వాల్మీకి మహర్షి విరచిత

# ఆనంద రామాయణము

1. సారకాండ, 2. యాత్రాకాండ, 3. యాగకాండ,

4. విలాసకాండ, 5. జన్మకాండ, 6. వివాహకాండ.

**1వ భాగము**




పరిష్కర్త

**స్వామి సత్యాత్మానంద**

చిన్మయమిషన్, ఒంగోలు.

# ఆనంద రామాయణము 1వ భాగము

**ప్రథమ ముద్రణ :** 17–ఏప్రియల్–2026
పూజ్య స్వామిని శారదాప్రియానంద మాతాజీ గారి
శతజయంతి సందర్భముగా

**ప్రతులు :** 1000

**ద్వితీయ ముద్రణ :** 2025– ఏప్రియల్, 17.
పూజ్య స్వామిని శారదాప్రియానంద మాతాజీ గారి
25వ ఆరాధన సందర్భముగా

**ప్రతులు :** 1000

**ప్రతులకు :**

**స్వామి సత్యాత్మానంద,**
స్వర్ణచిన్మయం
తూర్పుకమ్మపాళెం, **ఒంగోలు**
ఆంధ్రప్రదేశ్– 523 001.
సెల్ నెం. 98491 40653
email- chinmaya.sarada@gmail.com

**ముద్రణ :**
నిర్మలా ఆఫ్‌సెట్ ప్రింటర్స్,
విజయవాడ,

# విషయసూచిక

# కృతజ్ఞతలు

ఈ ఆనందరామాయణ గ్రంథ ముద్రణగురించి తెలియగనే సంతోషముతో ముందుకు వచ్చిన స్వర్గీయ కె.వి.యస్. రాఘవేణిగారికి శ్రీరామచంద్రులు ఉత్తమగతులు కలుగజేయాలని కోరుకుంటూ వారి కుటుంబసభ్యులపై హనుమంతుని ఆశీర్వాదములు ఉండాలని కోరుకుంటూ, శ్రీమతి కె.వి.యస్ రాఘవేణి కుటుంబసభ్యులకు కృతజ్ఞతలు తెలుపుతున్నాము.

ఈ గ్రంథముద్రణకు తమ అనుమతి ఇచ్చిన కపిలేశ్వరపురం రాజాగారి ఆస్థానమునకు నా హృదయపూర్వక కృతజ్ఞతలు తెలుపుతున్నాను.

నా హృదయములోని భావనను తెలపగానే జిల్లాగ్రంథాలయములో ఆనందరామాయణం 3 సంపుటములను జిరాక్స్‌చేసి ఇచ్చిన సంస్కృత ఉపాధ్యాయులు శ్రీ ములుకుట్ల సుబ్రహ్మణ్యం శర్మగారికి కృతజ్ఞతలు.

పుస్తక ముద్రణ అనుమతులు పొందడంలో ఎంతో సహకరించిన రాజమండ్రి వాసి శ్రీయుత సుబ్రహ్మణ్యం శర్మగారికి నా కృతజ్ఞతలు.

పుస్తక ముద్రణకు సదా నన్ను ప్రోత్సహించడమే గాక ఇందులోని 'దేహరామాయణం' ను జ్ఞానయజ్ఞాలుగా ప్రవచనంచేసి, దేహరామాయణం మీద కొద్దిపాటి వ్యాఖ్యానాన్ని వ్రాసి ప్రచురించిన పూజ్యస్వామి యజ్ఞానంద గారికి కృతజ్ఞతలు.

ఈ ఆనందరామాయణ గ్రంథ అక్షర కూర్పులో దొర్లిన తప్పులు ఎంతో ఓపికగా సరిచేయడమే గాక, నన్ను ఎంతో ప్రోత్సహించి, కైమోద్పును పంపిన విశాఖపట్టణవాసి, శ్రీమత్ వాల్మీకి రామాయణమును ఇప్పటికే 24సార్లు పారాయణ చేయడమేగాక, ఆనంద రామాయణమును కూడా ఒకసారి పారాయణచేసిన సోమయాజుల శ్రీరామమూర్తి గారికి ఎన్నో కృతజ్ఞతలు.

అడగగానే అక్షర దోషాలను సరిచేసిన విశ్రాంత మంచినీటి విశ్లేషకులు శ్రీ కె. హరిప్రసాద్ గారికి చాలాచాలా కృతజ్ఞతలు.

అక్షరకూర్పు సమయంలో నాకు ఎంతో సహకరించిన శ్రీమతి కుమారి గారికి కృతజ్ఞతలు.

స్వామి సత్యాత్మానంద.

## పుస్తక ముద్రణ దాత



# స్వర్గీయ కె.వి.యస్. రాఘవేణి

జననం : 30–5–1960,    స్వర్గస్థం: 30–10–2019

| | | |
|---|---|---|
| కుమార్తె | : | శ్రీమతి శ్రీలక్ష్మి, |
| అల్లుడు | : | శ్రీ గాదిరెడ్డి భానుప్రకాశ్ |
| మనుమరాలు | : | కుమారి హరిప్రియ, |
| కుమార్తె | : | శ్రీమతి శ్రీవిద్య |
| మనుమలు | : | చి. వేదవిహారి, చి. లక్ష్మీనారాయణ విఖ్యాత్. |

# సంకల్పము-సాకారము

ప్రతిసంవత్సరము శ్రీరామనవమికి ముందుగా వచ్చే శ్రీరాములవారి జన్మనక్షత్రమైన పునర్వసు నక్షత్రము నుండి తొమ్మిదిరోజుల పాటు శ్రీమత్ వాల్మీకి రామాయణాన్ని ప్రతిసంవత్సరం పారాయణ చేయాలని, సంకల్పించి ముందుగా 2012 వ సంవత్సరము అయోధ్యలో పూర్తిచేసి, 2013 లో చిత్రకూట్ లో పారాయణచేస్తున్న సందర్భముగా, శ్రీమత్ద్రామాయణాన్ని పారాయణ చేయడమే గాక, శ్రీమత్ రామాయణానికి ఏదైనా సేవచేయాలనే సంకల్పము కలిగినది. ఈ విషయం నా గదిలోనే ఉన్న స్వామి పరాత్మానందగారికి తెలియజేయగా వారూ ప్రోత్సహించారు.

ఆనందరామాయణం గురించి విని, చదవాలని ప్రయత్నించగా తెలుగులో అప్పటివరకు నాకు సరియైన పుస్తకం లభించకపోవడంతో హిందీ అనువాదంతో ఉన్న ఒక పుస్తకాన్ని 'చిత్రకూట'లో మందాకినీ నదిఒడ్డునుండి తీసుకురావడమైనది. దానిని తెలుగులోనికి ఎలా తీసుకురావాలా? అని ఆలోచిస్తుండగా సంస్కృత ఉపాధ్యాయులు శ్రీ ములుకుట్ల సుబ్రహ్మణ్యం శర్మగారు శ్రీ కపిలేశ్వరపురం రాజావారు తెలుగులో ఫోటోప్రింట్ చేసిన మూడు సంపుటాలను చూపించి, వాటిని జిరాక్స్ చేసి ఇచ్చారు. ఆ పుస్తకాలలోని భాష 1920 నాటిది, శ్లోకాలు వరుసగాను చిన్నగాను ఉన్నాయి, ఫోటో ముద్రణవలన కొన్నిచోట్ల శ్లోకాలు, తాత్పర్యం లేచిపోయి ఉంది, దాని మూలప్రతి సంపాదించడానికి వేటపాళెంలో ఉన్న పురాతన గ్రంథాలయానికి వెళ్ళి వెదకగా 1920 నాటి ప్రతులు లభించాయి.

నాకు లభించిన పుస్తకాలలో ఉన్నభాషను మార్చాలి, శ్లోకాలను సరిచేయాలి వీటికి కావలసిన మూలప్రతుల కొరకు వెదకగా నాకు,

1. చౌకాంబ సంస్కృత ప్రతిష్ఠాన్, న్యూఢిల్లీ వారు హిందీ అనువాదముతో ప్రచురించిన ప్రతి (దీనిని పండిట్ రామతేజ్ పాండే అనువదించారు.) శ్లోకముల సవరణకు నాకు ఎంతో ఉపయోగపడింది.

2. పరిమళ పబ్లికేషన్స్, ఢిల్లీ వారు ఆంగ్లానువాదముతో (ఆంగ్లానువాదకులు శాంతిలాల్ నాగర్) ప్రచురించిన రెంపుసంపుటాలు ఎంతో సహకరించాయి.

ఈ ఆనందరామాయణ ముద్రణకు నావంతు నేను కృషిచేశాను, ఇంకా చాలా కృషి అవసరమున్నది. ఇందులో దొర్లిన తప్పులు తెలిపితే తరువాతి ముద్రణలో సరిచేయగలను.

....స్వామి సత్యాత్మానంద.

# కైమోడ్పు

శ్లో॥ ఆపదామపహర్తారం దాతారం సర్వసమ్పదామ్ ।
లోకాభిరామం శ్రీరామం భూయోభూయో నమామ్యహమ్ ॥

శతకోటి రామచరితాంతర్గతమైన ఆనందరామాయణం శ్రీమద్వాల్మీకి మహర్షి విరచితం. రావణ సంహారానంతరం పట్టాభిషిక్తుడైన శ్రీరామచరితం ఇందులో వర్ణింపబడింది. శ్రీరాముని రాజ్యపరిపాలన, యజ్ఞయాగాదిక్రతువుల నిర్వహణ, సమస్త భూమండలమును చూచి, పరిశీలించుట, సకల తీర్థములను దర్శించుట, నదులలో స్నానమాచరించి వాటికి పవిత్ర స్థాయిలను కల్పించుట, మొదలగు విషయములు సవివరంగా వర్ణింపబడినవి.

ఇందులో కాండలకు వాల్మీకి చేసిన నామకరణం, నామౌచిత్యమును సార్థకతను తెలియజేయును.

1) సారకాండలో రామాయణసారము,
2) యాత్రాకాండలో శ్రీరాముడు సీతాసమేతుడై చేసిన యాత్రలు, స్నానమాడిన తీర్థములు,
3) యాగకాండలో శ్రీరాముడు చేసిన యజ్ఞయాగాది క్రతువుల తీరుతెన్నులు,
4) విలాసకాండలో విలాస, విహార వైభవములు,
5) జన్మకాండలో శ్రీరామ, భరత, లక్ష్మణ, శత్రుఘ్నులకు సంతాన ప్రాప్తి,
6) వివాహకాండలో పుత్రుల స్వయంవర వివాహ వైభవములు, వారికి సంతానప్రాప్తి,
7) రాజ్యకాండలో శ్రీరామావతార వైభవము, అవతార ప్రయోజనము, శ్రీ కృష్ణావతార సూచనము ఇత్యాదులు వర్ణింపబడినవి.
8) మనోహరకాండ, 9. పూర్ణ కాండములలో శ్రీరామానుగ్రహము కొరకు – చేయవలసిన, వివిధ వ్రతములు, స్తోత్రములు, ఫలప్రాప్తి వర్ణింపబడినవి.

రాజ్యకాండ పూర్వార్ధములో "శ్రీరామ సహస్ర నామావళి" అత్యంత భక్తి ప్రపత్తులనుద్దీపింప జేయునదిగాయున్నది. వాల్మీకి రామునిలో లీనమై పరమాత్మను దర్శించి "నామ" రచన చేసినట్లున్నది. ఇది అవశ్యపఠనీయము, నిత్యపారాయణస్తోత్రము.

శ్రీరాముడు పరబ్రహ్మస్వరూపుడు, సీత ప్రకృతి స్వరూపము. సీతారాములు జగత్తునకు ఆదర్శదంపతులు. సహజ గంభీర భావములు గలవారు. జీవన ఔన్నత్యమును తమ జీవన విధానము ద్వారా సకల మానవాళికి గుర్తెరిగించినవారు.

శ్రీమద్ రామాయణము దీర్ఘ శరణాగతి యను ప్రశస్తిగల మహాకావ్యము. శరణాగతి పరంపర చరిత్రగలది. శరణాగతులైన భక్తులు శ్రీరాముని అనుగ్రహమునకెట్లు పాత్రులైరో ఇందు వివరింపబడినది.

ధర్మానికి పరమార్ధశక్తి లేకపోతే దానికి అర్ధకామాలు వశంకావు. మనిషి తనను తాను జయించలేడు. తనను తాను జయించుకోలేనివాడు లోకాన్ని ఉద్ధరించలేడు. ఇది రామావతార ప్రయోజనం.

**శ్లో॥ రాశబ్దోచ్చారణే జాతే వక్త్రాత్ పాపం విగచ్ఛతి ।**
**మకారశ్రవణే జాతే భస్మీభావం గమిష్యతి ॥**

రామ శబ్దంలోని 'రా' ఉచ్చారణచే ముఖం నుండి పాపం నిర్గమిస్తుంది. వెంటనే 'మ' కారం పలుకగానే ఆ బహిర్గతమైన పాపరాశి భస్మీపటలం ఔతుంది.

ఆనందరామాయణము అత్యద్భుత సన్నివేశ సమలంకృతమైనది. తెలుగులో దీనిని పద్యకావ్యముగా గుండు లక్ష్మణకవి, గద్యములోకి నూతలపాటి పేరరాజు గారు అనువదించారు.

ఆనందరామాయణ గ్రంథాన్ని తెలుగు లిపిలో ప్రచురించి, అందరికి పారాయణ సౌకర్యం కలిగిస్తున్న శ్రీ స్వామి సత్యాత్మానంద గారు ధన్యులు. వారికి నా కృతజ్ఞతాంజలి. ఇది పాఠకులకెంతో ఉపయోగకారియని నమ్ముచున్నాను.

నమస్సులతో...

విశాఖపట్నం,
22-1-2021.

భక్తజన విధేయుడు

డా. అయల సోమయాజుల శ్రీరామమూర్తి
విశ్రాంత ప్రధానాచార్యులు,
చరవాణి : 99498 62438

# ఆనంద రామాయణము ఎందుకు చదవాలి?

ఆనందరామాయణములో అంతా ఆనందమే. ఆనందరామాయణములోని ప్రతి కాండ, ప్రతి సర్గ, ప్రతి శ్లోకము అంతా ఆనందమే. ఈ లోకజనులకు ఆనందమును పంచడము కోసమే వాల్మీకి మహర్షి పదమూడువేల శ్లోకాలతో ఆనందరామాయణమును రచించారు.

కైలాసములో పార్వతీ-పరమేశ్వరుల సంవాదరూపమున ఈ ఆనందరామాయణము మొదలౌతుంది. భూ లోకములో శ్రీరామదాసు తన శిష్యుడైన కృష్ణదాసుకు ఆనంద రామాయణమును బోధిస్తాడు. అంతేగాక మధ్యలో శ్రీరామదాసు-కృష్ణదాసు అను ఇద్దరు రామ-కృష్ణ భక్తులు కలహించి శ్రీరామచంద్రునియొక్క శ్రీకృష్ణునియొక్క భేదములు వారి గొప్పతనాన్ని చర్చిస్తారు.

భూ లోకవాసులకు వాల్మీకి రామాయణము సుపరిచితమే. వాల్మీకి మహర్షి శ్రీరామ చరితమును విస్తారముగా అందరికి తెలుపుటకు నూరుకోట్ల శ్లోకములతో వ్రాయగా, ఆ శ్లోకాలు వివిధ లోకాలకు పంచబడగా కొన్ని రామాయణాలు మన భూలోకములో మిగిలాయి. వానిలో కొన్ని వాల్మీకి రామాయణము, యోగవాసిష్ఠము, ఆనందరామాయణము మొ॥నవి.

వాల్మీకి రామాయణము ఉండగా మళ్ళీ మరో ఆనందరామాయణము ఎందుకు? అనే ప్రశ్న అందరికి వస్తుంది, అది సహజమే. దీనికి సమాధానము కూడా ఆనందరామాయణంలోనే మనసుకు లభిస్తోంది.

ఈ ఆనంద రామాయణము వాల్మీకి రామాయణానికి ఒక వ్యాఖ్యానము లాంటిది, అంతేకాదు. వాల్మీకి రామాయణానికి కొనసాగింపు కూడా. రామాయణంలో సీతామాత భూమి లోనికి ప్రవేశించిన తరువాత శ్రీరామచంద్రుడు సీతాదేవి ప్రతిమతో నూరు అశ్వమేథయాగాలు చేసి, అనంతరము సరయూ నదిలోనికి ప్రవేశించి, తన వైకుంఠధామానికి వెళతారు.

ఈ ఆనందరామాయణములో సీతాదేవి భూమిలోనికి ప్రవేశించేటప్పుడు శ్రీరాముడు భూమాతను కోరగా, భూమాత సీతాదేవిని శ్రీరామునికి సమర్పిస్తుంది. అలా సీతాదేవి మళ్ళీ శ్రీరామచంద్రుని వద్దకు వచ్చిన తరువాత వారియొక్క సంతానమైన కుశ లవుల సంతానము పెరిగి పెద్ద వారైన తరువాత, ఆ కుశలవులకు కూడా సంతానము కలగడం, ఆ సంతానానికి స్వయంవరం జరగడం వంటి విశేషాలున్నాయి ఇందులో. అంతేకాదు లక్ష్మణ, భరత, శత్రుఘ్నులకు సంతానం కలగడం, వారి సంతానానికీ జరిగిన వివాహాలు మొదలగు విశేషాలన్నీ ఈ ఆనంద రామాయణంలో రమ్యంగా చెప్పబడ్డాయి.

ఈ ఆనంద రామాయణంలో మరో విశేషమేమిటంటే... వాల్మీకి రామాయణం మొత్తాన్ని ఇందులో మొదటిదైన 'సారకాండ' గా చెప్పి, రామాయణంలోని ఇంచుమించు అన్ని పాత్రల యొక్క పూర్వ వృత్తాంతమును ఇందులో చెప్పడం జరిగింది. ఉదా. హనుమ, సుగ్రీవులు.

ఈ ఆనంద రామాయణం వాల్మీకి రామాయణానికి శ్రీమద్భాగవతానికి ఒక వారధి లాంటిది. రామాయణంలోని పాత్రలు మళ్లీ శ్రీమద్భాగవతంలో ఏవిధముగా మనకు దర్శనమిస్తాయో కూడా ఇందులో చెప్పబడింది. ఉదాహరణకు : 1. శ్రీరామచంద్రుడు వైకుంఠధామానికి వెళుతూ లక్ష్మణునితో, "లక్ష్మణా! నీవు నాకు ఈ అవతారంలో ఎంతో సేవచేశావు కనుక రాబోవు నా కృష్ణావతారములో నీవు నాకు అన్నగా అవతరిస్తావు, అపుడు నేను నీకు సేవచేస్తాను." అంటాడు.

అదేవిధముగా శ్రీరామచంద్రుడు వానరులతో, "మీరు నాకు ఎంతో సేవచేశారు అయినా నేను మీతో ఎక్కువ సన్నిహితంగా ఉండలేకపోయాను, రాబోవు నా కృష్ణావతారమపుడు మీరంతా గోపబాలకులై జన్మిస్తారు, అపుడు నేను మీతో కలసి ఆడిపాడడమే గాక మీతో కలసి భోంచేస్తాను" అంటాడు.

వాల్మీకిమహర్షి జన్మవృత్తాంతమేగాక, అంతకుముందు తన రెండు జన్మల కథనమూ ఈ ఆనంద రామాయణములో వాల్మీకి మనకు చెబుతారు.

ఎక్కువమంది పారాయణచేసే శ్రీరామరక్షాస్తోత్రము ఆనందరామాయణం లోనిదే. అంతేకాదు. హనుమను ప్రార్థించే, 'బుద్ధిర్బలం యశోధైర్యం అనే శ్లోకము, శ్రీరాముని స్తుతించే 'రామాయ రామభద్రాయ' అనే శ్లోకము ఇందులోనిదే.

ఈ ఆనందరామాయణంలో ఉపనిషత్తుల ప్రస్తావన, భగవద్గీత ప్రస్తావన కూడా గలదు. శ్రీరామచంద్రుడు తన తల్లులకు వేదాంతబోధచేయడమూ మనము ఆనందరామాయణంలో చూస్తాము. 'దేహరామాయణము' పేరున రామాయణములోని పాత్రల ద్వారా శ్రీరామచంద్రుడు మనకు వేదాంతమునూ బోధిస్తారు.

శ్రీ ఆనందరామాయణమును స్వయంగా టైపుచేయడమే గాక అర్హతలేకపోయినా పరిష్కరించే అర్హత కల్పించిన శ్రీరామచంద్రునికి, వాల్మీకి మహర్షికి, హనుమంతులవారికి నమస్కారములు.

రామాయణంపై అభిరుచినికలిగించిన మా గురువుగారైన పూజ్య స్వామినీ శారదాప్రియానంద మాతాజీ పాదపద్మములచెంద ఈ పుస్తకపుష్పాన్ని ఆనందముతో సమర్పిస్తూ.....

స్వామి సత్యాత్మానంద.

# శ్రీమద్రామాయణ పారాయణవిధి

రామాయణ పారాయణమునకు ముందు పఠించవలసిన శ్లోకాలు

**శాంతిపాఠము**

ఓం, ఓం, ఓమ్ ॥

మం॥ ఓం సహనా వవతు । సహ నౌ భునక్తు । సహవీర్యం కరవావహై ।
తేజస్వినావధీతమస్తు, మా విద్విషావహై ॥

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః ॥

**శ్రీవిఘ్నేశ్వర ప్రార్థన**

శ్లో॥ శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజమ్ ।
ప్రసన్నవదనం ధ్యాయేత్ సర్వవిఘ్నోపశాంతయే ॥

**శ్రీసరస్వతీ ప్రార్థన**

శ్లో॥ సరస్వతీ నమస్తుభ్యం వరదే కామరూపిణీ ।
విద్యారంభం కరిష్యామి సిద్ధిర్భవతు మే సదా ॥

**శ్రీగురు ధ్యానమ్**

శ్లో॥ గురుర్బ్రహ్మా గురుర్విష్ణుః గురుర్దేవో మహేశ్వరః ।
గురుస్సాక్షాత్ పరంబ్రహ్మా తస్మై శ్రీగురవే నమః ॥

శ్లో॥ త్వమేవ మాతా చ పితా త్వమేవ
త్వమేవ బంధుశ్చ సఖా త్వమేవ ।
త్వమేవ విద్యా ద్రవిణం త్వమేవ
త్వమేవ సర్వం మమ దేవదేవ ॥

**శ్రీవాల్మీకి ధ్యానమ్**

శ్లో॥ కూజంతం రామరామేతి మధురం మధురాక్షరమ్ ।
ఆరుహ్య కవితాశాఖాం వందే వాల్మీకికోకిలమ్ ।

శ్లో॥ వాల్మీకేర్మునిసింహస్య కవితా వనచారిణః ।
శ్రుణ్వన్ రామకథానాదం కో న యాతి పరాం గతిమ్ ॥

శ్లో॥ యః పిబన్ సతతం రామచరితామృతసాగరమ్ ।
అతృప్త స్తం మునిం వందే ప్రాచేతస మకల్మషమ్ ॥

**శ్రీఆంజనేయ ప్రార్థన**

శ్లో॥ గోష్పదీకృతవారాశిం మశకీకృతరాక్షసమ్ ।
రామాయణమహామాలా రత్నం వందేఽనిలాత్మజమ్ ॥

శ్లో॥ అంజనానందనం వీరం జానకీశోకనాశనమ్
కపీశ మక్షహంతారం వందే లంకాభయంకరమ్ ॥

శ్లో॥ మనోజవం మారుతతుల్యవేగం
జితేంద్రియం బుద్ధిమతాం వరిష్ఠమ్ ।
వాతాత్మజం వానరయూధముఖ్యం
శ్రీరామదూతం శిరసా నమామి ॥

శ్లో॥ ఉల్లంఘ్య సిన్ధో స్సలిలం సలీలం
యశ్శోకవహ్నిం జనకాత్మజాయాః ।
ఆదాయ తేనైవ దదాహ లంకాం
నమామి తం ప్రాంజలిరాంజనేయమ్ ॥

శ్లో॥ ఆంజనేయ మతిపాటలాననం
కాంచనాద్రికమనీయవిగ్రహమ్ ।
పారిజాతతరుమూలవాసినం
భావయామి పవమాననందనమ్ ॥

శ్లో॥ యత్రయత్ర రఘునాథకీర్తనం
తత్రతత్ర కృతమస్తకాంజలిమ్ ।
బాష్పవారి పరిపూర్ణలోచనం
మారుతిం నమత రాక్షసాంతకమ్ ॥

## శ్రీమద్రామాయణ ప్రార్థన

శ్లో॥ వేదవేద్యే పరే పుంసి జాతే దశరథాత్మజే ।
వేదః ప్రాచేతసాదాసీత్ సాక్షాద్రామాయణాత్మనా ॥

శ్లో॥ శ్రుణ్వన్ రామాయణం భక్త్యా యః పాదం పదమేవ వా ।
స యాతి బ్రహ్మణః స్థానం బ్రహ్మణా పూజ్యతే సదా ॥

శ్లో॥ శ్లోకసారసమాకీర్ణం సర్గకల్లోలసంకులమ్ ।
కాండగ్రాహ మహామీనం వందే రామాయణార్ణవమ్ ॥

శ్లో॥ యః కర్ణాంజలిసంపుటైః అహరహః సమ్యక్ పిబత్యాదరాత్
వాల్మీకే ర్వదనారవిన్దగలితం రామాయణాఖ్యం మధు ।
జన్మవ్యాధిజరావిపత్తిమరణైః అత్యంతసోపద్రవం
సంసారం స విహాయ గచ్ఛతి పుమాన్ విష్ణోః పదం శాశ్వతమ్ ॥

## శ్రీరామ ప్రార్థన

శ్లో॥ శ్రీరాఘవం దశరథాత్మజ మప్రమేయం
సీతాపతిం రఘుకులాన్వయరత్నదీపమ్ ।
ఆజానుబాహు మరవిన్దదళాయతాక్షం
రామం నిశాచరవినాశకరం నమామి ॥

శ్లో॥ వైదేహీసహితం సురద్రుమతలే హైమేమహామండపే
మధ్యే పుష్పకమాసనే మణిమయే వీరాసనేసుస్థితమ్ ।
అగ్రే వాచయతి ప్రభంజనసుతే తత్వం మునిభ్యః పరం
వ్యాఖ్యాంతం భరతాదిభిః పరివృతం రామం భజే శ్యామలమ్ ॥

శ్లో॥ ఆపదామపహర్తారం దాతారం సర్వసంపదామ్ ।
లోకాభిరామం శ్రీరామం భూయో భూయో నమామ్యహమ్ ॥

శ్లో॥ రామాయ రామభద్రాయ రామచంద్రాయ వేధసే ।
రఘునాథాయ నాథాయ సీతాయాః పతయే నమః ॥

శ్లో॥ నీలాంబుజ శ్యామలకోమలాంగం
సీతాసమారోపిత వామభాగమ్ ।
పాణౌ మహాసాయక చారుచాపం
నమామి రామం రఘువంశనాథమ్ ॥

శ్లో॥ నమోస్తు రామాయ స లక్ష్మణాయ
దేవ్యై చ తస్యై జనకాత్మజాయై
నమోస్తు రుద్రేంద్రయమానిలేభ్యో
నమోస్తు చంద్రార్కమరుద్గణేభ్యః ॥

## పారాయణ అనంతరం పఠించవలసిన శ్లోకాలు

**శాంతిపాఠము**

శ్లో॥ ఓం సర్వే భవన్తు సుఖినః, సర్వే సన్తు నిరామయాః ।
సర్వే భద్రాణి పశ్యన్తు, మా కశ్చిత్ దుఃఖభాక్ భవేత్ ॥

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః ॥

హరిః ఓం, శ్రీగురుభ్యోనమః, హరిః ఓమ్ ॥

## శ్రీరామ మంగళహారతి

శ్లో॥ రామచంద్రాయ జనక రాజజామనోహరాయ ।
మామకాభీష్టదాయ మహితమంగళమ్ ॥ 1

శ్లో॥ కోసలేంద్రాయ మందహాస దాసపోషణాయ ।
వాసవాదివినుత సద్వరదమంగళమ్ ॥ 2

శ్లో॥ చారుకుంకుమోపేత చందనానుచర్చితాయ ।
హారకటకశోభితాయ భూరిమంగళమ్ ॥ 3

శ్లో॥ లలితరత్నకుండలాయ తులసీవనమాలికాయ ।
జలజసదృశదేహాయ చారుమంగళమ్ ॥ 4

శ్లో॥ దేవకీసుపుత్రాయ దేవదేవోత్తమాయ ।
భావజ గురువరాయ భవ్యమంగళమ్ ॥ 5

శ్లో॥ పుండరీకాక్షాయ పూర్ణచంద్రవదనాయ ।
అండజ వాహనాయ అతులమంగళమ్ ॥ 6

శ్లో॥ విమలరూపాయ వివిధవేదాంతవేద్యాయ,
సుముఖచిత్తకామితాయ శుభగమంగళమ్ ॥ 7

శ్లో॥ రామదాస మృదులహృదయ తామరసనివాసాయ
స్వామిభద్రగిరివరాయ సర్వమంగళమ్ ॥ 8

శ్లో॥ మంగళం కోసలేంద్రాయ మహనీయగుణాత్మనే ।
చక్రవర్తి తనూజాయ సార్వభౌమాయ మంగళమ్ ॥ 1

శ్లో॥ మంగళం శ్రీకురుక్షేత్ర రణక్షోణివిహారిణే ।
పార్థసారథి రూపాయ గీతాచార్యాయ మంగళమ్ ॥ 2

శ్లో॥ మంగళం గురుదేవాయ మహనీయగుణాత్మనే ।
సర్వలోకశరణ్యాయ సాధురూపాయ మంగళమ్ ॥ 3

హర నమః పార్వతీపతయే హరహర మహాదేవ.

## శ్రీహనుమాన్ మంగళ హారతి

శ్లో॥ రామచంద్రసేవకాయ వజ్రదేహ పంజరాయ,
వారిసేతుబంధనాయ వీరమంగళమ్ ॥ ఆంజనేయ మంగళమ్ ॥ 1

శ్లో॥ అంజనీతపఃఫలాయ ఆత్మయోగతత్పరాయ,
సత్యధీపరాక్రమాయ వీరమంగళమ్ ॥ ఆంజనేయ మంగళమ్ ॥ 2

శ్లో॥ అష్టసిద్ధి యోగవేద్య దుష్టబుద్ధినాశనాయ,
నిత్యముక్తకర్మకాయ వీరమంగళమ్ ॥ ఆంజనేయ మంగళమ్ ॥ 3

శ్లో॥ భానువంశరక్షణాయ సర్వశాస్త్రపారగాయ,
శ్రీరమేశసేవకాయ వీరమంగళమ్ ॥ ఆంజనేయ మంగళమ్ ॥ 4

శ్లో॥ శాంతి దాంతి భూషణాయ శత్రుగర్వశోషణాయ,
మోహబంధ భేదనాయ వీరమంగళమ్ ॥ ఆంజనేయ మంగళమ్ ॥ 5

శ్లో॥ సుప్రసన్నవీక్షణాయ సూర్యబింబభక్షణాయ,
సర్వదేవవంద్యపాత్ర వీరమంగళమ్ ॥ ఆంజనేయ మంగళమ్ ॥ 6

శ్లో॥ భానుపుత్ర మంత్రివర్య భానుమూర్తి శిష్యవర్య,
వేదశాస్త్రధర్మవేద్య వీరమంగళమ్ ॥ ఆంజనేయ మంగళమ్ ॥ 7

శ్లో॥ దైవకార్యపోషణాయ దైత్యమాయ నాశకాయ,
గోష్పదీకృతార్ణవాయ వీరమంగళమ్ ॥ ఆంజనేయ మంగళమ్ ॥ 8

శ్లో॥ ఆదివిష్ణుసేవకాయ గూఢకార్య సాధకాయ,
సర్వలోకవంద్యపుత్ర వీరమంగళమ్ ॥ ఆంజనేయ మంగళమ్ ॥ 9

శ్లో॥ సర్వరోగనాశకాయ సర్వబంధ మోచకాయ,
వీతరాగరూపకాయ వీరమంగళమ్ ॥ ఆంజనేయ మంగళమ్ ॥ 10

శ్లో॥ రామభక్తవత్సలాయ భీమగర్వభంజనాయ,
సర్వదుఃఖనాశకాయ వీరమంగళమ్ ॥ ఆంజనేయ మంగళమ్ ॥ 11

శ్లో॥ నిత్యశుద్ధమానసాయ సత్యబద్ధకర్మణాయ,
కామరూపధారణాయ వీరమంగళం ॥ ఆంజనేయ మంగళమ్ ॥ 12

శ్లో॥ దాసతాపనాశకాయ దేవలోకవందితాయ,
రక్తమాలభూషణాయ వీరమంగళమ్ ॥ ఆంజనేయ మంగళమ్. 13

శ్లో॥ శాకినీపిశాచనాశ ఢాకినీగ్రహాదినాశ,
క్షుద్రదేవతావినాశ వీరమంగళమ్ ॥ ఆంజనేయ మంగళమ్ ॥ 14

శ్లో॥ సీతదుఃఖనాశకాయ పాపకర్మభంజనాయ,
మాయయంత్రభేదకాయ వీరమంగళమ్ ॥ ఆంజనేయ మంగళమ్ ॥ 15

శ్లో॥ రామరూప పూజకాయ రామనామకీర్తనాయ,
రామసత్కథాప్రసంగ వీరమంగళమ్ ॥ ఆంజనేయ మంగళమ్ ॥ 16



శ్రీరామ పట్టాభిషేకము



ఆదిశేషునిపై లక్ష్మీనారాయణులు

---



కౌసల్యాదులను వివాహమాడుచున్న దశరథుడు



ఊయలలో శ్రీరామ, లక్ష్మణ, భరత, శత్రుఘ్నులు.



సీతాస్వయంవరము



జటాయుపై బాణాలు వేస్తున్న రావణుడు

---



వాలిని పడగొట్టిన శ్రీరాముడు



అశోక వనములో సీత, హనుమ లంకను దహించుట



విభీషణుడు శ్రీరాముని శరణువేడుట



శ్రీరాముడు రామేశ్వరుని ప్రతిష్ఠించుట
హనుమంతుని గర్వభంగము.



కుంభకర్ణుని నిద్రలేపుట

---



కుంభకర్ణుడు వానరులతో యుద్ధముచేయుట.



రావణుని కిరీటములను తెస్తున్న సుగ్రీవుడు



రావణుని సంహరిస్తున్న శ్రీరాముడు



పుష్పకవిమానములో శ్రీ సీతారాములు

---



సీతారాములతో యాత్రచేయుచున్న నగర ప్రజలు.



శిష్యులకు బోధచేయుచున్న వ్యాసమహర్షి



వ్యాసమహర్షితో విష్ణుమూర్తి, బ్రహ్మదేవుడు



అశ్వమేధాయాగములో శ్రీ సీతారాములు



యజ్ఞాశ్వము వెంట శత్రుఘ్నుడు



అగస్త్య మహర్షి శ్రీరామునితో సంభాషించుట

---



మారుతి శ్రీరామధ్వజమునకు నమస్కరించుట



ఏకాంతమున శ్రీసీతారాములు

---



జలక్రీడలలో శ్రీసీతారాములు



స్త్రీలకు నగలను పంచుతున్న శ్రీరాముడు



సీతాప్రతిమను దానంచేసున్న శ్రీరాముడు



పింగళ శ్రీరామునికి నమస్కరించుట

---



ఋషిపత్నితో సీతామాత



శ్రీరామునికి జనవాక్యము తెలుపుతున్న భటుడు



సీతను అడవులకు తీసుకువెళుతున్న లక్ష్మణుడు.



కుశజన్మోత్సవము



వాల్మీకిమహర్షి కుశ, లవులకు రామరక్షచేయుట



లవుడు కమలములకై పోరాడుట



యజ్ఞమంటపమున సీత ప్రతిజ్ఞచేయుట



కుశ, లవులకు వరపుజ చేసి తీసుకుపోవుట



చంపిక స్వయంవరము



సుమతి స్వయంవరము



యూపకేతువు పరాక్రమము



విష్ణుమూర్తి గజేంద్రుని రక్షించుట

# సారకాండ వివరములు

| సర్గ. | శ్లోకాలు |
|---|---|
| 1. | 109 |
| 2. | 31 |
| 3. | 394 |
| 4. | 170 |
| 5. | 140 |
| 6. | 131 |
| 7. | 169 |
| 8. | 125 |
| 9. | 317 |
| 10. | 276 |
| 11. | 288 |
| 12. | 201 |
| 13. | 210 |

**మొత్తం- 13సర్గలు, 2,561 శ్లోకాలు**



# అథ ప్రథమః సర్గః-1వ సర్గ

శ్రీవాల్మీకి రువాచ
వామే భూమిసుతా పురస్తు హనుమాన్ పృష్ఠే సుమిత్రాసుతః
శత్రుఘ్నో భరతశ్చ పార్శ్వదళయోర్వాయ్యాదికోణాదిషు చ ।
సుగ్రీవశ్చ విభీషణశ్చ యువరాట్ తారాసుతో జాంబవాన్
మధ్యే నీలసరోజకోమలరుచిం రామం భజే శ్యామలమ్ ॥ 1

ఆదౌ రావణమర్దనం ద్విజగిరా తీర్థాటనం సీతయా
సాకేతే దశవాజిమేధకరణం పత్న్యా విలాసాటనమ్ ।
స్త్రీపుత్రగ్రహణం స్నుషార్థమటనం పృథ్వ్యాశ్చ సంరక్షణం
రామార్చాదినిరూపణం దయితయా స్వీయం స్థలారోహణమ్ ॥ 2

ఏకదా పార్వతీ దేవీ శంకరం ప్రాహ హర్షితా ।
కైలాసవాసినం నత్వా రామభక్త్యైకతత్పరా ॥ 3

పార్వత్యువాచ ।
శంభో త్వయా పురాణాని కథితాని మమాంతికే ।
రఘునాథస్య చరితం జన్మకర్మసమన్వితమ్ ॥ 4

తా॥ పరమ కారుణ్య మూర్తియైన శ్రీ వాల్మీకి మహర్షి జనులను అనుగ్రహించుటకు శ్రీ మత్ ఆనంద రామాయణమను మహాకావ్యమును చెప్పదలచి, ముందుగా శ్రీ సీతారాములవారిని ప్రార్థించుచున్నారు.

యెడమవైపున సీతాదేవియు, ముందువైపున హనుమంతుడును, వెనుక వైపున లక్ష్మణుడును, ఇరువైపుల భరత, శత్రుఘ్నులును, వాయువ్యము మొ॥ మూలలలో సుగ్రీవుడు, విభీషణుడు, యువరాజగు అంగదుడు, జాంబవంతులను కలిగి, మధ్యన నల్ల కలువవంటి కోమలకాంతితో శ్యామవర్ణము కలిగిన శ్రీరాముని భజించుచున్నాను. (1) అని ప్రార్థించిన పిదప ఆదికవి శ్రీ వాల్మీకిమహర్షి శ్రీమత్ ఆనందరామాయణమునందలి విషయములను వివరించుచున్నారు. మొదటిదియగు సారకాండములో రావణసంహారము మొదలగు విషయములును, రెండవదియగు యాత్రాకాండమున బ్రాహ్మణవర్యుని మాటననుసరించి సీతతో చేసిన తీర్థయాత్రాది విషయములును, మూడవదియగు యాగ కాండమున అయోధ్యలో దశాశ్వమేధ యాగము మొదలగు విషయములును,

నాలుగవదియగు విలాసకాండమున సీతతో వినోదయాత్రలును, అయిదవదియగు జన్మకాండములో స్త్రీ, పుత్ర గ్రహణాదికమును, ఆరవదియగు వివాహకాండమున కోడంగ్రకొరకు తిరుగుటయును, ఏడవదియగు రాజ్యకాండమున రాజ్యసంరక్షణాది విషయములును, ఎనిమిదవదియగు మనోహర కాండమున శ్రీరామ అర్చనాది విషయములును, తొమ్మిదవదియగు పూర్ణకాండమున సీతాదేవితో వైకుంఠధామమునకు వెళ్ళుటయును చెప్పబడిది.

అని ఇట్లు శ్రీ పార్వతీ పరమేశ్వర సంవాదరూపమున ఉన్న ఈ కథ ప్రారంభింపబడుచున్నది.

ఒకానొక రోజు శ్రీరామభక్తి పరాయణయైన పార్వతీదేవి కైలాసాధిపతియగు శ్రీ పరమేశ్వరునితో (3) "ఓ పరమేశ్వరా! ఇప్పటివరకు మీరు నాకు ఎన్నో పురాణములు చెప్పియున్నారు. అయినను నాకు ఎంతోఆనందమును కలిగించు శ్రీరామచంద్రుని ఆవిర్భావము మొదలు, వారి దివ్యచరిత్రను చెప్పవలసినదిగా కోరుచున్నాను," అనగా, శ్రీ పరమేశ్వరుడు ఇట్లు చెప్పనారంభించెను. (4)

**కథయస్వాధునా దేవ మమ ప్రీతివివర్ధనమ్ ।**
**ఆనందదాయకం కర్మ రఘువీరేణ యత్కృతమ్ ॥ 5**

**శ్రీ శివ ఉవాచ**
**సమ్యక్ పృష్టం త్వయా కాన్తే రామచంద్రకథానకమ్ ।**
**కథయామి సవిస్తారం మహామంగళకారకరమ్ ॥ 6**

**ఆదినారాయణాద్బ్రహ్మాఽభూన్మరీచిర్విధేః సుతః ।**
**మరీచేః కశ్యపః పుత్రస్తత్సుతః సూర్య ఉచ్యతే ॥ 7**

**సూర్యపుత్రః శ్రాద్ధదేవో మనుర్వైవస్వతస్త్వితి ।**
**స ఏవ ప్రోచ్యతే తస్యేక్ష్వాకుః పుత్రః ప్రతాపవాన్ ॥ 8**

**ఇక్ష్వాకోస్తు వికుక్షిర్హి శశాదశ్చ స ఏవ హి ।**
**వికుక్షేస్తు కకుత్స్థశ్చ స ఏవాత్ర పురంజయః ॥ 9**

**స ఏవోక్తశ్చేంద్రవాహః కకుత్స్థనృపతేః సుతః ।**
**అనేనాస్తస్య పుత్రోఽభూద్విశ్వరంధిశ్చ తత్సుతః ॥ 10**

**చంద్రశ్చంద్రస్య పుత్రోఽభూద్యువనాశ్వః ప్రతాపవాన్ ।**
**శావస్తో యువనాశ్వస్య శావస్తస్య సుతో మహాన్ ॥ 11**

శివుడు చెప్పుచున్నాడు, "ఓ మనోహారిణీ! చక్కగా అడిగితివి. మహా మంగళప్రదమగు శ్రీరామచంద్రుని కథను సవిస్తారముగ చెప్పెదను వినుము." (5, 6)

ఆదినారాయణమూర్తినుండి బ్రహ్మపుట్టెను. బ్రహ్మకుమారుడు మరీచి మహర్షి, అతనికుమారుడు కశ్యపుడు, అతని కుమారుడు సూర్యుడు. (7), సూర్యునికుమారుడే యముడు. అతనే వైవస్వతమనువు. మనుపుత్రుడే ఇక్ష్వాకు రాజు. (8) ఇక్ష్వాకు కుమారుడే వికుక్షి, ఇతనిని శశాదుడనికూడా అంటారు. ఇతనికుమారుడే పురంజయుడను కకుత్స్థ మహారాజు. (9) ఇతనికి ఇంద్రవాహుడని కూడా పేరుగలదు. వీని కుమారుడు విశ్వరంధి అనేనుడు.(10) అనేనుని పుత్రుడు చంద్రుడు. చంద్రుని కుమారుడు యువనాశ్వుడు. ఇతనికుమారుడు శావస్తుడు. (11)

**బృహదాశ్వ ఇతి ఖ్యాతస్తస్మాజ్జజ్ఞే నృపోత్తమః ।**
**కువలయాశ్వో నృపతిః దృఢాశ్వస్తత్సుతః స్మృతః ॥ 12**

**హర్యశ్వ ఇతి తత్పుత్రో నికుంభస్తత్సుతః స్మృతః ।**
**బర్హణాశ్వో నికుంభస్య బర్హణాశ్వనృపోత్తమాత్ ॥ 13**

**కృతాశ్వోనృపతిః ప్రోక్తః శ్యేనజిత్తత్సుతః స్మృతః ।**
**యువనాశ్వ శ్శ్యేనజితో యువనాశ్వనృపోత్తమాత్ ॥ 14**

**మాంధాతా త్రసద్దస్యుర్హి స ఏవ కథితో భువి ।**
**పురుకుత్సశ్చ మాంధాతుః పురుకుత్సస్య వై పునః ॥ 15**

**త్రసద్దస్యురితి ఖ్యాతోఽనరణ్యశ్చాపి తత్సుతః ।**
**అనరణ్యస్య హర్యశ్వో హర్యశ్వస్యారుణః సుతః ॥ 16**

**త్రిబంధనోఽరుణాజ్జాతస్త్రిబంధనసుతో మహాన్ ।**
**సత్యవ్రత స్స ఏవాత్ర త్రిశంకురితి వై స్మృతః ॥ 17**

**సత్యవ్రతస్య పుత్రోఽభూద్ధరిశ్చంద్రః ప్రతాపవాన్ ।**
**రోహితస్తత్సుతః ప్రోక్తః స్తస్మాచ్చహరితః స్మృతః ॥ 18**

**హరితస్య సుతశ్చంప స్సుదేవశ్చంపదేహజః ।**
**సుదేవాద్విజయః ప్రోక్త స్తత్పుత్రో భరుకః స్మృతః ॥ 19**

భరుకస్య వృకః పుత్రో వృకపుత్రస్తు బాహుకః ।
బాహుకాత్సగరో జజ్ఞేఽ సమంజ స్సగరాత్మజః ॥ 20

అసమంజశ్చ పుత్రోఽభూఽ దంశుమానితి నామతః ।
తస్య పుత్రో దిలీపస్తు దిలీపాచ్చ భగీరథః ॥ 21

భగీరథాచ్ఛ్రుతో జాతః శ్రుతాన్నాభః ప్రకీర్త్యతే ।
నాభస్య సింధుద్వీపశ్చ హ్యయుతాయుశ్చ తత్సుతః ॥ 22

ఋతుపర్ణస్త్వయుతాయో స్సుదాసస్తస్య కీర్త్యతే ।
మిత్రసహ స్స ఏవాత్ర కల్మాషాంఘ్రి స్స ఏవ హి ॥ 23

సుదాసస్యాశ్మకః పుత్రో మూలకోఽ శ్మకదేహజః ।
స ఏవ నారీకవచో మూలకస్య సుతో మహాన్ ॥ 24

నామ్నా దశరథః ప్రోక్త స్తస్య పుత్రః ప్రతాపవాన్ ।
నామ్నాత్వైడవిడః ప్రోక్త స్తస్య విశ్వసహః స్మృతః ॥ 25

శావస్తుని కుమారుడు బృహదాశ్వుడు. బృహదాశ్వునికి జన్మించినవాడు కువలయాశ్వుడు. వీనికి జన్మించినవాడు దృఢాశ్వుడు. (12) వీని సుతుడు హర్యశ్వుడు. హర్యశ్వునికి పుట్టినవాడు నికుంభుడు. ఇతని సంతానం బర్హణాశ్వుడు. (13) ఇతనికి కృతాశ్వుడు పుట్టాడు. కృతాశ్వుని సంతానం శ్యేనజిత్తు. వీనికి కలిగినవాడు యువనాశ్వుడు. (14) ఇతనికుమారుడే త్రసదస్యుడు అనబడు మాంధాత మహారాజు. ఇతని సంతానం పురుకుత్సుడు.(15) పురుకుత్సుని తనయుడు త్రసదస్యుడు (ఈ పేరు మళ్ళీపెట్టడం జరిగింది). త్రసదస్యుని పుత్రుడు అనరణ్యుడు. వీనికి కలిగినవాడు హర్యశ్వుడు. ఇతని కొడుకు అరుణుడు. (16) అరుణుని పుత్రుడు త్రిబంధనుడు. ఈ త్రిబంధనుని పుత్రుడే సత్యవ్రతుడనబడు త్రిశంకుమహారాజు. (17) ఇతని కుమారుడు హరిశ్చంద్రుడు. ఇతని పుత్రుడు రోహితుడు. రోహిత సుతుడు హరితుడు.(18) హరితునికి కలిగినవాడు చంపుడు. చంపుని కుమారుడు సుదేవుడు. ఇతనికుమారుడు విజయుడు. విజయుని సుతుడు భరుకుడు.(19) ఇతనికి కలిగినవాడు వృకుడు. వృక పుత్రుడు బాహుకుడు. బాహుకుని కుమారుడు సగరచక్రవర్తి. సగరపుత్రుడు అసమంజసుడు.(20) ఇతనికి అంశుమంతుడు జన్మించాడు. ఇతనికుమారుడు దిలీపచక్రవర్తి. దిలీపుని కుమారుడు భగీరథమహారాజు. (21)

భగీరథుని పుత్రుడు శ్రుతుడు. శ్రుత పుత్రుడు నాభుడు. నాభచక్రవర్తి కుమారుడు సింధుద్వీపుడు. ఇతని కుమారుడు అయుతాయు. (22) ఇతనికి జన్మించినవాడు ఋతుపర్ణుడు. ఇతనికుమారుడగు

సుదాసుడే, మిత్రసహుడుగాను కల్మాషపాదుడుగాను పిలువబడ్డాడు. (23) ఈ సుదాసుని కుమారుడగు అశ్మకసుతుడే నారీకవచుడనబడు మూలకుడు. (24) మూలకుని తనయుడు దశరథుడు. ఇతని సుతుడు ఐడవికుడు. ఇతని తనయుడు విశ్వసహుడు. (25)

తస్యపుత్రస్య ఖట్వాంగః ఖట్వాంగదీర్ఘబాహుకః ।
దిలీపశ్చ స ఏవాత్ర తస్య పుత్రో రఘుః స్మృతః ॥ **26**

రఘోః పుత్రో హ్యజః ప్రోక్త స్తస్మాద్దశరథః స్మృతః ।
రాజ్ఞో దశరథాజ్జాతః శ్రీరామః పరమేశ్వరః ॥ **27**

యస్య నామాన్యనంతాని గృణంతి మునయ స్సదా ।
విష్ణోరారభ్య కథితా ఏకషష్టిర్నృపా మయా ॥ **28**

ఏకషష్టిర్నృపాశ్చాగ్రే మధ్యే రామో విరాజతే ।
తస్య తే చరితం కృత్స్నం సంక్షేపాచ్చ బ్రవీమ్యహమ్ ॥ **29**

ఇక్ష్వాకువంశప్రవరః క్షత్రియో లోకవిశ్రుతః ।
బలవా న్సరయూతీరేఽయోధ్యాయాం పార్థివోత్తమః ॥ **30**

నామ్నా దశరథః శ్రీమాన్ జంబుద్వీపపతిర్మహాన్ ।
శశాస రాజ్యం ధర్మేణ సైన్యేన మహతాఽఽవృతః ॥ **31**

అయోధ్యాయాస్తు సాన్నిధ్యే దేశే శ్రీకోసలాహ్వయే ।
కోసలాయాం మహాపుణ్యః కోసలాఖ్యో నృపో మహాన్ ॥ **32**

తస్యాసీద్దుహితారమ్యా కౌసల్యా పతికాముకా ।
తస్యా దశరథేనైవ వివాహో నిశ్చితో ముదా ॥ **33**

లగ్నార్థం తం సమానేతుం దూతా దశరథం నృపమ్ ।
యయుర్వినిశ్చయం కృత్వా వివాహదివసస్య చ ॥ **34**

తదా దశరథశ్చాపి సాకేతే సరయూజలే ।
నౌకాస్థో జలజాం క్రీడాం చక్రే వై మంత్రిబంధుభిః ॥ **35**

నిశాయాం సేనయా యుక్తః స్తుతో మాగదవందిభిః ।
రత్నదీపప్రకాశైశ్చ నన్నృతుర్వారయోషితః ॥ **36**

విశ్వసహునికి కలిగినవాడు ఖట్వాంగమహారాజు. ఇతనికి జన్మించినవాడు దీర్ఘబాహువు. ఇతనికుమారుడు దిలీపమహారాజు. దిలీపుని పుత్రుడే రఘుమహారాజు. (26)

రఘుమహారాజు కుమారుడే అజమహారాజు. అజమహారాజు కుమారుడు దశరథమహారాజు. ఈ దశరథమహారాజు కుమారుడే మన శ్రీరామచంద్రుడు. (27), ఎవనినామమును మునులు అనంతముగా భావించుచున్నారో, అట్టిపరమేశ్వరుడే ఈ శ్రీరామచంద్రుడు. ఈ విధముగ శ్రీ మహా విష్ణువు మొదలు 61 మంది మహారాజులచరిత్ర నాచేత క్లుప్తముగ చెప్పబడినది. (28), అంతకుమునుపు కూడా 61 మంది మహారాజులు గలరు. ఇట్లు మధ్యభాగమున శ్రీరామచంద్రమూర్తి విరాజిల్లెను. ఆ మహానుభావుని చరిత్రను నీకు సంక్షేపముగ చెప్పుచున్నాను. (29), దశరథమహారాజు కుమారుడును, ఇక్ష్వాకువంశమున ముఖ్యమైనవాడు, లోకప్రసిద్ధుడు, బలవంతుడు, రాజశ్రేష్ఠుడును సుక్షత్రియుడును అగు శ్రీరామచంద్రుడు సరయూనదీతీరమున ఉన్న అయోధ్యాపట్టణమును రాజధానిగా జేసుకుని గొప్పసైన్యముతో జంబూద్వీపమునంతటిని చక్కగా పరిపాలించెను. (30, 31), అయోధ్యానగర సమీపమున కోసల అను దేశమున 'కోసలా' నగరమున పుణ్యాత్ముడగు 'కోసలుడ'ను మహారాజు గలడు. (32), అతనికి వివాహమునకు వచ్చిన కౌసల్య అను అందమైన కూతురుగలదు. ఆమెను దశరథమహారాజునకిచ్చి వివాహముచేయుటకు నిశ్చయింపబడెను. (33), వివాహమును నిశ్చయించి ముహూర్తమునకు దశరథ మహారాజును తీసుకురావడానికి వెళ్ళిరి. (34), అపుడు దశరథమహారాజు సరయూనదిలో నావనెక్కి బంధువులతోను, మంత్రులతోను జలక్రీడామహోత్సవము జరుపుచుండెను. (35), రాత్రిపూట పనిచేయుసైన్యం తోడురాగా, వందిమాగధ బృందం పొగడుతుండగా, వార నారీమణులు నాట్యముచేశారు. (36),

**తస్మిన్కాలే తు లంకాయాం విధిం పప్రచ్ఛ రావణః ।**
**కస్మాన్మే మరణం బ్రహ్మన్ తత్త్వం మాం వక్తుమర్హసి ॥ 37**

**తద్రావణవచః శ్రుత్వా కథయామాస తం విధిః ।**
**కౌసల్యాయాం దశరథాద్రామ స్సాక్షాజ్జనార్దనః ॥ 38**

**చతుర్ధా పుత్రరూపేణా భూత్వా సా నిహనిష్యతి ।**
**పంచమేఽహని లగ్నస్య రాజ్ఞో దశరథస్య హి ॥ 39**

**దివసో నిశ్చితో విప్రైః కోసల్యాఖ్యేన రావణ ।**
**తద్విధేర్వచనం శ్రుత్వా పుష్పకస్థో దశాననః ॥ 40**

**అయోధ్యాం సత్వరం గత్వా రాక్షసైః పరివేష్టితః ।**
**నౌకాస్థం తం దశరథం జిత్వా యుద్ధే స్సుదారుణః ॥ 41**

బభంజ నిజపాదేన తాం నౌకాం సరయూజలే ।
తదా సర్వే మృతాస్తత్ర సరయ్వా నిర్మలే జలే ॥ **42**

దశరథసుమంత్రౌ ద్వౌ నౌకాఖండోపరి స్థితౌ ।
శనై శ్శనైః ప్రవాహేణ గత్వా భాగీరథీం నదీమ్ ॥ **43**

తత స్సముద్రమధ్యే హి జీవంతావీశ్వరేచ్ఛయా ।
రావణః కోసలం గత్వా కృత్వా పరమసంగరమ్ ॥ **44**

కోసలాఖ్యం నృపం జిత్వా కౌసల్యాం తాం జహార సః ।
తతః ప్రముదితో లంకాం యయావాకాశవర్త్మనా ॥ **45**

దృష్ట్వా తిమింగిలం మత్స్యం వసంతం లవణార్ణవే ।
చిత్తే విచారయామాస దేవాస్తే మమ శత్రవః ॥ **46**

లంకాయాశ్చ హరిష్యంతి కౌసల్యాం గుప్తవిగ్రహాః ।
అతస్తిమింగిలాయేమాం న్యాసభూతాం కరోమ్యహమ్ ॥ **47**

ఇతినిశ్చిత్య మనసి పేటికాయాం నిధాయ తామ్ ।
మత్స్యం సమర్ప్య హృష్టాత్మా యయౌ లంకాం దశాననః ॥ **48**

తిమింగలోఽపి తామాస్యే ధృత్వాఽబ్ధౌ వ్యచరత్సుఖమ్ ।
అగ్రే దృష్ట్వా రిపుం స్వీయం తేన యుద్ధార్థముద్యతః ॥ **49**

అదేసమయంలో లంకలో రావణుడు బ్రహ్మదేవునితో "ఓ బ్రహ్మదేవా! నాకు మరణమెట్లు సంభవించునో తెలుపుటకు మీరే తగినవారు," అని ప్రశ్నించెను. (37), అపుడు బ్రహ్మదేవుడు "దశరథమహారాజువలన కౌసల్యా గర్భమున నలుగురు పుత్రులుగా జన్మించును. శ్రీరాముడను పేరుగలిగిన జనార్దనుడు నిన్ను చంపును (38, 39), ఆ దశరథునికిని కౌసల్యకును ఈ దినమునకు ఐదవరోజున వివాహము జరుగునట్లు విప్రులు నిశ్చయించారు," అని బ్రహ్మ చెప్పెను. (40, ), ఇట్టి బ్రహ్మవచనమును విన్న రావణుడు వెంటనే పుష్పకవిమానమునెక్కి, క్రూరులైన రాక్షసులతో వేగముగా అయోధ్యకు వెళ్ళి, యుద్ధముచేసి దశరథుని జయించి, తనకాలిచే ఆ నావను సరయూనదిలో త్రొక్కివేసెను. ఆ పుణ్యజలములలో అందరూ మరణించిరి. (41, 42), దశరథమహారాజు, సుమంత్రుడును ఆ ఇరువురే ఆ నౌకా శకలాన్ని పట్టుకుని, ప్రవాహవేగములోపడి తిన్నగా గంగానదినిచేరి, (43) చివరకు సముద్రమధ్యమున ఈశ్వరుని ఇచ్ఛతో ఎట్లోజీవించిరి. రావణుడు కోసలకు వెళ్ళి యుద్ధము

చేసి, ఆ రాజును చంపి, (44), కౌసల్యాదేవిని అపహరించి, ఆకాశమార్గమున లంకకు తీసుకు వెళ్ళు సమయమున లవణసముద్రమున వసించు తిమింగిలమునొకదానిని చూచెను. (45, 46)

దేవతలు నా శత్రువులు వారు మాయారూపముతో ఈ కౌసల్యను అపహరింతురు కనుక ఈమెను ఈ తిమింగలమునకు ఆహారముగా నిచ్చెదనని భావించి (46, 47) , ఆమెనొక పెట్టెలోపెట్టి ఆ తిమింగిలమునకప్పగించి సంతోషముతో లంకకు వెడలెను. (48), ఆ తిమింగిలము ఆ పెట్టెను నోటకరచి, సుఖముగా తిరుగుచు, ఎదుటి తన శత్రువుతో కలహింపదలచి (49),

ద్వీపే తాం పేటికాం స్థాప్య సంగ్రామం రిపుణాఽకరోత్ ।
ఏతస్మిన్నంతర నౌకాఖండం తం ద్వీపమాగతమ్ ॥ **50**

తదాతౌ మంత్రినృపతీ ద్వీపం తమారురుహతుః ।
తత్ర తాం పేటికాం దృష్ట్వా సముద్ఘాట్యాతివిస్మితౌ ॥ **51**

తస్యాం దృష్ట్వాఽథ కౌసల్యాం జ్ఞాత్వా వృత్తం పరస్పరమ్ ।
తయా ముహూర్తసమయే ద్వీపే దశరథో నృపః ॥ **52**

గాంధర్వాఖ్యం వివాహం చ చకార ముదితాననః ।
తతో రాజాఽథ కౌసల్యా సుమంత్రో మంత్రిసత్తమః ॥ **53**

త్రయః స్థిత్వా పేటికాయాం తద్ద్వారం పిదధుః పునః ।
తిమింగిలో రిపుం జిత్వా చకారాస్యే తు పేటికామ్ ॥ **54**

లంకాయాం రావణశ్చాపి సమాహూయ విధిం పునః ।
ఉవాచ ప్రహసన్ వాక్యం సభాయాం సంస్థితస్సుఖమ్ ॥ **55**

విధే తవ మృషా వాక్యం రావణేన మయా కృతమ్ ।
హతో దశరథస్తోయే కౌసల్యా గోపితా మయా ॥ **56**

తద్రావణవచః శ్రుత్వా సభాయాం పద్మసంభవః ।
దీర్ఘస్వరేణ ప్రోవాచ ఓం పుణ్యాహమితి స్ఫుటమ్ ॥ **57**

రావణః సంభ్రమాత్ ప్రాహ కిమిదం వ్యాహృతం త్వయా ।
విధిః ప్రోవాచ లగ్నం తు జాతం దశరథస్య హి ॥ **58**

తదావిధిం మృషా కర్తుం దూతాన్సంప్రేష్య సాదరమ్ ।
తిమింగిలాత్సమానీయ పేటికాం బ్రహ్మణోఽంతికే ॥ 59

సముద్ఘాట్య దదర్శాసౌ తత్ర తస్యాం దశాననః ।
తదాఽతిచకితః క్రుద్ధస్తాన్ హంతుం ఖడ్గమాదదే ॥ 60

తదాఽతిసంభ్రమాద్వేధా రావణం వాక్యమబ్రవీత్ ।
కిం కరోషి దశాస్య త్వం మాఽధునా సాహసం కురు ॥ 61

కౌసల్యైకాస్థాపితాఽస్యాం పేటికాయాం త్వయా పురా ।
త్రయస్తత్ర తు సంజాతా భవిష్యంత్యత్రకోటిశః ॥ 62

భవిష్యతి వధస్తేఽద్య రామోఽద్యైవ జనిష్యతి ।
సాహసం కురు మాఽ ద్యైవ సత్యాయుషి దశానన ॥ 63

ఒక ద్వీపమున ఆ పెట్టెనుంచి, పగతో పోరాడుచుండెను. అంతలో విరిగిన ఆ నౌకాశకలము ఆ ద్వీపమును జేరెను. (50), అప్పుడా మంత్రియును, రాజును ఆ ద్వీపమునెక్కిరి. అచ్చటనున్న ఆ పెట్టెనుచూచి, తెరచి ఆశ్చర్యమొందిరి. (51), అందులో కౌసల్యనుజూచి అన్యోన్యముగా తమతమ వృత్తాంతములను చెప్పుకొనిరి. (52), అపుడా దశరథమహారాజు, ముహూర్తసమయంలో గాంధర్వవిధి ననుసరించి కౌసల్యను వివాహమాడెను. (53), ఆ తరువాత ఆ ముగ్గురు మరల అదే పెట్టెలోదూరి, లోపల ద్వారమును బిగించుకొనిరి. ఆ తిమింగిలమూ తన శత్రువును జయించి, ఆ పెట్టెను తన నోట పెట్టుకొనెను. (54), లంకయందు రావణుడు మరల బ్రహ్మదేవుని పిలిపించి, "ఓయీ విధీ! నీమాట నాచే అసత్యముగావింపబడినది, దశరథుడు నీటిలో చంపబడెను. కౌసల్య నీటియందు దాచబడె," నని సభలో నవ్వుచూ పలికెను. (55, 56), అందుకు బ్రహ్మదేవుడు ఉచ్చైస్వరముతో "ఓం పుణ్యాహం" అని శుభకర్మారంభ సూచకముగ మంగళ వాక్యమును ఉచ్చరించెను. (57), దానిని విన్న రావణుడు ఆశ్చర్యముతో ఏమని చెప్పెదవని అధిక్షేపించెను. అపుడు బ్రహ్మ "దశరథ మహారాజుకు వివాహలగ్నము నెరవేరినదిగదా!" యని చెప్పెను. (58), వెంటనే రావణుడు విధిని ధిక్కరించదలచి, దూతలను పంపి, తిమింగిలమునుండి ఆ పెట్టెను తెప్పించి, బ్రహ్మ సన్నిధిలో ఆ పెట్టెను తెరవగా వారు కనిపించిరి. (59, 60) రావణుడు క్రోధముతో ఆ ముప్పురిని చంపుటకు- సిద్ధపడి కత్తిని చేబూనెను. (61), అపుడు బ్రహ్మదేవుడు సున్నితముగ రావణునితో ఇట్లనెను. " ఓయీ రావణా! ఇపుడు సాహసించవద్దు. ముందు నీవు ఈ పెట్టెలో కౌసల్యను పెట్టితివి, ఇపుడందులో ముగ్గురు ప్రత్యక్షమయ్యారు. ఇదేవిధమగ కోట్లకొలది కాగలరు. (62), నీవు వీరిని చంపితివా?! ఇపుడే రాముడు పుట్టును. వీరికి ఆయుర్బలముందిగనుక ఇపుడే సాహసింపకుము. (63),

యద్భవిష్యం తద్భవతు తదగ్రే మాఽస్తు సాంప్రతమ్ ।
ఏతాన్ దూతైః ప్రేషయాద్య సాకేతం త్వం సుఖీ భవ ॥ 64

న భవిష్యతి మద్వాణీ మృషా జానీహి నిశ్చయమ్ ।
యద్భావ్యం తద్భవత్యేవ గహనా కర్మణో గతిః ॥ 65

తద్విధేర్వచనం సత్యం మత్వా భీతో దశాననః ।
పేటికాం ప్రేషయామాస సాకేతం స్వభటైర్జవాత్ ॥ 66

సాకేతే పేటికాం త్యక్త్వా భటాస్తే రావణం గతాః ।
అయోధ్యాయాం మహానాసీత్ సంభ్రమో నృపదర్శనాత్ ॥ 67

అయోధ్యావాసినాం నృణాం కోసలాధిపతేరపి ।
తతః పునర్వివాహస్య సంభ్రమం కోసలాధిపః ॥ 68

కృత్వా స్వరాజ్యం జామాత్రే దదౌ ప్రీత్యా హి పుత్రికామ్ ।
తదారభ్య కోసలేంద్రాః ప్రోచ్యంతే రవివంశజాః ॥ 69

తతో రాజా దశరథః సుమిత్రాం మగధేశజామ్ ।
వివాహేనాపరాం పత్నీం చకార దయితాం ప్రియామ్ ॥ 70

కైకేయనృపతేః కన్యాం కైకేయీం పద్మలోచనామ్ ।
వివాహేనాకరోద్భార్యాం తృతీయాం పరమాదరాత్ ॥ 71

తథాఽన్యాని సప్తశత కళత్రాణ్యకరోన్నృపః ।
ఏవం రాజా దశరథః శశాస జగతీతలమ్ ॥ 72

దానైర్భోగైర్దశరథో బభూవ జరఠో మహాన్ ।
నాభవత్సంతతిస్తస్య ధార్మికస్యాఽవనీపతేః ॥ 73

కౌసల్యా చ సుమిత్రా చ కైకేయీ చ గిరీంద్రజే ।
ఏతాః కులీనాః సుభగా రూపయౌవనసంయుతాః ॥ 74

తస్మిన్ శాసతి రాజ్యం తు స్థితోఽయోధ్యాపురి ప్రియే ।
దేవానాం దానవానాం చ రాజ్యార్థం విగ్రహోమహాన్ ॥ 75

ముమ్ముందు ఏమగునో? అదియగుగాక! నాయనా! ఇపుడు వీరిని సాకేతపుర రాజధానికి పంపించి, నీవు సుఖముగానుండుము. (64), ఎప్పుడూ నామాట వ్యర్థముకాదని తెలుసుకో! ఇది నిశ్చయము. కాతగినది తప్పకయగును. కర్మమార్గము తెలిసికొనుట కష్టము. (65), బ్రహ్మ పలుకులు సత్యమని గ్రహించి, భయభ్రాంతుడైన రావణుడు, ఆ పెట్టెను భటులద్వారా సాకేతపుర రాజధానికి పంపించెను. (66,67) ఆ భటులు ఆ పెట్టెను అయోధ్యచేర్చి రావణునిచేరిరి. అయోధ్యవాసులు రాజును చూచి పెద్ద వేడుకలు చేసుకున్నారు. కోసల రాజుకు, నగరవాసులకు చాలా ఉత్సాహము కలిగినది. (68) సంతోషించిన కోసలరాజు మళ్ళీ వివాహమహోత్సవముజరిపి తన రాజ్యముతోపాటు కౌసల్యను దశరథునికిచ్చెను (69). అప్పటినుండి సూర్యవంశపురాజులు కోసలేంద్రులుగా పిలువబడ్డారు (70) ఆ తరువాత ఆ దశరథమహారాజు మగధరాజ కుమార్తెయగు సుమిత్రను పెండ్లాడి ప్రియపత్నిగా జేసుకొనెను (71). కేకయరాజ పుత్రికయైన కమలలోచనయగు కైకేయీ అను కన్యను ఎంతో ఆదరముతో పెండ్లాడి మూడవభార్యగా జేసికొనెను. (72) ఇదేవిధముగా వివాహమాడి 700 మందిని భార్యలుగా జేసికొనెను. (73) ఈ విధముగ దశరథమహారాజు దానములతోను, భోగములతోను, లోకమును పాలించుచు వృద్ధుడాయెను. అట్టి ధార్మికుడైన దశరథమహారాజుకు సంతానము కలుగలేదు. (74) ఆ రాజుకు కౌసల్య, సుమిత్ర, కైకేయీ అను ముగ్గురు భార్యలును రూప, యౌవన సంపదలతో, సత్కుల ధర్మపత్నులుగా ఖ్యాతినొందిరి (75).

**తత్ర వాగభవత్ శ్రేష్ఠా యత్రాయోధ్యాపతిర్మహాన్ ।**
**జయస్తత్ర న సందేహస్తాం శ్రుత్వా పవనో జవాత్ ॥ 76**

**ప్రార్థయామాస నృపతిం గత్వా యుద్ధాయ సాదరమ్ ।**
**తతో గత్వా దశరథశ్చకార కదనం మహత్ ॥ 77**

**ఏతస్మిన్నంతరే తత్ర సంగ్రామేఽతి భయావహే ।**
**భిన్నాక్షం స్వరథం రాజా నావిదద్దిష్టసంభ్రమాత్ ॥ 78**

**రాజ్ఞోఽన్తికే స్థితాసుభ్రూః కేకేయీ రణకౌతుకమ్ ।**
**పశ్యన్తీ స్వరథం భిన్నం దదర్శ సమరాంగణే ॥ 79**

**అక్షవత్సా నిజం హస్త చకార జయహేతవే ।**
**తయా తు పూర్వం బాల్యత్వాన్మహ్యాస్థం కస్యచిన్మునేః ॥ 80**

కృష్ణవర్ణం కృతం తేన శప్తా తేஉ ప్యపవాదతః ।
ముఖమగ్రే నిరీక్ష్యంతి నైవ లోకాః కదాచన ॥ 81

తతస్తం గంతుముద్యుక్తం కైకేయీ వామహస్తతః ।
దండాదికం దదౌతస్య మునేర్వాస్తేஉ తి భక్తితః ॥ 82

తస్యై దదౌ వరం విప్రస్తవ వామకరో వరాత్ ।
భవితా వజ్రకఠినః క్వాపి నాశం న చైష్యతి ॥ 83

కైకేయీ తం వరం స్మృత్వా స్వంచకారాక్షవత్కరమ్ ।
అథ జిత్వా రణే దైత్యాన్ దృష్ట్వా తత్కర్మ పార్థివః ॥ 84

దదౌ వరౌ ద్వౌ తస్యై స న్యాసభూతౌ కృతౌ త్వయా ।
యదాஉ హం యాచయిష్యామి తదా త్వం దేహి తౌ మమ ॥ 85

తథేత్యుక్త్వా నృపః పత్నీం యయౌ స్వనగరీం ప్రతి ।
ఏకదా స నిశాయాం తు మృగయాయాం మహావనే ॥ 86

చకార వారిబంధం చావధీద్వనచరాన్ బహూన్ ।
ఏతస్మిన్నంతరే తత్ర వనే వారాణసీపథా ॥ 87

కరండస్థౌ స్వపితరౌ స్వస్కంధే శ్రవణో వహన్ ।
కాశీం నేతుం యయౌ వైశ్యో ఘర్మబాధాభయాన్నిశి ॥ 88

నీరం పాతుం శిశో దేహి చావయోశ్చేతి ప్రార్థితః ।
తాభ్యాం కరండకే న్యస్య తటాకే జలసన్నిధౌ ॥ 89

ఆ దశరథ మహారాజు తనకు ప్రియమైన అయోధ్యను పరిపాలించుచుండగా అధికారమునకై దేవదానవులు కలహముచెందిరి (76). అపుడు దశరథుడున్నచోట జయము కలుగునని విని, (77) వాయుదేవుడు వచ్చి ప్రార్థించగా, దశరథమహారాజు యుద్ధమునకు బయలుదేరెను (78). ఆ లోకమున జరిగిన భయంకర యుద్ధములో తన రథచక్రముకున్న మేకు విరిగిన సంగతిని గమనించలేదు (79). సమీపమున ఆ రణవినోదమును గమనించుచున్న కైకేయీ, రథము భిన్నమౌతున్నదని గ్రహించి, (80) రాజుగారి విజయమును కాంక్షించి, తనహస్తమును ఆ రథ చక్రమునకు సహాయముగా

మేకువలే నుంచెను. (81) మునుపు తన చిన్నతనమున ఆమె ఒకానొక ముని ముఖమునకు నల్లని మసి రాసినందులకు ఆ ముని శపించగా ఆమె ముఖమును ఎవ్వరును నేరుగా చూడకుండిరి. (82) ఆ తరువాత నడుచుచున్న ఒకమునికి తన యెడమచేతితో ఒక చేతికట్టను భక్తితో సమర్పించగా, (83) ఆ ముని సంతసించి, "నీ చేయి వజ్రతుల్యమై నాశనముచెందదు" ని వరమునిచ్చెను. (84) ఆ ఋషివాక్యమును స్మరించి కైకేయీ తనచేతిని రథచక్రమునకు సహాయముగా నుంచెను. ఆ యుద్ధమున రాక్షసులను జయించిన దశరథమహారాజు కైకేయీ చేసిన ఆ పనికి సంతసించి, ఆమెకు రెండు వరములను ఇచ్చెను (85). అపుడా కైకేయీ "ఇపుడు మీరిచ్చిన ఈ రెండువరములను మీ వద్దనే ఉంచుచున్నాను. నేనెపుడు అడిగిన అపుడు ఇవ్వవలయునని," చెప్పెను. (86) అట్లేకానిమ్మని దశరథమహారాజు తన రాజ్యమునకు వచ్చెను. మరియొకసారి ఆ రాజు రాత్రివేళ మహారణ్యములో అనేక మృగములను వేటాడెను (87). నీటివద్ద మాటువేసి అనేక అడవిజంతువులను వేటాడెను. ఆ సమయమున అక్కడికి వారణాశికిపోవు (88) శ్రవణుడను వైశ్యుడు అంధులైన తన తల్లిదండ్రులను కావడిలో మోసికొనిపోవుచూ,.... (89)

**గత్వా జలే స్వయం కుంభం న్యుబ్జం తస్థౌ జలే క్షణమ్ ।**
**కుంభస్య న్యుబ్జతః శబ్దో బభూవ కరిణో యథా ॥ 90**

**వనద్విపో న హంతవ్యశ్చేతి జానన్నపి నృపః ।**
**వైశ్యం రాజా ద్విపం మత్వా వివ్యాథ స పతత్రిణా ॥ 91**

**పపాత శ్రవణస్తోయే హా కేనాహం ప్రతాడితః ।**
**బ్రువతశ్చేతి తద్వాక్యం శ్రుత్వాఽభూద్విహ్వలో నృపః ॥ 92**

**గత్వా జలాద్బహిర్వేగాత్ తంకృత్వాఽఽకర్ణ్య తద్గిరా ।**
**సర్వం వృత్తం విశల్యం తం చకార భయవిహ్వలః ॥ 93**

**తావంధావపి తత్పుత్రవధం శ్రుత్వా రురోదతుః ।**
**కారయిత్వా నృపతినా చితిం పుత్రసమన్వితౌ ॥ 94**

**దశరథాయ తౌ శాపం దదతుః పుత్రదుఃఖితౌ ।**
**పుత్రశోకాదావయోర్హి యథా మృత్యుస్తవాస్త్వితి ॥ 95**

**యయౌ నృపోఽపి నగరీం గురుం వృత్తం న్యవేదయత్ ।**
**వసిష్ఠో నృపతేర్దోషశాంత్యర్థం తురగాధ్వరమ్ ॥ 96**

నృపేణ కారయామాస సాకేతే సరయూతటే ।
రోమపాద ఇతి ఖ్యాతస్తస్మై దశరథ స్సఖా ॥ 97

శాంతాం స్వకన్యాం ప్రాయచ్ఛత్తద్రాష్ట్రేఽభూదవర్షణమ్ ।
విభాండకాశ్రమం వారనారీ స్సంప్రేష్య తత్సుతమ్ ॥ 98

రోమపాదోమోహయిత్వా ఋష్యశృంగం సమానయత్ ।
వారస్త్రియో వనేగత్వా సమానిన్యుర్ ఋషేః సుతమ్ ॥ 99

నాట్యసంగీతవాదిత్రైః విభ్రమాలింగనార్హణైః ।
తత్ ప్రతాపాదభూత్ వృష్టిః పుత్రోఽపి నృపతేరభూత్ ॥ 100

తతస్తుష్టో రోమపాదః తస్మై శాంతాం దదౌసుతామ్ ।
దశరథోఽపి స్వపురీ మానయామాస తం మునిమ్ ॥ 101

ఆ రాత్రి బాగా అలసిపోయి "త్రాగుటకు నీళ్ళిమ్ము నాయనా!" అని తల్లిదండ్రులడుగగా ఆ కావడినక్కడపెట్టి నీటివద్దకు వచ్చి, ఆ నీటిలో (90) కుండను ముంచగా, ఆ కుండ మునుగు శబ్దము ఏనుగు నీటినిపీల్చు శబ్దమును పోలియుండగా, (91) ఆడఏనుగును చంపరాదని తెలిసినవాడైనను, వేట తమకంలో ఆ దశరథుడు శ్రవణుని గజమని భావించి బాణముతో కొట్టెను. (92) అంతట శ్రవణకుమారుడు "హా! నన్ను చంపువారెవరు?" అని అరవగా, ఆ మాటవిన్న దశరథుడు కలతనొంది, (93) వచ్చి చూసి, అతనిని నీటినుండితీసి, వానివలన సంగతినంతటిని తెలిసికొని బాణమును తొలగించి, భయభ్రాంతుడయ్యెను. (94) ఆ అంధ దంపతులు పుత్రవధ వార్తచే ఏడ్చి రాజుచేత, పుత్రునితోకూడి తమకు చితినివేయించుకుని, (95) "పుత్రశోకమువలన మాకెట్లో నీకును అట్లే మరణము సంభవించుగాక!" అని దశరథుని శపించిరి. (96,) పిదప దశరథుడు రాజధానికి వచ్చి, వశిష్ఠునికి ఈ సంగతి తెలుపగా, ఆ వశిష్ఠుడు ఆ పాపమును పరిహరించుటకై రాజుచేత అశ్వమేధయాగమును చేయించెను (97). దశరథుడు ప్రసిద్ధుడగు తనమిత్రుడైన రోమపాదునికి, తన కుమార్తెయైన శాంతను దత్తుగా ఇచ్చియుండెను. (98) రోమపాదుడు తన దేశమున అనావృష్టి సంభవించగా, ఋష్యశృంగుని తీసుకువచ్చుటకు, విభాండక ఆశ్రమమునకు వారకాంతలను పంపెను. (99) వారు వెళ్ళి నాట్య, సంగీత వాద్యములచే విభ్రమాలింగనాది సత్కారములచే ఆ విభాండక సుతుని మోహింపజేసి వెంటదెచ్చిరి (100). ఆ ముని మహిమవలన ఆ దేశమున వానలు కురిసెను. రాజుకు పుత్రుడు కూడా కలిగెను (101).

స తు రాజ్ఞోఽనపత్యస్య నిరూప్యేష్టిం మరుత్వతః ।
ప్రత్యక్షం హి చకారాగ్నిం యజ్ఞకుండాత్సపాయసమ్ ॥ 102

ఆవిర్భూత్వా స్వయం వహ్నిః దదౌ రాజ్ఞే సుపాయసమ్ ।
రాజ్ఞా విభక్తం స్త్రీభ్యస్తత్రైకేయ్యా దుష్టభావతః ॥ 103

ఆహరత్పాయసం హస్తాత్ గృధ్రీ శాపవిమోచకమ్ ।
సువర్చలాఽప్సరోముఖ్యా నృత్యభంగాత్ స్వయంభువా ॥ 104

శప్తా జాతా తు సా గృధ్రీ తయా వేధా స్సుతోషితః ।
తస్యై తుష్టో విధిః ప్రాహ కైకేయీ పాయసం యదా ॥ 105

ప్రక్షిపస్యంజనగిరౌ తదా తే భవితా గతిః ।
అప్సరా త్వం పూర్వవచ్చ భవిష్యసి న సంశయః ॥ 106

తస్మాత్సా పాయసం నీత్వాఽక్షిపదం జనిపర్వతే ।
నిజం స్వరూపం సా లబ్ధ్వా జగామ సురమందిరమ్ ॥ 107

తతస్తాభ్యాం తు కైకేయ్యై దత్తం కించిత్తు పాయసమ్ ।
అథ తా భక్షయామాసురంతర్గర్భాస్తదాఽభవన్ ॥ 108

ఆసంస్తాసాం దోహదాస్తే పుత్రాణాం భావికర్మభిః ।
పుత్రాణాం భావికర్మాణి విదుస్తే దోహదైర్జనాః ॥ 109

ఇతి శ్రీ శతకోటిరామచరితాంతర్గతే, శ్రీమదానందరామాయణే,
వాల్మీకీయే, ఆదికావ్యే, సారకాండే, ప్రథమః సర్గః ॥

వీనితో సంతసించిన రోమపాదుడు, ఆ ఋష్యశృంగునికి తన కుమార్తెయగు శాంతనిచ్చి వివాహము జరిపించెను. దశరథుడు ఆ ఋష్యశృంగ మునిని తన పట్టణమునకు ఆహ్వానించెను. (102) ఆ ముని దశరథునికి యాగముతో ఇంద్రునిద్వారా హోమకుండమునుండి పాయసము ప్రత్యక్షమగునట్లు చేసెను. (103) అగ్ని తానుగా ఆవిర్భవించి, రాజుకు పరమాన్నమునిచ్చెను. రాజు దానిని తన ప్రియభార్యలకు పంచెను (104, 105). కైకేయి దుష్టభావముతో గృధ్రీ శాపమోచకమగు ఆ పాయసమును పారవైచెను. అదియేమనిన; సువర్చలయను

అప్సరస నాట్యదోషమున బ్రహ్మదేవునిచే శపింపబడి వేడుకొనగా, (106) సంతసించిన విధి "ఎపుడు కైకేయీ పాయసమును అంజనగిరిలో పారవేయునో అపుడు సుగతి గలుగు" నని వరమిచ్చెను. అందువలన ఆ సువర్చల గ్రద్ధయైయుండెను.

(107 కైకేయి పాయసము పారవేయగా, ఆ గ్రద్ధ పూర్వమువలే దేవాంగనయై వెళ్ళెను. అపుడు మిగిలిన ఇరువురును, కొంచెము పాయసమును కైకకు ఇచ్చిరి. పిమ్మట వారు పాయసమును భుజింపగా, దాని ప్రభావముతో వారు గర్భవతులై కలుగబోవు పుత్రులతో శోభిల్లి, వేవిళ్ళు పొందిరి. లోకులు వేవిళ్ళవలన పుత్రచర్యలను తెలిసికొనెదరు.

**శతకోటిప్రవిస్తరమైన రామకథలో, శ్రీమద్వాల్మీకిమహర్షిచే రచింపబడిన, ఆనందరామాయణంలో, సారకాండలో, ఒకటవసర్గ ముగిసినది.**



# ద్వితీయః సర్గః-2వ సర్గ

రామ, లక్ష్మణ, భరత, శత్రుఘ్నుల జననము.

**శ్రీశివ ఉవాచ**

**ఏతస్మిన్నంతరే భూమిర్దశాస్యాదిప్రపీడితా ।**
**బ్రహ్మణా ప్రార్థయామాస విష్ణుం సోఽపి తదాఽబ్రవీత్ ॥ 1**

**భూమ్యామవతరిష్యామి భవంతు కపయ స్సురాః ।**
**గంధర్వీ దుందుభీనామ్నీ భూమ్యాః కార్యార్థసిద్ధయే ॥ 2**

**మంథరాఽగ్రే భవత్వద్ధా రాజ్యవిఘ్నార్థసిద్ధయే ।**
**పశ్చాత్పునర్ద్వాపరాంతే కుబ్జాత్వం కంసమందిరే ॥ 3**

**అథ విష్ణుశ్చైత్రమాసి నవమ్యాం మధ్యగే రవౌ ।**
**సూతికాగృహమధ్యేఽథ కౌసల్యాయాః పురోఽభవత్ ॥**
**చతుర్భుజః పీతవాసా మేఘశ్యామో మహాద్యుతిః ॥ 4**

శివుడు చెప్పుచున్నాడు, "ఈ నాడు భూమి రావణాది రాక్షసులచేత పీడింపబడుచుండగా, భూదేవి బ్రహ్మను ప్రార్థించగా, ఆ బ్రహ్మ శ్రీమహావిష్ణువును ప్రార్థించెను. (2) అపుడు విష్ణువు, "భూమిపై అవతరించెదను, దేవతలు వానరులగుదురుగాక, దుందుభి అను గంధర్వస్త్రీ కార్యార్థ సిద్ధికై (3) ముందు మంథరగా, రాజ్యవిఘ్నార్థ సిద్ధికై పుట్టనీ, పిమ్మట మరల ద్వాపరాంతమున కంసుని నగరములో కుబ్జయగును," అని వరమిచ్చెను. (4)

**సాఽపి దృష్ట్వా బాలభావం ప్రార్థయామాస తం హరిమ్ ।**
**తతో జాతస్తదా బాలః క్షణాదృక్మవిభూషితః ॥ 5**

**హేమవర్ణః కంజనేత్రః చంద్రాస్యస్తపనప్రభః ।**
**తత స్సుమిత్రాపురతః శేషోఽభూద్బాలరూపధృక్ ॥ 6**

**ఆవిర్భూతౌ ద్వౌ యమలౌ కైకేయ్యా శ్శంఖచక్రకే ।**
**ఏవం తే జనితాబాలాః చత్వారస్సమయే శుభే ॥ 7**

దేవదుందుభయో నేదుః పుష్పవృష్టిః శుభా౨ పతత్ ।
జాతకర్మాదిసంస్కారాన్ గురుణా నృపతిస్తదా ॥ 8

కారయామాస విధివన్నృతుర్వారయోషితః ।
జ్యేష్ఠం రామం తు కౌసల్యాతనయం ప్రాహ వై గురుః ॥ 9

సుమిత్రాతనయం నామ్నా లక్ష్మణం గురురబ్రవీత్ ।
తతో భరతశత్రుఘ్ననామనీ ప్రాహ వై గురుః ॥ 10

రమణాద్రామ ఏవాసౌ లక్షణైర్లక్ష్మణస్త్వితి ।
భరణాత్ భరతశ్చేతి శత్రుఘ్నః శత్రుతర్జనాత్ ॥ 11

అథ వవృధిరే సర్వే లక్ష్మణో రాఘవేణ హి ।
శత్రుఘ్నో భరతేనాపి చకార క్రీడనాదికమ్ ॥ 12

రుక్మకంకణ మంజీరన్ నూపురైస్తే విభూషితాః ।
కేయూర రశనాహార కుండలైరతి శోభితాః ॥ 13

శృంఖలాబద్ధ రుక్మాది నిర్మితేషు వరేషు చ ।
దోలకేషు చ తే సర్వే దోలితా రేజిరే సుఖమ్ ॥ 14

భాలే స్వర్ణమయాశ్వత్థ పర్ణాన్యతిమహాంతి చ ।
ముక్తాఫలాప్రలంబీని శోభయంతి స్మ బాలకాన్ ॥ 15

కంఠే రత్నమణివ్రాత మధ్యద్వీపినఖాంచితాః ।
కర్ణయోః స్వర్ణసంపన్న రత్నార్జున సుతాలకాః ॥ 16

సింజానమణిమంజీర కటిసూత్రాంగదైర్యుతాః ।
స్మితవక్త్రాల్పదశనా ఇంద్రనీలమణిప్రభాః ॥ 17

అంగణే రింగమాణాశ్చ సంస్కారైః సంస్కృతాఃశుభాః ।
తే తాతం రంజయామాసుః మాతౄంశ్చాపి విశేషతః ॥ 18

అటుమీద శ్రీమహావిష్ణువు చైత్రశుక్ల నవమినాడు మిట్టమధ్యాహ్నవేళలో సూతికాగృహ మధ్యభాగమున కౌసల్యాదేవి ఎదుట ఆవిర్భవించెను. నాలుగుభుజములతో, పీతాంబరము (పసుపు

పచ్చని వస్త్రము) ధరించి మేఘశ్యాముడును. (5, 6) తేజోవంతమగు శ్రీహరిని ఆ కౌసల్యాదేవి చూచి, బాలభావమునొందునట్లు ప్రార్థించగా, అంతట క్షణకాలములో, చంద్రునివంటి మోమును, కమలములవంటి కన్నులను, అగ్నివంటి తేజస్సును, బంగారువంటి వర్ణమును, రత్నవిభూషణములు గల దివ్యబాలకుడు ఉదయించెను. అంతట సుమిత్రాదేవి యెదుట ఆదిశేషుడు బాలరూపమును ధరించి అవతరించెను (7). శంఖ, చక్ర దేవతలిరువురును కైకేయి గర్భమున కవలలై అవతరించిరి. ఇట్లు నలుగురు బాలకులు శుభసమయమందు జన్మించిరి (8,9). దేవదుందుభులు మ్రోగినవి. శుభకరమైన పుష్పవృష్టి కురిసినది. దశరథుడు వారికి గురువులైన వశిష్ఠులవారిచే నామకరణాది సంస్కారములను శాస్త్రోక్తముగ జరిపించెను. వశిష్ఠులవారు కౌసల్యా పుత్రునికి రాముడని నామకరణముజేసెను (10). సుమిత్రా పుత్రునికి లక్ష్మణుడనియు, కైకేయీ సుతులకు భరత, శత్రుఘ్నులనియు నామకరణముజేసెను (11). రమించుటవలన రాముడని, లక్షణములచే లక్ష్మణుడనీ, భరించుటచే భరతుడని, శత్రునిగ్రహమువలన శత్రుఘ్నుడనీ పేర్లు సార్థకమగును. (12) ఈ విధముగా వీరు ఎదుగుచుండగా, రామునితోడ లక్ష్మణుడు, భరతునితోడ శత్రుఘ్నుడును ఆటపాటలతో ఎడబాయకయుండిరి (13–18).

కౌసల్యా నృపతిశ్చాపి నానావస్త్రైః సుభూషణైః ।
శోభయామాసతుర్బాలాన్ నానావ్యాఘ్ర నఖాదిభిః ॥ 19

రామః స్వపితరం దృష్ట్వా భోజనస్థ త్వరాన్వితః ।
దుద్రావ కబళం పాత్రాత్ గృహీత్వా స పునర్బహిః ॥ 20

కౌసల్యా బాలకం ధర్తుం దుద్రావ నృపనోదితా ।
న తస్యాః కరగశ్చాసీత్ యోగినామప్యగోచరః ॥ 21

పరివృత్య స్వయం రామః కరేణ మృదులేన చ ।
కౌసల్యాస్యే నృపాస్యేఽపి కబళావకరోన్ముదా ॥ 22

ఏవం నానాకౌతుకైశ్చ రంజయామాస రాఘవః ।
నానా శిశుక్రీడనకైః చేష్టితైర్ముగ్ధభాషితైః ॥ 23

బాలకృత్రిమ యుద్ధైశ్చ గమనైర్ముఖ చుంబనైః ।
పితరౌ నిజచారిత్రైః వాహనారోహణాదిభిః ॥ 24

తతస్తే  బాలకాః  సర్వే వస్త్రాలంకారభూషితాః ।
సభాయాం పితరం నత్వా తస్థుః సింహాసనోపరి ॥ 25

అత్ర పిత్రోపనీతాస్తే గురుణా మునిభిర్ముదా ।
గర్భాత్సంవత్సరే షష్ఠే జన్మతః పంచమే సమే ॥ 26

బ్రహ్మవర్చసకామస్య కార్యం విప్రస్య పంచమే ।
రాజ్ఞోబలార్థినః షష్ఠే వైశ్యస్యార్థార్థినోఽష్టమే ॥ 27

విద్వద్భిశ్చోపనయనమేవం శాస్త్రేషు నిర్ణయః ।
గురోరాస్యాత్సుముహూర్తే వేదాన్ సాంగాంశ్చతుర్విధాన్ ॥ 28

చక్రుర్ముఖోద్గతానేవ బాలాః శాస్త్రాదికాన్యపి ।
బ్రహ్మచర్యసమాప్తౌ తే తీర్థాని జగ్మురాదరాత్ ॥ 29

సేనయా మంత్రిసహితా వశిష్ఠేన సమన్వితాః ।
షణ్మాసైః పునరాగత్య సాకేతం వివిశుర్ముదా ॥ 30

ఏవం తే మతిమంతశ్చ ప్రియా రాజ్ఞో వశే స్థితాః ।
పితరం రంజయామాసుః పౌరాన్ జానపదానపి ॥ 31

**ఇతి శ్రీశతకోటిరామాచరితాంతర్గతే, శ్రీమదానందరామాయణే, వాల్మీకీయే, ఆదికావ్యే, సారకాండే, రామజన్మనామ ద్వితీయః సర్గః ॥**

ఆ నలుగురు దివ్యమైన రత్నములుపొదిగిన బంగారు ఆభరణములు, కేయూర కుండల కంకణ నూపురాది భూషణములచే అలంకరింపబడి, రావిరేకులు ముఖమున వ్రేలాడగ, మణిమయమైన పులిగోళ్ళు కంఠమున మెరయుచుండగా, లేత దంతములపై చిరునవ్వు ముద్దుముద్దుగా నుండగా, అటునిటు దోగాడుచూ, బాల్యక్రీడలచే తల్లిదండ్రులను రంజింపజేసిరి. (19) కౌసల్యా దశరథులు ముచ్చటైన అలంకారములచే రామాదులను అలంకరించి, వినోదముగాంచుచుండిరి. (20) రాముడు భోజన సమయమున ముద్దను చేతబుచ్చుకుని పరుగెత్తెను. (21) పట్టుకొనుటకై కౌసల్య పరుగెత్తెను. యోగులకుకూడా గోచరింపని శ్రీరాముడు చిక్కకయుండెను. (22) ఇట్లు రాముడు చుట్టివచ్చి, కౌసల్యకును, దశరథునికి ఆ ముద్దను తినిపించెను. (23) ఇట్లే రాఘవుడు పలువిధములగు

వేషములతోను, వివిధములైన బాలక్రీడలతోను, చేష్టలతోను, ముద్దుమాటలతోను, (24) బాలల పోట్లాటలతోను, ముద్దునడకలతోను, వాహనములు అధిరోహించి దిగడమువంటి చర్యలతోను, తల్లిదండ్రులను ఆనందింపజేసెను. (25) ఆ వయస్సులోనున్న బాలకులు చక్కని వస్త్రభూషణాది అలంకారములతో, సభలోనికి ప్రవేశించి, తండ్రికి నమస్కరించి, తగిన సింహాసనములను అలంకరించిరి. (26) అపుడు దశరథమహారాజు వశిష్ఠాది మునులతో ఆ బాలకులకు గర్భాదిగా ఆరవదిగాను, జన్మాదిగా ఐదవసంవత్సరమున ఆనందముతో ఉపనయన సంస్కార మహోత్సవమును జరిపించెను. (27) ఎందులకనగా బ్రహ్మవర్చస్సును పొందగోరిన బ్రాహ్మణునికి ఐదవ యేటను, బలాపేక్షకలిగిన క్షత్రియునికి ఆరవయేటను, అర్థమునపేక్షించు వైశ్యునికి ఎనిమిదవయేటను, ఉపనయనము చేయవలయునని జ్ఞానులచే శాస్త్రమున నిర్ణయింపబడినది. (28) ఆ తరువాత వారు మంచి ముహూర్తమున గురుకులమునచేరి, సాంగములగు నాలుగువేదములు, వేదాంగములు, (29) ఇతర శాస్త్రాదులు, కళలు గురుముఖముగా నేర్చి, బ్రహ్మచర్య సమాప్తియందు ఆదరముతో, తీర్థములకు వెళ్ళి, (30) సేనతో, మంత్రులతో, వశిష్ఠులవారిని వెంటదీసుకుని, మరల ఆరుమాసములలో సంతోషముతో అయోధ్యానగరమున ప్రవేశించిరి. (31) ఈ విధముగా ఆ రాజపుత్రులు అనురాగపాత్రులై దశరథుని వశమున తండ్రిని, నగరవాసులను, దేశప్రజలనుగూడ రంజింపచేసిరి.

***శతకోటిప్రవిస్తరమైన రామకథలో, శ్రీమద్వాల్మీకిమహర్షిచే రచింపబడిన,***
***ఆనందరామాయణంలోని, సారకాండలో, రామజన్మను వివరించు***
***రెండవ సర్గ ముగిసినది.***



# తృతీయః సర్గః-3వ సర్గ

తాటకవధ, అహల్యోద్ధారం మరియు సీతాస్వయంవరం

శ్రీశివ ఉవాచ

ఏతస్మిన్నంతరేఽయోధ్యాం విశ్వామిత్రో యయౌమునిః ।
యజ్ఞసంరక్షణార్థాయ రాజానం మునిరబ్రవీత్ ॥ 1

రామం చ లక్ష్మణం చాపి మహ్యం దేహి కియద్దినమ్ ।
గురుణామంత్ర్య రాజాఽపి ప్రేషయామాస తౌ తదా ॥ 2

జగ్మతుర్యజ్ఞరక్షార్థం గాధిజేన రథస్థితౌ ।
తతః ప్రహృష్టో గాధేయః స్థిత్వా కామాశ్రమే పథి ॥ 3

ప్రభాతే స్నాతయోః స్నాతః ప్రాదాద్విద్యాస్తయోర్ముదా ।
మాహేశ్వరీం చ సద్విద్యాం ధనుర్విద్యా పురస్సరామ్ ॥ 4

శాస్త్రీమాస్త్రీం లౌకికీం చ రథవిద్యాం గజోద్భవామ్ ।
అశ్వవిద్యాం గదావిద్యాం మంత్రాహ్వాన విసర్జనే ॥ 5

క్షుత్తృట్శ్రమవిలోపిన్యౌ బలామతిబలామపి ।
సర్వవిద్యాస్త్వవాప్యాథ హ్యుభౌ తౌ రామలక్ష్మణౌ ॥ 6

వనౌకసాం హితార్థాయ జఘ్నతుస్తత్ర రాక్షసాన్ ।
పథి పాంథజనధ్వంసకారిణీం నామ తాటికామ్ ॥ 7

రాక్షసీమేకబాణేన జఘాన రఘునందనః ।
అప్సరా సా మునిం పూర్వం క్షోభయామాస కాననే ॥ 8

రాక్షసీ తస్య శాపేన బభూవ సుందకామినీ ।
మారీచశ్చ సుబాహుశ్చ సుందాత్తస్యాః సుతావుభౌ ॥ 9

రామబాణాద్గతిస్తస్యాః కీర్తితా మునినా పురా ।
సా ప్రాప్య దివ్యదేహత్వం నత్వా రామం దివం గతా ॥ 10

ఈ మధ్యలో విశ్వామిత్ర మహాముని అయోధ్యకువచ్చి, యజ్ఞసంరక్షణార్థం దశరథరాజును "రామ లక్ష్మణులను కొన్నిదినములపాటు తనవెంట పంపమని" కోరెను. అపుడు దశరథుడు, వశిష్ఠునితోకూడి ఆలోచించి, వారిని పంపెను. (3) ఆ రామలక్ష్మణులు రథములపై విశ్వామిత్రునితో వెడలిరి. అపుడు సంతుష్టుడైన గాథేయుడు దారిలో కామాశ్రమమున నిలచి, (4) ఉదయమే స్నానముచేసి, శుచివంతులైన రామలక్ష్మణులకు మాహేశ్వరియను విద్యను, ధనుర్విద్యా సహితముగా, (5)శస్త్రవిద్యను, అస్త్రవిద్యను, లౌకికవిద్యలైన రథ, గజ, తురగ విద్యలను, ఆయుధవిద్యను, మంత్రముల ప్రయోగ ఉపసంహారములను, (6) ఆకలి దప్పులను పోగొట్టు బల, అతిబల విద్యలనుగూడ సంతోషముతో ఉపదేశించెను. ఇంకను ఆ రామలక్ష్మణులు సర్వవిద్యలును గ్రహించి, (7) వనవాసుల క్షేమమునకై అచట రాక్షసులను సంహరించిరి. ప్రయాణీకులను ఇబ్బందిపెట్టు 'తాటక' యను రాక్షసిని శ్రీరాముడు ఒకబాణముతో సంహరించెను. (8)అది మునుపొక అప్సరస స్త్రీ. వనమున అది ఒక తాపసుని తొందరపెట్టగా అతడామెను రాక్షసియగునట్లు శపించెను. (9) అందువలన తాటకి సుందుడను రాక్షసునికి కామిని అయ్యెను. సుందునివలన దానికి సుబాహుడని, మారీచుడని ఇద్దరు పుత్రులు కలిగిరి. (10)

**విశ్వామిత్రాశ్రమం రామో గత్వా తద్యజ్ఞఘాతకాన్ ।**
**రాక్షసాన్నిశితైర్బాణైః జఘాన రఘునందనః ॥ 11**

**ప్రారంభం రణయజ్ఞస్య చకార రఘునందనః ।**
**హత్వా సహస్రశః శ్రీమాన్ రాక్షసాన్ నిశితైః శరైః ॥ 12**

**క్షిప్త్వా బాణేన మారీచం శతయోజనసాగరే ।**
**హత్వా సుబాహుం చైకేన బాణేన రఘుసత్తమః ॥ 13**

**స కృత్వా గాధియజ్ఞస్య సమాప్తిం రఘునందనః ।**
**నాకరోద్రణయజ్ఞస్య సమాప్తిం స్వకృతస్య చ ॥ 14**

**కాలానలమతృప్తం తం దృష్ట్వా తత్తృప్తిహేతవే ।**
**శ్రుత్వా జనకగేహే వై తత్కన్యాయాః స్వయంవరమ్ ॥ 15**

**రామలక్ష్మణసంయుక్తో మునిస్తం నగరం యయౌ ।**
**గమనావసరే మార్గే భర్తృశప్తాం శిలాం మునిః ॥ 16**

**మునిరూపిమహేంద్రేణ భుక్తాం రహసి శోభనామ్ ।**
**గౌతమస్యాంగనాం నామ హ్యహల్యాం చావదత్తయోః ॥ 17**

బ్రహ్మణా నిర్మితాఽహల్యా ద్విముఖీ గోః పరిక్రమాత్ ।
దత్తా పురా గౌతమాయ విసృజ్యేంద్రాదికాన్ సురాన్ ॥ 18

తత్ స్మరన్ మఘవా వైరం తాం భుక్త్వా మునిశాపతః ।
సహసా భగవాన్ జాతః సహస్రలోచనస్తతః ॥ 19

శ్రీరామచంద్రో నిజపాదపద్మ, స్పర్శేన తాం గౌతమధర్మపత్నీమ్ ।
నిష్కల్మషామద్భుతరూపయుక్తాం, చకార దేవః కరుణాసముద్రః ॥ 20

నదారూపా జనస్థానేఽహల్యా గౌతమశాపతః ।
రామేణ భ్రమతారణ్యే స్వాంఘ్రిస్పర్శాత్ సముద్ధృతా ॥ 21

కల్పభేదాద్వదంతీత్థం మునయశ్చాపి కేచన ।
నైవ శాపోఽస్తి సర్వేషు కల్పేషు సత్కథా తథా ॥ 22

తతస్తౌ సురగంధర్వవర్షితౌ పుష్పవృష్టిభిః ।
దత్వాఽహల్యాం గౌతమాయ జగ్మతుర్జాహ్నవీం ప్రతి ॥ 23

శపించిన ఆ ముని, దానికి రామబాణపు దెబ్బవలన సద్గతి కలుగునని చెప్పియుండెను. అట్లే ఆ తాటకి ఇచట దివ్యదేహమును పొంది, రాముని స్తుతించి, పైలోకమునకేగెను (11). ఆ తరువాత రాముడు విశ్వామిత్రాశ్రమమునకు వెళ్ళి, అచట యజ్ఞమునకు విఘాతముకలిగించు రాక్షసులను చంపుచు (12), రణయజ్ఞమునారంభించి వేలకొలది రాక్షసులను తన పదునైన బాణములచే అణగద్రొక్కి (13), మారీచుని నూరామడల దూరమున సముద్రములో పడవేసి, సుబాహువును చంపివేసి (14, 15) విశ్వామిత్రయాగమును పూర్తిచేసి, తృప్తిచెందని కాలాగ్నిని చూచి దానికి తృప్తినిచ్చుటకై తన రణయజ్ఞమును పూర్తిచేయకయుండెను (15), పిదప జనకరాజ మందిరమున సీతాస్వయంవరం జరుగునని విని, విశ్వామిత్రుడు రామలక్ష్మణులతో మిథిలకు బయలుదేరెను (16,17), దారిలో ప్రయాణించునప్పుడు, విశ్వామిత్రుడు రామలక్ష్మణులకు ఇంద్రునివలన శాపమునొంది, గౌతమునికి దూరమై, శిలయైన అహల్య శాపవృత్తాంతమును చెప్పెను(18). పూర్వము బ్రహ్మచే సృష్టింపబడిన అహల్య ఇంద్రాది దేవతలకివ్వబడక, ద్విముఖీ గో ప్రదక్షిణమువలన గౌతమునికి ఇవ్వబడెను (19). ఆ పగచే ఇంద్రుడు ఆమెను కామించి, గౌతమశాపమున సహస్ర నేత్రుడయ్యెను. (20) ఆ గౌతమ ధర్మపత్నిని కరుణాసముద్రుడగు శ్రీరామచంద్రుడు తన పాదస్పర్శతో పాపరహితగానూ, ఆశ్చర్య సంపన్నురాలుగానూ చేసెను. (21) అహల్య, గౌతమ శాపముచే జనస్థానమున నదీరూపముగా ఉండగా, శ్రీరాముడు తన అరణ్యవాసమున నిజపాద స్పర్శచే ఉద్ధరించెను. (22) అని కూడా

కొంతమంది మునులు కల్పభేదమువలన చెప్పెదరు. శ్రీరామ దివ్యచరిత్ర అన్ని కల్పములలోనూ ఏకరూపముగాలేదు (23).

రామం నౌకాం కాంక్షమాణం నౌకాపో వాక్యమబ్రవీత్ ।
నావిక ఉవాచ ॥
ఆదావహం క్షాళయిత్వా పాదరేణూంస్తవ ప్రభో ॥ 24

పశ్చాన్నౌకాం స్పర్శయామి తవ పాదౌ రఘూద్వహ ।
నోచేత్త్వత్పాదరజసా స్పృష్టా నారీ భవిష్యతి ॥ 25

క్షాళయామి తవ పాదపంకజం, నాథ దారుదృషదోః కిమన్తరమ్ ।
మానుషీకరణచూర్ణమస్తి తే, ఇతి లోకే హి కథా ప్రథీయసీ ॥ 26

అస్తి మే గృహిణీ గేహే కిం కరోమ్యపరాం స్త్రియమ్ ।
ఇతి తద్వాక్యమాకర్ణ్య విహస్య రఘునందనః ॥ 27

తేన సంక్షాళితపదో నౌకాం తామారురోహ సః ।
తతస్తీర్త్వా జాహ్నవీం తే మిథిలాం మునిభిర్యయుః ॥ 28

మిథిలాయాం సమాహూతాః కోటిశః పార్థివా యయుః ।
చారణాస్యాద్దశాస్యోఽపి శ్రుత్వాఽగచ్ఛత్స్వమంత్రిభిః । 29

అనాహూతః పుష్పకేణ సేనయా పరివారితః ।
న యయౌ పుత్రవిరహాత్ రాజా దశరథస్తదా ॥ 30

అత్యాదరైర్విదేహేన సమాహూతోఽపి భక్తితః ।
శ్రీరామలక్ష్మణాభ్యాం చ విశ్వామిత్రో మునీశ్వరః ॥ 31

శనైర్ముదా స మిథిలాం బహిశ్చోపవనం యయౌ ।
విశ్వామిత్రం సమానేతుం జనకో మంత్రిభిః సహ ॥ 32

యావద్గంతుం మనశ్చక్రే తావచ్ఛిష్యః సమాయయౌ ।
విశ్వామిత్రస్య తం దృష్ట్వా ననామ జనకస్తదా ॥ 33

తతః శిష్యః కరం ధృత్వా జనకస్య కరేణ హి ।
నీత్వా రహసి ప్రోవాచ వచనం స్వగురోః స్ఫుటమ్ ॥ 34

**త్వామాహ గాధిజో రాజన్ రాజ్ఞో దశరథస్య హి ।**
**మయా పుత్రౌ సమానీతౌ వీరౌ శ్రీరామలక్ష్మణౌ ॥ 35**

**తౌ సీతోర్మిళయోః పాణిగ్రహణం హి కరిష్యతః ।**
**పణీకృతం త్వయా చాపం రామోఽయం ఖండయిష్యతి ॥ 36**

అంతట వారిమీద దేవ గంధర్వులచే పూలవాన కురిసెను. శ్రీరామాదులు, ఆహల్యను గౌతమున కిచ్చి, గంగాతీరమునకు వెడలిరి. (24) అచట శ్రీరాముడు పడవనెక్కునపుడు ఆ పడవ యజమాని రామునిజూచి, "ఓ ప్రభూ! నేను మీ పాదధూళిని కడిగిన తరువాతనే, తమరిని నా పడవలోనికి అనుమతించెదను (25,26). అట్లుచేయనిచో మీ పాదధూళికి ఈ పడవ పడతియగును (27). నా ఇంటిలో ఇల్లాలుండగా మరియొక మగువనేమిచేయుదు?" ననగా, శ్రీరాముడు నవ్వి (28) వానిచే పాదములు కడిగించుకుని పడవనెక్కెను. అందరునూ గంగానదినిదాటి మునులతోడ మిథిలాపురికి చేరిరి. (29) మిథిలకు ఆహ్వానింపబడిన రాజులందరూ అమితముగా వెళ్ళిరి. సారణునిద్వారా సీతా స్వయంవర వార్తను విన్న రావణుడు, తన మంత్రులతోకూడి ఆహ్వానము లేకున్నను పుష్పకవిమానము నెక్కి మిథిలానగరము చేరెను. (30) జనకుడు దశరథుని ఎంతో ఆదరముతో ఆహ్వానించినను ఆ సమయమునకు కుమారుడు తనవద్ద లేనికారణమున వెళ్ళలేదు. (31) విశ్వామిత్రుడు రామ లక్ష్మణులను వెంటబెట్టుకుని, మునులతోడ తిన్నగ మిథిలాపురపు ఉపవనము చేరెను. (32) జనకమహారాజు తనమంత్రులతోకూడి విశ్వామిత్రుని ఆహ్వానించుటకు బయలుదేరునప్పటికే ఒక శిష్యుడచటికి చేరెను. (33) అపుడు జనకుడు కౌశికుని శిష్యునిజూచి నమస్కరించెను. (34) అపుడాశిష్యుడు జనకుని చేతిని గ్రహించి, రహస్య ప్రదేశమునకు వెళ్ళి, (35) "ఓ రాజా! విశ్వామిత్రముని మీతో ఇలా చెప్పమన్నారు. "దశరథరాజ కుమారులగు రామలక్ష్మణులు మాతో వచ్చియున్నారు. (36)

**అతో వరవిధానేన తౌ పురీం నేతుమర్హసి ।**
**ఏతద్వృత్తం చాపభంగపర్యంతం మా స్ఫుటం కురు ॥ 37**

**ఇత్యుక్త్వా జనకం శిష్యః స్వగురుం శీఘ్రమాయయౌ ।**
**జనకోఽపి ముదా యుక్తః తూష్ణీమేవ పురీం నిజామ్ ॥ 38**

**తోరణాద్యైః శోభయిత్వా సైన్యేన పరివేష్టితః ।**
**వారణేంద్రం పురస్కృత్య సభార్యస్తైః నృపైః సహ ॥ 39**

సుమేధాదిప్రమదాభిర్నానావాద్యైర్మనోహరైః ।
విశ్వామిత్రాంతికం గత్వా నత్వా సంపూజ్య తం మునిమ్ ॥ 40

అజ్ఞాత ఇవ తౌ దృష్ట్వా శ్రుత్వా తద్వృత్త మాదరాత్ ।
వస్త్రాలంకారభూషాద్యైః సత్కృత్యా విధివన్నృపః ॥ 41

గజయోస్తౌ సమారోప్య చామరాద్యైః స్సువీజితౌ ।
విశ్వామిత్రేణ మునినా నినాయ మిథిలాం పురీమ్ ॥ 42

ననృతుర్వారనార్యశ్చ తుష్టువుర్వందిమాగధాః ।
నేదుర్నానాసువాద్యాని జగుస్తే తు నటాదయః ॥ 43

తదా తౌ హట్టమార్గేణ జగ్మతుశ్చాతిశోభితౌ ।
శ్రుత్వా చ పురనార్యశ్చ వీరౌ శ్రీరామలక్ష్మణౌ ॥ 44

సమాగతావితి ముదా జగ్మతుశ్చాతిశోభితౌ ।
కంజనేత్రైర్దదృశుస్తౌ వవర్షుః పుష్పవృష్టిభిః ॥ 45

తదా పరస్పరం ప్రోచుః సీతాయోగ్యో వరస్త్వయమ్ ।
రామోఽస్మాకం రోచతే హి కరోత్యేవం విధిస్తు సః ॥ 46

ఊర్మిళాయాస్తు యోగ్యోఽయం లక్ష్మణోఽస్తి సులక్షణః ।
అస్మాకం సుకృతైరద్య తయోరేతౌ పతీ శుభౌ ॥ 47

శ్రీరామలక్ష్మణౌ రమ్యౌ భవతశ్చోత్తమోత్తమౌ ।
ఏవం తాసాం కామినీనాం వచనాని నృపాత్మజౌ ॥ 48

శుశ్రువతు శ్శుభాన్యేవ హ్యార్ధ్వాస్యౌ తౌ దదర్శతుః ।
తతస్తేమిలితాః సర్వే నృపాః ప్రోచుః పరస్పరమ్ ॥ 49

వారు సీత, ఊర్మిళను వివాహమాడెదరు. ఈ రాముడే నీ చే పందెముగావింపబడిన శివధనస్సును విరుచును. (37) అందువలన వారిని వరవిధానమున రాజధానిలోనికి ఆహ్వానించ" మనెను. ఈ విషయం విల్లు విరుగువరకు వెల్లడిచేయవలదు." అని పలికి, ఆ శిష్యుడు, తన గురుసన్నిధికి వెంటనే వచ్చెను. (38) జనకరాజును సంతోషయుక్తుడై, (39) తన పట్టణమును అలంకరింపించి, సేనావృతుడై భార్యలను, రాజులను వెంటనిడుకుని, గొప్పగొప్ప గజములు ముందు నడుచుచుండగా,

(40) సుమేధాది కాంతలు, నానా వాద్యములును మహోత్సవముగా రాగా, విశ్వామిత్రుని సన్నిధికి వెడలి, ఆ మునిపుంగవుని పూజించి, (41) తెలియని వానివలే వారి వృత్తాంతమును అడిగి తెలుసుకుని, విధివిధానముగా వస్త్ర, భూషణాది అలంకారములతో సత్కరించి, (42) ఆ రామలక్ష్మణులను ఏనుగుల నెక్కించి, చామరాది ఉపచారములతో, విశ్వామిత్రునితోపాటు మిథిలాపురములోనికి తీసుకువచ్చెను. (43) వారాంగనలు నాట్యమాడుచుండగా, వందిమాగదులు కొనియాడుచుండగా, వాద్యములు మ్రోగుచుండగా, (44) వ్యాపారకూడళ్ళవైపునుండి వచ్చుచున్న రామలక్ష్మణులు వెలుగొందుచుండిరి. ఈ మహోత్సవమును గాంచుటకు నగర నారీమణులు (45) భవనములనెక్కి తమ పద్మ నయనములతో దర్శించి, పూలవానలు గురుపించుచున్న వారిలో (46) "ఈ రాముడు మనసీతకు తగిన వరుడ" ని "బ్రహ్మ ఇట్లే జరుపుగాక" అని వాఛించిరి. (47) సులక్షణుడగు లక్ష్మణుడు మన ఊర్మిళకు తగినవాడు, మన పూర్వపుణ్యమువలన వారికి వీరు మంచి భర్తలుగా లభించెదరు. (48) ఎంతో సుందరులైనవీరు, నీకును తగినవారే! అనుచు పరస్పరము చెప్పుకొనుచుండగా, (49)

**ఏతాదృశో విదేహేన యదాఽస్మాభిస్సమాగతమ్ ।**
**తదోత్సవః కృతో నైవ హ్యనయోః క్రియతే కథమ్ ॥ 50**

**కిమంతఃస్థేన రాజ్ఞాఽద్య సీతా రామాయ సాఽర్పితా ।**
**కిమస్మాకం సమాహూయ మానభంగోఽద్యనః కృతః ॥ 51**

**ఏవం తేషాం నృపాణాం చ వచనాని నృపాత్మజౌ ।**
**జనకో గాధిజశ్చాపి శుశ్రువుస్తే సమంతతః ॥ 52**

**తతః శనై శ్శనైర్వీరౌ గవాక్షైః స్త్రీభిరీక్షితౌ ।**
**జగ్మతుర్వాద్యఘోషాద్యై ర్జనకస్య సభాం ప్రతి ॥ 53**

**తతోఽవతరతుర్వీరౌ గజాభ్యాం మునినా సహ ।**
**తత్స్వయం వరశాలాయా ముపవిష్టేషు రాజసు ॥ 54**

**విశ్వామిత్రానుగౌ తౌ హి మునిశాలాం ప్రజగ్మతుః ।**
**ఋద్ధాయా మునిశాలాయాం మునేరగ్రే నిషీదతుః ॥ 55**

**ఏవం సభాయామృద్ధాయాం రాజ్ఞా కన్యాప్రతిగ్రహే ।**
**ప్రతిజ్ఞాతం మమ ధనుస్తత్సజ్జ త్వముపస్థితమ్ ॥ 56**

**యదాఽధీతా ధనుర్విద్యా మత్తః పరశుధారిణా ।**
**తదా దత్తం మయా తస్మై ధనుస్త్రీపురదాహకమ్ ॥ 57**

తేనైకవింశద్వారం హి నిఃక్షత్రా పృథివీ కృతా ।
సహస్రబాహుర్నిహతః స్వపితుర్ఘాతకారణాత్ ॥ 58

తన్మైథిలాంగణే స్థాప్య జామదగ్న్యో నృపం యయౌ ।
అశ్వవత్తద్ధనుః కృత్వా జానకీ క్రీడనం వ్యధాత్ ॥ 59

జామదగ్న్యస్తేన సీతాం జ్ఞాత్వా లక్ష్మీం తదిచ్ఛయా ।
దదౌ నృపం పణార్థం తద్ధనురన్యైర్దురాసదమ్ ॥ 60

పణీకృతం ధనుస్తచ్చ విదేహేన స్వయంవరే ।
తతః సభాయామృద్ధాయాం జనకః ప్రాహ శంకితః ॥ 61

సంస్థాప్య రాజ్ఞాం పురతస్తన్మే చాపమనుత్తమమ్ ।
శస్త్రాగారాత్సమానీతం వృషైః పంచశతైస్తు యత్ ॥ 62

ఆ సంతోషకరమైన మాటలను రామలక్ష్మణులు వినిరి. అచట చేరిన రాజులందరూ తమలోతాము "ఏమిది?! మనమువచ్చినపుడు ఇట్టి ఉత్సవముచేయలేదు. వీరికి మహోత్సవము జరుగుచున్నది. (51) మనలనెందుకు ఆహ్వానించినట్లు? ఈ రామునికే సీతనిచ్చినాడా? మనరాకకు గౌరవము తప్పినదా?" (52) అని చర్చించుటను జనకుడు, రామలక్ష్మణులు, విశ్వామిత్రాదులును వినిరి. (53) ఆవిధముగా నెమ్మది నెమ్మదిగా సాగుతున్న ఆ శోభాయాత్ర నగరవాసులకు నేత్రానందము కలిగించుచు వాద్యఘోషలతో జనకుని సభకు విచ్చేసెను. (54, 55)

అంబారీలనుండి దిగిన ఆ వీరులు, విశ్వామిత్రుని అనుసరించి స్వయంవర మందిరమున ప్రవేశించి, మునిశాల యందు కౌశికునిముందు ఆశీనులైరి. (56) ఆ నిండుసభలో జనకమహారాజు "సీతాస్వయంవరమునకై పరశురాములచే పెట్టబడి, నూరు ఎద్దులచే ఆయుధాగారమునుండి లాగబడిన ఈ ధనస్సుకు ఏ మహావీరుడు అల్లెత్రాడును ఎక్కుపెట్టునో వానిని మా సీతాదేవి వరించగలదు" అని ప్రతిజ్ఞ చేసి అందరి ఎదుట ఆ దివ్య ధనస్సు స్థాపించబడెను. (57) "ఓ పార్వతీ! పరశురాముడు నావద్ద విద్యనభ్యసించినపుడు, త్రిపురాసుర సంహారమునకు ఉపయోగించిన ఈ ధనస్సును అతనికిచ్చితిని. (58) భార్గవరాముడు ఈ ధనస్సుచేతనే తన తండ్రిని హింసించిన వేయిచేతులుగల కార్తవీర్యార్జునుని చంపడముతోపాటు, ఈ భూమిమీద క్షత్రియుడు లేకుండా చేసెను. (59) జామదగ్న్యుడు చివరకు దానిని మిథిలానగరమున జనకునివద్ద పడవేసి వెళ్ళెను. సీతాదేవి ఆ ధనస్సును గుఱ్ఱమువలే భావించి దానితో ఆడుకొనుచుండెను. (60–63)

సీతాస్వయంవరార్థం యన్న్యస్తం పరశుధారిణా ।
నృపః ప్రాహ సభామధ్యే యో వీరస్త్వద్య సంసది ॥ 63

కరిష్యతి ధను స్సజ్జం తం వై సీతా వరిష్యతి ।
తత్తస్య వచనం శ్రుత్వా ధనుర్దృష్ట్వాఽచలోపమమ్ ॥ 64

అధోముఖాస్తదా సర్వే బభూవుః పార్థివోత్తమాః ।
కేచిద్భూమేః సముద్వోఢుం ధను శ్శక్తా న చాభవన్ ॥ 65

భూమేరుచ్చాలితే కేచిదూర్ధ్వం నేతుం న చాశకన్ ।
సర్వేఽప్యుచ్చాలనే తస్య నృపా శ్శక్తా న చాభవన్ ॥ 66

సజ్జీకారః కుతస్తస్య మనసాఽప్యవిచింతితః ।
ధను స్సజ్జీకృతౌ సర్వాన్ నృపాన్ జ్ఞాత్వా పరాఙ్ముఖాన్ ॥ 67

తదాతిగర్వసంరూఢః సభాయాం రావణోఽబ్రవీత్ ।
ధనుషః సన్నిధిం గత్వా విహసన్ జనకం ప్రతి ॥ 68

యేన వై నిర్జితా దేవాస్త్రైలోక్యం స్వవశే కృతమ్ ।
ఆందోళితో భుజాభిర్హి కైలాసో యేన వై మయా ॥ 69

తస్య మే జనకాద్య త్వం బలం పార్థివసంసది ।
ద్రుష్టుమిచ్ఛసి కింత్వస్మిన్ లఘూచాపే తృణోపమే ॥ 70

ఏవం వదన్ దశాస్యః సనమ్రో భూత్వా మహద్ధనుః ।
గృహీతుం వామహస్తేన చాలయామాస వై తదా ॥ 71

న తచ్చచాల కించిచ్చ తదా దక్షిణసత్కరమ్ ।
పురః కృత్వా గృహీతుం తచ్చాలయమాస వై పునః ॥ 72

న తచ్చచాల తదపి తదాశ్చర్యేణ రావణః ।
భుజాభ్యాం చాలయామాస తదా చాపం చచాల న ॥ 73

ఏవం క్రమేణ సర్వాభిర్భుజాభిశ్చాలయన్ ధనుః ।
వింశద్ధోర్భిరేకదేశం చాపస్యోర్ధ్వం చకార సః ॥ 74

అందుచేత పరశురాముడు, సీతను సాక్షాత్ లక్ష్మిగ భావించి, ఇతరులకు అలవిగాని ఆ ధనస్సును ఆమె స్వయంవరమునకు పందెముగా పెట్టెను. అందువలన జనకుడు ప్రతిజ్ఞచేసెను. (64) ఆ ప్రతిజ్ఞా వచనమును విని, పర్వతమువంటి ధనస్సునుచూచి రాజోత్తములందరి ముఖములు నేలవ్రాలినవి. (65) కొందరు రాజులు తమ ముఖములు ఎత్తుటకును అసమర్థులైరి. కొందరు తలలు కదిలించినా నిలుపుకొనుటకు అశక్తులయ్యారు. (66) చక్కగా తలలెత్తుకొనుటకెవరును శక్తులుగా కనబడలేదు. (67) విల్లునెక్కుపెట్టే ఆలోచననుకూడా ఎవ్వరూచేయలేకపోయారు. ఇట్లు ధనస్సు నెక్కుపెట్టుటలో అందరూ విముఖులైయుండుట గమనించిన (68) మహాగర్వియైన రావణుడు ఆ శివధనస్సువద్దకు వచ్చి నవ్వుచూ, సభలోని జనకునితో (69) "ఎవనిచేత దేవతలు జయింపబడిరో, ఎవ్వడు ముల్లోకములను వశపరచుకొనెనో, ఎవడు కైలాసపర్వతమును తనచేతులతో అల్లాడించెనో, (70)అట్టి నా బలమును ఈ సభలో, గడ్డిపరకవంటి ఈ అల్పధనస్సుముందు చూడదలచెదవా?" (71) అని చెప్పుచూ వంగి, ఆ మహాధనస్సును తన యెడమచేతితో కదిలించుటకు ప్రయత్నించెను. (72) అది ఇసుమంతైనను కదలలేదు. కుడిచేతితో ప్రయత్నించెను. అయినను కదలలేదు. (73)ఆశ్చర్యముతో భుజములతోను ఎత్తబూనెను.

**ఏకోనవింశర్దోర్భిశ్చ ధృత్వా చైవ మహద్ధనుః ।**
**గుణం భూమ్యాం నిపతితం గృహీతుం హి దశాననః ॥ 75**

**కించిద్భూత్వావినమ్ర స్స దోష్ణా జగ్రాహ తం గుణమ్ ।**
**ఏతస్మిన్నంతరే తచ్చ పపాత తద్ధృయేధనుః ॥ 76**

**న తద్వింశత్ భుజాభిశ్చ చచాల హృదయాద్ధనుః ।**
**తదా సభాయామూర్ధ్వాస్యః పపాత స దశాననః ॥ 77**

**ముకుటః పతితో భూమౌ ముక్తకచ్ఛోప్యభూత్తదా ।**
**తదా విజహసుః సర్వే సభాయాం పార్థివోత్తమాః ॥ 78**

**తదా ప్రాణాంతికం చాసీత్ రావణస్య సభాంగణే ।**
**అక్షిణి భ్రామయామాస లాలాస్తేభ్యో వినిర్యయౌ ॥ 79**

**తదా తం వేష్టయామాసుః మంత్రిణో రాక్షసాస్తదా ।**
**ధనురుచ్ఛాళనే శక్తాస్తేఽభవన్నైవ సంసది ॥ 80**

**సహస్రేషు దశాస్య స్స విష్టామూత్రం తదాఽకరోత్ ।**
**తత స్సభాయాం జనకః పునః ప్రాహాతిశంకితః ॥ 81**

కో౽పి వీరో౽స్తి భూమౌ న కిం నిర్వీరం హి భూతలమ్ ।
చేదస్తి కశ్చిత్సదసి తర్హి సో౽ద్య సభాంగణే ॥ 82

జీవదానం కరోత్వస్మై దశాశ్యాయ నృపాగ్రతః ।
ఇతి వాక్యశరాఘాతభిన్నౌ తౌ రామలక్ష్మణౌ ॥ 83

దదర్శతుర్గాధిజస్య ముఖం తౌ స్ఫురితభ్రువౌ ।
విశ్వామిత్రస్తదా ప్రాహ రామ చోత్తిష్ఠ రాఘవ ॥ 84

కిమంతం రావణస్యాద్య త్వం పశ్యసి సభాంగణే ।
జీవయైనం రాక్షసేంద్రం సజ్జం కురు ధనుస్త్విదమ్ ॥ 85

తన్మునేర్వచనం శ్రుత్వా తథేత్యుక్త్వా స రాఘవః ।
తదోత్థాయాసనాద్వేగాత్ ప్రణనామ మునీశ్వరమ్ ॥ 86

నిష్క్రాస్యకంఠాద్ధారాదీన్ కటిం బద్ధ్వా తదా ప్రభుః ।
ముకుటాది దృఢం కృత్వా శనైః ప్రాప సభాంగణమ్ ॥ 87

తం రామమాగతం దృష్ట్వా జనా స్సర్వే౽తివిస్మితాః ।
చకితాః పార్థివా స్సర్వే దదృశుర్నేత్రపంకజైః ॥ 88

ఈ విధముగా అన్ని భుజములతోను పెకలింపబూనెను. చివరకు తన ఇరవైచేతులతో ప్రయత్నించి ఆ ధనువు ఒక్కభాగము లేపగలిగెను.(75) పంతొమ్మిది చేతులతో దానినట్లే నిలిపి, ఇరవైయ్యవ చేతితో భూమిపై ఉన్న అల్లెత్రాటిని తీసుకొనుటకు వంగగా, (76)ఆ ధనస్సు గుండెలమీదపడెను. (77) క్రిందబడి కిచకిచ లాడుచూ, తన ఇరువది చేతులతో ఆ ధనస్సునెత్తడానికి ప్రయత్నించినా ఫలితములేక పైచూపులు చూచుచు నేలపైబడెను. (78) పంచకట్టు వీడిపోయెను, కిరీటము తొలగిపోయెను. సభలో రాజులందరును పకపకలాడిరి. (79) అపుడు రావణునికి ప్రాణాంతక మనబడెను. కండ్లు గిరగిరలాడెను. నోట చొంగకారెను.(80) అపుడు అతని మంత్రులు, పరివార రాక్షసులు చుట్టూ చేరిరి. అందరును ధనుస్సును ఎత్తుటకు చేతగాక నిర్విణ్ణులైరి. (81) వేలాది రాజుల నడుమ రావణుడు మూర్ఛను కార్చెను. అపుడు జనకుడు మిక్కిలి శంకించుచు ఇట్లనెను. (82) "భూమిపై ఒకవీరుడైనా లేడా? ఈ భూతలమే నిర్వీర్యమాయెనా? వీరుడుండినచో! ఈ సభా మధ్యమున, (83) ఈ దశకంఠునికి ఈ రాజులమధ్యన ప్రాణదానము చేయుగాక!" (84) ఆ జనక వాక్యమును విన్న రామలక్ష్మణులిరువురు కనుబొమ్మలదురుచుండ, విశ్వామిత్రునివైపు చూచిరి.

అపుడు విశ్వామిత్రుడు, "రఘువీరా! లెమ్ము, (85) నీ విపుడిచట రావణుని మరణముచూచెదవా? ఈ సభామధ్యమున రాక్షసేంద్రుని బ్రతికింపుము. ఈ ధనస్సును ఎక్కుపెట్టుము." అనెను. (86) శ్రీరాముడు ఆ మునివాక్యమును విని, అట్లేయని వెంటనే లేచి, మునీశ్వరునికి నమస్కరించి, (87) మెడలో హారాదులను సవరించుకుని, నడుముకట్టి, కిరీటాదులను సవరించుకుని, సభాంగణమునకు నేరుగవెడలెను. (88)

పరస్పరం తదా ప్రోచుః కింమూఢోఽస్తి శిశుస్త్వయమ్ ।
యత్రాస్మాభిః స్థితం తూష్ణీం తత్రాయం కిం కరిష్యతి ॥ **89**

కేచిదాహుర్దశాస్యం హి ద్రష్టుం బాల స్సమాగతః ।
కేచిదూచుర్బాలచేష్టా క్రియతే శిశునాఽత్ర హి ॥ **90**

కేచిదూచుః కిమర్థం హి హారా ముక్తాస్త్వనేన హి ।
కేచిదూచుర్గాధిజేన చాపం ప్రతి సుయోజితః ॥ **91**

కేచిదూచుర్వైరబుద్ధ్యా చోదితః కిం శిశుస్త్వయమ్ ।
వధార్థం చాపఘాతేన విశ్వామిత్రేణ రాఘవః ॥ **92**

కేచిదూచుర్బలం త్వస్య మునినాఽత్ర నిరీక్షితుమ్ ।
చోదితోఽస్త్యత్ర శ్రీరామశ్చాపేఽయం కిం కరిష్యతి ॥ **93**

ఏవం నానావిధాంస్తర్కా న్యావత్కుర్వంతి పార్థివాః ।
తావద్దృష్ట్వాగ్రతో రామం జనకః ప్రాహ గాధిజమ్ ॥ **94**

కిమర్థం ప్రేషితస్త్వత్ర మునే బాల స్సభాంగణే ।
అత్రైతే రావణాద్యాశ్చ నృపాః సర్వేఽతి కుంఠితాః ॥ **95**

తస్మింశ్చాపే త్వయం బాలః కిమాగత్య కరిష్యతి ।
యత్త్వయా శిష్యవాక్యేన పూర్వం చాహం ప్రబోధితః ॥ **96**

తత్సర్వం తు మృషైవాద్య చాపాగ్రే మునిసత్తమ ।
కాయం బాలః కోమలాంగః క్వేదం చాపం సుదుర్ధరమ్ ॥ **97**

కిం చాతకస్తృషాక్రాంతః సాగరం శోషయిష్యతి ।
ఏతస్మిన్నంతరే సర్వాః సుమేధాద్యః స్త్రియశ్చ తాః ॥ **98**

**ద్విజరాజానన చారుదోర్దండద్వయశోభితమ్ ।**
**హేమవర్ణోపమరుచిం శృంఖలానూపరాంఘ్రిణమ్ ॥ 99**

**శృంఖలాకంకణవరద్వయశోభితసత్కరమ్ ।**
**దివ్యకుండలమకుటరత్నాలంకారశోభితమ్ ॥ 100**

**సుజంఘం సువదం శూరం సుజానుం సుందరోదరమ్ ।**
**సుస్కంధం సుహనుం కంబుకంఠం త్రివళిశోభితమ్ ॥ 101**

**స్మితాస్యం కోమలోష్ఠం చ సుదంతావళిరంజితమ్ ।**
**సునాసం సుకపోలం చ కంజపత్రాయితేక్షణమ్ ॥ 102**

ఆ రామమూర్తిని జూచి, జనులందరూ ఆశ్చర్యమొందిరి. రాజులంతా చకితులై కనుదామరలతో జూచి, ఒకరితోనొకరిట్లనుకొనిరి. (89) ఈ బాలుడేమైనా మూఢుడా? ఏ విషయమున మనమందర మూ ఊరకున్నామో? ఆ విషయమున ఇతడేమిచేయగలడు? (90) కొందరు, "ఈ బాలుడు రావణుని జూచుటకు వచ్చుచున్నా" డనిరి. (91) మరికొందరు "ఇతడు కంఠహారాదులనేల తీసిపెట్టె?" ననిరి కొందరు(92) "ఈ ముని ఇతనిని పగతో ఈ పనికి పురికొల్పె"ననిరి. (93) ఇంకొందరు "ఇతని బలమును పరీక్షించుటకు విశ్వామిత్రుడు పంపెనుగాని, ధనస్సునితడేమిచేయగల" డనిరి. (94) ఇట్లు రాజులు నానావిధములుగా వితర్కించుచుండగా, జనకుడు మొదట రామునిజూచి, విశ్వామిత్రునితో ఇట్లనెను. (95) "మునిపుంగవా! ఈ బాలకునేల పంపితిరి? రావణాదిరాజులు ఏ ధనస్సునెత్తుటకు దుర్బలులైరో! (96) అట్టి ధనస్సును ఈ బాలుడేమిచేయగలడు? (97) మునుపు శిష్యునిద్వారా నాకు తెలిపినదంతయు ఈ ధనస్సుమందు నిజమగునా?! కోమలుడగు ఈ బాలుడెక్కడ? దుర్ధరమైన కోదండమెక్కడ? (98) చాతకపక్షి దప్పిగొనిన సముద్రమును శోషింపజేయగలదా? అని జనకుడు చెప్పుచుండగా, మేడలమీదనున్న సుమేధాది మంగళస్త్రీలందరూ..... (99-104)

**సుభ్రూభావం చ సుస్నిగ్ధం కుంచితాళకశోభితమ్ ।**
**ముక్తామాణిక్యరత్నాది నానాలంకారశోభితమ్ ॥ 103**

**ముక్తారత్నపుష్పమాలా న్యస్తమప్యతిశోభితమ్ ।**
**న్యస్తహారం న్యస్తవస్త్రం బద్ధపీతాంబరాన్వితమ్ ॥ 104**

**దివ్యముద్రాంగుళిలసత్పంకజద్వయసత్కరమ్ ।**
**ఏవం దృష్ట్వా స్త్రియో రామం సభాంగణవిరాజితమ్ ॥ 105**

న్యస్తకోదండ తూణీరం శివచాపాభిసంముఖమ్ ।
ప్రార్థయామాసుస్తాః సర్వా ఊర్ధ్వాస్యా ఊర్ధ్వసత్కరాః ॥ 106

పశ్యంత్యో గగనే శంభుం మోహాన్నారాయణం విధిమ్ ।
సాక్షాన్నారాయణం రామం న జ్ఞాత్వా తాశ్చ వై స్త్రియః ॥ 107

హే శంభో! హే రమాకాంత హే విధేఽస్మత్పురాకృతైః ।
వ్రతదానాదిపుణ్యైశ్చ చాపం సజ్జీకరోత్వయమ్ ॥ 108

యుష్మాభిర్నః సుకృతైశ్చ కర్తవ్యం పుష్పవద్ధనుః ।
అద్యాస్య కంఠదేశేఽత్ర మాలాం సీతా దధాత్వియమ్ ॥ 119

నో భవత్వద్య నేత్రాణాం సాఫల్యం దర్శనాదిహ ।
సీతాయా రామచంద్రస్య వేదికాయాం స్థితస్య హి ॥ 110

ఏతస్మిన్నంతరేసీతా రామం దృష్ట్వా సభాంగణే ।
దివ్యప్రాసాదసంరూఢా సఖీభిః పరివేష్టితా ॥ 111

ప్రోచ్చచాలాసనాద్వేగాదానందస్వేదసంప్లుతా ।
సఖ్యాస్తులస్యాః కంఠే స్వాం దోర్లతాం క్షిప్యసాదరమ్ ॥ 112

అబ్రవీన్మధురం వాక్యం రత్నాలంకారమండితా ।
కింపణోఽత్ర కృతః పిత్రా మమ శత్రుస్వరూపిణా ॥ 113

క్వ రామః సుకుమారాంగః క్వేదం చాపం నగోపమమ్ ।
హా విధే కిం కరోష్యద్య కిమస్త్యంతర్గతం తవ ॥ 114

రామాద్వినాఽన్యం పురుషం మనసాఽహం న రోచయే ।
యది తాతో బలాదన్యం మాం దాస్యతి తదా హ్యహమ్ ॥ 115
త్యజామి జీవితం త్వద్య ప్రాసాదపతనాదినా ।

హే శంభో! హే విధే దుర్గే! హే సావిత్రి! సరస్వతి! ॥ 116

కిటికీ రంధ్రములనుండి; సర్వాంగసుందరుడు, సర్వాలంకారభూషితుడు, మృదువైన అంగములు, సుకుమార శరీరుడు, మహాపురుష లక్షణములచే మనోహరాకారుడును,

మహానుభావుడును అగు (105) శ్రీరామచంద్రుడు తన తేజో సామ్రాజ్యముచే సభా ప్రాంగణములో రాజిల్లుచు, శివధనస్సుకు ఎదురునడుచుట చూచిరి. (106, 107) అట్లు చూసిన ఆ స్త్రీలందరూ ఊర్ధ్వముఖులై చేతులనెత్తికొని, మోహావేశముచే గగనమున త్రిమూర్తులకై నిరీక్షించుచు, (108) "ఓ పరమేశ్వరా! పరమేష్ఠీ! పంకజాక్షా! మాయొక్క పూర్వజన్మ వ్రతఫలములేమైనాయున్నచో, (109) వాటిబలముతో ఈ రామచంద్రునికి, ఈ ధనస్సు పుష్పమువలే తేలికయగునట్లు అనుగ్రహింపుడు. ఈ సుందరశరీరుని కంఠమును పూలమాలతో సీత అలంకరించుగాక. (110) ఇపుడిక్కడ ఈ సీతారాముల వివాహ వేడుక చూచుటచే మా నేత్రములు సఫలమగుగాక. (111) అని వేడుచుండగా, అంతలో తన చెలికత్తెలతో చక్కగా అలంకరింపబడిన సీత మేడనెక్కి, సభాప్రాంగణమున రామునిజూచి, ఎంతో ఆనందమునుపొంది, (112) తులసియను స్నేహితురాలి మెడపై తన భుజలతలను వేసి సాదరముగా (113) ఆహా! ఏమీ ఈ స్వయంవరము. శత్రుస్వరూపునివలే జనకుడు ఎటువంటి పందెము నేర్పరచినాడు!?. (114) సుకుమారుడగు రాముడెక్కడ? పర్వతమువంటి ఈ శివధనస్సెక్కడ? అయ్యో దైవమా! ఇపుడెట్లు చేయుదువో? నీ అంతరంగమున ఏమున్నది? (115) రామునితప్ప వేరొకరిని అంగీకరించలేను. ఒకవేళ నాతండ్రి బలవంతముగా వేరొకరికిచ్చినా?! (116)

**హే గాయత్రి! స్వరే భానో మఘవన్యమ తోయప ।**
**హే కుబేరానల రమే! హే విష్ణో ఖగనాయక! ॥ 117**

**హే ఫణీంద్ర నిశానాథ హే సర్వే నిర్జరాదయః ।**
**యుష్మాకం ప్రార్థయామ్యద్య ప్రసార్య నిజపల్లవమ్ ॥ 118**

**సర్వైరేతన్మహచ్చాపం కరణీయం తు పుష్పవత్ ।**
**ప్రవేశనీయం యుష్మాభిః శ్రీరామభుజదండయోః ॥ 119**

**చతుర్దశ వత్సరాణి మునివృత్త్యాఽనువర్తినీ ।**
**విచరామి వనే చాహం ధనుః సజ్జం కరోత్వయమ్ ॥ 120**

**ఏవం నానావిధైర్వాక్యైః సీతా దేవానతోషయత్ ।**
**ఏవం ప్రాసాదసంస్థాయా స్సీతాయా వివిధానిచ ॥ 121**

**తథా తాసాం హి నారీణాం నృపాణాం జనకస్య చ ।**
**వాక్యాని శ్రుణ్వన్ శ్రీరామః కించిత్కృత్వా స్మితాననమ్ ॥ 122**

**యయౌ చాపం నమస్కృత్య కృత్వా తం చ ప్రదక్షిణమ్ ।**

పునర్నత్వా శివం ధ్యాత్వా గురుం దశరథం నృపమ్ ॥ 123

కౌసల్యాం చ గురుం ధ్యాత్వా వామహస్తేన తద్దధౌ ।
సవ్యహస్తేన చాపస్య గుణం ధృత్వారఘూత్తమః ॥ 124

వామహస్తేన నమ్రం తచ్చకార సదసి క్షణాత్ ।
తదా నినేదుర్వాద్యాని తుష్టువుర్వందిమాగధాః ॥ 125

ఏతస్మిన్నంతరే రామో వామహస్తబలాద్ధనుః ।
మధ్యేఽభవత్రిఖండం తచ్ఛైవం ప్రాచీనముత్తమమ్ ॥ 126

చాపభంగాన్మహానాదస్తదాఽభూద్గగనాంగణే ।
చకంపే ధరణీ త్వం చాలింగయన్మాం భయాద్దృఢమ్ ॥ 127

చుక్షుభు స్సాగరాః సర్వే నినేదుస్తా దిశోదశ ।
తారా నిపేతుర్ధరణీం శిరః శేషోఽప్యచాలయత్ ॥ 128

వపుర్వాతా స్సుగంధాశ్చ దేవాస్తే గగనేస్థితాః ।
వాదయామాసుర్వాద్యాని పుష్పైఘైః సమవాకిరన్ ॥ 129

స్వర్వేశ్యా ననృతుః ఖే హి దేవాస్తోషం ప్రపేదిరే ।
తదా నినేదు స్సదసి భేర్యో దుందుభయో వరాః ॥ 130

నేను తప్పక ఈ భవనమునుండి పడి ప్రాణములను వదిలెదను. ఓ శంకరా! విధీ! దుర్గాదేవీ! సావిత్రీ! సరస్వతీ! (117) గాయత్రీ! సహస్రకిరణా! మహేంద్రా! సమవర్తీ! వరుణా! కుబేరా! అగ్నిభట్టారకా! లక్ష్మీ! విష్ణుమూర్తీ! పక్షిరాజా! (118) ఆదిశేషుడా! ఓయి సుధాకరుడా! ఓ సమస్తదేవతలారా! మిమ్ములనిట్లు ప్రార్థించుచున్నాను. (119) మీరందరూ అనుగ్రహించి, ఈ మహా ధనస్సును పుష్పమువలే తేలికచేయుడు. మీరందరూ ఈ శ్రీరాముని భుజదండములలో ప్రవేశింపుడు. (120) నేను పదునాలుగు సంవత్సరములు మునివృత్తి ననుసరించి వనమున సంచరించెదను. ఈ సుకుమారుడు వింటిని ఎక్కుబెట్టుగాక. అని యిట్లు నానావాక్యములతో దేవతలను సంతోషింపజేసెను. ఇట్టి ప్రాసాదమున ఉండెడు సీతయొక్క మధురాలాపములను రాజవదనల యొక్కయు రాజుల యొక్కయు సంభ్రమ వచనములను జనకుని యాలాపములను వినుచు శ్రీరాముడు చిరునవ్వు నవ్వుచు చాపమువద్దకు వెడలి నమస్కరించి, దానికి ప్రదక్షిణము చేసి, మరల నమస్కరించి, శివుని ధ్యానించి, తలిదండ్రులను తలంచి, గురువుకు నమస్కరించి, తన యెడమచేత దానిని ఎత్తుకుని, కుడిచేతితో

అల్లెత్రాడును తీసుకుని, క్షణమాత్రమున ఎడమచేతిచే ఆ శివధనస్సును వంచివేసెను. అప్పుడు సకలవాద్యములు మ్రోగుచుండెను. వంది మాగధులు పొగిడిరి. ఈ నడుమ రాముని యెడమచేతి బలమువలన ఆ శైవమగు మహాచాపము మూడు తునకలై విరిగిపడెను. ధనుర్భంగమువలన గగనమున మహాధ్వని గలిగెను. భూమి అణగెను. ఓ పార్వతీ! భీతిచే నీవు నన్నాలింగించితివి. సముద్రములు అల్లకల్లోలములయ్యె. పది దిక్కులును మ్రోగినవి. నక్షత్రములు రాలినవి. ఆదిశేషుడు తలయాడించెను. పరిమళయుక్తమగు చల్లని గాలివీచెను. గగనమున ఉన్న దేవతలు వాద్యములను వాయించిరి, పుష్పవృష్టి కురిపించిరి. దేవాంగనలు నర్తనముజేసిరి. దేవతలానందించిరి. ఇచ్చట సభాంగణమున వారకాంతలాడి పాడిరి. వాద్యములు మ్రోగెను. వంది మాగధులు పొగిడిరి.(130)

**నవవాద్యస్వనాః సర్వే బభూవుర్జయనిఃస్వనాః ।**
**ననృతుర్వారనార్యశ్చ తుష్టువుర్మాగధాదయః ॥ 131**

**స్త్రియో గవాక్షరంధ్రైశ్చ రామం పుష్పైరవాకిరన్ ।**
**తదా స రావణస్తూష్ణీం లజ్జయాఽఽనతమస్తకః ॥ 132**

**ముకుటైరపి హీనశ్చ ముక్తకచ్ఛోఽతివిహ్వలః ।**
**సభాయాం న క్షణం తస్థౌ తూర్ణం లంకాపురీం యయౌ ॥ 133**

**రామేణ భగ్నం తచ్చాపం దృష్ట్వా నార్యోముదాన్వితా ।**
**చక్రుర్జయస్వనైర్ఘోషాన్కరైశ్చ కరతాలికాః ॥ 134**

**సీతాఽపి ముదితా జాతా హర్షరోమాంచనిర్భరా ।**
**అనిమేషా కంజనేత్రా రామముత్కంఠితాహ్యభూత్ ॥ 135**

**ఏతస్మిన్నంతరే రాజా జనకః ప్రాహ మంత్రిణః ।**
**కరిణీస్థామత్ర సీతామానయధ్వం సముత్సవైః ॥ 136**

**రక్షణాయ నిజైః సైన్యైర్వేష్టయిత్వా సమంతతః ।**
**తథేతి తే మంత్రిణశ్చ యయుర్వేగేన జానకీమ్ ॥ 137**

**ప్రోచుస్తే మధురం వాక్యం ప్రబద్ధకరసంపుటాః ।**
**హే సీతే కంజనయనే ధన్యాఽసి గజగామిని ॥ 138**

**రవివంశోద్భవేనాద్య దశరథసుతేన చ ।**
**రామేణ భగ్నం సదసి చాపముత్తిష్ఠ వేగతః ॥ 139**

**కరిణీపృష్ఠమారుహ్య రామ త్వం గంతుమర్హసి ।**
**రామం కంఠేఽర్పయస్వాద్య రత్నమాలాం ముదాన్వితా ॥ 140**

**తన్మంత్రిణాం వచః శ్రుత్వా సీతా నత్వా స్వమాతరమ్ ।**
**సఖీభిః కరిణీపృష్ఠే సంస్థితాసీన్ముదాన్వితా ॥ 141**

**తదగ్రే నవవాద్యాని నినేదుర్మంగళాని వై ।**
**నినేదుః పృష్ఠభాగేఽపి నానావాద్యాని వై ముహుః ॥ 142**

**చిత్రోష్ణీష్ణాః కంచుకినః శతశో వేత్రపాణయః ।**
**సీతాకరిణ్యాశ్చాగ్రేతే దుద్రువుర్దీర్ఘనిస్వనాః ॥ 143**

**వారయన్ జనసంమర్దం సీతాం ద్రష్టుం జనైః కృతమ్ ।**
**ననృతుర్వారనార్యశ్చ బభూవుర్యత్రనిస్వనాః ॥ 144**

**తుష్టువుర్మాగధాద్యాశ్చ నటా గానం ప్రచక్రిరే ।**
**కరిణీం వేశ్యయామాసుః సీతాదాస్యః సహస్రశః ॥ 145**

జయజయధ్వనులు నిండినవి. స్త్రీలు గవాక్షములనుండి రామునిమీద పూలుజల్లిరి. అప్పుడు రావణుడు లజ్జానమ్ర ముఖుడై బోడితలలతో కచ్చువీడియుండ కలత నొంది, క్షణకాలమైన అచ్చట నిలువనేరక వేగముగా లంకకు వెడలి పోయెను. రామునిచేత విరువబడిన ఆ ధనస్సును చూచి మగువలందరు మోదమునొంది, జయజయ నాదములతోడ కరతాళములు వేసిరి. సీతాదేవియు అమందానందముచేత పులకితాంగియై రెప్పవేయక కనుదామరలతో రాముని నిరీక్షించుచు ఉత్కంఠితయై ఉండెను. (135) అంతలో జనకమహారాజు మంత్రులతో, "మన సీతాదేవిని ఏనుగుపై నెక్కించుకుని, సైన్యములతోడ సురక్షితముగా పిలచికొనిరండు" అనెను. అట్లేయని వెడలిన మంత్రులు సీతసన్నిధికిచేరి, "సరసిజాక్షియగు సీతమ్మా! నీవు ధన్యవయితివి. రవికులాలంకారుడగు దశరథపుత్రుడు రాముడు సభలో చాపమును ఖండించెను, లెమ్ము భద్రగజమునెక్కి, భద్రముగవచ్చి శ్రీరామభద్రుని జేరగలవు. సంతసముతో రామునిమెడలో రత్నహారమును సమర్పింపుము అని మధురముగా విన్నవించిరి. మంత్రుల మంగళ వాక్యములనువినిన జానకి తన తల్లికి నమస్కరించి, సఖులతోడ ఏనుగుమీద ఎక్కెను. (140). ముందర మంగళవాయిద్యములు కర్ణానందములు చేయుచుండెను. వెనుకను వాద్యములు వాయించబడుచుండె. రకరకాల వస్త్రాలంకారములు ధరించి, దండములు చేత బట్టిన అనేకమంది భటులు ముందు పరుగెత్తుతు, తమ శబ్దములచే జన సమ్మర్దమును అదుపుచేయుచుండిరి. నర్తకీమణులు నృత్యము చేయుచుండిరి. (145).

అశ్వారూఢాశ్చామరాది బిభ్రంత్యో రుక్మశోభితాః ।
తతోఽశ్వసంస్థా శ్శతశస్తాం యయుశ్చోపమాతరః ॥ 146

జరతాఃశస్త్రధారిణ్యః స్వర్ణదండలసత్కరాః ।
తతః పురుషవద్వేషాన్ బిభ్రంత్యః ప్రమదోత్తమాః ॥ 147

యయుస్తరుణ్యః శతశః శస్త్రహస్తాః సుభూషితాః ।
గోపితాస్యాః కంచుకిన్యస్తురగాదిషు సంస్థితాః ॥ 148

తతస్తేమంత్రిణః సర్వే నానావాహనసంస్థితాః ।
స్వసైన్యైర్వేష్టయామాసుః సీతాయాః కరిణీం ముదా ॥ 149

చామరైర్వ్యజనైః సఖ్యో ముహుః సీతామవీజయన్ ।
స్త్రియో గవాక్షరంధ్రైశ్చ సీతాం పుష్పైరవాకిరన్ ॥ 150

ఏవం నానాసముత్సాహైః శనైః సీతా తటిత్ప్రభా ।
నవరత్నమయీం మాలాం బిభ్రతీ దక్షిణే కరే ॥ 151

రామం నేత్రకటాక్షైశ్చ పశ్యంతీ ముదితాననా ।
సభాయాం రాఘవం గత్వా కరిణ్యాశ్చావరుహ్య చ ॥ 152

శనైః పద్భ్యాం యయౌ రామం తద్గ్రీవాయా సులజ్జితా ।
ముమోచ నిజబాహుభ్యాం రత్నమాలాం ముదాన్వితా ॥ 153

చకార నమనం రామం పాదయోః స్థాప్య వై శిరః ।
తస్థావవాఙ్ముఖీ సీతా సభాయామతిలజ్జితా ॥ 154

దదర్శ సీతాం రామోఽపి హారశోభితహృత్స్థలామ్ ।
అవాప తోషం నితరాం ననామ గాధిజం ప్రభుః ॥ 155

తదా రామం సమాలింగ్య విశ్వామిత్రో మునీశ్వరః ।
నివేశ్యయన్నిజాంకే తం స ప్రేమ్ణాఽఽఘ్రాయ మస్తకే ॥ 156

తదా స జనకః సీతాం గాధిజాంకే నివేశ్య యత్ ।
సీతాయా రఘునాథేన శుశుభే స మునిస్తదా ॥ 157

**మానయామాస స మునిర్జన్మసాఫల్యతాం హృది ।**
**తతః సభాయాం జనకో విశ్వామిత్రం వచోఽబ్రవీత్ ॥ 158**

**ప్రసాదాత్తవరామస్య లాభో జాతోఽద్య మే మునే ।**
**ధన్యోఽస్మ్యహం కులం ధన్యం ధన్యౌ తౌ పితరౌ మమ ॥ 159**

వందిమాగదులు పొగిడిరి. నటులు గానముచేసిరి. గుఱ్ఱములనెక్కి వేలకొలదిగల పరివారజనులు సాలంకృతులై సీతను చామరాదులతో పరివేష్టించుకొని వెడలిరి. పిదప ముసలివాండ్రైన ఉపమాతలు (దాదులు) శస్త్రములను ధరించి, చేత బంగారు బెత్తములను బూని, గుఱ్ఱములమీద నెక్కి వెడలిరి. ఆ వెనుక పురుషవేషమును వేసికొని సాలంకృతలైయుండు తరుణీమణులు వేలకొలది తరలిరి. ముఖములను మరుగుచేసికొనిన కంచుకీజనులు తురగములమీద వెళ్ళిరి. అటుమీద మంత్రులందరును నానావాహనములనెక్కి, తమతమ సైన్యములతో అంతట రక్షించుకొనుచుండిరి. వింజామరములతోను, వ్యజనములతోను సఖులు సీతను సేవించుచుండిరి. గవాక్షములనుండి స్త్రీలు సీతమీద పూలుజల్లిరి. (150). ఇట్లు మహోత్సవములతోడ మెరుగుబోడియగు సీత కుడిచేతిలో దివ్యనవరత్నమాలికను ధరించి, నిజకటాక్షములచే రాముని అలంకరించుచు, సుముఖియై తిన్నతిన్నగా శ్రీరామ సన్నిధానమునకు ఏనుగునుండి దిగి, కొంతనడిచివచ్చి, తన రెండుచేతులతో శ్రీరాముని కంఠమునకు రత్నమాలికను సమర్పించెను. మఱియు శ్రీరామచరణారవిందములకు నమస్కరించి మిగుల సిగ్గుతో మోమువంచి నిలచెను. శ్రీరాముడును మణిమాలాలంకృత వక్షఃస్థలుడై సీతనుజూచి ఎంతో ఆనందమునొంది, విశ్వామిత్రునికి నమస్కరించెను. (155) ఆ కౌశికముని, ప్రేమతో శ్రీరాముని ఆలింగించి, తనతొడమీద కూర్చుండబెట్టుకొని శిరస్సునాఘ్రాణించెను. అపుడాజనకుడు సీతను విశ్వామిత్రుని మఱియొకతొడమీద కూర్చుండబెట్టెను. ఆ మహాముని సీతారాములచే అక్కడ ప్రకాశించుచుండెను. కౌశికుడు తనమదిలో జన్మసాఫల్యమైనదని తలంచుచుండెను. అంత జనకుడు విశ్వామిత్రునితో, “మునిసత్తమా! మీ ప్రసాదమువలన నాకు శ్రీరాముడు లభించెను. నేను ధన్యుడనైతిని, కులము సఫలమయ్యె. నా తలిదండ్రులు ధన్యులైరి. (159)

**యోఽహం శ్రీరామశ్వశురశ్చేతి లోకే ప్రథాం గతః ।**
**ఇత్యుక్త్వా గాధిజం నత్వా ప్రణనామ రఘూత్తమమ్ ॥ 160**

**తదా తే పార్థివాః సర్వే సీతాం దృష్ట్వాతడిత్ప్రభామ్ ।**
**బింబోష్ఠీం చంద్రవదనాం తన్నేత్రశరతాడితాః ॥ 161**

బభూవుర్వికళాస్తత్ర దుర్దైవం మేనిరే నిజమ్ ।
కేచిన్మూర్ఛాం యయుస్తత్ర తాన్సమాగత్య మైథిలః ॥ 162

ప్రార్థయామాస నృపతీన్ విషణ్ణాన్ సదసి స్థితాన్ ।
నష్టశ్రీమ్లానవదనాన్ లజ్జయా నతకంధరాన్ ॥ 163

యుష్మాభిర్మేఽత్ర కన్యాయా వివాహం వినివర్త్య చ ।
గంతవ్యం స్వపురాణ్యేవ కరణీయా కృపా మయి ॥ 164

తదా తే పార్థివాః సర్వే మంత్రాంశ్చక్రుః పరస్పరమ్ ।
యది యుద్ధే విజేతవ్యః శ్రీరామోఽద్య రణాంగణే ॥ 165

తర్హ్యస్మిన్ సమయే దుష్టే జయో నో న భవిష్యతి ।
సుముహూర్తే వయం యాతాస్తూష్ణీం గత్వా పురాణి హి ॥ 166

సుముహూర్తే పునర్యోద్ధుం యాస్యామః సకలా బలైః ।
భవిష్యతి తదాఽస్మాకం జయో యుద్ధే వినిశ్చయాత్ ॥ 167

యదా రామం బాణభిన్నం పశ్యామః పతితం రణే ।
భవిష్యామః కృతకృత్యాస్తదా సర్వే వయం నృపాః ॥ 168

తదైవాస్యాపమానస్య దుఃఖం మర్మస్థలం గతమ్ ।
త్యజామః పార్థివా స్సర్వే జేష్యామో రాఘవం యదా ॥ 169

కిమర్థమధునా వైరం దర్శనీయం నృపాయ వై ।
ఇతి సంమంత్ర్య తే సర్వే తథేత్యుక్త్వా నృపోత్తమాః ॥ 170

కృత్వా సీతావివాహం చ గచ్ఛామః స్వస్థలాని హి ।
తదా తాన్ సకలం వస్తు గృహాణి జనకో ముదా ॥ 171

కల్పయామాస విధివన్మునీంశ్చాపి రఘూత్తమమ్ ।
తతో గాధిజవాక్యేన విదేహః ప్రేష్య మంత్రిణః ॥ 172

సమానేతుం దశరథం తత్ప్రతీక్షాం చకార సః ।
తేఽపి గత్వా మంత్రిణశ్చ దృష్ట్వా దశరథం నృపమ్ ॥ 173

**వృత్తం నివేద్య సకలం తం నత్వా తత్పురః స్థితాః ।**
**వృత్తం దశరథః శ్రుత్వా తుతోష నితరాం తదా ॥ 174**

**సైన్యేన నాగరైః సర్వైః స్త్రీభిర్జానపదైః సహ ।**
**మిథిలామగమచ్ఛీఘ్రం తదా దశరథో నృపః ॥ 175**

లోకమున శ్రీరాముని మామయని ప్రఖ్యాతనొందితినిగదా," అని చెప్పి, మునిచరణములకు నమస్కారముచేసి, రామునికి నమస్కరించెను (160). అపుడచటగల రాజులందరును దివ్యసుందర మోహనాంగియగు జానకిని చూచి, తత్కటాక్షశరతాడితులై తమదురదృష్టమును తలంచుచు వికలురైరి. కొందరు మూర్ఛాక్రాంతులైరి. ఇట్టి సిగ్గుచే తలవంచుకుని నిర్విణ్ణులైయుండు రాజులను చూచి, జనకరాజు, "మీరందరును నా కూతురి వివాహమహోత్సవమును నెరవేర్చి మీ పట్టణములకు వెడలవలయును, నా యెడ దయచేయవలయును" అని ప్రార్థించెను. అపుడు రాజులందరును, శ్రీరాముని యుద్ధమున జయించు పక్షమునందు ఇది మనకు దుష్కాలము(165) జయముకాజాలదు, చెడ్డముహూర్తమున మనము వెడలివచ్చితిమి, ఊరక మనయూరు చేరి మరల యుద్ధమునకై మంచి ముహూర్తమున బయలుదేరివచ్చెదము. అప్పుడు తప్పక మనకు జయమగును. ఎప్పుడు రాముడు రణమున పడిపోవునో మనమప్పుడు కృతకృత్యులమగుదుము. అప్పటికి ఈ అవమానము మనకు పోవును, ఇప్పుడు వృథా విరోధమును ఈ జనకునితో మనమేల పెట్టుకొనవలె? అని ఇట్లు పరస్పరముగా ఆలోచించుకుని, జనక సంప్రార్థనను అంగీకరించిరి. (170) అంత విదేహుడు వారి కందరికి విడిది మొదలుగాగల వాటిని యేర్పరిచియిచ్చెను. మునులకును పూజ్యమగు సముచిత స్థానములను సిద్ధపరచెను. ఇట్లు జనకుడు విధివిధానముగా అందరిని సత్కరించుచు గాధిజునిచే సంప్రేరితుడై దశరథరాజును పిలచికొనివచ్చుటకు మంత్రులను పంపి, తాను వారి రాకకై నిరీక్షించుచుండెను. ఆ మంత్రులు అయోధ్యకుజేరి, దశరథ రాజసన్నిధిలో స ప్రణామముగా సంగతిని విజ్ఞాపించిరి (175).

**తదా మహోత్సవేనైవ నృపం దశరథం పురీమ్ ।**
**నేతుం గజం పురస్కృత్య జనకః పార్థివైర్యయౌ ॥ 176**

**తదా దశరథాగ్రే తౌ దృష్ట్వా కైకేయజాసుతౌ ।**
**శ్రీరామలక్ష్మణావత్ర కుతః ప్రాప్తౌ వ్యచింతయత్ ॥ 177**

**తావద్రామలక్ష్మణాభ్యాం యుక్తం తం గాధిజం మునిమ్ ।**
**స్వసేనాయాం నృపో దృష్ట్వా విస్మయం ప్రాపమైథిలః ॥ 178**

తతో దశరథం నత్వా వసిష్ఠం ప్రణిపత్య చ ।
గాధిజం జనకః ప్రాహ కావేతౌ రామరూపిణౌ ॥ 179

తతస్తం గాధిజః ప్రాహ రామాంశాద్భరతస్త్వయమ్ ।
లక్ష్మణాంశాచ్చ శత్రుఘ్నః కైకేయ్యా నందనావిమౌ ॥ 180

తత్ర్శుత్వా జనకః ప్రాహ రాజానం గాధిజం గురుమ్ ।
సీతాం రామాయ దాస్యామి లబ్ధాం భూమావయోనిజామ్ ॥ 181

దేహజామూర్మిళానామ్నీం లక్ష్మణాయార్పయామ్యహమ్ ।
కుశధ్వజస్య మే బంధోః శ్రుతకీర్తిశ్చ మాండవీ ॥ 182

వర్తేతే బాలికే రమ్యే రూపయౌవనమండితే ।
సీతోర్మిలాభ్యామపి యే మయా నిత్యం ప్రలాలితే ॥ 183

దాస్యామ్యహం భరతాయ మాండవీం మండనాన్వితామ్ ।
శత్రుఘ్నాయ శ్రుతకీర్తిమర్పయామ్యహమాదరాత్ ॥ 184

ఏవం స్నుషాశ్చ తస్రశ్చ త్వమంగీకురు పార్థివ ।
తథేతి జనకం ప్రాహ రాజా దశరథో ముదా ॥ 185

తతో దశరథః ప్రాహ శతానందం పురోహితమ్ ।
అహల్యాజఠరోద్భూతం మైథిలాగ్రే స్థితం మునిమ్ ॥ 186

కథం లబ్ధా భువః సీతా తత్సర్వం వక్తుమర్హసి ।
శతానందస్తథేత్యుక్త్వాఽబ్రవీద్దశరథం నృపమ్ ॥ 187

శతానంద ఉవాచ

సమ్యక్ పృష్టం త్వయారాజన్ శ్రుణుష్వైకాగ్రమానసః ।
ఆసీత్పురా నృపః కశ్చిత్ పద్మాక్ష ఇతి విశ్రుతః ॥ 188

స దృష్ట్వా సకలాన్లోకాన్ లక్ష్మీకామైకతత్పరాన్ ।
చింతయామాస మనసి లక్ష్మీం కన్యాం కరోమ్యహమ్ ॥ 189

తపసైవ నిజాంకే తాం రంజయామి నిరంతరమ్ ।
ఇతి నిశ్చిత్య స నృపస్తప్త్వా తీవ్రం మహత్తపః ॥ 190

దశరథుడును విషయము తెలుసుకుని ఎంతో ఆనందము పొంది, సపరివారముతో ముఖ్యులగు నాగరికులు, జనపదమువారును వెంబడించిరాగా వేగిరమే మిథిలానగరమునకేతెంచెను. జనకుడు సముచితముగా మహోత్సవములతో దశరథరాజును స్వాగతించెను. (180) అపుడందరును దశరథునివద్దనున్న కైకేయీ సుతులను చూచి, శ్రీరామలక్ష్మణులు ఇచ్చటికేలవచ్చిరి? అని విస్మితులైరి. అంతలో జనకుడు తన సైన్యమున రామలక్ష్మణులతోడ రాజిలుచుండు విశ్వామిత్రునిజూచి, సంభ్రమించుచు, దశరథునికి నమస్కరించి, వసిష్ఠులవారికి ప్రణమించి, కౌశికునితో, "రామరూపులగు వీరిరువురు ఎవరు?" అని అడిగెను. అందుకు గాధిజుడు శ్రీరామాంశమునుండి యీ భరతుడును, లక్ష్మణాంశమునుండి యీ శత్రుఘ్నుడును కైకేయీ గర్భమున పుట్టిరి" అనెను. అంత జనకుడు దశరథమహారాజుతోను, విశ్వామిత్రులతోను, "పార్థివోత్తమా! భూమినుండి ఉద్భవించి, అయోనిజయైన సీతను శ్రీరామునికిని, నా యౌరసపుత్రియగు ఊర్మిళఅను కన్యకను లక్ష్మణుకుని, నా బంధువగు కుశధ్వజునియొక్క రూప, యౌవన సంపన్నురాంద్రగు ఇరువురు కూతుంద్రలలో మాండవియను కన్యను భరతునికిని, శ్రుతకీర్తియను కన్యకను శత్రుఘ్నునికి సమర్పించెదను. ఇట్లు నలుగురు కోడంద్రను మీరు అంగీకరించి యనుగ్రహింపుడు. అని ఎంతో ఆదరముగా సంప్రార్థించెను. అట్లే యని దశరథుడు అంగీకరించెను. (185) పిదప, దశరథరాజు జనకపురోహితుడును అహల్యా తనయుండునగు శతానందమునితో, "మునీంద్రా! సీత భూమినుండి యెట్లు లభించినది? దానినంతయు వివరింప వలె" ననెను. శతానందుడిట్లు చెప్పుచున్నాడు, "ఓ రాజా! వినుము. పూర్వము పద్మాక్షుడను రాజు విఖ్యాతుడుగానుండె. అతడు లక్ష్మీ కామతత్పరులగు సమస్తలోకులను జూచి, తన మనమున నేను లక్ష్మిని కన్యకగా జెసికొందును, తపశ్శక్తివలన నా తొడమీద ఆమెనాటలాడించెదను. అని చింతించి, తీవ్రతపమును ఆచరించెను. మహాలక్ష్మి ప్రసన్నురాలై వరము వేడుకొనమనగా, నీవు నా కూతురు అగుమనినందుకు,...... (190)

**దృష్ట్వా ప్రసన్నామగ్రే తు లక్ష్మీం వచనమబ్రవీత్ ।**
**దుహితా మే భవ త్వం హి సా ప్రాహ నృపతిం ప్రతి ॥ 191**

**పరతంత్రాఽస్మ్యహం రాజన్ విష్ణుం త్వం ప్రార్థయాధునా ।**
**స చేద్దాస్యామి మాం తే హి తర్హ్యహం దుహితా తవ ॥ 192**

**భవిష్యామి న సందేహస్తథేత్యుక్త్వా నృపః పునః ।**
**తప్త్వా తీవ్రం తపో విష్ణుం చకార వరదోన్ముఖమ్ ॥ 193**

**నత్వా తం నృపతిః ప్రాహ దేహి కన్యాం రమాం మమ ।**
**తద్రాజవచనం శ్రుత్వా మాతులుంగఫలం హరిః ॥ 194**

**పద్మాక్షాయ దదౌ శ్రేష్ఠం స్వయమంతర్దధే విభుః ।**
**తద్భిత్వా నృపతిః కన్యాం దదర్శ కనకప్రభామ్ ॥ 195**

**తాం దృష్ట్వా సాభిలాషః స కన్యాం మేనే నిజాం శుభామ్ ।**
**పద్మాక్షనృపతేః కన్యాం పద్మాం లోకా వదన్తి చ ॥ 196**

**ఆహ్వయామాసుస్తాం రమ్యాం సర్వచిత్తైకరంజనీమ్ ।**
**శకలే మాతులుంగస్య భూత్వైకత్ర ఫలం పునః ॥ 197**

**జాతం దృష్ట్వా దధారాథ స్వహస్తే నృపతేః సుతా ।**
**సా త్వవర్ధత న్నృపతేరంకే చంద్రకళా యథా ॥ 198**

**శుక్లపక్షే చ తాం దృష్ట్వా పద్మాక్షోఽచింతయద్ధృది ।**
**కస్మై దేయా మయా కన్యా హ్యస్మై యోగ్యో వరోఽత్ర కః ॥ 199**

**తతః సంమన్త్ర్య నృపతిః స్వయంవరమథారభత్ ।**
**స్వయంవరేఽథ పద్మాయా యజ్ఞారంభం చకార సః ॥ 200**

"రాజా నేను పరతంత్రను గాన నీవు విష్ణుమూర్తిని ప్రార్థింపుము, అతడు నీకు నన్నీయగలడు, అప్పుడు నేను నీకు తప్పక కూతురగుదును" అని అంతర్ధానమయ్యెను. అందుకు సరియని పద్మాక్షుడు మరల తీవ్రతపమాచరించి, నారాయణుని వరదునిగా జేసుకొనెను. అపుడు ప్రసన్నుడైన విష్ణుభట్టారకుడు "నాకు లక్ష్మిని కన్యకగానిమ్ము" అని సప్రణామముగా వేడుకొనగా, పద్మాక్షునికి మాతులుంగ (మాదీ) ఫలమును ఒకదానిని వరముగానిచ్చి అంతర్ధానమునొందెను. అంత ఆ రాజు దానిని వలిచి, అందులో స్వర్ణవర్ణయగు కన్యకను జూచి, కుతూహలముతో తనకు ఇది మంగళకన్యకయని తలంచెను. ఆ రమ్యాంగిని లోకులు పద్మాక్షపుత్రియగు 'పద్మ'యని పిలువనారంభించిరి. (195) అందరి అంతః కరణములను ఆకర్షించుచుండు ఆ కన్యక ఆ మాదీఫలమున మరియొకపండు పుట్టిన దానిజేసికొనెను. ఆ రాజుతొడమీద ఆ బాల చంద్రకళవలె వర్ధిల్లుచుండెను. అంత పద్మాక్షుడు ఈ కన్యనెవనికిచ్చెదను? దీనికి తగిన వరుడెచ్చటగలడు? ఇట్లు చింతించి, స్వయంవరమహోత్సవమును యజ్ఞమునకారంభించి దానితోడ ప్రకటించెను. (200)

**స్వయంవరాయ యజ్ఞాయ పత్రైరాకారయన్నృపాన్ ।**
**తేఽపి శృంగారయుక్తాశ్చ యయుః పద్మాస్వయంవరమ్ ॥ 201**

పద్మాస్వయంవరంశ్రుత్వా యయుస్తత్ర మునీశ్వరాః ।
యయుర్దేవాః సగంధర్వాః దానవాః మానవాః ఖగాః ॥ 202

నగా నద్యః సముద్రాశ్చ భూరుహాః కామరుపిణః ।
యయుర్యక్షాః కిన్నరాశ్చ రాక్షసా రావణాదయః ॥ 203

సర్వాన్ సమాగతాన్ దృష్ట్వా పద్మాక్షః ప్రాహ తాన్ ప్రతి ।
ఆకాశనీలవర్ణేన యః స్వాంగం పరలేపయత్ ॥ 204

దదామి తస్మై పద్మేయం సత్యం జ్ఞేయం వచో మమ ।
తద్రాజవచనం శ్రుత్వా దుర్ఘటం నృపసత్తమాః ॥ 205

పద్మాసౌందర్యసంభ్రాంతాం హర్తుం తే సముద్యతాః ।
తాన్ కన్యాహరణోద్యుక్తాన్ నృపాన్ దృష్ట్వా సనిర్జరాన్ ॥ 206

చకార సంగరం తైః స పద్మాక్షో లోమహర్షణమ్ ।
తద్బాణపీడితా దేవా మానవా విముఖా రణే ॥ 207

బభూవుస్తత్ర దైత్యైశ్చ పద్మాక్షో నిహతో రణే ।
తతస్తే మిలితాః సర్వే తాం ధర్తుం దుద్రువుర్జవాత్ ॥ 208

సా దృష్ట్వా ధర్తుముద్యుక్తాన్ జుహావాగ్నౌ కళేబరమ్ ।
తామదృష్ట్వా నృపాద్యాస్తే వ్యభిన్దన్నగరే తదా ॥ 209

బభంజుర్నృపగేహాని భూమిం చక్రురితస్తతః ।
శ్మశానతుల్యం నగరం జాతం వై క్షణమాత్రతః ॥ 210

పద్మాక్షనృపతేర్లక్ష్మీసంగాజ్జాతేదృశీదశా ।
తస్మాన్న మునయో లక్ష్మీం కామయన్తి కదాచన ॥ 211

లక్ష్మ్యాశ్చిత్తస్య చాంచల్యం భయం శోకో వధోఽపి చ ।
భవత్యేవ మహద్దుఃఖం తస్మాత్తాం పరివర్జయేత్ ॥ 212

పద్మాక్షే నిహతే యుద్ధే నృపపత్న్యః సహస్రశః ।
భర్త్రా సహైవ గమనం చక్రుస్తా భయనిర్భరాః ॥ 213

తతస్తే దైత్యవర్యాద్యా యయుః స్వం స్వం స్థలం ప్రతి ।
ఏకదా వహ్నికుండాత్సా పద్మా శక్తిః స్థిరా హరేః ॥ 214

బహిర్నిర్గత్య కుండస్య సమీపే సముపావిశత్ ।
ఏతస్మిన్నంతరే తత్ర పుష్పకస్థో దశాననః ॥ 215

విచరన్ జగతీం జేతుమాకాశవర్త్మనా యయౌ ।
సారణస్తాం దదర్శాథ వహ్నికుండే బహిః స్థితామ్ ॥ 216

సారణో దర్శయామాస రావణాయ వచోఽబ్రవీత్ ।
పురా సురాసురాద్యాశ్చ యాం ధర్తుం సముపస్థితాః ॥ 217

సేయం పద్మాక్షనృపతేః కన్యా పద్మాఽగ్నిసన్నిధౌ ।
తత్సారణవచః శ్రుత్వా తాం దృష్ట్వా కామమోహితః ॥ 218

యానాజ్జవాదుత్పపాత తాం ధర్తుం సాఽనలేఽవిశత్ ।
తామగ్నౌ సంప్రవిశం స దృష్ట్వా జ్ఞాత్వాఽథ తత్స్థలమ్ ॥ 219

తతః ప్రాహ దశాస్యః స త్వయా దేవా నృపాదయః ।
కృత్వాఽగ్నౌ వసతిం పద్మే శ్రమగ్రస్తాః కృతాః పురా ॥ 220

రాజులందరిని పిలిపించెను. ఇట్టి పద్మాస్వయంవరమునకు- మునులును, దేవతలును, గంధర్వులును, దానవులును, మానవులును, గరుడులు, నాగులు- కామరూపులగు- నదీ, వృక్ష, పర్వత, సముద్రాది దేవతలును- యక్ష, కిన్నరులును, రావణాది రాక్షసులును వచ్చిరి. ఇట్లువచ్చిన అందరితో స్వయంవరమంటపమున పద్మాక్షుడు, "ఎవడు ఆకాశ నీలవర్ణముచే తనయంగమును లేపించుకొనునో అతనికి యీ పద్మయను కన్యక యివ్వబడును. ఇది సత్యము," అని చెప్పెను. రాజశ్రేష్ఠులందరును ఈ మాటవిని దుర్ఘటమని యెంచి, పద్మాసౌందర్య సంభ్రాంతులై, ఆమెను అపహరించుటకు ఉద్యమించిరి. అపుడు అపహరణోద్యుక్తులగు అసురులైన నృపోత్తములతో దారుణ రణయజ్ఞమునకు ఆరంభించిరి. శౌర్యమును ప్రకటించిరి. వాని బాణాఘాతముల ఓర్వజాలక దేవతలు, మానవులు విముఖులై వెడలిరి. ఆమె దానినెఱింగి తన దేహమును అగ్నిలో దాచెను. ఆమె కనబడనందున ఆ రాజాదులు నగరమున వెదికి, రాజమందిరములను పగులగొట్టి, భూమిని పెళ్ళగించిరి. ఆహా! క్షణమాత్రమున పట్టణము శ్మశాన తుల్యమయ్యెను. లక్ష్మీసంగమువలన పద్మాక్షరాజుకు ఇట్టిదశగల్గె. అందువలన మునులు లక్ష్మిని అపేక్షించరు. (110) లక్ష్మివలన

చిత్తచాంచల్యము, భయము, శోకము, హింసయును, మహాదుఃఖమును కలుగును. కనుక ఆ సంపదను విడువవలయును. ఇట్లు పద్మాక్షుడు కోరగా, ఆ నృపపత్నులు వేలకొలది భయాతిశయముచే సహగమనముజేసిరి. రాక్షసేంద్రులు మొదలుగాగల వారందరును తమతమ స్థలములకరిగిరి. ఒకానొకప్పుడు శ్రీమన్నారాయణునియొక్క స్థిరశక్తియైన ఆ పద్మ అగ్నికుండమునుండి వెలువడి సమీపమున సంచరించుచుండె. అంతలో రావణుడు పుష్పకమునెక్కి విజయయాత్ర జేయుచున్నట్లు వచ్చెను. అపుడు రావణదూతయగు సారణుడు పద్మనుచూచి రావణునితో, "ప్రభూ! చూడుము, మునుపు సురాసురాదులు ఎవతకై శ్రమించిరో ఆ యీ పద్మ యజ్ఞకుండసమీపమున ఉన్నది," అని చెప్పెను. ఆమెమీద కామమోహితుడగు దశకంఠుడు తటాలున పుష్పకవిమానమునుండి దుమికి పట్టబోయెను. ఆమె అగ్నిలో దాగెను.(220)

**తదద్య వాసస్థానం తే మయా జ్ఞాతం మనోరమే ।**
**పద్మేఽధునాఽహం త్వం ధర్తుం శోధయామ్యనలస్థలమ్ ॥ 221**

**ఇత్యుక్త్వా జలకుంభైశ్చ సిషేచాగ్నిం దశాననః ।**
**యావత్పశ్యతి రక్షాయాం తావత్తత్ర దదర్శ హ ॥ 222**

**పంచ రత్నాని దివ్యాని గృహీత్వా తాని రావణః ।**
**కరండికాయాం సంస్థాప్య విమానేన యయౌ పురీమ్ ॥ 223**

**కరండికాం దేవగేహే సంస్థాప్య రావణస్తదా ।**
**రాత్రౌ మందోదరీం ప్రాహ మంచకస్థాం రహఃస్థితః ॥ 224**

**హే మందోదరి రత్నాని మయా త్వత్తోషదాని హి ।**
**సమానీతాని యత్నేన త్వదర్థం సురసద్మని ॥ 225**

**కరండికాయాం వర్తంతే గచ్ఛ గృహ్ణీష్వ తాని హి ।**
**తద్దశాస్యవచః శ్రుత్వా సా యయౌ దేవమన్దిరమ్ ॥ 226**

**కరండికాం తత్ర దృష్ట్వా తాం నేతుం పతిసన్నిధౌ ।**
**యావదుచ్చాలయామాస న చచాల తదా భువః ॥ 227**

**తదా సా లజ్జితా గత్వా రావణాయ న్యవేదయత్ ।**
**తచ్ఛ్రుత్వా స ప్రహస్యాథ స్వయం నేతుం యయౌ తదా ॥ 228**

తాం సోఽప్యుచ్చాలయామాస న చచాల కరండికా ।
యదా వింశద్భుజైర్భ్రామ్యా న చచాల కరండికా ॥ 229

తదా స విస్మయావిష్టో భయం మేనే దశాననః ।
తత్రైవోద్ఘాటయామాస రావణస్తం కరండికామ్ ॥ 230

తావద్దదర్శ తస్యాం స కన్యాం సూర్యప్రభోపమామ్ ।
తత్తేజోహరతేజస్కాం న్యాసం చక్షూంషి రక్షసామ్ ॥ 231

తాం ద్రష్టుం బాలికాం రమ్యాం యయుః సుహృత్సుతాదయః ।
తదా మందోదరీం ప్రాహ తస్యా వృత్తం రణోద్భవమ్ ॥ 232

పద్మాక్షకులజాత్యాది సర్వం వృత్తం దశాననః ।
క్రోధాన్మందోదరీ ప్రాహ భయభీతా దశాననమ్ ॥ 233

ఇయం కృత్యా ప్రచండా చ కులవిధ్వంసకారిణీ ।
లంకాం కిమర్థమానీతా హ్యస్యా జ్ఞాత్వాఽపి చేష్టితమ్ ॥ 234

దుష్టాం స్వవంశఘాతాయ త్యజైనాం సత్వరం వనే ।
బాలత్వేఽపీదృశీ గుర్వీ తారుణ్యే కిం కరిష్యతి ॥ 235

వధోఽస్యాస్తవ జానేఽహం మృత్యురేవ భవిష్యతి ।
స్థాపనీయా న లంకాయామియమద్యైవ రావణ ॥ 236

ఇతి తస్యా వచః శ్రుత్వా సత్యం మేనే దశాననః ।
మంత్రిభిశ్చాథ సంమంత్ర్య దూతానాజ్ఞాపయత్తదా ॥ 237

కరండికేయంనాత్వాఽద్య విమానే స్థాప్య యత్నతః ।
త్యక్తవ్యా మమ వాక్యాత్తు వనే గచ్ఛత వేగతః ॥ 238

తతస్తే రాక్షసాః సర్వే సంమీళ్య పుష్పకేఽథ తామ్ ।
కరండికాం తు సంస్థాప్య నిన్యుశ్చాకాశవర్త్మనా ॥ 239

దశాస్యపత్నీ తానాహ కార్యా భూమిగతా త్వియమ్ ।
స్థాపనీయా బహిర్నేయం దర్శనాద్వధకారిణీ ॥ 240

అందుకు రావణుడు, "అగ్నిలో దాగి నీవు మునుపు దేవతలకు, రాజులకు శ్రమనిచ్చితివి. ఓ మనోహారిణీ! నీ స్థలమును నేనెరింగితిని. ఇయ్యగ్ని కుండమునిపుడు శోధించెదను అని చెప్పి, జలకుంభములచే అగ్నిని చల్లార్చి చూచి, అచ్చట దొరికిన దివ్యపంచరత్నములనుతీసి, పెట్టెలో పెట్టుకుని లంకకువెడలి, దేవాలయమున దానిని భద్రపరచి, ఆ రాత్రి మంచముపై మండోదరితో రహస్యముగా, "ప్రేయసీ! నీ కొరకు దివ్యపంచరత్నములను తెచ్చి దేవునిఇంటిలో పెట్టియున్నాను. (225) ఆపెట్టెనెత్తికొనిరమ్ము. అని చెప్పెను. అందుకామె అట్లేపోయి ఆ పెట్టెను కదలింపనేరక సిగ్గుపడి, వచ్చి రావణునికి విన్నవించెను. అంత రావణుడే నవ్వుచు వెడలి కదలించి చూచి, రానందున తన యిరువదిచేతులు వ్యర్థములుకాగా, ఆశ్చర్యము పొంది, భయభ్రాంతుడై యచ్చటనే యా పెట్టెను తెరచి చూచెను. అప్పుడందులో సూర్యునివలే వెలుగుచున్న కన్యారత్నమును కనుగొనెను. దాని తేజస్సువలన రాక్షసుల నేత్రములు నిస్తేజస్కములయ్యె. దానిని చూచుటకు బంధుమిత్రవర్గము వారందరు వచ్చి చుట్టుకొనిరి. అపుడు దాని వృత్తాంతమునంతయును రావణుడు మండోదరితో చెప్పెను. అందుకు మండోదరి భయభ్రాంతయై క్రోధమునొంది, రావణునితో ఇట్లనియె, "ఈ కుమారి నీ కులనాశనము జేయునట్టిది, దీనివృత్తాంతము తెలిసియును లంకకేల తేబడెను? నిజవంశ నాశనమునకై తెచ్చితివా? వేగమే వనమున వదలుము, బాల్యముననే ఇట్లున్న ఇక యౌవనమున ఏమిచేయగలదో! (240)

**గృహస్థాశ్రమయుక్తో యస్తథా చ విజితేంద్రియః ।**
**వృద్ధిమేష్యతి తద్గేహే కుమారీయం శుభాననా ॥ 241**

**చరాచరేషు సర్వత్ర ఆత్మరూపేణ యః స్థితః ।**
**తస్య గేహే చిరం కాలం స్థాస్యతీయం న సంశయః ॥ 242**

**ఇతి మందోదరీవాక్యం శ్రుత్వా దూతాః సవిస్తరమ్ ।**
**యావత్తే గంతుముద్యుక్తా స్తావత్కన్యా వచోఽబ్రవీత్ ॥ 243**

**యస్యామ్యహం పునర్లంకాం రాక్షసానాం వధాయ చ ।**
**నిధనాయ దశాస్యస్య సపుత్రస్య సమంత్రిణః ॥ 244**

**అథ తృతీయవేళాయాం ఆగత్యాహం పునస్త్విహ ।**
**నికుంభజం పౌండ్రకం తం శతశీర్షం చ రావణః ॥ 245**

**హనిష్యామి పునర్గత్వా పునర్యాస్యామి త్వత్పురీమ్ ।**
**అహం చతుర్థవేళాయామద్భుతం మూలకాసురమ్ ॥ 246**

**కుంభకర్ణసుతం శూరం మర్దయిష్యామ్యహం పునః ।**
**తత్తస్యా వచనం శ్రుత్వా హృది విద్ధో దశాననః ॥ 247**

**జాతాస్తే రాక్షసాః సర్వే భయభీతాః శవోపమాః ।**
**రావణశ్చింతయామాస హంతవ్యాఽద్యైవ బాలికా ॥ 248**

**తీక్ష్ణం ఖడ్గం కరే ధృత్వా పద్మాం దుద్రావ రావణః ।**
**హేతుకామం పతిం దృష్ట్వా మయకన్యా న్యవారయత్ ॥ 249**

**సాహసం కురు మాఽద్యైవ సత్యాయుషి దశానన ।**
**భవిష్యతి వధస్త్వద్య తవ నాస్యా వచోమృషా ॥ 250**

నీకు దీనివల్లనే మృత్యువు సంభవించును. నేనేఱుగుదును, ఇప్పుడే దీనిని లంకలో ఉంచవలదు" అని ఇట్లు చెప్పిన మండోదరీ వాక్యములను విని, సత్యమని నమ్మి, మంత్రులతో ఆలోచించి దూతలతో, "ఈ పెట్టెనెత్తి విమానమున పెట్టుకొని వనమునకుపోయి, వేగమే విడువవదగును" అని ఆజ్ఞాపించెను. (250)

**యద్భవిష్యతి భవతు తదగ్రే త్యజ కాననే ।**
**కాలాంతరేణ యో మృత్యు స్తమద్య త్వం కిమిచ్ఛసి ॥ 251**

**ఇతి భార్యావచః శ్రుత్వా తూష్ణీమాస దశాననః ।**
**తతః సా పేటికా దూతైః నీతాయానేన వై జవాత్ ॥ 252**

**పశ్యన్ వనాని సర్వాణి సీతాయై మైథిలస్య చ ।**
**కృతా భూమిగతా దూతైః తదాసర్వైః కరండికా ॥ 253**

**తతో యయుః పునర్లంకాం దూతాస్తే రావణస్య చ ।**
**న్యవేదయన్రావణాయ సర్వం వృత్తం యథాకృతమ్ ॥ 254**

**సా భూమిః సూర్యగ్రహణే విదేహేన సమర్పితా ।**
**బ్రాహ్మణాయ ద్విజశ్చాపి తాం కర్షయితుముద్యతః ॥ 255**

అంతనట్లే రాక్షసులు ఆమెను పెట్టెతోడ విమానమున పెట్టుకొని వెడలునపుడు మందోదరి ఇట్లనియె, "దీనిని భూమిలో పాతిపెట్టదగును. వెలుపల ఉంచదగినది కాదు. చూచిన మాత్రమున చంపునట్టిది. ఎవడు గృహస్థుడైనను జితేంద్రియుడై చరాచరములలో అంతట యాత్మరూపముచే

నిండియుండునో వాని ఇంటిలో చిరకాలమీమె యుండగలదు. ఇందుకు సంశయములేదు." అనిన మండోదరీ వాక్యమును విని దూతలు "అట్లే"యని వెడలునపుడు ఆ కన్యక ఇట్లనెను, "నేను రాక్షసుల నందరిని చంపి, సపుత్ర సపరివారముగా రావణుని ధ్వంసముచేయుటకు లంకకు మరలవచ్చెదను. పిమ్మట మూడవతూరివచ్చి, నికుంబజాతుని ఆపౌండ్రకుని, శతకంఠరావణుని జంపెదను. మరల నాలగవతూరివచ్చి, కుంభకర్ణతనయుడగు శూరుడైన మూలకాసురుని సంహరించెదను." అనిన ఆ కన్య వాక్యములను విని రావణునికి హృదయభేదనముకాగా, భయభ్రాంతులగు రాక్షసులందరును పీనుగలవలే వెలవెలబోయిరి. రావణుడు తీక్ష్ణ ఖడ్గమును చేతబూని, దీని నిప్పుడే చంపవలయునని, పద్మవద్దకు పరుగిడెను. చంపదలచు పతిని జూచి, మందోదరి ఇట్లు నివారించెను. "ఆయువు బలముండగా ఇప్పుడే సాహసముచేయవలదు. అట్లు సాహసించితివా తప్పక ఇప్పుడే నీవు చత్తువు. ఈమెయొక్క మాట బొంకుకాదు. వెనుకనుండి యగునది యగుగాక! మొదట వనమున విడిచిపెట్టుము. కాలాంతరమున రాతగిన మృత్యువును ఇపుడేల రాగోరుదువు?" ఇట్టి ఇల్లాలి మాటను విని దశకంఠుడు ఊరకయుండెను. అంత ఆ దూతలు ఆ పెట్టెను తీసుకుని పోయి, అనేక అరణ్యములను జూచుచు, మిథిలాదేశమందు, నాగటిచాలున, గంగానది వద్ద భూమిలో పాతిపెట్టి తిరిగి లంకానగరమును చేరి, రావణునితో జరిగిన సంగతిని విన్నవించిరి. ఆ భూమి విదేహరాజుచే నొక బ్రాహ్మణునికి సూర్యగ్రహణసమయమున సమర్పింపబడినది. (255)

**పశ్యన్ ముహూర్తం ప్రియః స ప్రత్యబ్దం వై పునః పునః ।**
**చిరకాలేన దృష్ట్వాఽథ ముహూర్తం పరమోదయమ్ ॥ 256**

**శూద్రేణ కర్షయామాస భూమిం కృష్యర్థమాదరాత్ ।**
**తదా హలశితాగ్రేణ నిర్గతా సా కరండికా ॥ 257**

**తాం గృహీత్వా స శూద్రోఽపి యయౌ భూమిపతిం ద్విజమ్ ।**
**స మత్వా తన్నిధానం తు హర్షాత్ప్రాహ ద్విజోత్తమమ్ ॥ 258**

**శ్రేష్ఠస్తవ ముహూర్తోఽయం మహాభాగ్యం తవ ద్విజ ।**
**ఇమాం హలాగ్రసంభూతాం గృహాణ త్వం కరండికామ్ ॥ 259**

**నిధానపూరితాం గుర్వీ మయా యత్నేన వాహితామ్ ।**
**తతః స ద్విజవర్యస్తు తాం జగ్రాహ కరండికామ్ ॥ 260**

**తామానీయ విదేహాయ సభామధ్యే దదౌ ముదా ।**
**నృపతిం ప్రాహ వృత్తం తద్విప్రః శ్రుత్వా నృపోఽసి సః ॥ 261**

**ఉవాచ బ్రాహ్మణం భక్త్యా మయా భూమిః సమర్పితా ।**
**తస్యాం లబ్ధా త్వయా చేయం తవైవాస్తు కరండికా ॥ 262**

**విదేహనృపతేర్వాక్యం శ్రుత్వోవాచ ద్విజః పునః ।**
**మహ్యం సమర్పితా పూర్వం భూమిరేవ త్వయానృప ॥ 263**

**నేయం కరండికా రమ్యా వసుపూర్ణా సమర్పితా ।**
**యద్భూమౌ వర్తతే విత్తం తన్నృపస్య న సంశయః ॥ 264**

**మా మామధర్మః స్పృశతు గృహాణేమాం కరండికామ్ ।**
**ఏవం నృపస్య విప్రేణ కలహోఽభూత్సుదారుణః ॥ 265**

ఆ ద్విజుడు దానిని దున్నించుటకై ప్రతి సంవత్సరమును సుముహూర్తమున ప్రతీక్షించుచుండి చిరకాలమునకు లభించిన ఒకదివ్యముహూర్తమున తనభూమిని రైతుచే దున్నించెను. అప్పుడు ఆ నాగలి మొన తగిలి ఆ పెట్టె వెలువడెను. ఆ శూద్రుడు దానిని తీసుకుని భూస్వామి వద్దకు వచ్చి, సంతోషముగా ఆ బ్రాహ్మణునితో, "స్వాములారా! మీరు మహాపుణ్యాత్ములు. పెట్టిన ముహూర్తము చాలా బాగుగానున్నది. ఇది నాగలి మొనతగిలి వెలువడిన పెట్టె. తీసికొనుడు, ప్రయత్నముతో తెచ్చితిని," అని చెప్పెను. పిదప ఆ బ్రాహ్మణుడు ఆ కరండికను తీసుకుని రాజసభకు సమర్పించి, దాని వృత్తాంతమును రాజుతో చెప్పెను. అందుకు రాజు, (260) "నేను నీకు భూమిని దానముచేసితిని, దానిలో నిది దొరికెను, ఈ పెట్టెను నీవే తీసికొమ్ము, ఇది నా కేల?" అని నిరాకరించెను. బ్రాహ్మణుడును, "రాజా! నాకు ముందు భూమినిమాత్రము నీవు సమర్పించితివి, ఈ సువర్ణపూర్ణమగు దివ్యకరండికను నా కివ్వలేదు. భూమిలో దాగియుండి లభించిన విత్తము రాజుకు చేరతగినది. ఇది ధర్మము. ఇందులో సంశయములేదు. నాకు అధర్మపు సొమ్ము వద్దు. ఈ పెట్టెను తీసికొమ్ము," అని వేడెను. ఇట్లు వారిరువురును వివాదముచేయునపుడు సభాసదులందరును, "మహారాజా! ఏల ఈ వ్యర్థప్రసంగము? వలదు వలదు, దానిలో నేమియున్నది చూడుము," అని పలికిరి. దూతలచే దానిని తెరిపించి, అందులోని బాలికను చూచి విస్మయము నొందెను. బ్రాహ్మణుడు ఆ పెట్టెను రాజ సభలో సమర్పించి తన ఇంటికి వెడలెను. (265)

**తదా సభాసదాః సర్వే నృపతిం వాక్యమబ్రువన్ ।**
**మా కార్యః కలహోరాజన్ పశ్యాస్యా కిం ను వర్తతే ॥ 266**

**తాం తదోద్ఘాటయామాస దూతైర్నృపతిసత్తమః ।**
**తస్యాం దృష్ట్వాబాలికాం తు విస్మయం ప్రాప పార్థివః ॥ 267**

ద్విజస్త్యక్త్వాయయౌ గేహం పాలయామాస తాం నృపః ।
తదా ఖేచరవాద్యాని నేదుః కుసుమవృష్టిభిః ॥ 268

వవర్షుః సురసంఘాశ్చ తాం కన్యాం జనకం నృపమ్ ।
గంధర్వా గాయనం చక్రుః ననృతుశ్చాప్సరోగణాః ॥ 269

తదా మేనే నిజాం కన్యాం జనకస్తోషమాప సః ।
జాతకం కారయామాస విప్రైస్తస్యాః సవిస్తరమ్ ॥ 270

దదౌ దానాని విప్రేభ్యో ననృతుర్వారయోషితః ।
మాతులుంగాన్నిర్గతా యా మాతులింగీతి సా స్మృతా ॥ 271

అగ్నివాసాదగ్నిగర్భా తథా రత్నావలీతి చ ।
రత్నాంతరనివాసాచ్చ ప్రోచ్యతే జగతీతలే ॥ 272

ధరణ్యా నిర్గతా యస్మాత్ తస్మాద్ధరణిజేతి చ ।
జనకేనావితా యస్మాజ్జానకీతి ప్రకీర్త్యతే ॥ 273

సీరాగ్రాన్నిర్గతా యస్మాత్ సీతేత్యత్ర ప్రగీయతే ।
పద్మాక్షనృపతేః కన్యా తస్మాత్పద్మేతి సా స్మృతా ॥ 274

ఏవం నామాన్యనంతాని సీతాయాః సంతి భో నృప ।
ఆకాశనీలవర్ణాభ వపుషాऽనేన జానకీ ॥ 275

రాజు ఆ పెట్టెను స్వీకరించెను. అప్పుడు దేవవాద్యములు మ్రోగెను. అప్సరసలాడిరి, గంధర్వులు పాడిరి. జనకునిపై, కన్యారత్నముపై దేవతలు పూలవాన కురిపించిరి. అంత జనకమహారాజు తనపుత్రికయని యా బ్రాహ్మణులచే జాతకములను వ్రాయించి, దానధర్మములను ఒనరించెను. కనుక, ఆమె 'మాతులుంగమునుండి వెలువడినందున 'మాతులింగి' యనబడును. 'అగ్నిలో వాసము చేసి నందున 'అగ్నిగర్భ' యనబడును. రత్నపు పెట్టెలో ఉండినందువలన 'రత్నావతి' యని పిలువబడును. భూమినుండి వచ్చినందున 'భూపుత్రి'యని పేరు గాంచెను. జనకునిచే సంరక్షింపబడినందువలన 'జానకీ' అను పేరుగాంచినది. నాగలి మొనకుతగిలి వెలువడినందున 'సీత'యని ఖ్యాతి జెందినది. పద్మాక్షరాజపుత్రిగాన 'పద్మ'యని స్మరింపబడును. ఇట్లు అనేకనామములు సీతాదేవికి గలవు. ఓ దశరథుడా! ఆకాశనీలవర్ణుడగు నీ రామునికి సీత యిప్పుడు లభించినది. ఇప్పుడు పద్మాక్షుని ప్రతిజ్ఞ సఫలమయ్యె. నీ వడిగిన సంగతిని తెలిపితిని. ఇక నలుగురు కోడండ్రనంది

ఆనందింపుము. అని శతానందుడు చెప్పుచుండునప్పటికి దశరథరాజుచే పిలువనంపబడియుండిన దశరథుని మామలు కోసలరాజు, మగధరాజు, కేకయరాజును, సపుత్ర మిత్ర పరివారము వచ్చిచేరిరి. జనకుడు సంతోషముతో వారినందరిని స్వాగతసల్లాపాదికముచే సన్మానించెను. అంత జనకుడు దశరథుని పూజించి రామ, లక్ష్మణ, భరత, శత్రుఘ్నులను దివ్యాభరణాదులచేత అలంకృతులనుజేసి, మహోత్సవములతో అయోధ్య నగరమునకు పిలుచుకొనిపోయినపుడు, (270) శ్రీరాముడు దశరథునికి నమస్కరించి, పలుమార్లు సమాలింగితుడై, వశిష్ఠ, విశ్వామిత్రులకు నమస్కారముజేసి, కౌసల్యాదులగు తల్లులకు ప్రణామములు జేసి, దశరథునిముందర ఆ స్త్రీలతోను బంధువులతోను ముందు నడచెను. మంగళవాద్యములు మ్రోగుచుండగా వందిమాగధులు నమస్కరించుచుండగా ఆ శ్రీరామ ప్రభువు నగరమును ప్రవేశించెను. అంత అత్యంత సంభ్రమముతో అచ్చటి పురస్త్రీలంతా నగర గోపురాదులమీద పరుగులిడుచు నడుములమీద బిడ్డలనిడుకొని, తమతమ పనులనువిడిచి, మిక్కిలి కుతూహలముతో శ్రీరాముని దర్శించుకొనుచుండిరి. రాజమార్గమున వచ్చుచున్న రామునిమీద రాచకన్యలంతా కుసుమవర్షము కురిపించిరి. (275).

**లబ్ధా రామేణ పద్మాక్షప్రతిజ్ఞా సఫలీకృతా ।**
**ఏవం త్వయా యథా పృష్టం తథా త్వాం వినివేదితమ్ ॥ 276**

**చతస్రస్త్వం స్నుషాస్త్వత్ర కర్తుమర్హసి భో నృప ।**
**శ్రీశివ ఉవాచ**
**ఏతస్మిన్నంతరే తత్ర పూర్వం దశరథేన చ ॥ 277**

**సమాహూతా యయుః సైన్యైః స్త్రీపుత్రైః శ్వశురాశ్చ తే ।**
**కోసలో మాగధేశశ్చ కైకేయశ్చ యుధాజితః ॥ 278**

**మానయామాస తాన్ రాజా జనకోపి ముదాన్వితః ।**
**తతో దశరథం పూజ్య శ్రీరామం లక్ష్మణం తథా ॥ 279**

**భరతం చాపి శత్రుఘ్నం సంపూజ్యాభరణాదిభిః ।**
**నినాయ జనకస్తుష్టః స్వపురీం పరమోత్సవైః ॥ 280**

**తదా రామో నృపం నత్వా రాజ్ఞా చాలింగితో ముహుః ।**
**వసిష్ఠం గాధిజం నత్వా కౌసల్యాది ప్రణమ్యచ ॥ 281**

రాజ్ఞో దశరథస్యాగ్రే తైః స్త్రీభిర్బంధుభిః సహ ।
గజారూఢో యయావగ్రే తేష్వ ऽ భూవన్ గజస్థితాః ॥ 282

నదత్సు వాద్యసంఘేషు స్తువత్సు మాగధాదిషు ।
నర్తత్సు వారనారీషు వివేశ నగరీం ప్రభుః ॥ 283

తదా ऽ ऽ సీత్సంభ్రమః పౌరస్త్రీణాం శ్రీరామదర్శనే ।
విసృజ్య స్వీయకృత్యాని దుద్రువుర్గోపురాదిషు ॥ 284

కట్యాం నిధాయ బాలాంశ్చ దదృశూ రఘునందనమ్ ।
రాజమార్గగతం రామం వవర్షుః పుష్పవృష్టిభిః ॥ 285

ఏవం మహోత్సవైర్వ్యాసస్థలం దశరథః సుతైః ।
యయౌ వస్త్రాన్నతోయాద్యైః పరిపూర్ణం మనోరమమ్ ॥ 286

కృత్వా జ్యోతిర్విదా లగ్నదివసస్య వినిశ్చయమ్ ।
మంటపాంశ్చ తోరణాని పతాకాశ్చ ధ్వజాంస్తథా ॥ 287

రోపయామాసుః సర్వత్ర మంత్రిణో మిథిలాం పురీమ్ ।
మార్గాశ్చందనలిప్తాశ్చ పుష్పైరాచ్ఛాదితా అపి ॥ 288

మాలాభిస్తోరణైః పుష్పఘోషాద్యైస్తే చకాశిరే ।
తతో ముహూర్తసమయే వధూచ్ఛిష్టాం నిశాం శుభామ్ ॥ 289

సుతైలాఢ్యాం స్త్రియః సర్వాః కౌసల్యాద్యాస్తు మాతరః ।
రామాదీన్ పరిలిప్యాదౌ నీరాజనపురస్సరమ్ ॥ 290

ఇట్లు మహోత్సవములతో దశరథమహారాజు వచ్చి, ఆనందముగా అలంకార శోభితమైన అంతఃపురమున సర్వసత్కారములతో ప్రవేశించెను. మంత్రులు, దైవజ్ఞులవలన వివాహలగ్న నిశ్చయము చేయించి, మంటపములతోను, తోరణములతోను, పతాకములతోను, ధ్వజములతోను, మిథిలా పట్టణమును సుందరముగా అలంకరింప జేసిరి. రాజవీధులన్నీ చందనముతో కళ్ళాపు చల్లించిరి. పూల మాలలను వ్రేలాడదీయించిరి. పిమ్మట ఆకాశమున వెన్నెల పరుచుకున్న వేళ కౌసల్యాది తల్లులును, తక్కిన వృద్ధ సువాసినులు, రామ లక్ష్మణ భరత శత్రుఘ్నులను మొదట దివ్యపీఠములమీద గూర్చుండబెట్టి, పాటలుపాడి, మంగళహారతులనెత్తి,.... (290)

కరకుంభాంస్తోయపూర్ణాం చతుర్దిక్షు సదీపకాన్ ।
సంస్థాప్య స్నాపయామాసుః మహావాద్యపురస్సరమ్ ॥ 291

తదాభ్యంగం స్వయం చాపి కృత్వా సస్నుశ్చ మాతరః ।
రామాదీన్పురతః కృత్వా వస్త్రాలంకారభూషితాః ॥ 292

అభ్యంగపూర్వకం సస్నౌ రాజా దశరథోఽపి సః ।
సమాహూయ నృపస్త్రీశ్చ సభాయాం స్వస్తికే గురుః ॥ 293

ముక్తావినిర్మితే రాజ్ఞః పార్శ్వే వామే న్యవేశయత్ ।
అగ్రే రామాదికాన్కృత్వా తాః స్త్రియోఽవనతాననాః ॥ 294

హరిద్రాకుంకుమాలిప్తచరణా రేజిరేంగణే ।
వసిష్ఠో బ్రాహ్మణైర్యుక్తో రాజ్ఞా రామాదిభిర్ముదా ॥ 295

కృత్వా గణపతేః పూజాం పుణ్యాహాదిత్రయం క్రమాత్ ।
కారయామాస విధివత్ ప్రతిష్ఠాం దేవకస్య చ ॥ 296

గ్రామాచారం కులాచారం వృద్ధాచారం తథా పునః ।
దేశాచారం చ ప్రమదాచారాదీన కరోన్నృపః ॥ 297

తోయకుంభం మంటపాదికానాం పూజనమాచరత్ ।
కౌసల్యాద్యాః స్త్రియః సర్వా హరిత్పీతారుణైర్వరైః ॥ 298

హేమతంత్వర్చితైర్వస్త్రైః విరేజుర్మంటపాంగణే ।
జనకశ్చ నృపైర్యుక్తో మహావాద్యపురస్సరమ్ ॥ 299

రామాదీన్స నిజం గేహం నేతుకామస్సమాయయౌ ।
మంటపే పూజయామాస రామాదీన్ జనకస్తదా ॥ 300

మంగళవాద్యముల, మంగళఘోషములతోడ అభ్యంగ విధానము ఒనరించిరి. నాలుగు దిక్కులలోను దీపములతోడ పూర్ణకుంభములను సంస్థాపించిరి. మంగళవిధానముతో రామాదులకు అభ్యంగస్నానము చేయించిరి. ఆ స్త్రీలందరును తాము కూడా వస్త్రాలంకారభూషితులై అభ్యంగన మంగళ స్నానములను చేసికొనిరి. దశరథమహారాజును అభ్యంగస్నాముును చేసికొనెను. అంత వశిష్ఠ మునులును, రాణులను పిలిపించి, మణులచే అలంకరింపబడిన స్వస్తిమంటపమున దశరథ

మహా రాజుకు యెడమభాగమున కూర్చుండబెట్టి, వారి ముందర రామాదులకు శోభాయమానముగ బ్రాహ్మణులతోడ స్వస్తివాచనమునకు ఆరంభించిరి. అక్కడి స్త్రీలు వివిధ అలంకారములతో, పసుపు కుంకుమలచే అలంకరించుకుని రాజిల్లుచుండిరి. (295) వశిష్ఠముని మొదట శ్రీమహాగణపతిని అర్చించి, పుణ్యాహాదికాలను క్రమముగా ఆచరించి, విధిప్రకారముగా కులదేవతా ప్రతిష్ఠను గావించెను. దశరథుడు– గ్రామాచారములను, కులాచారములను, దేశాచారములను, వృద్ధాచారములను, సువాసిని ఆచారములను నెరవేర్చి, పూర్ణకుంభములతో మంటపాదుల పూజనము ఒనరించెను. (300)

**హేమతంతూద్భవైర్దివ్యైః వస్త్రైరాభరణాదిభిః ।**
**తదా విరేజుస్తే బాలాః సర్వే ప్రముదితాననాః ॥ 301**

**తతస్తే వారణేంద్రస్థా దివ్యచామరవీజితాః ।**
**శృణ్వంతో వాద్యఘోషాంశ్చ వర్షితా పుష్పవృష్టిభిః ॥ 302**

**హరిద్రాంకితధాన్యైశ్చ మాంగల్యైర్మౌక్తికాదిభిః ।**
**మాతృభిర్వారణస్త్రీషు సంస్థితాభి ర్ముహుర్ముహుః ॥ 303**

**ఏవం తే రాఘవాద్యాశ్చ పురస్త్రీభిర్నిరీక్షితాః ।**
**ప్రాసాదోపరి సంస్థాభిః లాజాభిర్వర్షితా ముహుః ॥ 304**

**దదృశుర్నర్తనాన్యగ్రే వారస్త్రీణాం స్మితాననాః ।**
**వాటికాః పుష్పవృక్షాణాం వరమృత్పాత్రనిర్మితాః ॥ 305**

**తథా కృత్రిమవృక్షాంశ్చ పతాకాంశ్చ ధ్వజాంస్తథా ।**
**వహ్నిసంగాదౌషధీనాం పుష్పవృక్షవినిర్మితాన్ ॥ 306**

**తటిత్ ప్రభోవమాంశ్చాపి గగనాంతర్విరాజితాన్ ।**
**వహ్నిసంగాదౌషధీభ్యః ప్రకారాన్ వివిధాన్ వరాన్ ॥ 307**

**చంద్రజ్యోత్స్నాకృత్రిమాంశ్చ దీపవృక్షాన్ సహస్రశః ।**
**దీపమాలాశ్చ వ్యాఘ్రాదీన్ కృత్రిమాన్ రథసంస్థితాన్ ॥ 308**

**ఓషధీభిః పూరితాంశ్చ కేకీచక్రోపమాదికాన్ ।**
**దదృశుర్వారణేంద్రస్థా ఏవం తే రాఘవాదయః ॥ 309**

**తదా దేవా విమానస్థా దదృశుః కౌతుకం ముదా ।**
**ఏవం నానోత్సవైర్బాలా యయుర్జనకమందిరమ్ ॥ 310**

అట్టి మంగళ మంటప ప్రాంగణమునందు కౌసల్యాది సువాసినులందరును మిక్కిలి శ్రేష్ఠములైన పచ్చదనపు వన్నెలు గల బంగారు అంచువస్త్రములను ధరించి మెరయుచుండిరి. జనక నృపోత్తముడును, రాజుతోడ మహావాద్యపురస్సరంగా రామాదివరులును పూజించి, పిలిచికొని పోదలచి వచ్చెను. అపుడు జనకుడు రామ, లక్ష్మణ, భరత, శత్రుఘ్నులను బంగారు అంచుగల వస్త్రములచేతను, దివ్యాభరణములచేతను పూజింపగా వారు రాజిల్లుచుండిరి. అందరు ఆనంద ముఖులుగా ఉండిరి. దివ్యచామరములు వీచుచుండ ఉత్తమగజములనెక్కి, రామాదులు సువాద్యములను వినుచు, ఆడ యేనుగులమీదనుండి తల్లులు అడుగడునకును మంత్రాక్షత మంగళ వాద్యములతోడ కుసుమ వర్షమును కురిపించుచుండగా ముందుకు సాగిరి. ఇట్లు వచ్చుచుండ శ్రీరామాది వరులను ప్రాసాదాదుల మీదనెక్కిన పౌరస్త్రీలు నిరీక్షించుచు నడుగడుగునకును లాజవర్షము గురిపించిరి. అపుడు నర్తకీ మణులు నాట్యములను, కుండీలలోని పూలచెట్లయొక్క వరుసలను, (305) అట్లే కృత్రిమ వృక్షములను, విచిత్ర రంగులు గల పతాక ధ్వజములను బాణవేడుకలలోని పుష్పవృక్షములను ఆకాశములో వివిధ రకముల బాణసంచా వెలుగులలోను, మెరుపులతోను, చిత్రధ్వజ పతాకాదులను, మరియు ఇట్టి పలువింతలను పరికించుచు, చిరునవ్వు నవ్వుచు శ్రీరామాది వరులు ఊరేగింపుతో జనకరాజ దివ్యమందిరమునకు వచ్చి, గజేంద్రములనుండి దిగి, వివాహమంగళ మంటప ప్రాంగణములో దివ్యమైన పీఠలను అలంకరించిరి. (310)

**అవరుహ్యగజేంద్రేభ్యః తస్థుస్తే మంటపాంగణే ।**
**మధుపర్కవిధానాని విష్టరాదీని చ క్రమాత్ ॥ 311**

**తయోర్గురూచక్రతుస్తౌ వసిష్ఠగౌతమాత్మజౌ ।**
**వాల్మీక్యాదిమునిగణౌ వేష్టితౌ తుష్టమానసౌ ॥ 312**

**తతః పూజాం వధూనాం చ ముదా దశరథో నృపః ।**
**చకార గురుణా యుక్తస్తదా స మంటపాంగణే ॥ 313**

**తతో లగ్నముహూర్తే తాన్ వధూభిశ్చ పృథగ్వరాన్ ।**
**వేదికాసు స్థితాన్ కృత్వా దంపత్యోరంతరే పటాన్ ॥ 314**

**కృత్వా మంగళఘోషాంశ్చ మునిభిశ్చక్రతుర్గురూ ।**
**తదా తూష్ణీం సభాయాం తే శుశ్రువు స్సకలా జనాః ॥**

పుష్పౌఘైః పీతధాన్యైశ్చ వవర్షుర్దంపతీన్ స్త్రియః ॥ 315

శ్రీదేవీతనయౌ శివః సుఖకరో మిత్రః శశీకంపనః
సర్వే తే మునయశ్చలా దశ దిశః సర్పా మృగేంద్రాః ఖగాః ।
నద్యః పుణ్యసరోవరాణి దితిజాస్త్రీర్థాని కంజాసనశ్చేంద్రో-
వహ్న్యామరా నదీ జలధయః కుర్వంతు వో మంగళమ్ ॥ 316

తదేవలగ్నం సుదినం తదేవ, తారాబలం చంద్రబలం తదేవ ।
విద్యాబలం దైవబలం తదేవ, కాశీపతేర్యత్ స్మరణం విధేయమ్ ॥ 317

ఏవం మంగళశబ్దైశ్చ మహావాద్యపురస్సరమ్ ।
తేషామంతః పటాన్ముక్త్వా ఓం పుణ్యాఽస్త్వూచతుర్గురూ ॥ 318

తాసాం తే పాణిగ్రహణవిధానం విధిపూర్వకమ్ ।
లాజహోమాదికం సర్వం చక్రుర్మంగళపూర్వకమ్ ॥ 319

అపుడు దేవతలు తమ విమానములలోనుండి యిట్టి పెండ్లివేడుకలను తిలకించుచుండిరి. వాల్మీకీ మొదలుగా గల మునిబృందములచే పరివేష్ఠితులై సంతృప్త మానసలుగానుండు దశరథ, జనకాచార్యులగు వశిష్ఠ, శతానంద మహర్షులు మధుపర్క విధానములను, ఆసనప్రధానాది సత్కారములను చేయించిరి. అంత దశరథుడు వశిష్ఠానుజ్ఞచే వధూపూజ ఒనరించెను. పిదప వివాహ శుభలగ్న ముహూర్తమున ఆ వరులను వధువులతోడ వేర్వేరుగా మంగళవేదికలపై కూర్చుండబెట్టి, దంపతులనడుమ తెరవేసిపట్టుకొని, శతానంద, వసిష్ఠులు, "బ్రహ్మాది దేవతలు, మునులు మొదలుగా గల సమస్తమును మీకు మంగళమునిచ్చుగాక, చేయతగిన శ్రీకాశీవిశ్వేశ్వర స్మరణమను నదియే సుదినము, సులగ్నము, చంద్రతారాబలయుక్తము, విద్యాబలము దైవబలముగా ఉన్నది," అను ఇట్టి అర్థములు గల మంగళశ్లోకములను చెప్పుచు, దివ్యమంగళ సంగీతాదులతో మంగళవాద్యధ్వనులు నాదబ్రహ్మమయమున చొప్పుచుండు సమయమునందు ఆ తెరలనుతీసి, "ఓం పుణ్యాఽస్తు" అని చక్కగా వక్కాణించిరి. (315) అంత ఆ సీతాది వధువులకును, శ్రీరామాది వరులకును, పాణిగ్రహణమహోత్సవము విధివిధానముగా నడచినది. పిదప లాజహోమాది వివాహవిధాన కర్మలన్నియును శుభప్రదములుగా నెరవేరినవి. అట్టి మహోత్సవకళ్యాణమంటపమున గణికా నర్తనములును, వందివందనములును, మంగళసంగీతములును, నయనానందములు, కర్ణానందములు, మనోహరములునై సాగుచుండగా, ఆ జనకమహారాజును, దశరథుడును, నానా విధములగు మహాదానములు చేసి, దేవ భూదేవ సంతృప్తిగావించిరి. (320)

తదా మహావాద్యఘోషా నినేదుర్మంటపాంగణే ।
ననృతుర్వారనార్యశ్చ జగుర్మాగధవందినః ॥ 320

నటా మంగళగీతైశ్చ తుష్టువుస్తే మహాస్వనైః ।
తదా దానాన్యనేకాని చక్రతుస్తౌ నృపోత్తమౌ ॥ 321

అథ తే బాలకాః సర్వే వధూః స్థాప్య కటీషు వై ।
కౌసల్యాదివనితాభిర్జగ్ముస్తే భోజనగృహాన్ ॥ 322

తత్రాంమ్రసింజనం చక్రుః సంపూజ్య త్వాం చ మామపి ।
తతో రామాదికాః సర్వే స్వస్వపత్న్యా పృథఙ్ముఖాః ॥ 323

చక్రుస్తే భోజనం హృష్టాః స్త్రీభిస్సర్వత్ర వేష్టితా ।
రాజా దశరథశ్చాపి సుహృద్భిశ్చ నృపోత్తమైః ॥ 324

పౌరైర్జానపదైరిష్టైః మునిభిః పరివారితః ।
జనకస్య గృహం గత్వా చకార భోజనం ముదా ॥ 325

కౌసల్యాద్యాః స్త్రియః స్త్రీభిః చక్రోర్భోజనముత్తమమ్ ।
సుమేధయా ప్రార్థితాస్తా వందితాశ్చ ముహుర్ముహుః ॥ 326

ఏవం నానాసముత్సాహం శ్చకారజనకోముదా ।
అథ తే బాలకాః సర్వే స్త్రీవాక్యాన్మాతృసన్నిధౌ ॥ 327

స్వస్వపత్న్యాః పాదయోః స్వశిరోభిర్నమనం ముహుః ।
చక్రుస్తుష్టచేతసస్తే తాస్తా నేముః పృథక్ పృథక్ ॥
కుంకుమాంకితపాదాశ్చ తేషామంకేషు తా దదుః ॥ 328

అంత ఆ బాలకులు తమ నూతన వధువులను నడుములపై ఎక్కించుకుని సర్వజనానందముగా కౌసల్యాది సమూహముతో భోజనగృహమునకు వెడలిరి. ఓ సర్వమంగళా! అచట నిన్ను నన్నూ గూడ పూజించి, ఆమ్రసించనమను శుభకర్మమును ఒనరించిరి. అంత శ్రీరామాదులందరును, తమతమ పత్నులతోడ అంతట కన్యామణులు చుట్టూ చేరగా వేర్వేరుగా గూర్చుండి, సుభోజనములు ఆరగించిరి. మహారాజగు దశరథుడు రాజేంద్రులగు మిత్రులతోడను, మునులతోడను పరివృతుడై జనక మందిరమున భోజన విధానముచే ఆనందించెను. కౌసల్యాది రాజస్త్రీలు స్త్రీపరివారముతో జనకపత్ని

'సుమేధ'చే అడుగడుగునకును ప్రార్థింపబడుచు, ఉత్తమభోజనములు ఒనరించిరి. (325) ఇట్లే జనకుడు ఉత్సాహమహోత్సవములను సలుపుచుండెను. పిమ్మట ఆ బాలకులు అందరును మాతృ సన్నిధానమున స్త్రీవాక్య లాలితులై తమ పత్నీ పదారవిందములకు తమ ఉత్తమాంగములను ఒత్తుచుండిరి. వేర్వేరుగా ఆ వధువులును సంతుష్ట చిత్తులై పతులపాదములకు ప్రణమిల్లుచుండిరి మరియును తమ కుంకుమాంకిత చరణాంకములను పతుల అంకములకు అలంకరించుచుండిరి. త్రైలోక్య చూడామణియును, సర్వాత్మకుడును, వరదివ్య సుందరాంగుడును, ముక్తాహారవిరాజమాన కంధరుడును, కరుణాకల్లోలిత కటాక్షుడును, పసుపుపచ్చని వస్త్రములు ధరించిన శ్రీరామచంద్రుడు మూలప్రకృతియై, జగన్మాతయైన భూపుత్రిని చేపట్టి, ముల్లోకములలో అనుపమయిన కాంతినొంది, సీతాకాంతుడనుటచే లోకాకాంతుడై రాజిలుచుండె. నాలుగవనాడు రాత్రి రాఘవాదులు వేణుపాత్ర విరాజిత దీపముల నీరాజనములచే విరాజిల్లుచుండిరి. అపుడు శ్రీరామాదులకు జనకుడు మహారాజార్హ సంమాన వస్తువులు అనగా- లక్షలకొలది మదించిన ఏనుగులను, అట్లే పల్లకీలను, పదిలక్షల గుఱ్ఱములను, లక్ష రథములను, పలురకములగు అలంకార వస్త్రములు మొదలగువానిని సమర్పించెను. (330)

**శ్రీరామస్సమవాప్య భూమితనయామాద్యాం జగత్స్వామినీం**
**సర్వాత్మా వరహేతుసుందరతనుః కారుణ్యపూర్ణేక్షణః ।**
**విద్యుద్వర్ణవిరాజమానవసనస్త్రైలోక్యచూడామణిః**
**శోభామాప జగత్త్రయేఽప్యనుపమాం ముక్తావిరాజద్గళః ॥ 329**

**చతుర్థే దివసే రాత్రౌ వంశపాత్రవిరాజితైః ।**
**దీపైర్నీరాజితాః సర్వే విరేజూ రాఘవాదయః ॥ 330**

**రామాదీనాం పారిబర్హాన్ దదౌ స జనకస్తదా ।**
**నియుతాన్ వారణేంద్రాశ్చ శిబికాశ్చాపి తన్మితాః ॥ 331**

**తురగాన్ దశలక్షాంశ్చ నియుతాన్ స్యందనాన్ దదౌ ।**
**నానాలంకారవాసాంసి గోదాసీసేవకాదికాన్ ॥ 332**

**దదౌ స రాఘవాదిభ్యో యేషాం సంఖ్యా న విద్యతే ।**
**ఏవం సంమానితాస్తేన తే బాలే జనకేన హి ॥ 333**

**పూర్వవదుత్సవాద్యైశ్చ స్వస్వపత్న్యా సమన్వితాః ।**
**గజారూఢా నృత్తగీతైః తాభిః స్వమంటపం యయుః ॥ 334**

తతో రాజా మాసమేకం నినాయ నృపవాక్యతః ।
తతః సైన్యేన స్వపురీం గంతుం పుర్యా బహిర్యయౌ ॥ 335

సీతాద్యా నిర్యయుర్ముగ్ధాః సాశ్రునేత్రాః సువిహ్వలాః ।
సుమేధాస్తాః సమాలింగ్య సాంత్వయిత్వా వ్యసర్జయత్ ॥ 336

అథ రాజా దశరథో జనకం విన్యవర్తయత్ ।
తదా దశరథం ప్రాహ జనకః సాశ్రులోచనః ॥ 337

శ్వసన్కవోష్ణమ్లానాస్యో విరహోద్గద్గదాక్షరః ।
ఏతావత్కాలపర్యంతం సీతాద్యా లాలితామయా ॥ 338

అధునా త్వమితాస్త్వగ్రే లాలయంబ కృతేక్షణైః ।
ఇత్యుక్త్వా నృపతిం నత్వా మిథిలాం జనకో యయౌ ॥ 339

తతో దశరథశ్చాపి స్నుషాస్త్రీతనయాదిభిః ।
నృపైః సైన్యేన స్వపురీం యయౌ మార్గే శనైః శనైః ॥ 340

ఇట్లు లెక్కలేనన్ని దివ్యవస్తువులనిచ్చిన జనకునివలన ఆ బాలకులు సంమానింపబడుచుండిరి. యథాపూర్వముగా మహోత్సవములను చేసికొని, తమ పత్నులతోడ గజస్కంధములనెక్కి, నృత్యగీతాది వినోదములు పొందుచు, విడిది ఇంటికి వచ్చిచేరిరి. అంతట నిట్లే ఒక నెల అమందానందముగా మిథిలానగరమున దశరథమహారాజు, జనకమహారాజు ప్రార్థనను అంగీకరించి వసించుచుండెను.

## సీత అత్తవారింటికి పోవుట

కొద్దికాలము తరువాత జనక పురినుండి సైన్యములతో అయోధ్యకు ప్రయాణము చేయనెంచెను. మిథిలా రాజధానిని విడిచివచ్చునపుడు ముగ్ధలయిన– సీత, ఊర్మిళ, మాండవీ, శ్రుతకీర్తులు మనమున కలతనొంది, బాష్పాకులిత నేత్రులై యుండ సుమేధాదేవి వారిని సమాలింగనాది ఓదార్పులచే సమాధానము చేయుచుండెను. అపుడు జనకరాజు సాశ్రులోచనుడై మోమువాడుచుండ, నిట్టూర్పులు వెడలుచుండ, గద్గదస్వరమున దశరథునితో ఇట్లనెయె, “ఈ వరకు సీతయు మొదలయిన వీరు నాచే లాలనతో పాలింపబడుచుండిరి, ఇకమీదట మీరు దయా దృష్టులతో పాలింపనగును అని అందరును సీతారామాది వధూవరులను సపరివారముగా సాగనంపి, మిథిలకు తిరిగి వచ్చిరి. అంత దశరథుడు, కోడండ్రు మొదలైన యిల్లాండ్రతోను, రాజులతోను, పుత్రులతోను, సైన్యపరివారముతోను, అయోధ్యకు తిన్నగా బయలుదేరెను. (340) అటుపిమ్మట మిథిలాపురికి......

అథ గచ్ఛతి శ్రీరామే మైథిలాద్యోజనత్రయమ్ ।
నిమిత్తాన్యతిఘోరాణి దదర్శ నృపసత్తమః ॥ 341

నత్వా వసిష్ఠం పప్రచ్ఛ కిమిదం మునిపుంగవ ।
నిమిత్తానీహదృశ్యంతే విషమాని సమంతతః ॥ 342

వసిష్ఠస్తమథో ప్రాహ భయమాగామి సూచ్యతే ।
పునరప్యభయం తేఽద్య శీఘ్రమేవ భవిష్యతి ॥ 343

మృగాః ప్రదక్షిణం యాంతి త్వాం పశ్య శుభసూచకాః ।
ఏవం వై వదతస్తస్య వవౌ ఘోరతరోఽనిలః ॥ 344

ముష్ణం చక్షూంషి సర్వేషాం పాంసువృష్టిభిరర్దయత్ ।
తతో దదర్శ పరమం జాదగ్న్యం మహాప్రభమ్ ॥ 345

నీలమేఘనిభం ప్రాంశుం జటామండలమండితమ్ ।
ధనుః పరశుహస్తం చ సాక్షాత్కాలమివ స్థితమ్ ॥ 346

కార్తవీర్యాంతకం రామం దృప్తక్షత్రియమర్దనమ్ ।
ప్రాప్తం దశరథస్యాగ్రే రక్తాస్యం రక్తలోచనమ్ ॥ 347

తం దృష్ట్వా భయసంత్రస్తో రాజా దశరథస్తదా ।
అర్ఘ్యాదిపూజాం విస్మృత్య త్రాహి త్రాహీతి చాబ్రవీత్ ॥ 348

దండవత్ ప్రణిపత్యాహ పుత్రప్రాణాన్ ప్రయచ్ఛ మే ।
ఇతి బ్రువంతం రాజానమనాదృత్య రఘూత్తమమ్ ॥ 349

ఉవాచ నిష్ఠురం వాక్యం క్రోధాత్ ప్రచలితేంద్రియః ।
త్వం రామ ఇతి మన్నామ్నా చరసి క్షత్రియాధమః ॥ 350

## పరశురామ ఆగమనము

మూడామడల దూరమున శ్రీరాముడు వచ్చుచుండగా, దశరథుడు దారుణములైన దుశ్శకునములను చూచి, వసిష్ఠులతో, "స్వామీ! ఏమిది? ఎచ్చటచూచినను దుర్నిమిత్తములు కనబడుచున్నవి," అని నమస్కరించి అడిగెను. అందుకు మునివర్యుడు, "రాబోవు భయమును సూచించుచున్నది,

మరల నేడు నీకు త్వరగానే అభయము కాగలదు, మృగములు శుభశూచకములై నిన్ను చూచుచు ప్రదక్షిణముగా పోవుచున్నవి," అని చెప్పుచున్నంతలో, చండమారుతము వీచెను. అందరు ధూళి వానచే కండ్లుక్రమ్మి కష్టము నొందిరి. అపుడు గర్వించిన రాజుల గర్వమణచిన కార్తవీర్యాంతకుడను కీర్తినొంది, ప్రత్యక్ష యమునివలె వచ్చుచున్నవాడును, నీలమేఘ శరీర ఛాయ గలిగి, ఆజానుబాహుడును, జటలు ధరించినవాడును, రక్తముతో తడిసిన పెద్ద గండ్రగొడ్డలిని చేతబట్టి, మహాతేజోవంతుడగు జమదగ్ని మహర్షి పుత్రుడు 'పరశు రాముడు' దశరథునికి ప్రత్యక్షమాయెను. అప్పుడా దశరథ రాజు భార్గవరాముని జూచి, భయభ్రాంతుడై, అతిథి పూజలను మరచి, దండప్రణామముజేసి, పుత్రులను రక్షింపుము అని వేడసాగెను. పరశురాముడు వానిని లక్ష్యపెట్టక, క్రోధావేశమునొందినవాడై, మిగుల నిష్ఠురముతో, శ్రీరామునితో, "క్షత్రియాధముడా! (350)

**ద్వంద్వయుద్ధం ప్రయచ్ఛాశు యది త్వం క్షత్రియోసి మే**
**పురాణం జర్జరం చాపం భక్త్వా త్వం కత్థసే ముధా ॥ 351**

**ఇదం తు వైష్ణవం చాప మారోపయసి చేద్గుణమ్ ।**
**తర్హి యుద్ధం త్వయా సార్ధం న కరోమి నృపాత్మజ ॥ 352**

**నో చేత్సర్వాన్హనిష్యామి క్షత్రియాంతకరస్త్వహమ్ ।**
**ఇతి తద్వచనం శ్రుత్వా రాఘవో వాక్యమబ్రవీత్ ॥ 353**

**వయమేకగుణాః స్వామిన్ యూయం చైవ గుణాధికాః ।**
**గోవిప్రదేవనారీషు రాఘవా నాస్త్రధారిణః ॥ 354**

**మయ్యేతైశ్చ జీవితాని తవ పాదార్పితాని హి ।**
**యథేచ్ఛం ఘాతయాస్మాకం విప్రైర్యుద్ధం కరోమి న ॥ 355**

**ఇతి బ్రువతి రామే వై చచాల వసుధా భృశమ్ ।**
**క్రుద్ధం దృష్ట్వా జామదగ్న్యం క్షత్రియాంతముపస్థితమ్ ॥ 356**

**అంధకారో బభూవాథ చక్షుభుః సప్త సాగరాః ।**
**రామో దాశరథిర్వీరో వీక్ష్య తం భార్గవం రుషా ॥ 357**

**ధనురాచ్ఛిద్య తద్ధస్తాదారోప్య గుణమంజసా ।**
**తూణీరాద్బాణమాదాయ సంధాయాకృష్య వీర్యవాన్ ॥ 358**

ఉవాచ భార్గవం రామః శ్రుణు బ్రహ్మన్ వచో మమ ।
లక్ష్యం దర్శయ బాణస్య హ్యామోఘో రామసాయకః ॥ 359

లోకాన్ పాదయుగం వాపి వద శీఘ్రం మమాజ్ఞయా ।
ఏవం వదతి శ్రీరామే భార్గవో వికృతాననః ॥ 360

నీవు 'రామ' యని, నాపేరుగలవాడై చరించెదవు, నీవు క్షత్రియుడగునెడ నాతోడ ద్వంద్వ యుద్ధమును జేయుము. శిథిలమయిన పాతవిల్లును విరిచి, వ్యర్థముగా నిక్కుచున్నావు. ఇదిగో వైష్ణవమగు నా ధనుస్సును ఎక్కుపెట్టినపుడు నీతోడ యుద్ధము చేసెదను. అట్లు చేయకపోయిన క్షత్రియాంతకుడనైన నేను అందరిని చంపివేయుదును," అని అదిలించెను. అందుకు శ్రీరాముడు, "స్వామీ! మేమొక్కగుణమే గలవారలము, తామే గుణాధికులు, రఘువంశజులు గోవులమీద, బ్రాహ్మణులమీద, స్త్రీలమీద అస్త్రము వేయువారుకారు. నేనును, వీరును మా ప్రాణములనే మీకప్పగించి యున్నాము. తమ ఇచ్చవచ్చినట్లు చేయుము, మేము బ్రాహ్మణులతోడి యుద్ధముచేయము," అని వినయముతో శ్రీరాముడు చెప్పుచుండగా భూమి గడగడవణకెను. క్రుద్ధుడైన పరశురాముని జూచి, క్షత్రియ ప్రళయము సమీపించెను, చీకట్లు క్రమ్మెను, సముద్రములు అల్లకల్లోలమయ్యె. అపుడు వీరుడైన దశరథరాముడు కోపముతో ఆ పరశురాముని జూచి, అతని చేతనున్న ధనస్సును తీసికొని, నారినెక్కుబెట్టి, బాణమును అనుసంధానముజేసి ధనస్సును సంధించి, పరశురామునితో, "బ్రాహ్మణుడా! వినుము, ఈ బాణమునకు ఇపుడు లక్ష్యమును జూపుము. (360)

సంస్మరన్ పూర్వవృత్తాంతమిదం వచనమబ్రవీత్ ।
రామ రామ మహాబాహో జానే త్వాం పరమేశ్వరమ్ ॥ 361

పురాణపురుషం విష్ణుం జగత్సర్గలయోద్భవమ్ ।
బాల్యేఽహం తపసా విష్ణుమారాధయితుమంజసా ॥ 362

గత్వా హి తీర్థే గోమత్యాం తపసా తోష్య శార్ఙ్గిణమ్ ।
అహర్నిశం మహాత్మానం నారాయణమనన్యధీః ॥ 363

యస్యాంశేన మయా భూమ్యామవతారో ధృతోఽస్తి హి ।
భూభారహరణార్థాయ కార్తవీర్యవధేప్సయా ॥ 364

తతః ప్రసన్నో దేవేశః శంఖచక్రగదాధరః ।
ఉవాచ మాం రఘుశ్రేష్ఠ ప్రసన్నముఖపంకజః ॥ 365

శ్రీభగవానువాచ

ఉత్తిష్ఠ తపసో బ్రహ్మన్ విహితం తే తపో మహత్ ।
మచ్చిదంశేన యుక్తస్త్వం జహి హైహయపుంగవమ్ ॥ 366

కార్తవీర్యం పితృహణం యదర్థం తపసా శ్రమః ।
తతస్త్రిః సప్తకృత్వస్త్వం హత్వా క్షత్రియమండలమ్ ॥ 367

కృత్స్నం భూమిం కశ్యపాయ దత్వా శాంతిముపావహ ।
త్రేతాయుగే దాశరథిర్భూత్వా రామోఽహమవ్యయః ॥ 368

ఉత్పత్స్యే పరయా భక్త్యా తదా ద్రక్ష్యసి మాం పునః ।
మత్తేజః పునరాదాస్యే త్వయి దత్తం మయా కృతమ్ ॥ 369

తదా తపశ్చరన్లోకే తిష్ఠ త్వం బ్రహ్మణో దినమ్ ।
ఇత్యుక్త్వాఽన్తర్దధే దేవ స్తథా సర్వం మయా కృతమ్ ॥ 370

శ్రీరామబాణము వ్యర్థముకానిది. కాబట్టి, నీవు సాధించిన పుణ్యలోకములను గాని, నీ రెండుకాళ్ళ(గమనము)నుగాని చూపుము," అని చెప్పెను. ఇట్టి రామవాక్యములను విని, భార్గవుడు వికలుడై, పూర్వవృత్తాంతమును స్మరించుచు, ఇట్లుపలికెను, "రామ! రామ! మహానుభావా! నీవు పరమేశ్వరుడవని గ్రహించితిని. నీవే లోక సృష్టి, స్థితి, అంత కారణుడగు పురాణపురుషుడవు, శ్రీమన్నారాయణుడవు. నేను బాల్యమున శ్రీవిష్ణుమూర్తిగురించి తపమొనరించదలచి, గౌతమీ తీర్థమునకు వెడలి, ఎవని అంశముతో నేను భూభారహరణమునకై కార్తవీర్యవధేచ్ఛచేత ఇట్లు భూమిపై అవతరించితినో, అట్టిమహాత్ముడగు నారాయణుని నిరంతరముగా ధ్యానించుచుంటిని. పిదప శంఖ, చక్ర, గదాధరుడు ప్రసన్నుడై నాతో, "తపస్సును చాలింపుము, బ్రాహ్మణుడా! నీ మహాతపస్సు ఫలించినది. నా యొక్క జ్ఞాన శక్తిని కలిగిన నీవు ఈ తపస్సును ఎవనిని జంపుటకై చేయుచున్నావో అట్టి హైహయ వంశ కీర్తికారకుడైన కార్తవీర్యుని జయింపుము. పిమ్మట 21 మార్లు క్షత్రియ సమూహమును సంహరించి, సమస్త భూమండలమును కశ్యపఋషికి దానమిచ్చి, శాంతించుము. త్రేతాయుగమున నేను దశరథరామునిగా అవతరించెదను. మరల నీవు పరమభక్తితో చూడగలవు. (370)

స ఏవ విష్ణుస్త్వం రామ జాతోఽసి బ్రహ్మణార్థినః ।
మయి స్థితం తు త్వత్తేజః త్వయైవ పునరాహృతమ్ ॥ 371

అద్య మే సఫలం జన్మ ప్రతీతోఽసి మమ ప్రభో ।
నమోఽస్తు జగతాం నాథ నమస్తే భక్తిభావన ॥ 372

నమః కారుణికానంత రామచంద్ర నమోఽస్తు తే ।
దేవ యద్యత్కృతం పుణ్యం మయా లోకజిగీషయా ॥ 373

తత్సర్వం తవ బాణాయ భూయాద్రామ నమోఽస్తు తే ।
తతో ముక్త్వా శరం రామస్తత్కర్మ భస్మసాత్కరోత్ ॥ 374

తతః ప్రసన్నో భగవాన్ శ్రీరామః కరుణామయః ।
జామదగ్న్యం తదా ప్రాహ వరం వరయ చేతి సః ॥ 375

తతః ప్రీతేన మనసా భార్గవో రామమబ్రవీత్ ।
యది మేనుఽగ్రహో రామ తవాస్తి మధుసూదన ॥ 376

త్వద్భక్తసంగస్త్వత్పాదే మమ భక్తిః సదాఽస్తు వై ।
తథేతి రాఘవేణోక్తః పరిక్రమ్య ప్రణమ్య తమ్ ॥ 377

పూజితస్తదనుజ్ఞాతో మహేంద్రాచలమన్వగాత్ ।
రావణేన జితా దేవాః సగర్వో రావణో మహాన్ ॥ 378

సహస్రబాహునా బద్ధః సోఽర్జునో భార్గవేణహి ।
హతః క్షణేన సమరే సోఽద్య శ్రీభార్గవోఽపి చ ॥ 379

జితస్తద్ధనుషా బాణమోచనాద్రాఘవేణ హి ।
ఏవం శ్రీరామచంద్రస్య పౌరుషం కిం వదామ్యహమ్ ॥ 380

మునుపు నేను నీకిచ్చిన తేజస్సును మరల తీసికొనుచున్నాను. అపుడు తపమునాచరించుచు, బ్రహ్మకల్పపర్యంతము సుఖముగా నుండుము," అని చెప్పి, అంతర్ధానము నొందినందున, అట్లే సర్వము నాచే ఆచరించబడినది. ఆ విష్ణువే నీవు. బ్రహ్మదేవునిచే ప్రార్థింపబడి, యవతరించితివి. నాయందుండిన నీ తేజస్సును ఇపుడు తీసికొంటివి. ఇపుడు నా జన్మము సఫలమయినది. నాకు ప్రసన్నుడవైతివి. లోకైకప్రభువై, భక్తపరాధీనుడై, కారుణికోత్తముడై, అనంతుడగు శ్రీరామచంద్రమూర్తీ!

నీకు నమస్కారము, ఈ వరకు ఏమేమి పుణ్యము లోకయజ్ఞార్థముగా నాచేత చేయబడియున్నదో అదంతయును నీబాణమునకు లక్ష్యమగుగాక. శ్రీరామా! నీకు నమస్కారము. మరల నమస్కారము. అని యిట్లు పరశురాముడు వేడుకొనుచుండగా, శ్రీరాముడు బాణమును ప్రయోగించి, ఆ సత్కర్మరాశిని భస్మముచేసెను. పిదప కరుణాకరుడైన శ్రీరాముడు ప్రసన్నుడై పరశురాముని వరము వేడుమనెను. అందుకు జామదగ్న్య పుత్రుడు, "శ్రీరామమూర్తీ! నీకు నాయందు అనుగ్రహబుద్ధి కలిగినట్లైతే, నీ భక్తులసహవాసమును, నీయందు నిరంతర భక్తియును నాకు కలుగనీ," అని ప్రార్థించగా, అట్లే కానిమ్మని రామునిచే వరముపొంది, ప్రదక్షిణ నమస్కారములను చేసి, పూజలనంది, రాముని నుండి శెలవు తీసుకుని, మహేంద్రగిరికి వెడలెను. పార్వతీదేవీ! దేవతలను జయించి, గర్వించిన రావణాసురుని తన వేయిచేతులతో బిగించిన కార్తవీర్యార్జునుని క్షణమాత్రమున యుద్ధమందు చిత్తుచేసిన భార్గవ రాముడు ఈ శ్రీరామునిచేతిలో ఓటమినందెను, అట్టి విజేతయైన శ్రీరామచంద్రుని పౌరుషమును ఏమని వర్ణింతును? (380)

**అథ రాజాదశరథో రామం మృతమివాగతమ్ ।**
**దృఢమాలింగ్య హర్షేణ నేత్రాభ్యాం జలముత్సృజన్ ॥ 381**

**తతః ప్రీతేన మనసా స్వస్థచిత్తః పురీం యయౌ ।**
**అయోధ్యాయాం సుమంత్రోఽపి నృప శ్రుత్వా సమాగతమ్ ॥ 382**

**నగరీం శోభయామాస పతాకధ్వజతోరణైః ।**
**వారణేంద్రం పురస్కృత్య రామం ప్రత్యుద్యయౌ జవాత్ ॥ 383**

**అథో నదత్సు వాద్యేషు రాజా పుత్రైస్సుహృజ్జనైః ।**
**నివేశ నగరం పౌరైః పశ్యన్నృత్యాదికం పథి ॥ 384**

**రామాద్యః స్వస్వపత్న్యా తే గజసంస్థా యయుః పురీమ్ ।**
**ననృతుర్వారనార్యశ్చ తుష్టువుర్మాగధాదయః ॥ 385**

**ఏవం రాజా గృహం గత్వా బాలకైః స్వీయసద్మని ।**
**రమాపూజాః కారయిత్వా దదౌ దానాన్యనేకశః ॥ 386**

**తదాఽలంకారవస్త్రాద్యైః సుహృదః పార్థివాదయః ।**
**రామాదీన్పూజయామాసు స్తదా దశరథం నృపమ్ ॥ 387**

దశరథోऽపి తాన్సర్వాన్ పూజయామాస వైభవైః ।
తతస్తే సుహృదః సర్వే నృపాశ్చ స్వస్థలం యయుః ॥ 388

ప్రీత్యా యుధాజితం రాజా స్థాపయామాస స్వాన్తికమ్ ।
రామాద్యా రమయామాసుః స్వస్వదారైః స్వసద్మసు ॥ 389

పార్వత్యువాచ
శ్రీవిష్ణోస్తు చిదంశేన జామదగ్న్యస్త్వయా స్మృతః । 390

తద్వచ్చాయం రాఘవః కిం వద మే సంశయం ప్రభో ।
శ్రీశివ ఉవాచ
అష్టావింశేన విధృతా అవతారాశ్చ విష్ణునా ॥ 391

రామకృష్ణావతారౌ చ పూర్ణరూపేణ తౌ ధృతౌ ।
వసిష్ఠౌ సకలేష్వేవావతారేషు హి తావుభౌ ॥ 392

తయోరపి వరః పూర్వః సత్యసంధో జితేంద్రియః ।
జ్ఞేయో రామావతారో హి నానేన సదృశః పరః ॥ 393

కృష్ణః కృష్ణరుచిర్ జ్ఞేయః శ్రీరామో రుక్మసంరుచిః ।
ఏవం గిరీంద్రజే ప్రోక్తం సీతాయాశ్చ స్వయంవరమ్ ॥

అస్య సర్గస్య శ్రవణాన్మంగళం లభ్యతే నరైః ॥ 394

**ఇతి శ్రీశతకోటిరామచరితాంతర్గతే, శ్రీమదానందరామాయణే, వాల్మీకీయే, ఆదికావ్యే, సారకాండే, సీతాస్వయంవరోనామ, తృతీయః సర్గః ॥**

## శ్రీరామాదులు అయోధ్యకు వచ్చుట

అంత దశరథమహారాజు, పరశురాముని ప్రమాదమునుండి బ్రతికివచ్చినట్లు దలచి, గాఢాలింగనముతో, ఆనందబాష్పములతో ఎంతో ప్రీతితో స్వస్థచిత్తుడై రాజధానికి వచ్చెను. రాజువచ్చు సంగతి తెలిసి, అయోధ్యయందు సుమంత్రాది మంత్రులు అలంకారములచే రాజమార్గములన్నీ శోభాయమానముగా వెలుగుచుండెను. మంత్రులు భద్రగజములతో వచ్చి, స్వాగతము ఒనరింపగా, మంగళవాద్యములు మ్రోగుచుండగా, మిగుల వేడుకలతో అందరును నగరమున ప్రవేశించిరి.

అట్లు అనేక రాజవైభవములతో దశరథుడు తన నగరికి జేరి, తన భార్యలతో శ్రీరామాదులచే లక్ష్మీపూజ చేయించి, అనేక దానములనిచ్చెను. అపుడు మిత్రవర్గపురాజులు దివ్యాలంకార వస్త్రాదులచే శ్రీరామాదులను, దశరథమహారాజును పూజించిరి. దశరథుడును వారినందరిని వైభవముగా సత్కరించెను. అనంతరము అంతా వారివారి స్థలములకు పయనించిరి. దశరథుడు ప్రీతిచే కైకేయి తమ్ముడగు యుధాజిత్తుని తనవద్దనే ఉంచుకొనెను. శ్రీరామాదులు తమతమ పత్నులతోడ వారివారి రాజమందిరములలో ఆనందించుచుండిరి.” అని శివుడు చెప్పగా, శివవాక్యామృతమును గ్రోలుచున్న పార్వతి,

## శ్రీరామావతార శ్రేష్ఠత్వము

“పరమేశ్వరా! భార్గవరాముడు శ్రీవిష్ణుమూర్తియొక్క చిదంశమున గలిగినట్లు చెప్పితివే, మరి శ్రీరాముడును విష్ణుమూర్తి అవతారమే గదా? ఈ నా సందేహమును తీర్చుము,” అని అడిగెను. అందుకు శివుడిట్లనెను. (390) శ్రీ మహావిష్ణువుచే 18 అవతారములు ధరింపబడినవి. అందులో రామ, కృష్ణావతారములు రెండును పూర్ణరూపములై శ్రేష్ఠములనబడుచున్నవి. ఆ రెండింటిలో మొదటిదైన శ్రీరామావతారము మిక్కిలి శ్రేష్ఠము. ఓ గిరిజా! ఇట్లు, సీతా స్వయంవరము చెప్పబడినది. ఈ అధ్యాయ కథాశ్రవణముచేత మానవులు మంగళమునొందుదురు.

***శతకోటిప్రవిస్తరమైన రామకథలో, శ్రీమద్వాల్మీకిమహర్షిచే రచింపబడిన, ఆనందరామాయణములోని, సారకాండలో, రామకళ్యాణమును వివరించు మూడవ సర్గ ముగిసినది.***



# చతుర్థః సర్గః-4వ సర్గ

## వృందాశాప వృత్తాంతము

శ్రీశివ ఉవాచ

అథ సీతాయుతః శ్రీమాన్ రామః సాకేతసంస్థితః ।
బుభుజే వివిధాన్ భోగాన్ రాజసేవాపరోభవత్ ॥ 1

శరత్కాలాశ్వినే మాసి జనకేన స్వమంత్రిణః ।
ఆహ్వానాయ చ రాజానం ప్రేషితాస్త్వరితం యయుః ॥ 2

తానాగతాన్ దశరథః శీఘ్రం సత్కృత్య సాదరమ్ ।
పప్రచ్ఛాగమనే హేతుం తేఽపి నత్వా తమూచిరే ॥ 3

దీపావళ్యుత్సవార్థం త్వాం స కుటుంబం సమంత్రిణమ్ ।
పౌరజానపదైః సాకమాహ్వయామాస తే సుహృత్ ॥ 4

తత్తేషాం వచనం శ్రుత్వా దూతానాజ్ఞాపయన్నృపః ।
కథ్యతాం నగరే రాష్ట్రే గమనం మిథిలాం ప్రతి ॥ 5

సుముహూర్తే తతో రాజా హస్త్యశ్వరథపత్తిభిః ।
పౌరైర్జానపదైః సాకం యయౌ కరివిరాజితః ॥ 6

రాజ్ఞః పృష్ఠే సమాజగ్ముర్గజోపరి విరాజితాః ।
రామలక్ష్మణభరతశత్రుఘ్నాస్తే స్వలంకృతాః ॥ 7

కౌసల్యాద్యా రాజదారాః స్నుషాభిస్తాః పృథక్ పృథక్ ।
రత్నమాణిక్యముక్తాది శోభితాసు వరాను చ ॥ 8

కరిణీషు సమాసీనా వేష్టితా వేత్రపాణిభిః ।
ధాత్రుకాభిః స్వదాసీభిః యయుర్వస్త్రాదిభూషితాః ॥ 9

ఆగతం నృపతిం శ్రుత్వా జనకః పౌరవాసిభిః ।
ప్రత్యుజ్జగామ హర్షేణ నినాయ నగరీం ప్రతి ॥ 10

## శ్రీరామాదులు దీపావళిపండుగకు మిథిలకు పోవుట

అటుమీదట సీతాసమేతుడైన శ్రీరామచంద్రుడు అయోధ్యలో వివిధభోగములను అనుభవించుచు రాజసేవాపరుడాయెను. జనకమహారాజు; శరత్ ఋతువులోని ఆశ్వీయుజమాసమున మిథిలలో జరుగు దీపావళి పండుగకు దశరథమహారాజును ఆహ్వానించుటకుగాను తన మంత్రులను అయోధ్యకు పంపెను. వారి రాకను తెలుసుకున్న దశరథుడు మిథిలా నగర మంత్రులను సత్కరించి, ఆదరముతో ఆగమన కారణము అడిగెను. అందుకు వారు నమస్కరించుచు, మిక్కిలి వినీతులై, "మహారాజా! మీ మిత్రుడు జనకమహారాజు మిమ్ములను సకుటుంబ సపరివారముగా ఈ దీపావళి మహోత్సవమునకు మిథిలకు దయచేయవలయునని ప్రార్థించుచున్నాడు," అని విన్నవించిరి. అందులకు దశరథుడును సమ్మతించి, ఆ సంగతిని దేశమందంతట ప్రకటించి, సుముహూర్తమున పౌర, జానపదాది పరివారముతో మిథిలకు ప్రయాణము ప్రారంభించెను. చతురంగ సైన్యములనడుమ శ్రీరామ, లక్ష్మణ, భరత, శత్రుఘ్నులును, కౌసల్యాది మాతలును, సీతాది రాజపత్నులును ఏనుగులనెక్కి, దాస దాసీజనులతో రాజవైభవములతో మహోత్సవముగా వెడలిరి. దశరథాదులు వచ్చుచున్న సంగతిని తెలుసుకున్న జనకమహారాజు మిక్కిలి సంతోషముతో ఎదురు వచ్చి, మంగళవాద్యములతో, వివిధ సంగీత ధ్వనులతో, నర్తకుల నర్తనములతో స్వాగతించెను. నగరములోనికి వచ్చిన అతిథులపై పౌరులు, స్త్రీలు ఆనందముతో పుష్పవర్షమును కురిపించిరి. ఆ దృశ్యములు కన్నులకు పండుగాయెను. రాజమార్గమున వచ్చుచున్న వియ్యాలవారిని, అల్లుండ్రను సముచిత సత్కారములచే జనకుడు పిలచికొనివచ్చెను. అందరును సమస్తభోగ సామాగ్రీ సమేతముగ రమ్యమైన తమతమ మందిరములలోనికి ప్రవేశించిరి. (10)

**వాద్యఘోషనినాదైశ్చ దుందుభీనాం మహాస్వనైః ।**
**వారాంగనానాం నృత్తాద్యైః గాయకానాం చ గాయనైః ॥ 11**

**మార్గే మార్గే మహాసౌధారూఢస్త్రీణాం కదంబకైః ।**
**పుష్పవృష్టివివర్షాభిర్యయౌ నృపగృహం నృపః ॥ 12**

**తతో గృహాణి రమ్యాణి పూరితాన్యన్నవారిభిః ।**
**ప్రవివేశ నృపశ్రేష్ఠో జనకేనాతిమానితః ॥ 13**

**తతో నానా సముత్సహైర్ మృష్టాన్నైః నృత్తగాయకైః ।**
**వస్త్రైరాభరణైః సర్వాన్ జామాతౄంశ్చ విశేషతః ॥ 14**

మణిరత్నాదిదీపైశ్చ ముహుర్నీరాజనైరపి ।
జనకః పూజయామాస దీపావళ్యాం మహాదినే ॥ 15

దీపోత్సవైర్మహాపుణ్యైర్బలిరాజ్యం ప్రవర్తతే ।
ఆనందః సర్వలోకానాం మంగళాని గృహే గృహే ॥ 16

అభ్యంగోద్వర్తనాద్యైశ్చ వరపక్వాన్నభోజనైః ।
గోదాసదాసీదానైశ్చ హస్త్యశ్వరథపత్తిభిః ॥ 17

చకార తుష్టాన్ జామాతౄన్ జనకో నృపతిం తథా ।
నృపపత్నీ స్వదుహితౄరయోధ్యాస్థాదికాన్ క్రమాత్ ॥ 18

పిదప జనకమహారాజు దీపావళి పర్వదినమున వివిధ సముత్సాహములతో, విందు భోజనాదులతో, దివ్యవస్త్రాభరణములతో అందరిని, విశేషముగా అల్లుండ్రను రత్నదీపములతో అడుగడుగున హారతులతో సేవించెను. మహాపుణ్యమగు దీపావళిదినమున ప్రతిగృహమునను అన్ని లోకాలకు ఆనందము కలుగునట్లు, మంగళదీప మహోత్సవములతో బలిరాజ్యము వలె వెలుగొందు చుండెను. నాడు జనకుడు అల్లుళ్ళకు రుచికరమైన విందుతోను, వినోదములతోను, గో దాస దాసీ ప్రదాన చతురంగ సైన్యములచే సంతుష్టలనుజేసెను. అట్లే జానకీ మొదలగు కుమార్తెలకును చివరకు అయోధ్యావాసులందరిని సత్కరించి, ఆనందపరవశులను జేసెను (18) అంత దశరథుడు

తతః ప్రస్థానమరోత్పురీం దశరథో నృపః ।
తతో రాజా దశరథః సైన్యేన పరివేష్టితః ॥ 19

యయౌ శనైః శనైర్మార్గం సుహృన్మంత్రిపురస్సరః ।
ఏతస్మిన్నంతరే మార్గే సీతార్థం ధనుషా పురా ॥ 20

భగ్నమానా నృపతయః పూర్వవైరమనుస్మరన్ ।
అసంఖ్యాతాః ససైన్యాస్తే రురుదుర్నృపతిం పథి ॥ 21

తాన్దృష్ట్వా నృపతీంశ్చాపి కిమేతదితి విహ్వలః ।
మంత్రిభిర్మంత్రయామాస జనకః స్వజనైరపి ॥ 22

ఏతస్మిన్నంతరే రామః శ్రుత్వా చింతార్ణవే నిజమ్ ।
నిమగ్నం పితరమ్ శీఘ్రం యయౌలక్ష్మణసంయుతః ॥ 23

**నత్వా దశరథం రామః కించిన్నమ్ర ఇదం జగౌ ।**
**తాత రాజన్న కర్తవ్యా చింతా సతి మయి త్వయా ॥ 24**

**క్షణాదేవ వధిష్యామి పశ్య త్వం కౌతుకం మమ ।**
**తతో రామవచః శ్రుత్వా రాజాలింగ్య రఘూత్తమమ్ ॥ 25**

**ప్రాహ షడ్వార్షికో బాలస్త్వం కథం యోద్ధుమిచ్ఛసి ।**
**అరణ్యే సుకుటుంబోఽహం వేష్టితోఽస్మిన్నృపాధమైః ॥ 26**

## మదించివచ్చిన రాజులతో మహాయుద్ధము

సాకేతమునకు ప్రయాణమై, సమస్త పరివారముతోడ తిన్నగా వచ్చుచుండెను. అంతలో పూర్వము సీతకొరకు ధనస్సుచే భగ్నమనోరథులగు రాజులందరును పూర్వవైరమును స్మరించుచు, లెక్కలేని సైన్యములతోడ వచ్చి, దారిలో దశరథుని ముట్టడిచేసిరి. జనకుడును వారినిజూచి, "ఏమిది?" యని సంభ్రాంతుడై మంత్రులతో ఆలోచించెను. అంతలో శ్రీరాముడు లక్ష్మణునితో చింతాసాగరములో మునిగిన తండ్రివద్దకు వచ్చి నమస్కరించి, వినయముతో, "తండ్రీ! నేనుండగా నీవు చింతింపవలదు. క్షణమాత్రమున వీరిని సంహరించెదను. నాపరాక్రమును చూడుము," అని విన్నవించెను. అందుకు దశరథుడు రాముని ఆలింగించుకుని, "నాయనా! పదునారేండ్ల బాలుడగు నీవు ఎట్లు యుద్ధము చేయగలవు? నీచులగురాజులు అరణ్యమున సకుటుంబుడగు నన్ను ముట్టడించిరి. నేనే యుద్ధమునకు పోదును. నీవు సైన్యమును రక్షింపుము," అని చెప్పెను.

**అహమేవ గమిష్యామి యోద్ధుం రక్షస్వ వాహినీమ్ ।**
**తత్తాతవచనం శ్రుత్వా రామస్తం పునరబ్రవీత్ ॥ 27**

**యదా మే కుంఠితాం శక్తి పశ్యసి త్వం రణాంగణే ।**
**తదా మే కురు సాహాయ్యం తావదత్ర స్థిరోభవ ॥ 28**

**స్వాం వాహినీం సకుటుంబాం తాత త్వం రక్ష మద్గిరా ।**
**ఇత్యుక్త్వా పితరమ్ నత్వా సజ్జీకృత్య శరాసనమ్ ॥ 29**

**జగామ రథమారూఢో లక్ష్మణోపితమన్వగాత్ ।**
**తౌ దృష్ట్వా భరత శ్చాథ శత్రుఘ్నోఽపి జగామ సః ॥ 30**

**తాన్దృష్ట్వా దశసాహస్రీం రాజసేనామచోదయత్ ।**
**తతస్తే పార్థివాః సర్వే రథస్థం తం రఘూత్తమమ్ ॥ 31**

నిరీక్ష్య దర్శయామాసుః స్వసేనాయాం పరస్పరమ్ ।
సమాగతోఽయం శ్రీరామః స్వపితృస్యందనం స్థితః ॥ 32

ఏష వై సుమహత్ శ్రీమాన్ విటపీ సంప్రకాశతే ।
విరాజత్యుజ్జ్వలస్కంధః కోవిదారధ్వజో రథే ॥ 33

దశరథాజ్ఞయా తస్య రథే శస్త్రౌఘపూరితే ।
ధ్వజబద్ధపతాకోచ్చకోవిదారే స్థితఃస్వయమ్ ॥ 34

ఏవం వదంతస్తే సర్వే రథైర్యోద్ధుం సమాయయుః ।
తతోఽభవన్మహద్యుద్ధం ఘోర తచ్చ పరస్పరమ్ ॥ 35

అస్త్రైః శస్త్రైః భిందిపాలైః శతఘ్నీభిః పరశ్వథైః ।
రామస్య సైనికాన్ ముక్త్వా రాజానో రామమన్వయుః ॥ 36

తే వవర్షుర్మహాశస్త్రైః బాణైర్వ్యాప్య దిగంబరమ్ ।
తాన్దృష్ట్వా నృపతీన్ సర్వాన్ రామమేవాభిసంముఖాన్ ॥ 37

లక్ష్మణః ప్రాద్రవచ్ఛీఘ్రం భరతోఽపి చ శత్రుహా ।
స్వామితారకవద్ఘోరం ఆసీద్యుద్ధం సుదారుణమ్ ॥ 38

తతో నృపతయః సర్వే శస్త్రౌఘైః భరతం తదా ।
తే విధ్వా మూర్ఛితం చక్రుః స్యందనాత్పతితో భువి ॥ 39

భరతం పతితం దృష్ట్వా శత్రుఘ్నం వివ్యధుః శరైః ।
తం చాపి విరథం కృత్వా దుద్రువుర్లక్ష్మణం నృపాః ॥ 40

వవర్షుర్నిశితైర్బాణైః చక్రుస్తం వ్యాకులం రణే ।
తథైవ రాఘవం చాపి శరైరాచ్ఛాదయన్నృపాః ॥ 41

తతః శ్రీరామచంద్రోఽపి లీలయా సమరాంగణే ।
పశ్యత్సు జాలరంధ్రైశ్చ కౌసల్యాద్యాసు మాతృషు ॥ 42

సీతయా భ్రాతృపత్నీషు పిత్రా మంత్రికులేష్వపి ।
టణత్కృత్య మహచ్చాప వాయవ్యాస్త్రేణ తాన్ నృపాన్ ॥ 43

**శుష్కపర్ణవదుద్ధూయ ప్రాక్షిపదబ్ధిరోధసి ।**
**మోహనాస్త్రేణ శేషాన్ హి మోహయామాస రాఘవః ॥ 44**

అందుకు మరల రాముడు, "నేను రణమున శక్తిహీనుడయినపుడు నీవు సహాయముచేయుదువులే, అంత వరకు ఇచ్చటనే స్థిరుడైయుండుము. నామాట విని సకుటుంబ సైన్యములను బ్రోచుచుండుము," అని చెప్పి, తండ్రికి నమస్కరించి, ధనస్సును సంధించి, రథారూఢుడై వెడలెను. లక్ష్మణుడు అనుసరించెను. వారినిజూచి, భరత శత్రుఘ్నులును వెడలిరి. వారిని జూచి, పదివేల సైన్యమును పంపించెను. పిదప రాజులందరును రథమునెక్కిన రాముని జూచి, తమలోతాము, "వచ్చుచున్న శ్రీరాముడు తన తండ్రి రథమునెక్కియున్నాడు. ఇతడుగదా గొప్ప సంపద్వృక్షమువలే ప్రకాశించు చున్నాడు. ఉజ్జ్వల స్కందమును, కోవిదారధ్వజమును రథమున గల్గియున్నది. దశరథాజ్ఞచే ఇట్లు వచ్చుచుండును," అని యిట్లు పలుకుచు, వారందరును రథములతోడ రణమునకువచ్చిరి. అంత అన్యోన్యముగా భయంకరమైన మహాయుద్ధము జరిగినది. శస్త్ర, అస్త్రాదులతో రామసైనికులను పడమొత్తి, రాజులందరును రామునిమీద కలబడిరి. ఇట్లు బాణవర్షములు గగనమును దిక్కులను వెంబడించగా, వారితో తారసిల్లెను. ఆ యుద్ధము కుమారస్వామి తారకాసుర యుద్ధమువలే మిక్కిలి భయంకరముగా ఉండెను. అపుడు రాజులందరును శస్త్రౌఘములచే భరత శత్రుఘ్నులను మూర్ఛితులను జేసిరి. వారు నేలకూలిరి. అందుచే లక్ష్మణుడు కోపముతో విజృంభించి బాణవర్షమును కురిపించుచు వచ్చెను. అతడు చాలకపోయెను. అపుడు గవాచీలనుండి కౌసల్యాది మాతలు, సీతాది రాజపత్నులు, మంత్రులందరును చూచుచుండగా, శ్రీరామచంద్రుడు రణాంగణమున వినోదముతో వాయవ్య అస్త్రప్రయోగముచేసి, రాజులందరిని ఎండుటాకులవలే సముద్రతీరమునకు ఎగురగొట్టెను. తక్కిన వారినందరిని మోహనాస్త్రప్రయోగముచే మూర్ఛితులను జేసెను. (44)

**లులుంఠ సకలం సైన్యం హస్త్యశ్వరథసంకులమ్ ।**
**తతో మూర్ఛితమాలోక్య భరతం కైకయీ రణే ॥ 45**

**కరిణ్యాః శీఘ్రముత్ప్లుత్య శుశోచాంకే నిధాయ తమ్ ।**
**తతో దశరథశ్చాపి కౌసల్యాద్యా నృపస్త్రియః ॥ 46**

**సాంతయిత్వాఽథ తాన్ రామః సౌమిత్రిం ప్రాహ వేగతః ।**
**ఇతో విదూరే సౌమిత్రే ముద్గలస్య తపోనిధేః ॥ 47**

**ఆశ్రమోఽస్తి హి తత్ర త్వం గత్వా వల్లీః శుభావహాః ।**
**సంజీవన్యాదికాః సర్వాః శీఘ్రమానయ లక్ష్మణ ॥ 48**

**మునేస్తపః ప్రభావేణ బహవః సంతి తత్ర వై ।**
**తథేతి లక్ష్మణో గత్వా స్యందనస్థస్త్వరాన్వితః ॥ 49**

**అవరుహ్యరథాద్వీరః సంవివేశాశ్రమం మునేః ।**
**నివారితః స వటుకైః సమాధివిరమే మునేః ॥ 50**

**యాచాం కృత్వా శుభా వల్లీః ప్రాప్స్యసే త్వం న చాన్యథా ।**
**కాలాతిక్రమభీత్యా స లక్ష్మణోఽపి రఘూత్తమమ్ ॥ 51**

**వృత్తం నివేదయామాస పునస్తం రాఘవోఽబ్రవీత్ ।**
**నివారయిత్వా వటుకాన్ వినా శస్త్రైస్త్వరాన్వితః ॥ 52**

## శ్రీరాముడు భరతశత్రుఘ్నులను సంజీవనిచే బ్రతికించుట.

ఇట్లు సమస్త సైన్యము రామరణక్రీడచే నిశ్శేషమయినపుడు, కైకేయి గజమునుండి దిగి, భరతునెత్తుకుని, ఒడిలో నుంచుకుని దుఃఖింపసాగెను. దశరథుడును, కౌసల్యాదులును చింతాక్రాంతులై రోదించసాగిరి. రాముడు వారిని సమాధానపరచుచు లక్ష్మణునితో, "ఓ లక్ష్మణా! ఇచ్చట సమీపమున ముద్గలాశ్రమమున సంజీవిని మొదలగు మహౌషధులు ఆ ముని ప్రభావముచే రాజిలుచున్నవి. వేగమే పోయి వాటిని తీసుకుని రమ్ము," అని యాజ్ఞాపించెను. వెంటనే లక్ష్మణుడును రథమునుండి దిగి, ఆశ్రమమునకుపోయి, అచ్చటి వటువులు, "మునులవారు సమాధినిష్ఠనుండి బహిర్ముఖులైన పిదప వారిని యాచించి, తీసుకొని పోవచ్చు," నని నివారింపగా, వచ్చి, ఆ సంగతిని రామసన్నిధిలో తెలియజేసెను. అందుకు రాముడు, "వారి భయము వలదు. త్వరగా వెడలి, శస్త్రములేక యా బ్రహ్మచారులను నిగ్రహించి, మహౌషధులను తీసుకొనిరమ్ము," అని పంపెను. సౌమిత్రి వేగముగా వెళ్ళి, బలవంతముగా ప్రాణాధార మూలికలను తెచ్చెను. శ్రీరాముడు వాటిచే, భరత శత్రుఘ్నులను బ్రతికించి, కైకేయి, దశరథరాజునకును ఆనందమును కలిగించెను. అప్పుడు కైకేయీ దశరథులు శ్రీరామాదులను తమ హృదయాలకు హత్తుకుని యానందించుచు, వశిష్ఠులచే బ్రాహ్మణులతోడ అనేక రక్షాశుభకర్మోత్సవములను చేయించెను. (52)

**ఆనయ త్వం శుభా వల్లీ ర్మా శంకాం చ మునేః కురు ।**
**సోఽపి రామాజ్ఞయా గత్వా నివార్య వటుకాన్ క్షణాత్ ॥ 53**

**బలాత్కారేణ తా వల్లీర్ గృహిత్వా రామమాగతః ।**
**భరతం జీవయామాస విశల్యం కృత్య సానుజమ్ ॥ 54**

తతః సముత్థితం దృష్ట్వా కైకేయీ భరతం ముదా ।
సంతోషం పరమం చక్రే కైకేయీ పితరం తదా ॥ 55

రాఘవం సా సమాలింగ్య భరతం పరిషస్వజే ।
తతో రాజాఽతి సంతుష్టః సమాలింగ్య రఘూత్తమమ్ ॥ 56

హర్షాన్నానోత్సవాంస్తత్ర చకార గురుణా ద్విజైః ।
తతస్తే వటవః సర్వే హాహాకృత్య మునీశ్వరమ్ ॥ 57

వృత్తం నివేదయామాసుః సమాధివిరమే మునేః ।
స ముద్గలోఽపి తచ్ఛ్రుత్వా విస్మయేనాబ్రవీద్వటూన్ ॥ 58

కో లక్ష్మణః కిమర్థం కస్యాజ్ఞయా సోఽహరద్ ద్రుమమ్ ।
విదిత్వా సకలం వృత్తమాగచ్ఛధ్వం తరాన్వితాః ॥ 59

తథేతి తే దశరథం గత్వా ప్రోచుస్త్వరాన్వితాః ।
కస్త్వం కిమర్థమానీతా వల్ల్యో లక్ష్మణహస్తతః ॥ 60

తాన్దృష్ట్వా క్రోధసంయుక్తాన్ రాజా చింతాతురోఽబ్రవీత్ ।
అహం దశరథో వల్ల్యో భరతార్థం సమాజ్ఞయా ॥ 61

ఆనీతా మునయే సర్వే బ్రువధ్వం నతిపూర్వకాః ।
అహమప్యాగమిష్యామి మునిం సాంత్వయితుం జవాత్ ॥ 62

తతస్తే మునయే సర్వం నృపనామాద్యవర్ణయన్ ।
శ్రుత్వా రామస్య పితరమ్ క్రోధం సంహృత్య వేగతః ॥ 63

దర్శనార్థం మతిం చక్రే తావద్దృష్టో నృపః పురః ।
బద్ధ్వా కరసంపుటం తం ప్రణమంతం నృపోత్తమమ్ ॥ 64

ప్రార్థయంతం సముత్థాప్య పూజయామాస సాదరమ్ ।
రామాద్యా నృపపుత్రాశ్చ కౌసల్యాద్యా నృపస్త్రియః ॥ 65

ప్రణమ్యాథ మునిం స్తుత్వా తస్థుర్ముద్గలభార్యయా ।
సుమత్యా పూజితాః సర్వా రాజదారా విశేషతః ॥ 66

**తతో దశరథః ప్రాహ మునిం స్తుత్వా పునః పునః ।**
**మయాఽపరాధితం రాజ్ఞా క్షమ్యతాం తత్త్వయా మునే ॥ 67**

**మునిర్దశరథం ప్రాహ హ్యుపకారో మహాన్ కృతః ।**
**నోచేత్కథం దర్శనం మే ధ్యానస్థస్య సుతస్య తే ॥ 68**

**శ్రీరామస్య ససీతస్య నృవేషస్య హి మాయయా ।**
**ఇతి తస్య వచః శ్రుత్వా దృష్ట్వా తుష్టం మునీశ్వరమ్ ॥ 69**

అచ్చట ఆ ముద్గలముని సమాధినుండి బహిర్ముఖుడై బ్రహ్మచారులనుండి జరిగిన వృత్తాంతమును విని, "ఎవరాలక్ష్మణుడు? ఎందుకు వీటిని హరించెను? శీఘ్రముగా పోయి తెలిసికొనిరండు," అని బ్రహ్మచారులను పంపెను. వారు వచ్చి, దశరథునితో, ఆ సంగతిచెప్పగా, దశరథుడు ఆహా! తపోధనుల క్రోధమునకు చిక్కితిమిగదా యని చింతించుచూ, "మహానుభావులారా! నేను దశరథుడను, భరతుని కొరకు నా యాజ్ఞచే ఓషధులు తేబడినవి, ఈ సంగతిని నా వినతులతోడ మహర్షి సన్నిధికి తెలుపుడు. ఇదిగో వారిని సమాధాన పరచుటకు నేనును వచ్చుచున్నాను," అని చెప్పిపంపెను. ఆ బ్రహ్మచారులు ఇచ్చుటి సర్వవృత్తాంతమును సవిస్తరముగా ముద్గలమునికి విజ్ఞాపించిరి. పిదప ముద్గలుడు శ్రీరామ జనక వృత్తాంతమును తెలుసుకుని, కోపమును వదలి, రామదర్శనమునకు రాదలిచెను. అంతలో దశరథుడు ఎదురువచ్చి, చేతులు ముకుళించి, నమస్కరించి ప్రార్థించుచుండగా, ముద్గలుడు సముచితముగా దశరథరాజును సత్కరించి, అట్లే నమస్కరించుచుండు శ్రీరామాదులందరిని సముచిత మర్యాదలచే అనుగ్రహించెను. ముద్గలపత్నియగు సుమతిచే కౌసల్యాది స్త్రీలు విశేషముగా పూజింపబడిరి. అంత దశరథుడు, "స్వామీ! నేను అపరాధమును జేసితిని క్షమింప వేడుచున్నాను." అని మాటమాటకు భయ భక్తి ప్రణామములచే ముద్గలమునిని ఆరాధించెను. అపుడు ముద్గలుడు, "మహారాజా! నాకు నీవు మహోపకారమును జేసితివి, అట్లుకాకున్న ఈ శ్రీసీతారామ దర్శనము నాకు లభించునా? ఇతడు మాయతోడ మానుషవేషము ధరించిన సాక్షాత్ ఆ మాధవుడే," అను చుండగా, శాంతుడైన దశరథుడు నమస్కారములతో మహర్షిని కొన్నిసంగతులను అడుగుటకు నిశ్చయించుకొనెను. (69)

**ఉవాచ నృపతిర్నత్వా కించిత్ప్రష్టుమనా మునిమ్ ।**
**జ్ఞాత్వా నృపస్య స మునిహృద్గతం ప్రష్టుకాముకమ్ ॥ 70**

**ఏకాంతే తులసీఖండే నీత్వా తం నృపమేవ సః ।**
**పప్రచ్ఛ కిం తే వాంఛాఽస్తి వదస్వ కథ్యతే మయా ॥ 71**

తమబ్రవీద్దశరథః శ్రీరామస్య హి భావి యత్ ।
హితాహితం సవిస్తారం జ్ఞాతుమిచ్ఛే మునీశ్వర ॥ 72

నృపస్య వచనం శ్రుత్వా రాజానం మునిరబ్రవీత్ ।

ముద్గలఉవాచ
సాక్షాన్నారాయణో విష్ణుః సర్వవ్యాపీ జనార్దనః । 73

భూభారహరణార్థాయ తవాపి వరదానతః ।
అవతీర్ణోఽస్తి త్వత్తో హి తవ పుణ్యమహోదయాత్ ॥ 74

అధర్మస్య వినాశం చ వృద్ధిం ధర్మస్య సాదరమ్ ।
నిర్దాళనం హి దుష్టానాం సజ్జనానాం చ పాలనమ్ ॥ 75

కరిష్యతి మహానేష తవ పుత్రో రఘూత్తమః ।
దశవర్షసహస్రాణి దశవర్ష శతానిచ ॥ 76

కరిష్యతి మహద్రాజ్యం గతే త్వయి దివం నృప ।
సప్తద్వీపపతిశ్చాయం భవిష్యతి నృపో మహాన్ ॥ 77

ద్వౌ తౌ భవిష్యతః పుత్రౌ చతస్రశ్చ స్నుషాస్తథా ।
చతుర్వింశతి పౌత్రాశ్చ పౌత్ర్యస్తు ద్వాదశైవ హి ॥ 78

అసంఖ్యాతాః ప్రపౌత్రాద్యా భవిష్యంతి సుతస్య తే ।
కియద్దినైరయం వృందాశాపం భోక్తుం హి దండకే ॥ 79

గమిష్యతి తతః పశ్చాన్మహద్రాజ్యం కరిష్యతి ।
తత్తస్య వచనం శ్రుత్వా నృపః ప్రాహ మునిం పునః ॥ 80

## ముద్గలముని శ్రీరామవృత్తమును దశరథునికి చెప్పుట.

వెంటనే ముద్గలుడు అంతయు దర్శించి, దశరథరాజును ఏకాంత స్థలమునకు పిలిచికొనిపోయి, "దశరథరాజా! నీవు నా ద్వారా ఏయేవిషయాలను తెలిసికొనవలయునను కొనుచున్నావో అడుగుము," అని సాదరముగా అనెను. అందుకు దశరథుడు, "స్వామీ! శ్రీరామునియొక్క భవిష్యత్ వృత్తాంతమును సవివరముగా మీద్వారా తెలిసికోగోరుచున్నాను," అని చెప్పెను. అపుడు ముద్గలముని యిట్లనెను,

"సర్వవ్యాపియైయుండు సాక్షాత్ శ్రీమన్నారాయణుడు నీకు వరమిచ్చినందు చేత, భూభారమును తగ్గించుటకు నీయొక్క మహాపుణ్యోదయమున నీకు జ్యేష్ఠపుత్రుడుగా అవతరించియున్నాడు. ఇతడు లోకమున అధర్మమును అణచి, ధర్మమును రక్షించి, దుష్టులను శిక్షించి, సాధువులను రక్షించి, రఘువంశ శిరోమణియై, నీవు స్వర్గమునకు వెడలిన తరువాత పదునొకండువేల సంవత్సరములు మహారాజ్యపరిపాలనము జేయుచు, రారాజుగా వెలుగొందును. ఇతడు సప్తద్వీపాధిపతియై, చక్రవర్తియై వర్తిల్లుచుండును. ఇతనికి ఇద్దరు కొడుకులును, నలుగురు కోడండ్రును, ఇరువది నాలుగుమంది మనుమలును, పండ్రెండుమంది మనుమరాండ్రును, లెక్కనేనంతమంది ముని మనుమలును పుట్టగలరు. కొన్నిదినములలో ఇతడు వృందా శాపమును అనుభవించుటకై దండకారణ్యమునకు పోవును. అటుమీద మహద్రాజ్యము ననుభవించుచుండును" అని చెప్పిన ముద్గలమహర్షి వాక్యములను వినిన(80).....

**దశరథ ఉవాచ**
**కా వృందా కస్య భార్యా సా కథం శప్తో హరిస్తయా ।**
**తత్సర్వం విస్తరేణైవ కథయస్వ మునీశ్వర ॥ 81**

**ముద్గల ఉవాచ**
**పురా జలంధరేణాసీద్యుద్ధం శ్రీశంకరస్య చ ।**
**వృందాపాతివ్రత్యబలాద్రక్షితం విష్ణునా తదా ॥ 82**

**జ్ఞాత్వా తదర్శితపథా పార్వత్యా ధర్షణాదినా ।**
**జాలంధరం పురం గత్వా తద్దైత్యపుటభేదనమ్ ॥ 83**

**పాతివ్రత్యస్య భంగాయ వృందాయాశ్చాకరోన్మతిమ్ ।**
**అథ వృందారకా దేవీ స్వప్నమధ్యే దదర్శహ ॥ 84**

**భర్తారం మహిషారూఢం తైలాభ్యక్తం దిగంబరమ్ ।**
**దక్షిణాశాగతం ముండం తమసాఽప్యావృతం తదా ॥ 85**

**తతః ప్రబుద్ధా సా బాలా తం స్వప్నం స్వం విచిన్వతీ ।**
**కుత్రాపి నాలభచ్ఛర్మ గోపురాట్టాలభూమిషు ॥ 86**

**తతః సఖీద్వయయుతా నగరోద్యానమాగతా ।**
**వనాద్వనాంతరం యాతా దదర్శాతీవ భీషణౌ ॥ 87**

రాక్షసౌ సింహవన్నాదౌ దంష్ట్రానయనభీషణౌ ।
తౌ దృష్ట్వా నిహ్వాలాఽతీవ పలాయనపరా తదా ॥ 88

దదర్శ తాపసం శాంతం సశిష్యం మౌనమాస్థితమ్ ।
తతస్తత్కంఠమాసజ్య నిజబాహులతాం భయాత్ ॥ 89

మునే మాం రక్ష శరణమాగతామిత్యభాషత ।
తత్తస్యా వచనం శ్రుత్వా ధ్యానం ముక్త్వా స వై మునిః ॥ 90

ఉన్మీల్య నయనే వృందాం హృది దృష్ట్వాఽబ్రవీద్వచః ।
తిష్ఠ త్వం బాలికే హ్యత్ర మా భయం కురు సర్వథా ॥ 91

ఇత్యుక్త్వా పురతో దృష్ట్వా రాక్షసౌ మునిసత్తమః ।
నిర్భర్త్సయంతౌ హుంకారైః క్రోధేన మహతా వృతః ॥ 92

తౌతద్ధుంకారతస్త్రస్తౌ పలాయనపరౌ తదా ।
తత్సామర్థ్యం మునేర్దృష్ట్వా వృందా సా విస్మయావృతా ॥ 93

## వృందాశాపముచేత శ్రీహరికి రామావతారము వచ్చుట.

దశరథమహారాజు మరల ఇట్లు విన్నవించెను, (80) "తాపసోత్తమా! ఆ వృంద ఎవరు? ఆమె ఎవరి యిల్లాలు? ఆమెచే శ్రీహరి యేల శపింపబడెను? ఆ సంగతిని సవివరముగా వివరించి చెప్పవలయును," అని సంప్రార్థించగా, ముద్గలముని యిట్లు చెప్పనారంభించెను. "పూర్వము జలంధరుడు అను రాక్షసునికి శ్రీమత్పరమేశ్వరునితో ఘోర యుద్ధము జరిగెను. అపుడు జలంధరునికి అతని భార్య వృంద అను ఆమె, తన పాతివ్రత్య ప్రభావముచే తన భర్తను రక్షించుచుండెను. అపుడు శ్రీమహావిష్ణువు ఈ విషయము పార్వతివలన తెలిసికొని, మారువేషమున జలంధరపురమునకు వెడలి వృందా పాతివ్రత్యమును భంగము చేయదలచెను. ఆ పిదప ఒకరాత్రి స్వప్నములో ఆ వృందా దేవి 'తన పతి అభ్యంగనము చేసికొని, దిగంబరుడై దున్నపోతునెక్కి పోవుచున్నట్లును, చీకట్లుకమ్మి అతడు బోడితలతో దక్షిణాభిముఖుడైనట్లును' కలగని, తెల్లవారి లేచి, తను దర్శించిన స్వప్నమునే చింతించుచు, మనసు అశాంతి నంది, ఇరువురు చెలికత్తెలతో నగరములోని ఉద్యాన వనమునకు వెళ్లెను. అక్కడి నుండి మరోవనమునకును, అటునుండి మరోవనమునకును తిరిగినను శాంతి పొందలేకపోయెను. ఆ ఉద్యాన వనములో కోరలచే మిక్కిలి భయంకరాకారులైన సింహనాదములు

చేయుచున్న ఘోరరాక్షసులను ఇరువురిని చూచి, భయభ్రాంతయై పరుగెత్తెను. ఇట్లు కొంతదూరముపోగా, నొకచోట ఒక ముని మౌనముగా శాంతుడై, శిష్యులతోడ కూర్చుండియుండు టను జూచి, భయముతో ఆ ముని సన్నిధికి చేరి, నమస్కరించి, "మునీంద్రా! శరణాగతయైన నన్ను రక్షింపుము," అని వేడెను. వేడుచున్న ఆ వృందాదేవి మాటలను వినిన ఆ ముని ధ్యానమును వదలి బహిర్ముఖుడై, కండ్లు తెరచి,

ప్రణమ్య దండవద్భూమౌ మునిం వచనమబ్రవీత్ ।
వృందోవాచ
రక్షితాఽద్య త్వయా ఘోరాత్ భయాదస్మాత్కృపానిధే ॥ **94**

కించిద్విజ్ఞప్తు మిచ్ఛామి కృపయా తద్వదస్వ మామ్ ।
జలంధరో హి మే భర్తా రుద్రం యోద్ధుం గతః ప్రభో ॥ **95**

స తత్రాస్తే కథం యుద్ధే తన్మే కథయ సువ్రత ।
మునిస్తద్వాక్యమాకర్ణ్య కృపయోర్ధ్వమవైక్షత ॥ **96**

తావత్కపీ సమాయాతౌ తం ప్రణమ్యాగ్రతః స్థితౌ ।
తతస్తత్ భ్రూమలతాసంజ్ఞా ప్రత్యుక్తౌ గగనాంతరాన్ ॥ **97**

గత్వా క్షణార్ధదాగత్య వానరావగ్రతః స్థితౌ ।
శిరః కబంధహస్తౌ చ దృష్ట్వోఽబ్ధితనయస్య సా ॥ **98**

పపాత మూర్ఛితా భూమౌ భర్తృవ్యసనదుఃఖితా ।
కమండలుజలైస్సిక్తా మునినాఽఽశ్వాసితా తదా ॥ **99**

రుదిత్వా సుచిరం వృందా తం మునిం వాక్యమబ్రవీత్ ।
వృందోవాచ
కృపానిధే మునిశ్రేష్ఠ జీవయైనం మునే ప్రియమ్ ॥ **100**

త్వమేవాస్య పునః శక్తో జీవనాయ మతో మమ ।

మునిరువాచ
నాయం జీవయితుం శక్యో రుద్రేణ నిహతో యుధి ॥ **101**

తథాపి త్వత్కృపావిష్టః పునః సంజీవయామ్యహమ్ ।
ఇత్యుక్త్వాంతర్దధే యావత్ తావత్సాగరనందనః ॥ **102**

వృందామాలింగ్య తద్వక్త్రం చుచుంబప్రీతమానసః ।
అథ వృందాఽపి భర్తారం దృష్ట్వా హర్షితమానసా ॥ 103

రేమే తద్వనమధ్యస్థా తద్యుక్తా బహువాసరమ్ ।
కదాచిత్సురతస్యాంతే దృష్ట్వా విష్ణుం తమేవ హి ॥ 104

నిర్భర్త్స్య క్రోధసంయుక్తా వృందా వచనమబ్రవీత్ ।
వృందోవాచ
తవ జ్ఞాతం హరే శీలం పరదారాభిగామినః । 105

త్వం జ్ఞాతోఽసి మయా సమ్యక్ మయాప్రత్యక్షతాపసః ।
యౌ త్వయా మాయయా ద్వౌ తౌ స్వకీయౌ దర్శితౌ మమ ॥ 106

తావేవ రాక్షసౌ భూత్వా తవ భార్యాం వినేష్యతః ।
జయవిజయనామానౌ జ్ఞాతౌ కృత్రిమరూపిణౌ ॥ 107

తన యెదమీదనున్న వృందనుజూచి, "ఓ అమ్మాయీ! భయపడవలదు," అని చెప్పి యెదుటనున్న రాక్షసులను చూచి క్రుద్ధుడై, హుమ్మని ధిక్కరించెను. అపుడు వారు ఆ హుంకార మాత్రమునకు వెరచి, వెనుకకు పరుగెత్తిరి. మునిపుంగవుని యిట్టి సామర్థ్యమునుజూచి, యాశ్చర్య పరవశమైన వృంద ఆ మునికి నమస్కరించి, "తాపసోత్తమా! దయానిధియగు నీవు నన్నిపుడు మహాభీతినుండి కాపాడితివి. నేనొకసంగతిని విన్నవించెదను, కరుణించి ఆ సంగతిని నాకు చెప్పవలయు. అదియేమనిన, జలంధరుడు నాభర్త. ప్రస్తుతము ఆయన రుద్రునితో యుద్ధమునకు పోయెను. అతడిప్పుడెట్లున్నాడు?" అని సవినయముగా ప్రార్థించెను. అందుకు ముని దయతో అంతరిక్షమును చూచుచు, ఆ వేళకు గగనమున వచ్చినిలచి, నమస్కరించుచున్న ఇద్దరు వానరులను చూచి, కనుబొమ్మలచే సంజ్ఞజేసి పంపెను. ఆ ఇరువురు వానరులు క్షణకాలమున పోయి జలంధరుని మృతదేహమును తీసుకువచ్చిరి. సముద్రసుతుడగు తన భర్త శవమును జూచి, పతివియోగ దుఃఖితయై వృంద నేలపైబడి, మూర్ఛనొందెను. అపుడు మునివర్యుడు తన చేతిలోని కమండలములోని జలమును ఆమెపై జల్లి, ఓదార్చెను. ఆమె ఎంతో దుఃఖించుచు మునితో, "కృపాళువైన మహానుభావా! మునిప్రియుడగు నా భర్తను బ్రతికింపుము. నీవే యితని బ్రతికించుటకు శక్తుడవని నమ్ముచున్నాను," అని వేడుకొనెను. అందుకు ముని, "రుద్రునిచేత చచ్చిన యితనిని బ్రతికించుటకు వీలుపడదు. అయినా నీ మీద దయతో నేను ఇతనిని మరల బ్రతికించెదను,"

త్వం చాపి భార్యాదుఃఖార్తో వనే కపిసహాయవాన్ ।
భవ సర్వేశ్వరోఽపి త్వం యత్తే శిష్యౌ సమాగతౌ ॥ 108

పుణ్యశీలసుశీలౌ తౌ కపిరూపధరావుభౌ ।
అతస్తే వానరైరస్తు సంగతిర్దండకే వనే ॥ 109

వటురూపధరః శిష్యో యస్తార్క్ష్యశ్చేతి వేద్మ్యహమ్ ।
ఇత్యుక్త్వా సా తదా వృందా ప్రవివేశ హుతాశనమ్ ॥ 110

తతో జలంధరో దైత్యో నిహతో యుధి శంభునా ।
తస్మాద్రాజన్నిదానీం తౌ కుంభకర్ణదశాననౌ ॥ 111

జాతౌ సాగరమధ్యే తౌ లంకాయామధునా స్థితౌ ।
నీత్వా జనకజాం బాలాం పంచవట్యాస్తు మాతృవత్ ॥ 112

పాలయిత్వాఽథ షణ్మాసాన్ రామబాణాన్మరిష్యతి ।
రామోఽపి వాలినం హత్వా సుగ్రీవేణ సమన్వితః ॥ 113

శిలాభిః సాగరం బద్ధ్వా సీతామాదాయ యాస్యతి ।
యాత్రాయజ్ఞవిలాసాంశ్చ సప్తద్వీపప్రరక్షణమ్ ॥ 114

కరిష్యతి దయితయా బంధుభిశ్చ యథాసుఖమ్ ।
ఇదం గోప్యం త్వయా రాజన్ కథనీయం న కుత్రచిత్ ॥ 115

శ్రీశివ ఉవాచ

ఇత్యుక్త్వా ముద్గలః సర్వం భావి రామస్య కౌతుకాత్ ।
చరిత్రం వర్ణయామాస యదా యద్యత్కరిష్యతి ॥ 116

తత్సర్వం నృపతిః శ్రుత్వా తుష్టః పప్రచ్ఛ తం పునః ।
పూర్వజన్మని కశ్చాహం కిం మయా సుకృతం కృతమ్ ॥ 117

తత్సర్వం వద మాం బ్రహ్మన్ యస్మాజ్జాతో హరిః సుతః ।
మమ సాక్షాద్రామచంద్రో లక్ష్మీః సీతా త్వభూత్ స్నుషా ॥ 118

ఇతి తస్య వచః శ్రుత్వా నృపమాహ పునర్మునిః ।

ముద్గలఉవాచ

ఆసీత్సహ్యాద్రివిషయే కరవీరపురే పురా ॥ 119

బ్రాహ్మణో ధర్మనిత్యశ్చిత్ ధర్మదత్త ఇతి శ్రుతః ।
విష్ణువ్రతకరః సమ్యక్ విష్ణుపూజారతః సదా ॥ 120

ద్వాదశాక్షరవిద్యాయాం జపనిష్ఠోఽతిథిప్రియః ।
కదాచిత్కార్తికే మాసి హరిజాగరణాయ సః ॥ 121

రాత్ర్యాం తుర్యావశేషాయాం జగామ హరిమందిరమ్ ।
హరిపూజోపకరణాన్ ప్రగృహ్య వ్రజతా తదా ॥ 122

అనుచు అంతర్ధానము నొందెను. అంతలో జలంధరుడును, వృందను ఒకరినొకరు హత్తుకొని, ఒకరి ముఖమును మరియొకరు చూడగా సంప్రీతుడాయెను. పిదప వృందాదేవి భర్తను జూచి మహానందమునొంది, ఆ వనమున అతనితో చాలా సంవత్సరములు ఆనందించుచుండెను. ఇట్లుండగా, ఒకసారి అది దేవ మాయయని గ్రహించిన వృంద అతనిని తన భర్తరూపములో ఉన్న శ్రీవిష్ణుమూర్తిగా గ్రహించి, కోపావిష్టయై, ధిక్కార పూర్వకముగా, "ఛీ, ఛీ, హరీ! ఇతరుల భార్యల శీలమును హరించిన నీ శీలము ఎందుకు? నీవు మాయావియైన ప్రత్యక్ష తాపసుడవని నేను చక్కగా తెలుసుకొంటిని. వానర రూపమున యున్న ఆ ఇద్దరు రాక్షసులు నీ మాయచే, ఏ విధముగా నీవారుగా వచ్చిరో, వారే నీ భార్యను అపహరించెదరు, జయ విజయులనువారే యీ కృత్రిమ రూపమును దాల్చిరి. నీవు సర్వేశ్వరుడైనను, వనమున కపిసహాయముగలవాడవై పత్నీదుఃఖము అనుభవించెదవు. పుణ్యశీల, సుశీలురను వారిరువురు నీకు శిష్యులై, కపిరూపములనొంది యున్నందున దండకావనమున వానరులతో వసించెదవు. వటువేషమున నీవద్దనున్న శిష్యుడు గరుడుడని నాకు తెలియును," అని చెప్పి వృంద అగ్నిలో ప్రవేశించెను. అందువలన యుద్ధమందు రుద్రునిచే జలంధరుడు చంపబడెను. ఓయీ దశరథుడా! కాబట్టి వారిద్దరు ఇప్పుడు రావణ, కుంభకర్ణులుగా పుట్టి సముద్రమధ్యమున లంకలో ఉన్నారు. వారు పంచవటిలోనుండి సీతాదేవిని అపహరించుకొనిపోయి, తల్లివలే కాపాడి, ఆరుమాసములయిన తరువాత రామబాణముచే మరణించెదరు. శ్రీరాముడు వాలిని జంపి, సుగ్రీవునితో కలసి, శిలలచే సముద్రమును బంధించి, సీతను తెచ్చుకొనును.

తేన దృష్టా సమాయాతా రాక్షసీ భీమనిఃస్వనా ।
వక్రదంష్ట్రా లలజ్జిహ్వా వినగ్నా రక్తలోచనా ॥ 123

దిగంబరా శుష్కమాంసా బింబోష్ఠీ ఘర్ఘరస్వనా ।
తాం దృష్ట్వా భయసంత్రస్తః కంపితావయవస్తదా ॥ 124

పూజోపకరణైః సర్వైః పయోభిశ్చాహనద్బలాత్ ।
సంస్మృత్య యద్ధరేర్నామ తులసీయుక్తవారిణా ॥ 125

సోఽహనద్వారిణా తస్మాత్ తత్పాపం లయమాగతమ్ ।
అథ సంస్మృత్య సా పూర్వజన్మకర్మవిపాకజామ్ ॥ 126

స్వాం దశామబ్రవీద్విప్రం దండవచ్చ ప్రణమ్య సా ।
కలహోవాచ
పూర్వకర్మవిపాకేన దశామేతాం గతాఽస్మ్యహమ్ ॥ 127

తత్కథం తు పునర్విప్ర యామ్యహం గతిముత్తమామ్ ।
ముద్గలఉవాచ
తాం దృష్ట్వా ప్రణతామార్తాం వదమానాం స్వకర్మ చ ॥ 128

అతీవ విస్మితో విప్ర స్తదా వచనమబ్రవీత్ ।
ధర్మదత్త ఉవాచ
కేన కర్మవిపాకేన త్వం దశామీదృశీం గతా ॥ 129

కుతః ప్రాప్తా చ కింశీలా తత్సర్వం విస్తరాద్వద ।
కలహోవాచ
సౌరాష్ట్రనగరే బ్రహ్మన్ భిక్షునామాఽభవద్ద్విజః ॥ 130

తస్యాహం గృహిణీ బ్రహ్మన్ కలహాఖ్యాఽతినిష్ఠురా ।
న కదాచిన్మయా భర్తుర్వచఽసాపి శుభం కృతమ్ ॥ 131

నార్పితం తస్య మృష్టాన్నం భర్తుర్వచనభంగయా ।
పాకకాలే మయా నిత్యం యద్యచ్చాన్నం మనోరమమ్ ॥ 132

తత్తత్పూర్వం స్వయం భుక్త్వా పశ్చాద్భర్త్రే నివేదితమ్ ।
ఏకదా స పతిర్మిత్రం మమ వృత్తం న్యవేదయత్ ॥ 133

నైవ శ్రుణోతి మే పత్నీ మద్వాక్యం కిం కరోమ్యహమ్ ।
తేన శ్రుత్వా తు సకలం క్షణం సంచిత్య వై హృది ॥ 134

**ఉవాచ మత్పతిం కించిద్యుక్తం తాం వై వదామ్యహమ్ ।**
**నిషేధోక్త్వా వదస్య త్వం గృహిణీ సా కరిష్యతి ॥** **135**

**తవ వాక్యేన కార్యాది యత్కించిత్తవ వాంఛితమ్ ।**
**తథేతి మిత్రవాక్యేన గృహమేత్య పతిర్మమ ॥** **136**

**మామాహ దయితే మా త్వం భోజనార్థం సమాహ్వాయ ।**
**మమ మిత్రం మహద్దుష్టం తత్ శ్రుత్వా స్వపతేర్వచః ॥** **137**

తీర్థయాత్రలను, యజ్ఞక్రియలను, ద్వీప ప్రదక్షిణమును, ప్రియురాలితోడ, బంధువులతోడ యథాసుఖముగా చేయగలడు. ఇది రహస్యమైన సంగతి ఎచ్చటను చెప్పవలదు.”

ఓ పార్వతీ! ఇట్లు ముద్గలముని శ్రీరాముని యొక్క భవిష్యత్ వృత్తాంతమును ఎప్పుడెప్పుడు, ఎట్లెట్లు జరుగునో ఆ సంగతులనన్నింటిని వర్ణించి చెప్పెను. వాటిని విని దశరథుడు సంతసమునొంది, “మహానుభావా! పూర్వజన్మమున నేనెవడు? నేనేమి పుణ్యముజేసితిని? ఎందువలన శ్రీహరి నాకొడుకు శ్రీరాముడుగా అవతరించెను? లక్ష్మియగు సీత నా కోడలెట్లయినది,” అని ప్రశ్నించెను. అందుకు ముద్గలుడు ఇట్లు చెప్పుచున్నాడు.

## కైకేయి యొక్క జన్మాంతర కలహాఖ్యానము.

“మునుపు సహ్యాద్రి దేశమున కరవీరపురమునందు ధర్మాత్ముడు, జ్ఞానియైన ‘ధర్మదత్తు’ డను ఒక బ్రాహ్మణుడు ఉండెను. అతడు నిష్ఠగా శ్రీమన్నారాయణ పూజా పరాయణుడై విష్ణువ్రతమును ఆచరించుచుండెను. ఆ ధర్మదత్తుడు వాసుదేవ ద్వాదశాక్షర మంత్ర జప పరాయణుడు. అతిథి ప్రియుడు. ఆ విప్రుడు ఒకానొక కార్తీకమాసమున హరిజాగరణము కొరకు సాయంకాలవేళ శ్రీవిష్ణు దేవాలయమునకు పూజోపకరణములను తీసికొనిపోవుచుండెను. దారిలో వ్రేలాడు నాలుకయును, కోరలు గల దంతములును, శుష్కించిన అంగములును, రక్తము ఓడుతూ, భయంకర ధ్వని కలిగి దిగంబరయైన రాక్షసియొకతె కనబడెను. ధర్మదత్తుడు దానినిజూచి, భయమునొంది, వణకుచు పూజాసామాగ్రిని, అభిషేక జలమును క్రింద పారవేసెను.

**తదా భర్తా మయోక్తః స మిత్రం తే సాధుసత్తమమ్ ।**
**సమాహ్వాయామ్యశనార్థమ ద్యైవ బ్రాహ్మణోత్తమమ్ ॥** **138**

**తతో మయా సమాహూతః స్వయం గత్వా పతేః సఖా ।**
**తదారభ్య నిషేధోక్త్యా కార్యమాజ్ఞాపయత్పతిః ॥** **139**

ఏకదా స పితుర్దృష్ట్వా క్షయాహ్వాః స్వపతిర్మమ ।
మామాహ దయితే శ్రాద్ధం న కరిష్యామ్యహం పితుః ॥ 140

తద్వాక్యం స్వపతేః శ్రుత్వా మయా విప్రా నిమంత్రితాః ।
మయా ధిక్ ధిక్ కృతో భర్తా కథం శ్రాద్ధం కరోషి నః ॥ 141

పుత్ర ధర్మం న జానాసి కా గతిస్తే భవిష్యతి ।
తతః పునః స మామాహ పక్వాన్నమద్య మా కురు ॥ 142

ద్విజం నిమంత్రయస్త్వేకం మా విస్తారం కురు ప్రియే ।
తత్తస్య వచనం శ్రుత్వా మయాఽష్టాదశ భూసురాః ॥ 143

నిమంత్రితాస్తు శ్రాద్ధార్థం పక్వాన్నాని కృతాని హి ।
తతః పునః స మామాహ ప్రియ శ్రుణు వచో మమ ॥ 144

మయా సహాదౌ త్వం మిష్టం పాకం భుక్త్వా తతః పరమ్ ।
స్వీయోచ్ఛిష్టం త్వద్య విప్రాన్ పరివేషణమాచర ॥ 145

తన్మయా వచనం శ్రుత్వా స పతిర్ధిక్కృతః పునః ।
కథమాదౌ స్వయం భుక్త్వా పశ్చాద్విప్రాన్ సమర్పయేత్ ॥ 146

ఏవం సర్వం నిషేధోక్త్యా శ్రాద్ధం సాంగం చకార సః ।
పిండదానాదికం కృత్వా మామాహ స పతిః పునః ॥ 147

అహంచోపోషణం త్వద్య కరిష్యామి న సంశయః ।
తత్తస్య వచనం శ్రుత్వా మిష్టాన్నేన స భోజితః ॥ 148

తతో దైవవశాద్భర్తా విస్మృత్యా ప్రాహ మాం పునః ।
నీత్వా పిండాన్ క్షిపస్వాద్య సత్తీర్థే పరమాదరాత్ ॥ 149

తతో మయా శౌచకూపే నీత్వా పిండా విసర్జితాః ।
తతః ఖిన్నమనా విప్రో హాహేత్యుక్త్వా స్థిరోఽభవత్ ॥ 150

క్షణం విచింత్య మామాహ పిండాన్మా త్వం బహిః కురు ।
తదోత్తీర్య శౌచకూపే మయా పిండా బహిః కృతాః ॥ 151

హరినామమును ఉచ్చరించుచు, తులసీ జలముచే కొట్టబడినందున ఆ రాక్షసియొక్క పాపము నశించెను. పిదప ఆ రక్కసి తన జన్మాంతర సంస్కారవశమున గల్గిన దుర్దశను స్మరించుచు, ఆ మునికి దండప్రణామమాచరించి, "బ్రాహ్మణోత్తముడా! జన్మాంతర కర్మదోషమువలన నేనీ దుర్దశనొందితిని. నేనెట్లు మరల సద్గతినొందుదును?" అని వేడెను. ఆర్తితో పలికిన ఆ మాటలచే ఎంతో ఆశ్చర్యమొందిన ధర్మదత్తుడు, "ఎట్టి కర్మవలన నీకీ దుస్థితి వచ్చినది? ఆ సంగతిని వివరముగా చెప్పుము," అనగా, ఆ రాక్షసి యిట్లనెను, "విప్రోత్తమా! మా సౌరాష్ట్రదేశమునందు భిక్షు డను బ్రాహ్మణుడుండెను. నేను అతని యిల్లాలిని, నా పేరు 'కలహ' . నేను మిక్కిలి నిష్ఠుర స్వభావము గలదానను. నా భర్తకు ఎన్నడూ మంచిమాటలు చెప్పలేదు. ఒకనాడును మంచిభోజనము వండి పెట్టలేదు. పతిమాటను ధిక్కరించుచుంటిని. వంటజేయునపుడు యేమేమి మంచి వస్తువులుండునో వాటినన్నింటిని మొదట నేను తిని, పిదప నా భర్తకు వడ్డించుచుంటిని. ఇట్లుండ ఒకనాడు నా పతి తన మిత్రునితో, "నా యిల్లాలు నామాట వినుటలేదు, నేనేమి చేయవలయును?" అని నా సంగతి చెప్పికొనెను. అతడు అంతయును విని, కొంతసేపు ఆలోచించి, నా భర్తతో, "మిత్రమా! నేనొకయుక్తిని చెప్పెదను అట్లుచేయుము, ఏమనిన నీకు ఇష్టములేనిదానిని ఇష్టముగాను, ఇష్టమయినదానిని అయిష్టముగాను; చేయవలసిన దానిని చేయవద్దనియు, చేయకూడనిదానిని చేయుమనియు ఇట్లు వ్యతిరేక ధోరణిమాటలాడిన నీ కార్యము చక్కబడును," అని యుక్తి నుపదేశించెను.

**తతః పునః స మామాహ పిండాన్ తీర్థే క్షిపస్వ మా ।**
**తదా తీర్థే మయా క్షిప్తాః తేపిండాః పరమాదరాత్ ॥ 152**

**ఏవం మయా కదా భర్తుర్వచనం న కృతం తదా ।**
**కలహప్రియాయా నిత్యం మయ్యుద్విగ్నమనా యదా ॥ 153**

**పరిణేతుం తతోఽన్యాం వై మనశ్చక్రే పతిర్మమ ।**
**తతో గరం సమాదాయ ప్రాణస్త్యక్తో మయా ద్విజ ॥ 154**

**అథ బధ్వా వధ్యమానాం మాం నిస్యుర్యమకింకరాః ।**
**యమశ్చ మాం తదా దృష్ట్వా చిత్రగుప్తమపృచ్ఛత ॥ 155**

**యమ ఉవాచ**

**అనయా కిం కృతం కర్మ ఫలం శుభమథాశుభమ్ ।**
**ప్రాప్నోత్యేషా చ తత్కర్మ చిత్రగుప్తావలోకయ ॥ 156**

కలహోవాచ

చిత్రగుప్తస్తదా వాక్యం భర్త్సయన్మాముువాచ హ ।

చిత్రగుప్త ఉవాచ

అనయా తు శుభం కర్మ కృతం కించిన్న విద్యతే ॥ 157

మిష్టాన్నం భుజ్యమానేయం న భర్తరి తదర్పితమ్ ।

అతశ్చ వల్గునీయోన్యాం స్వవిష్ఠాదాఽత్ర తిష్ఠతు ॥ 158

పతిం ద్వేష్టి సదా త్వేషా నిత్యం కలహకారిణీ ।

విష్ఠాదా సూకరీయేన్యాం తస్మాత్తిష్ఠత్వియం యమ ॥ 159

పాకభాండే సదా భుంక్తే గుప్తం చైకా యతస్తతః ।

తస్మాద్దోషాద్బిడాలాఽస్తు స్వజాతాపత్యభక్షిణీ ॥ 160

భర్తారమపి చోద్దిశ్య హ్యాత్మఘాతః కృతోఽనయా ।

తస్మాత్ ప్రేతశరీరేఽపి తిష్ఠత్వేకాఽతినిందితా ॥ 161

అతశ్చైషా మరుదేశే ప్రాపితవ్యా హరేర్భటైః ।

తత్ర ప్రేతశరీరస్థా చిరం తిష్ఠత్వియం తతః ॥ 162

ఊర్ధ్వం యోనిత్రయం చైషా భునక్త్వశుభకారిణీ ।

కలహోవాచ

తతో దూతైః ప్రాపితాఽహం మరుదేశం క్షణాద్ద్విజ ॥ 163

దత్వా ప్రేతశరీరం మాం గతాస్తే స్వస్థలం ప్రతి ।

సాఽహం పంచదశాబ్దాని ప్రేతదేహే స్థితా కిల ॥ 164

క్షుత్తృడ్భ్యాం పీడితాఽత్యర్థదుఃఖితా స్వేన కర్మణా ।

తతః క్షుత్పీడితా నిత్యం శరీర వణిజస్యహమ్ ॥ 165

ప్రవిశ్య దక్షిణే ప్రాప్తా కృష్ణావేణ్యాస్తు సంగమే ।

తత్తీరం సంశ్రితా యావత్తావత్తస్య శరీరతః ॥ 166

నాభర్త అట్లేయని ఇంటికి వచ్చి, ప్రియురాలా! “నేడు మహాదుష్టుడైన నా మిత్రుని భోజనమునకు పిలువవలదు,” అని నాతో చెప్పెను. అందుకు నేను, “అతడు చాలామంచివాడు గనుక ఎందుకు పిలువకూడదు? నేడే పిలచెదను” అని తీసుకొనివచ్చి, మంచి భోజనమును పెట్టితిని. అది మొదలు నా భర్త వ్యతిరేకపు మాటలతోనే కాలము గడుపుచుండెను. ఇలా జరుగు చుండగా మా మామగారి తద్దినము రాగా, నా పతి నాతో, “నేడు నాతండ్రి శ్రాద్ధము చేయన”నెను. వెంటనే నేను విప్రులను నిమంత్రించి, ఛీ, ఛీ, ఎట్లు శ్రాద్ధము చేయవు? పుత్రధర్మము తెలియదా? చేయకపోయిన నీకేమి గతి పట్టును? అని తిరస్కరించితిని. అందుకు, “అయితే పక్వాన్నములను వండవలదు, ఒక బ్రాహ్మణునే చెప్పుము, విస్తారము చేయకుము,” అనిన పతిమాటకు ప్రతికూలముగా 18మంది విప్రులను చెప్పితిని. పక్వాన్నములను వండితిని. అందుకు మరల నా భర్త నాతో, “ఓసీ! నామాట వినుము, మన మిరువురము వండినదానిని మొదట తిని మిగిలిదానిని బ్రాహ్మణులకు పెట్టుదము,” అనెను. అది విని భర్తను ధిక్కరించుచు, శ్రద్ధతో శ్రాద్ధపాకమొనరించి, బ్రాహ్మణులకు పెట్టితిని. ఇట్లు సర్వనిషేధోక్తులతో శ్రాద్ధమును సాంగముగా నెరవేర్చి, పిండాదికము నాచరించి, కడపట నేనుపవాసము చేసెదననెను. నేను ఎంతమాత్రము సరిపడదని మృష్టాన్నమును పెట్టి, భోజనము చేయించితిని. అటుమీద దైవవశమున నాభర్త మరచి, ఎంతో ఆదరముతో “ఈ పిండములను మహాతీర్థమున విడిచిరమ్ము,” అనెను.

**శివవిష్ణుగణైర్ఘోరమపాకృశ బలాదహమ్ ।**
**తతః క్షుత్క్షామయా దృష్టో భ్రమంత్యా త్వం మయా ద్విజ ॥ 167**

**త్వద్ధస్తతులసీవారిసంస్పర్శగతపాతకా ।**
**తత్కృపాం కురు విప్రేంద్ర కథం ముక్తా భవామ్యహమ్ ॥ 168**

**యోనిత్రయాదగ్రభావ్యాత్ అస్మాచ్చ ప్రేతభావతః ।**
**మాముద్ధర మునిశ్రేష్ఠ త్వామహం శరణం గతా ॥ 169**

**ఇత్థం నిశమ్య కలహావచనం ద్విజశ్చ**
**తత్పాపకమభయవిస్మయదుఃఖయుక్తః ।**
**తత్గ్లానిదర్శనకృపాచలచిత్తవృత్తిః**
**ధ్యాత్వా చిరం సువచనం నిజగాద దుఃఖాత్ ॥ 170**

**ఇతి శ్రీశతకోటిరామచరితాంతర్గతే, శ్రీమదానందరామాయణే, వాల్మీకీయే, ఆదికావ్యే, సారకాండే, వృందాశాప కలహాఖ్యానం నామ, చతుర్థః సర్గః ॥**

అంత నేను ఆ పిండములను పాడుపడ్డబావిలో పారవైచితిని. అప్పుడు నా భర్త హాహాకారములు చేయుచు ఎంతో బాధపడి నాతో, "ఆ పిండములను బయటకు తీయవలదు," అనెను. నేను ఆ పాడుపడ్డ నూతిలో దిగి యెత్తి, కడిగితిని. మరల నా భర్త, "వీటిని తీర్థమున వేయవలదు," అనడముతో నేను ఆ పిండములను తీర్థమునందు సమర్పించితిని. ఇట్లు నేనెల్లప్పుడును కలహప్రియయై యున్నందున నా భర్త విసిగి వేసారి వేరేపెండ్లిచేసికొనుటకు పూనెను. అంత నేను విషము మ్రింగి, ప్రాణములను విడిచితిని. యమకింకరులు వచ్చి నన్ను యమునివద్దకు తీసుకొనిపోయిరి. అచ్చట యముడు, "ఇది ఏమి శుభాశుభకర్మములను చేసినది? చూడు,"మని చిత్రగుప్తుని ఆజ్ఞాపించెను. అందుకు చిత్రగుప్తుడు నన్ను నిందించుచూ, "ఇది చేసిన శుభకర్మయొక్కటియును లేదు. తాను మంచిభోజనము తిని, భర్తకు దుష్ట భోజనము పెట్టినందున, వల్గునీ గర్భమున తన మలమును తానే తిననీ, వంటగదిలో రహస్యముగా తిండి తిన్నందున పిల్లియై తన బిడ్డలను తాను తినవలయును. పతినుద్దేశించి, ఆత్మహత్య చేసికొనినందున అత్యంత నింద్యమగు ప్రేతశరీరము పొందదగినది. అందువలన ఎడారి దేశమున పంపదగినది. అచ్చట ప్రేతశరీరమున చిరకాలముండనీ. అటుమీద తక్కిన మూడుజన్మముల ననుభవించుగాక," అని చెప్పినందుచేత, ఈ మరుభూమికి దూతలు నన్ను తీసికొనివచ్చి, ప్రేతదేహమునిచ్చి తమతావులకు వెడలిరి. ఆ నేను 15 సంవత్సరములు ప్రేతదేహ వాసినిగా ఉన్నాను. దప్పికచేతను, ఆకలిచేతను పీడింపబడినదాననై, ఆ దుష్కర్మచే దుఃఖించుచు, ఆకలి నోర్వలేక ఒక వ్యాపారి శరీరమున ప్రవేశించి, దక్షిణదేశమున 'కృష్ణా' 'వేణీ' సంగమ ప్రదేశమందుండి, అచ్చట శివ, విష్ణు గణములనుండి తరమబడి, ఆకలిచే కృశించుచు, తిరుగుచూ వచ్చి నిన్ను చూచితిని. నీ చేతి తులసీజలమువలన పాపములు పరిహరించిపోయినవి. కాబట్టి, ఓ విప్రోత్తమా! నేనెట్లు ముక్తురాలగుదును? ముందనుభవింపదగిన మూడు గర్భముల దుఃఖమును, ప్రేతదుఃఖమును ఎట్లు తొలగించు కొనెదను? నిన్నే శరణాగతయై నమ్మితిని నన్ను అనుగ్రహింపుము." అని యిట్లు ప్రార్థించగా ధర్మదత్తుడు ఆ మాటలను విని, వాని పాపకర్మలచే భయాశ్చర్య దుఃఖములను పొంది, కరుణతో, బాధపడి, కొంతసేపు ధ్యానించి, మంచిమనసుతో చల్లని మాటల నిట్లనెను.

***శతకోటిప్రవిస్తరమైన రామకథలో, శ్రీమద్వాల్మీకిమహర్షిచే రచింపబడిన, ఆనందరామాయణంలోని, సారకాండలో, వృందాశాప కలహోఖ్యానమనే నాలుగవ సర్గ ముగిసినది.***



# పంచమః సర్గః-5వ సర్గ

## కార్తీకమాస శ్రీవిష్ణువ్రత మహిమ, శ్రీరాముని దినచర్య

ధర్మదత్త ఉవాచ

విలయం యాంతి పాపాని తీర్థదానవ్రతాదిభిః ।
ప్రేతదేహే స్థితాయాస్తే తేషు నైవాధికారితా ॥ 1

త్వత్గ్లానిదర్శనాదస్మాత్ ఖిన్నం చ మమ మానసమ్ ।
నైవ నిర్వృతిమాయాతి త్వామనుద్ధృత్య దుఃఖితామ్ ॥ 2

పాతకం చ తవాత్యుగ్రం యోనిత్రయవిపాకజమ్ ।
నైవాల్పైః క్షీయతే పుణ్యైః ప్రేతత్వం చాతిగర్హితమ్ ॥ 3

తస్మాదాజన్మజనితం యన్మయా కార్తికవ్రతమ్ ।
తత్పుణ్యసార్ధభాగేన సద్గతిత్వమవాప్నుహి ॥ 4

కార్తికవ్రతపుణ్యేన న సామ్యం యాంతి సర్వథా ।
యజ్ఞదానాని తీర్థాని వ్రతాన్యపి తతో ధ్రువమ్ ॥ 5

ముద్గల ఉవాచ

ఇత్యుక్త్వా ధర్మదత్తోఽసౌ యావత్తామభ్యషేచయత్ ।
తులసీమిశ్రతోయేన శ్రావయన్ ద్వాదశాక్షరమ్ ॥ 6

తావత్ప్రేతత్వనిర్ముక్తా జ్వలదగ్నిశిఖోపమా ।
దివ్యరూపధరా జాతా లావణ్యేన యథోర్వశీ ॥ 7

తతః సా దండవత్ భూమౌ ప్రణనామ యదా ద్విజమ్ ।
ఉవాచ సా తదా వాక్యం హర్షగద్గదభాషిణీ ॥ 8

కలహోవాచ

త్వత్ప్రసాదాద్ద్విజశ్రేష్ఠ విముక్తా నిరయాదహమ్ ।
పాపాబ్ధౌ మజ్జమానాయాః త్వం నౌభూతోఽసి మే ధ్రువమ్ ॥ 9

ముద్గల ఉవాచ
ఇత్థం సా వదతీ విప్రం దదర్శాయాంతమంబరాత్ ।
విమానం సుందరం యుక్తం విష్ణురూపధరైర్గణైః ॥ 10

అథ సా తద్విమానస్థైః విమానే చాధిరోపితా ।
పుణ్యశీలసుశీలాద్యైః అప్సరోగణసేవితా ॥ 11

ధర్మదత్తుడు చెప్పుచున్నాడు, "తీర్థాటనముచేతను, దాన ధర్మములచేతను, వ్రతాచరణముల చేతను, తపస్సుచేతను, పాపములు హరించుచున్నవి. ప్రేతదేహమును అవలంబించిన నీకు వాటిని చేయుటకు అధికారము లేదు. నీకష్టమును జూచి నా మనస్సు నొచ్చుకొనుచున్నది. దుఃఖిస్తున్న నిన్ను విడనాడితే సంతోషము కలుగదు. నీయొక్క మూడుజన్మలలో అనుభవమునకు వచ్చు పాపము చాలా భయంకరమైనది. నింద్యమైన నీ పిశాచత్వము అల్పపుణ్యములతో తొలగదు. కాబట్టి నేను పుట్టినది మొదలుకొని ఆచరించుచు వచ్చిన కార్తీక వ్రతముయొక్క మహాపుణ్యములో అర్ధభాగముచేత నీకు ఉత్తమగతులు కలుగుగాక. యజ్ఞ, దాన, వ్రతాదులేవీ కార్తీక వ్రతపుణ్యమునకు సాటిరాజాలవు," అని చెప్పి, ధర్మదత్తుడు ఆ కలహకు తులసీ జలముచే ద్వాదశాక్షర మంత్రమును వినిపించుచు, అభిషేకము చేసెను. అంత అది ప్రేతత్వమును వదలి అగ్నిజ్వాలాతుల్యమయిన దివ్యదేహమును పొంది, సూర్యకాంతివలె వెలుగొందెను. పిదప అది ధర్మదత్తునకు పాదనమస్కారము చేసి, ఆనంద ముతో గద్గదస్వరమున, "బ్రాహ్మణోత్తముడా! నీ ప్రసాదమువలన నేను నరకమునుండి ఉద్ధరింపబడితిని. దాటలేని నదిలో మునిగిన నాకు నీవు నౌకవలే అయ్యావు." అని స్తుతించు చుండగా, విష్ణురూపధరులగు గుణములచే వారు విరాజించుచుండు విమానం ఒకటి అచ్చటికి వచ్చెను. సుందరమగు ఆ విమానములో ఉన్నవారు (10) పుణ్యశీల సుశీలాదులు ఈ కలహను దానిమీద ఎక్కించుకొనిరి.

తద్విమానం తదాఽఽపశ్యద్ధర్మదత్తస్సవిస్మయః ।
పపాత దండవద్భూమౌ దృష్ట్వా తౌ పుణ్యరూపిణౌ ॥ 12

పుణ్యశీలసుశీలౌ చ సముత్థాప్యాగతం ద్విజమ్ ।
సమభ్యనందయన్వాణీం ప్రోచతుర్ధర్మసంయుతామ్ ॥ 13

గణావూచతుః
సాధు సాధు ద్విజశ్రేష్ఠ యస్త్వం విష్ణురతః సదా ।
దీనానుకంపీ ధర్మజ్ఞో విష్ణువ్రతపరాయణః ॥ 14

ఆబాలత్వాత్త్వయా హ్యేతద్యత్కృతం కార్తికవ్రతమ్ ।
తవ తస్యార్ధదానేన పుణ్యం ద్వైగుణ్యమాగతమ్ ॥ 15

త్వత్పుణ్యస్యార్ధభాగేన యదస్యాః పూర్వకర్మజమ్ ।
జన్మాంతరశతోద్వ్రతం పాపం తద్విలయం గతమ్ ॥ 16

స్నానైరేవ గతం పాపం యదస్యాః పూర్వకర్మజమ్ ।
హరిజాగరాణాద్యైశ్చ విమానమిదమాగతమ్ ॥ 17

వైకుంఠం నీయతే సాధో నానాభోగయుతా త్వియమ్ ।
దీపదానభవైః పుణ్యైస్తైజసం రూపమాశ్రితా ॥ 18

తులసీపూజనాద్యైశ్చ కార్తికవ్రతకైః శుభైః ।
విష్ణుసాన్నిధ్యగా జాతౌ త్వయా దత్తైః కృపానిధే ॥ 19

త్వమప్యస్య భవస్యాంతే భార్యయా సహ యాస్యసి ।
వైకుంఠభువనం విష్ణోః సాన్నిధ్యం చ సరూపతామ్ ॥ 20

తే ధన్యాః కృతపుణ్యాస్తే తేషాం చ సఫలో భవః ।
యైర్భక్త్యాఽఽరాధితో విష్ణుర్ధర్మదత్త త్వయా యథా ॥ 21

సమ్యగారాధితో విష్ణుః కిం న యచ్ఛతి దేహినామ్ ।
ఔత్తానపాదిర్యేనైవ ధ్రువత్వే స్థాపితః పురా ॥ 22

యన్నామస్మరణాదేవ దేహినో యాంతి సద్గతిమ్ ।
గ్రాహగృహీతో నాగేంద్రో యన్నామస్మరణాత్పురా ॥ 23

విముక్తః సన్నిధిం ప్రాప్తో జాతోఽయం జయసంజ్ఞకః ।
గ్రాహోఽయం విజయో నామ్నా శ్రీవిష్ణోశ్చింతనాదభూత్ ॥ 24

అప్సరసలచే సేవింపబడుదానిని చూచి, ధర్మదత్తుడు విస్మయమొంది, ఆ పుణ్యాత్ములకు సాష్టాంగముగా నమస్కరించెను. ఆ వెనుక ఆ పుణ్యశీల, సుశీలలు ధర్మదత్తుని లేవనెత్తి, యిట్లు చెప్పుచున్నారు, "మంచిది, మంచిది, మహాబ్రాహ్మణుడా! నారాయణ పరాయణుడును, దీనులయెడ దయగలవాడును, ధర్మజ్ఞుడును, విష్ణువ్రతరతుడును అయిన నీవు బాల్యమునుండి ఆచరించిన కార్తీక వ్రతపుణ్యమును దానముగా ఇచ్చినందున అది రెండింతలై ఈమెకు పుణ్యబలమునిచ్చి, యీామెయొక్క వెనుకటి నూరు జన్మముల పాపములనుకూడా పోగొట్టిరక్షించినది. ఈమె యనుభవింపదగిన మూడు జన్మల పాప పరిపాకము

తొలగిపోయినది. మంత్రజల స్నానముచేతనే తొలగెను. విష్ణుజాగరణాదులచే విమానము వచ్చినది. నానావైభవములతో ఈమెను వైకుంఠమునకు తీసికొనిపోవుచున్నాము. దీపదాన మహిమవలన తేజోరూపము కలిగినది. కార్తీక వ్రతమునందలి తులసీ పూజనాదులచేత వైకుంఠమున విష్ణు సాన్నిధ్యము లభించినది. కరుణాకరుడై కార్తీకమాస పూజాఫలదానముచేసిన నీవును ఈ జన్మాంతమున భార్యతోడ శ్రీవిష్ణు సాన్నిధ్య సారూప్య ముక్తి పొందగలవు. ధర్మదత్తుడా! నీ వలె భక్తితో విష్ణువ్రతమును ఆచరించిన మహానుభావుల జన్మమే సఫలము, వారే ధన్యులు. చక్కగా నారాయణుని సేవించినవారికి దుర్లభము ఏమిగలదు? ఉత్తానపాదుని కొడుకు విష్ణుధ్యానముచే ధ్రువపదమునొందలేదా? ఆ శ్రీమన్నారాయణ నామ పారాయణచే ఏనుగులభర్త కూడా ముక్తినొందినట్టి యీ జయుడనువాడును,....

**యతస్త్వయాఽఽంచితో విష్ణుః తత్సాన్నిధ్యం ప్రయాస్యసి ।**
**బహూన్యష్టసహస్రాణి భార్యాద్వయయుతస్య తే ॥ 25**

**తతః పుణ్యే క్షయం ప్రాప్తే యదా యాస్యసి భూతలమ్ ।**
**సూర్యవంశోద్భవో రాజా విఖ్యాతస్త్వం భవిష్యసి ॥ 26**

**నామ్నా దశరథస్తత్ర భార్యాద్వయయుతః పుమాన్ ।**
**తృతీయేయం తదా భార్యా పుణ్యస్యైవార్ధభాగినీ ॥ 27**

**కలహా కైకయీ నామ్నీ భవిష్యతి న సంశయః ।**
**తత్రాపి తవ సాన్నిధ్యం విష్ణుర్దాస్యతి భూతలే ॥ 28**

**ఆత్మానం తవ పుత్రత్వం ప్రకల్ప్యామరకార్యకృత్ ।**
**రామనామ్నా రావణాదీన్ హత్వా రాజ్యం కరిష్యతి ॥ 29**

**తవాజన్మవ్రతాదస్మాత్ విష్ణుసంతుష్టికారణాత్ ।**
**న యజ్ఞా న చ దానాని న తీర్థాన్యధికాని వై ॥ 30**

**అతస్త్వగ్రేఽపి ధర్మజ్ఞ నిత్యం విష్ణువ్రతే స్థితః ।**
**త్యక్తమాత్సర్యదంభోఽపి భవ త్వం సమదర్శనః ॥ 31**

**కార్తికే మాధవే మాఘే చైత్రే మాసచతుష్టయే ।**
**ప్రత్యబ్దం త్వం ధర్మదత్త ప్రాతఃస్నాయీ సదా భవ ॥ 32**

**ఏకాదశీవ్రతే తిష్ఠ తులసీవనపాలకః ।**
**బ్రాహ్మణానపి గాశ్చాపి వైష్ణవాంశ్చ సదా భజ ॥ 33**

మసూరికాశ్చారనాలం వృంతాకాదీని ఖాద మా ।
ఏవం త్వమపి దేహాంతే తద్విష్ణోః పరమం పదమ్ ॥ 34

ప్రాప్నోషి ధర్మదత్త త్వం తద్భక్త్యైవ యథా వయమ్ ।
పుణ్యశీలసుశీలాఖ్యౌ జయశ్చ విజయస్తథా ॥ 35

ధన్యోఽసి విప్రాగ్ర్య యతస్త్వయైతద్,
వ్రతమ్ కృతం తుష్టికరం జగద్గురోః ।
యదర్ధభాగాత్సఫలాన్మురారేః
ప్రణీయతేఽస్మాభిరియం సలోకతామ్ ॥ 36

ముద్గలఉవాచ
ఇత్థం తౌ ధర్మదత్తం తముపదిశ్య విమానగౌ ।
తయా కలహయా సార్థం వైకుంఠభువనం గతౌ ॥ 37

మొసలిగా ఉండి, ముక్తినందినట్టి యీ విజయుడను వాడును, ఇప్పుడు పుణ్యశీల, సుశీల పేర్లు కలిగి యున్నాము. దేహధారులకు విష్ణునామస్మరణమే శరణమై సద్గతి నిచ్చుచున్నది. నీవు పుణ్య క్షయానంతరమున దశరథుడను పేరుగల సూర్యవంశరాజుగా అవతరించుచున్నావు. నీకిరువురు భార్యలుందురు. నీయొక్క పుణ్యార్ధభాగినియగు ఈమె కలహయనునది, కైకేయి యను మూడవభార్యగా నుండును. ఇందులో సంశయములేదు. అప్పుడును భూమిపై నీకు శ్రీహరి సాన్నిధ్యము నిచ్చుచుండును. దేవకార్య నిర్వహణకై శ్రీవిష్ణువు 'రామ' అని పేరుగలిగిన పుత్రుడుగా జన్మించి, రావణాదులను జంపి, రాజ్యమేలును. ధర్మదత్తుడా! నీ కార్తీక విష్ణువ్రత ప్రభావమింతగానున్నది. మహానుభావా! ఏ తీర్థములును దీనికి సాటిగావు. ఏ యజ్ఞములును ఇందుకు సరిగాదు. మదమాత్సర్య దంభాదులను వదలి సమదర్శనగా ఉండుము. కార్తీకము, వైశాఖము, మాఘము, చైత్రము అను ఈ నాలుగు నెలల్లో ప్రతి వత్సరమును నీవు ప్రాతఃస్నానమును ఆచరింపుము. తులసీచెట్టును కాపాడుచు, ఏకాదశీ వ్రతమును అనుష్ఠింపుము. బ్రాహ్మణులను, గోవులను, విష్ణుభక్తులను పూజింపుము. చిరుసెనగలను, అరనాలమును, వంకాయలను తినవలదు. ఇట్లుండి మావలె నీవు దేహాంతరమున శ్రీవిష్ణు పరమ పదమును పొందుదువుగాక. విప్రవర్యా! ఏ నీ పనియొక్క వ్రతార్ధఫలముచే ఈమెను విష్ణులోకమునకు పిలచికొనిపోదుమో అట్టి నీవే ధన్యుడవు. నీవే నారాయణవ్రతమును ఆదరించిన ధీరుడవు. అని యిట్లు ఉపదేశించి, ఆ పుణ్యశీల, సుశీలలు కలహతోడ వైకుంఠమునకు వెళ్ళిరి. ధర్మదత్తుడును అట్లే ఆ వ్రతమును ఆచరించుచు, దేహాంతరమున తన సతులతోడ విష్ణులోకమునకు చేరెను.

ధర్మదత్తోఽప్యసౌ రాజన్ ప్రత్యబ్దం తద్వ్రతే స్థితః ।
దేహాంతే పరమం స్థానం భార్యాభ్యామన్వితోఽభ్యగాత్ ॥ 38

బహూన్యబ్దసహస్రాణి స్థిత్వా వైకుంఠసద్మని ।
తతః పుణ్యక్షయే జాతే జాతోఽసి త్వం నృపో మహాన్ ॥ 39

త్రిభిః స్త్రీభిర్దశరథ తే విష్ణుః పుత్రతాం గతః ।
రామోఽయం లక్ష్మణశ్శేషో భరతోఽబ్జోఽరిశత్రుహా ॥ 40

ఏవం సర్వం మయాఽఽఖ్యాతం యథా పృష్టం త్వయా మమ ।
ధన్యస్త్వం యస్య తనయః సాక్షాన్నారాయణోఽభవత్ ॥ 41

శ్రీశివ ఉవాచ
ఇత్యుక్త్వా నృపతిం పూజ్య విససర్జ మునిస్తదా ।
ఆలింగ్య రామం సౌమిత్రిం మేనే చ కృతకృత్యతామ్ ॥ 42

తదా రాజా స్వసైన్యేన మహాహర్షసమన్వితః ।
అయోధ్యామగమద్రమ్యాం గోపురాట్టాలమండితామ్ ॥ 43

నృపమాగతమాజ్ఞాయ మంత్రిణః పురవాసినః ।
పతాకతోరణాద్యైశ్చ దివ్యచందనసేచనైః ॥ 44

నగరీం భూషయిత్వా తే నృత్యవాద్యాదిమంగళైః ।
నిన్యుః కుటుంబసహితం రాజానం నగరీం ప్రతి ॥ 45

రామమాగతమాజ్ఞాయ గోపురాట్టాలపంక్తిషు ।
కట్యాం నిధాయ బాలాంశ్చ స్త్రియః స్థిత్వా నిజైః కరైః ॥ 46

సువర్ణకుసుమాద్యైశ్చ వవర్షుః పుష్పవృష్టిభిః ।
కాశ్చిన్మార్గోపరి స్థిత్వా కుంభదీపాది మంగళైః ॥ 47

ఆర్తిక్యాద్యైశ్చ రాజానం సరామం శాంతికారకైః ।
పూజయంతి స్మ తాః సర్వా రాజమార్గే పృథక్ పృథక్ ॥ 48

ఏవం నానాసముత్సాహైః నర్తనైర్వారయోషితామ్ ।
దుందుభీనాం నినాదైశ్చ గాయకానాం చ గాయనైః ॥ 49

సౌధోద్భవగవాక్షైశ్చ స్త్రీముక్తపుష్పవృష్టిభిః ।
యయౌ స్వశిబిరం రాజా వీజ్యమానః సుచామరైః ॥ 50

తతస్తాన్ జనకామాత్యాన్ వస్త్రాలంకారవాహనైః ।
సత్కృత్య భోజనాద్యైశ్చ ప్రేషయామాస మైథిలమ్ ॥ 51

ఏవం సర్వేషూత్సవేషు జనకో వార్షికేషు సః ।
నినాయ మిథిలాం రామమాతృభిః పార్థివేన చ ॥ 52

ఉత్తరోత్తరతః పూజ్య తోషయామాస రాఘవమ్ ।
రామోఽపి రమయామాస లీలాభిః నృపతిం తదా ॥ 53

అనేక వేలసంవత్సరములు వైకుంఠమున ఆనందముగా గడిపి, పుణ్యక్షయము కాగా దశరథుడు అను వానిగా ఇట్లు జన్మించితివి. నీ యొక్క ముగ్గురు భార్యలు శ్రీవిష్ణుపుత్రభావము నొందిరి. ఈ రాముడే శ్రీవిష్ణువు. ఆదిశేషుడే లక్ష్మణుడు, శంఖ చక్రములే భరత శత్రుఘ్నులు. మహారాజా! మహావిష్ణువు నీ కొడుకగుటచే, నీవు ధన్యుడవు. నీ వడిగిన సంగతినంతయు చెప్పితిని అని ముద్గలముని యిట్లు భూత, భవిష్యత్ వృత్తాంతములను వివరించి, దశరథుని సత్కరించి, శ్రీరామాదులను హత్తుకుని పంపెను. పిదప దశరథమహారాజు మహాసైన్యములతో అందరిని వెంటదీసికొని శోభాయమానమైన అయోధ్యకు చేరెను.

## శ్రీరామాదులు మరల అయోధ్యకు వచ్చిచేరుట.

మంత్రులు వచ్చి సముచిత మర్యాదలతో నగరములోనికి స్వాగతించిరి. రామాదుల రాకను తెలుసుకుని రాజమార్గమున కాంతామణులు మిద్దెలను ఎక్కి, పసిబిడ్డలను చంకలలో నెత్తుకుని, కొందరు పుష్పవర్షములను గురిపించగా, కొందరు వేడుకలను చూచుచుండిరి. కొందరు యువతులు అచ్చటచ్చట చేరి మంగళకరమగు కుంభదీపరాశులచే మంగళహారతులెత్తి ఆరాధించుచుండిరి. ఇట్లు మహోత్సవములతోను, మంగళవాద్య నినాదములతోను, వారాంగనా నృత్యములతోను, గాయకుల గానములతోను, కిటికీలలో నుండి అంతఃపురస్త్రీలు సమర్పించుచుండు పుష్పజల్లులతోను, చామరాది ఉపచారములతోను వచ్చి వారివారి రాజమందిరములను అలంకరించిరి. అంత దశరథమహారాజు; జనకరాజుయొక్క మంత్రులను వస్త్రాలంకారాదులతో సత్కరించి, భోజనాదులతో సంతోష పరచి మిథిలకు పంపెను. ఇట్లే జనకమహారాజు అన్ని ప్రముఖ ఉత్సవాలకును శ్రీరామాదులను మిథిలాపురికి ఆహ్వానించి, రాజమాతలను, దశరథరాజును ఆనంద తరంగాలలో ముంచుచుండెను. ఇట్లు ఉత్తరోత్తర అభివృద్ధిగా అల్లుని సంతోషపరచుచుండెను. రాముడును లీలావినోదములతో రారాజించుచుండెను. (53)

మాసైః షడ్భిర్జనకజా లబ్ధ్వా శ్రీరాఘవాచ్ఛుభా ।
లగ్నత్వేకాదశే వర్షే రజోయుక్తా బభూవ హ ॥ 54

తద్వార్తాం జనకః శ్రుత్వా పత్నీభిర్మంత్రిభిః సహ ।
అయోధ్యామగమత్ శీఘ్రం రాజా ప్రత్యుజ్జగామ తమ్ ॥ 55

పరస్పరమ్ సమాలింగ్య సాకేతమిథిలాధిపౌ ।
నృత్యవాద్యసముత్సాహైః అయోధ్యాం వివిశుః సుఖమ్ ॥ 56

తతో మహాసముత్సాహైః నానామంటపతోరణైః ।
కదలీస్తంభమాలాభిః ఇక్షుదండైః సుచామరైః ॥ 57

చతుర్ద్వారమంటపైశ్చ ఘంటాఘోషైః సదర్పణైః ।
కింకిణీజాలఘోషైశ్చ వితానైర్దీపరాజిభిః ॥ 58

వసిష్ఠో మునిభిః సార్ధం గర్భాధానవిధిం శుభమ్ ।
కారయామాస రామేణ సీతాయాశ్చాతిహర్షితః ॥ 59

తదా వస్త్రైరలంకారైః జనకో నృపతిం ముదా ।
పూజయామాస సస్త్రీకం స్నుషాపుత్రసమన్వితమ్ ॥ 60

మాసమేకమతిక్రమ్య యయౌ స్వనగరీం సుఖమ్ ।
రామోఽపి సీతయా సార్ధం నానాభోగాన్ సుపుష్కలాన్ ॥ 61

బుభుజే హేమరత్నాది నిర్మితేషు గృహేషు సః ।
రుక్మమండనయుక్తాభిః దాసీభిర్వీజితః సుఖమ్ ॥ 62

## శ్రీ సీతారామాదుల శోభనమహోత్సవము.

పిమ్మట ఆరుమాసములకు శ్రీరామునికన్నను చిన్నదియైన సీతమ్మ పదునొకండవయేట శుభ లగ్నమున పుష్పవతియైనది. ఈ శుభవార్తనువిని జనకుడు భార్యలతోను, మంత్రులతోను పరివారము తోను మరల అయోధ్యకు వచ్చెను. దశరథుడు స్వాగతించగా, ఇరువురును పరస్పరము ఆలింగనాదులచే సంతోషించి, తన వైభవములతో రాజమందిరములచేతను, అరటిచెట్ల వరుసలచేతను, చెరుకుగడల చేతను, చామరములచేతను, రహదారి కూడళ్లలో పందిళ్ళచేతను, ఘంటానాదముల

చేతను, అద్దములచేతను, గజ్జెల చప్పుళ్ళచేతను, మంగళదీపాలచేతను అలంకృతమైన రాజ మందిరమున వశిష్ఠుడు గర్భాదాన శుభమహోత్సవమును శ్రీసీతారాములకు చేయించెను. అపుడు వస్త్రాలంకారములచే జనకుడు; కొడుకు, కోడలు, ఇల్లాండ్రుతోడనున్న దశరథరాజును మిగుల సత్కరించెను. ఇట్లు సంతోషముగా ఒకనెల యిచ్చటనుండి జనకుడు మిథిలకు వెడలెను. శ్రీరాముడు సీతతో సంపూర్ణములైన వివిధ భోగములను, సువర్ణరత్నాలంకృతమగు మందిరాలలో అనుభవించు చుండెను. స్వర్ణాలంకృతలగు దాసీజనులు సేవించుచుండిరి. ఇట్లే లక్ష్మణ, భరత, శత్రుఘ్నులును వారివారి భార్యలతో సముచిత కాలములలో విధివిధానమున నిషేక శాంతి శుభకర్మ మహోత్సవములు జరిగెను.

**ఏవం తాసాం నృపసుతపత్నీనాం చ పృథక్ పృథక్ ।**
**యథాకాలే విధానేషు గర్భాధానాదికేషు చ ॥ 63**

**ఆగత్య జనకశ్చక్రే నానోత్సాహాన్ముదాన్వితః ।**
**అయోధ్యానగరీమధ్యే వాద్యఘోషో గృహే గృహే ॥ 64**

**మంగళాని చ సర్వత్ర న కుత్రాప్యస్తమంగళమ్ ।**
**న దరిద్రీ ఋణీ నాసీన్నాధివ్యాధిప్రపీడితః ॥ 65**

**రామాదిభి శ్చతుర్భిస్తైర్బంధుభి స్తదనంతరమ్ ।**
**పథగ్గేహేషు భార్యాభిః గార్హస్థ్యమధ్యనుష్ఠితమ్ ॥ 66**

**రామః ప్రాతః సముత్థాయ కృతశౌచాది సత్క్రియః ।**
**ఆరుహ్య శిబికాం దివ్యాం స్నానార్థం సరయూం నదీమ్ ॥ 67**

**గత్వా కూలే వాహనాది విసృజ్య రఘునందనః ।**
**గచ్ఛంస్తస్యాః పావనార్థం సరవ్యాః పులినేముదా ॥ 68**

**మంత్రిభిః వేష్టితో గత్వా నత్వా తాం సరయూనదీమ్ ।**
**స్నాత్వా నిత్యవిధిం కృత్వా బ్రాహ్మణైః పరివారితః ॥ 69**

**దత్త్వా దానాన్యనేకాని గోభూధాన్యరసాదిభిః ।**
**సంపూజ్య సరయూం పుణ్యాం బ్రాహ్మణాన్ పూజ్య సాదరమ్ ॥ 70**

**యయౌ రథం సమారుహ్య రుక్మబంధనబంధితమ్ ।**
**రుక్మతంతురజ్జుభిశ్చ సర్వతః పరివేష్టితమ్ ॥ 71**

**పట్టకూలాదివసనైర్వ రైరాచ్ఛాదితం శుభమ్ ।**
**వాజివాహం సారథినా సుస్నాతేన ప్రచోదితమ్ ॥ 72**

**కింకిణీవరమాలాభిర్ఘంటాభిరతిగర్జితమ్ ।**
**రుక్మదండధరైర్ద్వాతైః అగ్రేదర్శితసత్పథమ్ ॥ 73**

**పథి నీరాజితః స్త్రీభిః వర్షితః పుష్పవృష్టిభిః ।**
**ప్రాప స్వీయం గృహం రామః సూర్యకోటిసమప్రభమ్ ॥ 74**

అప్పుడప్పుడు జనకుడు వచ్చి, పలు మహోత్సవములను కావించి, సంతోషము పొందుచుండెను. అయోధ్యానగరమున అంతటను మంగళవాద్యములు మ్రోగుచుండినవి. అన్నిచోట్లలోను శుభమహోత్సవములు తప్ప అమంగళప్రసక్తియే లేదు. అయోధ్యలో ఒక్కడును- దరిద్రుడును, అప్పులుగలవాడును, చింతాయుక్తుడు, వ్యాధిబాధితుడును లేడు. ఇట్లుండ శ్రీరామ, లక్ష్మణ, భరత, శత్రుఘ్నులు వారివారి బంధు పరివారములతో గృహస్థాశ్రమ ధర్మాలను పాటించుచుండిరి. (66)

## శ్రీరాములవారి దినచర్యా వర్ణన.

శ్రీరాముడు ఉదయమే లేచి, శౌచాది నిత్య క్రియలను తీర్చుకొని దివ్య రథమునెక్కి, స్నానమునకై సరయూనదికి వెళ్ళి, తీరమున వాహనాదులను వదలి, మంత్రులతో మాటలాడుచు, ఆ నదికి పరిశుద్ధినిచ్చుటకై యిసుకదిబ్బలమీద కాలినడకతో ప్రవాహమువద్దకు పోయి, విప్రోత్తములచే పరివేష్ఠితుడై స్నానముచేసి, నిత్యకర్మానుష్ఠానము ముగించి, గో, భూ, తిల, హిరణ్య, ఆజ్య, వాస, ధాన్య, గుడ, రౌప్య, లవణాది నానాదానములనొసంగి, సరయూనదిని, బ్రాహ్మణులను సాదరముగా పూజించి, బంగారు గొలుసులచే శింగారింపబడిన రథమునెక్కి, పట్టుబట్టలచేత, స్వర్ణరజ్జువులచే అలంకరింపబడిన దివ్యమైన అశ్వములు కట్టబడి, స్నానముజేసి, మడిగట్టుకొనిన సారథిచేత నడుపబడుచుండు ఆ రథమున వచ్చుచు, వెండి బెత్తములవారు, బంగారు బెత్తములవారు, గజ్జులు, ఏకరూపదుస్తులు ధరించినవారు మొదలైనవారిచే చూపబడెడు రాజమార్గమున

**అవరుహ్య రథాద్రామః పాదయోర్ధృత్య పాదుకే ।**
**వివేశ సీతాసందత్త పాదార్ఘ్యాచమనో గృహమ్ ॥ 75**

**గత్వాఽగ్నిహోత్రశాలాయాం సీతయాఽఽసనసస్థితః ।**
**అగ్నిహోత్రాదివిధినా వహ్నిం హుత్వా తతః పరమ్ ॥ 76**

స్ఫటికస్య చ లింగస్య కర్మమార్గం యథావిధి ।
లోకానాం శిక్షణార్థాయ కృత్వా పూజనముత్తమమ్ ॥ 77

జానక్యా దత్తపక్వాన్నాన్నైవేద్యాది సమర్ప్య చ ।
బ్రాహ్మణాన్పూజ్య దానాద్యైః తోష్య లబ్ధ్వా తదాశిషః ॥ 78

తులసీం చ గురుం ధేనుమశ్వత్థం మునిపాదపమ్ ।
పూజయిత్వా రవిం దేవం బ్రహ్మయజ్ఞం విధాయ చ ॥ 79

గురోర్ముఖాచ్చ పౌరాణీం కథాం శ్రుత్వా తు సీతయా ।
గురుం పునః ప్రపూజ్యాథ బంధుభిః పరివేష్టితః ॥ 80

ప్రార్థితశ్చ ముహుః పత్న్యా బ్రాహ్మణైః పరివారితః ।
నారికేళకపిత్థామ్రసులభాజంబుదాడిమైః ॥ 81

ఖర్జూరికాపనసాద్యైః పక్వాన్నైః ఘృతపాచితైః ।
ఉపహారం సుఖం కృత్వా తాంబూలం పరిగృహ్య చ ॥ 82

దివ్యవస్త్రాణి సంగృహ్య దృష్ట్వాఽఽదర్శే నిజం ముఖమ్ ।
నిరీక్షితశ్చ వైదేహ్యాఽఽరుహ్య స్యందనముత్తమమ్ ॥ 83

వేష్టితో మంత్రిదూతాద్యైః తూర్యధ్వనిపురస్సరమ్ ।
మాతృగేహం తతో గత్వా తాః ప్రణమ్యావనిం గతః ॥ 84

సవ్యా ప్రదక్షిణాం కృత్వా గత్వా రాజగృహం ప్రతి ।
సింహాసనస్థం రాజానం నత్వా స్థిత్వా తదాజ్ఞయా ॥ 85

నగరములోనిస్త్రీలు పుష్పజల్లులు గురిపించుచు రత్నహారతులనెత్తుచు సేవింపగా తన మందిరమునకు వచ్చి, రథమునుండిదిగి, పాదుకలు తొడిగి, జానకిచేత ఇవ్వబడిన జలముతో చేతులు పాదములు కడిగి, కొద్దిగా నీటిని ఆచమించి, తన మందిరములోని అగ్నిహోత్రశాలలో ప్రవేశించి, సీతతోడ శ్రీమదగ్నిదేవుని ఆహూతులచే ఆరాధించి, లోక కళ్యాణము కొరకు విధివిధానముగా స్ఫటికలింగ రూపమున ఉన్న శ్రీసాంబసదాశివుని ఆరాధించి, సీతచే తేబడిన నైవేద్యాదికములను నివేదించి, దానములచే విప్రవర్యులను సంతృప్తిపరచి, వారి ఆశీర్వాదములను పొంది, గో పూజ చేసి, అశ్వత్థ వృక్షమును, తులసి చెట్టును ఆరాధించి, శ్రీసూర్యుని ఉపాసించి, బ్రహ్మయజ్ఞ విధానానంతరము

శ్రీవశిష్ఠమునులవారినుండి, సీతతోడ పురాణపుణ్య కథలను విని, వశిష్ఠ మునులను సత్కరించి, తనబంధువులు చుట్టూ చేరగా వారితో వినోదముగా మాటలాడుచుండును. పిదప పత్నిచే పలుమార్లు ప్రార్థింపబడి, దివ్యఫలములు, దివ్యనేతితో తయారు చేయబడిన ఉపహారమును భుజించి, యథాసుఖముగా తాంబూలమును స్వీకరించి, దివ్యవస్త్రములను ధరించి, దర్పణమును దర్శించి, జానకీ కటాక్ష కవచితుడై రథమునెక్కి, మంత్రి మాతాదులు పరివేష్ఠించియుండ మంగళవాద్యములతో మాతృమూర్తుల మందిరంబునకు వెళ్ళి, తన తల్లులకు ప్రదక్షిణ నమస్కారములు చేసి, అట్లే తీర్థస్వరూపులైన దశరథులవారి రాజమందిరమునకు వచ్చి, సింహాసనాసీనుడైన దశరథమహారాజుకు నమస్కారములు జేసి, ఊరివారి పనులను చక్కబరచి, రాజాజ్ఞనొంది, అడుగడుగున తండ్రిని గౌరవించుచు, నానావైభవములతో సముత్సాహ మహోత్సవమున తనమందిరమునకు వచ్చును. పిదప జానకీమాతచే ఇవ్వబడిన జలముచే హస్త పాద ప్రక్షాళన గావించి, ఆమెతో అన్నిసంగతులను సరస హాస్యోక్తులచే విచారించుచు,.....

**పౌరకార్యాణ్యనేకాని కృత్వా రాజ్ఞా విసర్జితః ।**
**యయౌ స్యందనమాస్థాయ నృపం నత్వా పునః పునః ॥ 86**

**తూర్యగీతనినాదైశ్చ నర్తనైర్వారయోషితామ్ ।**
**యయౌ స్వీయం గృహం రామః స్యందనాదవరుహ్య చ ॥ 87**

**భూమిజాదత్తపాద్యార్ఘాచనీయాసనాదికమ్ ।**
**గృహీత్వా యద్బహిర్గత్వా కృతం తత్తాం న్యవేదయత్ ॥ 88**

**సర్వం వృత్తం కౌతుకేన హాస్యగీతాదిమంగళైః ।**
**రమయిత్వా భూమికన్యాం దివ్యవస్త్రాదిభూషితామ్ ॥ 89**

**తతో మధ్యాహ్నసమయే సరయ్వాం వాఽథసద్మని ।**
**స్నాత్వా మాధ్యాహ్నికం కర్మ చకార రఘునందనః ॥ 90**

**నిత్యం యత్రాకరోత్స్నానం సరయూనిర్మలే జలే ।**
**తదాఖ్యయాఽభవత్తీర్థం రామతీర్థమితి స్ఫుటమ్ ॥ 91**

**తద్విఖ్యాతం త్రిభువనే చైత్రమాసి విశేషతః ।**
**మాధ్యాహ్నికం చ సంపాద్య బ్రాహ్మణైర్మంత్రిభిర్జనైః ॥ 92**

ఇష్టైః సువర్ణపాత్రేషు త్రిపదాసు ఘృతేషు చ ।
పరిష్కృతేషు జానక్యా సీతాయా గతిలాఘవాత్ ॥ 93

క్వణత్కంకణమంజీర కింకిణీనూపురాదిషు ।
నదత్సు భోజనం చక్రే రాఘవో హర్షపూరితః ॥ 94

కరశుద్ధిం విధాయాథ భుక్త్వా తాంబూలముత్తమమ్ ।
తతః శతపదం గత్వా నిద్రాం కృత్వా తు సీతయా ॥ 95

పునర్వస్త్రాణి సంగృహ్య లబ్ధ్వా శస్త్రాణి సాదరమ్ ।
ధనుర్బాణౌ కరే ధృత్వా రథే స్థిత్వాఽథ బంధుభిః ॥ 96

పుష్పారామోద్యానకాదీన్ దృష్ట్వా తు కౌతుకేన చ ।
వాద్యఘోషైః నర్తకాద్యైః గత్వా స్వీయం గృహం పునః ॥ 97

సాయంసంధ్యాది సంపాద్య పునర్హుత్వా సవిస్తరమ్ ।
శంభుం భక్త్యా పునః పూజ్య కృత్వా చైవోపహారకమ్ ॥ 98

రత్నకాంచనమాణిక్య నిర్మితే మంచకే వరే ।
దివ్యప్రాసాదమధ్యే స సీతయా రఘునాయకః ॥ 99

హాస్యగీతవినోదాద్యైః నిద్రాం చక్రే తతః పరమ్ ।
ఏవం నానాసముత్సాహైర్నినాయార్కసమాః సుఖమ్ ॥ 100

సరయూనదిలోగాని, తనమందిరమున గాని స్నానమాచరించి, మాధ్యాహ్నిక సత్కర్మలను ఆచరించును. ఇట్లు ప్రతినిత్యమును శ్రీరాముడు సరయూనదిలో ఎచ్చట స్నానముజేసెనో అచ్చట యిప్పటికిని రామతీర్థమని ప్రసిద్ధిగలదు. అది ముల్లోకములలోను విదితమై చైత్రమాసమున విశేష ఫలనీయమయినది. పిదప, మధ్యాహ్న అనంతరము; ఇష్టులు, బ్రాహ్మణులు, మంత్రులు కలిసి కూర్చుని, ముక్కాలుపీటమీద సువర్ణపాత్రలలో దివ్య పక్వాన్నములను కంకణ, మంజీర, కింకిణీ, నూపురాది ఆభరణములయొక్క కలమధుర ధ్వనులచే ఆనందమొనరించుచు, శ్రీసీతాదేవి వడ్డించుచుండ ఆ రాఘవోత్తముడు సుఖ భోజనము గావించి, చేతులు కడుగుకొని, తాంబూలమును సేవించి, నూరు అడుగులు అటునిటు నడిచి సంతసించును. కొంతసేపు నిద్రించి, పిదప నవనవాలంకార వస్త్రములచే అలంకృతుడై, ధనుర్బాణములను ధరించి, శస్త్రములను తీసికొని, రథమునెక్కి, వైభవముగా వెడలి, పూతోటలలోను, ఉద్యానములలోను, వనములలోను విహరించుచు, మరల మంగళవాద్య

నర్తనాదులతోడ తన మందిరమునకు వచ్చును. పిదప సాయంకాల సంధ్యావందనాది సత్కర్మలనాచరించి, సవిస్తరముగా అగ్నిదేవుని ఉపాసించి, పరమేశ్వరుని ఆరాధించి, ఆహారాదులను ఆరగించి, దివ్యసౌధమునందు సువర్ణరత్నాలంకృతమగు దివ్యశయనమున శ్రీరఘురాముడు సీతతో హాస్యగీతాది వినోదములను అందుచు సుఖనిద్రనొందును. ఇట్లే అత్యంతవైభవ మహోత్సవములచే పంద్రెండేళ్ళు గడచినవి (100)

**ఏకదా రాఘవం రాజా జ్ఞాత్వా ముద్గలవాక్యతః ।**
**వసిష్ఠవాక్యతశ్చాపి చరిత్రైశ్చాప్యమానుషః ॥ 101**

**సాక్షాన్నారాయణం విష్ణుం మత్వాహూయ రహః స్థితః ।**
**పప్రచ్ఛ వినయేనైవ హృది భావం విధాయ చ ॥ 102**

**రామ నారాయణస్త్వం హి భూభారహరణాయ చ ।**
**మత్తో జాతాఽసతి లోకా వదంత్యజ్ఞానబుద్ధయః ॥ 103**

**అతః పృచ్ఛామి తే రామ మాయయా మోహితస్తవ ।**
**కించిత్‌జ్ఞానోపదేశేన నాశయాజ్ఞానజాం మతిమ్ ॥ 104**

**దారాపత్యగృహాద్యేషు స్థితా నైవోపశామ్యతి ।**
**తత్పితుర్వచనం శ్రుత్వా రాజానం రాఘవోఽబ్రవీత్ ॥ 105**

**శ్రీరామ ఉవాచ**

**శృణు రాజన్ ప్రవక్ష్యామి తవ జ్ఞానార్థముత్తమమ్ ।**
**శృణోతు మమ మాతేయం కౌసల్యాఽపి తవ ప్రియా ॥ 106**

**నశ్వరం భాసతే చైతత్ విశ్వం మాయోద్భవం నృప ।**
**యథా శుక్తౌ రౌప్యభాసః కాచభూమ్యాం జలస్య చ ॥ 107**

**యథా రజ్జౌ సర్పభాసో మృగతోయే జలస్పృహా ।**
**తద్వదాత్మని భాసోఽయం కల్ప్యతే నశ్వరోఽబుధైః ॥ 108**

**అజ్ఞానదృష్టిభిర్నిత్యం మన్యతే న తు పండితైః ।**
**ఆత్మా శుద్ధో నిర్వ్యలీకః సచ్చిదానందలక్షణః ॥ 109**

## దశరథునకు కౌసల్యయెదుట శ్రీరాముడు తత్త్వోపదేశము జేయుట

ఒకానొకప్పుడు దశరథుడు ముద్గలముని వచనములచేతను, వశిష్ఠముని వాక్యములచేతను అమానుష కృత్యములచేతను, శ్రీరాముడు సాక్షాత్ నారాయణ అవతారమేయని మదిలోనమ్మి, శ్రీరాముని రహస్యప్రదేశమునకు పిలిచి, సవినయముగా ఇట్లనెను, "రామభద్రా! నీవే నారాయణుడవు గదా? భూ భార హరణమునకై అవతరించిన మహానుభావుడవు నీవేగావా? అజ్ఞానులగు లోకులు నీవు నావల్ల పుట్టితివని చెప్పెదరు. కాబట్టి మాయామోహితుడైన నేను వేడుచున్నాను. కొంత జ్ఞానోపదేశమును ఒనరించి, నా అజ్ఞానబుద్ధిని పరిహరింపుము. ఈషణత్రయముతో కట్టుబడిన నాకు మనసున విశ్రాంతి గలుగలేదు. నన్ను ఉద్ధరింపుము శ్రీరామా!" అని అడిగిన దశరథునితో శ్రీరాముడిట్లనెను, "రాజా! వినుము. నీ కొరకు జ్ఞానమును చెప్పుచున్నాను. నా తల్లియగు ఈ కౌసల్యకూడ విననీ. నశ్వరంబగు ఈ ప్రపంచమంతయును ముత్తెపు చిప్పయందు వెండియను భ్రాంతితో చూచు చున్నట్లును, చౌడు నేలలో నీరున్నట్లును, ఈ యాత్మయందు మాయావిలసితంబై యున్నదను సంగతిని పండితులు తెలియగలరు. అజ్ఞానులు తెలియజాలరు. పండితులైనను ఇట్లు తెలిసికొందురు– నిస్పృహుడును, పరిశుద్ధుడును ఆత్మ నిషేధాప్రతియోగియైనందున సదాత్మకుడును, స్వయంప్రకాశుడును గాన చిదాత్మకుడును, ఆనందస్వరూపుడగుటచే, ఆనందాత్మకుడై సచ్చిదానంద లక్షణుడని చెప్పబడుచుండును. అట్టి పరమాత్మయొక్క అంశాంశమువలన పరమేశ్వర బ్రహ్మాదులును మేమే మొదలుగాగల అందురును ప్రపంచ సృష్టి, స్థితి సంహార కార్యములకై మాయవలన నానారూపములు పొందియున్నాము. నాటకములోని వివిధ పాత్రలను నటుడు ధరించినట్లు ఈ శరీరము బింబాకృతుల నందుచుండును.

**యస్యాంశాంశేన విశ్వేశ బ్రహ్మాద్యాః సకలా వయమ్ ।**
**స్థిత్యుత్పత్తివినాశార్థం నానారూపాణి మాయయా ॥ 110**

**ధార్యన్తే నటవద్రాజన్ నతేష్వాసక్త ఏవసః ।**
**యథా పద్మం న స్పృశతి జలం మాయాం తథా మలః ॥ 111**

**ఆత్మా నిత్యో న స్పృశతి పరమానందవిగ్రహః ।**
**దేహాగారసుతస్త్రీషు మామకేతి చ యా మతిః ॥ 112**

**ఉపసంహృత్య బుద్ధ్యా సంన్యస్య బ్రహ్మణి చిద్ఘనే ।**
**యద్యత్కించిద్భాసతేఽత్ర తత్తన్నారాయణాత్మకమ్ ॥ 113**

పశ్య త్వం సర్వభావేన ముచ్యతే భవసంకటాత్ ।
సత్యం శౌచం దయా శాంతిః క్షమా చేంద్రియనిగ్రహః ॥ 114

అహింసా భగవద్భక్తిః వేదమార్గానువర్తనమ్ ।
ఇత్యాద్యా యే గుణా రాజన్ తాన్ భజస్వ నిరంతరమ్ ॥ 115

చౌర్యం ద్యూతం వివాదం చ మాత్సర్యం దంభమేవ చ ।
క్రౌర్యం లోభం భయం క్రోధం శోకం నింద్యప్రవర్తనమ్ ॥ 116

వేదవిప్రయతీనాం చ సాధూనాం మానభంజనమ్ ।
నిందా పైశున్యమానేశం త్యజ దూరం స్వతో నృప ॥ 117

పూర్వం త్వయా తపస్తప్తం పుత్రత్వం యాచితం మమ ।
తస్మాజ్జాతోస్మి త్వత్తోఽహం కౌసల్యాయాం నృపోత్తమ ॥ 118

యన్మయా కథితం చైతదజ్ఞానమలనాశనమ్ ।
గోపనీయం ప్రయత్నేన కథనీయం న కుత్రచిత్ ॥ 119

తద్రామవచనం శ్రుత్వా గతమాయామలో నృపః ।
సద్భావపరిపూర్ణస్తు రోమాంచితవపుర్ధరః ॥ 120

ప్రణనామ రాఘవస్య చరణౌ గాఢభావతః ।
తతో రామం పునః ప్రాహ పితరం నిర్మలాశయమ్ ॥ 121

నేదం యోగ్యం త్వయా రాజన్ వందనాది శిశుం ప్రతి ।
మాయయా నరవేషస్య మమోపహాసకారణమ్ ॥ 122

మనసైవ చ మాం నిత్యం భజ భావేన సాదరమ్ ।
మచ్చిత్తో మద్గతప్రాణో మయి భక్తిం దృఢాం కురు ॥ 123

ఇత్యుక్త్వా పితరౌ నత్వా గృహీత్వాజ్ఞాం తయోః ప్రభుః ।
యయౌ రథసమారూఢః శ్రీరామః స్వనికేతనమ్ ॥ 124

నీళ్ళు తామరనెట్లు అంటకయుండునో అట్లే, ఆత్మ మాయావలంబనము లేక నిర్మలుడు నిత్యానంద మూర్తియునై యున్నాడు. నీవు ఈ శరీరము, ఇల్లు, పిల్లలు, భార్యలు మొదలగునవి నాది యను

బుద్ధినివదలి, దేనియందును మమకారము లేక చిదాత్మకుడైన పరబ్రహ్మయందు సర్వభారమును వేసి, సర్వాత్మ భావముతో గోచరించువాటి నన్నిటిని నారాయణ స్వరూపమని భావించుచుండుము. ఈ సంసారక్లేశమునుండి తొలగుదువు. సత్యము, సదాచారము, కారుణ్యము, శాంతి, ఓర్పు, ఇంద్రియనిగ్రహము, అహింస, దైవభక్తి, వేదమార్గము నవలంబించి యుండుట ఇత్యాది గుణములను నిరంతరముగా ఆశ్రయించి ఉండుము.

రాజా! దొంగతనము, జూదము, దెబ్బలాట, మాత్సర్యము, దంభము, క్రూరత్వము, క్రోధము, భీరుత్వము, లోభము, చెడుపనులను చేయుట, వేదనింద, బ్రాహ్మణనింద, యతినింద, సజ్జననింద పరదూషణము, పిసినారితనము మొదలగువాటిని సర్వవిధములా, సర్వకాలములలోను వదలుము. పూర్వము నీవు తపస్సుచేసి, పుత్రత్వమును కోరితివి. కాబట్టి నేను నీవలన కౌసల్యయందు అవతరించితిని. అజ్ఞానపరిహారమగు నేను చెప్పిన ఈ విషయమును నీలోనే దాచిపెట్టుము. ఎచ్చటను చెప్పవలదు.” ఇట్టి శ్రీరామవాక్యములను వినిన దశరథుడు, అజ్ఞాన నివృత్తిని, సుజ్ఞానప్రాప్తిని పొంది, సద్భావముతో పులకితాంగుడై శ్రీరామచరణములకు నమస్కరించెను. అందుకు రాముడు, “రాజా! నీ విట్లు బిడ్డకు నమస్కరించరాదు. నర రూపమున ఉన్న నాకిది హాస్యాస్పదముగా ఉండును. మనస్సులోనే సద్భావముచే నన్ను నిత్యము ఆరాధించుచుండుము. ఆదరముతో నాయందే మనస్సు గలిగి, నాయందే ప్రాణములుగలిగి, నాయందే దృఢభక్తిగలవాడివి అగుము,” అని యిట్లు చెప్పిన శ్రీరాముడు, తన తలిదండ్రులకు నమస్కరించి, బంధువులతో రథమునెక్కి, తన మందిరమునకు వచ్చెను. (124)

**కదా మాతుగృహం గత్వా సీతయా భోజనం వ్యధాత్ ।**
**కదా భ్రాతృగృహేష్వేవ కదా పంక్తౌ పితుః స్వయమ్ ॥ 125**

**కదా దశరథం తాతం భోజనార్థం నిజే గృహే ।**
**భార్యాపుత్రాదిభిర్యుక్తం పౌరైర్విప్రైః సమన్వితమ్ ॥ 126**

**ముదా రామ స్సమాహూయ భోజయామాస సాదరమ్ ।**
**శ్రీరామదర్శనార్థం తే తపోవననివాసినః ॥ 127**

**అయోధ్యానగరీమేత్య ద్వారపౌరనిషేధితాః ।**
**శతశః ప్రత్యహం రామం దృష్ట్వా స్తుత్వా పునః పునః ॥ 128**

**ఆతిథ్యం రఘునాథస్య గృహీత్వా తుష్టమానసాః ।**
**సప్తపంచదినాన్యేవ స్థిత్వా పుణ్యకథాదిభిః ॥ 129**

రమయిత్వా రమానాథం జగ్ముః స్వం స్వం వరాశ్రమమ్ ।
యత్ర యత్ర హి రామస్య ప్రీతిం జ్ఞాత్వా విదేహజా ॥ 130

తత్తచ్చకార సా సాధ్వీ హాస్యక్రీడాసనాదికమ్ ।
వివాహానంతరం రామః సమా ద్వాదశ సీతయా ॥ 131

రమయామాస సాకేతే మహాక్రీడాపురస్సరమ్ ।
సహస్రవర్షైర్విజ్ఞేయం శ్రేష్ఠం వర్షం కృతే యుగే ॥ 132

శతవర్షైశ్చ త్రేతాయాం ద్వాపరే దశవర్షజమ్ ।
కలేర్మానేన బోద్ధవ్యం శూన్యహ్రాసాత్త్రివిక్రమాత్ ॥ 133

## శ్రీరాములవారు జనులతో ఆనందించుట.

ఎప్పుడు సీతతోడ శ్రీరాముడు తల్లిగారింటికి వెడలిభుజించును? ఎప్పుడు సోదరుల యిండ్లలో భుజించును? ఎప్పుడు తండ్రిగారి బంతిలో భుజించును? ఎప్పుడు తన యింటికి భోజనమునకై భార్యాపుత్రులతోడ, పౌరులతోడ దశరథుని పిలిచికొనివచ్చును? అని వారువారు ప్రార్థింపవలసినట్లు సర్వజనాదరణకు ఆశ్రితుడై రాముడు రారాజించుచుండెను. మరియు శ్రీరాఘవుడు సంతోషముతో అందరిని రప్పించి, భోజనాది సత్కారములచే ఆదరించుచుండును. వనవాసులు రామదర్శనమునకై వచ్చి, ద్వారములలో పౌరులచే నిషేధింపబడినను, నూరారుమంది చూచి, పలుమారు స్తుతించి, రాఘవుడుచేయు ఆతిథ్యాదులచే ఆనందించి, ఐదారుదినములచ్చట ఉండి, పుణ్యకథలచే పురుషోత్తమునికి సంతృప్తినికలిగించి, తమతమ ఆశ్రమములకు పోవుచుండిరి. జానకీదేవి శ్రీరామునికి దేనియందు ప్రీతిగలదో దానిని నెరవేర్చుచు సరస హాస్య క్రీడనాదులతో ఆనందించుచుండెను. ఇట్లు శ్రీరాముడు వివాహానంతరము సీతాదేవితోడ 12 సంవత్సరములు మహోత్సవముగా జరిపెను. వర్షము; కృతయుగమున వేయింతలుగాను, త్రేతాయుగంబున నూరింతలుగాను, ద్వాపరమునందు పదింతలుగాను, కలియుగంబున సమముగాను ఉండును. దీనికి కారణము కలియుగమున ధర్మము మూడుపాదములు శూన్యమగుటయే.

ఏవం శ్రీరామచంద్రేణ భోగా భుక్తాః సురోపమాః ।
యస్మిన్ ఋతౌ చ యద్ద్రవ్యం ఫలపుష్పాదికం శుభమ్ ॥ 134

తత్సర్వం సర్వదైవాసీత్ రామే సాకేతసంస్థితే ।
అనావృష్టిర్న వై కుత్ర తస్కరాణాం భయం న హి ॥ 135

హింసాదీనాం భయం నాసీత్ అయోధ్యావిషయే ప్రియే ।
యుధాజిన్నామ కైకేయీభ్రాతా భరతమాతులః ॥ 136

నినాయ భరతం స్వీయరాజ్యే శత్రుఘ్నసంయుతమ్ ।
కౌతుకేన నృపం దృష్ట్వా కైకేయీం ప్రణిపత్య చ ॥ 137

ఏవం రామస్య మాంగళ్యం బాలత్వేఽపి సుఖావహమ్ ।
యే శృణ్వంతి నరా భక్త్యా న తేషామస్త్యమంగళమ్ ॥ 138

ఏవం యథా త్వయా పృష్టం తథా సర్వం మయోదితమ్ ।
రామేణాచరితం యచ్చ నృణాం మాంగళ్యదాయకమ్ ॥ 139

ఏవం గిరీంద్రజే ప్రోక్తం బాలలీలాది కౌతుకమ్ ।
రామచంద్రస్య సంక్షేపాత్తవ ప్రీత్యై సుఖావహమ్ ॥ 140

**ఇతి శ్రీశతకోటిరామచరితాంతర్గతే, శ్రీమదానందరామాయణే, వాల్మీకీయే, ఆదికావ్యే, బాలచరిత్రే, సారకాండే, శ్రీరామదినచర్యావర్ణనంనామ, పంచమః సర్గః ॥**

ఇట్లు శ్రీరాముడు దేవభోగములను అనుభవించుచు, అయోధ్యలో నుండునపుడు ఆయా ఋతువులలో పూచి పండతగిన పుష్ప ఫలములు, ఎంతో రుచికరముగా ఉండెను. అనావృష్టియును, చోరభయమును, హింసాదిక భీతియు లేదు. కైకేయీ దశరథుల ఆజ్ఞతో కైకేయీ సోదరుడును భరతుని మేనమామయును అయిన యుధాజిత్తు; భరత, శత్రుఘ్నులను తనరాజ్యమునకు పిలచికొనిపోయెను. ఇట్లు మంగళప్రదమయిన శ్రీరాముని బాలలీలావినోదములు లోకుల మేలు కొరకును, నీ ప్రీతికొరకును చెప్పితిని.

***శతకోటిప్రవిస్తరమైన రామకథలో, శ్రీమద్వాల్మీకిమహర్షిచే రచింపబడిన, ఆనందరామాయణంలోని, సారకాండలో, శ్రీరామదినచర్యాను వర్ణనమనే ఐదవ సర్గ ముగిసినది.***



# షష్ఠః సర్గః-6వ సర్గ

## శ్రీరాముడు దండకారణ్యములో ప్రవేశించుట

శ్రీశివ ఉవాచ

ఏవం త్రేతాయుగే రామం నగర్యాం సీతయా సుఖమ్ ।
క్రీడంతం నారదోఽభ్యేత్య జగాదాకాశవర్త్మనా ॥ 1

అథ రామో మునిం పూజ్య సీతయా లక్ష్మణేన చ ।
శుశ్రావ వచనం తస్య సురైర్విజ్ఞాపితం చ యత్ ॥ 2

నిహత్య రావణం యుద్ధే తతో రాజ్యం కురుష్వ హి ।
అంగీకృత్య రఘుశ్రేష్ఠః తం మునిం వ్యససర్జయత్ ॥ 3

అథ రామోఽబ్రవీత్సీతాం మమ రాజ్యాభిషేచనమ్ ।
కర్తుకామోఽస్తి తత్రాహం విఘ్నముత్పాద్య దండకమ్ ॥ 4

గచ్ఛామి రావణాదీనాం వధార్థం లక్ష్మణేనచ ।
అయోధ్యాయాం వసాత్ర త్వం కౌసల్యాం పార్థివం భజ ॥ 5

తద్రామవచనం శ్రుత్వా ప్రణిపత్య రఘూత్తమమ్ ।
ఉవాచ మధురం వాక్యం వనం మాం త్వం నయ ప్రభో ॥ 6

కారణాన్యత్ర వై త్రీణి సంతి తాని వదామ్యహమ్ ।
భవత్వద్య ప్రయాణం మే దండకం హి త్వయా సహ ॥ 7

వనప్రయాణం మామాహ భర్త్రా స సత్యవాగ్ద్విజః ।
బాలత్వే కరరేఖాం మే దృష్ట్వా కశ్చిత్ ద్విజాగ్రణీః ॥ 8

అన్యత్స్వయంవరే పూర్వం సురానపి మయోదితమ్ ।
యదా చాపాంతికం ప్రాప్తః సజ్జితుం త్వం సభాంగణ ॥ 9

చతుర్దశ వత్సరాణి మునివృత్త్యనువర్తినీ ।
విచరిష్యామ్యరణ్యేఽహం ధనుః సజ్జంకరోత్వయమ్ ॥ 10

**తత్సత్యం కురు మద్వాక్యం ప్రయాణాద్దండకం త్వయా ।**
**అన్యచ్ఛ్రుతం మయా పూర్వం రామాయణమనుత్తమమ్ ॥ 11**

**తత్ర సీతాం వినా రామో న గతోఽస్తి హి దండకమ్ ।**
**తస్మాత్త్వం మాం రఘుశ్రేష్ఠ దండకం నేతుమర్హసి ॥ 12**

**తత్సీతావచనం శ్రుత్వా తథాస్త్వితి వచోఽబ్రవీత్ ।**
**విహస్య రాఘవః శ్రీమాన్ సమాలింగ్య విదేహజామ్ ॥ 13**

ఇట్లు శ్రీరాముడు సీతతో నగరమున క్రీడించుచుండగా పంద్రెండవయేట నారదుడు గగనమునుండి దిగెను. సీతతోడను, లక్ష్మణునితోడను రాముడు ఆ మునిని సత్కరించెను. పిదప, నారదుడు, "రఘూత్తమా! దేవతలిట్లు విన్నవించుచున్నారు. రావణుని జంపిన పిదప రాజ్యమును ఏలవలయును," అని చెప్పెను. అందుకు రాముడు అంగీకరించి మునిని పంపించెను. అంత శ్రీరాముడు, "సీతా! మా నాన్న నాకు రాజ్యాభిషేకము జేయదలచి యున్నాడు. అందుకు నేను విఘ్నమును పుట్టించి, లక్ష్మణునితోడ రావణాదులను చంపుటకై దండకావనమునకు వెడలుదును. నీ విచ్చటనే అత్తమామలను సేవించు చుండుము," అనగా, సీత రామునికి నమస్కరించి, ముచ్చటైన మాటలను ఇట్లుపలికెను, "నాథా! నన్నుకూడా వనమునకు తీసికొనిపొమ్ము. ఇందులో మూడు కారణములు గలవు నా చిన్నతనములో సత్యవచనుడైన బ్రాహ్మణుడొకడు నా చేతిరేఖలను జూచి, పతితోడ ఈమెకు వనప్రయాణమున్నదని చెప్పియున్నాడు. శాస్త్రముతప్పునా? అంతేగాక నా స్వయంవర సమయమున నీవు ధనస్సును ఎక్కుపెట్టినపుడు, నేను, "ఓ దేవతలారా! ఈ రాముడు ఈ శివ ధనస్సును ఎక్కుబెట్టి, గెలిచి నన్ను వివాహము చేసికొనినచో అందుకు నేను మునివృత్తిని అవలంబించి, 14 సంవత్సరములు వనమున వసించెదను," అని ప్రతిజ్ఞచేసితిని. అది నెరవేరవలసినదే గదా? శ్రేష్ఠమైన రామాయణకథను నేను వినియున్నాను. అందులో సీతను వదలి రాముడు దండకా వనమునకు వెడలినట్లు లేదుకదా? ఈ మూడు కారణములనుబట్టి నన్ను నీవు వెంటబెట్టుకొని పోదగును," అనిన, సీతమాట విని, నవ్వి, ఆలింగించి, అట్లే కానిమ్మనెను. (13)

**అథ రాజా దశరథః శ్రీరామస్యాభిషేచనమ్ ।**
**యౌవరాజ్యపదే కర్తుం ఉద్యుక్తః ప్రాహ వై గురుమ్ ॥ 14**

**యౌవరాజ్యపదే రామమభిషేక్తుం త్వమర్హసి ।**
**తద్రాజవచనం శ్రుత్వా గురుర్దశరథం నృపమ్ ॥ 15**

కౌసల్యాగృహమానీయ బోధయామాస వై రహః ।
రాజన్ శృణు త్వం కౌసల్యాసుమిత్రే శృణుతం త్విమే ॥ **16**

రావణస్య వధార్థం హి రామః శ్వే దండకం వనమ్ ।
గమిష్యతి లక్ష్మణేన సీతాయా కైకయీవరాత్ ॥ **17**

తస్మాత్త్వమజ్ఞవత్తూష్ణీం సంభారానభిషేచితుమ్ ।
కారయస్వ సుమంత్రేణ సమాహూయ నృపాదికాన్ ॥ **18**

శ్రీరామవిరహాద్రాజన్ బ్రాహ్మణస్యాపి శాపతః ।
అరాచిదేవ స్వర్లోకం త్వం గమిష్యసి పార్థివ ॥ **19**

కౌసల్యేయం రామరాజ్యోత్సవం పశ్యతు వై పునః ।
అంతరిక్షాద్విమానస్థస్త్వం పశ్యసి మహోత్సవమ్ ॥ **20**

దుర్లంఘ్యా భావినీ రేఖా బ్రహ్మాదీనాం నృపోత్తమ ।
ఇతి శ్రుత్వా గురోర్వాక్యం తేన రాజా సభాం యయౌ ॥ **21**

## శ్రీరామపట్టాభిషేక ప్రయత్నము.

పిమ్మట దశరథుడును శ్రీరామునికి యౌవరాజ్య పట్టాభిషేకము జేయదలచి, వశిష్ఠులను, “మీరు రామునికి పట్టాభిషేకము జేయగలరు,” అని ప్రార్థించెను. అందుకు ఆ ముని రాజును కౌసల్యా మందిరమునకు పిలిచికొని పోయి, రహస్యమున, “రాజా! వినుము; కౌసల్యా, సుమిత్రలారా! వినుడు; కైకేయీ వరమువలన రావణాదులను సంహరించుటకై శ్రీరాముడు రేపు సీతను, లక్ష్మణుని వెంటతీసికొని, దండకారణ్యమునకు పోవుచున్నాడు. కాబట్టి, మీరు ఏమీ తెలియనివారివలే అభిషేక సంభారములను ఊరక సిద్ధము చేయింపుడు. సుమంత్రునిచే రాజులను పిలిపింపుము, రాజా! రామ విరహమువలన, బ్రాహ్మణ శాపమువలనను త్వరగానే నీవు స్వర్గలోకమునకు పోవుదువు. ఈ కౌసల్య మరల రామరాజ్యోత్సవమును చూచును. నీవును విమానము నుండి చూతువు. భవిష్యద్రేఖ బ్రహ్మాదులైనను తప్పక యనుభవించవలసినది,” అని ఉపదేశించిన పిదప దశరథుడు సభకు వెడలి రామ రాజ్యాభిషేకమునకు సంభారములనన్నిటిని సిద్ధముచేయమని చెప్పెను.

రామరాజ్యాభిషేకాయ సంభారానకరోన్ముదా ।
దూతైరాకారయామాస నృపాన్ దశరథస్తదా ॥ **22**

ఋషీశ్వరాః సమాజగ్ముః నానాశ్రమనివాసినః ।
నగరీం శోభయామాసుః దూతాశ్చిత్రధ్వజోత్తమైః ॥ 23

పతాకాభిస్తోరణైశ్చ హేమకుంభైర్మనోరమైః ।
గురురాజ్ఞాపయామాస సుమంత్రం నృపమంత్రిణమ్ ॥ 24

శ్వః ప్రభాతే మధ్యకక్షే కన్యకాః స్వర్ణభూషితాః ।
తిష్ఠంతు షోడశ గజాః స్వర్ణరత్నాదిభూషితాః ॥ 25

చతుర్దంతః సమాయాతు ఐరావతకులోద్భవః ।
నానాతీర్థోదకైః పూర్ణాః స్వర్ణకుంభాః సహస్రశః ॥ 26

స్థాప్యతాం తత్ర వైయాఘ్రచర్మాణి త్రీణిచానయ ।
శ్వేతచ్ఛత్రం రత్నదండం ముక్తామణివిరాజితమ్ ॥ 27

దివ్యమాల్యాని వస్త్రాణి దివ్యాన్యాభరణాని చ ।
మునయ స్సంస్కృతాస్తత్ర తిష్ఠంతు కుశపాణయః ॥ 28

నర్తక్యో వారముఖ్యాశ్చ గాయకా వైదికాస్తథా ।
నానావాదిత్రకుశలా వాదయంతు నృపాంగణే ॥ 29

హస్త్యశ్వరథపాదాతా బహిస్తిష్ఠంతు సాయుధాః ।
నగరే యాని తిష్ఠంతి దేవతాయతనాని చ ॥ 30

తేషు ప్రవర్తతాం పూజా నానాబలిభిరాదృతాః ।
రాజానః శీఘ్రమాయాంతు నానోపాయనపాణయః ॥ 31

ఇత్యాదిశ్య వసిష్ఠస్తు రథేన రఘునందనమ్ ।
గత్వా సంమానితస్తేన సర్వం వృత్తం న్యవేదయత్ ॥ 32

నిమిత్తమాత్రస్త్వం రామ శ్వో గమిష్యసి దండకాన్ ।
చతుర్దశ సమాస్తత్ర స్థిత్వా సంహృత్య రావణమ్ ॥ 33

బంధునా సీతయా సార్ధం తతో రాజ్యం కరిష్యసి ।
లౌకికీం వృత్తిమాలంబ్య స్వీకురుష్వ పితుర్వచః ॥ 34

**అద్య త్వం సీతయా సార్ధముపవాసం యథావిధి ।**
**కృత్వా శుచిర్భూమిశాయీ భవ రామ జితేంద్రియః ॥ 35**

**ఇత్యుక్త్వా రథమారుహ్య దృష్ట్వా రామం సలక్ష్మణమ్ ।**
**జానకీ చాపి స గురుర్యయౌ రాజగృహం పునః ॥ 36**

**కౌసల్యా చ సుమిత్రా చ రామరాజ్యాభిషేచనమ్ ।**
**మృషాఽపి శ్రుత్వా శ్రీగురోరాస్యాత్ స్నేహసమన్వితే ॥ 37**

**చక్రతుః పూజనం దేవ్యాస్తద్విఘ్నోపశమస్పృహే ।**
**బలిదానైః శాంతపాఠైః మునివృందసమన్వితే ॥ 38**

దూతలనంపి రాజులను పిలిపించెను. ఋషులు దయచేసిరి. పట్టణము దివ్యాలంకారములతో నయనానందకరముగా ఉండెను. అపుడు వశిష్ఠుడు సుమంత్రునితో, "రేపు ప్రొద్దున మధ్యవరుసలో సువర్ణాలంకృతలగు కన్యలుండుగాక. స్వర్ణరత్నాలంకృత ఏనుగులు (16) వచ్చుగాక. ఐరావత వర్గమునకు చెందిన నాలుగు దంతములు గల ఏనుగును తీసుకొనిరండు. సమస్తతీర్థముల పుణ్యజలములు తెప్పించబడినవి. పులిచర్మములు మూడుకావలయును. రత్నదండమును, ముత్తెముల జాలర్లునుగల శ్వేతఛత్రమును దివ్య పూలమాలలను, దివ్య వస్త్రములను, దివ్యాభరణములను సిద్ధపరచవలయును. చేతులలో దర్భలు, సమిధలు ధరించిన మునులు సిద్ధముగా ఉండదగును. మంగళవాద్యములు మ్రోగుచుండవలయును. చతురంగసైన్యం సాయుధముగా వచ్చినిలవనీ, ఊరిలోని దేవాలయములలో పూజోత్సవములు జరుపవలయును, కప్పములను సమర్పించుటకు రాజులు సర్వసిద్ధులుగా ఉండవలయును," అని యాజ్ఞాపించి, రథమునెక్కి, శ్రీరాముని వద్దకు వచ్చి, ఏర్పాట్లను నివేదించి, "రాముడా! రేపు నీవు దండకారణ్యమునకు వెళ్ళుదువు. 14 సంవత్సరములచ్చట ఉండి, రావణుని సంహరించి, సీతతోడ, లక్ష్మణునితోడ మరలవచ్చి, రాజ్యమునేలెదవు. లోకరీతిని అనుసరించి, తండ్రిమాటను వినుము. నేడు సీతతోడ యథావిధిగా ఉపవాసవ్రతమును ఆచరింపుము. ఇంద్రియనిగ్రహముతో భూమిపై శయనించుము." అని చెప్పి, శ్రీసీతారామ లక్ష్మణులను చూచి, తన ఇంటికి వెడలెను. కౌసల్యా, సుమిత్రలు వశిష్ఠులవారి నుండి రామరాజ్యాభిషేకము ఒట్టిదేనని విని, అనుతాపము కలిగి, విఘ్నశాంతికై మునులచేత శాంతి కర్మలను చేయించి, దేవిని ఆరాధించిరి. (38)

**అథాపరాహ్ణే సౌధస్థా దాస్యాః పుత్రీ తు మంథరా ।**
**శోభితాం నాగరీం దృష్ట్వా పృష్ట్వా వృద్ధాం పథి స్థితామ్ ॥ 39**

శ్రుత్వా శ్రీరామరాజ్యార్థం యయౌ వేగేన కైకయీమ్ ।
సర్వం వృత్తం నివేద్యాథ తూష్ణీమాసీత్తదా క్షణమ్ ॥ 40

తత్‌శ్రుత్వా కైకయీ చాపి తస్యై భూషణమర్పయత్ ।
ఏతస్మిన్నంతరే వాణ్యా దేవవాక్యాత్సుమోహితా ॥ 41

తుష్టాం దృష్ట్వా తు కైకేయీం భర్త్సయంత్యాహ తాం పునః ।
మూఢే కథం త్వం తుష్టాఽసి హతభాగ్యాఽసి వేద్మ్యహమ్ ॥ 42

రామే రాజ్యపదం ప్రాప్తే కౌసల్యాయాశ్చ కైకయి ।
దాసీ భవిష్యసి త్వం హి అతో మద్వచనం కురు ॥ 43

వరేణ న్యాసభూతేన రాజ్యం శ్రీభరతాయ హి ।
నృపం ప్రార్థయ రామస్య ద్వితీయేన వరేణ చ ॥ 44

దండకారణ్యగమనం చతుర్దశ సమాః పదా ।
క్రోధాగారం ప్రవిశ్యాద్య కురుష్వ యన్మయేరితమ్ ॥ 45

## కైకేయీ వరదానముచే శ్రీరామాదుల దండకారణ్యయాత్ర.

పిదప మధ్యాహ్న సమయమున అంతఃపుర మేడపైనుండి దాసీపుత్రియగు మంథర రాజమార్గములోని మహోత్సవములను గూర్చి దారిలోపోవు ముసలిదానివలన రామపట్టాభిషేకమును గురించి విని, పరుగు పరుగున కైకేయీ వద్దకు వచ్చి, సంగతులనన్నిటిని చెప్పి, కొంతసేపు ఊరకయుండెను. అదివినిన కైకేయి శుభవార్త చెప్పిన మంథరకు వెంటనే ఆభరణమును, పారితోషకమునిచ్చెను. అంతలో దేవవాక్యమువలన, సరస్వతి వలన మోహింపబడినదియగు కైకేయిని జూచి, ఆమెను ధిక్కరించుచు మంథర నిట్లనెను. “మూఢురాలా! నీవు ఏల సంతోషించుచున్నావు? నీవు దురదృష్టురాలవయితివి అని అనుకొనుచున్నాను. రాముడు రాజ్యమేలుచుండునపుడు కౌసల్యకు నీవు దాసియైయుందువు గదా? కైకేయీ! కాబట్టి నా మాటవినుము. ఒకప్పుడు దశరథుడు నీకు ఇచ్చియున్న రెండు వరములను గుర్తుకు తెచ్చుకో, భరతునికి రాజ్యమును, రాముడు 14 సంవత్సరములు దండకారణ్య వాసియగుటను రెండు వరములుగా నీ భర్తను ప్రార్థింపుము. ఇప్పుడే క్రోధ సౌధమును ఎక్కుము. నేను చెప్పినట్లు చేయుము.” అనిన మంథర వాక్యములను వినిన కైకేయి ఆ మాటల మాయలోపడెను. శ్రీరామ దైవేచ్ఛచే కైకేయిని అవివేకం ఆవరించెను. అంత ఆ రాత్రి యామె శోకగృహమున ఉన్నదని తెలిసి, దశరథుడు త్వరగా అచ్చటికి వెళ్ళి, వెంట్రుకలు విరబోసుకుని, అలంకారమును వదలి, నేలమీద పడియుండు సతిని చూచి,...

తన్మంథరోక్తం స్వహితం మత్వా సాపి తథాఽకరోత్ ।
మోహితా సాఽవివేకేన శ్రీరాఘవసురేచ్ఛయా ॥ 46

తతో నిశాయాం రాజ్ఞా సా జ్ఞాతా క్రోధగృహస్థితా ।
గత్వా తత్ర నృపః శీఘ్రం దదర్శ కైకయీం తదా ॥ 47

వికీర్యమాణకేశాం తాం త్యక్త్వాఽలంకారమండనామ్ ।
భూమౌ శయానాం తాం దృష్ట్వా జ్ఞాత్వా తస్య మనోగతమ్ ॥ 48

రామాయ దండకారణ్యం యౌవరాజ్యం సుతాయ చ ।
వరాభ్యాం యాచితం జ్ఞాత్వా హేత్యుక్త్వా మూర్ఛితోఽభవత్ ॥ 49

ప్రభాతే తత్సుమిత్రేణ వృత్తం శ్రుత్వా నృపం యయౌ ।
కైకేయీ మంత్రిణా పృష్టా సుమంత్రం ప్రాహ సా తదా ॥ 50

అత్రానయస్వ శ్రీరామం ద్రష్టుం తం వాంఛతే నృపః ।
సోఽప్యాహ రామం నృపతిమపృష్ట్వా నానయామ్యహమ్ ॥ 51

తదా శనైః నృపః ప్రాహ శీఘ్రమానయ రాఘవమ్ ।
సుమంత్రోఽప్యానయామాస రాఘవం పార్థివాజ్ఞయా ॥ 52

తతో రామో నృపం గత్వా శ్రుత్వా కైకేయజాగిరా ।
ఆత్మానం దండకే వాసం వరదానం పితుః పురా ॥ 53

తథేత్యంగీచకారాథ నృపం వచనమబ్రవీత్ ।
మా తే శోకోఽస్తు హే తాత హ్యహం గచ్ఛామి దండకాన్ ॥ 54

తద్రామవచనం శ్రుత్వా హేత్యుక్త్వా నృపోఽబ్రవీత్ ।
మాం విసృజ్య కథం ఘోరం విపినం గంతుమిచ్ఛసి ॥ 55

తస్య తద్వచనం శ్రుత్వా సాంత్వయామాస రాఘవః ।
అహం ప్రతిజ్ఞాం నిస్తీర్థ శ్రీఘ్రం యాస్యామి తే పురమ్ ॥ 56

ఇదానీం గంతుమిచ్ఛామి వ్యేతు మాతుశ్చ హృచ్ఛయః ।
మాతరం చ సమాశ్వాస్య హ్యానునీయ చ జానకీమ్ ॥ 57

**ఆగత్య పాదౌ వందిత్వా తవ యాస్యే సుఖం వనమ్ ।**
**ఇత్యుక్త్వా తౌ పరిక్రమ్య మాతరం ద్రష్టుమాయయౌ ॥ 58**

రామునికి దండకారణ్యమును, భరతునికి యౌవరాజ్యమును రెండు వరములుగా నిచ్చుటయను ఆమె భావమును తెలుసుకుని, హా! యని మూర్ఛితుడాయెను. తెల్లవారగానే మంత్రియైన సుమంత్రుడు అచ్చటకు వెళ్ళి, ఏమిసంగతి యని విచారించగా, అపుడు కైకేయీ, "శ్రీరాముని ఇచ్చటకు పిలుచుకొనిరమ్ము. దశరథుడు చూడదలచు చున్నా"డనెను. అందుకు సుమంత్రుడు దశరథుని ద్వారా వివరము తెలుసుకుని, "నేను రాముని పిలుచుకొని రాను" అనెను. దానికి దశరథుడు సుమంత్రుని మందలించి, శ్రీరాముని ఇచ్చటకు తీసుకురమ్మని ఆజ్ఞాపించెను. దానితో సుమంత్రుడు రాజాజ్ఞ నెరవేర్చెను. శ్రీరాముడు కైకేయీ మందిరమునకు వచ్చి, కైకేయీ వచనముల వలన తనకు దండకారణ్యవాసము పూర్వము తండ్రియిచ్చిన వరముగా వచ్చిన సంగతి తెలుసుకుని, అట్లే గానిమ్మని అంగీకరించి, "తండ్రీ! నీవు చింతింపవలదు, నేను దండకారణ్యమునకు పోవుచున్నాను," అని రాముడు చెప్పెను. అందుకు దశరథుడు హాహాకారమును జేయుచు, "రామభద్రా! ఎట్లు నన్నువదలి ఘోరారణ్యమునకు పోదలచుచున్నావు?" అనగా శ్రీరాముడు, "నేను మీ ప్రతిజ్ఞను నెరవేర్చి, త్వరలో పట్టణమునకు వచ్చెదను, ఇపుడు దండకారణ్యమునకు వెళ్ళదలచెదను. తల్లి యిచ్ఛ సఫలమగుగాక. నా తల్లిని సమాధానపరచి, సీతను తీసికొనివచ్చి, మీ పాదములకు మ్రొక్కి, సుఖముగా వనమునకు పోవుచున్నాను," అని తండ్రితో స్వాంతన వచనములు పలికి, వెంటనే శ్రీరాముడు కౌసల్యా దేవి మందిరమునకు వెళ్ళి, తల్లిపాదములకు మ్రొక్కి, ఆమె ప్రశ్నలకు సమాధానములను చెప్పి, యెట్లో ఒప్పించి, ఆమె ఆజ్ఞను తీసుకుని, ప్రదక్షిణ నమస్కారములు చేసి, తన మందిరమునకు వచ్చి, సీతకు జరిగిన సమాచారమును తెలిపెను.

**నత్వా స్వమాతరం రామః సమాశ్వాస్య పునః పునః ।**
**నత్వా ప్రదక్షిణాః కృత్వా తామామంత్ర్య యయౌ గృహమ్ ॥ 59**

**సర్వ వృత్తం తు సీతాం స కథయామాస రాఘవః ।**
**సీతయా లక్ష్మణేనాపి వనం గంతుం పునః పునః ॥ 60**

**ప్రార్థితశ్చ తథేత్యుక్త్వా త్వరయామాస రాఘవః ।**
**సర్వస్వం బ్రాహ్మణాన్ దత్వా సీతయాఽగ్నిసమన్వితః ॥ 61**

**పద్భ్యామేవ శనైర్భ్రాత్రా యయౌ రామో నృపాంతికమ్ ।**
**గచ్ఛంతం పథి శ్రీరామం పద్భ్యాం దృష్ట్వా పురౌకసః ॥ 62**

పరస్పరేణ తే వృత్తం శ్రుత్వా వ్యాకులమానసాః ।
బభూవుస్తాన్ వామదేవః కథయామాస సాదరాత్ ॥ 63

నారదాగమనం రామప్రతిజ్ఞాం రావణస్య చ ।
వధాదికం సవిస్తారం విష్ణుం మనుజరూపిణమ్ ॥ 64

పౌరాః శ్రుత్వా గతక్లేశా హ్యభూవన్పృథి సంస్థితాః ।
తతో నత్వా నృపం రామః కైకేయీం వాక్యమబ్రవీత్ ॥ 65

అంబాగతోఽహం విపినం గంతుమాజ్ఞాం దదస్వ మామ్ ।
తతః సా వల్కలాదీని దదౌ రామాదికాంస్తదా ॥ 66

రామస్తాన్పరిధాయాథ స్వయం సీతామశిక్షయత్ ।
తత్‌దృష్ట్వా కైకయీం ప్రాహ గురుః క్రోధేన భర్త్సయన్ ॥ 67

జడే పాపిని దుర్వృత్తే రామ ఏవ త్వయా వృతః ।
వనవాసాయ దుష్టే త్వం సీతాయై కిం ప్రదాస్యసి ॥ 68

ఇత్యుక్త్వా దివ్యవస్త్రాణి సీతాయై స గురుర్దదౌ ।
రాజా దశరథోఽప్యాహ సుమంత్రం రథమానయ ॥ 69

రథమారుహ్య గచ్ఛంతు వనం వనచరప్రియాః ।
రామః ప్రదక్షిణం కృత్వా పితరౌ రథమారుహత్ ॥ 70

సీతయా లక్ష్మణేనాథ చోదయామాస సారథిమ్ ।
కౌసల్యాం చ సుమిత్రాం చ తాతమాశ్వాస్య వై పునః ॥ 71

సమాశ్వాస్య జనాన్ రామస్తమసాతీరమాయయౌ ।
మాఘమాసే సితే పక్షే పంచమ్యాం పరమేఽహని ॥ 72

ప్రాప్తే హ్యష్టాదశే వర్షే రాఘవాయ మహాత్మనే ।
ఆసీనద్వనప్రయాణం హి స్వపుర్యాస్తమసాతటమ్ ॥ 73

ఇంద్రాద్యా నిర్జరాశ్చక్రుస్తదా తన్మార్గసత్క్రియామ్ ।
ఆసన్ శుభాశ్చ శకునా రామస్య వ్రజతో వనమ్ ॥ 74

సీతయును, లక్ష్మణుడును మేమును వనమునకు అనుసరించి వచ్చెదమని పలుమార్లు ప్రార్థింపగా, రఘురాముడు అంగీకరించి త్వరగా సిద్ధమవ్వాలని ఆజ్ఞాపించి, తన ధనమంతయు బ్రాహ్మణులకు పంచిపెట్టి, సీతతోడ అగ్నిహోత్రముతో, లక్ష్మణుడు అనుసరించుచుండగా, దశరథమహారాజు సన్నిధికి వచ్చెను. కాలినడకతో వచ్చుచున్న రాముని జూచి, పౌరజనులు తమలో తాము సంగతిని తెలుసుకొని దుఃఖింపసాగిరి. అపుడు వామదేవుడు వారికి నారదాగమనమును, రామప్రతిజ్ఞను, భవిష్యత్ రావణ వధాది కార్యములను, నారాయణుడే శ్రీరాముని రూపములో నరునిగా నవతరించుటను గూడా తెలిపెను. అది విని, వారు సమాధానము నొంది, దారిలో నిలచి చూచుచుండిరి. అంత ఆ కైకతో, “తల్లీ! అరణ్యయాత్రకు అనుజ్ఞనిమ్ము,” అని శ్రీరాముడు వేడగా, ఆమె నారబట్టలు మొదలైనవాటిని రామాదులకు ఇచ్చెను. రాఘవుడు వాటిని తాను కట్టుకొని, సీతను చూచెను. ఆస్థితిని జూచి, వసిష్ఠుడు కోపగించెను, “పాపియగు కైకేయీ! నీవు మిక్కిలి దుష్టస్వభావముగలదానవు, నీవు రామ వనవాసమును వరముగా అడిగితివి, సీతకేల నారబట్టల నిచ్చెదవు?” అని తిరస్కరించి, జానకీదేవిని దివ్యవస్త్రములచే పురస్కరించెను. దశరథుడును సుమంత్రునితో, “రథమును తీసుకొనిరమ్ము. అరణ్య ప్రియులగు వీరు రథారూఢులై అరణ్యమునకు వెడలాలని,” అని ఆజ్ఞాపించెను.

## శ్రీరామాదులయొక్క అరణ్యప్రయాణము.

శ్రీరాముడు తండ్రికి, తల్లులకు ప్రదక్షిణ నమస్కారములు జేసి, సీతతోడ లక్ష్మణునితోడ రథమునెక్కి, సారథిని వెడలమని; కౌసల్యకును, సుమిత్రకును, తండ్రికిని పలుమార్లు సమాధానములను చెప్పి, జనులకు సమాధానము చెప్పుచు, తమసానదీతీరమునకు వచ్చెను. మహాత్ముడగు శ్రీరామునికి వివాహానంతరము18 సంవత్సరములు వచ్చుచుండగా మాఘశుక్ల పంచమినాడు అయోధ్యనుండి, తమసాతీరమునకు వచ్చుట సిద్ధించినది. ఇంద్రాది దేవతలు ఆ మార్గమున సత్కారమునొనర్చిరి. రాముడు వనమునకు వెడలుచుండగా శుభశకునములు ఎదురైనవి (74)

**ఉషిత్వైకాం నిశాం తత్ర శృంగబేరపురం యయౌ ।**
**గుహేన మానితశ్చాపి తత్ర రాత్రిం నినాయ సః ॥ 75**

**గుహానీతైర్వటక్షీరైర్బబంధ రాఘవో జటామ్ ।**
**ప్రభాతే సీతయాఽఽరుహ్య నౌకాయాం లక్ష్మణేన సః ॥ 76**

**ప్రేషయామాస స రథం సుమంత్ర నగరీం ప్రతి ।**
**గుహస్తాం వాహయామాస నౌకాం స్వజ్ఞాతిభిస్తదా ॥ 77**

**గంగామధ్యగతాం గంగాం ప్రార్థయామాస జానకీ ।**
**దేవి గంగే నమస్తేఽస్తు నివృత్తా వనవాసతః ॥ 78**

రామేణ సహితాఽహం త్వాం లక్ష్మణేన చ పూజయే ।
సురామాంసోపహారైశ్చ నానాబలిభిరాదృతా ॥ 79

ఇత్యుక్త్వాపరకూలం తు గత్వా రామో గుహం తదా ।
విసర్జయిత్వా తత్రైకాం నిశాం నీత్వా శ్శనైశ్శనైః ॥ 80

భరద్వాజాశ్రమం గత్వా తస్థౌ తేనాతిపూజితః ।
తతః ప్రయాగే యమునాం తీర్త్వా గత్వా మహావనమ్ ॥ 81

## శ్రీరామాదులు గుహునిచే పూజింపబడి గంగనుదాటుట.

ఇట్లు వెడలిన శ్రీరామాదులు తమసాతీరమున ఒకరాత్రియుండి, శృంగబేరపురమునకు వెడలి, అచ్చట గుహునిచేత సత్కరింపబడి, అచ్చటకూడ ఒకరాత్రి గడపి, గుహునిచేత తేబడిన మఱ్ఱిపాలతో జడలుగట్టుకొనెను. ప్రొద్దున లేచి, శ్రీరాఘవుడు, సీతయును, లక్ష్మణుడును కలసి నావనెక్కి, సుమంత్రుని రథమును తీసుకుని అయోధ్యకు వెళ్ళుమనెను. గుహుడు తనవారితోడ ఆ నావను నడిపెను. నావ గంగానది నడుమకు చేరినపుడు జానకీదేవి, "గంగా! భగవతి! నీకు నమస్కారము, మేము వనవాసమునుండి క్షేమముగా తిరిగి వచ్చునపుడు నిన్ను మద్య, మాంస, ఫలాహారాది ఉప హారములచే శ్రీరామలక్ష్మణులతోడ ఆరాధించెదను," అని జాహ్నవిని ప్రార్థించెను. శ్రీరాముడు ఆవలి గట్టునెక్కి, గుహుని వదలి, అచ్చట ఒకరాత్రి వాసముచేసి, తిన్న తిన్నగా భరద్వాజాశ్రమమును చేరి, ఆ మునిచే సత్కరింపబడెను. పిదప ప్రయాగలో యమునానదిని దాటి, యమునకు నమస్కరించి, వాల్మీకి ఆశ్రమముగల మహావనమునకు వచ్చి, ఆ మునీంద్రునిచే గౌరవింపబడుచుండెను. (81)

వాల్మీకేరాశ్రమం గత్వా తస్థౌ తేనాతిపూజితః ।
చిత్రకూటే లక్ష్మణేన పర్ణశాలాం మనోరమామ్ ॥ 82

కృత్వా మాంసైర్మృగోద్భూతైర్బలిం దత్వా రఘూత్తమః ।
తస్థౌ తస్యాం సుఖం భ్రాత్రా సీతయా స్వగృహం యథా ॥ 83

శయనాసనపాకాగ్నిదేవాదీనాం పృథక్ పృథక్ ।
తత్రాసన్ వివిధాః శాలాస్తరువల్లి విరాజితాః ॥ 84

కందైర్మూలైర్వనోద్భూతైర్మృగమాంసఫలాదిభిః ।
మునీశ్వరాణామాతిథ్యం చక్రుస్తే స్వగృహే యథా ॥ 85

ఏకదా నిద్రితం రామం సీతాంకే సన్నిరీక్ష్య చ ।
ఇంద్రః కాకస్తదాగత్య నఖైస్తుండేన చాసకృత్ ॥ 86

సీతాంగుష్ఠం మృదు రక్తం విదదారామిషాశయా ।
నిద్రాభంగ భయాద్భర్తుః సీతయా న నివారితః ॥ 87

సీతాంగుష్ఠం తు కాకేన భిన్నం దృష్ట్వా రఘూత్తమః ।
అభిద్రవంతం రక్తాస్యమిషీకాస్త్రం ముమోచ సః ॥ 88

కేనాప్యరక్షితస్యాస్త్ర భయాద్భ్రహ్మాండగోలకే ।
స్వశరణమాగతస్తస్య పునర్నారదవాక్యతః ॥ 89

ఇషీకాస్త్రేణ కాకస్య బిభేద నయనం క్షణాత్ ।
ఏవం నానాకౌతుకాని కుర్వంస్తస్థౌ సుఖం ప్రభుః ॥ 90

## మందాకినీ నది ఒడ్డున కాకికి ఒక కన్ను తొలగించుట

లక్ష్మణుడు మనోహరమగు పర్ణశాలను తయారుచేయగా, అందులో సీతారాములు మృగమాంసాది ఉపహారములను పంచ బ్రహ్మ యజ్ఞములచే బలిదానం గావించి, లక్ష్మణునితో గృహప్రవేశము చేసెను. సీతాదులు స్వంతఇంటిలో ఉన్నట్లే సుఖముగా ఉండిరి. అచ్చట పడకటిల్లు, వసారా, వంటయిల్లు, అగ్నికార్యమును చేయు అగ్నిగృహము, పూజామందిరము, స్నానశాల మొదలైనవి వేర్వేరుగా నిర్మింపబడినవి. ఆ పర్ణశాల చెట్లు, తీగలతో అందగించినది. తమ యింటిలో ఇచ్చినట్లే శ్రీరామాదులు నిత్యము మునీంద్రులకు కందమూల ఫలాది దివ్య వన్య వస్తువులతో అతిథి సత్కారము చేయుచుండిరి.

ఒకానొకసారి మందాకినీ నది ఒడ్డున సీతతొడమీద తలనుంచి రాముడు నిద్రబోవు చుండగా, ఇంద్రుని కుమారుడు కాకి రూపమున వచ్చి గోళ్ళచేతను, ముక్కుచేతను సీతను బాధించెను. పలుమార్లు ఆ కాకి సీత శరీరమును గాయపరచెను. పతికి నిద్రాభంగమగునని ఆ సతి దానిని భరించెను. అంత రాముడు మేల్కొని చూడగా, భయముతో పారిపోవుచున్న ఆ కాకి మీద రాముడు ఇషీకాస్త్రమును ప్రయోగించెను. ఆ కాకి బ్రహ్మాండమంతటా తిరిగినను తనకు ఆ ఇషీకాస్త్రముండి రక్షణ దొరకనందున అది తిరిగి తిరిగి మరణభీతితో శ్రీరాముని పాదములనే ఆశ్రయించెను. ప్రసన్న రాఘవుడు తిరుగులేని తన ఆయుధముతో ఆ కాకియొక్క ఒక కన్నును భేదించెను. ఇట్లు అనేక ఆశ్చర్య కార్యములను నెరవేర్చుచు, మహాప్రభువగు శ్రీరామచంద్రుడు సుఖముగా ఉండెను. (90)

సుమంత్రోఽపి పురీం గత్వా నృపం వృత్తం న్యవేదయత్ ।
సోఽపిరాజా రాఘవేతి జపన్స్వం జీవితం జహౌ ॥ 91

నృపం మృతం గురుర్ జ్ఞాత్వా తైలద్రోణ్యాం నిధాయ తమ్ ।
యుధాజిన్నగరాద్దూతైః కైకేయ్యాస్తనయావుభౌ ॥ 92

ఆనయామాస భరతశత్రుఘ్నౌ వేగతస్తదా ।
తావుభావపి వేగేన స్వాం పురీం సంవివేశతుః ॥ 93

మాత్రా సంపాదితం కృత్యం జ్ఞాత్వా ధిక్కృత్య మాతరమ్ ।
భరతః పితరం వహ్నిం దదౌ సరయుసైకతే ॥ 94

వీరాణాం మాతరస్తాశ్చ జగ్ముర్న స్వామినా దివమ్ ।
పితురుత్తరకార్యాది కర్మ కృత్వా సవిస్తరమ్ ॥ 95

మంథరాం తాడయామాస మాతురగ్రే పునః పునః ।
ప్రార్థితోఽప్యభిషేకార్థం రాజ్యమంగీచకార న ॥ 96

తతో మంత్రిజనైః సాకం మాతృభిః పురవాసిభిః ।
పరివర్తయితుం రామం యయౌ స భరతస్తదా ॥ 97

గుహేన మానితశ్చాపి భరద్వాజాశ్రమం యయౌ ।
తపోబలేన భూస్వర్గం నిర్మాయ భరతం మునిః ॥ 98

ససైన్యం పూజయామాస తం నత్వా భరతోఽపి నః ।
మునిసందర్శితపథా చిత్రకూటేఽగ్రజం యయౌ ॥ 99

దృష్ట్వా రామం తు శాలాయాం సీతయా బంధునా స్థితమ్ ।
నత్వా తేనాలింగితశ్చ సర్వం వృత్తం న్యవేదయత్ ॥ 100

రామః శ్రుత్వా మృతం తాతం గత్వా మందాకినీం నదీమ్ ।
స్నాత్వా తిలాంజలిం దత్వా యయౌ శాలాం నిజాంగిరౌ ॥ 101

తతస్తం ప్రార్థయామాస భరతో గురుణా సహ ।
రాజ్యార్థం రాఘవశ్చాపి నేత్యువాచ పునః పునః ॥ 102

ప్రాయోపవేశనం తత్ర దర్భేషు భరతస్తదా ।
చకార నిగ్రహం తస్య జ్ఞాత్వా గురుమచోదయత్ ॥ 103

రామాజ్ఞాయా గురుశ్చాహ భరతం బోధయస్తదా ।
భూభారహరణార్థాయ విష్ణుః సాక్షాత్ రఘూత్తమః ॥ 104

అత్ర జాతోఽస్తి దేవానాం వచనాద్రావణాదికాన్ ।
హంతుం గచ్ఛతి రామోఽద్య మా త్వం నిగ్రహమాచర ॥ 105

తతో జ్ఞాత్వా హరిం రామం భరతో రామమబ్రవీత్ ।
రాజ్యార్థం పాదుకే దేహి తయోః సేవాం కరోమ్యహమ్ ॥ 106

జటావల్కలధారీ చ వసామి నగరాద్బహిః ।
ప్రతీక్షాం తవ రాజేంద్ర వర్షాణి చతుర్దశ ॥ 107

కృత్వా చతుర్దశే వర్షే పూర్ణే గుప్తే రవౌ త్వహమ్ ।
ప్రవేక్ష్యామ్యనలం రామ సత్యమేతద్వచో మమ ॥ 108

తత్తస్య వచనం శ్రుత్వా తథేత్యుక్త్వా రఘూత్తమః ।
రాజ్యార్థం స్వీయపదయోః పాదుకే రత్నభూషితే ॥ 109

దదౌ రామస్తదా తస్మై తతస్తం స వ్యసర్జయత్ ।
గృహీత్వా పాదుకే దివ్యే భరతో రత్నభూషితే ॥ 110

మస్తకోపరి తే బధ్వా కృతకృత్యమమన్యత ।
తతో నత్వా రఘుశ్రేష్ఠం పరిక్రమ్య పునః పునః ॥ 111

## శ్రీరాముడు భరతునికి పాదుకలను ఇచ్చి అనుగ్రహించుట.

సుమంత్రుడు అయోధ్యకు చేరుకుని సీతా, రామ లక్ష్మణుల సంగతి దశరథునికి విన్నవించెను. ఆ దశరథమహారాజు 'రామరామ' యని ప్రాణములను విడిచెను. వశిష్ఠుడు మహారాజు మృతివార్త తెలుసుకుని, శవమును తైలఘటమున భద్రపరచి, యుధాజిత్తు పట్టణమునకు దూతలను పంపి, త్వరగా భరత, శత్రుఘ్నులను పిలిపించెను. వారును వేగమే ఏమిజరిగినదో అని అయోధ్యకు వచ్చిరి. అంత భరతుడు తల్లివలన జరిగిన దుష్కృత్యము తెలిసికొని, తల్లిని తిరస్కరించుచు, సరయూ తీరమున తండ్రికి ఉత్తరక్రియలను జరిపెను. కౌసల్య, సుమిత్ర, కైకేయి పతితోడ పరలోకయాత్ర

జేయకయుండిరి. భరతుడు సవిస్తరముగా తండ్రి ఉత్తరక్రియలను నెరవేర్చి, తల్లియెదుట మంథరకు తగిన శిక్షను విధించెను. అందరును రాజ్యాభిషేకమునకు మిక్కిలి ప్రార్థించినను భరతుడు అంగీకరింపక మంత్రులను, తల్లులను, పౌరులను వెంటతీసుకుని, శ్రీరాముని అరణ్యవాసమునుండి, తీసుకు రావలయునని బయలుదేరెను. మార్గమున గుహునిచే గౌరవింపబడి, భరద్వాజ ఆశ్రమమునకు వచ్చెను. ఆ మునీంద్రుడు తన తపోబలమువలన భూలోక స్వర్గమును నిర్మించి, సైన్యములతోడ భరతుని సత్కరించెను. అంత ఆ కైకేయి తనయుడు భరద్వాజ మునికి నమస్కరించి, వారిచే చూపబడిన మార్గమును అనుసరించి, చిత్రకూటమునకు చేరెను. పర్ణశాలలో లక్ష్మణునిచే, సీతచే సేవింపబడుచున్న శ్రీరాముని జూచి, నమస్కరించి, రామాలింగనము పొంది, తండ్రివృత్తాంతమును విన్నవించెను. రఘురాముడు తండ్రి మరణవార్త విని మందాకినికి వెడలి, స్నానముజేసి, తిలాంజలిని ఇచ్చి, తిరిగి దుఃఖభారముతో తన ఆశ్రమమునకు వచ్చెను. పిదప భరతుడు వసిష్ఠులతోడ రాజ్యమును ఏలుమని రాఘవునితో అత్యంత ప్రీతితో ప్రార్థించెను. రాముడును వలదు వలదని నిరాకరించు చుండెను. అందుకు భరతుడు రాముని ఎదుట దర్భలుపరచుకొని, ప్రాయోపవేశమునకు సిద్ధపడెను. భరతుని పట్టుదలను గ్రహించిన శ్రీరాముడు వసిష్ఠులను ప్రేరేపించెను.

వారు రామాజ్ఞచేత భరతునికి, "నాయనా! శ్రీరాముని నీవు ఒత్తిడి చేయవలదు, ఇతడు సాక్షాత్ నారాయణుడు. దేవప్రార్థనను అంగీకరించి, రావణాది దుష్టరాక్షసులను సంహరించి, భూభారమును పరిహరించుటకై అవతరించి యున్నాడు," అని సమాధాన వచనములను పలికెను. ఆ వెనుక భరతుడు తత్త్వము గ్రహించి, దాశరథితో, "అన్నా! రాజ్యముకొరకు నీ పాదుకలనైనా ఇమ్ము. నేను వాటిని సేవించెదను. జడలు దాల్చి, నారబట్టలను కట్టుకొని, ఊరిబయట వసించుచుందును. నీ కొరకు 14 సంవత్సరములు ఎదురు చూచెదను. 14వ ఏట పూర్తియై రవి అస్తమించగానే నీవు రాని పక్షములో నేను అగ్నిలో ప్రవేశించెదను. నామాట సత్యము," అని ప్రతిజ్ఞజేసెను. ఆ మాట విని రాముడు "అట్లే కానిమ్ము" అని, రాజ్యమేలుటకు రత్నాలంకృతములగు తన పాదుకలను భరతునకు అనుగ్రహించెను. పిదప భరతుడు ఆ రత్నపాదుకలను తలమీద పెట్టుకొని, నేనే ధన్యుడను అని సంతసించుచు, పలుమారు రఘురామునికి ప్రదక్షిణ నమస్కారములను ఆచరించి, రామానుజ్ఞనొంది, తిరిగి అయోధ్యకు వచ్చెను.

**సైన్యేన మాతృభిశ్శీఘ్రం రామమామంత్ర్య సో యయౌ ।**
**సంప్రార్థయత్కైకయీ సా రామచంద్రం పునః పునః ॥ 112**

**మయాఽపరాధితం రామ తత్క్షంతవ్యం రఘూత్తమ ।**
**తామాహ రామచంద్రోఽపి న త్వయా మేఽపరాధితమ్ ॥ 113**

**మచ్ఛందాన్మంథరావాక్యాత్త్వం వాణ్యా మోహితాతదా ।**
**సుఖం గచ్ఛాంబ స్వపురీం న క్రోధోఽస్తి మమ త్వయి ॥ 114**

**ఇత్యుక్త్వా రామచంద్రేణ భరతేన న్యవర్తత ।**
**భరతః పూర్వమార్గేణ యయౌ స్వనగరీం ముదా ॥ 115**

**సర్వాన్ స్థాప్య నగర్యాం తు నందిగ్రామమకల్పయత్ ।**
**తస్థౌ స భరతస్తత్ర స్థాప్య సింహాసనోపరి ॥ 116**

**రామస్య పాదుకే దివ్యే ఫలమూలాశనః స్వయమ్ ।**
**రాజకార్యాణి సర్వాణి యావన్తి పృథివీపతేః ॥ 117**

**తాని పాదుకయో స్సమ్యక్ నివేదయతి రాఘవః ।**
**గణయన్దివసాన్యేవ రామాగమనకాంక్షయా ॥ 118**

అపుడు ఆ కైకేయి, "రామచంద్రా! రఘునాథా, నేను చేసినది గొప్ప అపరాధము. దీనిని క్షమింపుము," అని వేడెను. అందుకు శ్రీరాముడు, "తల్లీ! నీవు నాకు అపరాధము చేయలేదు. అపుడు నీవు నా యిచ్ఛవలన మంథర వాక్యముచే, వాగ్దేవిచే మోహింపబడితివి. సుఖముగా అయోధ్యకు వెళ్ళుము. మీయందు నాకు కోపములేదు," అని సమాధానము చెప్పగా, ఆమెను భరతుడు తీసికొని పోయెను. అలా చిత్రకూటము నుండి తిరిగి వచ్చిన భరతుడు అందరిని అయోధ్యలో ఉంచి, తాను నందిగ్రామము వద్ద పర్ణశాల నిర్మించుకుని అందులో సింహాసనము మీద శ్రీరామ పాదుకలను ఉంచి, సమస్త రాజకార్యములను ఆ దివ్యపాదుకలకు నివేదించి, నెరవేర్చుచు, ఆ పాదుకలనే శ్రీరాముడని మనసున నమ్మి, తానూ మునివృత్తిని అవలంబించి, కందమూలఫలాశనుడై బ్రహ్మర్షి వలే శ్రీరామ ధ్యాన పరాయణుడై దినములు లెక్కించుచుండెను. (118)

**స్థితో రామార్పితమనాః సాక్షాత్ బ్రహ్మమునిర్యథా ।**
**రామోఽపి చిత్రకూటాద్రౌ వసన్మునిభిరాదృతః ॥ 119**

**చకార సీతయా క్రీడాం విపినే రమ్యపర్వతే ।**
**మన శ్శిలాసు తిలకం సీతాయా బాలకోఽకరోత్ ॥ 120**

**గండయోశ్చిత్రవల్లీః స చకార నిజహస్తతః ।**
**వృక్షారుణదలైశ్చిత్రైః కోమలైః కుసుమాదిభిః ॥ 121**

ఏవం క్రీడన్ సుఖం రామస్తస్థౌ పత్న్యాఽనుజేన చ ।
నాగరాస్తం సదా జగ్ముః రామదర్శనలాలసాః ॥ 122

దృష్ట్వా సజ్జనసంబాధం రామస్తత్యాజ తం గిరిమ్ ।
అన్వగాత్సీతయా భ్రాత్రా హ్యత్రేరాశ్రమముత్తమమ్ ॥ 123

నత్వాఽత్రిం మానితస్తేన తస్థౌ తత్ర దినత్రయమ్ ।
గుహస్థామనసూయాం తాం సీతాఽత్రేర్వచనాత్తదా ॥ 124

నత్వా తయాఽఽలింగితా సా తదంకే సముపావిశత్ ।
అనసూయా తదా సీతాం పూజయామాస సాదరమ్ ॥ 125

దివ్యే దదౌ కుండలే ద్వే నిర్మితే విశ్వకర్మణా ।
దుకూలే ద్వే దదౌ తస్యై నిర్మలే భక్తిసంయుతా ॥ 126

అంగరాగం చ సీతాయై దదావత్రేస్తు సా ప్రియా ।
న త్యక్ష్యతేఽంగశోభాం త్వం కదాపి జనకాత్మజే ॥ 127

పాతివ్రత్యం పురస్కృత్య రామమన్వేహి జానకి ।
కుశలీ రాఘవో యాతు త్వయా భ్రాత్రా పునర్గృహమ్ ॥ 128

భోజయిత్వా యథాన్యాయం రామం సీతాసమన్వితమ్ ।
అత్రిర్విసర్జయామాస రామో నత్వా యయౌ వనమ్ ॥ 129

ఏవం వర్షమతిక్రాంతం రామస్య గిరివాసినః ।
యథాసుఖం లక్ష్మణేన జానక్యా సహితస్య చ ॥ 130

ఏవం గిరీంద్రజేఽయోధ్యాపుర్యాం రామేణ యత్కృతమ్ ।
చరిత్రం తన్మయా కించిత్ త్వదగ్రేవినివేదితమ్ ॥ 131

ఇతి శ్రీశతకోటిరామచరితాంతర్గతే, శ్రీమదానందరామాయణే, వాల్మీకీయే, ఆదికావ్యే, బాలచరిత్రే, సారకాండే, అయోధ్యా చరిత్రే, దండకాననప్రవేశంనామ షష్ఠః సర్గః ॥

## శ్రీసీతారాములు అత్రిముని ఆశ్రమమున సత్కారముపొందుట.

ఇచ్చట శ్రీరాముడు చిత్రకూటాద్రిలో మునులతోడ వాసముచేయుచు ఆ సుందర అరణ్యమున సీతయొక్క నుదుటన అక్కడ లభించు రాతి తిలకమును పెట్టుచూ, చెక్కిళ్ళపై చిత్రలతలను గీయుచు, కొప్పున పుష్పములను, లతలను అలంకరించుచు, పత్నీసమేతుడైన రఘురాముడు లీలావినోదముల తో గడుపుచుండెను. అప్పుడు అక్కడ శ్రీరామ దర్శనార్థం జనులు పదేపదే వచ్చిపోవుటచే అక్కడి ఋషులకు ఇబ్బంది కలిగించడం ఇష్టంలేని శ్రీరాముడు చిత్రకూటమును వదలి, సతి తోడను తమ్మునితోడను, అత్రిముని ఆశ్రమమునకు పోయెను. అచ్చట శ్రీరాముడు మునికి నమస్కరించి, వారిచే సన్మానింపబడి, మూడుదినములుండెను. అపుడు సీతాదేవి అత్రిమాటమీద సహవాసినియగు అనసూయను జూచి నమస్కరించి, ఆమెచే ఆలింగింపబడి, ఆమె సన్నిధిలో కూర్చుండెను. అపుడు అనసూయ సాదరముగ సీతమ్మను సమ్మానించి, ఆమెకు విశ్వకర్మ నిర్మితములయిన దివ్య ఆభరణములను, దివ్యవస్త్రములను భక్తితో ఇచ్చి, లేపనములను అర్పించి, “జనకనందినీ! ఎప్పుడును నీ దేహమున కాంతి క్షీణించజాలదు. పాతివ్రత్యమును పురస్కరించి, రాముని అనుసరించి యుండుము. శ్రీరాఘవుడు క్షేమముగా తమ్మునితోను, నీతోను మరల అయోధ్యలో ప్రవేశించుగాక!” అని ఆశీర్వదించెను. అత్రిముని ఇట్లు సీతారాములను తగిన విధముగా భోజనాదులచే సత్కరించి పంపెను. శ్రీరాముడచ్చటినుండి దండకారణ్యములోనికి ప్రవేశించెను. ఇట్లు అరణ్యవాసులగు శ్రీరామాదులకు ఒక సంవత్సరము గతించెను. ఓసి పార్వతీ! ఇట్లు సాకేత రాజధానిలోని శ్రీరామవృత్తము కొంతవరకు చెప్పబడినది. (131)

***శతకోటి ప్రవిస్తరమైన రామకథలో, శ్రీమద్వాల్మీకిమహర్షిచే రచింపబడిన, ఆనందరామాయణంలోని, సారకాండలో, దండకానన ప్రవేశన వర్ణనమనే ఆరవసర్గ ముగిసినది.***



# సప్తమః సర్గః-7వ సర్గ

విరాధ, ఖర, దూషణుల వధ.

శ్రీశివ ఉవాచ

అథ రామః సీతయా తు లక్ష్మణేన సమన్వితః ।
యాయౌ స దండకారణ్యం సజ్జం కృత్వా మహద్ధనుః ॥ 1

అగ్రే యాయౌ స్వయం రామస్తత్ పృష్ఠే జానకీ యాయౌ ।
తస్యాః పృష్ఠ స సౌమిత్రిః యయౌ ధృతశరాసనః ॥ 2

వనే దృష్ట్వాఽథ కాసారం స్నాత్వా పీత్వా జలం సుఖమ్ ।
భుక్త్వా ఫలాని పక్వాని తస్థుస్తత్ర క్షణమ్ త్రయః ॥ 3

ఏతస్మిన్నంతరే తత్ర విరాధ నామ రాక్షసమ్ ।
తే తం దదృశురాయాంత మహాసత్వం భయానకమ్ ॥ 4

కరాళదంష్ట్రవదనం భీషయంతం స్వగర్జితైః ।
వామంసన్న్యస్త శూలాగ్రగ్రథతానేకమానుషమ్ ॥ 5

భక్షయన్త గజం వ్యాఘ్రు మహిషం వనగోచరమ్ ।
జయరోపితం ధనుర్ధృత్వా రామో లక్ష్మణమబ్రవీత్ ॥ 6

రక్ష త్వం జానకీమత్ర సంహనిష్యామి రాక్షసమ్ ।
స తు దృష్ట్వా రమానాథం లక్ష్మణం జానకీం తదా ॥ 7

కౌ యువామితి తౌ ప్రాహ తతో రామస్తమబ్రవీత్ ।
నామకర్మ నిజం సర్వం కైకేయ్యాఽపి చ యత్ కృతమ్ ॥ 8

తద్రామవచనం శ్రుత్వా విహస్య రక్షాసోఽబ్రవీత్ ।
మాం జానాసి త్వం రామ విరాధం లోకవిశ్రుతమ్ ॥ 9

మద్భయాన్ మునయః సర్వే త్యక్త్వా వనమితో గతాః ।
యది జీవితుమిచ్ఛాస్తి త్యక్త్వా సీతాం నిరాయుధౌ ॥ 10

ఫలాయేతాం న చేత్ శీఘ్రం భక్షయామి యువామహమ్ ।
ఇత్యుక్త్వా రాక్షసః సీతామాధాతుమభిదుద్రువే ॥ 11

రామశ్ఛేద తద్బాహూ శరేణ ప్రహసన్నివ ।
తతః క్రోధపరీతాత్మ వ్యాధాయ వికటం ముఖమ్ ॥ 12

రామమభ్యద్రవద్రామశ్చిచ్ఛేద పరిధావృతః ।
పదద్వయం తదా సర్వ ఇవాస్యేన యయౌ పునః ॥ 13

తతోఽర్ధచంద్ర కారేణ నిహతో రాఘవేణ సః ।
తతః సీతా సమాలింగ్య ప్రశశంస రఘూత్తమమ్ ॥ 14

దేవదున్దుభయో నేదుర్దివి దేవగణేరితాః ।
తతో విరాధకాయత్తు పురుషశ్చ వినిర్గతః ॥ 15

## శ్రీరాముడు విరాధుని సంహరించుట

అనంతరము శ్రీరాముడు సీతను, లక్ష్మణుని, వెంటదీసుకొని ధనుర్ధారియై దండకారణ్యము లోనికి ప్రవేశించెను. ముందు రాముడును వెనుక సీతయును ఆవెనుక ధనుర్ధారియగు లక్ష్మణుడును పోవుచుండిరి. ఆ వనమున ఒక సరోవరమును జూచి, స్నానపానములను ముగించి, సుఖముగ పక్వఫలములను భుజించి, ముప్వురును అచ్చట క్షణకాలముండిరి. అంతలో అచ్చట మహాబలుడును, భయంకరుడును, పదునైన కోరలు కలిగిన 'విరాధుడు' అను రాక్షసుడు తన ఎడమ భుజము పై మానవుని శరీరమును గుచ్చియున్న శూలాయుధమును మోసుకొని, చూపుడు వేలుచే భయపెట్టుచు, అడవి జంతువులను, దున్నపోతులను, పులులను భక్షించుచు వచ్చుచుండగా ఈ ముప్వురు జూచిరి. అప్పుడు శ్రీరాఘవుడు విల్లు చేతబూని లక్ష్మణునితో, "నీవు జానకిని రక్షించుము. నేను రక్కసుని జంపెదను," అనెను. అంతలో ఆ విరాధుడు, సీతారామ లక్ష్మణులను చూచి, "మీరెవర"ని అడిగెను. శ్రీరామునివలన సర్వ వృత్తాంతము తెలుసుకుని, పకపకనవ్వుచూ, రామునిజూచి, "రాముడా! నేను తెలుసునా? నాభయమువలన మునులు ఈ వనమును విడిచి పరుగెత్తిరి. బ్రతుకుపై ఆశ ఉన్నచో సీతను వదలి పరుగెత్తండి. అట్లు గాకపోయిన మీరిరువురిని నేను భక్షించెదను" అని చెప్పుచు, సీతను అంటబోయెను. శ్రీరాముడప్పుడు నవ్వుచు, వానిచేతులను ఖండించెను. ఆ రక్కసుడు క్రుద్ధుడై తన భయంకారాకారమును చూపుచూ, తరమసాగగా, రాముడు పరుగెత్తుచుండు వాని కాళ్ళను ఖండించెను.

నత్వా రామం నిజం వృత్తం కథయామాస సాదరమ్ ।
దుర్వాససాఽహం శప్తస్తు పురా విద్యాధరః శుభః ॥ 16

ఇదానీం మోచితః స్యాపాత్త్వయా కాలన్తరాద్వనే ।
ఇత్యుక్త్వా రాఘవం స్తుత్వా విమానేన యయౌ దివమ్ ॥ 17

విరాధే స్వర్గతే రామో లక్ష్మణేన చ సీతయా ।
జగామ శరభంగస్య వనం సుర్వసుఖావహమ్ ॥ 18

శరభంగం తతో నత్వా తేన సమ్మానితో బహు ।
తస్యై తత్ర నిశామేకాం శరభంగో మునీశ్వరః ॥ 19

తస్మై సమర్ప్య స్వం పుణ్యమారురోహ చితిం తదా ।
స్తుత్వా తం స విమానేన వైకుంఠం పరమం యయౌ ॥ 20

తతః శనైః సుతీక్ష్ణస్య యయావాశ్రమముత్తమమ్ ।
నత్వా తం పూజితస్తేన సుఖం తస్యై రఘూద్వహః ॥ 21

ఏతస్మిన్నంతరే తత్ర నానాశ్రమనివాసినః ।
మునయో రాఘవం ద్రష్టుం సమాజగ్ముః సహస్రశః ॥ 22

సర్వే తే రాఘవం నత్వా స్తుత్వా నిన్యుర్నిజం నిజమ్ ।
ఆశ్రమం సీతయా భ్రాతా చక్రుః పూజాం సవిస్తరామ్ ॥ 23

ఏకరాత్రం త్రిరాత్రం వా పంచ సప్త దినానివా ।
పక్షమాత్రం తు మాసం వా సార్ధమాసమథాపి వా ॥ 24

త్రిమాసాన్ పంచమాసం వా షష్టాష్టైకాదశాయవా ।
సాగ్రం  సంవత్సరం వాపి స్వాశ్రమేషు రఘూత్తమమ్ ॥ 25

సంస్థాప్య చక్రురాతిథ్యమధికం చోత్తరోత్తరమ్ ।
ప్రత్యూఽనుజేన శ్రీరామమేవం పూజ్య విసర్జయన్ ॥ 26

భ్రమతైవం హి రామేణ నవ వర్షాణి దండకే ।
ఆశ్రమేషు మునీనాం చ హ్యతిక్రాన్తాని వై సుఖమ్ ॥ 27

**బహవో నిహతాస్తత్ర రాక్షసా భ్రమతా తథా ।**
**రాఘవేణ సహ భ్రాత్రా క్రీడతాఽవనికన్యయా ॥ 28**

**నానాశ్రమరామపుష్పవనోపవనభూమిషు ।**
**నదీజలతటాకద్రిశిఖరాదిస్తలేష్వపి ॥ 29**

అంత ఆ విరాదుడు ఇనుపముద్దవలె దొరలుచు రాగా, రాఘవుడు అర్ధచంద్ర బాణముచే సంహరించెను. సంతోషించిన సీత రాముని హత్తుకొనెను. దేవదుందుభులు మ్రోగినవి. అపుడు విరాధుని దేహమునుండి దివ్యపురుషుడొకడు బయటికి వచ్చి, నమస్కరించుచు, "రామా! పూర్వము నేనొక విద్యాధరుడను, దుర్వాసముని శాపముచే ఇట్లు రాక్షసుడైనాను. కాలాంతరమున ఈ ఘోర అరణ్యములో నీచే శాపవిముక్తుడనైతిని," అని చెప్పి రాముని స్తుతించి, విమానమునెక్కి స్వర్గమునకు పోయెను.

## శ్రీరాముడు శరభంగమునికి ముక్తినిచ్చుట.

ఆ తరువాత రాఘవుడు సీతతోను, లక్ష్మణుని తోను శరభంగ ఆశ్రమమునకు వెడలెను. ఆ మునికి నమస్కరించి, వారిచే సమ్మానితుడై, అచ్చట ఒకరాత్రి వసించెను. ఆ శరభంగ మునీశ్వరుడు తన పుణ్యమును శ్రీరామునికి సమర్పించెను. తన దేహమును చితాగ్నికి సమర్పించి, శ్రీరాముని స్తోత్రముజేయుచు, దివ్య విమానమును ఎక్కి, వైకుంఠమును చేరెను. (20) పిమ్మట రఘునాథుడు తిన్నగా ఉత్తమమగు సుతీక్ష్ణమునియొక్క ఆశ్రమమునకు వెడలి, అతనిచే పూజితుడై సుఖముగా అచ్చట నిలిచెను.

## శ్రీరామాదులకు మునులచే సత్కారములు.

శ్రీ సీతారామ లక్ష్మణుల ఆగమనము తెలుసుకుని వివిధ ఆశ్రమ వాసులు, మునులు, మహర్షులు శ్రీరామదర్శన కాంక్షులై వచ్చుచుండిరి. ఆ మహామునులందరు శ్రీసీతారామ లక్ష్మణులను సాదరముగా ఆదరించుచుండిరి. ఒకరాత్రి, మూడురాత్రులు, ఐదారు దినములు, ఏడెనిమిది దినములు, ఒక పక్షము, మాసము, ఒకటిన్నర నెల, మూడునెలలు, ఐదు నెలలు 6-8-11 నెలలు తుదకు ఒక సంవత్సరము ఇట్లు కొందరు భక్తితో తమతమ ఆశ్రమములలో శ్రీసీతారామ లక్ష్మణులను నిలుపుకొని సుఖవసతినిచ్చి, సత్కరించి, పంపుచుండిరి. ఇట్లు మునుల ఆశ్రమములలో సంచరించుచుండి శ్రీరామాదులకు దండకారణ్యమున 9 సంవత్సరములు సుఖముగా గడచినవి.

జంబామ్రరంభాద్రాక్షాదినానావృక్ష లతేషు హి ।
చకార సీతయా క్రీడాం రామో దేవ్యా యథా శివః ॥ 30

అథ రామో యయౌ కుంభసంభవస్యానుజాశ్రమమ్ ।
సుమతిః పూజయామాస రాఘవం సీతయాన్వితమ్ ॥ 31

తతస్సీతాయుతో రామః శనైర్భ్రాత్రా ముదాన్వితః ।
అగస్తేరాశ్రమం ప్రాప నానావృక్షవిరాజితమ్ ॥ 32

ప్రత్యుద్గమ్య మునిశ్చాపి మునిభిర్ వటుభిర్ వృతః ।
రాఘవం తం సమాలింగ్య స్వాశ్రమం తేన సో యాయౌ ॥ 33

అథ తం పూజయామాస రాఘవం కుంభసంభవః ।
రామోఽపి మానితాస్తేన తస్థౌ తత్ర కియద్దినమ్ ॥ 34

తతః స్తుత్వా రమానాథమగస్త్యో మునిసత్తమః ।
దదౌ చాపం మహేంద్రేణ రామార్థం స్థాపితం పురా ॥ 35

అక్షయ్యౌ బాణాతూణీరౌ ఖడ్గం రత్నవిభూషితమ్ ।
తతో రామో మునేర్వాక్యాద్గౌతమ్యా ఉత్తరే తటే ॥ 36

యయౌ పంచవటీం రమ్యాం మార్గే దృష్ట్వాఽథ పక్షిణమ్ ।
జటాయుషం నగాకారమరుణాత్మజముత్తమమ్ ॥ 37

సఖాయం స్వపితుశ్చాపి సంభాష్యాథ వివేశ తత్ ।
తత్ర కృత్వా మహాశాలాం యథా పూర్వం కృతా గిరౌ ॥ 38

మృగమాంసైర్బలిం దత్వా తస్థౌ రామో యథాసుఖమ్ ।
సీతాం సంరక్షయామాస జటాయుః పక్షిరాట్ స్వయమ్ ॥ 39

రాఘవస్య పంచవట్యాం సీతయా క్రీడతః సుఖమ్ ।
సార్ధ త్రీణి వత్సరాణి హ్యతిక్రాన్తాని పార్వతి ॥ 40

దండకారణ్యమున రామ లక్ష్మణులచే అనేక మంది రాక్షసులు చంపబడిరి. శ్రీరాముడు సీతాదేవితోడ; పార్వతీ పరమేశ్వరులవలె, దివ్యారామములలోను, పుష్పవనములలోను, నదీతీరముల లోను, చెరువు గట్లమీదను, కొండకొమ్ముల మీదను, నేరేడు, మామిడి, అరటి మొదలైన వృక్ష, లతలతోను, ద్రాక్షాది తీగల పందిళ్ళలోను విహరించుచుండెను. (30) పిదప

## అగస్త్యముని శ్రీరాముని సత్కరించి, ధనుర్బాణాదులు సమర్పించుట

సీతారామలక్ష్మణులు అగస్త్యముని సోదరుడు 'సుమతి' ఆశ్రమమునకు పోయి, అతనిచే సత్కరింపబడి, అచటనుండి, తిన్నగా చరించుచు, అనేక వృక్షాలతో కూడిన అగస్త్య ముని ఆశ్రమమునకు వచ్చెను. ఆ ముని శ్రీరామాదులను స్వాగతించి, రాఘవుని హృదయానికి హత్తుకొని, తన ఆశ్రమవాసులను పరిచయము చేసెను. శ్రీరాముడచ్చట సమ్మానింపబడుతు, కొన్ని దినములు వసించెను. అప్పుడు అగస్త్యుడు శ్రీలక్ష్మీపతిని స్తుతించి, ఇంద్రునిచే మునుపు శ్రీరాముని కొరకని స్థాపింపబడిన దివ్య ధనస్సును, అక్షయములగు బాణ తూణీరములను, రత్నాలంకృతమగు ఖడ్గమును శ్రీరామునికి సమర్పించెను (35)

## సీతారామ లక్ష్మణులు పంచవటిలో వసించుట

పిదప శ్రీరాముడు అగస్త్యముని అనుజ్ఞతో, గోదావరి నదియొక్క ఉత్తరతీరమున రమ్యమగు పంచవటీక్షేత్రమునకు పోవుచు, దారిలో నున్న పర్వతాకారుడు అరుణపుత్రుడును, తన తండ్రికి మిత్రుడును, సుపవిత్రుడును అయిన జటాయువును జూచి, పరామర్శించి, పంచవటిలో ప్రవేశించి, అచ్చట పర్ణశాల నిర్మించుకుని, ఇంతకు మునుపువలె ఆ పర్ణశాల ప్రవేశ సమయంలో భూతబలినిచ్చి, ఆ పర్ణశాలలో అందరితో ఆనందించుచుండెను. ఆ పర్ణశాలకు సమీపములో ఉన్న జటాయువు స్వయముగా తానే సీతాదేవిని రక్షించుచుండెను. అలా సీతారాములు పంచవటిలో క్రీడించుచుండగా, మూడున్నర సంవత్సరములు గడచెను. (40)

**వనే శూర్పణఖాపుత్రం తపంతం సాంబనామకమ్ ।**
**బ్రహ్మే దదౌ దివ్యఖడ్గం తం సాంబో న దదర్శ సః ॥ 41**

**తద్ధృత్వా లక్ష్మణః ఖడ్గం వృక్షాన్ వల్లీర్బభంజ సః ।**
**వృక్షగుల్మే హతః సాంబస్తతో రాఘవమబ్రవీత్ ॥ 42**

**ప్రాయశ్చిత్తం బ్రహ్మహణం మాం వద త్వం రఘూత్తమ ।**
**రమోఽప్యాహ హతస్సాంబో రాక్షసో న మునిర్హతః ॥ 43**

**తచ్ఛ్రుత్వా లక్ష్మణస్తుష్టః సాంబమాత్రాపి తచ్ఛ్రుతమ్ ।**
**తత్స్మరంతీ పుత్రదుఃఖం రాక్షసీ కామరూపిణీ ॥ 44**

**విచచార శూర్పణఖా నామ్నీ చ సర్వఘాతినీ ।**
**ఏకదా పంచవట్యాం సా రామం దృష్ట్వాఽథ రాక్షసీ ॥ 45**

పుత్రదుఃఖ సమాక్రాంతా ధృత్వా రూపం మనోహరమ్ ।
కపట్యబుద్ధ్యా శ్రీరామం సానుజం హన్తుముద్యతా ॥ 46

ఉవాచ మధురం వాక్యం వస్త్రాలంకారమండితా ।
కౌ యువాం కా త్వియం రమ్యా కిమర్థమాగతా వనమ్ ॥ 47

కుతః సమాగతావత్ర క్వాధునా గచ్ఛతః పురః ।
తత్తస్యా వచనం శ్రుత్వా రామః సర్వం న్యవేదయేత్ ॥ 48

తతః సా రాఘవం ప్రాహ భవ భర్తా మమ ప్రభో ।
సోఽప్యాహ దయితా మేఽస్తి బహిస్తిష్ఠతి లక్ష్మణః ॥ 49

ప్రార్థయామాస సౌమిత్రి సా తం సోఽప్యుత్తరం దదౌ ।
అహం దాసోఽస్మి రామస్య త్వం తు దాసీ భవిష్యసి ॥ 50

తతః క్రోధేన సా సీతాం ధర్తుం వేగేన దుద్రువే ।
తదా తాం రాఘవః ప్రాహ మమాయం శర ఉత్తమః ॥ 51

చిహ్నార్థం లక్ష్మణాయ త్వం నీత్వా దర్శయ వేగతః ।
మద్బాణదర్శనాత్కార్యం సిద్ధిం నేష్యతి లక్ష్మణః ॥ 52

ఇత్యుక్త్వా రాఘవో బాణం దదౌ తస్మై క్షరోపమమ్ ।
సత్యం మత్వా రామవాక్యం సా యాయౌ లక్ష్మణం పునః ॥ 53

లక్ష్మణాయ రామబాణం దర్శయామాస రాక్షసీ ।
స బుద్ధ్వా హృద్గతం బంధోస్తం సంధాయ శరాసనే ॥ 54

ముమోచ బాణం వేగేన రామనామ్నాంకితం శుభమ్ ।
స శరో రాక్షసీం గత్వా ఘ్రాణకర్ణోష్ఠ హృచ్ఛవాన్ ॥ 55

సంఛిత్వా రామతూణీరం వివేశ క్షణమాత్రతః ।
ఘ్రాణకర్ణోష్ఠ హృజ్జాతరహితా సాఽపి రాక్షసీ ॥ 56

### లక్ష్మణుడు సాంబుని సంహరించుట.

అరణ్యమున సాంబుడను శూర్పణఖాపుత్రుడనువాడు తపము ఆచరించుచుండగా, వానికి

బ్రహ్మదేవుడు ఒక దివ్యమైన ఖడ్గమును అనుగ్రహించెను. సాంబుడు దానిని చూడలేదు. ఆ ఖడ్గమును లక్ష్మణుడు తీసుకొని, చెట్లతీగలను కత్తిరించు చుండగా, అందులో చిక్కి సాంబుడు మృతినొందెను. దానిని తెలుసుకుని, సుమిత్రాసుతుడు రామునితో, "అన్నా! బ్రహ్మహత్యా ప్రాయశ్చిత్తమును విధింపుము," అని వేడగా, శ్రీరాముడు నాయనా, "వధింపబడినవాడు సాంబుడను రాక్షసుడు. బ్రాహ్మణుడు కాడు. చింత ఏల?" అని లక్ష్మణుని సమాధానపరచెను. (43) కామరూపిణియై అరణ్యమున సంచరించుచుండు శూర్పణఖ అను రాక్షసి తన తనయుడగు సాంబుడు చచ్చిన సంగతి తెలిసి, దుఃఖించుచు, మహాక్రోధముతో, ఒకసారి పంచవటిలో రామునిజూచి, పుత్రశోక సమాకూలితయై, కపటబుద్ధితో శ్రీరామ, లక్ష్మణులను చంపనెంచి, దివ్య వస్త్రాభరణములను ధరించి, మృదుమధురముగ, "సుకుమారులైన మీరు ఎవ్వరు? ఈ మనోహరాంగి ఎవతె? ఈ అరణ్యమునకు ఏల వచ్చితిరి? ఇచ్చట ఏలనున్నారు? ఎచ్చటికి పోవుదురు?" అని విచారించెను. అందుకు శ్రీరాముడు దానికి తమ సంగతినంతటిని సవిస్తరముగా చెప్పెను. పిదప ఆ రాక్షసి రామునితో, "ప్రభూ! నాకు నీవు భర్తవు కావలయును," అని వేడెను. అందుకు శ్రీరాముడు, నాకు, "సీత యున్నది. లక్ష్మణుడు ప్రస్తుతము భార్యకు దూరముగా ఉన్నాడు," అనెను, ఆ శూర్పణఖ లక్ష్మణుని భర్తగా ప్రార్థించగా, లక్ష్మణుడు, నేను, "శ్రీరామునికి దాసునిగా ఉన్నాను, నీవు నన్ను వరించినచో నీవు కూడా దాసియగుదువు," అని చెప్పగా సౌమిత్రి మాటలకు, క్రుద్ధురాలైన రాక్షసి, సీతను చంపుటకు పరుగెత్తెను. అపుడు శ్రీరాముడు, రాక్షసితో "సుందరీ! ఇదిగో నా బాణము, నీవు దీనిని తీసికొని త్వరగా పోయి లక్ష్మణునికి గురుతుగా చూపుము. లక్ష్మణుడు నా బాణమును చూచి, నీకు కార్యసిద్ధి నొనరించును," అని బాణమును విసిరెను. అది నిజమని నమ్మిన శూర్పణఖ ఆ బాణమును తీసుకుని లక్ష్మణుని వద్దకు వెడలి, రామబాణమును చూపెను. అతడు అన్నయొక్క హృదయాభిప్రాయమును గుర్తించి, దానిని తన ధనస్సులలో సంధానము జేసి వేగముగా ప్రయోగించెను. ఆ రామనామాంకిత బాణము శూర్పణఖ యొక్క ముక్కు, చెవి, పెదవి, పాలిండ్లను ఛేదించి, క్షణమాత్రమున శ్రీరాముని అమ్ములపొదిలో దూరెను (56)

**హా హతాస్మీతి జల్పన్తీ యయౌ బంధూన్ ఖరాదికాన్ ।**
**దృష్ట్వా స్వసాం తదృశీం తే త్రిశిరః ఖరదూషణాః ॥ 57**

**తన్ముఖాత్సకలం వృత్తం శ్రుత్వా తే క్రోధసంయుతాః ।**
**చతుర్దశ మహాఘోరాన్ రాక్షసాన్ ప్రేషయంస్తదా ॥ 58**

**తాన్ రామః క్షణమాత్రేణ చతుర్దశ శరైర్యమమ్ ।**
**సంప్రదర్శ్య నిజం లోకం ప్రేషయామాస లీలయా ॥ 59**

తాన్ రాక్షసాన్ మృతాన్ శ్రుత్వా ఖరాద్యాస్తే త్రయః క్రుధా ।
యుద్ధాయ నిర్యయుః సైన్యైః సహస్రైశ్చ చతుర్దశ ॥ 60

రామోఽపి బంధు సీతాం చ గుహాయాం స్థాప్య వేగతః ।
చకార రాక్షసైర్యుద్ధం శస్త్రైరస్త్రైర్భయావహమ్ ॥ 61

చతుర్దశసహస్రాణి స్వీయరూపాణి రాఘవః ।
కృత్వా తేషాం చ పురతః శరైస్తాన్మర్దయత్ క్షణాత్ ॥ 62

హత్వా ఖరం దూషణం చ తథా స్త్రిశిరసం శరైః ।
చతుర్దశసహస్రాంస్తాన్ ప్రేషయామాస స్వం పదమ్ ॥ 63

ముహూర్తేన తు రామేణ సహస్రాణి చతుర్దశ ।
మితా సేనా ఖరాద్యైశ్చ నిహతా గౌతమీతటే ॥ 64

ఖరాద్యాః కంటకా యత్ర స్థితాస్తత్ర త్రికంఠకమ్ ।
క్షేత్రం ఖ్యాతం త్ర్యంబకాఖ్యం తదేవ ప్రోచ్యతే భువి ॥ 65

జనస్థానం భూసురాణాం దదౌ వస్తుం రఘూద్వహః ।
అథ సీతా సమాలింగ్య రాఘవం ప్రశశంస సా ॥ 66

అథ తాం జానకీం ప్రాహ రామో రహసి సాదరమ్ ।
సీతే త్వం త్రివిధా భూత్వా రజోరూప వసానలే ॥ 67

వామాంగే మే సత్వరూపా వస ఛాయా తమోమయి ।
పంచవట్యాం దశస్యస్య మోహనార్థం వసాత్ర వై ॥ 68

తద్రామవచనం శ్రుత్వా తథా సీతా చకార సా ।
తతఃశూర్పణఖా లంకాం గత్వా రావణమబ్రవీత్ ॥ 69

## శ్రీరాముడు ఖర, దూషణ, త్రిశిరాదులకు ముక్తినిచ్చుట.

ముక్కుపోయి, చెవులూడి, పెదవులు పగలి, స్తనములు తెగిన ఆ శూర్పణఖ, అయ్యో! చచ్చితినని, మొరలిడుచు, ఖరాది బంధువుల వద్దకు వచ్చెను. ఇట్టి దురవస్థనొందిన చెల్లెలను జూచి, ఖర, దూషణ, త్రిశిరులు దాని నోటినుండి అన్ని సంగతులు తెలుసుకొని, కోపముతో మిక్కిలి భయంకరులగు

ఘోరరాక్షసులను 14 వేలమందిని రామునిపై యుద్ధమునకు పంపిరి. రాముడు వారికి క్షణమాత్రమున 14 బాణములచే యముని చూపుచు, వైకుంఠమునిచ్చెను. ఆ రాక్షసులు చచ్చిన సంగతి తెలిసి, త్రిశిర, ఖర, దూషణాదులు ముువ్వురును క్రుద్ధులై 14 వేలసైన్యముతో యుద్ధమునకు వచ్చిరి. శ్రీరాముడు; సీతను, సౌమిత్రినీ గుహలో దాచి, శస్త్రములు పూని రాక్షసులతో ఘోరయుద్ధము చేసెను. క్షణమాత్రమున 14 వేల రామ రూపములతో వారిని ఎదిరించిన రాముడు, రాక్షసులనందరిని పరమపదమునకు పంపెను. ఖర, దూషణ, త్రిశిరులను సంహరించి ముక్తినిచ్చెను. ఒక ముహూర్తములో గౌతమ తీరమున రామబాణాగ్నిచే రాక్షసులందరును కాల్పబడిరి. లోక కంఠకులైన ఆ ఖర, దూషణ, త్రిశిరులున్న క్షేత్రము 'త్రికంటకము' అనియు 'త్రయంబకము' అనియు చెప్పబడుచున్నది. అపుడు శ్రీరాముడు బ్రాహ్మణులు వాసము చేయుటకై జనస్థానమును ఇచ్చెను. యుద్ధానంతరము సీత శ్రీరాముని హత్తుకుని పొగడెను. (66)

## శ్రీసీతారాముల రహస్య సల్లాపము.

పిదప శ్రీరాముడు జానకితో, "దేవీ! మూడువిధములుగా అనగా రజోరూపిణివై అగ్నిలో వాసముచేయుచు నాయెడను ప్రక్కలో సత్వరూపమునొందియుండుము. తమోరూపము దాల్చి, ఛాయను అవలంబింపుము. పంచవటిలో రావణుని మోహింపజేయుటకై ఛాయాశ్రయవై ఇచ్చటనే వసింపుము," అని రహస్యముగ, సాదరముగా చెప్పెను. సీత ఆ రామవచనమును అట్లేయని అంగీకరించి నెరవేర్చెను. పిదప శూర్పణఖ లంకకు వెడలి, రావణాసురునితో (69)

**ధిక్ త్వం రాక్షసరాజానం వృత్తం చారైర్న వేత్సి యః ।**
**చతుర్దశసహస్రా స సేనా త్వబంధుభిః సహ ॥ 70**

**మానుషేణైవ రామేణ జనస్థానే నిపాతితా ।**
**తత్తస్యా వచనం శ్రుత్వా తాం దృష్ట్వా తాదృశీం తదా ॥ 71**

**సింహాసనాచ్చ చాలాథ పునః పప్రచ్ఛ తాం స్వసామ్ ।**
**వద కిం కారణం యుద్ధే ప్రాహ సా రాక్షసేశ్వరమ్ ॥ 72**

**స్త్రీరత్నం జానకీం దృష్ట్వా మయా చిత్తే విచిన్తితమ్ ।**
**రావణార్థం వినేష్యామి ధర్తుం తాం తత్పురోగతా ॥ 73**

**తావద్బాణేన నీతాఽహం దశామేతాం తు రావణ ।**
**సౌమిత్రిణా పంచవట్యామాజ్ఞయా రాఘవస్య చ ॥ 74**

సాంబోఽపి మే హతః పుత్రస్తప్యమానో నిరర్థకమ్ ।
మత్తోఽర్థం కృతం యుద్ధం బంధుభిస్తే నిపాతితాః ॥ 75

యద్యస్తి పౌరుషం కించిత్ తర్హి సీతాం సమానయా ।
నోచేదధోముఖస్తిష్ఠ యథా స్త్రీ గతభర్తృకా ॥ 76

తత్తస్య వచనం శ్రుత్వా సాంత్వయామాస తాం స్వసామ్ ।
తౌ రామలక్ష్మణౌ హత్వా తవ శోకాశ్రుమార్జనమ్ ॥ 77

కరోమ్యహం లోహితేన తయోః ఖేదం భజస్వ మా ।
ఏవం నానావిధైర్వాక్యైః సాంత్వయిత్వా స్వసాం ముహుః ॥ 78

## శూర్పణఖ వచ్చి రావణునితో మొరపెట్టుకొనుట.

ఛీ, నీ రాక్షసరాజత్వము వ్యర్థము. నీవు చారులవలన వృత్తాంతము తెలుసుకొనలేకపోతివి. నీ తమ్ములతోడ 14 వేల సైన్యము ధ్వంసమయ్యె. జనస్థానమున మానవమాత్రుడు ఇట్లు చేసెను," అని చెప్పగా, రావణుడు కురూపియైన చెల్లెలిని చూచి, సింహాసనము నుండి ధిగ్గున లేచి, నిలచి, "యుద్ధము చేయుమందువా చెప్పు"మనెను. అపుడా శూర్పణఖ, "అన్నా! స్త్రీరత్నమగు జానకీ దేవిని జూచి, మన రావణునికి దీనిని తీసికొనిపోయెదనని ఆలోచించి, పట్టుటకు ప్రయత్నించితిని. అంతలో లక్ష్మణుడు పంచవటిలో రామాజ్ఞను పొంది, బాణప్రయోగము జేసి నన్నీదురవస్థకు తెచ్చెను. తపమాచరించుచున్న సాంబుడును వ్యర్థముగా చచ్చెను. నీ తమ్ములును చనిపోయిరి. నీకు శౌర్యము ఉన్నయెడల సీతను తీసుకొనిరమ్ము, లేదా భర్త మరణించిన స్త్రీ వలె తలవంచి పడియుండుము," అని నిందించెను. అందుకు రావణుడు, "చెల్లెలా! చింతింపకుము, రామ, లక్ష్మణుల జంపి, వారి రక్తముచే నీ కండ్లనీళ్ళను తుడిచెదను. ఆ దుఃఖమును విడువుము," అని వివిధమాటలచే, ఆమెను(78) ఊరడించెను.

స్వ హితస్యోపదేష్టారం మాతులం తపసి స్థితమ్ ।
యయౌ రథేన మారీచం తస్మై వృత్తం న్యవేదయత్ ॥ 79

సోఽథ తం భీషయామాస భాగినేయం ముహుర్ముహుః ।
విశ్వామిత్రాధ్వరే త్యక్త్వా మాత్మానం తం న్యవేదయత్ ॥ 80

రామాఖ్యయా రథం రత్నం రజతం ర్మక్తభూషితమ్ ।
శ్రుత్వాఽత్ర రాది యత్కించిత్ రామం మత్వా బిభేమ్యహమ్ ॥ 81

కేన తే శిక్షితా బుద్ధిరియం లంకావిఘాతిని ।
ఆప్తరూపోఽస్తి కః శత్రుః యేనేయం శిక్షితా మతి ॥ 82

కథాం న  కురు రామస్య తం దృష్ట్వా త్వం మరిష్యసి ।
తతః క్రోధేన తం ప్రాహ యది నాయాసి రాఘవమ్ । 83

మయా తర్హి వధిష్యామి త్వామతః కురు మద్వచః ।
భూత్వా త్వం మృగరూపశ్చ రామస్త్వామనుయాస్యతి ॥ 84

త్వం శబ్దం కురు రామస్య లక్ష్మణస్తేన యాస్యతి ।
తతస్తాం జానకీం వేగాల్లంకాం స్వామానయామ్యహమ్ ॥ 85

లంకాయాస్తవ దాస్యామి స్వీయరాజ్యార్థమాదరాత్ ।
ఇతి తస్యాగ్రహం దృష్ట్వా మారీచో హృద్యచింతయత్ ॥ 86

రామహస్తాన్మృతిః శ్రేష్ఠా మాఽస్తు రావణహస్తతః ।
ఇతి నిశ్చిత్య మారీచస్తథేత్యుక్త్వా యయౌ తదా ॥ 87

## రావణ, మారీచ మంత్రాలోచనము.

పిదప రావణుడు తన క్షేమమును కోరు తన మామయగు మారీచుడను రాక్షసుడు దండకారణ్యమున తపస్సు చేయుచుండగా అతని వద్దకు వెళ్ళెను. ఆ మారీచునకు జరిగినది చెప్పెను. ఆ మారీచుడు తన మేనల్లుడైన రావణుని వెరపించుచు, “రావణా! విశ్వామిత్రుని యజ్ఞమున నేను చావునుండి బయటపడి వచ్చాను. అప్పటినుండి ‘రా’ అను శబ్దము వినడానికే నేను వణుకు తున్నాను. ఎప్పుడైనా **ర**థమనినను, **ర**త్నమనినను, **ర**జతమనినను, **రు**క్మభూషణమనినను నేను విని ‘రేఫా’ ది పద శ్రవణమాత్రముననే భయపడుచున్నాను. లంకా నగరానికి వినాశనము కలిగించే ఈ దుర్బుద్ధి ఎవరివలన నీకు కలిగినది. ఏ పగవాడు నీకు ఆప్తుడుగా ఉన్నాడు? ఈ బుద్ధి నీకు ఎట్లు పుట్టె? రాముని జోలికి పోవలదు. వానిని జూచిన నీవు చత్తువు,” అని చెప్పెను. అందుచే కృద్ధుడయిన రావణుడు మారీచునితో, “నీవు రామునివద్దకు పోకపోతే నేను నిన్ను చంపుదును. కనుక నేను చెప్పినట్లు చేయుము. నీవు మాయా లేడి రూపమును ధరించినచో శ్రీరాముడు నీ వెంట వచ్చును. నీవపుడు రామునివలే మొరబెట్టిన, విని లక్ష్మణుడు వచ్చును. అంత నేను సీతను వేగమే లంకకు అపహరించి తెచ్చెదను. ఇందుకు గాను లంకయొక్క అర్ధరాజ్యమును నీకు ఇచ్చెదను,” అని ఆజ్ఞాపించెను. అపుడు మారీచుడు తన మదిలో రావణునిచే మృతినొందుట కన్నను రామబాణముచే ముక్తినొందుట మేలని ఎంచి, అట్లే కానిమ్మని ఒప్పుకొనెను.

రావణేన రథే స్థిత్వా గత్వా పంచవటీం ప్రతి ।
భూత్వా హేమమయశ్చిత్రో మోహయామాస జానకీమ్ ॥ 88

సా చ్ఛాయా తామసీ దృష్ట్వా మృగం రాఘవమబ్రవీత్ ।
క్రీడార్థం మాం మృగం చేమం ధృత్వా దేహి రఘూత్తమ ॥ 89

మృగశ్చేర్బాణభిన్నాంగః కరోమి కందుకీం త్వచః ।
తత్తస్య వచనం శ్రుత్వా జ్ఞాత్వా సర్వం రఘూత్తమః ॥ 90

సీతాయా రక్షణే బంధు సంస్థాప్యాశు మృగం యయౌ ।
తతః పలాయనం చక్రే మృగో రామం వికర్షయన్ ॥ 91

రామబాణేన భిన్నాంగః శబ్దం దీర్ఘం చకార సః ।
హా సౌమిత్రే సమాగచ్ఛ హా హతోస్మ్యద్య కాననే ॥ 92

ఇత్యుక్త్వా రామవద్వాచా మమార రుధిరం వమన్ ।
తం శబ్దం జానకీ శ్రుత్వా చోదయామాస లక్ష్మణమ్ ॥ 93

సోఽప్యాహ రామవచనం నేదం సీతే భయం త్యజ ।
తతః సా తం పునః ప్రాహ జానామి తవ చేష్టితమ్ ॥ 94

భరతస్యోపదేశేన మృతిం రామస్య వాంఛసి ।
అథవా మేఽభిలాషోస్తి తర్హి ప్రాణాంస్త్యజామ్యహమ్ ॥ 95

తత్క్రూరవచనం తస్యాః శ్రుత్వా జ్ఞాత్వా మహద్భయమ్ ।
జానకీం ప్రాహ సౌమిత్రి ర్మాతః శృణు వచో మమ ॥ 96

రాఘవాజ్ఞాం పురస్కృత్య రక్షతస్త్వాం మమ త్వయా ।
తాడితం వాక్శరేణాద్య భోక్ష్యస్యస్యాచిరాత్ఫలమ్ ॥ 97

తథాపి శృణు మద్వాక్యం యన్మయాఽత్రోచ్యతే హితమ్ ।
మయైతాం ధనుషో రేఖాం కృతాం త్వత్పరితోఽధునా ॥ 98

## సీతాహరణము, జటాయు మరణము

పిదప ఆ మారీచుడు రావణునితో రథమునెక్కి, పంచవటికి వెడలి, సువర్ణమయమ్మైన చిత్రమగు మృగాకారము దాల్చి, సీతను మోహింపజేసెను. తామసియై ఛాయారూపిణియగు సీత, మృగమును జూచి, రామునితో, "నాథా! నాకీమృగమును పట్టి యిచ్చిన, దీని చర్మముతో వస్త్రమును చేసికొందును" అనిన రాముడు సర్వజ్ఞుడై సీతారక్షణకు లక్ష్మణుని నియమించి, మృగమును వెంటాడెను. ఆ మృగము రాముని ఆకర్షించి, పరుగిడుచు, రాముని బాణమునకు గురియై "హా! లక్ష్మణా! రమ్ము, చంపబడితిని అయ్యో," అని రామునివలే అరచి, రక్తమును కక్కి, మృతినొందెను. సీత దానిని విని, లక్ష్మణుని పొమ్మనెను. అందుకు సౌమిత్రి, "వదినా! ఇది రామవచనము కాదు. భయమువల"ద నెను. అపుడు సీత, "నీ చేష్ట నాకు తెలియును. భరత ప్రేరితుడవై రాముని చావు గోరెదవు. లేదా, నా యందు వాంఛగలదేమో? అట్లైన నేను ప్రాణములను వదులుదును." అని నిందించెను.

త్వద్రక్షణార్థం దుష్టానాం దుర్విలంఘ్యాం మహత్తమామ్ ।
మా త్వముల్లంఘయస్వే మాం ప్రాణైః కంఠగతైరపి ॥ 99

ఇత్యుక్త్వా ధనుషః కోట్యా కృత్వా రేఖాం సమంతతః ।
బాహ్యదేశే పంచవట్యాః సౌమిత్రిః పరిఘోపమామ్ ॥ 100

నత్వా సీతాం తతస్తూష్ణీం యయౌ రామం త్వరాన్వితః ।
ఏతస్మిన్నంతరే తత్ర రావణో భిక్షురూపధృక్ ॥ 101

గత్వా పంచవటీ ద్వారం రేఖాయాశ్చ బహిః స్థితిః ।
నారాయణేతి వై చోక్త్వా తూష్ణీం తస్థౌ స రావణః ॥ 102

తావచ్ఛాయామయీ సీతా భిక్షాం తస్మై సమర్పితుమ్ ।
యయౌ ద్వారం దీర్ఘహస్తా గృహ్ణీష్వేత్యబ్రవీచ్చ తమ్ ॥ 103

తదా భిక్షుః పునః ప్రాహ సీతాం పంకజలోచనామ్ ।
నాంగీకరోమ్యంతరేణ భిక్షామేతాం త్వయార్పితామ్ ॥ 104

గార్హస్థ్యం చేద్రాఘవస్య రక్షితుం త్వం సమిచ్ఛసి ।
తర్హి రేఖాం సముల్లంఘ్య మాం భిక్షాం దాతుమర్హసి ॥ 105

తద్భిక్షువచనం శ్రుత్వాఽధర్మోఽభూన్మేతి శంకితా ।
రేఖాబహిః సవ్యపాదం దత్వా దీర్ఘ లసత్కరా ॥ 106

గృహ్ణీష్వేమాం వరాం భిక్షామితి తాం ప్రాహ జానకీ ।
తతో దశాస్యస్తాం ధృత్వా భిక్షురూపం విసృజ్య చ ॥ 107

ఖరవాహే రథే సీతాం సంస్థాప్యాథ న్యవర్తత ।
యావద్గచ్ఛతి వేగేన తావద్దృష్టో జటాయుషా ॥ 108

చకార తుములం యుద్ధం రావణేన స పక్షిరాట్ ।
నిజపద్భ్యాం ముఖేనాథ చూర్ణీకృత్య రథోత్తమమ్ ॥ 109

ఖరానష్టౌ వినిష్పిష్య బభంజ తద్ధనుర్మహత్ ।
ముకుటాన్ దశ సంఛిద్య కృత్వా దేహం తు జర్జరమ్ ॥ 110

మూర్ఛితం రావణం కృత్వా తాం సీతాః సంన్యవర్తయత్ ।
స్వస్థీభూతో దశాస్యోఽపి తాడయామాస తం పదా ॥ 111

క్రోధేన మహతావిష్టః పక్షిణా జర్జరీకృతః ।
తతో జటాయుః పతితో వమన్ రక్తం ముఖేన సః ॥ 112

సీత నోటినుండి ఆ క్రూరవాక్యమును వినిన లక్ష్మణుడు, భవిష్యద్భయము కలిగి, సీతతో, "తల్లీ! నా మాటను వినుము. శ్రీరామాజ్ఞను అనుసరించి, నిన్నురక్షించుదును నన్ను ములుకుల వంటి మాటలచే నొప్పించితివి. దీని ఫలమును అనుభవించెదవు. అయినను నా మాట వినుము. నీ చుట్టూ నా ధనస్సుచే నీ రక్షణకై వేయబడిన ఈ రేఖను ఎట్టి కష్టము వచ్చినను దాటిపోవలదు. ఇది నీకు హితము." అని చెప్పి, వింటి మొనతో పంచవటికి వెలుపల చుట్టూ నొకగీతను గీచి, మంత్రించి, సీతకు నమస్కరించి, మౌనము వహించి, రాముని వెదుకుటకు బయలుదేరెను. అంతలో అచట భిక్షుకుని రూపమును ధరించిన రావణుడు వచ్చి, పంచవటీ ముందు లక్ష్మణ రేఖకు వెలుపల నారాయణ స్మరణతో నిలబడెను. ఆ లోపల ఛాయామయి సీత భిక్షతీసుకుని వచ్చి, ద్వారమున నిలచి, చేయిజాపి, భిక్షను స్వీకరించమనెను. అప్పుడు భిక్షకుడైన రావణుడు సీతతో, "రేఖల నడుమ నుండి ఇవ్వబడు భిక్షను స్వీకరించను. రాముని గృహస్థ ధర్మమును రక్షించునదియైన రేఖను దాటివచ్చి, భిక్షనిమ్ము," అని చెప్పగా, జానకి తనకు అధర్మము సంభవించునని శంకించుచు, రేఖ దాటి ఒక్క అడుగు బయటపెట్టి, భిక్షను స్వీకరించమనెను. అంత ఆ రావణుడు ఆమెను పట్టుకొని, భిక్షపాత్రను వదలి, కంచరగాడిదల రథముపై నెక్కించుకొని తరలెను. అంత నతడు వేగముగ పోవునంతలో జటాయువు జూచి, రావణునితో ఘోరయుద్ధము చేసెను. జటాయువు రావణుని రథమును బద్ధలుజేసి, రథమునకున్న గాడిదలను పిండిచేసి, విల్లును విరచి, పదికిరీటములను ఎగురగొట్టి, దేహమును రంధ్రములు జేసి, ఆ రావణుని మూర్ఛితుని జేసి, సీత తోడ వెనుకకు తిరిగెను.

తతో విహాయ సా సీతాం నినాయ రావణః పునః ।
రామరామేతి జల్పంతీ సీతాఽధో భూన్న్యస్తలోచనా ॥ 113

ఉత్తరీయ బబంధాథ పథి స్వాభరణాని సా ।
దృష్ట్వాఽధః పర్వతే ప్రోచ్చైః సంస్థితాన్ పంచ వానరాన్ ॥ 114

ప్రాక్షిపత్కపిమధ్యేఽథ సూచనార్థం రఘూత్తమమ్ ।
తతో దశాస్యస్తాం నీత్వా హ్యశోకే సంన్యవేశయత్ ॥ 115

ప్రార్థయామాస తాం సీతాం నోత్తరం సా దదౌ తదా ।
తస్యాః సంరక్షణార్థాయ రాక్షసీశ్చ సహస్రశః ॥ 116

ఆజ్ఞాపయద్దశాస్యః స స్వయం గేహం వివేశ హ ।
తదేంద్రో బ్రహ్మవాక్యేన పాయసం వర్షతుష్టిదమ్ ॥ 117

దదౌ రహసి సీతాయై తేన తుష్టా బభూవ సా ।
సమర్ప్య పాయసం కించిద్రామాయ లక్ష్మణాయ చ ॥ 118

సురానతిథయే దత్వా దత్వా ధేనుం చ ఖేచరాన్ ।
దత్వాఽథ త్రిజటాం కించిద్భక్షయామాస జానకీ ॥ 119

సంమంత్ర్య రావణేనాపి రాక్షసాంశ్చైవ షోడశ ।
ప్రేషితా రామఘాతార్థం తే కబంధేన భక్షితాః ॥ 120

యత్ర యత్ర పంచవట్యాం రామబాణభయాన్మృగః ।
చచార గౌతమీతీరే సంస్థానం తత్ర తత్ర హి ॥ 121

స్థానసంజ్ఞాన్యనేకాని జాతాని చ పురాణి హి ।
మృగస్య పతితం యత్ర నూపురం పరిధావతా ॥ 122

నూపురాఖ్యో మహాగ్రామః ప్రోచ్యతే గౌతమీతటే ।
రామబాణప్రహారేణ చపలాక్షోఽపతద్భువి ॥ 123

మృగో యత్ర మహాంస్తత్ర చాపల్యగ్రామ ఈర్యతే ।
గోదాతటే గ్రామభూమ్యాం రామబాణహతో మృగః ॥ 124

**పతితో యత్ర తచ్చిహ్నం దృశ్యతేఽద్యాపి మానవైః ।**
**సౌమిత్రిచాపజా రేఖా పంచవట్యాః సమంతతః ॥ 125**

**అద్యాపి దృశ్యతే స్పష్టా నదీరూపా భయావహా ।**
**పాషాణభూమ్యాం తత్రైవ రావణస్య పదం మహత్ ॥ 126**

పిదప రావణుడు తేరుకుని లేచి, మహాకోపముతో, జటాయువుతో యుద్ధముచేసి, దానిని బాగా గాయపరచగా అది రక్తము గ్రక్కుచు, నేలపైబడగా, మరలా సీతను తీసుకుని రథముపై ఉంచుకుని ఆకాశమార్గమున వెడలెను. ఆకాశమార్గమున పోవుచున్న సీత, "రామా! రామా!" అని రోదిస్తూ, నేలజూచుచు, తన ఉత్తరీయమున ఆభరణములను ముడివేసి, క్రింద నిలచియున్న ఐదుమంది వానరులను జూచి, శ్రీరామునికి ఆనవాలుకొరకు పైనుండి ఆ సొమ్ముల మూటను జారవిడిచెను. పిదప రావణుడు సీతను లంకకు తీసుకుపోయెను. ఎంత ప్రాధేయపడినను లొంగని సీతను అశోకవనములో ఉంచి, రక్షణకొరకు వేలకొలది రాక్షస స్త్రీలను నియమించి రావణుడు తన అంతఃపురమునకు వెళ్ళెను. (116)

## ఇంద్రుడు సీతాదేవికి పాయసము ఇచ్చుట.

ఆ సమయమున బ్రహ్మదేవుని ఆజ్ఞచే దేవేంద్రుడు, ఆకలిని తీర్చే దివ్యపాయసము తెచ్చి, సీతకర్పించెను. ఆమె దానిని అందుకొని, దేవతలకు నమస్కరించి, రామ లక్ష్మణులకు నివేదించి దేవతలకు సమర్పించి, త్రిజటకు కొంచెమిచ్చి, తాను కొంచెము త్రాగెను. (149) పిమ్మట రావణుడు శ్రీరాముని చంపుటకు 16 మంది రాక్షసులను పంపగా వారిని కబంధుడు భక్షించెను.

## శ్రీరామచరితము ప్రత్యక్షసిద్ధమని పరమేశ్వరుడు ఆనతిచ్చుట

గోదావరి తీరమున పంచవటిలో ఎచ్చటెచ్చట రామ బాణ భయముచే మృగములు సంచరించెనో. నేడు అచటచ్చట అనేకములగు పుణ్యస్థల గుర్తులు, పట్టణములు వచ్చినవి. మృగనూపురము పడి దొరలిన చోటు నూపురమను పురమైనది. రాముని బాణములచే చపల నేత్ర అయిన లేడి చచ్చినచోటు 'చాపల్య' గ్రామమున్నది. గోదావరి తీరమున రాతినేలలో రామబాణ రథమగు మృగము పడగా దాని గురుతు ఇప్పటికి మానవులు చూచుచున్నారు. పంచవటికి చుట్టును లక్ష్మణుడు గీచిన ధనురేఖ భయంకరమైన నదీరూపముగా ఇప్పటికిని కనిపించుచున్నది.

**అద్యాపి దృశ్యతే భీమం గర్తరూపం నరోత్తమైః ।**
**ఖరాద్యైర్యుద్ధసమయే పంచవట్యాం విదేహజా ॥ 127**

గుహాయాం గోపితాభర్త్రా సాద్యాఽపి తత్ర దృశ్యతే ।
తథా రామో లక్ష్మణోఽపి పంచవట్యాం సదైవ హి ॥ 128

దృశ్యతేఽద్యాపి భో దేవి సజ్జనైర్జ్ఞాన దృష్టిభిః ।
అజ్ఞానదృష్టిభిస్తే తు దృశ్యతే గ్రావరూపిణః ॥ 129

రామతీర్థం రామకృతం సీతాలక్ష్మణసంస్కృతే ।
తీర్థే తత్ర తు గౌతమ్యాం దృశ్యతేఽద్యాపి మానవైః ॥ 130

రామేణ సీతయా యత్ర శయ్యాయాం పర్వతోపరి ।
కృతం పూర్వం తు శయనం రామశయ్యాగిరిః స్మృతః ॥ 131

శయ్యారూపాణి దృశ్యంతేఽద్యాపి తత్ర తృణానిహి ।
రామోఽపి లక్ష్మణం దృష్ట్వా శ్రుత్వా సీతావచోఽశుభమ్ ॥ 132

నివేదితం లక్ష్మణేన క్రోధాశ్రుస్మయచేతసా ।
నిమిత్తాన్యతిఘోరాణి దృష్ట్వా చైవ సమంతతః ॥ 133

యయౌ పంచవటీం వ్యగ్రస్తత్ర సీతాం దదర్శ న ।
తతో మానుషభావం తు దర్శయన్ సకలాన్ జనాన్ ॥ 134

విచిన్వన్సర్వతః సీతాం గృధ్రరాజం దదర్శ సః ।
తతః స పక్షివచసా రావణేన హృతాం ప్రియామ్ ॥ 135

జ్ఞాత్వా తం యోజయామాస వహ్నినా జీవితక్షయే ।
తత్తుష్ట్యర్థం వన్యమాంసం క్షిప్త్వా స్నాత్వా రఘూత్తమః ॥ 136

యయౌ దక్షిణమార్గేణ విచిన్వన్మూఢవత్ప్రభుః ।
పూర్వవదగ్నిహోత్రం చ చకార కుశభార్యయా ॥ 137

ఏతస్మిన్నంతరే దేవి త్వయా ప్రోక్తస్త్వహం పురా ।
త్వయా యస్య జపో నిత్యం క్రియతే రాఘవస్య హి ॥ 138

సోఽయం స్త్రీవిరహోత్పస్య మూఢవద్భ్రమతే వనే ।
తవేతి వచనం శ్రుత్వా తదా త్వామబ్రువం త్వహమ్ ॥ 139

దేవి సాక్షాన్మహావిష్ణుస్స్వయం రామో మహీతలే ।
శిక్షార్థం సకలాన్ లోకాన్ మూఢవద్భ్రమతే వనే ॥ 140

నారీసంగో నరైస్త్యాజ్యః సర్వదాఽత్రేతి శిక్షయన్ ।
నారీవిషయజం దుఃఖ మీదృశం భ్రమకారకమ్ ॥ 141

దర్శయన్ సకలాన్ లోకానితి సోఽత్రాటతే వనే ।
ఇతి మద్వచనం శ్రుత్వా తత్పరీక్షార్థముద్యతా ॥ 142

త్వం గతాఽసి సమీపం శ్రీరాఘవస్య తదా వనే ।
సీతారూపేణ తం రామం త్వయా ప్రోక్తం శుభం వచః ॥ 143

రామ రాజీవపత్రాక్ష మామగ్రే పశ్య జానకీమ్ ।
క్రీడస్వాత్ర మయా సార్థమేహి శీఘ్రం సుఖీ భవ ॥ 144

త్వదుక్తం రాఘవః శ్రుత్వా విహస్య త్వాం వచోఽబ్రవీత్ ।
జానామ్యహం త్వం కాసీతి సీతాత్వం నాసి వేద్మ్యహమ్ ॥ 145

త్వం కిం సీతాస్వరూపేణ మోహయస్యత్ర మాం వనే ।
ఏవం పునః పునః ప్రోక్తా యదా త్వం రాఘవేణహి ॥ 146

తదా త్వయా తత్స్వరూపం జ్ఞాతం సత్యం మయేరితమ్ ।
తతో నత్వా రామచంద్రం ప్రార్థయిత్వా పునః పునః ॥ 147

ఆగతాఽసి పునర్మాం త్వం కైలాసశిఖరేఽమలే ।
త్వం కా త్వం కిమితి ప్రోక్తా రాఘవేణ పునః పునః ॥ 148

యా త్వం సా దండకే జాతా త్వం కా నామ్నాంబికా వనే ।
త్వం లజ్జితాఽసి రామేణ యత్ర తత్ర తవ స్థలే ॥ 149

అచ్చటనే ఇప్పుడును రాతినేలలో పెద్ద గుంతగా రావణుని పెద్ద పాదముద్ర కనబడును. ఖరాది యుద్ధ సమయమున పంచవటి వద్ద యే గుహలో సీత రక్షింపబడెనో అచట పతితోడ ఆ దేవి సాన్నిధ్యమునొంది కనిపించుచున్నది. రామలక్ష్మణులు సంచరించిన పంచవటి ప్రాంతమున ఇప్పుడును సజ్జనుల జ్ఞానదృష్టికి వారు కనబడుచున్నారు. అవి అజ్ఞానులకు శిలారూపములుగా ఉన్నవి. గోదావరి నదిలో రామ తీర్థమని, లక్ష్మణ తీర్థమని వారిచే చేయబడినవి గలవు. మునుపు సీతారాములు యే

బండపై పడుకుని యుండిరో అది నేడు 'రామ శయ్యాగిరి' యని చెప్పబడుచున్నది. ఇప్పటికి అచట గడ్డిపాన్పువలే కనిపించును. (131) పిదప, శ్రీరాముడు తమ్ముని జూచి,

## సీతావిరహ దుఃఖ వర్ణనలో పార్వతికి పరమేశ్వరుడు రామతత్త్వమును గుర్తు జేయుట.

సీతారోదనమును విని, అంతటా అశుభములగు దుశ్శకునములను గమనించి, శ్రీరాముడు వేగముగా, పంచవటికి వచ్చి, సీతను గానక, లోకులకు తన మానుష లీలను చూపించు వాడై జానకిని అంతట వెదకుచు వచ్చి, జటాయువును చూచి, వాని నుండి రావణ దుష్కృత్యమును విని, మృతినొందిన జటాయువునకు అగ్ని సంస్కారము ఒనర్చి, నవ్యమాంస బలిని ఇచ్చి, స్నానముజేసెను. అట్లే దక్షిణ మార్గముగా బోవుచు, తాను మహా ప్రభువైనను పరమ మూఢునివలె దర్భలతో గట్టిన భార్యాప్రతి కృతిని పెట్టుకుని అగ్నిహోత్రాదులను నెరవేర్చుచుండెను. పార్వతీ దేవి పరమేశ్వరునితో, "శంకరా! యే రాముని నామమును నీవు సంతతము జపించు చుందువో ఆ శ్రీరాముడు నేడు స్త్రీ విరహముచే మూఢుని వలే భ్రమించు చున్నాడు. చూడుము," అని అనెను. అందుకు శంకరుడు, "దేవీ! సాక్షాత్ నారాయణుడే శ్రీరాముడుగా నవతరించి యున్నాడు. సకల లోకములకును స్త్రీ సంగము మిక్కిలి చెడ్డది. నరులు సర్వవిధములలోను దీనిని వదలవలయును. స్త్రీ విషయ దుఃఖమిట్టిదని చెప్పలేనిది. ఇది మిక్కిలి భ్రాంతి కారణము అని శిక్షించువాడై తాను మూఢునివలే వనమున విభ్రాంతి నొందుచుండును," అని చెప్పితివి గదా? ఆ మాట విని నీవు పరీక్షించుటకు ప్రయత్నించి, వనమున శ్రీరామ సన్నిధికి పోయి, సీతారూపమును దాల్చి, రామునితో, "రాజీవాక్షుడగు రామచంద్రా! జానకి యగు నన్ను జూచి, నాతోడ ఇచట క్రీడించుచు, సుఖమునందుము, రమ్ము," అని పిలచితివి గదా? ఆ మాటవిని శ్రీరాముడు నవ్వుచూ, "నీవు ఎవ్వరివో నాకు తెలుసు. నీవు సీత కాదని నాకు తెలియును. ఏలనీవు నన్ను సీతరూపముతో మోహపరచుచున్నావు?" ఇట్లు పలుమార్లు నిరాకరింపగా, నేను చెప్పినట్లు సత్త్వరూపమునెరిగి, సత్యమనుకుని అంత ఆ రామచంద్రునికి నమస్కరించి, పలుమార్లు ప్రార్థించి, ఈ కైలాస శిఖరమున నా సన్నిధికి ఏతెంచితివి గదా? నీవు అపుడు అచట రామునిచే ఎవరు? ఏల వచ్చితివని? యడిగించికొని లజ్జపడిన తావున దండకారణ్యమున 'లజ్జాపుర' మని నగరము ఒకటి కలిగినది. (149)

**తల్లజ్జాపురానామ్నాఽఽసీన్నగరం దండకే వనే ।**
**తతస్తౌ రామసౌమిత్రీ జగ్మతుర్దక్షిణాం దిశమ్ ॥ 150**

**బహవో నిహతా మార్గే రాక్షసా ఘోరరూపిణః ।**
**ఏతస్మిన్నంతరేఽరణ్యే కబంధేన ధృతౌ తదా ॥ 151**

శ్రీరామలక్ష్మణౌ మార్గే యోజనాయతబాహునా ।
దృష్ట్వా తం శిరసా హీనం బాహూ చిచ్ఛేదతుస్తదా ॥ 152

తతః స దివ్యరూపోఽభూన్నత్వా రామం వచోఽబ్రవీత్ ।
కబంధ ఉవాచ
పురాగంధర్వరాజోఽహం బ్రహ్మణో వరదానతః । 153

కేనాప్యవధ్యస్త్వహసమశవక్త్రం మునీశ్వరమ్ ।
రక్షో భవేతి శప్తోఽహం మునినా ప్రాహ మాం పునః ॥ 154

త్రేతాయుగే యదా రామలక్ష్మణౌ యోజనాయతౌ ।
ఛేత్స్యతస్తే మహాబాహూ తదా శాపాత్ప్రమోక్ష్యసే ॥ 155

తతోరాక్షసదేహోహ మింద్రమభ్యద్రవం రుషా ।
సోఽపి వజ్రేణ మా రామ శిరోదేశే హ్యతాడయత్ ॥ 156

తదా కుక్షౌ శిరః పాదయుగళం చ గతం క్షణాత్ ।
బ్రహ్మదత్తవరాన్మృత్యుర్నాభూన్మే వజ్రతాడనాత్ ॥ 157

ముఖాభావే కథం జీవేదయమిత్యమరాధిపః ।
తదా మాం ప్రాహ కృపయా జఠరే తే ముఖం భవేత్ ॥ 158

బాహూ తే యోజనాయామావద్య శీఘ్రం భవిష్యతః ।
తదారంభాత్ర బాహుభ్యాం లబ్ధం తద్భక్షయామ్యహమ్ ॥ 159

తిష్ఠన్త్యగ్రే మతంగాది మునీనాం పరిచారికాః ।
శబరీదర్శనార్థం త్వం తత్ర యాహి రఘూత్తమ ॥ 160

కథయిష్యతి సా సీతాశుద్ధిం తే రఘునందన ।
ఇత్యుక్త్వా రాఘవం నత్వా స్తుత్వా స్వర్గం యయౌ ముదా ॥ 161

## కబంధుడు ముక్తినొందుట.

పిదప ఆ రామలక్ష్మణులు దక్షిణ దిక్కుకు వెడలిరి. స్వేచ్ఛారూపులగు అనేకమంది రాక్షసులు వీరిచే సంహరింపబడిరి. ఆ నడుమ, దారిలో యోజన ప్రమాణమగు చేతులు కలిగిన కబంధుడను

రాక్షసునిచే, రామ లక్ష్మణులు అడ్డగింపబడిరి. తలలేని వానిని జూచి, చేతులను తెగ్గొట్టిరి. అంత ఆ కబంధుడు దివ్యరూపము పొంది, రామునికి నమస్కరించి, "మునుపు, గంధర్వరాజగు నేను ఎవని చేతను చావకుండా బ్రహ్మనుండి వరమును పొంది, గర్వముతో ఒంటెవంటి మోము గల ఒక మునిని జూచి పరిహసించితిని. అందుకు ఆ ముని నన్ను "నీవు రాక్షసుడవగు"మని శపించి, "త్రేతాయుగమున ఎప్పుడు రామలక్ష్మణులు వచ్చి, యోజన ప్రమాణములగు నీ యొక్క మహా బాహువులను తెగగొట్టెదరో అపుడు నీవు ముక్తుడగుదువు," అని కరుణించెను. అటు పిమ్మట నేను రాక్షసదేహమును దాల్చి, ఇంద్రుని తరిమితిని. శ్రీరామా! ఇంద్రుని వజ్రాయుధముచే నాతల నొక్కివేయబడెను. ఆ క్షణమున నా కడుపులో తల, కాళ్ళను కూరుకుపోయాయి. బ్రహ్మ వర బలముచేతను, వజ్రాయుధపు దెబ్బచేతను చావు కలుగలేదు. ఇంద్రుడు 'ముఖము లేక వీడెట్లు బ్రతుకునని' కరుణించి, నాతో, "ఇప్పుడే నీకు కడుపులో ముఖము గల్గును. నీ చేతులు ఆమడ పొడవు అగును," అని చెప్పి పోయెను. అది మొదలు ఇచ్చట చేతచిక్కిన దానిని తినుచున్నాను. ఇకముందు మతంగాది మునులయొక్క పరిచారికలు గలరు. శబరి దర్శనమునకై నీవు అచటికి దయచేయుము. రఘునాథా! ఆమె సీతయొక్క వార్త చెప్పును," అని చెప్పి, రామునికి నమస్కరించి, ఆనందముగా స్వర్గమునకు వెడలెను.(161)

**తతో రామో లక్ష్మణేన శబరీసన్నిధిం యయౌ ।**
**సాఽపి సంపూజ్య శ్రీరామం విశేషైర్వనసంభవైః ॥ 162**

**చితామారోఢుముద్యుక్తా రాఘవం ప్రాహ హర్షితా ।**
**ఋష్యమూకగిరావగ్రే సుగ్రీవో మంత్రిభిః సహ ॥ 163**

**వర్తతే తస్య సఖ్యేన సీతాశుద్ధిం లభిష్యసి ।**
**గచ్ఛ రామ ఇతస్త్వగ్రే పంపానామ సరోవరమ్ ॥ 164**

**తత్తటాకే తు వృక్షాణాం ఫలాని వివిధాని చ ।**
**భక్షస్వ త్వం జలం పీత్వా యాహి సుగ్రీవసన్నిధిమ్ ॥ 165**
**ఇత్యుక్త్వా శబరీ రామం నత్వా వహ్నిం వివేశ సా ।**
**రామసందర్శనాన్ముక్తిం ప్రాప్తా వైకుంఠమాయయౌ ॥ 166**

**తతో రామః శనైర్భ్రాత్రా యయౌ పంపాసరోవరమ్ ।**
**ఫలాని భక్షయామాస పీత్వా తజ్జలముత్తమమ్ ॥ 167**

తతః శనైర్యయౌ మార్గే ఋష్యమూకాచలం ప్రతి ।
పశ్యన్వనాని సర్వత్ర చింతయామాస జానకీమ్ ॥ 168

ఏవం గిరీంద్రజే ప్రోక్తమారణ్యం చరితం తవ ।
శ్రీరామస్య ససీతస్య లక్ష్మణేన యుతస్య చ ॥ 169

**ఇతి శ్రీశతకోటిరామచరితాంతర్గతే, శ్రీమదానందరామాయణే,**
**వాల్మీకీయే, ఆదికావ్యే, సారకాండే, ఖరాదివధో నామ, సప్తమః సర్గః ॥**

## శ్రీరామలక్ష్మణులు శబరికి ముక్తినిచ్చి, ఋష్యమూక గిరికి వెళ్ళుట.

పిదప శ్రీరాముడు లక్ష్మణునితోడ శబరి సన్నిధికి వెడలెను. ఆమెయును శ్రీరాముని సంపూజిత విశేషములగు వన పదార్థములచే సత్కరించి, సంతసించి, చితారూఢయగుచు, రామునితో, "ఋష్యమూక గిరిమీద మంత్రులతో సుగ్రీవుడు గలడు. వాని సఖ్యమువలన సీతయొక్క వార్తను వినగలవు. ఇచటనుండి ముందు పంపాసరోవరమునకు వెడలి, అచటి నానాదివ్య ఫలములను భక్షించి, నీరు త్రాగి సుగ్రీవసన్నిధికి పొమ్ము," అని చెప్పి శ్రీరామునికి నమస్కరించి, అగ్నిప్రవేశమును ఒనర్చెను. రామదర్శనముచే వైకుంఠముక్తిని పొందెను. పిదప రామ లక్ష్మణులు తిన్నగా పంపా సరోవరమునకు పోయి, ఫలాహారములను పొంది, దివ్య ఉదకమును పానముజేసిరి. శ్రీరాముడు తిన్నగా ఋష్యమూకము నకు వచ్చుచు అంతట వనములను జూచుచు, సీతాదేవిని తలచుచుండెను.

పార్వతీ! నీకు నాచే ఇట్లు లక్ష్మణునితో ఉన్న శ్రీసీతారాముల అరణ్యచరిత్ర చెప్పబడినది.

***శతకోటి ప్రవిస్తరమైన రామకథలో, శ్రీమద్వాల్మీకిమహర్షిచే రచింపబడిన,***
***ఆనందరామాయణంలోని, సారకాండలో, ఖరాది వధ వర్ణనమనే***
***ఏడవ సర్గ ముగిసినది.***



# అష్టమః సర్గః-8వ సర్గ

కిష్కింధా చరిత్ర, సుగ్రీవునితో మైత్రి, వాలివధ

శ్రీశివ ఉవాచ

అథ రామో లక్ష్మణేన ఋష్యమూకాచలం ప్రతి ।
యయౌ ధృతధనుర్బాణో నేత్రే సర్వత్ర చాలయన్ ॥ 1

ఋష్యమూకగిరేః పార్శ్వే గచ్ఛంతౌ రామలక్ష్మణౌ ।
సుగ్రీవేణాథ తౌ దృష్టౌ ఋష్యమూకస్థితేన హి ॥ 2

సుగ్రీవస్తౌ తదా దృష్ట్వా చతుర్భిర్మంత్రిభిర్యుతః ।
సంమంత్ర్య మారుతిం ప్రాహ వాలినా ప్రేషితావుభౌ ॥ 3

మాం హంతుం ధృతకోదండౌ సతూణీరౌ నరాకృతీ ।
ఇతోఽస్మాభిః ప్రగంతవ్యం మంత్రం శ్రుణు మయోచ్యతే ॥ 4

గచ్ఛ జానీహి భద్రం తే వటుర్భూత్వా ద్విజాకృతిః ।
తాభ్యాం సుభాషణం కృత్వా జానీహి హృదయం తయోః ॥ 5

యది తౌ దుష్టహృదయౌ సంజ్ఞాం కురు కరాగ్రతః ।
సాధుత్వే స్మితవక్త్రోఽభూరేవం జానీహి నిశ్చయమ్ ॥ 6

తథేతి వటురూపేణ గత్వా నత్వా రఘూత్తమమ్ ।
కౌ యువాం పురుషవ్యాఘ్రావితి పప్రచ్ఛ మారుతిః ॥ 7

తతస్తం లక్ష్మణః ప్రాహ పూర్వవృత్తం సవిస్తరమ్ ।
శబరీవచనాద్రామః సఖ్యం కర్తుం సమాగతః ॥ 8

సుగ్రీవేణాథ తచ్ఛ్రుత్వా స్వరూపం మారుతిస్తదా ।
చకార నైజం ప్రకటం స్వీయం వృత్తం న్యవేదయత్ ॥ 9

మత్స్కంధమధిరుహ్యాద్య పర్వతం గంతుమర్హథః ।
తథేతి మారుతేః స్కంధే సంస్థితౌ తౌ బభూవతుః ॥ 10

**ఉత్పపాత గిరేర్మూర్ధ్ని క్షణాదేవ మహాకపిః ।**
**వృక్షచ్ఛాయాం సమాశ్రిత్య తౌ స్థితౌ రామలక్ష్మణౌ ॥ 11**

## ఆంజనేయుడు రామ లక్ష్మణులను ఋష్యమూకముపైకి మోసుకెళ్ళుట

అనంతరం శ్రీరాముడు ధనుర్బాణములను దాల్చి, అంతట జూచుచు, లక్ష్మణునితో ఋష్యమూక పర్వతము వైపు వెడలెను. ఇట్లు పోవుచున్న రామ లక్ష్మణులను గిరిమీదనుండు సుగ్రీవుడు చూచి, తన నలుగురు మంత్రులతో ఆలోచించి, ఆంజనేయునితో, "వీరిరువురు వాలిచే పంపబడి నన్ను చంపుటకై ధనుర్ధారులై నరరూపులుగా నడచుచున్నారు. ఇచ్చటనుండి మనము కదలవలెను. నేను చెప్పెడు యోచనను వినుము. నీవు బ్రాహ్మణ వేషము ధరించి, వారివద్దకు పోయి, వారి హృదయమును తెలుసుకుని, మంచిదిగా నుండిన చేయిచాపి చూపి, నగుమోము గలవాడవగుము." అనిచెప్పి హనుమంతుని పంపెను. అట్లేయని వాయుసుతుడు బ్రాహ్మణ రూపము ధరించి వచ్చి, రామునికి నమస్కరించి, "నరశ్రేష్ఠులారా! మీరెవరు?" అని అడిగెను. అపుడు లక్ష్మణుడు అతనికి తమ వృత్తాంతమును చక్కగా తెలిపి, శ్రీరాముడు శబరివాక్యముచే మీ సుగ్రీవునితోడ సఖ్యము జేయుటకై వచ్చియున్నా"డనెను. అది విని మారుతి మాయాబ్రాహ్మణ రూపమును వదలి, నిజరూపమును ధరించి, తన సంగతి విన్నవించి, వారిని వీపులమీదనెక్కించుకుని పర్వతమునకు పోవుటకు శ్రీరామ లక్ష్మణులను ప్రార్థించెను. వారును అట్లేయని హనుమ భుజస్కంధములపై కూర్చుండిరి. ఆ మహాకపి క్షణమాత్రమున కొండమీదికి పోయి, వారిని చెట్లనీడలో దింపెను. (11)

**సుగ్రీవం మారుతిర్గత్వా రామవృత్తం న్యవేదయత్ ।**
**తతః ప్రజ్వాల్య వహ్నిం స సుగ్రీవో రావణేన హి ॥ 12**

**చకార సఖ్యం వేగేన సమాలింగ్య పరస్పరమ్ ।**
**వృక్షశాఖాం స్వయం ఛిత్వా విష్టరార్థం దదౌ కపిః ॥ 13**

**హర్షేణ మహతావిష్టాః సర్వ ఏవావతస్థిరే ।**
**లక్ష్మణస్త్వబ్రవీత్సర్వం సుగ్రీవం వృత్తమాత్మనః ॥ 14**

**తచ్ఛ్రుత్వా సకలం వృత్తం సుగ్రీవః స్వం న్యవేదయత్ ।**
**సఖే శ్రుణుష్వ మే వృత్తం వాలినా యత్కృతం పురా ॥ 15**

**మయపుత్రో దుర్మదశ్చ కిష్కింధామేకదా గతః ।**
**కృత్వా స దీర్ఘశబ్దం తు వాలినం సముపాహ్వయత్ ॥ 16**

తం శ్రుత్వా నిర్యయౌ వాలీ జఘాన దృఢముష్టినా ।
దుద్రావ తేన సంవిగ్నో జగామ స్వగృహం ప్రతి ॥ 17

అనుదుద్రావ తం వాలీ వాలిపృష్ఠే త్వహం గతః ।
వాలీ మామాహ తిష్ఠ త్వం బహిర్గచ్ఛామ్యహం గుహామ్ ॥ 18

ఇత్యుక్త్వాఽఽవిశ్య స గుహాం మాసమేకే న నిర్యయౌ ।
గుహాద్వారాన్మయా రక్తం నిర్గతం సన్నిరీక్ష్య చ ॥ 19

నిశ్చిత్య మనసా వాలీ దుర్మదేన హతస్త్వితి ।
ఏతస్మిన్నంతరే శ్రుత్వా కిష్కింధాం రిపువేష్టితామ్ ॥ 20

గుహాద్వారి శిలామేకాం నిధాయ దుర్మదస్య చ ।
యత్నతో మార్గరోధార్థం కిష్కింధామాగతః స్వయమ్ ॥ 21

మాం దృష్ట్వా రిపవః సర్వే వేగాచ్చక్రుః పలాయనమ్ ।
అనిచ్ఛంతం మంత్రిణో మాం తత్పదే సంన్యవేశయత్ ॥ 22

తతో హత్వా రిపుం వాలీ దృష్ట్వా మాం స్వపదస్థితమ్ ।
సంతాడ్య నగరాన్మాం స బహిర్నిష్కాసయత్తదా ॥ 23

తతః స సర్వదేశేషు వాదయామాస దుందుభిమ్ ।
భూమ్యాం సుగ్రీవపాతా యః స వధ్యో భవేదితి ॥ 24

తతో లోకాన్పరిక్రమ్య ఋష్యమూకో మయాఽఽశ్రితః ।
ఏకదా దుందుభిర్నామ దైత్యో మహిషరూపధృక్ ॥ 25

యుద్ధాయ వాలినం రాత్రౌ సమాహ్వాయత భీషణః ।
తతో వాలీ సమాగత్య ధృత్వా శృంగ కరేణ సః ॥ 26

హస్తాభ్యాం తచ్ఛిరశ్ఛిత్వా తోలయిత్వాఽక్షిపద్భువి ।
పపాత తచ్ఛిరో రామ మతంగాశ్రమసన్నిధౌ ॥ 27

రక్తవృష్టిః పపాతోచ్చైర్మతంగోఽప్యశపత్క్రుధా ।
యద్యాగతోఽసి మే వాలిన్ గిరిం శీఘ్రం సమాపయ ॥ 28

ఏవం శప్తస్తదారభ్య ఋష్యమూకం న యాత్యసౌ ।
ప్రతిజ్ఞాం తే కరోమ్యద్య సీతాం శీఘ్రం సమానయే ॥ 29

యదా నీతా రావణేన తదా దృష్టా మయాఽత్ర ఖే ।
బద్ధ్వోత్తరీయ క్షిప్తాని పశ్య త్వ భూషణాని హి ॥ 30

ఇత్యుక్త్వా దర్శయామాస సుగ్రీవో భూషణాని హి ।
తాని దృష్ట్వాఽబ్రవీద్బంధు రామస్త్వం నిశ్చయం వద ॥ 31

త్వయాదృష్టాని సీతాయాస్తచ్ఛ్రుత్వా లక్ష్మణోఽబ్రవీత్ ।
న వేద్మ్యహం సమస్తాని వేద్మ్యంగులిభవాని హి ॥ 32

వందనే యాని దృష్టాని మయా నిత్యం రఘూద్వహ ।
తతో రామేఽతిసంతుష్టో లబ్ధాం సీతామమన్యత ॥ 33

## శ్రీరామ-సుగ్రీవుల మైత్రి

తరువాత హనుమంతుడు సుగ్రీవునికి రామవృత్తాంతమును చెప్పగా సుగ్రీవుడు, అగ్నిని ప్రజ్వలింపజేసి, శ్రీరామునితో అగ్నిసాక్షిగా మైత్రిని కుదుర్చుకొనెను, రామ, సుగ్రీవులు ఒకరినొకరు హత్తుకున్నారు. సుగ్రీవుడు తానే ఒక చెట్టురెమ్మవిరచి రామునికి ఆసనముగా అర్పించెను. అందరూ సంతోషించి కూర్చుండిరి. సుగ్రీవునితో లక్ష్మణుడు తమ వృత్తాంతమును చెప్పెను. ఆ సంగతి అంతయూ వినిన సుగ్రీవుడు తన సంగతిని చెప్పసాగెను, “మిత్రమా! మునుపు నేను వాలిచే అనుభవించిన నా కథ వినుము. ఒకప్పుడు మయుని పెద్దకుమారుడగు ‘మాయావి’ అను పేరుగల మదించిన రాక్షసుడు కిష్కింధకు వచ్చి, పెద్దఆర్భాటముచే వాలిని యుద్ధమునకు పిలచెను. అది విని వాలి ఆ మాయావిని తన పిడికిటితో నొకమొట్టు మొట్టెను. అంతనతడు తన గుహకు పరుగెత్తెను. వాలి వానిని వెంబడించి తరిమెను. వాలి వెనుక నేను వెళ్ళితిని. మాయావి గుహలో దూరునపుడు వాలి నాతో, “నేను గుహనుండి బయటకు వచ్చువరకు నీవిచ్చటనే యుండు,”మని చెప్పిపోయెను. వాలి నెలరోజులైనను గుహనుండి రాలేదు. నేనపుడు గుహద్వారమున రక్తము వచ్చుటను చూచి, మాయావి వాలిని చంపెనని నిశ్చయించుకొని, అంతలో కిష్కింధను శత్రువులు ముట్టడించారని విని, మాయావిని అడ్డగించుటకు ఒక శిలను తెచ్చి, గుహద్వారమును మూసివేసి, కిష్కింధకు వచ్చితిని. నన్నుజూచి, శత్రువులు త్వరగ పరుగెత్తిపోయిరి. నేను కోరకపోయినా మంత్రులు నన్ను రాజ్యమున ప్రతిష్ఠించిరి. పిదప వాలి మాయావిని సంహరించి వచ్చి, తన రాజ్యమేలుచున్న నన్ను జూచి, కొట్టి

ఊరిబయటికి తరిమెను. "సర్వలోకములలోను సుగ్రీవుని కాపాడువాడు నాచే చంపబడు"నని చాటించెను. పిదప నేను లోకములను చుట్టి ఈ ఋష్యమూకమును ఆశ్రయించితిని.

ఒకప్పుడు దుందుభియను భయంకర రాక్షసుడు రాత్రివేళ దున్నపోతు ఆకారముతో వచ్చి, వాలిని యుద్ధమునకు పిలిచెను. అపుడు వాలి వచ్చి, వాని కొమ్ములను చేత బట్టుకుని, చేతులతో వాని తలను జీల్చి, నేలకేసికొట్టెను. రాముడా! ఆ తల మతంగముని సన్నిధిలో పడెను. మీద నెత్తురు వాన కురియగా ఆముని, "వాలీ! నీ విచటికి వచ్చితివా, త్వరలో చచ్చెదవు" అని శపించెను. అది మొదలు వాలి ఋష్యమూకమునకు వచ్చుటలేదు. నీకు నేను ప్రతిజ్ఞచేసి చెప్పెదను. సీతను త్వరలో తెచ్చి ఇచ్చెదను. రావణుడు గొనిపోవునప్పుడు గగనమున సీతను నేను చూచితిని. ఆమె ఉత్తరీయమున కట్టిపడవేసిన భూషణములు ఇవి గదా? చూడుము రామచంద్రా!," అనిన సుగ్రీవ వాక్యములను విని, అతడు చూపిన సొమ్ములను చూచి, శ్రీరాముడు లక్ష్మణునితో, "తమ్ముడా! నీవు సీతవద్ద చూచిన ఆభరణములు ఇవియేనా?" అనెను. అందుకు, లక్ష్మణుడు"రఘునాథా! అన్నిటిని నేనెరుగను. నిత్యము వదినకు పాదనమస్కార సమయమున ఆమె పాదములకు ధరించు ఆభరణములను మాత్రము నేనెరుగుదును" అని చెప్పగా, లక్ష్మణుని పలుకులచే ఆనందించి. ఇక సీత దొరకదని ఎంతో బాధపడెను. (33)

**సుగ్రీవవచనాద్రామః ప్రత్యయార్థం తదా క్షణాత్ ।**
**పాదాంగుష్ఠేనాక్షిపత్తద్దుందుభేః శిరఉత్తమమ్ ॥ 34**

**దశయోజనపర్యంతం తథా బాణేన వై పునః ।**
**చక్రాకారాన్ సప్త తాళాన్ దృష్ట్వా దేహే హ్యహేః ప్రభుః ॥ 35**

**స్వీయాంగుష్ఠేన సౌమిత్రేః పదంకించిద్విమర్ద్య చ ।**
**ఋజుం కృత్వా పన్నగం తం శేషాంశేన స్థితం భువి ॥ 36**

**సుగ్రీవప్రత్యయార్థం హి సప్త తాలాన్ బిభేద సః ।**
**గుహాయామేకదా తాళఫలాని స్థాపితాని హి ॥ 37**

**వాలినా సప్త నీతాని తేన సర్పం దదర్శ సః ।**
**తమశాపత్త్వయి వృక్షాశ్చ భవిష్యంతీతి వానరః ॥ 38**

**సర్పోఽప్యహాథ తాన్ ఛేత్తా యస్తే హంతా న సంశయః ।**
**తద్దృష్ట్వా రామసామర్థ్యం తస్మిన్ప్రత్యయమాప సః ॥ 39**

సుగ్రీవస్తం పునః ప్రాహ రాఘవం తుష్టమానసః ।
వాలినే సురనాథేన పురా దత్తాఽస్తి మాలికా ॥ 40

యాం దృష్ట్వా రిపవో యుద్ధే గతవీర్యా భవంతి హి ।
యా పురా కశ్యపేనైవ తపసా దుష్కరేణ చ ॥ 41

శివాల్లబ్ధా పితా పుత్రమింద్రం తేనాపి వాలినే ।
ప్రీత్యార్పితా మాలికా సా వాలీ కంఠే దధాత్యసౌ ॥ 42

తస్యాంస్త్వం దర్శనాద్రామ గతసత్వో భవిష్యసి ।
తత్రోపాయం చింతయస్వ యేన తేఽద్య జయో భవేత్ ॥ 43

తత్తస్య వచనం శ్రుత్వా రామః సర్పం తమబ్రవీత్ ।
యః శాపాన్మోచితః పూర్వం సప్త తాలాన్విభిద్య చ ॥ 44

గచ్ఛ త్వం మమ వాక్యేన కిష్కింధాయాం చ వాలినమ్ ।
నిశీథే నిద్రితం దృష్ట్వా హర తన్మాలికాం శుభామ్ ॥ 45

తథేతి రామవాక్యేన కిష్కింధామేత్య పన్నగః ।
మంచకస్థం జహారాథ తాం మాలాం వాసవం దదౌ ॥ 46

## శ్రీరాముడు సుగ్రీవునికి అభయమిచ్చుట

పిదప సుగ్రీవుడు దుందుభి సంగతి చెప్పగా అతని నమ్మకమునకై శ్రీరాముడు కాలి బొటనవ్రేలిచే ఆ దుందుభి కళేబరమును పదియోజనముల దూరము చిమ్మెను మరియు చక్రాకారముగా సర్ప అంశయైన ఏడు తాటి చెట్లను సుగ్రీవుడు చూపగా, శ్రీరాముడు శేష అంశయైన ఆ ఏడు తాటి చెట్లను చూచి, తన కాలి బొటనవ్రేలుచే లక్ష్మణుని పాదమును రుద్దినమాత్రమున శేషాంశమగు ఆ సర్పమును చక్కబరచి, సుగ్రీవునికి నమ్మకము కలిగించుటకై ఆ తాళ వృక్షములను ఒకే బాణముచే నేలకూల్చెను. ఒకప్పుడు గుహలో తాటి వృక్ష ఫలములు స్థాపింపబడినవి కదా? వాటిని నేడు తీసుకురాగా వాలి సర్పమును జూచి, "నీ యందు వృక్షములు కూడా పుట్టుగాక." అని శపించెను. సర్పము కూడా, "ఎవ్వడు వాటిని ఖండించునో, వాడు నిన్ను తప్పక చంపును," అని ప్రతిశాపము నిచ్చెను. కనుక సుగ్రీవుడు శ్రీరామునిపై నమ్మకము గలవాడై, సంతోషించెను. (39)

పిమ్మట సుగ్రీవుడు రామునితో," మిత్రమా! మునుపు శివుని గూర్చి తపముజేసి, కశ్యప బ్రహ్మ సంపాదించిన శత్రుబల విధ్వంసిని యగు మాలికను తన పుత్రుడగు దేవేంద్రునికి ఇచ్చెను. అతడు

దానిని వాలికి ఇచ్చియున్నాడు. వాలి దానిని ధరించి వచ్చినచో ఎట్టివానికైనను చూచినంతలో బలము తరిగిపోవును. అందుచే నీవు దుర్బలుడవగుదువేమో. తగిన యుక్తిని యోచింపుము. పిమ్మట మనకు జయమగును," అని చెప్పగా, విని రాముడు సర్పముతో, "ఏడు తాటిచెట్లను భేదించి, నిన్ను శాపమునుండి రక్షించిన నా మాటను వినుము. నా మాటమీద కిష్కింధకు పోయి, రాత్రి నిద్రించుచుండు వాలిని చూచి, ఆ శుభమాలికను తీసుకొనిరమ్ము," అని ఆజ్ఞాపించెను. అట్లే యని ఆ పాము రామవాక్యముచే కిష్కింధకు పోయి, మంచముమీదనున్న ఆ మాలికను సంపాదించి, ఇంద్రునికి ఇచ్చెను. (46)

**తతో రామాజ్ఞయా గత్వా సమాహూయాథ వాలినమ్ ।**
**యుద్ధం చకార సుగ్రీవః శ్రీరామోఽపి దదర్శ తమ్ ॥ 47**

**సమానరూపౌ తౌ దృష్ట్వా మిత్రఘాతవిశంకయా ।**
**న ముమోచ తదా బాణం రామః సోఽపి న్యవర్తత ॥ 48**

**సుగ్రీవో రాఘవం ప్రాహ మాం ఘాతయసి వాలినా ।**
**యది మద్ధననే వాంఛా త్వమేవ జహి మాం విభో ॥ 49**

**తత్తస్య వచనం శ్రుత్వా సుగ్రీవస్య రఘూత్తమః ।**
**బంధయామాస సుగ్రీవకంఠే మాలాం తు బంధునా ॥ 50**

**పునస్తం ప్రేషయామాస సోఽపి వాలినమాహ్వయత్ ।**
**తతః శ్రుత్వా యయౌ వాలీ తం తారాఽప్రార్థయత్తదా ॥ 51**

**శ్రుతమంగదవాక్యేన మయా రామః సమాగతః ।**
**చకార మైత్రీం కిం తేన మా కురుష్వాద్య సంగరమ్ ॥ 52**

**గచ్ఛ నత్వా రమానాథం బంధుం మానయ సాదరమ్ ।**
**యౌవరాజ్యపదం దేహి తస్మై మే వచనం శ్రుణు ॥ 53**

**తత్తారావచనం శ్రుత్వా వాలిః తాం వాక్యమబ్రవీత్ ।**
**జానామ్యహం రాఘవం తం నరరూపధరం హరిమ్ ॥ 54**

**తస్య హస్తాన్మృతిర్మేఽస్తి గచ్ఛామి పరమం పదమ్ ।**
**సుఖం త్వం తిష్ఠ తారేఽత్ర సుగ్రీవం భజ సర్వదా ॥ 55**

యదా త్వయా స సుగ్రీవః కరిష్యతి రతిం ప్రియే ।
తదా తత్పత్నిభోగస్యా౽నృణ్యం గచ్ఛామి భామిని ॥ 56

అత ఏవం మాలికా మే గుప్తా౽భూత్పశ్య మత్ప్రియే ।
అద్యాహం రామబాణేన పతిష్యామి రణాంగణే ॥ 57

అద్య ధన్యో౽స్మ్యహం తారే ధన్యౌ తౌ పితరౌ మమ ।
యోగ్య శ్రీరామహస్తేన మరిష్యామి రణాంగణే ॥ 58

ఏవమాశ్వాస్య తాం తారాం యయౌ వాలీ త్వరాన్వితః ।
దృష్ట్వా వాలీమహోత్పాతాన్ సంతోషం పరమం యయౌ ॥ 59

చకార బంధునా యుద్ధం తదా బాణేన రాఘవః ।
వృక్షఖండే తిరోభూత్వా పాతయామాస తం భువి ॥ 60

## శ్రీరాముడు వాలిని సంహరించుట.

పిమ్మట సుగ్రీవుడు శ్రీరామాజ్ఞచే వాలిని పిలిచి యుద్ధముజేసెను. అప్పుడు రాఘవుడు సమాన రూపులగు వాలి, సుగ్రీవులను చూచి, మిత్రునికి బాణము తగులునని శంకించి, బాణము ప్రయోగించలేదు. సుగ్రీవుడును పోరాడజాలక, పరుగెత్తివచ్చి, రామునితో, "రామా! వాలి చే నన్ను చంపించుటకన్నను, నీవే చంపుము." అని మొరపెట్టినందుకు రాముడు లక్ష్మణునిచేత సుగ్రీవునికి పూలదండ వేయించి, మరలా యుద్ధమునకు పంపెను. సుగ్రీవుడు పోయి, వాలిని యుద్ధమునకు ఆహ్వానించెను. అప్పుడు యుద్ధమునకు సిద్ధపడుచున్న వాలినిజూసి, తారాదేవి, "పతీ! శ్రీరాముడు అను రాజు వచ్చి సుగ్రీవునితో సఖ్యమొనర్చినట్లు అంగదునివలన నేను విన్నాను. ఇప్పుడు యుద్ధమునకు పోయి, రామ పాదములను శరణమని నమ్మి, తమ్ముని గౌరవింపుము. సుగ్రీవునికే యౌవ రాజ్యాభిషేకము ఒనరింపుము. నా మాటను ఆలకింపుము," అని వేడుకొనెను. అందుకు వాలి, "తారా! శ్రీరాముడు మానవ రూపమెత్తిన నారాయణుడని నాకు తెలుసు. అతనిచేత నాకు మరణము గలదు. పరమపదమునకు పోవుదును. తారా! నీవిచట సుగ్రీవుని సేవించుచు సుఖమందుము. నీతో సుగ్రీవుడు సుఖమందుటచే, ప్రియురాలా! నేను వాని సతిని భోగించినదానియొక్క అనృణ్యమును పొందుదును. ప్రేయసీ! అందుచేతనే నా దివ్య మాలిక మాయమయ్యె. నేడే యుద్ధరంగమున రామబాణముచే మృతినొంది ముక్తినొందెదను. ఇప్పుడు నేను ధన్యుడను, నా జనకులు కృతార్థులు," అని సమాధానము చెప్పి, త్వరగా బయలుదేరి వచ్చుచు మహా ఉత్పాతములను చూచి, మహా ఉత్సాహమునంది సుగ్రీవునితో యుద్ధము చేయుచుండెను. అపుడు వృక్షము చాటునుండి రాముడు బాణమువేసి, వాలిని నేలకూల్చెను.

తతస్తారా సమాగత్య సుశోచ వాలినం ప్రతి ।
వాలీ దృష్ట్వా రమానాథం తదా ప్రాహ స గద్గదః ॥ 61

వృక్షషండే తిరోభూత్వా త్వయాఽహం తాడితో హృది ।
తవాద్య దుర్యశో జాతం మమ జాతో మహోదయః ॥ 62

కిం మయాఽపకృతం తే హి త్వయా యస్మాన్నిపాతితః ।
రామః ప్రాహ వాలినం త్వం రుమయా లంపటః సదా ॥ 63

బంధుభార్యాం గృహే స్థాప్య బంధుం హంతుం త్వమిచ్ఛసి ।
దుర్వృత్తం త్వాం సమాలోక్య మయా తస్మాన్నిపాతితః ॥ 64

యథా త్వయా రుమా భుక్తా తథా తారాం తవప్రియామ్ ।
భోక్ష్యత్వయం హి సుగ్రీవో వచనాన్మే కపీశ్వర ॥ 65

యద్యపి త్వం దురాచారో నిహతోఽసి రణే మయా ।
తథాపి భిల్లరూపేణ ద్వాపరాంతేఽంఘ్రిణం మమ ॥ 66

భిత్వా ప్రభాసే బాణేన పూర్వవైరేణ వానర ।
తతో మద్ధస్త మరణస్యాస్య కారణగౌరవాత్ ॥ 67

ముక్తిం గచ్ఛసి త్వం వాలిన్ శుభాం జన్మాంతరేణ హి ।
తతః ప్రాహ పునర్వాలీ మేఽభవిష్యదుదీరితమ్ ॥ 68

సీతావృత్తం త్వయా పూర్వం రావణేన క్షణేన హి ।
దత్తాఽభవిష్యదానీయ సీతా తవ మయా తదా ॥ 69

అధునా ప్రార్థయామి త్వామంగదం పరిపాలయ ।
ఇత్యుక్త్వా స తదా వాలీ జహౌ ప్రాణాన్ రణాంగణే ॥ 70

## శ్రీరాముడు వాలికి భవిష్యజ్ఞానము తెలుపుట

పిదప తార వచ్చి, వాలికొరకు దుఃఖించెను. అపుడు వాలి గద్గద వాక్యములచే రామునితో, "చెట్టు చాటునుండి నా ఎదను భేదించితివి. నీకిపుడు దుష్కీర్తియును, నాకు సత్కీర్తియును గలిగినది. ఏల నన్ను జంపితివి? నేను నీకేమి అపకారము చేసితిని?" అని అనగా, అందుకు రాముడు, "నీవు

తమ్ముని భార్యను స్వీకరించి ఆ తమ్మునే చంపనెంచితివి. నీ దుర్వృత్తిని గమనించి నిన్ను జంపితిని. కపిరాజా! నీవెట్లు రుమను భోగించితివో అట్లే సుగ్రీవుడును నా యాజ్ఞచే తారతో రతినొంది యానందించుగాక. అయినను దురాచారుడవైన నీవు నాచే చంపబడితివి. ఈ కార్యమును అనుసరించి, ద్వాపరాంతములో ప్రభాసమున నీవు బోయవాడవై బాణముతో నా కాలును భేదింపుము. ఈ కారణమున నాచే నీకు మరణము వచ్చినది. జన్మాంతరమున నీకు ముక్తి రాగలదు." అని వరమునిచ్చెను. మరలా వాలి, "శ్రీరామా! నీవు మొదట నీ అభిప్రాయమును తెలిపి, నీ వృత్తాంతమును చెప్పియుండిన క్షణకాలములో రావణునినుండి నేను సీతను తెచ్చి యిచ్చియుందును. పోనీ, ఇపుడు అంగదుని కాపాడమని ప్రార్థించుచున్నాను," ఇట్లు సంప్రార్థించి వాలి ప్రాణములు విడిచెను. (70)

**అంగదేన తదా రామః కారయామాస తత్క్రియామ్ ।**
**అథ రామం స సుగ్రీవో రాజ్యార్థం ప్రార్థయత్తదా ॥ 71**

**రామస్తమేవ రాజానం చకార లక్ష్మణేన సః ।**
**అథ వార్షికమాసాన్స వస్తుం రామోఽవిచారయత్ ॥ 72**

**ప్రవర్షణగిరేః ప్రోచ్చశిఖరే స్ఫటికోద్భవామ్ ।**
**రమ్యాం దృష్ట్వా గుహాం రామః పత్రపుష్పసమన్వితామ్ ॥ 73**

**నినాయ వార్షికాన్ మాసాన్ చతురః శ్రీరఘూద్వహః ।**
**ఏకదా లక్ష్మణః స్నాత్వా యావద్రామం సమాగతః ॥ 74**

**సాత్త్వికాస్త్యా సీతయా యుక్త స్తావద్రామో నిరీక్షితః ।**
**సౌమిత్రిణా వందితా సా పత్యుర్వామే లయం యయౌ ॥ 75**

**ఏవం నాసీత్తదా సీతావియోగో రాఘవస్య హి ।**
**సుగ్రీవోఽథ పురీమధ్యే చకార రాజ్యముత్తమమ్ ॥ 76**

**ఏకదా హనుమద్వాక్యాద్వానరాన్స సమాహ్వయత్ ।**
**ప్రవర్షణగిరావాస్తం తీర్థే ద్వే రామలక్ష్మణౌ ॥ 77**

## శ్రీరాముడు సుగ్రీవుని రాజుగా చేయుట

అపుడు శ్రీరాముడు అంగదునిచే వాలికి ఉత్తరక్రియలను చేయించెను. పిదప సుగ్రీవుడు రాజ్యమేలుమని రాముని ప్రార్థించెను. శ్రీరాముడు లక్ష్మణునిచే సుగ్రీవుని కపిరాజుగా చేయించెను.

పిమ్మట వర్షాకాలము రావడముతో సీతను వెదకుటకు వీలుగానందున రాముడు చింతించెను. ప్రవర్షణ (ప్రస్రవణ) గిరియొక్క అగ్ర భాగమున ఫల పుష్పాదులతో విలసిల్లు స్ఫటిక శిలారమ్యమగు గుహను చూచి, శ్రీరాముడు వర్షాకాలపు నాలుగు మాసములు అక్కడ గడపదలచెను.

## శ్రీరాముని సీతావిరహములోని విశేషము

ఒకసారి లక్ష్మణుడు స్నానముచేసి, శ్రీరాముని చూచునప్పటికి, సాత్త్వికి యగు సీతతోకూడి రాముడు అగుపడెను. ఆ సీత లక్ష్మణునిచే నమస్కరింపబడి, పతికి యెడమప్రక్క లీనమయ్యె. అపుడు రామునికి సీతావియోగం ఈ విధముగా పరిణమించినది గదా? తరువాత సుగ్రీవుడు తన నగరములో రాజ్యమేలు చుండెను. ఒకప్పుడు హనుమంతుని వాక్యముచే, వానరులనురప్పించెను. ప్రవర్షణ పర్వతమున రామతీర్థమనియు, లక్ష్మణతీర్థమనియు రెండు తీర్థములు ఏర్పడినవి. (77)

**ఏతస్మిన్నంతరే రామో దృష్ట్వా ప్రాప్తం శరదృతుమ్ ।**
**క్రోధేన ప్రేషయామాస సుగ్రీవాయ లక్ష్మణం చ సః ॥ 78**

**సోఽపి గత్వాఽథ కిష్కింధాం భీషయామాస వానరాన్ ।**
**ఆగతం లక్ష్మణం శ్రుత్వా సుగ్రీవో భయవిహ్వలః ॥ 79**

**మారుతిం ప్రేషయామాస సాంత్వనార్థం హి లక్ష్మణమ్ ।**
**స గత్వా తం సాంతయిత్వా కిష్కింధామానయత్తదా ॥ 80**

**ఏతస్మిన్నంతరే తారాం ప్రేషయామాస వానరః ।**
**సాఽపి గత్వా మధ్యకక్షాం సంస్థితం తం దదర్శ హ ॥ 81**

**లక్ష్మణం సాంత్వయామాస వచోభిర్మధురైర్నిజైః ।**
**సమాహూతాని సైన్యాని రామార్థం ప్రవగేన హి ॥ 82**

**సుగ్రీవే చ త్వయా కోపో మా కార్యోఽద్య హి దేవర ।**
**తతో లక్ష్మణహస్తే సా ధృత్వా రాజగృహం యయౌ ॥ 83**

**దృష్ట్వా సుగ్రీవరాజస్తమాసనాత్స చచాల సః ।**
**సుగ్రీవం లక్ష్మణః ప్రాహ విస్మృఽతోసి రఘూత్తమమ్ ॥ 84**

**వాలీ యేన హతో వీరః స బాణస్త్వాం ప్రతీక్షతే ।**
**త్వమద్య వాలినో మార్గం గమిష్యసి మయా హతః ॥ 85**

ఏమమత్యంతపరుషం వదంతం లక్ష్మణం తదా ।
ఉవాచ హనుమాన్ వీరః కథమేవం ప్రభాషసే ॥ 86

రామకార్యార్థమనిశం జగతిం న తు విస్మృతః ।
ఇత్యుక్త్వా తం పూజయిత్వా సుగ్రీవేణ స మారుతిః ॥ 87

చకార లక్ష్మణం శాంతం సుగ్రీవోఽపృథ వానరైః ।
గత్వా తం రాఘవం నత్వా దర్శయామాస వానరాన్ ॥ 88

రాఘవం స తదా ప్రాహ సుగ్రీవః ప్లవగాధిపః ।
దేవ పశ్య సమయాంతీం వానరాణాం మహాచమూమ్ ॥ 89

అత్ర యూథాధిపతయః పద్మాన్యష్టాదశ స్మృతాః ।
తతో రామాజ్ఞయా సీతాశుద్ధ్యర్థం తాన్ దిదేశ సః ॥ 90

## శ్రీరామునివద్దకు సుగ్రీవుడు సేనలతో వచ్చిచేరుట

ఇట్లుండగా, శరద్రుతువువచ్చుట చూచి, రాముడు కోపమంది సుగ్రీవుని వద్దకు లక్ష్మణుని పంపెను. అతడు కిష్కింధకు పోయి వానరులను భయపెట్టెను. సుగ్రీవుడు లక్ష్మణుని రాకను గ్రహించి, భయభ్రాంతుడై సమాధానమునకై ఆంజనేయుని పంపెను. అతడు వచ్చి, సమాహితుని జేసి సుగ్రీవుని అంతఃపురమునకు గొనిపోయెను. అంతలో సుగ్రీవుడు తారను కూడా పంపెను. ఆమె వచ్చి, మధ్య కక్ష్యలో ఉన్న లక్ష్మణుని జూచి, "శ్రీరాముని కొరకు హనుమంతుడు సైన్యములను చేర్చుచున్నాడు కదా? దేవరా! కోపము వలదు," అని మృదుమధుర వాక్యములు పలుకుచు, రాజగృహమునకు తీసికొనిపోయెను. సుగ్రీవుడు ఆసనమునుండి మర్యాదజేయునప్పటికి లక్ష్మణుడు, "ఏమోయీ! శ్రీరాముని మరచితివా? యే బాణము వాలిని చంపెనో, ఆ బాణము నిన్నెదురు చూచును. నీ విపుడు నా చే వాలిదారిన పోదువు," ఇట్లు మిక్కిలి క్రూరముగా నొక్కిచెప్పెడు లక్ష్మణునికి ఆంజనేయుడు, "ఇంత ఆగ్రహమేల? ఎల్లప్పుడు రామకార్యమున జాగరూకులై ఉండగా, మరుపెక్కడిది? అని సమాధానము చెప్పి, గౌరవించి, సుగ్రీవునిచే సత్కారము చేయించెను. లక్ష్మణుడు శాంతుడయ్యె. పిదప సుగ్రీవుడు వానరులతో వచ్చి, రాఘవునికి నమస్కరించి, సైన్యముల జూచి, "రఘునాథా! ఈ వానర మహాసైన్యము అవలోకింపుము. దీనిలో సేనాపతులు 18 పద్మాసంఖ్యకులున్నారు," అని విన్నవించి, శ్రీరామాజ్ఞచే సీతావృత్తాంతము నెరిగి వచ్చుటకై వారికి ఆజ్ఞనిచ్చెను. (90)

దిక్షు సర్వాసు వివిధాన్ వానరాన్ ప్రేష్య సత్వరమ్ ।
యామ్యాం దిశం జాంబవంతం అంగదం వాయునందనమ్ ॥ 91

నళం సుషేణం శరభం మైందం సంప్రేషయత్తదా ।
మాసాదర్వాఙ్నివర్తధ్వం నోచేద్వధ్యా భవిష్యథ ॥ 92

తతో రామో ముద్రికాం స్వాం దదౌ మారుతిసత్కరే ।
మన్నామాక్షర యుక్తేయం సీతాయై దీయతాం రహః ॥ 93

తతో రామో నిజం మంత్రం దదౌ తస్మై హనూమతే ।
తన్మంత్రస్య లక్షమితే కృత్వా తు జపలేఖనే ॥ 94

లబ్ధ్వా సామర్థ్యమతులం లంకాం గంతుం స మారుతిః ।
నత్వా రామం పరిక్రమ్య జగామ కపిభిః సహ ॥ 95

సద్వృత్తం రాఘవః ప్రాహః చిత్రకూటే పురా కృతమ్ ।
మనశ్శిలాయాస్తిలకం సీతాబాలే వినిర్మితమ్ ॥ 96

గండయోః పత్రవల్ల్యాది సీతాయై కథ్యతాం రహః ।
తతస్తే ప్రస్థితాః సర్వే పశ్చిమాదిషు దిక్షు చ ॥ 97

ప్రేషితాస్తే సమాయాతా న దృష్టా సేతి తం బ్రువన్ ।
తదాంగదాద్యాః ప్రవగాః సీతార్థే బభ్రుముర్వనే ॥ 98

## సుగ్రీవుడు సీతాన్వేషణకై వానరులను పంపుట

సుగ్రీవుడు అన్నిదిక్కులకు కపులను పంపుటలో భాగంగా దక్షిణ దిక్కుకు అంగద, జాంబవంత, ఆంజనేయ, నల, సుశేణ, శబర, మైందాదులను పంపుచు, కపులకందరికిని, “ఒక నెల లోపల తెలుసుకుని రాకపోయిన, మరణదండనమునకు లోబడుదురు.” అని చండశాసనమును ఒనర్చెను. అంత రాముడు, తన చేతి ముద్రికను ఆంజనేయుని చేతికి ఇచ్చి, “రహస్యమున దీనిని సీతకు అప్పగింపుము,” అని చెప్పి, తన మంత్రమును అతనికి ఉపదేశించెను. వాయుపుత్రుడు ఆ మంత్రమును లక్ష జపముచేసి, లక్షమార్లు వ్రాసి, లంకకుపోవు సామర్థ్యము పొందెను. పిదప అంజనాసుతుడు శ్రీరాముని వలన చిత్రకూటమున సీత చెక్కిళ్ళలోను, నుదుటిపైన, పత్రావళులు తిలకము వ్రాయబడినవి మొదలుగా గల రహస్యోదంతములను తెలిసికొని, శ్రీరామచంద్రునికి ప్రదక్షిణ నమస్కారములను

చేసి, కపులతో వెడలెను. తక్కినవారు పశ్చిమాది దిక్కులకు పోయి వెదకి, సీత దొరకలేదని మరలి వచ్చిరి. అంత అంగదాది కపివీరులు గహనాచారులై పోవుచు, వీడే రావణుడని దొరికిన నూర్లకొలది రాక్షసులను చితకకొట్టుచూ.... (98)

మత్వాఽయం రావణశ్చేతి రాక్షసాంశ్చతశోఽర్దయన్ ।
సార్ద్రాస్యాన్ఖేచరాన్ దృష్ట్వా గుహాద్వారాద్వినిర్గతాన్ ॥ 99

జలార్థం సంప్రవిష్టాస్తే గుహాయాం వానరోత్తమాః ।
తస్యాం తాన్ గచ్ఛతస్తూష్ణీం దినాన్యష్టాదశైవ హి ॥ 100

అతిక్రాంతాని తిమిరే బభ్రమస్తు ఇతస్తతః ।
తత్ర రత్నమయే దివ్యే గేహే దృష్ట్వా స్త్రియం శుభామ్ ॥ 101

సంశ్రావ్యతాం నిజం వృత్తం తద్వృత్తం శ్రోతుముద్యతాః ।
తాన్పూజ్య కథయామాస చైనం వృత్తం తు యోగినీ ॥ 102

హేమానామ్నో సుతా విశ్వకర్మణః సా మహేశ్వరమ్ ।
నృత్యేన తోషయామాస దదౌ తస్యై పురం మహత్ ॥ 103

అత్ర స్థిత్వా చిరం కాలం యదా గంతుం సముద్యతా ।
సా మాం ప్రాహాత్ర రామస్య ప్రతీక్షాం కురు సద్మని ॥ 104

సమాగచ్ఛస్వ రామస్య కృత్వా పూజనముత్తమమ్ ।
ఇత్యుక్త్వా సా దివం యాతా రాఘవం గమ్యతే మయా ॥ 105

స్వయంప్రభేతినామ్నాఽహం హేమయాః పరిచారికా ।
అధునా బ్రూత యుష్మాకం సాహాయ్యం కిం కరోమ్యహమ్ ॥ 106

తత్తస్యా వచనం శ్రుత్వా మత్వా స్వీయాదినవ్యయమ్ ।
తామూచుర్వానరాః సర్వే నస్త్వం కురు గృహాద్బహిః ॥ 107

ఇత్యుక్త్వా సా కణేనైవ తైః సహైవ యయౌ బహిః ।
తద్గిరాచ్ఛాదితస్వీయనయనైర్వానరైస్తదా ॥ 108

**న జ్ఞాతం చ తయా కేన మార్గేణ చ బహిః కృతమ్ ।**
**సాఽపి గత్వా పూజ్య రామం దేహం త్యక్త్వా దివం యయౌ ॥ 109**

**తతస్తే వానరా జ్ఞాత్వా గుహాయాం స్వదినవ్యయమ్ ।**
**విషణ్ణాః సాగరం దృష్ట్వా తస్థుః ప్రాయోపవేశనే ॥ 110**

**జటాయోః కీర్తనం చక్రు రామకార్యే మృతం పురా ।**
**చచ్ఛ్రుత్వాఽథ స సంపాతిః తాన్‌హంతు యః సముద్యతః ॥ 111**

ఒకానొక గుహద్వారమునుండి వెలువడుచుండు తేమమోముల ఖేచరులను చూసి, ఈ గుహలో నీళ్ళుగలవని యెంచి, లోనికి జొచ్చి, యూరక పోగాపోగా 18 దినములు గడచినవి. ఆ గుహలోని కటిక చీకటిలో నిటునటు భ్రమించి, చివరకు ఒక రత్నమయమగు దివ్య గృహమున శుభాంగి నొకరిని జూచి, తమ సంగతిని తెలిపి "నీసంగతి ఏమి" అని అడిగిరి. ఆ యోగిని వీరిని సత్కరించి, 'హేమ' అను పేరుగల విశ్వకర్మయొక్క కూతురు. తన నృత్యసేవచే ఈశ్వరుని సంతోషపరచి, ఈ పురమును వరముగా గొని, ఇచ్చట చిరకాలము వాసముజేసి, పోవునపుడు నాతో నీవీ ఇంటిలో రామాగమనము ప్రతీక్షింపుచుండుము. శ్రీరాముని సత్కరించి, వెడలిరమ్ము అని చెప్పి స్వర్గమునకు వెళ్ళెను. శ్రీరాముని నేను అందగలను. నా పేరు 'స్వయం ప్రభ' నేను హేమయొక్క పనిమనిషిని. నేనే మీకు సహాయము చేయవలయును," అని చెప్పగా అంగదాదులు తమకు ఇచ్చిన గడువు పూర్తియైన సంగతిని గుర్తించి, "తల్లీ! నీవు మమ్ములను గుహకు వెలుపల విడిచిన చాలు," అని వేడిరి. క్షణములో ఆమె వారితోడ గుహనుండి వెలుపలకు వచ్చెను. కండ్లు చీకట్లు కమ్మిన కపులు వచ్చిన దారిని కానరైరి. ఆమెయును వెడలి శ్రీరాముని పూజించి, దేహమును వదలి స్వర్గమునకు వెడలెను. పిదప కపులు గుహలో బహుకాలము వ్యర్థమాయెనని చింతించి సముద్రతీరమున ప్రాయోపవేశనిష్ఠులై, జటాయు సంకీర్తనమును ఆహా! రామకార్యమునకై ప్రాణమునిచ్చెగదా యని చెప్పుచుండగా, విని వీరిని చంపదలచి, సంపాతి వచ్చెను.

**తేభ్యః శ్రుత్వా మృతిం బంధోర్దత్వా తస్మై జలాంజలిమ్ ।**
**తేషాం శ్రుత్వా పూర్వవృత్తం సీతావృత్తం న్యవేదయత్ ॥ 112**

**శతయోజనమధ్యేఽబ్ధేర్లంకాయాం వర్తతేఽధునా ।**
**అశోకవనికాయాం తు తీర్త్వాఽబ్ధిం తాం ప్రపశ్యథ ॥ 113**

**అహం పక్షవిహీనోఽస్మి మయా గంతు న శక్యతే ।**
**గృధ్రత్వాద్దూరదృక్చాఽహం సీతా మాం దృశ్యతే గిరౌ ॥ 114**

భ్రాత్రా జటాయుషా పూర్వ ముడ్డీయాహం బలాద్రవిమ్ ।
స్ప్రష్టకామస్తదా తప్తస్త్రాతో బంధుర్మయా సఖే ॥ 115

పక్షాభ్యాం భస్మసాజ్జాతౌ మే పక్షౌ పతితావుభౌ ।
జటాయు స సపక్షశ్చ గతో దేశాంతరం పునః ॥ 116

అహం తదా పక్షహీనశ్చంద్రశర్మాణముత్తమమ్ ।
మునిం నత్వా తదా తస్మై నిజవృత్తం నివేదితమ్ ॥ 117

తదా మాం స మునిః ప్రాహ యదా త్వం వానరోత్తమాన్ ।
సీతాశుద్ధిం కథయసి తదా పక్షౌ భవిష్యతః ॥ 118

పశ్యతాం నిర్గతౌ పక్షౌ కోమలౌ మాం క్షణాదిహ ।
యదా నీతా రావణేన పురా సీతా విహాయసా ॥ 119

మత్పుత్రేణ తదా దృష్టా కథితం చాపి మాం తదా ।
ధిక్కృతః స మయా క్రోధాత్సా త్వయా న విమోచితా ॥ 120

తదారభ్య గతః క్రోధాదద్యాపి న సమాగతః ।
ఇత్యుక్త్వా తాన్కపీన్ పృష్ట్వా స సంపాతిర్గతస్తదా ॥ 121

అథ తే వానరాః సర్వే ప్రోచుః స్వం స్వం బలం తదా ।
న కోఽపి గమనే శక్తః శతయోజనసాగరే ॥ 122

తదా స జాంబవాన్ వృద్ధః స్తుత్వా తం మారుతిం ముహుః ।
జన్మకర్మాది సంశ్రావ్య లంకాం గంతుం దిదేశ తమ్ ॥ 123

సోఽపి శ్రుత్వా సముద్యోగం చకారరుహ్యా పర్వతమ్ ।
నిజభారాద్భూమిగతం కృత్వా సస్మార రాఘవమ్ ॥ 124

ఏవం గిరీంద్రజే ప్రోక్తం కిష్కింధావిషయే కృతమ్ ।
చరితం రాఘవేణేదం పురా పాపప్రణాశనమ్ ॥ 125

ఇతి శ్రీశతకోటిరామచరితాంతర్గతే ఆనందరామాయణే,
వాల్మీకీయే, ఆదికావ్యే, సారకాండే కిష్కింధాచరిత్రే, అష్టమః సర్గః ॥

## సంపాతి సీతా వృత్తాంతమును చెప్పుట, రెక్కలు మొలచి వెళ్ళుట

అపుడా సంపాతి వానరులనుండి తన తమ్ముడు జటాయు మృతిని తెలుసుకుని, తమ్మునికి జలాంజలిని ఇచ్చి, కపుల వృత్తాంతమును తెలుసుకొని, వారితో, "సముద్రమున నూరు ఆమడ నడుమ లంకలో అశోకవనమున ఇప్పుడు సీతగలదు. సముద్రమును దాటి, ఆమెను చూడండి. నాకు రెక్కలుపోయినవి. నేను పోజాలను. గ్రద్దనైన నేను దూరముగా ఉన్నవాటిని చూడగలను. సీత నన్ను కొండనుండి చూచినది. నా తమ్ముడు జటాయువు, నేనూ సూర్యుని ముట్టుకొనదలచి, చాలాదూరము పైకెగిరిపోతిమి. సూర్యుని దగ్గరకు చేరు ప్రయత్నములో నాకు రెక్కలు కాలి నేను ఈ పర్వతముపై పడగా, ఆ వేడినుండి బయటపడిన జటాయువు దేశాంతర గతుడయ్యె. అపుడు నేను రెక్కలు లేని వాడినై, చంద్రశర్మయను మునీంద్రునికి నమస్కరించి వారికి నాసంగతిని తెలిపితిని. వారపుడు కరుణించి, "సీతయొక్క వార్తను నీవు కపులకు చెప్పినపుడు నీకు రెక్కలు వచ్చును" అని వరమిచ్చెను. ఇదిగో చూడుడు మెత్తని రెక్కలిప్పుడే మొలుచుచు వచ్చినవి. మునుపు గగనమున రావణుడు సీతను ఎత్తుకొని పోవునపుడు నా కొడుకు చూచివచ్చి చెప్పెను. నీవు ఆమెను ఏల విడిపింపలేదని నేను నా కుమారుని ధిక్కరించితిని. అది మొదలు కోపమంది పోయిన నా కుమారుడు ఇంతవరకు రాలేదు," అని చెప్పి, కపులనుండి శెలవొంది సంపాతి తరలెను. తరువాత కపులందరును అపుడు తమ తమ బలములను పలికిరి. ఒక్కడును సముద్రమున నూరామడలపోవ శక్యుడు కాడయ్యె. అంత ఆ వృద్ధ జాంబవంతుడు పలుమార్లు ఆంజనేయుని స్తుతించి, అతని జన్మ, కర్మ, వృత్తాంతమును అతనికి తెలియజేసి, లంకా ప్రయాణమునకు ప్రోత్సహించెను. అతడు ఆ మాటలను విని, కొండనెక్కి, నేల క్రుంగునట్లు చేసి, శ్రీరాముని స్మరించెను. "పార్వతీ! పాపపరిహారకమైన మునుపటి శ్రీరాముని యొక్క కిష్కింధా విషయములోని, సచ్చరిత్రమిట్లు నా చే చెప్పబడినది." మరియు ఆ మహేశ్వరుడు ఇట్లనియె.

***శతకోటిప్రవిస్తరమైన రామకథలో, శ్రీమద్వాల్మీకిమహర్షిచే రచింపబడిన, ఆనందరామాయణంలోని, సారకాండలో, కిష్కింధాచరిత్ర వర్ణనమనే ఎనిమిదవ సర్గ ముగిసినది.***



# నవమః సర్గః-9వ సర్గ

హనుమంతుడు లంకకుచేరుట, సీతను వెదకి, లంకను కాల్చుట

శ్రీశివ ఉవాచ

అథ ఉడ్డీయ హనుమాన్ యయావాకాశవర్త్మనా ।
తద్దృష్ట్వా తద్బలం జ్ఞాతుం సురసాం నాగమాతరమ్ ॥ 1

ప్రేషయామాసురమరాః సా శీఘ్రం తత్పురో యయౌ ।
తదా సా మారుతిం ప్రాహ విశ త్వం వదనం మమ ॥ 2

స ప్రాహ రఘువీరస్య కార్యం కృత్వా విశామ్యహమ్ ।
దృష్ట్వా తస్యాస్తు నిర్బంధం వవర్ధత తదా కపిః ॥ 3

వివర్ధితం తయాఽప్యాస్యం తదా సూక్ష్మో బభూవ హ ।
అంగుష్ఠమాత్రస్తస్యాః స వక్త్రే గత్వా వినిర్గతః ॥ 4

జ్ఞాత్వా సాఽపి బలం తస్య స్తుత్వా తం ప్రయయౌ దివమ్ ।
అథాబ్ధివచనాన్మార్గే మైనాకః పర్వతో మహాన్ ॥ 5

జలమధ్యాత్ ప్రాదురభూద్విశ్రాంత్యర్థం హనూమతః ।
నానామణిమయైః శృంగైః తస్యోపరి నరాకృతిః ॥ 6

భూత్వా యాంతం హనూమంతం ప్రాహ మైనాకపర్వతః ।
ఆగచ్ఛామృతకల్పాని జగ్ధ్వా పక్వఫలాని చ ॥ 7

విశ్రామ్యాత్ర క్షణం పశ్చాద్గమిష్యసి యథాసుఖమ్ ।
పురా గిరీణామింద్రేణ యుద్ధమాసీత్సుదారుణమ్ ॥ 8

తదా దశరథేనాహం మోచితోఽస్మ్యత్ర సంస్థితః ।
అతస్తదుపకారం హి నిస్తర్తుం నిర్గతోఽస్మ్యహమ్ ॥ 9

గచ్ఛతో రామకార్యార్థం తవ విశ్రాంతిహేతవే ।
తదా తం హనుమానాహ రామకార్యే న మే శ్రమః ॥ 10

## హనుమంతుడు సాగరమును లంఘించుట

పిదప ఆంజనేయుడు సముద్రమున లంఘించిపోవునపుడు దారిలో వాని బలమును తెలియగోరి, దేవతలు నాగమాత యగు 'సురస' అను రాక్షసిని పంపిరి. ఆమె వచ్చి, వాయు పుత్రునికి అడ్డముగా నిలచి, "నా నోట దూరుమ"నెను. అపుడా కపి శ్రేష్టుడు,"రామకార్యమును నెరవేర్చి, అట్లే చేయుదు"నని వేడెను. ఆమెయొక్క నిబంధన తెలిసికొని, తన దేహమును పెంచసాగెను, ఆమె కూడా అట్లే తన దేహమును పెంచగా, హనుమంతుడు తటాలున తన ఆకారమును బొటనవ్రేలు అంత మాత్రమునకు తగ్గించుకుని సురస నోటదూరి బయటకు వచ్చెను. ఆ సురస కూడా అతని బుద్ధిబలము తెలుసుకుని, హనుమంతునికి నమస్కరించి, స్వర్గమునకు వెడలెను.

పిమ్మట సముద్రుని మాటను గౌరవించి, 'మైనాకము' అను పర్వతము ఆంజనేయునికి విశ్రాంతి నిచ్చుటకై నీటినడుమనుండి పైకి వచ్చెను. అది వివిధ రత్నమయములగు దివ్యశృంగములు గలది. దానిమీదుగా హనుమ పోవుచుండెను.

**విశ్రామః స్వామికార్యేఽత్ర న కరోమ్యద్య భక్షణమ్ ।**
**మైనాకస్తం పునః ప్రాహ స్వస్పర్శాత్పావయస్వ మామ్ ॥ 11**

**తథేతి స్పృష్టశిఖరః కరాగ్రేణ యయౌ కపిః ।**
**కించిద్దూరం గతస్యాస్య ఛాయాం ఛాయాగ్రహోఽగ్రహీత్ ॥ 12**

**సింహికానామ సా ఘోరా జలమధ్యే స్థితా సదా ।**
**ఆకాశగామినాం ఛాయామాత్రమ్యాకృష్య భక్షతీ ॥ 13**

**తయా గృహీతో మనుమాంశ్చింతయామాస వీర్యవాన్ ।**
**కేనేదం మే కృతం వేగరోధనం విఘ్నకారిణా ॥ 14**

**ఏవం విచింత్య హనుమానథో దృష్టిః ప్రసారయన్ ।**
**తత్ర దృష్ట్వా సింహికాం తాం తదాస్యే న్యపతత్కపిః ॥ 15**

**తస్యాంత్రజాలం నిష్కాస్య తాం హత్వాఽగ్రే యయౌ పునః ।**
**తతోఽబ్ధే ర్దక్షిణే కూలే లంకాం కృత్వా తు పార్శ్వతః ॥ 16**

**పపాత వరలంకాయాం తత్ర తాం రావణస్వసామ్ ।**
**క్రౌంచాం హత్వా సింహికావల్లంకాం రాత్రౌ వివేశ సః ॥ 17**

అపుడు మైనాకుడు, "వాయుపుత్రా! నీవిచట దయచేసి, అమృతమయమగు ఫలములను ఆరగించి, కొంచెము సేపు విశ్రమించి, పిదప నీ ఇచ్ఛవచ్చినట్లు పోవుదువు గాక, మునుపు ఇంద్రునికి పర్వతములకు యుద్ధము జరుగునపుడు దశరథునివలన నేను రక్షింపబడి, ఇచట దాగితిని. ఆ ఉపకారమును గుర్తుంచుకుని కృతజ్ఞతగా ఇట్లు శ్రీరామ కార్యమునకు పోవు నీయొక్క విశ్రాంతి కొరకు వచ్చితిని," అని పలికెను. అందుకు కపివరుడు, "శ్రీరామకార్యమున నాకు శ్రమలేదు. స్వామి కార్యమున విశ్రమించను. ఇపుడు ఫలహారములను స్వీకరించదలచుకోలేదు," అని చెప్పెను. అంత మైనాకుడు, "అయినా నీ స్పర్శచేతనైనను నన్ను పునీతునిజేయు,"మని సంప్రార్థించగా, అట్లే యని ఆంజనేయుడు తనచేత వానిని తాకి, ముందుకు సాగెను. మరికొంత దూరము ప్రయాణించగా, సింహిక యను భయంకరమైన రాక్షసి ఒకటి ఆకాశమున ఎగిరేవారి నీడను పట్టి ఆ ప్రాణులను భక్షించుచు, 'ఛాయాగ్రాహిణి' అని పేరుగాంచినది. ఆ ఛాయాగ్రాహిణి ఆంజనేయుని ఆకర్షించెను. అపుడు మహాబలుడగు హనుమంతుడు, "నా వేగము ఎందుకు నిదానించుచున్నది?" అని చింతించుచు, క్రింద జూచి, పెద్దనోరు తెరచికొనియుండు సింహికను వీక్షించి, దాని నోట దుమికి దాని ప్రేగులన్నింటిని చిందరవందర చేసి, బయటకువచ్చి, ముందుకు వెడలెను. తరువాత సముద్ర దక్షిణ తీరమున లంకకు సమీపమున దిగి, అచట రావణుని చెల్లెలగు 'క్రౌంచ' యను దానిని సింహికను చంపినట్లే చంపి, రాత్రి లంకలో ప్రవేశించెను. (17)

**తదా లంకాపురీ నామ్నీ రాక్షసీ తం వ్యతర్జయత్ ।**
**హనూమానపి తాం వామముష్టినాఽవజ్ఞయాఽహనత్ ॥ 18**

**తదా స్మృత్వా బ్రహ్మవాక్యం సా ప్రాహాశ్రుముఖీ పురీ ।**
**బ్రహ్మణోక్తా పురా చాహం యదా త్వాం ధర్షయేత్కపిః ॥ 19**

**తదా రామో రావణస్య వధార్థమత్ర యాస్యతి ।**
**జ్ఞాతం మయా రావణస్య వధం రామః కరిష్యతి ॥ 20**

**జితం త్వయా గచ్ఛ లంకామశోకే పశ్య జానకీమ్ ।**
**తతో వివేశ హనుమాల్లంకాం పశ్యన్యయౌ తదా ॥ 21**

**దదర్శ లంకాం తాం రమ్యాం గోపురాట్టాలమండితామ్ ।**
**హట్టవీథీచతుష్కాఢ్యాం త్రికూటశిఖరస్థితామ్ ॥ 22**

**పశ్యన్సమంతతః సీతాం ప్రతిగేహం స మారుతిః ।**
**గుహాయాం నిద్రితం కుంభకర్ణం దృష్ట్వా భయానకమ్ ॥ 23**

దృష్ట్వా విభీషణం రామకీర్తనే హృష్టమానసమ్ ।
దృష్ట్వా సులోచనాయుక్తం నిద్రితం మేఘనిస్వనమ్ ॥ 24

యయౌ రాజగృహం రాత్రౌ రావణం సదసి స్థితమ్ ।
దృష్ట్వా స్వయం వాయురూపో దీపరాజీర్వ్యలోకయత్ ॥ 25

అకరోద్వస్త్రహీనాస్తాన్ రావణాదీన్స మారుతిః ।
ఉల్ముకేనాకరోద్భస్మ కూర్చం చ రావణస్య చ ॥ 26

రాక్షసీః కోటిశో నగ్నాః కృత్వా తోయఘటాన్ కపిః ।
బభంజ లీలయా తూష్ణీం దూతాన్పుచ్ఛేన తర్జయత్ ॥ 27

తదాఽతివిహ్వలాః సర్వే ప్రోచుస్తేఽథ పరస్పరమ్ ।
క్రుద్ధాఽద్య జానకీ సత్యం నః ప్రాణాంతముపాగతమ్ ॥ 28

తచ్ఛ్రుత్వా తుష్టచితః స యయౌ రావణసద్గృహమ్ ।
అదృష్ట్వా జానకీం తత్ర యయౌ పుష్పకముత్తమమ్ ॥ 29

రావణం నిద్రితం దృష్ట్వా వేష్టితం స్త్రీకదంబకైః ।
దృష్ట్వా మందోదరీం తత్ర సీతేయమితి శంకితః ॥ 30

లక్ష్మణోక్తాని చిహ్నాని పశ్యంస్తస్యాం దదర్శ న ।
తథాపి సీతాసదృశీం దృష్ట్వా వ్యగ్రమనాస్త్వభూత్ ॥ 31

## హనుమంతుడు లంకానగరంలో ప్రవేశించుట

అపుడు 'లంకాపురి'యను రాక్షసి హనుమంతుని భయపెట్టెను. హనుమంతుడు దానిని ఎడమ ముష్టితో ఒక మొట్టుమొట్టి అణచెను. అపుడు ఆ లంకాపురి బ్రహ్మదేవుని స్మరించి, కన్నీరు గార్చుచు, "బ్రహ్మ నాతో ఇట్లు చెప్పియుండెను. ఎప్పుడు నిన్ను కపి నిగ్రహించునో, అపుడు శ్రీరాముడు రావణుని చంపుటకు ఇచటికి వచ్చును." కనుక రాముడు రావణుని చంపును అని నేను గ్రహించితిని. నీవు నన్ను గెలిచితివి. లంకలోనికి పొమ్ము, అశోకవనమున జానకిని చూడుము," అని పలుకగా ఆంజనేయుడు లంకలోనికి ప్రవేశించి, త్రికూట పర్వతమును, నగర శోభను, నగరములోని గోపురముల శోభను, మెరయుచున్న లంకాపురిని చూచెను. హనుమ అంతట పరిశీలించుచు,

ప్రతిగృహమందును సీతను వెదకపూనెను, పెద్ద గుహ వంటి భవనములో నిద్రించుచుండు భయంకరుడైన కుంభకర్ణుని జూచెను. శ్రీరామకీర్తనమున కుతూహలచిత్తుడగు విభీషణుని జూచెను. సులోచనాయుతుడై నిద్రించుచుండు మేఘనాథుని జూచెను, రాత్రి వేళలో రావణుని గృహములో ప్రవేశించెను. సభలోఉన్న దశకంఠుని జూచి, వాయురూపియగు తానే అక్కడ వెలుగుచున్న దీపాలను ఆర్పెను. అక్కడి పురుషుల గడ్డమును, మీసములను కాల్చెను. వినోదముగ అనేకమంది స్త్రీలు ఒంటిపై బట్టలు లేక కొలనులో ఆడుచుండగా ఆ స్నాన కొలనులోని నీటిని తీసివేసెను. రావణ దూతలను తోకతో భయపెట్టెను. అపుడు అందరును భయభ్రాంతులై, "నేడు సీతాదేవి కుపితయై ఉండును, సత్యము. ప్రాణాంతకము వచ్చినది," అని ఒకరికొకరు చెప్పుకొనసాగిరి. అదివిని ఆనందించిన ఆ ఆంజనేయుడు రావణుని అంతఃపురములోనికి వెళ్ళి, అచటను సీతను గానక, పుష్పక విమానమున వెదలి, స్త్రీ పరివార పరివేష్టితుడై నిద్రించుచుండు రావణుని వద్ద మందోదరిని జూచి, సీతయని శంకించి, లక్ష్మణుడు చెప్పియున్న గురుతులు ఏవియు కానరాకపోయినను, జానకి యని అనుమానించి వ్యాకులచిత్తుడాయెను. (31)

**పార్వత్యువాచ**
**కథం మందోదరీ సీతాసదృశీ రాక్షసీరితా ।**
**సీతాంశాంశాంశజాః సర్వాః స్త్రియశ్చేతి శ్రుతం మయా ॥ 32**

**శ్రీశివ ఉవాచ**
**శృణుష్వ కారణం దేవి సీతేయం విష్ణునా చితా ।**
**తేనైవ విష్ణునా పూర్వమియం మందోదరీ చితా ॥ 33**

**ఏకదా కైకసీ మాతా రావణం ప్రాహ దుఃఖితా ।**
**శేషోచ్ఛ్వాసేన తల్లింగం గతం చాద్య రసాతలమ్ ॥ 34**

**శివాదానీయ మాం దేహి ఆత్మలింగమనుత్తమమ్ ।**
**తన్మాతృవచనం శ్రుత్వా గాయనాద్వరదోన్ముఖమ్ ॥ 35**

**మామాహ రావణో వాక్యం ద్వౌ వరౌ దేహి మాం ప్రభో ।**
**ఆత్మలింగం చ మన్మాత్రే పత్న్యర్థం పార్వతీం మమ ॥ 36**

**తత్తస్య వచనం శ్రుత్వా త్వం దత్తాஉసి గిరీంద్రజే ।**
**దత్వాஉஉత్మలింగం సంప్రోక్తో మయా త్వం యది రావణ ॥ 37**

మార్గే లింగం భూమిసంస్థం కరోషి తర్హ్యహం పునః ।
నాగ్రే గచ్ఛామి తస్థానాత్తత్రైవ చ వసామ్యహమ్ ॥ 38

తథేతి రావణశ్చోక్త్వా దేవ్యా లింగేన సో యయౌ ।
తదా త్వయా స్మృతో విష్ణుస్తేనాంగచందనాదినా ॥ 39

కృత్వా మందోదరీ నామ్నీ మయహఽస్తేర్పితా శుభా ।
తాం నినాయ మయః శీఘ్రం పాతాలే స్వీయసద్గృహమ్ ॥ 40

తతో ద్విజస్వరూపేణ విష్ణుః ప్రాహ దశాననమ్ ।
ప్రతారితః శివేన త్వం దత్వా దుర్గాం తు కృత్రిమామ్ ॥ 41

పాతాళే మయగేహే సా గోపితాఽస్తి శివేన హి ।
వివిచ్యసి త్వం స్వర్లోకం భూలోకం చేతి శంకయా ॥ 42

స్వీయం మత్వా తు పాతాళం తత్ర త్వం న గవేష్యసి ।
త్యజేమాం కృత్రిమాం దుర్గాం పశ్య తాం మయసద్మని ॥ 43

గిరీంద్రజాం మహారమ్యాం పత్నీం కృత్వా సుఖం భజ ।
తద్విప్రవచనం సత్యం మత్వా మామేత్య వై పునః ॥ 44

విహస్యరావణఃప్రాహ జ్ఞాతంతేంతర్గతం మయా ।
అర్పితాకృత్రిమాదేవీ మా తాం గోప్యరసాతలమ్ ॥ 45

తవైవాస్త్వధునా చేయం త్వహం నేష్యామి గోపితామ్ ।
ఇత్యుక్త్వా త్వాం విసృజ్యాథ పాతాళం గంతుముద్యతః ॥ 46

## మందోదరి జన్మవృత్తాంతము, గోకర్ణక్షేత్ర ఆవిర్భావము

అని చెప్పిన శివునితో పార్వతి, "సీతయొక్క కళలోని అంశమువలన స్త్రీలందరును పుట్టిరని వినియున్నానే. రక్కసియగు మందోదరి ఎట్లు సీతకు సమానురాలగును?" అనిన శివుడు ఇట్లనెను, ఒకప్పుడు రావణుని తల్లియగు కైకసి ఏడ్చుచు, రావణునితో, "శేషుని ఉచ్ఛ్వాసముచేత ఆ లింగము రసాతలమునకు ఏగెను. మేలైన ఆత్మలింగమును శివుని వలన సంపాదించి ఇమ్ము," అని కోరెను. తల్లికొరకు రావణుడు సామగానముచే నన్ను మెప్పించి, నేను వరములు వేడుకొనమనగా, రావణుడు,

"నేడు రెండు వరములను అడిగెదను. నా తల్లికై ఆత్మలింగమును ఇమ్ము. నాకు పత్నిగా పార్వతిని ఇమ్ము," అని కోరెను. అపుడు నేను నిన్ను ఇచ్చితిని. ఆ ఆత్మలింగము ఇచ్చుచు, "ఓయి రావణా! దారిలో నీవు ఈ లింగమును భూమిపై పెట్టితివా, తరువాత నేను అచటినుండి వెలువడి రాను" అని చెప్పి పంపితిని. సరియని రావణుడు లంకకు పోవుచుండెను. రావణునిచే చిక్కిన నీవు శ్రీమహా విష్ణుమూర్తిని స్మరింపగా, విష్ణువు చందనాదులతో ఒక విగ్రహమును చేసి, దానికి మండోదరి అని పేరిడి మయునకు అప్పగించెను. ఆ మయుడు పాతాళమున తన ఇంటిలో భద్రపరచిపెట్టెను. అంత శ్రీహరి బ్రాహ్మణ రూపముతో వచ్చి, రావణుని జూచి, "నిన్ను శివుడు వంచించినాడు, ఎట్లనిన కృత్రిమమగు దుర్గాదేవిని నీకిచ్చి, అసలైన పార్వతిని పాతాళమున యముని ఇంటిలో దాచిపెట్టెను.

**తావన్మార్గే హ్యల్పశంకాగ్రస్తః ప్రాహ ద్విజం తథా ।**
**ఆత్మలింగం క్షణం హస్తే గృహ్ణీష్వ వచనాన్మమ ॥ 47**

**యావన్నివర్త్య శంకాం స్వామహమేష్యామి వేగతః ।**
**ద్విజవేషధరో విష్ణుస్తదా ప్రాహ దశాననమ్ ॥ 48**

**అతిక్రాంతే ముహూర్తేఽథ లింగం స్థాప్య వ్రజామ్యహమ్ ।**
**తథేతి రావణశ్చోక్త్వా తత్కరే లింగమర్పయత్ ॥ 49**

**తతో మూత్రస్య సా ధారాఽఖండితాఽభూచ్చిరం ప్రియే ।**
**అతిక్రాంతే ముహూర్తేఽథ లింగం సాగరరోధసి ॥ 50**

**పశ్చిమే స్థాప్య భూమ్యాం స యయౌ స్వీయస్థలం హరిః ।**
**తతః స రావణశ్చాపి మూత్రం కృత్వా యథావిధి ॥ 51**

**లింగం దృష్ట్వా భూమిసంస్థం తచ్ఛిరశ్చాలయత్తదా ।**
**తదా భూమ్యాం గతం లిగం శిరః కించిచ్చచాల న ॥ 52**

**అభూద్గర్తా కర్ణరంధ్రసదృశీ తచ్ఛిరః స్థలే ।**
**గర్తాయాం తచ్ఛిరశ్చాపి కర్ణశంకూపమం కృశమ్ ॥ 53**

**భువః కర్ణోపమం లింగం గోకర్ణం తద్వదంతి హి ।**
**తతః ఖిన్నమనాస్తూష్ణీం పాతాళం రావణో యయౌ ॥ 54**

**మయగేహే నిరీక్ష్యాథ దేవీం మందోదరీం వరామ్ ।**
**మయం సంప్రార్థయామాస దదౌ తాం రావణాయ సః ॥ 55**

**తతో వివాహం నిర్వర్త్య పారిబర్హం దదౌ మయః ।**
**రావణాయ దృఢాం శక్తిమమోఘాం శత్రుఘాతినీమ్ ॥ 56**

**దృష్ట్వా మందోదరం తస్యాః ప్రాహ మందోదరీమితి ।**
**తాం నామ్నా రావణస్తుష్టస్తయా స్వీయస్థలం యయౌ ॥ 57**

కావున నీవు మోసపోతిని. చేతిలో ఉన్న ఈమెను విడిచి, యముని ఇంటిలో పోయిచూడుము. మిక్కిలి మనోహరమగు చక్కని పార్వతిని పత్నిగా చేసుకొని సుఖింపుము," అని ఉపదేశించెను. రావణుడు ఆ మాటలు సత్యములని నమ్మి, నా వద్దకు మరలా వచ్చి, నవ్వుచూ, "నీ మనోగతమును తెలుసుకుంటిని. అసలైన పార్వతిని దాచి, ఈ మాయా బొమ్మను నాకు ఇచ్చితివి? నీది నీవే తీసికొమ్ము, నేను ఆమెను కొనితెచ్చెదను. అని నిన్ను నాకు అర్పించి, పాతాళమునకు పోదలచెను. అంతలో మార్గమున రావణునికి మూత్రము రాగా, ఆ దారిలో కనిపించిన విప్రునితో, "నేను అల్పశంకా నివృత్తి చేసుకొని వచ్చువరకు నీవు ఈ ఆత్మలింగమును చేతబట్టియుండుము," అనెను. విప్రవేషుడగు విష్ణువు, "ముహూర్తకాలము మించినచో, నేను నేలపై పెట్టి పోదును," అని లింగమును తీసికొనెను. రావణుడు పోయి, దీర్ఘమూత్ర విసర్జనలో ఉండెను. ముహూర్త మతిక్రమించగా ముకుందుడు పశ్చిమ సముద్రతీరమున ఆ భూమిపై ఆత్మలింగమును సంస్థాపించి, తన తావునకు తాను పోయెను. అంత ఆ రావణుడు శౌచవిధి తీర్చికొనివచ్చి నేలనున్న లింగము చూచి, దానిని పెకలించెను. అది ఇసుమంతైనను కదలలేదు. అపుడు ఆ ఆత్మలింగము పై గోవు యొక్క చెవిని పోలిన ఒక రంధ్రమును చేసెను. గోవుయొక్క కర్ణము ఆకారములో యున్న ఆ లింగమును గోకర్ణమని చెప్పుదురు. అంత రావణుడు ఖిన్నుడై ఒట్టిచేతులతో పాతాళమునకు పోయి, మయుని మందిరమున మనోహరియగు మండోదరిని చూచెను. మయుని ప్రార్థింపగా, మయుడు మండోదరిని రావణునికి ఇచ్చి పెండ్లిచేసెను. అపుడు మయుడు అల్లునికి కానుకగా శత్రువులను జంపు ఆయుధమైన శక్తి ని కానుకగా ఇచ్చెను. అపుడు మయుడు రావణుని ఉద్దేశించి, "ఈమె మందమైన ఉదరము గలది గాన మండోదరి అనబడును" అనెను. రావణుడు ఆ రమామణితోడ రాజిల్లుచు, లంకకు చేరుకొనెను.(57)

**తతౌ మాత్రా ధిక్కృతః స పునస్తప్తుం త్వరాన్వితః ।**
**గోకర్ణం రావణో గత్వా తప్త్వా లబ్ధ్వా విధేర్వరాన్ ॥ 58**

త్రైలోక్యం స్వవశో కృత్వా లంకాయాం రాజ్యమాప సః ।
తస్మాత్సీతాసమానేయం దృష్టా మందోదరీ ప్రియే ॥ 59

లంకాయాం వాయుపుత్రేణ రావణాగ్రే వినిద్రితా ।
మయోఽప్యాసీత్స లంకాయాం గృహం కృత్వా యథాసుఖమ్ ॥ 60

మయబంధుర్గయో నామ మహాన్ వీరః ప్రతాపవాన్ ।
రాత్రౌ వినిద్రితో గేహే బ్రహ్మదత్తవరాస్సుధీః ॥ 61

దశాస్యహస్తా త్తన్మృత్యు ర్విధినోక్తం విచింత్య చ ।
తస్య వస్త్రం మారుతినా హృతం సదసి వై పురా ॥ 62

తత్క్షిపద్ధేమపర్యంకే రావణస్య కపిస్తదా ।
విభీషణస్య పర్యంకే వసనం రావణస్య చ ॥ 63

క్షిప్త్వాపశ్యజ్జానకీం స లంకాయాం చ ముహుః కపిః ।
యయావశోకవనికాం వృక్షప్రాసాదమండితామ్ ॥ 64

దదర్శ తత్ర ప్రాంశుం చ శింశపానామ పాదపమ్ ।
తన్మూలే రాక్షసీమధ్యే దదర్శావనికన్యకామ్ ॥ 65

ఏకవేణీం కృశాం దీనాం మలినాంబరధారిణీమ్ ।
భూమౌ శయానాం శోచంతీం రామరామేతి భాషిణీమ్ ॥ 66

కృతార్థోఽహమితి ప్రాహ దృష్ట్వా సీతాం స మారుతిః ।
శింశపానగశాఖాగ్ర పల్లవాభ్యాంతరే స్థితః ॥ 67

పురా దృష్టానలంకారాన్ తస్య దేహే దదర్శ న ।
తతః కిలకిలాశబ్దైర్యయౌ తత్ర దశాననః ॥ 68

### హనుమంతుడు సీతను దర్శించుట.

పిదప తల్లిచే ధిక్కరింపబడిన రావణుడు మరల తపస్సుకై గోకర్ణమునకు వచ్చి, తపస్సుజేసి, బ్రహ్మవలన వరములను పొంది, త్రిలోకములను తన వశముజేసుకొని, లంకలో రాజ్యమేలుచుండెను. అందువలన మండోదరి సీతవలే చక్కనిదై ఉండెడిది.

ఆ మందోదరి నిద్రించుచుండగా అంజనాసుతుడు చూచెను. లంకలోనే మయుడును ఇల్లుకట్టుకొని నివసించచుండెను. మయుని తమ్ముడు అనబడువాడు కూడా బ్రహ్మవరములను పొంది, మహాబలుడై, అచ్చట నిద్రించుచుండెను. అపుడు హనుమంతుడు, "వీనికి మృత్యువు రావణునిచే అగును. అట్లు బ్రహ్మవాక్యము కలదని," పరిభావించి, మొదట తానెత్తిన వాని వస్త్రమును తీసి రావణుని బంగారు మంచముపై వేసెను. రావణ వస్త్రము విభీషణుని మంచముపైకి చేర్చెను. అంత ఎచ్చటను సీతను గానక అశోకవనమునకు వచ్చి, అచట ఒక భవనమును, శింశుపా వృక్షమును చూచెను. ఆ వృక్షమూలమున రాక్షసులచే కాపలా కాయపడుతున్న సీతాదేవి కనబడెను. ఒకటే జడదాల్చి, చిక్కి, దైన్యమునొంది, మలిన వస్త్రముమ కప్పుకొని, నేలపై కూర్చుని, రామా! రామా! యని అంగలార్చు చుండు జానకీదేవిని చూచిన ఆంజనేయుడు, ధన్యుడనైతిని అనుకొని ఆ అశోక వృక్ష పైభాగమున దాగి కూర్చుండెను, మునుపుండిన అలంకారములను హనుమ చూడడయ్యె. (68).

**దదర్శ రావణః స్వప్నే కపిః కశ్చిత్సమాగతః ।**
**అశోకవనికాయాం సా దృష్ట్వా తేన విదేహజా ॥ 69**

**రామహస్తాన్మృతిః శీఘ్రం లబ్ధుం తాం ధర్షయామ్యహమ్ ।**
**కపిర్దృష్ట్వా రాఘవాయ నివేదయతు మత్కృతమ్ ॥ 70**

**ఆగమిష్యతి తచ్ఛ్రుత్వా రామో మాం నిహనిష్యతి ।**
**ఇతి నిశ్చిత్య స యయౌ స్త్రీభిః సంవేష్టితో ముదా ॥ 71**

**నూపురాణాం ధ్వనిం శ్రుత్వా విహ్వలాసీద్విదేహజా ।**
**రావణో జానకీమాహ మాం దృష్ట్వా కిం విలజ్జసే ॥ 72**

**రామం వనచరం రాజ్యభ్రష్టం త్యక్తసుహృజ్జనమ్ ।**
**పిత్రా హీనం భోగహీనం సదా త్వయ్యతి నిష్ఠురమ్ ॥ 73**

**ఏకాంతవాసినం పింగజటావల్కలధారిణమ్ ।**
**తం త్యక్త్వా మాం భజస్వాద్య త్రైలోక్యేశం మహాబలమ్ ॥ 74**

**అప్సరోభిః సేవితం మాం భాగ్యయుక్తం వదస్థితమ్ ।**
**స్త్రియో మందోదరీముఖ్యాస్త్వాం భజిష్యన్త్యహర్నిశమ్ ॥ 75**

**మయా రాజ్యం త్వదధీనం కృతమస్తి భజస్వ మామ్ ।**
**మయా స్వజీవితం చాపి త్వదధీనం కృతం మహత్ ॥ 76**

ఇతి నానావిధైర్వాక్యైః ప్రార్థయామాస రావణః ।
ఉవాచాధోముఖీ సీతా నిధాయ తృణమన్తరే ॥ 77

రాఘవాద్భిభ్యతా నూనం భిక్షురూపం ధృతం త్వయా ।
రహితే రాఘవాభ్యాం త్వం సునీవ హవిరధ్వరే ॥ 78

హృతవానసి మాం నీచం తత్ఫలం ప్రాప్స్యసేఽచిరాత్ ।
యదా రామశరాఘాతవిదారితవపుర్భవాన్ ॥ 79

భవిష్యసి రణే రామం జానీషే మానుషం తదా ।
శ్రుత్వా రక్షోఽధిపః క్రుద్ధో జానక్యాః పరుషాక్షరమ్ ॥
వాక్యం క్రోధసమావిష్టః పునర్వచనమబ్రవీత్ ॥ 80

## రావణుడు సీతచే తిరస్కృతుడై వెడలుట.

తరువాత రావణుడు; కపియొకడు వచ్చి, అశోకవనమున సీతను చూచినట్లు కలగని, "శ్రీరాముని చేత త్వరగా చావును పొందుటకై ఆమెను బలాత్కరించి, అవమానించెదను. నా చేష్టను ఆ వానరుడు జూచి రామునితో చెప్పును గాక. అందువలన రాముడు వచ్చి, నన్నుచంపును గాక!" అని ఇట్లు నిశ్చయించిన రావణుడు, రాక్షస స్త్రీలచే కాపలాకాయబడుచున్న సీతయున్న చోటుకి వచ్చి, కోలాహలము చేసెను, నూపుర నాదమును విని వైదేహి విహ్వలమయ్యె. రావణుడు ఎదుటకు వచ్చి, "సీతా! నన్ను చూచి ఏలసిగ్గుపడుచున్నావు? సుఖములేక అడవులపాలై ఉంటివిగా. దిక్కుమాలిన దానివలె మిత్రులు విడనాడ రాజ్యభ్రష్టుడై, తండ్రిలేని రాముని ఇంకా ఏల కోరుచున్నావు? నీతో ఎల్లప్పుడు నిష్ఠూరములు ఆడుచుండెడు ఆ జటాధారిని వదలి, త్రిలోకపాలకుడై మహాబలుడగు నన్ను సేవింపుము. భాగ్యవంతుడై అప్సరసలచే సేవింపబడు నన్నేమందువు? నన్ను నీవు వరించితివా, మండోదరిని మొదలగు సుందరులందరును నీ చెలికత్తెలగుదురు. నా రాజ్యము నీ ఆధీనము అగును. నా ప్రాణములూ నీ ఆధీనము గావా?" ఇట్లు నానావిధ వాక్యములచే వేడెను. అందుకు సీత నేలజూచుచు, గడ్డిపరకను అడ్డుగా ఉంచి, "శ్రీరామునికి వెరచి, నీవు బిచ్చగాడివైతివే, నీచుడా! రామలక్ష్మణులు లేనపుడు, యజ్ఞమున సమర్పించు హవిస్సును కుక్కవలే నీవు నన్ను తెచ్చితివే. త్వరలో దాని ఫలమును అనుభవించెదవు. ఎపుడు రణాంగమున రామబాణములచే నీ దేహము చీలి బ్రద్దలగుచుండునో అపుడు రాముని మానుషత్వము నీవెరుగుదువు గాక," అని తృణీకరించగా, రావణుడు మిక్కిలి కోపముతో, "దేవతలు ఈ నగరిలో ఇక దుఃఖింతురు. రాముడు నా యెదుట

నిలిచి పోరాడజాలడు. అట్లు నిలిచెనా వాడు చెడును. రాముడు నన్ను జయించ చాలడు. నాకు ఆనందము,” అని ఇట్లు నొక్కిచెప్పెను.

భవిత్రీ లంకాయాం త్రిదశవదనగ్లానిరచిరాత్స
రామోఽపి స్థాతా న యుధి పురతో లక్ష్మణసఖః ।
తథా యాస్యత్యుచ్చైర్విపదమనుజేనాత్ర జటిలో
జయ శ్రీరామే స్యాన్న మమ బహుతోషోఽత్ర తు భవేత్ ॥ 81

తద్రావణవచః శ్రుత్వా జానకీ ప్రాహ తం పునః ।
షష్ఠాక్షరపరాణ్యేవ చతుర్ష చరణేష్వపి ॥ 82

త్వమక్షరాణి చత్వారి లోప్య శ్లోకమముం పఠ ।
ఏవం తయా జితో వాక్యమార్గణైః స దశాననః ॥ 83

దుద్రావ భీషయన్సీతాం ఖడ్గముద్యమ్య సత్వరః ।
ధృత్వా కరేణ తత్పాణిం మందోదర్యా నిషేధితః ॥ 84

మాదృశ్యః సతి బహ్వ్యశ్చ త్యజైనాం కృపణాం కృశామ్ ।
తతోఽబ్రవీద్దశగ్రీవో రాక్షసీర్వికృతాననాః ॥ 85

యథా మే వశగా సీతా భవిష్యతి సకామనా ।
తథా యతధ్వం త్వరితం తర్జనాదరణాదిభిః ॥ 86

యది మాసద్వయాదూర్ధ్వం మచ్ఛయ్యాం నాభినందతి ।
తదా మే ప్రాతరాశాయ హత్వా కురుత మానుషీమ్ ॥ 87

తదా సీతా పునః ప్రాహ వచనం తం దశాననమ్ ।
బాల్యంత్వేఽహం సమానీతా పేటికాస్థా త్వయా పురా ॥ 88

తదా మయా వచః ప్రోక్తం తత్త్వం కిం విస్మృతోఽసి హి ।
అధునాఽహం గమిష్యామి యాస్యామి త్వరితం పునః ॥ 89

త్వాం బంధుపుత్రసైన్యాద్యానిర్హంతుం చ మయేరితమ్ ।
తత్స్వీయం వచనం సత్యం కర్తుమత్రాగతాఽస్మ్యహమ్ ॥ 90

త్వాం బంధుపుత్రసైన్యాద్యైర్నిహత్య రామహస్తతః ।
తతోఽయోధ్యాపురీం గత్వా పునర్యాస్యామి త్వత్పురామ్ ॥ 91

నికుంభజం పౌండ్రకం తం మాతామహగృహే స్థితమ్ ।
శతశీర్షం రావణం చ ద్వీపాంతరనివాసినమ్ ॥ 92

సాహాయ్యార్థం పౌండ్రకేన లంకాయామాగతం పునః ।
అహం తృతీయ వేలాయాం సంబధిష్యామి తావుభౌ ॥ 93

తతః స్వీయస్థలం గత్వా పునర్యాస్యామ్యహం జవాత్ ।
కుంభకర్ణోద్భవం వీరం మూలకాసురనామకమ్ ॥ 94

అత్రైవ తుర్యవేలాయామాగత్య పుష్పకేణ హి ।
అహమేవ హనిష్యామి శితబాణై రణాంగణ ॥ 95

అన్యచ్చాపి స్మరాద్య త్వం పురా యద్విధినోదితమ్ ।
యద్వాక్యాచ్చ త్వయా గత్వా కౌసల్యానృపతీ హృతౌ ॥ 96

పేటికాస్థౌ పునస్త్యక్తౌ సాకేతే దైవయోగతః ।
అతస్త్వం మర్తుకామోఽసి యతోఽహమాహృతా త్వయా ॥ 97

గచ్ఛ గేహే సుఖం భుంక్ష్వ రామః శీఘ్రం హనిష్యతి ।
ఇతి సీతా వాక్యబాణైర్భిన్నమర్మస్థలోఽపి సః ॥ 98

యయౌ తూష్ణీం నిజం గేహం లజ్జితశ్చ దశాననః ।
ఏవం దశాననే యాతే రాక్షస్యో రావణాజ్ఞయా ॥ 99

అని ఇట్లు సీతావాక్య విదుడైన రావణుడు కోపముతో చేత కత్తిని పట్టుకుని భయపెట్టుచు పరుగెత్తెను. మండోదరి ప్రాణివధ చేపట్టవలదని, "నీకు నా వంటివారెందరో గలరు. ఈ కృశించిన స్త్రీని విడువుము," అని వారించెను. అంత ఆ రావణుడు, "వికారులగు రాక్షసస్త్రీలారా! మీరందరును సీత తనకై తాను నాకు ఎట్లులొంగునో అట్లు నయ, భయ, ప్రియ వాక్కులచే ప్రయత్నించుడు. ఇక రెండు నెలలలోగా నా పడకనొప్పుకొనకపోయిన మరునాడే చంపి, నాకు చికిత్సావిశేషమొనర్చుడు," అని ఆజ్ఞాపించెను. అది విని జానకీ దేవి. రావణునితో, "మునుపు నేను బాలయై పెట్టెలోన ఉన్నప్పుడు నీవు నన్ను తీసికొని వచ్చితివి. అపుడు నేను చెప్పిన దానిని మరచిపోతివి గదా? ఇపుడు

నేను పోదును, మరలా నిన్ను సపరివారముగా సంహరించుటకై వచ్చెదనని, చెప్పలేదా? నా మాటను సత్యమనిపించుటకై వచ్చియున్నాను. శ్రీరామునిచే నిన్ను, నీవారిని కూడా చంపి, అయోధ్యకు పోయి, మరలా మాతా గృహమందు నికుంభ సుతుడగు పౌండ్రకుని తోడ సఖ్యముగా మెలుగుచుండు ద్వీపాంతర వాసియగు శతకంఠరావణుని నేను మూడవతూరి వచ్చి చంపెదను. అంత స్వస్థలమునకు పుష్పకమున పోయి,  నాలుగవ సారి మరలా వేగమే వచ్చి, కుంభ కర్ణసుతుడగు మూలకాసుర వీరుని చంపెదను. ఇకనిపుడు, మునుపు బ్రహ్మచెప్పిన వాక్యములన్నింటిని స్మరింపుము. యే బ్రహ్మ వాక్యమునకై కౌసల్య దశరథులను పెట్టెలో తెచ్చి, మరలా పంపితివో తలంపుము. దైవయోగము గొప్పది. కావున నీవు నన్ను తెచ్చుటచేత చావనెంచియున్నావు. ఇంటికిపోయి నెమ్మదిగా భుజింపుము. రాముడు త్వరగా చంపును," అని చెప్పిన సీత వాక్యబాణములచే, మేని సంధులన్నియు బ్రద్దలగు-చుండినను, సిగ్గుచెందని రావణుడు ఇంటికి వెళ్ళెను. (99)

**జానకీం తాం స్వశబ్దైశ్చ తథా క్రూరోక్తిభిర్ముహుః ।**
**అస్త్రైర్విదీర్ణఖడ్గాద్యైర్భీషయన్త్యః కరాదిభిః ॥ 100**

**నివార్య త్రిజటానామ్నీ విభీషణప్రియాఽనుగా ।**
**తాః సర్వా రాక్షసీర్వేగాద్వాక్యమాహాథ సాదరమ్ ॥ 101**

**న భీషయధ్వం రుదతీం నమస్కురుత జానకీమ్ ।**
**సుచిహ్నై రాఘవః స్వప్నే మయా దృష్టోఽద్య జానకీమ్ ॥ 102**

**మోచయామాస దగ్ధ్వేమాం లంకాం హత్వా తు రావణమ్ ।**
**రావణో గోమయహ్రదే తైలాభ్యక్తో దిగంబరః ॥ 103**

**మయాఽద్య దృష్టః స్వప్నే హి తస్మాదేనాం న సాహసమ్ ।**
**కార్యం సేవ్యా సదా చేయం రామాదభయదాయినీ ॥ 104**

**యుష్మాభిదుఃఖితా చేద్వో భర్త్రేయం ఘాతయిష్యతి ।**
**ఇతి తత్త్రిజటావాక్యం శ్రుత్వా తస్థుర్భయాకులాః ॥ 105**

**తూష్ణీమేవ తదా సీతా దుఃఖాత్కించిదువాచ సా ।**
**ఇదానీమేవ మరణం కేనోపాయేన మే భవేత్ ॥ 106**

**దీర్ఘా వేణీ మమాత్యర్థం ముద్బంధాయ భవిష్యతి ।**
**యన్మయా స్వీయవాగ్బాణైః లక్ష్మణస్తాడితః పురా ॥ 107**

**తస్మాదిమాః పీడయంతి భోక్ష్యతే స్వకృతం మయా ।**
**మయా నిరాగః సౌమిత్రి స్త్రాసితో గౌతమీతటే ॥ 108**

**ప్రాయశ్చిత్తం కరోమ్యద్య తస్య త్యక్త్వా స్వజీవితమ్ ।**
**ఏవం నిశ్చితబుద్ధిం తాం మరణాయాథ జానకీమ్ ॥ 109**

## సీతావిలాపము, త్రిజటాస్వాంతనము.

ఇట్లు రావణుడు వెడలగా, ఆ ఆడ రాక్షసులు రావణాజ్ఞనొంది తీవ్రరోషముతోను, క్రూరమైన మాటలచేతను, భయంకర చేష్టలతోను, ఆయుధములను చూపుతూ, సీతను భయపెట్టసాగిరి. అపుడు విభీషణుని యొక్క ప్రియమైన భార్య 'త్రిజట' అను ఆమె భయపెట్టుచున్న ఆ రాక్షస స్త్రీలను వారించి, "దుఃఖించుచున్న జానకిమాతను భయపెట్టకండి. నమస్కరించండి, రాత్రి నా కలలో స్పష్టమైన గుర్తులతో శ్రీరాముడు స్వప్నమున కనబడి, ఈ లంకను కాల్చి, రావణుని జంపి, సీతను విడిపించెను. రావణుడు ఒంటికి నూనె రాసుకుని, పేడలో దొర్లుతున్నట్లు కనబడెను. కనుక ఈమెకై సాహసింపవలదు. ఈమె శ్రీరాముని వలన అభయము ఇచ్చును గాన, మనము ఈమెను సదా సేవింపవలసినది. మీరు ఆమెను కష్ట పెట్టితిరా, మీకు శ్రీరామునిచే చావును ప్రసాదించును." అనిన త్రిజటవాక్యములకు వారందరును ఊరక కూర్చుండిరి. అపుడు సీత దుఃఖించుచు, "ఇపుడే నాకు మరణము ఎట్లు కలుగును. మునుపు నేను వాగ్బాణములచే లక్ష్మణుని బాధించితిని గాన దానికి ఫలితముగా వీరిచే బాధింపబడుచున్నాను. ఏ పాపము ఎరుగని లక్ష్మణుడు గోదావరి తీరమున నాచే నిందింపబడెను. నేను ప్రాణము విడచి, దానికి ప్రాయశ్చిత్తము చేసికొనెద." అనుచు ఇట్లు మరణమును నిశ్చయించుచుండు జానకిని చూచి హనుమంతుడు మెల్లగా శ్రీరామ వృత్తాంతమును గానము చేసెను (9)

**దృష్ట్వా శనైర్వాయుపుత్రో రామవృత్తం న్యవేదయత్ ।**
**ఆసాకేతనిర్గమాచ్చ స్వసీతాదర్శనావధి ॥ 110**

**సవిస్తారం క్రమేణైవ సీతాతోషార్థమాదరాత్ ।**
**సీతా క్రమేణ తత్సర్వం శ్రుత్వా సాశ్చర్యమానసా ॥ 111**

**కిం మయేదం శ్రుతం వ్యోమ్ని స్వప్నో దృష్టోఽథవా నిశి ।**
**యేన మే కర్ణపీయూషవచనం సముదీరితమ్ ॥ 112**

స దృశ్యతాం మహాభాగః ప్రియవాదీ మమాగ్రతః ।
తచ్ఛ్రుత్వా తత్పురో గత్వా నత్వా తామబ్రవీత్పునః ॥ 113

రామదూతౌ దదౌ తస్యై రాఘవస్యాంగులీయకమ్ ।
తాం రామముద్రికాం దృష్ట్వా నత్వా తామబ్రవీత్కపిమ్ ॥ 114

సర్వం కథయ మద్వృత్తం యథా దృష్టం త్వయాఽత్ర హి ।
తదా తాం సాంత్వయామాస రామో మత్స్కంధసంస్థితః ॥ 115

వానరేంద్రైః సమాగత్య హత్వా రావణమాహవే ।
త్వాం నేష్యతి భయం సీతే త్యజ త్వం మమ వాక్యతః ॥ 116

తతః సీతాప్రత్యయార్థం రూపం స్వం దర్శయన్ కపిః ।
తతః పునః ప్రత్యయార్థం సీతాయై రాఘవోదితమ్ ॥ 117

మనః శిలాయాస్తిలకం చిత్రకూటగిరౌ కృతమ్ ।
కపిస్తత్కథయామాస పూర్వవృత్తం సవిస్తరమ్ ॥ 118

తతస్తుష్టాం జానకీం తాం మారుతిర్వాక్యమబ్రవీత్ ।
అనుజ్ఞాం దేహి మే మాతస్త్వభిజ్ఞానం దదస్వ మామ్ ॥ 119

సా తం చూడామణిం పిత్రా దత్తం కేశాంతరస్థితమ్ ।
నిష్కాస్య తత్కరే దత్వా పూర్వం కాకేన యత్కృతమ్ ॥ 120

చిత్రకూటగిరౌ వృత్తం కథయామాస తత్కపిమ్ ।
తతో నత్వా రామపత్నీం చింతయామాస చేతసి ॥ 121

స్వామికార్యం కృతం చైతదన్యత్కించిత్కరోమ్యహమ్ ।
ఇతి నిశ్చిత్య మనసా జానకీం పునరబ్రవీత్ ॥ 122

మాతర్మేఽతీవ క్షుద్బోధస్త్వద్య విక్లవదో మహాన్ ।
అస్మిన్వనేఽతిమధురః ఫలసంఘోఽతిదుర్లభః ॥ 123

## సీతాదేవి ఆంజనేయునికి రామముద్రికనిచ్చుట.

అయోధ్యనుండి బయలుదేరినది మొదలు, ఆంజనేయుని చూచువరకు జరిగిన యావత్ వృత్తాంతమును సవిస్తరముగ, సాదరముగా చెప్పిన దానిని విని, సీతాదేవి ఆశ్చర్యమునొంది, "నేనేమీ ఆకాశవాణి వినుచున్నాన? పగటిపూట రాత్రివలె కలకంటినా ఏమి? ఎవడు నాకు ఇట్లు కర్ణామృతములగు పలుకులను పలుకుచుండునో, ప్రియవాక్కులు పలుకు ఆ పుణ్యాత్ముడు నా ఎదుట కనబడని," అని చెప్పగా, ఆంజనేయుడు ఎదుటకు వచ్చి నమస్కరించి, మరలా శ్రీరామవృత్తాంతమును విన్నవించి, శ్రీరామ నామాంగుళీయకమును సీతకు సమర్పించెను. ఆమె రామముద్రికను చూచి, నమస్కరించి, "ఇచట నాసంగతి నీవెట్లు చూచితివో, అట్లు సర్వమును చెప్పుదువు కదా!" అనెను. అపుడు ఆంజనేయుడు ఆమెను సమాధాన పరచుచు, "శ్రీరాముడు నా భుజములపై కూర్చుండి, కపివరులతో ఇచటికి వచ్చి, యుద్ధమున రావణుని చంపి నిన్ను తీసికొనిపోవును. సీతమ్మా! నా మాటలచే భయమును వదులుము." అని సీతకు నమ్మకము కల్పించుటకై రామునిచే చెప్పబడిన చిత్రకూటమున తిలకమిడినది మొదలుగా గల సంగతిని విస్తారముగా విన్నవించి, అంత ఆనందించుచుండు జానకీదేవితో, హనుమ "తల్లీ! నాకు విజ్ఞానమును ఇచ్చి, అనుజ్ఞను ఇమ్మని," వేడెను. అందుకు సీత తన తండ్రి ఇచ్చియుండిన చూడామణిని జడనుండి తీసి, ఆంజనేయుని చేతికిచ్చి, మునుపు కాకాసురునిచే చేయబడిన సంఘటనను చెప్పెను. పిదప ఆ కపీంద్రుడు సీతకు నమస్కరించి, తన మనమున 'స్వామికార్యమును నెరవేర్చితిని ఇంకా నేనేమైనా ఘనకార్యము చేసి పోవలయు' నని నిశ్చయించుకుని, సీతతో, "తల్లీ! దూర ప్రయాణమువలన బాగా ఆకలిగా యున్నది. నీ ఆజ్ఞచే ఈ వనమున అరుదైన, మధురమైన ఫలములను తినెదను," అని ప్రార్థించెను(123)

**తవాజ్ఞయాఽద్య సీతేఽహం కరిష్యే భక్షణం ధ్రువమ్ ।**
**ఇతి తద్వచనం శ్రుత్వా జానకీ స్వీయకంకణమ్ ॥ 124**

**నిష్కాస్య హస్తాత్తం ప్రాహ గృహీష్వేదం ప్లవంగమః ।**
**అనేన ఫలసంభారాన్ లంకాహట్టాత్ ప్రగృహ్యా చ ॥ 125**

**భుక్త్వా పీత్వా సుఖం గచ్ఛ వనేఽస్మిన్ త్రోటయస్వ మా ।**
**తదా కపిః పునః ప్రాహ పరహస్తఫలాని హి ॥ 126**

**నాహం భుంజామి సీతే మే వ్రతమస్తి వ్రజామ్యహమ్ ।**
**వ్రజంతం మారుతిం దృష్ట్వా సీతా వచనమబ్రవీత్ ॥ 127**

భో బాలక కపిశ్రేష్ఠ రావణోఽస్తి వనాధిపః ।
న శక్తిర్న చ శక్యం తే కథం త్వం భక్షయిష్యసి ॥ 128

తత్తస్యా వచనం శ్రుత్వా మారుతిః ప్రాహ జానకీమ్ ।
శ్రీరామేతి పరం మంత్రశాస్త్రం మే హృదయాంతరే ॥ 129

తేన సర్వాణి రక్షాంసి తృణరూపాణి సాంప్రతమ్ ।
తదా తం జానకీ ప్రాహ పతితాన్యత్ర వై భువి ॥ 130

భుంక్ష్వైతాని ఫలాని త్వం తూష్ణీం మా త్రోటయాత్ర వై ।
తథేతి మారుతిశ్చోక్త్వా వృక్షాన్పుచ్ఛేన చాలయన్ ॥ 131

వృక్షాందోలనమాత్రేణ నిపేతుశ్చ ఫలాని హి ।
భక్షయామాస తాన్యేవ సుఫలాని క్షణేన సః ॥ 132

తతో వృక్షాన్ సముత్పాట్య లాంగూలేన స మారుతిః ।
క్షిప్త్వా తానన్యవృక్షేషు సమస్తాని ఫలాని వై ॥ 133

పాతయామాస భూమ్యాం తు భక్షయామాస తాని సః ।
భక్షితాని సమస్తాని ఫలాని వనజాని హి ॥ 134

దృష్ట్వా తం దుద్రువుర్ధర్తు మారుతిం వనరక్షకాః ।
రాక్షసానాగతాన్ దృష్ట్వా వృక్షైస్తాన్తాడయత్కపిః ॥ 135

ఉత్పాట్యాశోకవనికాం నిర్వృక్షామకరోత్క్షణాత్ ।
సీతాశ్రయనగం త్యక్త్వా వనం శూన్యం చకార సః ॥ 136

బభంజ చైత్య ప్రాసాదం హత్వా తద్రక్షకాన్ క్షణాత్ ।
తతస్తా రాక్షసీస్సర్వా వనభంగం నిరీక్ష్య చ ॥ 137

పప్రచ్ఛుర్జానకీం సర్వాః కోఽయం కస్య కుతస్త్విహ ।
తాస్సర్వా జానకీ ప్రాహ రాక్షసాః కామరూపిణః ॥ 138

విచరంతి ముదా భూమ్యాం వేద్మ్యహం భిక్షురూపిణా ।
యదా హృతాం పంచవట్యాం రావణేన హి తద్వనాత్ ॥ 139

**తస్మాత్జ్ఞేయస్తు యుష్మాభిః కోయం మాం పృచ్ఛతేద్య కిమ్ ।**
**ఇతి తస్యా వచశ్శ్రుత్వా రాక్షస్యో భయవిహ్వలాః ॥ 140**

## అశోకవన భంగము

సీత దయతో తనచేతి కంకణమును తీసి, "కపివీరా! దీనిని తీసికొనుము. లంకలోని అంగళ్ళ బజారున దీనిచే కావలసిన ఫలములను తీసికొనుము. తిని, త్రాగి సుఖముగా పొమ్ము. ఈ వనమును ఛేదింపవలదు," అనగా అందుకు కపీంద్రుడు, "తల్లీ! పరులచేతి పండ్లను నేను తిననని వ్రతము గలదు, పోదును" అని వెడలెను. దానిని జూచి, జానకి, "ఓరి నాయనా! వానర నాయకా! రావణుడు వనాధిపతి గదా? నాకు శక్తిలేదు. నీవల్ల కాజాలదు. మరెట్లు తిందువురా! అని మందలించగా, అందుకు హనుమంతుడు, "అమ్మా! శ్రీరామయను పరమమంత్ర శాస్త్రమునందు నాకు నమ్మకము గలదు. అందుచేత ఇప్పుడు రాక్షసులందరును నాకు తృణప్రాయులు," అని చెప్పెను. అంత ఆ జానకి అదిగో నేలపై రాలిన పండ్లను తిని తృప్తినొందుము, వ్యర్థముగా చెట్లను ఛేదించవలదనెను. అట్లేయని అంజనాత్మజుడు తోకతో చెట్లను కదిలించెను. అంత ఆ చెట్లనుండి పండ్లు రాలినవి. వాటిని వానరేంద్రుడు భక్షించగా, అవి ఫలము లయ్యె. వాయునందనుడు మహా వృక్షములను తోకతో పెళ్ళగించి, తక్కిన చెట్లమీద వేసి, పండ్లనన్నింటిని రాలగొట్టి, చక్కగా ఎక్కి, ఒక్క చెట్టును నిటారుగా ఉండనియ్యడయ్యె. ఆ వనరక్షకులు వచ్చి, వాయునందనుని భయపెట్టి, తరుముటకు పరుగిడిరి. ఆ వచ్చిన రాక్షసులను చూచి, హనుమ వృక్షములచే వారిని చావమోదెను. ఆ అశోకవనమున సీత ఉన్న వృక్షము తప్ప మరి ఏ చెట్టును నిటారుగా ఉంచలేదు. అచట ఉన్న మందిరమును పగులగొట్టి, కావలివాండ్రను చంపెను. దానిని జూచి, అచటి రాక్షస స్త్రీలు వీడెవ్వడు? ఎచ్చటివాడు? అని సీతను అడిగిరి. అందుకు సీత "రాక్షసులు, కామరూపులై యథేచ్ఛగా తిరుగుచుందురు? నేను వీనిని ఎరుగను. రావణుడు భిక్షకుని వేషముతో వచ్చి పంచవటిలో ఉన్న నన్ను పట్టి తెచ్చెను. గనుక మీరే వీనిని ఎవ్వడో తెలుసుకోండి. నన్ను ఏల అడుగుచున్నారు?" అని చెప్పగా, వారందరును భయభ్రాంతులై, ఆ సంగతిని రావణునికి చెప్పుటకై పరుగిడిరి. (140)

**దశాననం హి తద్వృత్తం యయుః శీఘ్రం నివేదితుమ్ ।**
**ఏతస్మిన్నంతరే ప్రాతర్మంచకే కటిబంధనమ్ ॥ 141**

**నిరీక్ష్య రావణశ్చాథ గయస్య చకితస్తదా ।**
**భుక్తాం మందోదరీం జ్ఞాత్వా తాం హంతుం ఖడ్గమాదదే ॥ 142**

తదా నివారిత స్త్రీభిః స్త్రీహత్యాం మాకరోత్త్వితి ।
తదా క్రుద్ధో దశగ్రీవస్తూష్ణీం గత్వా గయగృహమ్ ॥ 143

అవధీన్నిద్రితం వీరం ఖడ్గేన స్వగృహం యయౌ ।
తదా విభీషణః ప్రాతర్బంధోర్వస్త్రై స్వమంచకే ॥ 144

దృష్ట్వా తాం స రమాం హంతుం దుద్రువే వర్జితస్తదా ।
స్త్రీభిర్ధృత్వా తస్య హస్తం స్త్రీహత్యా గర్హితా త్వితి ॥ 145

విభీషణస్తదారభ్య బంధోస్త్రాసమమన్యత ।
ఏవమాసీచ్చ లంకాయాం కౌతుకం కపినా కృతమ్ ॥ 146

## రావణుడు భయభ్రాంతుడై గయుని చంపుట.

అంతలో రావణుడు తెల్లవారి లేచి, తన మంచము మీద గయుని కటివస్త్రములను చూచి, వీడు మండోదరిని, నన్ను భావించెననుకొని, మండోదరిని చంపుటకై ఖడ్గమెత్తుకొనెను. స్త్రీ హత్య వలదు వలదని, అచటి అంగనలందరును నివారించిరి. అంతట రావణుడు కృద్ధుడై ఏమియును పలుకక, గయుని ఇంటికి పోయి, నిద్రించుచున్న ఆ వీరుని చంపి, తన నగరమునకు వచ్చెను. అపుడు విభీషణుడు ప్రొద్దున తన మంచముమీద రావణుని వస్త్రమును జూచి, తన సతిని 'సరమ'ను చంపుటకై తరలి, అచటి అంగనలు చేబట్టుకొని నింద్యమగు స్త్రీ హత్యనేలచేసెదవని నివారింపగా, విడిచి, యూరకుండెను. మరియు అదిమొదలు, అన్ననుండి వెరపును ఆలోచించెను. ఇట్లు కపివీరునిచే అచట వినోదము చేయబడెను. (146)

అథ వేగేన రాక్షస్యః సభాసంస్థం దశాననమ్ ।
వృత్తం నివేదయామాసుః స్థలద్వాణ్యా వనోద్భవమ్ ॥ 147

తచ్ఛ్రుత్వా రావణః క్రోధాత్కపినోత్పాటితం వనమ్ ।
వనపాలం సమాహూయ జంబుమాలినమబ్రవీత్ ॥ 148

రాక్షసైర్నియుతైర్గచ్ఛ కీశం ధృత్వా సమానయ ।
తథేతి స యయౌ వేగాదశోకవనికాం ప్రతి ॥ 149

దృష్ట్వా సైన్యం దీర్ఘనాదం చకార కపికుంజరః ।
తతస్తే రాక్షసాః శస్త్రైర్నిజఘ్నుర్వానరోత్తమమ్ ॥ 150

తత ఉత్ప్లుత్య హనుమాన్ తోరణేన సమంతతః ।
నిష్పిపేష క్షణాదేవ మశకానివ యూథపః ॥ 151

హత్వా తాన్ రాక్షసాన్ సర్వాంస్తతో వేగేన మారుతిః ।
తాలవృక్షం సముత్పాట్య జఘాన జంబుమాలినమ్ ॥ 152

తాన్ సర్వాన్ నిహతాన్ శ్రుత్వా పంచసేనాపతీన్నృపః ।
రావణః ప్రేషయామాస హతాస్తే తోరణేన చ ॥ 153

వాయుపుత్రేణ వేగేన లక్షరాక్షససంయుతాః ।
స తానపి మృతాన్శ్రుత్వాఽక్షం పుత్రం ప్రేషయత్తదా ॥ 154

కపినా మారితః సోఽపి ససైన్యో ముద్గరేణ చ ।
తతః సంప్రేషయామాస పుత్రమింద్రజితం పునః ॥ 155

తతః స రథమారూఢః కోటిరాక్షసవేష్టితః ।
యుద్ధం చకార కపినా శస్త్రైరస్త్రైః సుదుర్ధరైః ॥ 156

తదా పుచ్ఛేన సైన్యాయ కృత్వా ప్రాకారముత్తమమ్ ।
నిష్పిపేష తోరణేన రాక్షసాన్మారుతిః క్షణాత్ ॥ 157

తతో వృక్షం సముత్పాట్య మేఘనాదమతాడయత్ ।
వృక్షేణ భిన్నసర్వాంగో మేఘనాదోఽవిశద్గృహమ్ ॥ 158

ఏతస్మిన్నంతరే బ్రహ్మా ప్రార్థయామాస మారుతిమ్ ।
బ్రహ్మాస్త్రం మానయన్మేఽద్య త్వం లంకాం యాహి రావణమ్ ॥ 159

తథేత్యంగీచకారాసౌ మేఘనాదం యయౌ విధిః ।
విధిః ప్రాహ మేఘనాదం క్వ గతోఽద్య పరాక్రమః ॥ 160

## రావణుడు వనభంగ వార్త విని, వానరుని బంధించుట

తరువాత వెంటనే రాక్షస స్త్రీలు కన్నీరు గార్చుచు, సభలో నున్న రావణునితో అశోకవన ధ్వంస వృత్తాంతమును విన్నవించిరి. రావణుడు అదివిని జంబుమాలి అను వనపాలకుని పిలచి, నీవు పదివేల రాక్షసులతో పోయి, ఆ కోతిని పట్టితెమ్మని ఆజ్ఞాపించెను. జంబుమాలి పరివారముతో

అశోకవనమునకు రాగా, ఆంజనేయుడు పెద్దగా గర్జించెను. అది విని వారందరును శస్త్రములు ప్రయోగింపగా, మారుతి చెట్లను పెళ్ళగించి, వారిపై విసరి, ఏనుగులు దోమలను నలిపినట్లు రాక్షసులను నలిపివేసి, మట్టికరిపించి, ఒక పెద్ద తాటిచెట్టుతో జంబుమాలిని చంపెను. అది విని రావణుడు లక్షసైన్యముతో ఐదుమంది సేనాపతులను పంపగా, వారందరును వానరునిచేతిలోని మందిరముయొక్క స్తంబములతో చావగ, అక్షుడను తన కుమారుని పంపెను. వానిని ఆ వాయుసుతుడు మోచేతి దెబ్బలతో యమునివద్దకు పంపెను. పిమ్మట దశకంఠుడు ఇంద్రజిత్తయిన మేఘనాదుని పంపెను. వాడు కోటిసైన్యముతో వచ్చి, శస్త్రాస్త్రములను ప్రయోగించెను. ఘోరయుద్ధము చేసెను. ఆంజనేయుడు ఆసైన్యమునకు తన తోకతో ప్రాకారమును రచించి, తోరణస్తంభముచే వారినందరిని సంహరించెను. ఒక వృక్షమును పెకలించి, మేఘనాదుని అంగములన్నియు తునాతునకలు అగునట్లు చావమోదెను. వాడు వానరునికి వెరచి, పరుగెత్తి గుహలో దాగెను. అంతలో బ్రహ్మదేవుడు వచ్చి, "నా బ్రహ్మాస్త్రమును గౌరవింపుము. లంకలోని రావణుని వద్దకు పొమ్ము". అని ఆంజనేయుని ప్రార్థించగా, అట్లేకానిమ్మని మాట ఇచ్చి, గుహలో దాగియున్న మేఘనాదుని వద్దకు పోయి, "నీ పరాక్రమము ఎచ్చటికి పోయె? బ్రహ్మాస్త్రముచే నన్ను బంధించి నీ తండ్రివద్దకు కొనిపొమ్ము," అనెను. అంత అట్లే అని ఇంద్రజిత్తు మరలా వచ్చి, బ్రహ్మాస్త్రముచే ఆంజనేయుని బంధించి రావణుని వద్దకు తీసుకునిపోయెను.(160)

**గచ్ఛ మేఽస్త్రేణ తం బద్ధ్వా పితురగ్రే సమానయ ।**
**స బ్రహ్మ వచనం శ్రుత్వా మేఘనాదః పునర్యయౌ ॥ 161**

**బ్రహ్మాస్త్రేణాథ బద్ధ్వా తమానయామాస రావణమ్ ।**
**తతో రావణవాక్యేన ప్రహస్తః ప్రాహ మారుతిమ్ ॥ 162**

**కస్త్వం కుతః సమాయాతః ప్రేషితః కేన వా వద ।**
**తతః స రామవృత్తం హి కథయామాస విస్తరమ్ ॥ 163**

**విసృజ్య మౌర్ఖ్యాద్ధృది శత్రుభావనాం**
**భజస్వ రామం శరణాగతప్రియమ్ ।**
**సీతాం పురస్కృత్య సపుత్రబాంధవో**
**రామం నమస్కృత్య విముచ్యసే భయాత్ ॥ 164**

**యావన్నగాభాః కపయో మహాబలా**
**హరీంద్రతుల్యా నఖదంష్ట్రయోధినః ।**

లంకాం సమాక్రమ్య వినాశయంతి తే
తావద్ద్రుతం దేహి రఘూత్తమాయ తామ్ ॥ 165

జీవన్న రామేణ విమోక్ష్యసే త్వం,
గుప్తః సురేంద్రైరపి శంకరేణ ।
న దేవరాజాంకగతో న మృత్యోః
పాతాళలోకానపి సంప్రవిష్టః ॥ 166

శుభం హితం పవిత్రం చ వాయుపుత్రవచః ఖలః ।
ప్రతిజగ్రాహ నైవాసౌ మ్రియమాణ ఇవౌషధిమ్ ॥ 167

ఇతి తద్వచనం శ్రుత్వా మారుతిం ప్రాహ రావణః ।
వినిర్జితా యేన దేవాస్తస్య మే పౌరుషం త్వయా ॥ 168

న దృష్టం వల్గసే వ్యర్థం శ్రుణు కించిద్వదామి తే ।
పంచాంగపాఠకశ్చాయం పశ్య బ్రహ్మా కృతో మయా ॥ 169

ప్రతీహారస్త్వయం సూర్యః శశీ ఛత్రధరః కృతః ।
వరుణోఽయం జలగ్రాహీ మార్జకః పవనస్త్విహ ॥ 170

అగ్నిః కృతోఽయం రజకో మాలాకారః శచీపతిః ।
దండపాణిర్యమశ్చాత్ర దాస్యశ్చాత్ర సురస్త్రియః ॥ 171

మార్తండో నాపితశ్చాఽయం గణపః ఖరరక్షకః ।
మంగలాద్య గ్రహాః సప్త మే సోపానయితాసనే ॥ 172

శిశుసేవాతత్పరేణ షష్ఠీ దేవీ మయా కృతా ।
ఆందోళితశ్చ కైలాసః కుబేరోఽపి వినిర్జితః ॥ 173

## ఆంజనేయుని సద్బోధను వినక రావణుడు విఱ్ఱవీగుట

పిదప రావణాజ్ఞచే, ప్రహస్తుడు, “నీవెవడవు? ఏలవచ్చితివి? ఎవరంపిరి? చెప్పు,” అని అడుగగా, ఆంజనేయుడు శ్రీరామ వృత్తాంతమును చక్కగా నొక్కివక్కాణించి, “రావణా! మూర్ఖతనమువలన మనసున శత్రుభావము వదిలి, శరణాగత ప్రియుడగు శ్రీరాముని సేవింపుము. సీతాదేవిని

పురస్కరించుకుని, సానుజుడు సాత్మజుడైన రామునికి నమస్కరించినచో భయములేక బ్రతుకుదువు. మహా బలులును, మహాసింహ తుల్యులును, పెద్ద పెద్ద కోరలు, గోళ్ళుగల వానర యోధులును అగు కొండలవంటి కపులు నీ లంకను ముట్టడిజేసి, ధ్వంసము చేయుటకు మునుపే త్వరబడి, ఆ జానకీదేవిని శ్రీరామసన్నిధికి సమర్పించి ధన్యుడవగుము. నీవు సురేంద్రులచేతను, శంకరుని చేత రక్షింపబడినను, ఇంద్రసన్నిధిలో దాగినను, మృత్యువు కరుణించి బ్రోచినను, పాతాళలోకములో దాగి యున్నను, శ్రీరామునినుండి తప్పించుకోలేవు. తప్పక చత్తువు.” అని చెప్పిన ప్రియమును, మంగళమును, పరిశుద్ధమగు హనుమంతుని మాటను మన్నింపక, ఆ దుష్టరావణుడు; చచ్చుచుండు వాడెవడో ఔషధమును నిరాకరించినట్లు, కపివీరునితో, “ఓరి దూతా! దేవతలను జయించిన నా పరాక్రమమును, నీ వెరుగక ఇట్లు వ్యర్థముగా మొరుగుచున్నావు. కొంచెము చెప్పెదను వినుము. బ్రహ్మదేవుడు పంచాంగము చెప్పబడు వాడై పడియున్నాడు. ఈ సూర్యుడు ప్రతిహారియై ఉన్నాడు. చంద్రునిచే గొడుగు పట్టించితిని. ఈ వరుణుడు నీళ్ళుతెచ్చుచున్నాడు. ఇచట వాయువు చెత్త ఊడ్చువాడు. అగ్ని బట్టలు ఉతుకు రజకుడై యున్నాడు. ఇంద్రుడు పూలదండలు కట్టుచున్నాడు. ఇచట యముడే దండపాణియై ఉన్నాడు. దేవస్త్రీలందరును దాసీజనులు. మార్తాండుడే క్షౌరకుడు. గణపుడు గాడిదలు గాచువాడు. అంగారకాది సప్తగ్రహములు నా సింహాసనమునకు సోపానములు. ఈ షష్ఠీదేవి బిడ్డలదారిగా చేయబడినది. కైలాసమును చేతితో ఊపితిని.

**కథం మమాఽగ్రే విలపస్యభీతవత్**
**ప్లవంగమానామధమోఽసి దుష్టధీః ।**
**క ఏష రామః కతమో వనేచరో**
**నిహన్మి సుగ్రీవయుతం నరాధమమ్ ॥ 174**

**ఇత్యుక్త్వా హంతుముద్యుక్తం దశాస్యః సభాస్థితః ।**
**తదా నివారయామాస రావణం స విభీషణః ॥ 175**

**పరదూతో న హంతవ్య ఇత్యాదివచనైస్తదా ।**
**తతః క్రోధసమావిష్టో రావణో లోకరావణః ॥ 176**

**దూతానాజ్ఞాపయామాస ఛేదనీయం తు లాంగులమ్ ।**
**తద్రావణవచః శ్రుత్వా రాక్షసాస్తే సహస్రశః ॥ 177**

**స్వాయుధైశ్ఛేదయామాసుః కుఠారక్రకచాదిభిః ।**
**ఆయుధాన్యేవ శతశస్తత్పుచ్ఛాఘాతమాత్రతః ॥ 178**

బభూవుః శతచూర్ణాని తస్య రోమ్ణోఽపి న వ్యథా ।
తన్నిరీక్ష్య దశాస్యః స మారుతిం వాక్యమబ్రవీత్ ॥ 179

న వీరా గోపయంత్యత్ర స్వీయం మృత్యుమపి క్వచిత్ ।
అతస్త్వం వద పుచ్ఛస్య యేన ఘాతోఽద్య తే భవేత్ ॥ 180

తదాఽమరత్వం స్వం ప్రాహ కపిస్తచ్చ మృషేతి సః ।
మత్వా దశాస్యస్తం ప్రాహ పునః సత్యం వదేతి చ ॥ 181

తదా స మారుతిస్తూష్ణీం క్షణం చిత్తే వ్యచింతయత్ ।
మత్పితుశ్చ సఖా వహ్నిస్తస్మాన్నాస్తి భయం మమ ॥ 182

తస్మాత్పుచ్ఛం దీపయిత్వా లంకాం దగ్ధాం కరోమ్యహమ్ ।
తతస్తం రావణం ప్రాహ మారుతిః సదసి స్థితః ॥ 183

పుచ్ఛం మే వహ్నినా దగ్ధం భవిష్యతి న సంశయః ।
తత్తస్తం వచనం శ్రుత్వా రావణో నిజకింకరాన్ ॥ 184

ఆజ్ఞాపయామాస పుచ్ఛం దీపయిత్వా ప్రయత్నతః ।
లంకాయాం దర్శనీయోఽయం దృష్ట్వైవం మద్భయం భవేత్ ॥ 185

సర్వేషాం మద్రిపూర్ణా చ తథా చక్రుస్త్వరాన్వితాః ।
తైలాక్తైః శణపట్టైశ్చ రాక్షసా వసనైరపి ॥ 186

కుబేరుని జయించితిని. అట్టి నా ఎదుటనే నీవు నిర్భయముగా కేకవేయుదువా? దుష్టబుద్ధిగల నీవు కపులలో పరమనీచుడవు. ఈ రాముడెవడు? ఈ కపి ఎంతటి వాడు? సుగ్రీవునితో ఈ నరాధముని చంపెదను," అని చెప్పి, రావణుడు సభలో వాయుసుతుని చంపనెంచెను. అప్పుడు విభీషణుడు, "పరుల దూతను చంపరాదు" అని మంచిమాటలతో నివారించెను. పిదప క్రోధాక్రాంతుడైన రావణుడు వీని తోక కత్తిరించుడని దూతలను ఆజ్ఞాపించెను. వేలకొలది రాక్షసులు వచ్చి, కొడవలి, రంపము, మొదలైన ఆయుధములతో కోయనారంభించగా వారి ఆయుధములన్నీ వేయి ముక్కలైనవి. వాటిచే ఆంజనేయుని ఒక్క రోమము కూడా తెగలేదు. దానిని గుర్తించిన రావణుడు మారుతితో "వీరులు తమ మృత్యువును కూడా దాచుటలేదు గాన, నీ తోక ఎట్లు పోవునో నీవే చెప్పు," అనెను. అందుకు ఆంజనేయుడు, నేను చావులేనివాడనని యథార్థము పలికియును మరలా

సత్యము చెప్పుమని రావణుడు అడుగగా, క్షణమాత్రము తన మనస్సులో నా తండ్రికి మిత్రుడగు అగ్ని భట్టారకునిచే నాకు భయము కలుగ జాలదు. (182) గనుక నా తోకకు నిప్పుపెట్టించుకొని, లంకనే కాల్చివేయుదునని ఆలోచించి, రావణునితో, "నా తోక నిప్పుచే కాల్చబడునందులకు సంశయములేదు," అని పలికెను.

పుచ్ఛం సంవేష్టయామాసుస్తదా పుచ్ఛం వ్యవర్ధత ।
తతో వసనహట్టాత్తు వస్త్రకోశాన్విలుంత్యచ ॥ 187

తత్పుచ్ఛం వేశ్యయామాసుర్ గృహవస్త్రైరనేకశః ।
తతః పురుషనారీణాం లంకాస్థానం నృపాజ్ఞయా ॥ 188

బలాదాచ్ఛిద్య వస్త్రాణి చక్రుః సర్వాన్ దిగంబరాన్ ।
తతః శయ్యామంటపాంశ్చ కంచుకీః కంచుకానపి ॥ 189

పౌరాణాం రాజగేహాచ్చ తే వస్త్రాణి సమానయన్ ।
దృష్ట్వాఽపూర్తి తు పుచ్ఛస్య సభాస్థానాం నృపస్య చ ॥ 190

వస్త్రమాత్రైః సమస్తైశ్చ లాంగూలం వేష్టయంస్తదా ।
ధ్వజోష్ణీషపతాకాభిర్విప్రాణాం వసనైరపి ॥ 191

మందోదర్యాదివస్త్రైశ్చ భిక్షూణాం వసనాదిభిః ।
వేష్టయన్కపిలాంగూలం తతః సీతాం యయుశ్చరాః ॥ 192

తత్జ్ఞాత్వా మారుతిశ్చాపి పుచ్ఛపూర్తి ప్రదర్శయత్ ।
తదా కోలాహలశ్చాసీద్వస్త్రార్థం ప్రతిసద్మని ॥ 193

తైలార్థం చ ఘృతార్థం చ స్నేహపాశం సమానయన్ ।
నాసీన్నిశాయాం దీపార్థం శిశూనామపి నో ఘృతమ్ ॥ 194

ఆసన్ స్త్రీపురుషా నగ్నా లజ్జా నాసీత్పరస్పరమ్ ।
తతస్తద్దీపయామాసుర్ వహ్నినా భస్త్రకంపనైః ॥ 195

ప్రదీప్తం నాభవత్పుచ్ఛం తతో మారుతిరబ్రవీత్ ।
యదా స్వీయముఖేనాయం యజమానోఽద్య రావణః ॥ 196

వహ్నిం ప్రజ్వాలయేదత్ర తదా జ్వాలా భవిష్యతి ।
తన్మారుతివచః శ్రుత్వా యయావగ్రే దశాననః ॥ 197

యావత్ఫూత్కారయామాస తత్పుచ్ఛానలమాననైః ।
తావత్తచ్ఛిరజాః శ్మశ్రుకూర్చాం దగ్ధా తదాఽభవన్ ॥ 198

తదా వింశద్భుజైః స్వీయముఖోపరి దశాననః ।
తాడయద్వహ్నిశాంత్యర్థం జహసూ రాక్షసాస్తదా ॥ 199

హాస్యం చకార హనుమాంస్తదా క్రుద్ధః స రావణః ।
నీయతాం మర్కటశ్చాయమితి దూతాన్వచోఽబ్రవీత్ ॥ 200

తతో దూతాః కపిం నిన్యుర్లంకాయాం తే సమంతతః ।
శృంఖలాభిర్ దృఢం బద్ధ్వా భ్రామయామాసురాదరాత్ ॥ 201

వాద్యఘోషైర్దీర్ఘశబ్దైర్ వేష్టితం శస్త్రధారిభిః ।
ఏవం దివా సర్వలంకాం దృష్ట్వోడ్డీయ స మారుతిః ॥ 202

ధృత్వాఽతిసూక్ష్మరూపం తు దృఢబంధవినిర్గతః ।
యథాస్థానం బ్రహ్మణోఽస్త్రం తద్యయౌ పూర్వమేవ హి ॥ 203

## హనుమంతుని తోకకు నిప్పంటించి ఉరేగించుట.

ఆ మాట వినిన రావణుడు తన సేవకులకు, “మీరందరు ప్రయత్నించి, వీని తోకకు నిప్పుముట్టించి, లంకలో ఊరేగించండి. ఇది చూసి నా శత్రువులందరికిని నా భయము కలుగును,” అని ఆజ్ఞాపించెను. అట్లే అందరును త్వరబడి, నూనెలో ముంచిన గడ్డి తీరులను, గుడ్డలను తోకకు చుట్టుచురాగా, అది పెరగసాగెను. అంత బట్టల బజారులోనుండి వస్త్రములన్నిటిని తెచ్చి చుట్టిరి. రాజాజ్ఞచే, ఇండ్లలోని స్త్రీ, పురుషుల వస్త్రములన్నియును చుట్టబడెను. అందరును దిబంగరమూర్తులైరి. చివరకు పరుపు గుడ్డలు, బంత్రోతులవి, సభవారివి, రాచకార్యములవారివి, రావణాదులవి మండోదరి మొదలగు వారివి, రాజ్యాంగనలవి, బిడ్డలవి, తలగుడ్డలు, మొలగుడ్డలు, ధ్వజపటములు అన్నియునైనవి. సీతాదేవి యొక్క వస్త్రమునకు యత్నించగా దానిని గ్రహించి, ఆంజనేయుడు తోక పెంపును చాలించి, పుచ్ఛము పూర్తిగ చూపెను. ఇంటింటను గుడ్డలకై గుమి కూడి కొట్టుకొనుచుండిరి. నూనెకై, నేతికై జిడ్డుచిక్కిన చాలునని అల్లాడి తెచ్చిపోయుచుండిరి. రాత్రియైన దీపమునకును నూనె లేదు. బిడ్డలకు నెయ్యియును లేదు. అందరు దిగంబరులగుటచే ఒకరినొకరు చూసుకుని సిగ్గుభగ్గమనుచుండిరి.

అంత ఆ తోకకు నిప్పుముట్టించి, కొలిమి తిత్తులను ఊదించిరి. అయినను నిప్పురాజుకొనలేదు. అపుడు ఆంజనేయుడు, "ఇపుడు యజమానుడగు రావణుడే తన నోటితో ఊదుచూ, నిప్పుముట్టించిన అంటుకొనును" అనెను. అట్లే రావణుడు ముందుకు వచ్చి, తోకకు నిప్పును ఊదెను. వాని తలవెంట్రుకలు తోడ, గడ్డము, మీసములు కాలి వెలివత్తులైనవి. రావణుడు తన ఇరువది చేతులచే మోములను రుద్దుకొనుచుండగా, రాక్షసులందరును పకపకలుగా నవ్వుచుండిరి. అప్పుడు ఆంజనేయుడు అపహాస్యము చేయగా దశగ్రీవుడు క్రుద్ధుడై, ఈ మూకను ఆవల గొనిపొండని దూతలను ఆజ్ఞాపించెను. అంత వారు మారుతికి సంకెళ్ళువేసి, చక్కగా కట్టి, శ్రద్ధతో లంక వీధులలో ఊరేగించుచు, వాయిద్యములు మ్రోగుచుండగా, శస్త్రధారులై కేకలు వేయుచు వెంటబోయిరి. ఇట్లు కపివీరుడు గంతులు వేయుచు, పగలు సర్వలంకను చుట్టి, అత్యంత సూక్ష్మరూపమును పొంది, సంకెళ్ళను వదిలించుకొనెను. ఆ వేళకు బ్రహ్మాస్త్రము తొలగిపోయెను (203)

**తతః పశ్చిమదిక్సస్థం లంకాద్వారం సమానయత్ ।**
**నిష్కాస్య తోరణం ద్వారాజ్జఘాన ద్వారరక్షకాన్ ॥ 204**

**హత్వా స్వరక్షకాంశ్చాపి ప్రాసాదేషు సమంతతః ।**
**దదావగ్నిం స్వపుచ్ఛేన లంకాం దగ్ధాం చకారసః ॥ 205**

**తదా కోలాహలశ్చాసీల్లంకాయాః ప్రతిసద్మని ।**
**నిద్రితానపి బాలాంశ్చ త్యక్త్వా నార్యో గృహాద్బహిః ॥ 206**

**దుద్రువుః ప్రాణరక్షార్థం దగ్ధవస్త్రాలకాస్తదా ।**
**క్రమేణ రావణాదీనాం ప్రాసాదాన్ జ్వలయన్క పిః ॥ 207**

**తాం రావణసభాం దగ్ధ్వా జనాన్ పుచ్ఛేన తాడయత్ ।**
**అభవన్ రాక్షసా దగ్ధా ముఖవాద్యాని చక్రిరే ॥ 208**

**తదా స రావణః క్రుద్ధో రాక్షసైర్దశకోటిభిః ।**
**యయౌ యోద్ధుం మారుతినా తాన్ సర్వాన్ తోరణేన సః ॥ 209**

**ఘాతయామాస పుచ్ఛేన బద్ధ్వా చైకత్ర కోటిశః ।**
**తథైవ లీలయా పుచ్ఛం రావణస్య చ మస్తకే ॥ 210**

**సంతాడ్య తత్త్వచం దగ్ధామకరోన్మారుతిః క్షణాత్ ।**
**తత్పుచ్ఛవహ్నినా దగ్ధో మూర్ఛితోఽభూద్దశాననః ॥ 211**

**కపిః శ్రీరామకీర్త్యర్థం రావణం న జఘాన సః ।**
**పతితం పితరం దృష్ట్వా దృష్ట్వాదగ్ధాన్ స్వరాక్షసాన్ ॥ 212**

**ఆత్మనః ప్రాణరక్షార్థమింద్రజిద్వివరం యయౌ ।**
**కపిర్లక్ష్మణప్రీత్యర్థం మేఘనాదం జఘాన న ॥ 213**

**ఏవం సర్వాన్విర్జిత్య గోపురాట్టాలమండితామ్ ।**
**దగ్ధ్వా లంకాం సవిస్తారం యయౌ సాగరముత్తమమ్ ॥ 214**

**తటే పుచ్ఛం స్థాపయిత్వా జలజాన్ రక్షయన్ కపిః ।**
**తత్తరంగైః సీతలం స్వం కృత్వా లాంగూలముత్తమమ్ ॥ 215**

## ఆంజనేయుడు లంకను కాల్చుట

తరువాత ఆంజనేయుడు పశ్చిమద్వారము నుండి, తోరణస్తంభమును ఎత్తుకుని, ద్వారపాలకులను, తన కావలివారిని కూడా సంహరించి, అంతఃపురములలోను, భవనములలోను అంతట తన తోకతో నిప్పుపెట్టి, లంకను కాల్చివేసెను. అపుడు ప్రతి ఇంటిలోను కోలాహలము చెలరేగెను. ఆడవారు నిద్రించు బిడ్డలను విడిచి ప్రాణరక్షణకై ఇంటివెలుపలకు పరుగెత్తిరి. క్రమంగా రావణాదుల ప్రాసాదములకు నిప్పు అంటించి, ఆ రావణ సభను కాల్చి, జనులను తోకతో అదిలించెను. కాలుచుండు రాక్షసులు నోటికి చేతికి తాళం ఆరంభించిరి. అపుడు రావణుడు కోపగించి పదికోట్ల రాక్షసులతో బయలుదేరి ఆంజనేయునితో యుద్ధమునకు ఆరంభించెను. కపివీరుడును తోరణస్తంభముతో చెలరేగి నొక్కొక్కచోట కోట్ల కొలది రాక్షసులను తోకతో చుట్టసాగెను. అట్లే వినోదముగా రావణుని తలమీద వాలమును ఉంచి, దెబ్బవేసి, వాని చర్మమును కాల్చెను. తోకనిప్పుచే రావణుడు మూర్ఛితుడాయెను. శ్రీరామునికి కీర్తికలుగవలెనని రావణుని చంపలేదు. తన తండ్రి నేలబడగా చూచి తన ప్రాణరక్షణకై ఇంద్రజిత్తు బిలములో దూరెను. వానిని లక్ష్మణుని ప్రీతికై చంపలేదు. కపీంద్రుడు గోపురాలతో అలంకరింపబడిన లంకనంతటిని దహించి, సముద్రతీరమునకు పోయి, జలజంతువులను బ్రోవ దలచి, నీటిమీద తోకను చాపి, ఆ అలలచేతనే తోకను చల్లార్చుకొనెను. (215)

**నిజకంఠాచ్చ ధూమ్రేణ శ్లేష్మాణం సాగరేఽక్షిపత్ ।**
**తతః కపిః క్షణం తూష్ణీం స్థిత్వా సీతాం విచింత్య చ ॥ 216**

**తాడయామాస హృదయే మత్వా దగ్ధాం విదేహజామ్ ।**
**ఆత్మానం గర్హయామాస స్థిత్వా సాగరరోధసి ॥ 217**

ధిక్ధిక్మాం వానరం మూఢం స్వామిపత్న్యాశ్చ దాహకమ్ ।
నిశ్చయేన మయా దగ్ధా జానకీ రామతోషదా ॥ 218

న విచారః కృతః పూర్వం లంకాదాహేఽవివేకినా ।
ఆత్మఘాతం కరోమ్యద్య పుచ్ఛబంధేన చాత్ర వై ॥ 219

కిం రామాయేదృశం స్వాస్యం దర్శయేఽద్య విగర్హితమ్ ।
రామస్తు శ్రుత్వా సీతాయా వృత్తం శీఘ్రం మరిష్యతి ॥ 220

తద్దుఃఖేన స సౌమిత్రిర్మరిష్యతి న సంశయః ।
తయోర్దుఃఖేన సుగ్రీవస్తదర్థం సా చ వై రుమా ॥ 221

తం శ్రుత్వా సోఽంగదశ్చాపి మరిష్యత్యతిలాలితః ।
తారాఽపి పుత్రశోకేన నృపే నష్టేఽథ వానరాః ॥ 222

ప్రాప్తే పంచదశే వర్షే భరతోఽపి మరిష్యతి ।
రామదుఃఖేన కౌసల్యా సుమిత్రా పుత్రదుఃఖితః ॥ 223

తథా సా కైకయీ దుష్టా సర్వానర్థకరీ తు యా ।
శత్రుఘ్నో బంధుదుఃఖేన రామార్థం మునయశ్చ తే ॥ 224

రాఘవా రామభక్తాశ్చ మంత్రిణః సుహృదస్తథా ।
సీతాపితుః కులం సర్వం కౌసల్యాయాః పితుః కులమ్ ॥ 225

సుమిత్రాయాశ్చ కైకేయ్యాస్తేషాం సంబంధినస్తథా ।
నష్టే రాజకులే జాతే ప్రజా స్వేచ్ఛానువర్తినీ ॥ 226

మరిష్యతి న సందేహస్తతః స్థావరజంగమమ్ ।
భూమిస్థాః ప్రాణినః సర్వే యదా నష్టస్తదా దివి ॥ 227

హవ్యకవ్యవిహీనాస్తే దేవా నాశం గతా ఇవ ।
అకాలే ప్రళయం దృష్ట్వా నష్టాం సృష్టిం స్వనిర్మితామ్ ॥ 228

పశ్చాత్తాపేన ధాతాఽపి మరిష్యతి న సంశయః ।
ఏవం క్రమేణ బ్రహ్మాండం నశ్యత్యేవ న సంశయః ॥ 229

ఏతద్ఘాతనిమిత్తోఽహం విధినా నిర్మితః పురా ।
ఇత్యుక్తవత ఖేదేన దేహత్యాగార్థముద్యతమ్ ॥ 230

దృష్ట్వా సాఽఽకాశజా వాణీ బభూవ బహుహర్షదా ।
మా కురుష్వ కపే ఖేదం న దగ్ధా జానకీ శుభా ॥ 231

ఆత్మానం దర్శయిత్వా తాం శీఘ్రం గచ్ఛ రఘూద్వహమ్ ।
తాం వాణీం హనుమాన్ శ్రుత్వా బభూవ హర్షపూరితః ॥ 232

ద్రుతం తాం జానకీం ద్రష్టుమశోకవనికాం యయౌ ।
తావద్దదర్శ లంకాయాం సువర్ణవేషితాం భువమ్ ॥ 233

## సీత అగ్నిలో చిక్కుకొనెనని భ్రమించి హనుమ విలపించుట.

తన గొంతునుండి పొగరంగు కలిగిన శ్లేష్మమును సముద్రములో ఉమ్మివేసి, కొంతసేపు ఊరక చింతించి, సీతను తలంచుకుని, అయ్యో! సీత కాలెనేమోనని విలవిలలాడి, అక్కడి సముద్రపు ఇసుకమీద కూర్చుని, తనలో తాను ఇట్లు చింతించెను. "స్వామి భార్యను కాల్చిన పరమ మూఢుడగు ఈ కపి పరమనీచుడు. ఛీ! ఛీ! అయ్యో! రామకాంతయగు సీత నిజముగా కాలిపోయెను. అవివేకియగు నేను లంకను కాల్చునపుడు మొదట విచారించక పోతినే. ఇచటనే తోకచే ఉరివేసుకుని చచ్చెదను. ఎట్లు నింద్యమగు నా ముఖమును శ్రీరామునికి చూపుదును. రాముడు ఈ వార్తవిని బ్రతుకడు. ఆ దుఃఖముచే లక్ష్మణుడు నిలువడు. వారు పోగా సుగ్రీవుడు మృతినొందును, అందుచే మంత్రులతోడ శ్మశానమునకేగును. అంత అంగదుడు, పుత్రశోకముచే తారా పోవును. రాజు లేమిచే కపులు చత్తురు. పదునాలుగు ఏండ్లు నిండగానే భరతుడు మృతినొందును. రామ దుఃఖముచే కౌసల్యను, లక్ష్మణ దుఃఖముచే సుమిత్రయును, సర్వానర్థములకు మూలమైన కైకయును, తత్సంబంధులును, జనక రాజాదులును, వారి బంధువర్గమువారును. ఇట్లే క్రమముగా రాజకుల మంతయును విలయము నొందును. ప్రజలు స్వేచ్ఛగా పోయి చత్తురు. ఆ తరువాత వృక్ష పర్వతాదులు చెడును. భూమిపై ప్రాణులందరు నశించగా హవిస్సులు లేక దేవతల బ్రతుకు తెల్లవారును. కవ్యములు లేక పితరులు ఇబ్బందిపడెదరు. ఇట్టి అకాలప్రళయమును చూచి, తన సృష్టిచెడెనని పశ్చాత్తాపముచే బ్రహ్మ నశించును. క్రమముగా బ్రహ్మాండమే పోవును ఇందులో సంశయములేదు. ఈ దుడుకు తనమునకు నిమిత్తముగా నేను నిర్మింపబడితిని అని విచారించి ప్రాణము విడుచుటకు సిద్ధపడుచుండగా ఆంజనేయునికి,

"దుఃఖింపకుము, మంగళాదేవి యగు జానకీదేవి కాలిపోలేదు. ఓ కపీ! నీవు ఆమెను దర్శించి శ్రీరామ సన్నిధికి శీఘ్రముగా పొమ్ము," అని అశరీరవాణి వినబడెను. ఆ మంచిమాట విని హనుమంతుడు సంతోషముతో వేగమే జానకిని దర్శించుటకై అశోకవనమునకు వచ్చెను. (233).

**తత్కారణం వదామ్యద్య తచ్ఛృణుష్వ గిరీంద్రజే ।**
**ఆసీద్గిరివరో దేవి త్రికూట ఇతి విశ్రుతః ॥ 234**

**క్షీరోదేనావృతః శ్రీమాన్యోజనాయుతముచ్ఛ్రితః ।**
**తావతా విస్మృతః పర్యక్ త్రిభిః శృంగైః పయోనిధిమ్ ॥ 235**

**దిశః ఖం రోచయన్నాస్తే రౌప్యాయసహిరణ్మయైః ।**
**తస్య ద్రోణ్యాం భగవతో వరుణస్య మహాత్మనః ॥ 236**

**ఉద్యానమృతుమన్నామ ఆక్రీడం సురయోషితామ్ ।**
**తస్మిన్సరః సువిపులం లసత్కాంచనపంకజమ్ ॥ 237**

**కుముదోత్పలకల్హారశతపత్రశ్రియోర్జితమ్ ।**
**నైతత్కృతఘ్నాః పశ్యంతి న నృశంసా న నాస్తికాః ॥ 238**

**తస్మిన్సరసి దుష్టాత్మా విరూపోఽంతర్జలాశయః ।**
**ఆసీద్గ్రాహో గజేంద్రాణాం దురాదర్షో మహాబలః ॥ 239**

**అథ దంతోజ్జ్వలముఖః కదాచిద్గజయూథపః ।**
**ఆజగామ తృషాక్రాంతః కరేణుపరివారితః ॥ 240**

**తృషితః పానకామోఽయ మవతీర్ణశ్చ తత్ సరః ।**
**పిబతస్తస్య తత్తోయం గ్రాహస్తముపపద్యత ॥ 241**

**సులీనః పంకజవృతే యూథమధ్యగతః కరీ ।**
**గృహీతస్తేన రౌద్రేణ గ్రాహేణాతిబలీయసా ॥**
**గజో హ్యాకర్షతే తీరం గ్రాహ ఆకర్షతే జలమ్ ॥ 242**

**పశ్యంతీనాం కరేణూనాం క్రోశన్తీనాం సుదారుణమ్ ।**
**నీయతే పంకజవనే గ్రాహేణావ్యక్తమూర్తినా ॥ 243**

తథాఽఽతురం యూథపతిం కరేణవో
వికృష్యమాణం తరసా బలీయసా ।
విచుక్రుశుర్దీనధియోఽపరే గజాః
పార్ష్ణిన్ గ్రహాస్తారయితుం న చాశకన్ ॥ 244

తయోర్యుద్ధమాభూద్ఘోరం దివ్యవర్షసహస్రకమ్ ।
వారుణైః సంయతః పాశైర్నిష్ప్రయత్నగతిః కృతః ॥ 245

వేష్ట్యమానః సుఘోరైస్తు పాశైర్నాగైర్దృఢైస్తథా ।
విస్ఫూర్జితమహాశక్తిర్విక్రోశశ్చ మహారవాన్ ॥ 246

వ్యథితః స నిరుత్సాహో గృహీతో ఘోరకర్మణా ।
పరమాపదమాపన్నో మనసాఽచింతయద్ధరిమ్ ॥ 247

ఏకాగ్రో నిగృహీతాత్మా విశుద్ధేనాంతరాత్మనా ।
ప్రగృహ్య పుష్కరాగ్రేణ కాంచనం కమలోత్తమమ్ ॥ 248

నైవేద్యం మనసా ధ్యాత్వా పూజయిత్వా జనార్దనమ్ ।
ఆపద్విమోక్షమన్విచ్ఛన్గజః స్తోత్రముదీరయత్ ॥ 249

## గజేంద్రమోక్షము, లంకా స్వర్ణమహిమ.

అంతలో ఆ లంకయందు బంగారు కప్పిన నేల నవలోకించెను. పార్వతీ! దానికి కారణమును చెప్పెదను వినుము. త్రికూటమను ప్రసిద్ధమగు పర్వతశ్రేష్ఠము పాలు పెరుగుల సంపద కలిగి యుండును. యోజన ప్రమాణము ఉత్తరము అంతయును వెడల్పుగల మూడు శృంగములు అందులో గలవు. అవి మూడును బంగారు, వెండి, ఇనుము వన్నెలచే దిక్కులను ఆవరించును, దాని సానువులో పూజ్యుడైన వరుణదేవుని యొక్క ఋతుమంతము అను దేవస్త్రీలకు విహారస్థానమైన దివ్య ఉద్యానవనము ఒకటి గలదు. అందులో విస్తారమును, స్వర్ణకమల కమనీయమును, కువలయ, కుముద, కల్హార, కాంతివంతము ఐన దివ్య సరస్సు ఉన్నది. అది కృతఘ్నులకును, నాస్తికాధములకును, హింసకులకును కనబడదు. దానిలో దుష్టాత్మయును, ఘోరాకారమును, మహాబలాన్వితమును, మంత్రదండ మారణమును అగు మహా మొసలి ఒకటి నీటిలో దాగి ఉండును. ఆ సరోవరమునకు పెద్ద దంతములు గల ఏనుగు అచటికి వచ్చెను. దప్పికగొని ఆడఏనుగలతోడ వచ్చెను. అట్లే ఆ కొలనులో దిగి, నీళ్ళు త్రావునపుడు ఆ మొసలిచే పట్టుబడెను. మిక్కిలి బలశాలియైన మొసలిచేత ఈడ్వబడిన ఏనుగల

రాజు మధ్యగతుడైనను, తామర తోటలో చిక్కువడెను. ఇట్లు మొసలిచే, బలముగా పట్టి లాగబడి, యల్లాడుచుండు గజరాజును చూసి, తక్కిన గజములు అనుతాపముచే, వెనుక నిలిచి, లాగుచు, ఎంత పోరాడినను, మొసలి పట్టును విడిపింప లేకపోయినవి. పిదప వెయ్యేండ్ల పాటు ఆ మొసలికిని గజరాజుకును గొప్ప పోరాటము సాగినది. అపుడా గజరాజు నీటిలో నాగపాశముతో చుట్టబడినట్లు, దారుణమగు మొసలికి చిక్కి కదలజాలకపోయెను. అట్లు మహానక్రముచే ఆపబడిన గజరాజు చిక్కి, ఉత్సాహము చెడి, ఆపదనొంది, శ్రీహరిని తలంచెను. నిర్మలమగు అంతరంగముచే, బాహ్య ఇంద్రియములను నిగ్రహించి, ఏకాగ్రుడై, తొండముతో ఒక కనక కమలమును అందుకొని, మనస్సులో నివేదనముగా భావించి, పురుషోత్తముని పూజించి, ఆపద తప్పింపమని వేడుచు స్తోత్రము చేసెను. (249)

**తత్కృతేన స్తవేనైవ సుప్రీతః పరమేశ్వరః ।**
**ఆరుహ్య గరుడం విష్ణురాజగామ సురోత్తమః ॥ 250**

**గ్రాహగ్రస్తం గజేంద్రం చ తం గ్రాహం చ జలాశయాత్ ।**
**ఉజ్జహారాప్రమేయాత్మా తరసా మధుసూదనః ॥ 251**

**జలస్థందారయామాస నక్రం చక్రేణ మాధవః ।**
**మోచయామాస నాగేంద్రం పాశేభ్యః శరణాగతమ్ ॥ 252**

**ఆసీర్గజః పురా పాండ్య ఇంద్రద్యుమ్న ఇతి శ్రుతః ।**
**ఏకదా స తపోనిష్ఠో బభూవ ధ్యానతత్పరః ॥ 253**

**యదృచ్ఛయా యయౌ తత్ర కుంభజన్మా నృపాంతికమ్ ।**
**ధ్యానస్థః స నృపో నైవ మునిం వేద సమాగతమ్ ॥ 254**

**దదౌ శాపం మునిర్భూప దృష్ట్వాత్మానం తు నోత్థితమ్ ।**
**తపోమదేన సంభ్రాంతస్త్వ యస్మాన్నోత్థితోஉసి మామ్ ॥ 255**

**అతో భవ గజో భ్రాంతో మదేన విపినేஉచిరాత్ ।**
**తం శ్రుత్వా నృపతిః శాపం తం ప్రణమ్య పునః పునః ॥ 256**

**విశాపం ప్రార్థయామాస మునిః ప్రాహ హరేః కరాత్ ।**
**భవిష్యతి విముక్తిస్తే యదా గ్రాహో ధరిష్యతి ॥ 257**

పురా తదైవ గంధర్వైస్త్వప్సరోగణసేవితః ।
సరస్యస్మిఞ్జలాక్రీడాం కర్తుం హూహూః సమాగతః ॥ 258

సరస్యఘమర్షణార్థం తం దృష్ట్వా స దేవలం చిరమ్ ।
సంస్థితం చ బహిః కర్తుం గంధర్వః స వ్యచింతయత్ ॥ 259

స్వయం భూత్వా జలే లీనస్తత్పాదౌ స్వకరేణ హి ।
దృఢం ధృత్వా కర్షయంతం జ్ఞాత్వాతమశపన్మునిః ॥ 260

గ్రాహవన్మే ధృతౌ పాదౌ తస్మాద్గ్రాహో భవాత్ర వై ।
తేన సంప్రార్థితః ప్రాహ హరిస్త్వా ముద్ధరిష్యతి ॥ 261

ఏవం తౌ పూర్వశాపేన పతితావతి సంకటే ।
హరిరుద్ధృత్య తౌ తాభ్యాం యయౌ స్వీయస్థలం పునః ॥ 262

ఆ గజేంద్రుడు చేసిన స్తుతిచే పరమేశ్వరుడగు విష్ణుమూర్తి సుప్రసన్నుడై గరుడుని ఎక్కి, వేగమే వచ్చి; మొసలి, ఏనుగులను బయటకు తీసి, తన చక్రాయుధముచే మొసలిని చంపెను. శరణాగతుడగు గజరాజును హరి యిట్లు పరిరక్షించి, పాశములనుండి తొలగించెను.

పూర్వము ఇంద్రద్యుమ్నుడను పాండ్యరాజు ఉండెను. అతను ఒకానొకప్పుడు తపమును ఆచరించుచు, ధ్యాననిష్ఠుడై ఉండెను. అనుకోకుండా ఒకసారి అచటికి అగస్త్యుడు వచ్చెను. ధ్యానమందున్న ఆ ఇంద్రద్యుమ్నుడు ఆ మునీంద్రుని రాకను గమనించలేకపోయెను. అపుడు అగస్త్యుడు, "నీవు తపో మదముచే నాకు తగు గౌరవమును ఇవ్వకపోతివి గనుక, భ్రాంతుడా! అరణ్యమున ఏనుగై పుట్టి, మదము పట్టి, చిరకాలము తిరుగుచుండుము," అని శపించెను. ఇంద్రద్యుమ్నుడు అందుకు వెరచి, శాపమునకు విరుగుడు ఇవ్వమని సంప్రార్థించెను. అగస్త్యుడు కరుణించి, "మొసలి నిన్ను పట్టి లాగినపుడు చక్రధారియైన విష్ణువు నిన్ను ఉద్ధరించును," అని చెప్పి వెడలెను.

మునుపు ఈ దివ్య సరోవరములో 'హూహూ' అను గంధర్వుడొకడు అప్సరస స్త్రీలతోడ జల క్రీడలకై వచ్చి, అచట నీటిలో దిగి అఘమర్షణ స్నానము చేయుచున్న 'దేవలుడు' అను మునిని చూచి, ఆతనిని అక్కడినుండి వెళ్ళగొట్టదలచి, తాను నీటిలో దాగుకొని, చేతులతో దేవలుని కాళ్ళు బట్టి లాగెను. ఆ దేవల మహర్షి, "మొసలివలే పట్టి లాగితివి గాన నిచట నీవు మొసలివై పడియుండు," మని శపించెను. 'హూహూ' మిక్కిలి వేడుకొనగా, శ్రీహరి ఉద్ధరించునని శాప విమోచనము చెప్పెను.

ఇట్లు వారిరువురును పూర్వ శాపమువలన అత్యంత సంకటమున పడియుండిరి. వారిని విష్ణుమూర్తి ఉద్ధరించి, స్వీయ స్థలములను ఇచ్చిపోయెను.(262)

క్షుధితేనాథ తార్క్ష్యేణ ప్రార్థితః ప్రాహ తం హరిః ।
గచ్ఛ భక్షస్వ పతితే గజగ్రాహకలేవరే ॥ **263**

యయౌ తార్క్ష్యః సరః పుణ్యం తావద్భ్రూభంగగృధ్రరాట్ ।
కళేవరాంతికం ప్రాప్తస్తం నిహత్య ఖగేశ్వరః ॥ **264**

పదేనైకేన భ్రూభంగమపరేణ కళేవరే ।
ధృత్వా తార్క్ష్యః శుద్ధదేశ భక్షణార్థమపశ్యత్ ॥ **265**

తావత్క్షీరార్ణవే జాంబూనదవృక్షం సమీక్ష్య సః ।
ఆయామవిస్తరోచ్చైస్తు సహస్రయోజనం శుభమ్ ॥ **266**

తచ్ఛాఖాయాం విశాలాయాం యావత్తస్థౌ స పక్షిరాట్ ।
తావద్బభంజ తచ్ఛాఖా వాలఖిల్యైరధోముఖైః ॥ **267**

తపద్భిః షష్టిసాహస్రైశ్చిరకాలం సమాశ్రితాః ।
తాంస్తాదృశాన్విలోక్యాథ తచ్ఛాపభయశంకితః ॥ **268**

ధృత్వా స్వచంచునా శాఖాం బభ్రామ గగనే పునః ।
తతో దృష్ట్వా కశ్యపం స్వతాతం నత్వా వ్యజిజ్ఞపత్ ॥ **269**

వద శుద్ధాం భువం మేఽద్య కుర్వేఽహం యత్ర భోజనమ్ ।
తదా తం కశ్యపః ప్రాహ శతయోజనసాగరే ॥ **270**

లంకానామ్నీ శుద్ధభూమిస్తత్ర త్వం కురు భోజనమ్ ।
తత్పితుర్వచనాల్లంకాం యయౌ తార్క్ష్యః క్షణేన సః ॥ **271**

ప్రోచ్చయోః పక్షయోః శాఖాం స్థాప్య తాన్భక్షయన్ముదా ।
తత్త్యక్తైరస్థిభిస్తత్ర శృంగాణి త్రీణి చాభవన్ ॥ **272**

త్రికూట ఇతి నామ్నా స లంకాయాం గిరిరాడభూత్ ।
తేషు శృంగేషు తాం శాఖాం తార్క్ష్యః సంస్థాప్య సంయయౌ ॥ **273**

**వాలఖిల్యాస్తపోఽంతేతే యయుర్విష్ణోః పరం పదమ్ ।**
**ఆసీచ్ఛాఖాఽన్తరాలే సా లంకాయాం శృంగమూర్ధసు ॥ 274**

**గ్రావభూతాం శైవలేన న విదుస్తాం తు రాక్షసాః ।**
**లంకాఽగ్నినా ద్రవీభూతా మర్దయన్తీ క్షపాచరన్ ॥ 275**

**పపాత రుద్రసేనాసీల్లంకాభూమిర్హిరణ్మయీ ।**
**తాం దృష్ట్వా చకితో వేగాద్వనే సీతాం యయౌ కపిః ॥ 276**

అంత ఆకలిగొన్న గరుడునిచే ప్రార్థింపబడిన శ్రీహరి, “పడియుండు మొసలి ఏనుగుల కళేబరములను భక్షింపుము. పొమ్ము,” అని ఆజ్ఞాపించెను. అంత ఆ సరస్సునకు గరుడుడు వచ్చి, భ్రూభంగుడను గ్రద్ధరాజు కళేబరమును సమీపింపగా వానిని చంపి, ఒక కాలితో పట్టి, మరియొక కాలిచే ఆ రెండు కళేబరములను ధరించి, భక్షించుటకు తగిన ప్రదేశమును వెదకెను. అప్పటికి పాల సముద్రమున జాంబునదా వృక్షమును జూచి, వేయి ఆమడల పొడవు, వెడల్పుగల ఆ జంబూ వృక్షము సరియైనదని భావించి దాని కొమ్మమీద గరుడుడు వ్రాలెను. ఆ చెట్టు క్రొమ్మ క్రింద బొటనవ్రేలు ప్రమాణముగల పదివేలమంది వాలఖిల్యులు తల క్రిందులుగా వ్రేలాడుతూ తపస్సు చేయుచుండిరి. ఆ కొమ్మపై కళేబరములతో గరుడుడు వ్రాలగా ఆ బరువును మోయలేక ఆ చెట్టుకొమ్మ విరిగెను. గరుడుడు విరుగుతున్న కొమ్మను, దానిక్రిందయున్న వాలఖిల్యులను చూచి, శాపమెచ్చట గలుగునో అని భయపడి, తన ముక్కుచే, ఆ రెమ్మను పట్టుకుని, మరలా గగనమునకు ఎగిరెను. అంతనతడు తనతండ్రియగు కశ్యపుని జూచి, “నేను భుజించుటకు తగిన ప్రదేశమును తెలుపుము.” అని ప్రార్థించెను. అందుకు కశ్యపుడు, “సముద్రమున నూరామడలలో లంకయను భూమి గలదు. అచట నీవు భుజింపుము” అని చెప్పెను. గరుడుడట్లే తండ్రిచెప్పినట్లు లంకకు పోయి, ఎత్తిన రెక్కలపై ఆ శాఖలను అణచుకొని వాటిని భక్షించెను. ఆ సమయమున రాలిన ఎముకలు మూడు పర్వతములైనవి. పిదప అది లంకలో త్రికూటమను కొండగా ఏర్పడెను. పర్వతముల మీద ఆ కొమ్మను విడిచి, గరుడుడు వెడలెను. వాలఖిల్యులును తపమును ఆచరించిన వెనుక నారాయణ పరమపదమును పొందిరి. ఆ చెట్టుకొమ్మ క్రిందిభాగమున పర్వతముల కొనలలో పాచివలన రాయిగా పరిణమించి ఉండెను. దానిని రాక్షసులు ఎరుగరు. అది హనుమంతుడు లంకకు పెట్టిన నిప్పుకు కరిగి నేలబడగా, ఆ రసమువలన లంకంతయును సువర్ణమణిమయమగు రుద్రసేన అయినది. (276).

**దృష్ట్వాఽశోకే పునః సీతాం తామాహ కపికుంజరః ।**
**మత్స్కంధసంస్థితా రామమద్య పశ్యసి జానకి ॥ 277**

సా ప్రాహ మోచితామన్యైర్మాం రామో న సహిష్యతి ।
నీత్వా పునర్ముద్రికాం త్వం రాఘవాయ సమర్పయ ॥ 278

ఇత్యుక్త్వా తత్కరే సీతా దదౌ శ్రీరామముద్రికామ్ ।
తతస్తాం మారుతిః పృష్ట్వా నత్వా శీఘ్రం యయౌ పునః ॥ 279

ఆరురోహ సువేలాద్రిం చూర్ణం తమకోద్గిరిమ్ ।
ఏతస్మిన్నంతరే బ్రహ్మా దదౌ పత్రం సవిస్తరమ్ ॥ 280

యద్యత్కృతం మారుతినా లంకాయాం తస్య సూచకమ్ ।
తద్గృహ్య మారుతిర్వేగాన్నత్వా పృష్ట్వా విధిం పునః ॥ 281

తత ఉడ్డీయ వేగేన యయావాకాశవర్త్మనా ।
కుర్వన్ శబ్దం మహాఘోరం కపినామూర్ధ్వతస్తదా ॥ 282

ఉదధ్యశ్యంతరా కించిత్పపాత భువి మారుతిః ।
తతో దృష్ట్వా కపీంస్తత్ర దృష్ట్వైకం మునిసత్తమమ్ ॥ 283

కించిద్గర్వసమావిష్టస్తం మునిం ప్రాహ మారుతిః ।
మయా శ్రీరామకార్యం తు కృతమస్తి మునీశ్వర ॥ 284

పానీయం పాతుమిచ్ఛామి దర్శయస్వ జలాశయమ్ ।
తచ్ఛ్రుత్వా దర్శయామాస మునిస్తస్మై జలాశయమ్ ॥ 285

తతః స మారుతిర్ముద్రాం మణిం పత్రం మునేః పురః ।
సంస్థాప్య నీరం పాతుం వై యయౌ కాసారముత్తమమ్ ॥ 286

## శ్రీరాముడు మునిరూపమున ఆంజనేయుని గర్వమణచుట

దానిని జూచి, ఆశ్చర్యముతో ఆంజనేయుడు వేగముగా సీతవద్దకు వచ్చి, నెమ్మదిగా ఉన్న ఆ సీతమ్మను జూచి, ఆమెతో, “నా మూపుపై గూర్చుందువా? శ్రీరాముని ఇప్పుడే చూచెదవు” అని ప్రార్థించెను. అందుకు ఆమె, “శ్రీరాముడు ఇతరులచే విడిపింపబడిన నన్ను సహించడు. నీవు ఈ ముద్రికను కొనిపోయి, రామునికి సమర్పింపుము,” అని చెప్పి, హనుమంతుని చేతికి శ్రీరామ ముద్ర కలిగిన ఉంగరమును ఇచ్చెను. అట్లే అని సీతకు నమస్కరించి, హనుమ వేగముగా బయలుదేరి,

సువేలాద్రిని ఎక్కి పెద్ద శబ్దమును చేసెను. అంతలో బ్రహ్మదేవుడు వచ్చి, ఆంజనేయుడు అచట జరిపిన కార్యముల వివరము తెలుపునట్లు జాబుఒకటి వ్రాసి ఇచ్చెను. హనుమంతుడు దానిని తీసుకుని బ్రహ్మకు అభివాదనమొనర్చి, అనుజ్ఞ తీసికొని, గంతువేసి గగనమున ఘోరఘోషను చేయుచు, వచ్చి, కపులమీదుగా ఆకాశమునుండి దుమికెను. అచట కపులను, మరియొక మునీశ్వరుని చూచి, కొంచెముగా గర్వించిన హనుమంతుడు ఆ మునిని, "మునీంద్రా! నేను శ్రీరామ కార్యమును నెరవేర్చి, వచ్చియున్నాను. దప్పిక వేయుచున్నది. జలాశయము చూపుము." అని కోరెను. ఆ మునీంద్రుడు చూపుడు వ్రేలితో నీటి మడుగును చూపించెను. అంత ఆంజనేయుడు శ్రీరామ ముద్రికను, సీతా చూడామణిని, బ్రహ్మ వ్రాసి ఇచ్చిన పత్రమును ముని ఎదుట పెట్టి, నీరు ద్రావుటకై మంచినీటి సరస్సుకు వెడలెను. (286)

**తతస్తత్ర కపిః కశ్చిన్ముద్రికాం మునిసన్నిధౌ ।**
**కమండలౌ ప్రాక్షిపత్స యయౌ తావచ్చ మారుతిః ॥ 287**

**గృహీత్వా తం మణిం పత్రం మునిం పప్రచ్ఛ ముద్రికామ్ ।**
**మునిర్భ్రూసంజ్ఞయా తస్మై కమండలుమదర్శయత్ ॥ 288**

**తతః కమండలౌ తూష్ణీం ముద్రికామవలోకయత్ ।**
**తావద్ద దర్శాంజనేయస్తస్మిన్ శ్రీరామముద్రికాః ॥ 289**

**దృష్ట్వా సహస్రశస్తత్ర చకితః ప్రాహ తం మునిమ్ ।**
**కుతస్త్విమా ముద్రికాశ్చ వద కా మమ ముద్రికా ॥ 290**

**ఏతాసు త్వం మునిశ్రేష్ఠ తదా తం మునిరబ్రవీత్ ।**
**యదా యదా వాయుపుత్రః సీతాం తాం రాఘవాజ్ఞయా ॥ 291**

**లంకాం గత్వా సమానీతా శుద్ధిముద్రాస్తదా ముదా ।**
**మదగ్రే స్థాపితాస్తాశ్చ కపిభిశ్చ కమండలౌ ॥ 292**

**నిక్షిప్తాస్తాస్త్విమాః సర్వా పశ్యతాసు స్వముద్రికామ్ ।**
**తన్మునేర్వచనం శ్రుత్వా గతగర్వస్తమబ్రవీత్ ॥ 293**

**కియంతో రాఘవాశ్చాత్ర సమాయాతా మునీశ్వర ।**
**మునిస్తం ప్రాహ నిష్కాస్య గణయస్వాద్య ముద్రికామ్ ॥ 294**

**కమండలోరంజలిభిస్తదాఽథ ముద్రికా ముహుః ।**
**బహిః క్షిపన్మారుతిః స నాన్తం తాసాం దదర్శ సః ॥ 295**

**పునః కమండలౌ కృత్వా మునిం నత్వా కపిః క్షణమ్ ।**
**చింతయామాస మనసి మాదృశైః శతశః పురా ॥ 296**

**సమానీతాస్తి సీతాయాః శుద్ధిః కా గణనాఽద్యమే ।**
**ఇతి నిశ్చిత్య మనసి గతగర్వస్తదా కపిః ॥ 297**

**పునర్దక్షిణమార్గేణ యయౌ యత్రాంగదాదయః ।**
**ప్రాయోపవేశనస్థాతే తం దృష్ట్వా తుష్టమానసాః ॥ 298**

అంత అచటికి ఒక కపివచ్చి, ఆ రామముద్రికను ముని కమండలువులో వేసిపోయెను. ఆంజనేయుడు వచ్చి, మణిని, పత్రమును తీసుకొని ముద్రిక ఏది? అని మునిని అడిగెను. ముని సైగచే కమండలువును చూపించెను. ఆ కమండలువులో తన ముద్రికకై చూడగా వేలకొలది రామ ముద్రికలు కనపడినవి. దానితో మారుతి ఆశ్చర్య చకితుడై, "మునీంద్రా! ఇన్ని ముద్రికలు ఎక్కడివి? వీటిలో నా ముద్రిక యేదో చెప్పు"మని వేడగా, ఆ ముని, "ఎప్పుడెప్పుడు ఆంజనేయులు శ్రీరామాజ్ఞచే లంకకుపోయి, సీతయొక్క శుద్ధముద్రికలను తెచ్చుచుందురో, అప్పుడంతయును నా వద్ద పెట్టబడిన వన్నియును కపులచే ఈ కమండలములో దాచబడినవి. వీటిలో నీ ముద్రిక ఏదో చూడుము. అని పలికెను. దానిని వాయుసుతుడు, "స్వామీ! ఇచట ఎందరు రాములు వచ్చిరి?" అని అడుగగా, మునీంద్రుడు, "కమండలువులోని ముద్రికలను లెక్కించి తెలిసికొను" మని చెప్పగా, మునిచే అనుమతి పొంది కమండలువులో ఎన్ని లెక్కించినను ఇంకా మిగిలే ఉన్నవి. మారుతి తనకు ఒక ముద్రికను తీసుకుని మిగిలిన అన్నింటిని ఆ కమండలువులోనే ఉంచి, మునిపుంగవునికి నమస్కరించి, కొంతసేపు ఆలోచించి, "నావంటివారు ఎంతోమంది ఇదివరకే సీతావృత్తాంత ముద్రికలను గొని తెచ్చియున్నారు. ఇక నేనెంతటివాడను?" అని తెలుసుకుని గర్వము తొలగగా మరలా దక్షిణమార్గముగా పయనించి, ప్రాయోపవేశ వ్రతములోనున్న అంగదాదులు ఉన్నచోటుకు వచ్చెను. వారందరును వాయుపుత్రుని జూచి, ఆనందించిరి (298)

**బభూవుర్వానరాః సర్వే సమాలింగ్యాథ తం ముహుః ।**
**జ్ఞాత్వా తన్ముఖతః సీతా దృష్టాఽశోకవనే త్వితి ॥ 299**

**యయుస్తే రాఘవం శీఘ్రం మార్గే సుగ్రీవపాలితమ్ ।**
**దృష్ట్వా మధువనం సర్వే దృష్ట్వా తం వాలినందనమ్ ॥ 300**

ఫలాని భక్షయామాసుర్దధివక్త్రో న్యషేధయత్ ।
తతస్తే తాడయామాసుర్దధివక్త్రం కపీశ్వరమ్ ॥ 301

జ్ఞాత్వా తం మాతులమపి సుగ్రీవస్యాంగదాదయః ।
స గత్వా సకలం వృత్తం సుగ్రీవాయ న్యవేదయత్ ॥ 302

సోఽపి శ్రుత్వా జనకజా దృష్ట తైరిత్యమన్యత ।
నోచేన్మధువనం రమ్యం కథమశ్నంతి వానరాః ॥ 303

తతో విసర్జయామాస దధివక్త్రం కపీశ్వరః ।
మా నిషేధస్త్వయా కార్యస్త్వం శీఘ్రం ప్రేషయస్వ తాన్ ॥ 304

మమాంతికం తతో గత్వా దధివక్త్రస్తథాఽకరోత్ ।
తతః సుగ్రీవవచనం శ్రుత్వా తేన సమీరితమ్ ॥ 305

యయుస్తే వానరాః సర్వే రామం నత్వా పురఃస్థితాః ।
తతో హర్షాన్మారుతిః స బ్రహ్మపత్రం న్యవేదయత్ ॥ 306

దత్వా చూడామణిం రామం కాకవృత్తం న్యవేదయత్ ।
తచ్ఛ్రుత్వా సకలం వృత్తం జ్ఞాత్వా మారుతినా కృతమ్ ॥ 307

లంకాయాం వాయుపుత్రేణ రామస్తుష్టో బభూవ సః ।
సమాలింగ్య హనూమంతం రాఘవోవాక్యమబ్రవీత్ ॥ 308

తవోపకారిణశ్చాహం న పశ్యామ్యద్య మారుతే ।
కర్తుం ప్రత్యుపకారం తే ధన్యోఽసి జగతీతలే ॥ 309

పరీరంభో హి మే లోకే దుర్లభః పరమాత్మనః ।
అతస్త్వం మమ భక్తోఽసి ప్రియోఽసి హరిపుంగవ ॥ 310

యత్పాదపద్మయుగళం తులసీదళాద్యైః
సంపూజ్య విష్ణు పదవీమతులాం ప్రయాన్తి ।
తేనైవ కిం పునరసౌ పరిరబ్ధమూర్తీ
రామేణ వాయుతనయః కృతపుణ్యపుంజః ॥ 311

రామం స మారుతిః ప్రాహ భీతభీతోఽతికంపితః ।
మయాఽపరాధితమితి ముద్రావృత్తం మునేర్వచః ॥ 312

తచ్ఛ్రుత్వా రామచంద్రోఽపి విహస్యోవాచ మారుతిమ్ ।
మయైవ దర్శితం మార్గే కౌతుకం మునిరూపిణా ॥ 313

త్వద్గర్వపరిహారార్థం ముద్రికాం మత్కరే త్విమామ్ ।
కనిష్ఠికాయాం త్వం పశ్య సమానీతా త్వయాద్య వై ॥ 314

తాం రామముద్రికాం దృష్ట్వా శ్రీరామస్య కరాంగుళౌ ।
ననామ గతవర్గః స రామం విష్ణుమమన్యత ॥ 315

మయ్యస్యైవ కృపయా పౌరుషం చేత్యమన్యత ।
ఏవం గిరీంద్రజే ప్రోక్తం చరిత్రం సుందరాభిదమ్ ॥ 316

రామార్థం వాయుపుత్రేణ కృతం సర్వార్థదాయకమ్ ॥ 317

ఇతి శ్రీశతకోటిరామచరితాంతర్గతే శ్రీమదానందరామాయణే, వాల్మీకీయే,
ఆదికావ్యే, సారకాండే, సుందరకాండే, సుందరచరిత్రే,
సీతాశుద్ధిర్నామ నవమః సర్గః ॥

## శ్రీరాముడు సీతావృత్తాంతమును విని హనుమంతుని సన్మానించుట

వానరులు ఒకరినొకరు తమ హృదయములకు హత్తుకొనిరి. ఆంజనేయుని నోటి నుండి సీతా వృత్తాంతమును విని సంతసించిరి. త్వరగా శ్రీరాముని సన్నిధికి బయలుదేరిరి. దారిలో సుగ్రీవునియొక్క మధువన మనబడు ఉద్యానవనమును జూచి, అంగదుని అనుమతితో, ఆ వనములోని ఫలములను భక్షించిరి. దధిముఖుడను ఉద్యానవన రక్షకుడు నిలువరించినప్పటికిని, అతడు సుగ్రీవుని మేనమామయని తెలిసియు అతనిని లెక్కచేయక మధువనములో ప్రవేశించిరి. ఎదురించిన దధిముఖుని కొట్టిరి. దధిముఖుడు పోయి సుగ్రీవునితో మొరపెట్టెను. సుగ్రీవుడు "ఆ కపులు సీతను కనుగొని యుండవచ్చును, లేనియెడల రమ్యమగు మధువనమును ఎట్లు కొల్లగొట్టుదురు? అని ఎంచి, దధిముఖునితో, "నీవు వారిని నిషేధించవలదు, వారిని త్వరగా నావద్దకు పంపుము," అని చెప్పి పంపెను. దధిముఖుడు అట్లేచేసెను. అంత సుగ్రీవుని మాటలు విని వానరులందరును వాయుపుత్రుని

తోడ వచ్చి, శ్రీరామునికి నమస్కరించి ఎదుట నిలిచిరి. ఆంజనేయుడు ఆనందించుచు, శ్రీరామునికి బ్రహ్మపత్రమును, చూడామణిని సమర్పించెను. కాకాసురుని వార్తను తెలిపెను. అంతయును విని, బ్రహ్మపత్రముచే లంకలోని, వానరచేష్టనంతను తెలిసికొని, శ్రీరాముడు పులకించి, ఆంజనేయుని తన హృదయానికి గాఢంగా హత్తుకుని "వాయునందనా! ఇంతగా ఉపకరించిన నీకు నేను ఏమి ఇచ్చి ప్రత్యుపకారము చేయుదును. పరమాత్మయొక్క నా ఆలింగనము అత్యంతదుర్లభము. అదినీకు అబ్బినది. నీవు నాకు ప్రియభక్తుడవు, ప్రియుడవు," అని సమ్మానించెను.

"పార్వతీ! ఎవ్వని పాదపద్మములను తులస్యాదులచే పూజించి పరమపదమగు, బ్రహ్మలోకమును పొందుచుందురో, అతని చేతనే హత్తుకొనబడిన ఆంజనేయునిది ఏమి భాగ్యము!? పుణ్యము ఫలించిననే అట్లు జరుగుచుండు. అంత హనుమ మిక్కిలి వెరచుచు, గడగడ వణకుచు, నేను అపరాధమును ఆచరించితిని. అని ముద్రికా వృత్తాంతమును, ముని వచనములను విన్నవించెను. అందుకు రామచంద్రుడు నవ్వుచు, " నీ గర్వమును తొలగించుటకు నేను ఆ మునిరూపమును ధరించి అక్కడ నీకు ప్రత్యక్షమైతిని అని, ఇదిగో నీవు తెచ్చిన ముద్రిక నా చిటికెన వ్రేలికి ఉన్నది చూడుము," అని అనుగ్రహించెను. అంత ఆంజనేయుడు శ్రీరాముని చేతివ్రేలికి ఉన్న ఆ ముద్ర ఉంగరమును జూచి, గర్వము తొలగి, శ్రీరాముని విష్ణు స్వరూపమని తెలుసుకొని, నా యందు ఇతని కృపచేతనే బలసంపద కలిగినదని తెలుసుకొని నమస్కరించెను. పార్వతీ! ఇట్లు సుందరమైన సమస్త ఇష్టములు నిచ్చునట్టి శ్రీరామునికై ఆంజనేయ కృతమగు చరిత్ర నీకు చెప్పబడినది.

***శతకోటిప్రవిస్తరమైన రామకథలో, శ్రీమద్వాల్మీకిమహర్షిచే రచింపబడిన, ఆనందరామాయణంలోని, సారకాండలో, సీతా శుద్ధి అనబడే తొమ్మిదవ సర్గ ముగిసినది.***



# దశమః సర్గః-10వ సర్గ

రామేశ్వరలింగ స్థాపన, రామ-రావణ యుద్ధము.

**శ్రీశివ ఉవాచ**

**అథాహ మారుతిం రామో మాం వదస్వ సవిస్తరమ్ ।**
**లంకాస్వరూపం జ్ఞాత్వా చ ప్రతీకారం కరోమ్యహమ్ ॥ 1**

**తద్రామవచనం శ్రుత్వా కథయామాస మారుతిః ।**
**లంకా దివ్యపురీ దేవ త్రికూటశిఖరే స్థితా ॥ 2**

**స్వర్ణప్రాకారసహితా స్వర్ణాట్టాలకసంయుతా ।**
**పరిఖాభిః పరివృతా పూర్ణాభిర్నిర్మలోదకైః ॥ 3**

**నానోపవనశోభాఢ్యా దివ్యవాపీభిరావృతా ।**
**గృహైర్విచిత్రశోభాఢ్యైర్మణిస్తంభమయైః శుభైః ॥ 4**

**పశ్చిమద్వారమాసాద్య రాజవాహాః సహస్రశః ।**
**ఉత్తరద్వారి తిష్ఠన్తి వాజివాహాః సపత్తయః ॥ 5**

**దశకోటిమితా సేనా వివిధాయుధమండితా ।**
**లంకాయాః పరితో వ్యాప్తా సతర్కా రక్షతే పురీమ్ ॥ 6**

**తిష్ఠంత్యర్బుదసంఖ్యాతా గజాశ్వరథపత్తయః ।**
**రక్షయతి సదా లంకా నానాస్త్రకుశలాః ప్రభో ॥ 7**

**సంక్రమైర్వివిధైర్లంకా శతఘ్నీభిశ్చ సంయుతా ।**
**ఏవం స్థితాయాం దేవేశ శృణు త్వద్దాసచేష్టితమ్ ॥ 8**

## ఆంజనేయుడు లంకను అభివర్ణించి చెప్పుట.

తరువాత శ్రీరాముడు హనుమంతునితో, “లంకానగర స్వరూపమును వివరింపుము, తగినట్లు ఆలోచించి నిర్ణయించెదను,” అని చెప్పగా, అందుకు పవనసుతుడు ఇట్లు చెప్పుచున్నాడు. ప్రభూ! లంక అనునది దేవనగరము వంటిది. అది త్రికూటశిఖరమున ఉన్నది. సువర్ణగోపురాలతో కూడి

యున్నది. స్వచ్ఛమైన నీటితో నిండిన కందకములు దాని చుట్టూ యున్నవి. రకరకాల ఉపవనములతో నిండి విరాజిల్లుచున్నది. మంచి బావులు గలవు. మంగళ మణి స్తంభములచే నిర్మింపబడిన గృహములతో ఉన్నది. పడమటి సింహద్వారము గల గజవాహకులు వేలాదిమంది గలరు. ఉత్తర ద్వారమును అనుసరించి లక్షలాది గుఱ్ఱపుఱౌతులు, పదాతులు ఉన్నారు. తూర్పువైపున అట్లే యుందురు. దక్షిణద్వారమున రథికులగు రాక్షసవీరులున్నారు. మధ్యకక్ష్యలో లెక్కకు మిక్కిలి చతురంగసైనికులు నిండియుందురు. అందరును శస్త్రాస్త్రములచే నేర్పరులై ఎల్లప్పుడును లంకను రక్షించుకొనియుందురు. నానాదుర్గమార్గములును శతఘ్నులును గలవు. ఇట్టి లంకలో నీ దాసుని చేష్ట వినుము. రావణుని బలములో నాల్గవవంతును నాశనము చేసితిని. లంకను కాల్చితిని. సువర్ణప్రాకారమును పాడుచేసితిని. శతఘ్నులను, దుర్గమార్గములను పడగొట్టితిని. స్వామీ! నీ దర్శనముచే మరల లంక భస్మమైపోవును. త్రికూటశిఖరమున రమ్యమైన నాచేకాల్చబడిన లంకకు...

దశాననబలౌఘస్య చతుర్థాంశో మయా హతః ।
దగ్ధా లంకాపురీ స్వర్ణప్రాకారా ధర్షితా మయా ॥ 9

శతఘ్న్యః సంక్రమాశ్చైవ నాశితా మే రఘూద్వహ ।
దేవ త్వద్దర్శనాదేన లంకా భస్మీభవేత్పునః ॥ 10

సువేలాద్రిశ్చోత్తరేఽస్తి పరలంకాఽస్తి పశ్చిమే ।
నికుంభిలా దక్షిణేఽస్తి తత్రాస్తే యోగినీవటః ॥ 11

పూర్వే చ లఘులంకాఽస్తి సా మధ్యే కాంతిమండితా ।
త్రికూటేశిఖరే రమ్యే మత్పుచ్ఛానలధర్షితా ॥ 12

ప్రస్థానం కురు దేవేశ గచ్ఛామో లవణార్ణవమ్ ।
తన్మారుతేర్వచః శ్రుత్వా సుగ్రీవం ప్రాహ రాఘవః ॥ 13

సుగ్రీవ సైనికాన్ సర్వాన్ ప్రస్థానాయాభినోదయ ।
ఇదానీమేవ విజయో ముహూర్తస్త్వద్య వర్తతే ॥ 14

అశ్వినీ శుక్లదశమీ శ్రవణర్క్షసమన్వితా ।
శుభాఽద్య వానరశ్రేష్ఠ గచ్ఛామో లవణార్ణవమ్ ॥ 15

రక్షంతు యూథపాః సేనామగ్రే పృష్ఠే చ పార్శ్వయోః ।
నలో భవత్వగ్రసరః పృష్ఠే నీలోఽథ రక్షతు ॥ 16

సుషేణః సవ్యపార్శ్వే మే జాంబవానితరే మమ ।
గజో గవాక్షో గవయో మైందశ్చేతేఽద్య వానరాః ॥ 17

వహ్నినైరితవాయ్వీశ చతుర్దిక్షు సమంతతః ।
రక్షంతు వానరం సేనాం ద్వివిదాద్యాస్తథాఽపరే ॥ 18

సర్వే గచ్ఛంతు సర్వత్ర సేనాయాః శత్రుఘాతినః ।
ఆరుహ్య మారుతిం చాహం గచ్ఛామ్యగ్రేఽంగదం తతః ॥ 19

ఆరుహ్య లక్ష్మణో యాతు సుగ్రీవ త్వం మయా సహ ।
ఆగచ్ఛస్వేతి చాజ్ఞాప్య హరీన్ రామః సలక్ష్మణః ॥ 20

ప్రతస్థే దక్షిణాశాయాం సేనామధ్యగతో విభుః ।
తదా తే కపయశ్చక్రుర్భుభుః కారాన్ భయానకాన్ ॥ 21

ఉత్తరమున సువేలాద్రియును పశ్చిమమున పరలంకయును, దక్షిణమున నికుంభిలయును, అచ్చటనే యోగినీ వటవృక్షమును పూర్వమున లఘులంకయును గలదు. మహాప్రభూ! బయలుదేరండి, పోదము.” అనిన మారుతి మాటలను ఆమోదించి శ్రీరాముడు సుగ్రీవునితో....

## వానరసైన్యమును లంకకు పంపుట

“కపిరాజా! ఈరోజే, యిప్పుడే విజయముహూర్తముగా ఉన్నది. సైనికులందరిని ప్రయాణమునకు సిద్ధులగునట్లు ఆజ్ఞాపింపుము. అశ్విని, శుక్ల, శ్రవణ, దశమిగాన నేడు బాగుగనున్నది. లవణసాగరమునకు పోదము. కపీశ్వరులు ముందు వెనుక ప్రక్కలలో సేనలను రక్షించుగాక. నలుడు ముందువరుసలో ఉండనీ, నీలుడు వెనుక రక్షకుడుగా ఉండనీ. సుషేణుడును, జాంబవంతుడును నాకు ఇరువైపులలో ఉండనీ. గజుడు, గవాక్షుడు, గవయుడు, మైందుడు వీరు నలుగురును ఆగ్నేయము మొదలగు విదిక్కులలో రక్షకులై ఉండనీ. ఇట్లు వానరసేనలను రక్షించికొని, ద్వివిదాదులు ఇతరులందరును బయలుదేరని. నేను మొదట ఆంజనేయుని ఎక్కి వచ్చుచున్నాను. వెనుక అంగదునిమీద లక్ష్మణుడు వచ్చునుగాక. సుగ్రీవుడా! నీవు నాతో రమ్ము.” అని ఇట్లు కపులను ఆజ్ఞాపించి, శ్రీరాముడు లక్ష్మణునితో సేనామధ్య విరాజితుడై దక్షిణమునకు బయలుదేరెను. అపుడు కపులు భయంకరములయిన గర్జనలను చేసిరి. భేరీ మృదంగ పటాహాదివాద్యములు మ్రోగినవి. ఏనుగులవంటి కామరూపులైన కపులు

వాదయామాసుర్వాద్యాని పణవానకగోముఖైః ।
వారణేంద్రనిభాః సర్వే వానరాః కామరూపిణః ॥ 22

గతాస్తదా దివారాత్రం క్వచిత్తస్థుర్న తే క్షణమ్ ।
అభవచ్ఛంకునా లంకాం గచ్ఛతో రాఘవస్య హి ॥ 23

తే సహ్యం సమతిక్రమ్య మలయం చ తథా గిరిమ్ ।
ఆయయుశ్చానుపూర్వేణ తే సర్వే దక్షిణార్ణవమ్ ॥ 24

కృత స్సేనానివాసశ్చ రాఘవేణాబ్ధిసైకతే ।
చక్రుర్మంత్రం సాగరస్య తరణార్థం ప్లవంగమాః ॥ 25

లంకాయాం వాయుపుత్రేణ కృతం దృష్ట్వా స రావణః ।
ప్రహస్తాదీంస్తదా ప్రాహ కథమగ్రే భవిష్యతి ॥ 26

ఏకేన కపినాఽస్మాకం పురతో జ్వాలితా పురీ ।
దృష్ట్వా సీతా వనం భగ్నం రాక్షసా నిహతా రణే ॥ 27

మమాతిలాలితః పుత్రః కనీయాన్నిహతో రణే ।
తదా తే మంత్రిణః సర్వే దదుర్ధైర్యం దశాననమ్ ॥ 28

రాజన్నుపేక్షితోఽస్మాభిర్మర్కటోఽయమితి స్ఫుటమ్ ।
వయం తవాజ్ఞయా కుర్మో జగత్ కృత్స్నమవానరమ్ ॥ 29

కుంభకర్ణస్తదా ప్రాహ రావణం రాక్షసేశ్వరమ్ ।
త్వయా యోగ్యం కృతం నైతద్యద్గత్వా జానకీ హృతా ॥ 30

యద్యప్యనుచితం కర్మ త్వయా కృతమజానతా ।
సర్వం సమం కరిష్యామి స్వస్థచిత్తో భవ ప్రభో ॥ 31

దేహి దేవ మమానుజ్ఞాం హత్వా రామం సలక్ష్మణమ్ ।
సుగ్రీవం వానరాంశ్చైవాగమిష్యామి పునః క్షణాత్ ॥ 32

కుంభకర్ణవచః శ్రుత్వా తదా ప్రాహ విభీషణః ।
మహాభాగవతః శ్రీమాన్ రామభక్త్యైకతత్పరః ॥ 33

నిలోక్య కుంభశ్రవణాదిదైత్యాన్
మత్తప్రమత్తానతివిస్మయేన ।
విలోక్య కామాతురమప్రమత్తో
దశాననం ప్రాహ విశుద్ధబుద్ధిః ॥ **34**

న కుంభకర్ణేంద్రజితౌ చ రాజం
స్తథా మహాపార్శ్వమహోదరౌ తౌ ।
నికుంభకుంభౌ చ తథాఽతికాయః
స్థాతుం న శక్తా యుధి రాఘవాగ్రే ॥ **35**

సీతాం చ సత్కృత్య మహాధనేన
దత్వాఽభిరామాయ సుఖీ భవ త్వమ్ ।
నోచేన్న రామేణ విమోక్ష్యసే త్వం
గుప్తః సురేంద్రైరపి శంకరేణ ॥ **36**

క్షణకాలమైనను నిలువక ప్రయాణముచేయుచుండిరి. శుభశకునములు ఎదురైనవి. ఇట్లు సహ్యా, మలయాది పర్వతాలను దాటి క్రమంగా లవణసాగరమును చేరి, రాఘవాజ్ఞచే సముద్రపు ఒడ్డున ఇసుక దిబ్బలమీద సేనలను ఉంచిరి. సముద్రమును దాటుటకు ఆలోచించుచుండిరి.

## సుగ్రీవునితో చేసిన ఒప్పందము చెడగా రావణుడు విలపించుట.

అచ్చట లంకలో ఆంజనేయుడు చేసినపని జూచి, ఆ రావణుడు ప్రహస్తాదులతో, "ఇకమీద ఎట్లగునో! మనఎదుటనే కపి యొకడువచ్చి లంకనుకాల్చెనే? సీతను కనుగొనెను, వనభంగమొనరించె, రణమున రాక్షసులను అణచెను, నా చిన్న కుమారుడగు ముద్దులపట్టిని చంపెను," అని మందలించెను. అప్పుడు మంత్రులందరును రావణునికి, "ప్రభూ! వీడొక కోతియని మేమందరము ఉపేక్షించి యుంటిమి. నీవు ఆజ్ఞాపించినట్లయిన ఈ లోకమును మర్కటహీనముగా ఒనర్చెదము," అని ధైర్యమునిచ్చిరి. అపుడు కుంభకర్ణుడు, "అన్నా! నీవు తగినపని జేయకపోతివి. సీతాపహరణము తగదు. అయిననేమో తెలియక జేసితివి. పోనిమ్ము. అంతటిని చక్కబరచెదను. నీవు నెమ్మదిగ ఉండుము. నాకు అనుజ్ఞనిమ్ము. శ్రీరామలక్ష్మణులను, సుగ్రీవుని, వాని వానరసైన్యమును కూడా క్షణములో చంపివచ్చెదను," అని చెప్పగా దానిని విని, నిర్మలాంతరంగుడును, పరమభాగవతోత్తముడును, శ్రీరామ భక్తాగ్రగణ్యుడును అగు విభీషణుడు ఆశ్చర్యమునొంది, మదోన్మత్తులైన కుంభకర్ణాదులను చూచి, కామాతురుడైన రావణునిజూచి,

ఏవం శుభం రావణః స విభీషణవచో హితమ్ ।
ఆత్మనః ప్రతిజగ్రాహ నైవాసౌ సౌఖ్యకారకమ్ ॥ 37

కాలేన నోదితో దైత్యో విభీషణమథాబ్రవీత్ ।
బంధురూపేణ శత్రుస్త్వం జాతో నాస్త్యత్ర సంశయః ॥ 38

యోఽన్యస్త్వేవంవిధం బ్రూయాద్వాక్యం హన్మి తదైవ తమ్ ।
ఉత్తిష్ఠ గచ్ఛ దుర్బుద్ధే ధిక్త్వాం రక్షఃకులాధమ ॥ 39

రావణేనైవముక్తః స పరుషేణవిభీషణః ।
చతుర్భిర్మంత్రిభిర్యుక్తో యయౌ శ్రీరాఘవాంతికమ్ ॥ 40

రాఘవశ్చాపి తం జ్ఞాత్వా తేన సఖ్యం చకార సః ।
హనూమతోదధేస్తీరే లంకాం చ సికతోద్భవామ్ ॥ 41

కారయిత్వా రఘుశ్రేష్ఠస్తత్ర మిత్రం విభీషణమ్ ।
లంకాయాశ్చైవ రాజ్యార్థం వానరైరభ్యషేచయత్ ॥ 42

తదా విభీషణం ప్రాహ రామచంద్రో విహస్య చ ।
న్యాసభూతా త్వియం లంకా తావత్కాలం తదాస్తి మే ॥ 43

యావతా రావణం హత్వా తవ దాస్యామ్యహం శుభామ్ ।
హనూమతాంస్త్వియం నామ్నా లంకా ఖ్యాతి గమిష్యతి ॥ 44

హనుమల్లంకాఽబ్ధేస్తీరే వర్తతేఽద్యాపి పార్వతి ।
విభీషణాద్రావణాన్తే రామస్తాం మోచయిష్యతి ॥ 45

ఏతస్మిన్నంతరే తత్ర గగనస్థః శుకోఽబ్రవీత్ ।
ప్రేషితో రావణేనైవ సుగ్రీవం ప్రాహ వేగతః ॥ 46

త్వామాహ రావణో రాజా తవ నాస్త్యర్థవిప్లవః ।
అహం యద్యహరం భార్యాం రాజపుత్రస్య కిం తవ ॥ 47

కిష్కింధాం యాహి హరిభిస్త్వం వైరం కురు మా మయా ।
తం ధృత్వా వానరాః శీఘ్రం బబంధుర్లోహబంధనైః ॥ 48

**శార్దూలశ్చాపి సేనాం తాం దృష్ట్వాఽధిమపభాషత ।**
**తచ్ఛ్రుత్వా రావణశ్చాపి దీర్ఘంచితాపరోఽభవత్ ॥ 49**

**రామః సమంత్రయామాస తదైకాంతే స్థితః క్షణామ్ ।**
**విభీషణేన సుగ్రీవమారుతిభ్యాం సమన్వితః ॥ 50**

"ఓ రాక్షసచక్రవర్తీ! రణమున రామునియెదుట కుంభకర్ణుడు, మేఘనాదుడు, నికుంభుడు, అతికాయుడు, మహోదరుడు వీరెవ్వరును నిలువజాలరు. సీతాదేవిని సత్కరించి, రామునికర్పించి, నీవు సుఖముగా ఉండుము. లేనియెడల కాలరుద్రుడు నిన్ను కాపాడినను రాముడు నిన్నువిడువడు," అని విభీషణుడు చెప్పగా, హిత, మితోచిత మంగళమహితమగు ఆ మాటను రావణుడు ఆదరింపక దుర్దైవముచే విడువబడి, "శత్రువగు నీవు తమ్ముడుగా పుట్టితివి. మరియొకడీమాట నాతోచెప్పియున్న ఇపుడే వానిని చంపియుందును. లెమ్ము; దుర్బుద్ధిగల రాక్షస కులాధముడా, ఛీ, పొమ్ము," అని ధిక్కరించెను. క్రూర రావణునిచే నిట్లు తిరస్కృతుడైన విభీషణుడు నలుగురు మంత్రులతోడ రామసన్నిధానమునకు వచ్చెను. (40)

రావణునిచే దూతగా పంపబడిన 'శుకుడు' అనువాడు వచ్చి ఆకాశమున నిలిచి, సుగ్రీవునితో, "రాజపుత్రుని భార్యను నేను అపహరించినందున నీకేమి? ఇందులో యే అనర్థము లేదే? వానరులతో నీవు కిష్కింధకు తిరిగి పొమ్ము. నా తోడ నీకు శత్రుత్వము వద్దు అని రావణరాజు నీకు చెప్పమన్నాడు," అని పలుకగా; వెంటనే వానరులు ఆ శుకుని బంధించి, బాగా నలగగొట్టిరి. శార్దూలుడు ఆ సంగతిని రావణునికి తెలిపెను. దానితో రావణుడు చింతాక్రాంతుడై దుఃఖించుచుండెను. శ్రీరాముడు– విభీషణ, సుగ్రీవ, ఆంజనేయునితో కొంతసేపు ఏకాంతమున కూర్చుని ఆలోచించెను. (50)

**తీర్త్వార్థం జలధేర్గుల్మం సంస్థితో బంధునా యుతః ।**
**సర్వేషాం వచనం శ్రోతుం రాఘవేణాథ సాగరః ॥ 51**

**మేఘవద్గర్జనాం కుర్వన్ వామహస్తేన ధిక్కృతః ।**
**అద్యాపి సాగరస్తత్ర తూష్ణీమేవ స విద్యతే ॥ 52**

**తతః సంమంత్ర్య రామస్తు తదా సాగరరోధసి ।**
**ప్రాయోపవేశనం చక్రే దర్భానాస్తీర్య వేగతః ॥ 53**

**దినద్వయమతిక్రమ్య తృతీయదివసే తదా ।**
**ఉత్థాయ దర్భశయనాత్పునర్లక్ష్మణమబ్రవీత్ ॥ 54**

పశ్య లక్ష్మణ దుష్టోఽసౌ వారిధిర్మాముపాగతమ్ ।
నాభినందతి దుష్టాత్మా దర్శనార్థం మమానఘ ॥ 55

జానాతి మానుషోఽయం మాం కిం కరిష్యతి వానరైః ।
అద్య పశ్య మహాబాహో శోషయిష్యామి వారిధిమ్ ॥ 56

పద్భ్యామేవాద్య గచ్ఛన్తు వానరా విగతజ్వరాః ।
ఇత్యుక్త్వా చాపమాకృష్య సందధే బాణముత్తమమ్ ॥ 57

తదా చచాల వసుధా దిశశ్చ తమసావృతాః ।
చుక్షుభే సాగరో వేలాం భయాద్యోజనమత్యగాత్ ॥ 58

తిమినక్రఝషా మీనాః ప్రతప్తాః పరితత్రసుః ।
ఏతస్మిన్నంతరే సాక్షాత్సాగరో దివ్యరూపధృక్ ॥ 59

శనైరుపానం రామం చ సమర్ప్య ప్రణనామ సః ।
అథ తుష్టావ దీనాత్మా ప్రార్థయామాస రాఘవమ్ ॥ 60

అభయం దేహి మే రామ లంకామార్గం దదామి తే ।
ఇతి తద్వచనం శ్రుత్వా రాఘవః ప్రాహ సాగరమ్ ॥ 61

అమోఘోఽయం మహాబాణః కస్మిన్దేశే నిపాత్యతామ్ ।
లక్ష్యం దర్శయ మే శీఘ్రం బాణస్యాస్య పయోనిధే ॥ 62

సాగర ఉవాచ
రామోత్తరప్రదేశేఽస్తి ద్రుమకల్ప ఇతి శ్రుతః ।
ప్రదేశస్తత్ర బహవః పాపాత్మానో దివానిశమ్ ॥ 63

బాధంతే మాం రఘుశ్రేష్ఠ తత్ర తే పాత్యతాం శరః ।
రామేణ ముక్తో బాణోఽసౌ క్షణాదాభీరమండలమ్ ॥ 64

## విభీషణునికి పట్టాభిషేకము

రఘునందనుడును కరుణించి, విభీషణుని జూచి, వానితో సఖ్యమొనరించెను మరియు రాముడు ఆంజనేయునిచే సముద్రతీరమున ఇసుకచే ఒక లంకను చేయించి, యచ్చట మిత్రుడగు విభీషణుని

గూర్చుండ బెట్టి, లంకారాజ్యపట్టాభిషేకమును వానరులతో చేసెను. అప్పుడు నవ్వుచు, రామచంద్రుడు విభీషణునితో, "నేను రావణుని సంహరించువరకు నీకు దీనిని లంకగా ఇచ్చియున్నాను. ఆంజనేయుని చే చేయబడినది ఈ లంక ప్రసిద్ధమగుగాక," అని అనుగ్రహించెను.

పార్వతీ! సముద్రతీరమున నిప్పటికిని హనుమల్లంక గలదు. రావణాంతమున విభీషణుని నుండి దానిని విడిపించును. ఆ నడుమ నచ్చట..

## సముద్రుడు శ్రీరామునిచే అనుగ్రహింపబడుట.

లక్ష్మణుడు, రాముడు అందరిమాటలను వినగోరి, సముద్రుని అల్పప్రవాహమును దాటి కూర్చుండి, మేఘమువలె ఎడమచేతితో ధిక్కరించెను. పార్వతీ! అచ్చట ఇప్పటికిని సముద్రము ఘోషించుటలేదు. అంత ఆ రాముడు ఆలోచించి, దర్భలు పరచుకుని, ప్రాయోపవేశనము ఒనరించెను. రెండు దినములు గడవగా, మూడవనాడు దర్భశయ్యనుండి లేచి, లక్ష్మణునితో, "చూడుము లక్ష్మణా! దుష్టుడైన ఈ సముద్రుడు నేను వచ్చినను నా దర్శనమునకు రాలేదు. ఈ సముద్రుడు నన్నేమి చేయగలడు, చూడుము ఇప్పుడే ఈ సముద్రపు నీటిని శోషించివేయుదును. కపులు అనుమానము లేక కాళ్ళతోనే నడిచిపోవుదురు," అని ఆగ్రహించి, ధనుస్సుఎత్తి, బాణానుసంధానము జేసెను. అపుడు భూమి కంపించెను. దిక్కులు చీకట్లుగ్రమ్మెను. సాగరము అల్లకల్లోలమై మేరమీరి ఆమడ పారెను.

**హత్వా పునః సమాగత్య తూణీరే పూర్వవత్ స్థితః ।**
**తతోఽబ్రవీద్రఘుశ్రేష్ఠం సాగరో వినయాన్వితః ॥ 65**

**మయి సేతుం కారయస్వ నలేనోపలనిర్మితమ్ ।**
**విశ్వకర్మమతశ్చాయం వరో లబ్ధోఽస్త్యనేన హి ॥ 66**

**ద్విజస్య జాహ్నవీతోయే శాలిగ్రామస్త్వనేన హి ।**
**త్యక్తస్తదా తేన శప్తః పాషాణాది తరిష్యతి ॥ 67**

**త్వద్ధస్తాదితి శాపోఽయం వర ఏవాత్ర స స్మృతః ।**
**ఇత్యుక్త్వా రాఘవం నత్వా యయౌ సింధురదృశ్యతామ్ ॥ 68**

**నలమాజ్ఞాపయామాస సేత్వర్థం రఘునందనః ।**
**సేతుమారభమాణస్తు విఘ్నేశం స్థాప్య రాఘవః ॥ 69**

నవగ్రహాణాం పూజార్థం పాషాణాన్నవ సాదరమ్ ।
నలహస్తేన సంస్థాప్య పూర్వం తత్ర మహోదధౌ ॥ 70

తతః సాగరసంయోగే స్వనామ్నా లింగముత్తమమ్ ।
స్థాపయామీతి నిశ్చిత్య మారుతిం వాక్యమబ్రవీత్ ॥ 71

కాశీం గత్వా శివాల్లింగం మాననీయమనుత్తమమ్ ।
ముహూర్తమధ్యే నోచేన్మే ముహూర్తాతిక్రమో భవేత్ ॥ 72

తద్రామవచనం శ్రుత్వా తథేత్యుక్త్వా స మారుతిః ।
యయావాకాశమార్గేణ క్షణాద్వారాణసీం మమ ॥ 73

తత్రాగత్యాథ మాం నత్వా రామకార్యం న్యవేదయత్ ।
తచ్ఛ్రుత్వాఽథ మయా దేవి రాఘవాయ హనూమతే ॥ 74

ద్వే లింగే హ్యర్పితే శ్రేష్ఠే తతోఽహం కపిమబ్రువమ్ ।
మయాఽపి దక్షిణే గంతుం పూర్వమేవ వినిశ్చితమ్ ॥ 75

అగస్తినా విశేషేణ యాస్యామి రాఘవాజ్ఞయా ।
ఏవం మద్వచనం శ్రుత్వా మారుతిః ప్రాహ మాం పునః ॥ 76

కదా వినిశ్చితం పూర్వం త్వయాఽత్ర కుంభజన్మనా ।
తత్సర్వం మాం వదస్వాద్య కృపాం కృత్వా మమోపరి ॥ 77

మహామత్స్యాది జలజంతువులు తపించి కంపింపసాగెను. ఆ వేళకు సాగరరాజు దివ్యరూపము దాల్చివచ్చి, శ్రీరామునికి రత్నములను కానుకగా ఇచ్చి నమస్కరించెను. మరియు దీనుడై స్తుతించెను. "రామచంద్రా! కరుణింపుము. అభయమిమ్ము, లంకకు దారినిచ్చెద," నని సంప్రార్థించెను. అందుకు శ్రీరాముడు, "సాగరుడా! నా బాణము వ్యర్థముకానిది. ఎక్కుపెట్టిన దీనిని ఎచ్చట వదులుదును? గురిజూపుము," అని అనుగ్రహించగా, సాగరుడు, "రామా! ఉత్తరప్రదేశమున ద్రుమకల్పమను చోటుగలదు. అచ్చట అనేకులు పాపాత్ములు గలరు. వారు నన్ను రాత్రింబవళ్ళు బాధించుచున్నారు. అచ్చట నీ బాణమును ప్రయోగింపుము," అని వేడెను. అంత ఆ రామబాణము పోయి ఆ ప్రదేశములో సాగరంలో దాగియున్న రాక్షసులను నిర్మూలించి, మరల శ్రీరాముని అమ్ములపొదిని చేరెను. పిదప సాగరుడు వినీతుడై, "రఘునాథా! ఈ నలుడను వానరుడు విశ్వకర్మ యొక్క కుమారుడు, వీడు

ఒకప్పుడు గంగలో బ్రాహ్మణుని శాలిగ్రామమును పడవేసెను. కోపించిన ఆ బ్రాహ్మణుడు నలుని, "నీవు నీటవేసిన రాళ్ళు తేలుచుండు," అని శపించెను. అది ఇప్పుడు వరముగా ఏర్పడినది. గనుక నాయందు నలునిచే సేతువును రాళ్ళతో కట్టింపుము," అని విన్నవించి, సాగరుడు అంతర్ధానము నొందెను. (68) పిదప శ్రీరాముడు సేతునిర్మాణమునకై నలునికి ఆజ్ఞనిచ్చెను.

## శివలింగములు తెచ్చుటకై హనుమంతుడు కాశికి వెళ్ళుట.

వారధిప్రారంభమునకు విఘ్నేశ్వరుని ప్రతిష్ఠించి, నవగ్రహముల పూజకొరకు నవపాషాణములను నలునిచేత సాగరములో సంస్థాపించి, అంత సాగరసంగమప్రదేశమున తనపేరుతో ఒక మంచి శివలింగమును ప్రతిష్ఠించుటకు నిశ్చయించిన శ్రీరాముడు, ఆంజనేయునితో, "ఒక ముహూర్తములోపల నీవు కాశికిపోయి, శివుని వలన రెండు లింగములను తీసికొని రమ్ము. కాలమతిక్రమించును పొమ్ము," అని చెప్పి పంపెను. అట్లేయని వాయుపుత్రుడు క్షణమాత్రమున వారణాసికి వచ్చెను. పార్వతీ! ఇచ్చటకు వచ్చి, నాకు నమస్కరించి, రామకార్యమును విన్నవించెను. అదివిని నేను శ్రీరామునికై ఆంజనేయునికి రెండు శివలింగములనిచ్చి, "హనుమా! నేనుకూడా దక్షిణదిక్కుకు వచ్చుటను మునుపే నిశ్చయించుకొనియున్నాను. అగస్త్యమునితోడ విశేషముగా ప్రార్థించబడితిని. శ్రీరాముని అనుమతిచే వచ్చుచున్నాను," అని చెప్పితిని. ఈ మాటవిని హనుమ, "అగస్త్యునితో నీవెపుడు నిశ్చయించితివి? నా మీద కరుణించి ఆ సంగతిని సవిస్తరముగా నిరూపింపుము," అని వేడెను. అందుకు నేను ఇట్లంటిని. (77)

**తన్మారుతివచః శ్రుత్వా తతోఽహమబ్రువం కపిమ్ ।**
**మారుతే త్వం శృణుష్వాద్య పూర్వవృత్తం వదామి తే ॥ 78**

**కదాచిన్నారదః శ్రీమాన్ స్నాత్వా శ్రీనర్మదాంభసి ।**
**శ్రీమదోంకారమభ్యర్చ్య సర్వదం సర్వదేహినామ్ ॥ 79**

**వ్రజన్విలోకయాంచక్రే పురో వింధ్యం ధరాధరమ్ ।**
**సంసారతాపసంహారి రేవావారిపరిష్కృతమ్ ॥ 80**

**రూపద్వయేన కుర్వంతం స్థావరేణ చరేణ చ ।**
**సాభిఖ్యేన యథార్థాఖ్యాముచ్చైర్వసుమతీమిమామ్ ॥ 81**

**అథ తం నారదం దృష్ట్వా వింధ్యః ప్రత్యుజ్జగామ సః ।**
**గృహమానీయ విధివత్ పూజయామాస సాదరమ్ ॥ 82**

గతశ్రమమథాలోక్య బభాషేఽవనతోగిరిః ।
అఘసంఘః పరిహృతస్త్వదంఘ్రిరజసా మమ ॥ 83

త్వదంగసంగిమహసా సహసాప్యంతరం తమః ।
సకలర్ధికరం చాద్య సుదినం చాద్య మే మునే ॥ 84

ప్రాక్కృతైః సుకృతైరద్య ఫలితం మే చిరార్జితైః ।
ధరాధరత్వం కులిషు మాన్యం మేఽద్య భవిష్యతి ॥ 85

ఇతి శ్రుత్వా తదా కించిదుచ్ఛ్వాస్య స్థితవాన్ మునిః ।
పునరూచే కులివరః సంభ్రమాపన్నమానసః ॥ 86

ఉచ్ఛ్వాసకారణం బ్రహ్మన్ బ్రూహి సర్వార్థకోవిద ।
తవాహం మార్జయామ్యద్య హృత్ఖేదం క్షణమాత్రతః ॥ 87

ధరాధరణసామర్థ్యం మేర్వాదౌ పూర్వపూరుషైః ।
వర్ణ్యతే సముదాయాత్తదహమేకో దధే ధరామ్ ॥ 88

గౌరీగురుత్వాద్ధిమవానాధిపత్యాచ్చ భూభృతామ్ ।
సంబంధిత్వాత్పశుపతేః స ఏకో మాన్యభృత్సతామ్ ॥ 89

న మేరుః స్వర్ణపూర్ణత్వాద్రత్నసానుతయాఽథవా ।
సురసద్మతయా వాఽపి క్వాపి మాన్యో మతో మమ ॥ 90

పరం శతం న కిం శైలా ఇలాకలనకేలయః ।
ఇహ సంతి సతాం మాన్యా మాన్యాస్తే తు స్వభూమిషు ॥ 91

మందేహదేహసందోహ ఉదయైకదయాశ్రితాః ।
నిషధశ్చౌషధిధరోఽప్యస్తోఽప్యస్తమితప్రభః ॥ 92

నీలశ్చ నీలనిలయో మందరో మందలోచనః ।
సర్పాలయః స మలయో రాయం నావాప రైవతః ॥ 93

హేమకూటత్రికూటాద్యాః కూటోత్తరపదాస్తు తే ।
కిష్కింధక్రౌంచసహ్యాద్యా భారసహ్యా న తే భువః ॥ 94

## వింధ్యపర్వత గర్వభంగము-అగస్త్యముని దక్షిణభారత ఆగమనము

వాయునందనా! ఒకప్పటి సంగతిని చెప్పెదను వినుము. "ఒకానొకప్పుడు శ్రీనారదమహర్షి నర్మదానదిలో స్నానముజేసి అందరి కోరికలను తీర్చునట్టి ఓంకారేశ్వరుని పూజించి, పోవుచు ఎదుట, సంసారసంతాప సంహారకమైన రేవానదిచే అలంకరింపబడి జంతు పర్వత రూపములు రెండును అవలంబించి, ఈ భూమిని ఔన్నత్యముచే యథార్థవతినిగా జేసిన కీర్తితో ఉండగా వింధ్యరాజును చూచెను. ఆ వింధ్యుడు నారదునిజూచి, భక్తితో ముందుకువచ్చి, తన యింటికి ఆహ్వానించి చక్కగా సత్కరించి, అగస్త్యుడు విశ్రమించినపుడు వినయముతో "మునీంద్రా! నీ పాదధూళిచే నా పాపమంతయు పరిహరింపబడె. నీ స్పర్శవలన నా అజ్ఞానము తొలగినది. మహానుభావా! నేడే సుదినము. నా వెనుకటి పుణ్యములు పండివచ్చినవి. నా కులము వారిలో మాన్యమగు భూధరత్వము ఇపుడు నాకు కలుగుచున్నది," అని చెప్పగా, నారదుడు విని కొంచెము నిట్టూర్పువిడిచి, ఊరకయుండెను. అందుకు గిరివరుడైన వింధ్యుడు ఆశ్చర్యముతో స్వాంతుడగుచు, "సర్వజ్ఞుడైన బ్రాహ్మణోత్తమా! తమరు నిట్టూర్పు విడుచుచున్నారేమి? నీ మనసులో కలిగిన క్లేశమును నిమిషములో పోగొట్టగలను. ఏమో వెనుకటివారు మొత్తము మీద పర్వతాలలో మేరువు మొదలగువాటిని వర్ణించుచున్నారే గాని, నిజానికి నేనొకడనే భూమిని ధరించువాడను. గౌరిని కనుటచేతను, కొండలకు రాజగుట చేతను, శివునికి మామ అగుటచేతను ఆ హిమవంతుడొకడు సుజనులచే కొనియాడబడుచున్నాడు. మేరువు బంగారు నిండియున్ననేమి? రత్నసానువైన నెంత? దేవతలకు నిలయమైన గాని? అది గొప్పదని ఎవ్వరూ అనరు. ఇది నామతము. భూమిలో ఎదగని నూర్లకొలది కొండలెన్నిలేవు? అవన్నియును పెద్దలచే గౌరవింపబడినవే, అయినా అవి ఉండెడుచోట్లలో, మందేహశైలం ఆకారపుష్టి గలది. ఉదయ శైలము కేవల దయాపాత్రము. నిషధగిరిలో ఓషధులులేవు. అస్తశిఖరికి కాంతిసున్న. నీలాద్రి నల్లనిది. మందరపర్వతము మందాక్షము. మలయధరము పాములపుట్ట. రైవతము నిర్ధనము. హేమకూట త్రికూటాదులు వేళ్ళుమాత్రముగలవి. కిష్కింధ, క్రౌంచ, సహ్యాదిగిరులు, భూమిబరువును ఓర్వజాలవు. నేనొకడు గొప్పవాడను," అని విఱ్ఱవీగుచుండు వింధ్యుని మాటలను విని

**ఇతి వింధ్యవచః శ్రుత్వా నారదో హృద్యచింతయత్ ।**
**అఖర్వగర్వసంసర్గో న మహత్వాయ కల్పతే ॥ 95**

**శ్రీశైలముఖ్యాః కిం శైలా నేహ సంత్యమలశ్రియః ।**
**యేషాం శిఖరమాత్రాది దర్శనం ముక్తయే సతామ్ ॥ 96**

**అద్యాస్య బలమాలోచ్యమితి ధ్యాత్వాఽబ్రవీన్మునిః ।**
**సత్యముక్తం హి భవతా గిరిసారం వివృణ్వతా ॥ 97**

పరః శైలేషు శైలేంద్రో మేరుస్త్వామవమన్యతే ।
మయా నిఃశ్వసితం చైతత్త్వయి చాపి నివేదితమ్ ॥ 98

అథవా మద్విధానాం హి కేయం చింతా మహాత్మనామ్ ।
స్వస్త్యస్తు తుభ్యమిత్యుక్త్వా యయౌ స వ్యోమవర్త్మనా ॥ 99

గతే మునౌ నినింద స్వమతోఽవోద్విగ్నమానసః ।
చిత్తే విచారయామాస మేరోః శ్రైష్ఠ్య కథం త్వితి ॥ 100

మేరుం ప్రదక్షిణం కుర్యాన్నిత్యమేష దివాకరః ।
సగ్రహర్క్షగణో నూనం మన్యమానో బలాధికమ్ ॥ 101

ఇతి నిశ్చిత్య వింధ్యాద్రిర్వవృధే స మృధేక్షణః ।
నిరుధ్య బ్రాధ్నమధ్వానం స్వస్థోఽభూద్గగనాంగణే ॥ 102

తతః ప్రభాతే సూర్యోఽసౌ దిశి యామ్యాం సముద్యతః ।
గన్తుం రుద్ధం స్వపంథానం దృష్ట్వాఽస్వస్థోఽభవచ్చిరమ్ ॥ 103

యోజనానాం సహస్రే ద్వే ద్వే శతే ద్వే చ యోజనే ।
యః స్వస్యశ్చ నిమేషార్ధాద్యాతి నాపి చిరం స్థితః ॥ 104

గతే బహుతిథే కాలే ప్రాచ్యోదీచ్యా భృశార్దితాః ।
చండరశ్మేః కరవ్రాతపాతసంతాపతాపితాః ॥ 105

పాశ్చాత్యాదాక్షిణాత్యాశ్చ నిద్రాముద్రితలోచనాః ।
శ్రమితా ఏవ దృశ్యంతే సతారగ్రహమంబరమ్ ॥ 106

స్వాహాస్వధావషట్కారవర్జితే జగతీతలే ।
పంచయజ్ఞక్రియాలోపాచ్చకంపే భువనత్రయమ్ ॥ 107

తతః సురావిధేర్వాక్యాదగస్తి తద్గిరేర్గురుమ్ ।
ప్రార్థయామాసుశ్చాత్రైత్య సమునిర్విహ్వాలోభవత్ ॥ 108

తదాఽగస్త్రిర్మయోక్తః స గచ్ఛ త్వం దక్షిణాందిశమ్ ।
వాక్పాశేన గిరిం బద్ధ్వా మా ఖిదద త్వం భజస్వ మామ్ ॥ 109

**అహమప్యచిరేణైవ తవ ఖేదాపనుత్తయే ।**
**సేతౌ శ్రీరామపూజార్థం యాస్యామిదక్షిణాం దిశమ్ ॥ 110**

**ఇతి మద్వచనం శ్రుత్వాఽగస్తిస్తుష్ట మనాస్తదా ।**
**ముక్త్వా కాశీం యయౌ వింధ్యం లోపాముద్రాసమన్వితః ॥ 111**

నారదుడు తన మనస్సులో, "ఈ వింధ్యుడు మిక్కిలి క్రొవ్వుపట్టినాడు, లోకమున శిఖర దర్శనమాత్రమున ముక్తినిచ్చునట్టి శ్రీశైలాది మహాపర్వతములు ఎన్నిలేవు? గర్వము మహిమను అణుచును. వీని బలము చూతము," అని నిశ్చయించి, వింధ్యునితో, "పర్వతములయొక్క సారమును వివరించుచు బాగుగా పలికితివి. అయిన కొండలలో మేరుగిరి నిన్ను తక్కువగా చూచును, నేనందుకే నిట్టూర్పు విడిచితిని. నీకును చెప్పితిని, ఏల? మావంటి మహాత్ములకు ఏ చింతయును లేదు. నీకు మేలగుగాక," అని పలికి గగనమున పోయెను. అంత ఆ వింధ్యుడు ఖిన్నుడై, "కానిమ్ము ఈ మేరువునకు ఇంత గొప్పతనమేల? గ్రహనక్షత్రాదులతో సూర్యుడు నిత్యప్రదక్షిణమునకు వచ్చుననిగదా? తగినపని చేయుదు," నని నిశ్చయించిన వింధ్యపర్వతము గగనమున పొడుగుగా పెరిగి పెరిగి సూర్యమార్గ మునకు అడ్డుగా నిలచెను. చిరకాలమిట్లు 2,202 యోజనములు పొడిగైయుండగా, పశ్చిమ, దక్షిణ దిక్కు ప్రజలు సూర్యకిరణములు పడక నిద్రలోనికి జారుకొనిరి. తూర్పు, ఉత్తర దిక్కు ప్రజలు ఎండలకు కాగిపోయిరి. కాల గమనము తప్పడముతో పితృపూజలు, యజ్ఞక్రియలు దెబ్బతిని ముల్లోక ప్రజలు అల్లకల్లోలమైరి. అటుమీదట దేవతలు బ్రహ్మవచనమునువిని ఆ గిరిసమస్యను పరిష్కరించమని దేవతల గురువైన అగస్త్యమునిని ప్రార్థించిరి. అగస్త్యమహర్షియును ఆలోచనలో పడెను. ఓ మారుతీ! అపుడు నేను అగస్త్యమునితో, "నీవు దక్షిణదిక్కుకు వెళ్ళుము. వాక్పాశముచేత వింధ్యాద్రినిబంధించి, చింతనొందక నన్ను భజింపుము. నేనును త్వరలో నీకు వ్యసనము కలుగక యుండునట్లును రామపూజ కలుగునట్లు దక్షిణదిక్కుకు వచ్చుచున్నాను," అని చెప్పితిని. అది విని అగస్త్యముని సంతసించుచు కాశీని విడచి లోపాముద్రతోడ దక్షిణదిక్కుకు పయనము జేసెను.

**తమగస్త్యం సపత్నీకం దృష్ట్వా వింధ్యోఽతికంపితః ।**
**అతిఖర్వతరో భూత్వా వివక్షురవనీమివ ॥ 112**

**ఆజ్ఞాప్రసాదః క్రియతాం కిం కరోమీతి చాబ్రవీత్ ।**
**తద్వింధ్యవచనం శ్రుత్వాఽగస్తిః ప్రాహ చ సాదరమ్ ॥ 113**

**వింధ్య సాధురసి ప్రాజ్ఞో మాం చ జానాసి తత్త్వతః ।**
**పునరాగమనం చేన్మే తావత్ఖర్వతరో భవ ॥ 114**

**ఇత్యుక్త్వా దక్షిణామాశా మగస్త్విః స యయౌ తదా ।**
**వేపమానో గిరిః ప్రాహ పునర్జన్మాద్య మేఽభవత్ ॥ 115**

**ఉచ్ఛిరో ద్వాదశాబ్దైః స మునిం పశ్యతి దక్షిణే ।**
**నాగతం తం మునిం దృష్ట్వా పునః ఖర్వోఽవతిష్ఠతే ॥ 116**

**అద్య శ్వో వా పరశ్వో వా హ్యాగమిష్యతి వై మునిః ।**
**ఇతి చింతామహాభారైర్గిరిరాక్రాంతవత్ స్థితః ॥ 117**

**నాద్యాపి మునిరాయాతి నాద్యాపి గిరిరేధతే ।**
**అరుణోఽపి చ తత్కాలే కాలజ్ఞోఽశ్వానకాలయత్ ॥ 118**

**జగత్స్వాస్థ్యమవాపోచ్చైః పూర్వవద్భానుసంచరైః ।**
**స మునిర్దండకం గత్వా మద్వాక్యం సంస్మరన్హృది ॥ 119**

**కరోతి మత్ప్రతీక్షాం చ తస్మాద్యాస్యామ్యహం కపే ।**
**ఇత్యుక్తో మారుతిః కాశ్యాం మయా దేవి విసర్జితః ॥ 120**

అగస్త్యముని తన పత్నితో వచ్చుటను జూచిన వింధ్యుడు వణకుచు, భూమిలో గ్రుంకువానివలె మిక్కిలి చిన్నరూపము నొంది, "ఏమి చేయుదును ఆజ్ఞాపించవలయు,"నని వేడెను. అందుకు అగస్త్యుడు, "వింధ్యుడా! నీవు మంచివాడవు. తెలివిగలవాడవు. నన్నుచక్కగా నెఱుగుదువు. నేను మరల వచ్చువరకు ఈ విధముగానే అణగి యుండుము" అని ఆజ్ఞాపించి, దండకారణ్యమును చేరి, నా రాక నెదురు చూచుచున్నాడు. అది మొదలు వింధ్యుడు నా కిపుడు పునర్జన్మము ఘటిల్లెనని చింతించుచు, పండ్రెండేళ్ళకు ఒకసారి దక్షిణమున మునిని తల ఎత్తి తొంగిచూచుచు మునీంద్రుడు రానందున నేడు వచ్చును, రేపువచ్చును చూతమను చింతతో బరువును మోయజాలని వానివలె క్రుంగి పడియున్నాడు. అగస్త్యముని ఇప్పటికీ తిరిగిరాలేదు. వింధ్యపర్వతము పెరగలేదు. దానితో సూర్య కిరణాలు ఆటంకము లేకుండా నలుదిశలా చక్కగా ప్రసరించుచున్నవి. లోకము చక్కబడినది. ఆ మునికొరకు నేను వచ్చెదను, అని చెప్పి ఆంజనేయుని పంపితిని." పార్వతీ వినుము. (120)

**జగామాకాశమార్గేణ శీఘ్రం రామం స మారుతిః ।**
**కించిద్గర్వసమావిష్టోలింగద్వయసమన్వితః ॥ 121**

తద్గర్వం రాఘవోజ్ఞాత్వా సుగ్రీవాదీన్ వచోऽబ్రవీత్ ।
ముహూర్తాతిక్రమో మేऽద్య భవిష్యతి తతస్త్వహమ్ ॥ 122

కృత్వా లింగం సైకతం చ సేత్వాదౌ స్థాపయామి వై ।
ఇత్యుక్త్వా వానరాన్ సర్వాన్మునిభిః పరివేష్టితః ॥ 123

సైకతం స్థాపయామాస లింగం రామో విధానతః ।
తదా సస్మార మనసి కౌస్తుభం రఘునందనః ॥ 124

తావదయ్యౌ మణిః శీఘ్రం ఖాత్కోటితపనోపమః ।
తం బబంధ మణిం కంఠే కౌస్తుభం రఘునందనః ॥ 125

మణ్యుద్భవైర్ధనైర్వస్త్రైరశ్వాభరణధేనుభిః ।
దివ్యాన్నైః పాయసాద్యైశ్చ పూజయామాస తాన్ మునీన్ ॥ 126

తతస్తే మునయస్తుష్టా రాఘవేణాతిపూజితాః ।
యయుః స్వీయాశ్రమాన్ మార్గ తాన్దదర్శ స మారుతిః ॥ 127

పప్రచ్ఛ మారుతిర్విప్రాన్ యూయం కేన ప్రపూజితాః ।
తేऽప్యూచుర్లింగమారాధ్య రాఘవేణైవ పూజితాః ॥ 128

తత్తేషాం వచనం శ్రుత్వా క్రోధావిష్టోऽభ్యచింతయత్ ।
వృథాऽహం శ్రమితస్తేన రామేణాద్య ప్రతారితః ॥ 129

ఇత్థం వదన్ యయౌ రామ క్రోధాత్ స్వీయం పదద్వయమ్ ।
భువి సంతాడ్య పతితస్తదా భూమ్యాం పదద్వయమ్ ॥ 130

అంత ఆ మారుతి గగనమున త్వరగా రామేశ్వర, విశ్వేశ్వరాది రెండులింగ ప్రతిష్ఠలతోడ సేతుమూలమున శ్రీరామాదులు సాన్నిధ్యమునందు భాగ్యమును పొందియున్నానను గర్వముగలవాడై పోవుచుండెను. వీని గర్వమెరిగిన శ్రీరాముడు సుగ్రీవాదులతో, "నాకు ముహూర్తము మీరుచున్నది. అందువలననే నేను ఇసుక లింగమును సముద్రపు ఒడ్డున స్థాపించెదను," అని చెప్పి మునీంద్రులచే పరివేష్ఠితుడై, శాస్త్రోక్తముగా సైకత లింగమును సంస్థాపించెను. అపుడు రాముడు తన కౌస్తుభ రత్నమును స్మరించగా అది దేదీప్యమానమై గగనము నుండి వచ్చెను. దానిని శ్రీరామచంద్రుడు కంఠమున ధరించి, దాని నుండి ఇచ్ఛామాత్ర నిర్మితములై వచ్చిన ధన, కనక, వస్తు, వాహన, అన్న

పానములచే మునీంద్రులను సత్కరించెను. ఆ మునులందరును ఎంతో ఆనందమునొంది, సత్కారములను స్వీకరించి, తమతమ నెలవులకు నడచిరి. దారిలో వారిని చూచి ఆంజనేయుడు మీ రెవ్వరిచే పూజింపబడితిరి అని అడిగెను. వారు లింగమును ఆరాధించి, శ్రీరాముడు మమ్మును సత్కరించి పంపెను అని చెప్పిరి. అది విని వీరకపి క్రోధమునంది, "అట్లాగా! రాముడు నన్ను వంచించెను. నేను అతనికై వ్యర్థముగా శ్రమనొందితిని," అని ఆగ్రహించుచు వచ్చి, రాముని ఎదుట రెండుకాళ్ళతో గగనము నుండి నేలదన్నెను. ఆ రెండడుగులును నేలపై గుర్తుగా నిలిచెను.

గతం కపిస్తదా రామమబ్రవీత్కిం న మే స్మృతః ।
సీతాశుద్ధిర్మయా లంకాం గత్వానీతేతి సాఽద్య హి ॥ **131**

తస్య మేఽద్యోపహాసోఽత్ర కాశీం ప్రేష్య త్వయా కృతః ।
కిమర్థం శ్రమితశ్చాహం యదీత్థం తే హృది స్థితమ్ ॥ **132**

అభవిష్యన్మయా జ్ఞాతం చేత్పూర్వం హృద్గతం తవ ।
కాశీమహం తర్హి గత్వా కిమర్థం లింగమానయే ॥ **133**

ఏకం త్వదర్థమానీతమపరం లింగముత్తమమ్ ।
మయాఽఽత్మార్థం సమానీతం తవాగ్రే కిం కరోమ్యహమ్ ॥ **134**

ఏవం క్రోధయుతం వాక్యం కించిద్గర్వసమన్వితమ్ ।
రామః శ్రుత్వా కపిం ప్రాహ కపే త్వం సత్యవాగపి ॥ **135**

మయైతత్స్థాపితం లింగం సముత్పాటయ త్వం బలాత్ ।
స్థాపయామి త్వయానీతం కాశ్యా విశ్వేశ్వరాభిదమ్ ॥ **136**

తథేత్యుక్త్వా మారుతిః స సైకతస్యేశ్వరస్య చ ।
సంవేష్ట్య మస్తకే పుచ్ఛం బలేనాందోలయన్ముహుః ॥ **137**

త్రుటితం తత్కపేః పుచ్ఛం పపాత భువి మూర్ఛితః ।
జహసుర్వానరాః సర్వే న చచాలేశ్వరస్తదా ॥ **138**

స్వస్థో భూత్వా మారుతిః స గతగర్వస్తదాఽభవత్ ।
ననామ పరయా భక్త్యా ప్రార్థయామాస తం ముహుః ॥ **139**

**మయాఽపరాధితం రామ తత్క్షమస్వ కృపానిధే ।**
**తదాహ మారుతిం రామస్త్వ మల్లింగోత్తరే త్విదమ్ ॥ 140**

**విశ్వనాథా భిదం లింగం స్వీయం సంస్థాపయాధునా ।**
**తథేతి మారుతిర్లింగం స్థాపయామాస సాదరమ్ ॥ 141**

**మారుతేశ్చైవ లింగాయ దదౌ రామో వరం తదా ।**
**అసంపూజ్యా విశ్వనాథం మారుతే త్వత్ప్రతిష్ఠితమ్ ॥ 142**

**మమాదౌ పూజయంత్యత్ర యే నరా లింగముత్తమమ్ ।**
**రామేశ్వరాభిధంసేతౌ తేషాం పూజా వృథా భవేత్ ॥ 143**

ఇట్లు వచ్చిన కపివీరుడు రాముని జూచి, “ఇప్పుడే లంక నుండి సీతావార్త దెచ్చినవాడనని నా యొక్క స్మృతి లేదా? అట్టి నన్ను కాశీనగరానికి పంపి అపహాస్యము చేసితివి. ఎందుకు నన్నిట్లు శ్రమపెట్టవలెను? ఇట్లు నీ మనస్సులో దలచిన సంగతి నాకు తెలిసియున్న ఈ కాశీ లింగములను నేనెందుకు తెత్తును? ఒక లింగమును నీకై తెచ్చితిని. ఒకటిని నాకై తెచ్చితిని. ఇప్పుడేమి చేయుదును?” అని కోపముతో గర్వముగా చెప్పగా, వినిన శ్రీరాముడు, “కపీ! నీవు యథార్థము చెప్పెదవు. నేనేమో ఈ లింగమును స్థాపించితిని, దీనిని పెరికివేయుము. నీవు కాశీనుండి తెచ్చిన విశ్వేశ్వర మను పేరుగల లింగమునే ప్రతిష్ఠించెదను,” అని చెప్పెను. అట్లేయని ఆంజనేయుడు ఆ సైకత లింగమును తన తోకతో చుట్టి, పలుమార్లు కదిపెను. హనుమంతుని తోక తెగినదే కాని లింగము రాలేదు. కపులందరును అట్టహాస మొనరించిరి. లింగమిసుమంతైనను చలించలేదు. పిదప ఆంజనేయుడు స్వస్థుడై గర్వము తగ్గి, శ్రీరామునికి నమస్కరించి, “శ్రీరామా! నేను అపరాధమును జేసితిని, దయానిధీ క్షమింపుము,” అని పలుమార్లు ప్రార్థించెను. అంత ఆ రాఘవుడు దయజేసి, “నీవు విశ్వనాథమను పేరుగల ఈ లింగమును నాలింగమునకు ఉత్తరమున ఇప్పుడు ప్రతిష్ఠింపుము,” అని వరమిచ్చెను. కపీంద్రుడు అట్లేయని ఆదరముతో శివప్రతిష్ఠజేసెను. అపుడు రాముడు, “మారుతీ! నీవు ప్రతిష్ఠించిన విశ్వనాథలింగమును పూజించక, మొదట నాచే ప్రతిష్ఠింపబడిన ఈ ఉత్తమ రామేశ్వర లింగమును సేతువులో పూజించినట్లైన వారి పూజ వ్యర్థమగుగాక,” అని ఆంజనేయుని శివలింగమునకు వరమిచ్చెను.

**ఇత్యుక్త్వా తం పునః ప్రాహ రామో రాజీవలోచనః ।**
**మదర్థం యత్సమానీతం త్వయా లింగం మహత్తమమ్ ॥ 144**

**విశ్వనాథస్య తత్తూష్ణమస్తు దేవాలయే చిరమ్ ।**
**అనర్చితమవన్యాం తదప్రతిష్ఠితముత్తమమ్ ॥ 145**

అగ్రే కాలాంతరేణాహం తచ్చాపి స్థాపయామి వై ।
తత్తత్ర వర్తతేఽద్యాపి లింగం విశ్వేశ్వరాంతికే ॥ 146

అప్రతిష్ఠాపితం భూమ్యాం న కేనాపి ప్రపూజితమ్ ।
పునః ప్రాహ కపిం రామస్త్వమత్ర ఛ్చిన్నలాంగులః ॥ 147

వస భూమ్యాం గుప్తపాదః స్మరన్స్వగర్వితం త్విదమ్ ।
తతః కపిః స్వీయమూర్తిం స్థాపయామాస స్వాంశతః ॥ 148

ఛిన్నపుచ్ఛా గుప్తపాదా సా తత్రాద్యాపి వర్తతే ।
పతితో మూర్ఛితో యత్ర మారుతిస్తత్ర తద్వరమ్ ॥ 149

బభూవ మారుతేర్నామ్నా తీర్థం పాపప్రణాశనమ్ ।
రామస్తత్రాకరోత్పుణ్యం స్వనామ్నా తీర్థముత్తమమ్ ॥ 150

స్వాంశేన స్థాపయామాస మూర్తిం తత్ర రఘూద్వహః ।
సేతుమాధవనామ్నీ సా వర్తతేఽద్యాపి పార్వతి ॥ 151

స్వనామ్నా లక్ష్మణశ్చాపి చకార తీర్థముత్తమమ్ ।
తతో రామః స్వహస్తేన స్పృష్ట్వా మారుతిలాంగులమ్ ॥ 152

చకార పూర్వవద్రమ్యం దృఢసంధిప్రసాదితః ।
తత్పుచ్ఛవేష్టనాజ్జాతః కృశో రామేశమస్తకః ॥ 153

స తథైవ కృశోఽద్యాపి తత్రాస్తి శివమస్తకః ।
తదారభ్య త్యక్తగర్వశ్చాభూద్రామే స మారుతిః ॥ 154

తతోఽహంసైకతాల్లింగాదావిర్భూయ రఘూద్వహమ్ ।
అబ్రువం దేవి తత్సర్వం శ్రుణుష్వ తే వదామ్యహమ్ ॥ 155

శ్రీరాముడు ఆంజనేయునితో, "నా కొరకు నీవు తెచ్చిన మహోత్తమలింగము విశ్వనాథుని దేవాలయమున ప్రతిష్ఠింపబడక ఊరక పడియుండనీ, దీనికి బహుకాలము భూమిలో పూజనమక్కర లేదు. ముందు మరియొక కాలమున దానిని గూడ నేను సంస్థాపించెదను," అని రాజీవాక్షుడగు రాముడు విధించెను. గనుక పార్వతీ! ఇప్పుడు విశ్వేశ్వరాలయమున లింగమొకటి ప్రతిష్ఠింపబడక ఎవరి చేతను పూజింపబడక ఉన్నది. మరల ఆ రాముడు, "నీవిచ్చట తోక తెగియున్నావు. భూమిలో

గుప్తచరణుడై ఈ నీ గర్వమును స్మరించుచుండుము," అని చెప్పగా ఆంజనేయుడు తన అంశముచే తన మూర్తిని స్థాపించెను. మోటుతోకతో కాళ్ళునేలతాకిన వాయుపుత్రుని ప్రతికృతి ఇప్పటికిని కనబడుచున్నది. ఆంజనేయుడు పడి మూర్ఛనొందినచోట ఈ వరము కలిగినది. అచ్చట పాప పరిహారకమైన మారుతి తీర్థము గలదు. రాముడును తనపేరుతో అచ్చట ఒక తీర్థమును ఏర్పరిచి, తన అంశచేత తన ప్రకృతిని గూడ సంస్థాపించెను. సేతుమాధవ నామముతో ఆ రాముని అర్చామూర్తి ఇప్పటికిని కనబడుచున్నది. అట్లే లక్ష్మణుడును తన పేరుతో ఒక తీర్థమును స్థాపించెను. అంత శ్రీరాముడు తనచేత మారుతి వాలమును స్పృశించి, ముందువలెనే తోక చక్కగా ఉండునట్లు చేసెను. ఆ పుచ్ఛబంధము చేత కృశమైన శిరస్సుగల రామేశలింగము ఇప్పటికిని అట్లే కనబడును. అది మొదలుకొని ఆంజనేయుడు రామ విషయమున గర్వములేనివాడై వర్తించుచున్నాడు. (154)

**రాఘవేంద్ర రఘుశ్రేష్ఠ శృణు వృత్తం పురాతనమ్ ।**
**ఏకదాఽహం పురా భూమ్యాం మలినాంబరసంయుతః ॥ 156**

**భిక్షార్థం కౌతకాద్విప్రరూపేణవిచరన్ సుఖమ్ ।**
**ఋషీణామాశ్రమాద్యేషు హ్యటంతం మాం విలోక్య చ ॥ 157**

**మద్రూపమోహితాః సర్వా ఋషిపత్న్యః సహస్రశః ।**
**మత్పృష్ఠే తాః సమాజగ్ముర్భర్తృభిర్వారితా అపి ॥ 158**

**తదా తే చక్షుభః సర్వే మామజ్ఞాత్వా మునీశ్వరాః ।**
**దదుః శాపం మహాఘోరం క్రోధసంవిగ్నమానసాః ॥ 159**

**రత్యర్థం మోహితాం నార్యస్త్వయాతస్మాద్విజాధమ ।**
**పతత్వద్య రతేరంగం లింగం భువి చ నో గిరా ॥ 160**

**ఏవం ద్విజైర్యదా శప్తోఽపతల్లింగం తదా భువి ।**
**ద్విజచ్ఛద్మస్య మే రామ గతోఽహం గుప్తతాం తదా ॥ 161**

**ద్విజనార్యోపిదృష్ట్వా మాం జగ్ముః స్వం స్వం గృహం ప్రతి ।**
**తల్లింగం వవృధే భూమ్యాం గగనం వ్యాప్య సంస్థితమ్ ॥ 162**

**తద్దృష్ట్వా చకితో వేధాస్తస్యాన్త ద్రష్టుముద్యతః ।**
**పశ్యతస్తస్య కోట్యబ్దైర్నాంతమాసీచ్చ వేధసః ॥ 163**

తదా మామేత్య స విధిర్భయాద్వృత్తం న్యవేదయత్ ।
అకాలే ప్రళయస్త్వద్య శంభోఽనేన భవిష్యతి ॥ 164

తదా మయా పూర్వవృత్తం విధిం సంశ్రావ్య సాదరమ్ ।
త్రిశూలో వేధసే దత్తస్తం ఛేత్తుం సోఽబ్రవీచ్చ మామ్ ॥ 165

కథం తేఽఙ్గం దారయేఽహం త్వమేవ చ్ఛేత్తుమర్హసి ।
తతో మయార్కఖండాని కృతాని తస్య రాఘవ ॥ 166

త్రిశూలేనాపి క్షిప్తాని భూమ్యాం నిపతితాని హి ।
తజ్జాతాన్యత్ర లింగాని జ్యోతిస్సంజ్ఞాని ద్వాదశ ॥ 167

## శివుడు శ్రీరామునికి లింగోత్పత్తిని వివరించుట.

పార్వతీ! నేను పిమ్మట సైకతలింగమునుండి ఆవిర్భవించి శ్రీరామునితో ఇట్లు చెప్పితిని. ఆ సంగతిని వినుము. "రఘునాథా! మునుపటి సంగతిని వినుము. మునుపు నేనొకప్పుడు భూమిలో మలిన వస్త్రమును ధరించి వినోదముగా భిక్షకొరకు బ్రాహ్మణరూపముతో సుఖముగా సంచరించుచు ఋషుల ఆశ్రమములలో తిరుగుచుంటిని. అట్టినన్ను చూచి నా రూపమును మోహించి, చాలామంది ఋషిపత్నులు తమతమ మగండ్రు నివారించుచున్నను లక్ష్యపెట్టక నన్ను వెంబడించి వచ్చిరి. అప్పుడు మునులు నన్నెఱుగక కోపించి, చూచి, "బ్రాహ్మణాధముడా రతికొరకు నీ చేత మా స్త్రీలు మోహింపబడినందున నీ రత్యంగమగు లింగము మామాటచేత ఇప్పుడే పడిపోవుగాక!" అని ఘోరశాపమును ఇచ్చిరి. ఇట్లు శపింపబడగా ఆ లింగము నేలపై ఊడిపడెను. నేను అంతర్ధానము నొందితిని. విప్రపత్నులు నన్ను జూచి తమతమ నెలవులకు వెళ్ళిరి. ఆ లింగము భూమిలో వృద్ధినొంది, గగనమును వ్యాపించి నిలిచెను. దాని జూచి, చకితుడైన బ్రహ్మ దాని అంతమును చూడ బూనెను. ఎంత కాలము చూచుచుండినను బ్రహ్మకు దాని అంతు కానరాదయ్యె. అపుడా బ్రహ్మ నాసన్నిధికివచ్చి భయమున, "స్వామీ! అకాలప్రళయము సంభవించుచున్నది." అని తెలిపెను. నేనపుడు బ్రహ్మకు జరిగిన సంగతిని చెప్పి, దానిని ముక్కలు చేయుటకు త్రిశూలమును ఇచ్చితిని. అందుకతడు, "నేనెట్లు నీయంగమును ఛేదింతును? నీవే దానికి తగుదు," వనెను. అంత నేను దానిని 12 భాగములుగా నేర్పరిచితిని. త్రిశూలముచే భూమిలో పడద్రోయగా వాటినుండి 12 జ్యోతిర్లింగములు ఏర్పడినవి.

ఓంకారః సోమనాథశ్చ త్ర్యంబకో మల్లికార్జునః ।
నాగేశో వైద్యనాథశ్చ కాశీవిశ్వేశ్వరస్త్వహమ్ ॥ 168

కేదారేశో మహాకాలో భీమేశో ఘృష్ణేశ్వరః ।
ఏవమేకాదశ జ్ఞేయా జ్యోతిర్లింగమయాః శుభాః ॥ 169

గంధమాధననామ్నేశో మేరోరీశానధిక్ స్థితః ।
ఆసీచ్చిరం న కస్యాపి మానవస్యాక్షిగోచరః ॥ 170

తదా తే మునయః సర్వే శివం బుద్ధ్వా తు లింగతః ।
దదుర్వరం పునర్లింగం తవాస్తు గిరిజాప్రియ ॥ 171

తతః ప్రళయవాతేన గంధమాదననామకమ్ ।
తన్మేరోరుత్తరే శృంగమేకదాఽత్రాపతద్భువి ॥ 172

తదిదం హ్యబ్ధిసంయోగే దక్షిణే సాగరాంభసి ।
గంధమాదననామ్నేదం శృంగం పశ్యాత్ర రాఘవ ॥ 173

గంధమాదననామ్నేశం లింగం ద్వాదశమం త్విదమ్ ।
త్వత్ప్రతిష్ఠితలింగస్య హీశాన్యామంతికే స్థితమ్ ॥ 174

ఏతావత్కాలపర్యంతం నేదం కైశ్చిద్విలోకితమ్ ।
అద్య త్వయా వానరాద్యైర్ దృష్టం స్పష్టం విమోక్షదమ్ ॥ 175

త్వత్ప్రతిష్ఠితలింగస్య ప్రసాదాదవనీతలే ।
ఖ్యాతిం గతం త్విదం లింగం యస్మాత్తస్మాద్రఘూత్తమ ॥ 176

అస్య లింగస్య యజ్జ్యోతిర్మదీయం త్వత్ప్రతిష్ఠితే ।
యాస్యత్యద్య సైకతేఽత్ర లింగో సేతౌ గిరా మమ ॥ 177

జ్యోతిర్లింగం ద్వాదశమం తవ రామేశ్వరాభిదమ్ ।
వదంత్యత్ర జనాః సర్వే హ్యద్యారభ్య రఘూత్తమ ॥ 178

పూజోత్సవాదికం కర్మ యద్యత్కించిద్గిరా మమ ।
తవైవ లింగే తత్సర్వమస్తు రామేశ్వరే సదా ॥ 179

అహం చాపి మునేర్వాక్యాదగస్తేస్త్వద్గిరాపి చ ।
త్యక్త్వా కాశీమాగతోఽస్మి త్వల్లింగేఽస్మిన్ వసామ్యహమ్ ॥ 180

ప్రణమేత్సేతుబంధే యః పుమాన్ రామేశ్వరం శివమ్ ।
బ్రహ్మహత్యాదిపాపేభ్యో ముచ్యతే మదనుగ్రహాత్ ॥ 181

అవి 1. ఓంకార లింగము, 2. సోమనాథలింగము, 3. త్ర్యంబక లింగము, 4. మల్లికార్జున లింగము, 5. నాగేశలింగము, 6. వైద్యనాథ లింగము, 7. కాశీ విశ్వనాథ లింగము, 8. కేదారనాథ కేదారేశ్వర లింగము, 9. ఉజ్జైనీ మహాకాళ లింగము, 10. భీమేశ లింగము, 11. ఘుశ్మేశ లింగము, అను పదకొండు అర్చ్యావతార మూర్తులు ఉద్భవించినవి. పండ్రెండవదైన గంధమాదన మను పేరు గల లింగము మేరువుయొక్క ఈశాన్యదిగ్భాగమున యే మానవునికి కానరాక చిరకాలముగా ఉండినది. అప్పుడా మునులందరును లింగమునుండి శివస్వరూపము నెఱిగి, గిరిజాపతీ! నీకు మరలా లింగమగుగాక అని వరమునిచ్చిరి. పిమ్మట ప్రళయ వాయువుచే గంధమాదనమను ఆ పర్వత శిఖరము ఒకప్పుడిచట నేలపైబడెను. అదియే ఈ సముద్రసంగమమగు దక్షిణ సముద్ర తీరమున పండ్రెండవదియగు ఆ లింగము. ఈ సైకతలింగమునకు ఈశాన్యదిగ్భాగమున సమీపములో ఉన్నది. ఇదిగో చూడుము ఈ వరకు దీనినెవ్వరును ఎరుగరు. ఇపుడు మోక్షప్రదమగు దానిని కపుల తోడ నీవు చూచితివి. స్పృశించితివి. నీవిచ్చట లింగప్రతిష్ఠచేయుట చేత నీలింగము కూడా ఖ్యాతిగలదయ్యె. ఇదిగో నామాటవలన నీ గంధమాదనేశ్వరలింగములో ఎంత తేజస్సు గలదో అంత తేజస్సు నీ సైకతలింగమున కూడా ప్రవేశించినది. ఇది మొదలు జనులు, “పండ్రెండవది యగు జ్యోతిర్లింగము రామేశ్వర సైకతలింగము,” అని పూజించుచుందురు. పూజోత్సవాదు లన్నియును రామేశ్వర లింగమునకే జరుగునుగాక. శ్రీరామా! నీ మాటమీదను, అగస్త్యముని ప్రార్థనమీదను కాశీని విడిచి వచ్చితిని. ఈ లింగమున ఇచ్చట వసించెదను. నా అనుగ్రహమువలన ఈ రామేశ్వరలింగమునకు ఎవ్వడు నమస్కరించునో వాడు బ్రహ్మహత్యాది పాపములచే విముక్తుడగును.

త్వం వదాద్య రఘుశ్రేష్ఠం వరం యేన జనాః సదా ।
స్నానార్థమానయిష్యంతి మణికర్ణిజలం మమ ॥ 182

మమైతద్వచనం శ్రుత్వా ప్రసన్నో రఘునాయకః ।
జగాద స్నాత్వా సేతుబంధే రామేశం పరిపశ్యతి ॥ 183

సంకల్ప్య నియతో భూత్వా గృహీత్వా సేతువాలుకామ్ ।
కరండికాభిర్యత్నేన గత్వా వారాణసీం శుభామ్ ॥ 184

క్షిప్త్వా తాం వాలుకాం త్యక్త్వా వేణ్యాం వాలుకరండికామ్ ।
ఆనీయ గంగాసలిలం రామేశమభిషిచ్య చ ॥ 185

సముద్రే త్యక్తతద్భారో బ్రహ్మ ప్రాప్నోత్యసంశయమ్ ।
సంకల్పేన వినా గంగా రామేశం నాగమిష్యతి ॥ 186

ఆగతా చేత్తదా జ్ఞేయః సంకల్పః పూర్వజన్మని ।
కృతోఽస్తీత్యత్ర మద్వాక్యాన్నాత్ర కార్యా విచారణా ॥ 187

ఏవం నానావరాన్రామో యావల్లింగాయ సోఽబ్రవీత్ ।
తావత్తత్ర సమాయాతః కుంభజన్మా మునీశ్వరః ॥ 188

ననామ శంకరో రామం రామోఽపి ప్రణనామ తమ్ ।
తదా మునిః ప్రాహ రామం ప్రసాదాత్తవ రాఘవ ॥ 189

దర్శనం విశ్వనాథస్య జాతం మేఽద్యాత్ర వై చిరాత్ ।
అద్యాత్ర తుష్టిర్జాతా మే లింగమత్ర కరోమ్యహమ్ ॥ 190

ఇత్యుక్త్వా స్థాపయామాస స్వనామ్నా లింగముత్తమమ్ ।
రామేశ్వరాగ్నిదిగ్భాగే కుంభజన్మా ముదాన్వితః ॥ 191

పూజయామాస తల్లింగమగస్తీశ్వరనామకమ్ ।
నత్వా స్తుత్వా విశ్వనాథం రామం రామేశ్వరం తథా ॥ 192

దృష్ట్వా పురాతనం లింగం గంధమాదననామకమ్ ।
యయౌ స్వీయాశ్రమం తుష్టః కుంభజన్మా మునీశ్వరః ॥ 193

సేతౌ రామేశ్వరస్యైవ దేవి దేవాలయే శుభే ।
దిశ్యాగ్నేయ్యామగస్త్యేశమీశాన్యాం గంధమాదనమ్ ॥ 194

ఆ మణికర్ణికా తీర్థమును తీసికొని స్నానమునకై జనులు వచ్చునట్లు నీవు వరమిమ్ము. రామచంద్రా," అని చెప్పగా పార్వతీ! శ్రీరాముడపుడు సంతోషముతో, "ఈ సేతుబంధమున స్నానముచేసి, రామేశ్వరుని దర్శనముచేసి, నియమముతో సంకల్పించి, సేతువుయొక్క ఇసుకను భరణిలో ఉంచుకుని, వారణాశికిపోయి త్రివేణిలో ఆ ఇసుక భరణిని పడవేసి, గంగోదకము తెచ్చి, రామేశ్వరునికి అభిషేకించిన నరుడు తన భారమును సముద్రునకు అప్పగించినవాడై బ్రహ్మమును పొంది సుఖించును. సంశయములేదు. ఇట్లు సంకల్పములేక గంగ రామేశ్వరుని వద్దకు రాజాలదు. వచ్చెనా జన్మాంతర సంకల్పముండితీరును. ఇందులో కారణము అవిచారణీయము,'' ఇట్లు శ్రీరాముడు

పలువరములనిచ్చువేళకు (188) అగస్త్యముని, "రఘునాథా! నీ ప్రసాదమువలన చిరకాలముగా ప్రార్థించుచుండిన శ్రీ విశ్వనాథసందర్శనము ఇప్పటికి సంభవించినది. నాకు మిగుల సంతసమయినది, నేనూ ఒక శివలింగమును ప్రతిష్ఠించెదను," అని చెప్పి తన పేరుతో అగస్త్యముని ఒక లింగమును రామేశ్వర లింగమునకు ఆగ్నేయదిగ్భాగమున సంతోషపడుచూ సంస్థాపించెను. పిమ్మట ఆ లింగమును పూజించి, స్తుతించి అట్లే విశ్వనాథుని, రాముని, రామేశ్వరుని గూడా సంస్తుతించి, పురాతనమగు గంధమాదన లింగమును సందర్శించి, అగస్త్య మునీంద్రుడు తన ఆశ్రమమునకు వెడలెను.

**వర్తతేఽద్యాపి ద్వే లింగే కశ్చిజ్జానాతి వా న వా ।**
**ప్రసిద్ధోఽభూచ్చ రామేశః స్వర్గమృత్యురసాతలే ॥ 195**

**తతో రామాజ్ఞయా సేతుం నలః కర్తుం మనో దధే ।**
**కించిద్గర్వసమావిష్టస్తత్ జ్ఞాతం రాఘవేణ హి ॥ 196**

**యావదేకాం శిలాం త్యక్త్వా నలోఽన్యాం ప్రాక్షిపచ్ఛిలామ్ ।**
**తావత్తరంగకల్లోలైః సాగరస్య ఇతస్తతః ॥ 197**

**గచ్ఛంతి స్మ శిలాః సర్వాస్తా దృష్ట్వా ఖిన్నమానసః ।**
**గతగర్వస్తదా రామం నలో వృత్తం న్యవేదయత్ ॥ 198**

**రామః శ్రుత్వా నలం ప్రాహ రామేతి ద్వేఽక్షరే మమ ।**
**దృషదోః సంధిసిద్ధ్యర్థం పృథగ్విలిఖతాం ద్వయోః ॥ 199**

**సర్వత్రైవం లిఖిత్వా హి దృఢః సంధిర్భవిష్యతి ।**
**తథేతి రామవచనాత్తథా చక్రే నలస్తదా ॥ 200**

**కృతః పంచదినైః సేతుః శతయోజనముత్తమః ।**
**కృతాని ప్రథమేనాహ్నా యోజనాని చతుర్దశ ॥ 201**

**ద్వితీయేన తథా చాహ్నా యోజనానాం చ వింశతిః ।**
**తృతీయేన తథా చాహ్నా యోజనాన్యేకవింశతిః ॥ 202**

**చతుర్థేన తథా చాహ్నా ద్వావింశతిరితి శ్రుతమ్ ।**
**పంచమేన త్రయోవింశద్యోజనానాం శతం త్వితి ॥ 203**

**విస్తృతో ద్వాదశ ప్రోక్తో యోజనాని దృషన్మయః ।**
**ఏవం బబంధ సేతుం స నలో వానరసత్తమః ॥ 204**

**యే మజ్జంతి నిమజ్జయంతి చ పరాన్ తే ప్రస్తరా దుస్తరే**
**వార్ధౌ యేన తరంతి వానరభయన్ సంతారయంతేఽపి చ ।**

**నైతే గ్రావగుణా న వారిధిగుణా నో వానరాణాం గుణాః**
**శ్రీమద్దాశరథేః ప్రతాపమహిమా సోఽయం సముజ్జృంభతే ॥ 205**

**తేనైవ జగ్ముః కపయో యోజనానాం శతం ద్రుతమ్ ।**
**ఆరుహ్య మారుతిం రామో లక్ష్మణోఽప్యంగదం తథా ॥ 206**

**జగామ వాయువల్లంకా సన్నిధిం సేనయా వృతః ।**
**అసంఖ్యాతాః సువేలాద్రిం రురుహుః ప్రవగోత్తమాః ॥ 207**

## శివ, రామ, అగస్త్య సమావేశమున రామేశ్వర మహిమ.

అగస్త్యుడును అచ్చటికి వచ్చి శంకరునికి నమస్కరించి, రామునిచే నమస్కరింపబడి, రామునితో, "సేతువుయందు రామేశ్వరునికి ఒక్కనికే దివ్య దేవాలయము ఒకటి గలదు. ఆగ్నేయదిక్కులో అగస్త్యలింగము, ఈశాన్య దిక్కులో గంధమాదనలింగము ఇప్పటికిని గలదు. వాటిని , తెలుసుకున్నవాడు ఉన్నాడో లేదో కానీ..ముల్లోకములలోను రామేశుడు సుప్రసిద్ధుడు గా ఉన్నాడు. (195)

## రామనామ మహిమచే నలుడు సేతువును నిర్మించుట.

రామాజ్ఞనొంది, నలుడు సేతు నిర్మాణమునకు ఆరంభించి, కొంచెము గర్వము గలవాడయ్యెను. ఆ సంగతిని రాముడు తెలిసికొనెను. నలుడు సముద్రమున ఒక రాయిని విడిచి, మరియొకటి నెక్కి విడుచునప్పటికి, మొదటిరాయి అలలరాపిడిచే అటు నిటుపోయి రాయికి రాయికి చేరి నిలువక పోసాగెను. అందుచే నలునికి గర్వభంగమైనది. అంత ఆ నలుడు శ్రీరామునికి ఆ సంగతిని విన్నవించెను. రఘువరుడు, "కపీ! నా యొక్క 'రామ' యను రెండక్షరములను రాళ్ళనతికించుటకై రెండు రాళ్ళలోను వేర్వేరుగా వ్రాయుము అనెను.

**తతః సైన్యయుతో రామః సువేలాద్రిం యయౌ ముదా ।**
**దిదృక్షూ రాఘవో లంకామారురోహాచలం శుభమ్ ॥ 208**

సువేలాద్రిం మహారమ్యం తరువల్లివిరాజితమ్ ।
దదర్శ లంకాం విస్తీర్ణాం రామశ్చిత్రధ్వజాకులామ్ ॥ 209

చిత్రప్రాసాదసంబాధాం స్వర్ణప్రాకారతోరణామ్ ।
పరిఖాభిః శతఘ్నీభిః సంక్రమైశ్చ విరాజితామ్ ॥ 210

ప్రాసాదోపరి విస్తీర్ణప్రదేశే దశకంధరమ్ ।
పశ్యంతం కపిసైన్యం తం సందదర్శ రఘూద్వహః ॥ 211

తతో రామేణ ముక్తః స శుకో గత్వా దశాననమ్ ।
కపిసైన్యం దర్శయంస్తం బోధయామాస రావణమ్ ॥ 212

సీతాం ప్రయచ్ఛ రామాయ లంకారాజ్యే విభీషణమ్ ।
కృత్వా తం శరణం యాహి నో చేద్రామాన్న మోక్ష్యసే ॥ 213

తచ్ఛ్రుత్వా రావణః క్రోధాచ్ఛుకం ధిక్కృత్య వై ముహుః ।
దూతైర్గేహాద్విహిః కృత్వా రామసేనాం వ్యలోకయత్ ॥ 214

శుకోఽపి బ్రాహ్మణః పూర్వం వరిష్ఠో బ్రహ్మవిత్తమః ।
అయజత్ క్రతుభిర్దేవాన్ విరోధో రాక్షసైరభూత్ ॥ 215

వజ్రదంష్ట్ర ఇతి ఖ్యాతస్తదైకో రాక్షసో మహాన్ ।
మాంసాన్నం యాచితం దృష్ట్వా మునినా కుంభజన్మనా ॥ 216

శుకభార్యావపుర్ధృత్వా నరమాంసం సమర్పయత్ ।
తదా శప్తః శుకస్తేన త్వం రక్షో భవ మాచిరమ్ ॥ 217

రక్షః కృతం పునర్ధ్యానాత్ జ్ఞాత్వా తత్ప్రార్థితోఽబ్రవీత్ ।
రామస్య దర్శనం కృత్వా బోధయిత్వా దశాననమ్ ॥ 218

ప్రతి రాతిపై 'రామ' నామము వ్రాసితివా అవి బలముగ అంటుకొనును," అని అనుగ్రహించెను. నలుడు అట్లేయని సేతువును కట్టసాగెను. మొదటి దినమున 14 ఆమడలదూరము, రెండవనాడు 20 ఆమడల దూరము, మూడవనాడు 21 ఆమడలదూరము, నాలుగవనాడు 22 ఆమడల దూరము, ఐదవ నాడు 23 ఆమడల దూరము, ఇట్లు ఐదు దినములలో 100 ఆమడల పొడవు, 12 ఆమడల వెడల్పుగల సేతువు నిర్మింపబడెను. వానరశ్రేష్ఠుడగు నలుడు ఇట్లు సేతువును కట్టెను. దుస్తరమగు

సాగరమున నీటిపై తేలుచు, పరులను తేలించుచుండుటకును, వానరులు దాటుటకు, దాటించుటకును బండరాళ్ళ మహిమగాని, సముద్రము మహిమగాని, వానర మహిమగాని కారణము కాదు. అది అంతయును శ్రీరాముని దివ్యప్రతాప మహిమ. అయ్యది విజృంభించి యున్నది (205)

## శ్రీరాముడు వానరులతో లంకకు చేరుట

పిమ్మట శ్రీరాముడు ఆంజనేయుని, లక్ష్మణుడు అంగదుని ఎక్కగా, ఆ కపిసేన అంతయును ఆ సేతువుమీదుగా వాయువేగమున పోయి లంక ఒడ్డుకు చేరెను. అసంఖ్యాకులగు కపివీరులు సువేలాద్రిమీద ఎక్కిరి. అంత ఆ రాఘవుడు సేనలతోడ సువేలాద్రిని ఎక్కి సంతోషముతో లంకను చూచెను. శ్రీరాముడు ఎంతో రమ్యమైన లతావృక్ష సమూహముచే విలాసాస్పదమగు సువేలాద్రిని, చిత్రధ్వజములతోను, విచిత్ర ప్రాకారములతోను, బంగారు గోడలతోను. అడ్డుగోడలతోను, శతఘ్న్యాది ఆయుధములతోను విలసిల్లు లంకను, విస్తారమైన మేడమీద నెక్కి కపిసేనలను వీక్షించుచుండు దశకంధరుని చూచి, శుకనాసుని విడిపించెను. ఆ శుకుడు పోయి కపిసైన్యములను చూపించుచు రావణునితో, "సీతను రామునికి సమర్పించి, విభీషణునికి లంకారాజ్యపట్టముగట్టి, శ్రీరామపాదమును శరణమని నమ్ముము, లేదా నీవు రామునిచే విడువబడవు," అని తెలివినుపదేశించెను. అది విని రావణుడు కోపముతో పలుమార్లు శుకుని ధిక్కరించి, దూతలచే వానిని వెలుపలకు నెట్టించెను.

శుకుడు అనువాడు మునుపు ఒక బ్రాహ్మణుడు. బ్రహ్మవేత్తగు వశిష్ఠుడు యజ్ఞముచే దేవసంతుష్టి గలిగించెను. రాక్షసులతో విరోధము కలిగినది. అపుడు వజ్రదంష్ట్రుడను గొప్ప రాక్షసుడు ఒకడు మాంసాన్నమును యాచించిన అగస్త్యమునికి శుకునియొక్క భార్య రూపమునొంది నరమాంసమును సమర్పించెను. అపుడు అగస్త్యుడు, "నీవు రాక్షసుడవగుమని," శపించెను. పిదప వజ్రదంష్ట్రుని మోసమని గ్రహించి, శుకుని ప్రార్థనను అంగీకరించిన అగస్త్యుడు, శుకునితో "శ్రీరాముని దర్శనముచేసి, రావణునికి తెలివిని చెప్పిన పిదప నీవు నీ బ్రాహ్మణ రూపమును పొందుదువ" ని శాపమోచనమును ఇచ్చెను. గనుక శుకుడు విప్రుడు. (218)

**త్వం ప్రాప్స్యసి నిజం రూపం తస్మాజ్జాతః శుకో ద్విజః ।**
**సువేలశిఖరే సంస్థః సంమంత్ర్య కపిభిస్తతః ॥ 219**

**సూచనార్థం రిపుం రామోఽఙ్గదం లంకామచోదయత్ ।**
**సోఽపి రామాజ్ఞయా గత్వా నానానీత్యుత్తరైస్తదా ॥ 220**

**రావణం బోధయామాస సభాయాం లాంగూలాసనే ।**
**సంస్థితోఽభీతవద్వాలితనయః స్వస్థమానసః ॥ 221**

శ్రుణు రావణ మద్వాక్యం హితం తే ప్రవదామ్యహమ్ ।
సీతాం సత్కృత్య సధనాం ప్రయచ్ఛ రాఘవం జవాత్ ॥ 222

రామం నారాయణం విద్ధి విద్వేషం త్యజ రాఘవే ।
యత్పాదపోతమాశ్రిత్య జ్ఞానినో భవసాగరమ్ ॥ 223

తరంతి భక్తిపూతాస్తే హ్యతో రామో న మానుషః ।
మద్వాక్యం కురు రాజేంద్ర కులకౌశలహేతవే ॥ 224

ఏవం నానావిధైర్వాక్యైరంగదేనాతిబోధితః ।
సోఽథ నీత్యుత్తరాణ్యస్య నాశృణోద్వానరస్య చ ॥ 225

ఉవాచ క్రోధసంయుక్తో వానరం స దశాననః ।
భీషయసేఽద్య కిం మాం త్వం రావణం లోకరావణమ్ ॥ 226

యేన సర్వే జితా దేవాః కైలాసః కంపితో మయా ।
తస్య మేఽగ్రే మర్కట త్వం కత్థసే కిం ముధాద్య హి ॥ 227

క్షణేన రాఘవౌ హత్వా హత్వా సుగ్రీవమారుతీ ।
హత్వా విభీషణం త్వాం చ వానరాన్ భక్షయామ్యహమ్ ॥ 228

రావణస్య వచశ్చేత్థం శ్రుత్వా ప్రాహాంగదశ్చ తమ్ ।
జానామ్యహం పౌరుషం తే బలిపాశవిచూర్ణిత ॥ 229

శివపాదాంగుష్ఠ భారనమ్రకైలాసపీడితః ।
సహస్రార్జునవీరాత్మ సంభవక్రీడనమృగ ॥ 230

శ్వేతద్వీపస్థప్రమదాకరతాడితసన్ముఖ ।
విష్ణుపుత్రోఽథ వై బ్రహ్మా మరీచిస్తత్సుతః స్మృతః ॥ 231

తత్సుతః కశ్యపస్తస్య పుత్రోఽభూదింద్రనామకః ।
తేనైవ యుద్ధకాలే తు బద్ధ్వా కారాగృహస్థిత ॥ 232

పర్యంకోపరి సంబద్ధమన్మాతృక్షాలితానన ।
ఇతి తద్వాక్యశరాఘాతతర్జితః స దశాననః ॥ 233

దూతానాజ్ఞాపయామాస తాడనీయో ముఖే త్వయమ్ ।
తథేత్యుక్త్వా రాక్షసాస్తే శస్త్రహస్తాః సహస్రశః ॥ 234

## రావణునికి అంగదుడు బుద్ధిచెప్పుట.

సువేలాద్రిలోనున్న రాముడు కపులతో ఆలోచించి శత్రువు వద్దకు దూతగా అంగదుని పంపెను. వాడును రామాజ్ఞనొంది, లంకకు వెడలి, రావణుని సభలో ప్రవేశించి, స్థిరబుద్ధితో, నిర్భయముగా తన తోకనే పీఠముగా జేసుకుని, "రావణుడా! నీకు హితము చెప్పెదను వినుము. త్వరగా సీతను సత్కరించి, ధనముతో రామునికి సమర్పింపుము. రాముని నారాయణునిగా ఎరుగుము. రాఘవునితో ద్వేషము వదలుము. జ్ఞానులు ఎవని పాదపద్మములను పడవగా జేసుకుని సంసార సముద్రమును తరించుచుందురో అట్టి ఆ రాముడు మానవుడు కాదు. నా మాటవిని వంశమును ఉద్ధరించుకొనుము," అని వివిధరీతులుగా పలువిధములుగా, ఆ రావణునికి హితోపదేశము జేసెను. ఆ దశకంఠుడు అంగదుని వాక్యములను వినకయే మిక్కిలి కోపముతో, "ఓరి వానరా! ఏమి నన్నే భయపెట్టెదవా? ఎవనిచే దేవతలందరును జయింపబడిరో లోకదారుణుడగు రావణుడను నేను. కైలాసాద్రిని పెకలించి విడిచితిని. ఇప్పుడేమో వ్యర్థముగా నీవు నా ఎదుటనే మొఱగుచున్నావు. క్షణమున రామలక్ష్మణులను చంపి, ఆంజనేయ సుగ్రీవులను అణచి, విభీషణుని నిన్ను సంహరించి, కపులను భక్షించెదను." అని ఆర్భాటించెను. ఇట్టి రావణవీరాలాపమును వినిన, అంగదుడు, "ఓరీ! నీ మహాపౌరుషమును నేనెరుగుదును. బలియొక్క పాశములచే ముక్తులైనవాడవు నీవే కదా? శివుని కాలి బొటనవ్రేలి భారమును ఓర్వలేక నేలగ్రుంగి కిచకిచలాడినవాడవు కదా? నీవు కార్తవీర్యార్జుని వేయిమంది బిడ్డలచేతిలో క్రీడామృగమైన సంగతిని మరచితివా? శ్వేతదీపమునందలి మందయానలు మూతిమీద కొట్టినదానిని స్మరింపుము. విష్ణుపుత్రుడగు బ్రహ్మయొక్క కొడుకగు మరీచిపుత్రుడైన కశ్యపుని తనయుడు అద్రియనువాడు యుద్ధమున నిన్నుపట్టి చెరసాలలో ఉంచలేదా? ఇంతయేల, మంచముమీద కట్టబడి నా మూత్రముచే నీ మోము కడుగబడలేదా?" అని ఇట్లు అంగదుని వాగ్బాణములచే కొట్టబడిన రావణాసురుడు దూతలను పిలిచి, వీనిని మూతిమీద గొట్టి పంపుడని ఆజ్ఞాపించెను.

అంగదం దుద్రువుః శీఘ్రం తాన్ దృష్ట్వా వానరోత్తమః ।
మర్దయామాస పుచ్ఛేన తాన్సర్వాన్ క్షణమాత్రతః ॥ 235

రావణాస్యేషు సంతాడ్య స్వకరాభ్యాం ముహుర్ముహుః ।
తద్ధస్తపాదౌ పుచ్ఛేన పూర్వం బంధ్వ సవిస్తరమ్ ॥ 236

తతశ్చోడ్డీయ వేగేన యయౌ ప్రాసాదమస్తకః ।

సువేలాద్రౌ రాఘవేంద్రం తారేయః స విహాయసా ॥ **237**

అంగదం రాఘవో దృష్ట్వా ప్రాసాదన్వితమస్తకమ్ ।
ఉవాచ కిం కృతం బాల ప్రాసాదోఽయం త్వయా కథమ్ ॥ **238**

సమానీతోఽత్రలంకాయాం మిత్రాయేయం పురీ మయా ।
అర్పితాఽస్తి తతో మిత్రవస్త్విదం న స్పృశామ్యహమ్ ॥ **239**

తద్రాఘవవచః శ్రుత్వా చకితః స తదాంగదః ।
ప్రాసాదం మస్తకే దృష్ట్వోర్ధ్వాక్షిభ్యామాహ రాఘవమ్ ॥ **240**

న జ్ఞాతోఽయం మయా రామ ప్రాసాదో మస్తకేన మే ।
ఉత్పాటితశ్చ లంకాయాః సమానీతస్తవాంతికమ్ ॥ **241**

పునర్నీత్వాఽద్య లంకాయామేనం సంస్థాపయామ్యహమ్ ।
ఇత్యుక్త్వా పరివృత్యాథ రాఘవస్యాజ్ఞయాంగదః ॥ **242**

ప్రాసాదం పూర్వవత్స్థాప్య లంకాయాం స యయౌ పునః ।
సువేలాద్రౌ రాఘవేంద్రం నత్వా వృత్తం న్యవేదయత్ ॥ **243**

యద్యత్కృతం తు లంకాయాం సంవాదం రావణస్య చ ।
రామోఽపి శ్రుత్వా తత్సర్వం స్మిత్వా తం పరిషస్వజే ॥ **244**

రావణుని భటులు అట్లే అని ఆయుధములతో అంగదునిమీదికివచ్చిరి. అంగదుడు వారినందరిని తోకతో చావమోదెను. అంగదుడు తనచేతులతో రావణుని చెంపలు వాయించి, పలుమార్లు వాని చేతులు కాళ్ళను తన తోకతో బిగదీసి కట్టి, పిమ్మట తలమీద మొట్టి, ఆ భవనమును మోసుకుని, సువేలాద్రిలో నున్న రామసన్నిధికి గగనమున వచ్చెను. శ్రీరాముడు అంగదుని జూచి, "అంగదా! ఈ ప్రాసాదమును లంకనుండి ఎట్లు తెచ్చితివి? ఈ పట్టణమును మిత్రునకిచ్చితిని. కావున మిత్రునివస్తువగు దీనినంటను," అని చెప్పెను. ఆమాట వినిన అంగదుడు ఆశ్చర్యముతో, పైచూపులతో తలమీద ఉన్న ప్రాసాదమును చూచి, రామునితో "స్వామీ! నా తలమీదనున్న ప్రాసాదము నాకు తెలియదు. లంకనుండి పెకలించుటను నేనెఱుగను. నీ వద్దకు తెచ్చుటను కానను. ఇదివింత! మరల దీనిని తీసికొనిపోయి లంకలోపెట్టెదను," అని చెప్పి శ్రీ రామాజ్ఞనొంది, బయలుదేరి లంకలో ఆ ప్రాసాదమును

మునుపున్నట్లు సంస్థాపించి, మరల వచ్చి సువేలాద్రిలో శ్రీరామునికి నమస్కరించి, లంకలో చేసిన పనులను, రావణునితో మాటలాడిన దానిని విన్నవించెను. (244)

అథ శ్రీరామచంద్రోऽపి సువేలాద్రౌ స్థితస్తదా ।
లీలయా చాపమాదాయ ముమోచ శరముత్తమమ్ ॥ 245

తేన చ్ఛత్రసహస్రాణి కిరీటదశకం తథా ।
లంకాయాం రాక్షసేంద్రస్య ప్రాసాదో సంస్థితస్య చ ॥ 246

చిచ్ఛేద నిమిషార్ధేన కపీనాం పశ్యతాం ప్రభుః ।
ఏతస్మిన్నంతరే తత్ర రామాగ్రే సంస్థితో మహాన్ ॥ 247

న దత్తాం జానకీం శ్రుత్వా రావణేనాంగదస్యతః ।
క్రోధేన మహతావిష్ట స్సుగ్రీవః ప్లవగాగ్రణీః ॥ 248

యయావుడ్డీయ లంకాయాం దశాస్యం రాక్షసైర్యుతమ్ ।
ప్రాసాదసంస్థితం ఛత్రహీనం ప్రవ్యగ్రమానసమ్ ॥ 249

సుగ్రీవో రావణం గత్వా జఘాన దృఢముష్టినా ।
పాతయామాస భూమ్యాం తం వరసింహాసనాత్తదా ॥ 250

చక్రతుస్తౌ బాహుయుద్ధం తుములం రోమహర్షణమ్ ।
ఊర్ధ్వంఘ్రికరహృద్ధస్తైః కపీశరాక్షసేశ్వరౌ ॥ 251

తదాసీజ్జర్జరాంగః స రావణః కపిఘాతతః ।
దుద్రువే బాహుయుద్ధం తత్త్యక్త్వా గేహ విలజ్జితః ॥ 252

తదాऽऽచ్ఛిద్య తన్మకుటం యయౌ రామం కపీశ్వరః ।
ననామ రాఘవం భక్త్యా వృత్తం సర్వం న్యవేదయత్ ॥ 253

తం సమాలింగ్య రామోऽపి సుగ్రీవం ప్రాహ సాదరమ్ ।
మామపృష్ట్వా కథం బంధో గతస్తూష్ణీం దశాననమ్ ॥ 254

త్వజ్జీవితం విపన్నం చేత్తర్హి కిం సీతయా మమ ।
భవిష్యతి న సౌఖ్యం హి మేదృష్టం సాహసం కురు ॥ 255

## సుగ్రీవుడు రావణుని కిరీటమును అపహరించుట

అటు తరువాత సువేలాద్రిలో ఉన్న శ్రీరామచంద్రుడు వినోదముగా ధనస్సును అందుకుని, ఉత్తమ బాణమును ప్రయోగించెను. దానితో లంకలో ఉన్న రావణుని నూరు ఛత్రములు, పది కిరీటములు, కపులు చూచుచుండగా అరక్షణములో కత్తిరించబడెను. శ్రీరాముడు అంగదునితో, "రావణుడు సీతాదేవిని తెచ్చి ఇంకా అప్పగించలేదు." అనగా, అది వినుటతోడనే కోపముతో ఊగిపోయిన సుగ్రీవుడు వెంటనే ఆకాశమున లంఘించి, లంకకు చేరుకుని, లంకలో మేడపై రాక్షసులతో, ఛత్రహీనుడై చింతించుచున్న రావణుని గుండెపై ఒక పిడిగుద్దు గుద్ది, వానిని సింహాసనమునుండి క్రిందికి తోసెను. సుగ్రీవుడు–రావణాసురుడు ఇద్దరూ బాహుయుద్ధమునకు దిగిరి. ఇరువురు భయంకరముగా పోరాడిరి. సుగ్రీవుని దెబ్బలకు ఓర్వలేని రావణుడు బాహు యుద్ధమును వదలి సిగ్గుతో ఇంటికి పరుగెత్తెను. అపుడు సుగ్రీవుడు రావణుని కొట్టి కిరీటమును తీసికొని శ్రీరామునివద్దకు వచ్చి, నమస్కరించి, సర్వవృత్తాంతమును విన్నవించెను. శ్రీరాముడు సుగ్రీవుని గట్టిగా తన హృదయమునకు హత్తుకుని, "సుగ్రీవా! నాకు చెప్పకుండా నీవు లంకకు పోయి రావణునితో యుద్ధము చేసితివా? అచ్చట నీకేమైనా జరిగియుంటే నాకు ఎంత బాధ కలిగి యుండును. అపుడు సీత లభించినా నాకు ఆనందము కలిగియుండదు. ఇటువంటి సాహసము మరియొకసారి చేయకు," అని మందలించెను. (255)

**తతో భేరీమృదంగాద్యైర్వాద్యైస్తే వానరోత్తమాః ।**
**లంకాం సంవేష్టయామాసుశ్చతుర్ద్వారేషు సంస్థితా ॥ 256**

**తదా తం ముకుటం రామోఽంగదాయ రావణస్య చ ।**
**దదౌ తుష్టో దశేశాయ లంకాం రోద్ధుం ప్రచోదయత్ ॥ 257**

**అంగదం దక్షిణద్వారం వాయుపుత్రం తు పశ్చిమమ్ ।**
**నలం సైన్యేన ప్రాగ్ద్వారం సుషేణం ద్వారమౌత్తరమ్ ॥ 258**

**యయుస్తే రాఘవం నత్వా లంకాం స్వస్వబలైర్యుతాః ।**
**తాం లంకాం రురుధుః సర్వే చతుర్ద్వారేషు వానరాః ॥ 259**

**దశాస్యోఽపి గృహం గత్వా సుగ్రీవజర్జరీకృతః ।**
**తస్థౌ తూష్ణీం స రహసి స్మరన్ సుగ్రీవపౌరుషమ్ ॥ 260**

మాలీ సుమాలీ చ తథా మాల్యవాన్బాంధవాస్త్రయః ।
మాతామహా రావణస్య తే సమంత్ర్య పరస్పరమ్ ॥ 261

దశాననం బోధయితుం తేభ్యస్త్వేకో యయౌ జవాత్ ।
మాల్యవానితి నామ్నా యో బుద్ధిమాన్ స్నేహసంయుతః ॥ 262

ప్రాహ తం రాక్షసం వీరం ప్రశాంతేనాంతరాత్మనా ।
శృణు రాజన్ వచో మేద్య శ్రుత్వా కురు యథేప్సితమ్ ॥ 263

యదా ప్రవిష్టా నగరీం జానకీ రామవల్లభా ।
తదాది పుర్యాం దృశ్యంతే నిమిత్తాని దశానన ॥ 264

ఘోరాణి నాశహేతూని తాని మే వదతః శ్రుణు ।
ఖరాః స్తనితనిర్ఘోషా మేఘాః ప్రతిభయంకరాః ॥ 265

శోణితాన్యభివర్షంతి లంకాముష్ణేన సర్వదా ।
సీదంతి దేవలింగాని ఖిద్యంతి ప్రచలంతి చ ॥ 266

కాలికా పాండురైర్దంతైః ప్రహసంతేఽగ్రతః స్థితాః ।
ఖరా గోషు ప్రజాయంతే మూషకా నకులైః సహ ॥ 267

## మాల్యవంతుడు రావణునికి బుద్ధిచెప్పుట.

అంత వానరవీరులు భేరీ మృదంగాది వాద్యములతో లంకకున్న నాలుగుద్వారములను ముట్టడించ నిశ్చయించిరి. అపుడు శ్రీరాముడు రావణుని ఆ కిరీటమును సేనాపతియైన అంగదునకు ఇచ్చి, అంగదుని దక్షిణ ద్వారమునను, ఆంజనేయుని పడమటి ద్వారమునను, నలుని తూర్పుద్వారము నను, సుషేణుని ఉత్తరద్వారమునను తమతమ సైన్యములతోడ నిలిచి, యుద్ధముచేయునట్లు అనుజ్ఞ ఇచ్చెను. వారును అట్లేఅని శ్రీరామునికి నమస్కరించి, స్వసైన్యములతోడ లంకాద్వారములను ముట్టడించిరి. అచ్చట సుగ్రీవునిచే మెలకువనందిన రావణుడు ఊరక అంతఃపురములో వాని పౌరుషమును స్మరించుచుండెను. రావణుని తాతలైన మాలి, సుమాలి, మాల్యవంతుడు అను ముగ్వురు అన్నదమ్ములు, తామంతా ఆలోచించి రావణునికి మంచి చెప్పుటకై వారిలో ఒకడగు బుద్ధిమంతుడైన మాల్యవంతుడు అనువాడు సాదరముగా వచ్చి, మిక్కిలి అణకువగలిగి, వీరుడగు రావణునితో, "రాజా! ఇప్పుడు నామాటవినుము. వినినపిదప నీయిష్టమొచ్చినట్లు చేయుము. శ్రీరామప్రేయసి

యగు సీత ఎప్పుడు ఈ లంకను ప్రవేశించెనో అదిమొదలు లంకలో ఉత్పాతములు కనబడుచున్నవి. నాశహేతువులును, భయంకరములు అగువాటిని చెప్పెదను వినుము. గాడిదలు మేఘములవలె గర్జించుచున్నవి. మిక్కిలి భయంకరములుగా మేఘములు వేడిరక్తమును కురిపించి లంకను ముంచుచున్నవి. ఆలయములలోని దేవతా మూర్తులు భిన్నములగుచున్నవి. ఏడ్చుచున్నవి. మరి చలించుచున్నవి. కాళికాదేవి ఎదుట నిలిచి తెల్లనికోరలజూపి అట్టహాసముచేయుచున్నది. ఆవులు, గాడిదెలనీనుచున్నవి. ఎలుకలు ముంగిసలతోడ, పిల్లులతోడ పోట్లాడుచున్నవి.

**మార్జారేణ తు యుధ్యంతే పన్నగా గరుడేన చ ।**
**కరాళో వికటో ముండః పురుషః కృష్ణపింగలః ॥ 268**

**కాలో గృహాణి సర్వేషాం కాలే కాలే త్వవేక్షతే ।**
**ఏతానన్యాని దృష్టాని నిమిత్తాన్యుద్భవంతి చ ॥ 269**

**అతః కులస్య రక్షార్థం శాంతిం కురు దశానన ।**
**సీతాం సత్కృత్య సధనాం రామాయాశు ప్రయచ్ఛ భోః ॥ 270**

**మాతామహవచశ్చేత్థం శ్రుత్వా తం రావణోఽబ్రవీత్ ।**
**రామేణ ప్రేషితో నూనం భాషసే త్వమనర్గళమ్ ॥ 271**

**గచ్ఛ వృద్ధోఽసి బంధుస్త్వం సోఢం సర్వం త్వయోదితమ్ ।**
**ఇతో వా కర్ణపదవీం దహత్యేతద్వచస్తవ ॥ 272**

**ఇత్యుక్తః స రావణేన మాల్యవాన్స్వ గృహం యయౌ ।**
**రావణోపి సభాం గత్వా చోదయామాస రాక్షసాన్ ॥ 273**

**పూర్వద్వారం తు ధూమ్రాక్షం వజ్రదంష్ట్రం తు పశ్చిమమ్ ।**
**నరాంతకం దక్షిణం తముత్తరం చ మహోదరమ్ ॥ 274**

**ప్రేషయామాస సైన్యేన వస్త్రాద్యైస్తోషితాన్ జవాత్ ।**
**చత్వారస్తేఽపి నత్వా తం రావణం సంగరం యయుః ॥ 275**

**ఏవం రామరావణయోః సైన్యాని చ పరస్పరమ్ ।**
**యయుస్తాని సమ్ముఖాని సంగరార్థం మహాస్వనైః ॥ 276**

**ఇతి శ్రీశతకోటిరామచరితాంతర్గతే శ్రీమదానందరామాయణే, వాల్మీకీయే, ఆదికావ్యే, సారకాండే, యుద్ధచరితే, రామ రావణ సేనాసంయోగో నామ, దశమః సర్గః ॥**

సర్పములు గరుడునితో పోరుచున్నవి. నల్లని తేనె రంగువంటి దారుణుడును, భయంకరుడును అగు కాలుడు ఇంటింట అప్పుడప్పుడు తొంగి చూచుచున్నాడు. ఇట్లే ఇంకా కొన్ని ఇతర ఉత్పాతములు కనబడుచున్నవి. అందువల్ల కులరక్షణకై శాంతిజేయుము. సీతను సత్కరించి ధనములతో శ్రీరామునికి త్వరగా సమర్పింపుము," అని చెప్పెను. అట్టి తాతగారిమాటవినిన రావణుడు, "నిజముగా రామునిచేత పంపబడి నీవిట్లు తడబాటులేక మాటలాడుచున్నావు. పొమ్ము, నీవు చాలాముసలివాడవైతివి. మరి బంధువని నీమాటలను సంహిచెదను. నీమాటలు ఇచ్చుట చెవిని దూరి నన్ను కాల్చుచున్నవి," అని చెప్పగా విని మాల్యవంతుడు తన ఇంటికి పోయెను. రావణుడు సభకువచ్చి, రాక్షసులతో, తూర్పు ద్వారమున ధూమ్రాక్షుడిని, పడమట వజ్రదంష్ట్రుడిని, దక్షిణమున నరాంతకుడిని, ఉత్తరమున మహోదరుడిని నిలబడి యుద్ధముచేయవలసినది, అని ఆజ్ఞాపించి, వారివారి సైన్యములతోడ అందరిని వస్త్రాదులచే సత్కరించి యుద్ధమునకు పంపెను. ఆ నలుగురును ఆ రావణునికి నమస్కరించి రణమునకు బయలుదేరిరి. ఇట్లు రామ-రావణుల యొక్క సైనికులు అన్యోన్యముగా మహానాదములతో యుద్ధోన్ముఖులై తలపడిరి. (276)

***శతకోటిప్రవిస్తరమైన రామకథలో, శ్రీమద్వాల్మీకిమహర్షిచే రచింపబడిన, ఆనందరామాయణంలోని, యుద్ధచరితంలో, రామ-రావణసంగ్రామమను పేరుగల పదవ సర్గ ముగిసినది.***



# ఏకాదశః సర్గః-11వ సర్గ

## రావణవధ

శ్రీశివ ఉవాచ

అథ తే రాక్షసాః సర్వే ద్వారేభ్యః క్రోధమూర్ఛితాః ।
నిర్గత్య భిండిపాలైశ్చ ఖడ్గైః శూలైః పరశ్వథైః ॥ 1

కుంతైః శరైః తఘ్నీభిః సంక్రమైః శక్తిభిర్దృఢమ్ ।
నిర్జఘ్నుర్వానరానీకం మహాకాయా మహాబలాః ॥ 2

రాక్షసాంశ్చ తథా జఘ్నుర్వానరా జితకాశినః ।
వృక్షైర్గ్రావైః పర్వతైశ్చ ముష్టిభిః కరతాడనైః ॥ 3

తే హయైశ్చ గజైశ్చైవ రథైః కాంచనసన్నిభైః ।
రక్షోవ్యాఘ్రా యుయుధిరే నాదయంతో దిశో దశ ॥ 4

ఏవం పరస్పరం చక్రుర్యుద్ధం వానరరాక్షసాః ।
నలో జఘాన ధూమ్రాక్షం వజ్రదంష్ట్రం స మారుతిః ॥ 5

నరాంతకం స తారేయః సుషేణస్తం మహోదరమ్ ।
చరుర్థాంశావశేషేణ నిహతం రాక్షసం బలమ్ ॥ 6

తదాంగదాద్యాశ్చత్వారో మహావాద్యమహోత్సవః ।
ప్రణేమూ రామమాగత్య జయఘోషప్రపూరితాః ॥ 7

స్వసైన్యం నిహతం దృష్ట్వా మేఘనాదో యయౌ తదా ।
సర్వాస్త్రాద్వ్యాకులం రామం చకార బంధువానరైః ॥ 8

రామః సస్మార తార్క్ష్యం స తార్క్ష్యః సార్పం న్యవారయత్ ।
తతః స్వస్థో బ్రహ్మావరాదంతర్ధానం గతోఽసురః ॥ 9

సర్వాస్త్రైకుశలీ వ్యోమ్ని బ్రహ్మాస్త్రేణ సమంతతః ।
వవర్ష శరజాలాని బ్రహ్మాస్త్రె మానయంస్తదా ॥ 10

క్షణం తూష్ణీమువాసాథ రామః స బంధువానరైః ।
తతః స్వస్థో రఘుశ్రేష్ఠో దదర్శ పతితం బలమ్ ॥ 11

మూర్ఛాగతం బ్రహ్మపాశైస్తదా లక్ష్మణమబ్రవీత్ ।
చాపమానయ సౌమిత్రే బ్రహ్మాస్త్రేణాసురాన్ క్షణాత్ ॥ 12

భస్మీకరోమి తచ్ఛ్రుత్వా లంకామింద్రజయో యయౌ ।
విలపంతౌ స్వసాన్నిధ్యే యత్ర వాయుజరాక్షసౌ ॥ 13

## రాక్షసులు, వానరుల ఘోరయుద్ధము.

వినుము పార్వతీ! పిమ్మట మహాబలులును, మహాకాయులును అగు రాక్షసులందరూ మహా క్రోధాక్రాంతులై యథా నియమముగా ద్వారములకడకు వెడలి నిలిచి– గద, కత్తి, పదునైన గండ్రగొడ్డలి, అమ్ము, ఈటె, ఇనుపముండ్లకఱ్ఱ, చిల్లకోల మొదలైన– దుర్గమాయుధములచేత వానరసైన్యములను చంపుచువచ్చిరి. వానరవీరులు యుద్ధమునందు రాక్షసులను– చెట్లు, రాళ్ళు, కొండలు, పిడికిళ్ళ చేతిపెట్లు– వీనిచే రాక్షసులను చంపుచుండిరి. ఆ దైత్యవీరులు గుఱ్ఱములు, ఏనుగులు, బంగారురథములు– వీనితో కూడి దిక్కులను మ్రోగించుచు పోరుచుండిరి. ఇట్లు పరస్పరము వానరులును, రాక్షసులును యుద్ధముచేయుచుండగా నలుడు ధూమ్రాక్షుని సంహరించెను. ఆంజనేయుడు వజ్రదంష్ట్రుని చంపెను. అంగదుడు నరాంతకుని ఇంటికి పంపెను. సుశేషుడు మహోదరుని మచ్చుమాపెను. రాక్షసబలము నాలుగవవంతు నిలచునట్లు నశించెను. అప్పుడు అంగదాదులు నలుగురును జయనాదముచే నింపబడిన మహావాద్యముల మహోత్సవముల తోడ శ్రీరామసన్నిధికి వచ్చి నమస్కరించిరి. అప్పుడు మేఘనాథుడు తన సైన్యము నాశనమయినదని తెలిసికొని సర్పాస్త్రప్రయోగముచేత తమ్మునితోను వానరులతోను శ్రీరాముడు వ్యాకులమునందు నట్లు చేసెను. అపుడు రాఘవుడు గరుత్మంతుని స్మరింపగా అతడు సర్పాస్త్రమును నివారించెను.

వరదానాద్బ్రహ్మణస్తౌ దృష్ట్వా రామః స జీవితౌ ।
తావువాచ రఘుశ్రేష్ఠో యువాభ్యాం బాన్ధవాన్ రణే ॥ 14

గత్వాఽస్తి జీవితశ్చేద్ధి వాచ్యస్తర్హి గిరా మమ ।
ఉపాయం చింతయస్వాద్య వానరాణాం సుజీవనే ॥ 15

తద్రామవచనం శ్రుత్వా తౌ విభీషణమారుతీ ।
నిశీథే తౌ విచిన్వంతౌ జాంబవంతం ప్రజగ్మతుః ॥ 16

ఉల్మూకహస్తౌ తం దృష్ట్వా ప్రోచతూ రాఘవేరితమ్ ।
జాంబవానపి తాం రామగిరం శ్రుత్వాఽతిహర్షితః ॥ 17

నిమీలితాక్షః ప్రోవాచ కౌ యువాం వాయుజో రణే ।
చేదస్తి జీవితస్తర్హి జీవయిష్యతి వానరాన్ ॥ 18

తదా విభీషణః ప్రాహ త్వయా త్యక్త్వాంగదాదికాన్ ।
పృచ్ఛ్యతేఽద్య కథం వాయుపుత్రస్య పరమాదరాత్ ॥ 19

తదా విభీషణం ప్రాహ జాంబవాన్ ఋక్షసత్తమః ।
రుద్రావతారః సంజజ్ఞే వాయుపుత్రః ప్రతాపవాన్ ॥ 20

న జ్ఞేయః కపిరేవాత్ర తస్మాత్త్వం విలోకయ ।
తదాఽబ్రవీజ్జాంబవంతం నత్వా స వాయునందనః ॥ 21

యం త్వం పృచ్ఛసి సోఽద్యాహం జీవితోఽస్మ్యద్య మారుతిః ।
విభీషణో ద్వితీయోఽయం యస్త్వయా పరిభాషతే ॥ 22

తదా స జాంబవాంస్తుష్టో మారుతిం వాక్యమబ్రవీత్ ।
గత్వా క్షీరనిధిం వేగాద్ద్రోణాద్రిం త్వం సమానయ ॥ 23

తథేత్యుక్త్వా త్వరన్ గత్వా గంధర్వైర్గోపితం నగమ్ ।
కామధేన్వా సోయధర్మనేత్రలేపాత్ప్రదర్శితమ్ ॥ 24

ఉత్పాట్య పుష్పవద్ధృత్వాఽఽనయామాస కపిర్జవాత్ ।
పర్వతోద్భవవల్లీనా మవఘ్రాయామృతోపమమ్ ॥ 25

సుగంధం జీవయిష్యంతి రాక్షసాశ్చేతి శంకయా ।
నిహతాన్ రాక్షసాన్ సర్వాంస్తదా తార్క్ష్యవిభీషణౌ ॥ 26

అంత అన్నిఅస్త్రములలోను నేర్పరియైన ఇంద్రజిత్తు బ్రహ్మవరమువలన అంతర్ధానము నొంది మరల బ్రహ్మాస్త్రముచే అంతట గగనమున బాణజాలమును కురిపించెను. అపుడు రాముడు బ్రహ్మాస్త్రమును గౌరవించి, అందరితోడ కొంతసేపు ఊరక కూర్చుండెను. అంత రాముడు స్వస్థుడై చూచునప్పటికి బ్రహ్మపాశమువలన వానరబలము మూర్ఛనొందియుండెను. అది జూచి లక్ష్మణునితో, "లక్ష్మణా! ధనస్సునందుకొనుము, క్షణకాలమున రాక్షసులనందరిని భస్మము చేయుదును," అని

చెప్పెను. అదివిని ఇంద్రజిత్తు లంకకువెడలెను. తనవద్ద విలపించుచు బ్రహ్మావరదానము వలన బ్రతికియున్న ఆంజనేయ, విభీషణులను చూచి శ్రీరాఘవుడు వారితో, "మీరిరువురును పోయి రణమున జాంబవంతుడు బ్రతికియుండిన వానితో కపులు బ్రతుకుటకు ఉపాయమును ఆలోచించుము అనిచెప్పవలయును," అని ఆజ్ఞాపించెను. అట్లేయని వారిరువురు అర్ధరాత్రి కొరవి చేతబట్టుకుని జాంబవంతుని వెదకుచు పోయి రామవాక్యమును చెప్పిరి. జాంబవంతుడును రామవాక్యమును విని ఆనందించుచు కండ్లుమూసుకునియే, "మీ ఇరువురు ఏవరు? ఆంజనేయుడు యుద్ధమున బ్రతికియుండిన కపులను బ్రతికింపగలడు," అని చెప్పెను. అందుకు విభీషణుడు, "జాంబవంతుడా! నీవు అంగదాదులను విడిచి, ఏల వాయుపుత్రుని ఒక్కనినే అడిగెదవు?" అని అడిగెను. దానికి జాంబవంతుడు, "పరాక్రమశాలియగు మారుతి శ్రీరుద్రావతారుడు. సామాన్య కపిగా వానిని ఎంచవలదు. గనుక వానిని చూడుము," అని చెప్పునప్పటికి ఆంజనేయుడు సమీపించి నమస్కరించి, "ఎందుకు నన్ను అడిగెదవు? ఆ నేనిదిగో బ్రతికియున్నాను అనెను.

**చిక్షిపతుః సాగరే తాన్ రాఘవస్యాజ్ఞయా క్షణాత్ ।**
**తదానీం తం గిరిం దృష్ట్వా సుషేణః స భిషగ్వరః ॥ 27**

**పర్వతోద్భవవల్లీభిర్జీవయామాస తాన్ కపీన్ ।**
**తతః శాఖామృగాః సర్వే సముత్తస్థుర్విజృంభితాః ॥ 28**

**ద్రోణాచలం యథాస్థానే స్థాపయామాస మారుతిః ।**
**కుబేరార్పితదివ్యాంభః ప్రమృజ్య నయనేషు చ ॥ 29**

**అంతర్హితానాం రామాద్యా దర్శనం ప్రాపురాహవే ।**
**తతః సంప్రేషయామాస రావణః స్వీయమంత్రిణః ॥ 30**

**అతినాదః ప్రహస్తశ్చ మహానాదదరీముఖాః ।**
**దేవశత్రుర్నికుంభశ్చ దేవాంతకనరాంతకౌ ॥ 31**

**సారణాద్యా బలైరన్యే యుయుధుర్వానరైః సహ ।**
**తాన్సర్వానంగదాద్యాస్తే హత్వా తస్థుర్విజర్జితాః ॥ 32**

**తదా కుంభనికుంభౌ ద్వౌ కుంబకర్ణసుతోత్తమౌ ।**
**రావణః ప్రేషయామాస యుద్ధార్థం తౌ ప్రజగ్మతుః ॥ 33**

**తదా కుంభో జాంబవతా నిహతశ్చ రణాజిరే ।**
**అంగదేన నికుంభశ్చ హతః శ్రుత్వా దశాననః ॥ 34**

**అతికాయం స్వీయపుత్రం ప్రేషయామాస సంగరమ్ ।**
**అతికాయేన సౌమిత్రిః కృత్వా సంగరముల్బణమ్ ॥ 35**

**శరేణ పాతయామాస లంకాయాం తచ్ఛిరో మహత్ ।**
**తదా యయౌ రావణః స స్వయం యుద్ధాయ వేగతః ॥ 36**

**సుహృన్మిత్రాజనైర్యుక్తో వేష్టితః పురవాసిభిః ।**
**రణే విభీషణం దృష్ట్వా కోపాచ్ఛక్తిం ముమోచ సః ॥ 37**

రెండవవాడు వీడే విభీషణుడు. వానితో నీవు మాటలాడినది," అని గుర్తుచేసెను. అపుడు జాంబవంతుడు సంతసించి, "వాయుపుత్రా! నీవు వేగముగా ద్రోణాద్రిని తీసికొనిరమ్ము," అని పంపెను. మారుతియు అట్లేయని త్వరగావెడలి, గంధర్వులచే దాచబడిన ఆ కొండను కనుగొని పెకలించి, పుష్పమునెత్తినట్లు తీసుకుని వచ్చెను. ఆ కొండలో పుట్టిన తీగలయొక్క అమృతమువంటి దివ్య గంధమును ఆఘ్రాణించి రాక్షసులు బ్రతుకుదురను అనుమానముతో చంపబడిన రాక్షసులందరిని అప్పుడు గరుడుడును, విభీషణుడును రామాజ్ఞతో క్షణకాలములో వారినందరిని సముద్రములోనికి నెట్టివేసిరి. అప్పుడా కొండను వైద్యరాజగు సుషేణుడు చూచి, కొండలోపుట్టిన తీగెలచేత ఆ కపులను బ్రతికించెను. అంత అచ్చటి మర్కటములన్నియును లేచి విజృంభించినవి. వాయుపుత్రుడు ద్రోణాచలమున అట్లే యున్నచోటనే పెట్టెను. శ్రీరామాదులందరును కుబేరునిచే అర్పింపబడిన దివ్యోదకమును కళ్ళకద్దుకొనిరి. పిమ్మట రావణుడు తన మంత్రులైన అతివాదుడు, ప్రహస్తుడు, మహానాదుడు, దరీముఖుడు, దేవశత్రుడు, నికుంభుడు, దేవాంతకుడు, నరాంతకుడు, సారణుడు మొదలుగాగల వీరులను పంపగా వారు వేర్వేరు సైన్యములతో వచ్చి కపులతో బలముగా యుద్ధము చేసిరి. వారినందరిని అంగదాది కపివీరులు చంపి ఆర్భటించుచు నిలచిరి.

**పృష్ఠే విభీషణం కృత్వా యయావగ్రే స లక్ష్మణః ।**
**హృది సంతాడితః శక్త్యా పపాత భువి లక్ష్మణ ॥ 38**

**లక్ష్మణం నగరీం నేతుం తం యయౌ స దశాననః ।**
**న చచాల భుజస్తస్య సౌమిత్రేః శేషరూపిణః ॥ 39**

తం నేతుకామం హనుమాన్ హృది ముష్ట్యా వ్యతాడయత్ ।
తేన ముష్టిప్రహారేణ పపాత రుధిరం వమన్ ॥ 40

ఆనయామాస సౌమిత్రిం మారుతిః కపివాహినీమ్ ।
రథారూఢో రావణోఽపి వివ్యాధ మారుతిం శరైః ॥ 41

తతః క్రుద్ధేన రామేణ బాణేన హృది తాడితః ।
సాశ్వధ్వజం రథం సూతం రాఘవో ధనురోజసా ॥ 42

ఛత్రం పతాకాం తరసా చిచ్ఛేద శితసాయకైః ।
అర్ధచంద్రేణ చిచ్ఛేద తత్కిరీటం రవిప్రభమ్ ॥ 43

తతస్తం వ్యాకులం దృష్ట్వా రామో రావణమబ్రవీత్ ।
గచ్ఛాద్య లంకామాశ్వస్తః శ్వస్త్వం పశ్య బలం మమ ॥ 44

అప్పుడు ఆ రావణునిచేత పంపబడిన కుంభకర్ణుని పుత్రులగు కుంభ, నికుంభులను వారిరువురు రణమునకు వచ్చిరి. అప్పుడు కుంభుడు జాంబవంతునిచేతను, నికుంభుడు అంగదుని చేతను చంపబడిరి. ఆ సంగతిని విని రావణుడు తనపుత్రుడైన అతికాయుడనువానిని రణమునకు పంపెను. వాడురాగా లక్ష్మణుడు వానితోడ ఘోరయుద్ధముచేసి, లంకలో వాని పెద్ద తలను పడవేసెను. అప్పుడు ఆ రావణుడు వేగముగా తానే సుహితాదులతో, ఊరివారితో కూడి యుద్ధమునకు వచ్చి, రణమున విభీషణుని చూచి, కోపమునంది శక్త్యాయుధమును ప్రయోగించెను. లక్ష్మణుడు అపుడు తనవీపున విభీషణుని పెట్టుకుని తాను ముందుకు సాగెను. ఆ శక్తివచ్చి లక్ష్మణుని హృదయమున తాకగా లక్ష్మణుడు నేలపైబడెను. ఆ లక్ష్మణుని లంకకు ఎత్తుకొనిపోవుటకు రావణుడు వచ్చెను. శేషావతారుడైన లక్ష్మణుని యొక్క భుజము కూడా కదలలేదు. అప్పుడు లక్ష్మణుని తీసుకోదలచి హనుమంతుడు వచ్చి రావణుని ఎదలో ఒక గ్రుద్దు గ్రుద్దెను. ఆ ముష్టి ప్రహారముచే రావణుడు రక్తము కక్కుచు నేలపైబడగా హనుమ మూర్ఛచెందిన లక్ష్మణుని తీసికొనివచ్చెను. వెంటనే రావణుడు రథమునెక్కి బాణములతో హనుమంతుని కొట్టెను. అంత రాముడు క్రుద్ధుడై త్వరగా తీక్ష్ణబాణములతో ఆ రావణుని ధ్వజమును, అశ్వములను, రథమును నేలకూల్చి సారథిని చంపి, సూర్యప్రభవంటి వాని కిరీటమును అర్ధచంద్రబాణము ముక్కలు చేసి, హృదయముపై కొట్టెను. అందుచే రావణుడు వ్యాకులము నొందగా, శ్రీరాముడు వానితో, "ఇప్పుడు లంకకుపోయి అలసటతీర్చుకుని రేపువచ్చి నా బలమును చూచెదవు గాక," అని ధిక్కరించెను. (44) అంత రావణుడు సిగ్గుతో తలవంచి లంకకు వెడలెను.

తతో లజ్జానతశిరా యయౌ లంకాం దశాననః ।
రామోఽపి లక్ష్మణం దృష్ట్వా మూర్ఛితం ప్రాహ మారుతిమ్ ॥ 45

ద్రోణాచలం సమానీయ జీవయైనం తథా కపీన్ ।
తథేతి స యయౌ వేగాత్ తద్జ్ఞాత్వా స దశాననః ॥ 46

ప్రార్థయిత్వా కాలనేమిం తద్విఘ్నార్థమచోదయత్ ।
స గత్వా హిమవత్పార్శ్వే తపోవనమకల్పయత్ ॥ 47

తత్ర శిష్యైః పరివృతో మునివేషధరః స్థితః ।
మారుతిశ్చాశ్రమం దృష్ట్వా జలం పాతుం వివేశ తమ్ ॥ 48

మునినా మానితశ్చాపి జలకుంభః ప్రదర్శితః ।
మారుతిః ప్రాహ తృప్తిర్మే నైవ నేన భవిష్యతి ॥ 49

తం పునః ప్రాహ స మునిస్తటాకం నికటస్థితమ్ ।
గచ్ఛాక్షిణీ పిధాయ త్వం జలం పిబ యథాసుఖమ్ ॥ 50

ఆగచ్ఛాశు పునశ్చాత్ర సుఖం తిష్ఠ మమాంతికమ్ ।
జానామి జ్ఞానదృష్ట్యాఽహం లక్ష్మణశ్చోత్థితస్త్వితి ॥ 51

గృహాణ మంత్రాన్ మత్తస్త్వం యైశ్చ పశ్యసి తం గిరిమ్ ।
గోపితం త్వద్య గంధర్వైర్యం తం త్వం నేతుమిచ్ఛసి ॥ 52

ప్లవంగానాం జీవనార్థం లంకాయాం వేగతః కపే ।
మత్తస్త్వం లబ్ధవిద్యః సన్ దదస్వ గురుదక్షిణామ్ ॥ 53

తథేతి మారుతిర్గత్వా కాసారమపిబజ్జలమ్ ।
పిధాయ నేత్రే తావత్తమగ్రసన్మకరీ తదా ॥ 54

సోఽపి తాం దారయామాస ధృత్వాస్యే సా మమార హ ।
తతోఽంతరిక్షే సా ప్రాహ దివ్యరూపా తు మారుతిమ్ ॥ 55

పురాహం మునినా స్పృష్ట్వా ప్రార్థితా న రతిర్మయా ।
దత్తా శప్తాఽస్మి త్వత్తో మే నిష్కృతిస్తేన కీర్తితా ॥ 56

ధాన్యమాలీతి విఖ్యాతాఽప్సరాః పూర్వం భవాంతరే ।
ఆశ్రమే యస్త్వయా దృష్టః కాలనేమిర్మహాసురః ॥ 57

రావణప్రేషితో మార్గే స్థితస్తం జహి వేగతః ।
తథేతి మారుతిర్గత్వా మునిం ప్రాహ త్వరాన్వితః ॥ 58

ముష్టిం బద్ధ్వ దృఢాం ఘోరాం గృహాణ గురుదక్షిణామ్ ।
ఇత్యుక్త్వా తాడయామాస హృది తం ముష్టినా తదా ॥ 59

పపాత భువి రక్తం స వమన్ ప్రాణాన్ జహౌ క్షణాత్ ।
తతః క్షీరనిధిం గత్వా జిత్వా గంధర్వసత్తమాన్ ॥ 60

ద్రోణాచలం గృహీత్వా స యావద్గచ్ఛతి మారుతిః ।
విహాయసాఽతివేగేన లంకాం తావచ్ఛ వై పథి ॥ 61

## ఆంజనేయుడు ద్రోణాద్రిని తెచ్చి లక్ష్మణుని బ్రతికించుట.

శ్రీరాముడు మూర్ఛనొందియుండు లక్ష్మణునిజూచి, ఆంజనేయునితో, "ద్రోణాచలమును తీసుకొని వచ్చి లక్ష్మణుని, అట్లే కపులను బ్రతికింపుము," అని ఆజ్ఞాపించెను. అట్లేయని అతడు వెడలెను. ఆ సంగతినెరిగి రావణుడు ఆ కార్యమునకు విఘ్నము చేయవలెనని తలంచి, కాలనేమి అను రాక్షసుని పంపెను. ఆ రక్కసుడు వెడలి హిమవంతమువద్ద తపోవనమును కల్పించుకుని అందులో తాను ఒక మునివేషమును దాల్చి శిష్యులతో ఉండెను. అందుకు ఆంజనేయుడు పోవుచు ఆ యాశ్రమమును చూచి నీళ్ళుద్రావుటకు అందులో ప్రవేశించెను. ఆ మాయాముని హనుంతుని సమ్మానించి నీళ్ళచెంబును చూపెను. అందుకు కపివరుడు దీనితో నాకు తృప్తికలుగదనెను. దానికి కపటముని, "సమీపమున చెరువున్నది. పోయి కండ్లుమూసుకొని కావలసినంత నీరుద్రాగి యథేచ్ఛగా మరల ఇచ్చటికి వచ్చి, నావద్ద నెమ్మదిగా కుర్చుండుము జ్ఞాన దృష్టితో లక్ష్మణుడు మేల్కొనెను అని తెలుసుకుంటిని. ఆ గిరిని చూచునట్టి దివ్యమంత్రమును ఉపదేశించెదను గ్రహింపుము. ఏలననగా ఆ పర్వతమును గంధర్వులు దాచియున్నారు నీవు దానిని గొనిపోయి లంకలో కపులను బ్రతికించనెంచెదవు. నావల్ల విద్యననుగ్రహించి గురుదక్షిణములనిమ్ము," అని చెప్పగా హనుమంతుడు అట్లేయని, పోయి సరస్సులో కండ్లుమూసుకుని నీరుద్రాగుచుండెను. అంతలో అచ్చట మొసలిఒకటి వచ్చి పట్టెను. మారుతి దాని నోరుబట్టి చీల్చివేసెను. అంత అంతరిక్షమున అది దివ్యరూపమునొంది, "మునుపొకముని నన్నంటగా అతనికి నేను సంగమమివ్వలేదు. అందుచే నన్నతడు శపించెను. నేను వేడగా, మారుతీ! నీ చేత

నాకు ముక్తి కలుగునని శాపవిముక్తినిచ్చెను.” అని ఆ ముసలి చెప్పెను. “నేను జన్మాంతరమున ధాన్యమాలియను అప్సరసను. ఈ ఆశ్రమమున కాలనేమియను రాక్షసుడు నాచే చూడబడినాడు. వాడు రావణునిచే పంపబడి దారిలో ముని వేషములోనున్నాడు. త్వరగా వానిని చంపుము,” అని చెప్పిపోయెను. అట్లేయని ఆంజనేయుడు పోయి కపటమునిని చూచి తన దృఢముష్టిని చూపి “ఇదిగో గురుదక్షిణలను స్వీకరించ”మని ఎదలో గ్రుద్దెను. వాడు నెత్తురుగ్రక్కుచు నేలపైబడి ప్రాణములు విడిచెను. అక్కడినుండి హనుమ గంధర్వవీరులను జయించి, ద్రోణాచలమును తీసికొని గగనమున వేగముగా వచ్చుచుండెను.

భరతేన శరం ముక్త్వా పర్వతో భువి పాతితః ।
భరతం మారుతిర్దృష్ట్వా రామోఽయమితి విహ్వలః ॥ **62**

ఉవాచ మధురం వాక్యం కథమత్ర సమాగతః ।
జితః కిం రావణేన త్వం రణం త్యక్త్వా పలాయితః ॥ **63**

ఏవముక్తోఽపి భరతః పునస్తం మారుతిం శరమ్ ।
మత్వాఽయం రాక్షసశ్చేతి సందధే నిశితం శరమ్ ॥ **64**

బాణహస్తం తమాలోక్య భుభుక్కారం విధాయ సః ।
నైవాయం రాఘవశ్చేతి మత్వా ధ్యాత్వా క్షణం హృది ॥ **65**

భరతం మారుతిః ప్రాహ రామదూతోఽద్య మే బలమ్ ।
పశ్యసి త్వం తద్గిరం తాం శ్రుత్వా తం భరతోఽబ్రవీత్ ॥ **66**

బంధునా మమ రామేణ కుతో వద సమాగతః ।
తవ జాతం సవిస్తారం దండకారణ్యవాసినా ॥ **67**

తతస్తం మారుతిర్వృత్తం సంశ్రావ్య రాఘవస్య తు ।
భరతేనేషుణా దత్తం గిరిం ధృత్వా యయౌ పునః ॥ **68**

లంకాం గత్వా స వల్లీభిర్జీవయామాస లక్ష్మణమ్ ।
వానరాంశ్చ భరతస్య రామం వృత్తం న్యవేదయత్ ॥ **69**

పునర్నీత్వా యథాస్థానం తం సంస్థాప్య మహాచలమ్ ।
లక్ష్మణో జీవితశ్చేతి సంశ్రావ్య భరతం పునః ॥ **70**

**యయావాకాశమార్గేణ లంకాం గన్తుం మనో దధే ।**
**నృపానాకారయామాస సాకేతం భరతోఽపి సః ॥ 71**

అపుడు వేగముగా వచ్చుచున్న హనుమంతుని జూచి, దారిలో భరతుడు బాణమును ప్రయోగించగా, ఆంజనేయుని చేతిలోనున్న ద్రోణగిరి నేలపై బడెను. హనుమంతుడు భరతునిజూచి, శ్రీరామునిగా భ్రమించి, "రామా! ఇక్కడికి ఎలావచ్చితిరి?" అనెను. ఆ రాత్రిలో మరో బాణము వచ్చి తగిలెను. దానిని జూచి కపీంద్రుడు భుభుక్కారముచేసి వీడు రాముడు కాదనుకొని, కొంతసేపు మనమున ధ్యానించి భరతునితో, "నేను రామదూతను. ఇపుడు నా బలమును చూపెదను," అని చెప్పగా అందుకు భరతుడు, "దండకారణ్యవాసియైన మా అన్నయగు రామునితో నీకెట్లు సహవాసము కలిగెను?" అని అడిగెను. అంత ఆంజనేయుడు శ్రీరామవృత్తాంతమును చెప్పి, భరతునిచే బాణపు దెబ్బకు నేలపై పడిన కొండనెత్తుకుని లంకకువచ్చి దానితీగలచే లక్ష్మణుని బ్రతికించెను. వానరులను బ్రతికించెను. శ్రీరామునికి భరతవృత్తాంతమును కూడ విన్నవించెను. మరల ఆ ద్రోణ పర్వతమును యథాస్థానమున పెట్టి, లక్ష్మణుడు బ్రతికెనను సంగతిని భరతునికి చెప్పి లంకకు తిరిగి వచ్చెను. నంది గ్రామములోని భరతుడు రాజులను పిలిపించెను. శ్రీరామునికి సహాయము చేయవలెనని లంకకుపోవుటకు ఆలోచించెను. (71)

**సాహాయ్యార్థం రాఘవస్య లంకాం గంతుం మనో దధే ।**
**తతః సభాయామాసీనో రావణః ప్రాహ రాక్షసాన్ ॥ 72**

**గచ్ఛధ్వం త్వరితం దూతాః పాతాలే తౌ మహాబలౌ ।**
**ఐరావణో మహానుగ్రస్తథా మైరావణో మహాన్ ॥ 73**

**తయోర్మే కథనీయం హి యుద్ధవృత్తం వయస్యయోః ।**
**తథేతి తే గతా దూతాస్తౌ తద్వృత్తం న్యవేదయన్ ॥ 74**

**తౌ శ్రుత్వా విహ్వలాత్మానౌ లంకాయాం సముపస్థితౌ ।**
**రామం చ లక్ష్మణం హన్తుం నిశాయాం తౌ సమాగతౌ ॥ 75**

**దదర్శతుస్తౌ పుచ్ఛస్య పరిఘం హి హనూమతః ।**
**కపీనాం తత్ర సేనాయాస్తదాకాశాన్మహాన్బలౌ ॥ 76**

**నిపేతతుః కపీనాం తు సేనాయాం రామలక్ష్మణౌ ।**
**కించిద్వినిద్రితౌ దృష్ట్వా శిలాయాం సంగరశ్రమాత్ ॥ 77**

నిన్యతుస్తౌ శిలాం శీఘ్రం పాతాలం నిజమందిరమ్ ।
ఏతస్మిన్నంతరేఽ దృష్ట్వా సేనాయాం రామలక్ష్మణౌ ॥ 78

మారుతిః పాదమార్గేణం తయోః పాతాళమాయయౌ ।
ఏతస్మిన్నంతరే మార్గే లంకాం దక్షిణదిక్తటే ॥ 79

నికుంభిలాయాం స్వపతిం కపోతీ ప్రాహ గుర్విణీ ।
నాథాద్య నరమాంసం మే భోక్తుం స్పృహయతే మనః ॥ 80

స ప్రాహాద్య సమానీతౌ వర్తేతే రామలక్ష్మణౌ ।
రసాతలం హి దైత్యాభ్యాం దేవ్యగ్రేతౌ వధిష్యతః ॥ 81

అథ శ్వస్తద్వధే జాతే మాంసమానీయ తేఽర్పయే ।
తద్వాక్యం మారుతిః శ్రుత్వా కించిత్తోషయుతో యయౌ ॥ 82

తావద్దదర్శతద్వారి సంస్థితం మకరధ్వజమ్ ।
స ధృత్వా తం హనూమంతం పప్రచ్ఛ మకరధ్వజః ॥ 83

కస్త్వం కుతః సమాయాతః స్వవృత్తం ప్రాహ మారుతిః ।
రామదూతస్తు లంకాయాశ్చానీతౌ రామలక్ష్మణౌ ॥ 84

## ఐరావణ, మైరావణులు-రామలక్ష్మణులను అపహరించుట.

పిమ్మట సభలోనున్న రావణుడు రాక్షసులతో, "ఓదూతలారా! మీరు త్వరగావెడలండి. పాతాళమున నా మిత్రులగు ఐరావణ, మైరావణులను మహాదైత్యులిరువురు గలరు. నా యొక్క ఈ యుద్ధ వృత్తాంతమును వారికి తెలియజేయండి," అని ఆజ్ఞాపించెను. వారు అట్లే అని పోయి, వారికి ఆ సంగతిని విన్నవించిరి. మహాబలులైన ఆ ఐరావణ, మైరావణులు విని బాధపడి, లంకలోనున్న రామలక్ష్మణులను రాత్రిపూట అపహరించుటకు ఆలోచించి వచ్చి, ఆంజనేయుని, ఆంజనేయుని తోకయొక్క ప్రాకారమును, అందులో కపులయొక్క గొప్పసేనను చూచి, కపిసేనలో తిన్నగా దుమికి యుద్ధాయాసము చేత బండమీద పడుకుని కొంచెము నిద్రించుచున్న రామలక్ష్మణులను కనుగొని, త్వరగా ఆ బండను పాతాళములోని తమ మందిరమునకు ఎత్తుకొనిపోయిరి. అంతలో ఆంజనేయుడు సేనలో రామలక్ష్మణులను కానక పాదమార్గమున వారి పాతాళమునకు పోయెను. ఆ వేళకు దారిలో లంకా దక్షిణదిగ్భాగముగానుండు నికుంభిలలో గర్భవతియైన పారావతపక్షి తనపతిని, "నాథా! నాకు

నరమాంసమును తెచ్చిపెట్టుము, ఆశగాఉన్నది," అని అడిగెను. అందుకా మొగపక్షి, "ఇప్పుడే దైత్యులిరువురు వచ్చి రామ లక్ష్మణులను పాతాళమునకు కొనిపోయిరి. దేవి ఎదుట వారిని చంపెదరు. అట్లు వారు చంపితే ఆ మాంసమును నీకు తెచ్చియిచ్చెదను," అని చెప్పుచుండగా ఆ మాటవినిన మారుతి కొంతచింతించుచు పోయెను. అంత ఆ ద్వారమున ఉన్న మకరధ్వజుడు అనువాడు ఆంజనేయుని అడ్డగించి, "నీవెవడవు? ఎందుకువచ్చితివి?" అని అడిగెను.

నిద్రితౌ నిశి దైత్యాభ్యామత్ర పాతాలమధ్య హి ।
తయోః శోధార్థమాయాతశ్చేత్త్వం వేత్సి వదస్వ తౌ ॥ 85

తన్మారుతివచః శ్రుత్వా తం ప్రాహ మకరధ్వజః ।
పితా మే వర్తతే తత్ర క్షేమేణాంజనిసమ్భవః ॥ 86

తచ్ఛ్రుత్వా చకితః ప్రాహ హనుమాన్ మకరధ్వజమ్ ।
హనూమతః కుతః పత్నీ సోఽబ్రవీన్మారుతిం పునః ॥ 87

లంకాదాహం పురా కృత్వా సాగరే శీతలం కృతమ్ ।
యదా పుచ్ఛం మారుతినా తదా తద్ధూమపూరితాత్ ॥ 88

కంఠాచ్ఛ్లేష్మా బహిస్త్యక్తః సాగరే సోఽపతత్తదా ।
మకర్యా భక్షితః సోఽపి తస్యాం జాతః సుతోస్మ్యహమ్ ॥ 89

తచ్ఛ్రుత్వా మారుతిః ప్రాహ సోఽయమేవ న సంశయః ।
తదా ననామ పితరం తథా వృత్తం న్యవేదయత్ ॥ 90

కామాక్ష్యాశ్చ బలిం కర్తుం నిశ్చితౌ పూర్వమేవ హి ।
తావానేతుం యదోద్యుక్తౌ లంకాం గత్వా సురోత్తమౌ ॥ 91

శ్వః కామాక్ష్యాః పురః కర్తుం తయోర్దానం వినిశ్చితమ్ ।
గచ్ఛ దేవాలయే గత్వా తత్ర స్థిత్వా హరస్వ తౌ ॥ 92

తతః స మారుతిర్గత్వా త్రసరేణుస్వరూపధృక్ ।
దేవాలయే ప్రవిశ్యాథ కపాటాని బబంధ సః ॥ 93

తావద్దైత్యౌ సమాయాతౌ పూజార్థం ద్వారి సంస్థితౌ ।
శనైర్దేవ్యాః స్వరేణైవ మారుతిస్తౌ వచోఽబ్రవీత్ ॥ 94

**పూజా కార్యా గవాక్షేణ సజీవౌ రామలక్ష్మణౌ ।**
**వనోద్భవైః ఫలైః పుష్పాదిభిః సమ్యక్ ప్రపూజితౌ ॥ 95**

**ధృత కోదండతూణీరౌ వన్యపుష్పైశ్చ శోభితౌ ।**
**దేవాలయస్య కించిద్ధి ద్వారముద్ఘాట్య వై శనైః ॥ 96**

మకరధ్వజుని చూచిన కపీంద్రుడు తన సంగతిని చెప్పి, "నేను రామదూతను. రాత్రిసమయాన నిద్రించునపుడు రామ, లక్ష్మణులను రాక్షసులు పాతాళమునకు ఎత్తుకుపోయిరి. వారిని కనిపెట్టుటకు నేనిపుడు పోవుచున్నాను. నీకు తెలిసియున్న చెప్పుము," అని అడిగెను. అందుకు మకరధ్వజుడు, "అచ్చట నా తండ్రి ఆంజనేయుడు క్షేమముగా ఉన్నాడా?" అనగా హనుమంతుడు ఆమాట విని చకితుడై "హనుమంతునికి పత్ని ఎచ్చటగలద"ని అడిగెను. అందుకు మరల మకరధ్వజుడు, "ఆంజనేయుడు మునుపు లంకను కాల్చి ఆ తోకను సముద్రములో చల్లార్చునపుడు ఆ పొగ కమ్మిన నోటి ఉమ్మిని వెలుపల విడిచెను. ఆ ఉమ్మిని మొసలి ఒకటి భక్షించెను. అది విని ఆంజనేయుడు. నిస్సందేహముగా వాడే తన కుమారుడని వక్కాణించెను. అంత ఆ మకరధ్వజుడు తండ్రికి నమస్కరించి, "వారు ఐరావణ, మైరావణులు మొదటనే లంకకుపోయినపుడు శ్రీరామ లక్ష్మణులను కామాక్షిదేవికి బలిగా అర్పింపవలెనని నిశ్చయించిరి. రేపు కామాక్షి ఎదుట వారిని ఖండించవలయునని నిశ్చయించిరి. పొమ్ము ఆ దేవాలయమునకు వెడలి అచ్చట నిలచి రాక్షసులను హరింపుము," అని మకరధ్వజుడు తెలియజేయగా, వెంటనే ఆంజనేయుడు సూక్ష్మమగు త్రసరేణు రూపమును దాల్చి దేవాలయమున ప్రవేశించి, తలుపులను వేసికొనెను. ఆ వేళకు పూజించుటకై ఆ రాక్షసులు ద్వారమువద్ద నిలచిరి. అపుడు కపివీరుడు దేవియొక్క స్వరముతోనే తిన్నగా వారితో, "గవాక్షములోనే పూజ చేయవలయును. సజీవులైన శ్రీరామలక్ష్మణులను వన్యములగు ఫల పుష్పాదులచే చక్కగా పూజింపవలయును. వారు కోదండ, తూణీరములను దాల్చి, వనపుష్పములచే అలంకరింపబడి, దేవాలయ ద్వారమును కొంచెము తెరచి, తిన్నగా నా సంతోషమునకై పంపబడుదురుగాక!" అనెను.

**మత్తుష్ట్యర్థం ప్రేషణీయావత్ర మామద్య మానవౌ ।**
**యేన కేన ప్రకారేణ యో మామద్య ప్రపశ్యతి ॥ 97**

**భవిష్యతి నిశ్చయేన సోఽంధో నాస్త్యేవ సంశయః ।**
**తద్దేవ్యా వచనం శ్రుత్వా తుష్టాం జ్ఞాత్వాంబికాం ముదా ॥ 98**

**తతస్తౌ పూజనం దైత్యౌ గవాక్షేణైవ చక్రతుః ।**
**పక్వాన్నపాయసాదీనాం రాశీంస్తౌ ప్రముమోచతుః ॥ 99**

పంచామృతఘటాంశ్చాపి కోటిశస్తౌ ముమోచతుః ।
కోటిశః ఫలభారైశ్చ గవాక్షేణ ముమోచతుః ॥ 100

తత్సర్వం భక్షయిత్వా స మారుతిః ప్రాహ తౌ పునః ।
కిం దత్తం గ్రాసమాత్రం మే భోజనం క్షుధితాఽస్మ్యహమ్ ॥ 101

తద్దేవ్యా వచనం శ్రుత్వా తౌ దైత్యా వతివిస్మితౌ ।
దూతైర్విలుంత్య హట్టాంశ్చ తథా స్వీయపురౌకసామ్ ॥ 102

భక్షణీయపదార్థాంస్తౌ గిరీనివ ముమోచతుః ।
రాజగృహాదిషు స్వేషు యద్యద్వస్త్వస్తి సంచితమ్ ॥ 103

తచ్చాపి దూతైరానీయ దేవ్యై శీఘ్రం ముమోచతుః ।
తదా కోలాహలశ్చాసీత్ప్రతిగేహే పురౌకసామ్ ॥ 104

నాసీచ్ఛేషం బాలకానాం భక్ష్యవస్త్వణ్వపి క్వచిత్ ।
తతస్తౌ వన్యపుష్పాద్యైర్భూషితౌ రామలక్ష్మణౌ ॥ 105

ధృతకోదండతూణీరౌ ద్వారేణైవార్పితౌ శ్రియై ।
తౌ దృష్ట్వా మారుతిర్నత్వాఽఽలింగ్యా శ్రీరామలక్ష్మణౌ ॥ 106

కపాటాని తతోద్ఘాట్య దైత్యయోః స వ్యతర్జయత్ ।
తతో రామో లక్ష్మణేన బహిర్దేవాలయాత్తదా ॥ 107

నిర్గత్య శరజాలైస్తౌ జఘాన క్షణమాత్రతః ।
సేవకాన్ సుహృదాదీంశ్చ తయోర్బాణైర్జఘాన సః ॥ 108

పునస్తౌ జీవితౌ దైత్యౌ పునస్తేన నిపాతితౌ ।
శతవారం హతౌవేవం నాసీన్మృత్యుస్తయోస్తదా ॥ 109

యేవిధముగానైనా ఎవ్వడిప్పుడు నన్ను చూచునో వాడు తప్పక గ్రుడ్డివాడగును. ఇందులో సంశయములేదు," అని చెప్పెను. ఆ రక్కసులిరువురును దేవియొక్క మాటను విని, జగదంబ సంతోషించెనని సంతోషముతో గవాక్షము నుండియే పూజించిరి. పక్వాన్నములను, పాయసాదులను రాసులు రాసులుగా విడచుచువచ్చిరి. పంచామృతములు కడవలను కోట్లకొలది కుమ్మరించిరి.

కోట్యంతరముగా దివ్యఫలములను అర్పించిరి. వాటినంతటిని భక్షించి, వానరేంద్రుడు మరల, "ఏమిచ్చితిరి నాకు? ఈ గ్రాసమాత్రముచే ఏమగును? మిక్కిలి ఆకలికొనియున్నాను," అని చెప్పెను. ఆ కపిరూపదేవి వచనమును విని దైత్యులు మిగుల విస్మితులై దూతలచే పాకశాలలో వెదకి తన ఊరివారియొక్క, తనయొక్క తినదగిన వస్తువులన్నిటిని కొండలవలె క్రుమ్మరించిరి. తమ రాజ మందిరములలో సంపాదించిపెట్టిన వస్తువులను అన్నిటిని దూతలచే తెప్పించిరి. అపుడు వారి ఇండ్లలో కోలాహలము ఆరంభమాయెను. ఎచ్చటను బిడ్డలు తినడానికి కూడా కొంచెమును మిగులకపోయెను. అంత ఐరావణ, మైరావణులు వన్యపుష్పాభరణములచే అలంకరించి ధనుర్బాణ ధారులుగా ఉన్నట్లే శ్రీదేవికై రామలక్ష్మణులను దేవాలయములోనికి పంపిరి. రామలక్ష్మణులకు ఆంజనేయుడు నమస్కరించి, వారిని హత్తుకొనెను. ఆ తరువాత ఆంజనేయుడు ఆలయ తలుపులను తెరచికొని బయటకు వచ్చి అక్కడి వారిని బెదిరించెను. అంత రామలక్ష్మణులు దేవాలయమునుండి బయటకు వచ్చి ఆ ఐరావణ మైరావణులయొక్క సైన్యవర్గమును, మిత్రవర్గమును, వారిరువురిని కూడా బాణములచే ధ్వంసముచేసిరి.

**తతోఽతివిస్మితో భూత్వా త్వరంగత్వా స మారుతిః ।**
**ఇతస్తతో భ్రమన్పుర్యాం నారీం రహసి సంస్థితామ్ ॥ 110**

**ఐరావణభోగపత్నీం పప్రచ్ఛ మరణం తయోః ।**
**సా ప్రాహ నాగకన్యాఽహం బలేనానేన ధర్షితా ॥ 111**

**మైరావణోఽపి మాం నిత్యం దుష్టబుధ్యాఽత్ర పశ్యతి ।**
**ఉభాభ్యామపి చ క్రీడాం దాతుం నాస్తిం బలం మయి ॥ 112**

**మిత్రం త్వేకో రిపుస్త్వేకస్త్వితి దుఃఖం తయోర్మమ ।**
**అతస్తయోర్వధే తుష్టిర్మమ చాపి భవిష్యతి ॥ 113**

**మారుతే యది రామో మాం స్వస్త్రియం హి కరిష్యతి ।**
**తర్హ్యహం కథయామ్యద్య తయోర్మృత్యుర్యతో భవేత్ ॥ 114**

**తచ్ఛ్రుత్వా మారుతిః ప్రాహ యది శ్రీరామభారతః ।**
**న భవిష్యతి భగ్నస్తే మంచకస్తర్హి తే పతిః ॥ 115**

**భవిష్యతి రామచంద్ర స్తథేత్యుక్త్వా తమాహ సా ।**
**భ్రమరానేకదా పూర్వం బాలైః కంటకరోపితాన్ ॥ 116**

మోచయామాసతుస్తౌ హి తేన తుష్టాశ్చ షట్పదాః ।
తావూచుస్తే యువాభ్యాం హి మరణాద్రక్షితా వయమ్ ॥ 117

యథా తథా యువాం చాపి రక్షామో మరణాద్వయమ్ ।
ఇత్యుక్త్వా తే స్థితాశ్చాత్ర తే నీత్వాఽమృతముత్తమమ్ ॥ 118

తద్రక్తబిందూన్ స్పృష్ట్వా తే ప్రకుర్వంతి సజీవితౌ ।
భ్రమరాస్తే తయోర్నిద్రాస్థానే సంత్యధునా కపే ॥ 119

కోటిశిస్తాన్మర్దయస్వ సోఽపి తాన్మర్దయత్ క్షణాత్ ।
తత్రైకం శరణం ప్రాప్తం భ్రమరం ప్రాహమారుతిః ॥ 120

కురు మంచకగర్భం త్వం గజభుక్తకపిత్థవత్ ।
ఐరావణభోగత్న్యాః షట్పదోఽపి తథాఽకరోత్ ॥ 121

తతో నిహత్య తౌ దైత్యౌ పునర్బాణౌ రఘూద్వహః ।
అభిషిచ్య తయోః స్థానే రాజ్యే తం మకరధ్వజమ్ ॥ 122

ఐరావణ, మైరావణ రాక్షసులు చంపినను మరల బ్రతికిరి. రామలక్ష్మణులు మరల చంపిరి. ఐరావణ మైరావణులు మరలా బ్రతికిరి. అట్లు నూరుమార్లు సంహరించినను వారికి మృత్యువు కలుగలేదు. అంత రామలక్ష్మణులు ఎంతో ఆశ్చర్యమునొందిరి. అపుడు ఆంజనేయుడు త్వరగా ఊరిలోనికి పోయి, నిటునటు సంచరించి, రహస్యస్థానమున ఉన్నట్టి ఐరావణ భోగపత్నియగు కాంతను ఒకదానిని చూచెను. వారి మరణరహస్యము గురించి దానిని అడిగెను. ఆమె హనుమంతునితో, "నేనొక నాగకన్యకను. వీరిచే బలత్కారమున చెర పట్టబడినదానను. ఇచ్చట మైరావణుడును నన్ను దుష్టబుద్ధితో చూచును. ఐరావణ, మైరావణులు ఇరువురికిని రతిక్రీడనిచ్చుటకు నాకు బలములేదు. నాయందు వారికి ఒకడు మిత్రుడు, ఒకడు శత్రువను దుఃఖము గలదు. కావున వారిసంతోషము నాకును సంతోషకరము.

హనుమంతుడా! శ్రీరాముడు నన్ను తన భార్యగా ఒప్పుకున్నట్లయిన నేను ఐరావణ, మైరావణుల మృత్యు రహస్యమును చెప్పెదను," అని చెప్పగా, అందుకు ఆంజనేయుడు, "శ్రీరాముని భారమునకు నీ మంచము విరుగక యుండిన అతడు నీపతి కాగలడు," అని చెప్పెను. దానికి ఆమెయు ఒప్పుకొనెను. పిదప ఆ నాగకన్యక, "మునుపు ఒకప్పుడు తుమ్మెదలను బాలకులు ముండ్లలో ఉంచగా వాటిని ఈ ఐరావణ మైరావణులు విడిపించిరి. అందుచే మెచ్చిన భ్రమరములు– మీరు మమ్మును మరణమునుండి

బ్రోచినట్లు మేము మిమ్మును మరణమునుండి రక్షించెదము– అని చెప్పి అవి వీరి శయనస్థానమున ఉన్నవి. అవి అమృతబిందువులను కొనివచ్చి వీరి రక్తబిందువులను స్పృశించుచున్నవి. వీరు బ్రతుకుచుందురు. కోట్లకొలదిగా ఉండు వాటిని సంహరింపుము," అని తెలిపెను.

అట్లేయని ఆంజనేయుడు వాటిని సంహరించబోయెను. అపుడొక తుమ్మెద శరణమనగా, "నీవు ఐరావణ భోగపత్నియొక్క మంచమును ఏనుగుతిన్న వెలగపండువలె నిస్సారముగా చేయుము, అని ఆజ్ఞాపించెను. అదియు అట్లే చేసెను. పిమ్మట రామచంద్రుడు బాణములచే వారిరువురిని సంహరించి ఆ రాజ్యమునకు మకరధ్వజుని పట్టాభిషిక్తుని జేసెను.

**యావద్గంతుం మనశ్చక్రే తావన్మారుతినాఽర్థితః ।**
**నాగకన్యాగృహం గత్వా నానాచిత్రవిచిత్రితమ్ ॥ 123**

**దృష్ట్వా తాం చారువదనాం వస్త్రాలంకారమండితామ్ ।**
**ధృత్వా కరేణ తద్ధస్తం కించిత్కృత్వా స్మితాననమ్ ॥ 124**

**చకార మంచకం భగ్నం స్వభారేణ రఘూత్తమః ।**
**తతస్తయా ప్రార్థితః స రామస్తాం పునరబ్రవీత్ ॥ 125**

**త్యక్త్వా దేహం భువం గత్వా భూత్వా బ్రాహ్మణకన్యకా ।**
**తపస్తప్త్వా చిరం కాలం తృతీయే త్వం తు జన్మని ॥ 126**

**ద్వాపరే ద్వారకాయాం హి మమ పత్నీ భవిష్యతి ।**
**తద్రామవచనం శ్రుత్వా రామాగ్రేఽగ్నిం ప్రవిశ్య సా ॥ 127**

**కన్యాకుమారీ నామ్నాఽసీద్ ద్విజకన్యాఽబ్ధిరోదసి ।**
**మారుతేః స్కంధసంస్థోఽభూత్తదా రామో ముదాన్వితః ॥ 128**

**రాజ్యే కృత్వా మంత్రిణం స్వం లక్ష్మణం మకరధ్వజః ।**
**అకరోత్తం స్కంధసంస్థం శేషం బ్రహ్మాండధారకమ్ ॥ 129**

**తతః క్షణాజ్జగ్మతుస్తౌ లంకాం శ్రీరామలక్ష్మణౌ ।**
**శ్రీరామలక్ష్మణౌ దృష్ట్వా సుగ్రీవాద్యాశ్చ వానరాః ॥ 130**

పాతాళమునుండి వచ్చుటకు సిద్ధపడిన హనుమ, శ్రీరామునితో, "స్వామీ! తమరు వివిధ చిత్ర విచిత్రమైన నాగకన్యా మందిరమునకు పోయి, చక్కగా అలంకరించుకున్న, అందగత్తెయైన ఆ

కాంతను చూచి సంతసముతో పాణిగ్రహణం చేయవలయు” నని విన్నవించెను. శ్రీరాముడు తన భారముచే మంచమును విఱుగగొట్టెను. అంత ఆమె మిక్కిలి ప్రార్థింపగా మరల శ్రీరాముడు, ఈ దేహమును వదలి భూమికి జని బ్రాహ్మణకన్యకగా జనించి చిరకాలము తపమొనరించి మూడవ జన్మమున ద్వాపరయుగమునందు ద్వారకా నగరములో నాకు ధర్మపత్నియగుము అని వరమునిచ్చెను. వెంటనే ఆమె అగ్నిని ప్రవేశించి ప్రకాశించెను. సముద్రతీరమున కన్యాకుమారి అను పేరుతో బ్రాహ్మణ కన్యకగా అవతరించెను. పిమ్మట శ్రీరాముడు ఆంజనేయుని భుజములపై ఎక్కెను. మకరధ్వజుడు రాజ్యమును తన మంత్రికి అప్పగించి, లక్ష్మణుని తన భుజములపై ఎక్కించు కొనెను. అంత ఆ రామలక్ష్మణులు క్షణములో లంకకు వచ్చి చేరిరి. (130)

**తావాలింగ్య ముహూర్తం నత్వా బభూవుస్తోషపూరితాః ।**
**రామోఽపి సకలం వృత్తం సుగ్రీవాదీన్న్యవేదయత్ ॥ 131**

దైత్యౌ రామేణ నిహతౌ శ్రుత్వా సదసి రావణః ।
రాక్షసాంశ్చకితః ప్రాహ పూర్వవృత్తం భయాన్వితః ॥ 132

మానుషేణైవ మృత్యుర్మే ప్రాహ పూర్వం పితామహః ।
అతో నారాయణః సాక్షాన్మానుషోఽభూన్న సంశయః ॥ 133

రామో దాశరథిర్భూత్వా మాం హంతుం సముపస్థితః ।
యదాఽనరణ్యః పూర్వం హి స హతో దీక్షితో మయా ॥ 134

శప్తశ్చాహం తదా తేన సూర్యవంశోద్భవేన హి ।
ఉత్పత్స్యతే చ మద్వంశే పరమాత్మా సనాతనః ॥ 135

స ఏవ త్వాం పుత్రపౌత్రైర్బాంధవైర్విహనిష్యతి ।
ఇత్యుక్త్వా స యయౌ నాకం సోఽధునా సమయో మమ ॥ 136

సమాగతో రాఘవో మాం సమరే స హనిష్యతి ।
విబోధ్య కుంభకర్ణం తమానయధ్వం త్వరాన్వితాః ॥ 137

తతస్తే తాం గుహాం గత్వా తచ్ఛ్వాసేన వికర్షితాః ।
యాతాయాతే ప్రచక్రుస్తే కుంభకర్ణోదరే ముహుః ॥ 138

తద్దైకత్ర బాహుపాశైర్బలం కృత్వాథ రాక్షసాః ।
గత్వా తదంతికం భీత్వా నిజఘ్నుస్తం ద్రుమైః పదైః ॥ 139

శిలాభిస్తాడయామాసుశ్చాశ్వైరుష్ట్రైర్వ్యచూర్ణయన్ ।
కాష్ఠభారైర్మహాదాహం దేహేచక్రుర్నృపాజ్ఞయా ॥ 140

తదా ప్రబుద్ధశ్చోత్థాయ సూకరాన్ మహిషాన్ వరాన్ ।
కోటిశః స్వముఖే క్షిప్త్వా జలవాపీర్విశోష్య సః ॥ 141

గత్వా నత్వా రాక్షసేంద్రం బోధయామాస రావణమ్ ।
ఏకదాఽహం వనే గత్వా దృష్ట్వా తం నారదం మునిమ్ ॥ 142

పృష్టవాంఽస్త్వం కుత్ర యాసి కుతశ్చాగమనం కృతమ్ ।
స మాం ప్రాహ దేవలోకాదయోధ్యాం ప్రతి గమ్యతే ॥ 143

రావణాదీన్ రణే హంతుం విష్ణుర్జాతోఽత్ర మానుషః ।
దేవవాక్యాత్త్వరయితుం రామం గచ్ఛామ్యహం జవాత్ ॥ 144

ఇత్యుక్త్వా మాం గతః సోఽథ ప్రేషయామాస రాఘవమ్ ।
ఇతి శ్రుతం మయా పూర్వం తవాగ్రే తన్నివేదితమ్ ॥ 145

అతోఽర్పయాద్య రామాయ సీతాం సఖ్యం కురు ప్రభో ।
ఇతి తద్వచనం శ్రుత్వా రావణస్తం వచోఽబ్రవీత్ ॥ 146

నిద్రావ్యాప్తేఽక్షిణీ తేఽద్య గచ్ఛ నిద్రాం సుఖం కురు ।
తద్బంధోః క్రూరవచనం శ్రుత్వా నత్వాఽథ రావణమ్ ॥ 147

## తన మృత్యువు రాముని చేతిలో గలదని రావణుడు చెప్పుట

శ్రీరామ, లక్ష్మణ, హనుమంతులను చూచి సుగ్రీవాదులు లంఘించి, పలుమార్లు వందించి, ఆనంద నిర్భరులైరి. శ్రీరాముడును పాతళమున జరిగిన వృత్తాంతమును సుగ్రీవాదులకు తెలిపెను.

పాతాళవాసులు తన మిత్రులైన అహిరావణ, మహిరావణులు మరణించిరను సంగతిని తెలుసుకుని రావణుడు సభలో భయభ్రాంతుడై, “మునుపు బ్రహ్మ నాకు మనుష్యుని వలననే మృత్యువు కలుగునని చెప్పెను. అందువలన నారాయణుడే ప్రత్యక్షముగా ఈ మానవాకృతినందియుండును.

అందులో సంశయములేదు. రాముడు దాశరథియై నన్ను సంహరించుటకు వచ్చియున్నాడు. మునుపు అయోధ్యరాజగు అనరణ్యుడు దీక్షితుడై యుండగా, నాచేత చంపబడినప్పుడు, అనరణ్య మహారాజు, “సూర్యవంశమైన నా ఈ వంశమున పరమాత్మ అవతరించుచున్నాడు. అతడే నీ పుత్ర, మిత్ర, పరివారముతోడ నిన్ను సంహరించునని” శాపమిచ్చి స్వర్గమునకు పోయెను. ఆ సమయ మిదిగో వచ్చినది. రాముడు వచ్చెను. యుద్ధమున నన్ను చంపును. త్వరగా మీరు కుంభకర్ణుని నిద్రలేపి నా వద్దకు తీసుకొని రండు,” అని భటులను ఆజ్ఞాపించెను. (137)

## కుంభకర్ణుడు నిద్రలేచి, యుద్ధముచేయుట.

రావణుని ఆజ్ఞతో రాక్షస భటులు కుంభకర్ణుని భవనమునకు వెడలిరి. ఆ కుంభకర్ణుని నిద్రలేపుటలో నానా అవస్థలు పడి, వాని ఉచ్ఛ్వాస నిశ్శ్వాసములకు ఊగిసలాడి, ఎట్లో తప్పించుకుని, కాళ్ళతోను, రాళ్ళతోను, చెట్లతోను కొట్టి, గుఱ్ఱములచేతను ఒంటెలచేతను త్రొక్కించి, కఱ్ఱలువేసి మంటపెట్టి, రాజాజ్ఞవలన ఎట్లో లేపిరి. అప్పుడు కుంభకర్ణుడు నిద్రలేచి– పందులను, దున్నపోతులను లెక్కలేనన్ని భక్షించి, బావులకొద్ది నీటిని త్రాగి, రావణుని వద్దకు వచ్చి నమస్కరించి, “నేనొకప్పుడు వనమున పోవుచు దారిలో నారదమునిని చూచి, “నీ వెచ్చటకు పోవుదువు? ఎచ్చటనుండి వచ్చితివి?” అని అడిగితిని. అందుకా ముని “దేవలోకమునుండి అయోధ్యకు పోవుచున్నాను. రణమున రావణాదులను చంపుటకు మాధవుడు మానుషరూపమునందుచున్నాడు. దేవకార్యమునుండి రాముని త్వరపెట్టుటకు పోవుచున్నాను,” అని ఇట్లు నాతో చెప్పెను. ఇట్లు నేను మునుపు వింటిని. నీ ఎదుట విజ్ఞాపించితిని. అందువలన శ్రీరామునికి సీతనర్పించి సఖ్యముచేయుము, అని హితమును ఉపదేశింపగా విని రావణుడు, “నీవు ఇపుడు నిద్రమత్తులో పడియున్నావు. పోయి నెమ్మదిగా నిద్రపొమ్ము,” అని నిరాకరించెను.

**జవాద్యయౌ స యుద్ధాయోల్లంఘ్య ప్రాసాదమున్నతమ్ ।**
**కుంభకర్ణం తతో దృష్ట్వా కృపణా భయవిహ్వలాః ॥ 148**

**చక్రుః పలాయనం సర్వే రామపార్శ్వముపాగతాః ।**
**కుంభకర్ణం తత్ర దృష్ట్వా ప్రణనామ విభీషణః ॥ 149**

**ఉవాచ ప్రణతో భూత్వా మయా రాజాఽతిబోధితః ।**
**సీతాం రామాయ దేహీతి తేన ధిగ్ధిక్కృతస్త్వహమ్ ॥ 150**

**తచ్ఛ్రుత్వాఽహం రాఘవస్య సేవాం కర్తుముపాగతః ।**
**తచ్ఛ్రుత్వా బంధువచనం కుంభకర్ణస్తమబ్రవీత్ ॥ 151**

సమ్యక్కృతం త్వయా వత్స మదగ్రే మా స్థిరో భవ ।
యుద్ధే స్వీయః పరో వాఽత్ర జ్ఞాయతే న మయాఽద్యహి ॥ 152

తతో బంధుం నమస్కృత్య రామపార్శ్వ ముపాయయౌ ।
కుంభకర్ణోఽపి హస్తాభ్యాం పాదాభ్యాం పేషయన్‌హరాన్ ॥ 153

చచార వానరీం సేనాం తత్ర దృష్ట్వా కపీశ్వరమ్ ।
త్రిశూలేనాథ తం భిత్వాఽఽనయామాస పురీం తు సః ॥ 154

మార్గే స్వస్థః స సుగ్రీవః కర్ణౌ ఘ్రాణం రిపోర్నఖైః ।
ఛిత్వా యయౌ రాఘవేంద్రం సోఽపి పౌరైర్విలజ్జితః ॥ 155

పునర్యయౌ రణభువం తం దృష్ట్వా రఘునందనః ।
వివ్యాథ నిశితైర్బాణైః సోఽపి రామం ద్రుమైర్నగైః ॥ 156

తాడయామాస తాన్ బాణైర్నివార్య రఘునందనః ।
వాయవ్యాస్త్రేణ చిచ్ఛేద తద్ధస్తౌ సాయుధౌ క్షణాత్ ॥ 157

ఛిన్నబాహుమథాయాంతం నదంతం వీక్ష్య రాఘవః ।
ద్వావర్ధచంద్రౌ నిశితావాదాయాస్య పదద్వయమ్ ॥ 158

చిచ్ఛేద పతితౌ పాదౌ లంకాద్వారి మహాస్వనౌ ।
నికృత్తహస్తపాదోఽపి కుంభకర్ణోఽతిభీషణః ॥ 159

బడబాముఖవద్వక్త్రం వ్యాదాయ రఘునందనమ్ ।
అభిదుద్రావ వినదన్ రాహుశ్చంద్రమసం యథా ॥ 160

రావణుని నుండి ఇట్టి కఠోరవాక్యమును విని, కుంభకర్ణుడు రావణుని స్తుతించి, నమస్కరించి, వేగముగా ప్రాసాదమును దాటి యుద్ధమునకు వచ్చెను. అచ్చట కుంభకర్ణుని చూచి వానరులు భయపడిరి. అందరు పరుగెత్తి పోయి శ్రీరామ పాదములను ఆశ్రయించిరి. అచ్చట విభీషణుడు కుంభకర్ణుని జూచి, నమస్కరించి, “అన్నా! సీతను రామునికి అర్పింపుమని రావణునికి ఎంతో నచ్చ చెప్పినను వాడు నన్ను ఛీ! ఛీ!! యని ధిక్కరించెను. అది విని నేను శ్రీరాముని సేవకై ఇచ్చటికి వచ్చితిని,” అని చెప్పగా, తమ్ముని మాటవిని కుంభకర్ణుడు, “మంచిపని చేసితివి” అయినా నీవు యుద్ధమున నా ఎదుట నిలువవలదు. ఇప్పుడు యుద్ధమున నాకు నావాడు, పరుడు అనుభేదము తెలియదు,”

అనెను. అది విని విభీషణుడు శ్రీరామసన్నిధికి పోయెను. కుంభకర్ణుడు చేతులు, కాళ్ళతో కపులను నలిపివేయుచు వానరసేనలో సంచరించుచు, సుగ్రీవుని జూచి, త్రిశూలమును చేతపట్టి, నేరుగా లంకకు ఎత్తుకొనిపోయెను. సుగ్రీవుడు దారిలో తన గోళ్ళతో, కుంభకర్ణుని ముక్కు, చెవులను కత్తరించుకుని రామసన్నిధికి తిరిగి వచ్చెను.

అపూరయచ్ఛితాగ్రైశ్చ సాయకైస్త్రద్రఘూత్తమః ।
శరపూరితవక్త్రోఽసౌ చుక్రోశాతిభయంకరః ॥ 161

అథ సూర్యప్రతీకాశమైంద్రం శరమనుత్తమమ్ ।
ముమోచ తేన చిచ్ఛేద కుంభకర్ణశిరో మహత్ ॥ 162

తదా ఖే దేవవాద్యాని నేదుః కుసుమవృష్టిభిః ।
వవర్షురమరా రామం తుష్టువుర్వివిధైః స్తవైః ॥ 163

పితృవ్యం నిహతం శ్రుత్వా పితరం చాతివిహ్వలమ్ ।
రావణిః సాంత్వయామాస త్వం మే పశ్యాద్య వై బలమ్ ॥ 164

ఇత్యుక్త్వా త్వరితం గత్వా మేఘనాదో నికుంభిలామ్ ।
రక్తమాల్యాంబరధరో హననాయోపచక్రమే ॥ 165

రథార్థం దివ్యశస్త్రార్థం జయార్థమభిచారకైః ।
యోగినీవటాధోభూమ్యాం గుహాయాం సంస్థితో రహః ॥ 166

తోయానిలానలవ్యాఘ్రసర్పరాక్షసకంటకైః ।
ఆత్మనః పరితః కృత్వా పరిఘాన్ సప్త దుర్గమాన్ ॥ 167

హోమకుండార్ధ్వతః సర్పం బద్ధ్వా కృష్ణమధోముఖమ్ ।
రక్త పుష్పాంబరధరో రక్తచందనలేపితః ॥ 168

రక్తపుష్పాక్షతా గుంజా సర్షపశ్చన్దనేక్షుభిః ।
ఖదిరామ్రపలాశోదుంబరభల్లాతకాస్థిభిః ॥ 169

సమిద్భిర్మాషమాంసాది భల్లాతకఫలైరపి ।
అర్కనింబబీజపూర కృష్ణదత్తూరరోచనైః ॥ 170

అపామార్గబదరికా నలదాలకబంధుకైః ।
నరముండః సమాంసైశ్చ బిభీతకఫలాదిభిః ॥ 171

సర్పషడైశ్చ మండూకైస్త్వగ్దంతస్నాయులోమభిః ।
నానావనచరాణాం చ మాంసైరపి సమంత్రకమ్ ॥ 172

ఇత్థం చకార హోమం స నిమీల్య నయనే రహః ।
విభీషణోఽపి తం దృష్ట్వా హోమధూమ్రం భయావహమ్ ॥ 173

కుంభకర్ణుడు ఊరివారిచే పరిహసింపబడి మరల యుద్ధభూమికి వచ్చెను. రాముడు వానిని జూచి తీక్ష్ణబాణములను ప్రయోగించెను. కుంభకర్ణుడును రామునిమీద చెట్లను, కొండలను విసరివేయుచు వచ్చెను. అంత ఆ రామచంద్రుడు ఆయుధములతో వాని చేతులను కత్తిరించెను. వాడు చేతులు లేకపోయినను గర్జించుచు వచ్చుచుండగా చూచి, రాముడు రెండు అర్ధచంద్ర బాణములచే వాని రెండుకాళ్ళను కత్తిరించెను. అవి లంకాద్వారమున ఘోరనాదము చేయుచూ పడెను. చేతులు, కాళ్ళు తెగిన కుంభకర్ణుడు పెద్ద గొయ్యివలె నోటిని తెరచి అరచుచు రాహువు చంద్రుని తరిమినట్లు వచ్చెను. శ్రీరాముడు నిశితబాణములను వానినోట కురిపించినను వాడు మిక్కిలి భయంకరముగా కేకవేయగా, శ్రీరాముడు గొప్పగా వెలిగే సూర్యునివంటి ఐంద్రాస్త్రమును ప్రయోగించి కుంభకర్ణుని తలను పగలగొట్టెను. అప్పుడు ఆకాశమున దేవవాద్యములు మ్రోగినవి. పూలవాన కురిసెను. దేవతలు నానాస్తుతులతో కొనియాడిరి. (163)

## లక్ష్మణుడు ఇంద్రజిత్తును సంహరించుట.

మేఘనాదుడు తన పినతండ్రి అయిన కుంభకర్ణుడు పడిపోయిన సంగతిని విని, చింతాక్రాంతుడైన తండ్రిని సమాధానపరచి, "నేడు నీవు నాయొక్క బలమును చూడుము," అని చెప్పి, త్వరగా మేఘనాదుడు నికుంభిలకు వెడలి, యోగినీ వృక్షమూలమున రహస్యముగా ఒక గుహలో నిలచి, రక్తపుష్పములను రక్త వస్త్రములను ధరించి, రథముకొరకును, దివ్యాస్త్రములకొరకును అభిచారిక మంత్రములచే యాగమును ఆరంభించెను. తనకు చుట్టూ దాటశక్యముగాని ఏడు ప్రాకారములను– జల, వాయు, అగ్ని, పులి, సర్ప, రాక్షస, కంటకములచే– కల్పించికొనెను. హోమకుండమునకు పైన తలక్రిందుగా నల్లత్రాచును కట్టి, రక్తపుష్ప రక్తచందనములను అలంకరించుకుని– ఎఱ్ఱని పూలు, రక్తాక్షతలు, గురువిందగింజలు, ఆవాలు, రక్తచందనము, చెఱకులు, చెంద్రమామిడి, మోదుగ, రాగి, నల్లజీడి, ఎముకలు, ఇట్టి సమిదలు, మినుములు, మాంసము, జీడిపండ్లు, జిల్లేడు, వేప, మాదీఫలము, నల్లఉమ్మెత్త, నిమ్మ, ఉత్తరేణి, రేగు, పద్మోత్పలాదులు, అరికెలు, బంధూకము, నరమాంసము,

తలపుఱ్ఱెలు, తాటిపండ్లు- మొదలైనవి- పాముతునకలు, కప్పలు, చర్మములు, దంతములు, వెంట్రుకలు, నరములు, వివిధ వన్యమృగ మాంసములు- వీటన్నిటిని పెట్టికొని మంత్రములతోడ రహస్యముగ కండ్లుమూసికొని హోమము చేసెను.

ప్రాహ రామాయ సకలం హోమారంభం దురాత్మనః ।
సమాప్యతే చేద్ధోమోఽయం మేఘనాదస్య దుర్మతేః ॥ 174

స చాజయ్యో భవేద్రామ మేఘనాదః సురాసురైః ।
అతః శీఘ్రం లక్ష్మణేన ఘాతయిష్యామి రావణిమ్ ॥ 175

యస్తు ద్వాదశ వర్షాణి నిద్రాహారవివర్జితః ।
తేనైవ మృత్యుర్నిర్దిష్టో బ్రహ్మణాఽస్య దురాత్మనః ॥ 176

లక్ష్మణోఽయం యదాఽయోధ్యాపుర్యాస్త్వామనునిర్గతః ।
తదాది నిద్రాహారాదీన్న ప్రాప్తః స రఘూత్తమ ॥ 177

సేవార్థం తవ రాజేంద్ర జ్ఞాతం సర్వమిదం మయా ।
తతో రామాజ్ఞయా గత్వా లక్ష్మణేన విభీషణః ॥ 178

హనుత్ప్రముఖైర్వీరైర్యూథపైః సర్వతో వృతః ।
లక్ష్మణం దర్శయామాస హోమస్థానం నికుంభిలామ్ ॥ 179

అంగదస్కంధమారుహ్య వహ్న్యాస్త్రేణాథ కంటకాన్ ।
జ్వాలయామాస సౌమిత్రిర్జఘాన రాక్షసాంశ్చరైః ॥ 180

గరుడాస్త్రేణ సర్పాంశ్చ పర్వతాస్త్రేణ దంష్ట్రిణః ।
అనలం శాంతమకరోత్పర్జన్యాస్త్రేణ లక్ష్మణః ॥ 181

ప్రాశయామాస హనుమాననిలం క్షణమాత్రతః ।
జలం సంశోషయామాస వాయవ్యాస్త్రేణలక్ష్మణః ॥ 182

పరిఘేష్వపి నష్టేషు తత్రాదృష్ట్వా రిపోః స్థలమ్ ।
యయావుత్పాటితుం క్రోధాద్ధనుమాన్యోగినీవటమ్ ॥ 183

**తదా తాం దర్శయామాస వటస్థాం యోగినీగుహామ్ ।**
**గుహాపిధానపాషాణం హనూమాన్పాదఘట్టనైః ॥ 184**

**చూర్ణీకృత్య గుహాసంస్థం మేఘనాదం వ్యతర్జయత్ ।**
**తదా స మేఘనాదోఽపి త్యక్త్వా హోమం త్వరాన్వితః ॥ 185**

**క్రోధావిష్టో రథే స్థిత్వా యయౌ లక్ష్మణసమ్ముఖమ్ ।**
**శస్త్రైరస్త్రైః పర్వతాద్యైర్మర్మభిద్భిర్నిజోక్తిభిః ॥ 186**

విభీషణుడు ఆ ఘోర హోమధూమమును చూచి రామునితో, "స్వామీ! దుష్టుడైన మేఘనాథుని యొక్క ఈహోమము నెరవేరినచో వాడు దేవ రాక్షసులచేత కూడా జయింపబడడు. అందువలన త్వరగా లక్ష్మణునిచే ఈ మేఘనాదుని చంపించెదను. ఎవడు 12 సంవత్సరములు నిద్రాహారములు లేకయుండునో వానివలన మాత్రమే వీనికి మృత్యువు కలుగునని బ్రహ్మశాపము. ఈ లక్ష్మణుడు నీవు అయోధ్యను వదిలినది మొదలుకొని ఇంతవరకు నీ సేవకై నిద్రాహారములు ఎరుగడు. మహారాజా! ఈ సంగతిని నేనెరుగుదును," అని విన్నవించెను. మరియు అట్లేయని శ్రీరామాజ్ఞ పొంది, విభీషణుడు హనుమంతుడు మొదలైన సేనావీరులతో కూడి, లక్ష్మణునికి హోమస్థానమగు నికుంభిలను చూపెను. అంత ఆ లక్ష్మణుడు అంగదుని మీద ఎక్కి, ఆగ్నేయాస్త్రముచే ముండ్లను కాల్చివేసెను. రాక్షసులను సంహరించెను. గరుడాస్త్రముచే సర్పములను, పర్వతాస్త్రముచే పులులను, పర్జన్యాస్త్రముచే అగ్నిని శాంతపరచెను. ఆంజనేయుడు నిముషములో వాయువును పీల్చివేసెను. లక్ష్మణుడు వాయవ్యాస్త్రముచే నీటిని ఎండగట్టెను. ఇట్లు కోటలను ధ్వంసముచేసినను శత్రువుయొక్క స్థానము కనబడనందున క్రోధమునందిన హనుమంతుడు యోగినీ ఉంటున్న మఱ్ఱి పెకలింపబూనెను. అప్పుడు ఆ మఱ్ఱి వృక్షమున ఉన్న యోగిని ఆ గుహను చూపెను. హనుమంతుడు ఆ గుహద్వారమున పెట్టిన పెద్దపెద్ద బండరాళ్ళను కాళ్ళతో త్రొక్కి పొడిచేసి, గుహలోఉన్న మేఘనాదుని భయపెట్టెను.

**చకార లక్ష్మణేనైవ యుద్ధం తత్తారకామయమ్ ।**
**సౌమిత్రిరపి బాణౌఘై రథమశ్వాన్ ధనుర్ధ్వజమ్ ॥ 187**

**తద్దృఢం కవచం సూతం బిభేధ క్షణమాత్రతః ।**
**తతః సోఽన్యేన ధనుషా ముక్త్వా బాణాన్సహస్రశః ॥ 188**

**పద్భ్యామేవాస్థితో భూమ్యాం చిచ్ఛేద కవచం రిపోః ।**
**తదా క్రుద్ధః స సౌమిత్రిర్బాణేనేంద్రజితం చ హి ॥ 189**

సశరం దక్షిణభుజం పాతయామాస తద్గృహే ।
తదా స వామహస్తేన మేఘనాదోఽతివిహ్వలః ॥ 190

దుద్రావ లక్ష్మణం హంతుం ధృత్వా శూలమనుత్తమమ్ ।
తం చాపి మార్గణేనైవ సశూలం వామసత్కరమ్ ॥ 191

మేఘనాదస్య సౌమిత్రి శ్ఛిత్వా రావణసన్నిధౌ ।
పాతయామాస లంకాయాం తదద్భుతమివాభవత్ ॥ 192

తదా వ్యాదాయ స్వముఖం రావణిర్లక్ష్మణం యయౌ ।
లక్ష్మణోఽపి శరం దివ్యం రామనామాంకితం శుభమ్ ॥ 193

ముమోచ రఘువీరస్య కృత్వా చింతనమాదరాత్ ।
స శరః సశిరస్త్రాణం శ్రీమజ్జ్వలితకుండలమ్ ॥ 194

ప్రమథ్యేంద్రజితః కాయాత్పాతయామాస తచ్ఛిరః ।
తతః ప్రముదితా దేవాః సౌమిత్రిం పరితుష్టువుః ॥ 195

పుష్పాణి వికిరంతో వై చక్రుర్నీరాజనం ముహుః ।
గతశ్రమః స సౌమిత్రిః శంఖమాపూరయద్రణే ॥ 196

శ్రుత్వా సీతా శంఖనాదం త్రిజటాం ప్రేష్య సాదరమ్ ।
శుశ్రావ సకలం వృత్తం తద్వాక్యాత్ప్రతుతోష సా ॥ 197

తతస్తన్మేఘనాదస్య శిరః సంగృహ్య మారుతిః ।
రాఘవాయ దర్శయితుం త్వరయామాస లక్ష్మణమ్ ॥ 198

తదా స వానరైర్యుక్తోఽంగదస్థః స విభీషణః ।
నానావాద్యం నినాదైశ్చ సౌమిత్రీ రాఘవం యయౌ ॥ 199

నత్వా తం దర్శయామాస మేఘనాదస్య తచ్ఛిరః ।
తద్దృష్ట్వాఽఽలింగ్య సౌమిత్రిం రామస్తుష్టోఽభవత్తదా ॥ 200

అపుడా మేఘనాదుడు అభిచార హోమమును వదలి, వేగముగా కోపముతో రథమునెక్కి, లక్ష్మణుని ఎదుటకు వచ్చెను. శస్త్రాస్త్రములచేతను, పర్వతాదులచేతను, తీవ్రపదజాలముచేతను,

మేఘనాదుడు లక్ష్మణునితో దారుణ యుద్ధమును చేయగా, లక్ష్మణుడు బాణసమూహముచే క్షణ మాత్రమున వాని రథమును, గుఱ్ఱములను, ధనుస్సును, ధ్వజమును, దృఢకవచమును, సారథిని కత్తిరించెను. అంత ఇంద్రజిత్తు వేరే ధనుస్సును అందుకుని, నేలమీదనే నిలచి వేలకొలది బాణములను ప్రయోగించుచు. లక్ష్మణుని కవచమును ఛేదించి వాని ఇంట పడవేసెను. వాడు మహాశూలమును ఎడమచేతితో పట్టి సౌమిత్రిని సంహరింపవలెనని ముందుకు వచ్చెను. లక్ష్మణుడు శూలసహితమగు వాని ఎడమభుజమును రావణుని ఎదుట పడునట్లు ఛేదించెను. అది మిక్కిలి ఆశ్చర్యముగా తోచినది. అంత ఆ మేఘనాదుడు తన నోరు తెరచుకొని లక్ష్మణుని మ్రింగవచ్చెను. సౌమిత్రి అప్పుడు శ్రీరామనామాంకితమైన దివ్యమంగళ బాణమునొకదానిని రాముని ధ్యానించుచు ప్రయోగించెను. ఆ శరము కవచకుండలాలంకృతమగు మేఘనాదుని తలను త్రుంచివేసెను. అంత ఆనందించిన దేవతలు లక్ష్మణుని కొనియాడిరి. మరి హారతులెత్తుచు, పూలవాన కురిపించిరి. విశ్రాంతినొందుచూ లక్ష్మణుడు శంఖనాదమొనరించెను. జానకి ఆ నాదమును విని, త్రిజటను పంపి ఆ వృత్తాంతమును తెలుసుకుని సంతోషించెను.

అంత ఆంజనేయుడు మేఘనాదుని తలను ఎత్తుకొని శ్రీరామునికి చూపుటకై సౌమిత్రిని త్వరపెట్టెను. అపుడు లక్ష్మణుడు అంగదునిమీద ఎక్కి వానరులతోను, విభీషణునితోను, అనేక వాద్యములతోను శ్రీరామునివద్దకు వచ్చి నమస్కరించి, ఆ తలను చూపెను. దానినిజూచి రాఘవుడు తమ్ముని హత్తుకుని పొగడెను (200)

**రావణోఽపి భుజం దృష్ట్వా శ్రుత్వా పుత్రవధం తథా ।**
**పపాత పుత్రదుఃఖేన సభాయాం మూర్ఛితో భువి ॥ 201**

**క్రోధాత్స ఖడ్గముద్యమ్య యయౌ హంతుం విదేహజామ్ ।**
**సుపార్శ్వో నామ మేధావి మంత్రీ తం సంన్యవారయత్ ॥ 202**

**సఖడ్గం తత్కరం ధృత్వా స్వహస్తే స త్వరాన్వితః ।**
**ఉవాచ నీతి సంయుక్తం వచనం రావణం తదా ॥ 203**

**కథం నామ దశగ్రీవ కోపాత్ స్త్రీవధమిచ్ఛసి ।**
**అస్మాభిః సహితో యుద్ధే హత్వా రామం సలక్ష్మణమ్ ॥ 204**

**ప్రాప్స్యసే జానకీం శీఘ్రమిత్యుక్తః స న్యవర్తత ।**
**సులోచనాఽపి కాంతస్య భుజం కేయూరభూషితమ్ ॥ 205**

దృష్ట్వా సమార్గణం స్వీయం పురతః పతితం భువి ।
తదా విలాపమకరోత్ స్మృత్వా తత్పౌరుషాణి సా ॥ 206

భుజోఽపి సాంత్వయన్ తాం స లేఖ్య భూమ్యాం శరేణ హి ।
స్వలోహితాక్షరైః ప్రాహ మా ఖేదం భజ భామిని ॥ 207

సాక్షాచ్ఛేషశరాఘాతైర్వ్రతోఽహం ముక్తిమాగతః ।
త్వం చాపి గత్వా శ్రీరామం నత్వా యాచస్వ మచ్ఛిరః ॥ 208

తత్త్వాం దాస్యతి రామోపి తేనాగ్ని విశ్య యాహి మామ్ ।
సులోచనా పఠిత్వా సా లిఖితాన్యక్షరాణి హి ॥ 209

తుష్టా పృష్ట్వా రావణాయ మందోదర్యా విభూషితా ।
యయౌ రామం శిబికాయా తాం దృష్ట్వా వానరోత్తమాః ॥ 210

సీతేయం రావణేనాద్య భయాద్రామం విసర్జితా ।
ఇతి మత్వా దుద్రువుస్తే సీతాయా దర్శనేచ్ఛయా ॥ 211

శిబికాం వేష్టయామాసుర్జ్ఞాత్వా తాం తు సులోచనామ్ ।
శిబికావాహకాస్యేనాఽయయుః శ్రీరాఘవం పునః ॥ 212

## మేఘనాదుని భార్య వైకుంఠమునకు పోవుట

రావణుడు మేఘనాదుని భుజమును చూచి, పుత్రవధను విని సభలో మూర్ఛితుడయ్యెను. మరియు అట్లే లేచి క్రోధావిష్టుడై కత్తినెత్తికొని జానకిని సంహరించుటకై అశోకవాటికకు పోయెను. అపుడు సుపార్శ్వుడు అను బుద్ధిమంతుడైన మంత్రి వాని ఖడ్గహస్తమును త్వరగా పట్టుకొని, "దశకంఠుడా! కోపముచే నీవేమని స్త్రీవధను చేసెదవు? మా తోడ నీవు యుద్ధమున రామలక్ష్మణులను సంహరించి, త్వరగా జానకిని అందుదువుగాక!" అని నీతిసమ్మతమైన యథోచిత మాటలచే నివారించెను. మేఘనాదుని పత్ని యగు సులోచన అను ఆమె తన ఎదుటపడిన అలంకారమయమైన, బాణాలంకృత మైన భర్తయగు మేఘనాదుని భుజమును చూచి, వాని పౌరుషములను స్మరించుచు ప్రలాపములు పలికెను. మేఘనాదుని ఆ భుజము సులోచనను ఓదార్చుచు తన రక్తాక్షరములను బాణముతో, "దుఃఖింపవలదు. కాంతా! ప్రత్యక్షమూర్తియైన శేషుని బాణపు దెబ్బచే నేను ముక్తినందితిని. నీవును శ్రీరామ సన్నిధికి పోయి నమస్కరించి, నా తలకొరకు వేడుము. రాముడు దానిని నీకిచ్చును. దానితోడ

అగ్నిలో ప్రవేశించి సతీ సహగమనముతో నావద్దకు రమ్ము." అని ఉపదేశించెను. సులోచన దానిని జదివికొని, సంతసించి, సాలంకృతగా అత్తమామల అనుజ్ఞనొంది, పల్లకినెక్కి శ్రీరామసన్నిధికివచ్చెను. దానిని చూచి, వానరవీరులు, "రావణుడు వెరచి, శ్రీరామ సన్నిధికి సీతను పంపెను," అని ఎంచి, సీతాదర్శన కుతూహలముచే పరుగెత్తిరి. ఇట్లువచ్చి పల్లకిని చుట్టుకొని వాహకులవలన సులోచన అని తెలిసి మరల రామసన్నిధికి చేరిరి.

**సులోచనాఽపి శ్రీరామం ననామ శిరసా ముహుః ।**
**భర్తుః శిరః కాంక్షమాణాం తాం రామో వాక్యమబ్రవీత్ ॥ 213**

**కృపయా తవ భర్తారం కరోమ్యద్య సజీవితమ్ ।**
**మా విశస్వాద్య వహ్నిం త్వం రోచతే చేద్వదస్వ మామ్ ॥ 214**

**తదా సా ప్రాహ శ్రీరామం పునః సౌమిత్రిహస్తతః ।**
**కుతో భవేతన్మరణం మోక్షదం జీవయస్వ మా ॥ 215**

**ఇత్యుక్త్వా రాఘవం దత్వా సస్మితం కపివాక్యతః ।**
**కృత్వా శిరః పతేస్తత్ర లబ్ధ్వా సా భర్తృసచ్ఛిరః ॥ 216**

**లంకాయాస్తౌ సమానీయ భుజౌ గత్వా నికుంభిలామ్ ।**
**భర్తృదేహేన సంయోజ్య వివేకాగ్నిం యథావిధి ॥ 217**

**సులోచనా దివ్యదేహా వైకుంఠం పతినా యయౌ ।**
**రావణోఽపి సుహృన్మిత్రైః పునర్యోద్ధుం యయౌ రణమ్ ॥ 218**

**తతో రామేణ నిహతాః సర్వే తే రాక్షసా యుధి ।**
**లంకాయాం రావణః క్షిప్తః శరేణ రాఘవేణ సః ॥ 219**

**తతః కృత్వా రామశిరః కృత్రిమం మయహస్తతః ।**
**యయౌ సీతాం దర్శయితుం రావణోఽశోకకాననమ్ ॥ 220**

**ఏతస్మిన్నంతరే బ్రహ్మా బోధయామాస జానకీమ్ ।**
**కృతమస్తి రావణేన కృత్రిమం రామసచ్ఛిరః ॥ 221**

**తద్దృష్ట్వా మా భజస్యాద్య ఖేదం త్వమధునాఽబలే ।**
**ఇతి సంబోధ్య తాం సీతాం బ్రహ్మాఽన్తర్ధానమాయయౌ ॥ 222**

**రావణోఽపి సమాగత్య దర్శయామాస తచ్ఛిరః ।**
**సీతాం ప్రాహ హతో రామస్త్వధునా త్వం భజస్వ మామ్ ॥ 223**

సులోచనయును శ్రీరామునికి తలవంచి నమస్కరించి, తన భర్తయొక్క శిరస్సునువేడగా; శ్రీరాఘవుడు, "దయతో నీ భర్తను బ్రతికించి యిచ్చెదను. సహగమనము చేయవలదు. నీ కిదిష్టమా?" అని అనుగ్రహించెను. అందుకామె నమస్కరించి, "మోక్షప్రదమగు మరణము మరల లక్ష్మణునిచేత ఎందుకు కలగాలి? గనుక స్వామీ! మీరు మేఘనాదుని తిరిగి బ్రతికింపవలదు," అని చెప్పెను. కపి మాటచే భర్త మందహాసయుతమగు తలను తీసికొని, లంకనుండి ఆ రెండు భుజములను తెప్పించెను. అంత ఆ సులోచన దివ్యదేహమునొంది, పతితో వైకుంఠమునకు పోయెను. (218)

రావణుడు సీతకు మాయజూపి విముఖుడై, యాగవిఘ్నమునొంది, అసురలతో కూడి మరల యుద్ధక్షేత్రమునకు వచ్చెను. అంత ఆ రాక్షసులందరును శ్రీరామునిచే సంహరింపబడిరి. రామబాణముచే ఎగరగొట్టబడి రావణుడు లంకలోపడెను. పిదప ఆ రావణుడు మయునిచేత కృత్రిమ రామ శిరస్సును చేయించి, సీతకు చూపుటకై అశోకవనమునకు వచ్చెను. అంతలో బ్రహ్మదేవుడు వచ్చి సీతకు, "అమ్మా! రావణుడు మోసముచే ఒక శ్రీరామ మస్తకమును చేయించుకొని వచ్చుచున్నాడు. ఇప్పుడు దానిని చూచి చింతింప వలదు," అని బోధించి అంతర్హితుడయ్యెను. రావణుడు వచ్చి ఆ తలను చూపి సీతతో, "ఇదిగో రాముడు చచ్చెను. ఇప్పుడైనను నన్ను భజింపుము," అని పలికెను.

**తదా సాఽధోముఖీ ప్రాహ తవైవాహం శిరాంసి హి ।**
**రామబాణైశ్చ పశ్యామి పతితాని రణాంగణే ॥ 224**

**ఇతి తద్వాక్యరాఘాతతాడితః స దశాననః ।**
**యయౌ తూష్ణీం స్వయం గేహం లజ్జయాఽవనతస్తదా ॥ 225**

**అథ రామాజ్ఞయా సర్వే లంకాం ప్రాసాదమండితామ్ ।**
**ఇషికాచూడహస్తాస్తే వానరాః కోటిశః క్షణాత్ ॥ 226**

**జ్వలయామాసుః సర్వత్ర దత్వా వహ్నిం ముహుర్ముహుః ।**
**తదా కోలాహలశ్చాసీల్లంకాదాహే పురా యథా ॥ 227**

**దగ్ధాం స్వనగరీం దృష్ట్వా స్వగృహాణ్యపి రావణః ।**
**దృష్ట్వా దగ్ధాని కపిభిర్మేఘాస్త్రం ససృజే జవాత్ ॥ 228**

తేనాసీదనలః శాంతస్తద్దృష్ట్వా కపయో యయుః ।
తతః స రావణః శుక్రవచనాద్రహసి స్థితామ్ ॥ 229

గుహాం ప్రవిశ్య చైకాంతే మౌనీ హోమం ప్రచక్రమే ।
లంకాద్వారకపాటాది బద్ధ్వా సర్వత్ర యత్నతః ॥ 230

హోమద్రవ్యాణి సంగృహ్య యాన్యుక్తాని మయాపురా ।
రక్తావగాహితో ముండమాలీ ప్రేతాసనస్థితః ॥ 231

పరిస్తీర్యాథ శస్త్రాణి హోమకుండం సమంతతః ।
అదశాహబాలకానాం శిరోభిర్మాంసలోహితైః ॥ 232

ఏవం స రిపుగాతార్థం చకార హవనం రహః ।
ఉత్థితం ధూమ్రమాలోక్య రామం ప్రాహ విభీషణః ॥ 233

యది హోమసమాప్తిః స్యాత్తదాఽజేయో భవేదయమ్ ।
తతో రామో హరీన్సర్వాన్ప్రేషయామాస సాదరమ్ ॥ 234

ప్రాకారం లంఘయిత్వా తే గత్వా రావణమందిరమ్ ।
హత్వా రాక్షసవృందం తద్గుహారక్షణతత్పరమ్ ॥ 235

## రావణుడు యాగవిఘ్నమునొంది మరల రణమునకు వచ్చుట

అందుకు సీత తలవంచుకుని, "శ్రీరామ బాణములచే కత్తిరింపబడి యుద్ధమున పడిన నీ తలలనే చూచెదను," అని చెప్పగా ఆ పొడుపుమాటలచే లజ్జితుడైన రావణుడు తిరిగి ఊరక తన యింటికి వచ్చెను.

పిమ్మట శ్రీరామాజ్ఞచే కోతులంతా గడ్డిమోపులను ఎత్తుకుని లంకలోని భవనములకు నిప్పుముట్టించి తగులబెట్టిరి. మునుపు హనుమంతుడు లంకను కాల్చినపుడు ఎట్లు కోలాహలమయ్యెనో అట్లు ఇపుడు కోలాహలమాయెను. లంకానగరము కాలిపోవుటను జూచిన రావణుడు మేఘాస్త్రమును ప్రయోగించి నిప్పును చల్లార్చెను. పిమ్మట శుక్రాచార్యుని మాటమీద రావణుడు రహస్యముగా ఒంటరిగా గుహలో ప్రవేశించి, మౌనముతో అభిచార హోమమును ఆరంభించెను. లంకయొక్క ప్రధాన ద్వారములన్నీ మూయబడెను.

పార్వతీ! నేను మునుపు చెప్పినవే హోమద్రవ్యములు. అపుడు నెత్తురులో మునిగి, పుఱ్ఱెల హారమును మెడలో వేసికొని, ప్రేతాసనాసీనుడై హోమకుండము చుట్టు శస్త్రములను పరచి, పది

దినములవరకు మాంసముచే ఎట్టినివియైన బాలుల తలలచే శత్రునాశనము కొరకు హోమము చేయుచుండెను. అపుడు గగనమున పొగక్రమ్మగా విభీషణుడు దానినెరిగి రామునితో, "స్వామీ! ఈ హోమము ముగెసెనా వీడు జయింపబడడు," అని చెప్పగా శ్రీరఘునందనుడు అభిచార హోమనాశనమునకు వానరులందరిని లంకకు పంపెను. వారు ప్రాకారమును దాటి, రావణుని ఇంటికి వెడలి, ఆ గుహరక్షణనిష్ఠులైన రాక్షసులను సంహరించిరి. అయినా హోమము చేయుచుండు గుహను కనుగొనలేకపోయిరి.

న దదృశుర్గుహాద్వారం యత్ర హోమం చకార సః ।
తతశ్చ సరమానామ ప్రభాతే కరసంజ్ఞయా ॥ 236

విభీషణస్య భార్యా తాన్ హోమస్థానమసూచయత్ ।
గుహాపిధానపాషాణానంగదః పాదఘట్టనైః ॥ 237

చూర్ణయిత్వా రావణం చ తాడయామాస ముష్టినా ।
వానరాస్తేఽపి తం వృక్షైస్తాడయామాసురాదరాత్ ॥ 238

తద్వృత్తే వానరా దృష్ట్వా తూష్ణీమేవ స్థితం రిపుమ్ ।
సమానయన్కేశపాశే ధృత్వా మందోదరీం శుభామ్ ॥ 239

విలపంతీం ముక్తనీవీం విహ్వలాం హృతకంచుకీమ్ ।
దృష్ట్వా త్యక్త్వా తదా హోమముదతిష్ఠత్త్వరాన్వితః ॥ 240

తతస్తే వానరా స్సర్వే యయుః శ్రీరాఘవాంతికమ్ ।
తతో మందోదరీ ప్రాహ కురు త్వం వచనం మమ ॥ 241

దత్వా సీతాం రాఘవాయ రాజ్యే కృత్వా విభీషణమ్ ।
తపశ్చర్యాం మయాఽరణ్యే కర్తుమర్హసి వై సుఖమ్ ॥ 242

తత్తస్యా వచనం శ్రుత్వా తాం స ప్రాహ దశాననః ।
రామో విష్ణుశ్చ మా సీతా జానామి ప్రాణవల్లభే ॥ 243

రామహస్తాద్వయం లబ్ధుం హృతా సీతా పురా మయా ।
రామహస్తాత్త్యక్తదేహో గచ్ఛామి పరమం పదమ్ ॥ 244

**త్వయా కార్యాం క్రియే మే హి ప్రవిశస్వ నలం తతః ।**
**తతః సుఖం మయా ముక్తా గమిష్యామి పరం పదమ్ ॥ 245**

**ఇత్యుక్త్వా ప్రయయౌ యోద్ధుం రథే స్థిత్వా త్వరాన్వితః ।**
**రాజద్వారాద్వినిర్గచ్ఛన్నగ్రే ముండీ విలోకితః ॥ 246**

**ముకుటః పతితశ్ఛత్ర స్సవింగ్నో రావణో హృది ।**
**తతో యయౌ రణభువం వవర్ష నిశితైః శరైః ॥ 247**

విభీషణుని పత్నియైన సరమ వానరులకు రావణుడు చేయుచున్న హోమ ప్రదేశమును చూపించెను. ఆ ప్రదేశపు గుహ యొక్క ద్వారమునకు అడ్డముగా మూసి ఉంచిన బండరాయిని అంగదుడు కాళ్ళతో త్రొక్కి, పొడిచేసి, లోనికి ప్రవేశించి రావణుని ఒక గ్రుద్దు గుద్దెను. మిగిలిన వానరులును చెట్లతో కొట్టిరి. మందోదరిని చూచి సిగబట్టి ఈడ్చుకొని వచ్చిరి. విలపించుచున్న మందోదరిని చూచి రావణుడు హోమమును చాలించి లేచెను. కపులు శ్రీరామసన్నిధికి వచ్చిచేరిరి. అపుడు మందోదరి రావణునితో, "నాథా! నా మాట వినుము. రామునికి సీతను సమర్పింపుము. విభీషణునికి రాజ్యపట్టము గావించి, సుఖముగా నాతోడ వనమున తపనకు సిద్ధపడుము," అని ప్రార్థింపగా; అందుకు రావణుడు, "శ్రీరాముడే శ్రీమన్నారాయణుడు, సీతయే రమాదేవి, అని నేనెరుగుదును. రామునిచే మరణమునందుటకై నేను మునుపు సీతను అపహరించితిని. రామునిచేత చచ్చినచో నేను పరమపదమునందుదును. నీవు నాయొక్క క్రియలను పూర్తిజేసిన పిమ్మట అగ్నిప్రవేశముజేసి, నాతోడ పరమపదమునందుము." అని చెప్పిన రావణుడు స్నానము చేసి, రథము నెక్కి త్వరగా యుద్ధమునకు వెడలెను.

**విధాయ కృత్రిమాం సీతాం భయేన స దశాననః ।**
**పశ్యతాం వానరాణాం చ స్వరథే తాం జఘాన వై ॥ 248**

**దివ్యేన శితఖడ్గేన దృష్ట్వా తే తు ప్లవంగమాః ।**
**హాహేత్యుక్త్వా దుఃఖితాస్తే యయూ రామం నివేదితుమ్ ॥ 249**

**తావద్వేధాః సమాగత్య రామాదీన్ ప్రాహ సాదరమ్ ।**
**కృత్రిమేయం హతా సీతా మా ఖేదం భజతాఽద్య హి ॥ 250**

**తతోఽన్తర్ధానమగమద్విధిస్తేఽపి ప్లవంగమాః ।**
**రామాద్యా బ్రహ్మవాక్యేన తుష్టా యుద్ధాయ నిర్యయుః ॥ 251**

తదా స మాతలిః శీఘ్రం దేవేంద్రవచనాద్రథమ్ ।
శస్త్రాస్త్రవాజిసహితమశనిధ్వజశోభితమ్ ॥ 252

వరచ్ఛత్రసమాయుక్తం రాఘవాగ్రే న్యవేదయత్ ।
తమారుహ్య తదా రామశ్చకార కదనం మహత్ ॥ 253

ఆగ్నేయేన తదాగ్నేయం దైవం దైవేన రాఘవః ।
అస్త్రం రాక్షసరాజస్య జఘాన పరమాస్త్రవిత్ ॥ 254

తతస్తు ససృజే ఘోరం రాక్షసః సార్పమస్త్రవిత్ ।
రామః సర్పాంస్తతో దృష్ట్వా సౌపర్ణాస్త్రం ముమోచ సః ॥ 255

అస్త్రైః ప్రతిహతే యుద్ధే రామేణ దశకంధరః ।
పర్జన్యం ససృజే ఘోరం వాయవ్యాస్త్రేణ రాఘవః ॥ 256

తదస్త్రం వినివార్యాసౌ వహ్న్యస్త్రం ససృజే పునః ।
పర్జన్యాస్త్రేణ పౌలస్త్యశ్చకార విఫలం తదా ॥ 257

నాగానామయుతం తురంగనియుతం సార్ధం రథానాం శతమ్
పత్తీనాం శతకోటినాశసమయే త్వేకా కబంధా నృతిః ।
ఏవం కోటికబంధనర్తనవిధావేకా ధ్వనిః కింకిణే-
ర్వింశత్యాః ప్రహరార్ధతో రఘుపతేః కోదండఘంటారణే ॥ 258

రావణుడు రాజమందిరమునుండి యుద్ధమునకు బయలుదేరగానే మొదట ముండిని చూచెను. కిరీటము జారిపోగా మదిలో చింతబయలుదేరెను. యుద్ధభూమికి వెడలి శరవర్షము గురిపించెను మరియు భయముచే ఆ రావణుడు కపులందరూ చూచుచుండగా కృత్రిమసీతను కల్పించి, తన రథమున ఖడ్గముచే గొట్టి ఆమెను చంపెను. దానిని చూచి కపులు హాహాకారమును జేయుచు, ఆ సంగతిని శ్రీరామునికి విన్నవించుటకై పరుగెత్తిరి. ఆ వేళకు బ్రహ్మదేవుడు వచ్చి సాదరముగా రామాదులతో, "ఇపుడు చంపబడినది కృత్రిమ సీత మీరు దుఃఖింపవలదు." అని చెప్పి అంతర్ధానము నొందెను. ఆ కపివీరులును, శ్రీరామాదులును బ్రహ్మవాక్యముచే ఆనందించి యుద్ధమునకు వెడలిరి. అప్పుడు ఇంద్రుని ఆజ్ఞతో రథసారథి మాతలి వజ్రధ్వజమును, దివ్యఛత్రమును, శస్త్రాస్త్రములను, దివ్య అశ్వములు గల రథమును తీసుకునివచ్చి శ్రీరామునకు అర్పించెను. దానినెక్కి రఘువీరుడు యుద్ధమును ఆరంభించెను. సర్వాస్త్ర సారవిదుడగు రాముడు ఆగ్నేయాస్త్రమున, ఆగ్నేయాస్త్రమును,

దైవాస్త్రమున దైవాస్త్రమును, ఇట్లే రావణుని అస్త్రములన్నిటిని ఉపసంహారము చేయుచురాగా, ఆ దశకంఠుడు మహానాగాస్త్రమును ప్రయోగించగా అది శ్రీరాముని గరుడాస్త్రముచే నాశనముకాగా, రావణుడు మరల ఆగ్నేయాస్త్రమును ప్రయోగించెను పర్జన్యాస్త్రముచే అది చల్లబడిపోగా, అస్త్రములు విఫలములని రావణుడు నిరాశచెందెను. ఇట్లు జరుగుచుండు ఘోర యుద్ధమున పదివేల ఏనుగులు, లక్షగుఱ్ఱములు, నూటయాభై రథములు, నూరుకోట్లు పదాతులును వినాశనమయ్యెను. ఇంతటి సంఖ్య అంతమైన ప్రతిసారీ శ్రీరాముని కోదండమునకున్న జే గంట ఒక్కసారి మ్రోగును.

తదా ఖే కౌతుకం ద్రష్టుం సమాజగ్ముః సురా ముదా ।
గంధర్వాః కిన్నరా యక్షా విమానశతసంస్థితాః ॥ **259**

తదాఽశనిధ్వజం రమ్యం బాణైశ్చిచ్ఛే దరావణః ।
తం దృష్ట్వా రామచంద్రోఽపి ధ్వజహీనం రథం నిజమ్ ॥ **260**

మారుతిం ప్రాహ వేగేన క్షణం తిష్ఠ ధ్వజోపరి ।
తథేత్యుక్త్వా మారుతిః స తాలముత్పాట్య వేగతః ॥ **261**

గత్వా రామరథే దివ్యే తస్మింస్తస్థౌ స్వయం ముదా ।
తం మారుతిధ్వజం దృష్ట్వా రావణః సమరాంగణే ॥ **262**

తాలం ఛ్చత్రం మాతలినం తురగాన్వాయునందనమ్ ।
ఐంద్రం ధనుస్తచ్చిచ్ఛేద నవబాణైస్త్వరాన్వితః ॥ **263**

వాతాత్మజమాతలినౌ మూర్ఛితౌ పతితౌ భువి ।
క్షణమాత్రేణ స్వస్థోఽభూత్తదా స వాయునందనః ॥ **264**

తదా రామో వాయుపుత్రస్కంధే స్థిత్వా రణాజిరే ।
చకార తుములం యుద్ధం రావణేన భయావహమ్ ॥ **265**

రావణః పరిఘేణైవ సంతాడ్య మారుతిం హృది ।
చకార మూర్ఛితం వేగాత్పపాత స పునర్భువి ॥ **266**

తదా సస్మార రామోఽపి స్వరథం సమరాంగణే ।
తావద్రథః క్షణాదేవాయయౌ ఖాదగ్రతః స్థితః ॥ **267**

దారుకః సారథిర్యత్ర యత్ర శస్త్రాణ్యనేకశః ।
గదా పద్మం తు యత్రాస్తి సర్వదా గరుడో ధ్వజే ॥ 268

యస్మిన్ శైబ్యశ్చ సుగ్రీవస్తథా చైవ బలాహకః ।
మేఘపుష్పశ్చ చత్వారో వాయువేగా హయోత్తమాః ॥ 269

యత్ర ఛత్రం పరం దివ్యం హేమదండం విరాజతే ।
చామరే ద్వే శుభే యత్ర శార్ఙ్గం స్వం ధనురాదదే ॥ 270

తతో రామః శరైస్తీక్ష్ణైర్దశాస్యస్య రథం క్షణాత్ ।
చకార చూర్ణం సర్వం తం రావణం చాప్యతర్జయత్ ॥ 271

తదాఽన్యరథమారూఢో రావణో రాఘవం యయౌ ।
తతో రామః శరైస్తీక్ష్ణైర్దశాననశిరాంసి సః ॥ 272

అలా శ్రీరామునియొక్క ధనుర్దండమునందలి జే గంట రణరంగమున అరజాములో ఇరువది మార్లు మ్రోగుచుండెను. దీనినిబట్టి శ్రీరామపరాక్రమహిమ ఎంతటిదనవచ్చును?

పార్వతీ! వినుము; అపుడాకాశమున ఆ వింతజూచుటకు సంతసముతో దేవతలు చేరిరి. వందలకొద్ది విమానములలో గంధర్వ, కిన్నర, యక్షులు వచ్చుచుండిరి. అపుడు రావణుడు శ్రీరాముని వజ్రధ్వజమును ఖండించెను. అంత రాముడు మారుతితో, “నీవు క్షణకాలము రథముమీద ధ్వజముగా ఉండుము,” అని ఆజ్ఞాపించెను. అట్లేయని మారుతి రామరథమున తాళవృక్షమును పెట్టి, దానిమీద తాను ధ్వజముగా నిలిచెను. ఆ యాంజనేయ ధ్వజమును చూచి రణమున రావణుడు తొమ్మిది బాణములను ప్రయోగించి, తాళమును, ఛత్రమును, సారథియగు మాతలిని, మారుతిని, గుఱ్ఱములను, ఇంద్రుని, ధనస్సును త్వరగా పడగొట్టెను. మారుతి, మాతలుడూ మూర్ఛితులై పడిరి. వెంటనే క్షణకాలములో ఆంజనేయుడు మేల్కొనెను. అపుడు శ్రీరాముడు వాయుపుత్రుని భుజములపై ఎక్కి రణరంగమున దారుణమగు యుద్ధమును చేసెను. మరల రావణుడు తన పరిఘాయుధముచే ఆంజనేయుని గుండెలపై గ్రుద్దెను. దానితో ఆంజనేయుడు నేలపైబడి మూర్ఛితుడయ్యెను. (266)

## దివ్యవైష్ణవరథమునెక్కి శ్రీరాముడు రావణుని సంహరించుట

పిమ్మట శ్రీరామచంద్రుడు తన దివ్యరథమును స్మరించెను. వెంటనే అది గగనమున ఆవిర్భవించెను. దారుక సారథ్యముచే, గరుడధ్వజముచే– శైబ్య, సుగ్రీవ, వలాహక, మేఘపుష్పములను వాయు వేగము గలిగిన నాలుగు గుఱ్ఱములతో, శస్త్రపరికరములతో, గదా పద్మ శార్ఙ్గములతో,

ఛత్ర చామరాది అలంకారములతో అలరారు రథమును రాముడవలోకించి, ప్రదక్షిణ ప్రణామములను ఆచరించి, సంతోషముగా రథమును ఎక్కెను. తన శార్ఙ్గ ధనుస్సును చేతబూనెను. తీక్ష్ణ శస్త్రములచే రావణుని, వాని రథమును, గుఱ్ఱములను ధ్వంశముచేసి వానిని అదిలించెను.

చిచ్ఛేద తాని గగనే గత్వా తోషయుతాని హి ।
రామహస్తాన్మృతిర్జ్ఞాతాఽస్మాక చేతి విచింత్య చ ॥ 273

వందనం కర్తుకామాని గగనాచ్చ రణాజిరే ।
సస్మితాని పతంతి స్మ రాఘవస్య పదోపరి ॥ 274

రామః శిరాంసి దృష్ట్వాఽథ విదీర్ణాస్థాని ఖాత్పునః ।
మాం హన్తుం ప్రద్రవన్తీతి మత్వా భీత్యా వ్యతాడయత్ ॥ 275

శరౌఘైః శతశశ్శీఘ్రం తదద్భుతమివాభవత్ ।
శతమేకోత్తరం ఛిన్నం శిరసాం చైకవర్చసామ్ ॥ 276

శతమూర్ధ్నో రావణస్య చైకోత్తరసహస్రకమ్ ।
ఛిన్నం తత్కల్పభేదేన వదంతీత్యపి కేచన ॥ 277

దృష్ట్వా తు రావణస్యాంతం విభీషణమతేన సః ।
నాభిదేశేఽమృతం తస్య కుండలాకారాసంస్థితమ్ ॥ 278

పావకాస్త్రేణ తచ్ఛీఘ్రం శోషయామాస రాఘవః ।
తతః శిరాంసి బాహూంశ్చిచ్ఛేద రావణస్య సః ॥ 279

ఏకేన ముఖ్యశిరసా బాహుభ్యాం రావణో బభౌ ।
తయోర్యుద్ధమభూద్ఘోరం తుములం రోమహర్షణమ్ ॥ 280

తతో దారుకవాక్యేన మర్మదేశే వ్యతాడయత్ ।
బ్రహ్మాస్త్రేణ రఘుశ్రేష్ఠః సమరే దశకంధరమ్ ॥ 281

స శరో హృదయం భిత్వా హృత్వా తం తు దశాననమ్ ।
రామతూణీరమావిశ్య మేనే స కృతకృత్యతామ్ ॥ 282

**రావణస్య చ దేహోత్థం జ్యోతిరాదిత్యవస్ఫురత్ ।**
**ప్రవివేశ రఘుశ్రేష్ఠం దేవానాం పశ్యతాం సతామ్ ॥ 283**

**తదా దేవాస్తుష్టువుస్తం వవర్షుః పుష్పవష్టిభిః ।**
**నేదుః ఖే దేవవాద్యాని ననృతుశ్చాప్సరోగణాః ॥ 284**

**తదా మందోదరీ భర్త్రా సహ దేహం విసృజ్య సా ।**
**యయౌ వైకుంఠభువనం రావణేన ముదాన్వితా ॥ 285**

అంత రావణాసురుడు వేరే రథమునెక్కి రామునితో తలపడెను. అపుడు శ్రీరాముడు నిశిత బాణములచే దశవదనుని తలలను కత్తిరించుచువచ్చెను. ఆ తలలు మాకింతమాత్రము రామునిచేత చావుచిక్కినదని సంతోషముతో, శ్రీరామపాదములకు నమస్కరించుటకు వచ్చుచున్నవా అన్నట్లు గా శ్రీరామ పాదపద్మముల మీద గగనమున ఎగిరి నవ్వుచు వచ్చి పడుచుండెను. నోరు తెరుచుకుని వచ్చెడు ఆ తలలను చూచి, ఇవి మరల నన్ను ఎదుర్కొనుటకు వచ్చుచున్నవని ఎంచి వానిని బాణములచే రాముడు పడగొట్టుచుండెను. చూచుటకు అది మిక్కిలి ఆశ్చర్యముగానుండెను. దీనిని కొందరు కల్పభేదముచేత 100 తలలు అని, 101 తలలు అని, 1001 తలలు అని, ఇట్లు భేదముగా చెప్పెదరు. ఎంతకూ ఆ రావణుడు చావకపోవడముతో, రామునికి అంతము కానరానందున విభీషణుని మాటమీద, రావణుని బొడ్డులో కుండలాకారముగా ఉన్న దివ్యామృతమును, శ్రీరాముడు వాయవ్యాస్త్రముచే ఎండించి, రావణుని తలలను, చేతులను ఖండించెను. మామూలుగా రెండు చేతులును, ఒక తలనుగల రావణునికిని శ్రీరామునికిని మిక్కిలి ఘోర యుద్ధము జరిగెను. అపుడు రాముడు దారుకుని మాటననుసరించి బ్రహ్మాస్త్రముచే రావణుని హృదయమును భేదించెను. బ్రహ్మాస్త్రము దశకంఠుని సంహరించి తన పని ముగియగానే తిరిగి రాముని అమ్ములపొదిలో దూరెను. ఆ అద్భుతాన్ని చూచుచుండిన దేవతలందరును శ్రీరాముని సంస్తుతించిరి. పూలవాన కురిపించిరి. దేవవాద్యములు మ్రోగినవి. అప్సరసలు ఆడిరి. అప్పుడు మందోదరి పతితోడ సహగమనముచేసి సంతోషముగా వైకుంఠమునకు జనెను

**తతో విభీషణేనైవ రామో రావణసత్క్రియామ్ ।**
**కారయిత్వా లక్ష్మణేన లంకాయాం తం విభీషణమ్ ॥ 286**

**నీత్వాఽభిషేదయిత్వాఽథ న్యాసభూతాం తదంతికే ।**
**వాయుపుత్రకృతాం లంకాం మోచయామాస రాక్షసాత్ ॥ 287**

**విభీషణాతిభిః శీఘ్రమశోకం ప్రేష మారుతిమ్ ।**
**సీతాయై సకలం వృత్తం శ్రావయామాస రాఘవః ॥ 288**

**ఇతి శ్రీశతకోటిరామచరితాంతర్గతే, శ్రీమదానందరామాయణే, వాల్మీకీయే, ఆదికావ్యే, సారకాండే, యుద్ధచరితే రావణవధోనామ, ఏకాదశః సర్గః ॥**

పిదప శ్రీరాముడు విభీషణునిచే రావణునికి ఉత్తరక్రియలను చేయించి, లక్ష్మణుని పంపి లంకలో విభీషణునికి రాజ్యపట్టాభిషేకమును చేయించి, వానివద్ద ఆంజనేయునిచే చేయించిపెట్టియున్న చిన్న లంకను విడిపించెను. మరియు ఆ విభీషణాదులతో ఆంజనేయుని శీఘ్రముగా పంపించి అశోకవనమున ఉన్న సీతాదేవికి సకలవృత్తాంతమును తెలిపెను.

***శతకోటిప్రవిస్తరమైన రామకథలో, శ్రీమద్వాల్మీకిమహర్షిచే రచింపబడిన, ఆనందరామాయణంలోని, సారకాండలో యుద్ధచరితములో, రావణవధ అను పేరుగల పదకొండవ సర్గ ముగిసినది.***



# ద్వాదశః సర్గః-12వ సర్గ

## శ్రీరామ పట్టాభిషేక వర్ణన

శ్రీశివ ఉవాచ

అథ తాం దివ్యవస్త్రైశ్చ భూషయిత్వా విదేహజామ్ ।
సుస్నాతాం శిబికాసంస్థాం వేష్టితాం వేత్రపాణిభిః ॥ 1

నిన్యుః శ్రీరామసాన్నిధ్యం సుగ్రీవాద్యాస్త్వరాన్వితాః ।
నానావాద్యసముత్సాహైర్నృత్తైర్వారయోషితామ్ ॥ 2

తతోఽవరుహ్య యానాత్సా పద్భ్యాం గత్వా శనైః పతిమ్ ।
ననామ సీతా శ్రీరామం లజ్జితాఽఽసీత్పతేః పురః ॥ 3

రామోఽపి దృష్ట్వా తాం సీతాం శుద్ధాం జ్ఞాత్వాపి తాం పునః ।
సర్వేషాం ప్రత్యయార్థం హి తదా వచనమబ్రవీత్ ॥ 4

యథేచ్ఛం గచ్ఛ వైదేహి రిపుగేహనివాసినీ ।
న త్వామంగీకరోమ్యద్య బ్రహ్మణా ప్రార్థితోఽప్యహమ్ ॥ 5

తద్రామవచనం శ్రుత్వా కారయిత్వా చితాం శుభామ్ ।
లక్ష్మణానాథ సుస్నాతా సీతావచనమబ్రవీత్ ॥ 6

రామాదన్యం చేతసాఽపి నాహం జానామి పావక ।
యాదదం మే వచః సత్య తర్హి త్వ శాతలా భవ ॥ 7

### సీత అగ్నిప్రవేశము

పిమ్మట సుగ్రీవాది వానర వీరవరులు త్వరగా సుస్నానము చేసి, దివ్యవస్త్రాభరణములచే అలంకృత యైన జానకీదేవిని పల్లకిమీద తీసుకుని, భటులు పరివారముగా రాగా మంగళ వాయిద్యములతోను, వారాంగనల నృత్యములతోను శ్రీరామసన్నిధికివచ్చిరి. ఆ సీత పల్లకీ నుండి దిగి కాలినడకతో తిన్నగావచ్చి, పతిపాదములకు నమస్కరించి, యెదుట లజ్జితయై నిలిచెను. శ్రీరాముడును ఆమెను చూచి పరిశుద్ధురాలని తెలుసుకుని యున్నను, మరల అందరి నమ్మకము కొరకు సీతతో, "వైదేహీ! నీ ఇచ్చ వచ్చినట్లు పొమ్ము. పగవానియింటనుంటివి. బ్రహ్మ వచ్చి చెప్పినను నేనంగీకరించను." అని

ధిక్కరించెను. శ్రీరామవచనమును వినిన సీత; లక్ష్మణునిచే చితిని పేర్పించి, స్నానము చేసివచ్చి, అగ్నిని ఉద్దేశించి, "ఓ అగ్నిదేవా! నేను నా మనస్సునందు రామునికన్న ఇతరుని ఎరుగను. నాయందు సత్యముగలగి యున్నచో నీవు చల్లగా మారుము," అని చెప్పి, శపథముచేసి, మండుతున్న ఆ పెద్ద చితిలోనికి ప్రవేశించెను.

ఇతి సా శపథం కృత్వా వివేశానలముత్తమమ్ ।
తతః స దేవవాక్యైశ్చ తథా దశరథస్య చ ॥ 8

వచనాజ్జానకీం శుద్ధాం జ్ఞాత్వా తామగ్రహోత్ప్రభుః ।
సుభూషితాం పావకన స్వాకే సంస్థాపితా శుభామ్ ॥ 9

పంచవట్యాం స్వయం తత్ర పురా న్యస్తాం చ పావకే ।
ఆలింగ్య జానకీ రామా నిజాంకే సంన్యవేశయత్ ॥ 10

తామసీ రాజసీ చైవ సాత్వికీ యా త్రిధా పురా ।
జాతా రావణఘాతార్థం సా జాతైకత్ర వై తదా ॥ 11

తతో దేవైః స్తుతో రామశ్చేంద్రేణ సమరే మృతాన్ ।
వానరాదీన్ సుధావృష్ట్యా జీవయామాస సాదరమ్ ॥ 12

తత్రైకం వానరం రామోఽదృష్ట్వా పప్రచ్ఛ మారుతిమ్ ।
రాఘవం మారుతిః ప్రాహ కుంభకర్ణేన భక్షితః ॥ 13

యది కించిత్తస్య కపేర్నఖకేశాస్థిలోహితమ్ ।
రణేఽభవిష్యత్పతితం తర్హ్యుద్యామృతవృష్టిభిః ॥ 14

అభవిష్యజ్జీవితః స సత్యం విద్ధి రఘూత్తమ ।
సుధావృష్ట్యా రాక్షసాస్తే జీవయిష్యంతి వై పునః ॥ 15

ఇతి భీత్యా పురాఽస్మాభిః సర్వే త్యక్తా మహోదధౌ ।
తన్మారుతేర్వచః శ్రుత్వా యమరాజం వ్యలోకయత్ ॥ 16

యమోఽపి భీత్యా రామాగ్రేఽర్పయత్తం ప్లవగోత్తమమ్ ।
తం దృష్ట్వా రాఘవస్తుష్టస్తదాజ్ఞాం నాకముత్తమమ్ ॥ 17

**గంతుం దదౌ మాతలినే సోఽపి నత్వా రఘూత్తమమ్ ।**
**రథేన వాజియుక్తేన యయౌ మఘవతః పురీమ్ ॥ 18**

**రామస్తు మంగళస్నానం కర్తుం సంప్రార్థితోఽపి హి ।**
**విభీషణేన భరతం స్మృత్వా నాంగీచకార సః ॥ 19**

**తతః సర్వైర్వానరైశ్చ పుష్పకం చారురోహ సః ।**
**రథేన దారుకశ్చాపి గరుడో మకరధ్వజః ॥ 20**

అంత అగ్నిలో నుండి క్షేమముగా వచ్చిన జానకిని దేవవాక్యముల చేతను, దశరథుని మాటమీదను పరిశుద్ధురాలని తెలిసి, శ్రీరాముడు తిరిగి సీతను స్వీకరించెను. మునుపు పంచవటిలో తానే అగ్నిలో ఉంచబడిన జానకిని హృదయానికి హత్తుకుని తనతొడమీద కూర్చుండబెట్టు కొనెను. మునుపు రావణసంహారమునకై ఎవరైతే తామసి, రాజసి, సాత్వికి యని మూడు విధములుగా ఏర్పరచబడి యుండెనో ఆ శక్తి యిప్పుడు ఒకటిగా అయినది.

## అమృతవర్షముచే శ్రీరాముడు వానరులను బ్రతికించుట.

తరువాత దేవతలచే స్తుతింపబడిన శ్రీరాముడు ఇంద్రుని ఆజ్ఞాపించి, అమృత వర్షముచే యుద్ధమున మృతినొందిన వానరములన్నింటిని ప్రీతితో బ్రతికించెను. అప్పుడచట ఒకవానరుడు మాత్రము కానరానందున రాముడు వాడెక్కడ యున్నాడని ఆంజనేయుని అడిగెను. అందుకతడు, “స్వామీ! వానిని కుంభకర్ణుడు తినివేసెను. ఆ కపియొక్క ఎముకయో, గోరో, వెంట్రుకయో తుదకు వాని రక్తమో రణమునపడినది కొంచముండినను ఈ అమృతవృష్టిచే మరల రాక్షసులందరును జీవించెదరని భయపడి, మేము రాక్షసులనందరిని సముద్రములో పడవేసితిమి,” అని విన్నవించెను. వెంటనే రాముడు యమధర్మరాజును అవలోకించెను. యముడు భయముచే ఆ వానరవీరుని శ్రీరామ సన్నిధికి చేర్చెను. వానిని జూచి రాముడు ఆనందించెను. మాతలికి స్వర్గమునకు పోవుటకు అనుమతి నిచ్చెను. ఆ మాతలి శ్రీరామచంద్రునికి నమస్కరించి రథాశ్వములతో ఇంద్రనగరమునకు పోయెను. (18) అటుపిమ్మట శ్రీరాముడు మంగళ స్నానము చేయవలెనని విభీషణునిచే ప్రార్థింపబడినను భరతుని స్మరించి అందుకంగీకరించలేదు. అంత అందరితోడ పుష్పక విమానమునెక్కెను. ఆ పుష్పకమున శ్రీరామాజ్ఞచే రథముతోడ దారుకుడును మకరధ్వజుడు, విభీషణుడును అందరు నెక్కిరి.

**విభీషణశ్చారురోహ పుష్పకం రాఘవాజ్ఞయా ।**
**తతస్తే నిర్జరాః సర్వే రామమామంత్ర్య ఖం యయుః ॥ 21**

దృష్ట్వా రామం దశరథో విమానేన యయౌ దివమ్ ।
అథ తం రాఘవం ప్రాహ పుష్పకస్థం విభీషణః ॥ **22**

రామ తే ప్రష్టుమిచ్ఛామి తత్త్వం మాం వక్తుమర్హసి ।
ఐరావణగృహే రామ యదా పాతాళముత్తమమ్ ॥ **23**

పురా గతస్తదా తూష్ణీం కిమర్థం త్వం స్థితః ప్రభో ।
కథం తౌ న హతౌ దుష్టౌ తదైవ క్షణమాత్రతః ॥ **24**

తత్తస్య వచనం శ్రుత్వా విహస్య రాఘవోఽబ్రవీత్ ।
భ్రమరాణాం వధః పూర్వం విధినా మారుతేః కరాత్ ॥ **25**

ప్రోక్తస్తస్మాన్మయా తూష్ణీం ప్రతీక్షా మారుతేః కృతా ।
అన్యచ్చాపి జగత్యాం హి మారుతేః పౌరుషం జనాః ॥ **26**

వదంతు యేన శ్రీరామలక్ష్మణౌ మోచితౌ పురా ।
అసురాభ్యాం హి పాతాలే సోఽయం శ్రీరామసేవకః ॥ **27**

ఇతి పౌరుషవృద్ధ్యర్థం మారుతేర్జగతీతలే ।
మమ దాసస్య బలినస్తథా తూష్ణీం స్థితం మయా ॥ **28**

నోచేద్ధుం కారమాత్రేణ పథి హంతుం న కిం క్షమః ।
ఇషికాస్త్రేణ కాకస్య యేన నేత్రం విదారితమ్ ॥ **29**

శతయోజనపర్యంతం మారీచోఽద్ధా పతత్రిణా ।
పురా యేన మయా త్యక్తః సోహం కిం కుంఠితస్తదా ॥ **30**

తయోర్వధే తు పాతాళే న శస్త్రార్థం ప్రతీక్షితమ్ ।
మారుతేః పౌరుషార్థం హి సత్యం వదే విభీషణ ॥ **31**

ఇతి రామవచః శ్రుత్వా మారుతిః సవిభీషణమ్ ।
తదా ప్రాహ విహస్యాథ కిం త్వం తద్విస్మృతోఽసి హి ॥ **32**

సేతుకాలే రాఘవేణ గర్వం దృష్ట్వా మయి స్థితమ్ ।
లాంగూలం ఖండితం పూర్వం లింగోత్పాటనహేతునా ॥ **33**

## పుష్పక విమానములో శ్రీరాముడు విభీషణునితో మాట్లాడుట,

దేవతలు రామునివద్ద శెలవుతీసుకుని స్వర్గమునకు వెళ్ళిన తరువాత, దశరథుడును రాముని విచారించి విమానముతో స్వర్గమునకు వెళ్ళెను. అపుడు పుష్పక విమానములో ప్రయాణించుచున్న శ్రీరామునితో విభీషణుడు, "స్వామి! నేను నీతత్త్వము తెలుసుకోవాలను కుంటున్నాను. దయజేసి చెప్పగలరు. మునుపు నీవు పాతాళమున అయిరావణునియింట ఏమిచేయక ఊరక ఉండినది ఎందుకు? ఆ దుష్టుని ఆ క్షణముననే ఎందుకు చంపలేదు? అని ప్రార్థించెను. అందుకు శ్రీరాముడు నవ్వుచు ఇట్లుపలికెను, "హనుమంతునిచేత మొదట తుమ్మెదలకు చావుకావలెనని విధి విధించియుండెను. అందుకై వానిరాకను నిరీక్షించుచుంటిని. మరియొకటి గలదు. ఈ లోకమున అందరును– ఆహా! పాతాళమున రాక్షసులచేత చిక్కిన రామ లక్ష్మణులను హనుమంతుడు విడిపించుకొనివచ్చెను. వీడుగదా శ్రీరామసేవకుడు! అని యాంజనేయుని పౌరుషమును కీర్తింతురు గాక! బలిష్టుడగు నా సేవకుడైన హనుమంతునికి శౌర్యకీర్తి యిట్లువచ్చుటకై ఊరకయుంటిని. అట్లు గాకపోయిన నేను హుంకారము చేతనే దారిలో వారిని చంపలేనా? గడ్డిపోచతో కాకాసురుని కన్ను తీయలేదా? బాణముతో మారీచుని నూరామడదూరం సముద్రములోనికి నెట్ట లేదా? అట్టి నేను చేతగానివాడనా? కాను. పాతాళమున వారి వధకై శస్త్రములను ఉపయోగించ లేదు.

విభీషణుడా! నిజము చెప్పుచున్నాను. ఆంజనేయ పరాక్రమాభివృద్ధికే నేను ఊరక ఉంటిని" అని శ్రీరాముడు చెప్పగా, ఆ మాటలు విన్న హనుమంతుడు నవ్వి, విభీషణునితో, "ఏమిటి? నీవు శ్రీరాముని సంగతిని మరచితివా, మునుపు సేతునిర్మాణ సమయమున నాయొక్క గర్వమును చూచీ లింగమును పెరికి వేయు నెపముచే శ్రీరామమహిమతో నాతోక తెగిపోయెను.

**తస్య మే రాఘవాగ్రే హి కిం బలం మన్యసేఽత్ర హి ।**
**కిం విలంబో రాఘవాయ తయోరసురయోర్వధే ॥ 34**

**వర్ధితా నిజదాసస్య కీర్తిరత్ర విభీషణః ।**
**ఇతి తన్మారుతేర్వాక్యం శ్రుత్వా రామం విభీషణః ॥ 35**

**ననామ పరయా భక్త్యా తతః సమ్యగపూజయత్ ।**
**అథ రామః పుష్పకస్థః సీతయా ప్రార్థితో ముహుః ॥ 36**

**తద్వాక్య గౌరవాత్తుష్ట స్త్రీజటాయై వరాన్దదౌ ।**
**వస్త్రాలంకారభూషాభిః పూర్వం తుష్టాం విధాయ చ ॥ 37**

త్రిజటే వచనం మేఽద్య శ్రుణు మంగళదాయకమ్ ।
కార్తికే మాధవే మాఘే చైత్రే మాసచతుష్టయే ॥ 38

స్నాత్వాఽగ్రే త్రిదినం స్నానం త్వత్ప్రీత్యర్థం నరోత్తమాః ।
కరిష్యంతి హి తేనైవ కృతకృత్యా భవిష్యసి ॥ 39

యైర్నస్త్రిదినం స్నానం న కృతం పౌర్ణిమోర్ధ్వతః ।
తేషాం మాసకృతం పుణ్యం హర త్వం వచనాన్మమ ॥ 40

అన్యచ్చాపి శ్రుణుష్వ త్వం దీయతే యో వరో మయా ।
అశుచీని గృహాణ్యేవ తథా శ్రాద్ధహవీంషి చ ॥ 41

క్రోధావిష్టేన దత్తాని విధివత్తత్ కృతాన్యపి ।
త్రిజటే తాని తుభ్యం హి శ్రుణ్వన్ యత్వం మయోచ్యతే ॥ 42

పాదశౌచమనభ్యంగం తిలహీనం చ తర్పణమ్ ।
సర్వం తత్త్రిజటే తుభ్యం తథా శ్రాద్ధమదక్షిణమ్ ॥ 43

ఇతి దత్వా వరాన్ రామస్త్రిజటాసరమాన్వితః ।
స విభీషణసుగ్రీవమకరధ్వజవానరైః ॥ 44

యయౌ విహాయసా సీతాం దర్శయన్ కౌతుకాని సః ।
పశ్య సీతే పురీం లంకాం తథా రణభువం శుభామ్ ॥ 45

పశ్య సేతుం మయా బద్ధం శిలాభిర్లవణార్ణవే ।
ఏతచ్చ దృశ్యతే తీర్థం సేతుబంధమితి స్మృతమ్ ॥ 46

ఓ విభీషణుడా! “శ్రీరాములవారి యెదుట కపియైన ఈ హనుమంతుని బలము ఏ పాటిది. ఆ అయిరావణ, మయిరావణుల సంహారమున శ్రీరాముడు తన దాసుడైన నాయొక్క ! కీర్తిని వృద్ధిపరచెను.” అని పలుకగా; వినిన విభీషణుడు విశేష భక్తితో రామునికి నమస్కరించి పూజించెను(35) తరువాత శ్రీరాముడు సీతచే పలుమార్లు ప్రార్థింపబడి ఆమెమాటమీద త్రిజటకు వరములనిచ్చెను.

## శ్రీరాముడు త్రిజటకు వరములనిచ్చుట.

శ్రీరాముడు త్రిజటకు వస్త్రములు, ఆభరణములు ఇచ్చి సంతోషపరచి, “త్రిజటా! నా మంచిమాట

వినుము, మానవోత్తములు చైత్ర, వైశాఖ, కార్తీక, మాఘ మాసములను నాలుగు నెలలలో మొదట మూడు దినములు నీ ప్రీతికొరకు చేయుదురు. ఆ విధముగా నీవు ధన్యమగుదువు. ఆ విధముగా ఎవరు పూర్ణిమకు ముందు మూడు దినములు స్నానము చేయరో వారియొక్క నెలలోని పుణ్యమును నా మాటమీద నీవు గ్రహింపుము. మఱియొక వరమును వినుము. ఎవరైనను సరే కడకు వాడు బ్రహ్మ కొడుకైనను సరే, ఇండ్లను అశుచిగాపెట్టికొని, కోపావేశముతో నెవడు హవ్య కవ్యముల నిచ్చునో వాటిని నీవు గ్రహింపుము. అభ్యంగస్నానము లేని పాదశౌచమును, నువ్వులు లేని తర్పణమును, దక్షిణ లేని శ్రాద్ధమును నీకర్పితమగుగాక." అనియిట్లు శ్రీరాముడు త్రిజటకు వరములనిచ్చెను. (43) పిమ్మట శ్రీరాముడు త్రిజటను, సరమను, విభీషణ, సుగ్రీవ, మకరధ్వజులను వెంటదీసికొని పుష్పక విమానమున వచ్చునపుడు సీతకు భూమిపై విశేషములను చూపుతూ, "కాంతా! చూచితివా లంకను. ఇదిగో యుద్ధభూమి! ఇక్కడచూడుము, నేను సేతువుగట్టిన చోటు! ఇది సేతుబంధనమను తీర్థము."

**ఇత్యుక్త్వా రఘువీరస్తు రాక్షసేంద్రస్య వాక్యతః ।**
**పుష్పకాద్భువి చోత్తీర్య ధృత్వా కోదండముత్తమమ్ ॥ 47**

**బభంజ సేతుం తత్కోట్యా ధనుష్కోటిరితీర్యతే ।**
**అతఏవ హి తత్తీర్థం స్నానాత్కైవల్యదాయకమ్ ॥ 48**

**కోదండపాణిర్నామ్నాఽఽసీద్రామమూర్తిశ్చ తత్ర హి ।**
**ఏతస్మిన్నంతరే తత్ర సంపాతిః స యయౌ తదా ॥ 49**

**తమాలింగ్య రామచంద్రస్తం ప్రాహ స్మితపూర్వకమ్ ।**
**బంధోర్నామ్నాత్ర తీర్థం త్వం కురు సేతౌ మహత్తమమ్ ॥ 50**

**తథేతి రామవచనాద్భ్రాతుః సంతోషకామ్యయా ।**
**తీర్థం చకార సంపాతిర్జటాయుమితి విశ్రుతమ్ ॥ 51**

**తతో రామాజ్ఞయా యానం సంపాతిశ్చారురోహ సః ।**
**తతో యానేన తాం సీతాం దర్శయన్ కౌతుకాని హి ॥ 52**

**యయౌ రామేశ్వరం పూజ్య తథా శ్రీరఘునందనః ।**
**సీతేఽత్ర పశ్య మంత్రార్థమేకాంతే సంస్థితం పురా ॥ 53**

అత్ర దర్భేషు శయనం కృతం పశ్య విదేహజే ।
నవగ్రహార్థం ప్రక్షిప్తాన్పాషాణాన్పశ్య సాగరే ॥ 54

తూష్ణీమేవ స్థితం పశ్య సాగరం మమ వాక్యతః ।
ఏవం తాం దర్శయన్ రామః కిష్కింధాం ప్రయయౌ క్షణాత్ ॥ 55

వానరాణాం స్త్రియః సర్వా విమానే స్థాప్య రాఘవః ।
యయౌ తాం దర్శయన్ సీతాం కౌతుకాని సమంతతః ॥ 56

ప్రవర్షణగిరిం పశ్య ఋష్యమూకాచలం తథా ।
పంపాసరోవరం పశ్య కృష్ణాం భీమరథీం శుభామ్ ॥ 57

పశ్య పంచవటీం రమ్యాం గోదాతీరవిరాజితామ్ ।
అగస్తేరాశ్రమం పశ్య సుతీక్ష్ణస్యాశ్రమం తథా ॥ 58

పశ్యాత్రేరాశ్రమం సీతే చిత్రకూటం సమీక్షయా ।
కాళిందీం జాహ్నవీం పశ్య భరద్వాజాశ్రమం తథా ॥ 59

## శ్రీరాముడు సీతకు దారిలోని విశేషములను చూపుట

పుష్పకముపైనుండి దారిలో జరిగిన సంఘటలను శ్రీరాముడు సీతకు చెప్పుచుండగా, అంతలో శ్రీరాముడు విభీషణునిమాట మీద పుష్పకమునుండి భూమికి దిగి, విల్లందుకొని, దాని మొనతో సేతువును పడగొట్టెను. ధనుస్సు యొక్క కోటిచేత కొట్టబడినందుననే ధనుష్కోటియనబడుచున్నది. అందువలననే ఆ తీర్థము ముక్తిప్రదమైనది. అచ్చట కోదండపాణియను పేరుతో శ్రీరామమూర్తిగలడు. అంతలో అప్పుడచ్చటికి సంపాతివచ్చెను. రాముడు ఆ సంపాతిని హృదయమునకు హత్తుకుని, నవ్వుచు, “ఈ సేతుభంగ స్థానమైన ధనుష్కోటిలో నీవు నీతమ్ముని పేరుతో తీర్థమును కల్పింపుము.” అని యాజ్ఞాపింపగా అతడట్లేయని సహోదరుని సంతోషమునకై ‘జటాయు’ తీర్థమును నిర్మించెను. రామాజ్ఞచే సంపాతియును పుష్పక విమానమును ఎక్కెను. అంత అందరును అచ్చటినుండి వచ్చుచుండగా, రాముడు సీతకు వింతలను కనుబరచుచు రామేశ్వరమునకువచ్చి సీత తోడ రామేశ్వరుని ఆరాధించిన శ్రీరాముడు, సీతతో “ప్రియా! చూడు ఇచ్చట మునుపు ఆలోచనలకై సమావేశమైతిమి. ఇదిగో ఇచ్చట దర్భలమీద పండుకొనియుంటిని. ఇవి నవగ్రహములకై ప్రత్యాకృతిశిలలు నవపాషాణములు స్థాపింపబడినవి. నామాటను అతిక్రమింపక సముద్రుడూరక నిలిచిన చోటిది, చూడుము.” అని చెప్పుచు క్షణమున కిష్కింధకువచ్చెను. అచ్చటనున్న వానర పత్నులను

విమానమున ఎక్కించుకొని సీతకు, "ఇదిగో ప్రవర్షణగిరిని చూడుము, ఋష్యమూక శైలమును చూడుము, ఇదిగో పంపాసరోవరము దీనిని వీక్షింపుము. కృష్ణా, భీమరథీ నదులను చూడుము. ఆహా గోదావరితీరమున రమ్యమగు పంచవటియిది. అగస్త్యాశ్రమమిచ్చటనున్నది. అట్లే సుతీక్ష్ణముని ఆశ్రమము. అత్రితపోవనమును చూచితివా? చిత్రకూటమిది చిత్రముగానున్నది. ఇది యమున, ఇది గంగ, ఇదిగో భరద్వాజాశ్రమము," అని చెప్పుచు, చూపుచువచ్చి భరద్వాజముని ప్రార్థింపగా అతని ఆశ్రమమున దిగి అందరితోడ అచ్చట నిలిచెను. (60)

**ఇత్యుక్త్వా జానకీ రామో భారద్వాజార్థితస్తదా ।**
**తస్థౌ తస్యాశ్రమే యానాదవరుహ్య యథాసుఖమ్ ॥ 60**

**మాఘశుక్లచతుర్థ్యాం హి పూర్ణే వర్షే చతుర్దశే ।**
**భరద్వాజోఽపి తపసా స్వర్గం నిర్మాయ భూతలే ॥ 61**

**పూజయామాస శ్రీరామం సీతావానరసంయుతమ్ ।**
**రామోఽపి హృది సంమంత్ర్య మారుతిం వాక్యమబ్రవీత్ ॥ 62**

**అయోధ్యాం గచ్ఛ భరతం మద్వృత్తం కథయస్వ తమ్ ।**
**సఖాయం శృంగబేరే మే వృత్తం కథయ కేవటమ్ ॥ 63**

**తథేతి గుహకం గత్వా కపిర్వృత్తం న్యవేదయత్ ।**
**గుహకోఽపి ముదా యుక్తస్తదా రామాన్తికం యయౌ ॥ 64**

**తతోఽయోధ్యాం యయౌ వేగాన్మారుతిః స విహాయసా ।**
**నందిగ్రామేఽపి భరతః పూర్ణే వర్షే చతుర్దశే ॥ 65**

**నాగతే రాఘవే వహ్నిం సన్నద్ధోఽభ్రాతృప్రవేశితమ్ ।**
**శత్రుఘ్నం భరతః ప్రాహ రావణేన రణాంగణే ॥ 66**

**శ్రీరామలక్ష్మణౌ వీరౌ హతౌ మన్యేఽద్య నాగతౌ ।**
**ఆకారితా మయా సర్వే నృపా ఏతే బలైర్యుతాః ॥ 67**

**లంకాం గత్వా రాఘవస్య సాహాయ్యం కర్తుమిచ్ఛతా ।**
**సోఽహమగ్నిం విశ్యామ్యద్య రవావస్తాంచలం గతే ॥ 68**

**త్వం గచ్ఛ పార్థివైర్లంకాం హత్వా యుద్ధే దశాననమ్ ।**
**మోచయిత్వా జనకజాం తతో నః పారలౌకికమ్ ॥ 69**

**రామాదీనాం త్రిబంధూనాం కర్తుమర్హసి సాదరమ్ ।**
**ఇతి తద్వాక్యమాకర్ణ్య పౌరా జానపదా నృపాః ॥ 70**

**శత్రుఘ్నో మాతరః సర్వా ఊర్మిలాద్యాః స్త్రియశ్చ తాః ।**
**సుమంత్రాద్యా మంత్రిణశ్చ పౌరనార్యశ్చ సేవకాః ॥ 71**

అరణ్యవాసము పదునాలుగు సంవత్సరములు ముగియగా, మాఘమాస శుక్ల చతుర్థినాడు భరద్వాజముని తన తపశ్శక్తిచే భూస్వర్గమును నిర్మించి, శ్రీసీతారాములను సపరివారముగా సమస్తభోగ వస్తువులచే సత్కరించెను. శ్రీరాముడు మదిలో ఆలోచించి మారుతితో, "వేగముగా అయోధ్యకు వెడలి భరతునికి నావృత్తాంతమును చెప్పుము. శృంగబేరపురమున నామిత్రుడగు గుహునికి నా ఉదంతము తెలుపుము." అని ఆజ్ఞాపించెను. వానర వీరుడట్లేయని వెడలి, గుహునికి సంగతిని చెప్పగా, గుహుడు వెంటనే శ్రీరామ సన్నిధానమునకు వచ్చెను. అంత ఆంజనేయుడు గగనమున వేగముగా వచ్చుచుండెను. అచ్చట నందిగ్రామమున భరతుడు పదునాలుగు సంవత్సరములు నిండగా రాముడు రానందున అగ్ని ప్రవేశమునకు సర్వసిద్ధుడై శత్రుఘ్నునితో, "నేడు వీరులగు రామలక్ష్మణులు రాకపోతే రావణునిచే రణమున జయింపబడినట్లు తలంచెదను. లంకకుపోయి రాఘవునికి సహాయము చేయనెంచిన నేను ఈరోజు అందరిని పిలిపించితిని. అట్టి నేను నేడు సూర్యుడస్తమించగానే అగ్నిప్రవేశము చేసెదను. నీవు రాజులతో లంకకువెడలి రణమున రావణుని జంపి సీతనువిడిపించి, పిమ్మట రామ భరత లక్ష్మణులగు మాముగ్గురికిని పారలౌకిక క్రియను సాదరముగా చేయుదువుగాక," అని చెప్పగా; ఊరివారును, దేశమువారును, రాజులును, శత్రుఘ్నుడును, తల్లులందరును, ఊర్మిళాది స్త్రీలును, సుమంత్రాది మంత్రులును, నగరస్త్రీలును, సేవకులును అందరును దుఃఖార్తులై భరతుని చుట్టుముట్టిరి.

**భరతం వేష్టయామాసుః ఖేదాద్విహ్వలమానసాః ।**
**భరతః సాంత్వయన్ సర్వాన్ యయౌ తాం సరయూనదీమ్ ॥ 72**

**చితాం కృత్వా తతః స్నాత్వా దదౌ దానాన్యనేకశః ।**
**సప్త ప్రదక్షిణాః కృత్వా వహ్నిం ధ్యాత్వా రఘూత్తమమ్ ॥ 73**

**సీతాం తాం లక్ష్మణం వీరం నత్వా మాతౄర్గురుం మునీన్ ।**
**ఆరాధ్యదేవతాం ధ్యాత్వా హ్యుత్తరాభిముఖః స్థితః ॥ 74**

రవౌ న్యస్తేక్షణః సాయం ప్రతీక్షన్ సంస్థితః క్షణమ్ ।
మహాన్కోలాహలశ్చాసీత్తదా స్త్రీపురుషైః కృతః ॥ 75

ఏతస్మిన్నంతరే ఖస్థస్తం దృష్ట్వా వాయునందనః ।
ప్రవేష్టుముద్యతం వేగాద్భరతం గద్గదస్వనః ॥ 76

అబ్రవీన్మధురం వాక్యం సుధయా సేచయన్నివ ।
మా విశస్వానలం వీర రాఘవోఽద్య సమాగతః ॥ 77

సీతయా లక్ష్మణేనాపి భరద్వాజాశ్రమం ప్రతి ।
వానరైః సహితం రామం శ్వస్త్వం పశ్యసి నిశ్చయాత్ ॥ 78

రామోఽప్యుత్కంఠితస్త్వాం హి ద్రష్టుమస్తి జటాధర ।
ఇతి తద్వాక్సుధావృష్టిసేచితా భరతో ముదా ॥ 79

వహ్నిం నత్వా పరావృత్య ననామ వాయునందనమ్ ।
భరతం మారుతిశ్చాపి నత్వాఽఽలింగ్య సవిస్తరమ్ ॥ 80

శ్రావయామాస శ్రీరామవృత్తం సంతోషకారకమ్ ।
తత్శ్రుత్వా భరతస్తుష్టః శోభయామాస తాం పురీమ్ ॥ 81

అయోధ్యాం తోరణాద్యైశ్చ పౌరైః ప్రత్యుజ్జగామ తమ్ ।
మస్తకే పాదుకే బద్ధ్వా పురస్కృత్యాఽథ వారణమ్ ॥ 82

మాఘస్య సితపంచమ్యాం ప్రాప్తే పంచదశేఽబ్దకే ।
ప్రభాతే భరతో యామ్యే దదర్శ పుష్పకం ఖగమ్ ॥ 83

భరతుడపుడు పరివారమునంతటిని సమాధానపరచుచు సరయూ నదీతీరమునకు వెళ్ళి, చితిని వేయించి, స్నానముచేసి, అనేక దానధర్మములను చేసి, ఏడుమార్లు అగ్నికి ప్రదక్షిణములను ఆచరించి, శ్రీరామునిధ్యానించి, జానకీదేవికిని, వీరుడగు లక్ష్మణుకిని నమస్కరించి, తల్లులకును, మునులకును, గురువులకును నమస్కారములుజేసి, దేవతారాధన ఆచరించి, ఉత్తరాభిముఖముగా తిరిగి సాయంకాలమున అస్తమించుచున్న సూర్యబింబము గమనించుచు, క్షణకాలము ఊరక నిలచి యుండెను. అప్పుడచ్చట గుమికూడిన స్త్రీ పురుషులలో ఎంతో చింతా కోలాహలము జరుగుచుండెను. సరిగ్గా అదే సమయానికి గగనమందుండిన హనుమంతుడు అగ్నిప్రవేశమునకు సర్వసిద్ధుడుగా ఉన్న భరతుని

జూచి కలత నొంది, బహువేగముగా వచ్చి, అమృతమును కురిపించునట్లు మృదుమధుర వాక్యములచే, "వీరుడా! నీవు అగ్నిప్రవేశము చేయవద్దు. రాముడిప్పుడే వచ్చుచున్నాడు. సీతా, లక్ష్మణులతోడ భరద్వాజ ఆశ్రమమునకు వచ్చియున్నాడు. నీవు తప్పక రేపే వానరులతో ఆ నరేంద్రుని చూడగలవు. భరతుడా! శ్రీరాముడును నిన్ను చూడవలయునని తహతహలాడుచున్నాడు," అని ఆనందపరచెను. సంతసించిన భరతుడు అగ్నికి నమస్కరించి, ఇటు తిరిగి వాయుపుత్రునికి అభివాదము చేసెను. ఆంజనేయుడును భరతునికి అభివాదము చేసి, హత్తుకుని వివరముగా సర్వవృత్తాంతమును విన్నవించెను. (80) అదివిని భరతుడు ఆనందించి, తోరణ మంగళ వస్తువులచే అయోధ్యాపట్టణమున అలంకారములను చేయించి, ఊరివారితోడ ఊరేగింపుతో తనతలమీద శ్రీరామపాదుకలను ధరించి, పట్టపు ఏనుగును పురస్కరించుకొని ఎదురేగెను. ఇట్లు భరతుడు మాఘ శుక్ల పంచమినాడు శ్రీరాముడు అరణ్యవాసమునకుపోయి పదునాలుగు సంవత్సరములు ముగిసి, 15వ సంవత్సరము ఆరంభించుచుండగా, ప్రొద్దున దక్షిణదిక్కులో గగనమున పుష్పకవిమానమును గమనించెను.

**ననామ రాఘవం దృష్ట్వా సాష్టాంగం భరతస్తదా ।**
**రామోఽప్యాలింగ్య భరతం కృత్వా రూపాణ్యనేకశః ॥ 84**

**ఏకకాలే జనాన్ సర్వాన్ పృథక్ స పరిషస్వజే ।**
**ఆదౌ పశ్చాన్న రామేణ కృతమాలింగనం తదా ॥ 85**

**రామాన్ దృష్ట్వా హ్యసంఖ్యాతాన్ జనాశ్చాసన్సువిస్మితాః ।**
**సమాశ్వాస్యాథ భరతం రాఘవః సాశ్రులోచనమ్ ॥ 86**

**ననామ శిరసా మాతౄర్వసిష్ఠం చాప్యరుంధతీమ్ ।**
**తతో వాద్యనర్తనాద్యైర్నందిగ్రామం యయౌ శనైః ॥ 87**

**శ్మశ్రుకర్మోద్వర్తనం చ తైలాభ్యంగం తు బంధుభిః ।**
**నందిగ్రామేఽకరోద్రామో నానామాంగళ్యవస్తుభిః ॥ 88**

**నవవాద్యసుఘోషాశ్చ నేదుః సర్వత్ర సుస్వరాః ।**
**నార్యో నీరాజయామాసూ రత్నదీపై రఘూత్తమమ్ ॥ 89**

**తతః సీతా నమస్కృత్య కౌసల్యాద్యాశ్చ మాతరః ।**
**వసిష్ఠం బ్రాహ్మణాన్ వృద్ధాన్ వందనీయాన్యథాక్రమమ్ ॥ 90**

తతః సీతాం సమాలింగ్య కౌసల్యాద్యాశ్చ మాతరః ।
స్నాపయామాసుర్మాంగళ్యద్రవ్యైర్వాద్యపురస్సరమ్ ॥ 91

వస్త్రాలంకారభూషాభిః శుశుభే జానకీ తదా ।
భరతః పాదుకే తే తు రాఘవస్య సుపూజితే ॥ 92

యోజయామాస రామస్య పాదయోర్భక్తిసంయుతః ।
తతోఽతివినయాత్ప్రాహ భరతో రఘునందనమ్ ॥ 93

రాజ్యమేతన్న్యాసభూతం మయా నిర్యాపితం తవ ।
కోష్ఠాగారం బలం కోశం కృతం దశగుణం మయా ॥ 94

త్వత్తేజసా జగన్నాథ పాలయస్వ పురం స్వకమ్ ।
తథేతి రాఘవశ్చోక్త్వా భరతం సంన్యవేశయత్ ॥ 95

తతః స దివ్యవస్త్రాణి పరిధాయ రఘూత్తమః ।
సీతయా రథమారుహ్య వాద్యఘోషైర్జయస్వనైః ॥ 96

భరతుడు శ్రీరాముని పాదపద్మములకు సాష్టాంగదండప్రణామము ఆచరించెను. శ్రీరాముడును భరతుని తన హృదయమునకు హత్తుకొనెను. శ్రీరాముడు ఏక కాలమున అనేకరూపములతో అందరిని వేర్వేరుగా హత్తుకొనెను. జనులందరూ ఏక కాలమున అనేక మంది శ్రీరాములను చూచి, అమిత ఆశ్చర్యమును పొందిరి. శ్రీరాముడును తన కళ్ళలో నీళ్ళు సుళ్ళుతిరగగా భరతునికి సమాధానమును చెప్పి, తన తల్లులకును, అరుంధతీ వశిష్ఠులకును నమస్కరించెను.

## శ్రీరాములవారు సపరివారముగా అయోధ్యలో ప్రవేశించుట

తరువాత శ్రీరాముడు తిన్నగా మంగళవాద్య నర్తనములతో బయలుదేరెను. పిదప అరణ్యవాస దీక్షా విరమణము గావించెను, నందిగ్రామములోనే మాంగళ్య వస్తువులచే మంగళ స్నానమును ముగించెను. వివిధ వాద్యములు మ్రోగింపబడుచుండెను. ఎచ్చట వినినను మంగళనాదములే. రఘుకుల ప్రదీపకుడగు శ్రీరామునికి రమామణులు రత్నదీపములతో హారతుల నెత్తుచుండిరి. అంత సీతాదేవియును; అత్తలకును, అరుంధతీ వసిష్ఠులకును, వృద్ధులకును, పూజ్యులగు బ్రాహ్మణోత్తముల కును క్రమముగా నమస్కారములు చేసెను. కౌసల్యాది అత్తలు సీతను హత్తుకొనిరి. మంగళవాద్యములు మ్రోగుచుండగా మంగళద్రవ్యములచే సీతమ్మను సత్కరించి, అభ్యంగనాది క్రమములను సలిపిరి. నూతన వస్త్రాది అలంకారములచే సీతాదేవి వెలిగిపోవుచుండెను. అపుడు భరతుడు అత్యంత భక్తితో

తాను పూజించిన రామ పాదుకలను తెచ్చి శ్రీరాముని పాద పద్మములకు తొడిగెను. ఎంతో వినయముగా శ్రీరామునితో, "అన్నా! నా వద్ద ఉంచబడిన రాజ్యమిది. ఇపుడు నీకు సమర్పించుచున్నాను. నీప్రభావమున కోశాగారము, సైన్యమును పదింతలుగా వృద్ధి చేయబడినవి. జగదీశా! నీ నగరమును కాపాడుము." అని ప్రార్థించెను. శ్రీరాముడు అట్లేయని భరతుని మన్నించెను. పిమ్మట శ్రీరాముడు సీతతో కలసి దివ్యవస్త్రాలను అలంకరించుకొని, రథమునెక్కి, మంగళవాద్యములతో, సంగీత నర్తనములు జరుగుచుండ, చెవులకు, కళ్ళకు ఆనందకరములై ఉండగా ముందుకు సాగి అయోధ్యా పురములో ప్రవేశించెను.

**వారాంగనానృత్తగీతైర్యయౌ నిజపురీం ప్రతి ।**
**పౌరనార్యశ్చ సౌధస్థా వవర్షుః పుష్పవృష్టిభిః ॥ 97**

**చక్రుర్నీరాజనం మార్గే నానాబలిపురస్సరమ్ ।**
**రామో రథాత్తదోత్తీర్య సీతాం సంప్రేక్ష్య వై గృహమ్ ॥ 98**

**పుష్పకం ప్రాహ గచ్ఛ త్వం కుబేరం వహ సర్వదా ।**
**తథేతి రామవచనాజ్జగామ పుష్పకం తు తత్ ॥ 99**

**అథ రామః సభామధ్యే వివేశ కపిభిః సహ ।**
**దదౌ కపిభ్యో గేహాని వస్తుం రమ్యాణి సాదరమ్ ॥ 100**

**అథ రామస్య రాజ్యార్థమభిషేకం గురుస్తదా ।**
**చకార సుముహూర్తే వై మహామంగళపూర్వకమ్ ॥ 101**

**హనుమత్ప్రముఖ్యాద్యైశ్చ చతుస్సింధుజలం శుభమ్ ।**
**సమానీయ నృపైః సర్వైర్మహావాద్యపురస్సరమ్ ॥ 102**

**ఛత్రం చ తస్య జగ్రాహ పృష్ఠసంస్థః స లక్ష్మణః ।**
**దధార సవ్యపార్శ్వస్థశ్చామరం భరతస్తదా ॥ 103**

**శత్రుఘ్నో వామపార్శ్వస్థో దధార వ్యజనం శుభమ్ ।**
**హనూమాన్పాదుకే దివ్యే దధార పురతః స్థితః ॥ 104**

**వాయవ్యాదిచతుష్కోణసంస్థితాస్తే మహౌజసః ।**
**సుగ్రీవాద్యాస్తదా చాసంశ్చత్వారో రాఘవేక్షణాః ॥ 105**

**సుగ్రీవో జలపాత్రం చ వరాదర్శం విభీషణః ।**
**దధార హస్తే తాంబూలపాత్రం స వాలినందనః ॥ 106**

**వస్త్రకోశాం జాంబవాంశ్చ దధార వేగవత్తరః ।**
**తస్థౌ సింహాసనే రామః సపృష్టాంకోపబర్హణః ॥ 107**

పురకాంతలు మేడలమీదనుండి పూలవాన కురిపించిరి. వివిధబలులతో నీరాజనములిచ్చిరి. శ్రీరాముడపుడు రథమునుండి దిగి, సీతను రాజాంతఃపురమునకు పంపి, చైతన్యమగు పుష్పక విమానమును ఉద్దేశించి, "ఇక నీవు పోయి ఎల్లప్పుడు కుబేరుని సేవించుచుండుము," అని ఆజ్ఞాపించెను. అ పుష్పకవిమానము అట్లేయని ఎగిరిపోయెను.(99)

## శ్రీరామ పట్టాభిషేకము.

అపుడు శ్రీరాముడు సభామధ్యమునకు కపులతో ప్రవేశించి, కపులకు ఆసనములను, సుందర వస్తువులను సాదరముగా ఇచ్చెను. ఆ తరువాత కులగురువులగు వశిష్ఠులవారు శ్రీరామునికి రాజ్య పట్టాభిషేకమును సుముహూర్తమున దివ్య మంగళవైభవములతో జరిపించెను. హనుమంతుడు మొదలుగా గల కపివీరులచే నాలుగుసముద్రములనుండి మంగళజలములు తీసికొనిరాబడెను.సమస్త రాజులును మహావాద్యములతో చేరిరి. వెనుక నిలచిన లక్ష్మణుడు తెల్లని గొడుగుపట్టెను. కుడిప్రక్కనున్న భరతుడు చామరము వీయుచుండెను. ఎడమ ప్రక్కనున్న హనుమంతుడు శ్రీరామ దివ్యపాదుకలను పట్టుకొనెను. మహాబలవంతులగు సుగ్రీవాదులు వాయువ్యము మొదలగు నాలుగు మూలలలో నిలబడిరి. అందు వాయువ్యమున సుగ్రీవుడు మంచినీటి పాత్రను, ఈశాన్యమున విభీషణుడు తాంబూల పాత్రను, నైఋతి దిక్కున ఉన్న జాంబవంతుడు వస్త్రములను పట్టుకుని, శ్రీరామ కరుణా కటాక్ష వీక్షణకు పాత్రులైరి.

**సౌమిత్రివామపార్శ్వేఽథ సంపాతిః సంస్థితోఽభవత్ ।**
**వామపార్శ్వే భరతస్య గుహకః సంస్థితోఽభవత్ ॥ 108**

**శత్రుఘ్నవామపార్శ్వేఽథ సంస్థితో మకరధ్వజః ।**
**హనుమద్వామపార్శ్వే చ గరుడః సంస్థితోఽభవత్ ॥ 109**

**సుగ్రీవాదిచతుర్ణాం తే వామపార్శ్వేషు సంస్థితాః ।**
**శ్రీచిత్రరథవిజయసుమంత్రదారుకాస్తథా ॥ 110**

**నానారాజోపకరణధృతహస్తా మహౌజసః ।**
**యయుర్దేవాసురాః సర్వే యక్షగంధర్వకిన్నరాః ॥ 111**

**ఔషధ్యః పర్వతా వృక్షాః స్సాగరాశ్చాథ నిమ్నగాః ।**
**మాలాంచ కాంచనీం వాయుర్దదౌ వాసవచోదితః ॥ 112**

**సర్వరత్న సమాయుక్తం మణికాంచన భూషితమ్ ।**
**దదౌ హారం నరేంద్రాయ స్వయం శక్రస్తు భక్తితః ॥ 113**

**ప్రజగుర్దేవగంధర్వా ననృతుర్వారయోషితః ।**
**దేవదుందుభయో నేదుః పుష్పవృష్టిః పపాత ఖాత్ ॥ 114**

**తతోఽకరవం స్తుతిమహం భరతేనాభిపూజితః । 115**

దివ్యమంగళమయిన రత్నసింహాసనముపై రత్నకంబళముగల ఆసనముపై శ్రీరాముడు వెలిగిపోవుచుండెను. లక్ష్మణుని యెడమప్రక్కలో సంపాతియును, భరతుని యెడమ ప్రక్కలో గుహుడును, శత్రుఘ్నుని ఎడమ ప్రక్కలో గరుడుడును, సుగ్రీవ విభీషణ వాలిపుత్ర జాంబవంతుల యెడమ ప్రక్కలలో వరుసగా చిత్రరథ, విజయ, సుమంత్ర, దారుకులును చక్కగా అలంకారులై ప్రకాశించుచుండిరి. పలు విధములగు దివ్యమంగళ ప్రదములైన సామగ్రులతో పరమేశ్వరుడనైన నేనూ, నాతో సకల దేవతలును, యక్ష గంధర్వ కిన్నరులును, పర్వత వృక్ష నదీ దేవతాదులును, శ్రీరామపట్టాభిషేక సమయమున శ్రీరాముని సన్నిధిలో ఉంటిమి. ఇంద్ర ప్రేరితుడైన వాయుదేవుడు సువర్ణహారమును సమర్పించెను. భక్తితో ఇంద్రుడు స్వయముగా సార్వభౌముడగు శ్రీరామునికి సమస్త రత్నములతోను, బంగారముతో కూడిన కమనీయమైన హారమును సమర్పించెను. దేవగంధర్వులు గానముచేయుచుండిరి. దేవతా నర్తకీమణులు నృత్యము చేయుచుండిరి. దేవదుందుభులు మ్రోగుచుండెను. గగనమునుండి పూలవాన వర్షించు చుండెను. భరతునిచే నమస్కరింపబడిన నేనూ శ్రీరాముని ఇట్లు స్తుతించితిని.

**శ్రీ శివ ఉవాచ**
**సుగ్రీవమిత్రం పరమం పవిత్రం**
**సీతాకళత్రం నవమేఘగాత్రమ్ ।**
**కారుణ్యపాత్రం శతపత్రనేత్రం**
**శ్రీరామచంద్రం సతతం నమామి ॥ 116**

సంసారసారం నిగమప్రచారం
ధర్మావతారం హృతభూమిభారమ్ ।
సదాఽవికారం సుఖసింధుసారం
శ్రీరామచంద్రం సతతం నమామి ॥ 117

లక్ష్మీవిలాసం జగతాం నివాసం
లంకావినాశం భువనప్రకాశమ్ ।
భూ దేవవాసం శరదిందుహాసం
శ్రీరామచంద్రం సతతం నమామి ॥ 118

మందారమాలం వచనే రసాలం
గుణైర్విశాలం హతసప్తతాలమ్ ।
క్రవ్యాదకాలం సురలోకపాలం
శ్రీరామచంద్రం సతతం నమామి ॥ 119

వేదాంతగానం సకలై స్సమానం
హతారిమానం త్రిదశప్రధానమ్ ।
గజేంద్రయానం విగతావసానం
శ్రీరామచంద్రం సతతం నమామి ॥ 120

శ్యామాభిరామం నయనాభిరామం
గుణాభిరామం వచనాభిరామమ్ ।
విశ్వప్రణామం కృతభక్తకామం
శ్రీరామచంద్రం సతతం నమామి ॥ 121

లీలాశరీరం రణరంగధీరం
విశ్వైకసారం రఘువంశహారమ్ ।
గంభీరనాదం జితసర్వవాదం
శ్రీరామచంద్రం సతతం నమామి ॥ 122

ఖలే కృతాంతం సుజనే వినీతం
సామోపగీతం మనసా ప్రతీతమ్ ।
రాగేణ గీతం వచనాదతీతం
శ్రీరామచంద్రం సతతం నమామి ॥ 123

శ్రీరామచంద్రస్య వరాష్టకం త్వాం
మయేరితం దేవి మనోహరం యే ।
పఠంతి శృణ్వంతి గృణంతి భక్త్యా
తే స్వీయకామాన్ ప్రలభంతి నిత్యమ్ ॥ 124

ఇతి స్తుత్వా రామచంద్రం సభాయాం సంస్థిత స్వహమ్ ।
ఏతస్మిన్నంతరే తత్ర రాజా దశరథో మహాన్ ॥ 125

దృష్ట్వా రామం ససీతం చ విమానస్థోఽర్కసన్నిభః ।
స్తుత్వా రామం పరాత్మానం రాజ్యస్థం బంధువేష్టితమ్ ॥ 126

ఉవాచ రామం సంతుష్టః సురానీక విరాజితః ।
దశరథ ఉవాచ
ధన్యోఽహం కృతకృత్యోఽహం ధన్యౌ తౌ పితరౌ మమ ॥ 127

ధన్యో దేశః కులం ధన్యం యస్త్వాం రాజ్యాభిషేచితమ్ ।
పశ్యామ్యద్య మహాబాహో ధన్యా సా జననీ తవ ॥ 128

యా కౌసల్యా సముత్సాహం నేత్రాభ్యాం తేఽద్య పశ్యతి ।
ఇత్యుక్తవంతం రాజానం నమామ స రఘూత్తమః ॥ 129

కౌసల్యాద్యా రాజదారాః సర్వే తే పౌరవాసినః ।
లక్ష్మణో భరతశ్చైవ శత్రుఘ్నస్తేఽథ మంత్రిణః ॥ 130

నమస్కారాన్నృపం చక్రుర్విమానస్థం ముదాన్వితాః ।
తాన్ రాజాఽపి పృథక్ పృష్ట్వా సర్వై ర్దేవగణైర్యుతః ॥ 131

పూజితో రామచంద్రేణ మయా సహ న్యవర్తత ।
యయుః స్వం స్వం పదం సర్వే మయా రాజ్ఞా సురాస్తదా ॥ 132

పరమేశ్వరుడైన నేను ఈ విధముగా శ్రీరామచంద్రస్వామిని సంస్తుతించితిని. నేను సభలో ఉండగా ఆకాశములో విమానముపైనుండి సూర్యునివలె వెలుగుచున్న దశరథమహారాజు, సాక్షాత్తు పరమాత్మ యగు శ్రీరాముడు బంధు పరివారముతో రాజ్యసింహాసనమును అలంకరించి యుండుటను చూచి స్తుతిస్తూ యిట్లనెను. “శూర శిరోమణీ! రాజ్యసింహాసనమును అలంకరించి వెలుగొందుచున్న నిన్ను చూచిన నేను తరించితిని. నాతల్లిదండ్రులును సార్థక జన్ములు. నా దేశము పావనమయినది. నాకులము పరిశుద్ధమయినది. యే కౌసల్య మిక్కిలి మక్కువతో నిన్ను చూచుచుండునో ఆ నీ తల్లి మిగుల ధన్యురాలు.” ఇట్లు చెప్పుచున్న ధశరథరాజునకు శ్రీరామచంద్రుడు నమస్కరించెను. పిదప వరుసగా కౌసల్య, సుమిత్ర, కైకేయి రాజ స్త్రీలును, ఊరివారందరును, లక్ష్మణ, భరత, శత్రుఘ్నులును, మంత్రులును సంతోషముతో దశరథరాజునకు నమస్కారములుచేసిరి. ఆరాజును అందరిని వేర్వేరుగా విచారించి నాతోను, సమస్తదేవ గణములతోనుకూడి శ్రీరామునిచేత పూజింపబడి తిరిగి స్వర్గమునకు వెడలెను. అపుడు సమస్తదేవతలును వారివారి స్థానములకు వెళ్ళిరి. (132)

**రామేఽభిషిక్తే రాజేంద్ర సర్వలోకసుఖావహే ।**
**వసుధా సస్యసంపన్నా ఫలవంతో మహీరుహాః ॥ 133**

**గంధహీనాని పుష్పాణి గంధవంతి చకాశిరే ।**
**సహస్రం శతమశ్వానాం ధేనూనాం రఘునందనః ॥ 134**

**దదౌ శతం వృషాణాం చ ద్విజేభ్యో వసు కోటిశః ।**
**సూర్యకాంతి సమప్రఖ్యాం సర్వరత్నమయీం స్రజమ్ ॥ 135**

**సుగ్రీవాయ దదౌ ప్రీత్యా రాఘవో హర్షసంయుతః ।**
**అవతంసం దదౌ శ్రేష్ఠం రాక్షసేంద్రాయ రాఘవః ॥ 136**

**అంగదాయ దదౌ దివ్యే రాఘవో బాహుభూషణే ।**
**చంద్రకోటిప్రతీకాశం మణిరత్నవిభూషితమ్ ॥ 137**

**సీతాయై ప్రదదౌ హారం ప్రీత్యా రఘుకులోత్తమః ।**
**సా తం హారం దదౌ వాయుపుత్రాయ సా మనస్వినీ ॥ 138**

**తేన హారేణ శుశుభే మారుతిర్గౌరవేణ చ ।**
**తదా దృష్ట్వా హనూమంతం రామోవచనమబ్రవీత్ ॥ 139**

మారుతే త్వాం ప్రసన్నోఽస్మి వరం వరయ కాంక్షితమ్ ।
హనూమానపి తం ప్రాహ నత్వా రామం ప్రహృష్టధీః ॥ 140

త్వన్నామ స్మరతో రామ మనస్తృప్యతి నో మమ ।
అతస్త్వన్నామ సతతం స్మరన్ స్థాస్యామి భూతలే ॥ 141

యావత్ స్థాస్యతి తే నామ లోకే తావత్కళేవరమ్ ।
మమ తిష్ఠతు రాజేంద్ర వరోఽయం మేఽభికాంక్షితః ॥ 142

యత్ర యత్ర కథాలోకే ప్రచరిష్యతి తే శుభా ।
తత్ర తత్ర గతిర్మేఽస్తు శ్రవణార్థం సదైవ హి ॥ 143

దేవాలయాన్నదీతీరాత్తీర్థాద్వాపి జలాశయాత్ ।
వినాఽన్యత్ర స్థలే తేఽస్తు కథా షడ్ఘటికోర్ధ్వతః ॥ 144

రామస్తథేతి తం ప్రాహ ముక్తస్తిష్ఠ యథాసుఖమ్ ।
కల్పాంతే మమ సాయుజ్యం ప్రాప్స్యసే నాత్ర సంశయః ॥ 145

## శ్రీరాముడు సత్కారములు చేయుట

సమస్త లోకములకు సుఖప్రదమైన శ్రీరామపట్టాభిషేక సమయమున భూమి పైరుతోనిండి యుండెను. వృక్షములు ఫలవంతములై ఉండెను. వాసనలేని పూవులు కూడా వాసనతో నిండి శోభించినవి. తన పట్టాభిషేక సమయమున శ్రీరాముడు బ్రాహ్మణులకు లక్షగుఱ్ఱములను, లక్షగోవులను, నూరు ఎద్దులను, కోట్ల కొలది బంగారు నాణెములను పంచెను. భక్తవత్సలుడగు రాముడు ప్రేమతో సుగ్రీవునికీ సూర్యుని వలె వెలుగొందు రత్నహారమును ఇచ్చెను. విభీషణునికి మేలైన సిగబంతినిచ్చెను. అంగదునికి భుజాలంకారమును ఇచ్చెను. కోటిచంద్రుల వెలుగులతో ప్రకాశించే దివ్య రత్నాలంకృత మగు హారమును శ్రీరాముడు సీతాదేవిచేతికి ఇచ్చెను, ఆమె ఆ హారమును వాయుపుత్రునికి అనుగ్రహించెను. దానిని ఆంజనేయుడు గౌరవముగా భావించి సంతోషించెను. అపుడు మారుతిని జూచి శ్రీరాముడు, "వాయుపుత్రా! నేను నిన్ను అనుగ్రహించి యున్నాను. నీకు ఇష్టము వచ్చినట్లు వరములను కోరుము." అని అనుగ్రహించెను. అందుకాంజనేయుడు సంతోషితుడగుచు, శ్రీరామునికి నమస్కరించి, "శ్రీరామస్వామీ! నీనామమును స్మరించు నా మనమునకు తృప్తిగలుగదు. కనుక నీ నామమును స్మరించుచు భూమిలో నివసించెదను. నాయొక్క వరమేమనగా నీ నామము లోకమునందు ఉండునంతవరకు నాదేహము నిలుచునుగాక! "నీయొక్క మంగళచరితము ఎచ్చటెచ్చట జరుగు

చుండునో అచ్చటచ్చట నిరంతరముగా వినుటకై నాకు గమనము సిద్ధించును గాక! దేవాలయము, నదీతీరము, తీర్థము, సరోవరముల ఒడ్డున, జలాశయములు ఇవి తప్ప తక్కినయేస్థలమైనను నీకథ ఉదయం ఆరు గంటల తరువాత జరుగును గాక!" అని వరమును ప్రార్థించెను. శ్రీరాముడట్లే యనుచు, "ముక్తుడై నీయిచ్చవచ్చినట్లుండుము. ప్రళయమున నాయొక్క సాయుజ్యముక్తి నందుదువు. ఇందులో సంశయము లేదు." అని వరమును ప్రసాదించెను.

**తమాహ జానకీ ప్రీతా యత్ర కుత్రాపి మారుతే ।**
**స్థితం త్వామనుయాస్యంతి భోగాః సర్వే మమాజ్ఞయా ॥ 146**

**గ్రామారామేపత్తనేషు వజ్రఖేటకసద్మసు ।**
**వనదుర్గపర్వతేషు సర్వదేవాలయేషు చ ॥ 147**

**నదీషు క్షేత్రతీర్థేషు జలాశయపురేషు చ ।**
**వాటికోపవనాశ్వత్థవటవృందవనాదిషు ॥ 148**

**త్వన్మూర్తిం పూజయిష్యంతి మాయయా విఘ్నశాంతయే ।**
**భూతప్రేతపిశాచాద్యా నశ్యంతి స్మరణాత్తవ ॥ 149**

**యే చాన్యే వానరాద్యాశ్చ హ్యయోధ్యాం సముపాగతాః ।**
**అమూల్యాభరణైర్వస్త్రైః పూజితా రాఘవేణ తే ॥ 150**

**సుగ్రీవప్రముఖాః సర్వే వానరాః స విభీషణాః ।**
**మఖరధ్వజసంపాతిగుహకాః పార్థివాదయ ।**
**యథార్థం పూజితాస్తేన రామేణ వసనాదిభిః ॥ 151**

**తతః సర్వైర్భోజనార్థం రాఘవః సంస్థితోఽభవత్ ।**
**రామేణ ప్రాణాహుతయో గృహీతాశ్చేతి మారుతిః ॥ 152**

**నిరీక్ష్యోడ్డీయ వేగేన రామాగ్రే భోజనస్య చ ।**
**త్రిపదాయాం స్థితం పాత్రం హైమం పక్వాన్న పూరితమ్ ॥ 153**

**నినాయ వామహస్తేన ధృత్వా చ విహసన్ముదా ।**
**స్వయం భుక్త్వా రామశేషం ప్రాక్షిపద్వానరానపి ॥ 154**

**తదా విభీషణాద్యాశ్చ స్వీయపాత్రాణి వేగతః ।**
**విసృజ్య మారుతిం స్తుత్వా త్వయా సమ్యక్కృతం త్వితి ॥ 155**

**తత్క్షిప్తం రాఘవోచ్ఛిష్టం బుభుజుః సంభ్రమాన్వితాః ।**
**మహాన్ కోలాహలశ్చాసీద్రామోచ్ఛిష్టార్థమాదరాత్ ॥ 156**

**సీతారామౌ తన్నిరీక్ష్య ముదా జహసతుస్తదా ।**
**ఏవం నానాకౌతుకాని కుర్వంతో రాఘవాంతికే ॥ 157**

అపుడు సీతాదేవి ప్రీతితో ఆంజనేయునికి, "వాయుపుత్రా! వినుము; నాయాజ్ఞ వలన గ్రామములలోను, తోటలలోను, పట్టణములలోను, పంట కాలువలుండెడు పల్లెలు, ఇండ్లు, అరణ్యములు, కోటలు, కొండలు, సకల దేవాలయములు, నదులు, పుణ్యక్షేత్రములు, పుణ్యతీర్థములు, అశ్వత్థాది (రావి)వృక్ష మూలములు మొదలైన ప్రాంతాలలో నివసించుచు నిన్ను యెవరు పూజించు చుందురో వారికి సమస్తభోగములు సిద్ధించును, విఘ్నములు తొలగిపోవును. నిన్ను స్మరించుట చేత భూత, ప్రేత, పిశాచములు నశించును." అని వరమునిచ్చెను. పిమ్మట, అయోధ్యకువచ్చియున్న వానరులు మొదలుగాగల వారందరును రత్నాభరణముల చేతను, వస్త్రములచేతను సత్కరింపబడిరి. మకరధ్వజుడును, సంపాతియును, గుహుడును తక్కిన రాజులును గౌరవింపబడిరి. (151)

## శ్రీరామునితో అందరు వినోదించి తమతమ నివాసములకు వెళ్ళుట.

అంత అందరితోను శ్రీరాముడు భోజనమునకు కూర్చుండెను. అప్పుడు శ్రీరాముడు ప్రాణాహుతులను స్వీకరించిన వెంటనే హనుమంతుడు కుప్పిగంతు వేసివచ్చి, ముక్కాలుపీట మీదనున్న పక్వాన్నములుగల శ్రీరాముని భోజనపాత్రమును తీసికొని యెదుట నవ్వుచు శ్రీరామ ఉచ్ఛిష్టమును తాను భక్షించి మిగిలినది వానరులకొరకు పడవేసెను. అపుడు విభీషణాదులు, సుగ్రీవాదులును తమతమ పాత్రములను విడిచిపెట్టి నీవు చక్కనిపని చేసితివని ఆంజనేయుని పొగడుచు ఆపడిన రామోచ్ఛిష్టమును సంభ్రమముతో తినుచుండిరి. అప్పుడచ్చట శ్రీరాముని యెంగిలి మాకు చిక్కునా, మాకు చిక్కునా యను మహా కోలాహలము మొదలాయెను. సీతారాములు వీరి వినోదములను చూచి నవ్వుచుండిరి. ఇట్లు సుగ్రీవాదులు వివిధ వినోదములను చేయుచు శ్రీరాముల సన్నిధిలో వారికి సంతోషమునిచ్చుచు కొన్నిదినములుండిరి.

**సుగ్రీవాద్యాః సుఖం తస్థుస్తోషయన్తః కియద్దినమ్ ।**
**ఏకస్మిన్నంతరే తత్ర పుష్పకం చాగమత్పునః ॥ 158**

ప్రాహ దేవ కుబేరేణ ప్రేషితం త్వామహం పునః ।
మామాహ యత్కుబేరస్తచ్ఛృణుష్వ త్వం రఘూత్తమ ॥ 159

జితస్త్వం రావణేనాదౌ పశ్చాద్రామేణ నిర్జితః ।
అతస్త్వం రాఘవం నిత్యం వహ యావద్వసేద్భువి ॥ 160

యదా గచ్ఛేద్రఘుశ్రేష్ఠో వైకుంఠం యాహి మాం తదా ।
తచ్ఛ్రుత్వా రాఘవః ప్రాహ స్సుగ్రీవాదీన్ యథాస్థలే ॥ 161

స్థాప్య శీఘ్రమయోధ్యాయాం రాజద్వారాద్వహిర్వస ।
తథేతి రామవచనాద్వానరాద్యాన్యథాస్థలే ॥ 162

స్థాప్య శీఘ్రమయోధ్యాయాం రాజద్వారాద్బహిః స్థితమ్ ।
చకార రాజ్యం ధర్మేణ లంకాయాం స విభీషణః ॥ 163

ప్రశాస రాజ్యం పాతాళే ధర్మేణ మకరధ్వజః ।
చకార తార్క్ష్యః సంపాతిం యౌవరాజ్యేపదే నిజే ॥ 164

శశాస రాజ్యం కపిభిః కిష్కింధాయాం కపీశ్వరః ।
శృంగవేరపురే రాజ్యం గుహకశ్చాకరోన్ముదా ॥ 165

నత్వా రామం వాయుపుత్రో యయౌ తప్తుం హిమాలయమ్ ।
సర్వే విభీషణాద్యాశ్చ పంచమే సప్తమేఽహని ॥ 166

దర్శనార్థం రాఘవస్య సాకేతం ప్రయయుః సదా ।
పంచ సప్త దినాన్యత్ర స్థిత్వా శ్రీరాఘవాంతికమ్ ॥ 167

యాతాయాతం సదా చక్రుః స్వస్వరాజ్యాద్రఘూత్తమమ్ ।
రామోఽపి రాజ్యమఖిల శశాసాఖిలవత్సలః ॥ 168

అనిచ్ఛంతం హి సౌమిత్రిం యౌవరాజ్యేఽభ్యషేచయత్ ।
లక్ష్మణః పరయా భక్త్యా రామసేవాపరోఽభవత్ ॥ 169

విశ్వామిత్రాధ్వరే పూర్వం రణయాగస్య పూర్ణతా ।
న కృతా యా రాఘవేణ సా కృతా స్వపదే తదా ।
రణయాగః సవిస్తారాద్వర్ణ్యతే శృణు పార్వతి ॥ 170

**రణాంగణం యజ్ఞకుండం తత్ర వై హ్యపలాయనమ్ ।**
**తచ్చ వేదవిధానం చ బ్రహ్మసత్త్వం ప్రకీర్తితమ్ ॥ 171**

అంతలో ఆ సచేతన పుష్పకవిమానము తిరిగి వచ్చి శ్రీరామునితో, "స్వామీ! నేను కుబేరునిచే పంపబడితిని- నిన్ను రావణుడు మొదట జయించి యనుభవించుచుండె. పిమ్మట శ్రీరాముడు జయించెను. కావున, నీవు శ్రీరాముడు భూలోకమును అలంకరించుచుండు నంతవరకు అస్వామినే సేవించుచుండుము. అతడు వైకుంఠమునకు వెళ్ళినతరువాత నావద్దకు రమ్ము- అని చెప్పిపంపెను. "వచ్చియున్నాను," అని విన్నవించెను. అది విని శ్రీరాముడు సుప్రీతుడై, "పుష్పకమా! నీవు సుగ్రీవాదులను వారివారి స్థలములలో విడిచివచ్చి అయోధ్యలో రాజద్వారమున నుండవలయు"నని ఆజ్ఞాపించెను. అట్లేయని పుష్పకము శ్రీరామాజ్ఞ ప్రకారము అందరిని వారివారి ఊళ్లలో విడచివచ్చి, రాజద్వారము బయటనుండెను. విభీషణుడు లంకలో ధర్మముగా రాజ్యమేలెను. మకరధ్వజుడు ధర్మముగా పాతాళములో రాజ్యమునేలెను. గరుడుడు తన యౌవరాజ్యపదమున సంపాతిని సంస్థాపించెను. సుగ్రీవుడు కిష్కింధలో రాజ్యమేలుచుండెను. శృంగబేరపురమున గుహుడు రాజ్యమేలుచుండెను. హనుమంతుడు శ్రీరామునికి నమస్కరించి, హిమాలయమున తపస్సు చేయుటకై వెడలెను. విభీషణాదులందరును 5-7 దినముల కొకతూరి శ్రీరామసన్నిధికివచ్చి 5-7 దినములు వసించియుండి పోవుట, వచ్చుట, ఇట్టి రాకపోకలచే ఆనందించుచుండిరి. అందరియందును ప్రీతి గల రాముడు రాజ్య మేలుచుండెను. అపుడు వలదనినను బలాత్కారముచే భరతునికి యౌవరాజ్యమును ఇచ్చెను. లక్ష్మణుడు మిక్కిలి భక్తితో రామసేవాపరాయణుడై యుండెను.

పార్వతీ! పూర్వము విశ్వామిత్రుని యజ్ఞమున శ్రీరాముడు యే రణయజ్ఞమునకు ఆరంభిచెనో, దానినిప్పుడు పూర్తిచేసెను.

**కర్మణశ్చ ఘటాటోపో జ్ఞేయః శస్త్రఖణస్వనః ।**
**సమ్మార్జనం స్రుక్స్రువయోర్జ్ఞేయం పాషాణఘర్షణమ్ ॥ 172**

**శస్త్రాణాం మలశోధార్థం క్రియతే యద్రణాంగణే ।**
**భూమౌ శరాణాం విస్తారః పరిస్తరణముత్తమమ్ ॥ 173**

**పరిసమూహనం ధైర్యం వహ్నికాలానలో మహాన్ ।**
**స్రువేణ బాణరూపేణ మాంసాహుతిసమర్పణమ్ ॥ 174**

**రక్తధారా వసోర్ధారా హాహాకారో భయానకః ।**
**స ఓంకార వషట్కారఘోషో జ్ఞేయో రణాధ్వరే ॥ 175**

**అగ్నేర్జ్వాలా శస్త్రతేజోధూమ్రః స్వేదస్రువో రణే ।**
**జ్వాలానిచయశాంత్యర్థం పృషదాజ్యస్య సేచనమ్ ॥ 176**

**యత్తదత్ర తు వీరాణామస్త్రమోచనముత్తమమ్ ।**
**జ్ఞానేన సహ జీవస్య బలిర్దీపబలిః స్మృతః ॥ 177**

**యే దేహలోభినో జీవా బలిదీపహరాః స్మృతాః ।**
**రామహస్తాన్మృతిం త్యక్త్వా యే కుర్వంతి పలాయనమ్ ॥ 178**

**దేహబంధాన్న ముక్తాస్తే బలిభక్షణదోషతః ।**
**పూర్ణాహుతిః శిరోభిర్హి జ్ఞేయాస్తత్ర ప్రదక్షిణాః ॥ 179**

**ఉచ్చాటనం హి సవ్యేన వీరాణాం జయహేతవే ।**
**నైజం పదప్రదానం చ జ్ఞేయా సా దక్షిణాఽధ్వరే ॥ 180**

**సురైర్యా పుష్పవృష్టిస్తత్ జ్ఞేయం విప్రాభిషేచనమ్ ।**
**జయ సంపాదనం యుద్ధే శ్రేయః సంపాదనం హి తత్ ॥ 181**

## శ్రీరాముని రణయజ్ఞ వర్ణనము.

పార్వతీ! విశ్వామిత్రుని ఆ రణయజ్ఞమును చక్కగా వర్ణించెదను. వినుము, "యుద్ద రంగమే యజ్ఞ కుండము. పరుగెత్తకయుండుటే వేదవిధానము. రణకర్మయే బ్రహ్మసద్మము. శస్త్రముల ఖణనాదమే వేదశస్త్రములు, శస్త్రములకు సానపెట్టుటే స్రుక్ స్రువ మార్జనము. నేలబడిన బాణములే పరి స్తరణములు. ధైర్యమే పరిసమూహనము. గొప్ప కాలాగ్నియే యజ్ఞేశ్వరుడు. బాణమను స్రువముచే మాంసాహుతి సమర్పణమగును. రక్తధారయే వసోర్ధార. హాహాయను నాదమే ప్రణవాదినాదము. శస్త్రకాంతులే అగ్నిజాల్వలు, ఘర్మస్రావమే ధూమ్రము. వీరులచేతి యస్త్రము లూడిపడుట జ్వాలాతిశయమున జేయు పృషదాజ్యసేచన మనబడును. జ్ఞానముతోడ జీవబలినిచ్చుట దీపబలి ప్రదానము. దేహ అభిమానము గల యేజీవులు రామునిచేతి చావునందక వెరచి పరుగెత్తిరో వారు బలిదీపహరులు. బలి భక్షణ దోషముచే అట్టివారు ముక్తినొందలేదు. తలలచే పూర్ణాహుతులు. జయమునకై వీరులుచేయు సరియైన మన్త్రోచ్చాటనయే ప్రదక్షిణము. నిజపద ప్రదానమే దక్షిణ యనబడును. దేవపుష్పవృష్టియే బ్రాహ్మణాభిషేకము. జయించుటే శ్రేయస్సునందుట.

**చరాచరాణామానందో జ్ఞేయః స నిజగోత్రిణామ్ ।**
**భూతానాం తర్పణం విప్రభోజనం సంప్రకీర్తితమ్ ॥ 182**

ఏవం సుబాహునా యుద్ధే రాఘవస్య రణాధ్వరః ।
తథా గాధిజయజ్ఞోఽపి ద్వౌ తౌ జ్ఞేయౌ సహైవ హి ॥ 183

కృతాఽధ్వర సమాప్తిస్తు విశ్వామిత్రేణ వై పురా ।
విసర్జితో న రామేణ దృష్ట్వాఽతృప్తం రణాధ్వరే ॥ 184

కాలానలం పునస్తస్య తృప్త్యర్థం వాఽకరోన్మతిమ్ ।
కృత్వా భూమేర్మహత్పాత్రం విరాధరుధిరేణ హి ॥ 185

పాత్రస్య ప్రోక్షణం కృత్వా చిత్రాహుత్యర్థమాదరాత్ ।
రామః శూర్పణఖాయాశ్చ ఘ్రాణం కర్ణౌ విభేద యత్ ॥ 186

ప్రాణాహుతిభ్యో రామేణ త్రిశిరాః ఖరదూషణౌ ।
మారీచశ్చ కబంధశ్చ పంచ తే నిహతాః క్షణాత్ ॥ 187

శిఖాబంధవిమోక్షార్థం శబరీ భవబంధనాత్ ।
కృతా ముక్తా తు రామేణ జలస్పర్శనహేతవే ॥ 188

నేత్రయోర్నిహతో వాలీ దత్తం తద్రుధిరం తదా ।
కృథిర్లంకాపురీ దగ్ధా కుంభకర్ణస్తథౌదనః ॥ 189

పక్వాన్నమింద్రజిత్ జ్ఞేయః శాకార్థం రాక్షసా హతాః ।
వరాన్నం సారణో జ్ఞేయః ప్రహస్తో వటకః స్మృతః ॥ 190

నికుంభః పర్పటో జ్ఞేయః కుంభస్తు లవణం స్మృతః ।
పాయసార్థం కాలనేమిస్త్వతికాయః స శర్కరః ॥ 191

క్షీరమైరావణో జ్ఞేయో ఘృతం మైరావణః స్మృతః ।
దధ్యోదనః సమాప్తౌ తు ఆహవే చ స రావణః ॥ 192

హత్వా నివేదితః పాత్రే తస్య కాలానలస్య చ ।
ఉచ్ఛిష్టబలిసంత్యాగః కేశత్వక్కీకసాదినామ్ ॥ 193

సంత్యాగోఽత్ర రణే జ్ఞేయస్తదా తృప్తో బభూవ సః ।
తతో రణాధ్వరస్యాత్ర రాఘవేణ విసర్జనమ్ ॥ 194

**అయోధ్యాయాం ప్రవేశో హి కృతస్తత్తే వదామ్యహమ్ ।**
**అధ్వరావభృథస్నానం జ్ఞేయం రాజ్యాభిషేచనమ్ ॥ 195**

**మంగళాని సమస్తాని యజ్ఞాంగవిహితాని హి ।**
**జ్ఞాతవ్యానీతి రామేణ రణయాగో విసర్జితః ॥ 196**

వృక్షాలు, జంతువుల ఆనందమే నిజగోత్ర ఆనందము. భూత తృప్తియే విప్రసంతుష్టి. ఇట్లు శ్రీరాముడు సుబాహువుతో రణయజ్ఞము చేసెను. అట్లే విశ్వామిత్రుడును యజ్ఞము చేసెను. అవి రెండును సమముగా నడిచెను.

విశ్వామిత్రుడు అప్పుడే యజ్ఞమును ముగించెను. కానీ రాముడు మాత్రము తన రణయజ్ఞమును ముగించలేదు. మరల నా కాలాగ్నిని తృప్తిపరచుటకై ఈ భూమినే పాత్ర అనుకొని విరాధుని రక్తముచే పాత్రమును ప్రోక్షించి, శూర్పణఖయొక్క ముక్కు, చెవుల చే చిత్రాహుతులను ఇచ్చెను. త్రిశిరుడు, ఖరుడు, దూషణుడు, మారీచుడు, కబంధుడు– వీరయిదుగురిని పంచప్రాణాహుతులుగా జేసెను. శ్రీరామునిచే శిఖాబంధ విమోక్షమునకై సంస్మృతిబంధమునుండి శబరి తొలగింపబడెను. రాఘవుడు కండ్లకు నీళ్లుతుడుచుటకై వాలిని చంపి, వానిరక్తమునిచ్చెను. లంక కాల్పబడుటయే హవిః పాకము. కుంభకర్ణుడే ఓదనము. ఇంద్రజిత్తు పక్వాన్నము. రాక్షసులే కూరలు. శాల్యన్నము సారణుడు. ప్రహస్తుడు వడియము. నికుంభుడే అప్పళము. కుంభుడే ఉప్పు. పాయసము కాలనేమి, అతికాయుడు పంచదార, ఐరావణుడు పాలు, నెయ్యి మైరావణుడు. రణయజ్ఞ సమాప్తిలోని దధ్యోదనమే రావణుడు. ఇట్లు శ్రీరాముడు అందరినిచంపి భోజన వస్తువులునుగా జేసి ఆ పాత్రను కాలాగ్నికిచ్చెను. గోళ్లు, ఎముకలు మొదలైనవాటిని విడచుటయే ఉచ్చిష్ట బలిత్యాగము. అప్పుడు ఆ కాలాగ్ని తృప్తినొందెను. అంత ఆ రఘుపతి రణ యజ్ఞమును విడిచి, అయోధ్యను ప్రవేశించి రాజ్య పట్టాభిషేకము నందుటయే అవభృథస్నానమనబడును, శ్రీరాముడిట్లు యజ్ఞాంగములగు మంగళములను తెలియవలెనని రణయజ్ఞమును విడిచెను.

**ఏవం ప్రోక్తో మయా దేవి రణయాగః సవిస్తరః ।**
**రామోఽథ పరమాత్మాపి కార్యాధ్యక్షోఽతినిర్మలః ॥ 197**

**కర్తృత్వాది విహీనోఽపి నిర్వికారోఽపి సర్వదా ।**
**స్వానందేనాపి సంతుష్టో లోకానాముపదేశకృత్ ॥ 198**

చకార వివిధాన్ ధర్మాన్ గార్హస్థ్యమనులంబ్య చ ।
న పర్యదేవన్ విధవా న చ వ్యాలకృతం భయమ్ ॥ 299

న వ్యాధిజం భయం చాసీద్రామే రాజ్యం ప్రశాసతి ।
ఔరసానివ రామోఽపి జుగోప పితృవత్ ప్రజాః ॥ 200

సీతయా బంధుభిః సార్థం సాకేతే సుఖమాప సః ।
ఇదం యుద్ధచరిత్రం తే ప్రోక్తం దేవి మయా తవ ॥ 201

**ఇతి శ్రీశతకోటిరామచరితాంతర్గతే, శ్రీమదానందరామాయణే, వాల్మీకీయే, ఆదికావ్యే, సారకాండే, యుద్ధచరితే, రామరాజ్యాభిషేకవర్ణనం నామ ద్వాదశః సర్గః ॥**

పార్వతీ ! ఇట్లు శ్రీరాముని రణయాగమును వర్ణించి చెప్పితిని. ఆహా! సాక్షాత్పరమాత్మయును, సదా నిర్వికారుడును, నిర్మలుడునై నిత్యము స్వానందానుభవమునందు ఉండెడు శ్రీరాముడు కర్తృత్వాదులకు దూరమైనను కార్యాధ్యక్షుడై లోకములకు ఉపదేశము నిచ్చువాడై గృహస్థాశ్రమమును అవలంబించి సమస్త ధర్మములను ఆచరించుచుండెను.

శ్రీరాముడు రాజ్యమునేలుచుండగా విధవలు పెండ్లియాడ లేదు. సర్పభయము, రోగభయము లేదు. తన బిడ్డలవలె ప్రజలను పరిపాలించుచుండెను. ఇట్లు సీతతోడ సపరివారముగా శ్రీరాముడు సాకేతరాజధానిలో సుఖముగా ఉండెను.

పరమేశ్వరుడు, “దేవీ! నీకిట్లు నాచేత శ్రీరాముని యుద్ధచరితము అభివర్ణింపబడినద”ని చెప్పి మఱియు ఇట్లనెను.

***శతకోటిప్రవిస్తరమైన రామకథలో, శ్రీమద్వాల్మీకిమహర్షిచే రచింపబడిన, ఆనందరామాయణంలోని, సారకాండలో యుద్ధచరితములో, రామరాజ్యాభిషేక వర్ణనములో పండ్రెండవ సర్గ ముగిసినది.***



# త్రయోదశః సర్గః-13వ సర్గ

## రామ-అగస్త్య సంవాదము

శ్రీశివ ఉవాచ

ఏకదా రాఘవం ద్రష్టుం మునిభిః కుంభసంభవః ।
యయౌ రామేణ సమ్మానమానితః స ఉపావిశత్ ॥ 1

ఉపవిశాః ప్రహృష్టాశ్చ మునయో రామపూజితాః ।
సంపృష్టకుశలాః సర్వే రామం కుశలమబ్రువన్ ॥ 2

కుశలం తే మహాబాహో సర్వత్ర రఘునందన ।
దిష్ట్యేదానీం ప్రపశ్యామో హతశత్రుమరిందమ ॥ 3

దిష్ట్యా త్వయా హతాః సర్వే మేఘవాదాదయోఽసురాః ।
హత్వా రక్షోగణాస్సర్వాన్ కృతకృత్యోఽద్య జీవసి ॥ 4

ఇతి తేషాం వచశ్శ్రుత్వా రామస్తాన్ప్రాహ సుస్మితః ।
కిమర్థమాదౌ యుష్మాభిర్మేఘనాదోఽద్య కీర్తితః ॥ 5

### అగస్త్యుడు శ్రీరామదర్శనమునకు వచ్చుట.

ఒకసారి శ్రీరాముని దర్శించుటకై ఋషీశ్వరులతోడ ఆగస్త్య మహర్షి వచ్చి, శ్రీరామునిచే గౌరవ సత్కారములను పొంది కూర్చుండెను. అట్లు సుఖాసీనులై, సంతుష్టులై, సమ్మానితులునైన మునులు తమ కుశలములను చెప్పి, పిదప శ్రీరామునితో, “శూరాగ్రణీ ! నీవు క్షేమమా! రఘుపతీ ! అంతట శత్రువర్గమును జయించి, సౌభాగ్యయుక్తముగా ఉన్నారా? భాగ్యవశమున మేఘనాదుడు మొదలుగా గల రాక్షసులనందరిని సంహరించి, కృతకృత్యుడవై విరాజమానులగుచున్నావు,” అని చెప్పిరి.

ఇతి రామవచశ్శ్రుత్వాఽగస్తిస్తైరవలోకితః ।
కుంభయోనిస్తదా రామం ప్రీత్యా వచనమబ్రవీత్ ॥ 6

శ్రుణు రామ యథా వృత్తం మేఘనాదస్య చేష్టితమ్ ।
జన్మకర్మవరప్రాప్తిం సంక్షేపాద్గదతో మమ ॥ 7

పురా కృతయుగే రామ పులస్త్యో బ్రహ్మణః సుతః ।
తృణబిందుసుతాయాం స పుత్రం త్రైలోక్యవిశ్రుతమ్ ॥ 8

నిర్మమే విశ్రవా నామధేయం వేదనిధిం శుభమ్ ।
భరద్వాజసుతాయాం చ విశ్రవా నిర్మమే సుతమ్ ॥ 9

శ్రేష్ఠం వైశ్రవణం తస్మై ప్రసన్నోఽభూద్విధిశ్చిరాత్ ।
విధిర్వైశ్రవణాయాథ తుష్టస్తత్తపసా దదౌ ॥ 10

మనోఽభిలషితం యానం ధనేశత్వమఖండితమ్ ।
పుష్పకం చాప్యేకదాఽసౌ ద్రష్టుం విశ్వావసుం యయౌ ॥ 11

పుష్పకేణ ధనాధ్యక్షో బ్రహ్మదత్తేన భాస్వతా ।
నత్వా తాతం తదా ప్రాహ న స్థానం బ్రహ్మణా మమ ॥ 12

దత్తం స్థేయం మయా కుత్ర తద్విత్తార్య వదస్వ మామ్ ।
విశ్రవా హ్యపి తం ప్రాహ విశ్వకర్మ వినిర్మితా ॥ 13

లంకానామ్నీ పురీ శ్రేష్ఠా సాగరేఽస్తి సుమండితా ।
త్యక్త్వా విష్ణుభయాద్దైత్యా వివిశుస్తం రసాతలమ్ ॥ 14

సుఖం త్వం వస తస్యాం హి తథేత్యుక్త్వా ధనేశ్వరః ।
గత్వా తస్యాం చిరం కాలమువాస పితృసమ్మతః ॥ 15

కస్మింశ్చిత్త్వథ కాలే హి సుమాలీనామ రాక్షసః ।
దుహిత్రా వ్యచరద్భూమౌ పుష్పకేతుం దదర్శ సః ॥ 16

హితాయ చింతయామాస రాక్షసానాం మహామనాః ।
కైకసీం తనయామాహ గచ్ఛ విశ్రవసం మునిమ్ ॥ 17

వరయస్వ మునేస్తేజః ప్రతాపాత్తే సుతాః శుభాః ।
భవిష్యంతి ధనాధ్యక్షతుల్యా నో హితకారిణః ॥ 18

## రావణ, కుంభకర్ణాదుల జన్మ, కర్మ వృత్తాంతము.

అదివిని రామచంద్రుడు చిరునవ్వుతో, “మహాత్ములారా! మీరు మొదట మేఘనాదుని ఏల ప్రశంసించితిరి?” అని అడుగగా, అగస్త్యముని సాదరముగా యిట్లు చెప్పుచున్నాడు. “శ్రీరామా!

సంక్షేపముగా మేఘనాదుని జన్మకర్మాది సకలవృత్తాంతమును చెప్పెదను వినుము(7), "మునుపు కృతయుగమున బ్రహ్మపుత్రుడగు పులస్త్యముని తృణబిందువు యొక్క పుత్రికయందు 'విశ్రవసు' అను ముల్లోకములలో సుప్రసిద్ధుడగు మునీంద్రుని కనెను. వేదనిధియగు ఆ విశ్రవసు ముని భరద్వాజ పుత్రిక యందు శ్రేష్ఠుడైన వైశ్రవణుని కనెను. అతడు తపస్సు చేసి, చిరకాలమునకు ప్రసన్నుడైన బ్రహ్మవలన తన మనస్సులోని కోరిక యగు ధనాధిపత్యమును, పుష్పక విమానమును వరముగా పొందెను. అంత ఒకసారి వైశ్రవణుడు పుష్పకముమీద వచ్చి తనతండ్రికి నమస్కరించి "మహాగురూ! బ్రహ్మదేవుడు నాకంటూ ఒక స్థిరమైన స్థలము ఇవ్వనందున, నేనెచ్చట నివసించవలయునో విచారించి సెలవిమ్ము," అని ప్రార్థించెను. అందుకు విశ్రవస్సు, "నాయనా! విశ్వకర్మనిర్మితమైన 'లంక' యను దివ్యనగరము సాగరమందున్నది అది ఎంతో శోభాయమానమైనది. 'వెన్ను' నికి వెరచి అందున్న రాక్షసులు రసాతలమునకు చేరిరి. దానిలో నీవుసుఖముగా ఉండుము." అని అనుగ్రహించెను. అట్లేయని వైశ్రవణుడు తండ్రి మాటను అనుసరించి, లంక లో నిశ్చింతగా చిరకాలముండెను.

ఒకానొకసారి 'సుమాలీ' అను రాక్షసుడు తన కూతురిని వెంటబెట్టుకొని భూమిపై తిరుగుచు పుష్పకముపై కుబేరుని చూచి, రాక్షసులకు హితమును కోరి, తన పుత్రియగు కైకసి తో, "అమ్మా! నీవు మునీంద్రుడగు విశ్రవస్సు వద్దకుపొమ్ము. అతనితేజస్సును వరముగా కోరుము. కుబేరునివంటి కుమారులు నీకు కలుగగలరు. అందువలన మనకు మేలుగలుగును," అని చెప్పెను.

**సా సంధ్యాయాం యయౌ శీఘ్రం మునేరగ్రే వ్యవస్థితా ।**
**లిఖన్తి భువి పాదాగుంష్ఠేన చాధోముఖీ స్థితా ॥ 19**

**తామపృచ్ఛన్మునిః కా త్వం సాఽఽహ త్వం వేత్తుమర్హసి ।**
**తతో ధ్యాత్వా మునిః సర్వం జ్ఞాత్వా తాం ప్రత్యభాషత ॥ 20**

**జ్ఞాతం తవాభిలషితం మత్తః పుత్రానభీప్ససి ।**
**దారుణాయాం తు వేలాయామాగతాఽసి సుమధ్యమే ॥ 21**

**అతస్తే దారుణౌ పుత్రౌ రాక్షసౌ సంభవిష్యతః ।**
**సాఽబ్రవీన్మునిశార్దూలం త్వత్తోఽప్యేవంవిధౌ సుతౌ ॥ 22**

**తామాహాంతిమజో యస్తే భవిష్యతి మహామతిః ।**
**తతః సా సుషువే పుత్రాన్ యథాకాలే సుమధ్యమా ॥ 23**

**రావణం కుంభకర్ణం చ క్రౌంచీం శూర్పణఖాం శుభామ్ ।**
**కుంభీనసీం కనీయాంసం తృతీయం తం విభీషణమ్ ॥ 24**

రావణః కుంభకర్ణశ్చ త్రయో దుహితరస్తదా ।
దుర్వృత్తాః ప్రాణిభక్షాశ్చ బభూవుర్మునిహింసకాః ॥ 25

ఏకదా రావణో మాత్రా లింగార్థం ప్రేషితః శివమ్ ।
కర్తుం ప్రసన్నమకరోత్ కైలాసే కర్మ దుష్కరమ్ ॥ 26

కించిత్స్వీయం శిరశ్ఛిత్వా వీణాం షడ్జస్వనైర్ముహుః ।
కృత్వా పీఠం హి దేహస్య తన్మూలం శిరసస్తథా ॥ 27

తదగ్రం పాదయోః కృత్వా శంకూనంగులిభిస్తథా ।
తంత్రీః కృత్వాఽంత్రమాలాభిః శతశోఽథ సహస్రశః ॥ 28

ఏవం కృత్వా స్వదేహస్య వీణాం షడ్జస్వరైర్ముహుః ।
చకార స్వముఖేనైవ గాంధర్వం గాయనం శుభమ్ ॥ 29

తదా నందీశ్వరం ప్రాహ శంకరో లోకశంకరః ।
శిరః సంధాయ హస్తేన త్వయా వాచ్యోఽద్య రావణః ॥ 30

ఆత్మలింగం రాక్షసం త్వాం శంకరో న ప్రదాస్యతి ।
హృద్గతం హి మయా జ్ఞాతం శంభోస్త్వం యది స్వస్థలమ్ ॥ 31

ఆ కైకసి యట్లేయని నిశ్చయించి, సంధ్యాసమయమున ఆమునియెదుట కాలివ్రేలిచే నేలను గీకుచు తలవంచి నిలిచెను. అపుడు విశ్రవస్సు, "నీవెవరు?" అని అడుగగా, "మీరే తెలిసికొందురు గాక !" అని సమాధాన మిచ్చెను. అంత ఆముని ధ్యానమున సర్వము తెలుసుకుని ఆమెకు, "నీ కోరిక ఏమిటో తెలుసుకుంటిని. నావలన కొడుకులను కోరుచున్నావు. సుందరీ! నీవు క్రూరకాలమగు సంధ్యాసమయమున వచ్చితివి, అందుచేత నీకు ఇద్దరు క్రూరరాక్షసులు పుట్టగలరు," అని అను గ్రహించెను. అందుకా కైకసి; "నీవల్ల ఇట్టి క్రూరులా" అని వేడగా, మరలా విశ్రవస్సు, "మరియొకని ప్రసాదించు చున్నాను ఆ మూడవ వాడు బుద్ధిశాలిగా ఉండును పొమ్మ"నెను. అంత ఆ కైకసి కాలక్రమమున ముగ్గురు పుత్రులను కనెను. మొదటివాడు రావణుడు, రెండవవాడు కుంభకర్ణుడు, ఆ తరువాత వరుసగా– క్రౌంచి, శూర్పణఖ, కుంభీనసి– యను ముప్పురు పుత్రికలు కలిగిరి. చివరలో ఆరవవాడుగా విభీషణుడు జన్మించెను. వీరిలో విభీషణుడు తప్ప తక్కినవారు చెడ్డనడతగలవారును, హింసకులును, క్రూరులునై మెలగిరి.

ఒకసారి కైకసి శివుని వద్దనుండి ఆత్మలింగమును తీసుకురమ్మని రావణుని పంపెను. వాడు కైలాసమునకు వెళ్ళి, శంకరుని ప్రసన్నుని జేయదలచి, తనతలను కత్తిరించి తనకాళ్ళలో నిరికించి పేగులవరుసను తంతులుగాజేసికొని వ్రేళ్లను మెట్లుగాఏర్పరచి తన దేహమునే ఇట్లు వీణాకారముగా మార్చి, ఆరుస్వరములతో ఆ ముఖముతోనే గంధర్వగానము చేయసాగెను. అపుడు లోకమునకు సుఖమునిచ్చు శివుడు నందిని పిలచి, "నీవు పోయి, వానితలను చేతబట్టి, ఓరి రావణా! పరమేశ్వరుడు ఆత్మ లింగమును నీకు ఇచ్చుటలేదు. శివహృదయాభి ప్రాయమును నేనెఱుగుదును. నీవు నీ స్థానమునకుపొమ్ము. అని చెప్పి వానిని పంపివేయుము," అని ఆజ్ఞాపించెను.

**ఇత్యుక్త్వా ప్రేషణీయః స రావణః స్వస్థలం త్వయా ।**
**ఇతి శంభోర్వచః శ్రుత్వా యయౌ నందీ స రాఘవమ్ ॥ 32**

**శిరః సయోంజ్య హస్తేన శివోక్తం తం న్యవేదయత్ ।**
**తచ్ఛ్రుత్వా రావణశ్చాపి సమతిక్రమ్యతాం నిశామ్ ॥ 33**

**చకార పూర్వవద్గానం ద్వితీయదివసే పునః ।**
**నందినా శంకరశ్చాపి పూర్వవృత్తం న్యవేదయత్ ॥ 34**

**ఇత్థం దశ దినాన్యేవ గతాని రావణస్య చ ।**
**అథ తత్కర్మణా తుష్టః శంకరో గాయనేన చ ॥ 35**

**భూత్వా ప్రసన్నస్తం ప్రాహ వరం వరయ చేతి వై ।**
**దృష్ట్వా శంభుం రావణోఽపి శిరసా తేన సంధితః ॥ 36**

**వరయామాస తన్మాత్రే హ్యాత్మలింగం తథా మమ ।**
**పత్న్యర్థం పార్వతీం దేహి తథేత్యుక్త్వా దదౌ శివః ॥ 37**

**గృహీత్వా గంతుకామం తం పునః ప్రాహ హరస్తదా ।**
**మత్తోషార్థం త్వయా వీర దశవారం నిజం శిరః ॥ 38**

**ఖడ్గేన ఛేదితం యస్మాత్తస్మాత్తేఽద్య శిరాంసి హి ।**
**దశ వింశద్భుజాశ్చాపి భవిష్యంతి గిరా మమ ॥ 39**

**తతః స రావణస్తుష్టో గిరిజాలింగసంయుతః ।**
**వింశద్భుజో దశగ్రీవః స్వస్థలం గంతుముద్యతః ॥ 40**

**కల్పభేదాచ్ఛుతశిరాః శతవారం ప్రఖండితైః ।**
**స ప్రోక్తః స్వశిరోభిర్హి శతద్వయభుజః క్వచిత్ ॥ 41**

**తస్మాద్ధి హృతవాన్ విష్ణుస్త్వం తాం మార్గే ప్రతార్య వై ।**
**తథైవాబ్ధేస్తటే లింగం గోకర్ణం రావణాత్త్వయా ॥ 42**

**గృహీత్వా స్థాపితం పూర్వం రావణోఽపి గృహం యయౌ ।**
**మందోదరీం హరేర్వాక్యాలబ్ధ్వా మయసుతాం శుభామ్ ॥ 43**

**మాతుః కార్యమసంపాద్య తూష్ణీమేవాతిలజ్జితః ।**
**మందోదర్యాఽకరోత్స్వయం వివాహం తోషపూరితః ॥ 44**

అపుడు నంది వచ్చి వానితలను లేపి, శివాదేశమును చెప్పెను. అదివినిన రావణుడు ఆ రాత్రి కాగానే వదలక మరల అదేవిధముగా రెండవసారి తన తల నరికి గానమునకు ఆరంభించెను. మరల శివాజ్ఞచే నందివచ్చి చెప్పిపోయెను. ఇట్లు రావణుడు తనతలను పదిమార్లు పదిదినములలో శివార్పితము జేసి గానముచేయగా సాంబశంకరుడు ప్రసన్నుడై వచ్చి వరములు వేడుమనెను. శంభు దర్శనమందిన రావణుడు ఆ కడపటి తల నంటబెట్టుకొని తనతల్లికి ఆత్మలింగమును ఇమ్మని మొదటివరము నడిగెను. నాకు భార్యగా నారియగు పార్వతినిమ్మని రెండవవరమునడిగెను. అట్లేయని శివుడు వరదుడై ఆత్మలింగమును, ఆర్యాదేవిని తీసికొనిపోవ నెంచుచుండు రావణునికి, "ఓరివీరుడా! నీవు నాసంతోషముకొరకు పదిమార్లు నీతలను నరికి సమర్పించితివిగాన ఇప్పుడు నీకు పదితలలును ఇరువది భుజములును నాయాజ్ఞచే కాగలవు." అని మరల వరమునిచ్చెను. అంత ఆ దశగ్రీవుడు 20 భుజములతో, ఆత్మలింగము, గిరిజాదేవితో సంతుష్టుడై వెడలెను. కల్పభేదముచే కొన్ని చోట్లలో నూరుతలలు ఖండింపబడి శతగ్రీవుడని, 200 చేతులు గలవాడని చెప్పబడియున్నది. గనుకనే శ్రీరామా! మహావిష్ణువుగా నీవే దారిలో ఆత్మలింగమును అపహరించి గోకర్ణమున ప్రతిష్ఠించితివిగదా! హరివాక్యముచే పార్వతిని విడిచి, మాయ పుత్రియగు మందోదరిని పెండ్లాడి, తల్లి చెప్పిన పని చేయలేక, దూరదృష్టిలేక, మందోదరీ వివాహముతో ఆనందముగా ఉండెను.

**దృష్ట్వైకదా ధనాధ్యక్షం పుష్పకస్థం తు కైకసీ ।**
**పుత్రాన్ ధిక్కారయామాస యూయం షడా మృతోపమాః ॥ 45**

**సాపత్నబంధుం యే దృష్ట్వా జాయంతే నాత్ర లజ్జితః ।**
**తే మాతృవచనం శ్రుత్వా యయుర్గోకర్ణముత్తమమ్ ॥ 46**

దశవర్షసహస్రాణి కుంభకర్ణోఽకరోత్తపః ।
విభీషణోఽపి ధర్మాత్మా సత్యధర్మపరాయణః ॥ 47

పంచవర్ష సహస్రాణి పాదాంగుష్ఠేన తస్థివాన్ ।
దివ్యవర్షసహస్రం తు ధూమాహారో దశాననః ॥ 48

పూర్ణే వర్షసహస్రం స్వం శీర్షమగ్నౌ జుహావ సః ।
ఏవం వర్షసహస్రాణి నవ తస్యాతిచక్రముః ॥ 49

అథ వర్షసహస్రే తు దశమే దశమం శిరః ।
ఛేత్తుకామస్య ధర్మాత్మా ప్రసన్నోఽభూత్ప్రజాపతిః ॥ 50

ఉవాచ వచనం బ్రహ్మా వరం వరయ కాంక్షితమ్ ।
తదోవాచ దశాస్యస్తమవధ్యత్వం వృణోమ్యహమ్ ॥ 51

సుపర్ణనాగయక్షేభ్యో దేవేభ్యశ్చాసురైరపి ।
త్వత్తః శంభోర్మహావిష్ణోర్మానుషా మే తృణోపమాః ॥ 52

తథేత్యుక్త్వా విధిస్తస్మై దశ శీర్షాణి సందదౌ ।
విభీషణాయ సద్బుద్ధిమమరత్వం దదౌ ముదా ॥ 53

విమోహితం సరస్వత్యా దేవేంద్రపదకాంక్షిణమ్ ।
కుంభకర్ణం విధిః ప్రాహ వరం వరయ వాంఛితమ్ ॥ 54

సోఽపి తం వరయామాస నిద్రాంషాణ్మాసికీం శుభామ్ ।
షాణ్మాసీయే చైకదినేఽశానం బ్రహ్మాఽపి దత్తవాన్ ॥ 55

తతోఽన్తర్ధానమగమద్విధిస్తేఽపి గృహం యయుః ।
సుమాలీ వరలబ్ధాంస్తాన్ జ్ఞాత్వా దౌహిత్రసత్తమాన్ ॥ 56

ఇట్లుండగా ఒకప్పుడు రావణుని తల్లియైన కైకసి పుష్పక విమానములో తిరుగుచున్న కుబేరుని జూచి తనపుత్రులతో "సవతితల్లి కుమారుడు అన్నయు అగు పుష్పక విమానములో తిరుగుచున్న కుబేరుని జూచి సిగ్గుపడక యుండుట చేత మీరు చచ్చినవారి వంటివారు. పౌరుషము లేనివారు," అని రావణ సోదరులను పరుషముగా మాట్లాడెను. తల్లిమాటవిని వారు గొప్పదగు గోకర్ణ క్షేత్రమునకుపోయి తపస్సుకు సిద్ధపడిరి. కుంభకర్ణుడు పదివేలసంవత్సరములు తపస్సు చేసెను. ధర్మాత్ముడగు విభీషణుడును సత్యధర్మ పరాయణుడై అయిదువేల సంవత్సరములు కాలిబొటనవ్రేలి

మీద నిలచి తపము చేసెను. రావణుడు ప్రతి వేయి సంవత్సరములకు ఒకసారి తన ఒక తలను అగ్నిలో ఆహుతిగా సమర్పించుచుండెను. అట్లు పదివేలసంవత్సరములు గడుచునప్పటికి పదియవ తలను కత్తరింప బూనుచుండగా అప్పటికి ధర్మాత్ముడగు ప్రజాపతి ప్రత్యక్షమాయెను. అపుడు ప్రజాపతి బ్రహ్మదేవుడు వరము కోరు మనగా రావణుడు, "దేవ, రాక్షస, నాగ, యక్ష, గరుడాదుల వల్లను, నీవల్ల, శివ, విష్ణువువల్లను నాకు మరణము లేకుండునట్లు అనుగ్రహింపుము. నాకు మనుష్యులు గడ్డిపోచవంటి వారు," అని వరమునడిగెను. అట్లే అగునని బ్రహ్మ వాని పది తలలను మరల ఇచ్చెను. బ్రహ్మ విభీషణునికి సద్బుద్ధిని, చిరంజీవిత్వమును వరముగా ఇచ్చెను. దేవేంద్రపదవిని కోరదలచిన కుంభకర్ణుడు సరస్వతీ దేవిచే భ్రాంతిపొంది "ఆరునెలలు మంచి నిద్రపోవుటను, ఆరునెలల కొకసారి భుజించుటను," వరముగా కోరెను. బ్రహ్మదేవుడు అట్లేయని అనుగ్రహించెను. బ్రహ్మదేవుడు అంతర్ధానము కాగా రావణ, విభీషణ, కుంభకర్ణులు తమ యిండ్లకు వచ్చిరి.

**పాతాళాన్నిర్భయః ప్రాయాత్ప్రహస్తాద్యైర్భువం సుఖమ్ ।**
**మంత్రివాక్యాద్దశాస్యోఽపి నిష్కాస్య ధనదం బలాత్ ॥ 57**

**లంకాపుర్యాం రాక్షసైస్తు లంకారాజ్యం చకార సః ।**
**ధనదః పితరం పృష్ట్వా త్యక్త్వా లంకాం మహాయశాః ॥ 58**

**గత్వా కైలాసశిఖరం తపసాఽతోషయచ్ఛివమ్ ।**
**తేన సఖ్యమనుప్రాప్య తేనైవ పరినందితః ॥ 59**

**అలకాం నగరీం తత్ర నిర్మమే విశ్వకర్మణా ।**
**దిక్పాలత్వమనుప్రాప్య శివస్య వరదానతః ॥ 60**

**రావణో విద్యుజ్జిహ్వాయ దదౌ శూర్పణఖాం తదా ।**
**పారిబర్హం దదౌ తస్మై దండకారణ్యముత్తమమ్ ॥ 61**

**మాతృష్వసుః సుతాన్ బంధూ స్త్రిశిరః ఖరదూషణాన్ ।**
**సాహాయ్యార్థం దదౌ తస్మై తత్కాంతే తు మృతేఽచిరాత్ ॥ 62**

**కుంభీనసీం దదౌ హర్షాన్మధుదైత్యాయ రావణః ।**
**దదౌ మధువనం తస్మై పారిబర్హమనుత్తమమ్ ॥ 63**

**ఖడ్గజిహ్వాయ తాం క్రౌంచీం దదౌ ప్రేమ్ణా దశాననః ।**
**పరలంకాం పారిబర్హం దదౌ తస్యై మనోరమమ్ ॥ 64**

వైరోచనస్య దౌహిత్రీం వృత్రజ్వలేతి విశ్రుతామ్ ।
స్వయందత్తాం ముదోవాహ కుంభకర్ణాయ రావణః ॥ 65

గంధర్వరాజస్య సుతాం శైలూషస్య మహాత్మనః ।
విభీషణస్య భార్యార్థే సరమాం స ముదాఽవహత్ ॥ 66

తతో మందోదరీ పుత్రం మేఘనాదమజీజనత్ ।
జాతమాత్రస్తు యో నాదం మేఘవత్ప్రచకార హ ॥ 67

తతః సర్వే బ్రువన్ మేఘనాదోఽయమితి వై జనాః ।
గుహాయాం కుంభకర్ణోఽపి నిద్రావ్యాప్తో వినిద్రితః ॥ 68

పాతాళ లోకములో ఉంటున్న 'సుమాలి' తన మనుమలు తపస్సుతో బ్రహ్మదేవుని నుండి వరములు పొందినారని తెలిసి సంతోషించి, నిర్భయముగా ప్రహస్తాదులతో భూమిపైకి వచ్చెను. రావణాసురుడును తన మంత్రులమాటమీద బలాత్కారముగా కుబేరుని నిర్బంధించి, అతనిని లంకనుండి తరిమివేసి, లంకారాజ్యమును అనుభవింప సాగెను. మహా కీర్తిమంతుడగు వైశ్రవణుడు తన తండ్రినడిగి ఆయన ఆజ్ఞతో కైలాస శిఖరమునకుపోయి పరమేశ్వరుని సంతోషపరచెను. సాంబశంకరునితో స్నేహ సుఖమును పొందెను. అచ్చటనే 'అలక' అను పట్టణమొకదానిని విశ్వకర్మచే నిర్మింపజేసి, శివ వరానుగ్రహముతో దిక్పాలకత్వమును పొంది ఆనందించుచుండెను. రావణుడు తన చెల్లెలగు శూర్పణఖను విద్యుజ్జిహ్వునికి ఇచ్చి వివాహము జరిపి, దండకారణ్యమును కట్నముగా ఇచ్చెను. శూర్పణఖ భర్త కొంతకాలమునకు చావగా, పినతల్లి కొడుకులును తన తమ్ములునగు ఖర, దూషణ, త్రిశిరులను ఆమెకు సహాయముగా ఇచ్చెను. రావణుడు తనకు మరో చెల్లెలగు 'కుంభీనసి'ని 'మధు' అను రాక్షసునికి ఇచ్చి వివాహము జరిపి, ఆమెకు మధువనమును కానుకగా ఇచ్చెను. మూడవ చెల్లెలగు 'క్రౌంచి' యనుదానిని 'ఖడ్గజిహ్వు'నికి ఇచ్చి వివాహము జరిపి, మనోహరమగు పరలంకను దానికి కట్నముగా ఇచ్చెను.

రావణుడు; తన తమ్ముడగు కుంభకర్ణునికి, వైరోచనుని యొక్క మనుమరాలగు 'వృతజ్వాల'యను సుప్రసిద్ధురాలితో వివాహము జరిపించెను. విభీషణుడు శైలూషుడను గంధర్వ రాజుయొక్క పుత్రికయగు 'సరమ' అను ఆమెను పత్నిగా అంగీకరించెను. అంత ఆ మందోదరి మేఘనాదుడను పుత్రునిగనెను. పుట్టినపుడే మేఘమువలె గర్జించుట చేత వానిని అందరు 'మేఘనాదు' డని పిలిచిరి. కుంభకర్ణుడు గుహలో నిద్రాముద్రితుడై ఉండెను (68)

తతః స రావణశ్చాపి దేవగంధర్వకిన్నరాన్ ।
హత్వా ఋషీశ్వరాన్నాగాన్ స్త్రియస్తేషామపాహరత్ ॥ 69

ధనదోఽపి చ తచ్ఛ్రుత్వా రావణ్యస్యాక్రమం తదా ।
అధర్మం మా కురుష్వేతి దూతవాక్యైర్న్యవారయత్ ॥ 70

తతః క్రుద్ధో దశగ్రీవో జగామ ధనదాలయమ్ ।
వినిర్జిత్య ధనాధ్యక్షం జహార తస్య పుష్పకమ్ ॥ 71

అలకాయాం యదాఽఽసీత్స సేనయా రావణస్తదా ।
నిశాయామేకదా భ్రాతుః కుబేరస్య సుతేన హి ॥ 72

ప్రార్థితా సా పురా రంభా చకార నియతం దినమ్ ।
అజ్ఞాతవృత్తా వేగేన యయౌ ఖాన్నూపురస్వనా ॥ 73

రావణోఽపి చ తాం దృష్ట్వా బలాదేవ ప్రభుక్తవాన్ ।
చిరాన్ముక్తాఽథ వృత్తం సా కౌబేరం సంన్యవేదయత్ ॥ 74

క్రుద్ధః సోఽపి దదౌ శాపం రావణాయ మహాత్మనే ।
అద్యారభ్య దశాస్యశ్చేద్విరక్తాం స్త్రీయముత్తమామ్ ॥ 75

హఠాద్భోక్ష్యతి చేత్తర్హి క్షణమాత్రాన్మరిష్యతి ।
ఇతి శాపం రావణోఽపి శుశ్రావ చరవాక్యతః ॥ 76

తదారభ్య స్త్రియైః కామమనిచ్ఛంతీం న ధర్షయన్ ।
తతో యమం చ వరుణం నిర్జిత్య సమరేఽసురః ॥ 77

స్వర్గలోకమగాత్తూర్ణం దేవరాజజిఘాంసయా ।
తతో రావణమభ్యేత్య బబంధ త్రిదశేశ్వరః ॥ 78

తచ్ఛ్రుత్వా సహసాఽఽగత్య మేఘనాదః ప్రతాపవాన్ ।
కృత్వా యుద్ధం మహాఘోరం జిత్వా త్రిదశపుంగవమ్ ॥ 79

ఇంద్రం ధృత్వా దృఢం బద్ధ్వా మేఘనాదో మహాబలః ।
మోచయిత్వా స్వపితరం గృహీత్వేంద్రం యయౌ పురీమ్ ॥ 80

## రావణ దిగ్విజయ వర్ణన

పిదప రావణుడు– దేవతలను, గంధర్వులను, కిన్నరులను, ఋషులను, నాగులను చంపి వారివారి పత్నులను అపహరించుచు వచ్చెను. కుబేరుడు వీని అన్యాయమును విని అధర్మము చేయవలదని దూతలచే చెప్పిపంపెను. దానికి కోపగించిన రావణుడు కుబేరుని నగరమైన 'అలకాపురము' వెళ్ళి, కుబేరుని బంధించి అతని పుష్పకవిమానమును పట్టుకువచ్చెను. రావణుడు తన సేనలతో అలకాపురిలో ఉండునపుడు ఒకనాడురాత్రి తన అన్నయగు కుబేరునిపుత్రుడు 'నలకూబరు' నిచే ప్రార్థింపబడియున్న రంభ అను అప్సరస్త్రీ ఈ యుద్ధవార్త తెలియనిదియై వేగముగా గగనమునుండి నలకూబరునికోసం వచ్చెను. రావణుడు దాని నూపురనాదమును విని చూచి, ఆ రంభను బలాత్కారముగా పట్టి అనుభవించెను. రావణునికి బహుకాలమునకు విడువబడిన రంభ వచ్చి జరిగిన సంగతిని నలకూబరునికి విన్నవించెను. అది విని క్రుద్ధుడై నలకూబరుడు మహాత్ముడగు రావణునికి, "ఇది మొదలు రావణుడు అనురాగిణికాకయుండెడు స్త్రీని బలాత్కారముగా అనుభవించిన క్షణముననే చచ్చును గాక," అని శాపమునిచ్చెను. చారుల వలన రావణుడును ఈ సంగతిని వినెను. అది మొదలు రావణుడు కామమోహితురాలు కాని కాంతను చేరుటలేదు. అంత ఆ రావణుడు యమధర్మ రాజును, వరుణదేవుని యుద్ధమున జయించి, త్వరగా స్వర్గమున ఇంద్రుని జయింపదలచి స్వర్గమునకు వెళ్ళెను. అపుడు ఇంద్రుడు వచ్చి రావణుని బంధించి చెరవేసెను. అదివిని మహాపరాక్రమ వంతుడైన మేఘనాదుడు చాలా వేగముగావచ్చి, ఘోర యుద్ధముచేసి దేవేంద్రుని జయించి, బలముగా బంధించి తనతండ్రిని విడిపించి, ఇంద్రునితో సహ లంకానగరమునకు వచ్చెను.

**బ్రహ్మా తం మోచయామాస దేవేంద్రం మేఘనాదతః ।**
**దత్వా వరాన్ రాక్షసాయ బ్రహ్మా స్వభవనం యయౌ ॥ 81**

**ఇంద్రజిన్నామ తస్యాభూత్తదారభ్య రఘూత్తమ ।**
**రావణాదివ యశ్చాసీద్బలిష్ఠః సమరప్రియః ॥ 82**

**మేఘనాదాదాయశ్చేతి తస్మాత్ప్రోక్తం తవాగ్రతః ।**
**ఏతైర్మునీశ్వరైః పూర్వం తన్నిమిత్తం మయేరితమ్ ॥ 83**

**రావణో విజయీ లోకాన్సర్వాన్ జిత్వా క్రమేణ తు ।**
**జిత్వా వహ్నిం నిర్ఋతిం చ వాయుమీశం యయౌ ముదా ॥ 84**

**కైలాసం తోలయామాస బాహుభిః పరిఘోపమైః ।**
**తదా భీతా స్వయం దేవీ దోర్భ్యాం సా పరిషస్వజే ॥ 85**

శివోఽపి వామపాదాంగుష్ఠేన కైలాసమూర్ధని ॥
భారం దత్వా గిరిం ఖర్వం చకారాథ శనైః శనైః ॥ 86

తదా తద్గిరిసంభూతవల్లిసంధిషు దోర్లతాః ।
వింశచ్చాపి రావణస్య తా ఆసన్ మర్దితాః క్షణాత్ ॥ 87

స తేనాక్రందయామాస స్తంభసంబద్ధచోరవత్ ।
తదా నందీశ్వరేణాపి శప్తోఽయం రావణేశ్వరః ॥ 88

చంచలం కర్మ యస్మాత్తే కపితుల్యమతోఽసుర ।
వానరైర్మానుషైశ్చైవ నాశం గచ్ఛసి కోపితైః ॥ 89

తతః కాలాంతరేణాయం శంభునైవ విమోచితః ।
శప్తోఽప్యగణయన్వాక్యం యయౌ హైహయపత్తనమ్ ॥ 90

బహిర్గతం నృపం శ్రుత్వా సహస్రార్జుననామకమ్ ।
మధ్యాహ్నే రావణశ్చక్రే రేవాయాం శివపూజనమ్ ॥ 91

అధస్తస్మాన్నర్మదాయ భుజపాశైశ్చ సేతువత్ ।
స్తంభయామాస నీరౌఘం జలక్రీడాం గతోఽర్జునః ॥ 92

వేష్టితోఽయుతనారీభిస్తత్తోయం రావణం తదా ।
ప్లావయామాస ధ్యానస్థం జ్ఞాతస్తత్కర్మణాఽర్జునః ॥ 93

అప్పుడు లంకానగరానికి బ్రహ్మదేవుడువచ్చి మేఘనాదునికి కోరిన వరములనిచ్చి యింద్రుని విడిపించి బ్రహ్మలోకమునకు వెళ్ళెను. అది మొదలు మేఘనాదునికి 'ఇంద్రజిత్తు' అను పేరు ప్రసిద్ధ మాయెను. శ్రీరామా! రావణునికన్నను మేఘనాదుడు బలిష్ఠుడగుటచేత మేఘనాదుడే మొదటగా జయింపబడవలెనని మునులును, నేను మిమ్ము కోరితిమి.

## రావణుడు కైలాసశిఖరముక్రింద నలుగుట

విజయియగు రావణుడిట్లు క్రమంగా సర్వలోకములను జయించి; అగ్ని, నిరురుతి, వాయువులను జయించి, ఈశానజయమునకై కైలాసమును తన భుజములతో పెకలింపబూనెను. కైలాసము కదలడము జూచి, "పార్వతీదేవి వేగముగా వచ్చి పరమేశ్వరుని హత్తుకొనెను. అప్పుడా పరమేశ్వరుడు తన యెడమకాలి బొటన వ్రేలుచే కైలాస శిఖరమును నొక్కెను. దానితో కైలాసపర్వతము క్రింద

చేతులు ఇరుక్కుపోయి రావణుడు స్తంభమునకు బిగదీసికట్టబడిన దొంగవలె మొరబెట్టసాగెను. అప్పుడు నందీశ్వరుడు రావణునికి, "మిక్కిలి చంచలమగు ఇట్టి కోతిచేష్టను నీవు చేసినందుకు గాను నర వానరులచే నాశనము చెందుదువుగాక," అని శాపమునిచ్చెను. అటుమీద చిరకాలమునకు శివుడే కరుణించి విడిచిపెట్టెను. పైన చెప్పినట్లు శపింపబడినను లక్ష్య పెట్టక ఒకసారి హైహయపట్టణమునకు వచ్చెను. కార్తవీర్యార్జునుడు నగరము బయట ఉన్నట్లు వినిన రావణుడు మధ్యాహ్న సమయమున నర్మదా నదీతీరమున శివపూజ జేయుచుండెను. క్రిందిప్రక్కలో కార్తవీర్యార్జునుడు నర్మదానదిని తన వేయి చేతులతో సేతువువలె స్తంభింపజేసి భార్యలతో జలక్రీడన చేయుచుండెను. ధ్యాననిష్ఠుడగు రావణుడు ఆనీళ్లలో తేలిపోయెను. ఆ రావణుడు ధ్యానాదికమును వదలి కార్తవీర్యార్జునునితో యుద్ధము చేసెను.

**ముక్త్వా ధ్యానాదికం సర్వం యుద్ధం చక్రేర్జుఽనేనసః ।**
**తేన బద్ధో దశగ్రీవః కంఠే రంతుం సుతాయ తమ్ ॥ 94**

**దదౌ దశాననం ప్రీత్యా కాష్ఠనిర్మితహస్తివత్ ।**
**కియత్కాలాంతరేణైవ పులస్త్యేన స మోచితః ॥ 95**

**తతోఽతిబలమాసాద్య జిఘాంసుర్వారిపుంగవమ్ ।**
**సాగరే ధ్యానమాసీనం పశ్చాద్భాగే శనైర్యయౌ ॥ 96**

**ధృతస్తేనైవ కక్షేణ వాలినా దశకంధరః ।**
**భ్రామయిత్వా తు చతురః సముద్రాన్ రావణం హరిః ॥ 97**

**కిష్కింధాం స్వాం యయౌ వేగాదగ్రే దృష్ట్వాంగదం శిశుమ్ ।**
**ప్రీత్యా తం చుంబనం దాతుం దోర్భ్యాం కట్యాం న్యవేశయత్ ॥ 98**

**తదా బాహోశ్చంచలత్వాత్కక్షాత్స పతితో భువి ।**
**తం దృష్ట్వా స్వజనాన్ స్త్రీశ్చ దర్శయామాస వై ముదా ॥ 99**

**పేంఖస్యోపరి పుత్రస్య బబంధాధోముఖం చిరమ్ ।**
**ఆసీత్సోఽంగదమూత్రస్య ధారాధౌతాననోఽసురః ॥ 100**

**స్వయమేవ తతో వాలీ బహుకాలే గతే సతి ।**
**దదావాజ్ఞాం దశాస్యాయ తేన సఖ్యం చకార సః ॥ 101**

**రావణః స పునః స్థిత్వా పుష్పకే వ్యచరత్సుఖమ్ ।**
**పశ్యన్నానావిధాన్వీరాన్ యయౌ పాతాలముత్తమమ్ ॥ 102**

**తత్ర దృష్ట్వా పురం రమ్యం బలేః కోటిరవిప్రభమ్ ।**
**తత్తేజో హతతేజస్తత్పుష్పకం న చచాల వై ॥ 103**

**తతః స్వయం యయౌ తూష్ణీమేక ఏవ దశాననః ।**
**పురం ప్రవిశ్య తద్ద్వారి త్వాం దదర్శ చ వామనమ్ ॥ 104**

**కోటిసూర్యప్రతీకాశం పీతకౌశేయవాససమ్ ।**
**చతుర్భుజం సపత్నీకం ద్వారరక్షణతత్పరమ్ ॥ 105**

అప్పుడు హైహయుడు రావణుని గొంతును బిగదీసికట్టి, కొయ్యతో చేసిన ఏనుగును ఆడించినట్లు తనకొడుకునకు ఆటలాడుటకిచ్చెను. కొంతకాలమునకు పులస్త్యమునీంద్రునివలన రావణుడు విడుపింప బడెను. ఆ తరువాత రావణుడు ఊరకే ఉండక కపిరాజగు వాలిని జయించ గోరి, సముద్రమున ధ్యాననిష్ఠుడైయున్న వాలికి వెనుకప్రక్క మెల్లగాపోయి వానీ చంకలలో చేతులు దూర్చి వాలిని గట్టిగా పట్టుకోదలచెను. కానీ ఆ రావణుని చేతులను గట్టిగా తన చంకలలో బంధించిన వాలి రావణుని నెత్తికొని నాలుగుసముద్రములలోను పరిభ్రమించి వేగముగా కిష్కింధకువచ్చెను. తన ఇంటిలో తన కుమారుడగు అంగదుని జూచి, ఆనందముతో వానినిముద్దు బెట్టుకొనుటకై యెత్తికొనుటలో తన చంకలను సడలించెను. అప్పుడు రావణుడు చంకలనుండి ఊడిపడెను. అపుడు వాలి రావణుని పట్టుకుని, తనవారికిని, స్త్రీలకును చూపి, అంగదుని ఊయలపై తలక్రిందుగా కట్టిపెట్టెను. అట్లు రావణుడు కిష్కింధలో చాలా కాలముండగా, అంగదుని మూత్రధారలచే ముఖము తడుపబడు చుండెను. వాలి తానుగా చాలా కాలము గడిచెనని దయతలచి రావణుని విడిచిపెట్టెను. రావణుడు అది మొదలు వాలితో స్నేహముగా మెలగెను. ఆ తరువాతను రావణుడు పుష్పకవిమానము ఎక్కి తన ఇష్టము వచ్చినట్లు తిరుగుతూ, అనేకమంది వీరులను వెంటబెట్టుకుని పాతాళలోకమునకు పోయెను. పాతాళమున కోటిమంది సూర్యుల కాంతితో ప్రకాశించే బలి చక్రవర్తిని చూచెను. ఆ బలి చక్రవర్తి తేజస్సుకు పుష్పకవిమానము ముందుకు కదలలేదు.

**త్వాం ప్రాహ స దశగ్రీవః కోఽత్ర రాజాఽస్తి మాం వద ।**
**తూష్ణీం స్థితో వామనస్త్వమర్పితం నోత్తరం రిపోః ॥ 106**

**తదా త్వాం బధిరం మత్వా స వివేశ బలేర్గృహమ్ ।**
**తత్ర దృష్ట్వా బలిం పత్న్యా సారిక్రీడనతత్పరమ్ ॥ 107**

తస్థౌ తత్ర క్షణం తూష్ణీం బలేర్లక్ష్మీం వ్యలోకయత్ ।
తావద్ద్వారే బలేర్వస్త్రాత్క్రీడాపాశో ऽ పతత్‌భువి ॥ 108

తమానేతుం రావణాయ బలీరాజ్ఞాపయత్తదా ।
రావణో ऽ పి తమానేతుం యయౌ పాశాంతికం జవాత్ ॥ 109

ప్రోచ్చచాల భువః పాశం కరేణ వచచాల సః ।
వింశద్దోర్భిః క్రమేణాసౌ యావత్పాశం ప్రచాలయత్ ॥ 110

తావదంగులయః సర్వాః పాశభారేణ పీడితాః ।
న నిష్క్రముః పాసతలాచ్చూర్ణితా రుధిరాప్లుతాః ॥ 111

తదా చుక్రోశ దీర్ఘం స చిరకాలం దశాననః ।
తతో విహస్య దాస్యా తం పాశమానీయ వై బలిః ॥ 112

ధిక్‌ధిక్ కృత్వా రావణం తం గృహాన్నిష్కాసయద్బహిః ।
తతో ధృత్వా రాజదూతైస్తదుచ్ఛిష్టైస్తు పోషితః ॥ 113

అశ్వానాం శకృతం నీత్వా ప్రాక్షిపత్ప్రత్యహం బహిః ।
ఏకదా ద్వాపరే గత్వా ప్రార్థయామాస త్వాం ముహుః ॥ 114

త్వయా స్వపాదలగ్నః స్వపాదాంగుష్ఠేన ఖే ऽ ర్పితః ।
తదా ऽ తిముదితో లంకాం చిరకాలేన రావణః ॥ 115

యయౌ మేనే నిజం జన్మ ద్వితీయం జాతమద్య వై ।
రావణః పరమప్రీత ఏవం లోకాన్మహాబలః ॥ 116

కర్తుం తాన్‌స్వవశాన్నిత్యం బభ్రామ పుష్పకస్థితః ।
దృష్ట్వైకదా ऽ త్ర సాకేతే పూర్వజం తవ దీక్షితమ్ ॥ 117

అనరణ్యం సంగరేణ చకార పతితం రణే ।
తదా శప్తో ऽ నరణ్యేన మద్వంశే రఘునందనః ॥ 118

పిమ్మట రావణుడు తానొక్కడే భవనములోనికి ప్రవేశించెను. శ్రీరామా! వామనుడవగు నిన్ను బలిచక్రవర్తి మందిరద్వారమున చూచెను. కోటిసూర్య ప్రకాశుడును, పీతాంబరధరుడును,

చతుర్భుజుడును, లక్ష్మీసమేతుడును, ద్వారపాలన దక్షుడునగు నీతో, రావణుడు, "ఇచ్చట యేరాజుగలడు? నాకుజెప్పుము." అని అడిగెను. వామనుడగు నీవు శత్రువగు రావణునికి యే సమాధానమును ఇవ్వలేదు. అప్పుడతడు నిన్ను చెవిటివానిగానెంచి బలిమందిరములోనికి ప్రవేశించెను. అచ్చట తనపత్నితో పాచికలాట ఆడుతున్న బలీంద్రుని జూచెను. అచ్చట కొంతసేపు ఊరకేయుండి బలీంద్రుని సంపదను గమనించుచుండెను. అంతలో బలిచక్రవర్తియొక్క పాచిక ఒకటి దూరమునకు దొరలిపోయెను. అది అందుకో దలచిన బలి, సమీపమున నిలచియున్న రావణుని జూచి, "నీవు ఆ పాచికను తీసికొనిరమ్ము," అని ఆజ్ఞాపించెను. రావణుడు ఆ పాచికను తెచ్చుటకు దానివద్దకుపోయెను. దానిని కదలించెను. అది నేలనుండి కదలదయ్యె. రావణుడు ఇరువదిచేతులతోను గట్టిగా పట్టుకుని ఎంత కదిలించినను ఆ పాచిక కదలలేదు. ఆ పాచిక భారమునకు రావణుడు నెత్తురు గ్రక్కుచు పెద్దగా యేడ్చెను. అపుడు ఆ బలిచక్రవర్తి నవ్వి, అక్కడ పనిచేసెడు పని మనిషితో ఆ పాచికను తెప్పించి ఛీఛీయని ధిక్కరించుచు, రావణుని నింటిలోనుండి బయటకు వెళ్లగొట్టెను. అంత ఆ రాజదూతల చేతజిక్కి, స్త్రీలు మిగిల్చినది తిని పొట్టపోసికొనుచుండెను. అప్పుడు గుఱ్ఱపుశాలలో పనిచేయుచు, గుఱ్ఱముల లద్దెలను ఊడ్చి దిబ్బలోవేయు పనిచేయుచుండెను. ఇట్లుండ ఒకసారి ద్వార పాలకుడవగు నీవద్దకువచ్చి పలుమార్లు ప్రార్థించెను. నీవప్పుడు కృపచే వానిని నీ పాదపు బొటనవ్రేలిచే పైకెగదన్నితివి. ఆ తన్నుకు రావణుడు లంకలో వచ్చి పడెను. అప్పుడు తనకిది రెండవజన్మ అనుకొనెనుగదా!

శ్రీరామచంద్రా! ఇట్టిమహాబలుడు రావణుడు పుష్పకవిమానముపై తిరుగుచూ, రాజులను తన వశము చేయదలచి నిత్యము సంచరించుచుండెను. ఇట్లుండగా ఒకప్పుడు అయోధ్యలో నీవంశమున 'అనరణ్య'డు అను మహారాజు యజ్ఞదీక్షలో ఉన్నపుడు, రావణుడువచ్చి యుద్ధముచేసి వానిని పడద్రోసెను. అప్పుడనరణ్యుడు "నావంశమున రఘునందను డవతరించి నిన్ను సకుటుంబముగా యుద్ధమున సంహరించును గాక," అని రావణుని శపించి స్వర్గమునకేగెను.

**భూత్వా త్వాం సంగరేణైవ సకుటుంబం వధిష్యతి ।**
**ఇత్యుక్త్వా స గతో నాకం రావణోఽపి పురీం యయా ॥ 119**

**సనత్కుమారమేకాంతే సన్నిరీక్ష్యైకదాఽసురః ।**
**నత్వా పప్రచ్ఛ దేవేషు కో వరశ్చేతి సాదరమ్ ॥ 120**

**మునిః ప్రాహ మహావిష్ణుం తచ్ఛ్రుత్వా ప్రాహ తం పునః ।**
**విష్ణునా యే హతా యుద్ధే రాక్షసాద్యా లభంతి కామ్ ॥ 121**

గతిం చేతి మునిః ప్రాహ తే ముక్తిం యాంతి దుర్లభామ్ ।
పునః పప్రచ్ఛ తం నత్వా కేనోపాయేన వై హరేః ॥ 122

భవిష్యత్యత్ర మే మృత్యుస్తదా తం మునిరబ్రవీత్ ।
త్రేతాయాం నరరూపేణ రామో విష్ణుర్భవిష్యతి ॥ 123

అయోధ్యాయాం తదా తేన కృత్వా వైరం సుదారుణమ్ ।
తస్మాద్వధం కురుష్వ త్వమాత్మనః పరమాత్మనః ॥ 124

తేన గచ్ఛసి ముక్తిం త్వం తచ్ఛ్రుత్వా స దశాననః ।
విరోధార్థం జనకజామాహరద్గౌతమీతటాత్ ॥ 125

అశోకే రక్షితా తేన మాతృవత్స్వపధేచ్ఛయా ।
ఏకదా నారదం దృష్ట్వా నత్వా పప్రచ్ఛ రావణః ॥ 126

భగవన్ బ్రూహి మే యోద్ధుం కుత్ర సన్తి మహాబలాః ।
యోద్ధుమిచ్ఛామి బలిభిస్త్వం జానాసి జగత్త్రయమ్ ॥ 127

మునిర్ధ్యాత్వా చిరాత్ప్రాహ శ్వేతద్వీపనివాసినః ।
మహాబలా మహాకాయాస్తత్ర యాహి మహామతే ॥ 128

విష్ణుపూజారతా యే వై విష్ణునా నిహతాశ్చ యే ।
త ఏవ తత్ర సంజాతా అజేయశ్చ సురాసురైః ॥ 129

తచ్ఛ్రుత్వా రావణో వేగాన్మంత్రిభిః పుష్పకేణ తైః ।
యోద్ధుకామో యయౌ గర్వాత్ శ్వేతద్వీపాంతికం ముదా ॥ 130

తత్ప్రభాహతతేజస్కం పుష్పకం నాచలత్పురః ।
త్యక్త్వా విమానం ప్రయయౌ స్వయమేవ దశాననః ॥ 131

రావణుడు ఏకాంతమున ఉన్న సనత్కుమారుని జూచి నమస్కరించి “స్వామీ! దేవతలలో ఎవరు శ్రేష్ఠుడు?” అని సాదరముగా అడిగెను. అందుకు మునీంద్రుడు, “శ్రీమహావిష్ణువు” అని పలికెను. మరల రావణుడు, “స్వామీ! రణమున విష్ణువుచే చంపబడిన రాక్షసులు ఏగతిని పొందుదురు?” అని అడిగెను. అందుకు సనత్కుమారుడు “దుర్లభమగు మోక్షమును పొందగల” రనగా, రావణుడు “నాకు మహావిష్ణువుచే మరణమెట్లుకలుగునో సెలవిమ్ము” అని నమస్కార పూర్వకముగా వేడెను.

దానికి మునీంద్రుడు "త్రేతాయుగమున శ్రీమహావిష్ణువు నరరూపముతో అయోధ్యలో శ్రీరాముడుగా అవతరించును. అప్పుడు వారితో బద్ధ వైరమును సంపాదించుకొని నీ యాత్మకు ఆ పరమాత్మవలన ముక్తినందగలవు." అని అనుగ్రహించిరి. అది వినిన రావణుడు నీతో వైరవృత్తిని అవలంబించుటకై గౌతమి తీరమున జానకీదేవిని అపహరించి, ఆమెను తల్లివలెనే అశోక వనమున రక్షించుచుండెను. మరియొకప్పుడు రావణుడు నారదునిజూచి నమస్కరించి, "పూజ్యుడా! సెలవిమ్ము. నాతో యుద్ధమొనరించుటకు తగిన మహాబలులెచ్చటగలరు? బలిష్ఠులతోడ యుద్ధముచేయనెంచెదను. నీవు ముల్లోకములనెరిగిన మునీంద్రుడవు," అని ప్రార్థించెను. అందుకు నారదుడు కొంతసేపు ధ్యానించి మహాబుద్ధీ! "నీవు శ్వేతద్వీపమునకుపొమ్ము. ఎవరు విష్ణుపూజా పరాయణులో, ఎవరు విష్ణువుచే సంహరింపబడిన వారో అట్టివారే అచ్చుటమూర్తీభవించియుందురు. వారందరును మహాబలులు, మహాకాయులు. వారిని దేవ, రాక్షసులు జయింపచాలరు.'' అని చెప్పిపోయెను. దానిని విని రావణుడు మంత్రులతో పుష్పకవిమానమునెక్కి, గర్వించి వారితో యుద్ధముచేయనెంచి శ్వేతద్వీప సమీపమునకు వచ్చెను.

**ప్రవిశన్నేవ తద్ద్వీపం ధృతో హస్తేన యోషితా ।**
**గచ్ఛంత్యా కస్యచిద్దాస్యా పుష్పాణ్యానయితుం వనమ్ ॥ 132**

**తయా పృష్టః కుతః కోఽసి ప్రేషితః కేన వా వద ।**
**ఇత్యుక్త్వా లీలయా స్త్రీభిర్హసంతీభిర్ముహుర్ముహుః ॥ 133**

**ముఖేషు తాడితో హస్తైః భ్రామితోఽధోముఖం చిరమ్ ।**
**ధృత్వైకం తత్పదం తాభిః క్షిప్తః కందుకవన్ముహుః ॥ 134**

**పరస్పరం హి క్రీడద్భిః కయా త్యక్తస్తు లీలయా ।**
**పపాత పరలంకాయాం క్రౌంచాయాః శౌచకూపకే ॥ 135**

**కృఛ్రాద్ధస్తాద్వినిర్ముక్తస్తాం స్త్రీణాం దశాననః ।**
**ఆశ్చర్యమతులం లబ్ధ్వా చింతయామాస దుర్మతిః ॥ 136**

**విష్ణునా యే హతా యుద్ధే తేషామేతాదృశం బలమ్ ।**
**తర్హ్యత్ర నిహతస్తేన శ్వేతద్వీపం వ్రజామ్యహమ్ ॥ 137**

**మయి విష్ణుర్యథా కుప్యేత్తథా కార్యం కరోమ్యహమ్ ।**
**ఇతి నిశ్చిత్య వైదేహీం జహార రావణో వనాత్ ॥ 138**

జానన్నేవం మహాలక్ష్మీం స జహారావనీసుతామ్ ।
మాతృవత్పాలయామాస త్వత్తః కాంక్షన్ వధం నిజమ్ ॥ 139

శ్రీరామచంద్ర ఉవాచ
వాలిసుగ్రీవయోర్జన్మ శ్రోతుమిచ్ఛామి త్వన్ముఖాత్ ।
రవీంద్రౌ వానరాకారౌ జజ్ఞాత ఇతి తచ్ఛ్రుతమ్ ॥ 140

అగస్త్య ఉవాచ
మేరౌ స్వర్ణమయే పూర్వం సభాయాం బ్రహ్మణః కదా ।
నేత్రాభ్యాం పతితం దివ్యమానందాశ్రుజలం తదా ॥ 141

తద్గృహీత్వా కరే బ్రహ్మా ధ్యాత్వా కించిత్తదత్యజత్ ।
భూమౌ పతితమాత్రేణ తస్మాజ్జాతో మహాకపిః ॥ 142

తమాహ ద్రుహిణో వత్స త్వమత్ర వస సర్వదా ।
ఏవం బహుతిథే కాలే గతేఽక్షవిరజః సుధీః ॥ 143

శ్వేతద్వీపపు కాంతులచే విచలితమైన పుష్పకవిమానము చలించకపోగా రావణుడు ఆ విమానమును వదిలి తానే శ్వేతద్వీపమును ప్రవేశించెను. ఇట్లు రావణుడు పోవుచుండగా అచ్చట పూలుగోయుటకు పోవుచున్న కాంత ఒకరు వీనిని జూచి చేతబట్టికొని "నిన్నెవడుపంపెను చెప్పుము? నీవెచ్చటనుండి వచ్చితివి? ఎవడవు?" అని ప్రశ్నించెను. ఆమె వెంటనున్న స్త్రీలును వినోదముగా రావణుని చెంపలు వాయించుచు, కాళ్లుబట్టి తలక్రిందులుగా ఊపసాగిరి. ఇట్లు ఆ స్త్రీలు వంతులు వేసికొని బంతులాడునట్లు రావణునియొక్క పాదములనుపట్టి విలాసముతో విసరివేయుచు ఆటలాడిరి. అప్పుడొక యువతి చేతి వేలితో నేలబడునట్లు వీనిని చిమ్మెను. రావణుడేట్లో కష్టతరముగా ఆ స్త్రీ పట్టునుండి ఊడి పరలంకలో నుండు క్రౌంచ యొక్క శౌచకూపమున కూలెను. అంత రావణుడు ఆహా! విష్ణువునకు కోపమువచ్చునట్లు చేసెదను. నేను శ్వేతద్వీపమున వెళ్ళెదను. విష్ణువుచే యుద్ధమున చంపబడినవారికి ఇట్టిబలము గల్గుచున్నదని అత్యంత ఆశ్చర్యముతో చింతించి, నిశ్చయించి, వనమున సీతను అపహరించెను. వాడు ఈమె మహాలక్ష్మియని తెలిసిన వాడైనప్పటికీ, సీతను అపహరించి, నీచే మృత్యువును కోరుతూ సీతను తల్లివలె కాపాడుచుండెను. (139)

## వాలి, సుగ్రీవుల యొక్క జన్మ వృత్తాంతము

అని చెప్పుచున్న అగస్త్యమునీంద్రునితో రామచంద్రుడు, "మహానుభావా! మీ ద్వారా వాలి

సుగ్రీవులయొక్క జన్మవృత్తాంతమును వినగోరుచున్నాను. కపివీరులగు వారు సూర్యుని వలన, ఇంద్రునివలన పుట్టినట్లు వినియున్నాను.” అని అడుగగా అగస్త్యముని చెప్పుచున్నాడు, “సువర్ణమయమగు మేరుపర్వతమునందలి బ్రహ్మసభలో ఒకప్పుడు సుఖాసీనుడగు బ్రహ్మ దేవుని కండ్లలో ఆనందాశ్రువులు ఉద్భవించెను. వాటిని బ్రహ్మ తనచేతబట్టి ధ్యానించి భూమిమీద కొంతజల్లెను. అంత ఆ చోట ‘ఋక్షుడు’ అను మహాకపి ఒకడు ఉద్భవించెను. బ్రహ్మ వానిని జూచి నీవిచ్చటనే నిరంతరము వసించుచుండుము అనెను. అట్లు బహుకాలము గతించిపోయినది.

**కదాచిత్పర్యటన్మేరౌ ఫలమూలార్థముద్యతః ।**
**అపశ్యద్దివ్యసలిలాం వాపీం మణిశిలాచితామ్ ॥ 144**

**పానీయం పాతుమగమత్తత్ర చ్ఛాయామయం కపిమ్ ।**
**దృష్ట్వా ప్రతికపిం మత్వా నిపపాత జలాంతరే ॥ 145**

**తత్రాదృష్ట్వా హరిం శీఘ్రం బహిరుత్ప్లుత్య సంయయౌ ।**
**అపశ్యత్సుందరీం నారీమాత్మానం విస్మయం గతః ॥ 146**

**తతో దదర్శ మఘవా సోఽత్యజద్వీర్యముత్తమమ్ ।**
**తామప్రాప్యైవ తద్వీర్యం వాలదేశేఽపతద్భువి ॥ 147**

**వాలీ సమభవత్తత్ర శక్రతుల్యపరాక్రమః ।**
**భానురప్యాగమత్తత్ర తదానీమేవ భామినీమ్ ॥ 148**

**దృష్ట్వా కామవశో భూత్వా గ్రీవాదేశేఽసృజన్మహత్ ।**
**బీజం తస్యాస్తతః సద్యో సుగ్రీవో బలవానభూత్ ॥ 149**

**పుత్రద్వయం సమాదాయ గత్వా సా నిద్రితా క్వచిత్ ।**
**ప్రభాతేఽపశ్యదాత్మానం పూర్వవద్వానరాకృతిమ్ ॥ 150**

**తద్వృత్తం తు విధిః శ్రుత్వా కిష్కింధారాజ్యముత్తమమ్ ।**
**దదౌ స వానరేంద్రాయ పుత్రాభ్యాం తత్ర సంస్థితః ॥ 151**

**మృతేఽర్క్ష విరజస్యాభూద్వాలీ పుర్యాం కపీశ్వరః ।**
**ఏవం తే కథితం రామ యథా పృష్టం త్వయా మమ ॥ 152**

శ్రీరామచంద్ర ఉవాచ
యదాఽసౌ వాలినా బంధుః కిష్కింధాయా బహిష్కృతః ।
తదా తస్యైవ సచివః శ్రీమాన్పవననందనః ॥ 153

న వేద కిం బలం నైజం వాలితుల్యపరాక్రమః ।
ఇతి రామవచః శ్రుత్వా పునస్తం మునిరబ్రవీత్ ॥ 154

అగస్తిరువాచ
కేసరీనామ విఖ్యాతః కపిరంజనపర్వతే ।
తస్యాస్తాం చ శుభే పత్న్యౌ వానర్యావేకదా గిరౌ ॥ 155

ప్లవంగస్యాంజనీనామ్నీ స్థితా తావచ్చ ఖాత్తదా ।
పపాత పాయసమయః పిండో గృధ్రీముఖాద్భువి ॥ 156

ఆ విరజుడను ఋక్షుడు ఒకప్పుడు ఫలమూలాదులకై మేరువులో పరిభ్రమించుచుండెను. మణిశిలలచే నిర్మింపబడి అమృతము వంటి నీరు కలిగిన బావిని చూచెను. నీరు త్రావగోరి ఆ బావిలోనికి దిగెను. ఆ బావిలోని నీటిలో తన ప్రతిబింబాన్ని చూచి, ఆ నీడ ఇంకొక వానరుడని భ్రమించి నీళ్లలో దుమికెను. ఆ బావినీటిలో కపిని గాంచక బయటకువచ్చి తానొక సుందరాంగియగు వానరముగా ఉండుట చూచి విస్మయమునొందెను. ఆ ఆడ వానర రూపమును చూచిన ఇంద్రుడు మోహవశమున రేతస్ఖలనము చెందెను. అది ఆ స్త్రీ గర్భములో పడక, దాని తోక ప్రదేశమున నేలపైబడెను. అచ్చట యుద్భవించిన వాడు 'వాలి' అను పేరుతో ఇంద్ర సమాన పరాక్రముడై పెరిగెను. అప్పుడే ఆ భామనుచూచి భానుడు మోహించివచ్చి ఆమెయొక్క గ్రీవ(గొంతు)ప్రదేశమున వీర్యమును వదలేను. అపుడు అ గ్రీవ(గొంతు) ప్రదేశమున ఉద్భవించినవాడు సుగ్రీవుడనబడి బలిష్టుడై ఎదిగెను. ఆ సుందరి ఆ వాలి, సుగ్రీవులను ఎత్తుకొనిపోయి పెంచెను. ఒకరోజు ఉదయము తాను నిద్రనుండి లేచే సరికి తాను మునుపెట్లో అట్లే మగ వానరాకారము దాల్చినట్లు గ్రహించెను. ఆ వృత్తాంతమును తెలుసుకున్న బ్రహ్మ వచ్చి కిష్కింధారాజ్యమును ఆ కపీంద్రునికిచ్చి అచ్చట ఆ ఇరువురు పుత్రులతో విరజుని స్థాపించి పోయెను. ఆ ఋక్షుడు మృతినందగా విరజుని పురమున వాలి కపిరాజై యుండెను." అని అగస్త్యుడు శ్రీరామునితో "నీవడిగిన వాలి, సుగ్రీవ వృత్తాంతము చెప్పితి" ని అనెను.(152)

## హనుమంతుడు తనబలమును తానెరుగకపోవుట.

అపుడు శ్రీరాముడు మరలా అగస్త్యునితో "స్వామీ! వాలి తన తమ్ముడగు సుగ్రీవుని వెళ్లగొట్టినపుడు

వాలివంటి బలము కలిగిన హనుమంతుడు తన సహజబలము నెఱుగలేదా? అని అడుగగా అగస్త్యుడిట్లనెను, "అంజన పర్వతమున కేసరియను కపివీరుడు మిక్కిలి ప్రసిద్ధుడు. ఆ గిరిలో ఇరువురు వానరస్త్రీలు వానికి పత్నులుగలరు. అంజని యను పేరుగల పెండ్లాము ఒకప్పుడు విశ్రాంతిగా నుండు వేళలో గగనమునుండి గ్రద్దనోట వీడిన పాయస పిండ మొకటి నేలపైబడెను.

**యదా నీతస్తు కైకేయ్యా కరాద్గృధ్యా శుభః పురా ।**
**తం పిండం భక్షయామాస వానరీ హ్యమృతోపమమ్ ॥ 157**

**ఏతస్మిన్నంతరే తత్ర మార్జారాస్యా సమాగతా ।**
**పతినా రహితే తే ద్వే క్రీడంత్యౌ వసనం తయోః ॥ 158**

**అహరత్పవనో వేగాద్దృష్ట్వా వాయుస్తదూరవః ।**
**అంజనీం ప్రార్థయామాస తథా భోగం చకార సః ॥ 159**

**తథైవ ప్రార్థయామాస మార్జారాస్యాం స నిర్ఋతిః ।**
**తయాఽకరోద్రతిం తత్ర సోఽపి పర్వతమూర్ధని ॥ 160**

**తయోస్తాభ్యాం సముత్పన్నౌ వానర్యా మారుతాత్మజః ।**
**మార్జార్యాః సమభూద్ఘోరః పిశాచోఘర్ఘరస్వనః ॥ 161**

**చైత్రే మాసి సితే పక్షే హరిదిన్యాం మఘాఽభిధే ।**
**నక్షత్రే స సముత్పన్నో హనుమాన్ రిపుసూదనః ॥ 162**

**మహాచైత్రీ పూర్ణిమాయాం సముత్పన్నోఽంజనీసుతః ।**
**వదంతి కల్పభేదేన బుధా ఇత్యపి కేచన ॥ 163**

**బాలభావేఽపి యః పూర్వం దృష్ట్వోద్యంతం విభావసుమ్ ।**
**మత్వా పక్వఫలం చేతి జిఘృక్షుర్లీలయోత్ప్లుతః ॥ 164**

**యోజనానాం పంచశతం వాయువేగేన మారుతిః ।**
**రాహుస్తస్మిన్దినే దర్శే యయౌ సూర్యం రఘూత్తమ ॥ 165**

**తావద్దృష్ట్వా ధర్తుకామం రవేరగ్రే కపిం స్థితమ్ ।**
**తదా రాహుర్భయాదేవ రవిం ముక్త్వేంద్రమాయయౌ ॥ 166**

**రాహుః ప్రాహ శచీనాథం తవ పీడాం కరోమ్యహమ్ ।**
**ఇతః పూర్వం త్వయా సూర్యః పీడాం కర్తుం సురేశ్వర ॥ 167**

**తత్ర విఘ్నం సముత్పన్నం తత్త్వం శీఘ్రం నివారయ ।**
**తద్రాహువచనాదింద్రః స మారుహ్య గజోపరి ॥ 168**

**దేవైర్యుతో యయౌ వేగాద్దదర్శ ప్లవగం పురః ।**
**తదా ముమోచ తం వజ్రం మఘవా మారుతిం ప్రతి ॥ 169**

కైకేయిచేతిలోని పాయస పిండమును గ్రద్దతన్నుకొనివచ్చెను. ఆ గ్రద్ధ తన్నుకుని వచ్చిన అమృతతుల్యమగు దానిని అంజనాదేవి భక్షించెను. అప్పటికి 'మార్జారాస్య'యను మఱియొక స్త్రీ యును వచ్చెను. పతివిరహితలగు వారిరువురు విహరించుచుండగా గాలివీచుటలో వారివస్త్రములు ఎగిరినవి. వాయువు దూరమునుండి యంజనను చూచి ప్రార్థించి, భోగించెను. అట్లే ఆ మార్జరాస్య ను నిర్బుతి మోహించి క్రీడించెను. అంజనాగర్భమున మారుతాత్మజుడు అవతరించెను. మార్జారాస్యకు మహాపిశాచము పుట్టెను. శత్రు సంహారకుడగు ఆంజనేయుడు చైత్రమాస శుక్ల ఏకాదశీ మఖా నక్షత్రమున పుట్టినట్లును, చైత్రమాస పూర్ణిమ నాడు పుట్టినట్లును కల్పభేదమున పండితులు చెప్పెదరు. హనుమంతుడు బాల్యచేష్టవలన ఉదయించుచుండు సూర్యబింబమునుచూచి, పండిన పండనియెంచి పట్టదలచి, గంతుకు 500 యోజనములవంతున వినోదముగా పైకెగిసెను. ఆ రోజు అమావాస్య యగుటచే రాహువు సూర్యుని పట్టుటకు వెళ్ళెను. రాహువు పోయి సూర్యునివద్దనున్న కపి వీరునిజూచి భయపడి, సూర్యుని వదలి యింద్రునివద్దకు వచ్చి, "దేవేంద్రుడా! నిన్ను పీడించెదను. ఇంతకుమునుపు నేను సూర్యుని పీడించునట్లు నీవే నియమము యేర్పరచితివి. అందుకు విఘ్నముగల్గినది. దానిని మొదట నివారింపుము." అని అదిలించెను. ఆ మాటవినిన వెంటనే యింద్రుడు ఐరావతమునెక్కి దేవతలతో వచ్చి, హనుమంతుని చూచి తన వజ్రాయుధముచే ఆంజనేయుని బలముగా కొట్టెను.

**వజ్రఘాతాన్మారుతిః ఖాత్ పపాత గిరికందరే ।**
**తదా భగ్నా హనూస్తస్య హనుమానితి వై యతః ॥ 170**

**ఖ్యాతిం గతోఽయం సర్వత్ర తదా వాయుశ్చుకోప హ ।**
**సాంత్వయిత్వా హనూమంతం స్వయం స్తబ్ధోఽభవత్తదా ॥ 171**

**వాయు స్తంభాజ్జనాః సర్వే నిపేతుర్ధరణీతలే ।**
**త్రైలోక్యం శవవజ్జాతం హాహాకారోఽభవద్దివి ॥ 172**

తదా ధిక్కృత్య దేవేంద్రం వేధా వాయుం యయౌ జవాత్ ।
ప్రార్థయామాస తం నత్వా పునర్వాయు వచోఽబ్రవీత్ ॥ 173

దేవేంద్రస్యాపరాధం త్వం క్షంతుమర్హసి కంపన ।
తవ పుత్రాయ దాస్యామి వరానద్య హనూమతే ॥ 174

తదా తుష్టోఽభవద్వాయుశ్చచాల పూర్వవత్పునః ।
అభూత్సంజీవితం సర్వం త్రైలోక్యం క్షణమాత్రతః ॥ 175

తదా దదౌ వరాన్ బ్రహ్మా మారుతిం పురతః స్థితమ్ ।
భవిష్యసి త్వమమరో వజ్రదేహో వరాన్మమ ॥ 176

తే కుంఠితా గతిర్మాఽస్తు కుత్రాప్యంజనిసంభవ ।
భవిష్యతి హరౌ భక్తిస్తవ నిత్యమనుత్తమా ॥ 177

త్వం విష్ణోరపి సాహాయ్యం కరిష్యసి వరాన్మమ ।
ఇత్యుక్త్వాఽన్తర్దధే వేధా రాహుః సూర్యం యయౌ పునః ॥ 178

శ్రీరామ ఉవాచ
దేవేంద్రేణ కథం దత్తో రవిస్తస్మై స రాహవే ।
తత్సర్వం విస్తరేణైవ కథయస్వ మమాగ్రతః ॥ 179

అగస్త్య ఉవాచ
సుధాపానాదయం రాహుర్దైత్యోఽభూదమరః స్వయమ్ ।
గ్రహోఽష్టమోఽభవత్సోఽపి యదాఽవాంఛదఘం సురాన్ ॥ 180

పీడాం కర్తుం తదా దేవాః సూర్యం సోమం దదస్తు వై ।
జ్ఞాత్వా ధర్మైర్జ్ఞనాః సర్వే నిజకర్మాది హేతవే ॥ 181

దేవేంద్రుని వజ్రాయుధపు దెబ్బకు ఆంజనేయుని గడ్డము తెగిపోవుటచేతనే 'హను' మంతుడు అనుపేరు స్థిరపడెను. అప్పుడు వాయుదేవుడు మిక్కిలి కోపము చెంది ఆంజనేయునికి సమాధానమును చెప్పి తాను స్తంభించి కూర్చుండెను. జనులందరును వాయుస్తంభనమున నిశ్చేష్టితులై నేలగూలిరి. ముల్లోకములు జడముగా మారి చలనము లేకపోయెను. స్వర్గమున హాహాకారముపుట్టెను. అపుడు బ్రహ్మదేవుడు ఇంద్రుని ధిక్కరించి, వాయుసన్నిధికివచ్చి అతనికి నమస్కరించి, "ప్రకంపనుడా! దేవేంద్రుని

అపరాధమును క్షమింపగలవు. నేను నీకొడుకునకు వరములనిచ్చెదను.” అని ప్రార్థించగా; అంత వాయువు ముందు వలె చలించెను. సర్వప్రపంచములును బ్రతికెను. అప్పుడు బ్రహ్మ తన ముందున్న హనుమంతునికి, “నీవు అమరునివిగా ఉందువు. నీ దేహము వజ్రదేహమగును. నీవు మహావిష్ణువునకు సహాయముగానుండుము. నీకు పరమోత్తమమగు హరిభక్తి యెడతెగక ఉండని.” అని యిట్లు అమోఘ వరములనిచ్చి తన లోకమునకు వెళ్ళెను. రాహువు మరల సూర్యుని పీడింప పోయెను. (178)

## సూర్య, చంద్ర గ్రహణ నైమిత్తిక విచారము.

అని చెప్పిన అగస్త్యమునితో శ్రీరాముడు “స్వామీ! దేవేంద్రుడు రాహువునకు సూర్యుని ఎట్లు ఇచ్చెను? ఆ సంగతిని విస్తరించి చెప్పవలయునని ప్రార్థింపగా, అగస్త్యముని చెప్పుచున్నాడు. తానుగా నీ రాహువు అమృతపానము చేత అమరత్వమును పొందెను. రాహువు ఎనిమిదవ గ్రహముగా ఏర్పడెను. రాహువు ఎప్పుడు దేవతలను బాధింపపూనునో అప్పుడు దేవతలకు ప్రతిగా చంద్ర సూర్యులను ఇచ్చునట్లు దేవేంద్రుడు నియమించుకొనెను.

**మోచయిష్యంతి రాహోశ్చ శశినం భాస్కరం ప్రతి ।**
**యదా యదా భవత్యత్రోపరాగో జగతీతలే ॥ 182**

**తదా తదా జనా ధర్మైర్నిజమత్యర్థమాదరాత్ ।**
**తోషయిత్వా సదా రాహు తౌ తస్మాన్మోచయంతి హి ॥ 183**

**ఏతత్సర్వం మయా ప్రోక్తముపరాగస్య కారణమ్ ।**
**జన్మ కర్మ వరాదానం మారుతేశ్చాపి విస్తరాత్ ॥ 184**

**అతస్తద్బలమాహాత్మ్యం కో వా శక్నోతి వర్ణితుమ్ ।**
**స ఏకదా మునీనాం హి చాశ్రమేషు కుశాదికాన్ ॥ 185**

**చకారేతస్తతః సర్వాన్ధర్షయన్మునిబాలకాన్ ।**
**తస్య తత్కర్మ మునిభిర్దృష్ట్వా శప్తోఽంజనీసుతః ॥ 186**

**అద్యారభ్య కపిశ్రేష్ఠ న జ్ఞాస్యసి స్వపౌరుషమ్ ।**
**యదాఽన్యస్య ముఖాత్స్వీయం బలం శ్రోష్యసి విస్తరాత్ ॥ 187**

**భవిష్యతి తదా పూర్వస్మృతిస్తే పౌరుషం పునః ।**
**అతః సుగ్రీవసాన్నిధ్యే విస్మృతః స్వపరాక్రమః ॥ 188**

**యదా స్తుతో జాంబవతా పురా ప్రాయోపవేశనే ।**
**తదా స్మృతిస్తస్య జాతా స్వబలస్య హనూమతః ॥ 189**

**ఏతత్తే సర్వమాఖ్యాతం త్వయా పృష్టం మయా తవ ।**
**యథా తథా సవిస్తారం కపిరావణచేష్టితమ్ ॥ 190**

ధార్మికులగు లోకులందరును తమకర్తకు మూలభూతులైన సూర్య, చంద్రులకు పీడా పరిహారకముగా ధర్మములను ఆచరించుచు రాహుప్రీతినొనర్చి ధన్యులగుచుందురు. శ్రీరామచంద్రా! ఇట్లు గ్రహణతత్వమును, ఆంజనేయుని జన్మ కర్మ వృత్తాంతమును చెప్పితిని. అట్టి హనుమంతుని బలమహిమను చెప్పుట నాతరమా? ఎవరును చెప్పజాలరు. ఆ హనుమంతుడు ఒకసారి ఋషి ఆశ్రమాలలో దర్భలను ఇటునటుమార్చుచు మునిబాలకులను భయపెట్టెను. ఈ చేష్టను చూచిన ఆ మునులు, "కపిశ్రేష్ఠుడా! ఇది మొదలు నీపరాక్రమమును నీవెరగక పోదువుగాక, ఇతరుడెప్పుడు నీ బల మహిమను విస్తరించి చెప్పగా వినుచుందువో అప్పుడు మునుపటి పరాక్రమము జ్ఞప్తికి వచ్చును గాక!" అని శాపమునిచ్చిరి. అందువలన సుగ్రీవ సన్నిధిలో తన పరాక్రమమును మరచియుండెను. వానరులు ప్రాయోపవేశము పొందదలచినపుడు జాంబవంతునిచే పొగడబడిన హనుమంతునికి తన నిజపరాక్రమము జ్ఞప్తికివచ్చెను. (189) రఘుపతీ! కపి, రావణచరితాది సర్వవృత్తాంతమును విన్నవించితిని," అనెను.

**రామ త్వం పరమేశ్వరోఽసి సకలం జనాసి విజ్ఞానదృక్**
**భూతం భవ్యమిదం త్రికాలకలనాసాక్షీ వికల్పోజ్ఝితః ।**
**భక్తానామనువర్తనాయ సకలం కుర్వన్ క్రియాసంహతిమ్**
**చా శృణ్వన్ నుజాకృతిర్మమ వచో భాసీశ లోకార్చితః ॥ 191**

**శ్రీ శివ ఉవాచ**
**స్తుత్వైవం రాఘవం తేన పూజితః కుంభసంభవః ।**
**స్వాశ్రమం మునిభిః సార్ధం ప్రయయౌ గుప్తవిగ్రహః ॥ 192**

**విన్ధ్యాచలం నిజం రూపం స మునిర్నైవ దర్శయత్ ।**
**పునరుత్థాస్యతి గిరిశ్చేతి మత్వా తు తద్భయాత్ ॥ 193**

**రామస్తు సీతయా సార్ధం భ్రాతృభిః సహమంత్రిభిః ।**
**సంసారీవ రమానాథో రమమాణోఽవసద్గృహే ॥ 194**

అనాసక్తోఽపి విషయాన్ బుభుజే ప్రియయా సహ ।
హనుమత్ప్రముఖైః సద్భిర్వానరైః పరిసేవితః ॥ 195

రాఘవే శాసతి భువం లోకనాథే రమాపతౌ ।
వసుధా సస్యసంపన్నా ఫలవంతశ్చ భూరుహాః ॥ 196

జనాః స్వధర్మనిరతాః పతిభక్తిపరాః స్త్రియః ।
నాపశ్యత్పుత్రమరణం కశ్చిద్రాజని రాఘవే ॥ 197

సమారుహ్య విమానాగ్ర్యం రాఘవః సీతయా సహ ।
వానరైర్ భ్రాతృభిః సార్ధం సంచచారావనిం ప్రభుః ॥ 198

అమానుషాణి కర్మాణి చకార బహుశో భువి ।
లోకానాముపదేశార్థం పరమాత్మా రఘూత్తమః ॥ 199

కోటిశశ్శివలింగాని స్థాపయామాస సర్వతః ।
అశ్వమేధాదివివిధాన్ యజ్ఞాన్ విపులదక్షిణాన్ ॥ 200

చకార పరమానందో మానుషం వపురాస్థితః ।
సీతాం తాం రమయామాస సర్వభోగైరమానుషైః ॥ 201

శశాస రామో ధర్మేణ రాజ్యం పరమధర్మవిత్ ।
కథాః సంస్థాపయామాస సర్వలోకమలాపహాః ॥ 202

## అగస్త్యముని శ్రీరాముని స్తుతించి, సన్మానింపబడి వెళ్ళుట.

స్వామీ! నీవే సాక్షాత్ పరమేశ్వరుడవు. సర్వజ్ఞుడవు. భూత, భవిష్యత్, వర్తమాన కాలములకు సాక్షిగా ఉందువు. నీయందు ఎట్టి వికల్పములును లేవు. భక్తులను అనుగ్రహించుటకై ఈ లోక వ్యవహారములలో నటించుచు, మనిషి రూపంలో ఇట్లు మన్నించుచుందువు, నీవే లోకైకపూజ్యుడుగా ఉన్నావు.” అని యిట్లు అగస్త్యుడు శ్రీరాముని స్తుతించి, శ్రీరామునిచే సత్కరింపబడి మునులతోడ అక్కడినుండి తన ఆశ్రమమునకు వెళ్ళెను. (192).

## శ్రీరాముని మానుషలీలా వినోదము.

అగస్త్య మహర్షి తన నిజరూపమును వింధ్య పర్వతునికి చూపి, "నేను తిరిగి వచ్చిన తరువాత నీవు పైకి లెమ్ము," అని అగస్త్యుడు అంతర్ధానము నొందెను. పార్వతీ! వినుము, "శుద్ధబ్రహ్మ అగు ఆ శ్రీరామమూర్తి బద్ధసంసారివలె సోదరులతోను, సీతతోను, మంత్రులతోను, లీలావినోదములు చేయుచుండెను. తాను అనాసక్తుడైనను పరమాసక్తుడే. జానకీదేవితో భార్యాసుఖమందుచుండెను. హనుమంతుడు మొదలైనవారివలన సేవింపబడుచుండెను. లోకనాథుడును, లక్ష్మీనాథుడును అగు రఘునాథుడు రాజ్యమేలుచుండగా ఈ భూమిపై వృక్షములు మంచి కాయలను, పండ్లను ఇచ్చినవి. జనులందరును వారివారి ధర్మములు చక్కగ ఆచరించు చుండిరి. గృహిణులు తమ భర్తల పట్ల ఎంతో భక్తి శ్రద్ధలు కనబరచిరి. యే ఒక్కరికిని పుత్రశోకము కలుగలేదు. శ్రీసీతారాములు సపరివారముగా పుష్పకవిమానమునెక్కి ఈ భూమిపై సంచరించిరి. శ్రీరాముడు మానుషకృత్యములను ఎన్నింటినో చూపుచుండెను. మఱియు లోకులకు ఉపదేశించుటకై కోట్లకొలది శివలింగ ప్రతిష్ఠలను చేసెను. గొప్ప దక్షిణలతో కూడిన అశ్వమేధాది యజ్ఞములను చేసెను. పరమానంద విగ్రహుడగు తాను దివ్యభోగములచే జానకీదేవిని సంతోషపరచెను. ధర్మాత్మకుడును, ధర్మజ్ఞుడును అగు రాముడు రాజ్యమును ధర్మబద్ధముగా పరిపాలించెను. సర్వలోకములను పరిశుద్ధిజేయనెంచి తనచరితములను సంస్థాపించెను.

**ఏకాదశసహస్రాణి సైకాదశసమాని చ ।**
**త్రేతాయుగభవాన్యేవ వర్షాణి రఘునందనః ॥ 203**

**చకార రాజ్యం ధర్మేణ లోకవంద్యపదాంబుజః ।**
**కలేర్మానేన జ్ఞేయాని లక్షాణ్యేకాదశైవ హి ॥ 204**

**సైకాదశశతాన్యత్ర రామో రాజ్యం చకార సః ।**
**ఏకపత్నీవ్రతో రామో రాజర్షిః సర్వదా శుచిః ॥ 205**

**యస్యైకమేవ తచ్చాసీత్ పత్నీవాక్యం శరస్తథా ।**
**గృహమేధీయమఖిలమాచరన్ శిక్షితుం నరాన్ ॥ 206**

**సీతా ప్రేమ్ణాఽనువృత్యా చ ప్రశ్రయేణ దమేన చ ।**
**భర్తుర్మనోహరా సాధ్వీ భావజ్ఞా సా హ్రియా భియా ॥ 207**

యుక్త్వా తం రంజయామాస రాజానం రాఘవం ముదా ।
ఏవం గిరీంద్రజే ప్రోక్తం రామరాజ్యోత్తరోద్భవమ్ ॥ 208

చరితం రఘునాథస్య యథా పృష్టం త్వయా మమ ।
శ్రవణాత్సర్వపాపఘ్నం మహామంగళకారకమ్ ॥ 209

సారకాండమిదం దేవి యే శృణ్వంతి నరోత్తమాః ।
తేషాం మనోరథాః సర్వే పరిపూర్ణా భవంతి హి ॥ 210

**ఇతి శ్రీశతకోటిరామచరితాంతర్గతే, శ్రీమదానందరామాయణే, వాల్మీకీయే, ఆదికావ్యే, సారకాండే, అగస్తి రామ శివ పార్వతీ సంవాదే, త్రయోదశః సర్గః ॥**

## ఇతి సారకాండః సమాప్తః ॥

లోకపూజ్యుడగు శ్రీరామచంద్రునిచే త్రేతాయుగమున 11,111 సంవత్సరములు రాజ్యము చక్కగా పరిపాలింపబడెను. ఏకపత్నీవ్రతుడగు రాముడు నిత్యపరిశుద్ధుడగు రాజర్షియై యుండగా, పత్నీవాక్యమొకటియే ఆయనకు బాణముగా ఉండెను. సనాతనమగు గృహస్థాశ్రమధర్మమును సమగ్రముగా ఆచరించి చూపెను. సీతామాత కూడా– వినయము చేతను, ప్రేమ చేతను, అనువర్తనము చేతను, ఇంద్రియనిగ్రహము చేతను, లజ్జ చేతను భావము నెఱిగి– భర్తయొక్క మనస్సును గ్రహించి, రాముని రంజింపజేసి సంసారమునే సంసారమనిపించుచుండెను.

పార్వతీ! నీవడిగినట్లు శ్రీరామునియొక్క రామరాజ్య ఉత్తర చరిత్రమును చెప్పితిని. ఈదివ్య చరిత్రను వినినచో సమస్త కష్టములు తొలగి సమస్త మంగళములు చేకూరును. ఈ సారకాండను వినిన మహాత్ములు సమస్త కోరికలను తీరి ఆనందించుచుందురు. (210)

***శతకోటిప్రవిస్తరమైన శ్రీరామకథలో, శ్రీమద్వాల్మీకిమహర్షిచే రచింపబడిన, ఆనందరామాయణంలోని, సారకాండలో– అగస్త్య, రామ, శివ, పార్వతీ– సంవాదములో పదమూడవ సర్గ ముగిసినది.***



## 2. యాత్రా కాండ వివరములు

| సర్గ. | శ్లోకాలు |
|---|---|
| 1. | 44 |
| 2. | 76 |
| 3. | 80 |
| 4. | 105 |
| 5. | 95 |
| 6. | 139 |
| 7. | 86 |
| 8. | 50 |
| 9. | 69 |

**మొత్తం 9 సర్గలు, 744 శ్లోకాలు**



# ప్రథమః సర్గః-1వ సర్గ

శ్రీమద్రామాయణ కథనము, శ్లోకోత్పత్తి.

**శ్రీపార్వత్యువాచ**

**సారకాండం త్వయా శంభో కీర్తితం బహుపుణ్యదమ్ ।**
**మయా శ్రుతం తు పృచ్ఛామి యత్తద్వక్తుం త్వమర్హసి ॥ 1**

**కథం కృతా వాజిమేధా రాఘవేణ బలీయసా ।**
**రామాదీనాం చతుర్ణాం హి బంధూనాం సంతతిం వద ॥ 2**

**స్వపుత్ర బంధుపుత్రాశ్చ కథం స్త్రీభిః సుయోజితాః ।**
**దశవర్షసహస్రాణి దశవర్షశతాని చ ॥ 3**

**తథైకాదశ వర్షాణి త్రేతాయుగ భవాని హి ।**
**రాజ్యం కృతం త్వయా ప్రోక్తం విస్తరాద్వా వదస్వమామ్ ॥ 4**

**యాని యాని చరిత్రాణి రాఘవేణ కృతాని హి ।**
**తాని తాని హి కృత్స్నాని విస్తరాద్వక్తుమర్హసి ॥ 5**

శ్రీమత్ రామకథా వర్ణనముచే శ్రవణానందమును కలిగించిన, శంకరుని జూచి, పార్వతీదేవి, “శంభూ! పుణ్యప్రదమగు సారకాండను చెప్పగా వింటిని. సర్వమును చెప్పుటకు శక్తుడవగు నిన్ను అడిగెదను. మహాత్ముడగు రాముడు అశ్వమేధయాగములను ఎట్లు చేసెను? నలుగురు అన్నదమ్ములైన రామదూతలయొక్క సంగతి చెప్పుము? శ్రీరాముడు 11,011 త్రేతాయుగ సంవత్సరములు రాజ్యమేలిన సంగతిని వివరముగా వినిపింపుము. తన పుత్రులను, తమ్ముల పుత్రులను ఎట్లు సమముగా చూసి మెలిగెను? ఆ కాలమున రాముని సర్వవిశేష కృత్యములను చక్కగా నిరూపింప వేడెదను,” అని ప్రార్థించెను.(5)

**ఇతి దేవివచః శ్రుత్వా శంభుస్తాం పునరబ్రవీత్ ।**

**శ్రీ మహాదేవ ఉవాచ**

**సమ్యక్ పృష్టం త్వయా దేవి రాఘవస్య కథానకమ్ ॥ 6**

**మమాపి హర్షః సంజాతస్తద్వదామి కథానకమ్ ।**
**చరితం రఘునాథస్య శతకోటిప్రవిస్తరమ్ ॥ 7**

ఏకైకమక్షరం పుంసాం మహాపాతకనాశనమ్ ।
వాల్మీకినా కృతం పూర్వమేకదా తద్వదామి తే ॥ 8

వాల్మీకిస్త్వేకదా స్నాతుం జగామ తమసాం నదీమ్ ।
శిష్యేణ సహితో గత్వా భూమౌ స్థాప్య కమండలుమ్ ॥ 9

ఆవశ్యకం తు సంపాద్య కృత్వా శౌచవిధిం తతః ।
యావద్గచ్ఛతి స్నానార్థం దర్భపాణిః స వై మునిః ॥ 10

తావద్దదర్శ తమసాతీరే కౌతుకముత్తమమ్ ।
క్రౌంచయుగ్మే హతః క్రౌంచో నిషాదేన పతత్రిణా ॥ 11

క్రౌంచీ శోకసమావిష్టా విలలాపాతిదుఃఖితా ।
వియుక్తా పతినా తేన ద్విజేన సహచారిణా ॥ 12

తామ్రశీర్షేణ మత్తేన పత్రిణా సా హతేన చ ।
తథావిధం ద్విజ దృష్ట్వా నిషాదేన నిపాతితమ్ ॥ 13

ఋషేర్ధర్మాత్మనస్తస్య కారుణ్యం సమపద్యత ।
తతఃకరణయాఽఽవిష్ట స్త్వధర్మోఽయమితి ద్విజః ॥ 14

నిశామ్యరుదతీంక్రౌంచీమిదం వచనమబ్రవీత్ ।
మా నిషాద ప్రతిష్ఠాం త్వమగమః శాశ్వతీః సమాః ॥ 15

పార్వతీదేవి వాక్యములను వినిన మహాదేవుడు ఇట్లు చెప్పుచున్నాడు, "దేవీ! నీవు శ్రీరామ చరిత్రను చక్కగా అడిగితివి, నేను ఆనందించుచు వివరించెదను వినుము. మునుపు ఒకప్పుడు వాల్మీకిచే చెప్పబడినదియును, ఒక్కొక్క అక్షరమూ మనుషుల మహాపాతకములను తొలగించునదియు అగు నూరుకోట్ల శ్లోకములు గల గ్రంథముగా విస్తరించియుండు శ్రీరామ చరిత్రను నీకు చెప్పెదను. ఒకప్పుడు వాల్మీకి మహర్షి తమసానదికి స్నానమునకై వెడలెను. శిష్యుని తోడుగా తీసుకొని పోయి, కమండలువును ఒడ్డున ఉంచి, శౌచ ఆచారమును నెరవేర్చి, చేతికి దర్భను ధరించి, తమసా నదిలో స్నానమునకు దిగుతున్నప్పుడు ఒక దృశ్యము కనిపించెను. అది ఏమనిన; అచట పాపియగు బోయవాడు ఒకడు అక్కడి చెట్టుపై ఉన్న జంట పావురములలో మగదానిని బాణముతో చంపెను. ఆడపక్షి, తన భర్తయగు మగ పక్షి యొక్క వియోగమును భరింపలేక, మిక్కిలి శోకముతో ఏడ్చుచుండెను. వేటగానిచే చంపబడిన మగపావురమును జూచి ఎడ్చుచున్న ఆడపావురమును జూచిన ధర్మాత్ముడగు

వాల్మీకికి మనసులోని కరుణ పెల్లుబికెను. అపుడు బాధతో దుఃఖించుచున్న ఆడపావురమును చూచిన వాల్మీకి, తటాలున, "ఓ బోయవాడా! నీవు, జంట పావురములలో కామియగు మగదానిని చంపినందుకుగాను చిరకాలము బ్రతుకవలదు" అని శపించెను.

(శ్లో॥ మా నిషాద ప్రతిష్ఠాం త్వమ్ అగమః శాశ్వతీః సమాః ।
యత్క్రౌంచమిథునాదేకమ్ అవధీః కామమోహితమ్ ॥ (15, 16)

హే నిషాద= ఓ బోయవాడా! యత్= ఎందువలన, క్రౌంచ మిథునాత్= జంట పక్షులలో, కామమోహితమ్= క్రీడాతత్పరమగు, ఏకమ్= మగదానిని ఒకదానిని, అవధీః= చంపితివో- అందువల్ల, త్వం= నీవు, శాశ్వతీస్సమాః= అనంతములగు సంవత్సరములు, ప్రతిష్ఠాం= స్థితిని, మా+అగమః= పొందవలదు.)

ఇట్లు చెప్పుచూ ఆత్మను సంధానముచేయు మునికి చింత కలిగెను. ఆహా! శోకార్తుడగు నేను పక్షిని గురించి ఏమని పలికితిని? అని చింతించుచునే మహాప్రాజ్ఞుడును, మతిమంతుడైన ఆ మునీంద్రుడు మనస్కరించి, శిష్యుడగు భరద్వాజునికి, "సమపాదాక్షరమును, వీణాగాన లయోపేతమును అగు శోకార్తుడగు నా యొక్క మాట తప్పక శ్లోకమగునుగాక!" అని చెప్పెను. శిష్యుడును, మునీంద్రుని మాన్యవచనమును సంతోషముతో సంభావించి, ఒప్పుకొనెను. వాని విషయమై వాల్మీకి ప్రసన్నుడై ఆ తీర్థమున యథావిధిగా స్నానముచేసి, ఆ శ్లోక అర్థమునే విచారించుచు, తన ఆశ్రమమునకు వచ్చెను. వినయవంతుడైన శిష్యుడగు భరద్వాజుడు, కమండలువు చేతబట్టుకుని వాల్మీకి మునితోపాటు ఆశ్రమమునకు వచ్చెను. ఇట్లు తన పుణ్యాశ్రమమున.....

**యత్క్రౌంచమిథునాదేకమవధీః కామమోహితమ్ ।**
**తస్యేత్థం బ్రువతశ్చింతా బభూవ హృది వీక్షితః ॥ 16**

**శోకార్తేనాస్య శకునేః కిమిదం వ్యాహృతం మయా ।**
**చింతయన్స మహాప్రాజ్ఞశ్చకార మతిమాన్ మతిమ్ ॥ 17**

**శిష్యం చైవాబ్రవీద్వాక్యమిదం స మునిపుంగవః ।**
**పాదబద్ధోఽక్షరసమస్తంత్రీలయసమన్వితః ॥ 18**

**శోకార్తస్య ప్రవృత్తో మే శ్లోకో భవతు నాన్యథా ।**
**శిష్యస్తు తస్య బ్రువతో మునేర్వాక్యమనుత్తమమ్ ॥ 19**

ప్రతిజగ్రాహ సంతుష్టస్తస్య తుష్టోఽభవన్మునిః ।
సోఽభిషేకం తతః కృత్వా తీర్థే తస్మిన్ యథావిధి ॥ 20

తమేవ చింతయన్నర్థముపావర్తత వై మునిః ।
భరద్వాజస్తతః శిష్యో వినీతః శ్రుతవాన్ గురోః ॥ 21

కలశం పూర్ణమాదాయ ప్రహృష్టశ్చ జగామ హ ।
స ప్రవిశ్యాశ్రమపదం శిష్యేణ సహ ధర్మవిత్ ॥ 22

ఉపవిష్టః కథాశ్చాన్యాశ్చకార ధ్యానమాస్థితః ।
తత్రాజగామ లోకానాం కర్తా బ్రహ్మా స్వయం ప్రభుః ॥ 23

చతుర్ముఖీ మహాతేజా ద్రష్టుం తం మునిపుంగవమ్ ।
వాల్మీకిస్థ తం దృష్ట్వా సహసోత్థాయ వాగ్యతః ॥ 24

ప్రాంజలిః ప్రయతో భూత్వా తస్థౌ పరమవిస్మితః ।
పూజయామాస తం దేవం పాద్యార్ఘ్యాసనవందనైః ॥ 25

ప్రణమ్య విధివచ్చైనం పృష్ట్వా చైవ నిరామయమ్ ।
అథోపవిశ్య భగవానాసనే పరమార్చితే ॥ 26

మహర్షయే వాల్మీకయే సందిదేశాసనం తతః ।
బ్రహ్మణా సమనుజ్ఞాతః సోఽప్యుపావిశదాసనే ॥ 27

ఉపవిష్టే తదా తస్మిన్ సాక్షాల్లోక పితామహే ।
తద్గతేనైవ మనసా వాల్మీకిర్ధ్యానమాస్థితః ॥ 28

పాపాత్మనా కృతం కష్టం వైరగ్రహణబుద్ధినా ।
యస్తాదృశం చారురవం క్రౌంచం హన్యాదకారణమ్ ॥ 29

శిష్యునితో ఆశ్రమములోనికి ప్రవేశించిన వాల్మీకి ముని సుఖాసీనుడై, మిగిలిన కార్యక్రమములను ఆచరించెను. ధ్యానములోనికి పోయెను. అంత అచటికి లోకనిర్మాణ నిపుణుడు, మహానుభావుడగు చతుర్ముఖ బ్రహ్మ వాల్మీకిని జూచుటకు అక్కడికి వచ్చెను. బ్రహ్మదేవుని రాకను గమనించిన వాల్మీకి విస్మయమునంది, వేగమే లేచి, మిక్కిలి శ్రద్ధాభక్తులతో ఆ దేవాదిదేవునికి, అర్ఘ్య, పాద్య, స్నానాదులచే సత్కరించి, విధి విధానముగా అర్చించి, నియమముతో దోసిలిపట్టి, కుశలప్రశ్నలు వేసెను. గౌరవనీయ

ఆసనముమీద కూర్చున్న బ్రహ్మదేవుడు, వాల్మీకిని ఒక ఆసనము మీద కూర్చొనమని చెప్పెను. అపుడు వాల్మీకి బ్రహ్మాజ్ఞచే తన ఆసనముమీద కూర్చుండెను. అట్లు సాక్షాత్ బ్రహ్మదేవుని సాన్నిధ్యమున వాల్మీకి ధ్యానస్థితిని పొంది, "అయ్యో! నిష్కారణముగా ఆ పావురమును కొట్టిన బోయవానిని శపించితినే" అని చింతించుచుండెను.

శోచన్నేవం పునః క్రౌంచీముపశ్లోకమిమం జగౌ ।
పునరంతర్గతమనా భూత్వా శోకపరాయణః ॥ **30**

తమువాచ తతో బ్రహ్మాన్ ప్రహసన్ మునిపుంగవమ్ ।
శ్లోక ఏవ త్వయా బద్ధో నాత్ర కార్యా విచారణా ॥ **31**

మచ్ఛందాదేవ తే బ్రహ్మాన్ ప్రవృత్తేయం సరస్వతీ ।
రామస్య చరితం కృత్స్నం కురు త్వమృషిసత్తమ ॥ **32**

ధర్మాత్మనో గుణవతో లోకే రామస్య ధీమతః ॥ **33**

వృత్తం కథయ ధీరస్య యథా తే నారదాచ్ఛ్రుతమ్ ।
రహస్యం చ ప్రకాశం చ తద్వృత్తం తస్య ధీమతః ॥ **34**

రామస్య సహ సౌమిత్రేః కీశానాం రాక్షసాం తథా ।
వైదేహ్యాశ్చైవ యద్వృత్తం ప్రకాశం యది వా రహః ॥ **35**

తచ్చాప్యవిదితం సర్వం విదితం తే భవిష్యతి ।
న తే వాగనృతా కావ్యే కాచిదత్ర భవిష్యతి ॥ **36**

కురు రామకథాం పుణ్యాం శ్లోకబద్ధాం మనోరమామ్ ।
యావత్స్థాస్యంతి గిరయః సరితశ్చ మహీతలే ॥ **37**

తావద్రామాయణకథా లోకేషు ప్రచరిష్యతి ।
యావద్రామాయణకథా త్వత్కృతా ప్రచరిష్యతి ॥ **38**

తావదూర్ధ్వమధశ్చ త్వం మల్లోకేషు నివత్స్యసి ।
ఇత్యుక్త్వా భగవాన్ బ్రహ్మా స్వయం రామస్య ధీమతః ॥ **39**

**చరిత్రం శ్రావయామాస వేదవాక్యైః సుపుణ్యదైః ।**
**తతస్తేనార్చితో బ్రహ్మా తత్రైవాంతరధీయత ॥ 40**

**తతః సశిష్యో భగవాన్ మునిర్విస్మయమాయయౌ ।**
**తస్య శిష్యాస్తతః సర్వే జగుః శ్లోక మిమం పునః ॥ 41**

**ముహుర్ముహుః ప్రీయమాణాః ప్రాహుశ్చ భృశవిస్మితాః ।**
**సమాక్షరైశ్చతుర్భిర్యః పాదైర్గీతో మహర్షిణా ।**
**సోఽనువ్యాహరణాద్భూయ శోకః శ్లోకత్వమాగతః ॥ 42**

అలా చింతలోనున్న తాను శాపముగా పలికిన ఆ శ్లోకమునే మరలా మరలా చింతించసాగెను. అపుడు బ్రహ్మ నవ్వుచూ వాల్మీకి మునితో, "నీవు శ్లోకమును పలికితివి. అందుకు కారణమును ఆలోచింపవలదు. నా ఇచ్ఛవలననే నీ నోటినుండి ఆశ్లోకము వెలువడెను. ఋషిశ్రేష్ఠుడా! శ్రీరామ చరితమును సమగ్రముగా రచింపుము. ధర్మాత్ముడు, గుణవంతుడు, ధీమంతుడు అగు శ్రీరామ చరితము నారదుని వలన నీవు విన్నది విన్నట్లు చెప్పుము. సీతారాములయొక్క లక్ష్మణునియొక్క, రాక్షసులయొక్కయు, రహస్యములును, అందరికి తెలిసిన విషయములును, నీకు తెలియని సకల వృత్తాంతములును ఇక నీకు తెలియుచుండును.

కావ్యమున నీ మాట పొల్లుపోదు. మనోహరమగు శ్లోకములచే రామకథను అభివర్ణింపుము. ఈ రామాయణకావ్యము భూమి, నదులు, పర్వతాలు ఉండునంతవరకు ప్రఖ్యాతినొంది వ్యాపించునుగాక! ఈ భూమిమీద నీచే వ్రాయబడిన శ్రీరామకథ ఎంతవరకు ప్రచారమును పొందియుండునో అంతవరకు నీవు పైన, దిగువకూడా నా లోకములో ఉండగలవు," అని అనుగ్రహించి, మహానుభావుడగు బ్రహ్మదేవుడు శ్రీరాములవారి దివ్యమంగళ చరితమును, పుణ్యకరములగు దేవవాక్కులచే వినిపించెను. అంత వాల్మీకిచే సత్కరింపబడిన బ్రహ్మదేవుడు అచటనే అంతర్ధానము నందెను. అంత శిష్యుడగు వాల్మీకి ఎంతో ఆశ్చర్య పరవశుడయ్యెను. వాల్మీకి శిష్యులందరును మరలా మరలా ఆ శ్లోకమునే పఠించిరి. మరలా మరలా ఆ శ్లోకమునే ఇష్టపడుతూ, ఎంతో ఆశ్చర్యముతో గానముచేసిరి. ఇట్లు వాల్మీకి మరలా మరలా పఠించడముతో అతని శోకమే శ్లోకమాయెను.

(ఎట్లనిన– మా నిషాద= లక్ష్మీ నివాసుడగు శ్రీరామా! యత్= యే కారణమువలన, క్రౌంచ మిథునాత్= క్రుంచరాక్షసి అనగా కుటిల అగు కైకసియొక్క కొడుకు క్రౌంచుడు రావణుడు వాని పత్ని మండోదరి క్రౌంచి అనబడును క్రౌంచియును, క్రౌంచుడును చేరి క్రౌంచులు. వీరియొక్క మిథునమును జత క్రౌంచ మిథునము ఇట్టి క్రౌంచమిథునములో , కామమోహితమ్= లోక విద్విష్ట కర్మగల రావణుడు,

ఏకమ్= ఒకనిని, అవధీః= చంపితివో– ఆకారణమువలన, త్వం= నీవు, శాశ్వతీస్సమాః= అనంతము లగు సంవత్సరములు, ప్రతిష్ఠామ్= సుస్థితిని, అగమః= పొందుము.)

అని శ్రీరామ స్మరణరూప మంగళశ్లోకమును వాల్మీకి దైవికముగా చెప్పినట్లైనది.

**తస్య బుద్ధిరియం జాతా మహర్షేర్భావితాత్మనః ।**
**కృత్స్నం రామాయణం కావ్యమీదృశైః కరవాణ్యహమ్ ॥ 43**

**ఉదారవృత్తార్థపదైర్మనోరమైః**
**తదాఽస్య రామస్య చకార కీర్తిమాన్ ।**
**సమాక్షరైః శ్లోకవరైర్యశస్వినో**
**మునిః స కావ్యం శతకోటిసంమితమ్ ॥ 44**

**ఇతి శ్రీ శతకోటిరామచరితాంతర్గతే, శ్రీమదానందరామాయణే, వాల్మీకీయే, ఆదికావ్యే, యాత్రాకాండే, శ్లోకోత్పత్తిరామాయణకథనం నామ ప్రథమః సర్గః ॥**

పిమ్మట భావితాత్మ యగు వాల్మీకిమహర్షి రామాయణ కావ్యమును సమగ్రముగా ఇట్లే రచించెదనని నిశ్చయించెను. అట్లే శతకోటి గ్రంథసమ్మితముగా శతస్థానము మూడవది. కోటిస్థానము ఏనిమిదవది, ప్రవిస్తరమున వాటి గుణకము 3×8=24వేలు వేదరామాయణ గ్రంథసంఖ్య అని సంఖ్యావంతులు సంభావించుచుందురు. మహోదర వృత్తాంతములను సత్పద గుంభితములును, మనోహరములును అగు శ్లోక రత్నములచే పుణ్యశ్లోకుడగు ధర్మాత్ముడైన శ్రీరాముని దివ్యమంగళ చరితమును కావ్యముగా రచించెను. (1)

***శతకోటిప్రవిస్తరమైన రామకథలో, శ్రీమద్వాల్మీకిమహర్షిచే రచింపబడిన, ఆనందరామాయణంలోని, యాత్రాకాండలో, రామాయణ శ్లోకోత్పత్తిని వివరించు మొదటిసర్గ ముగిసినది.***



# ద్వితీయః సర్గః-2వ సర్గ

## వాల్మీకిమహర్షి రామాయణమును విస్తరించుట

**శ్రీశివ ఉవాచ**

**వాల్మీకినా కృతం దేవి శతకోటిప్రవిస్తరమ్ ।**
**రామాయణం మహాకావ్యం జగృహుర్మునయశ్చ తే ॥ 1**

**ఆశ్రమే తత్ పఠంతి స్మ కథయంతి స్మ తే ముదా ।**
**తచ్ఛ్రోతుమమరాః సర్వే విమానైశ్చ దివి స్థితాః ॥ 2**

**శ్రుత్వా సర్వం సవిస్తారం వాల్మీకిం పుష్పవృష్టిభిః ।**
**వవర్షుర్జయశబ్దైస్తే ప్రశశంసుర్మునీశ్వరమ్ ॥ 3**

**తతో దేవాః సగంధర్వా యక్షా నాగాః సకిన్నరాః ।**
**మునీశ్వరా గుహ్యకాశ్చ పార్థివాః పద్మభూస్త్వహమ్ ॥ 4**

**పరస్పరం తే కలహం చక్రుః కావ్యార్థమాదరాత్ ।**
**బ్రహ్మాద్యా నిర్జరాః సర్వే పన్నగాదితిజాన్నరాన్ ॥ 5**

**వయం కావ్యం వినేష్యామో దివం వాల్మీకినా కృతమ్ ।**
**దితిజాః పన్నగాః ప్రోచుర్వినేష్యామో రసాతలమ్ ॥ 6**

**వయం కావ్యం రాఘవస్య చరిత్రం పావనం శుభమ్ ।**
**ఋషీశ్వరాః సభూపాలాః ప్రోచుః కావ్యం హి భూతలాత్ ॥ 7**

**నేతుం రసాతలం స్వర్గం నదాస్యామో వయం త్విదమ్ ।**
**కావ్యార్థమితి తే చక్రుః కలహం రోమహర్షణమ్ ॥ 8**

## ముల్లోకములవారు రామాయణముకొరకు కలహించుట

శివుడు చెప్పుచున్నాడు, “వాల్మీకిమహర్షి నూరుకోట్ల శ్లోకములతో రామకథను వివరముగా వ్రాయగా, దానిని అచటి మునులందరును అంగీకరించి, సంతోషముతో చదువుచు, బోధించు చుండిరి. ఆ రామాయణమును వినుటకై దేవతలందరును ఆకాశమున విమానములలో ఉండి,

సవిస్తరముగా అంతా విని, వాల్మీకి మీద పూలవాన కురిపించిరి. అచటి మునులను జయ జయ ధ్వానములతో శ్లాఘించిరి.

పార్వతీ! పిదప దేవతలును, గంధర్వులును, యక్షులును, నాగులును, కిన్నరులును, మునీంద్రులును, గుహ్యకులును, రాజులును, బ్రహ్మదేవుడును, నేను అచటికి చేరితిమి. అందరూ అన్యోన్యముగా ఆ రామాయణ మహాకావ్యము కొరకు కలహింపసాగిరి. బ్రహ్మాది దేవతలు, తక్కిన నాగాదులతో, "ఈ వాల్మీకి కావ్యమును స్వర్గమునకు కొనిపోవుచున్నాము అని చెప్పిరి. ద్విజులును, పన్నగులును, "మంగళము, పావనమగు శ్రీరఘురామ చరిత్రను మేము తీసికొనిపోవుచున్నాము," అనిరి. మునులును, రాజులును, "ఆహా! ఈ కావ్యమును భూతలమునుండి స్వర్గమునకు గాని, పాతాళమునకు కాని మేము ఇవ్వము," అనిరి. ఇట్లు రామాయణ కావ్యమునకై కఠోర యుద్ధము చేసిరి. (8)

**తతో దేవి జనాన్ సర్వాన్ నివార్య వచనైర్నిజైః ।**
**గత్వాఽహం త్వైస్తు క్షీరాబ్ధౌ శేషపర్యంకశాయినమ్ ॥ 9**

**విష్ణుం స్తుత్వా తు వేదోక్తైః మంత్రైర్నానావిధైరపి ।**
**నానాపూజోపహారైశ్చ పూజయిత్వా సవిస్తరమ్ ॥ 10**

**కృతవాన్ గీతవాద్యాది తేన విష్ణురబుధ్యత ।**
**పప్రచ్ఛ మాం తదా విష్ణుః కిమర్థం బోధితోఽస్మ్యహమ్ ॥ 11**

**వృత్తం సర్వం మయా దేవి కథితం తత్సవిస్తరమ్ ।**
**కావ్యార్థం కలహం శ్రుత్వా ప్రహస్య జగదీశ్వరః ॥ 12**

**త్రిధా విభజ్య కావ్యం తత్ క్షణేన భక్తవత్సలః ।**
**త్రయస్త్రింశత్కోటిలక్షసహస్రాణి పృథక్ పృథక్ ॥ 13**

**శతాని స్త్రీణి శ్లోకాంశ్చ త్రయస్త్రింశచ్ఛుభావహాన్ ।**
**దశాక్షరమితాన్మంత్రాన్వ్యభజ్యత రమాపతిః ॥ 14**

**ద్వేఽక్షరే యాచమానాయ మహ్యం శేషే దదౌ హరిః ।**
**ఉపదిశామ్యహం కాశ్యాం తేఽన్తకాలే నృణాం శ్రుతౌ ॥ 15**

రామేతి తారక మంత్రం తమేవ విద్ధి పార్వతి ।
లక్ష్మీగరుడశేషేభ్యో యాచమానేభ్య ఆదరాత్ ॥ 16

మంత్రత్రయం పృథక్ విష్ణుర్దదౌ తేభ్యోఽతిహర్షితః ।
శేషాన్ నినాయ పాతాళం లక్ష్మీర్వైకుంఠమాదరాత్ ॥ 17

పృథివ్యామేవ గరుడస్తం దధార మహామనుమ్ ।
ప్రాపుః శేషాత్పన్నగాద్యాః సర్వే పాతాళవాసినః ॥ 18

స్వర్గే ప్రాపుర్మహాలక్ష్మ్యాస్తం మనుం నిర్జరాదయః ।
తార్క్ష్యాత్ప్రాపుర్మహామంత్రం సర్వే భూతలవాసినః ॥ 19

మంత్ర శాస్త్రాత్తత్స్వరూపం జ్ఞేయం గుహ్యం గిరీంద్రజే ।
తతః పూర్వ విభాగాన్స దదౌ విష్ణుః పృథక్ పృథక్ ॥ 20

ఏవం విభాగం దేవేభ్యో ద్వితీయం పరమేశ్వరః ।
మునీశ్వరేభ్యో నాగేభ్యస్తృతీయం భాగముత్తమమ్ ॥ 21

## రామాయణ పంపకము

పార్వతీ! అంత నేను వారి కలహమును నివారించి, మంచిమాటలచే సమాధానపరచి, వారితో వెడలి, పాలసముద్రమున శేషతల్పమున శయనించియుండు శ్రీమహావిష్ణువును వేదోక్తమగు వివిధ మంత్రములతో స్తుతించి, వివిధ పూజాసామాగ్రితో పూజించి, గీతవాద్యాదులచే నిద్రమేల్కొల్పితిని. అపుడు నారాయణుడు "నన్నేల లేపితిరి" అని నన్ను అడిగెను. నేను జరిగిన విషయమును విన్న వించితిని. జగన్నాథుడు మాటల కలహమును విని, నవ్వి, భక్తవత్సలుడగు విష్ణువు; క్షణమాత్రమున ఆ నూరుకోట్లశ్లోకముల రామాయణ కావ్యమును మూడు పాళ్ళుగా విభజించి, వేరువేరుగా ముప్పది మూడుకోట్ల, ముప్పది మూడు లక్షల, ముప్పదిమూడువేల మూడువందల, ముప్పది మూడు వంతున పంచిపెట్టి, యాచించుచుండు నాకు మిగిలిన రెండు అక్షరములగు తారకమంత్రమును అనుగ్రహించెను. నేను అట్టి **'రామ'** తారకమను మంత్రమును కాశీపట్టణమున ప్రాణుల చెవిలో ఉపదేశించుచున్నాను. మరియు గరుడుడు, లక్ష్మీ, శేషుడు వీరును వేడుకొనగా ఆ నారాయణుడు వారికిని వేరువేరుగా మూడు మంత్రములను అనుగ్రహించెను. వారిలో శేషుడు పాతాళమునకు ఆ మంత్రమును కొనిపోయెను. లక్ష్మీదేవి స్వర్గమునకు తీసుకొనిపోయెను. గరుడుడు భూలోకమున ఆ మంత్రమును స్థాపించెను. ఆ మహామంత్రమును పాతాళవాసులగు నాగులందరును శేషుని వలన ఆ మంత్రమును స్వీకరించిరి.

తతో దేవా నిజం భాగం స్వర్గం నిన్యుర్ముదాన్వితాః ।
పాతాళే పన్నగాద్యాశ్చ నిన్యుర్భాగం ముదా నిజమ్ ॥ 22

ఆసీద్భాగో మునీనాం హి పృథివ్యాం గిరివరాత్మజే ।
తస్యాపి విస్తరం వక్ష్యే విభక్తో విష్ణునా యథా ॥ 23

సప్తద్వీపేషు సర్వేషు విభక్తః సప్తధా పునః ।
కోట్యశ్చత్వారి లక్షాణి షట్సప్తతి మితాని హి ॥ 24

సహస్రాణి తథైకోనవింశచ్చైవ తథా పునః ।
సప్తచత్వారింశన్మితాః శ్లోకాశ్చేతి పృథక్ పృథక్ ॥ 25

విభక్తం సప్తధా దేవి సప్తద్వీపేషు విష్ణునా ।
చతుఃశ్లోకాః శేషభూతా యాచమానాయ వేధసే ॥ 26

దదౌ విష్ణుస్తుష్టమనా నిజభక్తాయ భక్తితః ।
పుష్కరద్వీపభాగశ్చ వర్షయోర్ ద్వివిధః కృతః ॥ 27

కోట్యౌ ద్వే హ్యష్ట త్రింశచ్చ లక్షాణి హి తథా పునః ।
సహస్రాణి నవైవాథ తథా పంచశతాని హి ॥ 28

త్రయోవింశాశ్చ తే శ్లోకాః షోడశాక్షరజో మనుః ।
ఏవం ద్విధా కృతౌ భాగౌ విష్ణునా వర్షయోస్త్విహ ॥ 29

శాకద్వీపాదిద్వీపానాం పంచానాం చ పృథక్ పృథక్ ।
సప్తస్వపి చ సర్వేషు సప్తైవ హరిణా యథా ॥
తత్తద్భాగావిభక్తాశ్చ తాన్శృణుష్వ బ్రవీమ్యహమ్ ॥ 30

అష్టషష్టి హి లక్షాణి సహస్రే ద్వే శతాని హి ।
సప్తైవ చ తథా శ్లోకా ఏకవింశచ్ఛుభప్రదాః ॥ 31

విభజ్య షట్సు ద్వీపేషు హరిణైవ యథాక్రమమ్ ।
జంబుద్వీపగతో భాగో నవవర్షేషు సాదరమ్ ॥ 32

విభక్తో విష్ణునా దేవి యథా త్వాం చ బ్రవీమ్యహమ్ ।
ద్వీపంచాశత్తు లక్షాణి తథా గిరివరాత్మజే ॥ 33

సహస్రాణ్యేకనవతిశ్లోకాః పంచ తథా పునః ।
సప్తాక్షరమితా మంత్రాస్త్వేవ హి నవధా కృతాః ॥ 34

శేషమేకమక్షరం శ్రీరితి సర్వత్ర విష్ణునా ।
నవఖండేషు తత్త్యక్తం తత్సర్వత్ర నియోజయత్ ॥ 35

నానానామసు మంత్రేషు న తస్య నియమః కృతః ।
విభజ్యేతి మహావిష్ణురదృశ్యమగమత్తదా ॥ 36

ఆ తారక మంత్రమును లక్ష్మీదేవి వలన స్వర్గవాసులు పొందిరి. గరుడుని వలన భూలోకము వారు పొందిరి. పార్వతీ! రహస్యమగు తారకమంత్ర తత్త్వమును, మంత్రశాస్త్రమును ఉపదేశ పూర్వకముగా తెలుసుకొనవలెను. అంత ఆ విష్ణుమూర్తి మునుపు విభజించునట్లు మొదటిభాగము 33, 33, 33, 333 దేవతలకును, రెండవ భాగము 33, 33, 33, 333 మునీంద్రులకును, మూడవభాగము 33, 33, 33, 333 నాగులకును ఇవ్వగా, వారు వారివారి లోకములలో ప్రచారము చేసికొనిరి. అట్టి భూలోకవాసుల భాగమును విష్ణువే సప్త ద్వీపములకును ఎట్లు విభజించెనో వినుము.

అనగా– సప్తద్వీపములలో ఒక్కొక్క ద్వీపమునకు నాలుగుకోట్ల డెబ్బదియారులక్షల పంతొమ్మిదివేల నలువది ఏడు (4,76,19,047) శ్లోకముల చొప్పున గ్రంథమును విభజించి ఇచ్చెను. అలా ఏడు ద్వీపములకు పంచగా, నాలుగు శ్లోకములు మిగిలినవి వాటిని ప్రార్థించుచుండు నిజభక్తుడైన బ్రహ్మదేవునికి ఆత్మ తృప్తినొందిన విష్ణుమూర్తి అనుగ్రహించి ఇచ్చెను. ఇట్లు ద్వీపమొకటికి వచ్చిన 4,76,19,047 శ్లోకములలో వర్షద్విభాగమును, దానిలోని రెండు వర్షములకును 2,38,09,523 వంతున పంచెను. శాకాద్వీపాది పంచద్వీపములలో ఏడేడు వర్షములకును ఏడుభాగములను చేసి 68,02,721 శ్లోకముల చొప్పున విభజించి ఇచ్చెను, పిమ్మట జంబూద్వీప భాగమును తొమ్మిది భాగములుగా అనగా 52,91,005 శ్లోకములను తొమ్మిది పాళ్ళుగా పంచి, సప్తాక్ష మంత్రములతోడ నిలిచెను. చివరలో 'శ్రీ' అను అక్షరము మిగలగా దానిని అంతటా ఉపయోగించునట్లు విడువబడెను. ఇట్లు మహావిష్ణువు రామకావ్యమును పంచిపెట్టి, అదృశ్యుడాయె. (36)

అగ్రే కాలాంతరే దేవి దశాస్యో బుద్ధిమత్తరః ।
నిజబుద్ధిబలాదేవ దేవానాం చ పృథక్ పృథక్ ॥ **37**

శతశశ్చైవ ఖండాని కరిష్యతి ఋజూని చ ।
జ్ఞాత్వా మందధియో విప్రా భవిష్యంతీతి వై కలౌ ॥ **38**

క్షీణాయుషో వ్యగ్రచిత్తాస్తేషాం యోగ్యాని రావణః ।
శ్రీకృష్ణోఽపి పునర్దేవి వ్యాస రూపధరో భువి ॥ **39**

మానవానాం హితార్థాయ కావ్యాద్రామాయణాత్పునః ।
భాగాద్భారతవర్షాంతర్గగతాచ్చ వివిధాని హి ॥ **40**

పృథక్ పృథక్ సప్తదశ పురాణాని కరిష్యతి ।
భారతం త్వితిహాసం చ మహచ్ఛ్రేష్ఠం కరిష్యతి ॥ **41**

భాగాద్భారతవర్షాంతర్గతాత్సారం విగృహ్య చ ।
స వ్యాసో భారతాద్యైశ్చ యదా శాంతి న గచ్ఛతి ॥ **42**

సరస్వత్యాస్తటే వ్యాసో వ్యగ్రచిత్తో భవిష్యతి ।
ఏతస్మిన్నంతరే బ్రహ్మా నారదాయ మహాత్మనే ॥ **43**

చతుః శ్లోకైర్విష్ణుదత్తైరుపదేశం కరిష్యతి ।
లబ్ధ్వా తాన్ నారదశ్చాపి సువీణాం రణయన్ముహుః ॥ **44**

కీర్తయన్ సుస్వరం గత్వా మునిం సత్యవతీసుతమ్ ।
తాన్శ్లోకాన్ వ్యాసమునయే స తదా హ్యుపదేక్ష్యతి ॥ **45**

లబ్ధ్వా వ్యాసమునిః శ్లోకాంస్తాన్ రామాయణసంస్థితాన్ ।
శాంతిం లబ్ధ్వా తతస్తేషాం విస్తార చ కరిష్యతి ॥ **46**

తేషామేవార్థమాదాయ పురాణం పరమోదయమ్ ।
అష్టాదశసహస్రం హి శ్రీమద్భాగవతాభిధమ్ ॥ **47**

కరిష్యత్యష్టాదశమం రమ్యం జనమనోహరమ్ ।
భాగవతస్యాత ఏవ వాణీ భిన్నా భవిష్యతి ॥ **48**

## వాల్మీకి వచనమే సర్వశాస్త్రపురాణములకు మూలము.

పార్వతీ! ఇకమీద చాలాకాలమునకు మహాయతియైన దశాస్యుడగు రావణుడు, మందబుద్ధులగు బ్రాహ్మణులు కలిలో భయచకిత చిత్తులుగాను, క్షీణాయు బలముగలవారును యేర్పడుదురని తెలిసి, వేదములను వారికి తగినవిధముగా సరియైన నూరు భాగములుగా వేరువేరుగా చెప్పుచున్నారు.

పార్వతీ! శ్రీకృష్ణుడు వ్యాసరూపమును ధరించి, భూమిపై మానవులకు హితముచేయదలచి, మరలా రామాయణ కావ్యమునుండి భారతవర్ష భాగములోని సారమును తీసుకుని వేరువేరుగా 17 పురాణములను, భారత ఇతిహాసమును చేయుచున్నాడు. పిమ్మట అట్లు రచించిన వ్యాసుడు భారతాదులచే శాంతిని పొందలేక, సరస్వతీ నదీతీరమున చింతాక్రాంతుడై ఉండును. అంతలో బ్రహ్మదేవుడు విష్ణువువలన ఉపదేశము పొందిన నాలుగు శ్లోకములను మహాత్ముడగు నారదునికి ఉపదేశించు చున్నాడు. నారదుడు ఆ నాలుగు శ్లోకములను పఠించుచు, వీణవాయించుచు వచ్చి, వ్యాసమునీంద్రునికి ఆ నాలుగు శ్లోకములను ఉపదేశించుచున్నాడు. రామాయణంలో ఉన్న విషయాలను పొంది, ఆనందించిన వేదవ్యాసుడు ఆ భావమును విస్తరించుచు, పద్దెనిమిది పురాణములను, పురాణ రత్నమగు శ్రీమద్భాగవతమును రచించుచున్నాడు. అందువల్లనే భాగవత వాక్సరిణి వేరుగా నుండును.

**పురాణానాం చ సర్వేషాం వాల్మీకీయైవ గీః ప్రియే ।**
**పృథక్కర్తా స్మృతో వ్యాసః శ్రీమద్రామాయణం శతమ్ ॥ 49**

**కరిష్యతి తథాన్యాని స వ్యాసో వివిధాని చ ।**
**రమ్యాణ్యుపపురాణాని సారం సారం విగృహ్య చ ॥ 50**

**భాగాద్భరతఖండాంతర్గతాద్రామాయణాద్భువి ।**
**కరిష్యంతి తథాన్యేఽపి షట్ శాస్త్రాణి మునీశ్వరాః ॥ 51**

**తస్మాద్రామాయణాదేవ సారముద్ధృత్య సాదరాత్ ।**
**యత్కించిద్గిరిజే భూమ్యాం కీర్త్యతే వై కథానకమ్ ॥ 52**

**రామాయణాంశజం విద్ధి శ్లోకమాత్రమపీహ యత్ ।**
**పార్వత్యువాచ**
**శంభో తే ప్రష్టుమిచ్ఛామి వ్యాసాయ నారదో మునిః ॥ 53**

**స్వయం జ్ఞాత్వా విధిముఖాద్రమ్యాన్పాతకనాశనాన్ ।**
**తాన్ రామచరిత శ్లోకాంశ్చతురశ్చోపదేక్ష్యతి ॥ 54**

**యైః కరిష్యతి స వ్యాసో మునిర్భాగవతం వరమ్ ।**
**తానాశ్లోకాంశ్చతురస్త్వం మాం కృపయా వక్తుమర్హసి ॥ 55**

**శ్రీ శివ ఉవాచ**
**సమ్యక్ పృష్టం త్వయా దేవి సావధానమనాః శృణు ।**
**నారదోక్తాం శ్చతుఃశ్లోకాంస్తవాగ్రే ప్రవదామ్యహమ్ ॥ 56**

**నారదాయాపి కథితా విధినా యే పురా శుభాః ।**
**బ్రహ్మణే విష్ణునా పూర్వం శ్రీరామచరితం యదా ॥ 57**

**విభక్తం హి తదా దత్తాః శేషభూతాః సుపుణ్యదాః ।**
**తాన్ శృణుష్వ చతుః శ్లోకాన్ విష్ణునోక్తాన్ స్వయంభువే ॥ 58**

సర్వ పురాణములకును వాల్మీకి యొక్క వాక్కే మూలము. ఆ రామాయణమునే వ్యాసుడు వేరొక కర్తయై చెప్పును. అట్లే భూమిలోని భారత ఖండాంతర్గత రామాయణ భాగమునుండి సారసంగ్రహమును తీసి, వివిధములగు ఉపపురాణములను రచించును. అట్లే తత్సారమును, షట్ శాస్త్రములుగా రచించును. అందువల్లనే రామాయణములోని సారమును ఆధారముగా గ్రహించియే ప్రతి ఒక్క కథా భూలోకమున కీర్తింపబడినది. లోకమున శ్లోకమనేదంతా రామాయణము యొక్క అంశయే అని గ్రహించుము..... (52)

## భగవంతుడు బ్రహ్మకు ఉపదేశించిన భాగవత మూల శ్లోకములు.

అని పరమేశ్వరుడు చెప్పగా, వినుచున్న పార్వతీదేవి, "నాథా! నిన్ను అడగ దలచెదను. నారదుడు బ్రహ్మముఖము నుండి అభ్యసించిన, యే రామాయణ శ్లోకములను వ్యాసునికి ఉపదేశించెనో, వ్యాసుడు ఏవిధముగా ఆ నారదుని నుండి పొందిన శ్లోకములు పరిశీలించి, శ్రీ భాగవతమును రచించెనో, ఆ నాలుగు శ్లోకములను నాకు దయచేసి చెప్పుము," అని ప్రార్థింపగా ఈశ్వరుడు ఇట్లనెను, "దేవీ! నీవు చక్కగా అడిగితివి, సావధానముగా వినుము. రామాయణ నిరూపణ సమయమున, ఆ శ్లోకములను మునుపు సాక్షాత్ పరమాత్ముడైన నారాయణుడు బ్రహ్మకు ఉపదేశించగా, ఆ విధి నారదునికి అనుగ్రహించెను. పుణ్యప్రదములగు ఆ నాలుగు శ్లోకములను చెప్పెదను వినుము.

**శ్రీభగవానువాచ**
**అహమేవాసమేవాగ్రే నాన్యద్యత్ సదసత్పరమ్ ।**
**పశ్చాదహం యదేచ్చ యోఽవశిష్యేత సోఽస్మ్యహమ్ ॥ 59**

**ఋతేఽర్థం యత్ప్రతీయేత న ప్రతీయేత చాత్మని ।**
**తద్విద్యాదాత్మనో మాయాం యథాఽఽభాసో తథా తమః ॥ 60**

**యథా మహాంతి భూతాని భూతేషూచ్చావచేష్వను ।**
**ప్రవిష్టాన్యప్రవిష్టాని తథా తేషు న తేష్వహమ్ ॥ 61**

**ఏతావదేవ జిజ్ఞాస్యం తత్త్వజిజ్ఞాసునాఽఽత్మనః ।**
**అన్వయవ్యతిరేకాభ్యాం యత్స్యాత్సర్వత్ర సర్వదా ॥ 62**

భగవంతుడు చెప్పుచున్నాడు, "నేను సర్వపూర్ణుడను, కేవలముగా ఉన్నాను. ఈ వ్యావహారిక స్థావర జంగమాత్మక ప్రపంచము నేనుకాను. అదీకాదు, ఇదీ కాదని సర్వమూ నిషేధింపబడగా, మిగిలిన సత్తామాత్రుడే నేను. సర్వము పోగా ఏది తోచునో, అట్టైన యే ఆత్మయందు సర్వమును తోచదో, అట్లు తోచియును తోచక తెరగాఉండునదియే ఆత్మయొక్క మాయగా తెలుసుకో. ప్రకాశము, తపస్సు, పంచభూతములను ఇవి సకల ప్రాణులలో వ్యాపించి యున్నను వేర్వేరుగా తోచుచున్నట్లే, ఈ బ్రహ్మము అంతటను వ్యాపించియున్నను నిర్లేపముగా ఉన్నది.

59. అగ్రే= చివరలో (పారమార్థిక దశయందు), ఏవ= ఇతర వ్యవచ్ఛేదముగా, అహమేవ= నేనుమాత్రమే, ఆసం= ఉన్నాను, అన్యత్= వేరైన, (వ్యావహారికములోని) సత్= చరవస్తు, న= నేను కాను, అసత్= జడవస్తు, న= నేను కాను, (ఐన ఏమిని విచారించునపుడు) పరం= కేవలముగా ఉందును, పశ్చాత్= పిమ్మట (అవిద్యాజ్ఞాననివారణమైనవెనుక), యత్= ఏ బ్రహ్మము, ఏతత్= ఇది యని చెప్పబడునో, చ= అదియును, అహం= నేనుగానే ఉన్నాను. యః= ఏ ఆత్మ, అవశిష్యేత= సర్వము నిషేధింపబడగా కేవలముగా నిలచునో, సః= ఆయాత్మ, అహం= నేనుగా, అస్మి=ఐతిని.

60. అర్థం ఋతే= వ్యావహారికమంతయు విడువబడగా, యత్= యేకారణమువలన, ప్రతీయేత= పొందబడునో, ఆత్మని= బ్రహ్మమందు, న ప్రతియేత చ= (ఈ ప్రాతిభాసిక జగత్తు) పొందబడదో, తత్= ఆ కారణమువలన, ఆత్మనః= బ్రహ్మముయొక్క, మాయామ్= ప్రకృతిని, విద్యాత్= తెలియవలెను, యథా= ఎట్లు, భాసః= ప్రకాశము, యథా= ఎట్లు, తమః= అంధకారమును.

61. యథా= ఎట్లు, మహంతి భూతాని= గొప్పవైన పంచభూతములును, ఉచ్చావచేషు= నానా విధములైన, భూతేషు= ప్రాణులలో, అనుప్రవిష్టాని= చేరికొనియున్నవో, అప్రవిష్టాని= చేరక వేరుగా ఉన్నవో, తథా= అట్లే, అహం= నేను, తేషు= వాటిలో ఉన్నాను, న తేషు= వాటిలో నేను లేను.

62. ఇట్లు, అన్వయవ్యతిరేకాభ్యాం= స్ఫురించుచున్నది మరియొకప్పుడును స్ఫురించకపోవుట యును, సామరస్యములచే, యత్= నేను అను పరబ్రహ్మము, సర్వదా= త్రికాలములలో, సర్వత్ర=

అంతటను, స్యాత్= సత్వస్వరూపమగునో, అట్టి, ఏతావదేవ= ఇంతమాత్రము ఈవిషయమొక్కటియే, ఆత్మనః= పరబ్రహ్మముయొక్క, తత్త్వ జిజ్ఞాసునా= యథార్థము ఎరుంగవలయునని కోరువానిచే, జిజ్ఞాస్యాం= మననము చేయబడదగినది.

**వివరణ :** అనగా ఇచ్చుట అన్వయ వ్యతిరేక స్వరూపమును తెలియవలయును. ఎట్లనిన– వ్యావహారిక దశయందు తానని వ్యవహరించిన స్థూలదేహము స్వప్నావస్థయందు తోచక తాను తోచుచుండుట అన్వయము. అట్లు తాను తోచినను, స్థూలశరీరము తోచకపోవుట వ్యతిరేకము. స్వాప్నికావస్థయందు తానని వ్యవహరించిన సూక్ష్మదేహము సుషుప్తి అవస్థయందు తోచక తాను తోచుచుండుట అన్వయము అట్లు తాను తోచినను సూక్ష్మశరీరము తోచకపోవుట వ్యతిరేకము. సమాధి దశలో సుషుప్తి తోచక తానూ తోచుట అన్వయము. తానుతోచినను సుషుప్తి తోచకపోవుట వ్యతిరేకము. ఇట్లు అన్వయ వ్యతిరేక యుక్తులచేత తాను వ్యవహరించిన పంచకోశములను త్రోసి, కేవలాతీతమగు బ్రహ్మము నేనని దృఢతర జ్ఞాననిష్టులు తెలియుదురు. ఇట్లే బ్రహ్మ జగత్తుకు అన్వయ వ్యతిరేకములచే తాదాత్మ్యము ఎరుగవలయును. బ్రహ్మ నిర్లిప్తము. తత్ భిన్నము మిథ్య. అని తత్త్వ మస్యాది. (శ్రీమద్భాగవతము, 2వ స్కంధము, 9వ అధ్యాయం, 32,33,34,35 శ్లోకాలు.)

**శ్రీశివ ఉవాచ**

**ఏవం శ్లోకా భగవతా చత్వారశ్చ ప్రకీర్తితాః ।**
**వేధసే యే తవాగ్రే తే కీర్తితా దేవి వై మయా ॥ 63**

**ఏతే పవిత్రాః పాపఘ్నా మర్త్యానాం జ్ఞానదాయకాః ।**
**అజ్ఞాననాశనాః సద్యః కీర్తనీయా నరోత్తమైః ॥ 64**

**ఏవం దేవి త్వయా పృష్టం యథా తత్తే నివేదితమ్ ।**
**కథామారంభితా పూర్వమధునా శృణు వచ్మ్యహమ్ ॥ 65**

**తతో రామాయణం వ్యాసో విధ్వస్తం మునిభిః పునః ।**
**కృత్వైకత్ర శేషభూతం సప్తకాండమితం శుభమ్ ॥ 66**

**చతుర్వింశతి సాహస్రం రక్షిష్యతి మునిస్తదా ।**
**ఆదావంతే తతస్తస్య శ్లోకాస్తత్ర కియంతి హి ॥ 67**

**చతుర్వింశతి సాహస్రం వ్యాసస్య రచితా అపి ।**
**భవిష్యంతి గిరిజేఽగ్రే మంగళాచరణాదిషు ॥ 68**

రామాయణాన్యనేకాని పృథగగ్రే మునీశ్వరాః ।
భాగాద్భారతఖండాంతర్గతాత్కుంభోద్భవాదయః ॥ 69

కరిష్యంత్యత్ర శతశస్తాని సర్వాణి పార్వతి ।
వాల్మీకీయాద్వినా దేవి న జ్ఞేయాని మనీషిభిః ॥ 70

సారకాండం పురా దేవి యదుక్తం చ మయా తవ ।
వాల్మీకీయాచ్చ తచ్చాపి సారముద్ధృత్య వై మయా ॥ 71

నివేదితం చ హ్యధునా పృష్టం రామకథానకమ్ ।
సవిస్తారం వదస్వేతి త్వయా తస్మాన్మయోదితమ్ ॥ 72

మానం రామచరిత్రస్య శతకోటిప్రవిస్తరమ్ ।
పంచాననోఽప్యహం దేవి దివ్యైర్వర్షాబుదైరపి ॥ 73

రామాయణం సవిస్తారం వ్యాఖ్యాతుం న క్షమస్త్విహ ।
యన్నిర్మితం చ మునినా స్వతపోభిరనుత్తమమ్ ॥ 74

భగవంతునిచే ఇచట నాలుగు మహావాక్యములు నాలుగు శ్లోకములుగా చెప్పబడినవి. అని ఈ నాలుగు శ్లోకములను బ్రహ్మకు భగవంతుడు చెప్పెను. పార్వతీ! నీకు నేను వాటిని చెప్పితిని. ఇవి నాలుగు శ్లోకములును పరమపావనము, పాపపరిహారకములు, నరులకు జ్ఞానప్రదములు, అజ్ఞాన నివర్తకములు, మానవోత్తములు వెంటనే కీర్తించదగినవి. దేవీ! నీవు ఇట్లు నడుమ అడిగిన దానిని వివరించితిని. ఇక ఆరంభించిన కథను ఇప్పుడు చెప్పుచున్నాను వినుము. (65) అంత ఆ వ్యాసుడు

## ఆది రామాయణము ఖిలమైపోగా అనేక రామాయణములు ఏర్పడుట

మునులచే ఖిలమైనరామాయణమును మరలా మిగిలినవాటిని ఒక ప్రక్కచేర్చి, మంగళమగు 7 కాండలలో, 24 వేల శ్లోకములుగా కాపాడుచున్నాడు. ఆ ఇరువది నాలుగువేల శ్లోకముల ఆద్యంతములలో, మంగళాచరణాదులలో నీవల్ల, వ్యాసుని వల్లను రచింపబడిన శ్లోకములు ఎన్నియో కలుగును. మరియును అగస్త్యుడు మొదలైన మునీంద్రులు వేరువేరుగా భారత ఖండాంతర్గత భాగమునుండి నూర్లకొలది రామాయణములు రచించెదరు. అన్నియును వాల్మీకీయములే అని జ్ఞానులు ఎరుగవలయును. పార్వతీ! మునుపు సారకాండమును నీకు చెప్పితినే దానిని వాల్మీకిరామాయణ సారముగ భావింపుము. ఇపుడు నీవు రామకథను సవిస్తారముగా చెప్పుమని అడిగినందువలన దాని ప్రమాణమును నిరూపించి చెప్పితిని. రామచరిత్రకు ప్రమాణము శతకోటి ప్రవిస్తరము. నేను

ఐదు ముఖములు గలవాడనైనను, శాశ్వతుడైనను, వాల్మీకి ముని తపోమహిమవలన చెప్పబడినది అగు రామాయణమును సవిస్తారముగా వివరించి చెప్పుటకు శక్తుడను కాను.

**అతః సంక్షేపమాత్రం హి సారం సారం విగృహ్య చ ।**
**కథయిష్యామి త్వత్ప్రీత్యై యాత్రాకాండం శుభావహమ్ ॥ 75**

**రామదాసో యథాగ్రేహి విష్ణుదాసం వదిష్యతి ।**
**శతకోటిమితాన్ జ్ఞానా దృష్ట్వా చాహం తథా తవ ॥ 76**

**ఇతి శ్రీ శతకోటిరామచరితాంతర్గతే, శ్రీమదానందరామాయణే, వాల్మీకీయే, ఆదికావ్యే, యాత్రాకాండే, రామాయణవిస్తారకథనం నామ, ద్వితీయః సర్గః ॥**

దేవీ! అందువలన అందులోని సారాంశమును సర్వత్రా సంగ్రహించుకొని ఇకమీద ఎట్లు రామదాసుడు, నూరుకోట్ల శ్లోకములలో విస్తరించియున్న రామాయణమును జ్ఞాన దృష్టిచే తెలుసుకొని విష్ణుదాసునికి బోధించుచున్నాడో అట్లే నీయొక్క ప్రీతికై నేను శుభమైన యాత్రాకాండను నిరూపించు చున్నాను. (76)

(ఈ సర్గయొక్క అర్థము ఏమనగా సర్వ ఆధ్యాత్మిక సాహిత్యమునకును రామాయణమే మూలము. అనగా సకల వేద శాస్త్రపురాణములలోని సమస్త తత్త్వరహస్యములను ఆది రామాయణోక్తములనియు, సమస్త శ్లోకములన్నీ రామాయణమనెను. మొదట కలిగినదనియును తత్వవిదులు గుర్తించగలరు.)

***శతకోటిప్రవిస్తరమైన రామకథలో, శ్రీమద్వాల్మీకిమహర్షిచే రచింపబడిన, ఆనందరామాయణంలోని, యాత్రాకాండలో, రామాయణ కథయొక్క విస్తారమును వివరించు రెండవ సర్గ ముగిసినది.***



# తృతీయః సర్గః-3వ సర్గ

శ్రీరాముడు గంగ-సరయు సంగమానికి బయలుదేరుట

పార్వత్యువాచ
కో రామదాసః కుత్రస్థో విష్ణుదాసశ్చ కః స్మృతః ।
కథం వదిష్యతి గురుస్తన్మాం కథయ విస్తరాత్ ॥ 1

క్షేత్రేఽబ్జకే నృసింహాఖ్యే మునిరగ్రే భవిష్యతి ॥ 2

శ్రీశివ ఉవాచ
భారతే దండకారణ్యే గోదానాభౌ విరాజితే ।
రామనామా తు తత్పుత్రస్తచ్ఛిష్యో విష్ణురిత్యపి ।
గురుశిష్యౌ రామసేవాసక్తౌ నిత్యం భవిష్యతః ॥ 3

దాస్యత్వాజ్జానకీజానేస్తావుభౌ భూసురోత్తమౌ ।
రామదాసవిష్ణుదాసావితి లోకే పరాం ప్రథామ్ ॥ 4

గమిష్యతోఽగ్రే భో దేవి గౌతమ్యా దక్షిణే తటే ।
రామదాసః పితుః శ్రాద్ధం గయాయాం సంవిధాయ చ ॥ 5

పృథివ్యాం యాని తీర్థాని తాని గత్వా యథాక్రమమ్ ।
అధ్యాపయిష్యతిచ్ఛాత్రాన్ గోదానాభౌ గృహాశ్రమీ ॥ 6

ఏకదా విష్ణుదాసః స శ్రుత్వా నానావిధాః కథాః ।
రామదాసముఖాత్సారకాండం రామాయణోద్భవమ్ ॥ 7

## రామదాస, విష్ణుదాసుల గురుశిష్యత్వము.

శివా! ఎవడా రామదాసు? ఎచటి వాడు? విష్ణుదాసుడు ఎవరు? వానికి గురువెట్లు చెప్పుచున్నాడు? ఈ సంగతిని వివరముగా చెప్పవలెనని పార్వతి అడుగగా, పరమేశ్వరుడు ఇట్లనెను, "భారత దేశములో దండకారణ్యమున, గోదానది మధ్యలో నృసింహాఖ్య అబ్జక క్షేత్రమునందు ఒక మునీంద్రుడు గలడు. ఆ మునిపుత్రుడే 'రామ' అను పేరు గలిగినవాడు. ఆ రాముని శిష్యుడే 'విష్ణువు' అనువాడు. ఈ

గురు-శిష్యులు ఇరువురును రామసేవాసక్తులై, ఎల్లప్పుడును శ్రీసీతారామదాసులుగా ఉండుటను బట్టి, రామదాసుడని, విష్ణుదాసుడని లోక ప్రసిద్ధినందిరి. ఓ దేవీ! రామదాసు ఒకసారి గయ క్షేత్రమునకు వెళ్ళి అక్కడ తన తండ్రికి శ్రాద్ధక్రియలను నెరవేర్చి, అక్కడి నుండి బయలుదేరి భూమి పైన గల ప్రముఖ తీర్థములను సేవించి, గోదానాభి లో గృహస్థాశ్రమమును స్వీకరించి, శిష్యులకు అధ్యయనము చేయించుచుండెను. ఒకసారి విష్ణుదాసు రామదాసు ద్వారా రకరకముల కథలను, రామాయణము నందలి సారకాండను విని కుతూహలముతో, రామదాసుతో,....

**శ్రుత్వా కించిత్ ప్రష్టుమనా రామదాసం వదిష్యతి ।**
**విష్ణుదాస ఉవాచ**
**గురో తే ప్రష్టుమిచ్ఛామి తత్త్వం వక్తుమిహార్హసి ॥ 8**

**సారకాండ మయా త్వత్తః శ్రుతం రామాయణస్థితమ్ ।**
**న కించిత్సౌఖ్యలేశోఽపి జానక్యా రాఘవస్య చ ॥ 9**

**శ్రుతోఽత్ర క్వాపి రాజ్యస్య విస్తారోఽపి చ న శ్రుతః ।**
**కథం యాగాః కృతాస్తేన సంతతిస్తస్య న శ్రుతా ॥ 10**

**సుతానాం బంధుపుత్రాణాం వివాహాదికమశ్రుతమ్ ।**
**తత్సర్వం విస్తరాత్త్వత్తః శ్రోతుమిచ్ఛాఽస్తి మే గురో ॥ 11**

**తత్త్వం వద మహాభాగ రఘువీరస్య చేష్టితమ్ ।**
**రమ్యం పవిత్రమానందదాయకం పాతకాపహమ్ ॥ 12**

**శ్రీరామదాస ఉవాచ**
**సమ్యక్ పృష్టం త్వయా వత్స రామచంద్రకథానకమ్ ।**
**మంగళం రఘునాథస్య ప్రోచ్యతే యత్సవిస్తరమ్ ॥ 13**

**సావధానమనాస్త్వం తత్ శృణు పాతకనాశనమ్ ।**
**యథా శ్రుతం మయా పూర్వం తుష్ట్యర్థం తే వదామ్యహమ్ ॥ 14**

**హత్వా దశాననం రామో రాజ్యం నిహతకంటకమ్ ।**
**అయోధ్యాయాం ముక్తిపుర్యాం శశాస మతిమత్తమః ॥ 15**

న దుర్భిక్షం న చౌర్యం చ నాపమృత్యుర్న చేతయః ।
న దారిద్ర్య భయం చింతా వ్యాధయశ్చ కదాచన ॥ 16

న భిక్షార్థీ న దుర్వృత్తో న పాపాత్మా న నిష్ఠురః ।
న క్రోధీ న కృతఘ్నోఽపి రామేరాజ్యం ప్రశాసతి ॥ 17

ఏకదా జానకీ కాంతమేకాంతే ప్రాహ లజ్జితా ।
స్మితావక్త్రా చారునాసా దివ్యాలంకారమండితా ॥ 18

చామరవ్యగ్రహస్తా సా వినయావనతాననా ।
రామ రాజీవ పత్రాక్ష రావణారే మమ ప్రభో ॥ 19

విష్ణుదాసు అడుగుచున్నాడు, "స్వామీ! గురూత్తమా! మిమ్ములను అడుగ వేడెదను. తామె చెప్పుటకు తగినవారలు. రామాయణమునందలి సారకాండను మీవలన వింటిని. సీతచే రామునికి ఏయొక్క సుఖలేశమును వినలేదు. ఎచటను రాజ్యవిస్తారమును వినలేదు. పుత్రుల యొక్కయు, తమ్ముల పుత్రుల యొక్కయు వివాహాది విభవములను వినలేదు. వాటన్నిటిని విస్తారముగా మీవలన వినగోరుచున్నాను. కాబట్టి, గురువర్యా! పవిత్రమును, పరమానందప్రదమును, పాపపరిహారకమును అగు శ్రీరామ దివ్యమంగళ దివ్యచరితమును అనుగ్రహించి చెప్పవలయును". అని సంప్రార్థించెను. అందుకు రామదాసు ఇట్లు చెప్పుచున్నాడు "విష్ణుదాసా! చక్కగా అడిగితివి. మునుపు నేను వినినట్లు నీకు పుణ్యమంగళ దివ్య రామచరితమును వినిపించెదను. సావధానముగా వినుము. మహామహిమ గల శ్రీరాముడు రావణుని సంహరించిన పిదప నిష్కంటకమగు రాజ్యమును, ముక్తినగరమగు అయోధ్యను పరిపాలించుచుండెను. అపుడు దుర్భిక్షము, చౌర్యము, అపమృత్యువు ఈతి బాధలు, దరిద్రము, భయము, చింత, వ్యాధులు ఇవి ఎప్పుడును రామరాజ్యమున లేవు. రాముడు రాజ్యము ఏలుచుండగా– బిచ్చగాడు, దుష్టుడు, పాపాత్ముడు, క్రూరుడు, కృతఘ్నుడు, కోపి–ఇట్టివారు భూమిపైననే లేరు. రామకాంతయగు సీత ఒకసారి ఏకాంతమున చక్కని అలంకారముతో, నగుమోముతో– నయ, భయ, వినయ వనితయై సిగ్గుతో, చామరముతో వీచుచు, శ్రీరామచంద్రునితో, "రావణసంహారి! రాజీవాక్ష! మన్నాథా! రఘునాథా!

కించిద్విజ్ఞప్తుమిచ్ఛామి యద్యనుజ్ఞాం కరోషి హి ।
విజ్ఞాపయామి తర్హి త్వాం ధర్మమూలం మహోదయమ్ ॥ 20

తత్సీతావచనం శ్రుత్వా జానకీం ప్రాహ రాఘవః ।
హే సీతే కంజనయనే మమ ప్రాణసుఖాస్పదే ॥ 21

శీఘ్రం వదస్వ యత్తేఽస్తి చిత్తే తత్కారవాణ్యహమ్ ।
ఇతిరాఘవసమ్మానవచనైర్జనకాత్మజా ॥ 22

నితరాం తోషపూరౌఘపరిపూర్ణాఽబ్రవీత్పతిమ్ ।
శ్రీసీతోవాచ
యదా త్వం రాఘవశ్రేష్ఠ దండకం వచనాత్పితుః ॥ 23

మయా సౌమిత్రిణా సాకం పూర్వం స్వనగరాద్గతః ।
శృంగబేరపురం గత్వా జాహ్నవ్యాస్తరణే యదా ॥ 24

నౌకాయాం స్థితమస్మాభిర్భాగీరథ్యాం తదా పురా ।
సంకల్పితం మయా కించిత్తత్త్వం వక్ష్యామ్యహం ప్రభో ॥ 25

దేవి గంగే నమస్తేఽస్తు నివృత్తా వనవాసతః ।
రామేణ సహితాఽహం త్వాం లక్ష్మణేన చ పూజయే ॥ 26

సురామాంసోపహారైశ్చ నానాబలిభిరాదృతా ।
ఇత్యుక్తం వచనం పూర్వం తత్ జ్ఞాతం భవతాఽపి చ ॥ 27

తతశ్చతుర్దశే వర్షే విమానేన యదాఽఽగతమ్ ।
తదా భరత శత్రుఘ్నకౌసల్యావిరహాతురా ॥ 28

అహం తద్విస్మృతా రామ స్మృతిర్జాతాఽద్య మే ప్రభో ।
తన్మత్సం కల్పపూర్త్యర్థం గంతుమర్హసి జాహ్నవీమ్ ॥ 29

మయా మాతృబంధుభిస్త్వమితి తే ప్రార్థయామ్యహమ్ ।
రోచతే యది తే చిత్తే న త్వామాజ్ఞాపయామ్యహమ్ ॥ 30

ఇతి సీతావచః శ్రుత్వా ప్రహస్య రఘునందనః ।
సీతామాలింగ్య బాహుభ్యాం హర్షయన్తామువాచ సః ॥ 31

ఏతద్వచనచాతుర్యం కుతో జానాసి మైథిలి ।
న తత్తే వచనం దేవి గంగాం ప్రతి మమైవ తత్ ॥ 32

తాము అనుజ్ఞ ఇచ్చినట్లైతే ధర్మమూలమును, శ్రేయోనిధానపు సంగతులను కొంచెము విన్నవించెదను” అనెను. అందుకు రాముడు, “జలజాక్షి యగు జానకీ! నీ మనసులో ఉన్నదానిని త్వరగా చెప్పుము దానిని చేయుదును,” అని ప్రోత్సాహించెను. అపుడు సీతమ్మ అమందానంద భరితయై, “స్వామీ! మునుపు మీరు పితృవాక్య పరిపాలన కొరకు దండకారణ్యమునకు వెళ్ళుటకు, నాతోను, లక్ష్మణునితోను, శృంగబేరపురమునుచేరి, భాగీరథిని దాటుటకై గంగలోని పడవలో మాతోడ కూర్చుండినపుడు నేను ఒక సంకల్పము చేసితిని. నాథా! దానిని నేనిపుడు చెప్పెదను. “గంగామాతా! నీకు నమస్కారము. మేము క్షేమముగా వనవాసమునుండి తిరిగి వచ్చిన తరువాత రామ లక్ష్మణులతోడ వచ్చి, మద్య, మాంసాది నానావిధ బలి నైవేద్యములను సమర్పించి నిన్ను ఆరాధించెదను,” ఇట్లు నేను చెప్పిన మునుపటిమాటను మీరును వినియుంటిరి. అంత పదునాలుగవ సంవత్సరమున పుష్పక విమానమును ఎక్కి తిరిగి వచ్చుచున్నప్పుడు, భరత శత్రుఘ్నులును, కౌసల్యయును ఆతృతగా ఎదురు చూచుటవలన వేగమే వచ్చితిమి. అప్పుడు నేనూ మరచితిని. ఇప్పుడు జ్ఞప్తికి వచ్చినది. ఆ నా సంకల్పమును నెరవేర్చుటకై గంగాతీరమునకు నాతోను, మంత్రులతోను, బంధువులతోను మీరు రావలయునని ప్రార్థించుచున్నాను. మిమ్ము ఆజ్ఞాపించు దానను కాను,” అని పలికెను. ఆ మాటలు వినిన రాముడు తన చేతులతో సీతను తనదగ్గరకు తీసుకుని, సంతోషపరచుచూ, “జానకీ! నీవు ఈ మాటల నేర్పు ఎక్కడ నేర్చితివి? ఇది నీ మాట కాదు. గంగా మహిమ కాబోలు. దేవీ! నీ మాటమీద రేపే బయలుదేరుదాము. గంగా తీరమున ఎక్కడికి పోదలచితివో దానిని చెప్పుము,”

**వచనాత్తవ వైదేహి శ్వో గన్తా జాహ్నవీం ప్రతి ।**
**క్వ తే వాంఛాఽస్తి దయితే గంగాం గంతుం వదస్వ మే ॥ 33**

**తచ్ఛ్రుత్వా తత్ర వై స్థాతుం సేనాయోగ్య సమం మృదు ।**
**ఋజుం కర్తుం హి పంథానం దూతానాజ్ఞాపయామ్యహమ్ ॥ 34**

**తతః సీతాఽబ్రవీద్వాక్యం పునః శ్రీరామచోదితా ।**
**యత్ర గంగా చ సరయూ సంగతాఽస్తి రఘూద్వహ ॥ 35**

**తత్ర గంగోత్తరే దేశే గంతుమిచ్ఛామి మే మనః ।**
**ఇతి సీతావచః శ్రుత్వా తథేత్యుక్త్వా రఘూద్వహః ॥ 36**

**ద్వారపాలం సమాహూయ పటైరాచ్ఛాద్య జానకీమ్ ।**
**ఆజ్ఞాపయచ్చ తం రామః శీఘ్రం గచ్ఛ మమాజ్ఞయా ॥ 37**

లక్ష్మణం వచనం మే త్వం కథయస్వ సవిస్తరమ్ ।
జ్ఞాతవ్యః శ్వో మమోద్యోగః సీతాయాశ్చైవ కౌతుకాత్ ॥ 38

సరయూసంగమే గంగాపూజనార్థం త్వయా సహ ।
మాతృభిర్మంత్రిభిః సైన్యైః సుహృద్భిర్భరతేన చ ॥ 39

శత్రుఘ్నేన పురిస్థైశ్చ జనైర్విప్రైర్యథాసుఖమ్ ।
సేనానివేశస్థానాని యోజనార్ధాంతరాణి చ ॥ 40

పూరితామన్నతోయాద్యైః కల్పనీయాని వై పృథక్ ।
ఇతి రామవచః శ్రుత్వా స తథేతి త్వరాన్వితః ॥ 41

ఆజ్ఞాప్రమాణమిత్యుక్త్వా నత్వా రామం పునః పునః ।
కథయామాస సౌమిత్రిం రామవాక్యం సవిస్తరమ్ ॥ 42

తద్రామవచనం శ్రుత్వా యౌవరాజ్యపదస్థితః ।
సభాయాం మంత్రిభిర్యుక్తో లక్ష్మణో దూతమబ్రవీత్ ॥ 43

అంగీకృతం రామవాక్యమితి రామం వదస్వ తత్ ।
తచ్ఛ్రుత్వా త్వరితం దూతః కథయామాస రాఘవమ్ ॥ 44

సభాయాం లక్ష్మణశ్చాపి దూతానాజ్ఞాపయత్తదా ।
రుక్మదండకరాన్ చిత్రోష్ణీషయుక్తాన్ విభూషితాన్ ॥ 45

అని శ్రీరాముడు పలుకగా, అందుకు సీత, "నాథా! ఎచట గంగా–సరయు నదులు కలియు స్థానము మంగళప్రదమై ఉన్నదో, అట్టి గంగోత్తర ప్రదేశమునకు పోవడానికి నా మనసు ఇష్టపడు చున్నది అని విన్నవించెను. అంత శ్రీరాముడు అట్లేయని అంగీకరించి, (36)

## శ్రీరాముల తీర్థయాత్రా ప్రయాణసన్నాహము.

ద్వారపాలకుని పిలిచి, సీత తెరలో ఉండగా, ద్వారపాలకునితో– ఓయీ! నీవు పోయి, నా ఆజ్ఞను లక్ష్మణునికి విన్నవించుము. యేమనిన, "సీతాదేవి యొక్క కోరిక మేరకు రేపటిరోజున గంగ–సరయు నదుల సంగమ ప్రదేశమున గంగను ఆరాధించుటకై, సకల బంధు, మిత్ర, పరివారముతో సౌకర్యవంతముగా ప్రయాణము చేయవలయునని విన్నవించుము. దారిలో అక్కడక్కడా విశ్రమించుటకు తగిన ఏర్పాట్లను చేయునది" అని చెప్పుము, పొమ్ము అని ఆజ్ఞాపించెను. అట్లే

ఏలినవారి ఆజ్ఞ ప్రకారమని వాడు శ్రీరామునికి అడుగడుగునకును నమస్కరించుచు వచ్చి, లక్ష్మణునితో ఆ శ్రీరామ వాక్యమును విస్తారముగా విన్నవించెను. ఆ రామాజ్ఞను విని, సభలో యౌవరాజ్య పదస్థితుడై మంత్రులతో ఉన్న లక్ష్మణుడు శ్రీరామ ఆజ్ఞను శిరసా వహించెదమని, విజ్ఞాపించవలసినది," అని దూతను ఆజ్ఞాపించెను. అట్లే దూతుడు పోయి శ్రీరామునికి విన్నవించెను. పిదప లక్ష్మణుడు వెండి కఱ్ఱలను చేతపట్టి, చిత్ర విచిత్రములగు వస్త్రములను ధరించి, చక్కగా ముస్తాబై ఉన్న సేవకులను పిలిచెను.

గచ్ఛధ్వం త్వరితా యూయం కథయధ్వం జనాన్పురి ।
అయోధ్యాయాం రాఘవస్య శ్వో యాత్రార్థం సముద్యతః ॥ 46

తథేత్యుక్త్వా జవాద్దూతా రాజమార్గేషు సర్వతః ।
దీర్ఘస్వరేణ తే ప్రోచుశ్చోర్ధ్వం కృత్వాఽఽత్మసత్కరాన్ ॥ 47

హే జనాః శ్రుణుత స్వస్థాః శ్వః సీతారామయోర్ముదా ।
సముద్యోగోఽస్తి పూజార్థం సరయ్వాః సంగమం ప్రతి ॥ 48

భాగీరథ్యాం సుహృద్భిశ్చ పావరోధైర్బలైః సహ ।
ఇతి సంశ్రావ్య సకలాన్ జనాన్ సాకేత వాసినః ॥ 49

తే దూతా రాజభవనే లక్ష్మణం తం పునర్యయుః ।
సంశ్రావ్య తే జనాంశ్చారా రామోద్యోగం న్యవేదయన్ ॥ 50

సభాయాం లక్ష్మణశ్చాపి సమాహూయానుజైర్జవాత్ ।
తక్షకానిష్టికాకారాన్నృపత్కర్మసు నైష్ఠికాన్ ॥ 51

లోహకారాంశ్చర్మకారాన్ భిత్తికర్మాదినైష్ఠికాన్ ।
క్రయవిక్రయకర్తౄంశ్చ కాష్ఠనిర్జీవకారిణః ॥ 52

వాసోగృహవిదగ్ధాంశ్చ మహిషైర్జలవాహినః ।
నానాకర్మసు నిష్ణాతా రజ్జుకుద్దాలధారిణః ॥ 53

ఏతానాజ్ఞాపయామాస శోషణాద్ వసనాదిభిః ।
సమ్మానితాన్స సౌమిత్రిః కథయామాస సాదరమ్ ॥ 54

సముద్యోగం రాఘవస్య సీతాయాః శ్వో బలైః సహ ।
ఋజుర్మార్గో విధాతవ్యః సమః శర్కరవర్జితః ॥ 55

**నిమ్న భూమిః సమాకార్యా ఉచ్చా భూమిః సమాఽపి చ ।**
**ఛిద్యంతాం పర్వతా వృక్షా మార్గస్థా దుఃఖదాయకాః ॥ 56**

**వాప్యః కూపాస్తటాకాశ్చ శోధనీయాః సహస్రశః ।**
**నవీనాశ్చాపి కర్తవ్యాః సతోయా నిర్జలే వనే ॥ 57**

భటులారా! మీరు త్వరగా వెళ్ళి, అయోధ్యలోని ప్రజలకు, శ్రీరాములవారు రేపు తీర్థయాత్ర చేయుచున్నారని ప్రకటించవలసినది," అని ఆజ్ఞాపించెను. భటులు అట్లే అని వెడలి, నగరంలో అచటచట నిలిచి, "ఓ జనులారా! రేపు మన సీతారాములు సమస్త పరివారముతో గంగా-సరయు సంగమమగు మంగళాతీర్థమునకు యాత్ర వెడలుచున్నారు," అని చేతులెత్తి, గట్టిగా జనులందరికిని తెలిపి, ఆ సంగతి లక్ష్మణుని సన్నిధికి వచ్చి విన్నవించిరి. పిమ్మట సభాసీనుడగు లక్ష్మణుడు అనుచరుల వలన కొయ్యపనివారిని, రాతిపనివారిని, ఇంటికి కప్పువేయువారిని, కమ్మరులను, చర్మకారులను, గోడలను నిర్మించే నిపుణులను, వ్యాపార వర్గమును, కట్టెలు మొదలైనవాటిని తెచ్చిచ్చువారలను, గుడ్డల గుడారములను ఏర్పరుచువారలను, యనుబోతు వారలపై నీళ్ళుతెచ్చువారలను, తాళ్ళను నేయువారలను, ఇట్లు సమస్త కర్మలలోను నిపుణులగు వారిని పిలిపించిరి. అందరిని వస్త్రాభరణాదులచే గౌరవించి, సాదరముగా వారిని ఇట్లు ఆజ్ఞాపించెను "రేపు సీతారాములవారికి సకలసౌకర్యములతోను యాత్రాసన్నాహము జరుగవలసిఉన్నది. రహదారులను సమముగా ఏర్పరచి, ఇసుకలేనట్లు, చక్కబరచ వలసినది. పల్లములను పూడ్చి, మిట్టలను పడగొట్టి సమము చేయవలయును. మార్గమునకు అడ్డువచ్చు వృక్షములను ఛేదించి దారిని చక్కబరచునది. వేలకొలదిగా దారిలోని బావులను, గుంటలను, చెరువులను శోధించి చక్కబరచవలెను. క్రొత్తవిగా కొన్నిటిని చేయవలయును. చెరువులలో నీళ్ళను నింపవలయును. ఆరామడకు ఒక్కొక్క సేనాని నివేశస్థానమును కల్పించి, అచట అన్నపానాదులకు ఏ కొరతలేనట్లు సర్వవస్తువులను అందుబాటులో ఉంచగలరు.

**సేనానివేశస్థానాని యోజనార్ధే సవిస్తరే ।**
**కల్పనీయాని యుష్మాభిః పూరితాన్యన్నవారిభిః ॥ 58**

**చుల్ల్యో రమ్యావిధాతవ్యాః పాకశాలాః సభిత్తయః ।**
**వస్త్రైర్ గృహాణి కార్యాణి తృణైశ్చాపి సహస్రశః ॥ 59**

**ఆరక్తఖర్పరైరాచ్ఛాదితాని చిత్రితాని హి ।**
**నానాగృహాణి కార్యాణి పూరితాన్యన్నవారిభిః ॥ 60**

పుష్పాణాం వాటికాః కార్యాః శతశోఽథ సహస్రశః ।
మార్గే మార్గే కౌతుకార్థం భిత్తౌ చిత్రాణ్యనేకశః ॥ 61

నరస్కంధగతాశ్చిత్రవాటికాశ్చ సహస్రశః ।
పుష్పాణాం వాటికాశ్చారుమృత్పాత్రనిర్మితాః శుభాః ॥ 62

మార్గే మార్గే గాయకానాం స్థానాన్యపి సహస్రశః ।
సేనానివాసస్థానేషు హస్త్యశ్వరథవాజినామ్ ॥ 63

సహస్రశో విధాతవ్యాః శాలాః పూర్ణాస్తృణాదిభిః ।
సుగంధచన్దనైర్మార్గాః సోచనీయాః సమన్తతః ॥ 64

నేమిరేఖాఽపి సా మార్గే విచిత్రవసనైర్గృహాః ।
పుష్పైరాచ్ఛాదనీయాస్తే హట్టాః సంతు సమంతతః ॥ 65

శృంగారైరతిచిత్రైశ్చ హస్త్యుష్ట్రరథవాజినః ।
వస్త్రాలంకారఘంటాభిః శోభనీయాః సహస్రశః ॥ 66

శకటేషు తథోష్ట్రేషు వారణేషు రథాదిషు ।
శతఘ్న్యః పరిఘా బాణాః శక్తయః కార్ముకాన్యపి ॥ 67

స్థాపనీయాని శతశో విధాతవ్యా ధ్వజా అపి ।
చతుర్ష్వపి విధాతవ్యా ధ్వజా రామరథేషు హి ॥ 68

హనుమత్కోవిదారాండజేశబాణాంకితాః శుభాః ।
చతుర్ష్వపి బంధనీయాః పతాకాః స్యందనేషు హి ॥ 69

హరితశ్వేతపీతనీలవర్ణాః పరమశోభనాః ।
గజపృష్ఠే రాఘవార్థం హరిద్వర్ణాంకితాసనమ్ ॥ 70

రుక్మమాణిక్యరచితం సితచ్ఛత్రోపశోభితమ్ ।
స్థాపనీయం మహాదివ్యం ముక్తాహారవిరాజితమ్ ॥ 71

సీతార్థం కరిణీపృష్ఠే నీలవర్ణం మహాసనమ్ ।
రుక్మవిద్రుమవైడూర్య రత్నముక్తావిరాజితమ్ ॥ 72

**ముక్తాఫలహేమతంతుగణైరాచ్ఛాదితం పరమ్ ।**
**సిద్ధం కార్యం మహాదివ్యం స్వర్ణకుంభవిరాజితమ్ ॥ 73**

**పుష్పమాలాస్తోరణాని బంధనీయాని వై పథి ।**
**నృత్యంతు వారవేశ్యాశ్చ స్తుతిం కుర్వంతు వందినః ॥ 74**

పాకశాలలు, పూరిండ్లు, పెంకుటిండ్లు మొదలైన సౌకర్యములు, గృహములు వేలకొలది కట్టబడి సిద్ధముగా ఉండవలయును. వినోదాత్మకములుగా గోడలమీద చిత్రములు చిత్రించి ఉండవలయును. పుష్పవాటికలు అంతటా ఆనందకరములుగా ఉండవలయును. పూలచెట్లు మట్టితొట్టెలలో పెట్టి, మార్గములను అలంకరించవలయును. దారులలో అచటచట గాయకులకు వేదికలను ఏర్పరుచునది. సేనలు ఆగుచోట గజ, అశ్వ శాలలను గడ్డితో ఉంచవలయును. మార్గములలో పరిమళజలమును చల్లవలయును. దారిలో వస్త్రపు అంచువలె విచిత్ర వస్త్రములచే ఏర్పరచిన తాత్కాలిక గృహాలను, అంగడివీధులను, సమస్తశృంగార అలంకారములతో ఉంచవలయును. రథ, గజ, తురగములను మంచి వస్త్రములతోను, గంటలు గజ్జెలుతోను అలంకరింపవలయును. బండ్లమీదను, ఒంటెలమీదను, ఏనుగులమీదను, రథాలమీదను శతఘ్నులను, ఇనుపగట్ల గుదియలను, అమ్ములను, చిల్లకొలలను, ధనుస్సులను, విరివిగా నింపవలయును. ఆంజనేయ, కోవిదార, గరుడ బాణచిహ్నములు గల మంగళ పతాకములను, రథముల నాలుగు ప్రక్కలలోను కట్టవలెను. తెల్లని, పచ్చని, నల్లని రంగులు గల మంగళ ధ్వజములను వేయవలయును. శ్రీరాములవారికొరకు పచ్చని రంగుగల సువర్ణరత్న రంజితమైన తెల్లని గొడుగుచే అంబారీని సిద్ధం చేయవలయును. శ్రీసీతాదేవి కొరకు ఏనుగు అంబారీపై నీలవర్ణపీఠమును, బంగారముతోను వైఢూర్యములతోను, రత్నాలతోను అలంకరించ వలయును. అది బంగారు వస్త్రముచే అలంకరింపబడి ఉండాలి. దివ్యమంగళ బంగారు పూర్ణ కుంభమును సిద్ధముచేయవలయును. పూలమాలలు, తోరణములు అలంకరింపవలయును. వారకాంతలు నర్తనము చేయవలయును. వందిమాగదులు స్తుతించుచుండవలెను.

**ద్రవ్యైర్వస్త్రైరాభరణైః పూజాద్రవ్యైశ్చ గోరసైః ।**
**పాత్రైర్నానావిధైర్దివ్యైః పూరణీయా రథోత్తమాః ॥ 75**

**అన్యచ్చాపి మయా నోక్తం యద్యద్యోగ్యం హి తత్పథి ।**
**సిద్ధం కార్యం హి యోగేన యేన తుష్యతి రాఘవః ॥ 76**

**ఇతి సందిశ్య మేధావీ లక్ష్మణః సహ మంత్రిభిః ।**
**సాయం సంధ్యాదికం కర్తుం జగామ నిజమందిరమ్ ॥ 77**

సౌమిత్రేరాజ్ఞయా తేఽపి తథా చక్రుర్యథోదితాః ।
సంతుష్టాస్తే యథాయోగ్యం రామసంతోషహేతవే ॥ 78

రామోఽపి సీతయా సార్ధం మందిరే రత్ననిర్మితే ।
మంచకే పుష్పశయ్యాయాం సీతామాలింగ్య వై దృఢమ్ ॥ 79

రుక్మనేపథ్యయుక్తాభిర్దాసీభిశ్చ ముహుర్ముహుః ।
వీజితో వాలవ్యజనైర్నిశి సుప్తః సుఖం తదా ॥ 80

**ఇతి శ్రీశతకోటిరామచరితాంతర్గతే, శ్రీమదానందరామాయణే, వాల్మీకీయే, ఆదికావ్యే, యాత్రాకాండే, దూతాజ్ఞావర్ణనం నామ, తృతీయః సర్గః ॥**

దివ్యపరిమళ సద్వస్తువులను రథములలో నింపుకొనుడు. ఇంకా నేను చెప్పినదానికి తగిన సమస్త వస్తువులను అందరును సిద్ధపరచుకుని బయలుదేరండి. సర్వవిధములుగాను శ్రీరాముని ఆనందమే ముఖ్యము అని ఆజ్ఞాపించెను. నిపుణుడగు లక్ష్మణుడు మంత్రులతో సాయంసంధ్యా అనుష్ఠానమునకు తన మందిరమునకు వెళ్ళెను. వారందరును లక్ష్మణుని ఆజ్ఞను స్వీకరించి, శ్రీరాముని ఆనందము కొరకు పనులను నెరవేర్చుచుండిరి. శ్రీరాముడు సీతాదేవితో సుందర మందిరమున రత్నపు మంచములపై పూలపాన్పుమీద సీతతో పవ్వళించి, బంగారు తెరలనడుమ అడుగడుగుకును దాసీజనులు, చామరముల వీవనలతో వీచుచుండగా, ఆ రాత్రి శృంగార స్వారాజ్య అనుభవమున సుఖనిద్రను పొంది, ఆనందించెను.

***శతకోటిప్రవిస్తరమైన రామకథలో, శ్రీమద్వాల్మీకిమహర్షిచే రచింపబడిన, ఆనందరామాయణంలోని, యాత్రాకాండలో, దూతలను ఆజ్ఞాపించుట అను మూడవ సర్గ ముగిసినది.***



# చతుర్థః సర్గః-4వ సర్గ

## శ్రీరాముడు సరయూ-గంగ నదులను కలుపుట

శ్రీరామదాస ఉవాచ

తతః ప్రాతః సముత్థాయ శ్రుత్వా వాద్యధ్వనిం తథా ।
గాయనం వందిభిర్గీతం సీతయా సహ రాఘవః ॥ 1

కృత్వా నిత్యవిధిం సర్వం దత్వా దానాని విస్తరాత్ ।
జ్యోతిర్విదం సమాహూయ గోపాలాభిధముత్తమమ్ ॥ 2

నమస్కృత్వాఽథ సంపూజ్య గణకం రాఘవోఽబ్రవీత్ ।
భో గోపాల మహాబుద్ధే త్వాం పృచ్ఛేఽహం ద్విజోత్తమ ॥ 3

### శ్రీరాములవారు తీర్థయాత్రలు చేయుట.

రామదాసు చెప్పుచున్నాడు- అంతట తెల్లవారుఝాముననే సీతతోడ శ్రీరాముడు మేల్కొని, మంగళవాద్య ధ్వనులను, వంది మాగదుల స్తుతులను విని, నిత్యకృత్యములనన్నిటిని నిర్వర్తించి, విప్రులకు విరివిగా దానములను చేసి, గోపాల అను పేరుగల దైవజ్ఞులను పిలిచి, నమస్కరించి, సత్కరించి, అతనితో, "బుద్ధిమంతులగు గోపాల దైవజ్ఞా!

యాత్రార్థం జాహ్నవీతీరం గంతుమిచ్ఛామి సాంప్రతమ్ ।
అతో ముహూర్తో దాతవ్యః సమ్యక్‌బుద్ధ్యా వివిచ్య చ ॥ 4

తద్రామవచనం శ్రుత్వా గోపాలః ప్రాహ రాఘవమ్ ।
పంచాంగపట్టం విస్తార్య తత్ర దృష్ట్వా బలాబలమ్ ॥ 5

రామ రాజీవపత్రాక్ష ముహూర్తస్త్వాద్య వర్తతే ।
పూర్వయామే మహాన్‌శ్రేష్ఠః పుష్యనక్షత్రమండితః ॥ 6

తస్య వక్ష్యే ఫలం రాజన్ సావధానమనాః శృణు ।
శృణ్వంతు మునయః సర్వే శృణోతు తే గురుర్మహాన్ ॥ 7

న యోగయోగం న చ లగ్నలగ్నం
న తారకాచంద్రబలం గురోశ్చ ।
యోగిన్య రాహుర్న తదైవ కాలే
సర్వాణి కార్యాణి కరోతి పుష్యః ॥ 8

అస్మిన్నామ సునక్షత్రే ప్రస్థానం కురు సీతయా ।
దత్తో మయా ముహూర్తోఽయం యాత్రార్థం రఘునాయక ॥ 9

ఇతి తస్య వచః శ్రుత్వా లక్ష్మణం రాఘవోఽబ్రవీత్ ।
భేరీమృదంగపణవకాహలాऽऽనక గోముఖైః ॥ 10

తాలఘర్ఘరదుందుభిశ్చైభిశ్చ నవభిర్మహాన్ ।
సేనాయాః సూచనార్థం హి కర్తవ్యః ప్రథమో ధ్వనిః ॥ 11

తథేతి రామవచనాద్దూతానాజ్ఞాపయత్తదా ।
నవ వాద్యధ్వనిం తేఽపి చక్రుర్మంజుల సుస్వరమ్ ॥ 12

తతో రామో ద్విజైర్యుక్తో వసిష్ఠేన పురోధసా ।
ఘృతేన ప్రచురం శ్రాద్ధం గణేశాదీన్ ప్రపూజ్య చ ॥ 13

చకార ప్రోక్తవిధినా వసిష్ఠం ప్రాహ వై తతః ।
అగ్నిహోత్రాణి మేఽగ్రే త్వం స్థాపితాని తు పుష్పకే ॥ 14

నేతుమర్హసి మే మాతౄర్బంధుభిః పురవాసినః ।
విమానే కరణీబద్ధ్వా పుష్పమాలాऽతిశోభితా ॥ 15

మేము గంగాయాత్ర చేయుటకు ఒక మంచిముహూర్తమును చూడండి," అని అడిగెను. దైవజ్ఞుడు వెంటనే పంచాఙ్గపుస్తకమును జూచి, అచట బలాబలమును పరిశీలించి, "రాజీవాక్షుడవగు రామా! నేడే పూర్వయామమున శ్రేష్ఠమైన ముహూర్తము గలదు. అది పుష్యమీనక్షత్ర మండితము. దాని ఫలమును చెప్పెదను వినుము. రాజా! "రాజులందరును విననీ, మీ గురువు ఆలకించు గాక! యోగము చేరి రానక్కరలేదు. లగ్నము సంధించనక్కరలేదు. వేరొక నక్షత్రము వలదు. అనగా తారాబలమెందుకు? చంద్రబలము వలదు. గురుబలము వలదు. యోగినీ దిగ్గ్రాహు ఎట్లున్ననేమి?" అనగా పైన చెప్పినవాటిలో ఏదియున్నను, ఏదిలేకపోయినను, ప్రయాణ సమయమున పుష్యమీ

నక్షత్రము సమస్తకార్యములను చేయును. కావున ఇట్టి నక్షత్రమున ముహూర్తమును పెట్టించి యున్నాను. సీత తోడ సుఖముగా ప్రయాణము చేయవచ్చును." అని దైవజ్ఞులు పలుకగా శ్రీరాముడు లక్ష్మణునితో, "భేర్యాది నవ మహావాద్యములచే, సేనాసన్నాహమునకై ప్రథమ ధ్వనిని చేయించుము," అనెను. అట్లే అని లక్ష్మణుడు ఆ దూతలను ఆజ్ఞాపించగా వారు మహామంగళ వాద్యఘోషములను ఒనరించిరి. అంత ఆ శ్రీరాముడు బ్రాహ్మణసమేతుడై వశిష్ఠులతోడ నేతితో నాందీ శ్రాద్ధమును ఆచరించి, విధి విధానముగా గణేశాది దేవతలను ఆరాధించి, వసిష్ఠులవారితో, "స్వామీ! నాముందర అగ్నిహోత్ర ములను పుష్పకవిమానమున స్థాపించుకుని, నా తల్లులతోడను, తమ్ములతోడను, నాగరికులతోడను విమానమున కూర్చుండి, మమ్ము తీసుకొనిపోవుటకు తగిన వాడవు. అరణి సంబంధములగు పూలదండలచే సీత అలంకృతయగు గాక.

**సీతాంగస్పర్శనీ మార్గే మాం స్పర్శతు గజస్థితమ్ ।**
**తతః పప్రచ్ఛ వైదేహీం కేన యానేన మైథిలి ॥ 16**

**గమిష్యసి వద త్వం మాం తదేవాజ్ఞాపయామ్యహమ్ ।**
**తద్రామవచనం శ్రుత్వా సీతా ధ్యాత్వా క్షణం హృది ॥ 17**

**సా ప్రాహ ముదితా రామం కరిణ్యా గమనం మమ ।**
**రోచతే యది తే చిత్తే తర్హ్యస్తు రఘునాయక ॥ 18**

**తత్తస్యా వచనం శ్రుత్వా యానమాజ్ఞాప్య లక్ష్మణమ్ ।**
**సీతాయై దివ్యవస్త్రాణి దదౌ మాతృస్తథైవ చ ॥ 19**

**తథా దత్వా బంధుపత్నీర్దత్వా చాపి గురోః స్త్రియమ్ ।**
**తతో దత్వా వసిష్ఠం చ విప్రాన్ దత్వా తతః పరమ్ ॥ 20**

**దత్వా వస్త్రాణి బంధుభ్యః స్వయం జగ్రాహ రాఘవః ।**
**బద్ధ్వా శస్త్రాణ్యనేకాని త్వరయిత్వా విదేహజామ్ ॥ 21**

**నత్వా మాతౄర్గురుశ్చాపి మంత్రిభిః పరివారితః ।**
**ఆరుహ్య శిబికాం రామః సభాం ప్రతి సమాయయౌ ॥ 22**

**తతః సింహాసనే స్థిత్వా లక్ష్మణం ప్రాహ రాఘవః ।**
**ద్వితీయః సూచనార్థం హి నవవాద్యధ్వనిః పునః ॥ 23**

ఆజ్ఞాపనీయః సౌమిత్రే తత్ శ్రుత్వా రాఘవేరితమ్ ।
ఆజ్ఞా ప్రమాణమిత్యుక్త్వాఽఽజ్ఞాపయద్ధ్వనిముత్తమమ్ ॥ 24

కర్తుం దూతాస్తేఽపి చక్రుర్ధ్వనిం మేఘోపమాం తతః ।
తతః ప్రాహ రఘుశ్రేష్ఠః పునః సౌమిత్రిమాదరాత్ ॥ 25

సుమంత్రః స్థాప్యతాం పుర్యాం రక్షణార్థం మమాజ్ఞయా ।
గచ్ఛత్వగ్రే తు భరతో పశ్చాదాయాతు శత్రుహా ॥ 26

మత్పృష్ఠే త్వం సమాగచ్ఛ తతః సీతాఽనుగచ్ఛతు ।
తస్యాః పృష్ఠే చ త్వత్పత్నీహ్యూర్మిళా సానుగచ్ఛతు ॥ 27

తత్పృష్ఠే మాండవీ రమ్యా దయితా భరతస్య సా ।
అనుగచ్ఛతు తత్పృష్ఠే శ్రుతకీర్త్యానుగచ్ఛతు ॥ 28

"సీత తనను తాను తాకి, గజముపై ఉన్న నన్నూ స్పృశించును గాక,'' అని చెప్పి, పిదప సీతను జూచి, "దేవీ! యే వాహనమును ఎక్కదలచావో చెప్పుము? దానినే ఆజ్ఞాపించెదను," అని అడిగెను. అందుకు సీత కొంచెము ఆలోచించి, ఆనందముగా, "నాథా! నీకు ఇష్టమైన ఆడఏనుగుమీద ఎక్కి ప్రయాణము చేయవలయును," అనెను. పిదప రాముడు అట్లేఅని లక్ష్మణునిని ఆజ్ఞాపించి, సీతకును తల్లులకును, తమ్ముల పత్నులకును, గురుపత్నులకును, గురువులకును, బంధువులకును, బ్రాహ్మణులకును వరుసగా వస్త్రాదులను ఇచ్చి, తానూ స్వీకరించి, ఆయుధములను కట్టుకుని, సీతను త్వరపరచి, గురువులకు, తల్లులకు నమస్కరించి, మంత్రులతోడ సభాభవనమునకు వచ్చి, సింహాసనాసీనుడై లక్ష్మణునితో, "ఇక సేనాసన్నివేశ సూచనకై నవవాద్య ధ్వనిని రెండవసారి చేయింపుము," అని ఆజ్ఞాపించెను. సౌమిత్రియును అట్లే అని దూతలను ఆజ్ఞాపించెను. వారు అట్లేచేసిరి. పిమ్మట శ్రీరాముడు మరలా లక్ష్మణునితో, "నా ఆజ్ఞగా నగర రక్షణకు సుమంత్రుని ఇక్కడే ఉంచుము. మొదట భరతుడు బయలుదేరవలయును, శత్రుఘ్నుడు వెనుక అనుసరించవలయును, నా వెంబడి నీవును, నీ వెనుక సీతయును, సీత వెనుక నీ సతీ మూర్తులను వారి వెనుకు భరతపత్ని మాండవియును, ఆమె వెనుకు శత్రుఘ్న సహధర్మచాణి శ్రుతకీర్తియును వరుసగా ప్రయాణించ వలయును.

శత్రుఘ్నస్య ప్రియా భార్యా విమానః పురయోషితః ।
మాతృభిస్తాః సమాయాం తు పశ్యంతః కౌతుకం ముదా ॥ 29

సీతాద్యాః కరిణీష్వద్యస్థాపయిత్వా మమాంతికమ్ ।
ఆగంతవ్యం త్వయ శీఘ్రం తతోఽహం గజమాశ్రయే ॥ 30

తథేతి రామవచనాత్తథా తాః కరిణీషు సః ।
ఆరోపయిత్వా శ్రీరామం సమాగచ్ఛత్త్వరాన్వితః ॥ 31

సమాగతం లక్ష్మణం తం దృష్ట్వా రామో మహామనాః ।
సుమంత్రాయ దదౌ వస్త్రం తదధీనాం పురీం వ్యధాత్ ॥ 32

తతో ముహూర్తసమయే ధృత్వా లక్ష్మణసత్కరమ్ ।
సింహాసనాత్సముత్తీర్య మహానాగాంతికం యయౌ ॥ 33

గజం ప్రదక్షిణం కృత్వా సోపానేన స రాఘవః ।
గజదంతోద్భవే నారురోహ నాగం సుఖం శనైః ॥ 34

తదా దుందుభినిర్ఘోషాన్ నవవాద్యస్వరాన్ వరాన్ ।
వాదయామాసుర్గభీరాన్ గజదూతాః సహస్రశః ॥ 35

బభూవుర్యంత్రశబ్దాశ్చ ననృతుర్వారయోషితః ।
వాదయంతి స్మ వాద్యాని గజవాజిరథోపరి ॥ 36

జయశబ్దాన్ వేదఘోషాన్ ద్విజాశ్చక్రుర్మహాస్వనైః ।
కేఽపి పిచ్ఛోద్భవం చిత్రం రత్నదండవిరాజితమ్ ॥ 37

చామరం వీజయామాస విజయః పార్శ్వసంస్థితః ।
అన్యస్తు వాలవ్యజనం బీజయామాస పృష్ఠతః ॥ 38

కలశైః శతసాహస్రైర్ముక్తాహారైస్తు శోభితమ్ ।
రత్నదండం సువిస్తీర్ణం ఛత్రమన్యో దధార తత్ ॥ 39

తత్పృష్ఠే గజమారుహ్య లక్ష్మణః శీఘ్రమాయయౌ ।
సీతాద్యాస్తాః సమాజగ్ముః సౌమిత్రిగజపృష్ఠతః ॥ 40

పశ్యంతః కౌతుకాన్యేవ జాలరంధ్రైః సమంతతః ।
పుష్పకం చాపి గగనమార్గేణైవ శనైః శనైః ॥ 41

**జగామ సంస్థితాస్తత్ర పురనార్యో రఘూత్తమమ్ ।**
**పశ్యంత్యోఽథ కౌతుకాని వవర్షుః పుష్పవృష్టిభిః ॥ 42**

**తతస్తే తురగారూఢా గజారూఢా రథే స్థితాః ।**
**నేమిరేఖోపమాః సర్వే స్థితాస్తే రామపార్శ్వయోః ॥ 43**

**చక్రుః ప్రణామాన్ శ్రీరామం సంస్థితా హారబంధవత్ ।**
**రామోఽపి కంజహస్తాభ్యాం ప్రణామానభ్యనందయత్ ॥ 44**

విమానములలో పురస్త్రీలు తల్లులతో ఆనందిస్తూ, దాని వేడుకలను చూచుచు రావలసినది. నీవందరిని వారివారి వాహనములపై ఎక్కించి రమ్ము. నేనును గజమును ఆరోహించెదను,” అని చెప్పగా లక్ష్మణుడు అట్లేయని అందరిని ప్రయాణమునకు సర్వసంసిద్ధులుగా జేసి, త్వరగా వచ్చెను. అంత శ్రీరాముడు సుమంత్రునికి వస్త్రాలంకారములతో కూడి అయోధ్యను అప్పగించి, సుముహూర్త సమయమున లక్ష్మణుడు చేతిని అందివ్వగా శ్రీరాముడు సింహాసనము నుండి లేచి, భద్రగజమువద్దకు వచ్చి, దానికి ప్రదక్షిణముచేసి, ఏనుగు దంతములతో తయారైన మెట్ల మీదుగా దానిని ఎక్కి అలంకరించెను. అపుడు మావటీలు వేలువేలుగా దుందుభి ఘోషలను నవవాద్య ధ్వనులను గంభీరముగా చేయుచుండిరి. యంత్రములు మ్రోగుచుండెను. వారకాంతలు నాట్యముచేయుచుండిరి. రథ, గజ, తురగారూఢులై వాద్యగాండ్రు వాద్యములను వాయించుచుండిరి. విప్రులు వేదఘోషలతో జయ శబ్దములను పలుకుచుండిరి. విజయుడు నెమలి కన్నులచే ఏర్పరచిన రమ్యమగు రత్నదండ చామరము ఒక ప్రక్కన వీచుచుండెను. వెనుక ఒకడు చామరమును వీచుచుండెను. మరియొకడును ముక్తాహారములతోను, రమ్యకలశములతోను రారాజించుచుండు రత్నదండ శ్వేత ఛత్రమును పట్టెను. ఇట్లు యథోక్తక్రమముగా అందరును వారివారి వాహనములను ఎక్కి వెడలిరి. గగనమున పుష్పకము తిన్నగా వచ్చుచుండెను. అందులోనున్న పౌర స్త్రీలు శ్రీరామునిమీద అచటి వేడుకలను చూచుచు, పూలవానకురిపించిరి. రథ, గజ, తురగములను ఎక్కినవారు ఇరువైపులా వరుసగా ఉండి నమస్కరించిరి. ఆ సన్నివేశము పూలబంతి గట్టినట్లు ఉండెను. శ్రీరాముడును చేతులెత్తి వారి ప్రణామాలను ఆదరించుచుండెను. (44)

**ఏవం గచ్ఛతి రాజేంద్రే రామచంద్రే శనైః పథి ।**
**గజోపరి సవీణాస్తే నటా గానం ప్రచక్రిరే ॥ 45**

**ఏవం పశ్యన్ స రామోఽపి పుష్పారామాదికౌతుకమ్ ।**
**హట్టాన్ చిత్రాణి వేశ్యానాం నృత్యాని వివిధాని చ ॥ 46**

సుస్వరాణ్యథ వాద్యాని శృణ్వన్ మార్గే శనై శ్శనైః ।
వేష్టితశ్చతురంగిణ్యా సేనయా స సమంతతః ॥ 47

ప్రాప సేనానివాసాయ కల్పితాం భువముత్తమామ్ ।
అయోధ్యామివ తాం దృష్ట్వాఽవతరద్రాఘవో గజాత్ ॥ 48

అభినంద్య ప్రణామాంశ్చ పునర్వీరకృతాన్ ముహుః ।
లక్ష్మణస్య కరం ధృత్వా స్వకరేణ రమాపతిః ॥ 49

వస్త్రగేహం సంప్రవిశ్య తస్థౌ సింహాసనే పునః ।
సీతా ద్యాస్తాః స్త్రియః సర్వా వివిశుర్వస్త్రసద్మని ॥ 50

తతః శ్రీరామచంద్రోఽపి లక్ష్మణం వాక్యమబ్రవీత్ ।
సీమాయాః క్రోశమాత్రేఽద్య శతదూతాన్ పృథక్ పృథక్ ॥ 51

ఏకైకస్యాం దిశి త్వం మే వచనాత్ స్థాపయస్వ భోః ।
యోజనోపరి సౌమిత్రే త్వష్టదిక్షు సమంతతః ॥ 52

నియోజయస్వ శతసో వాజివాహాన్ మమాజ్ఞయా ।
తథేత్యుక్త్వా లక్ష్మణోఽపి తథా సర్వం చకార సః ॥ 53

తతో విప్రైః సుహృద్భిశ్చ వివిధాన్నైర్మనోరమైః ।
ఘృతేన శ్రాద్ధశేషేణ భోజనం రాఘవోవ్యధాత్ ॥ 54

తాంబూలైర్దక్షిణాం దత్వా నానావిప్రేభ్య ఆదరాత్ ।
ముఖశుద్ధిం స్వయం కృత్వా తస్థౌ సింహాసనే పునః ॥ 55

శ్రుత్వా శాస్త్రపురాణాని వేదాంతాంశ్చాపి సాదరమ్ ।
సాయంసంధ్యాదికం కృత్వా హుత్వా హోమం యథావిధి ॥ 56

సింహాసనే సమాసీనో వేశ్యానాం నృత్యముత్తమమ్ ।
పశ్యన్ శృణ్వన్ గాయనం చ నీత్వా యామద్వయం నిశామ్ ॥ 57

తతః సుష్వాప పర్యంకే సీతయా సహ రాఘవః ।
ద్వితీయే దివసే తత్ర స్థిత్వా రామస్తు కౌతుకైః ॥ 58

## శ్రీ సీతారాములు దారిలో అచటనచట విశ్రమించుట.

ఇట్లు శ్రీరాముడు రాజ్యవైభవములతో తిన్నగా దారిలోపోవునపుడు ఏనుగులమీద నటులు వీణలువాయించుచు, గానములను ఆరంభించిరి. శ్రీరాముడును పుష్పరామాది వినోదములను చిత్రములగు అంగడివీధులను, వారాంగనా వివిధ నర్తనములను చూచుచు, సుస్వర వాద్యములను వినుచు, తినతిన్నగా చరుతంగసేన చుట్టూ వచ్చుచుండగా, అయోధ్యవలే ఏర్పరచబడియున్న సేనా సన్నివేశస్థానములను జూచి, అచట వీరులు చేయు ప్రణామంబులను ఆదరించి, సముచిత మర్యాదలతో లక్ష్మణుడు తన చేతిని అందివ్వగా శ్రీరాముడు ఏనుగు అంబారీ నుండి దిగి, వసతి గృహ మందిరమున ప్రవేశించి, వైభవముగా అచట సింహాసనముపై కూర్చుండెను. సీతాదులందురును వస్త్రగృహములలో ప్రవేశించిరి. అంత ఆ రామచంద్రుడు లక్ష్మణునితో, "అంతట ప్రతిదిక్కులోను క్రోశడు దూరమున వేర్వేరుగా నూరునూరుమంది దూతలను స్థాపింపుము, ఎనిమిది దిక్కులలోను ఆమడదూరమున అంతట నూర్లకొలది గుఱ్ఱపు రౌతులను నిలుపుము" అని ఆజ్ఞాపించెను. అతడు అట్లేఅని నెరవేర్చెను. అంత శ్రీరాముడు బ్రాహ్మణులతోను, మిత్రులతో నేతితో చేసిన వివిధ అన్నపానాది ఆహారములను భుజించి, సాదరముగా అక్కడి విప్రులకు తాంబూల దక్షిణలను సమర్పించి, తానూ తాంబూలమును స్వీకరించి, మరలా సింహాసనాసీనుడై వేదశాస్త్రార్థ విచారములతో కొంతసేపు సల్లాపగోష్ఠిలో ఉండి, సాయంసంధ్యాది అనుష్ఠానమును నిర్వర్తించి, అగ్నిహోత్ర కర్మలను ఆచరించి, రాత్రి వేళ నృత్యగీతాది వినోదములనంది, సీతతోడ సుఖ సంతృప్తుడై మరునాడు అచటనే వేడుకలలో వసించెను.

నీత్వాసమగ్రం సుదినం తృతీయే దివసే పునః ।
పూర్వవద్వాద్య ఘోషాద్యైః శనైః స్థానాంతరం యయౌ ॥ 59

క్వచిద్దినమతిక్రమ్య క్వచిద్ద్వే త్రీణిరాఘవః ।
స్థిత్వా పశ్యన్ కౌతుకాని రంజయన్ జనకాత్మజామ్ ॥ 60

శనైః శనైర్యయౌ మార్గే మాసేనైకేన రాఘవః ।
ప్రాప జీర్ణం ముద్గలేన త్యక్తమాశ్రమముత్తమమ్ ॥ 61

రామమాగతమాజ్ఞాయ ముద్గలో నూతనాశ్రమాత్ ।
భాగీరథ్యా దక్షిణతః ప్రాప రామాంతికం తదా ॥ 62

తం దృష్ట్వా రాఘవశ్చాపి నత్వా సంపూజ్య సాదరమ్ ।
వాసోగేహే సమాసీనం పప్రచ్ఛ వినయాన్మునిమ్ ॥ 63

త్వయాఽయమాశ్రమస్త్యక్తః కిమర్థం మునిసత్తమ ।
తత్త్వం వద మహాభాగ యథావచ్చ సవిస్తరమ్ ॥ 64

తద్రామవచనం శ్రుత్వా ముద్గలో వాక్యమబ్రవీత్ ।
అద్య ధన్యోఽస్మ్యహం రామ నివృత్తం వనవాసతః ॥ 65

యత్త్వాం పశ్యామి నేత్రాభ్యాం చిరకాలేన రాఘవ ।
భరతప్రాణరక్షార్థం యదా నీతా మమాశ్రమాత్ ॥ 66

దివ్యౌషధ్యస్తదా జాతం పూర్వం తే దర్శనం మమ ।
మయాఽయమాశ్రమస్త్యక్తః కిమర్థం తద్బ్రవీమి తే ॥ 67

సాన్నిధ్యం నాత్ర గంగాయాః సరయ్వా అపి నాత్ర వై ।
ఇతి మత్వా మయా త్యక్తశ్చాశ్రమోఽయం మహత్తమః ॥ 68

అత్ర సిద్ధిం గతాః పూర్వం శతశోఽథ సహస్రశః ।
మునీశ్వరా మయాప్యత్ర తపస్తప్తం కియద్దినమ్ ॥ 69

ఇతి రామ సమాఖ్యాతమాశ్రమస్య చ మోచనే ।
కారణం చ త్వయా పృష్టం కిమగ్రే శ్రోతుమిచ్ఛసి ॥ 70

తన్మునేర్వచనం శ్రుత్వా పునస్తం ప్రాహరాఘవః ।
కిం కృత్వా తేఽత్ర వసతిర్భవిష్యతి మునేర్వద ॥ 71

తద్రామవచనం శ్రుత్వా రాఘవం ప్రాహ ముద్గలః ।
యద్యత్ర సరయూనద్యాః సంగమో హి భవిష్యతి ॥ 72

జాహ్నవ్యా తర్హ్యహం చాత్రం వత్స్యే రామ యథాసుఖమ్ ।
తత్తస్య వచనం శ్రుత్వా రాఘవః ప్రాహ తం పునః ॥ 73

మరలా, మూడవనాడు యథాపూర్వముగా సమస్త వైభవములతో ముందుకు ప్రయాణము సాగించెను. కొన్ని చోట్ల ఒకనాడు, కొన్నిచోట్ల రెండు మూడు రాత్రులను, ఇట్లు దారిలో సముచితముగా నిలచి, నిలచి, సీతకు మార్గవినోదములను ఎన్నిటినో చూపుచు ఒకనెల ప్రయాణముచేసెను. (60)

## శ్రీరాములవారు ముద్గలాశ్రమమున ప్రవేశించుట.

ఇట్లు వచ్చుచు జీర్ణమగు ముద్గలమునిచే విడువబడిన దివ్యాశ్రమమున ప్రవేశించెను. ముద్గలుడు శ్రీరాములవారు విచ్చేసిన సంగతిని తెలుసుకుని, నూతన ఆశ్రమమునుండి వచ్చి, గంగకు దక్షిణముగా ప్రయాణించి రామ సాన్నిధ్యమును పొందెను. అపుడు శ్రీరాముడు మునీంద్రునిజూచి, నమస్కరించి, సాదరముగా సంపూజించి, పర్ణశాలలో సుఖాసీనుడగు ఆ మునితో సవినయముగా, "మునీంద్రా! నీవు ఈ ఆశ్రమమును ఏల వదలితివి? దాని యథార్థమును నాకు చక్కగా తెలుపుము." అని అడిగెను. అందుకు ముద్గలుడు, "స్వామీ! నేడు నేను ధన్యుడనైతిని. బహుకాలమునకు నీ దర్శనము లభించినందున వనవాసమునుండి నివృత్తుడుగా ఉన్నాను. మునుపు భరతుని ప్రాణరక్షార్థము దివ్య ఔషధులు ఈ ఆశ్రమమునుండి సేకరించినపుడు మీ దర్శనము కలిగినది, అందువల్ల నేను ఈ ఆశ్రమమును విడిచితిని." అనెను.

**కిమర్థం సరయూః శ్రేష్ఠాః కుతః ప్రాప్తా ధరాతలమ్ ।**
**తత్త్వం వద మహాభాగ సవిస్తారం మమాగ్రతః ॥ 74**

**తద్రామవచనం శ్రుత్వా ముద్గలో వాక్యమబ్రవీత్ ।**
**తవైవ చరితం రామ మన్ముఖాచ్ఛ్రోతుమిచ్ఛసి ॥ 75**

**తర్హి తే సంప్రవక్ష్యామి తచ్ఛృణుష్వ రఘూత్తమ ।**
**శంఖాసురో మహాన్ దైత్యో వేదాన్ పూర్వం జహార హి ॥ 76**

**క్షిప్త్వా తాంశ్చ సముద్రే హి స్వయమాసీన్మహోదధౌ ।**
**తదర్థం చ త్వయా మాత్స్యం వపుర్ధృత్వా మహత్తరమ్ ॥ 77**

**హతః శంఖాసురో వేదాస్త్వయా దత్తాస్తు వేధసే ।**
**తతో మార్గేణ మహతా పూర్వరూపం త్వయా ధృతమ్ ॥ 78**

**తదా హర్షేణ నేత్రాత్తే పతితాశ్చాశ్రుబిందవః ।**
**హిమాలయే తతో జాతా నదీ పుణ్యా శుభోదకా ॥ 79**

**సాక్షాన్నారాయణస్యైవ ఆనందాశ్రుసముద్భవా ।**
**శనైర్బిందుసరః ప్రాప తస్మాచ్చ మానసం యయౌ ॥ 80**

ఏతస్మిన్నంతరే రామ పూర్వజస్తే మహత్తమః ।
వైవస్వతో మనుర్యష్టుముద్యుక్తో గురుమబ్రవీత్ ॥ 81

అనాదిసిద్ధాఽ యోధ్యేయం విశేషేణాపి వై మయా ।
రచితా నిజవాసార్థమత్ర యజ్ఞం కరోమ్యహమ్ ॥ 82

యది తే రోచతే చిత్తే తచ్ఛ్రుత్వా గురురబ్రవీత్ ।
అత్ర తీర్థం వరం నాస్తి నాస్తి శ్రేష్ఠా మహానదీ ॥ 83

యద్యత్రైవాస్తి తే చిత్తం యష్టుం నృపతిసత్తమ ।
ఆనయస్వ నదీం రమ్యాం మానస్పాతకాపహామ్ ॥ 84

తద్గురోర్వచనాద్రాజా మనుర్వైవస్వతో మహాన్ ।
టణత్కృత్య మహచ్చాపం సందధే శరముత్తమమ్ ॥ 85

స శరో మానసం భిత్వా తస్మాన్నిష్కాస్య తాం నదీమ్ ।
అయోధ్యామానయామాస పంథానం దర్శయన్నివ ॥ 86

శరమార్గానుసారేణాయోధ్యాయాం ప్రాప వై నదీ ।
మహోదధౌ పూర్వదేశే మిలితా రఘునందన ॥ 87

ఇది గంగాతీరము కాదు. ఇచట సరయూనదియును లేదు. అయినా ఇచట అనేకమంది మునీంద్రులు తపస్సిద్ధిని పొందిరి. నేనును కొంతకాలము ఇచట తపమును చేసితిని. నీవు అడిగిన సంగతిని తెలిపితిని. ఇంకను ఏమి వినగోరుదువు," అని పలికెను. మరలా శ్రీరాముడు, "మహర్షీ! నీకిచట ఏమిచేసిన సుఖవసతి కలుగును? చెప్పుము" అని అడిగెను. అందుకు ముద్గలుడు "ఇచట గంగా –సరయు సంగమమైనచో నేను ఇచటనే యథాసుఖముగా వసించెదను." అనెను. ఆమాట వినిన రాముడు, "మహాత్మా! సరయూనది ఎందువల్ల శ్రేష్ఠమైనది? ఇది భూమికి ఎట్లు వచ్చినది? ఆసంగతిని చక్కగా చెప్పుము," అని అడిగెను (74) ఆ మాట విని ముద్గలుడు శ్రీరామునితో, "స్వామీ! నీ చరిత్రమునే నా ముఖమునుండి వినగోరుచున్నావు. దానిని సంక్షేపముగా చెప్పెదను వినుము.

## ముద్గలుడు సరయు ఉత్పత్తిని తెలుపుట.

"మునుపు శంఖుడను మహా రాక్షసుడు వేదములను అపహరించి కొనిపోయి సముద్రమున జల్లి, తానూ సముద్రమధ్యమున ఉండెను. దాని కొరకు నీవు మత్స్యరూపమును ధరించి, శంఖాసురుని

చంపి, ఆ వేదములను తీసుకువచ్చి, బ్రహ్మదేవునికి ఇచ్చితివి. అపుడు నీవు పూర్వరూపమును పొంది, ఆనందించుచుండగా నీ ఆనందాశ్రుబిందువులు హిమాలయమున పడెను. అంత అచటనుండి అవి పుణ్యజలములు గల మహానదిగా ఏర్పడెను. అది సాక్షాత్ నారాయణుని ఆనందాశ్రు సముద్భవముగా తిన్నగా బిందు సరస్సునుచేరి, అక్కడనుండి మానస సరోవరము చేరెను. అంతలో మీ పూర్వులగు వైవస్వత మనువు యజ్ఞముచేయ సంకల్పించి తన గురువుతో, "ఈ అయోధ్య అనాది సిద్ధమైనది. నేనును దీనిని విశేష రాజధానిగా చేసుకుంటిని. మీకు ఇష్టమైనచో ఇచట యజ్ఞమును ఆచరించెదను." అని ప్రార్థించగా అందుకు గురువుగారు, "ఇచట మంచి తీర్థములేదు, మహానదియును లేదు. ఇచటనే యజ్ఞముచేయ ఇచ్ఛకలిగియుండిన నీవు మానససరోవరమునుండి పాపములను పటాపంచలు చేయు మహానదిని తీసుకొనిరమ్ము." అని చెప్పెను. ఆ గురువాజ్ఞను విని, వైవస్వతుడు ధనుష్టాంకారముజేసి బాణమును ప్రయోగించెను. అది పోయి మానస సరోవరమును భేదించి, అందుండి విడదీసి, ఆ నదిని అయోధ్యకు దారిచూపుదానివలే ఈడ్చుకొని వచ్చెను. ఆ నది శర మార్గమును అనుసరించి అయోధ్యకు వచ్చి తూర్పు సముద్రములో కలిసెను. శరముచే తేబడిన నది గనుక అది 'శరయు' అని చెప్పబడును.

**ఆనీతా సా శరేణైవ శరయూశ్చేతి కథ్యతే ।**
**సరోవరాత్సముద్భూతా సరయూశ్చేతి కేచన ॥ 88**

**తతో భగీరథేనేయం కపిలక్రోధవహ్నినా ।**
**వినిర్దగ్ధాన్ పూర్వజాన్ వై సాగరాన్ ప్రేషితుం దివమ్ ॥ 89**

**భాగీరథీ సమానీతా త్వత్పాదాబ్జసముద్భవా ।**
**తపసా శంకరం తోష్య సరయ్వా మిలితాఽథ సా ॥ 90**

**వరదానాత్కలౌ శంభోర్గంగా ఖ్యాతిం గమిష్యతి ।**
**అగ్రే సాగరపర్యంతమేనాం గంగాం వదంతి హి ॥ 91**

**తవ పాదసముద్భూతా యా విశ్వం పాతి జాహ్నవీ ।**
**ఇయం తు నేత్ర సంభూతా కిమద్యాగ్రే వదామ్యహమ్ ॥ 92**

**కోటివర్షసహస్రైశ్చ కోటివర్షశతైరపి ।**
**మహిమా సరయూనద్యాః కోఽపి వక్తుం న వై క్షమః ॥ 93**

ఇతి రామ సమాఖ్యాతం యథా పృష్టం త్వయా మమ ।
మునేస్తద్వచనం శ్రుత్వా లక్ష్మణం ప్రాహ రాఘవః ॥ 94

సరయూమానయస్వాత్ర శరం ముక్త్వా మమాజ్ఞయా ।
తథేతి రామవచనాద్ధృత్వా చాపం స లక్ష్మణః ॥ 95

శరం ముక్త్వా తటం భిత్వా శరయూమానయత్ క్షణాత్ ।
సరయూ సా ద్విధా భూత్వా ముద్గలాశ్రమ మాయయౌ ॥ 96

జాహ్నవ్యా మిలితా సాపి తాం దృష్ట్వా రాఘవోఽబ్రవీత్ ।
అత్ర స్థిత్వా లక్ష్మణేన దారితేయం మహానదీ ॥ 97

అతో దద్రీతి నామ్నాఽత్ర నగరీ ఖ్యాతిమేష్యతి ।
దద్రీయం జగతీమధ్యే బదర్యాశ్చ యవాధికా ॥ 98

భవిష్యతి న సందేహస్తవ వాసాద్విశేషతః ।
తత స్సీతాం సమాహూయ రాఘవో వాక్యమబ్రవీత్ ॥ 99

ముద్గలస్యాశ్రమేఽత్రైవ సా నీతా సరయూర్నదీ ।
పశ్య సౌమిత్రిణా ముక్త్వా శరం మన్నామచిహ్నితమ్ ॥ 100

నారీ భిర్మాతృభిః సీతే పుష్పకేణాతిభాస్వతా ।
వృద్ధా సా సరయూర్యత్ర సంగతాఽస్తి మహానదీ ॥ 101

జాహ్నవ్యా సంగమం త్వం హి గచ్ఛస్వ గురుణా ద్విజైః ।
పూజయిత్వా సవిస్తారం యథోక్తం వచనం పురా ॥ 102

ఆగచ్ఛస్వ తతః శీఘ్రమత్ర త్వం మమ సన్నిధౌ ।
విశేషాన్ముద్గలస్యాపి సన్నిధావద్య వై పునః ॥ 103

నవీనసరయూనద్యా భాగీరథ్యాస్తు సంగమే ।
పూజనం త్వం మయా సాకం కర్తుమర్హసి మైథిలీ ॥ 104

తథేతి రామవచనమంగీకృత్య విదేహజా ।
పూజాసంభారమాదాతుం వివేశ వసనగృహమ్ ॥ 105

**ఇతి శ్రీశతకోటిరామచరితాంతర్గతే, శ్రీమదానందరామాయణే, వాల్మీకీయే, ఆదికావ్యే, యాత్రాకాండే, సరయూద్విధాకరణం నామ, చతుర్థః సర్గః ॥**

సరోవరమునుండి పుట్టివచ్చినది గాన 'సరయు' అని కొందరిచే చెప్పబడెను. అంతట భగీరథునివలన నీ పాదారవిందముల వద్ద ఉద్భవించిన గంగ, కపిల మహర్షి క్రోధాగ్నికి దగ్ధమైన మీ పూర్వులైన సాగరులను దివమునకు పంపుటకు తేబడెను. ఆ భగీరథుడు తపస్సుచే శంకరుని ఆరాధించి, సంతుష్టునిజేసి గంగను భూమిపై ప్రవహింపజేసి, సరయూనదిలో కలిపెను. శివ వర మహిమచే కలిలో గంగానది ఎంతో ప్రఖ్యాతినొందును.

మున్ముందు సాగర పర్యంతము దీనినే గంగయని చెప్పుదురు. నీ పాదములలో ఉద్భవించిన జాహ్నవినది లోకపావనిగా ఉన్నది. ఈ సరయు నీ కంటినుండి పుట్టినది. దీని మహిమను నీ ఎదుటనేమి చెప్పగలను? నూరు కోట్లసంవత్సరములైనా, వేయికోట్లవత్సరములైనా సరయు మహిమను అభివర్ణించుటకు ఒక్కడును సమర్థుడు గాడు. శ్రీరామా! నీవడిగిన విషయమును నిరూపించితిని," అని ముద్గలముని మౌనము పూనెను. (93) ముని వాక్కులను విని శ్రీరాముడు, "లక్ష్మణా! నీవు నా ఆజ్ఞచే బాణమును ప్రయోగించి, శరయూనదిని ఇచ్చటికి గొనిరమ్ము." అని సౌమిత్రిని ఆజ్ఞాపించెను. అట్లేయని రామాజ్ఞానుసారముగా లక్ష్మణుడు ధనుర్ధారియై శరమును విడిచి, తత్ క్షణమే శరయును వెంటదెచ్చెను. ఇట్లు శరయు రెండుగా చీలి ముద్గలాశ్రమమును చేరెను. అదియునుపోయి గంగతో కలిసికొనెను. దానినిచూచి రాముడు, "ఇచట నిలిచి లక్ష్మణుడు సరయును చీల్చెను గాన ఈ చోట 'దద్రి' అను పేర ఒక నగరము ఏర్పడి ఖ్యాతినొందును. జగమున ఈ 'దద్రి' బదరికన్నను ఒక వీశం అధికముగా కలదు. ముద్గలుడా! నీవు ఇచట వసించుటవలన ఇంకను విశేషమగును, అని ఆనతిని ఇచ్చి, సీతను పిలచి, "దేవీ! చూడుము ఇచటనే ముద్గలాశ్రమమున నా పేరు కలిగిన శర(బాణ)మును లక్ష్మణుడు ప్రయోగించి, శరయును తెచ్చెను. నీవు స్త్రీలతోను, తల్లులతోను, గురువులను వెంటబెట్టుకుని పుష్పకవిమానమును ఎక్కి, వృద్ధసరయు-గంగ సంగమ స్థానమునకు పోయి, వెనుక నీవు అడిగినట్లు అచ్చట గంగను ఆరాధించి, త్వరగా ఈ నవీన సరయూ గంగ సంగమ ప్రదేశమున విశేషముగా ముద్గల సన్నిధిలో గంగను నాతో పూజించెదవు గాక. పోయి రమ్ము" అని ఆజ్ఞాపించెను. (104)

***శతకోటిప్రవిస్తరమైన రామకథలో, శ్రీమద్వాల్మీకిమహర్షిచే రచింపబడిన, ఆనందరామాయణంలోని, యాత్రాకాండలో, సరయు-గంగ సంగమమనే నాలుగవ సర్గ ముగిసినది.***

# పంచమః సర్గః-5వ సర్గ

కుంభోదరుని వృత్తాంతము

శ్రీరామదాస ఉవాచ
తతో గృహీత్వా సంభారాన్ పూజార్థం జానకీ జవాత్ ।
కౌసల్యాదిశ్వశ్రుభిస్తు పుష్పకం చారురోహ సా ॥ 1

క్షణేన వృద్ధా సరయూర్యత్ర సా గంగయా శుభా ।
సంగతాఽస్తి మహాశ్రేష్ఠా తత్ర ప్రాప విదేహజా ॥ 2

## సీత వృద్ధసరయు-గంగ సంగమాలను ఆరాధించివచ్చుట.

అంత ఆ జానకీదేవి పూజోపకరణములను సిద్ధముజేసుకుని, కౌసల్యాదులతో పుష్పక విమానమును ఎక్కెను. ఆ పుష్పకము క్షణమాత్రమున వృద్ధ సరయూనది-గంగానది సంగమస్థానమైన దివ్య స్థానమునకు చేరెను.

పతిం వినాఽగ్నినా నారీ సీమాముల్లంఘ్య న వ్రజేత్ ।
స దోషోఽత్ర న విజ్ఞేయః సీతాయాత్ర విహాయసా ॥ 3

ఉత్తీర్య సా విమానాగ్ర్య న్నమస్కృత్వాఽథ సంగమమ్ ।
పురోధసా చోదితా సా నారికేళం సవాయనమ్ ॥ 4

భాగీరథ్యై సమర్ప్యాథ స్నాత్వా చైవ యథావిధి ।
సంగమం పూజయామాస చోపస్కారైర్యథావిధి ॥ 5

సురామాంసోపహారైశ్చ పక్వాన్నైర్బలిభిస్తథా ।
పట్టకూలాదిభిర్వస్త్రైర్ముక్తాహారైః సచందనైః ॥ 6

దివ్యైరాభరణైశ్చిత్రైర్వాయనాద్యైః సవిస్తరమ్ ।
తతః సువాసినీః పూజ్య పూజయిత్వా త్వరుంధతీమ్ ॥ 7

వసిష్ఠం బ్రాహ్మణాంశ్చాపి భోజయామాస విస్తరైః ।
పట్టకూలాదిభిర్వస్త్రైర్దివ్యైరాభరణాదిభిః ॥ 8

సువాసినీర్బ్రాహ్మణాంశ్చ తోషయామాస మైథిలీ ।
స్వయం కృత్వోపహారం చ రాఘవార్థముపోషితా ॥ 9

యయౌ యానేన శీఘ్రం సా రాఘవస్యాంతికం ముదా ।
తతః శ్రీరామచంద్రోఽపి సీతయా గురుణా ద్విజైః ॥ 10

గంగయోః సంగమే చక్రే పూజనం స యథావిధి ।
యథా కృతం చ వైదేహ్యా తస్మాచ్చాపి శతాధికమ్ ॥ 11

తతః సహస్రశో విప్రాన్ భోజయామాస సాదరమ్ ।
దత్త్వా దానాన్యనేకాని గోహస్తిరథవాజినామ్ ॥ 12

తతో భుక్త్వా స్వయం రామః సీతయా బంధుభిర్జనైః ।
సింహాసనే సమాసీనో సౌమిత్రిమిదమబ్రవీత్ ॥ 13

జ్ఞాతవ్యో మమ వాసోఽత్ర రాత్రీర్నవ రఘూత్తమ ।
సమాచారాన్ కురుష్వ త్వం శాసనం యన్మయోచ్యతే ॥ 14

బ్రహ్మచారీ గృహస్థో వా వానప్రస్థాశ్రమీ యతిః ।
యః కశ్చిద్వా సమాయాతి పథికః స మమాజ్ఞయా ॥ 15

అగ్నిని, పతిని వదలి స్త్రీలు పొలిమేర్లు దాటరాదు. అను నియమాన్ని ఇచట ఎంచవలదు. వెంటనే సీత విమానమును దిగి, గంగకు నమస్కరించి, పురోహిత ఆజ్ఞానుసారముగా ఫల వాయనమును గంగకు అర్పించి, తానూ స్నానముచేసి, యథావిధానముగా నదీసంగమమును ఆరాధించెను. సుర, మాంస, ఉపహారాధులను, పక్వాన్న బలులను, పట్టు వస్త్రములను, రత్నాలు ముత్యాలతో కూడిన ఆభరణములను, సువాసనలనిచ్చే చందనాదులను గంగాదేవికి సమర్పించెను. అట్లే అరుంధతి మొదలగు సువాసినులను సంపూజించి, వసిష్ఠాది బ్రాహ్మణులకు దివ్యమైన భోజనాదులతో సత్కారములను జరిపెను మరియు బ్రాహ్మణులకును ముత్తైదువులకును పుష్పగంధ, తాంబూల, ఆభరణ, దక్షిణాదులను తృప్తిగాఇచ్చి, వారిని తృప్తిపరచెను. తానును ఉపహారమును అంగీకరించి, శ్రీరామునికై ఉపవాసముగానే విమానమునెక్కి, శ్రీరామ సన్నిధికి వచ్చి చేరెను. (9)

## సీతారాములు గంగాసంగమానికి పూజలుచేయుట.

ఇట్లు సంతోషముగా వచ్చిన సీతను, వసిష్ఠాదులను, కౌసల్యాదులను వెంటబెట్టుకొని శ్రీరాముడు

నవీన సరయూ–గంగా ప్రదేశమున, సీత వృద్ధశరయు–గంగా సంగమమున చేసిన వైభవములకన్నా నూరింతలు అధికముగా పూజించి, గో, గజ, తురగ, రథాది మహాదానములను అనేకములుగా ద్విజులకు సమర్పించి, వేలకొలది బ్రాహ్మణులకు అన్నసమారాధన చేయించి, తానూ సకల పరివారముతోడ భుజించి, సంతోషముగా సింహాసనాసీనుడైన లక్ష్మణునితో, "తమ్ముడా! ఇక ఇచట నాకు తొమ్మిది రాత్రులు నివాసము నిశ్చయింపబడినది. ఇచట మనఎల్లలో ఇట్లు నా శాసనమును నిరూపింపుము. బ్రహ్మచారి గాని, గృహస్థుగాని, వానప్రస్థుగాని, యతిగాని ఎవ్వడైనను సరియే, బాటసారిని నా ఆజ్ఞచే పట్టి తీసుకుని రావలసినది. వారు నాచే సత్కరింపబడక ముందుకు పోకూడదు.

**మయా సంపూజితో నైవ గంతుం దేయః సమన్తతః ।**
**మయాऽదృష్టో గతః కశ్చిత్తదా వః శాసనం మమ ॥ 16**

**తద్రామవచనం శ్రుత్వా తథా చక్రే స లక్ష్మణః ।**
**చ్యవనో మునివర్యస్తు జ్ఞాత్వా రామం సమాగతమ్ ॥ 17**

**దర్శనార్థం యయౌ శీఘ్రం రామేణాపి సుపూజితః ।**
**స్త్రీత్వాసనే వస్త్రగేహే రాఘవం వాక్యమబ్రవీత్ ॥ 18**

**రామ రాజీవపత్రాక్ష గంగయా దక్షిణే తటే ।**
**ఆశ్రమః కీకటే దేశే మమాస్తి పరమః శుభః ॥ 19**

**కందమూలఫలార్థం హి విఘ్నం కుర్వంతి మాగధాః ।**
**మమాశ్రమే రాజదూతాస్తేభ్యో రక్షా విధీయతామ్ ॥ 20**

**చ్యవనస్య వచః శ్రుత్వా టణత్కృత్య మహద్ధనుః ।**
**బాణం ముక్త్వాऽऽశ్రమాత్తస్య పరితః పరిఖోపమామ్ ॥ 21**

**చకార రేఖాం బాణేన దుష్టైర్గంతుం చ హ్యక్షమామ్ ।**
**రామబాణకృతా రేఖా యత్ర తత్ర పురీశుభా ॥ 22**

**రామరేఖేతి నామ్నాऽऽసీత్తథా చైవ మహానదీ ।**
**చ్యవనశ్చ తతో హృష్టో రాఘవం వాక్యమబ్రవీత్ ॥ 23**

**నింద్యః స కీకటో దేశో వర్తతే రఘునందన ।**
**తవ వాక్యాద్భవిష్యన్తి తత్ర పుణ్యస్థలాని హి ॥ 24**

తర్హి త్వయాఽద్య వక్తవ్యం వచనం మే సుఖాస్పదమ్ ।
తన్మునేర్వచనం శ్రుత్వా వాక్యం రామస్తమబ్రవీత్ ॥ 25

కీకటేషు గయా పుణ్యా నదీ పుణ్యా తు పునఃపునా ।
ఆశ్రమస్తే మహాపుణ్యః పుణ్యం రాజవనం వరమ్ ॥ 26

భవిష్యతి న సందేహో మమవాక్యాన్మునీశ్వర ।
చ్యవనస్తేన సంతుష్టో రామం దృష్ట్వాఽఽశ్రమం యయౌ ॥ 27

ఏతస్మిన్నంతరే తస్య సత్రే రామేణ నిర్మితే ।
ప్రత్యహం కోటిశో విప్రా భుజంతి యతిభిః సహ ॥ 28

కుంభోదరో మునిః ప్రాగాత్సీమాచారంతికం ముదా ।
గంగాయాత్రాప్రసంగేన గయాం గంతుం సముద్యతః ॥ 29

నన్ను చూడక ఎవ్వరైనను ఇటువెళ్ళినా నా ఆజ్ఞ మీరినట్లే" అని చండశాసనము చేసెను. (16) రామాజ్ఞానుసారముగా లక్ష్మణుడట్లే నెరవేర్చెను.

## కీకటదేశము పుణ్యప్రదమగుట.

ఇట్లుండగ శ్రీరాముని ఆగమన వార్త విని, చ్యవనుడను మునీంద్రుడు శ్రీరామ దర్శనమునకై త్వరగావచ్చి, గుడారమున సుఖాసీనుడై సత్కరింపబడి, శ్రీరామునితో, "రాజీవాక్షుడవగు రామచంద్రా! గంగకు దక్షిణ తీరమునందలి 'కీకట' దేశమున నా పుణ్యాశ్రమము పావనముగా ఉన్నది. ఆ నా యాశ్రమమున కందమూల ఫలాదులకై మాఘాదులగు దూతలు వచ్చి వానిని ధ్వంసము చేయు చున్నారు, వారి నుండి రక్షణ కల్పించవలసినది" అని కోరగా ఆ మాటను వినిన శ్రీరాముడు ధనుష్టంకార పురస్సరముగా బాణమును ప్రయోగించి, ఆ మునియొక్క పుణ్యాశ్రమమునకు అంతట అంచు కట్టినట్లు రేఖను ఏర్పరచెను. ఆ రేఖను దుష్టులు దాటుటకు అశక్యముగా ఉన్నది. ఎచట రామరేఖ రక్షణగా ఏర్పడినదో అది 'రామరేఖ' అను పేరుతో మంచి పట్టణముగా ఏర్పడెను. అట్లే దానిలో ఒక మహానది కలిగెను. అంత సంతసించిన చ్యవనుడు శ్రీరామునితో, "రఘునందనా! ఇంతవరకు ఆ 'కీకట' దేశము మిక్కిలి నింద్యముగా ఉన్నది. నీమాటవలన అచట పుణ్యస్థలములు ఏర్పడవలెను కదా! గనుక నీవు శుభవచనమును నాకు చెప్పవలయును," అని వేడెను. అందుకు శ్రీరాముడు, "కీకట దేశమున గయ పుణ్యస్థలమును 'పునఃపునా' నదియును కలుగునని, నీ ఆశ్రమము పరమపవిత్రముగా ఉండునని, రాజవనమును, వరవనమును పుణ్యకరము అగును. నా మాటవలన

పై విషయములకు సంశయములేదు.” అని మునిని కీర్తనీయునిజేసెను. చ్యవనుడును రామాజ్ఞనొంది, తన ఆశ్రమమునకు వెళ్ళెను. అచట రాముని సత్రమున ప్రతిదినమును కోట్లకొలది బ్రాహ్మణులు యతులతోడ భుజించుచుండిరి. (28) ఇట్లుండ ఒకరోజు కుంభోదరుడు అను మునియొకడు గంగాయాత్ర చేయుచు ప్రయాగనుండి గంగకువచ్చు దారిలోని వినోదములను చూచి,

సమాగతః ప్రయాగాచ్చ దూతాన్ దృష్ట్వాऽబ్రవీద్వచః ।
హే దూతా ఉత్తరం దేయం యూయం కస్యాజ్ఞయా స్థితాః ॥ 30

ఆకాశచుంబినశ్చిత్రా ఇమేऽగ్రే కస్య వై ధ్వజాః ।
హనుమత్కోవిదారాండజేశబాణాంకితాః శుభాః ॥ 31

శ్వేతనీలహరిత్పీతవర్ణాః పరమశోభనాః ।
దృశ్యంతేऽగ్రే పతాకాశ్చ శ్రూయతే జయనిఃస్వనః ॥ 32

తత్తస్య వచనం శ్రుత్వా దూతాః ప్రోచుస్త్వరాన్వితాః ।
రామో రాజీవపత్రాక్షోऽయోధ్యాయాః పాలకః ప్రభుః ॥ 33

సోऽగ్రే యాత్రార్థమాయాతో వయం తస్యాజ్ఞయా స్థితాః ।
సత్రమన్నస్య రామేణ నిర్మితం చాత్ర వర్తతే ॥ 34

క్షుధార్తస్త్వం సుఖం గచ్ఛ భుక్త్వా పీత్వా సుఖం వ్రజ ।
తత్తేషాం వచనం శ్రుత్వా పరివృత్య మునిః పునః ॥ 35

ఆగతో యేన మార్గేణ తేన మార్గేణ సంయయౌ ।
గచ్ఛంతం తం మునిం దృష్ట్వా రామదూతాస్త్వరాన్వితాః ॥ 36

రుద్ధ్వా మార్గం మునేస్తస్య వచనం ప్రోచురాదరాత్ ।
కిమర్థం త్వం పరావృత్య మునే గచ్ఛసి వై పునః ॥ 37

ఆగతోऽసి యథా యేన తేనైవ త్వం వదస్వ నః ।
ఇతి తేషాం వచః శ్రుత్వా నిర్బంధాన్మునిరప్యసౌ ॥ 38

తూష్ణీం స్థిత్వా క్షణం ధ్యాత్వా నిశ్చయం కృతవాన్ హృది ।
ఇదానీం రాఘవోऽయోధ్యాం యాత్రాం కృత్వా గమిష్యతి ॥ 39

నానాదేశేషు సర్వత్ర నృణాం తద్దర్శనం కథమ్ ।
భవిష్యతి తథాஉన్యత్ర రామతీర్థాని భూతలే ॥ 40

భవిష్యంతి కథం నృణాం మహత్పాపహరాణి చ ।
కథం రామేశ్వరా భూమ్యాం భవిష్యంతి గతిప్రదాః ॥ 41

## కుంభోదరుడు శ్రీరామసత్కారమును నిరాకరించుట.

కుంభోదరుడు అచటి దూతలతో, "ఓ దూతలారా! ఎవరియాజ్ఞమీద మీరు ఇచట ఉన్నారు? తెల్లని హనుమత్ ధ్వజమును, నల్లని కోవిదార ధ్వజమును, గరుత్మంతుని బొమ్మను చిత్రించిన ధ్వజమును, పీతవర్ణ బాణధ్వజమును చిత్రముగా ఆకాశమున రెపరెపలాడుచున్నవి. ఈ పతాకములు ఎవరివి? జయనాదములు వినబడుచున్నవే?" అని అడుగగా , ఆ దూతలు త్వరపడి, "స్వామీ! అయోధ్యను ఏలుచుండు రాజీవాక్షుడగు రాముడు యాత్రార్థమువచ్చి ఉండగా, వారి ఆజ్ఞను అనుసరించి మేము ఇచట ఉన్నాము. ఇచట శ్రీరామునిచే నడుపబడుతున్న అన్నసత్రము గలదు. ఆకలి గొన్న నీవు సుఖముగా భుజించి, పానీయములు త్రాగి సంతోషముగా పోవచ్చును," అని ప్రార్థించిరి. ఆ మాట వినుచూనే ఆ ముని ఎట్లు వచ్చెనో అట్లే మరలివెడలెను. పోవుచున్న మునినిజూచి, రామదూతలు త్వరపడి ఆ ముని మార్గమును అడ్డగించి, ఎంతో ఆదరముగా మునీంద్రా! మీరేల మరలా వచ్చిన దారినిబట్టిపోవుచున్నారు? ఎట్లు వచ్చితిరో అట్లే మాటలాడండి. ఆగ్రహింపవలదు," అని వేడుకొనిరి. అందుకు అతడు కొంతసేపు ఊరకయుండి, ధ్యానించి, తన మనమున– 'ఇప్పుడు రాముడు యాత్రలనుజేసి, అయోధ్యకుపోవుచున్నాడు. దేశములోని వివిధ ప్రాంతవాసులకు శ్రీరామ దర్శనమెట్లుకలుగును? మరియు అన్ని చోట్లను శ్రీరామతీర్థములు కలిగి, నరుల పాపములు ఎట్లు పరిహరించును? మరియు అంతట ముక్తినిచ్చు రామేశ్వర స్థానములు ఎట్లు ఏర్పడును? అని ఆలోచించెను.

అతః కించిత్కరోమ్యద్య యేన రామస్తు భూతలే ।
యాత్రోద్దేశేన సర్వత్ర సీతయా సహ యాస్యతి ॥ 42

అనేన లోకశిక్షాஉపి భవిష్యతి న సంశయః ।
ఇతి నిశ్చిత్య స మునిః ప్రాహ దూతాన్స్మయన్నివ ॥ 43

దూతాః శ్రుణుత మే వాక్యం హతో యేన దశాననః ।
బ్రహ్మపుత్రో బంధుపుత్రైః న కృతం తీర్థ సేవనమ్ ॥ 44

తథా యజ్ఞాః కృతో నైవ తస్యాన్నం నాహిమశ్నియామ్ ।
దీయతాం మమ మార్గో హి భవద్భిర్వచనం మమ ॥ 45

కథనీయం రాఘవాయ యాత్రాయజ్ఞాన్ కరిష్యతి ।
ఇతి తస్య వచః శ్రుత్వా విస్మయావిష్టమానసాః ॥ 46

దత్వా మార్గం శాపభీత్యా దూతా రామాంతికం యయుః ।
రామం నత్వా శనైస్తస్య కర్ణే వృత్తం న్యవేదయన్ ॥ 47

రాఘవోఽపి మునేస్తస్య జ్ఞాత్వాఽభిప్రాయముత్తమమ్ ।
సర్వం వృత్తం సభామధ్యే చకార సస్మితః స్ఫుటమ్ ॥ 48

మంత్రిభిర్బంధుభిశ్చైవ వశిష్ఠేన పురోధసా ।
మంత్రయిత్వా మునేర్వాక్యం సత్యం మేనే రమాపతిః ॥ 49

తతో నిశ్చితవాన్ రామః సభామధ్యే పురోధసా ।
ఆదౌ కార్యా తీర్థయాత్రా యజ్ఞాః కార్యాస్తతః పరమ్ ॥ 50

తతో రామాజ్ఞయా దూతా గత్వాఽయోధ్యాం పురీం ప్రతి ।
తద్వృత్తం చ సవిస్తారం సుమంత్రాయ న్యవేదయన్ ॥ 51

సుమంత్రోఽపి చ తద్వృత్తం శ్రుత్వా వస్త్రధనాని చ ।
ఉష్ట్రాశ్వరథనాగాద్యైః ప్రేషయామాస సాదరమ్ ॥ 52

పుష్పకం చ తదా ప్రాహ రామః శక్తిస్తవాస్తి హి ।
యద్యప్యద్య గిరా మే త్వం శీఘ్రమేవ యథాబలమ్ ॥ 53

ఉష్ట్రాశ్వరథనాగాద్యైర్నివాసం చ తవోదరే ।
కరిష్యతి సవిస్తారం తథా విస్తీర్ణతాం భజ ॥ 54

కనుక శ్రీరాముడు సీతతో అన్ని ప్రాంతాలలోను యాత్రచేసివచ్చునట్లు ఒక చిన్నపనిచేసెదను. ఇందువలన లోకులను కూడా శిక్షించినట్లు అగును. ఇందు సంశయములేదు– అని నిశ్చయించుకుని, నవ్వుచు దూతలను ఉద్దేశించి, "భటులారా! వినుడు. బ్రహ్మపుత్రుడగు రావణుని చంపిన శ్రీరాముడు తమ్ములతోను, కుమారులతోను తీర్థయాత్ర చేయలేదు. యజ్ఞములను ఆచరించలేదు. అట్టివాని అన్నమును నేను తినను. నా దారిన నేను పోవుదును. ఈ సంగతిని మీరు శ్రీరామునికి చెప్పండి.

అతడు యాత్రాయజ్ఞములను ఒనర్చును," అని అనగా, ఆ కుంభోదరుని వచనములను వినిన, దూతలు శ్రీరామ సన్నిధికి వచ్చి నమస్కరించి, సంగతిని సర్వము విన్నవించిరి. (47) శ్రీరాముడును ఆ మునీంద్రుని ఆశయమును గ్రహించుకుని చిరునవ్వుతో సభామధ్యమున సర్వ వృత్తాంతమును మంత్రులును, పురోహితుడును, వసిష్ఠుడును వినుచుండగా చెప్పి, ముని కుంభోదరుని మాటలను ఆలోచించి, "మొదట తీర్థయాత్ర ఆచరించవలయును, పిదప యజ్ఞమును ఆచరించవలయను," అని నిర్ణయించెను. అంత శ్రీరామాజ్ఞచే దూతలుపోయి, అయోధ్యలో ఉన్న సుమంత్రునికి విషయమును విన్నవించిరి. సుమంత్రుడు సంగతిని చక్కగా గ్రహించి- ఒంటెలు, ఏనుగులు, బండ్లు గుఱ్ఱములు మొదలైనవాటిపై ధన, కనక, వస్త్రాది సర్వసామాగ్రులను సాదరముగా పంపించెను. శ్రీరాముడు పుష్పకవిమానమునుజూచి, "నీకు మోయుటకు చక్కగా శక్తికలదుగదా? అయినా ఇప్పుడు నా మాట వలన త్వరగా నీ బలముండునంతవరకు రథములు, ఏనుగులు, గుఱ్ఱములు, ఒంటెలు, ఆవులు నీ భాగమున నివాసము కల్పింపుము. సవిస్తారముగా అవి సంచరించునట్లు సేవింపుము అనెను.

**సర్వేషాం భారవాహార్థం శక్తిరస్తు యథాసుఖమ్ ।**
**కస్మిన్కాలే సూక్ష్మరూపం మహద్రూపం కదాపిచ ॥ 55**

**యథాకామా మయా శక్తిస్తవ దత్తా న సంశయః ।**
**తచ్ఛ్రుత్వా రామవచనం పుష్పకం దశయోజనమ్ ॥ 56**

**సమంతతస్తథోచ్చం హి వ్యవర్ధత ద్వియోజనమ్ ।**
**శతాట్టాలైశ్చ సోపానైః హేమరత్నోద్భవైశ్చితమ్ ॥ 57**

**కోటిసూర్యప్రతీకాశం నానాధాతువిచిత్రితమ్ ।**
**కలశైః శతసాహస్రైఃహేమరత్నవిఘట్టితైః ॥ 58**

**జాలరంధ్రైర్గవాక్షైశ్చ ముక్తాహారైర్విభూషితమ్ ।**
**కవాటైర్దర్పణోద్భూతైర్జలయంత్రశతైర్వృతమ్ ॥ 59**

**పుష్పాణాం వాటికాభిశ్చ నానాపక్షినినాదితమ్ ।**
**సర్వమస్తకజా యత్ర శతశోఽథ సహస్రశః ॥ 60**

**నిశాయాం మణయశ్చిత్రాః ప్రభా విస్తారయంతి హి ।**
**గోపురాణి చ భాసంతే శతశోఽథ సహస్రశః ॥ 61**

తత్ర ప్రాథమికాయాం తు పంక్తౌ శ్రీరాఘవాజ్ఞయా ।
ఉష్ట్రాశ్వరథనాగాదీన్ దూతాశ్చారోహయంస్తదా ॥ 62

ద్వితీయాయాం కాష్ఠచయాన్ తృణోలూఖలమూసలాన్ ।
తృతీయాయాం ధాన్యరాశీన్ పాకామాత్రాణి వై తతః ॥ 63

పంచమ్యాం తు శతఘ్నీశ్చ తతః శస్త్రాణ్యనేకశః ।
తత ఊర్ధ్వం రాజవాహనాశ్వోష్ట్రరథవారణాన్ ॥ 64

అష్టమాయాం రాజకోశాన్ వస్త్రైధాన్యవినిర్మితాన్ ।
హట్టశాలాస్తతఃశ్రేష్ఠా దాసీదాసాంస్తతః పరమ్ ॥ 65

నటాదీనాం తతః శాలా వారస్త్రీణాం తతః పరమ్ ।
తతో వీరానాంఘ్రిగాంశ్చ తేభ్యః శ్రేష్ఠాంస్తతః పరమ్ ॥ 66

గచ్ఛంతి తురగైర్యే తాన్ పంచదశ్యర్పితా తతః ।
రథయోగ్యాంస్తతోఽప్యూర్ధ్వం గజాంశ్చైవ తతః పరమ్ ॥ 67

ఆరోహయంస్తతో దూతాన్ రాజ్యయోగ్యాధికారిణః ।
సుహృత్పుత్రజనస్త్రీభిర్ నృపాన్మాండలికాంస్తతః ॥ 68

## శ్రీరాముడు పుష్పకమునకు వరమునిచ్చి తీర్థయాత్రలు చేయుట.

సర్వభారమును వహించుటకును, ఎప్పుడు ఎట్లు కావలయునో అట్లు సూక్ష్మాకారమునుగాని, విస్తీర్ణాకారమునుగాని ఇష్టము వచ్చినట్లు ఏర్పడుటకు నిస్సంశయముగా నీకు శక్తినిచ్చియున్నాను," అని వరమునిచ్చెను. అది వినినవెనుక పుష్పకము పదిఆమడల వైశాల్యమును, రెండు ఆమడల పొడుగును గలదై పెరిగెను. అందులో వ్యాపారసముదాయములు నూరును, సువర్ణరత్న సోపాన మార్గములును, నూర్లకొలది, వేలకొలదిగా దివ్య మణి కనక కలశములును, దివ్యసౌధములును, ముత్తెముల కిటికీలును, అద్దపు వాకిళ్ళును, వివిధ జలయంత్రములును, పలుపక్షుల కలకల మంజులములగు పుష్పతరువాటికలును, రాత్రిళ్ళలో చిత్రప్రతిభ వినోదించుచుండు, సర్వశిరోధిరత్న సమూహమును, దివ్యగోపురములును, అత్యంత ఆశ్చర్యకరముగా ఉండినవి. ఇట్లుండు పుష్పక విమానమున శ్రీరామాజ్ఞచే దూతలు మొదటి అంతస్థులో రథ, గజ, తురగ, గోవులను ఎక్కించిరి. రెండవ అంతస్థులో తృణకాష్ఠ ముసల ఉలూఖాదులను, మూడవ అంతస్థులో ధాన్య రాసులను, నాలుగవ అంతస్థులో వంటసామాగ్రులను, ఐదవ అంతస్థులో శతఘ్నులను, ఆరవ అంతస్థులో

సమస్త ఆయుధములను, ఏడవ అంతస్థులో సమస్త రాజవాహనములను, ఎనిమిదవ అంతస్థులో రాజోపచార వస్తువులను, వంటగదులను మనోహరముగా కల్గియుండెను. ఆ వెనుక వ్యాపార దుకాణములు, దాసదాసీవర్గముల స్థానములును, నట గాయకుల వేదికలను, వ్యాపార వర్గమును, పిమ్మట వీరులను, పదాతులు, ఆ వెనుక అశ్వయోధులను, రథయోధులను, గజయోధులను, పిమ్మట రాజభాగ్యాది కారులగు దూతలును ఇట్లు క్రమముగా కలిగినదాయెను. పిమ్మట మిత్ర, పుత్ర, కళత్రాది పరివారముతో మండలాధిపతులు పుష్పక ప్రవిష్టులైరి. పిదప రామ సుహృద్వారమును, పౌరపరివారములు నిలచెను.

**తతోఽపూర్ధ్వం రాఘవస్య సుహృదశ్చ పురౌకసః ।**
**తతో భోజనశాలాశ్చ వింశచ్చైవమనోరమాః ॥ 69**

**పాకశాలాస్తతః పంచ స్త్రీణాం భోక్తుం తతో దశ ।**
**తత ఊర్ధ్వం హి బంధూనాం మాతౄణాం చ గృహాణి చ ॥ 70**

**తత ఊర్ధ్వం రాఘవస్య సభా సింహాసనాన్వితా ।**
**తతోఽపూర్ధ్వం చ సీతాయా గేహం నానాసఖీవృతమ్ ॥ 71**

**తతోఽపూర్ధ్వం రాఘవస్య క్రీడాస్థానం తు సీతయా ।**
**తతోఽపూర్ధ్వం షష్టితమాయాం రాజ్ఞాం సుహృదా స్త్రియః ॥ 72**

**తతః స్త్రీణాం సభార్థం హి సప్త శాలాః శుభావహాః ।**
**చిత్రశాలా ద్వాదశాథ వయసాం పంచ వై తతః ॥ 73**

**పుష్పారామాదికానాం హి పంచ శాలాస్తతః శుభాః ।**
**తతోఽపూర్ధ్వం తు శాలాయాం ఘటీయంత్రాదికౌతుకమ్ ॥ 74**

**వ్యాఘ్రాదీనాం తతః శాలా త్వేకా రమ్యాఽతివిస్తృతా ।**
**తతోఽపూర్ధ్వమగ్నిహోత్రశాలా శ్రీరాఘవస్య చ ॥ 75**

**తతః శివార్చనస్యైకా శాలా జ్ఞేయా శుభావహా ।**
**విప్రాణాం చ తతః శాలాః శాలా విద్యార్థినాం తతః ॥ 76**

**యతీనాం చ తతః శాలా వాద్యశాలా తతః పరమ్ ।**
**జలశాలా తతః శ్రేష్ఠా జలయంత్రాన్వితా తతః ॥ 77**

**తతో౽ పూర్యర్ధ్వమార్ద్రవస్త్రశోషణార్థమనుత్తమాః ।**
**శతశాలాస్త్విమాః పూర్ణాశ్చక్రుస్తే రామసేవకాః ॥ 78**

**రామో౽పి దృష్ట్వా తాః సర్వా ఆరురోహ స్వయం తదా ।**
**తతో నదత్సు వాద్యేషు స్తువత్సు మాగధాదిషు ॥ 79**

**నర్తత్సు వారనారీషు పతాకాసు చలత్సు చ ।**
**ప్రకాశయన్ దశ దిశో విమానం రాఘవాజ్ఞయా ॥ 80**

**ఆగచ్ఛత్పూర్వదిగ్భాగాత్ ప్రతీచీం తపనోపమమ్ ।**
**విహాయసా వాయువేగం కింకిణీజాలమాలితమ్ ॥ 81**

పిదప ఇరువది భోజనశాలలు మనోహరములుగా ఉండెను. పిదప ఐదు పాకశాలలు, దానివెనుక పది స్త్రీ భోజనశాలలు, దానిమీద బంధువులకును, తల్లులకును దివ్యమందిరములు, దానిపై శ్రీరాములవారి సింహాసనముగల సభా భవనమును, దానివెనుక సకల సఖీసహితమగు సీతాదేవి కొరకు అంతఃపురభవనము, దానికి పైన శ్రీరాముని క్రీడాస్థానమును, అరవ అంతస్థులో స్త్రీ స్నేహితుల కొరకు వసతి, ఆ పైన స్త్రీల సభలకై ఏడు శాలలును, పిమ్మట చిత్రశాలలు పండ్రెండును, తరువాత ఐదు వయశ్శాలలును, పిదప ఐదు మంగళపుష్ప రామాది శాలలును, పిదప ఒక కాలచక్ర యంత్రాది శాలయును, వెనుక ఒక వ్యాఘ్రాది జంతువుల శాలయును, ఆ పిమ్మట శ్రీరామ అగ్నిహోత్రము కొరకు ఒక మందిరము, శివార్చన కొరకు ఒక మండపము, బ్రాహ్మణ శాలయును, విద్యార్థుల వసతులును, యతుల నివాసములును, వాద్యశాలలును, వినోద జలయంత్రోవేత్త శాలలును, పిమ్మట తడిబట్టలు ఆరబెట్టుకొనుటకు వసతి, వసారాలును– ఇట్లు సమస్త సౌకర్యములును గల నూరు శాలలు నిండియుండెను. సేవకులచే సమస్త స్థలములును సముచితముగా ఒనర్పబడిన సంగతిని శ్రీరాముడు తెలుసుకుని, తానూ పుష్పకమును ఎక్కెను. అంత వాయిద్యములు మ్రోగుచుండగా, నాట్యము జరుగుచుండగా, ధ్వజపతాకములు చలించుచుండగా, సర్వదిక్కులను ప్రకాశింపజేయుచు, రామ ధ్వజాంకితమగు దేదీప్యమానమైన విమానము వాయువేగము కలిగినదై, గగనమున చిరుగంటల కిణికిణీనాద వినోదము గావించుచుండగా, ప్రయాగాభిముఖముగా తూర్పునుండి పశ్చిమమునకు వెడలెను. (81)

**యయౌ ప్రయాగాభిముఖం శ్రీరామధ్వజచిహ్నితమ్ ।**
**విష్ణుదాస ఉవాచ**
**కథం రామస్య చత్వారో ధ్వజాః ప్రోక్తాః పురా త్వయా ॥ 82**

తత్సర్వం విస్తరేణాద్య శ్రోతుమిచ్ఛామిత్వన్ముఖాత్ ।
శ్రీరామదాస ఉవాచ
శైశవే రఘునాథస్తు స్వపితృస్యందన స్థితః ॥ 83

అతః సోప్యస్య రామస్య కోవిదారధ్వజః స్మృతః ।
బాణధ్వజాంకితరథమారుహ్య తాటకాం వనే ॥ 84

జఘానైకేన బాణేన తస్మాద్బాణధ్వజః స్మృతః ।
ఛిన్నం వజ్రధ్వజం దృష్ట్వా రావణేన స రాఘవః ॥ 85

ధ్వజేఽకరోద్వాయుపుత్రం తస్మాత్ప్రోక్తః కపిధ్వజః ।
రణే విమూర్ఛితం దృష్ట్వా రామో మాతలినం తదా ॥ 86

స్థితః స్వీయరథే దివ్యే తస్మాచ్చ గరుడధ్వజః ।
శుక్లాయాం హి పతాకాయాం కోవిదారోఽస్తి వై శుభః ॥ 87

బాణః శుభోస్తి నీలాయాం హరితాయాం తు మారుతిః ।
పీతాయాం గరుడో జ్ఞేయః శ్రీరామస్యందనోపరి ॥ 88

చతుర్షు స్యందనేష్వేవం చత్వారః కీర్తితా ధ్వజాః ।
కోవిదారధ్వజో రామః శ్రీరామో మార్గణధ్వజః ॥ 89

కపిధ్వజో రాఘవేంద్రో భూపేశో గరుడధ్వజః ।
ఏవం నామాన్యనంతాని ప్రోచ్యతే రాఘవస్య హి ॥ 90

తస్మాద్రామధ్వజాః ప్రోక్తాశ్చత్వారశ్చ మయా తవ ।
వజ్రధ్వజాంకితరథే స్థిత్వా రామేణ సంగరః ॥ 91

కృతస్తస్మాద్రాఘవేంద్ర తం వదంత్యశనిధ్వజమ్ ।
అతో రామధ్వజస్యైకమేవ చిహ్నం న విద్యతే ॥ 92

## శ్రీరామ ధ్వజరథాది చిహ్ననిరూపణము.

ఇట్లు కథచెప్పుచున్న రామదాసును శిష్యుడగు విష్ణుదాసు, "స్వామీ! మీరు శ్రీరామునికి నాలుగు ధ్వజములను చెప్పితిరే. వాటిసంగతిని విస్తారముగా వివరించండి" అని వేడెను. అందుకు రామదాసు

చెప్పుచున్నాడు. "చిన్నతనమున శ్రీరాముడు తండ్రియొక్క రథమును ఎక్కినందున కోవిదార రథధ్వజుడు అనబడెను. అప్పుడు సుమంత్రుడు సారథిగా ఉండెను. అపుడు మానుష లీలామూర్తికి 'రామ' యనే నామము ఒప్పుచుండెను. తెల్లని పతాకమునందు కోవిదారము చెప్పబడినది. ఇక అతడు బాణపు గుర్తుగల ధ్వజమును పెట్టుకున్న రథమును ఎక్కెడివాడు, వనమున ఒకే బాణముచే తాటకను సంహరించినందున బాణధ్వజుడయ్యెను. నీలపతాకయందు బాణము శోభించును.

**తస్మాచ్ఛిష్య మయా ప్రోక్తాశ్చత్వారో రాఘవప్రియాః ।**
**కోవిదారాంకితరథే సుమంత్రః సారథిః స్మృతః ॥ 93**

**బాణధ్వజాంకితరథే సూతశ్చిత్రరథః స్మృతః ।**
**వాయుపుత్రాంకిత రథే సారథిర్విజయః స్మృతః ॥ 94**

**రామస్యదారుకః సూతః స్యందనే గరుడాంకితే ।**
**ఏవం శిష్య త్వయా పృష్టం శ్రీరామధ్వజకారణమ్ ॥ 95**

**త్వయా పూర్వం మయా తచ్చ తవాగ్రేఽద్య నివేదితమ్ । 95**

**ఇతి శ్రీశతకోటిరామచరితాంతర్గతే, శ్రీమదానందరామాయణే, వాల్మీకీయే, ఆదికావ్యే, యాత్రాకాండే, కుంభోదరోపాఖ్యానం నామ, పంచమః సర్గః ॥**

అప్పటి నామము శ్రీరాముడని ధ్యేయము. సారథి చిత్రరథుడు అనబడును. ఇక రావణుడు వజ్రధ్వజమును కత్తిరించగా ఆంజనేయుని ధ్వజమున నిలిపినందున కపిధ్వజుడయ్యెను. ఆకు పచ్చ పతాకమునందు కపిచిహ్నము కనిపించును. అప్పటి సారథి విజయుడనబడును. నామము రాఘవేంద్ర అని కీర్తింపబడును. ఇక రణమున మూర్ఛితుడైన మాతలిని జూచి తన రథమును ఎక్కెను. అప్పుడు గరుడధ్వజుడయ్యెను. అప్పటి నామము భూతేశ అని భావింపబడును. పసుపువన్నె పతాకమున గరుడ చిహ్నమొప్పును. ఇట్లు శ్రీరామచంద్ర స్వామికి అనేక ధ్వజపతాక రథ నామములు శోభించుచున్నవి. (95)

***శతకోటిప్రవిస్తరమైన రామకథలో, శ్రీమద్వాల్మీకిమహర్షిచే రచింపబడిన, ఆనందరామాయణంలోని, యాత్రాకాండలో, కుంభోదర ఉపాఖ్యానమనే ఐదవవ సర్గ ముగిసినది.***

# షష్ఠః సర్గః-6వ సర్గ

శ్రీసీతారాములు తూర్పుదేశములను దర్శించుట

**శ్రీరామదాస ఉవాచ**

**తతో రామ విమానేన గత్వా కించిత్తు పశ్చిమామ్ ।**
**దిశం యయౌ ప్రయాగం చ త్రివేణీ యత్ర వర్తతే ॥ 1**

**క్రోశమాత్రే విమానం తన్ముక్త్వా రామః ససీతయా ।**
**పద్భ్యాం శనైః శనైరేవ త్రివేణీసంగమం యయౌ ॥ 2**

**నారికేళం వాయనేన సమర్ప్య రఘునందనః ।**
**చతురంగుళమానం హి కేశబంధం సభూషణమ్ ॥ 3**

**దదౌ సంఛిద్య సీతాయాః స్వయం క్షౌరమథాకరోత్ ।**
**లక్ష్మణాద్యైర్బంధుభిశ్చ వపనం రఘునందనః ॥ 4**

**మాతృభిః కారయామాస కృత్వా చైకముపోషణమ్ ।**
**ద్వితీయే దివసే ప్రాప్తే కృత్వా శ్రాద్ధం సతర్పణమ్ ॥ 5**

**మాసమాత్రం మాఘమాసే వాసం కృత్వా సవిస్తరమ్ ।**
**అష్టతీర్థే తతో గత్వా దత్వా దానాన్యనేకశః ॥ 6**

**దృష్ట్వాఽక్షయవటం రమ్యం నిద్రాస్థానం నిజంలయే ।**
**కించిద్విహస్య శ్రీరామః సీతయా భ్రాతృభిః సహ ॥ 7**

తరువాత శ్రీరాముడు కొంత పశ్చిమ దిక్కుకువచ్చి, ప్రయాగ క్షేత్రమునుజూచి, క్రోశడు దూరముననే సీతతోడ విమానమునుండి దిగి, కాలినడకతోనే తినతిన్నగా త్రివేణి సంగమమునకు చేరెను. వెంటనే శ్రీరాముడు కొబ్బరికాయ వాయనమును అర్పించి, అలంకరింపబడిన సీతయొక్క జడను (వేణిని) నాలుగువ్రేళ్ళంత కత్తిరించి ఇచ్చి, పిదప తాను, తమ్ములు మొదలైనవారితోడ క్షౌరము చేయించుకుని, అందరితోపాటు ఒకదినము ఉపవాసవ్రతమును పాటించి, రెండవనాడు యథావిధిగా తీర్థ శ్రాద్ధ

తర్పణములచే పితరులను తృప్తిపరచి, మాఘమాసము ముప్పైరోజులు ప్రయాగలోనే వసించుచు, అష్టతీర్థములకు పోయి, అనేక దానములను చేసి, ప్రళయకాలమున తను శయనించే అక్షయమనే మఱ్ఱి వృక్షమును చూసి, చిరునవ్వు నవ్వుచు, సీతాలక్ష్మణులతో దానిని భజించెను.

పూజాం కృత్వా త్రివేణ్యాశ్చ వస్త్రైర్దివ్యైః సభూషణైః ।
గంగాజలైః కాచకుంభాన్ శతశోఽథ సహస్రశః ॥ **8**

పూరయిత్వా విమానాగ్ర్యే స్థాప్య తీర్థం పురోహితాన్ ।
పూజయిత్వా సవిస్తారం నత్వా చైవ పునః పునః ॥ **9**

తాన్ పృష్ట్వా పుష్పకే స్థిత్వా యయావాకాశవర్త్మనా ।
వింధ్యాచలం సమాశ్రిత్య యత్ర దుర్గా తు వర్తతే ॥ **10**

తత్ర స్నాత్వా తీర్థవిధిం పూర్వవచ్చ విధాయ సః ।
తాం వింధ్యవాసినీం పూజ్య వస్త్రైరాభరణాదిభిః ॥ **11**

కృత్వా దానాన్యనేకాని తోష్య తీర్థపురోహితాన్ ।
యయౌ కాశీం పుష్పకస్థః శ్రీరామః సీతయా సుఖమ్ ॥ **12**

ఏతస్మిన్నంతరే కాశ్యాం కాశీస్థాః పుష్పకం తు తత్ ।
కోటిసూర్యప్రతీకాశం దృష్ట్వా పశ్చిమతో దిశమ్ ॥ **13**

యత్ ప్రాచీం కాశ్యాభిముఖమాగచ్ఛంతం మహోజ్జ్వలమ్ ।
చక్రుస్తర్కాన్వితర్కాంశ్చ శతశోఽట్టాలసంస్థితః ॥ **14**

కేచిదూచుశ్చ దావాగ్నిస్త్వయం పర్వతమస్తకే ।
సూర్యేణ విస్మృతః పంథా భ్రమణాద్భ్రాంతిమాప సః ॥ **15**

ఇతి కేచిజ్జనాః ప్రోచుః కేచిదూచుస్త్వయం మునిః ।
నారదస్తు సమాయాతి కేచిత్తత్ర బభాషిరే ॥ **16**

పతత్యసౌ రవిః స్వర్గాత్ కేచిద్ద్రోణాచలాన్వితః ।
వాయుపుత్రోఽయమితి తే ప్రోచుః కాశీనివాసినః ॥ **17**

**కేచిదూచుః శశీ స్వర్గాన్ మృగేణ వినిపాతితః ।**
**కేచీదూచుశ్చ విశ్వేశం కేచిదూచుః సుదర్శనమ్ ॥ 18**

**కేచిదూచుః సువర్ణాద్రిం కేచిత్ప్రోచురరుంధతీమ్ ।**
**కేచిత్పుత్రత్రిరాజానం కేచిచ్చ ప్రళయానలమ్ ॥ 19**

శ్రీ సీతారాములవారు దివ్య వస్త్రాభరణాదులచే త్రివేణిని ఆరాధించిరి. మరియు అచ్చట వెయ్యిన్ని ఆరు (1,006) బంగారు కలశములలో గంగను నింపి, వాటిని విమానమున భద్రపరచమని ఆజ్ఞాపించెను. పిదప తీర్థవాసులగు పురోహితులను పూజించి, వారికి పలుమార్లు నమస్కరించి, వారి ఆజ్ఞను పొంది, అందరితో పుష్పకవిమానము ఎక్కి, గగనమార్గమున పయనించెను (9) అంత ఆ విమానము వింధ్యాద్రికి రాగా, వింధ్యారణ్యములోని శ్రీ దుర్గాసన్నిధిన దిగి స్నానముచేసి, తీర్థవిధిని ఆచరించి,......

## శ్రీరాములు వింధ్యావాసిని ఆరాధించుట.

యథాపూర్వముగా దానధర్మములను చేసి, ఆ వింధ్యావాసిని దేవిని దివ్య వస్త్రాభరణములచే ఆరాధించి, తీర్థపురోహితులను సత్కరించి, వారి అనుజ్ఞను పొంది, సీతతో యథాసుఖముగా పుష్పకమునందు కాశికి వెడలెను. (12)

## శ్రీరాముడు కాశీయాత్రజేయుట

అంతలో అచట గోపురములలోని కాశీవాసులందరును పశ్చిమదిక్కునుండి వచ్చుచుండు పుష్పకమును జూచి, నానావిధములుగా వితర్కించుచుండిరి. కొందరు పర్వత శృంగమునందలి దావాగ్ని కనబడుచున్నదనిరి, కొందరు సూర్యుడు దారితప్పి వచ్చుచున్నాడా! అని విభ్రాంతులైరి, మరికొందరు నారదుడు బృహద్రూపముతో దిగుచున్నాడనిరి. ఇంకొందరు ఆకాశమునుండి సూర్యుడు ఊడిపడుచున్నాడనిరి. మరికొందరు ద్రోణగిరిపర్వతముతో ఆంజనేయుడు వచ్చుచున్నాడనిరి, ఇట్లే కొందరు స్వర్గమునుండి మృగముచే పడవేయబడిన చంద్రుడనిరి, కొందరు స్వర్ణగిరియనిరి, కొందరు గగనాద్రియనిరి. కొందరు గరుడుడనిరి, కొందరు ప్రళయాగ్ని అనిరి.

**కేచిత్ప్రోచుర్మహాఘోరం వహ్న్యాస్త్రం కేన మోచితమ్ ।**
**కేచిత్ప్రోచుః సహస్రాస్యస్త్వయం మణివిరాజితః ॥ 20**

**ఏవం వదంతస్తే యానం దదృశుః పుష్పకం మహత్ ।**
**మహాకోలాహలం చక్రుః ప్రోచుస్త్వయం సమాగతః ॥ 21**

రామోఽయోధ్యాపతిః శ్రీమాన్ మానం కర్తుం సనాగరః ।
విశ్వనాథోఽపి తచ్ఛ్రుత్వా పార్వత్యా వృషభస్థితః ॥ 22

ప్రత్యుజ్జగామ శ్రీరామం కాశీస్థైః పరివేష్టితః ।
ఉపాయనం రాఘవస్య గృహీత్వా బహువిస్తరమ్ ॥ 23

ఏతస్మిన్నంతరే రామస్తం దేహళివినాయకమ్ ।
పూజ్య విశ్వేశ్వరం దృష్ట్వా ననామ శిరసా తదా ॥ 24

ఆలింగితః శివేనాథ గృహీత్వోపాయనం శివాత్ ।
స్వయం వస్త్రైరాభరణైః పూజయామాస శంకరమ్ ॥ 25

వివేశ కాశినాథస్య ధృత్వా హస్తేన సత్కరమ్ ।
తావుభౌ వాహనం ముక్త్వా జగ్మతుర్మణికర్ణికామ్ ॥ 26

తతః సీతాయుతో రామశ్చక్రపుష్కరిణీజలే ।
సమర్ప్య శ్రీఫలం స్నాత్వా సచైలం క్షౌరపూర్వకమ్ ॥ 27

నిత్యయాత్రాం విధాయాథ కృత్వా చైకముపోషణమ్ ।
తీర్థశ్రాద్ధాది సంపాద్య పంచతీర్థీ విధాయ చ ॥ 28

అంతర్గృహీం మహాయాత్రాం మానసద్వయమేవ చ ।
ద్విచత్వారింశల్లింగాని హ్యష్టలింగాని వై తతః ॥ 29

షట్పంచాశచ్చ గణపాంస్తథాఽష్టౌ భైరవాన్ పునః ।
యోగినీశ్చ చతుః షష్టీస్తథా దుర్గశ్చ వై నవ ॥ 30

తథాఽష్టదిక్పదీంశ్చాపి తథా నైవ నవగ్రహాన్ ।
క్షేత్రప్రదక్షిణాం పంచక్రోశీయాత్రాం రఘూత్తమః ॥ 31

చతుర్దశేమా యాత్రాస్తు కృత్వా చైవ సవిస్తరమ్ ।
రామేశ్వరం మహాలింగం వరుణాయాస్తటే శుభే ॥ 32

కొందరు ఘోరమగు ఆగ్నేయాస్త్రమును ఎవడు ప్రయోగించెననిరి, కొందరు రత్నములతో అలంకరింపబడిన వేయి పడగలు గల ఆదిశేషుడనిరి. రకరకాలుగా పలుకుచుండిరి. చివరలో ఊరివారు ఇది పుష్పకవిమానమని తెలిసి, ఎంతో కోలాహలము చేసిరి. శ్రీరాముడు యాత్రార్థము వచ్చుచున్నాడని తెలుసుకుని, విశ్వనాథుడు నందివాహనమెక్కి సపరివారముగా పార్వతీదేవితో శ్రీరామునికి స్వాగతమును చెప్పుటకు వచ్చెను. కాశీవాసులు గుంపులుగా వచ్చుచుండిరి. అంతలో శ్రీరాముడు వచ్చుచుండు దేహళి వినాయకుని, పూజ్యుడగు విశ్వేశ్వర స్వామిని దర్శించి, శిరసాభి వందనమును చేసి, శివలింగముపై తలను మోడ్చి, వస్త్రాలంకార ఆభరణాలచే శంకరుని ఆరాధించెను. పిదప ఆ శివ, రాములు ఇరువురును ఒకరిచేతులను ఒకరు పట్టుకుని కాశీనగరమున ప్రవేశించి, వాహనములను వదలి, కాలినడకతో మణికర్ణికకు వచ్చిరి. పిదప శ్రీరాముడు సీతతో చక్రపుష్కరిణిలో శ్రీఫలములను అర్పించి, సచేలస్నానముచేసి, నిత్యయాత్రను ఒనర్చి, ఒకదినము ఉపవాసము ఉండి, తీర్థ శ్రాద్ధాది కర్మలను ఆచరించెను.

1. అంతర్ గృహయాత్ర, 2. మహాయాత్ర, 3,4. మానసయాత్రలురెండు, 5. ద్విచత్వారింశ లింగయాత్ర, 6. అష్టలింగయాత్ర, 7. షట్పంచాశత్ గణపతియాత్ర, 8. అష్టభైరవయాత్ర, 9. చతుష్షష్టియోగినీయాత్ర, 10. నవదేవి యాత్ర, 11. అష్టదిక్పాలకయాత్ర, 12. నవగ్రహయాత్ర, 13. క్షేత్ర ప్రదక్షిణయాత్ర, 14. పంచక్రోశయాత్ర– అను ఈ పదునాలుగు యాత్రలును సవిస్తరముగ ఆచరించెను.

**కాశ్యా వాయవ్యదిగ్భాగే సీమాయాం స్థాప్య సూత్తమమ్ ।**
**రామతీర్థం స్వీయనామ్నా భాగీరథ్యాం చకార సః ॥ 33**

**ఏతస్మిన్నంతరే తత్ర వాయుపుత్రః సమాగతః ।**
**వృత్తం శ్రుత్వా రాఘవస్య యాత్రాః కర్తుం గతస్త్వితి ॥ 34**

**సీతారామౌ నమస్కృత్య స్నాత్వా భాగీరథీ జలే ।**
**స్వనామ్నా శంకరం తీర్థమకరోజ్జాహ్నవీతటే ॥ 35**

**ఘట్టం బబంధ గంగాయాస్తటే రమ్యం దృషన్మయమ్ ।**
**కాశ్యామద్యాపి తన్నామ్నా ఘట్టోఽస్తి పరమః శుభః ॥ 36**

**తథా చకార రామోఽపి ఘట్టబంధనముత్తమమ్ ।**
**దృశ్యతే ప్రత్యహం యత్ర కాశ్యాం రామః ససీతయా ॥ 37**

చకార పంచగంగాయాం కార్తికస్నానముత్తమమ్ ।
కాశీవాసం వర్షమేకం చకార ధర్మతత్పరః ॥ 38

తీర్థవాసార్థినః సర్వాన్ సంతర్ప్య చ పృథక్ పృథక్ ।
రత్నైర్హిరణ్యైర్వాసోభిరశ్వాభరణధేనుభిః ॥ 39

విచిత్రైశ్చ దశాఽఽ మాత్రైః స్వర్ణరౌప్యాదినిర్మితైః ।
అమృతస్వాదుపక్వాన్నైః పాయసైశ్చ సశర్కరైః ॥ 40

సగోరసైరన్నదానైర్ధాన్యదానైరనేకధా ।
గంధచందనకర్పూరైస్తాంబూలైశ్చారుచామరైః ॥ 41

సతూలైర్మృదుపర్యంకైర్దీపికాదర్పణాసనైః ।
శిబికాదాసదాసీభిర్వాహనైః పశుభిర్గృహైః ॥ 42

చిత్రధ్వజపతాకాభిరుల్లోచైశ్చంద్రచారుభిః ।
నానావ్రతైర్మహాశ్రేష్ఠైః సధ్వజారోపణాదిభిః ॥ 43

వర్షాశనప్రదానైశ్చ గృహోపస్కరసంయుతైః ।
ఉపానత్పాదుకాభిశ్చ యతేశ్చాపి తపస్వినః ॥ 44

యోగ్యైః పట్టదుకూలైశ్చ మృదులైశ్చిత్రకంబలైః ।
దండైః కమండలుయుతైరజినైర్మృగసంభవైః ॥ 45

మరియు కాశీపట్టణముయొక్క వాయువ్య దిగ్భాగమున గల వరుణాతీరమున రామలింగేశ్వర మను శివలింగమును ప్రతిష్ఠించెను. పిదప గంగలో తనపేరుతో శ్రీరాముడు ఒక తీర్థమును ఏర్పరచెను. అంతలో అచటికి యాత్రార్థము శ్రీసీతారాములు వచ్చియున్నారను వృత్తాంతమునువిని హనుమంతుడు వేగమేవచ్చి, సీతారాములకు నమస్కరించి, గంగాస్నానముచేసి, పరమేశ్వరుని ఆరాధించి, తనపేరుతో ఒక తీర్థమును కల్పించి, గంగాతీరమున ఒక ఘట్టమును రాళ్ళతో నిర్మించెను. అది ఇప్పటికిని 'హనుమత్ ఘట్ట'మని ప్రసిద్ధినొందియున్నది. అట్లే రాముడును తనకు ఒక ఘట్టమును ఏర్పరచెను. శ్రీరాముడు సీతతోడ అచటి యాత్రలను చూచెను. పంచగంగయందు కార్తీకస్నానమును ఆచరించెను.

ధర్మనిరతుడై ఇట్లు ఒకసంవత్సరము కాశీనగరమున ఉండెను. తీర్థవాసులుగాఉండెడు జనులనందరిని వేర్వేరుగా–సువర్ణ, రత్న, ధన, వసన, భూషణాదులను, గోవులను, గుఱ్ఱములను, బంగారు వెండితో తయారైన పాత్రలను, అమృతాన్నములను దివ్యపాయసములను, గవ్యములను, ధాన్యాదివివిధ దానములను, పుష్ప, గంధ, తాంబూలాది శృంగార అలంకార వస్తువులను, మంచము, పరుపు దిండ్లను, అద్దములను, దీపాదులను, గృహములను నానావిధ వాహనములను ఇచ్చి– సంతుష్టులను చేసియుండెను. ఉత్తమమగు రకరకాలవ్రతములను ఆచరించుటచేత ఊరివారిని ఆనందపరచెను.

కౌపీనైరుచ్ఛమంచైశ్చ పరిచారక కాంచనైః ।
మఠైర్విద్యార్థినామాన్నైరాతిథ్యర్థ మహోధనైః ॥ 46

బహుధౌషధదానైశ్చ భిషజాం జీవనాదిభిః ।
మహాపుస్తకసంభారైర్లేఖకానాం చ జీవనైః ॥ 47

రసాయనైరమూల్యైశ్చ సత్రదానైరనేకశః ।
గ్రీష్మే ప్రపార్థద్రవిణైర్హేమంతేఽ గ్నేష్టకేంధనైః ॥ 48

ఛత్రాచ్ఛాదనకాద్యర్థైర్వర్షాకాలోచితైర్బహు ।
రాత్రౌ పాఠప్రదీపైశ్చ పాదాభ్యంజనకాదిభిః ॥ 49

పురాణపాఠకాంశ్చాపి ప్రతిదేవాలయం ధనైః ।
దేవాలయే నృత్తగీతకరణార్థైరనేకశః ॥ 50

దేవాలయే సుధాకార్యైర్జీర్ణోద్ధారైరనేకశః ।
చిత్రలేఖనమూల్యైశ్చ రంగమాల్యాదిమండనైః ॥ 51

ఆరార్తికైర్గుగ్గులైశ్చ దశాంగాదిసుధూపకైః ।
కర్పూరవర్తికాద్యైశ్చ దవాచార్యైరనేకశః ॥ 52

పంచామృతానాం స్నపనైః సుగంధస్నపనైరపి ।
దేవార్థం ముఖనాసైశ్చ దేవోద్యానైరనేకశః ॥ 53

మహాపూజార్థ మాల్యాదిగుంఫనార్థైస్త్రికాలతః ।
శంఖభేరీమృదంగాదివాద్యనాదైః శివాలయే ॥ 54

ఘంటాగండుకకుంభాది స్నానోపస్కరభాజనైః ।
శ్వేతైర్మార్జనవస్త్రైశ్చ సుగంధైర్యక్షకర్దమైః ॥ **55**

జపహోమైః స్తోత్రపాఠైః శివనామోచ్చభాషణైః ।
రాసక్రీడాదిసంయుక్తైశ్చలనైః సప్రదక్షిణైః ॥ **56**

ఏవమాదిభిరుద్దండైః క్రీడాకాండైరనేకశః ।
వర్షమేకముషిత్వా తు కృత్వా తీర్థాన్యనేకశః ॥ **57**

దీననాథాంశ్చ సంతర్ప్య నత్వా విశ్వేశ్వరం విభుమ్ ।
బ్రహ్మచర్యాదినియమైఋతుకాలాగమేనచ ॥ **58**

సత్యంసంభాషణేనాపి తీర్థమేవం ప్రసాధ్య చ ।
నత్వా పునర్విశ్వనాథం కాలరాజం గణాధిపమ్ ॥ **59**

అన్నపూర్ణం దండపాణిం దృష్ట్వా స్తుత్వా ప్రణమ్య చ ।
అనుజ్ఞాతః శివేనాథ విమానేన రఘూత్తమః ॥ **60**

యతులకు– కౌపీన, పాదుక, వస్త్ర, దండ, కమండలు, మృగచర్మాదులను– ఇచ్చుటచేతను, భిక్షాది సత్కారములచేతను సంతృప్తులనుచేసెను. మరియు వారికి మఠములను, విద్యార్థులను, పరిచార కులను, వేదికలను, పీఠములను–కల్పించుచు వచ్చెను. వివిధ ఔషధములచే లోకులకు సదా ఆరోగ్యమును ఇచ్చునట్టి మంచివైద్యులకు జీవనమును కల్పించెను. అచటచట పుస్తక శాలలను అందులో పుస్తక లేఖకులను ఏర్పరచెను. మంచి భోజన వసతులచే భక్తులను సత్కరించునట్టి అన్నసత్రమును సంస్థాపించెను. ఎండాకాలమున చలివేంద్రపు పందిళ్ళ చేతను, చలి కాలమున కుంపట్లచేతను లోకులకు సుఖమునందించుచుండెను. వర్షాకాలమునకు తగినవిధముగా గొడుగులను ఇచ్చెను. దేవాలయములలో అనేకములుగా నృత్య, గీత, వాద్యాలు నిరంతరము జరుగుచుండునట్లు చేసెను. విద్యార్థులు రాత్రులలో పాఠములు చదువుటకు దీపములకు కావలసిన సౌకర్యములను కల్పించెను మరియు శిథిలమైన దేవాలయములను జీర్ణోద్ధరణముచేసి, వాటిలో సున్నములు కొట్టించుట, బొమ్మలను గీయించుట, ముగ్గులు పెట్టించుట, అలంకారములు చేయించుట, హారతులను ఎత్తించుట, ధూపములను వేయించుట, కర్పూరములను వెలిగించుట, దీపారాధనలుచేయించుట, పంచామృత స్నానాదులను జరిపించుట, పుష్పార్చనములు చేయించుట, ఇట్టి సత్కారములను ఎన్నింటినో చేసెను.

శివాలయమున శంఖ, భేరి, మృదంగాది దివ్య మంగళవాయిద్యములు మ్రోగుచుండునట్లును, దివ్య నైవేద్యములు జరుగుచుండునట్లును జప హోమ బలిప్రదానములు, స్తోత్రపఠనములు, నామస్మరణ, క్రీడా ప్రదక్షిణములును తప్పక జరుగునట్లును ఏర్పరచెను. ఇట్లు ఒక్కసంవత్సరము దీనులను, అనాథలను సంరక్షించుచు విశ్వేశ్వరునికి నమస్కరించి, బ్రహ్మచర్య, సత్యభాషణాది నియమవర్తనములచే తీర్థవాస వ్రతమును నెరవేర్చి, పలుమార్లు విశ్వేశ్వర స్వామిని, కాలభైరవుని, దుండీ రాజగణపతిని, అన్నపూర్ణాదేవిని, దండపాణిని చూసి, స్తుతించి, నమస్కరించి శ్రీసాంబసదాశివ ఆజ్ఞను పొంది శ్రీరాముడు విమానమును ఎక్కి, (60) గగన మార్గముగా గంగా దక్షిణ తీరమున వెడలెను.

**యవావాకాశమార్గేణ గంగాయా దక్షిణే తటే ।**
**కర్మనాశాం నదీం దృష్ట్వా చ్యవనస్యాశ్రమం యయౌ ॥ 61**

**రామచంద్రః పుష్పకస్థః స్నాత్వానత్వా మునీశ్వరమ్ ।**
**రామతీర్థం చ రామేశం చకార తత్ర రాఘవః ॥ 62**

**నిజబాణకృతాం రేఖాం దర్శయామాస తాన్ జనాన్ ।**
**కాశ్యా అప్యధికాన్యత్ర దత్త్వా దానాన్యనేకశః ॥ 63**

**యయౌ యానేన దివ్యేన స్వర్ణభద్రస్య సంగమమ్ ।**
**యాని యాని హి తీర్థాని రాఘవశ్చ గమిష్యతి ॥ 64**

**ఉత్తరోత్తరతస్తేషు దానాధిక్యం కరిష్యతి ।**
**యత్ర యత్ర రఘుశ్రేష్ఠో గమిష్యతి ససీతయా ॥ 65**

**తత్ర తీర్థాన్యనేకాని భవిష్యంతి మహాంతి చ ।**
**శేషోఽపి తేషాం సంఖ్యాం హి వక్తుం నాత్ర క్షమో భవేత్ ॥ 66**

**తేషు తీర్థాని శ్రేష్ఠాని షట్ జ్ఞేయాని మనీషిభిః ।**
**బంధూనాం చైవ చత్వారి సీతాయాః పంచమం స్మృతమ్ ॥ 67**

**షష్ఠమంజని పుత్రస్య సర్వత్రైవం వినిశ్చయః ।**
**రామః స్నాత్వా స్వర్ణభద్ర గంగయోః సంగమే ముదా ॥ 68**

త్రిరాత్రం సమతిక్రమ్య గండకీ సంగమం యయౌ ।
కస్మింస్తీర్థే త్రిరాత్రం చ పంచరాత్రమథ క్వచిత్ ॥ 69

సప్తరాత్రం క్వచిచ్చాపి పక్షమేకమథ క్వచిత్ ।
అష్టాదశైకవింశద్వా త్రిమాసం చ క్వచిత్ప్రభుః ॥ 70

చకార వాసం తీర్థేషు ధర్మాన్ కుర్వన్ యథాసుఖమ్ ।
గండకీసంగమే స్నాత్వా నేపాలే జగదీశ్వరమ్ ॥ 71

దృష్ట్వాహరిహరక్షేత్రం యయౌ రఘుకులోద్వహః ।
ఏవం కుర్వన్ స తీర్థాని సర్వాణి రఘునందనః ॥ 72

## వివిధ క్షేత్రములను దర్శించి మరలా గయకువచ్చుట.

ఇట్లు రాముడు కర్మనాశియైన నదినిచూచి, చ్యవనాశ్రమమునకు వచ్చెను. స్నానముజేసి, మునికి మ్రొక్కి, అచట రామతీర్థమును, రామేశ్వరుని కల్పించెను. ఆ జనులకు తన బాణముచే వేయబడిన రేఖనుజూపెను. అచట కాశిలో చేసిన దానములకన్నను అధికముగా దానధర్మలను చేసెను. పిదప శ్రీరాముడు సీతతోడ శోణభద్రానది సంగమమునకు వచ్చెను. యేయే తీర్థములకు శ్రీరాముడు పోవునో అచటచ్చట దాన ధర్మాలు ముందుకంటే అధికముగా జరుగుచుండును. ఎచటెచ్చట వీరు పోదురో అచటచ్చటి గొప్పతీర్థములు విశేషతీర్థములుగా మారినవి. ఈ క్షేత్ర తీర్థసంఖ్యను ఆదిశేషుడైనను లెక్కించలేడు. వానిలో ఆరు తీర్థములు పరమోత్తమములని ఎన్నదగినవి. అవి ఏవి యనిన యే తీర్థమునకు పోయినను శ్రీరామ, లక్ష్మణ, భరత, శత్రుఘ్నతీర్థములు నాలుగు, సీతాతీర్థము ఐదవది. ఆరవది ఆంజనేయుని తీర్థము. ఇట్లే అంతటా నిర్ణయము. శ్రీరాముడు గంగా–శోణాభద్ర సంగమమున స్నానముచేసి, మూడు రాత్రులు వసించి, గండకీ–గంగా సంగమభూమికి వెళ్ళెను. ఒక తీర్థమున మూడురాత్రులు, మరియొకచోట ఐదురాత్రులు, ఇంకొకచోట ఏడురాత్రులు, కొన్ని తావులలో పదునైదురాత్రులు, పద్దెనిమిది (18) రాత్రులు, ఇరవైఒక్క (21) రాత్రులు, శ్రీరాముడు సర్వతంత్రుడుగాన ఒకానొకచోటున మూడు మాసములుకూడా యథాసుఖముగా వసించుచు, ధర్మములను ఆచరించుచుండెను. గండకి సంగమమున స్నానముచేసి, నేపాళములో పశుపతీశ్వర స్వామిని ఆరాధించి, హరిహర క్షేత్రమునకు పోయెను, ఇట్లే సమస్తతీర్థములను సేవించెను,

పునః పునః సంగమం చ యయౌ జాహ్నవిదక్షిణే ।
వైకుంఠనగరం గత్వా జరాసంధపురం యయౌ ॥ 73

వైకుంఠాయా జలే స్నాత్వా తతో రామో యయౌ గయామ్ ।
ఫల్గునద్యాస్తటే పూర్వం ముక్త్వా తద్యానముత్తమమ్ ॥ 74

నత్వా విష్ణుపదం దివ్యం పునర్యానాంతికం యయౌ ।
తాం నిశాం సమతిక్రమ్య ప్రభాతే రఘునందనః ॥ 75

స్నాతుం ఫల్గునదీతోయే యయౌ తీర్థం ద్విజైః సహ ।
ఏతస్మిన్నంతరే సీతా సఖీభిః పరివేష్టితాః ॥ 76

యయౌ స్నాతుం ఫల్గునద్యాం స్నాత్వా పూజ్య సువాసినీః ।
సైకతే సా క్షణం తస్థౌ పూజనార్థం మహేశ్వరీమ్ ॥ 77

వాలుకాపంచపిండైశ్చ దుర్గాం కర్తుం సముద్యతా ।
గృహీత్వా వామహస్తేన సార్ద్రాం సా సికతాం తదా ॥ 78

సవ్యేన కృత్వా పిండం తు యావత్సా పాణినా భువి ।
స్థాపయామాస తావత్తు దదర్శ జగతీతలాత్ ॥ 79

వినిర్గతం దశరథశ్వశురస్య కరం శుభమ్ ।
దక్షిణం నిజహస్తాచ్చ గృహీత్వా పిండముత్తమమ్ ॥ 80

గచ్ఛంతం భూతలం రమ్యం తద్దృష్ట్వా కౌతుకం పునః ।
ద్వితీయం స్థాపయామాస భువి పిండం తు సైకతమ్ ॥ 81

సోఽపి నీతః పూర్వవచ్చ హ్యేనమష్టోత్తరం శతమ్ ।
దదౌ పిండాన్ కౌతుకేన తతః శాంతా విదేహజా ॥ 82

మనసా పూజ్య దుర్గాం సా యయౌ యానం త్వరాన్వితా ।
తద్వృత్తం న సఖీభిస్తు జ్ఞాతం రామేణ వాఽపి న ॥ 83

తథాఽపి కథితం చైవ కిం రామో మాం వదిష్యతి ।
ఇతి భీత్యా తతో రామః పంచతీర్థం విగాహ్యచ ॥ 84

ప్రేత పర్వతమాసాద్య పిండదానమథాకరోత్ ।
కనిష్ఠికాయాం నిష్కాస్య నిజనామాంకితాం శుభామ్ ॥ 85

మరలా మరలా గంగ దక్షిణతీర్థమున గల సంగమములకు వచ్చి, వైకుంఠనగరమునకు పోయి, జరాసంధపురమునకు వెడలి, వైకుంఠి యోదకమున స్నానముచేసిన శ్రీరాముడు గయా క్షేత్రమునకు వచ్చెను. పిమ్మట ఫల్గునది పూర్వాతీరమున విమానమును విడచి విష్ణుపాదము వద్దకు వచ్చి నమస్కరించి మరలా పుష్పకవిమానమును చేరెను. ఆ రాత్రి గడచిన పిదప ప్రొద్దున బ్రాహ్మణులతోడ శ్రీరాముడు ఫల్గునది స్నానమునకై వెడలెను. (75) అంతలో సీతాదేవి సఖులతో కూడి, ఫల్గునదికి వెడలి స్నానముచేసి, ముత్తైదువులను పూజించి,

## దశరథుడు సీతఇచ్చిన సికతాపిండములచే సంతృప్తుడగుట.

ఇసుకదిబ్బమీద కొంతసేపు కూర్చుండి, గౌరీపూజకై ఇసుక ముద్దలను ఐదింటిని ఎత్తి, దుర్గాదేవిని చేయనారంభించెను. అపుడు ఆమె తడిఇసుకను ఎడమచేతనెత్తి, కుడిచేతితో ముద్దచేసి, నేలనణచునప్పటికి భూతలమునుండి తనమామగారైన దశరథరాజుయొక్క హస్తము వెలువడి, కుడిచేతిలోని ఇసుకముద్దను తీసుకుని నేలలో దాగుచుండు మంచి వేడుకనుజూచెను. ఐనా ఇది ఏమో చూతమని రెండవముద్దను పెట్టెను. అదియును అట్లే గ్రహింపబడెను. ఇట్లు నూటఎనిమిది ఇసుకముద్దలను ఇచ్చి, అత్యాశ్చరమును పొంది, ఆ పనిని చాలించి, మనముననే గౌరిని ఆరాధించి, విమానమునకు వెడలెను. ఈ సంగతి సఖులకును తెలియదు. రామునికిని తెలియదు. శ్రీరాముడు ఏమిచెప్పునో అను భీతివలన ఆమెయును ఎవ్వరితోను చెప్పలేదు. పిదప అచట శ్రీరాముడు పంచతీర్థ స్నానముచేసి, ప్రేత పర్వతమును ఎక్కి, పిండదానముచేయబూని తన పేరిట ముద్ర ఉంగరమును చిటికెన వ్రేలునుండి తీసెను.

**కాంచనీం ముద్రికాం రమ్యాం దక్షిణాభిముఖస్తదా ।**
**అపహతేతి మంత్రేణ చకార భువి రాఘవః ॥ 86**

**రేఖాత్రయం తదద్యాపి దృశ్యతే తత్ర వై స్ఫుటమ్ ।**
**ఆస్తీర్య స కుశాంస్తత్ర పిండాన్ సక్తుమయాన్ శుభాన్ ॥ 87**

**తిలాజ్యమధుసంయుక్తాన్ దాతుం రామః సముద్యతః ।**
**సవ్యేన పాణినా పిండం గృహీత్వా రఘునందనః ॥ 88**

**యావత్పశ్యతి భూమ్యాం తు న దదర్శ పితుః కరమ్ ।**
**తదాశ్చర్యేణ విప్రాస్తే రామమూచుస్స్వరాన్వితాః ॥ 89**

నిష్క్రామన్త్యత్ర సర్వేషాం పితౄణాం దక్షిణాః కరాః ।
న దృశ్యతే తవ పితుః కారణం నాత్ర విద్మహే ॥ 90

రామోఽపి విస్మయావిష్టశ్చకితః ప్రాహ లక్ష్మణమ్ ।
జానీషే కారణం కించిదత్ర త్వం బుద్ధిమానసి ॥ 91

స ప్రాహ రాఘవాస్మాభిర్యదా గోదావరీం గతమ్ ।
ఇంగుదీఫలపిణ్యాకపిండదానే తదా కరః ॥ 92

అస్మాభిః స్వపితుర్దృష్టః సోఽత్ర నైవ ప్రదృశ్యతే ।
మమాపి జాతమాశ్చర్యం సీతాం త్వం ప్రష్టుమర్హసి ॥ 93

తచ్ఛ్రుత్వా జానకీ శీఘ్రం ప్రాహ కించిద్భయాతురా ।
మయాఽపరాధితం కించిత్ తత్క్షమస్వ రఘూత్తమ ॥ 94

తత్తస్యా వచనం శ్రుత్వా రాఘవః ప్రాహ తాం పునః ।
వద తథ్యం న భేతవ్యం కారణం హి మమాన్తికమ్ ॥ 95

యథా వృత్తం తయా సర్వం రాఘవాయ నివేదితమ్ ।
తచ్ఛ్రుత్వా రాఘవః ప్రాహ కః సాక్షీ తవ కర్మణి ॥ 96

సా ప్రాహ చూతవృక్షోఽస్తి దృష్టః స నేత్యువాచ హ ।
తదా శప్తః సీతయా స ఫలహీనః స కీకటః ॥ 97

భవ మే వచనాచ్చూత యతో మిథ్యా త్వయేరితమ్ ।
పునః సా రాఘవం ప్రాహ ఫల్గుః సాక్ష్యం ప్రదాస్యతి ॥ 98

సాఽపి రామేణ పృష్టాఽథ నేత్యువాచ భయాతురా ।
సాఽపి శప్తా రామపత్న్యాఽధోముఖీ మమ వాక్యతః ॥ 99

శ్రీరాముడు దక్షిణాభిముఖముగా కూర్చుని, భూమిమీద మూడురేఖలను గీచెను. పార్వతీ! అవి ఇప్పుడును చక్కగా కనబడుచున్నవి. పిమ్మట శ్రీరాముడు దర్భలను పరచి, నువ్వులు, తేనె, నెయ్యి కలిసిన పిండి పిండములను ఇచ్చుటకు ఆరంభించెను. శ్రీరాముడు కుడిచేతిచే పిండమును ఎత్తుకుని

ఎంతజూచినను భూమి మీద తండ్రిచేయి కనబడలేదు. అపుడచటి బ్రాహ్మణులు ఆశ్చరమును పొంది, త్వరపడి రామునితో, "ఈ పిండదానము అనిన అందరికి ఇది వారివారి పితరులయొక్క దక్షిణ హస్తము వెలువడును. నీ తండ్రిది కనబడకయున్నది కారణము మాకు తెలియదు," అని పలికిరి. శ్రీరాముడు ఆశ్చర్యచకితుడై, "లక్ష్మణా! దీనికి నీకేమైనా కారణము తెలియునా?" అని అడిగెను. అందుకు లక్ష్మణుడు, "అన్నా! అపుడు మనము గోదావరి తీరమున గారకాయల పిండి పిండములను ఇచ్చినపుడును పితృకర్మను నేను జూచితిని. ఇది ఇపుడేల కనబడలేదని నేనూ ఆశ్చర్యపోతున్నాను. ఈ విషయమును ఇక్కడేయున్న సీతను అడుగవచ్చుగా," అని చెప్పగా, సీతవిని; భయభ్రాంతయై, "నాథా! నేను కొంచెము అపరాధముచేసినాను. దానిని క్షమింపుము," అని వేడుకొనెను. శ్రీరాముడు, "యథార్థమును చెప్పుము? ఎంతమాత్రమును భయపడవలదు." అని అభయమునివ్వగా, సీత జరిగిన వృత్తాంతమును యథార్థముగా పలికెను.

**వహ యస్మాన్మృషా చోక్తం త్వయా సత్యేపి కర్మణి ।**
**తతః సీతా పునః ప్రాహ సాక్ష్యం మేఽత్ర నివాసినః ॥ 100**

**దాస్యంతి మే ద్విజాః సర్వే తదా మన్నికటస్థితాః ।**
**తేఽపి పృష్టా రాఘవేణ నేత్యూచుర్భయవిహ్వలాః ॥ 101**

**దద్మః సాక్ష్యం తర్హి రామః శాపం నస్తు ప్రదాస్యతి ।**
**నివారితా కథం నేయం తదా సీతేతి చింత్య తే ॥ 102**

**తాంస్తదా జానకీ శాపం దదౌతీర్థనివాసినః ।**
**యుష్మాకం నాత్ర సంతృప్తిః కదా ద్రవ్యైర్భవిష్యతి ॥ 103**

**ద్రవ్యార్థం సకలాన్ దేశాన్ భ్రమధ్వం దీనరూపిణః ।**
**తతః సా జానకీ ప్రాహ ఓతుః సాక్ష్యం ప్రదాస్యతి ॥ 104**

**సోఽపి పృష్టో నేత్యువాచ రామం సీతా శశాప తమ్ ।**
**పుచ్ఛాగ్రం స్వపురః కృత్వా పదా మన్నికటోఽపి సన్ ॥ 105**

**మృషేరితం యతస్త్స్మాత్పుచ్ఛే హ్యస్పృశ్యతాం భజ ।**
**తతః సా జానకీ ప్రాహ గౌర్మే సాక్ష్యం ప్రదాస్యతి ॥ 106**

**సోఽపి పృష్టా నేత్యువాచ రామం సీతా శశాప తామ్ ।**
**అపవిత్రా భవాస్యై త్వం మమ వాక్యేన ధేనుకే ॥ 107**

**తతః సీతాశ్వత్థవృక్షం సాక్ష్యార్థం ప్రాహ రాఘవమ్ ।**
**స పృష్టో నేత్యువాచాథ తం సీతాఽథశపత్క్రుధా ॥ 108**

**భవాచలదలస్త్వం హి మద్గిరాఽశ్వత్థపాదప ।**
**పునః సీతా పతిం ప్రాహ మమ సాక్షీ ప్రభాకరః ॥ 109**

**స పృష్టః ప్రాహ తథ్యం హి తుష్టిర్జాతా పితుస్తవ ।**
**ఏతస్మిన్నంతరే తత్ర విమానేనార్కవర్చసా ॥ 110**

**రాజా దశరథో రామమాగత్యాలింగ్య వై దృఢమ్ ।**
**ప్రాహ త్వయా తారితోఽహం నరకాదతిదుస్తరాత్ ।**
**మైథిల్యాః పిండదానేన జాతా మే తృప్తిరుత్తమా ॥ 111**

అందుకు రాముడు, "సరే! మరి దీనికి ఎవ్వరు సాక్షిగా ఉన్నారు? అనెను," సీత, "ఈ మామిడి చెట్టు నా వెనుక ఉండి చూచుచుండె" అనెను. ఆ మామిడిచెట్టు "నాకు తెలియదు" అనెను. అపుడు సీత, "ఓ మామిడి వృక్షమా! నీవు అసత్యమాడినందున పండకయుందువు, నీయందు పురుగులు పడనీ," అని మామిడిచెట్టును శపించి, మరియొక సాక్ష్యమున్నదని ఫల్గూనదిని జూపెను. రాముడు దానిని అడుగగా, అదియును "నాకు తెలియదు," అనెను. అందుకు సీత, "జరిగినదానికి నీవు సత్యము చెప్పనందున నేటినుండి అధోభాగమున ప్రవహించుచుందువు," అని శపించి, ఈ బ్రాహ్మణులందరును నా వద్దన అపుడు నిలచియుండిరి గాన వీరందరును క్షేత్రవాసులు, సాక్ష్యము ఇవ్వగలరు అనెను. రాముడు వారిని అడుగగా వారును, "సాక్ష్యమిచ్చితిమా రాముడు మమ్ములను శపించును. ఈమె ఎట్లు నివారింపబడును? అపుడు సీత చింతింపబడును," అని తమలో తాము భయభ్రాంతులై "మాకు తెలియదు" అనిరి. వారిని గురించి సీత, "తీర్థవాసులారా! మీకు ఇచట ఎంత ద్రవ్యమిచ్చినను తృప్తిలేకపోవును గాక. మీరు దీనరూపముతో ద్రవ్యమునకై సకలదేశములలోను భ్రమించుచుందురు," అని శపించి, పిల్లి సాక్ష్యము ఇవ్వగలదనెను. రాముడు అడుగగా అదియును "లేద"నెను. అపుడు సీత మార్జాలమునకు, "నీ తోక కొనను ముందర పెట్టుకుని, నీవు నా వద్ద కూర్చుండినను, అబద్ధము చెప్పినందున, నీ తోకను ఎవ్వరూ తాకకూడనిది అగును." అని శాపమునిచ్చి, ఈ ఆవు నాకు సాక్ష్యమును ఇచ్చును అనెను. అదియును లేదని ఉత్తరమిచ్చెను.

అపుడు సీత ఆవును, “ఓయి గౌతమి! నీవు ముఖమున అపవిత్రతనొందుదువు” అని శపించెను. అశ్వత్థ వృక్షమును సాక్ష్యము అడుగగా, అదియును “నాకు తెలియదు” అనగా సీత, “ఓ అశ్వత్థమా! నీ ఆకులు నిత్యము నిలకడగా ఉండక కదులుతుండును గాక,”అని శపించెను, ఆ తరువాత నాకు జగత్ చక్షువగు సూర్యుడే సాక్ష్యము అనెను. అపుడు రాముడు సూర్యుని అడుగగా, అతడు, “మా తండ్రికి సంతృప్తి కలిగెను,” అని యథార్థముగా చెప్పెను. అంతలో అచటకి దశరథమహా రాజు సూర్య ప్రకాశమానమగు విమానములో వచ్చి, శ్రీరామచంద్రుని తన హృదయానికి హత్తుకుని, “శ్రీరామా! మిక్కిలి దుస్తరమగు నరకమునుండి నీవు నన్ను ఉద్ధరించితివి. జానకి ఇచ్చిన పిండ దానముచేత నాకు సంతృప్తి కలిగినది.

**తథాపి లోకశిక్షార్థం గయాశ్రాద్ధం త్వమాచర ॥ 112**
**పితరం ప్రాహ రామోఽపి కిమర్థం హి త్వయాఽత్రవై ।**

**త్వరయా సికతాపిండః సంగృహీతో వదస్వ మామ్ ।**
**స ప్రాహాత్ర గయాయాం తు బహువిఘ్నాని రాఘవ ॥ 113**

**భవంతి శ్రాద్ధసమయే కృతా తస్మాత్త్వరా మయా ।**
**ఇతి రామం సమాభాష్య గృహీత్వా రాఘవాదపి ॥ 114**

**కించిత్క్రవ్యం విమానేన యయౌ దశరథస్తదా ।**
**తతో రామః ప్రేతగిరౌ పిండదాన విధాయ చ ॥ 115**

**గత్వా ప్రేతశిలాయాం చ దత్వా కాకబలిం తతః ।**
**ధర్మారణ్యం తతో గత్వా కృత్వైకోనపదేషు హి ॥ 116**

**సక్తునా చ తిలాజ్యైశ్చ పాయసైశ్చ స శర్కరైః ।**
**పృథగ్ద్వై పిండదానాని వటశ్రాద్ధం విధాయ చ ॥ 117**

**అష్టతీర్థే తతః కృత్వా తతః సంధ్యాం స్థలత్రయే ।**
**కృత్వా యథావిధానేన దత్వాదానాన్యనేకశః ॥ 118**

**గదాధరం తతః పూజ్య మహావిభవపూర్వకమ్ ।**
**సేచయామాస తోయైశ్చ చూతవృక్షం సకీటకమ్ ॥ 119**

ఏకో మునిః కుంభ కుశాగ్రహస్త
శ్చూతస్య మూలే సలిలం దధార ।
ఆమ్రశ్చ సిక్తః పితరశ్చ తృప్తా
ఏకా క్రియా ద్వ్యర్థకరీ ప్రసిద్ధా ॥ 120

కృత్వా విష్ణుపదే పూజాం విమానారోపణాదిభిః ।
మాసత్రయమతిక్రమ్య గయాయాం రఘునందనః ॥ 121

విమానేన యయౌ ప్రాచీం దిశం సంతోషయన్ జనాన్ ।
ఫల్గునద్యాస్తటే పూర్వే విమానం యత్ర సంస్థితమ్ ॥ 122

తత్ర రామగయానామ్నీ భూమిర్విప్రైరుదీర్యతే ।
రామేశ్వరో రామతీర్థం వర్తతే తత్ర పావనమ్ ॥ 123

ఐనను లోకమునకు ఆదర్శముగా గయాశ్రాద్ధమును ఆచరింపుము అని వక్కాణించెను. అందుకు రాముడును, "ప్రభూ! నీవేల ఇచట ఇసుకముద్దలను త్వరబడి గ్రహించితివి?" అని అడిగెను. అది విని దశరథుడు, "రామా! ఈ గయాశ్రాద్ధసమయమున అనేక విఘ్నములు సంభవించును. కనుక నేను త్వరపడితిని." అని చెప్పి, రామునిచేత ఇవ్వబడిన కవ్యముకూడా కొంతస్వీకరించి, తన విమానమును ఎక్కిపోయెను. (114)

## శ్రీరాముడు 'రామగయ'ను ఏర్పరుచుట

తరువాత శ్రీరాముడు ప్రేతగిరిలో పిండప్రదానములు చేసి, ప్రేతశిలకు పోయి, పిమ్మట కాకబలిని ఇచ్చి, అటుమీద ధర్మారణ్యమునకు వెడలి; నువ్వులు, నేయి, పాయస, శర్కరాన్విత పిష్ట పిండములను వేర్వేరుగా ఇచ్చి, వటశ్రాద్ధముపెట్టి, అష్టతీర్థములను ఆచరించి, యథావిధానముగా త్రిస్థలమునందు కర్మలను ఆచరించి, అనేకములగు దానములను ఇచ్చి, అత్యంత వైభవముతో గదాధరస్వామిని ఆరాధించి, స కీటకంబగు చూత వృక్షమును నీళ్ళతోముంచెను. ఒకమునీంద్రుడు దర్భలను చేతబూని, మామిడిచెట్టుక్రింద నీటిని ధరించెను. మామిడిచెట్టును తడిపెను. పితరులును తృప్తినందిరి. ఒక పని రెండు ప్రయోజనములను ఇచ్చునదని ప్రసిద్ధము. పిమ్మట శ్రీరాముడు విమానమును ఎక్కించుటయే మొదలుగా గల సత్కారములచే విష్ణుపాదమున పూజజరిపి, ఇట్లు మూడుమాసములు గయలో వసించి లోకులను సంతోషపరచుచు, విమానమును ఎక్కి తూర్పునకు వెడలెను. ఫల్గానది

తీరమున పూర్వమున మొదట విమానము నిలచినచోటు, 'రామ గయ' అను పేరుచే ప్రసిద్ధముగా ఉన్నదని బ్రాహ్మణులు చెప్పుచుందురు. అచట రామేశ్వరుడును, రామతీర్థమును పరమపావనముగా ఉన్నవి.

రామోఽపి ఫల్గునద్యశ్చ గంగాయాః సంగమం యయౌ ।
గయాబహిః ఫల్గురేవ జ్ఞేయా సా తు మహానదీ ॥ **124**

తతో యయౌ ముద్గలస్య నూతనాశ్రమముత్తమమ్ ।
యస్మిన్నుదగ్వహా గంగా జాహ్నవీ పాపనాశనీ ॥ **125**

తతోఽగ్రే జానకీ జ్ఞాత్వా భూమౌ దివ్యం ప్రదాస్యతి ।
తస్యా దివ్యస్థలే రామస్తీర్థమాదౌ చకార సః ॥ **126**

బంధూనాం చ పృథక్ తత్ర సంతి తీర్థాని సర్వతః ।
సీతయా చ కృతం తత్ర స్వనామ్నా తీర్థముత్తమమ్ ॥ **127**

జ్ఞాత్వా భవిష్యత్యగ్రే మత్తీర్థం చేతి సవిస్తరమ్ ।
యదా భూమౌ ప్రదాస్యామి దివ్యం తీర్థం తదాఽస్తుమే ॥ **128**

రామస్తతో విమానేన గతశ్చోత్తరవాహినీమ్ ।
నామ్నా పురీ తథా గంగా యత్రాస్తి పరమార్థదా ॥ **129**

పర్వతో యత్ర గంగాయామస్తి బిల్వేశ్వరోఽపి చ ।
తతః శ్రీవైద్యనాథేశం నత్వా రావణనిర్మితమ్ ॥ **130**

తతః శనైర్విమానేన పశ్యన్నానాస్థలాని సః ।
యయౌ భాగీరథీమధ్యాద్యత్ర భిన్నా సితా పునః ॥ **131**

ప్రయాగాద్యోజనశతమానే దేశే రఘూద్వహః ।
తతో గంగాఽబ్ధిసంయోగసహస్రే పుష్పకేన సః ॥ **132**

గత్వా స్నాత్వా తతో యత్ర కాళిందీసంగతాఽర్ణవే ।
తత్ర గత్వా రఘుశ్రేష్ఠస్తతః పశ్యన్ స్థలాని సః ॥ **133**

## శ్రీరాముడు పూర్వసాగర తీర్థములను సేవించుట.

శ్రీరాముడు ఫల్గూనది గంగా సంగమానికి వెడలెను. మునుపు గయకు ప్రక్కన ఫల్గూ ఒకటే ఉన్నది. అది ఒక మహానదిగా ఉన్నది. (124) ఆ తరువాత రాముడు ఎచట పరమపవిత్రయగు జాహ్నవియైన గంగ ఉత్తరవాహినిగాఉన్నదో అట్టి నూతనమగు ముద్గలాశ్రమమునకు వచ్చెను. అంత అచట జానకీదేవి భూమిలో దివ్యముగా తన మహాతేజస్సును తెలిసి ఇచ్చెను. ఆమెయొక్క దివ్యస్థలమున శ్రీరాముడు మొదట తీర్థమును కల్పించెను. వేరుగా శ్రీరామానుజుల తీర్థములు గలవు. సీత మాత్రము, "ముందు నా యొక్క తీర్థము ఇచ్చట విస్తారముగా ఏర్పడును. ఎప్పుడు నా తేజస్సు భూమిలో ఉంచెదనో అపుడు గదా అది జరుగు," అని తెలిసి తన పేరుతో తీర్థమును కల్పించలేదు. అంత ఆ దాశరథి పుష్పక విమానముపై పరమార్థప్రదమైన 'ఉత్తరవాహిని' అను ఊరికి వచ్చి, అచట ఉత్తర వాహిని గంగను ఆరాధించి, ఎచట గంగలో పర్వతమును, బిలేశ్వరుడును గలడో అచటికిపోయి, రావణ నిర్మితమగు వైద్యనాథేశ్వరుని ఆరాధించెను. విమానము తిన్నగా వచ్చుచు అనేక పుణ్య స్థలములను చూచుచూ....,

**నానాపుణ్యాని తీర్థాని దృష్ట్వా శ్రీపురుషోత్తమమ్ ।**
**పూర్వసాగరతీరస్థం దత్వా దానాన్యనేకశః ॥ 134**

**తతః శనైః పుష్పకేణ దృష్ట్వా నానావిధాన్ సురాన్ ।**
**దృష్ట్వా నానా నదీః సర్వా నానాదేశాన్విలంఘ్య చ ॥ 135**

**గోదాతీరే స్వనామ్నా తు కృత్వా గిరిమనుత్తమమ్ ।**
**సప్తగోదావరీభేదసంగమేషు మహోదధౌ ॥ 136**

**స్నాత్వా దక్షిణమార్గేణ తతో రామో యయౌ పునః ।**
**పూర్వదేశే నృపతిభిర్మానితః పూజితోఽపి చ ॥ 137**

**గృహీత్వా స్వకరం తేభ్యస్తైః సహైవ శనైః శనైః ।**
**విమానేన సుఖేనైవ తీర్థాన్యన్యాని సేవితుమ్ ॥ 138**

**శ్రీరామో యామ్యదిగ్జాని దక్షిణాభిముఖో యయౌ ।**
**ఏవం ప్రోక్తా పూర్వదేశయాత్రా రామేణ యా కృతా ॥ 139**

**ఇతి శ్రీశతకోటిరామచరితాంతర్గతే, శ్రీమదానందరామాయణే, వాల్మీకీయే, ఆదికావ్యే, యాత్రాకాండే, పూర్వదేశ తీర్థయాత్రావర్ణనం నామ షష్ఠః సర్గః ॥**

గంగనుండి సీతానది ఎచట విడిపోవునో అచటికి వచ్చి, ప్రయాగకు నూరు ఆమడల దూరమున గల గంగాసాగర (నేడు కలకత్తాకు 120 కి.మీ. దూరమున గలదు.) సహస్రమునకు విమానముమీద వచ్చి, స్నానముచేసి, ఎచట యమునానది సముద్ర సంగమము ఆయెనో అచటికి పోయి, అచట స్థలములను చూచి, వివిధ పుణ్యతీర్థములను దర్శించి, పూర్వసాగరతీరమునందుగల పురుషోత్తమ స్థలమునకు (ఒరిస్సా రాష్ట్రములోని పూరి జగన్నాథక్షేత్రము) వచ్చి, అనేక దానధర్మములను ఆచరించి, తిన్నగా పుష్పకముపై ప్రయాణిస్తూ, వివిధ నగరములను, నదులను చూచి, పలుదేశములను దాటి, గోదా తీరమున తనపేరుతో ఒక పర్వతమును కల్పించి, సప్తగోదావరి సంగమమున సముద్రములో స్నానముచేసి, మరలా రాముడు దక్షిణమార్గముగా వచ్చుచు, పూర్వదేశమునందలి రాజులచే పూజింపబడి, వారినందరిని పుష్పకముమీద ఎక్కించుకొని, సుఖముగా దక్షిణ దిక్కులోని తీర్థములను సేవించుచు, దక్షిణ దిక్కునకు వెడలెను.

విష్ణుదాసా! నీకు ఇట్లు శ్రీరాముని పూర్వకీర్తిద యాత్ర వర్ణనము చెప్పబడినది. (139)

***శతకోటిప్రవిస్తరమైన రామకథలో, శ్రీమద్వాల్మీకిమహర్షిచే రచింపబడిన, ఆనందరామాయణములోని, యాత్రాకాండలో, తూర్పుదేశయాత్రావర్ణనమనే ఆరవ సర్గ ముగిసినది.***



# సప్తమః సర్గః-7వ సర్గ

## శ్రీరాముని దక్షిణదేశయాత్ర

శ్రీరామదాస ఉవాచ

తతో రామః సముల్లంఘ్య మత్స్యతీర్థ మనోరమమ్ ।
తీర్త్వా మహానదీం కృష్ణాం పశ్యన్ పుణ్యస్థలాని సః ॥ 1

తతో యయౌ నారసింహం రామః పానకనామకమ్ ।
కృఽష్ణాబ్ధిసంగమే స్నాత్వా దత్వా దానాని విస్తరైః ॥ 2

పశ్యన్నానాస్థలాన్యేవ యయౌ శ్రీశైలపర్వతమ్ ।
స్నాత్వా స నీలగంగాయాం దృష్ట్వా శ్రీమల్లికార్జునమ్ ॥ 3

తత్రైవ కృష్ణా సా జ్ఞేయా నీలాగంగేతి నామతః ।
శ్రీశైలశిఖరం దృష్ట్వా పునర్జన్మనివారకమ్ ॥ 4

శ్రీరామదాసు ఇట్లు చెప్పుచున్నాడు, "తరువాత ఆ శ్రీరాముడు మత్స్యతీర్థమును దాటి, మహానదియగు కృష్ణను దాటి, పుణ్యస్థలములను చూచుచు పోయి, పానకాల నరసింహ స్వామిని చేరి, కృష్ణాసాగర సంగమమున స్నానముచేసి, విరివిగా దానములను చేసి, దారిలోని పెద్దపెద్ద తీర్థములను దర్శిస్తూ, శ్రీశైల పర్వతమునకు వచ్చి, నీలగంగలో మునిగి, శ్రీ మల్లికార్జున స్వామిని ఆరాధించెను. అచటి కృష్ణానదియే నీలగంగయనబడును. శ్రీశైల శిఖరమును చూచిన మరలా జన్మములేదు.

శిఖరేశ్వరస్య శిఖరాత్ బ్రహ్మకుండే విగాహ్యచ ।
భీమకుండే తతః స్నాత్వా తథా నివృత్తి సంగమే ॥ 5

తుంగభద్రాసంగమేఽపి మహానదీసరోవరే ।
విగాహ్య భవనాశిన్యాం తతో దృష్ట్వా హ్యహోబలమ్ ॥ 6

నారసింహం తతో నత్వా కృత్వా స్తంభప్రదక్షిణాః ।
గత్వా పుష్పగిరౌ తత్ర పినాకీమవగాహ్య చ ॥ 7

పశ్యన్ పుణ్యస్థలానీశాన్ దృష్ట్వా పంపాసరోవరమ్ ।
కిష్కింధాయాం తతో గత్వా సుగ్రీవాద్యైః సుపూజితః ॥ 8

సుగ్రీవాద్యైర్వానరైశ్చ విమానేన విహాయసా ।
ప్రవర్షణగిరౌ స్వీయగుహాం రమ్యాం ప్రదర్శయన్ ॥ 9

వైదేహీం కౌతుకాద్రామః కించిత్కృత్వా స్మితాననమ్ ।
ద్వితీయే భీమకుండేఽథస్నాత్వా గత్వా షడాననమ్ ॥ 10

స్నాత్వాఽగస్తికుండమధ్యే పశ్యంస్తీర్థాన్యనేకశః ।
కనకగిరిస్థం శంభుం నత్వా సంపూజ్య రాఘవః ॥ 11

వీరభద్రం తతో దృష్ట్వా నత్వాఽద్రివేంకటం భువి ।
గోవిందరాజం తం నత్వా తృప్తిపత్తన సంస్థితమ్ ॥ 12

స్నాత్వా కపిలధారాయాం తీర్థశ్రాద్ధ విధాయ చ ।
తతః శేషాచలం గత్వా స్నాత్వా పుష్కరిణీజలే ॥ 13

వేంకటేశం పూజయిత్వా పంచతీర్థం విగాహ్య చ ।
సువర్ణముఖరీతీరసంస్థ శ్రీకాళహస్తినమ్ ॥ 14

పూజయిత్వా యయౌ కాంచీం రామః శివహరిప్రియామ్ ।
ఏకాంబరేశ్వరం పూజ్య సర్వతీర్థే విగాహ్య చ ॥ 15

కామాక్షీమంబికాం నత్వా స్నాత్వా వేదవతీజలే ।
నత్వా వరదరాజం చ పక్షితీర్థం తతో యయౌ ॥ 16

పూషావిధాతృనామానౌ పక్షిణౌ పూజ్య సీతయా ।
పుష్పకేణ తతః శీఘ్రం క్షీరనద్యాం విగాహ్య చ ॥ 17

నత్వా త్రివిక్రమం తత్ర తతోఽగాదరుణాచలమ్ ।
ముక్తిర్యత్స్మరణాదేవ నత్వాతమరుణాచలమ్ ॥ 18

శిఖరేశ్వరుని శిఖరమునుండి బ్రహ్మకుండమును దర్శించి, పిదప భీమకుండమున స్నానముచేసి, అట్లే నివృత్తిసంగమమున, తుంగభద్రాసంగమములో, మహానది సరోవరములో, భవనాశిని యందును స్నానములను చేయుచు వచ్చి, అహోబిల నృసింహస్వామిని ఆరాధించి, స్తంభమునకు ప్రదక్షిణ చేసి,

పుష్పగిరికి వెడలి పినాకినిలో మునిగి, పుణ్యస్థలములను మహాలింగములను దర్శించుచు, పంపాసరోవరమునుజూచి, కిష్కింధకు వెడలి సుగ్రీవాదులచే సత్కరింపబడి, వారినందరిని విమానమున ఎక్కించుకుని, ప్రవర్షణగిరిలోని తన గుహను చూపుచు, సీతను వేడుకలచే సంతోషపరచి, రెండవ భీమకుండమున స్నానముచేసి, కుమారస్వామిని దర్శించి, అగస్తికుండమున మునిగి, అనేక తీర్థములను చూచుచు, కనకగిరిలోని శంబుదేవునికి నమస్కరించి, పూజించి, వీరభద్రుని దర్శించి, వెంకటగిరికి నమస్కరించి, తిరుపతి పట్టణవాసియగు గోవిందరాజుకు నమస్కరించి, కపిలధారలో స్నానమాడి, తీర్థశ్రాద్ధముపెట్టి, పిదప శేషాచలమునకు వెడలి, పుష్కరిణీ స్నానముచేసి, శ్రీవేంకటేశ్వరులను ఆరాధించి, పంచతీర్థమున మునిగి, సువర్ణముఖీ తీరమున శ్రీకాళహస్తీశ్వరుని ఆరాధించి, శంకరనారాయణ ప్రియయగు కాంచీనగరికి ఏతెంచి, సర్వతీర్థమున స్నానముచేసి, కామాక్షి దేవిని, ఏకాగ్రమనాథుని ఆరాధించి, వేగవతిలో స్నానముచేసి, వరదరాజుని పూజించి, పక్షితీర్థమునకు వెడలి 'పూష', 'విధాతృ'అను పక్షులను సత్కరించి, సీత తోడ పుష్పకమునకు వెడలి క్షీరనదిలో స్నానముచేసి, త్రివిక్రమ మూర్తికి మ్రొక్కి, అరుణాచలమునకు వచ్చెను. దేనిని స్మరించిన మాత్రమున ముక్తిలభించునో అట్టి అరుణాచలమును ఆరాధించెను.

**మణిముక్తానదీతీరే వృద్ధాచల మగాత్తతః ।**
**వృద్ధాచలేశం సంపూజ్య వటపాలం తతో యయౌ ॥ 19**

**వటపాలేశ్వరం పూజ్య తతః శ్రీముష్టిమభ్యగాత్ ।**
**తత్ర యజ్ఞవరాహం చ సంపూజ్య జగదీశ్వరమ్ ॥ 20**

**చిదంబరమథాగచ్ఛద్దర్శనాదేవ ముక్తిదమ్ ।**
**లిఖితా యత్ర శేషేణ శిలాయాం తాండవాకృతిః ॥ 21**

**కావేరీం చ తతస్తీర్త్వా సింహక్షేత్రం తతో యయౌ ।**
**నత్వాబ్రహ్మ పురేశం చ వైజనాథం ప్రణమ్యసః ॥ 22**

**శ్వేతారణ్యం తతో గత్వా శంఖముఖ్యాం విగాహ్య చ ।**
**ఛాయావనం తతో దృష్ట్వా యయౌ గౌరీమయూరకమ్ ॥ 23**

**వేదారణ్యం తతో గత్వా నత్వా మధ్యార్జునం శివమ్ ।**
**స్నాత్వాఽథ వృద్ధకావేరీం కుంభకోణ విలోక్య చ ॥ 24**

శ్రీనివాసం తతో దృష్ట్వా దృష్ట్వా బృందావనం శుభమ్ ।
సారనాథం తతో దృష్ట్వా శ్రీవత్సం చ దదర్శ సః ॥ 25

ప్రయాగమాధవం నత్వా గత్వాఽఽఽభ్ర శిరసః స్థలమ్ ।
భిత్తావాకాశనీలాభం గత్వాఽథ కమలాలయమ్ ॥ 26

త్యాగేశ్వరం సమభ్యర్చ్య గయాతీర్థే విగాహ్య చ ।
దక్షిణద్వారకాయం చ శ్రీగోవిందం ప్రణమ్య సః ॥ 27

జేపాలాఖ్యం పురం గత్వా గత్వా చాభయదేశ్వరమ్ ।
విఘ్నేశ్వరం నమస్కృత్య పురా సంస్థాపితం స్వయమ్ ॥ 28

స్నాత్వా వై నవపాషాణే యయౌ దేవ్యాశ్చ పత్తనమ్ ।
స్నాత్వా వేతాలతీర్థే వై తీర్త్వౌఘం సాగరస్య చ ॥ 29

స స్నాత్వా భైరవే తీర్థే ప్రాపైకాంతస్థితం నిజమ్ ।
అవరుహ్య విమానాగ్ర్యాత్పద్భ్యాం సర్వైర్జనైః సహ ॥ 30

గత్వా లక్ష్మణకుండేఽథ స్వకుండేఽపి విగాహ్య చ ।
అగ్నితీర్థే తతః స్నాత్వా ధనుష్కోట్యాం విగాహ్య చ ॥ 31

స్నాత్వా జటాయుతీర్థే హి గత్వా తం గంధమాదనమ్ ।
ఆదౌ నత్వా విశ్వనాథ పురాఽఽనీతం హనూమతా ॥ 32

మణిముక్తానది తీరమున వృద్ధాచలమునకు వెళ్ళి అక్కడి ఈశ్వరుని ఆరాధించి, వటపాలనమునకు పోయి వటపాలేశ్వరుని పూజించి, శీఘ్రమున యజ్ఞవరాహమూర్తిని ఆరాధించి, దర్శనమాత్రమున ముక్తిప్రదమగు శేషలిఖిత తాండవాకృతిగల చిదంబరమునకు వచ్చి, శ్రీకావేరీ నదిలో స్నానముచేసిన తరువాత సింహక్షేత్రమునకు పోయి బ్రహ్మపురేశ్వరునికి నమస్కరించి, వైద్యనాథునికి ప్రణమిల్లి, శ్వేతారణ్యమునకు వెడలి, శంఖముఖ్యలో మునిగి ఛాయావనమునుజూచి, గౌరీమయూరమునకు వెళ్ళి, వేదారణ్యమునుదాటి, మధ్యార్జునేశ్వరునికి నమస్కరించి, వృద్ధకావేరీలో స్నానముచేసి, కుంభకోణమునుచూచి, శ్రీనివాసుని దర్శించి, మంగళ బృందావనమున సారనాథుని, శ్రీవాంఛమును, ప్రయాగమాధవునికి నమస్కరించి అభ్రు శిరస్థ స్థలమునకు వెళ్ళి కమలాలయమున త్యాగేశ్వరుని ఆరాధించి, గయాతీర్థమున మునిగి, దక్షిణ ద్వారకలో శ్రీగోవిందుని ఆరాధించెను. (27)

## శ్రీరాముడు సేతుయాత్రజేసి వచ్చుట.

జేపాలపురమున అభయదేశ్వరునిజూచి మునుపు తనచే ప్రతిష్ఠితమైన విఘ్నేశ్వరుని పూజించి, నవపాషాణ తీర్థమున స్నానముచేసి, దేవీపట్టణమునకు వెళ్ళి వేతాళతీర్థమున మునిగి, సముద్రమున మునిగి, భైరవతీర్థమున స్నానముచేసి, పుష్పకమునెక్కి ప్రయాణించి, అందరితో పద్మస్థలికి పోయి, రామకుండమున, లక్ష్మణకుండమున, అగ్నికుండమునను స్నానముచేసి, ధనుష్కోటిలో దిగి మునిగి, జటాతీర్థమును సేవించి, గంధమాధనమునుచేరి మొదట హనుమంతుడు తెచ్చిన విశ్వనాథునికి నమస్కరించెను.

రామేశ్వరం తతో నత్వా కృత్వా గంగాభిషేచనమ్ ।
కాచకుంభాదికం త్యక్త్వా ధనుష్కోట్యా రఘూత్తమః ॥ 33

కోటితీర్థం ధనుష్కోట్యా చకార కూపముత్తమమ్ ।
క్షేత్రపాపప్రశాంత్యర్థం దృష్ట్వా శ్రీసేతుమాధవమ్ ॥ 34

నానాదానాదికం కృత్వా మాసమేకం విలంఘ్య చ ।
వాహనారూఢదేవానాం మహోత్సాహాన్విధాయ చ ॥ 35

క్షేత్రపాపప్రశాంత్యర్థం కోటితీర్థం విగాహ్య చ ।
నత్వా ద్వారస్థగణపం తీర్థౌఘం జలధేః పునః ॥ 36

విహాయసా విమానేన స దర్భశయనం యయౌ ।
స్నాత్వా నిక్షేపికాతోయైస్తామ్రపర్ణ్యబ్ధిసంగమే ॥ 37

గత్వా స్నాత్వా రామచంద్రో దదౌ దానాన్యనేకశః ।
తతోఽబ్ధేస్థీరసంస్థం తం స్కందం సంపూజ్య రాఘవః ॥ 38

తామ్రపర్ణీతటేనైవ పశ్యన్పుణ్యస్థలాని సః ।
నవవేంకటనాథాంస్తాన్ నత్వా తోతాద్రిమాయయౌ ॥ 39

కన్యాకుమారికాం దృష్ట్వా సింధుతీరనివాసినీమ్ ।
ప్రతీక్షంతీం స్వీయమార్గం బిభ్రతీం మాలికాం కరే ॥ 40

తామాహ రఘువీరశ్చ వరం వరయ సువ్రతే ।
సా ప్రాహ రాఘవం నత్వా చిరమస్మి వ్రతస్థితా ॥ 41

అహం మునిసుతా పిత్రా సుసేంద్రాయ వినిశ్చితా ।
వివాహార్థం సమానీతః సురేంద్రో యోజనే స్థితః ॥ 42

తవ యాత్రోద్యమం శ్రుత్వా మయా చిత్తే వినిశ్చితమ్ ।
ఆగమిష్యతి రామోఽత్ర వరయిష్యామ్యహం తదా ॥ 43

పిత్రా మన్నిశ్చయం జ్ఞాత్వా సురేంద్రో వినివర్తితః ।
సోఽపి మత్ఖేదచిత్తస్తు యోజనేఽద్యాపి వర్తతే ॥ 44

వివాహోపకరణ్యాది మన్మాత్రా యత్కృతం పురా ।
పిత్రా తత్సాగరే క్షిప్తం క్రోధావిష్టేన రాఘవ ॥ 45

ఆ తరువాత శ్రీరాముడు రామేశ్వరుని ఆరాధించి, గంగా జలముతో అభిషేకము చేసి, గాజు కుప్పెలు మొదలైనవాటిని ధనుష్కోటిలో వదలి, ధనుష్కోటిలో కోటితీర్థమును నిర్మించి, క్షేత్ర పాపపరిహారార్థముగా శ్వేతమాధవునిజూచి, వివిధ దానాదికములతో ఒకనెల గడిపి, వాహనారూఢు లగు దేవతలకు మహోత్సవములను జరిపి, క్షేత్రపాపము పోవుటకు కోటితీర్థములో స్నానముచేసి, ద్వారగణపతికి మ్రొక్కి, మరలా సముద్రస్నానముచేసి, పుష్పకవిమానమును ఎక్కి గగనమున పయనించి, తాను సముద్రుని అనుగ్రహము కొరకు ఉపవసించిన చోటు దర్భశయమునకు వచ్చి, నిక్షేపికా జలమున స్నానముచేసి, ఆ తరువాత తామ్రపర్ణి-సింధు సంగమములో స్నానముచేసి, దాన ధర్మములను చేసి, తీరవాసియగు స్కంధమూర్తిని ఆరాధించి, తామ్రపర్ణి తీరముననే పుణ్యస్థలములను జూచుచు, నవ వేంకట నాథులకు నమస్కరించి, తోతాద్రికి వచ్చెను. (39).

## శ్రీరాముడు కన్యాకుమారికి వరమునిచ్చుట.

పిదప శ్రీరాముడు తనరాకకై చేత పుష్పమాలికను పట్టి సముద్రతీరమున ఎదురుచూచుచున్న కన్యాకుమారిని చూచి, "వరమును వేడు," అని అనుగ్రహించెను. అందుకు ఆమె రామునికి నమస్కరించి, "స్వామీ! నేను ముని పుత్రికను. నా తండ్రి నాకు సుసేంద్రునికి ఇవ్వదలచి వానిని పిలిపించెను. వాడు పెండ్లికై వచ్చి ఆమడదూరములో నిలిచెను. నీవు యాత్రకు వచ్చుచుండు సంగతిని విని, నేను మనమున రాముడిచ్చుటకు వచ్చును నేనతనిని వరించెదను అని నిశ్చయించితిని. నా తండ్రివలన నా నిశ్చయముతెలుసుకుని, సుసేంద్రుడు వెనుకకు తరలెను. ఆయన ఒక ఆమడదూరములో ఇప్పటికిని నా చింతలో నిలిచియున్నాడు. విహారార్థముగా నా తల్లిచేసిన ఉపకరణములను అన్నింటిని నా తండ్రి కోపించి సముద్రములో పారపోసెను.

అద్యాపి దృశ్యతే పశ్య తరంగైర్నిర్గతం బహిః ।
అద్య త్వయా తారితాఽహం మాం దాసీం కర్తుమర్హసి ॥ 46

జ్ఞాత్వా తస్యా హ్యభిప్రాయం తామాహ రఘునందనః ।
ఏకపత్నీవ్రతం మేఽస్మిన్ జన్మన్యస్తి కుమారికే ॥ 47

అగ్రే కృష్ణావతారే త్వం భజ మాం నాత్ర సంశయః ।
తద్రామవచనాదేవ యమైశ్చ నియమైరపి ॥ 48

యావద్రామః స్థితో భూమ్యాం తావత్ధృత్వా కలేవరమ్ ।
తపోబలేన దేహాంతే జాంబవంతీ జనిష్యతి ॥ 49

జాంబవతీతి నామ్నా సా కృష్ణపత్నీ భవిష్యతి ।
రామో యయౌ సుసేంద్రం చ పయోష్ణీం సంవిగాహ్య సః ॥ 50

అద్యానన్తం తతో గత్వా తామ్రపర్ణీతటే స్థితమ్ ।
వినిద్రితం శేషపృష్ఠే లక్ష్మీగరుడసేవితమ్ ॥ 51

జ్ఞాతవ్యా తామ్రపర్ణీ సా త్వన్యా పశ్చిమవాహినీ ।
అనంతశయనం గత్వా పద్మతీర్థే విగాహ్య చ ॥ 52

శంఖతీర్థే మత్స్యనద్యాం విగాహ్య సీతయా ప్రభుః ।
తతో గత్వా విమానేన ధర్మాధర్మసరోవరే ॥ 53

స్నాత్వా జనార్దనం గత్వా పశ్చిమే హ్యబ్ధిరోధసి ।
దర్శేఽథ పౌర్ణిమాయాం చ గంగాధారాబ్ధిసంగమ ॥ 54

స్నాత్వా జనార్దనం పూజ్య నారీరాజ్యం విలోక్య చ ।
అగ్రే శ్రీరామచంద్రః స న యయౌ లోకశిక్షయా ॥ 55

పరివృత్య తతో రామో ఘృతమాలాం విగాహ్య చ ।
కృతమాలాం తతః స్నాత్వా సింధునద్యాం విగాహ్య చ ॥ 56

గత్వా గజేంద్రమోక్షం చ తామ్రపర్ణీతటస్థితమ్ ।
తామ్రపర్ణ్యుద్గమే స్నాత్వా గత్వా మైరాళతీర్థకమ్ ॥ 57

**గత్వా చంద్రకుమారాఖ్యం గిరిం శ్రీరఘునందనః ।**
**తతో యయౌ విమానేన దృష్ట్వా దక్షిణకాశికామ్ ॥ 58**

**నత్వా కాశీవిశ్వనాథం చంపకారణ్యమాయయౌ ।**
**చిత్రగంగాజలే స్నాత్వా నత్వా హరిహరౌ శుభౌ ॥ 59**

**తతో రామో విమానేన మధుపుర్యాం వివేశ సః ।**
**వేగవత్యా జలే స్నాత్వా నత్వా తం సౌందరేశ్వరమ్ ॥ 60**

ఆ పదార్థములు ఇప్పటికీ అలలచే పొర్లి కనబడుచున్నవి. ఇప్పుడు నీచే ధన్యతనైతిని. నన్ను దాసిగ అంగీకరింపుము" అని ప్రార్థించెను. దానికి శ్రీరాముడు, "కుమారికా! నాకీ జన్మమున ఏకపత్నీవ్రతముగలదు. రాగల కృష్ణావతారమున నన్ను నీవు భజింపుము," అని వరమునిచ్చెను. రామ వచనానుసారముగా రాముడుండునంతవరకు ఘోరతపమును ఆచరించి, దేహాంతమున తపోబలముచే జాంబవంతునికి 'జాంబవతి' అను కూతురిగా పుట్టి, కృష్ణునికి పత్నికాగలదు. (50)

## శ్రీరాముడు పశ్చిమ, దక్షిణ క్షేత్రములను సేవించి వచ్చుట.

పిదప శ్రీరాముడు సుసేంద్రమునకు పోయి, పయోష్ణిలో స్నానముచేసి, అంత తామ్రపర్ణీ తీరమున శేషపృష్ఠశాయియై లక్ష్మీగరుడ సేతుడగు నార్యానంత మూర్తిని ఆరాధించెను. దానిని వేరొక పశ్చిమవాహినియగు తామ్రపర్ణిగా గుర్తించవలయును. పిమ్మట రాముడు అనంతశయనమునకు వచ్చి- పద్మతీర్థ, శంఖతీర్థ, మత్స్యనదులలో స్నానముచేసి, పుష్పక విమానమున బయలుదేరి, ధర్మాధర్మ సరోవరమున మునిగి, సముద్రతీర జనార్దన క్షేత్రమునకు పోయి, అమావాస్య పూర్ణిమలలో గంగాధార సంగమంలో స్నానముచేసి, జనార్దనుని ఆరాధించి, నారీరాజ్యమును చూచి, లోకమునకు సందేశమిచ్చుటకు దానిలో ప్రవేశించక చుట్టివచ్చి, శ్రీరాముడు ఘృతమాలా నదిలోను, కృతమాలా నదిలోను స్నానముచేసి, సింధూనదిలో దిగి, తామ్రపర్ణీతీర గజేంద్రమోక్ష క్షేత్రమునకు వెళ్ళి, తామ్రపర్ణీమూలమున మునిగి, మైరాళతీర్థమును సేవించి, చంద్రకుమార పర్వతమునకు పోయి, అచటనుండి దక్షిణకాశికి వచ్చి, కాశీవిశ్వనాథునికి నమస్కరించెను. చంపకారణ్యమునకు వచ్చి, చిత్రగంగాజలమున స్నానముచేసి, హరి హరునారాధించి, పిమ్మట మధురకు వచ్చి, వేగవతిలో స్నానముచేసెను.

**మీనాక్షీమంబికాం నత్వా వేంకటం ద్రావిడే గిరౌ ।**
**కావేరీమధ్యనిలయం శ్రీరంగశయనం యయౌ ॥ 61**

మాతృభూతేశ్వరం నత్వా నత్వా తం జంబుకేశ్వరమ్ ।
రంగనాథం నమస్కృత్య హ్యవినాశీం తతోయయౌ ॥ 62

శ్రీరంగపత్తనం గత్వా స్నాత్వా హైమవతీజలే ।
శాలిగ్రామం నమస్కృత్య రామనాథపురం యయౌ ॥ 63

స్నాత్వా కుమారధారాయాం సుబ్రహ్మణ్యం ప్రపూజ్య చ ।
ఉడుపాఖ్యం తతః కృష్ణం నత్వా శృంగాశ్రమం యయౌ ॥ 64

తుంగానదీతటే శృంగిగిరౌ నత్వా తు శారదామ్ ।
కుంభకాశీం తతో గత్వా గత్వా కోటీశ్వరం శివమ్ ॥ 65

నత్వా మూకాంబికాం దేవీ నత్వా ముండేశ్వరం హరమ్ ।
గుణవంతేశ్వరం నత్వా నత్వా ధారేశ్వరం తతః ॥ 66

గౌరేశ్వరం నమస్కృత్య నత్వా శృంగేశ్వరం శివమ్ ।
గోకర్ణం చ తతో గత్వా తం ప్రణమ్య మహాబలమ్ ॥ 67

హరిహరేశ్వరం గత్వా పశ్యంస్తీర్థాన్యనేకశః ।
జామదగ్న్యం మహేంద్రాదౌ నత్వా భీమేశ్వరం యయౌ ॥ 68

ధౌమం మహాబలం నత్వా యయౌ కోలాపురం తతః ।
కరవీరపురం గత్వా కృష్ణావేణ్యోస్తు సంగమే ॥ 69

స్నాత్వా రామో విమానేన గదాలక్ష్మీశ్వరం యయౌ ।
స్నాత్వా ఘటప్రభాయాం తు పశ్యన్ పుణ్యస్థలాని హి ॥ 70

మహాదేవం నమస్కృత్య నత్వా మల్లారిమీశ్వరమ్ ।
కారానదీతటస్థం తం వక్రతుండం విలోక్య చ ॥ 71

నీరానదీజలే స్నాత్వా నారసింహం ప్రపూజ్య చ ।
పాండురంగం నమస్కృత్య చంద్రభాగాం విగాహ్య చ ॥ 72

యయౌ భీమాసంగమం తు చందల్లాం చ తతో యయౌ ।
తతః ప్రేమపురం గత్వా నత్వా మార్తాండమీశ్వరమ్ ॥ 73

(మధురై)మీనాక్షి సుందరేశ్వరుని ఆరాధించి, ద్రవిడగిరిలో వేంకటమూర్తికి నమస్కరించి, కావేరీ మధ్యవాసియగు శ్రీరంగ శయనమునకు వచ్చి, మాతృభూతేశ్వర, జంబుకేశ్వర, రంగనాథుని సేవించి, అవినాశికి వచ్చి, శ్రీరంగపట్టణమునకుపోయి, హైమావతిలో స్నానముచేసి శాలిగ్రామమును ఆరాధించి, రామనాథపురమునకు వెడలి కుమార ధారలో దిగి సుబ్రహ్మణ్యస్వామిని ఆరాధించి, ఉడుపి కృష్ణమూర్తికి నమస్కరించి, శృంగగిరికి వచ్చి తుంగానదీ తీరమున శృంగగిరిలో శారదకు మ్రొక్కి, కుంభకాశికి వెడలి, ఆ తరువాత కోటీశ్వరమునకు పోయి శివుని సేవించి, మూకాంబికకు మ్రొక్కి, మృడేశ్వరుని చూచి- గుణవతేశ్వర, ధారేశ్వర, గౌరేశ్వర సజేశ్వరులను సేవించి, గోకర్ణమునకు వెడలి మహాబలేశ్వరునికి ప్రణమించి, హరిహరేశ్వరమునకుపోయి అనేక తీర్థములను దర్శిస్తూ, మహేంద్రగిరిలో పరశురాముని చూచి, నమస్కరించి, భీమేశ్వరమునకు వెడలి ధౌమ మహాబలమూర్తిని సేవించి, కోల్హాపూర్ మీదుగు కరవీరపురమునకు వచ్చి, కృష్ణవేణీసంగమమున స్నానముచేసి, విమానమును ఎక్కి, గదా లక్ష్మీశ్వరమునకు ఏతెంచి ఘటప్రభలో స్నానముచేసి, పుణ్యస్థలములను చూచుచు, మల్లారీశ్వరుని ఆరాధించి, పాండురంగని పూజించి, చంద్రభాగలో మునిగి, భీమాసంగమమునకు వచ్చి, చందలకు వెళ్ళి, ప్రేమ పురమును చూచి, మార్తాండేశ్వరుని ఆరాధించెను.

**నీలదుర్గం విలోక్యాథ నానా పశ్యన్ స్థలాని హి ।**
**తులజాపురసంస్థాం తాం దేవీం నత్వా యయౌ తతః ॥ 74**

**మాణిక్యామంబికాం దృష్ట్వా పశ్యంస్తీర్థాని రాఘవః ।**
**యోగీశ్వరీం వరామంబాం దృష్ట్వా హ్యంబాపుర స్థితామ్ ॥ 75**

**వైద్యనాథం నమస్కృత్య వంజరాసంగమం యయౌ ।**
**నాగేశం చ విలోక్యాథ విమానేన స రాఘవః ॥ 76**

**స్నాత్వా పూర్ణాసంగమే తు గోదాయా ఉత్తరే తటే ।**
**స్వనామ్నాఽథ పురీం కృత్వా ముద్గలాశ్రమమాయయౌ ॥ 77**

**బాణతీర్థే తతః స్నాత్వా సింధుఫేనాసుసంగమే ।**
**గోదానాభావబ్జకేఽథ స్నాత్వా నత్వా త్రివిక్రమమ్ ॥ 78**

**కృత్వా పరాం స్వనామ్నా తు పురీం గోదావరీతటే ।**
**అంబికాం తు నమస్కృత్య చండికాం పరిపూజ్య చ ॥ 79**

ఆత్మతీర్థే తతః స్నాత్వా నత్వా విజ్ఞానమీశ్వరమ్ ।
మహాలక్ష్మీం విలోక్యాథ వడవాసంగమం యయౌ ॥ 80

ప్రతిష్ఠానం విలోక్యాథ స్నాత్వా వృద్ధైశైలసంగమే ।
శివనందా సంగమేఽథ నృసింహం పరిపూజ్య సః ॥ 81

స్వీయనామ్నా ఖ్యాతతీర్థే ప్రవరాసంగమం యయౌ ।
సిద్ధేశ్వరం నమస్కృత్య నివాసాఖ్యం పురం యయౌ ॥ 82

నూపురాఖ్యం పురం గత్వా పశ్యన్నానాస్థలాని సః ।
యయౌ గోదాతటేనైవ పుణ్యస్తంభం రఘూద్వహః ॥ 83

గత్వా కద్రూసంగమే తు వినతాసంగమం యయౌ ।
జనస్థానం తతో గత్వా యయౌ త్ర్యంబకమీశ్వరమ్ ॥ 84

దాక్షిణాత్యైర్నృపతిభిర్మానితః పూజితోఽపి చ ।
గృహీత్వా కరభారం స్వం తేభ్యస్తైః సహితో యయౌ ॥ 85

ఏవం దక్షిణయాత్రేయం యా కృతా రాఘవేణ వై ।
సా మయా విస్తరేణైవ కథితా త్ర్యంబకావధి ॥ 86

**ఇతి శ్రీశతకోటిరామచరితాంతర్గతే, శ్రీమదానందరామాయణే, వాల్మీకీయే, ఆదికావ్యే, యాత్రాకాండే, దక్షిణతీర్థయాత్రావర్ణనం నామ, సప్తమః సర్గః ॥**

నీలదుర్గ క్షేత్రమును దర్శించి, నానాస్థలములను చూస్తూ, తుళుజాపురిలో భవానీ దేవిని ఆరాధించి, పిదప మాణిక్యాంబను పూజించి, అంబాపురిలోని యోగీశ్వరియగు వరాంబను చూచి, వైద్యనాథునికి నమస్కరించి, వంజరాసంగమమునకు వచ్చి నాగేశునిదర్శించి, పూర్ణసంగమమున గోదానదికి ఉత్తరతీరమున తనపేరుతో ఒకపురమును కల్పించి, ముద్గలాశ్రమమునకు వచ్చి, సింధుసేనా సంగమమునందు బాణతీర్థమున స్నానముచేసి, గోదానదిలో అబ్జక్షేత్రమున స్నానముచేసి త్రివిక్రముని అర్చించి, గోదా తీరమున ఒక రామపురిని కల్పించి, అంబికను ఆరాధించి, చండికను అర్చించి, ఆత్మతీర్థ స్నానానంతరము విజ్ఞానేశ్వరునికి నమస్కరించి, మహాలక్ష్మిని విలోకించి, బడబా సంగమము నకు వెడలి ప్రతిష్ఠానము అవలోకించి, వృద్ధెల సంగమమున స్నానముచేసి శివానంద సంగమమున

నృశింహుని పరిపూజించి, తనపేరుతో ప్రసిద్ధతీర్థముగల ప్రవరాసంగమమునకు వచ్చెను. శ్రీరాముడు అచట సిద్ధేశ్వరుని ఆరాధించి, నివాసపురికి ఏతెంచి, నూపురపురికివచ్చి, ఇట్లే పుణ్యస్థలములను అవలోకించుచు, గోదా తీరముననే పుణ్యస్తంభమును స్థాపించి, కద్రు సంగమమునకు, వినతా సంగమమునకును, జనస్థానమునకును క్రమముగా వచ్చి, త్ర్యంబక క్షేత్రమును చేరెను. దక్షిణదిక్కులోని రాజులచే పూజింపబడి శ్రీరాముడు వారినుండి కానుకలను గైకొని, వారిని విమానమును ఎక్కించుకుని వెడలెను.

విష్ణుదాసుడా! శ్రీరాముడు త్రయంబక క్షేత్రమువరకు చేసిన దక్షిణ దిక్కు యాత్రను గురించి నీకు చెప్పబడినది.” అని రామదాసుడు చెప్పెను.

***శతకోటి ప్రవిస్తరమైన రామకథలో, శ్రీమద్వాల్మీకిమహర్షిచే రచింపబడిన, ఆనందరామాయణములోని, యాత్రాకాండలో, దక్షిణదేశతీర్థయాత్రావర్ణనమనే ఏడవ సర్గ ముగిసినది.***



# అష్టమః సర్గః-8వ సర్గ

## శ్రీరాముని పశ్చిమదేశయాత్ర

విష్ణుదాస ఉవాచ

గురో జాతోఽస్తి సందేహో మమ చిత్తే వదామ్యహమ్ ।
స త్వయా ఛిద్యతాం స్వామిన్ సాధవో హి కృపాళవః ॥ 1

యానారూఢా న కర్తవ్యా యాత్రా చేతి శ్రుతం మయా ।
కథం యానేన రామేణ కృతా యాత్రా త్వయేరితా ॥ 2

ఇతి జాతోఽస్తి సందేహో మమ తం త్వం నివారయ ।
ఇతి శిష్యవచః శ్రుత్వా గురుః ప్రాహోథ తం పునః ॥ 3

శ్రీరామదాస ఉవాచ

పదా యాత్రా న కర్తవ్యా ఛత్రచామరధారిణా ।
రాజ్ఞా ద్వీపాధిపత్యేన కార్యా మాండలికేన తు ॥ 4

పృథివీశస్య దేవస్య లగ్నోద్యుక్తవరస్య చ ।
తథా మఠాధిపస్యాపి గమనం న పదా స్మృతమ్ ॥ 5

తస్మాన్నాత్ర త్వయా కార్యః సందేహో రాఘవం ప్రతి ।
ఆజ్ఞయా రామచంద్రస్య కృపయాఽపి చ తైర్జ్ఞైః ॥ 6

అధిష్ఠితం పుష్పకం తు కో దేవేశ్వరచేష్టితమ్ ।
ఇదానీం రామచంద్రస్య శృణు తాం ప్రాక్తనీం కథామ్ ॥ 7

త్ర్యంబకాద్రామచంద్రస్య పురా యత్ర తు నిద్రితమ్ ।
సీతయా పర్వతే తత్ర గత్వా స్థిత్వా దినత్రయమ్ ॥ 8

సప్త శృంగగిరౌ గత్వా గత్వాఽగస్తేస్తు చాశ్రమమ్ ।
సుతీక్ష్ణస్యాశ్రమం గత్వా యయౌ చైలపురం తతః ॥ 9

ఘృష్ణేశ్వరం నమస్కృత్య శివతీర్థే విగాహ్య చ ।
దృష్ట్వా రమ్య దేవగిరిం విరజాక్షేత్రమాయయౌ ॥ 10

మాతాపురస్థాం దేవీం తాం నత్వా పశ్యన్ స్థలాని సః ।
దేవవాటే నారసింహ నత్వా రామశ్చ సీతయా ॥ 11

చకార విధివత్స్నానం పయోష్ణ్యాం బంధుభిర్జనైః ।
స్నాత్వా తాప్యుద్భ్యమం రామః స్వనామ్నా పర్వతోత్తమమ్ ॥ 12

గత్వా స్నాత్వాఽథ రేవాయామోంకారం పరిపూజ్య చ ।
పశ్చిమాభిముఖః పశ్యన్నానాపుణ్యస్థలాని హి ॥ 13

తాప్యాశ్చ సంగమే స్నాత్వా నర్మదాయాశ్చ సంగమే ।
మహానదీజలే స్నాత్వా ప్రభాసం చ తతో యయౌ ॥ 14

## విష్ణుదాసు సందేహమును రామదాసు తొలగించుట

శిష్యుడైన విష్ణుదాసు గురువుగారైన రామదాసును అడుగుచున్నాడు. "స్వామీ! నాకు ఒక సందేహము కలిగినది. దయచేసి సందేహమును తొలగించగలరు. సాధువులు దయావంతులు గదా! యాత్రజేయువారు వాహనమును ఎక్కకూడదని వినియున్నాను మరి శ్రీరామచంద్రుడు ఎందుకు పుష్పకవిమానమును ఎక్కి యాత్రజేసెను?" అని అడుగగా, అందుకు రామదాసు చెప్పుచున్నాడు– "ఛత్ర చామరములను ధరించిన ద్వీపాధిపతి యగు రాజు కాలినడకతో యాత్రచేయరాదు. మండలాధి పతి ఒకవేళ చేయవచ్చును. మరియు రాజుకు, దేవునికి, పెండ్లిలోని వరునికి, మఠాధిపతికి కాలినడక కూడదు. కనుక శ్రీరాముని విషయమునందు నీవు సందేహించవలదు. తక్కినవారికన్నను శ్రీరామాజ్ఞవలన అందరును వాహనారూఢులైరి. జగదీశ్వరుని చర్య ఎవరికి తెలియును? ఇంక రామచంద్రుని పశ్చిమదిక్కుయాత్ర కథను వినుము. (7)

"త్రయంబకమునుండి రాముడు బయలుదేరదలచినను, సీత ఆ పర్వతమున మూడురాత్రులు ఉండదలచెను. పిదప సప్తశృంగ పర్వతమునకు వెడలి, అక్కడినుండి అగస్త్యాశ్రమమునకు పోయి, సుతీక్ష్ణ ఆశ్రమమును చూచి, మైలపురమునకు చేరిరి. పిదప శ్రీరాముడు ఘృష్ణేశ్వరమునకు నమస్కరించి, శివ తీర్థమున స్నానముచేసి, రమ్యమగు దేవగిరిని చూచి, విరజా క్షేత్రమునకు వచ్చి, తల్లియెదుట ఉండు దేవుని దర్శించి, తక్కిన స్థలములను చూచుచు వచ్చి, దేవ వాటమున

నారశింహునికి నమస్కరించెను. అందరితో విధివిధానముగా పయోష్ణిలో స్నానముచేసి, తాపీ నదీమూలమున తనపేర ఒక కొండను ఏర్పరిచి, రేవానదిలో స్నానముచేసి, ఓంకారేశ్వరుని ఆరాధించి, పశ్చిమాభిముఖముగా వివిధ పుణ్యస్థలములను దర్శిస్తూ, తాపీసంగమాన, మదాసంగమములోను, మహీనదీయందును స్నానముచేసి, ప్రభాస క్షేత్రమునకు వచ్చెను.

పంచసరస్వతీనాం చ సంగమేషు విగాహ్య చ ।
సౌరాష్ట్రస్థం సోమనాథం దృష్ట్వా సా భ్రమతీం నదీమ్ ॥ **15**

పశ్యన్నానాస్థలాన్యేవం శంఖోద్ధారం యయౌ తతః ।
గోమత్యాం విధివత్స్నాత్వా ద్వారావత్యాం వివేశ సః । **16**

అనాదిసిద్ధాం సప్తసు పురీషు ప్రథితాం శుభామ్ ।
దృష్ట్వా కృత్వా తీర్థవిధిం దత్వా దానాన్యనేకశః ॥ **17**

పశ్యన్తీర్థాని సర్వాణి పుణ్యాని రఘునందనః ।
పాశ్చిమాత్యైర్నృపతిభిర్మానితః పూజితోఽపి చ ॥ **18**

గృహీత్వా కరభారం స్వం తేభ్యస్తైః సహితో యయౌ ।
సరస్వత్యాస్తటేనైవ పశ్యన్పుణ్యస్థలాని సః ॥ **19**

పుష్పకస్థః శనై స్సీతాం దర్శయన్ కౌతుకాని హి ।
యయౌ పుష్కరతీర్థం వై నృపైః సర్వత్ర సంవృతః ॥ **20**

విమానే ప్రత్యహం రామః కోటిశో బ్రాహ్మణాన్ సదా ।
భోజయామాస దివ్యాన్నైః పాయసైః శర్కరాదిభిః ॥ **21**

విమానే యే స్థితాః పూర్వమయోధ్యాపురవాసినః ।
తథా యే పూర్వదేశీయా దాక్షిణాత్యా నృపాశ్చ యే ॥ **22**

పాశ్చిమాత్యా నృపా ఏవం తే బలైర్వాహనైః సహ ।
రామేణాతిథివత్సర్వే వస్త్రాన్నాభరణాదిభిః ॥ **23**

పూజితా మానితా ఆసన్ సాదరం తే యథాసుఖమ్ ।
నకశ్చిద్భిన్నపాకం హి చకార పుష్పకే నరః ॥ **24**

**చింతా కాష్ఠతృణాదీనాం జలస్యాపి న కస్యచిత్ ।**
**ఏకా చింతా తు తత్రాస్తి క్షుద్బోధో మే కథం భవేత్ ॥ 25**

**వాంఛన్తి సర్వే తత్రైకం భిషక్ చూర్ణం ప్రదాస్యతి ।**
**నిద్రాయాస్తత్ర దారిద్ర్యం వాద్యఘోషైర్నిరంతరమ్ ॥ 26**

**త్రాసస్తత్ర మహానాసీద్విమానే వారయోషితామ్ ।**
**గీతైర్నేత్రకటాక్షైశ్చ క్రీడాభిర్వచనాదిభిః ॥ 27**

పంచసరస్వతి సంగమమున మునిగి, సౌరాష్ట్రమునందలి సోమనాథ స్వామిని దర్శించి, సాభ్రమతి నదిలో దిగి, ఇట్లే నానాస్థలములను వీక్షించుచు, శంకోద్ధారమునకు వచ్చెను. పిదప రాముడు గోమతి నదిలో యథావిధిగా స్నానముచేసి, ద్వారావతిన ప్రవేశించెను. ఆ నదీ సిద్ధములగు సప్తమోక్ష పట్టణములలో ప్రసిద్ధమైన ద్వారావతిని చూచి, తీర్థవిధిని ఆచరించి, దానధర్మములను ఆచరించి, శ్రీరాముడు ఇంకా అనేక పుణ్యస్థలములనుచూచి, పశ్చిమ దేశరాజులచే పూజింపబడి, వారినుండి కానుకలనుగైకొని, వారినందరిని పిలుచుకుని సరస్వతీ తీరమున పుణ్య స్థలములను పరిశీలించుచు, పుష్పకవిమానమును ఎక్కి పుష్కర క్షేత్రమునకు వచ్చి, రాజులందరితో కూడి సంతృప్తినందెను. (20)

శ్రీరాముడు ప్రతిదినమును కోట్లకొలది బ్రాహ్మణులకు దివ్యాన్నపానీయములచే సంతర్పణ చేయుచుండెను. ఆ పుష్పకవిమానమున అయోధ్యలో మునుపున్నవారును, పూర్వ, దక్షిణ, పశ్చిమ దేశీయులగు రాజులును, సైన్యములును, పరివారజనులును అందరును శ్రీరామునివలన అతిథుల వలె సాదరముగా సమ్మానింపబడి, యథాసుఖముగా ఉండిరి. ఒక్కడును వేరుగా వంటచేయలేదు. ఎవ్వరికిని తృణ కాష్ట జలాదుల చింతలేదు. అచట నాకు ఎట్లు భోజనము లభించును అనే చింతేలేదు. అచట అందరును ఆకలికి మందును మాత్రము అడుగుచుందురు. సంతత వాద్యధ్వనులచే నిద్రకు దారిద్ర్యము కలిగినది. గీతాభినయ క్రీడావచనములచే వారకాంతలకు మిక్కిలి భయము కలుగుచుండును.

**మణిదీపైర్దినం రాత్రిం న జానాతి స్మ తత్ర వై ।**
**గచ్ఛద్దినే కదా యానం యాతి రాత్రావపి క్వచిత్ ॥ 28**

**ఏతస్మిన్నంతరే శిష్య పుష్కరస్థైర్జనైస్తదా ।**
**మహానాదః శ్రుతో రమ్యో మంజులః శ్రుతితోషకృత్ ॥ 29**

వారస్త్రీనూపురోద్భూతః క్వణత్కంకణజోఽపి చ ।
కరతాడనగీతాదిమృదంగపణవోద్భవః ॥ 30

నవవాద్యసముద్భూతో ఘటీయంత్రసముద్భవః ।
యానఘంటాకింకిణీనాం పతాకారవసంభవః ॥ 31

వారాంగనాకటితటకింకిణీసంభవోఽపి చ ।
వారణాశ్వాయుధౌష్ట్రాది మయూరకపిసంభవః ॥ 32

వీరేభ్యో వేదఘోషేభ్యః శిష్యేభ్యశ్చ సముత్థితః ।
నటనాటకబందిభ్యో మాగధేభ్యః సముత్తితః ॥ 33

గోదోహసంభవశ్చాపి హ్యజామహిషిదోహజః ।
దధిమంథనసంభూతః శిశూనాం రోదనోద్భవః ॥ 34

శిశుమంచకసంబద్ధశృంఖలాభ్యః సముత్థితః ।
నానాతూర్యోద్భవశ్చాపి పిష్టచక్రసముద్భవః ॥ 35

ఘృతపాచితపక్వాన్నప్రకారకరణోద్భవః ।
నారదాదిమునిశ్రేష్ఠధృతవీణాదిసంభవః ॥ 36

పురాణకథనోద్భూతో హరికీర్తనసమ్భవః ।
రామనామసహస్రాదిస్తోత్రపాఠసముద్భవః ॥ 37

నారీపురాణపేషణకార్యే కంకణసమ్భవః ।
పాదప్రక్షాళనాద్యాదినానాకార్యాసముద్భవః ॥ 38

ఏవం నానావిధం శ్రుత్వా పుష్కరస్థా జనా ధ్వనిమ్ ।
నిశాన్తే పశ్చిమామాసాం కిమేతదితి విహ్వలాః ॥ 39

కేచిదూచుర్నందిఘంటాస్వరోఽయం శ్రూయతే మహాన్ ।
కేచిదూచుర్విమానేన గచ్ఛతీంద్రో దివం ప్రతి ॥ 40

**కేచిదూచుః సమాయాంతి రంభాద్యాప్సరసశ్చ ఖే ।**
**కేచిన్మేఘధ్వనిం ప్రోచుః కేచిదైరావతం త్వితి ॥ 41**

**కేచిత్ప్రోచుః సమాయాతి సాగరః కిం లయం వినా ।**
**కేచిత్ప్రోచుస్త్విదం జ్ఞేయం వాయుపుత్రస్య శబ్దితమ్ ॥ 41**

**కేచిత్పుత్రత్రిరాజస్య శబ్దితం ప్రోచురుత్తమమ్ ।**
**కేచిత్ప్రోచుశ్చ గంధర్వా విమానస్థా అటతి ఖే ॥ 42**

అచట రత్నదీపాలచే ఎవ్వరును పగటికి రాత్రికి తేడా తెలుసుకొనలేకపోయిరి. విమానము పగలును, రాత్రులలోను ప్రయాణించుచుండెను. ఇట్లుండ పుష్కర పురవాసులు మహాశబ్దమును వినిరి అది యేమనిన– విమానములోని మంగళ వేదఘోష, వారనారులు, దివ్యాభరణ ధ్వనులు, వీణావేణు మృదంగాది వాద్యనాదములు, వాహనములు, గంటాది ధ్వనులు, వీరులు సంరావములు, హరికీర్తన స్వరములు, రామనామ పారాయణములు, వంది మాగదుల జయజయధ్వానములు, బాలుర రోదనలు, గో మహిష్యాది దోహన శబ్దములు, నారదాదుల వీణా నాదములు, గడియారపు శబ్దములు, పురాణశ్రవణ సన్నాదములు, నారీ నరుల వివిధ పనులలోని వివిధ ధ్వనులును కలిగి ఇట్లు నాద బ్రహ్మమయమై యుండు విమానము వచ్చుచుండగా వేకువజామున పుష్కరవాసులలో కొందరు ఏమిది? మహానందియొక్క గంటాధ్వని వినవచ్చుచున్నదనియు, కొందరు విమానముమీద ఇంద్రుడు స్వర్గమునకు పోవుచున్నాడనియు, కొందరు గగనమున రంభాదులు వచ్చెదరనియును,

**కేచిత్ప్రోచుర్నాగకన్యాః కుర్వంతీదం సుగాయనమ్ ।**
**కుర్వంతశ్చేతి తర్కాంశ్చ దదృశుః పుష్పకం మహత్ ॥ 44**

**రామమాగతమాజ్ఞాయ తోషపూర్ణా బభూవిరే ।**
**ఉపాయనాని సంగృహ్య ప్రేమనిర్భరమానసాః ॥ 45**

**ప్రత్యుజ్జగ్ముస్తదా రామం దృష్ట్వా నత్వా రఘూత్తమమ్ ।**
**మేనిరే జన్మసాఫల్య రాఘవేణాతిమానితాః ॥ 46**

**రాఘవోఽపి విమానాగ్ర్యాదవరుహ్య ద్విజోత్తమాన్ ।**
**ప్రణిపత్య సమాభాష్య ప్రతిపూజ్య సవిస్తరమ్ ॥ 47**

తైస్తీర్థవాసిభిర్యుక్తో యయౌ పుష్కరముత్తమమ్ ।
స్నాత్వా సుచైలం విధినా తీర్థశ్రాద్ధం విధాయ చ ॥ 48

దత్వా దానాన్యనేకాని కాశ్యాః కోట్యధికాని తు ।
ద్రవ్యాలంకారవస్త్రాన్నైస్తోషయామాస భూసురాన్ ॥ 49

తతస్తైరభ్యనుజ్ఞాతో విమానేన యయౌ పునః ।
ఏవం పశ్చిమయాత్రా తే వర్ణితా రాఘవస్య హి ॥ 50

**ఇతి శ్రీశతకోటిరామచరితాంతర్గతే, శ్రీమదానందరామాయణే, వాల్మీకీయే, ఆదికావ్యే, యాత్రాకాండే, పశ్చిమయాత్రావర్ణనం నామ, అష్టమః సర్గః ॥**

కొందరు మేఘగజములనియు, కొందరు ఐరావత బృహితమనియు, కొందరు ప్రళయమొచ్చెనని, సాగరఘోష అనియు, కొందరు ఇది ఆంజనేయ ఆర్భాటమనియు, కొందరు గరుడనాదమనియు, కొందరు గంధర్వులు విమానారూఢులై సంచరించెదరనియు, కొందరు నాగకన్యకల గానమనియును వితర్కించుచు, శ్రీరామ పుష్పకమునుచూచి ఎందరో ఆనందించిరి. పిదప అచటివారందరును సభాప్తికముగ ఉపాయమును అందుకొని సంతుష్టులై, సప్రేమముగా శ్రీరాముని దర్శించి, తమ జన్మసాఫల్యతను భావించుకుని శ్రీరామునికి నమస్కరించిరి. శ్రీరాముడు విమానమునుండి దిగి, బ్రాహ్మణోత్తములను పలుకరించి, యథావిధిగా వారిని అర్చించి, అచట తీర్థవాసులతోడ శ్రేష్ఠమైన పుష్కరమును చేరెను. శ్రీరాముడు అచట స్నానముచేసి, యథావిధిగా తీర్థశ్రాద్ధమును పెట్టి, కాశీ కన్నను కోటింతలుగా దాన ధర్మములను, వస్త్ర అన్నపాన అలంకారాదులను పంచెను. పిదప వారిచే అనుజ్ఞనొంది, శ్రీరాముడు ఉత్తరదిక్కునకు వెడలెను. ఇట్లు పశ్చిమాది కీర్తియాత్ర నీకు చెప్పితిని. (50)

***శతకోటిప్రవిస్తరమైన రామకథలో, శ్రీమద్వాల్మీకిమహర్షిచే రచింపబడిన, ఆనందరామాయణంలోని, యాత్రాకాండలో, పశ్చిమదేశతీర్థయాత్రావర్ణనమనే ఎనిమిదవసర్గ ముగిసినది.***



# నవమః సర్గః-9వ సర్గ

## శ్రీరాముని ఉత్తరదేశ యాత్ర

**శ్రీరామదాస ఉవాచ**

**ఉత్తరాభిముఖో రామస్తతః పశ్యన్ స్థలాని సః ।**
**యయౌ పర్వతతీర్థం చ తతో జ్వాలాముఖీం యయౌ ॥ 1**

**పశ్యన్ స్థలాని సంప్రాప తప్తాం శ్రీమణికర్ణికామ్ ।**
**కరతోయానదీతోయే స్నాత్వాఽగ్రే న యయౌ విభుః ॥ 2**

**తరణే దోషమాకర్ణ్య పర్యవర్తత రాఘవః ।**
**కర్మనాశానదీస్పర్శాత్కరతోయావిలంఘనాత్ ॥ 3**

**గండకీబాహుతరణాద్ధర్మః స్ఖలతి కీర్తనాత్ ।**
**గత్వా దేవప్రయాగం చాలకనందాతటేన వై ॥ 4**

శ్రీరామదాసు చెప్పుచున్నాడు, “తరువాత శ్రీరాముడు ఉత్తరాభిముఖముగా వెడలి, పుణ్యస్థలములను దర్శించుచు, పర్వత తీర్థమునకు వచ్చి, పిదప జ్వాలాముఖికి పోయి, అట్లే తీర్థస్థలములను చూచుచు, తప్తయగు శ్రీమణికర్ణికను చేరెను. కరతోయ నదీతీరమున స్నానముచేసి దాటిపోవుటలో దోషమును విని ముందుకు వెడలలేదు. ఆ దోషమేమనిన ‘కరముతో ఆ నదిని స్పృశించుటచేతను, కరముతో ఆ నదిని దాటుటచేతను, గండకి నదిని ఈదుటచేతను, చేసిన ధర్మమును చెప్పుకొనుటచేతను పుణ్యము నశించును’ అందువలన వెనుకకు మరలి, దేవ ప్రయాగకు వచ్చెను.

**నరనారాయణౌ గత్వా దర్శనాన్ముక్తిదౌ నృణామ్ ।**
**బదరికాశ్రమే రామః కేదారేశ విలోక్య సః ॥ 5**

**హిమాద్రౌ దేవగంధర్వసేవితే ధాతుమండలే ।**
**మహాపథం తతో గత్వా యయౌ తన్మానసం సరః ॥ 6**

**యస్మాద్ద్వినిర్గతా గంగా సరయూః పాపనాశినీ ।**
**కంజాని యత్ర హైమాని యత్ర హంసాః సహస్రశః ॥ 7**

రక్తనేత్రాంఘ్రివదనా ముక్తాభక్షణతత్పరాః ।
యత్ప్రదేశే చిత్రభూమ్యాం దేవగంధర్వకిన్నరాః ॥ 8

అప్సరోభిస్తథా స్త్రీభిః క్రీడాం కుర్వంత్యహర్నిశమ్ ।
తత్ర స్నాత్వా మానసేऽథ గత్వా బిందుసరోవరమ్ ॥ 9

స్నాత్వా దానాదికం కృత్వా హిమాలయగిరిస్థితామ్ ।
దృష్ట్వా బ్రహ్మసభాం దివ్యాం మేరుస్థసదృశీం పరామ్ ॥ 10

రాఘవః సీతయా సర్వైరవరుహ్య స పుష్పకాత్ ।
ప్రణమంతం సురేంద్రాద్యైరాలింగ్య చతురాననమ్ ॥ 11

బ్రహ్మణా సహితాన్దేవాన్పూజయామాస విస్తరైః ।
విధిస్తం పూజయామాస కామధేనుం న్యవేదయన్ ॥ 12

విమానాగ్రే కామధేనుం సంస్థాప్య రఘునందనః ।
సురైర్బ్రహ్మాదిభిః సాకం కైలాసమగమత్తదా ॥ 13

రామమాగతమాజ్ఞాయ కైలాసే గిరిజాపతిః ।
ప్రత్యుజ్జగామ పార్వత్యా రామచంద్ర వృషస్థితః ॥ 14

శంభుమాగతమాజ్ఞాయ రాఘవః పుష్పకాజ్జవాత్ ।
అవరుహ్య నమస్కృత్య శివేనాలింగితః స్థితః ॥ 15

ఉమాऽపి సీతామాలింగ్య దివ్యాలంకారచందనైః ।
పూజయామాస వస్త్రాద్యైః సూర్యకోటిసమప్రభైః ।
తాటంకే నూపురే దివ్యే కేయూరే చూడకద్వయమ్ ॥ 16

అలకానందా నదీతీరమున నరులకు దర్శనమాత్రముచేతనే ముక్తినిచ్చునట్టి, నరనారాయణులు ఉండు బదరికాశ్రమమును సేవించి, కేదారేశ్వరుని ఆరాధించి, రకరకాల మూలికలు లభించు చిత్రమైన దేవ గంధర్వులచే సేవింపబడే హిమాలయమున మహామార్గమున ప్రయాణించి, దురిత పరిహారకమగు గంగా, సరయూ నదులకు జన్మస్థానమైన మానస సరోవరమును చేరెను. ఎచట స్వర్ణ కమలములు, రకరకాల హంసలు కలిగిఉండునో, ఎచట ముత్యములను ఆహారముగా తీసుకునే

రాజహంసలు ఎచట కలవో, ఎచట చిత్రభూమిని ఆశ్రయించి, దేవ, గంధర్వ, కిన్నెరలు వసించు చుందురో, ఎచట వారందరును అప్సరస స్త్రీలతోడ క్రీడలనంది ఆనందించెదరో అట్టి మానస సరస్సున శ్రీరాముడు స్నానముచేసి, బిందు సరోవరమునకు పోయి, అచట అవగాహించి, దానాది సత్కర్మములను ఆచరించెను. పిదప మేరువునందుండు సభలో సమానమైన శ్రేష్ఠమగు దివ్య బ్రహ్మసభనుజూచి, సీతాసహితముగా పుష్పకమునుండి దిగి, దేవేంద్రులతో వచ్చి, నమస్కరించు బ్రహ్మను హృదయమునకు హత్తుకొని, వారినందరిని చక్కగా సత్కరించెను. బ్రహ్మదేవుడు శ్రీరాముని పూజించి, కామధేనువును అర్పించెను. తనకు సమర్పించిన కామధేనువును పుష్పకమందుంచి, బ్రహ్మాది దేవతలతో కైలాసమునకు ప్రయాణించెను. (13) కైలాసమునకు వచ్చుచున్న శ్రీరామునిజూచి, పరమేశ్వరుడు పార్వతితో నందివాహనమెక్కి స్వాగతించెను. పరమేశ్వరునిజూచి, శ్రీరాముడు వేగమే పుష్పకమునుండి దిగి శివునికి నమస్కరించి, శివునిచే ఆలింగింపబడి నిలిచెను.

**కింకిణీరవసంయుక్తరశనాం చంద్రభాస్కరౌ ।**
**సీమంతభూషణౌ హారాన్మణిముక్తావిచిత్రితాన్ ॥ 17**

**దదౌ జనకనందిన్యై పార్వతీ తోషపూరితా ।**
**తతః శంభుస్తదా ప్రాహ రాఘవ పూజ్య వైభవైః ॥ 18**

**రామ త్వన్నాభికమలే బ్రహ్మోఽయం చతురాననః ।**
**తతో జాతో విధేశ్చాహం రోదనాద్రుద్రసంజ్ఞకః ॥ 19**

**పౌత్రస్తవ రఘుశ్రేష్ఠ తవాజ్ఞాపరిపాలకః ।**
**సంహారః క్రియతే రామ ఆజ్ఞయా తవ సాదరాత్ ॥ 20**

**యదా మయా తు ప్రలయే తదా పాపం క్వ తే గతమ్ ।**
**యద్దశాస్యవధాద్భీతస్తీర్థయాత్రాం కరోషి హి ॥ 21**

**క్రీడేయం తవ రాజేంద్ర సుఖం క్రీడస్వ సీతయా ।**
**క్రియతే లోకశిక్షార్థం జానామి తవ చేష్టితమ్ ॥ 22**

**ఏవం నానావిధైస్తస్య చారిత్రైరీడ్యరాఘవమ్ ।**
**దదౌ సింహాసనం ఛత్రం చామరే మంచకోత్తమమ్ ॥ 23**

పానపాత్రం భోజనస్య పాత్రం హైమం మనోరమమ్ ।
కంకణే కుండలే బాహుభూషణే ముకుటోత్తమమ్ ॥ 24

రామం ప్రస్థాపయామాస బద్ధ్వా చింతామణిం హృది ।
హృది చింతామణిం దృష్ట్వా రాఘవస్య విదేహజా ॥ 25

ప్రాహోతిలజ్జితా రామం గౌర్మే చింతామణిస్తవ ।
తథేతి రాఘవోఽప్యుక్త్వా విమానేన జనైః సహ ॥ 26

యయౌ నత్వా శంకరం హి కృత్వా యజ్ఞార్థసూచనామ్ ।
ఆకారయిత్వాఽథ విధిం మాసైకేనాధ్వరాయ హి ॥ 27

భాగీరథ్యాస్తటేనైవ హరిద్వారం యయౌ జవాత్ ।
కురుక్షేత్రం విగాహ్యాథ ఇంద్రప్రస్థం తతో యయౌ ॥ 28

దృష్ట్వా మధువనం రమ్యం యయౌ బృందావనం తతః ।
గోకులం వీక్ష్యరామస్తు గోవర్ధనమగాచ్ఛనైః ॥ 29

## శ్రీరాముడు కైలాసమున శివునిచే సత్కరింపబడుట.

పార్వతీదేవి సీతను హత్తుకుని, కోటిసూర్యప్రకాశములగు వస్త్రాలంకారములతో సత్కరించెను. కమ్మలు, అందెలు, కడియములు, తలమీద ధరించు ఆభరణాలు, వడ్డాణములు, సూర్యచంద్రులు, పాపిటబొట్టు, హారములు మొదలైనవాటిచే సీతను అలంకరించెను. అంత ఆ శివుడు వైభవముగా శ్రీరాముని అర్చించి, "శ్రీరామా! నీ నాభికమలమున ఈ చతుర్ముఖ బ్రహ్మ అవతరించెను. అ విధినుండి యుద్భవించిన నేను రోదనముచే రుద్రుడనబడితిని. నీ ఆజ్ఞానువర్తియగు మనుమడుగా ఉన్నాను. నీ ఆజ్ఞచే సంహారక కృత్యమున ఉన్నాను. నాచేత ప్రళయమగునప్పుడు నీ పాపమెచట గలదు. రావణహత్య పాపమునకై తీర్థయాత్రచేయుట ఇదియును ఒక క్రీడకాబోలు. సీతతోడ సుఖముగా ఉండుము. ఐనా లోకమునకు ఆదర్శప్రాయముగా నీవిట్లు నటించుచుందువని నేనెరుగుదును," అని ఇట్లు నానా విధములుగా స్తుతించి- ఛత్ర, చామర, సింహాసన, మంచకాది రాజోపచారములను ఇచ్చి- కిరీటాది దివ్య ఆభరణములను సమర్పించి, హృదయమున చింతామణి కట్టి శ్రీరాముని ప్రయాణము చేయించి పంపెను. అప్పుడు సీత రామునితో లజ్జతో కూడి, "నాకు గోవు-నీకు చింతామణి," అని

వేడుకగా చెప్పెను. అట్లేయని శ్రీరాముడు విమానమును ఎక్కి, సకలజనులతో శంకరునికి నమస్కరించి, వీడ్కోలు సూచనమును చూపి, మాసములోని యజ్ఞమునకు బ్రహ్మను పిలిచి, గంగాతీరముననే వెడలి, హరిద్వారమును చేరెను. (27) పిమ్మట, కురుక్షేత్రములో ప్రవేశించి ఇంద్రప్రస్థమునకు వెడలెను. మధువనమును చూచి, బృందావనమున ప్రవేశించి, గోకులమును అవలోకించి, తిన్నగా గోవర్ధన పర్వతమునకు వచ్చెను.

**గత్వాఽథావంతికాం పుణ్యాం క్షిప్రాతీరవిరాజితమ్ ।**
**మహాకాల పురస్కృత్య పశ్యంస్తీర్థాన్యనేకశః ॥ 30**

**దృష్ట్వా రాజాహ్వయం క్షేత్రం సాగరం కూపమీక్ష్య చ ।**
**యయౌ స నైమిషారణ్యే గోమత్యాం స విగాహ్య చ ॥ 31**

**సూతం పౌరాణికం దృష్ట్వా శౌనకాదీన్ ప్రపూజ్య చ ।**
**స్నాత్వా తత్ బ్రహ్మవైవర్తసరస్యథ రఘూత్తమః ॥ 32**

**తమసాం తాం విగాహ్యాథ దదర్శ నగరీం నిజామ్ ।**
**రామమాగతమాజ్ఞాయ సుమంత్రో వేగవత్తరః ॥ 33**

**అయోధ్యాం భూషయామాస ప్రోచ్చైర్నానావిధైర్ధ్వజైః ।**
**తోరణైశ్చ పతాకాభిః పుష్పహారైర్మనోరమైః ॥ 34**

**శోధయిత్వా రాజమార్గాన్ సేచయిత్వా తు చందనః ।**
**వికీర్ణకుసుమైర్దివ్యైః బలిదీపైర్విరాజితాన్ ॥ 35**

**వారణేంద్రం పురస్కృత్య సేనయా పరివేష్టితః ।**
**ప్రత్యుజ్జగామ రాజేంద్రం పుష్పకస్థం త్వరాన్వితః ॥ 36**

**దండవత్ప్రణిపత్యాథ దత్తా చోపాయనాని తత్ ।**
**ఆలింగితో రాఘవేణ మేనే స కృతకృత్యతామ్ ॥ 37**

**తతో వాద్యనినాదైశ్చ నర్తనైర్వారయోషితామ్ ।**
**వేదఘోషైర్ద్విజానాం చ రామతీర్థం యయౌ శనైః ॥ 38**

**స్నాత్వా తత్సరయూతోయే యత్ర తీర్థం సుపుణ్యదమ్ ।**
**స్వయమేవ కృతం పూర్వం నిత్యకర్మార్థమాదరాత్ ॥ 39**

**వసిష్ఠోక్తవిధానేన కృత్వా చైకముపోషణమ్ ।**
**దధిశ్రాద్ధం విధాయాథ దత్వా దానాన్యనేకశః ॥ 40**

**తృతీయే దివసే రామో విమానేన విహాయసా ।**
**పుర్యాం విలంఘ్య ప్రాకారాన్ హేమరత్నవినిర్మితాన్ ॥ 41**

ఆ తరువాత క్షిప్రానదీతీరమున పుణ్యప్రదమగు అవంతీ నగరమునకు వచ్చి, మహాకాలునికి నమస్కరించి, అనేక తీర్థములను దర్శిస్తూ గజక్షేత్రమును చూచి, సాగర కూపమును వీక్షించి, నైమిశారణ్యమున గోమతి తీర్థమున స్నానముచేసి, పౌరాణికుడగు సూతమహర్షిని చూచి, శౌనకాది మునులను సత్కరించి, బ్రహ్మవైవర్త సరస్సునందు స్నానముచేసి, తమసానదిలో మునిగి, అయోధ్యకు తిరిగి వచ్చెను. (33).

## శ్రీరాముడు తీర్థయాత్రలను ఆచరించి అయోధ్యకు వచ్చి సుఖించుట.

పిదప జాగరూకుడగు సుమంత్రుడు విజయముగా వచ్చుచున్న శ్రీరామచంద్రునిచూచి, అయోధ్యానగరమును వివిధ ధ్వజములతోను, తోరణ పతాకాదుల తోను, పుష్పహారములతోను అలంకారము చేయించి, రాజమార్గములకు చందనము కలిపిన కళ్ళాపు చల్లించి, పూలహారములను వ్రేలాడదీయించి, బలిదీపములను పెట్టించి, పట్టపుటేనుగును ముందుపెట్టుకుని, సకలసేనలతో కూడి, పుష్పక విమానములో వచ్చుచున్న శ్రీరామునికి స్వాగతము పలుకుటకు సాగెను. ఇట్లు వెడలిన సుమంత్రుడు సాష్టాంగదండ ప్రణామములుచేసి, కానుకలను సమర్పించి, శ్రీరామునిచే ఆలింగింపబడి, తానూ ధన్యుడనైతిని అనుకొనెను. పిమ్మట శ్రీరాముడు మంగళవాద్యములతోను, నృత్యగీతాదుల తోను, బ్రాహ్మణుల వేదఘోషలతోను ముందుకు సాగెను. సరయూనదిలో నిత్య కర్మార్థము మునుపు తాను తన పేరుతో ఏర్పరచిన తీర్థరాజమునకు వచ్చి, స్నానముచేసి, వశిష్ఠులవారు ఆనతిచ్చినట్లు ఒక ఉపవాసముచేసి, దధిశ్రాద్ధమును ఆచరించి, అనేక దాన ధర్మములను చేసి, మూడవనాడు అయోధ్యనగరములోనికి ప్రవేశించెను.

**అయోధ్యాం శోభితాం రమ్యాం గోపురాట్టాలమండితామ్ ।**
**వీథీహట్టసమాయుక్తాం చతుష్పథవిరాజితామ్ ॥ 42**

**పశ్యన్ స్వీయం రాజసభాద్వారం ప్రాహ రఘూత్తమః ।**
**యానం భూమండలం ప్రాప్య సుఖమాసీత్ స్థిరం తదా ॥ 43**

తతః స్సుమంత్రపత్నీభిః దధ్యోదనవినిర్మితాః ।
బలయః కాంస్యపాత్రస్థా జలతైలఘటాస్తథా ॥ 44

సీతారాఘవయోర్దేహాదుత్తీర్య శతశస్తదా ।
నీత్వా త్యక్త్వా విదూరే తు స్నాత్వా రామగృహం యయుః ॥ 45

తతో రామో విమానాగ్ర్యాదవరుహ్య స బంధుభిః ।
నాగరైస్తైర్నృపతిభిః సభాయాం సంవివేశ హ ॥ 46

తస్థౌ సింహాసనే రామశ్చింతామణివిరాజితః ।
తస్థుర్నృపాః సభాయాం శ్రీరాఘవేణాతిమానితాః ॥ 47

సీతాఽపి నిజగేహం సా విచిత్రరత్ననిర్మితమ్ ।
కామధేనుం పురస్కృత్య ప్రవివేశాతిహర్షితా ॥ 48

తతో రామః కామధేనుసంభూతైఃఘృతపాచితైః ।
పరమాన్నైః షడ్రసైశ్చ భోజయామాస భూసురాన్ ॥ 49

అచండాలాంస్తర్పయిత్వా స్వయం కృత్వాఽశనం తదా ।
నిద్రార్థం నృపతీన్ యానే స్థలమాజ్ఞాపయత్తదా ॥ 50

పంచరాత్రం నృపాన్ ప్రీత్యా స్థాపయిత్వా స్వసన్నిధౌ ।
వస్త్రాలంకారతురగైస్తోషయిత్వా సువిస్తరామ్ ॥ 51

తాన్ ప్రోవాచ రమానాథః ప్రబద్ధకరసంపుటాన్ ।
మమ యజ్ఞాంగతురగం దృష్ట్వా తత్పృష్ఠగైః పునః ॥ 52

ఆగంతవ్యం జానపదైః స్వసైన్యైర్నాగరైః సహ ।
ఇత్యాజ్ఞాం రఘువీరస్య హ్యంగీకృత్య నృపోత్తమాః ॥
యయుః స్వం స్వం పురం దేశం స్వబలైః పరివేష్టితాః ॥ 53

సుగ్రీవాద్యాన్ వానరాంశ్చ పరివారసమన్వితాన్ ।
ఆజ్ఞాపయిత్వా సద్మాని స్థాపయామాస స్వాంతికే ॥ 54

అయోధ్య నగర ప్రాకారమును దాటి; బంగారము, రత్నములతో నిర్మితమైన నగర గోపురాలను దాటి, చక్కగా అలంకరింపబడిన తన అయోధ్యరాజధానిని చూచుచు వచ్చి, రాజసభాద్వారమున విమానము నేలపై నిలిచెను. అంతట సుమంత్ర పత్నులు పెరుగు అన్నముచే ఏర్పరచిన బలులను, కంచుపాత్రలలో ఉంచుకుని, నీటి కుండలతోను, నూనె కుండలతోను శ్రీసీతీరాములకు దిష్టితీసి, వాటిని దూరంగా విసిరివేసి, స్నానముచేసి, రామమందిరమునకు విచ్చేసిరి. పిదప చింతామణి విరాజితుడగు శ్రీరాముడు పుష్పక విమానమునుండి దిగి, తమ్ములను, నగరప్రజలను, రాజులను, వెంటతీసుకుని, సభలోనికి ప్రవేశించి సుఖముగా కూర్చొనిరి. జానకీదేవి కామధేనువుతో దివ్య రత్నములతో శోభిస్తూ తన అంతఃపురమున ప్రవేశించెను. (48)

## శ్రీరాముడు సమస్తపరివారమును, ప్రజలను తృప్తులనుచేయుట.

తరువాత శ్రీరామచంద్రుడు కామధేనువు వలన వచ్చిన నేతితో కూడిన మంచి వంటకములతోను, పరమాన్నముతోను, షడ్రస భోజ్య వస్తువులచేత బ్రాహ్మణసమారాధనచేసెను. అన్నివర్గముల ప్రజలను సంతృప్తులనుజేసి, పిదప తానూ భుజించి, పుష్పకమున రాజులందరికిని శయనించుటకు సుఖనిద్రాస్థలములను ఇచ్చెను. ఇట్లు ఐదురాత్రులపాటు రాజులందరూ రాజసన్నిధిలో ఉండిరి. శ్రీరాముడు రాజులందరిని మంచి వస్త్ర, ఆభరణములచే సమ్మానించెను. శ్రీరాముడు రాజులను చూచి, "నాయొక్క యజ్ఞాశ్వమును జూచి, దానిని అనుసరించి వచ్చువారితో మీరందరును సపరివారముతోను, సైన్యములతోను, నగరప్రజలతోను రావలయును," అని ఆజ్ఞాపించెను. వారును రాజాజ్ఞను శిరసావహించి, వారివారి బలములతో తమతమ నగరములకు వెడలిరి.

**వాజిమేధానంతరం హి ప్రేషయిష్యామ్యహం త్వితి ।**
**తతో దుందుభినిర్ఘోషం స్వపుర్యాం ఘోషయత్తదా ॥ 55**

**అద్యారభ్య జనైః సర్వైరయోధ్యానగరీస్థితైః ।**
**యైః కైశ్చిదత్ర పథికైర్భిన్నపాకైర్న భుజ్యతామ్ ॥ 56**

**యావత్కరోమ్యహం భూమ్యాం రాజ్యం సీతాసమన్వితః ।**
**నిజగార్హస్థ్యమాలంబ్య యే వర్తన్తే నరోత్తమాః ॥ 57**

**తే కుర్వంతు సుఖం పాకం స్వస్వగేహేషు భక్తితః ।**
**నిర్బంధో మమ న జ్ఞేయో వర్తితవ్యం యథాసుఖమ్ ॥ 58**

ఇత్యాజ్ఞాప్య జనాన్ రామః సుఖం తస్థౌ స సీతయా ।
అయోధ్యాయాం తు సర్వత్ర వేదఘోషో గృహే గృహే ॥ 59

మంగలానిసముత్సాహో నర్తనం వారయోషితామ్ ।
బభూవుశ్చ పురాణాని కీర్తనాని హరేః కథా ॥ 60

ఏవమాసీత్సుసంతుష్టా సాకేతనగరీ శుభా ।
ఏవం ప్రోక్తం మయా శిష్య యాత్రాకాండమనుత్తమమ్ ॥ 61

యే శృణ్వన్తి నరా భక్త్యా తేషాం యాత్రాఫలం భవేత్ ।
యాత్రాధనార్జనోద్యోగే యాత్రాకాండమిదం వరమ్ ॥ 62

పఠిత్వా యే తు గచ్ఛన్తి సుఖేనాయాంతి తే గృహమ్ ।
బ్రహ్మహత్యాదిపాపాని కృతాని మానవైః సకృత్ ॥ 63

యాత్రాకాండమిదం జప్త్వా శుద్ధిస్తేభ్యో భవిష్యతి ।
సర్వతీర్థావ గాహైశ్చ యత్ఫలం పరికీర్తితమ్ ॥ 64

యాత్రాకాండమిదం శ్రుత్వా తత్ఫలం ప్రతిపద్యతే ।
ధనార్థీ ధనమాప్నోతి కామీ కామానవాప్నుయాత్ ॥ 65

పాపీ పూతో భవేత్సద్యో యాత్రాకాండశ్రవాదినా ।
యః కశ్చిత్ప్రాతరుత్థాయ కృతశౌచవిధిర్నరః ॥ 66

తీర్థానాం చ వరం కాండమిదం పుణ్యం పఠిష్యతి ।
తస్య రామశ్చ సంతుష్టః పూరయిష్యతి వాంఛితమ్ ॥ 67

సర్వతీర్థావగాహస్య ఫలం తస్య భవేద్ధ్రువమ్ ।
యాని కాని చ పాపాని జన్మాంతరకృతాని చ ॥ 68

తాని సర్వాణి నశ్యంతి యాత్రాకాండశ్రవాదినా । 69

**ఇతి శ్రీ శతకోటిరామచరితాంతర్గతే, శ్రీమదానందరామాయణే, వాల్మీకీయే, ఆదికావ్యే, యాత్రాకాండే, రామోత్తరయాత్రా నగరప్రవేశో నామ, నవమః సర్గః ॥**

## ఇతి యాత్రాకాండః సమాప్తః ॥

సుగ్రీవాది వానరులతో, వారి పరివారజనులతో, శ్రీరాముడు, "మిమ్ములను అశ్వమేధ యజ్ఞము తరువాత పంపెదను," అని, వారికి విడిది ఇండ్లనుచూపి, తన సన్నిధిలో ఉంచుకొనెను. "ఈ దినము మొదలు నేనీ భూమిలో రాజ్యమేలుచుండునంతవరకు ఈ అయోధ్యనగరమున నివశించువారంతా వేరెక్కడా భుజించకూడదు. తమతమ గృహస్థాశ్రమ ధర్మావలంబులగు వారు వారివారి ఇండ్లలో యథాసుఖముగా వండి భుజింపదగును. నా ఈ నిబంధన ఉల్లంఘింపరాదు. అందరును యథా సుఖముగా ఉండదగును." అని ఇట్లు భేరీవాద్యములతో ఊరివారికి చాటింపు వేయించి, సీతతో సుఖముగా ఉండెను. అయోధ్యలో ఎచట విన్నను వేదఘోషయే. ఇంటింటను మంగళ నృత్య గీత వాద్యములే. అంతటా హరికీర్తనలే, పురాణపఠనములు జరుగుచుండెను. ఇట్లు సాకేతనగరము ఆనందముగా ఉండెను.

విష్ణుదాసా! నీకిట్లు శ్రీరాముని ఉత్తరయాత్ర చెప్పబడినది. ఈ యాత్రాకాండను ఎవరు భక్తిచే వినుచుందురో వారు యాత్రాఫలమును అందెదరు. యాత్రజేసి, ధనమును ఆర్జించువారు దీనిని చదివినచో సుఖముగా వచ్చి ఇల్లుచేరుదురు. బ్రహ్మహత్యాది సమస్తపాపములును పరిహరింపబడును. ఈ యాత్రాకాండమును విన్నవారు సర్వతీర్థ స్నాన ఫలమును అనుభవించెదరు. దీనిని పఠించినవారు ధనమును కోరినచో ధనము లభించును. కోరికలు కలిగినవారు తమ కోర్కెలు తీరి సుఖింతురు. పాపాత్ముడు పుణ్యమూర్తియగును. ఎవరు ఉదయమే నిద్రలేచి తన నిత్య కర్మానంతరము భక్తితో చదువుదురో వారికి శ్రీరాముడు కోరినది అనుగ్రహించును. సర్వతీర్థ స్నానఫలము లభించును. యాత్రాకాండ శ్రవణముచే జన్మజన్మాంతర కృత పాపములు నశించును. (9)

***శతకోటిప్రవిస్తరమైన రామకథలో, శ్రీమద్వాల్మీకిమహర్షిచే రచింపబడిన, ఆనందరామాయణంలోని, యాత్రాకాండలో, శ్రీరామ ఉత్తరదేశ యాత్ర, నగరప్రవేశ వర్ణనమనే తొమ్మిదవసర్గ ముగిసినది.***

## యాత్రాకాండ ముగిసినది.



## 3. యాగ కాండ వివరములు

| సర్గ. | శ్లోకాలు |
|---|---|
| 1. | 60 |
| 2. | 63 |
| 3. | 61 |
| 4. | 72 |
| 5. | 54 |
| 6. | 54 |
| 7. | 77 |
| 8. | 88 |
| 9. | 100 |

**మొత్తం 9 సర్గలు, 629 శ్లోకాలు.**



# ప్రథమః సర్గః-1వ సర్గ

యజ్ఞసామాగ్రిని సేకరించుట

శ్రీరామదాస ఉవాచ

అథ రామః సభామధ్యే ఏకదా గురుమబ్రవీత్ ।
కుంభోదరమునేర్వాక్యాత్తీర్థయాత్రా మయా కృతా ॥ 1

ఇదానీం తస్య వాక్యేన వాజిమేధ కరోమ్యహమ్ ।
యజ్ఞోపకరణాని త్వం లక్ష్మణాయ వదస్వహి ॥ 2

సుముహూర్తే శుభే లగ్నే శ్యామకర్ణాంఘ్రిపుచ్ఛకః ।
తురంగో దివ్యవస్త్రాద్యైర్భూషయిత్వా విముచ్యతామ్ ॥ 3

పృథ్వీ ప్రదక్షిణార్థం హి తత్పృష్ఠేఽయుత సంఖ్యయా ।
సేనయా సహ శత్రుఘ్నః సుమంత్రేణ సహాఽచిరాత్ ॥ 4

తద్రామవచనం శ్రుత్వా వసిష్ఠో మునిసత్తమః ।
జ్యోతిర్విత్సహితో దృష్ట్వా సుముహూర్తం శుభోదయమ్ ॥ 5

ఆజ్ఞాపయత్స సౌమిత్రిం సభాయాం రామసన్నిధౌ ।
సౌమిత్రేఽద్యదినాత్జ్ఞేయో ముహూర్తః సప్తమేఽహని ॥ 6

దీక్షార్థ రామచంద్రస్య వాజిమేధాఖ్యకర్మణి ।
రామతీర్థే యజ్ఞభూమిః శోధనీయా హలాదిభిః ॥ 7

శ్రీరామదాసు చెప్పుచున్నాడు, "ఒకసారి శ్రీరాముడు సభలో సుఖముగా ఉన్నప్పుడు వశిష్ఠుల వారితో, "నేను కుంభోదరుని వచనము ప్రకారము తీర్థయాత్రను ఆచరించితిని. ఇప్పుడు ఆ మాటను గౌరవిస్తూ, అశ్వమేధయాగమును చేయదలచాను. యజ్ఞమునకు కావలసిన సామాగ్రులను లక్ష్మణునికి తెలుపగలరు. సుముహూర్త శుభలఘ్నమున తోక, చెవి, కాళ్ళు నల్లగానుండు గుఱ్ఱమును చక్కగా అలంకరించి సంచారమునకు విడువండి. దాని వెనుక భూ ప్రదక్షిణమునకై, 10,000 మంది సైన్యమును సుమంత్రుని వెంట తీసుకుని వెడలవలెను" అని విన్నవించెను.

## లక్ష్మణుడు యజ్ఞసామాగ్రిని సిద్ధముచేయుట

ఆ రామవచనమును వినిన మునీంద్రుడగు వశిష్ఠుడు దైవజ్ఞులతో మంగళప్రదమగు ముహూర్తమును నిశ్చయించి, శ్రీరామ సన్నిధానమున లక్ష్మణునికి ఇట్లు ఆజ్ఞాపించెను, “వినుము లక్ష్మణుడా! నేటికి ఏడవనాడు శ్రీరాముని అశ్వమేధ యజ్ఞదీక్షకు సుముహూర్తము. బ్రాహ్మణులతో రామతీర్థ ప్రదేశమున బంగారు నాగళ్ళతో యజ్ఞభూమిని దున్నవలయును. అయోధ్యానగరమునకు వెలుపల పదిక్రోశుల దూరమున భూమిని సిద్ధం చేయించండి.

**సువర్ణనిర్మితైర్దివ్యైః బ్రాహ్మణైః సహ సత్వరమ్ ।**
**దశక్రోశమితాఽయోధ్యా బహిః సర్వత్ర లక్ష్మణ ॥ 8**

**సమాశర్కరహీనా తు లిప్తా చందనజాతిభిః ।**
**మంటపశ్చ విధాతవ్యః సర్వత్రాఖండితః శుభః ॥ 9**

**జంబ్వామ్రాదినగానాం చ శాఖాభిః కుసుమైరపి ।**
**పల్లవైశ్చ విచిత్రైశ్చ కదలీస్తంభమండితః ॥ 10**

**సమంతతస్తోరణాని బంధనీయాని యత్నతః ।**
**పుష్పహారాః ఫలాదీనాం మాలాశ్చ వివిధాః శుభాః ॥ 11**

**వేద్యః సహస్రశః కార్యాః సుధయా చేష్టకాదిభిః ।**
**కరణీయం మహత్కుండం మత్సాన్నిధ్యేన మృణ్మయమ్ ॥ 12**

**కుండోపరి మహత్ కార్యం గోముఖం చ మనోరమమ్ ।**
**ఖాదిరస్య విచిత్రం హి వసోర్ధారార్థముత్తమమ్ ॥ 13**

**సితరక్తాసితైశ్చైవ నీలపీతాదిభిః శుభైః ।**
**నానాదృషదచూర్ణైశ్చ హ్యుపధాతువినిర్మితైః ॥ 14**

**నానావర్ణైర్విలేఖ్యాని స్వస్తికాని సమంతతః ।**
**కమలాని విచిత్రాణి తథా హ్యష్టదలాని చ ॥ 15**

**శంఖచక్రగదాపద్మవల్లయశ్చ సహస్రశః ।**
**కుసుమాని వికీర్యాణి యజ్ఞభూమ్యాం సమంతతః ॥ 16**

చతుర్వింశచ్ఛుభాః కార్యా యజ్ఞస్తంభా మహోచ్ఛ్రితాః ।
వినిర్మితాః సువర్ణేన ముక్తాహార విగుంఫితాః ॥ 17

చిత్రయం సర్వతోభద్రం కుండమధ్యేఽశ్వదైవతమ్ ।
లేఖనీయం తథా కుండ నానావర్ణైర్విచిత్రితమ్ ॥ 18

ద్రుతం కార్యాణి పాత్రాణి యజ్ఞార్థం మమ పశ్యతః ।
హైమాః కిలోపకరణా వరుణస్య యథాఽధ్వరే ॥ 19

ఆసనాని ఋషీణాం చ నిద్రార్థం చ సహస్రశః ।
వాసోగేహాని కార్యాణి తృణైః పర్ణైశ్చ ఖర్పరైః ॥ 20

పాకశాలా విధాతవ్యా కార్యా శాలాఽశనస్య చ ।
ఋషిశాలా విధాతవ్యాః స్త్రీశాలాశ్చ శుభావహాః ॥ 21

యజ్ఞోపకరణానాం చ శాలా పరమ సుందరీ ।
సభాః కార్యా నృపాణాం చ వరవస్త్రైర్విచిత్రితః ॥ 22

ఆసనార్థం మహార్హాణి వస్త్రాణి చ సమన్తతః ।
ఆస్తీర్యాణి తథా రాజపృష్ఠభాగాశ్రయాణి చ ॥ 23

పక్షిపిచ్ఛైః సుకార్పాసభేదైః సంపూరితాని హి ।
కశిపూపబర్హణాని విచిత్రాణి మహాంతి చ ॥ 24

యజ్ఞశాల భూమిని సమముగాను, ఇసుకలేనట్లునుచేసి, గంధపు నీటిచే అలికి, అంతట నఖ ఖండితముగా ఉంటునట్లును మంటపమును ఏర్పరచవలెను. ఆ మంటపమును నేరేడు, మామిడి మొదలగు చెట్ల రెమ్మలచేతను, చిగుళ్ళచేతను, పుష్పములచేతను అరటి చెట్లచేతను అలంకరించ వలయును. అంతటా పుష్పహారములను తోరణములుగా కట్టవలయును. ఎచట చూచినా ఫల, పుష్పాదులే కనబడుచుండవలయును. సున్నపు అరుగులు మెరుస్తూ ఉండాలి. నా ఎదుట మట్టితో హోమకుండమును ఏర్పాటు చేయించుము. కుండముమీద అందముగా గోముఖమును చిత్రించ వలయును. వసోర్ధారకై ఖదిరకొయ్యతో గరిటెను చేయించవలయును. నల్లని, ఎఱ్ఱని, పచ్చవి, తెల్లనివి మొదలైన నానా రకముల పొడులను కలిపి; స్వస్తికము, కమలము, అష్టదళాదులు, శంఖ చక్రాదులును మొదలైన ముగ్గులను వేయించవలయును. యజ్ఞభూమి అంతటా పూలు చల్లబడాలి. 24 (ఇరువది నాలుగు) రమ్యమగు బంగారముతో తయారుచేయబడి, ముత్యములు మొదలగు వానితో

అలంకరింపబడిన స్తంభములను ఏర్పాటుచేయాలి. యాగశాల మధ్యలో అశ్వదైవతమగు సర్వతో భద్రమును వేయించాలి. మరియు అచట పలువన్నెలను వేయించాలి. నేను చూచుచుండగా వరుణ యాగములోని వస్తువుల వలె, స్వర్ణమయ యజ్ఞపాత్రములు ఉపయోగింపబడాలి. పూరిండ్లు, పర్ణశాలలు, పెంకుటిండ్లు మొదలగువాటిని నిర్మింపజేయాలి. అదేవిధముగా, వంటశాల, భోజనశాల, ఋషిశాల, స్త్రీ శాల, సామాగ్రి నిల్వ ఉంచుటకు శాలలు, వస్త్రశాల, రాజులకు సభ మొదలైనవాటిని చిత్ర విచిత్రములుగా కట్టింపవలయును. రాజయోగ్యములగు తూలికాతల్పములు, రత్నకంబళములను సిద్ధపరచవలయును.

స్థాపనీయాని సదసి మహార్హాణి తు లక్ష్మణ ।
స్థాపనీయాని పానార్థం పాత్రాణి వివిధాని చ ॥ **25**

నానారసైః పూరితాని తథా పక్వఫలాదిభిః ।
నానాసుగంధద్రవ్యైశ్చ రాగైర్నానావిధైరపి ॥ **26**

మద్యైర్విచిత్రైర్మధురైస్తథా మాదకవస్తుభిః ।
నానాసుగంధతైలైశ్చ కాచకుంభాః సహస్రశః ॥ **27**

స్థాపనీయాశ్చందనైశ్చ సుగంధైరక్షతాదిభిః ।
నానోపస్కరయుక్తానాం తాంబూలానాం సహస్రశః ॥ **28**

స్థాపనీయాని పాత్రాణి చామరాణి సహస్రశః ।
వ్యంజనాని విచిత్రాణి తథాదర్శా విచిత్రితాః ॥ **29**

స్థాపనీయాశ్చ క్రీణార్థం క్రీడోపకరణాని చ ।
స్థాపనీయాని సదసి నృపాణాం చిత్రితాని చ ॥ **30**

మత్పాత్రసంభవాః కార్యాః శతశః పుష్పవాటికాః ।
జలయంత్రాణి కార్యాణి సర్వత్ర వివిధాని చ ॥ **31**

నానావిచిత్రవర్ణానాం వయసాం పంజరాః శుభాః ।
హేమరత్నమౌక్తికైశ్చ ప్రవాళైర్వసనైర్వరైః ॥ **32**

కామనీయాశ్చ భూషాభిస్తోయాన్నాద్యైః ప్రపూరితాః ।
బంధనీయా మంటపేషు నర్తితవ్యోఽప్సరోగణః ॥ **33**

ధూపయంతు సుధూపాశ్చ సుగాయంతు హి గాయకాః ।
వాదనీయని వాద్యాని బహూని వివిధానిచ ॥ 34

పూజోపకరణాద్యైశ్చ పాత్రాణి పూరితాని హి ।
పృథక్ పృథక్ సభాస్వేవ స్థాపనీయాని లక్ష్మణ ॥ 35

తథా ఋషిసభాయాం తు దర్భాశ్చ సమిధస్తథా ।
దండాః కమండలుయుతాః స్థాపనీయాః సహస్రశః ॥ 36

బహిర్వాసాంశ్చ కౌపీనాన్ వల్కలాన్ యాజినాని చ ।
పూజాద్రవ్యాణి హవ్యాని జలకుంభాః సహస్రశః ॥ 37

శౌచార్థం మృత్తికాః శుద్ధా దంతకాష్ఠాని పాదుకాః ।
గైరికా ముఖశుద్ధ్యర్థం నానావస్తూని కల్పయ ॥ 38

తథా నారీసభాయాం తు పూజాపాత్రాణ్యనేకశః ।
సౌభాగ్యద్రవ్యపూర్ణాని సుగంధైః పూరితాన్యపి ॥ 39

వాయనాని విచిత్రాణి స్థాపనీయాని లక్ష్మణ ।
కబర్యః కజ్జలానాం చ పాత్రాణి కుంకుమాని చ ॥ 40

గొప్పగొప్ప విలువైన భోజన పాత్రలను, చిత్రవిచిత్రములగు పానపాత్రలను, పండిన పండ్లను సిద్ధము చేయింపుడు. దివ్య పరిమళ వస్తువులను, నలుగుపిండ్లను, ఊరగాయలు మొదలగు పచ్చళ్ళను, చామలాను, రకరకాల గాజుకుప్పెలను, మద్యాది మదము నిచ్చు వస్తువులును, అద్దములను, వినోదములగు క్రీడాసామాగ్రులను, ఉపసభలో ఉంచదగిన పూలచెట్లుగల మట్టి తొట్లను, వివిధ జలయంత్రాలను, చక్కగా అలంకరింపబడిన అప్సరస స్త్రీలను, సాంబ్రాణి వంటి మంచి ధూపాలను, మంగళ వాద్యములను, సత్కార సామాగ్రులను వేరువేరుగా పుష్కలముగా సిద్ధముచేసి ఉంచవలయును.

ఇంకా ఋషులు వసించుచోట– సమిధలు, దర్భలు, దండములు, కమండలువులు, బర్హిస్సులు, కౌపీనములు, పూజాసామాగ్రులు, జలకుంభములు, ముఖశుద్ధికి గైరికాది వస్తువులు, దంతశుద్ధి కాష్ఠములు, నారబట్టలు– మొదలైనవి సిద్ధముగా ఉంచాలి. అట్లే స్త్రీ శాలలో– పూజాపాత్రలు, సౌభాగ్య ద్రవ్యాలు పుష్కలముగా ఏర్పాటుచేయబడాలి. మరియు అచట పుష్పములు, గంధములు, వాయనములు, సౌరములు, కాటుకలు, భరణులలో నిండిన ఆభరణములు ఉంచాలి.

కరండస్థాని రమ్యాణి భూషణాన్యుజ్జ్వలాని చ ।
హరిద్రాదీని వస్త్రాని కంచుక్యో వసనాని చ ॥ 41

స్థాపనీయాని వ్యజనచామరాదీని సాదరమ్ ।
సుహృదాం లేఖనీయాని పత్రాణి చ సమంతతః ॥ 42

రామముద్రాంకితాన్యద్య తథా దూతా మహాజవాః ।
జనకాయ ప్రేషణీయాః కైకేయనృపసన్నిధౌ ॥ 43

కౌసల్యాయాః సుమిత్రాయాః పితరౌ ప్రతి లక్ష్మణ ।
శ్యామాంఘ్రి శ్యామకర్ణశ్చ శ్యామపుచ్ఛః సితః శుభః ॥ 44

మహార్ఘాభరణైర్వస్త్రైర్దివ్యవీరాసనేన చ ।
శోభనీయాశ్చామరాద్యైర్ముక్తాహారైర్మనోరమైః ॥ 45

హైమీభిః శృంఖలాభిశ్చ వేణీబంధవిభూషణైః ।
తస్య భాలే హేమపత్రే లేఖనీయం స్ఫుటాక్షరైః ॥ 46

కోసలేంద్రస్య రామస్య యజ్ఞాంగతురగో హ్యయమ్ ।
జ్ఞేయః సర్వైనృపైర్ముక్తః కర్తుం భూమ్యాః ప్రదక్షిణామ్ ॥ 47

యస్యాస్తి సారం తేనాశ్వో బంధనీయోఽయముత్తమః ।
నోచేత్కోశాంశ్చ నిజాన్ పురస్కృత్య బలైః స్సహ ॥ 48

స్వకుటుంబైర్నాగరైశ్చ తథా జానపదైః సహ ।
ఆగంతవ్యం నృపతిభిర్యజ్ఞాంగాశ్వానువర్తిభిః ॥ 49

యజ్ఞభూమిమయోధ్యాయాం యుద్ధేర్జిత్వా మహోద్ధతాన్ ।
ఏవం పత్రం బంధయిత్వా ముక్తామణివిచిత్రితైః ॥ 50

అవతంసైః శోభయిత్వా సిద్ధః కార్యశ్చ మంటపే ।
సిద్ధః కార్యః స శత్రుఘ్నః సైన్యేన పరివేష్టితః ॥ 51

రథారూఢోఽశ్వరక్షార్థం సుమంత్రేణ సమన్వితః ।
నానాపుణ్యనదీనాం చ జలకుంభాన్ సహస్రశః ॥ 52

**నానాదేశాన్మృదశ్చాపి శత్రుఘ్నేనానయస్వ హి ।**
**శోభనీయా పురీ రమ్యా పతాకాధ్వజతోరణైః ॥ 53**

**దేవాలయే సుధా దేయా తథా ప్రాసాదమస్తకే ।**
**దేవాలయాభ్యంతరేఽద్య చిత్రశాలా మనోరమాః ॥ 54**

పసుపు కుంకుమలు, రవికెలు, చీరెలు, చామరాది ఉపభోగ సామగ్రులు ఏర్పాటుచేయండి మరియు శ్రీరామ ముద్రాంకితమగు పత్రికలు మిత్రమండలికి వ్రాసిపంపవలయును. జనక మహా రాజునకును, కేకయ రాజునకును, కౌసల్య సుమిత్రల పుట్టినిండ్లకును, ఈ శుభోదంతమును వ్రాసి తెలుపుము. దూతలను పంపుము. నల్లని చెవి, నల్లని కాళ్ళు, నల్లని తోకగల తెల్లని గుఱ్ఱమును దివ్యాలంకార వస్త్రములచే అలంకరించి, చామరాది ఉపచారములతో ఆరాధించుచు, జడలు మొదలైన వాటిచే శృంగారించి, బంగారముతో చేసిన కళ్ళెములు కట్టి ఉంచదగును. దాని నుదుట, "ఈ గుఱ్ఱము కోసలరాజగు శ్రీరాముని అశ్వమేధయాగమున భూ ప్రదక్షిణమునకై విడువబడినది. రాజులందరును తెలిసి విడిచిపెట్టదగును. ఎవ్వడైనను శక్తుడుగా నుండిన వాడు దీనిని బంధింపవచ్చును. శక్తిలేని యెడల తమ భండారములను ముందు పెట్టుకుని సైన్యములతోడను, పరివారములతోను, నాగరికులతోను, దేశమువారితోను రాజులు వెడలి యుద్ధతలమున గెలిచి, అయోధ్యలో యజ్ఞభూమికి ఆజ్ఞావర్తులై వెంబడి రాదగినది," అని, కనక పట్టికను పుటాక్షరములచే వ్రాసి, అశ్వముఖమున కట్టవలయును. ముక్తాభరణములను, శిరోభూషణములను అలంకరించి, ఇట్లు గుఱ్ఱమును, యజ్ఞమంటపమును సిద్ధపరచునది. నీవును శత్రుఘ్నునితో కలసి ససైన్యముగా సిద్ధము కావలయును. సుమంత్రునితో రథమునెక్కి సకల పుణ్యనదుల దివ్యజలములను కలశములలో నింపుకుని, నానాదేశ మృత్తికలను శత్రుఘ్నునిచే తెప్పించవలయును. రకరకాల పతాకాదులచే ఊరిని అలంకరింపవలయును. దేవాలయములకును, భవనములకును సున్నములు కొట్టింపవలయును.

**లేఖనీయా విధాతవ్యా రత్నదీపాః సదైవ హి ।**
**పూజోపకరణాదీని ప్రతీదేవాలయేష్వపి ॥ 55**

**స్థాపయస్వ సమస్తాని వాద్యాన్యాజ్ఞాపయస్వ భోః ।**
**రాజమార్గాః శోధనీయాః సేచనీయాశ్చ చందనైః ॥ 56**

**సౌధరాజిషు సర్వత్ర చిత్రాణి వివిధాని చ ।**
**లేఖనీయానీ రమ్యాణి ముక్తాహారాః సమంతతః ॥ 57**

ప్రవాళమణివైఢూర్యకాశ్మీరస్ఫటికాదిభిః ।
నానావిధాశ్చ కుసుమైర్హారాః పక్వఫలాదిభిః ॥ 58

బంధనీయాశ్చ సర్వత్ర జాలరంధ్రైర్విశేషతః ।
ఏవం యద్యన్మయా ప్రోక్తం తత్కురుష్వావిచారతః ॥ 59

తద్గురోర్వచనం శ్రుత్వా తథేత్యుక్త్వా స లక్ష్మణః ।
కారయామాస తత్సర్వం గురోర్వాక్యాచ్ఛతాధికమ్ ॥ 60

**ఇతి శ్రీశతకోటిరామచరితాన్తర్గతే, శ్రీమదానంద రామాయణే, వాల్మీకీయే, ఆదికావ్యే, యాగకాండే, యాగోపకరణనివేదనం నామ ప్రథమః సర్గః ॥**

దేవాలయములలో చిత్రశాలలను నిర్మింపవలయును. దేవాలయాలలో అఖండ రత్నదీపములు వెలుగవలయును. పూజాసామాగ్రులు సిద్ధముగా ఉండవలయను. వాద్యములు మంగళ ప్రదములుగా ఉండవలయును. రాజమార్గములు పరిశుభ్రముగా ఉండవలయును. చందనపు కళ్ళాపి చల్లింపవలయును. భవనములలో వివిధ చిత్రములను గీసి నవరత్న నిర్మితములగు హారములను కట్టి, అరటి చెట్లను అలంకరించి, నయనానందకరములగునట్లు చేయవలయును. ఇట్లు వీలైనంతవరకు నేను చెప్పినట్లు చేయవలయు"నని వశిష్ఠులవారు ఆజ్ఞాపించగా లక్ష్మణుడు సభక్తికముగా వారి వాక్యములను అంగీకరించి, వారు చెప్పినదానికి నూరింతలుగా చేయించెను.

***శతకోటిప్రవిస్తరమైన రామకథలో, శ్రీమద్వాల్మీకిమహర్షిచే రచింపబడిన, ఆనందరామాయణంలోని, యాగకాండలో, యాగమునకు సామాగ్రిని సిద్ధముచేయునట్లు తెలుపుమొదటిసర్గ ముగిసినది.***



# ద్వితీయః సర్గః-2వ సర్గ

లక్ష్మణుడు రామాజ్ఞను పాటించుట

**శ్రీరామదాస ఉవాచ**

**అథ రామః ససీతస్తు ముహూర్తే సప్తమేఽహని ।**
**నవనీతోద్వర్తనాద్యైః స్నాత్వా కృత్వాంజనాదికమ్ ॥ 1**

**తూర్యనాదైర్ద్విజానాం చ వేదఘోషైర్విశేషతః ।**
**పౌరస్త్రీణాం గాయనైశ్చ పౌరాణాం చ జయస్వనైః ॥ 2**

**ఆగత్య మంటపే రమ్యే తస్థౌ చిత్రాసనోపరి ।**
**దదౌ కౌశేయ వస్త్రాణి గురుం రామస్త్వరుంధతీమ్ ॥ 3**

**పౌరాంశ్చ పౌరపత్నీశ్చ మాతౄశ్చాథ సువాసినీః ।**
**శ్వశ్రూశ్చాపి ద్విజాన్ సర్వాన్ జనకం సుహృదస్తథా ॥ 4**

## శ్రీరాముడు అశ్వమేధ యజ్ఞమంటపమున ప్రవేశించుట.

శ్రీరామదాసు ఇట్లు చెప్పుచున్నాడు, "అంత ఆ శ్రీరామచంద్రుడు సీతతో ఏడవనాడు సుముహూర్తమున నవనీతాది అభ్యంగన స్నానముచేసి, అంజనాదులను అలంకరించుకుని, బ్రహ్మఘోషలను, తూర్యప్రణాదములను, పుర నారీమణుల నర్తనలతోను, పౌరుల జయజయ ధ్వానములమధ్యన, సర్వానందకరములై యుండగా వెడలి, యజ్ఞమంటమున ప్రవేశించి, చిత్రాసనమున సుఖాసీనుడై ఉండి; అరుంధతి, వశిష్ఠులకు పట్టుబట్టలు అలంకారమును చేసి- తల్లులకును, అత్తమామలకును, బంధువులకును, మంత్రులకును, వీరులకును, ఊరివారికిని, సకల వర్ణులకును, సేవకులకును తుదకు అందరికిని- వస్త్రములను ఇచ్చెను.

**బంధూంశ్చ బంధుపత్నీశ్చ వయస్యాంశ్చ తతః పరమ్ ।**
**మంత్రిణశ్చాథ వీరాంశ్చ దాసదాసీజనాంస్తథా ॥ 5**

**నటనర్తక వంద్యాదీన్ వారస్త్రీశ్చ తతః పరమ్ ।**
**ఆచాండాలాదికాన్ దత్వా తతః స్సీతాం దదౌ వరమ్ ॥ 6**

హేమతంతుసముద్భూతం ముక్తామాణిక్యగుంఫితమ్ ।
రత్నకాశ్మీరనీలాద్యైర్మధ్యే మధ్యే విచిత్రితమ్ ॥ 7

ముక్తాప్రవాళఘోషాద్యైర్మణిభిః సర్వతో వృతమ్ ।
ఆదర్శబింబసదృశం విద్యుత్తేజోపమం మహత్ ॥ 8

తతః స్వయం రామచంద్రః పీతకౌశేయముత్తమమ్ ।
హేమతత్త్వంకితం నానావల్లీపుష్పవిచిత్రితమ్ ॥ 9

దధారాన్యత్తూత్తరీయం వాసోఽలంకారమండితః ।
వ్యంజితాశేషగాత్రశ్రీర్మణిద్వయవిరాజితః ॥ 10

కేయూరకుండలైర్ముక్తాహారైశ్చ కటకైర్యుతః ।
తతో వసిష్ఠవర్యస్తం ముక్తానాం స్వస్తికోపరి ॥ 11

నివేశ్య రాఘవః సీతామాహూయ వటుకైర్ద్విజైః ।
నివేశ్య రామవామాంగే మునిభిః పరివేష్టితః ॥ 12

రామేణ కారయామాస విఘ్నేశాదిప్రపూజనమ్ ।
పుణ్యాహాదిత్రయం చాపి దదౌ దీక్షాం తతస్తయోః ॥ 13

ధ్వజారోపవిధానేన స్థాపయిత్వా ధ్వజోత్తమాన్ ।
రామేణ వరయామాస గురుః షోడశ ఋత్విజః ॥ 14

వసిష్ఠతత్ర సజాతోఽధ్వర్యుః సకలకర్మవిత్ ।
బ్రహ్మాఽభూచ్చ స్వయం బ్రహ్మా హోతా గాధిసుతో హ్యభూత్ ॥ 15

ఉద్గాతాఽభూచ్ఛతానందో గురుర్యో జనకస్య చ ।
యమో బభూవ శమితా కశ్యపాద్యా మునీశ్వరాః ॥ 16

వృణీతా వాజిమేధేహి రాఘవేణ మహాత్మనా ।
ఋత్విజః షోడశ శుభాస్తథాఽన్యే సర్వకర్మసు ॥ 17

పిదప సీతకు అద్దమువలె వెలుగుచున్న కెంపులను, ముత్తెముల నడుమ నీలములు చెక్కిన బంగారు అంచుగల చీరను ఇచ్చి, పిదప తానూ నానాలతపుష్పచిత్రమగు దివ్యమైన పసుపుపచ్చ

పట్టువస్త్రమును ధరించి, ఉత్తరీయమును పైనధరించి, తేజోమయ కాంతులు స్ఫురించుచుండగా రత్నదివ్యాలంకృతాంగుడై కటక, కుండల, హార, కేయూరాది ఆభరణములచే అలంకరింపబడి వెలుగుచుండెను. పిదప వశిష్ఠులవారు ముత్తైదువులచే ఏర్పరచిన స్వస్తికము మీద శ్రీరాముని కూర్చుండబెట్టి, వటువులను పంపి సీతను పిలిపించి, శ్రీరాముని ఎడమభాగమున కూర్చుండబెట్టి, మునులతో కూడి, శ్రీమహాగణాధిపతి పూజాదికమును చేయించి, పుణ్యాహవాచనము, నాందిశ్రాద్ధము, నవగ్రహముల పూజ చేయించి, పిదప శ్రీ సీతారాములకు యజ్ఞదీక్షను ఇచ్చి, యథావిధానముగ ధ్వజారోహణము చేయించి, శ్రీరామునికి 16 మందికి ఋత్విగ్వరణముచేయించెను. అందులో సకల కర్మ రహస్యజ్ఞుడు వశిష్ఠుడే అధ్వర్యుడయ్యెను. సాక్షాత్ బ్రహ్మయే బ్రహ్మఅనబడె. విశ్వామిత్రుడు హోతగా నిలబడెను. జనక మహారాజుగారి గురువగు శతానందుడు ఉద్గాతృవయ్యెను. యముడే శమితమయ్యె. కశ్యపాది మహర్షులు శ్రీరామునిచే ఋత్విక్కులుగా వరింపబడిరి. ఇట్లు 16మంది ఋత్విజులైరి ఆ తరువాత వందలకొలది మహర్షులు యాగమునకు ఎన్నుకోబడిరి. కుండమున అగ్నిని స్థాపించి, పాత్రాసాధనములను ఒనర్చిన పిదప, నల్లని చెవుల గుఱ్ఱమును పూజించి సవ్యముగా భూమిని చుట్టివచ్చుటకు విడిచెను. దాని సంరక్షణకై సుమంత్రునితో రథమును ఎక్కిన శత్రుఘ్నుని 10,000 మంది సైన్యములను వెంటనిచ్చి పంపించి, వశిష్ఠుడు బ్రాహ్మణులతో ఊరకే కూర్చుండెను.

**పృథక్ పృథక్ సంవృణీతాః శతశస్తే మునీశ్వరాః ।**
**కుండేఽగ్నిస్థాపనం కృత్వా పత్రాణ్యాసాద్య విస్తరాత్ ॥ 18**

**శ్యామకర్ణం పూజయిత్వా మోచయామాస భూతలే ।**
**సవ్యాం ప్రదక్షిణాం కర్తుం తస్య సంరక్షణాయ హి ॥ 19**

**రథారూఢం సుమంత్రేణ సైన్యేనాయుతసంఖ్యయా ।**
**శత్రుఘ్నం ప్రేషయిత్వాఽథ తూష్ణీం తస్థౌ ద్విజైర్గురుః ॥ 20**

**యజ్ఞవాటే మునిగణాపూరితే సరయూతటే ।**
**రామోఽపి సీతయా తూష్ణీం తస్థౌ శృణ్వన్ కథాశ్శుభాః ॥ 21**

**కృష్ణాజినధరో దాన్తః కుశపాణిః కృతోచితః ।**
**కోటిసూర్యప్రతీకాశస్తస్థౌ స గురుసన్నిధౌ ॥ 22**

**తద్దీక్షాయాం ప్రవృత్తాయాం భ్రాతరః పుష్కరస్రజః ।**
**స్నాతాః సువాససః సర్వే రేజిరే సుష్ఠ్వలంకృతాః ॥ 23**

తన్మహిష్యశ్చ ముదితా నిష్కకంఠ్యః సువాససః ।
దీక్షాశాలాముపాజగ్ముశ్చాలిప్తా వస్తుపాణయః ॥ 24

తదా నినేదుర్వాద్యాని ననృతుర్వారయోషితః ।
ఏతస్మిన్నంతరే తత్ర సమాయాతా మునీశ్వరాః ॥ 25

దినేదినేఽశ్వమేధస్య వార్తాం శ్రుత్వా సహస్రశః ।
కశ్యపోఽత్రిర్భరద్వాజో విశ్వామిత్రోఽథ గౌతమః ॥ 26

మార్కండేయో మృకండుశ్చ చ్యవనో ముద్గలోఽసితః ।
జామదగ్న్యో దేవలశ్చ వ్యాసో నారాయణః క్రతుః ॥ 27

విభాండకో నారదశ్చ తుంబురుర్గాలవో మునిః ।
శివదాసో భానుదాసో హరిదాసో మహాతపాః ॥ 28

శివవర్మా రుద్రవర్మా శివశర్మా మునీశ్వరః ।
ఏక శృంగశ్చతుః శృంగః సప్త శృంగస్త్రి శృంగకః ॥ 29

తిలభాండో భృగుశ్చైవ భార్గవో వాక్పతిస్తథా ।
ధౌమ్యఃకణ్వశ్చైకపాద స్త్రీపాదశ్చోర్ధ్వబాహుకః ॥ 30

శ్రీసీతారాములు– సరయూతీరమున యజ్ఞవాటికలో మునులు నిండియుండగా మంగళ చరిత్రములను వినుచుండిరి. అప్పుడు శ్రీరాముడు జింకచర్మమును ధరించి, పవిత్రపాణియై చేయవలసిన కార్యములను తెలుసుకుని, గురుసన్నిధిలో కోటిసూర్య ప్రకాశుడై వెలుగుచుండెను. ఆ యాగ దీక్షలో ఉన్నపుడు కమల పుష్పముల హారములను వేసుకుని, దివ్య నూతన వస్త్రములను ధరించి, అలంకారులై శోభించుచుండిరి. వారి పత్నులును సంతసించుచు, కాసుల దండలను అలంకరించుకుని, మంచి చీరలను ధరించి, చందనాదుల రాసుకుని, చేత మంగళవస్తువులను ఉంచుకుని, దీక్షాశాలకు వచ్చిరి. అప్పుడు వాద్యములు మ్రోగుచుండెను. నృత్యగీతములు జరుగుచుండెను. అంతలో అచటికి శ్రీరాములవారి అశ్వమేధయాగ వార్తను విని దినదినము మునీంద్రులు వచ్చుచుండిరి– కశ్యపుడు, అత్రి, భరద్వాజుడు, విశ్వామిత్రుడు, గౌతముడు, మార్కండేయుడు, మృకండువు, చ్యవనుడు, ముద్గలుడు, అసితుడు, పరశురాముడు, దేవలుడు, వ్యాసుడు, నారాయణుడు, క్రతువు, విభాండకుడు, నారదుడు, గాలవుడు, శివదాస, భానుదాస, హరిదాసులును, మహాతపస్వులు, శివవర్మ, రుద్రవర్మ, శివశర్మలను మునీంద్రులు, ఏకశృంగ,

చతుఃశృంగ, సప్తశృంగ, త్రిశృంగులును, తిలభాండుడు, భృగువు, భార్గవుడు, గురుడుడు, ధౌమ్యుడు, కణ్వుడు, ఏకపాదుడు, త్రిపాదుడు, ఊర్ధ్వబాహువు,

ఊర్ధ్వపాదశ్చోర్ధ్వనేత్రశ్చోర్ధ్వాస్యస్త్రిశిరాస్తథా ।
వృద్ధగౌతమనామాఽథ పర్ణాదశ్చంద్రసంజ్ఞకః ॥ 31

ఋష్యశృంగో మతంగోఽథ జాబాలిః కుంభసంభవః ।
దధీచిః శౌనకః సూతః సుతీక్ష్ణో లోమశస్తథా ॥ 32

వాల్మీకిశ్చాపి దుర్వాసా మునిర్వేదనిధిర్మహాన్ ।
ఏతే చాన్యే చ మునయః స్త్రీశిష్యతనయాదిభిః ॥ 33

కేచిత్పర్ణాశనాః కేచిద్వాయుభక్షాస్తథాఽపరే ।
కుశాగ్రజలపానాశ్చ కేచిత్త్యక్తాశనాస్తథా ॥ 34

భిక్షాశనాస్తథా కేచిత్ పరదత్తాశనాః పరే ।
అయాంచావ్రతినః కేచిత్త్యక్తసంభాషణాః పరే ॥ 35

కేచిద్వల్కలసంవీతాః కేచిత్పాషాణవస్త్రిణః ।
మృగచర్మధరాః కేచిత్ కేచిదాకాశవస్త్రిణః ॥ 36

వృక్షపల్లవవస్త్రాశ్చ కేచిత్పంచాగ్నిసాధకాః ।
ధూమ్రపాన వ్రతాః కేచిత్ కేచిత్త్యక్తేషణాః పరే ॥ 37
ఏవంనానావనారామగిరిదుర్గాశ్రమాదిషు ।
వాసినస్తే సమాయతాః సదారాశ్చ సబాలకాః ॥ 38

సశిష్యా రామచంద్రస్య ద్రష్టు యజ్ఞోత్సవం వరమ్ ।
దశదిగ్భ్యో మునిశ్రేష్ఠాః కోటీశశ్చ దినే దినే ॥ 39

తాన్సర్వాన్ రామచంద్రోపి ప్రత్యుత్థానాసనాదిభిః ।
మధుపర్కాదిపూజాభిస్తోషయామాస సాదరమ్ ॥ 40

యజ్ఞవాటే మహారమ్యే కామధేనుం రఘూత్తమః ।
పూజయామాస విధివద్వస్త్రైరాభరణైరపి ॥ 41

**సువర్ణ శృంగభూషాభిః కింకిణీనూపురాదిభిః ।**
**ఏవం తాం శోభయిత్వాఽథ ప్రార్థయామాస రాఘవః ॥ 42**

**ధేనో సాగరసంభూతే త్వమన్నాని ద్విజాదికాన్ ।**
**దాతుమర్హస్యధ్వరే మే ప్రసీద జగదంబికే ॥ 43**

ఊర్ధ్వపాదుడు, ఊర్ధ్వాక్షుడు, ఊర్ధ్వాశ్వుడు, త్రిశిరుడు, వృద్ధగౌతముడు, పర్ణాదుడు, చంద్రసంజ్ఞుడు, ఋష్యశృంగుడు, మాతంగుడు, జాబాలి, అగస్త్యుడు, దధీచి, శౌనకుడు, సూతుడు, సుతీక్ష్ణుడు, లోమశుడు, వాల్మీకి, వేదనిధియగు వ్యాసుడు మొదలుగాగల ఇతర మునీంద్రులును భార్య, పుత్ర, గొడుగులతోడ వచ్చిరి. కొందరు ఆకులనే ఆహారముగా తీసుకునేవారు, కొందరు వాయుభక్షకులు, కొందరు గడ్డి కొనలపై బడిన నీటిని త్రాగి తపస్సుచేసేవారు, కొందరు నిరాహారులు, కొందరు భిక్షనే ఆహారంగా తీసుకునేవారు, కొందరు పరదత్తాశనులు, కొందరు అనాయాసముగా లభించిన ఆహారంతోనే జీవించేవారు, కొందరు మౌనవ్రతులై ఉన్నవారు. కొందరు నారబట్టలవారు, కొందరు కావిగుడ్డలవారు, కొందరు చర్మాలనే వస్త్రాలుగా ధరించినవారు, కొందరు ఆకాశమునే వస్త్రముగా ధరించినవారు, కొందరు పల్లవములనే వస్త్రములుగా ధరించినవారును, కొందరు పంచాగ్ని సాధనాపరులును, కొందరు పొగనే ఆహారముగా తీసుకొనువారును, కొందరు విరాగులునై ఇట్లు వివిధ వన, దుర్గ, పర్వతాశ్రమములలో వసించువారందరును తమతమ పత్నులను, పుత్రులను, శిష్యులను వెంటబెట్టుకుని వచ్చిరి. ఇట్లే ప్రతిదినము శ్రీరామచంద్రుని యజ్ఞోత్సవమును చూచుటకై కోట్లకొలది మునీంద్రులు వచ్చుచుండిరి. వారినందరిని రఘునాథుడు స్వయముగా లేచి స్వాగతించుచుండెను. ఆసనాది ఉపచారముల చేతను, మధుపర్కాదులచేతను సాదరముగా సత్కరించుచుండెను. పిదప శ్రీరాముడు యజ్ఞవాటమున కామధేనువును– దివ్య వస్త్ర, ఆభరణ, సువర్ణ శృంగాదులచే పూజించి, “జగన్మాతయగు కామధేనువా! నీవు నా యజ్ఞమున ప్రసన్నురాలవై ద్విజాదులకు మృష్టాన్నమును ఇచ్చుదానవుగా ఉన్నావు,” అని ప్రార్థించి, నమస్కరించి, పాకశాలలో పట్టువస్త్రముల మీద నిలిపెను.

**ఏవం సంప్రార్థ్య తాం కామధేనుం రామః ప్రణమ్య చ ।**
**బబంధ పాకశాలాయాం పట్టకూలాసనోపరి ॥ 44**

**అథ సా సురభిస్తుష్టా షడ్రసాన్నాని సాదరాత్ ।**
**దదౌ జనకనందిన్యై స దేవాధ్వరకర్మణి ॥ 45**

నాగ్నికార్యం చ తత్రాసీత్ పాకాశాలాసు చైకదా ।
ఇచ్ఛాశనైః సదా తుష్టా బభూవుర్మునిసత్తమాః ॥ 46

యాన్యాన్కామాన్ రామచంద్రశ్చింతయామాస చేతసి ।
తాంస్తానుభౌ మణీ శీఘ్రం కల్పయామాసతుర్ద్రుతమ్ ॥ 47

తథా సీతాఽపి యాన్ కామాంశ్చింతయామాస చేతసి ।
కామధేనుర్దదౌ తాంస్తాన్ శీఘ్రం త్రైలోక్యదుర్లభాన్ ॥ 47

సర్వత్ర యజ్ఞవాటే హి ద్విజాద్యైశ్చ సమంతతః ।
పంక్తిషు భూమిజాదీనాం పరివేషణకర్మణి ॥ 49

స్త్రీణాం కంకణనాదశ్చ శుశ్రువే నూపురధ్వనిః ।
అథ రామశ్చ సౌమిత్రిం సమాహూయేదమబ్రవీత్ ॥ 50

సీమాచారాన్సమాహూయ మమ వాక్యాచ్చ సాదరమ్ ।
ఆజ్ఞాపయస్వ శీఘ్రం త్వం శాసనం యన్మయోచ్యతే ॥ 51

బ్రహ్మచారీ గృహస్థో వా వానప్రస్థాశ్రమీ యతిః ।
యః కశ్చిద్వా సమాయాతి పథికః స మమాజ్ఞయా ॥ 52

నివారిణీయో యుష్మాభిర్న కదాప్యధ్వరే మమ ।
మమాజ్ఞాం న ప్రతీక్షధ్వం కోపః కార్యో న కస్యచిత్ ॥ 53

ఇతి రామవచః శ్రుత్వా తథేత్యుక్త్వా స లక్ష్మణః ।
సీమాచారాన్ సమాహూయ రాఘవోక్తం న్యవేదయత్ ॥ 54

తతో రామః పునః ప్రాహ సమాహూయాథ లక్ష్మణమ్ ।
బ్రహ్మచారీ గృహస్థో వా వానప్రస్థాశ్రమీ యతిః ॥ 55

మునీనాం దయితా బాలాః శిష్యాః సంబంధినస్తథా ।
పౌరా జానపదస్థస్తు తేషాం సంబంధినః స్త్రియః ॥ 56

అంత కామధేనువు పరితుష్టియై జానకీదేవికి ఎల్లప్పుడు కావలసినంత షట్ రసములను ఇచ్చుచుండెను. వంటగదులలో నిప్పుతోపనిపడలేదు. మునీంద్రులు వారికి ఇష్టమైన ఆహారములతో సంతుష్టులగుచుండిరి. శ్రీరాముడు యజ్ఞమున ఎట్లెట్లు దేని దేనిని చింతించునో అట్లు వాటివాటిని కామధేను, చింతామణులు తప్పక ఇచ్చుచుండినవి. అట్లే సీతయును తన మదిన దేనిని కోరునో దుర్లభమగు వాటిని కామధేనువు ఇచ్చుచుండెను. సర్వత్ర యజ్ఞవాటికలో బ్రాహ్మణాదులకు తృప్తిగా జానకియే వడ్డించుచుండెను. వడ్డనలో అంతటా స్త్రీలయొక్క కంకణధ్వనులును, నుపుర నాదములును వినవచ్చు చుండినవి. (50)

## శ్రీరాముడు ఉదారముగా సంతర్పణ చేయుట

తరువాత శ్రీరాముడు లక్ష్మణుని పిలిచి, "తమ్ముడా! అన్ని ఆచార వ్యవహారాలను పరిశీలించి, వారికి సాదరముగా నా యాజ్ఞను తెలుపుము. బ్రహ్మచారిగాని, గృహస్థుడుగాని, వానప్రస్థాశ్రమిగాని, యతిగాని, ఎవ్వరైనను బాటసారిగా వచ్చెనా వానిని నా యాజ్ఞను అనుసరించి, ప్రయాణమును కూడా మానుకుని ఇక్కడికి రావలయును. ఈ యజ్ఞసమయమున ఇంకా ఎప్పుడును నా ఆజ్ఞకు ఎదురుచూడవద్దు. ఎవని విషయమైనను కోపించకూడదు," అని ఆజ్ఞాపించగా, అట్లేయని లక్ష్మణుడు నగరచారులను పిలిపించి, శ్రీరామాజ్ఞను వివరించెను. మరలా శ్రీరాముడు లక్ష్మణుని పిలిచి, "బ్రహ్మచర్యాది ఆశ్రమ ధర్మపరాయణులు, వారిపత్నులు, బాలురు, శిష్యులు, వారి బంధువులు, నగరవాసులు, గ్రామములనుండి వచ్చినవారు, వారి సంబంధులు, స్త్రీలు,

**దాసీదాసజనాః సర్వే యద్యద్వాంఛంతి లక్ష్మణ ।**
**మామపృష్ట్వా తు తత్తేషాం దాతవ్యం హ్యవిచారితమ్ ॥ 57**

**అంత్యజావధి సర్వాన్హి తోషయధ్వం నిరంతరమ్ ।**
**న కేషామభిలాషాశ్చ విఫలా హి విధీయతామ్ ॥ 58**

**అయోధ్యాం కామధేనుం చ జానకీం కౌస్తుభం మణిమ్ ।**
**చింతామణిం పుష్పకం చ రాజ్యం కోశాధికం చ మే ॥ 59**

**ఏతేష్వపి చ యో యద్వై యాచయిష్యతి యత్త్వయా ।**
**న దత్తం చేతి వై శ్రుత్వా మమాతోషో భవేత్త్వయి ॥ 60**

**అతో జ్ఞాత్వా భయం మత్తో దదస్వ హ్యావిచారతః ।**
**యాజ్ఞాభంగః కృతశ్చేద్ధి మచ్ఛిరోహా భవిష్యసి ॥ 61**

**సదా స్మర గిరం మే త్వమిమాం లక్ష్మణసాదరమ్ ।**
**ఇతి రామకృతాం శిక్షామంగీకృత్య స లక్ష్మణః ॥ 62**

**తథా చకార తత్సర్వం యథా రామేణ శిక్షితమ్ ॥ 63**

**ఇతి శ్రీశతకోటిరామచరితాంతర్గతే, శ్రీమదానందరామాయణే, వాల్మీకీయే, ఆదికావ్యే, యాగకాండే, లక్ష్మణాజ్ఞాకరణం నామ ద్వితీయః సర్గః ॥**

లక్ష్మణుడా! దాసీదాసజనులు వీరందరును దేనిని ఆపేక్షించెదరో, వారికి దానిని నన్ను అడుగకనే ఈయవచ్చును. ఇందుకు విచారము అక్కరలేదు. ఎల్లప్పుడు అంత్యజులవరకు అందరును ఆనందింపదగును.

యే ఒక్కరి అపేక్షను కూడా విఫలముచేయవద్దు. అయోధ్యను, కామధేనువును, జానకిని, కౌస్తుభరత్నమును, చింతామణిని, పుష్పకమును రాజ్యకోశాదులను ఇంకా నీ ఇష్టమగు ఏ వస్తువుల నైనను ఆపేక్షించినవారికి నీవు ఇవ్వకపోవుటను నేను వింటినా యేమాత్రము సంతోషించజాలను. కనుక నా భయమును గుర్తించి, నిర్విచారుడవై ఇచ్చుచుండుము. నా యజ్ఞమును భంగపరచితివా నాతల కొట్టినవాడగుదువు. లక్ష్మణుడా! ఎల్లప్పుడును నాయీ మాటలను తప్పక స్మరించుచుండుము," అని ఇట్లుచెప్పిన శ్రీరామశాసనమును లక్ష్మణుడు అంగీకరించి, యథోక్తముగా అంతటిని, అట్లే నెరవేర్చుచుండెను.

***శతకోటిప్రవిస్తరమైన రామకథలో, శ్రీమద్వాల్మీకిమహర్షిచే రచింపబడిన, ఆనందరామాయణంలోని, యాగకాండలో, లక్ష్మణాజ్ఞను వివరించు రెండవ సర్గ ముగిసినది.***



# తృతీయః సర్గః-3వ సర్గ

అశ్వమేధ అశ్వగమనము

శ్రీరామదాస ఉవాచ

అథ ముక్తస్తదా వాజీ రాఘవేణ మహాత్మనా ।
యజ్ఞాంగః శ్యామకర్ణః స పూర్వదేశం యయౌ జవాత్ ॥ 1

శత్రుఘ్నేన చ సైన్యేన ప్రాప్తో భాగీరథీతటమ్ ।
ఏతస్మిన్నంతరే రామః స్వప్రతాపం ప్రదర్శయన్ ॥ 2

చకార కౌతుకం తత్ర శత్రుఘ్నస్య పురో మహత్ ।
బ్రహ్మావర్తం మహాదేశం త్యక్త్వా గంగాతటం ప్రతి ॥ 3

యావత్ప్రాప్తః శ్యామకర్ణస్తావదాసీద్ధనైర్ధినా ।
గంగాయాం చ మహాపూరో యత్ర నౌకాఽపి కుంఠితా ॥ 4

శత్రుఘ్నేనాపి తద్దృష్ట్వా కుంఠితాం గతిమీక్ష్య చ ।
కాలాతిక్రమభీత్యా స నిజచిత్తే వ్యచింతయత్ ॥ 5

ఆదావేవాపి మే విఘ్నముత్పన్నం గమనే మహత్ ।
గ్రాసే ప్రాథమికే యద్వన్మక్షికాపతనం తథా ॥ 6

## యజ్ఞాశ్వమునకు గంగానది దారి ఇచ్చుట

శ్రీరామదాసు ఇట్లు చెప్పుచున్నాడు, "పిమ్మట మహాత్ముడగు శ్రీరామునిచే విడువబడిన యజ్ఞాశ్వము వేగముగా భారతదేశపు తూర్పు భాగమునకు వెడలెను. సైన్యముతో శత్రుఘ్నుడును దానివెంట పయనిస్తూ గంగాతీరమును చేరెను. అంతలో అచట శ్రీరాముడు తనమహిమచే శత్రుఘ్నుని ఎదుట ఒక అద్భుతమును జరిపించెను. ఏమనిన-గుఱ్ఱము, బ్రహ్మావర్తమును, మహాదేశములను వదలి, గంగాతీరమునకు వచ్చునప్పటికి గంగలో మహాప్రవాహము నిండియుండెను. పడవ పగిలియుండెను. శత్రుఘ్నుడు దానిని చూసి, సమయము మించిపోవుచున్నదను భీతిచేత తన మనసులో ప్రయాణమున మొదటనే విఘ్నము సంభవించినది కాబోలు, ఎలాగనిన భోజనముచేయువానికి మొదటి ముద్ద లోనే ఈగ దూరినట్లయినది అని భావించెను.

తర్హిదానీం రామచంద్రప్రతాపేనాస్తు మే గతిః ।
నిశ్చిత్యేత్థం న శత్రుఘ్నో రథస్థో జాహ్నవీతటే ॥ 7

స్థిత్వా ప్రోవాచ గంగాం స పరిపూజ్య సవిస్తరాత్ ।
శృణ్వత్సు సర్వలోకేషు మునిదేవగణేషు చ ॥ 8

దేవి గంగే మహాపుణ్యే యది సత్యం రఘూత్తమే ।
దీయతాం తర్హి పంథా మే శీఘ్రం సైన్యయుతస్య చ ॥ 9

ఇతి శత్రుఘ్నవచనం శ్రుత్వా సా జాహ్నవీ తథా ।
స్వవేగం ఖండయామాస స్వోదరం చాప్రదర్శయత్ ॥ 10

పద్భిర్వాజీ తదా శీఘ్రం పరం తీరం యయౌ క్షణాత్ ।
తథా సైన్యేన శత్రుఘ్నః ససుమంత్రః సమాయయౌ ॥ 11

మాగధాఖ్యం మహాదేశం స ఏవ కీకటః స్మృతః ।
పూర్వవచ్చ మహాపూరో జాహ్నవ్యాం సంబభూవ హ ॥ 12

ప్రతాపం రామచంద్రస్య సర్వైర్బుధ్వా మహాద్భుతమ్ ।
చక్రుస్తే జయశబ్దాంశ్చ సీతారామాఖ్యయా ముహుః ॥ 13

శ్యామకర్ణస్తతః శీఘ్రం యయౌ పూర్వదిశం ప్రతి ।
మాగధేశో నృపశ్చాథ శ్రుత్వా తురగమాగతమ్ ॥ 14

ప్రత్యుజ్జగామ సైన్యేన పురస్కృత్యథ వారణమ్ ।
నినాయాశ్వం పఠిత్వా తద్భాలపత్రం పురం నిజమ్ ॥ 15

పూజ్యాదరాత్ససైన్యం తం శత్రుఘ్నం విభవైర్నిజైః ।
సమస్తం నిజకోశాది సమర్ప్య మగధాధిపః ॥ 16

పౌరాన్ జానపదాన్స్వస్త్రీః సుహృత్తనయమంత్రిణః ।
పౌరపత్నీర్జానపదపత్నీర్విప్రాన్ పురోధసమ్ ॥ 17

ప్రేషయామాస సాకేతే వాహనైరధ్వరం ప్రతి ।
స్వయం సైన్యేన తురగచరణాననులక్ష్య చ ॥ 18

అయినా ఇపుడు శ్రీరామచంద్రుని ప్రతాపమువలన ప్రయాణమగుగాక. అని నిశ్చయించుకుని, రథముపై పయనిస్తున్న శత్రుఘ్నుడు గంగాతీరమున నిలిచి, గంగాదేవిని చక్కగా పూజించి, సర్వలోకములును, దేవఋషులును వినుచుండగా, "గంగాదేవీ! పుణ్యవతి! శ్రీరామునియందు సత్యము ఉన్నయెడల ససైన్యుడగు నాకు దారిని ఇమ్ము," అని ప్రార్థన చేయగా, ఆ వచనమును వినిన గంగానది, తన వేగమును ఆపి, దారిని చూపెను. పిదప క్షణమాత్రమున యజ్ఞాశ్వము కాలినడకతో నదిని దాటెను. అట్లే సైన్యములతోను శత్రుఘ్నుడు, సుమంత్రుడును నదిని దాటిరి. 'కీకట' మని చెప్పబడు మగధ దేశమునకు వచ్చి, అచటను గంగా ప్రవాహమును వెనుక చెప్పినట్లే దాటిరి. అపుడందరును శ్రీరామచంద్రుని ప్రతాపమును పొగడుచు, సీతారాములను జయజయ నాదములచే కొనియాడిరి. నీలిరంగు చెవి గలిగిన యజ్ఞాశ్వము అచటనుండి తూర్పునకు పయనించెను. మగధరాజు యజ్ఞాశ్వము వచ్చుచున్నసంగతిని విని, తన పట్టపుటేనుగును సైన్యములను ముందుపెట్టుకుని, గుఱ్ఱమువద్దకు వచ్చి, దాని నొసటఉన్న లేఖను చదువుకొని సాదరముగా దానిని ఆరాధించి, సైన్య సమేతుడైన శత్రుఘ్నుని సత్కరించి, తమ సమస్త సంపదలను సమర్పించి, తన దేశమువారిని, నాగరికులను, అంతఃపుర స్త్రీలను, పుత్ర, మిత్ర, మంత్రి ప్రముఖులను, సపత్నీకులను నిజపురోహితులతోడ అయోధ్యలోని యజ్ఞమునకు పంపించి, తాను సైన్యముతో యజ్ఞాశ్వముయొక్క చరణములను కనిపెట్టికొనుచు శత్రుఘ్నుని ఆజ్ఞను అనుసరించు వానిగా, నమస్కారభావముతో వచ్చుచుండెను.

**శత్రుఘ్నవాగానువర్తీ బద్ధహస్తపుటో యయౌ ।**
**ఏవం సర్వేఽపి రాజానో జ్ఞాతవ్యాః సర్వదిక్ స్థితాః ॥ 19**

**న కేనాపి శ్యామకర్ణో బద్ధో నృపతినా భువి ।**
**ఇంద్రాద్యైర్నిర్జరైర్నాపి నాసురాద్యైః కదాచన ॥ 20**

**తతో వాజీ పూర్వదేశానంగవంగకలింగకాన్ ।**
**తథా నానావిధాన్దేశాన్ విలంఘ్య జలధేస్తటమ్ ॥ 21**

**దృష్ట్వా నృపకులైర్యుక్తో దక్షిణాభిముఖో యయౌ ।**
**గోదావరీం నదీం తీర్త్వా దేశమాంధ్రం చ ద్రావిడమ్ ॥ 22**

**అతిక్రమ్యారవారాఖ్యం దేశం సమతిక్రమ్య చ ।**
**కాంచీప్రదేశాన్ సకలాన్ పశ్యన్నానావిధాన్శుభాన్ ॥ 23**

కావేరీం సమతిక్రమ్య చోళదేశం విలంఘ్య చ ।
సేతుబంధం తతో దృష్ట్వా పశ్చిమాభిముఖో యయౌ ॥ 24

తామ్రపర్ణీ విలంఘ్యాథ సమతిక్రమ్య కేరళాన్ ।
ద్విషట్ప్రకారాన్ దేశాంశ్చ గోకర్ణం చ తతో యయౌ ॥ 25

కృష్ణాతీరప్రదేశాంశ్చ సమతిక్రమ్య ఘోటకః ।
కర్ణాటకం మహాదేశం సమతిక్రమ్య సత్వరమ్ ॥ 26

కొంకణం సమతిక్రమ్య తత్తద్దేశనృపైః సహ ।
భీమాన్దేశాన్స సకలాన్ శ్యామకర్ణః శుభావహః ॥ 27

పశ్యన్ యయౌ మహారాష్ట్రం గౌతమీ తాం విలంఘ్య చ ।
విదర్భం సమతిక్రమ్య యయావాభీరమండలమ్ ॥ 28

మాళవం సమతిక్రమ్య తీర్త్వా పుణ్యాం మహానదీమ్ ।
తీర్త్వా సా భ్రమతీం పుణ్యాం సమతిక్రమ్య గుర్జరమ్ ॥ 29

ప్రభాసం చ తతో గత్వా యయావానర్తముత్తమమ్ ।
సౌవీరాన్ సమతిక్రమ్య యయౌ వాజీ స మాధురాన్ ।
సౌరాష్ట్రాన్ సమతిక్రమ్య మరుదేశం యయౌ హయః ॥ 30

ధన్వదేశమతిక్రమ్య యయౌ సారస్వతానథ ॥
మత్స్యాన్ దేశానతిక్రమ్య యయౌ వాజీ స మాథరాన్ ॥ 31

అదేవిధముగా తొమ్మిది దిక్కులలోని సమస్తరాజులును యజ్ఞాశ్వమును అనుసరించిరి. యజ్ఞాశ్వమును భూమిలో ఒకరాజును బంధించలేదు. దానిని బంధించుటకు ఇంద్రాదుల చేతగాదు. దానవులచేతగాదు. అంత ఆ యజ్ఞాశ్వము అంగ, వంగ, కళింగాది నానాపూర్వ దేశములను పర్యటించి, తూర్పు సముద్రతీరమునకు వచ్చెను. (21)

## యజ్ఞాశ్వము దక్షిణదిక్కున సంచరించుట.

యజ్ఞాశ్వము రాజ సమూహముతో కూడి దక్షిణాభి ముఖముగా పయనించి, గోదావరినది దాటి, ఆంధ్ర, ద్రావిడ దేశములను చూచి, ఆరవార దేశమును అతిక్రమించి, మంగళమగు సమస్త

కాంచీమండల ప్రదేశములనన్నిటిని చూచుచు, కావేరీ నదిని దాటి, చోళదేశముగుండా పయనించి, శ్రీరామసేతువునకు వచ్చెను. (24)

## యజ్ఞాశ్వము పశ్చిమదిక్కున సంచరించుట.

గుఱ్ఱము పడమర దిశగా పయనిస్తూ తామ్రపర్ణీనదిని దాటి, పండ్రెండు విధములగు కేరళ దేశమును దాటి, గోకర్ణమునకు వచ్చి, కృష్ణాతీరప్రదేశమును చూచుచు, కర్ణాటకదేశమును దాటి, కొంకణదేశమును దాటి, ఆయాదేశపు రాజులతోడ భీమానది ప్రదేశమును జూచి, మహారాష్ట్రమునకు వచ్చి, గౌతమీనదిని దాటి, విదర్భను చూచి, అభీరమండలమునుచేరి, మాళవమునకు వచ్చి, పుణ్యమగు మహానదిని దాటి, సాభ్రమతిని లంఘించి, ఘూర్జరదేశమును అతిక్రమించి, ప్రభాసమునకు వచ్చెను. (29)

## యజ్ఞాశ్వము ఉత్తరదిక్కున సంచరించుట.

ఆనర్తదేశమునకు పోయి, సౌవీరదేశములను, మరుదేశమును, ధన్వదేశమును, సార్వస్వత దేశమును, మత్స్యదేశమును, మధురములను దాటెను.

**శూరసేనానతిక్రమ్య పాంచాలాన్ తురగో యయౌ ।**
**కురుక్షేత్రం తతోగత్వాఽతిక్రమ్య కురుజాంగలాన్ ॥ 32**

**దేశం కైకేయముల్లంఘ్య యయౌ కాశ్మీరముత్తమమ్ ।**
**భిల్లదేశం గౌడదేశం శకదేశం యయౌ హయః ॥ 33**

**యవనాంస్తామ్రదేశాంశ్చ సమతిక్రమ్య వేగతః ।**
**పశ్యన్ నానావిధాన్ దేశాన్ కరతోయాతటేన వై ॥ 34**

**యయౌ వాజీ వాయుగత్యా శీఘ్రం జ్వాలాముఖీం ప్రతీ ।**
**దోషభీత్యా కరతోయాం తీర్త్వా నైవాగ్రతో గతః ॥ 35**

**కర్మనాశానదీస్పర్శాత్ కరతోయావిలంఘనాత్ ।**
**గండకీం బాహుతరణాద్ధర్మః స్ఖలతి కీర్తనాత్ ॥ 36**

**హరిద్వారం యయౌ వాజీ తతో గంగాతటేన హి ।**
**హిమాద్రేః సన్నిధౌ దేశాన్ సమతిక్రమ్య వేగతః ॥ 37**

బదరికాశ్రమ మాలోక్య కలాపగ్రామవాసిభిః ।
సంమానితస్తదా వాజీ గత్వా తన్మానసం సరః ॥ 38

దృష్ట్వా హరిహరక్షేత్రం మిథిలాం ప్రాప సేనయా ।
నానాదేశానతిక్రమ్యా ఆర్యావర్తం యయౌ హయః ॥ 39

దృష్ట్వా కాశీం త్రివేణీం చ హ్యంతర్వేదీం యయౌ జవాత్ ।
శృంగబేరపురం గత్వా తమసాం తాం విలంఘ్య చ ॥ 40

గత్వా స నైమిషారణ్యం సముల్లంఘ్యాథ గోమతీమ్ ।
బ్రహ్మావర్తం సరో గత్వా పశ్యన్ దేశాన్ మనోరమాన్ ॥ 41

కోసలాఖ్యం మహాదేశం దృష్ట్వా వాజీ మనోరమమ్ ।
తతః సాకేతవిషయే షణ్మాసైః ప్రాప చాధ్వరమ్ ॥ 42

నానాదేశాన్ నృపైః సార్ధం శత్రుఘ్నేనాభిరక్షితః ।
ఆగతం శ్యామకర్ణం తం జ్ఞాత్వా సీతాపతిస్తదా ॥ 43

శూరసేనదేశాలను, పాంచాలదేశాలను, కురుక్షేత్రమును, కేకయదేశాలను క్రమముగా దాటి, కాశ్మీరమునకు వచ్చెను. పిదప భిల్లదేశమును, శకదేశమును, గౌడదేశమును దాటి, యౌవన తామ్ర దేశమును చూచి, నానాదేశములను వీక్షించుచు, కరతోయ నదీతీరముననే వాయువేగముతో వచ్చుచు, పిమ్మట జ్వాలాముఖికి వచ్చి, దోషభీతివలన కరతోయా నదిని దాటి ముందుకు పోక, హరిద్వారమునకు వెడలెను. ఆదోషమేమనిన–కర్మనాశా నదిని స్పృశించుటచేతను, కరతోయానదిని గండికిగా అతిక్రమణముగా చెప్పుకొనుటచేతను ధర్మము నశించును. యజ్ఞాశ్వము గంగాతీరముననే హిమాద్రి ప్రదేశములను వేగముగా దాటి, బదరికాశ్రమమును వీక్షించి, కలాప గ్రామవాసులచే సమ్మానింపబడి, మానస సరోవరమునకేతెంచి, సార క్షేత్రమును అవలోకించి, మిథిలాదేశమునకు వచ్చి, నానాదేశములను అతిక్రమించి, యమునానదికి, కాశికివచ్చి, త్రివేణికివచ్చి, వేగముగా అంతర్వేదికి ఏతెంచెను. శృంగబేరపురము పోయి, తమసా నదిని దాటి, నైమిశారణ్యమునకు వెడలి, గోమతీనదిని దాటి, బ్రహ్మావంపు చూచి, మనోహరములగు దేశములను వీక్షించుచు కోసల నాయక దివ్యదేశమును ఈ యజ్ఞాశ్వము ఆరు మాసములలోపల నానాదేశపు రాజులతోడ శత్రుఘ్నపరివారము వచ్చి, సాకేతరాజధానిలోని యజ్ఞ వాటికలో ప్రవేశించెను. (42)

## శ్రీరామ అశ్వమేధమున జనసంబంధాది వైభవము.

పిదప శ్రీరాముడు యజ్ఞాశ్వమును చూచి, లక్ష్మణుని ఆజ్ఞాపించెను. అతడును పట్టపు ఏనుగును ముందు పెట్టుకుని,......

ఆజ్ఞాపయచ్చ సౌమిత్రిం సోఽపి ప్రత్యుజ్జగామ తమ్ ।
వారణేంద్రం పురస్కృత్య భేరీదుందుభినిఃస్వనైః ॥ 44

వారస్త్రీణాం నృత్తగీతైర్వేదఘోషైర్ద్విజేరితైః ।
సంపూజ్యాథ శ్యామకర్ణం నృపతీంశ్చ సవిస్తరమ్ ॥ 45

ఆనయామాస సౌమిత్రిః శనైరధ్వరమంటపమ్ ।
మహోత్సవో మహానాసీత్తదా తురగదర్శనే ॥ 46

దశయోజనపర్యంతం సర్వత్ర జగతీతలమ్ ।
వ్యాప్తం సమం తతోఽయోధ్యాబహిర్నృపగణైస్తదా ॥ 47

తత్ర సర్వత్ర రాజానః పూర్వం సంప్రేషితాన్ జనాన్ ।
పౌరాన్ జానపదాన్ స్త్రీశ్చ పశ్యంతో భ్రమరోపమాః ॥ 48

సైన్యేన బభ్రముః సర్వే స్వీయదర్శనలాలసాః ।
న ప్రాపుర్దర్శనం తేషాం జనౌఘేఽధ్వరమంటపే ॥ 49

కేచిత్తే దర్శనం స్వానాం ప్రాపుస్తత్ర పరేఽహని ।
కేచిత్తృతీయే దివసే పంచమే సప్తమేఽథ వా ॥ 50

కేచిద్దుందుభిఘోషేణ ప్రాపుః స్వానాం ప్రదర్శనమ్ ।
కేచిత్ పక్షానంతరం హి మాసేనానంతర జనాః ॥ 51

కేషాం వియోగ ఏవాసీచ్చిరకాలం తదాఽధ్వరే ।
తత్జ్ఞాత్వా రామచంద్రోఽపి లక్ష్మణం ప్రాహ సాదరమ్ ॥ 52

పరస్పరం వియోగోఽత్ర సంమర్దేన తు లక్ష్మణ ।
జాయతే యత్ర యుక్తిం త్వం మత్తః శ్రుత్వా కురుష్వ తామ్ ॥ 53

**తమసాయాస్తటే శాలాం కృత్వాఽద్య మహతీం శుభామ్ ।**
**ఘోషణీయశ్చ సర్వత్ర మహాదుందుభినిఃస్వనైః ॥ 54**

**యేషాం వియోగస్తైర్గత్వా తమసాతటశోభితామ్ ।**
**శాలాం ప్రవేశయధ్వం హి స్వానాం యోగోఽస్తు తత్ర హి ॥ 55**

సైన్యవైభవములతో, భేరీ మృదంగాది మంగళవాద్యములు మ్రోగుచుండ, నృత్యగీతములు జరుగుచుండ, బ్రాహ్మణవేదఘోషలు జరుగుచుండ, ఆ యజ్ఞాశ్వమును స్వాగతించి, పూజించి, రాజమార్గమును అలంకరించి, తిన్నగా యజ్ఞమంటపమునకు తీసుకుని వచ్చెను. ఆ గుఱ్ఱపు దర్శనము మహోత్సవము బాగుగా జరిగినది. అయోధ్యాపురికి చుట్టున పదియామడలభూమి రాజులచే రాజించుచు నిండియుండెను. అపుడచట రాజులందరును తమ సైన్యములతో తుమ్మెదలవలే పరిభ్రమిస్తూ, తాము ముందు పంపిన తమ ఇష్ట మిత్ర, పుత్ర, కళత్ర, పరివార, నాగరిక, దేశీయాది జనులను వెదకుచుండిరి. తమవారిని మరునాడు, కొందరు రెండవదినములకును, కొందరు మూడవ దినములకు, కొందరు ఐదుదినములకు, కొందరు ఏడుదినములకును కనుగొనుచుండిరి. కొందరు బేరీనాదములచే తమవారిని చూచుకొనిరి. కొందరు 15 రోజులకును, కొందరు ఒక నెలకును కనుగొనిరి. ఆయజ్ఞమున కొందరికి చిరకాలము వియోగమే మిగిలెను. ఆసంగతిని ఎఱిగి శ్రీరాముడు సాదరముగా లక్ష్మణునితో, "తమ్ముడా! ఈ మహాజనులలో అన్యోన్యముగా సమర్థముచే వియోగము విశేషముగా కలుగుచున్నది దానికి నేనొక యుక్తిని చెప్పెదను నీవు దానిని విని అట్లు చేయింపుము. తమసానది తీరమున చక్కని మహాశాలను ఒకదానిని నిర్మించి అచట పెద్దపెద్ద దుంధుభులచే, మహాఘోషమును వినునట్లు చేసి, ఎవ్వరెవ్వరు వియోగమునందియుండిరో వారందరును తమసానదీ తీరమున శోభించుచుండు శాలను ప్రవేశించండి. అచట మీవారిని చూచెదరుగాక అని చాటించునది."

**చతుష్పదాదివస్తూని జ్ఞాత్వా యస్య లఘూన్యపి ।**
**తత్రైవ స్థాపనీయాని స్వం స్వం గృహ్ణంతు తే జనాః ॥ 56**

**ఇతి రామవచః శ్రుత్వా తథేత్యుక్త్వా స లక్ష్మణః ।**
**తథా చకార తత్సర్వం యేన యోగః పరస్పరమ్ ॥ 57**

**సర్వే తత్ర జనాః ప్రాపుః స్వానాం స్త్రీబాలమంత్రిణామ్ ।**
**చతుష్పదాదివస్తూనాం తత్ర లాభో బభూవ హ ॥ 58**

**యత్కించిద్విస్మృతం యేన తద్దృష్ట్వాఽన్యేన వై తదా ।**
**శాలాయాం స్థాపితం దృష్ట్వా త్వయం జగ్రాహ తత్ర సః ॥ 59**

**ఏవం శ్రీరామయజ్ఞే హి సంమర్దః సంబభూవ హ ।**
**న తత్ర శుశ్రువే శబ్దః కర్ణేఽప్యుక్తో జనైస్తదా ॥ 60**

**తతస్తే పార్థివాః సర్వే తస్థుర్వసనసద్మసు ॥ 61**

**ఇతి శ్రీశతకోటిరామచరితాంతర్గతే, శ్రీమదానందరామాయణే, వాల్మీకీయే, ఆదికావ్యే, యాగకాండే, అశ్వగమనం నామ తృతీయః సర్గః ॥**

మరియు అచటనే అన్యములని తెలియవచ్చు చతుష్పదాది సకలవస్తువులను పెట్టింపవలయును. ఎవరి వస్తువులను వారు వచ్చి తీసుకువెళ్ళుదురుగాక! అని ఆజ్ఞాపింపగా అట్లేనని లక్ష్మణుడు శ్రీరాముడు చెప్పినట్లు ఏర్పాటుచేసెను. సర్వజనులును అచటచేరి వారివారిని స్త్రీ, బాలాకాది జనులను కనుగొనిరి. చతుష్పదాది వస్తువులును దొరకుచు వచ్చినవి. ఎవ్వడైనను దేనినైనను మరచి విడిచి పోయినను, ఇతరుడు దానిని జూచి అచట నుంచగా తీసికొనుచుండును. ఇట్లు శ్రీరాముడు చేసిన యజ్ఞమున సమర్ధకోలాహలము కలిగినది. చెవిలో మాట్లాడినను ఒకరిశబ్దము మరియొకరికి వినబడదు. అంత అచటికి వచ్చిన రాజులందరును గుడారములలో యథాసుఖముగా నిలిచిరి.

***శతకోటిప్రవిస్తరమైన రామకథలో, శ్రీమద్వాల్మీకిమహర్షిచే రచింపబడిన, ఆనందరామాయణములోని, యాగకాండలో, అశ్వగమనమును వివరించు మూడవ సర్గ ముగిసినది.***



# చతుర్థః సర్గః-4వ సర్గ

కుంభోదర ఋషి శ్రీరాముని స్తుతించుట

శ్రీరామదాస ఉవాచ
అథ తే ఋత్విజః సర్వే మంగలైర్వివిధైః శుభైః ।
సమ్యక్ ప్రవర్తయామాసుర్వాజిమేధం యథావిధి ॥ 1

తత్రర్త్విజో వాజిమేధే రత్నకౌశేయవాససః ।
ససదస్యా విరేజుస్తే యథా వృత్రహణోఽధ్వరే ॥ 2

ఏతస్మిన్నంతరే తత్ర సురేశసహితైః సురైః ।
స్వామినా విఘ్నరాజేన పార్వత్యా వృషభస్థితః ॥ 3

మహేశ్వరో యజ్ఞవాటం రామాహూతో యయౌ గణైః ।
శివమాగతమాజ్ఞాయ ప్రత్యుద్గమ్యాథ లక్ష్మణః ॥ 4

వారణేంద్రం పురస్కృత్య పతాకాధ్వజతోరణైః ।
నానావాద్యసుఘోషైశ్చ వారస్త్రీణాం ప్రవర్తనైః ॥ 5

సంపూజ్య శంకరం భక్త్యా చానయామాస మంటపమ్ ।
పంచ సప్త పదాన్యగ్రే గత్వా రామోఽపి శంకరమ్ ॥ 6

## అశ్వమేధ యాగమునకు శంకరుడు విచ్చేయుట.

శ్రీరామదాసు ఇట్లు చెప్పుచున్నాడు, "యాగశాలలోనికి అశ్వమును స్వాగతించిన అచటి ఋత్విక్కులందరును వివిధ శుభకార్యములతో యథావిధిగా అశ్వమేధయాగమును జరుపుచుండిరి. ఆ అశ్వమేధ ఋత్విక్కులు మణులు చెక్కిన పట్టుబట్టలను కట్టుకుని, సదస్యులతో ఇంద్రుని యజ్ఞమున ఉన్నట్లు ప్రకాశించుచుండిరి. అంతలో అచటికి దేవతలతోకూడి దేవేంద్రుడు, పార్వతి గణపతులను వెంటతీసుకుని, వృషభారూఢుడై పరమేశ్వరుడు శ్రీరామునిచేత ఆహ్వానింపబడి ప్రమదగణములతో వచ్చెను. శివుడు వచ్చుచున్న సంగతిని విని లక్ష్మణుడు భద్రగజమును ముందుపెట్టుకుని, ఛత్ర ధ్వజ పతాకాలతో వెడలి స్వాగతించి, నృత్య, గీత, వాద్యములు జరుగుచుండగా శివుని పూజించి, యజ్ఞ వాటికకు తీసుకుని వచ్చెను. అప్పుడు శ్రీరాముడును ఐదు-ఆరు అడుగుల ముందుకు వెడలి,

నమస్కృత్య సమాలింగ్య విశ్వేశం గిరిజాయుతమ్ ।
హైమాసనే సన్నివేశ్య హేమపాత్రే స్వహస్తతః ॥ 7

పాదప్రక్షాళనం శంభోశ్చకార సీతయా ప్రభుః ।
హేమనిర్మితఝర్ఝర్యా మణిరత్నాదిచిత్రయా ॥ 8

జలధారాం యథాయోగ్యాం మోచయామాస జానకీ ।
తతస్తే రాఘవం సీతాం దృష్ట్వా దేవగణాస్తదా ॥ 9

అనిమేషాః కంజనేత్రకటాక్షాః సన్నిరీక్ష్య హి ।
తయోశ్చిత్రోపమా ఆసన్ న విదుః కే వయం త్వితి ॥ 10

తుష్టువుస్తత్ర కేచిత్తే సురాః శ్రీరాఘవం ముదా ।
జానకీం తుష్టువుః కేచిత్ ప్రబద్ధకరసంపుటాః ॥ 11

ఏవం నిర్జరసంఘానాం సంతోషస్తత్ర వై హ్యభూత్ ।
అనౌపమ్యం తయోర్దృష్ట్వా రూపం కోటిరవిప్రభమ్ ॥ 12

అథ రామః సీతయా హి శంకరం గిరిజామపి ।
స్వయం సంపూజ్య సకలాన్ దేవాన్ సౌమిత్రిణా ఋషీన్ ॥ 13

పూజయిత్వాఽబ్రవీద్వాక్యం శంకరం లోకశంకరమ్ ।
అద్య ధన్యోఽస్మ్యహం దేవ దర్శనాత్తవ సీతయా ॥ 14

అద్య మే సూర్యవంశేఽస్మిన్ జన్మ సాఫల్యతాం గతమ్ ।
ఇతి రామస్య వచనం శ్రుత్వా స శశిభూషణః ॥ 15

విహస్య రాఘవం ప్రాహ వేద్మి మాయాం హరే తవ ।
త్వన్నాభికమలే బ్రహ్మా జాతస్తస్మాన్మునీశ్వరాః ॥ 16

మరీచ్యాద్యాః సంబభూవుః పౌత్రాః సప్తాహతౌజసః ।
మరీచేః కశ్యపః పుత్రః సృష్ట్యుత్పత్తివిధాయకః ॥ 17

కశ్యపాత్సవితా జజ్ఞే పౌత్రపౌత్రస్తవ ప్రభో ।
రవేర్జాతః సూర్యవంశస్తద్వంశో తవ జన్మ వై ॥ 18

**త్వద్వంశసంభవః సూర్యః కిం మాం మోహయసి ప్రభో ।**
**దేవానాం కార్యసిద్ధ్యర్థమవతీర్ణోఽసి మాయయా ॥ 19**

చంద్రశేఖరునికి నమస్కరించి, హత్తుకుని, పార్వతీ పరమేశ్వరులను కనక సింహాసనమున కూర్చుండబెట్టి, తన చేతులతో బంగారు పళ్ళెములో శివుని చరణ కమలములను కడిగెను. సీతా దేవి రత్నములతో అలంకరింపబడిన బంగారు చెంబుతో జలధారను విడిచెను. అట్టి సీతారాములను జూచి దేవగణములు రెప్పవేయక కలువకన్నులతో కటాక్షములను సీతారాములలో చేర్చి, తామెవ్వరమో దానిని కూడా మరచి చిత్రపు బొమ్మలవలె ఉండిరి. చేతులు జోడించుకుని కొందరు శ్రీరాముని, కొందరు సీతాదేవిని కొనియాడుచుండిరి. ఇట్లు అసమానమగు సీతారాముల లావణ్యమును జూచి, దేవగణములు ఆనందించుచుండిరి. పిదప శ్రీరాముడు లక్ష్మణునితో పార్వతీ పరమేశ్వరులను, దేవతలను అందరిని తామే క్రమముగా పూజించి, పూజచేయించి, లోక శంకరుడగు శంకరునితో, "దేవా! నీ దర్శనము నేడు కలుగుటచేత, సీత తోడ నేను ధన్యుడనైతిని. నేడు ఈ సూర్యవంశమున నా జన్మము సఫలమైనది," అని చెప్పెను. దానిని విని చంద్రశేఖరుడు నవ్వుచు శ్రీరామునితో, "శ్రీహరి! నీ మాయను నేను ఎరుగుదును. నీ నాభికమలమున ఉద్భవించిన బ్రహ్మ నుండి మరీచ్యాది మహర్షులు, మునులుగా ఏడుమంది అవతరించిరి. మరీచికి కశ్యపుడు, సృష్ట్యాది విద్యాధికుడగు పుత్రుడు, కశ్యపుని నుండి నీ ప్రప్రౌత్రుడగు సూర్యుడు పుట్టెను. రవినుండి సూర్యవంశమయ్యె. అచట నీ అవతారము కలిగెను. ప్రభూ! నన్ను ఎలా మోసపరచెదవు. నీ వంశమున పుట్టినవాడు సూర్యుడుకాడా? నీ మాయచే దేవకార్యము కొరకు అవతరించితివి. తీర్థయాత్రా యజ్ఞకర్మాది వినోదములచే యథేష్టముగా క్రీడించుము.

**కురు క్రీడాం యథేచ్ఛం త్వం యాత్రాయజ్ఞాదికౌతుకైః ।**
**శిక్షాం కరోషి లోకానాం వేద్మ్యహం చేష్టితం తవ ॥ 20**

**ఇతి శ్రుత్వా శంభువాక్యం సీతారామౌ విహస్య చ ।**
**యకుజ్ఞకుండసమీపే తు తస్థతుర్గురుసన్నిధౌ ॥ 21**

**ఏతస్మిన్నంతరే తత్ర సమాజగ్ముః సహస్రశః ।**
**గంధర్వాః కిన్నరాః సిద్ధాస్తథా చాప్సరసాం గణాః ॥ 22**

**లోకపాలాశ్చ దిక్పాలా రసాతలనివాసినః ।**
**నవగ్రహాః షడృతవః షష్టిసంవత్సరాస్తథా ॥ 23**

ఋక్షాణి తిథయో యోగాః కరణాని చ రాశయః ।
పర్వతాస్తరవః సర్వే సాగరాశ్చ నదా అపి ॥ 24

సరోవరాణి నద్యశ్చ వాప్యః కూపాస్తథాఽపరే ।
ధృత్వా జంగమరూపాణి యయుస్తే యజ్ఞమంటపమ్ ॥ 25

సమాగతశ్చ సంపాతిర్గుహకో మకరధ్వజః ।
సమాయయౌ స లంకాయా రాక్షసైశ్చ విభీషణః ॥ 26

మానితా రాఘవేణాపి సర్వే తస్థుః ప్రపూజితాః ।
స్వాంతికే స్థాపితాః పూర్వం తత్రైవాసన్ ప్లవంగమాః ॥ 27

ఏతస్మిన్నంతరే తత్ర సమాయాతో మునీశ్వరః ।
కుంభోదరో మహాతేజాః సీమాచారైర్విలోకితః ॥ 28

తం దృష్ట్వా భయభీతాస్తే సర్వే ప్రోచుః పరస్పరమ్ ।
హా కష్టం పునరాయాతః సోఽయం కుంభోదరో మునిః ॥ 29

యాత్రాశ్రమో రాఘవస్య యన్నిమిత్తో బభూవ హ ।
యద్వాక్యాదశ్వమేధోఽపి సర్వేషాం సంబభూవ హ ॥ 30

మహాన్ శ్రమోఽశ్వపృష్ఠే తు భ్రమతాం జగతీతలే ।
అధునాఽపి సమాయాతః కిమగ్రే వై పునస్త్వయమ్ ॥ 31

కరిష్యతి న తద్విద్మో రాఘవస్యాపి నిందకః ।
ఏవం నానావిధా వాచః సీమాచారగణేరితాః ॥ 32

శ్రీరామా! నీవు ఆచరణతో లోకమునకు పాఠము నేర్పుచుందువు. నేను ఎరుగుదును." అని చెప్పెను. ఇట్లు పలికిన పరమేశ్వరుని పలుకులను విని శ్రీరామచంద్రుడు, సీతా దేవియును నవ్వుచు వెడలి, యజ్ఞకుండ సమీపమున గురుసన్నిధిలో కూర్చుండిరి. (21)

## అశ్వమేధ యజ్ఞమును చూచుటకు దేవతలందరూ వచ్చుట.

అంతలో ఆ యజ్ఞవాటికకు వేలకొలదిగా గంధర్వులు, కిన్నెరులు, సిద్ధులు, యక్షులు, అప్సరసలు, దిక్పాలకులు, లోకేశ్వరులు, పాతాళవాసులు, నవగ్రహములు, తిథి, వార, నక్షత్ర, యోగ, కరణ,

దిన. పక్ష, మాస, ఋతు, సంవత్సరాది కాలాభిమాని దేవతలు, సాగరదేవతలు, పర్వతదేవతలు, వృక్షదేవతలు, పక్షిదేవతలు, వాపి, కూప, తటాకాది దేవతలు, వీరందరును కదిలే రూపములను దాల్చి వచ్చుచుండిరి. సంపాతి, గుహుడు, మకరధ్వజుడు, లంకనుండి రాక్షసులతోడ విభీషణుడును వచ్చిరి. శ్రీరామునితో అందరును సమ్మానింపబడి, వారికి కేటాయింపబడిన ఆసనములపై కూర్చుండిరి. కపులను మొదట తనదగ్గరనే కూర్చుండ బెట్టుకొనెను. వారట్లే ఉండిరి. (27)

## కుంభోదరుడు శ్రీరామునితో సంభాషించుట.

అంతలో అచటికి మునీంద్రుడగు కుంభోదరుడు వచ్చెను. ఆ మునిని ద్వారపాలకులు చూచిరి. భయభ్రాంతులగుచు వారందరును ఒకరితో ఒకరు, "అయ్యో! మరలా ఈ కుంభోదరుడు వచ్చెనే! వీనివల్లనే కదా శ్రీరామునికి తీర్థయాత్ర శ్రమకలిగినది! ఈ అశ్వమేధమున అందరికి తొందర కలిగెను! అశ్వముపై భూమిని చుట్టివచ్చుచుండగా ఎంత బరువు ఎక్కినది! ఇపుడును వచ్చెనే ఇంక వీడేమిచేయునో! దానిని మేమేమి ఎఱుగజాలము." అనుకొనిరి.

**శృణ్వన్ కుంభోదరస్తూష్ణీం యయౌ యజ్ఞభువం ప్రతి ।**
**తదాగమనపూర్వం స సీమాచారైర్నివేదితః ॥ 33**

**ధావద్భిర్వేపమానైశ్చ స్ఖలద్వాగ్భిస్త్వరాన్వితైః ।**
**రామ రామ మహాబాహో హే లక్ష్మణ శృణు ప్రభో ॥ 34**

**యాత్రాయజ్ఞశ్చ యద్వాక్యాత్ సమాయాతః స వై పునః ।**
**కుంభోదరో మునిశ్రేష్ఠో రామ త్వయ్యపి నిష్ఠురః ॥ 35**

**తద్దూతవచనం శ్రుత్వా సర్వే తద్దర్శనోత్సుకాః ।**
**త్యక్త్వా స్వీయానికర్మాణి చోత్తస్థుస్తద్దిదృక్షయా ॥ 36**

**ఋత్విజో రాఘవః సీతా న భయం మేనిరే మునేః ।**
**కుంభోదరో యజ్ఞవాటం యయౌ సర్వైర్విలోకితః ॥ 37**

**అతిఖర్వః స్థూలశిరాః శ్యామకర్ణః సపాదుకః ।**
**స్థూలదరః పింగనేత్రః సకోపీనాం జటాధరః ॥ 38**

**చీరవాసాః ఖర్వపాదః ఖర్వహస్తో మహామునిః ।**
**యువా కించిత్ శ్మశ్రుయుక్తో ధృతదండకమండలుః ॥ 39**

తం దృష్ట్వా సకలా లోకా భయం ప్రాపుః స్వచేతసి ।
పూర్వకర్మ చ సంస్మృత్య సంశ్రుత్య చ పరస్పరమ్ ॥ 40

ఏతస్మిన్నన్తరే రామః శీఘ్రం ప్రత్యుజ్జగామ తమ్
సాష్టాంగం ప్రణిపత్యాథ కరే ధృత్వా తు మండపమ్ ॥ 41

ఆనయామాస శ్రీరామో దదౌ హైమాసనం వరమ్ ।
కుంభోదరో మునిః శీఘ్రం భూమౌ దండకమండలూ ॥ 42

స్థాపయామాస చీరాణి ననామ రఘునాయకమ్ ।
రామః శీఘ్రం కరాభ్యాం తం ప్రత్యుత్థాప్య మునీశ్వరమ్ ॥ 43

గాఢమాలింగ్య బాహుభ్యాం తతో ముని మభాషత ।
నాహం యోగ్యో వందనార్థం త్వయా రావణఘాతకః ॥ 44

ఇతి రామవచోరూపైర్బాణైః సంతాడితో హృది ।
కుంభోదరస్తదోవాచ యజ్ఞవాటే రఘూత్తమమ్ ॥ 44

"ఆహా! వీడు శ్రీరామ దూషకుడు కదా!" అని ఇట్లు నానావిధములుగా కాపలాదారులు గుంపులు గుంపులుగా చేరి చెప్పుకొను మాటలను వినుచు, ఊరకే కుంభోదరుడు యజ్ఞభూమికి వచ్చెను. వాడు వచ్చుచున్న సంగతిని దూతలు చింతతో పరుగెత్తుకుని వచ్చి, నోట మాటలు ఆగుచుండగా, "రామా! రామా! మహాప్రభూ! ఓ లక్ష్మణ ప్రభూ! ఎవని మాటలమీద శ్రీసీతారాములు తీర్థయాత్రయును, యజ్ఞకర్మను చేయుచున్నారో, అట్టి కుంభోదర మునీంద్రుడు వచ్చియున్నాడు. శ్రీరామా! నీ యందును అతడు మిక్కిలి నిష్ఠూరుడు," అని మొరపెట్టిరి. ఆ మాటలను విని సభికులందరును వారి దర్శనమునకై కుతూహలముతో వారివారి పనులను మాని లేచిరి. ఈ మునివలన శ్రీరాముడును, సీతయును, ఋత్విక్కులును భయపడలేదు. ఇట్లుండగా అప్పుడు అచ్చటికి పొట్టి శరీరము, పెద్దతల, నల్లని చెవులు, పెద్దబొజ్జ, పచ్చని కండ్లు, జడలు, మోటు కాళ్ళు, మరుగుజ్జు చేతులు, బొట్టమీసములు, గడ్డము, దండ కమండలములతో ప్రకాశించు నటువంటి వాడును, కౌపీన పాదుకాలంకృతుడును, తరుణుడును నారబట్టలను తొడగినవాడును అగు కుంభోదరుని అందరూ చూచిరి. జనులందరును కుంభోదరుని జూచి, మనసులో గతములో వీని చర్యలను తలంచి తలంచి, వెఱచిరి. అంతలో ఆ సంగతిని గ్రహించిన శ్రీరాముడు తానే వచ్చి, కుంభోదరునికి సాష్టాంగముగా నమస్కరించి, తానే

వారి చేతిని పట్టుకుని యజ్ఞమండపమునకు పిలుచుకుని వచ్చి, కనక పీఠమును ఇచ్చి సత్కరించెను. కుంభోదరుడు త్వరగా తన దండ, కమండలువులను, వస్త్రములను నేలమీద పెట్టి, శ్రీరామునికి దండప్రణామము చేసెను. త్వరగా రాముడు మునిని లేవనెత్తి, భుజములచే ఆలింగించి, మునీంద్రునితో, "రావణబ్రహ్మను హత్యచేసిన నేను నీచే నమస్కరింపదగినవాడనా?" అని వాక్శరములతో పొడిచెను. అప్పుడు కుంభోదరుడు శ్రీరామచంద్రుని జూచి....

రామ రామ మహాబాహో న కోపః క్రియతాం మయి ।
అపరాధ్యస్మ్యహం తే హి క్షమస్వ రఘునాయక ॥ **46**

న మయా స్వార్థసిద్ధ్యర్థం దోషారోపః కృతస్త్వయి ।
కృతః పరోపకారార్థం తథా కీర్త్యై తవాపి చ ॥ **47**

శిక్షార్థం సకలాన్ లోకాన్  తత్ జ్ఞాతం చ త్వయాపి హి ।
యథైతే మునయః సర్వే తవ సత్రేఽన్ననిర్మితే ॥ **48**

శతశో భోజనం చక్రుస్తథా భుక్తం మయాఽపి చ ।
తదా కుతో మహత్కీర్తిస్తవ మే రఘునందన ॥ **49**

ఇతి నిశ్చిత్య హృదయే మయా పూర్వం హితాయ హి ।
లోకానాం చ కృతో యత్నస్త్వయి దోషానుకీర్తనైః ॥ **50**

నోచేద్యాత్రాసముద్యోగః కథం రామ భవేత్తవ ।
యత్ర యత్ర చ దేశేషు తీర్థేషూపవనేషు చ ॥ **51**

ఆశ్రమారామగ్రామేషు నదీవనగిరిష్వపి ।
యే యే జనాశ్చ సర్వత్ర నానాకర్మసు తత్పరాః ॥ **52**

తవ దర్శనలాభస్తు తేషాం జాతః సుఖప్రదః ।
తత్రాహం కారణం మన్యే చాత్మానం రఘునందన ॥ **53**

మమాలముపకారస్తు జనైః సర్వత్ర కీర్త్యతే ।
కుంభోదరప్రసాదేన నః సీతారామదర్శనమ్ ॥ **54**

**జాతం విషయలుబ్ధానామితి మే కృతకృత్యతా ।**
**జాతా సమంతతః కీర్తిస్త్వయి దోషానుకీర్తనాత్ ॥ 55**

**తవాపి కీర్తిః సర్వత్ర జాతాఽత్ర రఘునందన ।**
**రామేశ్వరాశ్చ సర్వత్ర రామతీర్థాన్యనేకశః ॥ 56**

**యావద్భూమ్యాం ప్రగీయేత తావత్కీర్తిస్తవాపి చ ।**
**అన్యచ్చ లోకశిక్షాఽపి జాతా మద్వాక్యకారణాత్ ॥ 57**

**కుంభోదరేణ మునినా రాఘవస్య మహాత్మనః ।**
**దోషారోపః కృతః పూర్వం కథం నో న భవిష్యతి ॥ 58**

"శ్రీరామా! శ్రీరామా! మహాబహూ! నా మీద నీవు కోపపడవలదు. ఒకవేళ నేను అపరాధిగ ఉండిన నన్ను క్షమించి కావుము. నా స్వప్రయోజనమునకై మీయందు నేను దోషమును ఆరోపించలేదు. నేను పరోపకారమునకు, నీకు కీర్తి కలుగుటకును చేసితిని. లోక శిక్షార్థమని నీవు తెలుసుకున్నావు. అట్లే ఈ మునీంద్రులందరును మీ అన్నసత్రమునందు అనేకసార్లు భోజనముచేయుదురు. నేనును అట్లే భుజించెదను. అయినా అందువలన మీకేమీ కీర్తి కలిగినట్లు? నాకేమిఫలము? ఇట్లని మదిని నిశ్చయించి, లోకహితమును కోరి, నేను దోషానుకీర్తనముచేయదలచితిని, అట్లుకాకపోయినా నీ యాత్రాయజ్ఞములు నీకెట్లుకలుగును? నీయొక్క తీర్థయాత్రవలన సకలదేశములలోను, తీర్థములలోను, క్షేత్రములలోను, ఆశ్రమాలలోను, వనాలలోను, నదీతీరాలలోను, పర్వతాలలోను, గ్రామాలలోను గల జనులందరికిని నీ దర్శనము లభించినది. అందువల్ల అందరును సుఖించిరి మరియు, రామచంద్రా! ఇందుకు కారణము నేనని తెలుసుకుంటిని. నా ఉపకారమును జనులు అంతట, "కుంభోదరుని అనుగ్రహమువలన ఇంద్రియ భోగాసక్తులగు మాకు సీతారాముల దర్శనము లభించినది," అని సంతోషిస్తున్నారు కనుక నేను ధన్యుడనైతిని. నీయందు దోషమును ఆరోపించుటచేత ఇంతటి కీర్తి కలిగినది. రఘుపతీ! నీకును కీర్తిలభించినది. అంతట రామేశ్వర ప్రతిష్ఠలును, రామతీర్థములును కలిగినవి. అవి భూమిలో ఉండునంతవరకు నీ కీర్తియుండును. మరియు నా వలన లోకమునకు ఒక పాఠము చెప్పినట్లైనది. అది ఎట్లనిన– "మహాత్ముడగు రాముని దోషమునే కుంభోదరుడు చెప్పి దూషించెనే, ఇక దోషములుచేసిన వాటివలన మాకు నిందలు రాకమానునా?

స్వదోషపరిహారార్థం రాఘవేణ మహాత్మనా ।
తీర్థయాత్రా కృతా పూర్వమస్మాకం కా కథా పునః ॥ 59

ఇతి స్మృత్వా భయం చిత్తే సర్వత్ర జగతీతలే ।
కరిష్యంతి జనా యాత్రాం స్వదోషపక్షాలనాయ హి ॥ 60

త్వయి బ్రహ్మణి పూర్ణే చ దోషారోపః కథం భవేత్ ।
పద్మపత్రే జలస్పర్శో న ఘటేత యథా తథా ॥ 61

యస్య భ్రూభంగమాత్రేణ బ్రహ్మాండప్రళయో భవేత్ ।
బ్రహ్మాండాంతర్గతాన్ జీవాన్ హరసి త్వం యదా ముహుః ॥ 62

తదా దోషానురోపస్తే కిం ఘటేత జనార్దన ।
సర్వేషాం చ క్షయం మృత్యుర్విదధాతి తవాజ్ఞయా ॥ 63

తత్ర సంఖ్యాత్ర కా కార్యా త్వయా దోషః కృతస్త్వితి ।
యథా చిత్రాణి కుడ్యే హి లిఖితాని సహస్రశః ॥ 64

సంమార్జితాని తేనైవ తత్ర దోషో భవేత్కథమ్ ।
తథా త్వమపి శ్రీరామ త్రిధా భూత్వా త్రిభిర్గుణైః ॥ 65

సృష్టిం కరోషి రజసా సత్త్వరూపేణ పాలనమ్ ।
తమోరూపేణ సంహారం విధివిష్ణుశివాత్మకః ॥ 66

అస్మాభిస్తవ తోషార్థం తీర్థయాత్రా విధీయతే ।
తవ తీర్థస్తు కిం రామ తీర్థీభూతగుణస్య చ ॥ 67

సర్వతీర్థేషు ముఖ్యా యా కీర్త్యతే స్వర్ధునీ భువి ।
తవ దక్షిణపాదస్యాంగుష్ఠాగ్రాజ్జనితా తు సా ॥ 68

తవాంఘ్రిరజసః స్పర్శాత్పవిత్రా కీర్తితా భువి ।
తవ పాదరజోమిశ్రా దృశ్యతేద్యాపి సా సితా ॥ 69

రజాంస్యద్యాపి దృశ్యంతే తవ భాగీరథీజలే ।
ఇతి నానావిధైర్వాక్యైస్తోషయామాస రాఘవమ్ ॥ 70

**అష్టోత్తరశతం యావత్ శ్రీమద్రామస్తవేన చ ।**
**స్తుత్వా రామం రాఘవేణ పూజితః స్థితవాన్మునిః ॥ 71**

**రామోఽపి గురుసాన్నిధ్యే తస్థౌ సీతాసమన్వితః ।**
**నిజాసనేషు సర్వత్ర తస్థుస్తే సకలా జనాః ॥ 72**

**ఇతి శ్రీశతకోటిరామచరితాంతర్గతే, శ్రీమదానందరామాయణే, వాల్మీకీయే, ఆదికావ్యే, యాగకాండే, కుంభోదరదర్శనం నామ చతుర్థః సర్గః ॥**

అంతటి శ్రీరాముడే తీర్థయాత్ర చేసెను. ఇంక మావంటి వారెంత?" ఇట్లని చెప్పుకొనుచు మనమున లోకులు వెఱచుచుందురు. తమ దోషములను పోగొట్టుకొనుటకు తీర్థయాత్రలను చేయుదురు. శ్రీరామా! నీవు పూర్ణుడవై పరబ్రహ్మముగా ఉందువు. తామరాకుమీద నీరు అంటనట్లు నిన్ను నాదూషణలు అంటవు. నీవు కనుబొమ్మనాడించినంతమాత్రమున ప్రపంచ ప్రళయమగును. నీవు మాటిమాటికి జగదంతర్గత ప్రాణులను సంహరించు జనార్దనుడవు. అట్టి నీకు నా దోష మెట్లు కలుగును? నీ ఆజ్ఞచే మృత్యువు అందరిని హరించుచున్నది. నీచే దోషము చేయబడెనను మాట ఒక లెఖ్ఖలోనిదా. గోడమీద వివిధ చిత్రములను వ్రాసి, వాటిని వ్రాసినవాడే తుడిచివేసినపుడు గోడకేమి కొరత? శ్రీరామా! అట్లే బ్రహ్మ, విష్ణు, శివాత్మకుడవు నీవు సత్వ, రజస్తమోగుణములచే మూడు ప్రాకారములుగా ఏర్పడి సంహారములను చేయుచుందువు. మేము మీ సంతోషము కొరకు తీర్థయాత్ర చేయుచున్నాము. పరిశుద్ధుడగు నీకు తీర్థమువలన ఏమి ప్రయోజనము? సమస్తతీర్థములలో ఉత్తమోత్తమమగు దేవగంగ నీకుడికాలి బ్రొటనవేలినుండి పుట్టినది. నీ కాలిదుమ్ము అంటినందున భూమిలో మిక్కిలి పవిత్రముగా ఉన్నది. ఆ నీపాద ధూళికలిసి ఇప్పటికిని గంగ తెల్లగా ఉన్నది. భాగీరథిలో నీ పాదధూళి ఇప్పటికీ ఇసుకగా కనబడుచున్నది," ఇట్లు వివిధమగు స్తుతివాక్యములతో, కుంభోదరుడు శ్రీరామచంద్రపరబ్రహ్మను ప్రశంసించి, అష్టోత్తర శతనామములచే పూజించి నిలిచెను. పిదప శ్రీరాముడును సీతతో వశిష్ఠ సన్నిధిలో తన పీఠమున కూర్చుండెను. జనులందరును స్తుతించిరి.

***శతకోటిప్రవిస్తరమైన రామకథలో, శ్రీమద్వాల్మీకిమహర్షిచే రచింపబడిన, ఆనందరామాయణంలోని, యాగకాండలో, కుంభోదర దర్శనమనే నాలుగవ సర్గ ముగిసినది.***



# పంచమః సర్గః-5వ సర్గ

శ్రీరామ అష్టోత్తర శతనామావళి

విష్ణుదాస ఉవాచ

గురో తే ప్రష్టుమిచ్ఛామి తత్త్వం వద సవిస్తరమ్ ।
కుంభోదరేణ మునినా యత్స్తోత్రం సముదీరితమ్ ॥ 1

అష్టోత్తరశతం నామ్నాం రాఘవస్య శుభప్రదమ్ ।
శ్రవణే తస్య మే ప్రీతిర్జాతాఽస్తి కథయస్వ తత్ ॥ 2

శ్రీరామదాస ఉవాచ

శృణు శిష్య మహాబుద్ధే సమ్యక్ పృష్టం త్వయా మమ ।
అష్టోత్తరశతం నామ్నా రాఘవస్య వదామ్యహమ్ ॥ 3

సర్వేశ్వరః సర్వమయః సర్వభూతోపకారకః ।
సర్వేషాముపకారార్థం యః సాకారో నిరాకృతిః ॥ 4

స భవత్యేవ లోకేఽస్మిన్ సంసారభయనాశనః ।
యదా యదా హి లోకానాం భయముత్పద్యతే తదా ॥ 5

అవతీర్యాకరోచ్ఛ్రీమాన్ దుష్టదైత్యవిమర్దనమ్ ।
మత్స్యకూర్మవరాహాదిరూపేణ పరమార్థదృక్ ॥ 6

తత్కాలేషు చ సర్వేషు సర్వేషాముపకారకృత్ ।
సాధూనాం సమచిత్తానాం భక్తానాం భక్తవత్సలః ॥ 7

ఉపకర్తుం నిరాకారః సదాకారేణ జాయతే ।
అజోఽయం జాయతేఽనంతే విశ్రుతో భూతభావనః ॥ 8

తదా తదాఽవతరతి భక్తానామనుకంపయా ।
క్షీరాబ్ధౌ దేవదేవేశో లక్ష్మీనారాయణో విభుః ॥ 9

అశేషైః శంఖచక్రాభ్యాం దేవైర్బ్రహ్మాదిభిః సహ ।
శేషోఽభూల్లక్ష్మణో లక్ష్మీర్జానకీ శంఖచక్రకే ॥ 10

జాతౌ భరతశత్రుఘ్నౌ దేవాః సర్వేఽపి వానరాః ।
ఆసన్ పురైవ సర్వేఽపి దేవానాం భయశాంతయే ॥ 11

తత్ర నారాయణో దేవః శ్రీరామ ఇతి విశ్రుతః ।
సర్వలోకోపకారాయ భూమౌ స్వయమవాతరత్ ॥ 12

ధ్యానమాత్రేణ దేవేశో మహాపాతకనాశకృత్ ।
కీర్తనశ్రవణాభ్యాం చ హత్యాకోటినివారణః ॥ 13

కలౌ సంకీర్తనేనైవ సర్వం పాపం వ్యపోహతి ।
రామ రామేతి రామేతి యే వదంత్యతిపాపినః ॥ 14

పాపకోటిసహస్రేభ్యస్తానుద్ధరతి నాన్యథా ।
అష్టోత్తరశతం నామ్నాం తస్య స్తోత్రం వదామ్యహమ్ ॥ 15

శిష్యుడైన విష్ణుదాసు గురువుగారైన రామదాసుతో, "గురువుగారూ! కుంభోదరుడు ఏ అష్టోత్తర నామములచే శ్రీరాముని స్తుతించెను. వాటిని వినగోరెదను. అనగా; శ్రీరామదాసు చెప్పుచున్నాడు. "సన్మతియగు శిష్యుడా! చక్కగా అడిగితివి. సర్వేశ్వరుడును, సర్వజ్ఞుడును, సర్వమయుడును, సర్వ భూతోపకారుడును, నిరాకారుడైనను సాకారుడును అగు శ్రీరామ పరబ్రహ్మమూర్తి లోక కళ్యాణార్థముగా ఎప్పుడెప్పుడు ఈ ప్రపంచమునకు భయము సంభవించునో అప్పుడప్పుడు భయమును తొలగించుటకు ఈ లోకమున అవతరించుచున్నాడు. మత్స్య, కూర్మ, వరాహాది రూపములతో పరమాత్మ యగు శ్రీరాముడు అవతరించి, దుర్మార్గులైన రాక్షసులను సంహరించి, ఆయా సమయాలలో అంతట, అందరికి, ఉపకరించువాడై భక్తులకు భక్తవత్సలుడగుటచే, సమచిత్తులగు సాధువులకు ఉపకరించుటకై నిరాకారుడైనను సాకారుడుగా ఏర్పడుచున్నాడు. తనకు జననము లేకపోయినా జన్మించుచున్నాడు. అంతములేనివాడు భూతభావనుడై సుప్రసిద్ధుడుగా ఉన్నాడు. పాలసముద్రములో దేవదేవుడై విభువగు శ్రీమన్నారాయణుడు అశేషునిగా శంఖ, చక్ర, బ్రహ్మాది దేవతలతో అప్పుడప్పుడు అవతరించుచున్నాడు. ఆదిశేషుడే లక్ష్మణుడుగా అవతరించెను. లక్ష్మియే సీత. శంఖ, చక్రములే భరత, శత్రుఘ్నులు. దేవతలందరును వానరులు. ఇట్లు ముందువలెనే భయమును తొలగించుటకు అవతరించిరి. అచట శ్రీమన్నారాయణుడే శ్రీరాముడుగా సర్వలోకోపకారమునకై భూమిపై అవతరించెను. ధ్యానించిన మాత్రమున శ్రీరాముడు మహాపాపములను పరిహరించును. కీర్తించుటచేతను, వినుటచేతను రాముడు కోటి హత్యల పాపములనైనను తొలగించుచున్నాడు. కలియుగమున నామకీర్తనమే పాపపరిహారకము. రామా! రామా! రామా! అని ముమ్మారు పలికిన మాత్రముననే పాపాత్ములను సముద్ధరించుచున్నాడు. అట్టి శ్రీరాముని అష్టోత్తర శతనామస్తోత్రమును చెప్పెదను వినుము.

## శ్రీరాముని అష్టోత్తర శతనామ స్తోత్రము

**ఓమ్ అస్య శ్రీరామచంద్రనామాష్టోత్తరశతమంత్రస్య, బ్రహ్మాఋషిః । అనుష్టుప్ ఛందః । జానకీవల్లభః శ్రీరామచంద్రో దేవతా ।**

**ఓం బీజమ్ । నమః శక్తిః । శ్రీరామచంద్రః కీలకమ్ । శ్రీరామచంద్రప్రీత్యర్థే జపే వినియోగః ।**

**ఓం నమో భగవతే రాజాధిరాజాయ పరమాత్మనే హృదయాయ నమః ।**
**ఓం నమో భగవతే విద్యాధిరాజాయ హయగ్రీవాయ శిరసే స్వాహా ।**
**ఓం నమో భగవతే జానకీవద్భవాయ నమః శిఖాయై వషట్ ।**
**ఓం నమో భగవతే రఘునందనాయామితతేజసే కవచాయ హుమ్ ।**
**ఓం నమో భగవతే క్షీరాబ్ధిమధ్యస్థాయ నారాయణాయ నేత్రత్రయాయ ఔషట్ ।**
**ఓం నమో భగవతే సత్ప్రకాశాయ రామాయ అస్త్రాయ ఫట్ ।**
**ఇతి షడంగన్యాసః । ఏవం అంగుళిన్యాసః కార్యః ।**

**అథ ధ్యానమ్**
**మందారాకృతిపుణ్యధామవిలసద్వయః స్థలం కోమలం**
**శాన్తం కాంతమహేంద్రనీలరుచిరాభాసం సహస్రాననమ్ ।**
**వందేఽహం రఘునందనం సురపతిం కోదండదీక్షాగురుం**
**రామం సర్వజగత్సుసేవితపదం సీతామనోవల్లభమ్ ॥ 16**

**సహస్రశీర్ష్ణే వై తుభ్యం సహస్రాక్షాయ తే నమః ।**
**నమః సహస్రహస్తాయ సహస్రచరణాయ చ ॥ 17**

**నమో జీమూతవర్ణాయ నమస్తే విశ్వతోముఖ ।**
**అచ్యుతాయ నమస్తుభ్యం నమస్తే శేషశాయినే ॥ 18**

యథోక్తవిధిగా సంకల్పము చెప్పి, అంగన్యాసాదులను, కరన్యాసాదులను చేసి, ధ్యానము చేసి "కల్పవృక్ష ఆకృతియును, పుణ్యమందిరమునను, విశాల వక్షఃస్థలము గలవాడును, కమలుడును, ఇంద్రనీలకాంతుడును, శాంతుడును, సహస్ర వక్త్రకుడును, ధనుర్దీక్షాచార్యుడును, సర్వజగతస్సేవిత చరణుడును, జానకీ మనోవల్లభుడును, దేవదేవుడు అగు దశరథ రాముని నేను ధ్యానించుచున్నాను," అని ధ్యానించి, క్రింది 108 నామములను కీర్తించవలెను.

నమో హిరణ్యగర్భాయ పంచభూతాత్మనే నమః ।
నమో మూలప్రకృతయే దేవానాం హితకారిణే ॥ 19

నమస్తే సర్వలోకేశ సర్వదుఃఖనిషూదన ।
శంఖచక్రగదాపద్మజటాముకుటధారిణే ॥ 20

నమో భర్గాయ తత్త్వాయ జ్యోతిషాం జ్యోతిషే నమః ।
ఓం నమో వాసుదేవాయ నమో దశరథాత్మజ ॥ 21

నమో నమస్తే రాజేంద్ర సర్వసంపత్ప్రదాయ చ ।
నమః కారుణ్యరూపాయ కైకేయీప్రియకారిణే ॥ 22

నమో దాంతాయ శాంతాయ విశ్వామిత్రప్రియాయ తే ।
యజ్ఞేశాయ నమస్తుభ్యం నమస్తే క్రతుపాలక ॥ 23

నమో నమః కేశవాయ నమో నాథాయ శార్ఙ్గిణే ।
నమస్తే రామచంద్రాయ నమో నారాయణాయ చ ॥ 24

నమస్తే రామచంద్రాయ మాధవాయ నమో నమః ।
గోవిందాయ నమస్తుభ్యం నమస్తే పరమాత్మనే ॥ 25

నమస్తే విష్ణురూపాయ రఘునాథాయ తే నమః ।
నమస్తేఽనాథనాథాయ నమస్తే మధుసూదన ॥ 26

త్రివిక్రమ నమస్తేఽస్తు సీతాయాః పతయే నమః ।
వామనాయ నమస్తుభ్యం నమస్తే రాఘవాయ చ ॥ 27

నమో నమః శ్రీధరాయ జానకీవల్లభాయ చ ।
నమస్తేఽస్తు హృషీకేశ కందరాయ నమో నమః ॥ 28

నమస్తే పద్మనాభాయ కౌసల్యాహర్షకారిణే ।
నమో రాజీవనయన నమస్తే లక్ష్మణాగ్రజ ॥ 29

నమో నమస్తే కాకుత్స్థ నమో దామోదరాయచ ।
విభీషణపరిత్రాతర్నమః సంకర్షణాయ చ ॥ 30

వాసుదేవ నమస్తేఽస్తు నమస్తే శంకరప్రియ ।
ప్రద్యుమ్నాయ నమస్తుభ్యమనిరుద్ధాయ తే నమః ॥ 31

సదసద్భక్తిరూపాయ నమస్తే పురుషోత్తమ ।
అధోక్షజ నమస్తేఽస్తు సప్తతాలహరాయ చ ॥ 32

ఖరదూషణసంహర్త్రే శ్రీనృసింహాయ తే నమః ।
అచ్యుతాయ నమస్తుభ్యం నమస్తే సేతుబంధక ॥ 33

జనార్దన నమస్తేఽస్తు నమో హనుమదాశ్రయ ।
ఉపేంద్రచంద్రవంద్యాయ మారీచమథనాయ చ ॥ 34

నమో వాలిప్రహరణ నమః సుగ్రీవరాజ్యద ।
జామదగ్న్యమహాదర్పహరాయ హరయే నమః ॥ 35

నమో నమస్తే కృష్ణాయ నమస్తే భరతాగ్రజ ।
నమస్తే పితృభక్తాయ నమః శత్రుఘ్నపూర్వజ ॥ 36

అయోధ్యాధిపతే తుభ్యం నమః శత్రుఘ్నసేవిత ।
నమో నిత్యాయ సత్యాయ బుద్ధ్యాదిజ్ఞానరూపిణే ॥ 37

అద్వైతబ్రహ్మరూపాయ జ్ఞానగమ్యాయ తే నమః ।
నమః పూర్ణాయ రమ్యాయ మాధవాయ చిదాత్మనే ॥ 38

అయోధ్యేశాయ శ్రేష్ఠాయ చిన్మాత్రాయ పరాత్మనే ।
నమోఽహల్యోద్ధారణాయ నమస్తే చాపభంగినే ॥ 39

సీతారామాయ సేవ్యాయ స్తుత్యాయ పరమేష్ఠినే ।
నమస్తే బాణహస్తాయ నమః కోదండధారిణే ॥ 40

నమః కబంధహంత్రే చ వాలీహంత్రే నమోఽస్తు తే ।
నమస్తేఽస్తు దశగ్రీవప్రాణసంహారకారిణే ॥ 41

## శ్రీరామచంద్ర అష్టోత్తర శతనామావళిః ॥

1. సహస్రశీర్ష్ణే నమః, 2. సహస్రాక్షాయ నమః, 3. సహస్రహస్తాయ నమః,
4. సహస్రచరణాయ నమః, 5. జీమూతవర్ణాయ నమః, 6. విశ్వతోముఖాయ నమః,
7. అచ్యుతాయ నమః, 8. శేషశాయినే నమః, 9. హిరణ్యగర్భాయ నమః,
10. పంచభూతాత్మనే నమః, 11. మూలప్రకృతయే నమః, 12. దేవానాంహితకారిణే నమః,
13. సర్వలోకేశాయ నమః, 14. సర్వదుఃఖ నిషూదనాయ నమః,
15. శంఖచక్ర గదాపద్మ జటాముకుటధారిణే నమః, 16. భర్గాయ నమః,
17. తత్త్వాయ నమః, 18 జ్యోతిషాంజ్యోతిషే నమః, 19. వాసుదేవాయ నమః,
20 దశరథాత్మజాయ నమః, 21. రాజేంద్రాయ నమః, 22. సర్వసంపత్ప్రదాయ నమః,
23. కారుణ్యరూపాయ నమః, 24. కైకేయీప్రియకారిణే నమః, 25. దాంతాయ నమః,
26. శాంతాయ నమః, 27. విశ్వామిత్రప్రియాయనమః, 28. యజ్ఞేశాయ నమః,
29. క్రతుపాలకాయ నమః, 30. కేశవాయ నమః, 31. నాథాయ నమః,
32. శార్ఙ్గిణే నమః, 33. రామచంద్రాయ నమః, 34. నారాయణాయ నమః,
35. రామచంద్రాయ నమః 36. మాధవాయ నమః , 37. గోవిందాయ నమః,
38. పరమాత్మనే నమః, 39. విష్ణుస్వరూపాయ నమః 40. రఘునాథాయ నమః,
41. నాథనాథాయ నమః, 42. మధుసూధనాయ నమః 43. త్రివిక్రమాయ నమః,
44. సీతాయాఃపతయే నమః, 45. వామనాయ నమః, 46. రాఘవాయ నమః,
47. శ్రీధరాయ నమః, 48. జానకీవల్లభాయ నమః, 49. హృషీకేశాయ నమః,
50. కంధరాయ నమః, 51. పద్మనాభాయ నమః, 52. కౌసల్యాహర్షకారిణే నమః
53. రాజీవనయనాయ నమః, 54. లక్ష్మణాగ్రజాయ నమః 55. కాకుస్థాయ నమః,
56. దామోదరాయ నమః, 57. విభీషణపరిత్రాత్రే నమః 58. సంకర్షణాయ నమః,
59. వాసుదేవాయ నమః , 60. శంకరప్రియాయ నమః, 61. ప్రద్యుమ్నాయ నమః,
62. అనిరుద్ధాయ నమః, 63. సదసద్భక్తి రూపాయనమః, 64. పురుషోత్తమాయ నమః,
65. అధోక్షజాయ నమః, 66. సప్తతాళహరాయ నమః, 67. ఖరదూషణసంహర్త్రేనమః,
68. శ్రీనృసింహాయ నమః 69. అచ్యుతాయ నమః, 70. సేతు బంధకాయ నమః
71. జనార్దనాయ నమః, 72. హనుమదాశ్రయాయ నమః,
73. ఉపేంద్రచంద్రవంద్యాయ నమః 74. మారీచమథ నాయనమః,
75. వాలిప్రహరణాయ నమః, 76. సుగ్రీవరాజ్యదాయ నమః,

77. జామదగ్న్యమహాదర్పహరాయ నమః, 78. హరయే నమః,
79. కృష్ణాయ నమః, 80. భరతాగ్రజాయ నమః, 81. పితృభక్తాయ నమః
82. శత్రుఘ్నపూర్వజాయ నమః, 83. అయోధ్యాధిపతయే నమః, 84.శత్రుఘ్నసేవితాయ నమః,
85. నిత్యాయ నమః, 86. సత్యాయ నమః, 87.బుద్ధ్యాదిజ్ఞానరూపిణే నమః,
88. అద్వైతబ్రహ్మరూపాయ నమః 89. జ్ఞానగమ్యాయ నమః,
90. పూర్ణాయ నమః 91. రమ్యాయ నమః 92. మాధవాయ నమః,
93. చిదాత్మనే నమః , 94. అయోధ్యేశాయ నమః 95. శ్రేష్ఠాయ నమః,
96. చిన్మాత్రాయ నమః, 97. పరమాత్మనే నమః, 98. అహల్యోద్ధారణాయ నమః,
99. చాపభంగినే నమః, 100. సీతారామాయ నమః, 101. సేవ్యాయ నమః,
102. స్తుత్యాయ నమః, 103. పరమేష్ఠినే నమః, 104. బాణహస్తాయ నమః,
105. కోదండధారిణే నమః, 106. కబంధహంత్రే నమః, 107. వాలిహంత్రే నమః,
108. దశగ్రీవప్రాణసంహారకారిణే నమః,

అనంతశిరస్కుడా! అనంత నయనుడా! అనంత కరుణాకరా! అనేక పాదములు గలవాడా! మేఘశ్యాముడ! సర్వాంతర్యామీ! షడ్భావ వికారశూన్యుడా! భుజంగ శయనుడా! బ్రహ్మాత్మకుడా! పృథివి, వాయు, తేజో, ఆకాశ స్వరూపుడా! నమస్కారము(10)

అనాది మాయా స్వరూపుడా! దేవతలకు హితముచేయువాడా! సమస్తభువనములకును నియామకుడా! అందరి దుఃఖములను తొలగించువాడా! శంఖ, చక్ర, గదా, పద్మ ఆయుధములను, జడలను, కిరీటములను ధరించినవాడా! తేజస్స్వరూపుడా! పరమార్థ సదాత్మకుడా! సూర్యరూపుడా! సర్వభూతాదివాసుడా! దశరథనందనా! నమస్కారము (20)

రాజాధిరాజా! సమస్త సంపదలను ఇచ్చువాడా! దయాళుడా! కైకేయికి మేలుచేసినవాడా! తపఃక్లేశ సహనుడా! విషయసుఖాసంగుడా! విశ్వామిత్ర ప్రియుడా! యజ్ఞ నియామకుడా! యజ్ఞపాలకుడా! స్వవశమునందు (క= బ్రహ్మ, అ= విష్ణు, ఈశ= రుద్రులు. గనుక కేశః= త్రిమూర్తులు అనబడుదురు) త్రిమూర్తులును గలవాడా! నమస్కారము (30)

ఆశ్రయుడా! శార్‌ఙ్గధనుస్సుగలవాడా! చంద్రునివలే లోకమున రమించువాడా! నరునినుండి కలిగినవి నారములు అనగా ఆకాశాది భూతములకు మార్గముగా ఉండువాడా! ఆహ్లాదకమగు రామనాముడా! లక్ష్మీపతి! వేదవాక్కులచే తెలియబడువాడా! కార్యాకార్య విలక్షణుడగు నిత్య, శుద్ధ, బుద్ధ, ముక్త స్వభావుడా! వ్యాపక స్వరూపుడా! రఘువంశమునేలినవాడా! నమస్కారము(40)

రారాజా! మధుఅనే రాక్షసుని సంహరించినవాడా! త్రివిక్రమావతారము దాల్చినవాడా! జానకీరమణా! వామనావతారుడా! దశరథరామావతారుడా! లక్ష్మీధరుడా! సీతాప్రియుడా! క్షేత్రజ్ఞాన రూపుడా! కామరూపుడా! నమస్కారము (50)

కమలనాభుడా! కౌసల్యానందకారుడా! కమలాక్షుడా! లక్ష్మణుని అన్నా! కకుత్సుని వంశమున జన్మించినవాడా! లోకములన్నీ ఉదరమున గలవాడా! విభీషణుని సంరక్షించినవాడా! సంహార సమయమున ప్రజలను ఆకర్షించువాడా! సర్వభూతాధివాసుడా! శివమిత్రుడా! నమస్కారము(60)

ప్రభలుడా! తడిలేనివాడా! (వ్యూహ చతుష్టయమున మూడవమూర్తి, నాలుగవమూర్తి), సత్ అసత్తుల విభాగాత్మకుడా! పరమాత్మా! అధఃపతన రహితుడా! సప్తతాళములను కత్తిరించినవాడా! కరదూషణులను సంహరించినవాడా! నృసింహ అవతారము దాల్చినవాడా! నాశనములేనివాడా! సముద్రముపై సేతువును నిర్మించినవాడా! నమస్కారము(70)

సంహారమూర్తి! ఆంజనేయుడా! ఇంద్రునిచేత, చంద్రునిచేత నమస్కరింపబడినవాడా! మారీచుని సంహరించినవాడా! వాలీ విధ్వంసకుడా! సుగ్రీవునికి రాజ్యమిచ్చినవాడా! పరశురాముని గర్వమును తొలగించినవాడా! దురిత పరిహారకుడా! సచ్చిదానంద ఆత్మకుడా! భరతుని అన్నా! నమస్కారము(80)

తండ్రియందు భక్తిగలవాడా! శత్రుఘ్నునికి అన్నా! అయోధ్యా రాజధానికి ప్రభువా! శత్రుఘ్నునిచే సేవింపబడినవాడా! మూడు కాలాలకు అతీతుడా! అమితరూపుడా! అంతరంగ జ్ఞానాత్మకుడా! సాతిరిక్త సత్తాశూన్యుడా! విజ్ఞానముచే పొందదగినవాడా! అంతటా నిండినవాడా! (90)

మనోహరుడా! లక్ష్మీదేవి భర్తా! జ్ఞానాత్మకుడా! పురుషుడా! ఉత్తముడా! ప్రజ్ఞానమూర్తీ! పరబ్రహ్మమా! అహల్యను ఉద్ధరించినవాడా! శివధనస్సును విరచినవాడా! సీతారమణా! నమస్కారము(100)

అందరిచేతా సేవింపబడినవాడా! అందరిచేతా కీర్తింపబడినవాడా! పరమమగు తన మహిమనందే ఉండువాడా! శంకరుడా! కోదండపాణి, కబంధహరణా! వాలినాశకా! రావణమారకా! నమస్కారము (108)

**అష్టోత్తరశతం నామ్నాం రామచంద్రస్య పావనమ్ ।**
**ఏతత్ ప్రోక్తం మయా శ్రేష్ఠం సర్వపాతకనాశనమ్ ॥ 42**

ప్రచరిష్యతి తల్లోకే ప్రాణ్యదృష్టవశాద్ద్విజ ।
తస్య కీర్తనమాత్రేణ జనా యాస్యతి సద్గతిమ్ ॥ 43

తావద్విజృంభతేపాపం బ్రహ్మహత్యాపురస్సరమ్ ।
యావన్నామాష్టకశతం పురుషో న హి కీర్తయేత్ ॥ 44

తావత్కాలేర్మహోత్సాహో నిశ్శంకం సంప్రవర్తతే ।
యావచ్ఛ్రీరామచంద్రస్య శతనామ్నాం న కీర్తనమ్ ॥ 45

తావద్యమభటాః క్రూరాః సంచరిష్యంతి నిర్భయాః ।
యావచ్ఛ్రీరామచంద్రస్య శతనామ్నాం న కీర్తనమ్ ॥ 46

తావత్స్వరూపం రామస్య దుర్బోధం ప్రాణినాం స్ఫుటమ్ ।
యావన్న నిష్ఠయా రామ నామమాహాత్మ్యముత్తమమ్ ॥ 47

కీర్తితం పఠితం చిత్తే ధృతం సంస్మారితం ముదా ।
అన్యతః శృణుయాన్మర్త్యః సోఽపి ముచ్యేత పాతకాత్ ॥ 48

బ్రహ్మహత్యాదిపాపానాం నిష్కృతిం యది వాంఛతి ।
రామస్తోత్రం మాసమేకం పఠిత్వా ముచ్యతే నరః ॥ 49

దుష్ప్రతిగ్రహదుర్భోజ్యదురాలాపాదిసంభవమ్ ।
పాపం సకృత్కీర్తినేన రామస్తోత్రం వినాశయేత్ ॥ 50

శ్రుతిస్మృతిపురాణేతిహాసాగమశతాని చ ।
అర్హంతి నాల్పాం శ్రీరామనామకీర్తికలామపి ॥ 51

అష్టోత్తరశతం నామ్నాం సీతారామస్య పావనమ్ ।
అస్య సంకీర్తనాదేవ సర్వాన్ కామాన్లభేన్నరః ॥ 52

పుత్రార్థీ లభతే పుత్రాన్ ధనార్థీ ధనమాప్నుయాత్ ।
స్త్రియం ప్రాప్నోతి పత్న్యర్థీ స్తోత్రపాఠశ్రవాదినా ॥ 53

**కుంభోదరేణ మునినా యేన స్తోత్రేణ రాఘవః ।**

**స్తుతః పూర్వం యజ్ఞవాటే తదేతత్త్వాం మయోదితమ్ ॥ 54**

**ఇతి శ్రీశతకోటిరామచరితాంతర్గతే, శ్రీమదానందరామాయణే, వాల్మీకీయే, ఆదికావ్యే, యాగకాండే, శ్రీరామనామాష్టోత్తరశతస్తోత్రం నామ పంచమః సర్గః ॥**

శ్రీరామా! నీకు నూటయెనిమిది నమస్కారములు. నన్ను ఉద్ధరించి కావవే శ్రీరామచంద్రప్రభూ!" అని ఇట్లు చెప్పబడిన పాపములను తొలగించే నూట ఎనిమిది నామములు గల శ్రీమత్ రామ అష్టోత్తర శతనామ స్తోత్రము ప్రాణుల అదృష్టానుసారముగ ఈ లోకమున వర్తించుచున్నది. దీనిని కీర్తించుటచేత జనులు సద్గతిని పొందుదురు. ఈ అష్టోత్తర శతనామ స్తోత్రమును కీర్తించనంతవరకే బ్రహ్మహత్యాది పాపములు ఉండును. యమభటుల సంచారము అంతవరకే. అంతవరకు శ్రీరామస్వరూపము తెలియదు. అనగా శ్రీరామనామకీర్తనముచే పాపభయములేదు. యమదూతభీతి లేదు. రామతత్త్వము తెలియును. అశ్రద్ధతో అయినను శ్రీరామనామమును పఠించినచో, విన్నచో స్మరించినచో పాపములు తొలగును. బ్రహ్మహత్యాది మహాపాపములకు పరిహారమును కోరువారు దీనిని ఒకనెలపాటు పఠించవలయును. ఈ రామస్తోత్రమును ఒకసారి చదివినంతచేతనే గ్రహములన్నీ శాంతించును. దుష్టభోజనపు పాపములు తొలగును. మాటలద్వారా వచ్చిన పాపములు తొలగును. సకలవేద, శాస్త్ర, పురాణాది సాహిత్యములు శ్రీరామ కీర్తనకు సాటిరావు. ఈ అష్టోత్తర నామ కీర్తనచే పుత్రేచ్ఛ గలవారు పుత్రులను, ధనేచ్ఛగలవారు ధనమును, కామేచ్ఛ గలవారు కామమును, అందరును వారివారి కోర్కెలు తీరి ఆనందించెదరు. విష్ణుదాసా! నీకిట్లు కుంభోదరుడు చెప్పిన స్తోత్రము చెప్పితిని.

***శతకోటిప్రవిస్తరమైన రామకథలో, శ్రీమద్వాల్మీకిమహర్షిచే రచింపబడిన, ఆనందరామాయణములోని, యాగకాండలో, శ్రీరామఅష్టోత్తర శతనామావళిని చెప్పే ఐదవసర్గ ముగిసినది.***



# షష్ఠః సర్గః–6వ సర్గ

## అశ్వమేధయాగములో శ్రీరాములవారి దినచర్య

శ్రీరామదాస ఉవాచ
అథ కుంభోదరే దివ్యే ఆసనోపరి సంస్థితే ।
యజ్ఞస్తంభే శ్యామకర్ణం బబంధుస్తే హి ఋత్విజః ॥ 1

తస్యాంగాని సమస్తాని పృథగ్ మంత్రైర్యథావిధి ।
సమ్మంత్ర్యాపి శమిత్రా తం నిహన్యుర్ద్విజపుంగవాః ॥ 2

తన్మాంసఖండైరాజ్యాక్తైర్హోమం చక్రుః సవిస్తరమ్ ।
తథా నానావిధైర్ద్రవ్యైః సక్తుపాయసగోఘృతైః ॥ 3

మధ్వాక్తతిలదూర్వాద్యైః సమిధాభిశ్చ సాదరమ్ ।
గోఘృతేన వసోర్ధారాం వహ్నౌ స్థూలామఖండితామ్ ॥ 4

గోముఖేనోర్ధ్వబద్ధేన దదుర్మంత్రైః సవిస్తరమ్ ।
చిరకాలం హోమకుండే యావద్యజ్ఞసమాపనమ్ ॥ 5

తదా ధూమచయైర్వ్యాప్తమాకాశం చ సమంతతః ।
నాద్యాపి దృశ్యతే శుభ్రం నీలవర్ణం ప్రదృశ్యతే ॥ 6

చైత్రమాసే మహాపుణ్యే వసంతర్తౌ సుఖావహే ।
ఏవం ప్రవర్తయామాసుర్వాజిమేధం మునీశ్వరాః ॥ 7

ఈజుస్తే యజ్ఞవిధినా హ్యగ్నిహోత్రాదిలక్షణైః ।
ప్రాకృతైర్వైకృతైర్యజ్ఞైర్ద్రవ్యజ్ఞానక్రియేశ్వరమ్ ॥ 8

### అశ్వమేధయాగముచే పరమేశ్వరుని ఆరాధించుట.

శ్రీరామదాసు ఇట్లు చెప్పుచున్నాడు, "తరువాత కుంభోదరుడు రమ్యపీఠమున సుఖాసీనుడు కాగా, ఋత్విక్కులు నీలిచెవి గల యజ్ఞాశ్వమును యూపస్తంభమునకు బంధించిరి. శమిత్రచే యథావిధిగా దాని అంగములను వేరువేరుగా అభిమంత్రించి ఛేదించిరి. ఆ మాంసఖండములను

ఆజ్యమున ముంచి, సవిస్తరముగా హోమముచేసిరి. అట్లే పిండిపాయసము, ఆవునేతిలో, తేనెలో తడిపిన తిలలు, గరిక మొదలైన వాటిచేతను, సమిధల చేతను సాదరముగా అగ్నిని ఆరాధించిరి. పైన కట్టిన గోముఖముచే యజ్ఞము పూర్తివరకు చిరకాలము అఖండితమగు గోఘృత వసోర్ధారను సమంత్రముగా, సవిస్తరముగా ఇచ్చిరి. అప్పుడంతటా గగనమున హోమధూమమువ్యాపించి, ఇప్పటికిని ఆకాశము నీలవర్ణముగా కనపడుచున్నది. ఇట్లు సుఖకరమగు వసంత, చైత్రమాస శుక్లపక్షమున అశ్వమేధ యజ్ఞము ఆరంభింపబడినది. యజ్ఞవిధిని అనుసరించి, అగ్నిహోత్రాది లక్షణములుగల ప్రకృతి, వికృతి యజ్ఞములచే దివ్యజ్ఞాన క్రియేశ్వరుడగు పరమేశ్వరుని ఆరాధించిరి. (8)

**ప్రత్యహం ప్రాతరుత్థాయ రామచంద్రః ససీతయా ।**
**నత్వా శంభుం విధిం దేవాన్ మునీంశ్చాపి పృథక్ పృథక్ ॥ 9**

**కౌసల్యాద్యాశ్చ మాతౄశ్చ కామధేను హృదిస్థితమ్ ।**
**చింతామణిం కౌస్తుభం చ కంఠే బద్ధ రవిప్రభమ్ ॥ 10**

**పుష్పకం యజ్ఞవాటస్య దేవతాం యజ్ఞపూరుషమ్ ।**
**తతో గత్వా రామతీర్థే స్నాత్వా రామో యథావిధి ॥ 11**

**కృత్వా నిత్యవిధిం సర్వం పూజయామాస శంకరమ్ ।**
**ఉపహారాత్ సమర్ప్యాథ కామధేను సముద్భవాన్ ॥ 12**

**సమానీతాన్ రత్నపాత్రైః సీతయా రఘునందనః ।**
**తతః సంపూజ్య తాం ధేనుం విధిం పూజ్య సవిస్తరమ్ ॥ 13**

**ఋత్విగ్జనం తు సంపూజ్య తస్థౌ స గురుసన్నిధౌ ।**
**ప్రభాతే ఋత్విజః సర్వే తథాదేవా మునీశ్వరాః ॥ 14**

**స్నాత్వా నిత్యవిధిం కృత్వా తస్థుర్యజ్ఞస్య మంటపే ।**
**రామాజ్ఞయాఽథ సౌమిత్రిన్నృపాదీనాం ప్రపూజనమ్ ॥ 15**

**దివ్యైర్నానోపహారాద్యైః కామధేనుసముద్భవైః ।**
**తతశ్చకార సౌమిత్రిర్నృపాదీనాం ప్రపూజనమ్ ॥ 16**

తథా సీతాజ్ఞయా స్త్రీణామూర్మిలా లక్ష్మణప్రియా ॥ 17

మాండవీ శ్రుతకీర్తిశ్చ సర్వాశ్చక్రుః ప్రపూజనమ్ ।
అథ తే ఋత్విజశ్చక్రుః స్వాహాకారైర్యథావిధి ॥ 18

హోమం నానావిధైర్దివ్యైః సుగంధైర్యజ్ఞమంటపే ।
పురోడాశాన్ వరాన్ దివ్యానశ్నన్ రామోఽపి సీతయా ॥ 19

వాజిమేధే రాఘవస్య సాక్షాద్దేవాః స్వయం ముదా ।
హవీంషి భక్షయామాసుస్త్యక్తమాత్రాణి పావకే ॥ 20

అస్తుశ్రౌషడితి ప్రోచుర్వాద్యఘోషః స మేఘవత్ ।
శ్రూయతే యజ్ఞశాలాసు సర్వత్రర్త్విజకీర్తితః ॥ 21

## శ్రీరాముని యజ్ఞదినచర్య

శ్రీరామచంద్రుడు నిత్యము ప్రొద్దునలేచి, సీతతోడ శివ బ్రహాది దేవతలకు నమస్కరించి, మునులకు నమస్కరించి, వేరువేరుగా కౌసల్యాది తల్లులకు ప్రణమిల్లి, కామధేనువునకు కంఠమునందుండు కౌస్తుభ చింతామణులకు మ్రొక్కి, పుష్పకమునకు, యజ్ఞవాటికకు, యజ్ఞపురుషునికి నమస్కరించి, పిదప రామతీర్థమునకు పోయి యథావిధిగా స్నానముచేసి, నిత్యాహ్నిక కృత్యములు నిర్వర్తించి, సీత తెచ్చిన రత్నపాత్రములలో కామధేనువు కల్పితములగు ఉపహారములతో శ్రీసాంబసదాశివుని ఆరాధించి, కామధేనువును పూజించి, ఋత్విక్ జనులకు సత్కరించి, గురు సన్నిధానమున సుఖాసీనుడు అగును. తెల్లవారగా అందరు ఋత్విక్కులున్నట్లే దేవతలు, మునీంద్రులు స్నానముచేసి, కాలకృత్యమును ఆచరించి, యజ్ఞమంటపమున వారివారి స్థానములలో ఆసీనులగుచుండిరి. శ్రీరామాజ్ఞచే లక్ష్మణుడు కామధేను ఉద్భవములగు వివిధ సత్కారములచే వారినందరిని ఆరాధించుచుండును. పిదప లక్ష్మణుడు వస్త్రాభరణ వివిధ పక్వాన్నములచే నృపాదులను సత్కరించును. అట్లే సీతయొక్క ఆజ్ఞప్రకారము ఊర్మిళ, మాండవి, శ్రుతకీర్తులందరును పూజించుచుందురు. అంత ఆ ఋత్విక్కులు దివ్యపరిమళ యజ్ఞ ద్రవ్యములతో యథావిధిగా స్వాహాకారములతోడ హోమమాచరించెదరు. తరువాత సీతారాముల తోడ ఉత్తమ యజ్ఞప్రసాదములను భుజించెదరు. శ్రీరాముని అశ్వమేధమునకు దేవతలు ప్రత్యక్షముగా వచ్చి, హవిర్భాగములను అగ్నిలో అర్పించిన వెంటనే స్వీకరించుచుండిరి. యజ్ఞశాలలో మేఘమువలే వాద్యములు మ్రోగుచుండగా అంతట ఋత్విక్కులు వేదశాస్త్రములను చర్చించుచుండిరి. మంగళమగు యజ్ఞకుండము ఋత్విక్కులచే చుట్టబడియుండెను.

మధ్యే కుండ మహారమ్యం వ్యాప్తమృత్విగ్జనై శుభమ్ ।
తతో మునీశ్వరాః సర్వే తతో దేవాః సమన్తతః ॥ 22

తతః సర్వాః స్త్రియః శ్రేష్ఠాస్తతో విద్యాధరాః స్థితాః ।
తతో యక్షాశ్చ గంధర్వాః కిన్నరాః ప్లవగోత్తమాః ॥ 23

తతస్తే క్షత్రియాః సర్వే తతస్తేషాం తు సేవకాః ।
తతః స్థితా వారనార్యస్తతో మాగధవందినః ॥ 24

దదృశుః సంస్థితా యజ్ఞమంటపే యజ్ఞకౌతుకమ్ ।
మధ్యాహ్నవిధి హుత్వా తే ఋత్విజశ్చ సవిస్తరమ్ ॥ 25

తతో మాధ్యాహ్నికం కర్తుం యయుస్తాం సరయూం నదీమ్ ।
కృత్వా మాధ్యాహ్నికం కర్మ గత్వా తు యజ్ఞమంటపే ॥ 26

హైమాసనే తు సర్వత్ర నేమిరేఖోపమే స్థితాః ।
దేవాశ్చాపీశ్వరాద్యాస్తే తస్థుర్దివ్యాసనోపరి ॥ 27

లక్ష్మణస్తాన్ ప్రపూజ్యాథ భరతేన స శత్రుహా ।
సంస్థాప్య హేమపాత్రాణి సర్వేషాం పురతస్తదా ॥ 28

జానకీం త్వరయామాస పరివేషణకర్మణి ।
అథ సీతోర్మిలా రమ్యా తథా సా మాండవీ శుభా ॥ 29

శ్రుతకీర్తిర్మంత్రిపత్న్యః సుహృత్పత్న్యః సహస్రశః ।
పరివేషణకర్మాణి చక్రుస్తా యజ్ఞమంటపే ॥ 30

నానావిధవరాన్నైశ్చ కామధేనుసముద్భవైః ।
మునీశ్వరాదికాః సర్వే తోషమాపుస్తదాఽధ్వరే ॥ 31

సీతాదీనాం హి నారీణాం తదా యజ్ఞస్య మంటపే ।
నూపురాణాం కింకిణీనాం శుశ్రువే సర్వతో ధ్వనిః ॥ 32

**యథేచ్ఛ భుంజతాం సర్వే యాచ్యతాం యద్ధృది స్థితమ్ ।**
**మా శంకా భోజనే కార్యా త్యక్తవ్య యన్న రోచతే ॥ 33**

**అయాచితాని దేయాని పక్వాన్నాని యథారుచి ।**
**అఖండితాజ్యధారాఽత్ర కార్యా రాఘవశాసనాత్ ॥ 34**

**గృహ్యతాం కించిదూచుస్తే నేతి నేతి ద్విజాః పునః ।**
**ఇతి భోజనకాలే వై శుశ్రువే సర్వతో ధ్వనిః ॥ 35**

యాగశాల మధ్యభాగమున మనోహరముగా ఉండటంతో అందురు ఆసీనులైరి. మునీంద్రులును, దేవతలును, ఉత్తమ సువాసినులును, విద్యాధర, యక్ష, గంధర్వ, కిన్నెరలును, వానరులును, వారివెనుక క్షత్రియులు వారిసేవకులు, వారాంగనలు, వందిమాగదులు ఇట్లు సభామండపమున సాలంకారులుగా కూర్చుండి, యజ్ఞవైభవమును చూచుచుండిరి. ఆ ఋత్విక్కులు మధ్యాహ్నమువరకు హోమవిధిని ఆచరించి, మధ్యాహ్నికమునకై సరయూనదికి పోవుదురు. అచట మధ్యాహ్నికను ఆచరించి, యజ్ఞమంటమునకు వచ్చి బంగారు పీతలపై సుఖాసీనులగుచుందురు. ఈశ్వరాది దేవతలును, మునీంద్రులును, దివ్యాసనములపై కూర్చుండగా, భరత శత్రుఘ్నులతోడ లక్ష్మణుడు వారినందరిని కూర్చుండబెట్టి, అందరి ముందు బంగారుపాత్రలను పెట్టి, వడ్డించుటకు సీతను త్వరపరచెదరు. పిదప సీత, ఊర్మిళ, మాండవి, శ్రుతకీర్తి, మంత్రిపత్నులు, మిత్రపత్నులు మొదలైనవారు వేలకొలదిగా కామధేను సృష్టియగు దివ్య పదార్థములను వడ్డించుచుండిరి. మునులు ఆనందించి, భుజించుచుందురు. సీతాది స్త్రీలయొక్క నూపుర కింకిణీధ్వనులు అంతట నిండియుండెను. “శ్రీరామాజ్ఞచే అందరును తృప్తిగా భుజింపవలయును. వారివారికి కావలసినదానిని అడుగవలయును. భోజనమున సంకోచింప వలదు. ఇష్టములేనిదానిని పరిహరింపవచ్చును. యథారుచిగా అపేక్షించినట్లు పక్వాన్నమును వడ్డించ వలయును. నేతిధార విడవక పడవలయును,” అని చెప్పబడెను. వడ్డించువారు “ఇంకొంచెము వడ్డించుకొను”దనియు, భుజించువారు “వలదు వలదు” అనియు చెప్పు మాటలే అంతటా వినబడు చుండెను.

**కించిదపేక్షితం స్వామిన్నితి రామేణ ప్రార్థితాః ।**
**చక్రుస్తే భోజనం సర్వే వీజితా వ్యజనాదిభిః ॥ 36**

**జలైరుష్ణోదకైశ్చక్రుః కరశుద్ధిం మునీశ్వరౌ ।**
**తతో గృహీతతాంబూలా మునయస్తే తు నిర్జరాః ॥ 37**

గృహీత్వా హేమముద్రాం హి రాఘవేణ పృథక్ పృథక్ ।
సమర్పితాం దక్షిణార్థం జగ్ముర్వ్యాసస్థలాని హి ॥ 38

తతః పూర్వోపచారాద్యైః కథితైరేవ పార్థివాః ।
చక్రుస్తే భోజనం సర్వే చక్రురైశ్యాస్తతః పరమ్ ॥ 39

స్త్రీణాం భోజనశాలాసు పూర్వం భుక్త్వాఽమరస్త్రియః ।
సహితా మునిపత్నీభిస్తతస్తాః క్షత్రియస్త్రియః ॥ 40

చక్రుర్వై భోజనం సర్వాః సీతయా ప్రార్థితా ముహుః ।
తతో వైశ్యాస్త్రియశ్చక్రుః పౌరనార్యస్తతః పరమ్ ॥ 41

తత శ్శూద్రస్త్రియశ్చాపి ముదా చక్రుశ్చ భోజనమ్ ।
శాలాసు పురుషాణాం చ తతో వానరరాక్షసాః ॥ 42

ఋక్షాః పౌరా జానపదాశ్చక్రుర్భోజనముత్తమమ్ ।
తతః శ్శూద్రాదయః సర్వ తతః పార్థివసేవకాః ॥ 43

న కశ్చిత్ క్షుధితస్తత్ర నాసీత్కస్య నిషేధనమ్ ।
తతో రామః సుహృన్మిత్రై ర్బంధుభిః సచివాదిభిః ॥ 44

చకార భోజనం స్వస్థః సీతయా ప్రార్థితో ముహుః ।
యావంతో భూమికణికా యావన్తస్తోయబిందవః ॥ 45

యాం వంత్యుడూని గగనే తావంతో రాఘువాధ్వరే ।
ప్రత్యహం భోజనం చక్రుర్విప్రాద్యాత్ స్త్రియోఽపి చ ॥ 46

శ్వశ్రూభిర్మంత్రిపత్నీభిస్తథా దేవరపత్నిభిః ।
చకార భోజనం సీతా దివ్యాన్నైః స్వస్థమానసా ॥ 47

తతశ్చతుర్థప్రహరే సభాం కృత్వా తు మంటపే ।
కథాభిః కీర్తనైర్గాత్రైః శాస్త్రవాదైః సుపుణ్యదైః ॥ 48

**వారస్త్రీణాం నృత్యగీతైర్నిన్యే రామో దినక్షయమ్ ।**
**తతః సంధ్యాదికం కృత్వా పునర్హుత్వా యథావిధి ॥ 49**

శ్రీరాముడు నడుమ నడుమ భోంచేస్తున్నవారి వద్దకు వచ్చి, "స్వామీ! కొంచెము వడ్డించుకో కూడదా! అని విచారించుచుండును. రుచికరమైన వంటకాలను ప్రశాన్తముగా అందరును భుజించు చుండిరి. గోరువెచ్చని నీటిచే అందరును చేతులు కడుగుకొనిరి. తాంబూలములను అందుకొని శ్రీరామ ముద్రాంకితములగు సువర్ణ నామ కంకణములను దక్షిణగా అంగీకరించి, వారివారి స్థలములకు పోవుదురు. పిదప అట్లే మొదట ఉపచారములచే క్షత్రియులు భుజించెదరు. పిదప వైశ్యులు భుజించెదరు. స్త్రీలయొక్క భోజనశాలలో మొదట మునిపత్నులతోడ దేవాంగనలు, పిదప క్షత్రియ స్త్రీలు, పిమ్మట వైశ్యాంగనలును భుజించుచుందురు. అట్లే పురుషశాలలో వానరులు, రాక్షసులు, ఋక్షులు, పౌరులు, గ్రామిణీకులును భుజించెదరు. పిదప శూద్రులు మొదలగువారు రాజసేవకులును భుజించెదరు. అచట ఒక్కడైనను ఆకలిగొన్నవాడు లేడు. యే ఒక్కనికీ నీకు భోజనములేదు అని నిషేధములేదు. పిమ్మట రాముడు; బంధు, మిత్ర, సుహృత్ శివాదులతోడ సీతచే పలుమార్లు ప్రార్థింపబడి సుస్థితుడై భుజించును. శ్రీరామ అశ్వమేధమున ప్రతిదినమును ప్రపంచమున భూమిరేణువులు ఎన్నిగలవో, జలబిందువులు ఎన్నిగలవో, ఎన్ని నక్షత్రములు గగనమున గలవో అందరు బ్రాహ్మణాది జనులును, స్త్రీలును భుజించుచుండిరి. ఇంతకన్నా అతిశయమేమి? అత్తల తోడను, మంత్రి పత్నులతోడను, తోడికోడండ్రళ్ళతోను కలసికొని, స్వస్థచిత్తమై, సీత దివ్యాన్నములను భుజించును. శ్రీరాముడు నాలుగవ జామున వీలు చేసుకుని నృత్య, గీత, వాద్య, పుణ్యకథ, ప్రసంగాదులచే పగలును గడుపుచుండును. ఆ వెనుక సాయంసంధ్యాదికమును ఆచరించి, మరల అగ్నిహోత్రమును సలిపెడివాడు.

**పూర్వోక్తైస్తు కథాద్యైశ్చ నిశాయాః ప్రహరద్వయమ్ ।**
**సమతిక్రమ్య నిద్రార్థం సర్వానాజ్ఞాపయత్తదా ॥ 50**

**గత్వా స్వస్వస్థలం సర్వే నిద్రాం చక్రుర్యథాసుఖమ్ ।**
**పట్టేకూలాసనే భూమ్యాం సీతయా చ జితేంద్రియః ॥ 51**

**చకార నిద్రాం శ్రీరామో హృది చింత్యేష్టదేవతాః ।**
**ఆజ్ఞాభంగో నరేంద్రాణాం విప్రాణాం మానఖండనమ్ ॥ 52**

**పృథక్ శయ్యా చ నారీణామశస్త్రవధ ఉచ్యతే ।**
**అతః స సీతయా యుక్తశ్చకార శరణం ప్రభుః ॥ 53**

**ఏవమాసీత్ప్రత్యహం వై దినచర్యాఽఽధ్వరే ప్రభోః ॥ 54**

**ఇతి శ్రీశతకోటిరామచరితాంతర్గతే, శ్రీమదానందరామాయణే, వాల్మీకీయే, ఆదికావ్యే, యాగకాండే, యజ్ఞారంభే రామదినచర్యావర్ణనం నామ, షష్ఠః సర్గః ॥**

సత్కథా శ్రవణాదులచే రాత్రి రెండుజాములను గడిపి, అందరిని ఆనందముగా నిద్రించుటకు ఆజ్ఞాపించును. వారువారు యథాసుఖముగా వారివారి స్థలములలో నిద్రించుచుందురు. శ్రీరాముడు సీతతోడ పట్టెమంచముపై హంసతూలికాతల్పమున స్వానంద నిద్రను అనుభవించును. రాజులకు ఆజ్ఞాభంగమును, విప్రులకు మాన భంగమును, స్త్రీలకు వేరుపడకను శస్త్రములేని హింసగా చెప్పబడి యుండుటచే, సీతారాములు ఏక శయ్యానిద్రితులై గడుపుచుండిరి. మహాప్రభువగు శ్రీరామునియొక్క యజ్ఞవైభవమున ఇట్లు దినచర్య జరుగబడుచుండెడిది. (6)

***శతకోటిప్రవిస్తరమైన రామకథలో, శ్రీమద్వాల్మీకిమహర్షిచే రచింపబడిన, ఆనందరామాయణంలోని, యాగకాండలో, అశ్వమేధయాగములో శ్రీరాముని దినచర్యను వివరించు ఆరవసర్గ ముగిసినది.***



# సప్తమః సర్గః-7వ సర్గ

విష్ణుధ్వజారోపణవిధి, మాహాత్మ్యము.

శ్రీరామదాస ఉవాచ

సౌత్యేऽహన్యవనీపాలో యాజకాన్సదసస్పతీన్ ।

అపూజయన్మహాభాగాన్ యథావత్సుసమాహితః ॥ 1

అథ చైత్రే సితే పక్షే రాజానః ప్రతిపత్తిథౌ ।

ధ్వజానారోపయామాసుర్విధినాऽధ్వరమంటపే ॥ 2

విష్ణుదాస ఉవాచ

ఆరోపితా ధ్వజాః ప్రోక్తాః పార్థివైర్యజ్ఞమంటపే ।

గురో తేషాం విధానం మాం సమ్యగ్వక్తుం త్వమర్హసి ॥ 3

శ్రీరామదాస ఉవాచ

సమ్యక్ ప్రశ్నః కృతః శిష్య త్వయా లోకోపకారకః ।

సావధానమనా భూత్వా శృణుత్వ త్వం మయోచ్యతే ॥ 4

సాంవత్సరం వ్రతంచేదం నృపైర్దృష్ట్వా సమాగతమ్ ।

ఆరోపితా ధ్వజాః సర్వైర్యజ్ఞవాటే తదా ముదా ॥ 5

నోచేద్విష్ణుగృహేష్వేవారోపణీయా ధ్వజా నృభిః ।

మధుశుక్లాదశామ్యాం చ పుణ్యాయాం ప్రతిపత్తిథౌ ॥ 6

## విష్ణు ధ్వజారోపణవ్రత మహిమాభివర్ణనము.

శ్రీరామదాసు చెప్పుచున్నాడు, "అశ్వమేధాయాగములో సోమరసము పిండబడెను. పగటి పూట శ్రీరాముడు యాజకులను, సదస్సులో పూజ్యులను సముచితముగా పూజించెను. పిదప చైత్రమాస శుక్ల ప్రతిపత్తి తిథిలో అధ్వరమంటపమున రాజులందరును యథావిధిగా ధ్వజములను సంస్థాపించిరి" అని వినిన విష్ణుదాసుడు, "గురూత్తమా! రాజోత్తములు యజ్ఞమంటపమున యథావిధిగా

ధ్వజారోపణమును చేసినట్లు చెప్పితిరే, ఆ విధివిధానమును సవిస్తరముగా వినగోరుచున్నాను.” అని ప్రార్థించెను. శ్రీరామదాసు చెప్పుచున్నాడు, “శిష్యుడా! లోకోపకారకమగు ప్రశ్నను చక్కగా అడిగితివి. నేను చెప్పెదను శ్రద్ధతో వినుము. విష్ణుధ్వజారోపణ ప్రతిసంవత్సరమును చేయదగిన ఒక వ్రతము. ఆ అశ్వమేధ యజ్ఞశాల అంతటా రాజులు ధ్వజారోపణములు చేసిరి. అట్లుకాకున్న నరులు విష్ణుదేవాలయములలో ధ్వజములను సంస్థాపింపవలయును.

**అథవా రోపణీయాస్తే శ్రీరామనవమీదినే ।**
**మధుశుక్లదశమ్యాం వా దశమ్యామాశ్వినే సితే ॥ 7**

**అథవోర్జ్జప్రతిపది శుక్లపక్షేఽపి భో ద్విజ ।**
**ఏతే కాలా మయా ప్రోక్తా వ్రతస్యాస్య తవాగ్రతః ॥ 8**

**అధునా సంప్రవక్ష్యామి ధ్వజారోపణముత్తమమ్ ।**
**వ్రతం పాపహరం పుణ్యం రామసంతోషకారకమ్ ॥ 9**

**యః కుర్యాద్విష్ణుభవనే ధ్వజారోపణ సంజ్ఞితమ్ ।**
**సంపూజ్యతే విరించ్యాద్యైః కిమన్యైర్బహుభాషితైః ॥ 10**

**హేమభారసహస్రం తు యో దద్యాచ్చ కుటుంబినే ।**
**తత్ఫలం సమవాప్నోతి ధ్వజారోపణకర్మణః ॥ 11**

**ధ్వజారోపణతుల్యం స్యాన్న గంగాస్నానముత్తమమ్ ।**
**అథవా తులసీ సేవా శివలింగప్రపూజనమ్ ॥ 12**

**అహోఽపూర్వమహోఽపూర్వ మహోఽపూర్వ మహత్తరమ్ ।**
**సర్వపాపహరం కర్మ ధ్వజారోపణ సంజ్ఞితమ్ ॥ 13**

**తాని సర్వాణి వక్ష్యామి శృణు త్వం గదతో మమ ॥ 14**

**అథ చైత్రే సితే పక్షే వ్రతం హి ప్రతిపత్తిథౌ ।**
**మధుశుక్లదశమ్యాం వా నవమ్యాం రాఘవస్య వా ॥ 15**

**కార్యం వాఽఽఽశ్వినమాసస్య దశమ్యాం శుక్లపక్షకే ।**
**ఊర్జశుక్లప్రతిపది దశమ్యాం వా విధీయతామ్ ॥ 16**

**అవశ్యం చైత్రమాసే హి కార్యం చైతత్ప్రతోత్తమమ్ ।**
**అతిక్రాంతే చైత్రమాసే కార్యం చేతరపర్వసు ॥ 17**

**చైత్రశుక్లప్రతిపది ప్రభాతే ప్రయతో నరః ।**
**స్నానం కుర్యాత్ప్రయత్నేన దంతధావనపూర్వకమ్ ॥ 18**

**తతః కృత్వా నిత్యకర్మ పశ్చాద్విష్ణుం సమర్చయేత్ ।**
**చతుర్భిర్బ్రాహ్మణైః సార్ధం కృత్వా చ స్వస్తివాచనమ్ ॥ 19**

ప్రతి సంవత్సరము చైత్రమాస శుక్లప్రతిపత్తునాడు, అది తప్పిన శ్రీరామ నవమినాడు, అది తప్పిన చైత్ర శుక్లదశమినాడు మరియు విజయదశమినాడు, లేనిపక్షంలో కార్తీక శుక్ల ప్రతిపత్తినాడు ధ్వజారోపణమునకు సరియైన కాలములుగా చెప్పబడినవి. ఇక శ్రీరామ సంతోషకారణములును, పవిత్రములును, దురితకారణములును అగు ధ్వజారోపణ సంజ్ఞితమగు వ్రతమును చెప్పబోవుచున్నాను.

విష్ణుమందిరమున ఎవ్వడు ధ్వజారోపణము చేయునో వానిని బ్రహ్మాదులు పూజించెదరు. ఇక ఇతరులు ఎంతటివారు? ఈ విష్ణుధ్వజారోపణమును గృహస్థు చేసినచో, అతడు బ్రాహ్మణులకు వేయిబారువుల బంగారమును దానముచేసిన ఫలమును పొందును. తులసీ పూజ, శివార్చన, గంగాస్నానము కూడా ధ్వజారోపణకు సమానము కాదు. ఆహా! ఉత్తమోత్తమమగు ఈ ధ్వజారోపణ చేయు వ్రతము సర్వపాపపరిహారకమై అపూర్వముగా ఉన్నది. దీని సంగతులను చెప్పెదను వినుము.

చైత్రశుక్ల పాడ్యమినాడు గానీ, అశ్వీయుజ శుక్ల పాడ్యమినాడు గానీ, కార్తీక శుక్లపాడ్యమినాడు గానీ, విష్ణుధ్వజమును ఎగురవేయవచ్చును. వీటిలో ముఖ్యముగా చైత్రశుక్ల పాడ్యమి నాడు ఈవ్రతమును ఆచరించవలయును. చైత్రమాసములో చేయలేకపోతే తక్కినకాలములో ఆచరించునది. (17)

## విష్ణు ధ్వజారోపణ వ్రతముయొక్క విధివిధానము.

పుణ్యాపేక్షగల మానవుడు చైత్రశుక్లప్రతిపత్తునాడు సత్సంకల్పముతో, ప్రభాతమున శౌచనవిధిని ఆచరించి, స్నానముచేసి, నిత్యకర్మలను నిర్వర్తించి, పిదప శ్రీవిష్ణుమూర్తిని ఆరాధించునది. ఎట్లనిన నలుగురు బ్రాహ్మణులతో స్వస్తివాచనమును ఆచరించవలయును.

నాందీశ్రాద్ధం ప్రకుర్వీత ధ్వజారోపణకర్మణి ।
ధ్వజస్తంభౌ చ గాయత్ర్యా ప్రోక్షయేద్వస్త్రసంయుతౌ ॥ 20

పతాకయోర్లేఖనీయౌ వైనతేయాంజనీసుతౌ ।
సూర్యం చంద్రం మారుతిం చ వైనతేయం ప్రపూజయేత్ ॥ 21

ధాతారం చ విధాతారం పూజయేత్కుంభకద్వయే ।
హరిద్రాఽక్షతదూర్వాద్యైః శుక్లపుష్పైర్విశేషతః ॥ 22

తతో గోచర్మమాత్రం తు స్థండిలం చోపలిప్య చ ।
అథాయాగ్నిం స్వగృహ్యోక్త్యా ఘృతభాగాదికం క్రమాత్ ॥ 23

జుహుయాత్పాయసేనైవ ఘృతేనాష్టోత్తరం శతమ్ ।
ప్రథమం పౌరుషం సూక్తం విష్ణోర్ణుకేన మంత్రతః ॥ 24

తతశ్చ వైనతేయాయ స్వాహేత్యష్టాహుతీస్తదా ।
మారుతేరష్టాహుతీశ్చ కృత్వా స్వాహేతి హోమయేత్ ॥ 25

సోమో ధేనుం సమాచ్చార్య జుహుయాత్ప్రయతస్తదా ।
సౌరాన్ మంత్రాన్ జపేత్తత్ర శాంతిసూక్తాని భక్తితః ॥ 26

రాత్రౌ జాగరణం కుర్యాదుపకంఠం హరేః శుచిః ।
ఏవం నవదినం కార్యం పూజనం పరమోత్సవైః ॥ 27

నవరాత్రం జాగరణం కుర్యాన్నిత్యం సుకీర్తనైః ।
తతో దశమ్యాముషసి సముత్థాయ వ్రతీ శుచిః ॥ 28

ప్రాతః స్నాత్వా నిత్యకర్మ సమాప్యాథ తతః పరమ్ ।
గంధపుష్పాదిభిర్దేవానర్చయేత్పూర్వవత్క్రమాత్ ॥ 29

తతో మంగళవాద్యైశ్చ శుక్లపీతైశ్చ శోభనైః ।
నృత్యైశ్చ స్తోత్రపఠనైర్నయేద్దేవాలయం ధ్వజమ్ ॥ 30

**దేవస్య ద్వారదేశే వా శిఖరేవా ముదాన్వితః ।**
**సుస్థిరం స్థాపయేచ్ఛిష్యం ధ్వజస్తంభం సుశోభితమ్ ॥ 31**

నాందీశ్రాద్ధము చేసి, ధ్వజారోపణ కర్మయందు వస్త్రములతో అలంకరించిన రెండు ధ్వజస్తంభములను గాయత్రి మంత్రములచే ప్రోక్షించవలయును. ధ్వజపతాకములపై గరుడ, ఆంజనేయుల చిత్రములను వ్రాయించవలయును. సూర్య, చంద్ర, గరుడ, హనుమంతులను పూజించవలయును. రెండు కలశములలో ధాతృ, విధాతృ దేవతలను, పసుపు అక్షతలు, గరిక మొదలైన వాటిచేతను విశేషముగా తెల్లని పుష్పములచేత పూజించవలయును. పిదప గోచర్మమాత్ర విశాలము కలిగిన భూమిపై గోమయముతో అలికి హోమకుండమును నిర్మించి, దానియందు స్వగృహ్యోక్త విధానముగా అగ్నిని ప్రతిష్ఠించి, నేతితోను, పాసయములతో హోమము చేయవలయును. అందులో 108 నేతి ఆహుతులను- మొదట పురుషసూక్తముచేతను, తరువాత విష్ణోర్నుకం మంత్రముచే హోమముచేసి, పిదప వైనతేయునికి స్వాహాకారముతోడ ఎనిమిది ఆహుతులను, అట్లే మారుతికి ఎనిమిది ఆహుతులను హోమముచేసి, సోమధేను అనుమంత్రముచే హోమము చేయవలయును. భక్తితో అచట సౌరమంత్రములను, శాంతిసూక్తములను జపించవలయును. శ్రీవిష్ణు సాన్నిధ్యమున శుచిగా ఆ రాత్రి జాగరణము చేయవలయును. ఇట్లు 9 దినములు పరమోత్సవములతో పూజించపవలయును. 9 రాత్రులు కీర్తనముచే జాగరణవ్రతము చేయవలయును. దశమిరోజున ఉదయమే నిద్రలేచి, శుచివంతముగా స్నానముచేసి, నిత్యకర్మానంతరము పూర్వమెట్లో అట్లు క్రమముగా గంధ పుష్పాదులచే దేవతలను అర్చించి, పిదప మంగళవాద్యములతోను, శుక్లపీఠములతోను, చక్కని నృత్యములతోను, స్తోత్రపఠనములతోను ధ్వజమును దేవాలయమునకు తీసుకొనిపోయి, ఆలయ ముఖద్వారమున లేదా ఆలయ శిఖరముపైనను, సంతోషముగా ధ్వజస్థంభములను నిలబెట్ట వలయును.

**గంధపుష్పాక్షతైర్దీపైర్దివ్యధూపైర్మనోరమైః ।**
**భక్ష్యభోజ్యాది సంయుక్తైః నైవేద్యైశ్చ హరిం యజేత్ ॥ 32**

**ఆప్రతిపదమారభ్య దశమ్యవధి సద్మని ।**
**ధ్వజయోః పూజనం కృత్వైకాదశ్యాం హరిసద్మని ॥ 33**

ఆరోపణీయౌ శిఖరే పురతో వా యథాసుఖమ్ ।
అథవా రోపణీయౌ హి దశమ్యాం తౌ ధ్వజోత్తమౌ ॥ 34

నవమ్యాం వా ద్వితీయాయాం చతుర్థ్యామ్యష్టమీదినే ।
షష్ఠ్యాం వా రోపణీయౌ తౌ పూర్వం పూజ్య యథావిధి ॥ 35

వ్రతస్య ప్రతిపద్యేవ ప్రారంభో నేతరే దినే ।
పూర్వోక్తేషు హరేః కార్యా న మాసేష్వితరేషు చ ॥ 36

మాఘాసితచతుర్దశ్యామేవం శంభోర్గృహే ధ్వజౌ ।
నందీభృంగ్యంకితౌ కృత్వా రోపణీయౌ యథావిధి ॥ 37

అశ్వినస్య సితాష్టమ్యాం మధోర్వా గిరిజాగృహే ।
నభస్యస్య చతుర్థ్యాం హి ప్రోక్తౌ గణపసద్గృహే ॥ 38

మార్గశీర్షే శుక్లషష్ఠ్యామేవం మార్తాండసద్గృహే ।
ఏవం హి సర్వదేవానాముత్సాహదివసేష్వపి ॥ 39

మధూర్జాశ్వినమాసేషు వినా విష్ణోర్న చేతరే ।
ఏవం దేవాలయే స్థాప్య శోభనౌ తౌ ధ్వజోత్తమౌ ॥ 40

సంపూజ్య విష్ణుం విధివత్ విత్తశాఠ్యం వినా తతః ।
ప్రదక్షిణమనువ్రజ్య స్తోత్రమేతదుదీరయేత్ ॥ 41

నమస్తే పుండరీకాక్ష నమస్తే విశ్వభావన ।
నమస్తేఽస్తు హృషీకేశ మహాపురుష పూర్వజ ॥ 42

గంధ, పుష్పాక్షత, ధూప, దీప, భక్ష్య, భోజ్యాది నైవేద్య తాంబూలాదులచే శ్రీహరిని అర్చించవలయును. మరియు శుక్ల ప్రతిపత్తుమొదలు దశమివరకు 10 దినములు ఇంటిలో పూజించి, పిదప ఏకాదశినాడు ధ్వజారోపణము చేయవచ్చును. దశమినాడే స్థాపించినను స్థాపింపవచ్చును. అట్లే ద్వితీయనాడు కానీ, చతుర్థినాడు కానీ, షష్ఠినాడు కానీ, అష్టమినాడు కానీ, నవమినాడు కానీ, యథావిధిగా ప్రతిపత్తు మొదలుకొని అర్చించి శ్రీవిష్ణుమూర్తికి ఎదుటకాని, శిఖరముపైగాని, ధ్వజారోపణము చేయవచ్చును. ఈ వ్రత ప్రారంభమునకు ప్రతిపత్తే ముఖ్యము. ఇతర దినములు కూడదు. (36)

## శివాలయాదుల యందును ధ్వజారోపణ కాలము.

మాఘ కృష్ణ చతుర్దశినాడే నంది, భృంగి చిత్రములను గీసిన ధ్వజములను యథావిధిగా అర్చించి స్థాపింపవలయును. ఆశ్వీయుజ శుక్లాష్టమినాడు, చైత్ర శుక్లాష్టమినాడుగాని, ఈశ్వరీదేవాలయమునను, భాద్రపదశుక్ల చతుర్దశినాడు గణపతి దేవాలయమునను, మార్గశిర శుక్లషష్ఠినాడు సూర్యసన్నిధానమున, ఇట్లే సర్వదేవతలకును ఆయా ఉత్సవ దినములయందు ఆయా దేవతా యంత్ర, తంత్ర విధానోక్తముగా ధ్వజారోపణ వ్రతములచే తృప్తిని కలుగజేయదగును.

చైత్ర, ఆశ్వీయుజ, కార్తీకములు తప్ప తక్కినవి విష్ణువుకు పనికిరావు. ఇట్లు మంగళధ్వజములను, శ్రీవిష్ణుసన్నిధిలో సంస్థాపించి, ధనం విషయంలో పిసినారితనాన్ని విడనాడి, విధివిధానముగా విష్ణువును ఆరాధించి, ప్రదక్షిణము చేసి, ఈ స్తోత్రమును భక్తిపూర్వకముగా పఠించవలయును.

**యేనేదమఖిలం జాతం యస్మిన్ సర్వం ప్రతిష్ఠితమ్ ।**
**లయమేష్యతి యత్రైతత్తం ప్రపన్నోఽస్మి మాధవమ్ ॥ 43**

**న జానంతి వరం దేవం సర్వే బ్రహ్మాదయః సురాః ।**
**యోగినో యం ప్రశంసన్తి తం వందే జ్ఞానరూపిణమ్ ॥ 44**

**అంతరిక్షం తు యన్నాభిః ద్యౌర్మూర్ధా యస్య చైవ హి ।**
**పాదాదభూచ్చ వై పృథ్వీ తం వందే విశ్వరూపిణమ్ ॥ 45**

**యస్య శ్రోత్రే దిశః సర్వా యచ్చక్షుర్దినకృచ్ఛశీ ।**
**ఋక్సామయజుషో యేన తం వందే బ్రహ్మరూపిణమ్ ॥ 46**

**యన్ముఖాత్బ్రాహ్మణా జాతా యద్బాహ్వోరభవన్నృపాః ।**
**వైశ్యా యస్యోరుతో జాతాః పద్భ్యాం శూద్రస్త్వజాయత ॥ 47**

**మనసశ్చంద్రమా జాతో దినేశశ్చక్షుషస్తథా ।**
**ప్రాణేభ్యః పవనో జాతో ముఖాదగ్నిరజాయత ॥ 48**

**పాపసందాహమాత్రేణ వదంతి పురుషం తు యమ్ ।**
**స్వభావవిమలం శుద్ధం నిర్వికారం నిరంజనమ్ ॥ 49**

**క్షీరాబ్ధిశాయినం దేవమ్ అనంతమపరాజితమ్ ।**
**సద్భక్తవత్సలం విష్ణుం భక్తిగమ్యం నమామ్యహమ్ ॥ 50**

## శ్రీవిష్ణు ధ్వజారోపణలో శ్రీవిష్ణుస్తుతి.

హృదయమస్థమగు పుండరీకమును వ్యాపించి, అచట స్థిరముగా ఉండువాడా! తామర రేకుల వంటి కన్నులుగలవాడా! నీకు నమస్కారము. ప్రపంచమును సృష్టించువాడా! సృష్టిని లయము జేయువాడా! అనాదిమూర్తీ! నీకు నమస్కారము. ఎవనిచే ఈ సమస్తమును వచ్చినదో, ఎవనియందు ఈ సర్వమును ఉన్నదో, ఇదంతయు ఎచట లయమునందునో అట్టి మాధవునికి నేను శరణాగతుడను అయితిని. ఏ పరబ్రహ్మమును బ్రహ్మాది దేవతలు కూడ తెలుసుకొనలేక ఉన్నారో, ఎవనిని యోగులు నిరంతరము ధ్యానించుచుందురో, జ్ఞానత్మకుడగు అట్టి దేవునికి నమస్కరించెదను. ఎవనియొక్క నాభియే ఈ ఆకాశమో, ఎవని శిరస్సు స్వర్గమో, పాదమునుండి భూమి ఉద్భవించెనో అట్టి విరాడ్రూపునికి నమస్కారము. సమస్త దిక్కులును ఎవని చెవులో, సూర్యచంద్రులు ఎవనికి కన్నులో, ఎవనిచే ఋగ్వేద, యజుర్వేద, సామవేదములు ఉద్భవించెనో అట్టి పరబ్రహ్మకు నమస్కారము. ఎవనిముఖము నుండి బ్రాహ్మణులును, ఎవని భుజములనుండి క్షత్రియులును, ఎవని తొడలనుండి వైశ్యులును, ఎవని పాదములనుండి శూద్రులు, మనస్సునుండి వాయువు, ముఖమునుండి అగ్నియు పుట్టెనో- అట్టి విరాడ్రూపునికి నమస్కారము. మల, మాయ, కర్మ, పాశ బంధమగు, సమస్త పాశములను పూర్తిగ దహించుటచేతనే పురుసంజ్ఞమగు దేహమున అంతర్యామిగా నిలిచిన పురుషుని ఎవనిని ప్రకృతి నిర్మలుడనియును, కేవల పరిశుద్ధుడనియును, అవయవ రహితుడగుటచే యేవికారమును లేనివాడనియు, నిస్సంగుడనియు, జ్ఞానులు అభివర్ణించి చెప్పుచుందురో అట్టి వాడైన నాశనము లేనివాడును. అంతః శత్రువులగు రాగాదులచేతను, బాహ్య శత్రువులగు రాక్షసుల చేతను జయింప బడక ఉండువాడును, సాధువులగు భక్తులయందు ప్రీతిగలవాడును, వ్యాపకుడును స్వానుభవైక అనుసంధాన ప్రీతిచేతనే పొందదగినవాడును అగు క్షీరాబ్ధిశయన స్వామికి నమస్కరించుచున్నాను.

**పృథివ్యాదీని భూతాని తన్మాత్రాణీంద్రియాణి చ ।**
**సుసూక్ష్మాణి చ యేనాసంస్తం వందే సర్వతోముఖమ్ ॥ 51**

**యత్బ్రహ్మ పరమం ధామ సర్వలోకోత్తమోత్తమమ్ ।**
**నిర్గుణం పరమం సూక్ష్మం ప్రణతోస్మి పునః పునః ॥ 52**

**నిర్వికారమజం శుద్ధం సర్వతో వహ్నిమీశ్వరమ్ ।**
**యమామనంతి యోగీంద్రాః సర్వకారణకారణమ్ ॥ 53**

**ఏకో విష్ణుర్మహద్భూతం పృథగ్భూతాన్యనేకశః ।**
**త్రీన్లోకాన్ వ్యాప్య భూతాత్మా భుంక్తే విశ్వభుగవ్యయః ॥ 54**

**నిర్గుణః పరమానందః స మే విష్ణుః ప్రసీదతు ।**
**హృదయస్థోఽపి దూరస్థో మాయయా మోహితాత్మనామ్ ॥ 55**

**జ్ఞానినాం సర్వధర్మస్తు స మే విష్ణుః ప్రసీదతు ।**
**చతుర్భిశ్చ చతుర్భిశ్చ ద్వాభ్యాంపంచభి రేవచ ॥ 56**

**హూయతే చ పునర్ద్వాభ్యాం స మే విష్ణుః ప్రసీదతు ।**
**జ్ఞానినాం కర్మణాం చైవ తథా భక్తిమతాం నృణామ్ ॥ 57**

**గతిదాతా విశ్వభుగ్యః స మే విష్ణు ప్రసీదతు**
**జగద్ధితార్థం యో దేహమదధాల్లీలయాహరిః ॥ 58**

పృథివి, నీరు, అగ్ని, వాయు, ఆకాశములు; శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములు; చెవి, చర్మము, కన్ను, నాలుక, ముక్కు; నోరు, చేతులు, పాదములు, మలద్వారము, మూత్రద్వారము–అంతఃకరణములైన మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారములును ఎవనివల్ల వచ్చినవో అట్టి సర్వ పూర్ణుడగువానిని వేడెదను. ఏ పరబ్రహ్మము సర్వలోకోత్తమోత్తమమును, తేజోరూపమును, గుణరహితమును, అత్యంత సూక్ష్మమునై ఉన్నదో అట్టి పరబ్రహ్మమునకు మరలా మరలా నమస్కరించు చున్నాను. వికారరహితుడగు ఏ పరబ్రహ్మమును సర్వలోక నియామకుడనియు, శుద్ధుడనియు, అనాది అనియు, నిండిన తేజస్సు అనియు, జగత్ స్థూల కారణుడనియు యోగీంద్రులు చెప్పు చుందురో; కేవలుడును, జనార్దనుడును అగు యే నారాయణుడు మహాతత్త్వమును వేర్వేరున ఇరువదిఐదు తత్త్వాలను, ముల్లోకములను వ్యాపించి తత్ స్వరూపుడై నాశనములేనివాడగుచు అనుభవించుచున్నాడో, నిర్గుణుడు అగు ఆ విష్ణుమూర్తి నాకు ప్రసన్నుడగుగాక! ఎవడు జ్ఞానులయొక్క సమస్త ధర్మము తానైయుండునో, ఆ విష్ణుమూర్తి నాకు ప్రసన్నుడగుగాక! ప్రజాపత్య దేవతాకములగు సప్తదశాక్షర మంత్ర శస్త్రములచే హోమము చేయబడు యజ్ఞనారాయణుడు నాకు ప్రసన్నుడగుగాక! జ్ఞానులకును, కర్మపరులకును, భక్తులకును, సర్వాంతర్యామి ఎవడు సద్గతిని ఇచ్చుచుండునో ఆ విష్ణువు నాకు ప్రసన్నుడగుగాక! లోకహితముకొరకు యే హరి నిజలీలచే దేహమును ధరించునో,..

**యమర్చయన్తి విబుధాః స మే విష్ణుః ప్రసీదతు ।**
**యమామనంతివైసంత సచ్చిదానందవిగ్రహమ్ ॥ 59**

**నిర్గుణం చ గుణాధారం స మే విష్ణుః ప్రసీదతు ।**
**పరేశః పరమానందః పరాత్పరతరః ప్రభుః ॥ 60**

చిద్రూపశ్చ పరిజ్ఞేయః స మే విష్ణుః ప్రసీదతు ।
య ఇదం కీర్తయేన్నిత్యం స్తోత్రాణాముత్తమోత్తమమ్ ॥ 61

సర్వపాపవినిర్ముక్తో విష్ణులోకే మహీయతే ।
య ఇదం కీర్తయేద్విష్ణుం బ్రాహ్మణాంశ్చ ప్రపూజయేత్ ॥ 62

ఆచార్యం పూజయేత్పశ్చాద్దక్షిణాచ్ఛాదనాదిభిః ।
బ్రాహ్మణాన్ భోజయేత్పశ్చాత్ భక్తితః సత్యభాషణః ॥ 63

పుత్రమిత్రకళత్రాద్యైర్బంధుభిః సహ వాగ్యతః ।
కుర్వీత పారణాం శిష్య నారాయణపరాయణః ॥ 64
యస్త్వేతత్కర్మ కుర్వీత ధ్వజారోపణముత్తమమ్ ।
తస్య పుణ్యఫలం వక్ష్యే శృణుష్వ సుసమాహితః ॥ 65

వస్త్రం ధ్వజస్య సంబంధం యావచ్చలతి వాయునా ।
తావత్స్వపాపజాలాని నశ్యన్త్యత్ర న సంశయః ॥ 66

మహాపాతకయుక్తో వా యుక్తశ్చేత్సర్వపాతకైః ।
ధ్వజం విష్ణుగృహే కృత్వా సర్వపాపైః ప్రముచ్యతే ॥ 67

యావద్దినాని వసతి ధ్వజో హరిగృహోపరి ।
తావద్యుగసహస్రాణి హరేః సామీప్యమాప్నుయాత్ ॥ 68

ఆరోపితం ధ్వజం దృష్ట్వా యేఽభివందంతి ధార్మికాః ।
తేఽపి సద్యో విముచ్యంతే హ్యపపాతకకోటిభిః ॥ 69

ఆరోపితం ధ్వజం విష్ణుగృహే ధున్వన్స్వకం పటమ్ ।
కర్తుః సర్వాణి పాపాని ధునోతి నిమిషార్ధతః ॥ 70

ఏవం శిష్య మయా ప్రోక్తం యథా పృష్టం త్వయా మమ ।
ధ్వజారోపణమాహాత్మ్యం సవిధానం మనోరమమ్ ॥ 71

పండితులు ఎవనిని అర్చించెదరో వాడు నాకు ప్రసన్నుడు కానిమ్ము. సత్పురుషులు ఎవ్వరిని నిత్యానందమూర్తి అనియు, సత్వరజస్తమో గుణములకు ఆధారుడైనను, తనకంటూ ఒక గుణములేక నిర్గుణుడు అని చెప్పబడుచుండునో అతడు నాకు ప్రసన్నుడగుగాక! ఎవ్వడు పరమేశ్వరుడుగాను, పరమానంద మూర్తిగాను, పరతత్త్వము మీద అవ్యక్తిత్వముగాను, సర్వతంత్రుడుగాను, జ్ఞాన రూపుడుగాను, తెలియదగినవాడగునో అట్టి విష్ణుమూర్తి నాకు ప్రసన్నుడు కావలయును. (60)

## శ్రీవిష్ణు ధ్వజోత్సవ స్తుతికి ఫలశ్రుతి.

ఎవ్వడీ సర్వోత్తమమగు స్తోత్రమును పఠించునో వాడు అన్నిపాపములనుండి బయటపడును, విష్ణులోకమును పొందును. దీనిని పఠించిన వాడు బ్రాహ్మణులను పూజించి, పిమ్మట పురోహితులను పూజించి, దక్షిణ తాంబూలాదులతోడ బ్రాహ్మణ సమారాధనముచేసి, భక్తితో సత్యవ్రతుడై; పుత్ర, మిత్ర, కళత్రాదులతోడ పారాయణను ఆచరించవలయును. నారాయణభక్తి పరవశుడగు నెవ్వడు ఈ వ్రతమును ఆచరించునో వానికి కలుగు పుణ్యఫలమును చెప్పెదను వినుము. ధ్వజమున ఉన్న వస్త్రము ఎంతవరకు గాలికి చలించుచుండునో అంతవరకు వ్రతముచేసినవాని పాపములు తొలగిపోవును. ఇందులో సంశయములేదు. మహాపాపియైనను, సకలపాపములు చేసినవాడైనను, విష్ణుదేవాలయమున ధ్వజారోపణముచేసినచో, సర్వపాప ముక్తుడగును. ఎన్నిదినములు విష్ణు మందిరమున ధ్వజముండునో అన్నిసహస్రయుగములు ధ్వజధారి విష్ణుసాన్నిధ్యమును పొందును. యే మహాత్ములు ధ్వజారోపణము చూచి, వందనము చేసెదరో వారును పాపముక్తులగుదురు. విష్ణుమందిరమున సంస్థాపించిన ధ్వజము తన పతాకమును వీచుచు, ధ్వజారోపణముచేసివాని పాపములను వదలించుచున్నది. విష్ణుదాసా! ఇట్లు నీవడిగిన ధ్వజారోపణ విధానమును చెప్పితిని.

**సమాగతాం ప్రతిపదం జ్ఞాత్వా చైత్రసితాం నృపైః ।**
**ఆరోపితా ధ్వజాః సర్వైర్ద్వితీయాయాం పృథక్ పృథక్ ॥ 72**

**జ్ఞాత్వా రామం మహావిష్ణుం తస్యైవాధ్వరమంటపే ।**
**కృత్వా చైకదినం స్వస్వావాసగేహేషు పూజనమ్ ॥ 73**

**ధ్వజస్య పూజనం గేహే నవరాత్రం సమాచరేత్ ।**
**యథాశక్త్యనుసారం వా చైకరాత్రమథాపి వా ॥ 74**

**యజ్ఞోత్సవదర్శనార్థం కృతమేకదినం నృపైః ।**
**చకార రాఘవశ్చాపి పూర్వమేవ ధ్వజోత్సవమ్ ॥ 75**

**మాఘమాసే కృష్ణపక్షే చతుర్దశ్యాం శివాగ్రతః ।**
**తదా ధ్వజైర్మహోచ్చైస్తైః శుశుభే గగనాంగణమ్ ॥ 76**

**ఇదం చరిత్రం పరమం మనోహరం**
**శ్రీమద్ధ్వజారోపవిధానసంజ్ఞితమ్ ।**
**పఠంతి శృణ్వంతి నరాః సుపుణ్యదం**
**భవేచ్చ తేషాం నియతం విచింతితమ్ ॥ 77**

**ఇతి శ్రీశతకోటిరామచరితాంతర్గతే, శ్రీమదానందరామాయణే, వాల్మీకీయే, ఆదికావ్యే, యాగకాండే, ధ్వజారోపణవ్రతం నామ, సప్తమః సర్గః ॥**

శ్రీరామా! అశ్వమేధమునకు వచ్చియున్న రాజులందరును వేరువేరుగా తమతమ ఇండ్లలో ధ్వజమును 9 రాత్రులు భక్తితో పూజచేయదగును. యథాశక్తిగా ఒకదినమైనను జరుపదగును. యజ్ఞోత్సవములను చూచుటకై ఆ రాజులు ఒకదినమే చేసిరి. శ్రీరాముడు మొదట ధ్వజోత్సవమును ఒనరించెను. మాఘ కృష్ణ చతుర్దశినాడు శివసన్నిధిలో ఆ రాజులచే పొడుగైన ధ్వజములు కట్టబడి గగనమున ప్రకాశించుచుండెను. ఈ మనోహరమగు ధ్వజారోహణ చరితమును చదివినవారు కూడా తప్పక వారి మనోరథములు పొందెదరు.

***శతకోటిప్రవిస్తరమైన రామకథలో, శ్రీమద్వాల్మీకిమహర్షిచే రచింపబడిన, ఆనందరామాయణంలోని, యాగకాండలో, ధ్వజారోపణవిధానమును వివరించు ఏడవ సర్గ ముగిసినది.***



# అష్టమః సర్గః-8వ సర్గ

అవభృథోత్సవము

శ్రీరామదాస ఉవాచ

అథ చైత్రసితే పక్షే నవమ్యాం రామజన్మని ।
తదాఽవభృథస్నానార్థం వాజిమేధఫలాప్తయే ॥ 1

చకార సూచనాం రాజ్ఞే రాఘవాయ గురుః స్వయమ్ ।
త్వరయామాస తం రామం రవితాపభయాన్మునిః ॥ 2

వసిష్ఠవచనం శ్రుత్వా రామో లక్ష్మణమబ్రవీత్ ।
అద్యావభృథస్నానార్థముత్సవైర్గమనం మమ ॥ 3

రామతీర్థం త్వయా జ్ఞాత్వా కరణీయం మయోచ్యతే ।
ఆజ్ఞాపనీయా రాజానో నిజసైన్యైర్గజాదిభిః ॥ 4

సజ్జీభూతాః సావరోధాస్తిష్ఠధ్వమితి మంటపే ।
సిద్ధం కార్యం నిజం సైన్యం శిబికారథవారణమ్ ॥ 5

అశ్వపత్తిసమాయుక్తం తురగోష్ట్రగజైర్యుతమ్ ।
నవవాద్యధ్వనిః కార్యాస్తూర్యాదీనాం స్వనోఽపి చ ॥ 6

పతాకాశ్చ ధ్వజాశ్చాపి తోరణాది సమంతతః ।
ముక్తప్రవాళపుష్పాణి హారాశ్చాధ్వరమంటపాత్ ॥ 7

బంధనీయా రామతీర్థపర్యంతం సైకతేఽపి చ ।
కదలీనాం మహాస్తంభాశ్చేక్షుదండాః సమంతతః ॥ 8

## అశ్వమేధమున అవభృథస్నాన సన్నాహము.

శ్రీరామదాసు ఇట్లు చెప్పుచున్నాడు, "పిదప చైత్ర శుక్ల నవమినాడు శ్రీరామ జన్మోత్సవ దినమునందు అశ్వమేధ యాగ ఫలావాప్తికొరకై అవభృథ స్నానముచేయుటకు శ్రీరామునికి గురువగు

వశిష్ఠుడు సూచనలనిచ్చెను. ఎండలు పెరుగునను భీతివలన త్వరపడుడు. వశిష్ఠులమాటమీద శ్రీరాముడు లక్ష్మణునితో, “తమ్ముడా! ఇప్పుడు అవభృథ స్నానమునకై ఉత్సవములతో నేను బయలుదేరవలయును. నీవు రామతీర్థమువద్ద చేయవలసిన పనియేమనిన– రాజులకందరికిని వారివారి సైన్యములతోను, రాణివాసములతోను, వారువారు యజ్ఞమండపమున సర్వసిద్ధులుగా ఉండునట్లు ఆజ్ఞాపింపుము. మనసైన్యమును– రథ, గజ, తురగ, పదాతి, యాన వాహనాదులతోడ సిద్ధముగా ఉండునట్లు చేయుము. నవవాద్యములు తురియాది ఘోషలతో మ్రోగుచుండవలయును, యజ్ఞ మంటపమునుండి రామతీర్థము వరకు ఇసుకలోను, చిత్రధ్వజ పతాకతోరణ రత్నహారములను అలంకరించవలయును.

పుష్పాణి వాటికాశ్చాపి మృత్పాత్రాదిషు నిర్మితాః ।
స్థాపనీయాశ్చ సర్వత్ర నృత్యంతు వారయోషితః ॥ 9

సేచనీయో రామతీర్థమార్గశ్చందనవారిభిః ।
పుష్పైరాచ్ఛాదనీయో హి పట్టకూలాదిభిస్తథా ॥ 10

అన్యచ్చాపి యథాయోగ్యం యన్నోక్తం చ మయాతవ ।
తత్కురుష్వావిలంబేన మామపృష్ట్వాఽవిచారితమ్ ॥ 11

తథేత్యుక్త్వా లక్ష్మణోఽపి తథా సర్వం చకార సః ।
అథ తం ఋత్విజశ్చక్రుర్గమనేష్టిం సవిస్తరమ్ ॥ 12

వాజివాహే రథే వహ్నిం పాత్రాణి స్థాప్య రాఘవమ్ ।
సీతాం చారోహ్య స గురుశ్చారురోహర్త్విజైః సహ ॥ 13

మునయో దేవఘోషాంశ్చ సర్వే చక్రుః సమంతతః ।
స సమ్రాడ్రథమారూఢః సదశ్వం రుక్మమాలినమ్ ॥ 14

యయౌ శనైః శనైర్మార్గే ముదా వందిజనైః స్తుతః ।
అగ్రే గజాః పతాకాభిర్జగ్మురశ్వాస్తతః పరమ్ ॥ 15

తతస్తే తూర్యఘోషాణాం కర్తారస్తురగస్థితాః ।
తతస్తే రాజదూతాశ్చ చిత్రోష్ణీషాః సుదండినః ॥ 16

తతో వందినటాద్యాశ్చ వారస్త్రీణాం తతో గణాః ।
తతో దేవాః సగంధర్వాస్తతో రామః స సీతయా ॥ 17

ఋత్విగ్జనైర్యయౌ వహ్నిసంయుతః స్యందనస్థితః ।
తతో మునీశ్వరాః సర్వే ఋషిపత్న్యస్తతో యయుః ॥ 18

తతః క్షత్రియపత్న్యాద్యాః స్త్రియః సర్వాః శనైర్యయుః ।
తతస్తే క్షత్రియాః సర్వే నానావాహనసంస్థితాః ॥ 19

తతస్తేషాం హి సైన్యాని తతోఽన్తే రాజసేవకాః ।
నవవాద్యధ్వనీనాం చ వారణాద్యాస్తతః పరమ్ ॥ 20

తతశ్చోష్ట్రాస్తు బాణానాం శకటాః శస్త్రపూరితాః ।
లోహకారాస్తక్షకాశ్చ చర్మకారాస్తతః పరమ్ ॥ 21

పూలచెట్లు, మట్టితొట్లును, చెరుకుగడలును, అరటిచెట్లును రహదారికి ఇరువైపులా సింగారింపబడవలయును, నర్తనము జరగవలయును. రామతీర్థ మార్గమున చందనరసమును చల్లవలయును. పట్టుబట్టలను పరచి, పూలు చల్లవలయును. ఇంకను కావలసిన పనులను నన్ను అడుగకయే తగిన విధముగా చేయింపుము," అని చెప్పెను. లక్ష్మణుడు అట్లే అని సర్వమును నెరవేర్చెను.(12)

## శ్రీరాముడు అవభృథస్నానము చేయుట.

తరువాత చక్కగా ఋత్విక్కులు గమనేష్ఠిని ఒనరించిరి. వశిష్ఠుడు అశ్వమేధ యాగ రథమున అగ్నిని, యజ్ఞపాత్రములను స్థాపించి, సీతారాములను ఎక్కించి, తాను ఋత్విక్ జనులతో రథమును ఎక్కెను. అంతట మునీంద్రులు వేదఘోషలను ఒనరించుచుండిరి. పిదప బంగారముతో చక్కగా అలంకరింపబడిన గుఱ్ఱపు రథమున శ్రీరామ మహారాజు జనులచే నమస్కరింపబడుతూ మార్గమున తిన్నగా వచ్చుచుండెను. ముందర ధ్వజాలంకృతమగు గజములు నడుచుచుండెను. చతుర్విధ వాద్యములను వాయించుచు అశ్వారూఢులు వెడలిరి. వారివెనుక వెండి బంగారు కఱ్ఱల రాజదూతలు అలంకారములతో నడచుచుండిరి. వారివెనుక గాయకులు, నటులు, వారాంగనలు వరుసగా వచ్చుచుండిరి. అంత గంధర్వులను, దేవతలను ముందుపెట్టుకుని శ్రీసీతారాములు ఋత్విక్ అగ్నిహోత్రములతో వచ్చుచుండిరి. వారివెనుక క్షత్రియ కాంతలును, వారివెనుక తక్కిన స్త్రీ

పరివారములును, ఆ వెనుక రాజులును, వారిసైన్యములు, ఇతర రాజసేవకులును, నవవాద్య ధ్వనులతో గజాదులును, అంబుల ఒంటెలును, శస్త్రశకటములును వారి వెనుక కమ్మరులు, వడ్లవాండ్రు, చర్మకారులు నడచుచుండిరి.

భూమిమానప్రకర్తారో రజ్జుకుద్దాలహస్తకాః ।
యయుర్యథాక్రమాం సర్వే తదైవ పరమోత్సవైః ॥ **22**

తదా నినేదుర్వాద్యాని ననృతుర్వారయోషితః ।
మునిపార్థివపత్న్యస్తం వవర్షుః పుష్పవృష్టిభిః ॥ **23**

మార్గే వందిజనాద్యాశ్చ తుష్టువూ రఘునందనమ్ ।
షడ్జాదిస్వరాన్ గంధర్వాః ప్రజగుః పథి తే ముదా ॥ **24**

చక్రుస్తే వేదఘోషాంశ్చ మునయః సర్వపూర్వకాన్ ।
ఏవం రామః శనైర్మార్గే కౌతుకాని సమంతతః ॥ **25**

పశ్యన్ జనకనందిన్యా యయౌ చామరవీజితః ।
తత్ర రామస్య మార్గే హి సీతాయా ముఖపంకజమ్ ॥ **26**

ద్రష్టుం కోలాహలం చక్రుః సంమర్దాత్సకలా జనాః ।
తతస్తాస్తాడయామాసుః శతశో వేత్రపాణయః ॥ **27**

విశేషేణ తదాసీత్సా మహాన్ కోలాహలో ద్విజ ।
తత్సర్వం రాఘవో దృష్ట్వా శ్రుత్వా చ ప్రాహ లక్ష్మణమ్ ॥ **28**

ఏతే సర్వే పుష్పకస్థా జనాః సీతాం చ మా సుఖమ్ ।
పశ్యంతు కలహో మాఽస్తు తథాస్త్వితి స లక్ష్మణః ॥ **29**

సర్వానారోహయామాస పుష్పకే తాన్ జనాన్ ముదా ।
తతస్తే పుష్పకారూఢా జనా రామం మనోరమమ్ ॥ **30**

జానకీసహితం యాంతం దదృశుః పథి వై శనైః ।
కేచిదూచుర్వయం ధన్యాః పరిపూర్ణమనోరథాః ॥ **31**

**అద్య రామ ససీతం చ పశ్యామోఽత్ర మహోత్సవే ।**
**కేచిదూచుశ్చ తౌ ధన్యౌ పితరౌ నః సుజన్మదౌ ॥ 32**

**యయోః పుణ్యచయైరద్య నః సీతారామదర్శనమ్ ।**
**ఏవం గచ్ఛతి శ్రీరామే స్త్రియః సర్వాః పరస్పరమ్ ॥ 33**

**సంమంత్ర్య పుష్పకే స్థాతుం ప్రార్థయంతి స్మ జానకీమ్ ।**
**తదా సా జానకీ ప్రాహ లక్ష్మణం పురతః స్థితమ్ ॥ 34**

**స్త్రియః సర్వాస్త్వయా శీఘ్రం నారీశాలాసు పుష్పకే ।**
**ఆరోహణీయా మే వాక్యాత్ ప్రార్థయంతత్ర మాం ముహుః ॥ 35**

రహదారిని సరిచేయువారు, చేత తాడును ధరించినవారును, నేలకొలిచెడివారును ఇట్లు యథాక్రమముగా అందరును పరమోత్సవములతో వచ్చుచుండిరి. అప్పుడు వాద్యములు మ్రోగుచుండినవి. నర్తనములు జరుగుచుండినవి. మునిపత్నులును, రాజపత్నులును సీతారాములమీద పూలవాన కురిపించుచుండిరి. వందిమాగదులు కీర్తించుచుండిరి. గంధర్వులు గానము చేయుచుండిరి. మునులు సస్వరముగా వేదపారాయణము చేయుచుండిరి. ఇట్లు శ్రీరాముడు సీతతో చామరములు వీయబడుచుండగా శోభాయమానముగా మెల్లగా దారిలోని వేడుకలను చూచుచు వచ్చునపుడు, లోకులందరును సీతారాముల ముఖపద్మములను చూచుటకై జనసమర్ధమువలన త్రొక్కిళ్ళుపడి కోలాహలముచేయగా, వారిని బెత్తములు చేతపట్టిన భటులు అదలించుచుండిరి. సర్వమును పరికించుచున్న శ్రీరాముడు వారి కోలాహలములను విని లక్ష్మణునితో, “వీరినందరిని పుష్పకముమీద ఎక్కింపుము. సంతోషముగా మమ్ము చూచుచుండనీ. త్రొక్కిసలాట వద్దు,” అని ఆజ్ఞాపింపగా అతడు అట్లేచెసెను. పుష్పకవిమానము నెక్కిన ఆ జనులందరును తిన్నగా వచ్చుచు, రాజమార్గములను అలంకరించుచు శ్రీ సీతారాములను తృప్తిగా చూచుచు, కొందరు మేము ధన్యులము, సఫల మనోరథులము, నేడిచ్చట మహోత్సవములతో శ్రీసీతారాములను చూచుచున్నాము కదా!” అనియును, మరి కొందరు, “ఇట్టి శ్రీసీతారాములను దర్శించు భాగ్యమువలన జన్మను మాకిచ్చిన తల్లిదండ్రులు ఇరువురును మిక్కిలి ధన్యులు అని చెప్పుకొనుచుండిరి. ఇట్లు శ్రీరాముడు వచ్చుచుండగా స్త్రీలందరును తమలోతాము ఆలోచించి, తామూ పుష్పకవిమానమును ఎక్కుటకై సీతాదేవిని ప్రార్థించిరి.

లక్ష్మణోఽపి తథేత్యుక్త్వా తాః స్త్రీః సర్వాశ్చ పుష్పకే ।
త్వరయాఽఽరోహమాస స్త్రీశాలాసు యథాసుఖమ్ ॥ 36

తతస్తాః పుష్పకారూఢా స్తృణజాలపటాంతరైః ।
దదృశుః సీతయా రామం వవర్షుః పుష్పవృష్టిభిః ॥ 37

మృదంగశంఖపణవధుంధుర్యానకగోముఖాః ।
వాదిత్రాణి విచిత్రాణి నేమశ్చావభృథోత్సవే ॥ 38

నర్తక్యో ననృతుర్హృష్టా గాయకా యూథశో జగుః ।
వీణావేణుతలోన్నాదస్తేషాం స దివమస్పృశమ్ ॥ 39

చిత్రధ్వజపతాకాగ్రైరిభేంద్రస్యందనార్వభిః ।
స్వలంకృతైర్భటైర్భూపా నిర్యయూ రుక్మమాలినః ॥ 40

యదుసృంజయకాంభోజకురుకైకయకోసలాః ।
కంపయంతో భువం సైన్యైర్యజమానపురస్సరాః ॥ 41

సదస్యర్త్విగ్ద్విజశ్రేష్ఠా బ్రహ్మఘోషేణ భూయసా ।
దేవర్షిపితృగంధర్వాస్తుష్టువుః పుష్పవృష్టిభిః ॥ 42

స్వలంకృతా నరా నార్యో గంధస్రగ్భూషణాంబరైః ।
విలింపంత్యోఽభిషించంత్యో విజహుర్వివిధై రసైః ॥ 43

తైలగోరసగంధోదహరిద్రాసాంద్రకుంకుమైః ।
పుంభిర్లిప్తాః ప్రలింపంత్యో విజహ్రుర్వారయోషితః ॥ 44

ఏవం నానాసముత్సాహైః శ్రీరామశ్చ ససీతయా ।
పశ్యన్నానాకౌతుకాని స్యందనేన శనైః శనైః ॥ 45

అగమత్సరయూతీరే రామతీర్థం శుభావహమ్ ।
అవరుహ్య రథాద్రామః సీతయా సరయూజలే ॥ 46

**స చకార జలేష్టిం త్రైఋత్విగ్భిః పరివారితః ।**
**పత్నీసంయాజావభృథ్యైశ్చరిత్వా తే తమృత్విజః ॥ 47**

**సర్వే రామహ్రదే విప్రా యజమానపురః సరాః ।**
**ఆచాంతం స్నాపయాం చక్రుః సరయ్వా సహ సీతయా ॥ 48**

**శత్రుఘ్నేన పురాఽఽనీతైర్నానాతీర్థైర్జలైస్తదా ।**
**రామాభిషేకం తే చక్రుర్ముదా మంత్రైర్మునీశ్వరాః ॥ 49**

అప్పుడు సీత లక్ష్మణుని జూచి, "నీవు ఈ స్త్రీలందరిని పుష్పకమున స్త్రీలకు కేటాయించిన చోట ఉండునట్లు చేయుము." అని యాజ్ఞాపించెను. అతడు అట్లేచేసెను. వారందరును యథాసుఖముగా కూర్చుండి, జాలరు కలిగిన కిటికీలనుండి సీతారాములను చూచుచు, పూలవాన కురిపించిరి. అపుడు వీణా, వేణు, మృదంగాది దివ్యవాద్య ధ్వనుల నాదము ఆకాశమునంటుచుండెను. మంగళ నృత్య, గీత వాద్యములు మహోత్సవముగా ఉండెను. యదు, శృంజయ, కాంబోజ, కురు, కైకయ, కోసలాది నృపులు– చిత్ర, ధ్వజ, పతాక, గజ, రథాది రాజ్య వైభవములతో సువర్ణరత్నాలంకృతులై యజమానుని వెంబడించి వచ్చునపుడు, వారి భారమునకు భూమి కంపించుచుండె. సదస్యులును, ఋత్విక్కులును, బ్రాహ్మణ శ్రేష్ఠులును వేదఘోష నాద బ్రహ్మమును ప్రత్యక్షర పరచుచుండగా, దేవర్షి పితృ గంధర్వులు పుష్పవృష్టములచే తుష్టినొందు చుండిరి. పుష్ప, గంధ, భూషణ వస్త్రములచే అలంకృతులగు నరులు, నారులు; గంధోదకము, పుసుపు, కుంకుమలు, గోరోజనాది వివిధరసములు, తైలములు మొదలైనవాటిని పరస్పరముగా పూసుకొనుట, అభిషేకించుట, హాస్యముచేయుట మొదలైన వినోద కృత్యములను చేయుచుండిరి. ఇట్లు జరుగుతుండు వేడుకలను వీక్షించుచు, శ్రీరాముడు రథారూఢుడై తిన్నగా వచ్చి, సరయూతీరమున మంగళప్రదమగు శ్రీరామ తీర్థమునకు చేరి, సీతతోడ రథమునుండి దిగి, ఋత్విక్ గజ పరివృతుడై, వారితో పవిత్ర స్నానకర్మను ఆచరించుచుండెను. ఆ ఋత్విక్కులు పత్ని సంయాజావ భృత్య, మంత్రవిధులను ఆచరించి, అందరును, మునులును, యజమాన పరస్పరులై, శత్రుఘ్నుడు తెచ్చిన నానాదేశములలోని దివ్యమంగళ తీర్థ జలములచే సరయూనదిలో వేదమంత్రములను ఉచ్చరించుచు, శ్రీసీతారాములను అభిషేకించిరి.

**దేవదుందుభయో నేదుర్నరదుందుభిభిః సమమ్ ।**
**ముముచుః పుష్పవర్షాణి దేవర్షిపితృమానవాః ॥ 50**

**సస్నుస్తత్ర తతః సర్వే వర్ణాశ్రమయుతా నరాః ।**
**మహాపాతకినశ్చాపి స్నాత్వా ముక్తాః స్వపాతకాత్ ॥ 51**

అథ రామోఽహతే క్షౌమే పరిధాయ స్వలంకృతః ।
శుశుభే నితరాం దివ్య కంకణాభ్యాం సుమండితః ॥ 52

కేయూరాభ్యాం కుండలాభ్యాం ముక్తాహారైర్విచిత్రితైః ।
నానాప్రసూనహారైశ్చ రత్నానాం నూపురాదిభిః ॥ 53

హృది చింతామణియుతః కంఠే కౌస్తుభమండితః ।
చింతామణికౌస్తుభయోః ప్రమయా దీపితోదయః ॥ 54

కోటిసూర్యప్రతీకాశః సికతాయాం వరాననే ।
తస్థౌ జనకనందిన్యా ఋత్విగ్భిః పరివేష్టితః ॥ 55

అథర్త్విగ్భ్యోదదాత్కాలే యథామ్నాయం స దక్షిణాః ।
స్వలంకృతేభ్యోఽలంకృత్య గోభూతురగవారణాన్ ॥ 56

కామధేనుమలంకృత్య గురుం దాతుం సముద్యతః ।
తత్జ్ఞాత్వా చింతయామాస వసిష్ఠః స స్వచేతసి ॥ 57

అస్తి మాం నందినీ నామ్నీ కామధేనుసుతాసుతా ।
నాస్యాః ప్రయోజనం మేఽద్య హ్యాత్రాపూర్వం కరోమ్యహమ్ ॥ 58

అస్త్వైవాస్తు కామధేనురస్యై యోగ్యో రఘూత్తమః ।
తాం వర్జయిత్వా రామస్య కీర్త్యర్థం జగతీతలే ॥ 59

యాచామ్యహం శుభాం సీతాం సాలంకారాం సదక్షిణామ్ ।
ఔదార్యం రాఘవస్యాద్య దర్శయిష్యామ్యహం జనాన్ ॥ 60

ఇతి నిశ్చిత్య స గురుస్తదా ప్రాహ రఘూత్తమమ్ ।
కరోమి కిం ధేనుదానం తేన తృప్తిర్న మే భవేత్ ॥ 61

యది దాస్యసి దేయా మే సీతాఽలంకారమండితా ।
తయా తృప్తిర్భవేన్మఽద్య నాన్యైర్నారీశతైరపి ॥ 62

దేవదుందుభులు మానవ దుందుభులతో మ్రోగుచుండినవి. దేవతలు, పితృదేవతలు, మహర్షులు, మానవులు కూడా పూలవానలను కురిపించిరి. అపుడు నాలుగు వర్ణాశ్రమ వాసులు, నరులందరును స్నానముచేసిరి. మహాపాపులు కూడా స్నానము చేసి, తమ పాపములనుండి విముక్తులైరి. అప్పుడు శ్రీరాముడు స్వచ్ఛమైన మేలి పట్టువస్త్రములను అలంకరించుకుని, దివ్య కంకణ, కేయూర, కుండల, ముక్తాహార దివ్యాభరణములకు శోభనిచ్చుచూ ఎంతో ప్రకాశించు చుండెను. హృదయమున చింతామణి రత్నమును, కంఠకమున కౌస్తుభ రత్నమును దేదీప్యమానమై యుండగా, వాటి కాంతులచే ప్రకాశోదయమై కోటి సూర్యులవలే వెలుగుచు, దివ్య రత్నపీఠముపై సీతతో కూర్చుండి, ఋత్విక్ జనముచే ఆవరింపబడి యుండెను. (55) ఆ సమయమున చక్కగా అలంకరించుకున్న ఋత్విక్ జనులకు గో, భూ, గజ, హిరణ్యాది దానములను అనేకములను సదక్షిణాకముగా ఇచ్చుచు, కామధేనువును అలంకరించి, గురువుల వారగు వసిష్ఠులవారికి దానముచేయుటకు యత్నించెను. ఆసంగతిని ఎఱిగిన వశిష్ఠుడు మనమున, "నావద్ద నందిని అను కామధేనువుయొక్క కూతురు ఉన్నది. ఇందువలన దీనితో నాకేమి ప్రయోజనము లేదు. ఇచ్చట నేను ఒక అద్భుతమును చూపెదను అని, ఇతనికే కామధేనువు తగును. కామధేనువునకు ఇతడే తగినవాడు. దీనిని వదలి శ్రీరామునికి జగమున కీర్తికలుగుటకై సదక్షిణాకముగా సాలంకృతయగు సీతను ఇమ్మని యాచించెదను. అని నిశ్చయించుకొనెను.

**తన్మునేర్వచనం శ్రుత్వా వసిష్ఠస్య జనాస్తదా ।**
**హాహాకారం మహచ్చక్రుర్విషణ్ణా భయవిహ్వలాః ॥ 63**

**కేచిదూచుర్వసిష్ఠోఽయం కిం భ్రాన్తో జఠరోఽద్య హి ।**
**కేచిదూచుర్వినోదోఽయం కృతోఽస్తి మునినాఽత్ర హి ॥ 64**

**కేచిదూచూ రాఘవస్య ధైర్యం పశ్యత్యయం మునిః ।**
**కేచిదూచు రాఘవోఽద్య కిం కరిష్యతి పశ్యతామ్ ॥ 65**

**ఏతస్మిన్నంతరే రామః శ్రుత్వా తచ్చ గురోర్వచః ।**
**ప్రహస్య సంజ్ఞయా సీతామాహూయ గురుసన్నిధౌ ॥ 66**

**సీతాయాః స్వకరేణైవ ధృత్వా వామకరం ముదా ।**
**సభాయాం రాఘవః ప్రాహ వసిష్ఠం తోషయన్ముదా ॥ 67**

స్త్రీదానమంత్రో వక్తవ్యః సీతాదానం కరోమి తే ।
తథేతి మునివృందేషు వసిష్ఠశ్చ యథావిధి ॥ 68

అంగీచకార స్త్రీదానం రాఘవేణ సమర్పితమ్ ।
చకితం చ తదాఽభూద్వై సర్వం స్థావరజంగమమ్ ॥ 69

దేహభానం న కస్యాసీత్తదాసీదతిచిత్రవత్ ।
తదా సీతాం మునిః ప్రాహ మత్పృష్ఠే తిష్ఠ బాలికే ॥ 70

మమార్పితాఽసి రామేణ త్వాం మన్యేఽహం సుతోపమామ్ ।
తన్మునేర్వచనం శ్రుత్వా సీతా సా ఖిన్నమానసా ॥ 71

రామన్యస్తేక్షణా సాధ్వీ మునేః పృష్ఠే హ్యుపావిశత్ ।
బభూవాశ్రుపూర్ణనేత్రా సా రోమాంచితవిగ్రహా ॥ 72

## వశిష్ఠులవారికి సీతను దానమిచ్చుట.

జనులకు శ్రీరాముని ఔదార్యమును చూపించెదను అని నిశ్చయించుకున్న వశిష్ఠుడు శ్రీరాముని జూచి, "రఘూత్తమా! ధేను దానమేమిచేసెదవు, ఇందువలన నాకు తృప్తి కలుగదు. నీవు ఒకవేళ సాలంకృతయగు సీతను దానమిచ్చినట్లైతే దానివలన నాకు తృప్తికలుగును. తక్కిన నూరుమంది స్త్రీలవల్లను కలుగనేరదు." అని చెప్పెను. ఆ మునిమాటను విని, జనులందరును మోము వాడి హాహాయని భయభ్రాంతులైరి. కొందరు, "ఏమన్నా వీడే ఇప్పుడు మిక్కిలి చాదస్తము గలవాడైనాడు?" అనియును, కొందరు, "హాహా ఈమునీంద్రుడు ఇప్పుడేమో వినోదమును చూపుచున్నాడు," అనియును, కొందరు, "శ్రీరాముని ధైర్యమును పరీక్షించుచున్నాడు," అనియును, కొందరు, "ఇప్పుడు రాముడు ఏమి చేయునో చూడ," వలయునని కొందరు చెప్పుకొనుచుండిరి. ఇంతలో శ్రీరాముడు గురు వాక్యమును గౌరవించి, నవ్వుచు, కనుసైగచేసి, సీతను పిలచి, గురుసన్నిధానమున సీతయొక్క ఎడమ చేతిని, తన చేత పట్టుకుని, సంతోషముతో వశిష్ఠుని ఆనందిప పరచుచు, సభికులు వినుచుండ, "నీకు సీతాదానముచేసెద. స్త్రీ దానమంత్రము చెప్పబడనీ," అని పలికెను. అట్లే అని వసిష్ఠముని అ సమూహమున యథావిధిగా శ్రీరామునిచే అర్పింపబడిన స్త్రీ దానమును అంగీకరించెను. అపుడు స్థావర, జంగమాత్మక ప్రపంచము దిగ్భ్రాంతినొందెను. ఒకనికైనా అప్పుడు తమ దేహస్మృతి కూడా

కలుగలేదు. అందరును బొమ్మలవలెయుండిరి. వశిష్ఠుడు సీతను చూచి, “బాలికా! నీవు శ్రీరామునిచే నాకు అర్పింపబడిన దానవు గాన, నా వెనుక నిలువుము. నిన్ను నాకూతురివలె ఎంచెదను అని ఆజ్ఞాపించెను. అందు చింతాక్రాంత స్వాంతయై సొగసుగా నిలచిన చూపులు కలిగి, ఆ సతి మునీంద్రుని వెనుక ప్రక్కలో నిలిచెను మరియు ఆమె కండ్లనీళ్ళు క్రమ్ముచుండ పులకాంకితయై ఉండెను.

తతో రామః పునః ప్రాహ వసిష్ఠం వినయాన్వితః ।
గృహాణ సురభిం చాపి సీతాయై హ్యర్పితాం పురా ॥ 73

మయా తోషేణ కైలాసే మన్మణేస్తోషదాయినీ ।
మయాఽపి దాతుమానీతా తచ్ఛ్రుత్వా గురురబ్రవీత్ ॥ 74

రామ రామ మహాబాహో తవోదార్యం చ దర్శితుమ్ ।
యాచితా తవ పత్నీయం మయా తేఽస్తు పునః శుభా ॥ 75

అస్యాః కురు తులామద్య సువర్ణేన రఘూత్తమ ।
అష్టవారం ప్రతులితం సీతయా రుక్మముత్తమమ్ ॥ 76

మాం దత్వేయం త్వయా గ్రాహ్యా పునః సపది మద్గిరా ।
అన్యత్కించిచ్ఛృణుష్వ త్వం వచనం యన్మయోచ్యతే ॥ 77

ధేనుం చింతామణిం సీతాం కౌస్తుభం పుష్పకం పురీమ్ ।
స్వయం రాజ్యమయోధ్యాయాం త్వం చేత్కస్య ప్రదాస్యతి ॥ 78

అగ్రే కదా తదాఽఽజ్ఞా మే త్వయా లుప్తా భవిష్యతి ।
మమాజ్ఞాభంగదోషేణ బహుక్లేశో భవిష్యతి ॥ 79

మదుక్తైః సప్తమీ రాజన్ వినా యద్యత్వమిచ్ఛసి ।
తత్తద్దదస్వ విప్రేభ్యో త్వం సుఖం హ్యవిచారతః ॥ 80

తద్గురోర్వచనం శ్రుత్వా తథేత్యుక్త్వా రఘూత్తమః ।
సీతాం తులాయామారోప్య సువర్ణేనాష్టసంఖ్యయా ॥ 81

**తులితాం ప్రతిజగ్రాహ గురోః సాధ్వీం స్మితాననామ్ ।**
**దివ్యాలంకారహీనాం తాం కంచుకీవస్త్రసంయుతామ్ ॥ 82**

**తదా నినేదుర్వాద్యాని వవర్షుః పుష్పవృష్టిభిః ।**
**సురస్త్రియో విమానస్థాః సీతారామౌ ముదాన్వితాః ॥ 83**

అంత ఆ రాముడు గురువును చూచి, "స్వామీ! ఈ కామధేనువును కూడా పరిగ్రహించండి. మునుపు కైలాసమున ఇది సీతకే ఇవ్వబడినది. నేనును దానమిచ్చుటకే తెచ్చితిని అని ప్రార్థింపగా వసిష్ఠుడు, "రఘువీరా! రామచంద్రా! మంగళాంగియగు ఈమెయొక్క తూకమునకు సరియైన సువర్ణమును ఎనిమిదిమారులు తూచి, ఆ బంగారును నాకిచ్చి, మరలా ఈ సభయందు నా మాటమీద నీ సీతను నీవు గ్రహింపుము. వేరొకమాటను నేను చెప్పెదను వినుము. ఈ అయోధ్యలో నీవు ఉండు నపుడు- కామధేనువును, చింతామణిని, సీతను, కౌస్తుభమును, పుష్పకమును, ఈ అయోధ్యను, రాజ్యమును ఎవ్వరికి ఇవ్వగలవు? ఇకమీద నీవేమైనా ఇచ్చితివా? నా యాజ్ఞను అపుడు ధిక్కరించిన వాడవగుదువు. నా ఆజ్ఞను భంగపరచినందున నీవు మిక్కిలి సంకటమును అనుభవించెదవు.

రాజారామ! నా మాటమీద నీవు పైన చెప్పిన సప్తపదార్థములు తప్ప తక్కినవాటిని ఎవ్వరేమడిగినను నీ ఇష్టప్రకారము ఇచ్చి సుఖింపుము," అని చెప్పెను. అపుడు శ్రీరాముడు గురు ఆజ్ఞానుసారముగా అట్లే అని సీతను త్రాసుమీదకూర్చుండబెట్టి, ఏనిమిదిరెట్లు బంగారముచేత సమానురాలుగా జేసి, మార్చుకొనెను. చూడముచ్చటగు రవికే, చీరలను ధరించి, దివ్యలంకారములు లేనిదియును అగు ఆ పతివ్రతను శ్రీరాముడు మరలా పరిగ్రహించినపుడు విమానములయందున్న దేవతా స్త్రీలు పూలవానను కురిపించిరి.

**పూర్వాధికానలంకారాన్ స్వదేహే జానకీ దదౌ ।**
**జనాః సర్వే సుసంతుష్టాస్తదాఽఽసన్ముదితాననాః ॥ 84**

**అథ సీతా పతిం నత్వా తత్పార్శ్వే సంస్థితాఽభవత్ ।**
**స్మితాననాఽఽనందమగ్నా లజ్జితా రామలోచనా ॥ 85**

**తతో రామోఽప్యనేకాని కృత్వా దానాని విస్తరాత్ ।**
**ఋత్విక్సదస్యముఖ్యాదీనానర్ఘ్యాభరణాంబరైః ॥ 86**

**స్వీయజ్ఞాతీన్నృపాన్మిత్రసుహృదోఽన్యాంశ్చ సర్వశః ।**
**అభీక్ష్ణం పూజయామాస వస్త్రాలంకారభూషణైః ॥ 87**

**సర్వే జనాః సులలితోన్మణికుండలస్త్ర**
**గుష్ణీషకంచుకదుకూలమహార్ఘహారాః ।**
**నార్యశ్చ కుండలయుగాలకవృందజుష్ట**
**వక్త్రశ్రియః కనకమేఖలయా విరేజుః ॥ 88**

**ఇతి శ్రీశతకోటిరామచరితాంతర్గతే, శ్రీమదానందరామాయణే, వాల్మీకీయే, ఆదికావ్యే, యాగకాండే, అవభృథోత్సవవర్ణనం నామ, అష్టమః సర్గః ॥**

మంగళ వాద్యములు వాయింపబడెను. శ్రీసీతారాములు ఆనందించిరి. సీత ముందుకన్నను అధికమగు దివ్యాలంకారములను ధరించెను. జనులందరును ఆహ్లాద వదనులును, సంతుష్ట అంతరంగులు అయిరి. పిదప సీతాదేవి శ్రీరామునికి నమస్కరించి, వారిప్రక్కనే స్వానందముచే, చిరునవ్వుతో రామునిపై కటాకటాక్షములు జారుచుండెను. సిగ్గుతో సుస్థితయై బరగుచుండెను. పిదప శ్రీరాముడును విస్తారముగా అనేక దానములను చేసెను. వస్త్రాభరణములచే ఋత్విక్ వర్యులను , సదస్సులోని ముఖ్యులను, మహామునులను చక్కగా అర్చించి, తన బంధువులను, రాజులను, మిత్రులను, దివ్య సత్కారములచే సత్కరించెను. అక్కడ ఉన్న పురుషులంతా పంచెలు, తలపాగలు, పుష్పహారములు, రత్నకుండలాది భూషణములు దివ్యవస్త్రాలను ధరించియుండిరి. స్త్రీలందరును చక్కని వస్త్రములను ధరించి, కాటుకాది అలంకారములతో ముఖసంపద నీరు వచ్చుచుండ బంగారు ఆభరణములు గలవారై మెరయుచుండిరి. (8)

***శతకోటిప్రవిస్తరమైన రామకథలో, శ్రీమద్వాల్మీకిమహర్షిచే రచింపబడిన, ఆనందరామాయణంలోని, యాగకాండలో, అవభృథ స్నానమును వివరించు ఎనిమిదవసర్గ ముగిసినది.***



# నవమః సర్గః-9వ సర్గ

అశ్వమేధాయాగ పరిసమాప్తి

**శ్రీరామదాస ఉవాచ**

**శ్రీరామోఽవబృథస్నాతో శంభుబ్రహ్మాదిభిః సురైః ।**
**రామం వేదస్తవైః స్తుత్వా ప్రత్యువాచ పురః స్థితః ॥ 1**

**అద్య ధన్యా వయం సర్వే యత్త్వాం స్నాతం సుమంగళమ్ ।**
**పశ్యామో వాజ్యవభృథే సీతయా బంధుభిః సహ ॥ 2**

**అస్మాకం హర్షకాలోఽయం దేవదేవ దయానిధే ।**
**తస్మాదయం సదా పుణ్యః శ్రేష్ఠకాలో భవిష్యతి ॥ 3**

## అయోధ్య, సరయు, రామతీర్థముల మాహాత్మ్యము.

శ్రీరామదాసు ఇట్లు చెప్పుచున్నాడు, "అశ్వమేధయాగ అవభృథ స్నానం ముగించిన శ్రీరాముని జూచి, శంకరుడు బ్రహ్మాది దేవతలతోడ వేదసూక్తులచే సంస్తుతించి ఎదుట నిలచి, శ్రీరామా! నీవు సీతతోను, తమ్ములతోను మంగళములగు అవభృథ స్నానముచేయుటను చూచిన మేమందరము ధన్యులము. దేవదేవుడగు దయానిధీ! మాకిది మిక్కిలి సంతోషసమయము. అందువలన ప్రతి యుగమున ఈ పుణ్యకాలము మిక్కిలి శ్రేష్ఠమైయుండును.

**త్వం చాప్యంగీకరుష్వాద్య దేహ్యస్మై సుబహూన్ వరాన్ ।**
**అన్యన్నశ్చాత్ర ప్రత్యబ్దం యేన తే దర్శనం భవేత్ ॥ 4**

**తథా కురు రఘుశ్రేష్ఠ తీర్థాయాస్మై వరాన్యద ।**
**అన్యాని చ త్వయా పూర్వం యాని భూమ్యాం కృతాని హి ॥ 5**

**యాత్రాకాలే సుతీర్థాని లింగాన్యపి నిజాఖ్యయా ।**
**తేషామపి వరానద్య వద త్వం మమ వాక్యతః ॥ 6**

**పురీషు శ్రేష్ఠాఽయోధ్యేయం త్వయా వాచ్యాఽద్య రాఘవ ।**
**నదీషు సరయూ శ్రేష్ఠా వరైః కార్యాఽద్య మద్గిరా ॥ 7**

తచ్ఛంభువచనం శ్రుత్వా ప్రహస్య రఘునందనః ।
హర్షకాలేఽబ్రవీద్వాక్యం యత్త్రైలోక్యోపకారకమ్ ॥ 8

యత్ ప్రార్థితం త్వయా శంభో తదేవ హృది మే స్థితమ్ ।
శృణుష్వ వచనం మేఽద్య యద్ధర్మాత్ప్రోచ్యతే శుభమ్ ॥ 9

సర్వేషామేవ మాసానాం శ్రేష్ఠశ్చాయం మధుర్భవేత్ ।
వైశాఖాత్ కార్తికః శ్రేష్ఠః కార్తికాన్మాఘ ఏవ చ ॥ 10

మాఘమాసాద్వరశ్చాయ చైత్రమాసో భవిష్యతి ।
చైత్రమాసేఽభవజ్జన్మ మమ యస్మాత్తథా పునః ॥ 11

వాజిమేధావభృథ్యేషు స్నానేనాపి విశేషతః ।
సర్వేషామధికశ్చాస్తు మధుస్తే వాక్యగౌరవాత్ ॥ 12

చైత్రమాసే కృతం దత్తం హుతం స్నాతం విచింతితమ్ ।
సర్వం కోటిగుణం ప్రోక్తమయోధ్యాయాం విశేషతః ॥ 13

సర్వాసు ప్రథమా చేయం పురీషు నగరీ మమ ।
అయోధ్యా ముక్తిదాత్రీ తు భవిష్యతి గిరా మమ ॥ 14

అన్యత్ర యత్కృతం పుణ్యం షష్టిసంవత్సరే శుభమ్ ।
తదత్ర దివసైకేన భవిష్యతి నృణాం సదా ॥ 15

శ్రీరామా! నీవు సంతోషించి ఇపుడు ఈ రామతీర్థముకు విశేష ఫలితాలనిచ్చే నిన్ను చూడగలిగిన మిక్కిలి మంచి వరములను అనుగ్రహింపుము. అంత మాత్రమే గాక, నీవు ఇంకను భూమిలో ఎన్ని తావులలో తీర్థములను కల్పించియుందువో ఎచటెచట శ్రీరామేశ్వర లింగములను ప్రతిష్ఠించి యుందువో, ఆ ప్రాంతాలలో అంతటా ప్రవర్తిల్లునట్లు నామాటమీద నీవు మంచి వరములను ఇమ్ము. నామాటమీద నదులలో సరయూనది, పట్టణములలో అయోధ్య నీ వరములచే మేలుగా ఉండవలయును." అని ప్రార్థించెను. అట్టి శివవాక్యమును విని శ్రీరాముడు తత్ సంతోష సమయమున నవ్వుచూ, "శంభూ! ముల్లోకములకు ఉపకారముగా ఏది మీచే ప్రార్థింపబడుచున్నదో ఆ సంగతియే

నా మనసున గలదు. నా మాటను వినుము. నేను సంతోషముగా శుభమును చెప్పుచున్నాను. అన్ని నెలల్లోను ఈ చైత్రమాసమే శ్రేష్ఠముగా ఉండును. వైశాఖము కన్నను కార్తీక మాసము శ్రేష్ఠము. కార్తీకముకన్నను మాఘమాసము శ్రేష్ఠము. మాఘము కన్నా ఈ చైత్రము అధికము ఎందువల్లననగా చైత్రముననే నేను అవతరించితిని. మరియు అశ్వమేధ అవభృథస్నానము కూడా చైత్రములోనే జరిగినది. కనుక ఈ వాక్య గౌరవము చేతను చైత్రమే మిక్కిలి శ్రేష్ఠముగా ఉండనీ. చైత్రమాసమున చేసిన దానము, హోమము, స్నానము, ధ్యానము ఇవన్నియు కోటింతలు అధికముగా ఫలితమునిచ్చును. అయోధ్యయందు మరీ విశేషముగా ఎంచబడును. ఈ నా అయోధ్యా నగరము గొప్పగా, ముక్తిప్రదముగా ఉండును. ఇతర స్థలములలో అరవై సంవత్సరములలో కలుగుపుణ్యము అయోధ్యలోని మానవులకు ఒక దినములోనే కలుగును.

**పరిణాం మధురా జ్ఞేయా రాజధానీ శుభప్రదా ।**
**త్వయాఽస్యై యాచితో యస్మాద్వరార్థమహమాదరాత్ ॥ 16**

**తవ వాక్యాద్గౌరవేణ తవ కాశ్యాః శతాధికా ।**
**భవిష్యతి పురీ చేయమయోధ్యా మమ వల్లభా ॥ 17**

**నదీషు సరయూశ్చేయం శ్రేష్ఠాఽస్తు వచనాన్మమ ।**
**సరయూసదృశీ నాన్యా నదీ భూతా భవిష్యతి ॥ 18**

**అస్యామపి మయా చేదం రామతీర్థం వినిర్మితమ్ ।**
**నిజతేజ ప్రతాపేన తీర్థేషు ముకుటోపమమ్ ॥ 19**

**భవిష్యతి న సందేహః సర్వపాతకనాశనమ్ ।**
**తథా యాని పృథివ్యాం హి యయా తీర్థాని వై పురా ॥ 20**

**లింగాన్యపి స్వీయనామ్నా కృతాని తాని శంకర ।**
**స్నానే దర్శనార్చాద్యైర్ముక్తిదాఽన్యత్ర సంతు వై ॥ 21**

**రామతీర్థే చైత్రమాసే ప్రత్యబ్దం భువి మానవైః ।**
**స్నాతవ్యం విధినా సమ్యక్ నియమైర్మమ వాక్యతః ॥ 22**

**యచ్ఛ్రేయశ్చాశ్వమేధేన యద్గోమేధేన వై ఫలమ్ ।**
**యత్ఫలం సోమయాగేన తచ్చైత్రేఽత్రావగాహనాత్ ॥ 23**

**సూర్యగ్రహే కురుక్షేత్రే యచ్ఛ్రేయః స్నానదానతః ।**
**తచ్ఛ్రేయః స్యాన్మధౌ స్నానాదయోధ్యాయాం సురేశ్వర ॥ 24**

**అయోధ్యాయాం రామతీర్థే సరయూజలసంస్థితాః ।**
**చైత్రస్నానం ప్రకుర్వాణాస్తే నరా మోక్ష భాగినః ॥ 25**

**యథా మాఘే ప్రయాగేహి స్నాతవ్యం సుఖమిచ్ఛతా ।**
**కార్తికేఽపి యథా కాశ్యాం పంచగంగాజలే స్మృతః ॥ 26**

**ద్వారకాయాం యథా ప్రోక్తా వైశాఖే చక్రతీర్థకే ।**
**అయోధ్యాయాం రామతీర్థే తథా చైత్రేఽవగాహనమ్ ॥ 27**

మంగళప్రదమగు ఈ అయోధ్య రాజధాని ముక్తిప్రధాన నగరమని గుర్తించునది. నీవు వరములను ప్రార్థించినందున నీ మాటమీద గౌరవముచే నాకు మిక్కిలి ప్రీతి ప్రాతమగు ఈ అయోధ్య నీయొక్క రాజధానియగు కాశీకన్నను నూరింతలు గుణాధికముగా ఉండును. ఇక నదులలో, నామాటమీద ఈ సరయూనది మిక్కిలిశ్రేష్ఠము. సరయూనదికి సమానమైనది కలుగనేరదు. దీనియందును నాచే నిర్మింపబడిన రామతీర్థము పరమోత్తమము. ఇది తమరి సాన్నిధ్యముచే సర్వపాప పరిహారకమై తీర్థములలో కిరీటమై యుండును. ఇందులో సందేహములేదు. శివా! ఈ భూమిపై నాచే ఏర్పాటు చేయబడిన రామతీర్థములును, శివలింగములును, క్షేత్రములును స్నాన, పూజన, సత్కారములచే అవి ఎచటెచట ఉన్నా ముక్తిప్రదములై యుండును. నా మాటమీద మానవులు ప్రతిసంవత్సరమూ చైత్రమాసమున ఈ రామతీర్థమున నియమములతో యథావిధిగా స్నానము చేయవలయును. ఇచటి చైత్రస్నానముచే, అశ్వమేధ ఫలముకలుగును, గోమేధ ఫలములను, సోమయాగ ఫలములను కూడా పొందగలరు. సూర్యగ్రహణ సమయమున కురుక్షేత్రమునందలి స్నాన, దానాదులచే కలుగు శ్రేయస్సు ఈ అయోధ్యా నగరమున చైత్రమాస స్నానముచే కలుగును. అయోధ్య, సరయు, రామతీర్థ చైత్రస్నానపరులు ముక్తిభాగులై యుందురు.సుఖాపేక్షగలవారు మాఘమాసమున ప్రయాగలో స్నానము చేసినట్లును, ద్వారకలో చక్రతీర్థస్నానమును వైశాఖమాసమున చేసినట్లును, కార్తీకమాసమున

కాశీపట్టణములో పంచగంగాతీర్థస్నానమును ఆచరించినట్లును, చైత్రమాసమున అయోధ్యరామతీర్థ స్నానమును మంగళప్రదముగా ఉన్నది. అందరును నా మాటమీద ఇట్లు ప్రవర్తించదగును.

కరణీయం నరైర్భక్త్యా వచనాన్మమ సర్వదా ।
సర్వేష్వపి చ మాసేషు ప్రథమః సకలైర్జనైః ॥ 28

ఏతావత్కాలపర్యంతం మార్గశీర్షః ప్రగీయతే ।
అద్యారభ్య మధుశ్చాయం ప్రథమః ఖ్యాతిమేష్యతి ॥ 29

యథా దేవేషు ప్రథమస్త్వం మహేశస్తథా మధుః ।
మాసేషు ప్రథమశ్చాస్తు తథాఽయోధ్యా పురీష్వపి ॥ 30

చైత్రే మాసే తు సంప్రాప్తే సర్వే దేవాః సవాసవాః ।
బహిర్జలం సమాశ్రిత్య తిష్ఠధ్వం హి మమాజ్ఞయా ॥ 31

ప్రత్యబ్దం చైత్రమాసేఽత్ర యథేదానీం సమాగతాః ।
ఆగంతవ్యం తథా సర్వైస్త్రైలోక్యాంతరవాసిభిః ॥ 32

జరఠైరాతురైః స్త్రీభిర్యేషాం యత్సన్నిధౌ మమ ।
రామతీర్థం ప్రగంతవ్యం సర్వత్ర భువి శంకర ॥ 33

చైత్రమాసేఽవగాహార్థం వచనాన్మమ సర్వదా ।
ఇతి రామవచః శ్రుత్వా గిరిజా ప్రాహ జానకీమ్ ॥ 34

సీతే వరాస్త్వయా దేయా ఇదానీం వచనాన్మమ ।
నారీణాం చ హితార్థం హి సర్వలోకోపకారకాః ॥ 35

పార్వత్యా వచనం శ్రుత్వా జానకీ ప్రాహ సాదరమ్ ।
పృథివ్యాం మమ తీర్థాని యాని సంతి సహస్రశః ॥ 36

అత్రాపి చ మహచ్ఛ్రేష్ఠం యత్ర స్నాతం మయాఽధునా ।
తేషు చైత్రతృతీయా యా యావద్వైశాఖసంభవా ॥ 37

సితా తృతీయాఽఽక్షయ్యాఖ్యా తావత్ స్త్రీభిస్తు సాదరమ్ ।
స్నాతవ్యం సీతలాగౌరీసంజ్ఞకం స్థానముత్తమమ్ ॥ 38

సౌభాగ్యదం మాసమేకం పుత్రపౌత్రప్రవర్ధనమ్ ।
సర్వత్ర రామతీర్థస్య వామే తీర్థం మమాస్తి హి ॥ 39

ఇతి దత్వా వరాన్సీతాఽఽఽస్తీత్తూష్ణీం రామసన్నిధౌ ।
తతో రామం గురుః ప్రాహ గంతవ్యం యజ్ఞమంటపమ్ ॥ 40

తద్గురోర్వచనం శ్రుత్వా తథేత్యుక్త్వా రఘూద్వహః ।
ఆరురోహ రథం శీఘ్రం సీతయార్త్విగ్జనైః సహ ॥ 41

పరమేశ్వరా! ఇదివరకు మార్గశీర్షము మొదటిగా ఎంచబడుచున్నది. ఇకమీదట చైత్రమాసము మొదటిదిగా ఎంచబడును. దేవతలలో నీవు ఎట్లు మొదటివాడవో, అట్లు మాసములలో చైత్రము మొదటిది. అట్లే పట్టణములలో అయోధ్య గొప్పది. ఇంద్రాదులగు దేవతలారా! మీరందరును చైత్రమాసము రాగానే నా ఆజ్ఞానుసారముగా బహిర్జలమును ఆశ్రయించి ఉండవలయును. ఎందువలననిన ప్రతిసంవత్సరమునను చైత్రమాసమున ఇప్పుడు ఎట్లువచ్చినారో అట్లే ముల్లోకములలో ఉండు ముసలివాండ్రు, ఆర్తులు, స్త్రీలు అందరును వచ్చెదరు. శంకరుడా! భూమిలో అంతటా అందరును నా రామతీర్థమునకు పోవలసినది.

ఇట్లనిన శ్రీరాముని మాటలను విని, పార్వతీ దేవి సీతను చూసి, "జానకీ! నా మాటమీద నీవును లోకోపకారముగా స్త్రీలకు హితములగు వరములను ఇమ్ము," అని ప్రోత్సాహపరచగా, ఆ జనకపుత్రి, పార్వతీదేవీ పలుకులను విని సాదరముగా ఇట్లనెను. "వేలకొలదిగా నాయొక్కతీర్థములు భూమిలో ఎన్నిగలవో వానిలోను ఇప్పుడు స్నానముచేసిన పరమోత్తమమగు ఈ స్థలమున చైత్ర శుక్ల తృతీయ మొదలు, వైశాఖ శుక్ల అక్షయతృతీయ వరకు నెలరోజులవరకు ఉత్తమమగు సీతల గౌరి సంజ్ఞకమైన స్నానమును సాదరముగా స్త్రీలు చేయవలసినది. ఆ నెలరోజులు వారికి సౌభాగ్యప్రదమును పుత్ర, పౌత్రాది అభివృద్ధి ఇచ్చునట్టిదియై ఉన్నది. అంతట శ్రీరామతీర్థమునకు ఎడమప్రక్కన నా తీర్థము ఉండును." అని ఇట్లు వరమునిచ్చి, సీత పతిసన్నిధిన ఊరకే ఉండెను. (40) అంత ఆ వసిష్ఠుడు ఇక యజ్ఞమంటపమునకు వెడలవలయుననెను. వెంటనే శ్రీరాముడు "అట్లే అని" గురువాక్యమును గౌరవించుచు, త్వరగా సీతతో రథమును ఎక్కెను, ఋత్విక్ జనులును రథమును ఎక్కిరి.

తతో నేదుర్దుందుభయో భేరీణాం నిఃస్వనాస్తతః ।
మృదంగపణవాదీనాం మహాఘోషాః సమంతతః ॥ 42

వేదఘోషాశ్చ సర్వత్ర జయశబ్దా ద్విజేరితాః ।
బభూవుర్మంత్రశబ్దాశ్చ ననృతుశ్చాప్సరోగణాః ॥ 43

నానోత్సవైః పూర్వవచ్చ కౌతుకాని సమంతతః ।
పశ్యన్యయౌ రామచంద్రః శనైరధ్వరమంటపమ్ ॥ 44

అవరుహ్య రథాచ్ఛీఘ్రం నీత్వాఽగ్నిం ప్రక్షిపత్పునః ।
యజ్ఞకుండే రామచంద్రః సీతయార్త్విగ్జనైః సహ ॥ 45

పూర్ణాహుతిం తతో దత్వా వస్త్రైరాభరణైః ఫలైః ।
కృత్వాఽగ్నం పూజనం చాపి యజ్ఞపాత్రాణి రాఘవః ॥ 46

తతో విసర్జయామాస యజ్ఞాన్తే దక్షిణాం బహు ।
దాతుం తానృత్విజః సర్వాన్ సౌమిత్రిం రాఘవోఽబ్రవీత్ ॥ 47

కోశాగారం లక్ష్మణాద్యాః సర్వే మే ఋత్విజస్త్వయా ।
నీత్వా దూతాన్నిరాకృత్య తూష్ణీం స్థేయం తతః పరమ్ ॥ 48

యథేచ్ఛయాఽమితం యేన గృహీతముత్తమం వసు ।
తస్యాశ్రమే ప్రాపణీయం వాహనాద్యైశ్చ తత్త్వయా ॥ 49

తతో మునిజనాన్ సర్వాన్ దేయం విపులహస్తతః ।
తద్రామవచనం శ్రుత్వా లక్ష్మణోఽపి తథాకరోత్ ॥ 50

తతో విసర్జయామాస భోజయిత్వా రఘూత్తమః ।
ఋత్విగ్జనాన్ సంవృణీతాన్వాజీమేధాఖ్యకర్మణి ॥ 51

తతో రామోఽమరాన్సర్వాన్ శివాద్యాన్విధిర్నిజైః ।
పూజయామాస విధివద్వస్త్రాలంకారవాహనైః ॥ 52

**దదౌ కేశాన్స్తురగాన్ కేషాం స శిబికాం దదౌ ।**
**కేషాం రథాన్ గజాన్ కేషాం దదౌ వస్త్రాణ్యపీశ్వరః ॥ 53**

**ఏవం పృథ్వీపతిశ్చాపి సావరోధాన్ ససేవకాన్ ।**
**వస్త్రైరాభరణైర్యానైః పూజయామాస భోజనైః ॥ 54**

## శ్రీరాముడు యజ్ఞమంటపమునకు విచ్చేయుట

ఇంతకుముందు చెప్పినట్లు, మంగళవాద్య ధ్వనులును, వేదఘోషలును, జయశబ్దములును, కోలాహలములును అంతట అతిశయించుచుండ, నృత్య గీతాది మహోత్సవములు జరుగుచుండ, శ్రీరాముడు తిన్నగా మార్గమున వేడుకలను జూచుచు, యజ్ఞమంటపమునకు తిరిగివచ్చెను. త్వరగా రథమునుండిదిగి, సీతతోను, ఋత్విక్కులతోను, అగ్నిశాలలో మరలా అగ్నిని ప్రతిష్ఠించెను. (45)

## అశ్వమేధ యాగ పరిసమాప్తి.

పిదప శ్రీరాముడు వస్త్రాభరణ ఫలాదులచే అగ్నిలో పూర్ణాహుతిని సమర్పించి, అగ్ని పూజనమును చేసి, యజ్ఞపాత్రములను విసర్జించి, యజ్ఞానంతమున ఋత్విక్ జనులకు విశేష దక్షిణలను ఇవ్వదలచి లక్ష్మణుని జూచి, "తమ్ముడా! ఇప్పుడీ ఋత్విక్కులను పిలుచుకొనిపోయి, దూతలను దూరముగా పొమ్మని, వీరిని కోశాగారమున విడచి, నీవు ఊరకే నిలచి ఉండుము. వారివారి మనసుకు తోచినంత వారువారు సువర్ణమును తీసుకొనినిమ్ము. పిదప వారి ఆశ్రమాలకు వాటివాటిని వాహనాదులమీద పంపుము. తక్కిన మునీంద్రులకు చేతినుండి విశేషముగా ఇచ్చి నీవు తృప్తిపరుపుము. ఆ శ్రీరామ వాక్యానుసారముగా లక్ష్మణుడు అట్లే జరిపెను. పిదప శ్రీరాముడు తాను యజ్ఞమునకై వరించి యుండిన ఋత్విక్ జనులను అందరికి చక్కగా భోజనము పెట్టి, ఉద్వాసనముచేసెను. అంత దేవతలను, శంకరాదులను, వారివారి వైభవానుసారముగా దివ్య వస్త్రాభరణాది అలంకారములచే పూజించెను. అందులో కొందరికి గుఱ్ఱములను, కొందరికి ఏనుగులను, కొందరికి పల్లకీలను, శాస్త్రములను కూడా ఇచ్చెను.

**తతో రామః స్వశరీరే దివ్యవస్త్రాణి సందదౌ ।**
**తదా తం పూజయామాసుర్బలిభిర్విబుధా నృపాః ॥ 55**

సరిత్సముద్రా గిరయో నాగా గావః ఖగా మృగాః ।
ద్యౌః క్షితిః సర్వభూతాని సమాజహ్రురుపాయనమ్ ॥ 56

సీతయా స మహారాజః సువాసాః సాధ్వలంకృతః ।
బంధుభిః సేవ్యమానః స విరేజేఽగ్నిరివాపరః ॥ 57

తస్మై జహార ధనదో హైమం వీరవరాసనమ్ ।
వరుణః సలిలస్రావి హ్యాతపత్రం శశిప్రభమ్ ॥ 58

వాయుశ్చ వాలవ్యజనే ధర్మః కీర్తిమయీం స్రజమ్ ।
ఇంద్రః కిరీటముత్కృష్టం దండం సంయమనం యమః ॥ 59

బ్రహ్మా బ్రహ్మమయం వర్మ భారతీ హారముత్తమమ్ ।
దశచంద్రమసిం రుద్రః శతచంద్రమథాంబికా ॥ 60

సోమోఽమృతమయానశ్వాంస్త్వష్టా రూపాశ్రయం రథమ్ ।
అగ్నిరాజగవం చాపం సూర్యో రశ్మిమయానిషూన్ ॥ 61

భూః పాదుకే యోగమయ్యౌ ద్యౌః పుష్పావలిమన్వహమ్ ।
నాట్యం సుగీతం వాదిత్రమంతర్ధానం చ ఖేచరాః ॥ 62

ఋషయశ్చాశిషః సత్యాః సముద్రః శంఖమాత్మజమ్ ।
సింధవః పర్వతా నద్యో రథవీథీర్మహాత్మనః ॥ 63

తతో దదుర్నృపాః సర్వే స్యందనాంస్తురగాన్ గజాన్ ।
శిబికాగోవృషాన్ ఖడ్గాన్ దాసీర్దాసోష్ట్రఖేచరాన్ ॥ 64

సీతాయై నృపపత్న్యశ్చ దేవపత్న్యః సహస్రశః ।
వస్త్రాలంకారయానాని మాంగల్యాన్యథ కంచుకీః ॥ 65

క్రీడోపకరణాదీని దదుస్తాః పక్షిపంజరాన్ ।
తతస్తైః పూజితః సర్వైః సీతయా రఘునాయకః ॥ 66

**ఆరురోహ రథం దివ్యం వహ్నినా వందిభిః స్తుతః ।**
**స్వస్త్రీభిః నృపపత్నీభిర్విమానేన మునీశ్వరాః ॥ 67**

## యజ్ఞమునకు వచ్చిన దేతలు, రాజులు సీతారాములను సత్కరించుట.

శ్రీసీతారాములు రాజులను, వారివారి రాణీవాసములను, పరివారములను కూడా వస్త్రాభరణ భోజనాదులచే సత్కరించెను.(55) అప్పుడు అక్కడ చేరియుండిన దేవతలు, రాజులు, నదీదేవతలు, సముద్రదేవతలు, గిరిదేవతలు, నాగులు, గోదేవతలు, ఖగ, మృగాది దేవతలు, భూతదేవతలు, అందరును శ్రీరాములవారికి కానుకలు సమర్పించిరి. మహారాజగు శ్రీరాముడు సీతతో చక్కగా అలంకరింపబడినవాడై, తమ్ములచే సేవింపబడుచు, అపరాజ్ఞిమూర్తివలే రారాజించుచుండెను. అపుడు కుబేరుడు సువర్ణ వీరాసనములను, వరుణుడు నీళ్ళంటని చంద్రప్రభయగు ఛత్రమును, వాయుదేవుడు చామరములను, ధర్మదేవత కీర్తిమయమగు పుష్పమాలికను, ఇంద్రుడు ఉత్తమమగు కిరీటమును, యముడు సమ్యము అనబడు దండమును, బ్రహ్మ వేదాత్మకమగు కవచమును, సరస్వతి మేలైన హారమును, రుద్రుడు దశచంద్ర ఖడ్గమును, పార్వతి శతచంద్ర ఖడ్గమును, చంద్రుడు అమృతమయములగు గుళ్ళములను, త్వష్ట బ్రహ్మరూపాశ్రయమగు రథమును, అగ్ని భట్టారకుడు ఆజగాన మనే ధనస్సును, సూర్యుడు కిరణాత్మక బాణమును, భూదేవి యోగమయ పాదుకలను, స్వర్గదేవత నిత్య పుష్పమాలికను, ఖేచరులు నృత్య, గీత, వాద్య వస్త్రాదులను సమర్పించిరి. మునులు సత్యాశీర్వాదములను, సముద్రుడు తనయందు పుట్టిన శంఖమును, సింధుపర్వత నదీ దేవతలు రథవీధులను అనగా ప్రతిహత రథవేగ శక్తులను, రాజులందరును రథ, గజ, తురగ, పదాతి, గో, వృష, పల్లకీలను, దాసీదాస వర్గములను, ఖడ్గాది ఆయుధములను, క్రీడా సామాగ్రులగు పక్షుల గూళ్ళు, మొదలైనవాటిని ఇట్లు సర్వులును వారివారికి శక్తికి తగిన ఉచితములగు కానుకలను శ్రీసీతారాములవారికి సమర్పించిరి. (66) అందరిచే చక్కగా పూజింపబడి శ్రీరాముడు సీతతో అగ్నిహోత్రములను తీసికొని, జనులు నమస్కరించుచుండగా దివ్యరథమును ఎక్కెను.

**విహాయసా యయుః సర్వేఽయోధ్యాయాం నృపతేర్గృహమ్ ।**
**తతో రామో రథేనైవ పూర్వోక్తైరుత్సవైః శనైః ॥ 68**

**వివేశ నగరీం రామః స్తుతః సూతైశ్చ మాగధైః ।**
**ఛత్రం దధార సౌమిత్రిర్ముక్తాజాలవిరాజితమ్ ॥ 69**

భరతస్తాలవ్యజనం శత్రుఘ్నశ్చామరద్వయమ్ ।
తాంబూలపాత్ర సుగ్రీవస్తోయపాత్రం తు వాయుజః ॥ 70

నలః ష్ఠీవనపాత్రం చ వాలిజో ముకురం వరమ్ ।
వాసః కోశం రాక్షసేంద్రో ధూపపాత్రం హి జాంబవాన్ ॥ 71

నానాఫలానాం పాత్రాణి పూజాపాత్రాణ్యనేకశః ।
సుగంధద్రవ్యపాత్రాణి దధుస్తే మంత్రిసత్తమాః ॥ 72

ఏవం సుగంధివస్తూని ప్రక్షిపన్ వారయోషితామ్ ।
వృందేషు సీతయా రామో విరేజై స్యందనే స్థితః ॥ 73

సుగంధ రాగపూర్ణైశ్చ జలయంత్రైః కరే ధృతైః ।
వారాంగణానాం వస్త్రాణి నృపాదీనాం చ రాఘవః ॥ 74

చిత్రితాన్యకరోద్రాగైః కింశుకానీవ మాధవే ।
స్నేహైః సుగంధై రాగాద్యైరార్ద్రవస్త్రేషు రాఘవః ॥ 75

క్షిప్త్వా పరిమళాదీని చిత్రితాన్యకరోత్పునః ।
నర్తత్సు వారయోషిత్సు వాద్యేషు నినదత్సు చ ॥ 76

సువత్సు వందివృందేషు పుష్పవృష్టివిరాజితః ।
యయౌ రాజగృహద్వారం రామో రాజపథా శనైః ॥ 77

మార్గే కుంభప్రదీపైశ్చ దధ్యోదనవినిర్మితైః ।
బలిదీపైః పూర్ణకుంభైః రాజమార్గే పురస్త్రియః ॥ 78

చక్రుర్నీరాజనం రామం స్వస్త్యర్థం సీతయా యుతమ్ ।
అవరుహ్య రథాద్రామో సీతయాఽగ్నిం నిజే గృహే ॥ 79

## శ్రీసీతారాములు రాజమందిరమునుచేరి, సుఖించుట.

తక్కిన రాజాది సమస్త పరివారములును పుష్పక విమానమును ఎక్కి వెడలెను. అంత శ్రీరాముడు రథముమీదనే ముందుచెప్పబడినట్లు మహావైభవములతో తిన్నగా అయోధ్యలో ప్రవేశించెను. వంది

మాగదులు పొగుడుచుండిరి. లక్ష్మణుడు మౌక్తిక ఛత్రమును పట్టెను. భరతుడు తాళవృతమును, శత్రుఘ్నుడు చామరములను, సుగ్రీవుడు తాంబూల కరండికను, ఆంజనేయుడు జలపాత్రను, నలుడు ఉమ్మిగిన్నెను. అంగదుడు దర్పణమును, విభీషణుడు వస్త్రపేటికను, జాంబవంతుడు ధూప పాత్రమును, మంత్రివరులు వివిధ ఫల పాత్రములను, పూజాపాత్రములను పరిమళపదార్ధ పాత్రములను ధరించి వచ్చుచుండిరి. వారాకాంతల బృందము నృత్యము చేయుచుండెను. శ్రీరాముడు సీతతో ప్రయాణిస్తుండగా జనులు సుగంధ చూర్ణాదులను చల్లుచుండిరి. శ్రీరాముడు రాజుల యొక్కయు, వారాంగనలయొక్కయు, వస్త్రాభరణములను తన చేతితో జలయంత్రాదులతోను, పరిమళ ద్రవ్యాదులతోను వారివారి వస్త్రాలంకారాదులపై చల్లుచుండగా, అవి రంగులుమారుచుండెను.

**స్థాప్య స్వీయసభాం గత్వాఽఽరురోహ స్వీయమాసనమ్ ।**
**తతస్తే పార్థివాః సర్వే ప్రణేమూ రఘునందనమ్ ॥ 80**

**రాజ్ఞా ముకుటరత్నౌఘప్రభాభిః పదపంకజే ।**
**విరేజతూ రాఘవస్య తదా సింహాసనోపరి ॥ 81**

**ముకుటస్థావతంసానాం పరాగైః పూజితే నృపైః ।**
**ప్రాపతుర్నితరాం శోభాం రక్తోత్పలనిమే పరే ॥ 82**

**సీమతస్థచంద్రసూర్యరత్నమాణిక్యదీప్తిభిః ।**
**సురపార్థివపత్నీనాం సీతాయాః పదపంకజే ॥ 83**

**విరేజతుః పరాగైశ్చ కేశబంధప్రసూనజైః ।**
**సురపార్థివపత్నీభిః పూజితే కనకోజ్జ్వలే ॥ 84**

**తతః సభాయాం శ్రీరామం స్తుత్వా దేవైర్మహేశ్వరః ।**
**శ్రీరామస్తవరాజేన శ్రీరామేణాపి పూజితః ॥ 85**

**ప్రాప్యాజ్ఞాం రామచంద్రస్య సావరోధైః సురాదిభిః ।**
**ప్రస్థానం స్వస్థలం గంతుం చకార వృషభస్థితః ॥ 86**

**నృపస్త్రియోఽపి సీతాయాః ప్రాప్యాజ్ఞాం పూజితాస్తథా ।**
**యానాన్యారురుహుః సర్వాస్స్వయోధ్యాయా వినిర్యయుః ॥ 87**

**అథ తే పార్థివాద్యాశ్చ ప్రాప్యాజ్ఞాం రాఘవస్య చ ।**
**సావరోధాః ససైన్యాశ్చ స్వీయరాజ్యాని వై యయుః ॥ 88**

**యయౌ శివోఽపి కైలాసం సత్యలోకం విధిర్యయౌ ।**
**ఇంద్రాద్యా నిర్జరాః సర్వే స్వర్గలోకం యయుర్ముదా ॥ 89**

**అథర్త్విజో మహాశీలాః సదస్యా బ్రహ్మవాదినః ।**
**సర్వే మునీశ్వరాద్యాశ్చ స్వధామాని యయుస్తదా ॥ 90**

వాద్యములు మ్రోగుచుండగ, గణికులు ఆడుచుండగ, స్తోత్రపాఠకులు పొగడుచుండగ, గాయకులు పాడుచుండగ, రాముడు రాజమార్గమున తిన్నగా వచ్చి రాజమందిరమునకు చేరుకొనెను. దారిలో దీపకలశములచే, దధ్యాన్న బలిదీపములచే, పూర్ణకలశములచే, పురస్త్రీలు సీతారాములను మంగళప్రదముగా హారతులు ఇచ్చుచుండిరి. అంత శ్రీరాముడు రథమునుండి దిగి, సీతచే నిజాగారమున అగ్ని ప్రతిష్ఠచేయించి, సభకువచ్చి దివ్యసింహాసనమును అలంకరించెను. అంత అచట రాజులందరును శ్రీరామునికి నమస్కరించిరి. సింహాసనముపై కూర్చున్న శ్రీరాముని పాదారవిందములు నమస్కరించుచుండు రాజులయొక్క కిరీటాలు రత్నప్రభలచే వెలిగిపోవుచుండెను. వారి చెవితాటంకముల రాపిడిచే శ్రీరాముని పాదపద్మములు ఎఱ్ఱబడినవి. సింహాసనాసీన యగు సీతయొక్క చరణకమలములు నమస్కరించుచుండు దేవస్త్రీలయొక్క సీమంత, చంద్ర, సూర్యాభరణ రత్నకాంతులు నిండి, కేశబద్ధ ప్రసూనపరాగములచే అర్చింపబడి, కనకమయములై వెలిగినవి. (84)

## దేవీ దేవతలు వారివారి స్థానములకు వెడలుట.

తరువాత సభలోఉన్న శ్రీరామచంద్రుని జూచి, శ్రీసదాశివుడు– శ్రీరామ స్తవరాజముచేతను, వేదములచేతను స్తుతించి, శ్రీరామునిచే పూజింపబడి, శ్రీరామునివద్ద శెలవుతీసుకుని, సకలదేవతల తోడ ప్రయాణముచేసి, వృషభారూఢుడై తనవాసమునకు వెడలెను. రాజపత్నులును, రాజులును, శ్రీసీతారాముల ఆజ్ఞనొంది, తమ సైన్యములతో అయోధ్యను విడిచి, వారివారి రాజ్యములకు వెడలిరి. శివుడు కైలాసమును, బ్రహ్మ సత్యలోకమును, ఇంద్రాదులు స్వర్గలోకమును చేరిరి. ఋత్విక్కులును, మహాత్ములు అగు మునీంద్రులును వారివారి ఆశ్రమములకును వెడలిరి.

తతో రామః పూర్వవచ్చ శశాస జగతీతలమ్ ।
రేమే జనకనందిన్యా చిరకాలం యథాసుఖమ్ ॥ 91

వర్షాంతరేణ కాలేన వాజిమేధాః పృథక్ పృథక్ ।
ఉత్తరోత్తరతః శ్రేష్ఠా వింశద్వర్షైః కృతా దశ ॥ 92

ఇత్థం శ్రీరామచంద్రేణ దశమే తురగాధ్వరే ।
ప్రతిపాల్య గురోర్వాక్యం సర్వస్వమపి భూసురాన్ ॥ 93

దత్తం కిల మహారాజ్ఞ తథా చ దిక్చతుష్టయమ్ ।
ఋత్విగ్భ్యో దక్షిణార్థం హి దత్త చేతి మయా శ్రుతమ్ ॥ 94

ఋత్విగ్భిస్తత్పునర్దత్తం రాఘవాయైవ సాదరమ్ ।
కృపాలుభిః పాలనార్థమితి శిష్యానుశ్రూయతే ॥ 95

ఏవం శిష్య త్వయా పృష్టం రామచంద్రస్య మంగళమ్ ।
చరితం తన్మయా కించిత్తవోక్తం యజ్ఞసంభవమ్ ॥ 96

ఇదం యః ప్రాతరుత్థాయ యాగకాండ మనోరమమ్ ।
పఠిష్యతి నరః పుణ్యం సర్వాన్ కామానవాప్నుయాత్ ॥ 97

పుత్రార్థీ ప్రాప్నుయాత్పుత్రం ధనార్థీ ధనమాప్నుయాత్ ।
యాగకాండమిదం శ్రుత్వా వాజిమేధఫలం లభేత్ ॥ 98

హోమకాలే శ్రాద్ధకాలే చాతుర్మాస్యాదికేష్వపి ।
జపధ్యానార్చనారంభే పూర్వం నిత్యం పఠేదిదమ్ ॥ 99

రమ్యం పవిత్రం రఘునాయకస్య
శ్రీమచ్చరిత్రం తురగాధ్వరోద్భవమ్ ।
పఠంతి శృణ్వంతి జనాః సుపుణ్యదం
లభంతి నైజం ఖలు వాంఛితం హృది ॥ 100

**ఇతి శ్రీశతకోటిరామచరితాంతర్గతే, శ్రీమదానందరామాయణే, వాల్మీకీయే, ఆదికావ్యే, యాగకాండే, రామోత్తరయాత్రా నగరప్రవేశో నామ, నవమః సర్గః ॥**

## ఇతి యాగ కాండః సమాప్తః ॥

అంత ఆ శ్రీరాముడు యథాపూర్వముగా లోకమును పరిపాలించుచుండెను. జానకీదేవితో యథాసుఖముగా చిరకాలము రమించుచుండెను. పిదప క్రమముగా ఇరువది సంవత్సరములలో ఉత్తరోత్తర మహోత్సవాతిశయముగా పది అశ్వమేధాయాగములను ఆచరించెను. ఇట్లే శ్రీరామ చంద్రుడు పదియవ వాజీమేధమున వశిష్ఠులవారి వచనమును పరిపాలించుచు, తన సర్వస్వమును నాలుగుదిక్కులలోని సర్వభూమిని ఋత్విక్ జనులకు దక్షిణగా ఇచ్చెననియును, పిదప ధర్మ పరిపాలనకై వారందరిచే ఆ భూమి శ్రీరామచంద్రునికే సమర్పింపబడినదనియు వినుచున్నాను.

శిష్యుడగు విష్ణుదాసా! వినుము. నీవడిగిన శ్రీరామచంద్రుని వాజీ మేధాధ్వర మంగళ వృత్తాంతము నీకు చెప్పితిని. ఈ యాగకాండమును ప్రొద్దునలేచి ఎవ్వడు భక్తితో పఠించునో వాడు సమస్త కోరికలను తీర్చుకొనగలడు. పుత్రులను కావలసినవారు పుత్రులను, ధనమును కావలసినవారు ధనమును పొందగలరు. ఈ యాగకాండమును పఠించినవారు అశ్వమేధ యజ్ఞఫలమును పొందుదురు. హోమసమయమున, శ్రాద్ధాకాలమున, చాతుర్మాస్యాది కాలములలోను, జప ధ్యాన పూజా సమయములలోను మొదట దీనిని పఠించవలయును. శ్రీరాముని అశ్వమేధయాగోద్భవమైన దివ్య మంగళచరితమును పుణ్యప్రదమని చదివిన, వినిన జనులు తమ మనోరథములను పొంది, శ్రీరామానంద రామానుగ్రహముచే ఆనందించుచుందురు.

***శతకోటిప్రవిస్తరమైన రామకథలో, శ్రీమద్వాల్మీకిమహర్షిచే రచింపబడిన, ఆనందరామాయణంలోని, యాగకాండలో, శ్రీసీతారాములు యాగానంతరము నగరములో ప్రవేశించు ఘట్టమును వివరించు, తొమ్మిదవ సర్గ ముగిసినది.***

**ఇట్లు వాల్మీకి ప్రోక్తమగు ఆనందరామాయణంబున యాగకాండ సమ్పూర్ణమైనది.**



# 4. విలాస కాండ వివరములు

| సర్గ. | శ్లోకాలు |
|---|---|
| 1. | 90 |
| 2. | 74 |
| 3. | 82 |
| 4. | 92 |
| 5. | 74 |
| 6. | 57 |
| 7. | 53 |
| 8. | 99 |
| 9. | 57 |

**మొత్తం 9 సర్గలు, 678 శ్లోకాలు**



# ప్రథమః సర్గః-1వ సర్గ

శ్రీ రామదాసు-శ్రీరామ స్తవరాజమును ఉపదేశించుట.

విష్ణుదాస ఉవాచ
గురో తే ప్రష్టుమిచ్ఛామి తద్వదస్వ సవిస్తరమ్ ।
స్తుతో రామః శివేనాత్ర యేన రామస్తవేన హి ॥ 1

తం రామస్తవరాజం మే విస్తరేణ ప్రకాశయ ।
శ్రీశివ ఉవాచ
ఇతి శిష్యవచః శ్రుత్వా రామదాసోఽబ్రవీద్వచః ॥ 2

శ్రీరామదాస ఉవాచ
సమ్యక్ పష్టం త్వయా వత్స సావధానమనాః శృణు ।
ప్రోచ్యతే రామచంద్రస్య స్తవరాజో మయాఽధునా ॥ 3

యత్పరం యద్గుణాధారం యజ్జ్యోతిరమలం శివమ్ ।
తదేవ పరమం తత్త్వం కైవల్యపదదాయకమ్ ॥ 4

శ్రీరామేతి పరం జాప్యం తారకం బ్రహ్మసంజ్ఞితమ్ ।
బ్రహ్మహత్యాదిపాపఘ్నమితి వేదవిదో విదుః ॥ 5

శ్రీరామ రామ రామేతి యే వదంత్యపి సర్వదా ।
తేషాం భుక్తిశ్చ ముక్తిశ్చ భవిష్యతి న సంశయః ॥ 6

స్తవరాజః పురా ప్రోక్తః శివేన పరమాత్మనా ।
తమహం సంప్రవక్ష్యామి హరిధ్యానపురస్సరమ్ ॥ 7

తాపత్రయాగ్నిశమనం సర్వాఘౌఘనికృంతనమ్ ।
దారిద్ర్యదుఃఖశమనం సర్వసంపత్ప్రదాయకమ్ ॥ 8

**విజ్ఞానఫలదం పుణ్యం మోక్షైకఫలదాయకమ్ ।**
**నమస్కృత్య ప్రవక్ష్యామి రామం కృష్ణమనామయమ్ ॥ 9**

విష్ణుదాసు అడుగుచున్నాడు, "గురూత్తమా! ఏ శ్రీరామ స్తవముచే శంకరుడు శ్రీరామచంద్ర స్వామిని స్తుతించెనో, ఆ రామస్తవరాజమును విస్తారముగా నాకు చెప్పవలయును," అని ప్రార్థించెను.

శివుడు చెప్పుచున్నాడు. పార్వతీ! విష్ణుదాసు అడిగిన ఈ ప్రశ్నకు రామదాసు ఇట్లు సమాధానము చెప్పుచున్నాడు. (2)

శ్రీరామదాసు ఇట్లు చెప్పుచున్నాడు, "బాలుడా! చక్కగా అడిగితివి. ఏకాగ్రచిత్తుడవై వినుము. ఆ రామచంద్ర స్తవరాజమును చెప్పెదను. (3)

## శ్రీరామ స్తవరాజ స్తుతి

అవ్యక్తమును, శబలమై త్రిగుణాధారమును, శుద్ధచిదాత్మకము, నిత్యమంగళము అగు పరబ్రహ్మమే ముక్తినిచ్చునట్టిది. (4) అది వ్యాపకమగుటచే బ్రహ్మసంజ్ఞమునందిన జన్మదుఃఖ నివారములగుటచే తారకమనబడిన 'శ్రీరామ' అను పరమమంత్రమును జపించవలయును. అందువలన బ్రహ్మహత్యాది సమస్త దురితములు పరిహరింపబడునని తత్త్వజ్ఞులు తెలియజేయుదురు. (5) శ్రీరామా! శ్రీరామా! శ్రీరామా! అని ఎవరు నిరంతరము పఠించెదరో వారికి ఇహలోకమున భుక్తియును, పరలోకమున ముక్తియును తప్పక కలుగును. ఇందులో సంశయము లేదు. (6) మునుపు పరమాత్మయగు పరమేశ్వరునిచే చెప్పబడిన శ్రీరామస్తవరాజమును నేను విష్ణుధ్యాన తత్పరుడనై నీకు చెప్పుచున్నాను. (7) ఆధ్యాత్మిక, ఆధిభౌతిక, ఆధిదైవికములు అనబడు తాపత్రయమును పరిహరించువాడును, సకలదురిత పరిహారకుడును, దారిద్ర్య దుఃఖనాశకుడును, సమస్త సంపదలనిచ్చువాడును, శాస్త్రజన్య జ్ఞానప్రయోజన ప్రదుడును, ఆనందాత్మకుడును ముఖ్యముగా మోక్షానంద దాయకుడు అగు జనార్దనుడైన శ్రీరామునికి నమస్కరించి పలికెదను. (9)

**అయోధ్యానగరే రమ్యే రత్నమంటపమధ్యగే ।**
**ధ్యాయేత్కల్పతరోర్మూలే రత్నసింహాసనే శుభే ॥ 10**

**తన్మధ్యేఽష్టదళం పద్మం నానారత్నోపశోభితమ్ ।**
**స్మరేన్మధ్యే దాశరథిం సహస్రాదిత్యతేజసమ్ ॥ 11**

**పితురాసనమాసీనమింద్రనీలసమప్రభమ్ ।**
**కోమలాంగం విశాలాక్షం విద్యుద్వర్ణాంబరావృతమ్ ॥ 12**

భానుకోటిప్రతీకాశం కిరీటేన విరాజితమ్ ।
రత్నగ్రైవేయకేయూరవరకుండలమండితమ్ ॥ 13

రత్నకంకణమంజీరకటిసూత్రైరలంకృతమ్ ।
శ్రీవత్సకౌస్తుభోరస్కం ముక్తాహారోపశోభితమ్ ॥ 14

చింతామణిసమాయుక్తం రత్నమాలావిరాజితమ్ ।
దివ్యరత్నసమాయుక్తం ముద్రికాభిరలంకృతమ్ ॥ 15

కర్పూరాగరుకస్తూరీదివ్యగంధానులేపనమ్ ।
తులసీకుందమందారపుష్పమాల్యైరలంకృతమ్ ॥ 16

రాఘవం ద్విభుజం వీరం రామమీషత్ స్మితాననమ్ ।
యోగశాస్త్రేష్వభిరతం యోగేశం యోగదాయకమ్ ॥ 17

సదా సౌమిత్రిభరతశత్రుఘ్నైరుపసేవితమ్ ।
విద్యాధరసురాధీశసిద్ధగంధర్వకిన్నరైః ॥ 18

యోగీంద్రైర్నారదాద్యైశ్చ స్తూయమానమహర్నిశమ్ ।
విశ్వామిత్రవసిష్ఠాద్యైఋషిభిః పరిసేవితమ్ ॥ 19

సనకాదిమునిశ్రేష్ఠైః యోగివృందైః సమావృతమ్ ।
రామం రఘువరం వీరం ధనుర్వేదవిశారదమ్ ॥ 20

మంగళాయతనం దేవం రామం రాజీవలోచనమ్ ।
సర్వశాస్త్రార్థతత్త్వజ్ఞమానందమతిసుందరమ్ ॥ 21

రమ్యమగు అయోధ్య పట్టణమున, రత్నమండపమున కల్పవృక్షమూలమున మంగళమగు రత్నసింహాసనమును ధ్యానము చేయవలయును. (10) దాని నడుమ వివిధ రత్నవిరాజితమగు అష్టదళపద్మమును భావించవలయును. దాని నడుమ వేయిమంది సూర్యుల తేజము కలిగి, దాశరథియై తండ్రి సింహాసనమును అలంకరించినవాడును, ఇంద్రనీల రత్నములవలే కాంతి గలవాడును, సుకుమార గాత్రుడును, సువిశాల నేత్రుడును, మెరుపువన్నెగల వస్త్రమును ధరించినవాడును, కోటిసూర్యుల వలే వెలుగువాడును– కిరీట, హార, కేయూర, కుండల, కంకణ, మంజీర, కటి సూత్రాదులచే అలంకృతుడును– శ్రీవత్సాంకితుడును, కౌస్తుభధారియును, ముక్తాహార సంశోభితు

డును, చింతామణి సంయుతుడును, మణిమాలాలంకృతుడును, దివ్యరత్నముద్రికాశోభితుడును, కర్పూర, కస్తూరి, కాలాగరు కాశ్మీర దివ్యగంధమును లేపించికొనినవాడును, తులసీధామముచే మల్లికా పారిజాతాది హారములచే అలంకృతుడగువాడును, మందస్మిత ముఖారవిందుడును ఐక్యానుసంధానం అనబడు యోగమునందు ఆసక్తుడను, యోగనియామకుడును, యోగప్రదుడును, ద్విభుజ వీరరాఘవ మూర్తియును, ఎల్లప్పుడును లక్ష్మణ, భరత, శత్రుఘ్నులచే పరివృతుడును, సురేంద్ర, విద్యాధర, సిద్ధ, గంధర్వ, కిన్నెర, నారదాది యోగీంద్ర ప్రముఖులచే సంస్తుతింపబడిన వాడును, వసిష్ఠ విశ్వామిత్రాది మహర్షులచే పరివృతుడును, సనకాది మహాయోగీంద్రులచే ఆశ్రయింపబడినవాడును. ధనుర్వేద విశారదుడును, సకల కళావిదుడును, ఆనందమూర్తియును, దివ్యసుందరుడును, (21)

**కౌసల్యాతనయం రామం ధనుర్బాణధరం హరిమ్ ।**
**ఏవం సంచింతయేద్విష్ణుం యజ్యోతిర్జ్యోతిషాం పరమ్ ॥ 22**

**ప్రహృష్టమనసో భూత్వా సభాయాం వృషభధ్వజః ।**
**సర్వలోకహితార్థాయ తుష్టావ రఘునందనమ్ ॥ 23**

**కృతాంజలిపుటో భూత్వా చింతయన్నద్భుతం హరిమ్ ।**
**శ్రీ శివ ఉవాచ**
**యదేకం తత్పరం నిత్యం యదనంతం చిదాత్మకమ్ ॥ 24**

**యదేకం వ్యాపకం లోకే తద్రూపం చింతయామ్యహమ్ ।**
**సర్వత్రైలోక్యసౌఖ్యార్థం రామభక్త్యభివృద్ధయే ॥ 25**

**విజ్ఞానహేతుం విమలాయతాక్షం**
**ప్రజ్ఞానసందివ్యసుఖైకరూపమ్ ।**
**శ్రీరామచంద్రం హరిమాదిదేవం**
**విశ్వేశ్వరం రామమహం భజామి ॥ 26**

**కవిం పురాణం పురుషం పరేశం**
**సనాతనం యోగినమీశితారమ్ ।**
**అణోరణీయాంసమనంతవీర్యం**
**ప్రాణేశ్వరం రామమహం భజామి ॥ 27**

**నారాయణం జగన్నాథమభిరామం జగత్పతిమ్ ।**
**కవిం పురాణం వాగీశం రామం దశరథాత్మజమ్ ॥ 28**

కౌసల్యానందనుడును, ధనుర్బాణదారియును, కళ్యాణీయుడును, దేవదేవుడును, రఘుకుల వీరుడును అగు వెలుగులకు వెలుగైన రాజీవాక్షుడగు రామచంద్రస్వామిని ఇట్లు ధ్యానించవలయును. వృషభధ్వజుడగు శివుడు సభలో స్వానంద అంతరంగుడై, సమస్తలోకములకును హితమును కోరి, అద్భుతుడగు అచ్యుతుని అనుసంధానముజేసి, పరమేశ్వరుడు అంజలిఘటించి శ్రీరామచంద్రుని ఇట్లు స్తుతించెను.

## శ్రీ శివ కృత శ్రీరామ స్తవరాజము.

ఏది కేవలము ఉత్కృష్టము, మూడుకాలాలకు అతీతమూ, నిత్యము, జ్ఞానస్వరూపము, లోకమున పూర్ణమైయున్నదో ఆ రూపమును, ముల్లోకములయందు అంతటా శ్రీరామభక్తియును, ఆనందమును కలిగియుండుటకై నేను భావించెదను. (25) శాస్త్రజన్యము, జ్ఞానకారణము, నైర్మల్య విస్తృత ఇంద్రియుడును, ప్రజ్ఞానరూపుడును, కేవలానందాత్మకుడును, జగన్నాథుడును, పాపపరిహారకుడును, ఆదిదైవము అగు శ్రీరామచంద్ర సంజ్ఞముగల యోగి హృదయారాముని భజించెదను.(26) కవియు, పురాణపురుషుడును, ఈశ్వరుడును, సనాతనుడును, యోగులనుకూడా శాసించువాడను, అణువు కన్నను సూక్ష్మమైనవాడును, అంతటా సమముగాయుండువాడును, అనంత శక్తి సామర్థ్యము గలవాడను, సకల ప్రాణులను శాసించువాడను అగు రామును భజించుచున్నాను. (27) త్రిమూర్తి స్వరూపుడును, అనాది సర్వజ్ఞుడును ఐన దశరథ నందనుడుగా అవతరించి,.....

**రాజరాజం రఘువరం కౌసల్యానందవర్ధనమ్ ।**
**భర్గం వరేణ్యం విశ్వేశం రఘునాథం జగద్గురుమ్ ॥ 29**

**సత్యం సత్యప్రియం శ్రేష్ఠం జానకీవల్లభం ప్రభుమ్ ।**
**సౌమిత్రిపూర్వజం శాంతం కామదం కమలేక్షణమ్ ॥ 30**

**ఆదిత్యం రవిమీశానం ఘృణిం సూర్యమనామయమ్ ।**
**ఆనందరూపిణం సౌమ్యం రాఘవం కరుణాకరమ్ ॥ 31**

జామదగ్న్యం తపోమూర్తిం రామం పరశుధారిణమ్ ।
వాక్పతిం వరదం వాచ్యం శ్రీపతిం పక్షివాహనమ్ ॥ 32

శ్రీశార్ఙ్గధారిణం రామం చిన్మయానందవిగ్రహమ్ ।
హలధారిణమీశానం బలరామం కృపానిధిమ్ ॥ 33

శ్రీవల్లభం కలానాథం జగన్మోహనమచ్యుతమ్ ।
మత్స్యకూర్మవరాహాదిరూపధారిణమవ్యయమ్ ॥ 34

వాసుదేవం జగద్యోనిమ్ అనాదినిధనం హరిమ్ ।
గోవిందం గోపతిం విష్ణుం గోపీజనమనోహరమ్ ॥ 35

గోపాలం గోపరీవారం గోపకన్యాసమావృతమ్ ।
విద్యుత్పుంజప్రతీకాశం రామం కృష్ణం జగన్మయమ్ ॥ 36

గోగోపికాసమాకీర్ణం వేణువాదనతత్పరమ్ ।
కామరూపం కలావంతం కామినాం కామదం ప్రభుమ్ ॥ 37

మన్మథం మథురానాథం మాధవం మకరధ్వజమ్ ।
శ్రీధరం శ్రీకరం శ్రీశం శ్రీనివాసం పరాత్పరమ్ ॥ 38

భూతేశం భూపతిం భద్రం భూతిదం భూరిభూషణమ్ ।
సర్వదుఃఖహరం వీరం దుష్టదానవమర్దనమ్ ॥ 39

శ్రీనృసింహం మహావిష్ణుం మహాంతం దీప్తతేజసమ్ ।
చిదానందమయం నిత్యం ప్రణవం జ్యోతిరూపకమ్ ॥ 40

ఆదిత్యమండలగతం నిశ్చితార్థస్వరూపిణమ్ ।
భక్తిప్రియం పద్మనేత్రం భక్తానామీప్సితప్రదమ్ ॥ 41

కౌసల్యేయం కలామూర్తిం కాకుత్స్థం కమలాప్రియమ్ ।
సింహాసనే సమాసీనం నిత్యవ్రతమకల్మషమ్ ॥ 42

విశ్వామిత్రప్రియం దాంతం స్వదారనియతవ్రతమ్ ।
యజ్ఞేశం యజ్ఞపురుషం యజ్ఞపాలనతత్పరమ్ ॥ 43

సత్యసంధం జితక్రోధం శరణాగతవత్సలమ్ ।
సర్వక్లేశాపహరణం విభీషణవరప్రదమ్ ॥ 44

దశగ్రీవహరం రుద్రం కేశవం కేశిమర్దనమ్ ।
వాలిప్రమథనం వీరం సుగ్రీవేప్సితరాజ్యదమ్ ॥ 45

లోకమును ఉద్ధరించువాడును, రాజులకు రాజును, రఘువంశజులగు వారిలో శ్రేష్ఠుడును, కౌసల్యానందనవర్ధనుడును, విశ్వేశ్వర మహా భార్గవరూపుడై లోకగురువగు వాడును, సీతా వల్లభుడును మహాప్రభువును సత్పురుషులలో సాధుతత్త్వమగుటవలన సత్యుడును, శాంతుడును, లక్ష్మణాగ్రజుడును, ఇష్టములను ఇచ్చువాడును, పద్మలోచనుడును, దయానిధియును, సహస్రకిరణుడును, సుఖాత్మకుడును, జమదగ్నికి పుత్రుడై పరశురాముడనబడి, తపోమహిమచే పొగడ్తనొందినవాడును, వాగీశ్వరుడును వరములనిచ్చువాడు అని చెప్పబడెను. సగుణ బ్రహ్మమగువాడును, మాధవుడును, వేదాత్మక గరుడారూఢుడు, జ్ఞానానంద గాత్రుడు, శార్ఙ్గ పాణియు, కృపచే బలరామమూర్తియైన వాడును. లోకమోహనుడును, సకలవిద్యేశ్వరుడును, మత్స్య కూర్మాది అవతరాములను ఎత్తినవాడును, శ్రీకృష్ణావతారముచే గో, గోప, గోపీజనవల్లభుడును, మన్మథుడును, ప్రద్యుమ్నాది వ్యూహకారుడును, లక్ష్మీపతియును, లక్ష్మీధరుడును, లక్ష్మీప్రదుడును, సర్వభూతాంతర్యామియును, సకల ఐశ్వర్య ప్రదాయకుడును, సమస్త దుఃఖ పరిహారకుడును, క్రూర రాక్షస సంహారకుడును, భక్తిపరవశుడై భక్తులకు వరములను ఇచ్చువాడును. క్షత్రసింహాసనాసీనుడును, శరణాగతులను రక్షించువాడును, యజ్ఞ రక్షకుడును, యజ్ఞపురుషుడును, జితేంద్రియుడును, సీతాపతియై ఏకపత్నీవ్రతస్థుడును,...

నరవానరదేవైశ్చ సేవితం హనుమత్ప్రియమ్ ।
శుద్ధం సూక్ష్మం పరం శాంతం తారకబ్రహ్మరూపిణమ్ ॥ 46

సర్వభూతాత్మభూతస్థం సర్వాధారం సనాతనమ్ ।
సర్వకారణకర్తారం నిదానం ప్రకృతేః పరమ్ ॥ 47

నిరామయం నిరాభాసం నిరవద్యం నిరంజనమ్ ।
నిత్యానందం నిరాకారమద్వైతం తమసః పరమ్ ॥ 48

పరాత్పరతరం నిత్యం సత్యానందచిదాత్మకమ్ ।
మనసా శిరసా నిత్యం ప్రణమామి రఘూత్తమమ్ ॥ 49

భవోద్భవం వేదవిదాం వరిష్ఠమ్
ఆదిత్యచంద్రానిలసుప్రభావమ్ ।
సర్వాత్మకం సర్వగతస్వరూపం
నమామి రామం తమసః పరస్తాత్ ॥ **50**

నిరంజనం నిష్ప్రతిమం నిరీహం
నిరాశ్రయం కారణమాదిదేవమ్ ।
నిత్యం ధ్రువం నిర్విషయస్వరూపం
నిరంతరం రామమహం భజామి ॥ **51**

భవాబ్ధిపోతం భరతాగ్రజం తం
భక్తిప్రియం భానుకులప్రదీపమ్ ।
భూతాధినాథం భువనాధిపత్యం
భజామి రామం భవరోగవైద్యమ్ ॥ **52**

సర్వాధిపత్యం రణరంగధీరం
సత్యం చిదానందసుఖస్వరూపమ్ ।
సత్యం శివం సజ్జనహృన్నివాసం
ధ్యేయం పరానందమహం భజామి ॥ **53**

కార్యక్రియాకారణమప్రమేయం
కవిం పురాణం కమలాయతాక్షమ్ ।
కుమారవేషం కరుణామయం తం
కల్పద్రుమం రామమహం భజామి ॥ **54**

త్రైలోక్యనాథం సరసీరుహాక్షం
దయానిధిం ద్వంద్వవినాశహేతుమ్ ।
మహాబలం వేదనిధిం సురేశం
సనాతనం రామమహం భజామి ॥ **55**

నరేంద్ర, వానరేంద్ర సేవితుడును, ఆంజనేయప్రియుడును, జనార్దనుడును, రావణాంతకుడును, సుగ్రీవ వాంఛితార్థప్రదుడును, విభీషణ వరదుడును, ప్రకృతి నియామకుడును, స్వస్వకారణకారకుడును, నిత్య, బుద్ధ, శుద్ధ, సచ్చిదానంద, అద్వైత బ్రహ్మయగు శ్రీరామచంద్ర స్వామికి సాష్టాంగముగా నమస్కరించెదను. (49)

వేదవిద్వరిష్ఠుడును, సంసారమూలుడును, సూర్యాగ్ని చంద్రతేజోరూపుడును, సర్వాంతర్యామి యును, సర్వమయుడును అగు శ్రీరాముని మాయాతీతునిగా తెలుసుకుని నమస్కరించెదను. (50) నిర్లేపుడు, అసమానుడు, నిష్క్రియుడును, సర్వాశ్రయుడును, అనాది కారణ విగ్రహుడును, సత్యుడును అగు కేవలానంద పరబ్రహ్మమైన శ్రీరాముని సేవించెదను. (51) సంసారోత్తారకుడును, రవికుల రత్నముగా అవతరించి, భగవంతునికి అగ్రజుడై, లోకైక ప్రభువగుటచే జనన మరణ దుఃఖప్రవాహరూప సంసార రోగమునకు వైద్యుడైన శ్రీరామునికి నమస్కారము. (52) సత్యజ్ఞానానంద స్వరూపుడును, మంగళుడును, సాధువుల హృదయాంతరములలో పరమానంద గ్రహుడుగా ధ్యానింపబడుతున్నవాడు అయిన శ్రీరామునికి నమస్కారము. (53) ఈశ్వరుడగుటచే కారణాత్మకుడై, ప్రపంచ స్వరూపుడగుటచే కార్యాత్మకుడై, పరిణామధార కాలాత్మకుడగుటచే క్రియాత్మకుడై, ఇట్టి వాడని ఊహించుటకు అలవిగానివాడును, అనాది దివ్యరూపముచే కమలాక్షుడై యుండువాడును, కోరికలను తీర్చుటలో కల్పవృక్షమై ఉండెడు శ్రీరాముని సేవించెదను. (54) ముల్లోకములకు మూలమును, శుద్ధసత్త్వప్రధాన విష్ణురూపుడును, జ్ఞాననిధియును- శోక, మోహ, జరా, మరణాది-ద్వంద్వ దుఃఖములను పరిహరించునట్టివాడును అగు శ్రీరామునికి నమస్కారము.(55)

**వేదాంతవేద్యం కవిమీశితారమ్**
**అనాదిమధ్యాంతమచింత్యమాద్యమ్ ।**
**అగోచరంనిర్మలమేకరూపం**
**పరాత్పరం రామమహం భజామి ॥ 56**

**అశేషవేదాత్మకమాదిదేవమ్**
**అజం హరిం రామమనంతమూర్తిమ్ ।**
**అపారసంవిత్సుఖమేకరూపం**
**నమామి రామం తమసః పరస్తాత్ ॥ 57**

తత్త్వస్వరూపం పురుషం పురాణం
స్వతేజసా పూరితవిశ్వమేకమ్ ।
రాజాధిరాజం రవిమండలస్థం
విశ్వేశ్వరం రామమహం భజామి ॥ 58

యోగీంద్రసంఘైరపి సేవ్యమానం
నారాయణం నిర్మలమాదిదేవమ్ ।
నతోఽస్మి నిత్యం జగదేకనాథం
హరిం చిదానందమయం ముకుందమ్ ॥ 59

అశేషవిద్యాధిపతిం నమామి
రామం పురాణం తమసః పరస్తాత్ ।
విభూతిదం విశ్వసృజం పరేశం
రాజేంద్రమీశం రఘువంశనాథమ్ ॥ 60

అచింత్యమవ్యక్తమనంతరూపం
జ్యోతిర్మయం రామమహం భజామి ।
అశేషసంసారవికారహీనమ్
ఆనందసంపూర్ణసుఖాభిరామమ్ ॥ 61

నారాయణం విష్ణుమహం భజామి
సమస్తసాక్షిం తమసః పరస్తాత్ ।
మునీంద్రగుహ్యం పరిపూర్ణమేకం
కలానిధిం కల్మషనాశహేతుమ్ ॥
పరాత్పరం యత్పరమం పవిత్రం
నమామి రామం మహతోమహాంతమ్ ॥ 62

బ్రహ్మా విష్ణుశ్చ రుద్రశ్చ దేవేంద్రో దేవతాస్తథా ।
ఆదిత్యాదిగ్రహాశ్చైవ త్వమేవ రఘునందన ॥ 63

**తాపసా ఋషయః సిద్ధాః సాధ్యాశ్చ మునయస్తథా ।**
**విప్రా వేదాశ్చ యజ్ఞాశ్చ పురాణం ధర్మసంహితాః ॥ 64**

ఆది మధ్యాంత శూన్యుడు, అగోచరుడు, నిర్మలుడు, కేవల చిదాత్మానందాత్మకుడు, ఉపనిషత్ ప్రతిపద్యుడు, సర్వజ్ఞుడగు శ్రీరామునికి నమస్కారము (56), సకల సారస్వత విద్యాత్మకుడు, జన్మరహితుడు, ఆదిదేవుడు, అనంత విగ్రహుడును, అపార జ్ఞానానాందైక కారుడును, శ్రీహరి రామచంద్రస్వామికి నమస్కారము. (57) ప్రకృతి తత్త్వాత్మకుడై, పురాణపురుషుడై, నిజాంశముతో నిండి తను ఒక్కడుగానే నిలిచినవాడై, విశ్వపతి అనబడు రవిమండల మధ్యవర్తియై, రవివంశమునకు రాజరాజగు శ్రీరామకృతిచే రంజింపజేసిన పరమాత్మకు నమస్కారము. (58). సనకాది యోగీంద్రుల బృందముచే వందితుడై నిర్మల, సత్య, జ్ఞానానంద స్వరూపుడై, మోక్షప్రదుడగు శ్రీమన్నారాయణునికి నమస్కారము. (59). రఘువంశాలంకార రామావతారముజేసిన ప్రపంచమును సృష్టించిన, సకల ఐశ్వర్యప్రదుడగు మాయాతీత సనాతన బ్రహ్మకు నమస్కారము. (60). నానావిధములగు సంస్కృతీ వికారములకు అంటనివాడు, పరిపూర్ణానంద ఘనుడగుటచే అభిరాముడును, మనోవాక్కులకు అగోచరుడును, తేజఃస్వరూపుడును అగు శ్రీరామునికి నమస్కారము. (61) మహాతత్త్వములగు త్రిమూర్తులకు పైన మహాతత్త్వమగు కేవల బ్రహ్మమును, సర్వసాక్షియును, సర్వాత్మకుడును, దురిత పరిహారకుడును, పరమపవిత్రుడును, వ్యాపకుడును అగు శ్రీమన్నారాయణునికి నమస్కారము (62). శ్రీరామా! బ్రహ్మ, విష్ణు, రుద్రులను త్రిమూర్తులును, దేవేంద్రుడును, సురులును, సూర్యాది గ్రహములును, నీవుగా ఉన్నావు. (63). తపస్విజనులును, ఋషులును, సిద్ధులును, సాధ్యులును, ధ్యాన సంపన్నులును, బ్రాహ్మణులును, వేదములును,

**వర్ణాశ్రమాస్తథా ధర్మా వర్ణధర్మాస్తథైవ చ ।**
**నాగా యక్షాశ్చ గంధర్వా దిక్పాలా దిగ్గజా దిశః ॥ 65**

**వసవోఽష్టౌ త్రయః కాలా రుద్రా ఏకాదశ స్మృతాః ।**
**తారకా ద్వాదశాదిత్యాస్త్వమేవ రఘునాయక ॥ 66**

**సప్త ద్వీపాః సముద్రాశ్చ నదా నద్యస్తథా ద్రుమాః ।**
**స్థావరా జంగమాశ్చైవ త్వమేవ రఘునందన ॥ 67**

**దేవతిర్యఙ్మనుష్యాణాం దానవానాం దివౌకసామ్ ।**
**మాతా పితా తథా భ్రాతా త్వమేవ రఘునందన ॥ 68**

సర్వేశస్త్వం పరం బ్రహ్మ త్వద్రూపం విశ్వమేవ చ ।
త్వమక్షరం పరం జ్యోతిస్త్వమేవ రఘుపుంగవ ॥ 69

శాంతం సర్వగతం సూక్ష్మం పరం బ్రహ్మ సనాతనమ్ ।
రాజీవలోచనం రామం ప్రణమామి జగత్పతిమ్ ॥ 70

తతః ప్రసన్నః శ్రీరామః ప్రోవాచ వృషభధ్వజమ్ ।
శ్రీరామ ఉవాచ
తుష్టో౽హం గిరిజాకాంత వృణీష్వ వరముత్తమమ్ ॥ 71

శ్రీశివ ఉవాచ
యది తుష్టో౽సి దేవేశ శ్రీరామ కరుణానిధే ।
తవాద్య దర్శనేనైవ కృతార్థో౽హం న సంశయః ॥ 72

ధన్యో౽హం కృతకృత్యో౽హం పుణ్యో౽హం పురుషోత్తమ ।
అద్య మే సఫలం కర్మ హ్యద్య మే సఫలం తపః ॥ 73

అద్య మే సఫలం జ్ఞానమద్య మే సఫలం శ్రుతమ్ ।
అద్య మే సఫలం సర్వం త్వత్పదాంభోజదర్శనాత్ ॥ 74

అద్వైతం విమలం జ్ఞానం త్వన్నామస్మరణం తథా ।
త్వత్పదాంభోరుహద్వంద్వే సద్భక్తిం దేహి రాఘవ ॥ 75

యజ్ఞములు, స్కందా పురాణములు, మన్వాది శాస్త్రములు, నారద, వసిష్ఠ, విశ్వామిత్రాది సంహితలు, అష్టవసువులు, త్రికాలములు, ఏకాదశరుద్రులు, ఇరువదియేడు నక్షత్రములు, ద్వాదశాదిత్యులు, సప్తద్వీపములు, సముద్రములు, నదీ నదములు, వృక్షములు, చిట్టచివరికి చరాచరాత్మకమగు ప్రపంచమంతయును నీవుగా ఉన్నావు. కనుకనే నీవు విరాట్ రూపుడవై ఉందువు. (77) శ్రీరామా! సురులకు, నరులకు, తిర్యక్ జంతుజాలమునకు, రాక్షసులకు, స్వర్గవాసులకు అందరికిని నీవే తల్లి, నీవే తండ్రి, నీవే అన్నగా ఉన్నావు. (78) రఘువర్యా! నీవే సమస్త నియామకుడవు, సర్వోత్తముడవు, సర్వవ్యాపకుడవు. నీ విరాట్స్వరూపమే ఈప్రపంచము, నీవు నాశరహితుడవు, నీవే చిత్ప్రకాశుడవు (69) యే కమలనయనుడు లోకపతియై సూక్ష్మాతి సూక్ష్ముడై అంతట అన్నిటిలోను వ్యాపించి, స్థూలాతి స్థూలమై, ఈ నేత్రములకు కనబడక, శుద్ధసత్వ తేజముగా ఉన్నాడో అట్టి రామచంద్ర స్వామికి నమస్కారము. (70). ఇట్లు స్తుతించుచుండగా శ్రీరాముడు పరమేశ్వరుని

చూచి, "పార్వతీ పతీ! నేను ప్రసన్నుడనైతిని, మేలైన వరమును వేడుము." అని పలికెను. అందుకు శంకరుడు, "దయానిధియగు శ్రీరామా! నీవు ప్రసన్నుడవైతే నేను నీ దర్శనముచేతనే ధన్యుడనైతిని, ఇందులో సంశయములేదు. నేను ధన్యుడను, నేను కృతకృత్యుడను, నేను పుణ్యవంతుడను, పురుషోత్తమా! నీ పాద పద్మములను దర్శించినందువలన నా సుకృతము పండినది. నా తపస్సు నేడు ఫలించినది. నా జ్ఞానము ఈదినమున సఫలమయ్యె. నేడు నా తెలివి ఫలితమయ్యె. సర్వమును ఇప్పుడే సఫలమయ్యెను. శ్రీరామా! నీ రెండుపాదపద్మములయందు సద్భక్తిని, నీ నామస్మరణమును, నిర్మలమగు అద్వైత జ్ఞానమును నాకిమ్ము." అని ప్రార్థించెను.

**తతః పరం సుసంప్రీతో రామః ప్రాహ సదాశివమ్ ।**
**గిరిజేశ మహాభాగ పునరిష్టం దదామ్యహమ్ ॥ 76**

**శ్రీశివ ఉవాచ**
**వరం న యాచే రఘునాథ యుష్మత్**
**పదాబ్జభక్తిః సతతం మమాస్తు ।**
**ఇదం ప్రియం నాథ వరం ప్రయచ్ఛ**
**పునః పునస్త్వామిదమేవ యాచే ॥ 77**

**శ్రీ రామదాస ఉవాచ**
**ఇత్యేవమీడితో రామః ప్రాదాత్తస్మై వరాంతరమ్ ।**
**తేనోక్తస్తవరాజాయ దదౌ నానావరాన్ బహూన్ ॥ 78**

**ఏవం శివేన యః ప్రోక్తః స్తవరాజః శుభావహః ।**
**స ఏవాద్య త్వయా పృష్టస్తవాగ్రే కథితో మయా ॥ 79**

**అయం శ్రీరఘునాథస్య స్తవరాజో హ్యనుత్తమః ।**
**సర్వసౌభాగ్యసంపత్తిదాయకో ముక్తిదః స్మృతః ॥ 80**

**కథితో గిరిజేశేన తేనాదౌ సారసంగ్రహః ।**
**గుహ్యాద్గుహ్యతరో నిత్యస్తవ స్నేహాత్ప్రకీర్తితః ॥ 81**

**యః పఠేచ్ఛృణుయాద్వాపి త్రిసంధ్యం శ్రద్ధయాన్వితః ।**
**బ్రహ్మహత్యాదిపాపాని తత్సమాని బహూని చ ॥ 82**

హేమస్తేయసురాపానగురుతల్పయుతాని చ ।
గోవధాద్యుపపాపాని చింతనాత్సంభవాని చ ॥ 83

సర్వైః సముచ్యతే పాపైః కల్పాయుతశతోద్భవైః ।
మానసం వాచికం పాపం కర్మణా సముపార్జితమ్ ॥ 84

శ్రీరామస్మరణేనైవ వ్యపోహతి న సంశయః ।
ఇదం సత్యమిదం సత్యం సత్యం నైవాన్యదుచ్యతే ॥ 85

రామః సత్యం పరం బ్రహ్మ రామాత్కించిన్న విద్యతే ।
తస్మాద్రామస్వరూపం హి రామః సర్వమిదం జగత్ ॥ 86

ఆ తరువాత శ్రీరాముడు సంప్రీతుడై, "పూజ్యుడగు శంకరుడా! మరల ఇష్టమును చెప్పుము ఇచ్చెద," అనెను. అందుకు చంద్రశేఖరుడు, "రాఘవస్వామీ! నేను వరమును వేడను. నీ పాదారవింద భక్తి సతతము నాకు కలిగిఉండనీ. ఈ ఒక్క వరమును మాత్రమే ఇమ్ము. మరలా మరలా దీనినే వేడెదను," అని కోరెను. ఇట్లు స్తుతింపబడిన శ్రీరాముడు శివునికి వేరేవరమును ఇచ్చెను. శివోక్తమగు శ్రీరామ స్తవరాజమునకు అనేకములగు వరములను ఇచ్చెను" అని రామదాసుడు చెప్పుచున్నాడు. (77,78)

విష్ణుదాసా! వినుము. ఇట్లు సర్వమంగళేశ్వరునిచే చెప్పబడిన మంగళప్రదమగు శ్రీరామ స్తవరాజము నీచే ఇప్పుడు అడుగబడెను. దానినే నీ ఎదుట నేను చెప్పితిని. ఉత్తమోత్తమమగు శ్రీరామచంద్రుని స్తోత్రరాజమిది. ఇహమున సమస్త సౌభాగ్యములనిచ్చి, పరమున ముక్తిప్రదమై యున్నది. (80) శ్రీపరమేశ్వరునిచే చెప్పబడి, దేవతలలో సారముగా గ్రహింపబడిన పరమ రహస్యమగు ఈ సనాతన స్తోత్రము నీకు ప్రీతిచే చెప్పబడెను. ఉదయము, మధ్యాహ్నము, సాయంకాలములలో దీనిని ఎవడు శ్రద్ధగా పఠించునో, శ్రవణముచేయునో వాడు– బ్రహ్మ హత్యాది మహాపాతకములు, వాటితో సమానములైనవి, సువర్ణమును దొంగిలించిన పాపమునుండి, సురా పానము, గోవధ, గురుతల్ప గమనము మొదలగునవి మరియు ఉపపాతకములు, మానసిక పాపములు ఇట్టి కల్పాంతరమునుండి సంచితములగు సమస్త పాపములనుండి పూర్తిగ ముక్తుడై సుఖించును. **'శ్రీరామ'** అని స్మరించిన మాత్రమున కాయక, వాచిక, మానసికము లను త్రికరణ పాపములను, తప్పక తొలగించును. ఇందులో సంశయములేదు. ఇది సత్యము, ఇది యథార్థము, ఇంతకన్నను వేరొకటి సత్యముకాదు. మూడుకాలాలకు అతీతమైన శుద్ధ, బుద్ధ, సచ్చిదానంద పరబ్రహ్మము రాముడొక్కడే. రామునికన్యముగా వేరొకటిలేదు. కనుక శ్రీరాముని స్వరూపమునే మననము చేయవలయును గద?

శ్రీరామచంద్ర రఘుపుంగవ రాజవర్య
రాజేంద్ర రామ రఘునాయక రాఘవేశ ।
రాజాధిరాజ రఘునాయక రామచంద్ర
దాసోఽహమద్య భవతః శరణాగతోఽస్మిన్ ॥ **87**

ఉత్ఫుల్లామలకోమలోత్పలదళశ్యామాయ రామాయ చా-
కామాయ ప్రశమాయ నిర్మలగుణగ్రామాయ రామాత్మనే ।
ధ్యానారూఢమునీంద్రమానససరోహంసాయ సంసార-
విధ్వంసాయ స్ఫురదోజసే రఘుకులోత్తంసాయ పుంసే నమః ॥ **89**

ఏవం శిష్య మయా ప్రోక్తో యథా పృష్టస్త్వయా మమ ।
స్తవరాజో రాఘవస్య శ్రవణాత్పాపనాశనః ॥ **90**

**ఇతి శ్రీశతకోటిరామచరితాంతర్గతే, శ్రీమదానందరామాయణే, వాల్మీకీయే, ఆదికావ్యే, విలాసకాండే, శంకరకృత రామస్తవరాజో నామ, ప్రథమః సర్గః ॥**

ఈ సమస్త జగము రాముడుగా ఉన్నది. రఘునందనుడై, రాజాదిరాజువై శ్రీరామచంద్ర అవతారముచే లోక రంజకుడై ఎరగిన పరబ్రహ్మమూర్తి నీకు చరణకింకరుడగు నేను శరణాగతుడనై ఉన్నాను. వికసిత వర మృదులోత్పలదళశ్యాముడును, నిర్మలగుణాభిరాముడును, నిష్కృతుడును, రఘుకులకాంతుడును, శాంతుడును, ధ్యానించుచుండు మునీంద్రుల మానస సరస్సులకు రాజ హంసుడును, సంసార విధ్వంసుడును. రవివంశోత్తముడును, నిత్య శుద్ధ బుద్ధ ముక్త సచ్చిదానంద అద్వయ తేజోమయమును అగు పురోషోత్తమునికి నమస్కారము. శిష్యుడా! ఇట్లు నీవడిగిన శ్రీరామ స్తవరాజము శ్రవణ మాత్రమున దురిత హరణమగుటజేసి, నీకు చెప్పబడదగినదని శ్రీరామదాసుడు నిరూపించెను. (1)

***శతకోటిప్రవిస్తరమైన రామకథలో, శ్రీమద్వాల్మీకిమహర్షిచే రచింపబడిన, ఆనందరామాయణములోని, విలాసకాండలో, శంకరుడు స్తుతించిన శ్రీరామ స్తవరాజమును తెలుపు మొదటిసర్గ ముగిసినది.***



# ద్వితీయః సర్గః-2వ సర్గ

శ్రీరాముడు సీతాదేవిని వర్ణించుట

విష్ణుదాస ఉవాచ
గురో తే ప్రష్టుమిచ్ఛామి తత్త్వం మాం వక్తుమర్హసి ।
అయోధ్యాయాం రాఘవేణ సీతయాఽతిసురూపయా ॥ 1

కథం భుక్తా వరా భోగాః కిం కిమాచరితం శుభమ్ ।
చరితం తస్య సకలం వద మంగళదాయకమ్ ॥ 2

శ్రీరామదాస ఉవాచ
సమ్యక్ పృష్టం త్వయా వత్స సావధానమనాః శృణు ।
రణదీక్షాం వాజిమేధదీక్షాం చ రఘునందనః ॥ 3

నిర్వాప్య సీతయా రేమేఽయోధ్యాయాం బంధుభిః సుఖమ్ ।
జానకీం రంజయామాస నానాభోగైర్మనోహరైః ॥ 4

తత్కించిచ్ఛృణు మాంగల్యం విలాసచరితం శుభమ్ ।
సీతయా కౌసలేంద్రస్య శ్రవణాన్మంగళప్రదమ్ ॥ 5

## శ్రీరాములవారి సుఖసామ్రాజ్యభోగమందిర వర్ణనము.

విష్ణుదాసు అడుగుచున్నాడు, "స్వామీ! నేను అడుగగోరెదను, మీరు చెప్పుటకు తగినవారలు. దివ్య మోహనాంగియగు సీతతో శ్రీరాముడు అయోధ్యలో సకలభోగములను ఎట్లు అనుభవించెను? యేమేమి మంగళములను ఆచరించెను. కళ్యాణప్రదమగు శ్రీరాముని సర్వచరిత్రమును చెప్పవలయును. అని ప్రార్థించెను.

శ్రీ రామదాసు చెప్పుచున్నాడు, "చక్కగా అడిగితివి. చెప్పెదను, శ్రద్ధగా వినుము. శ్రీరాముడు యుద్ధ దీక్షను, అశ్వమేధ దీక్షను పరిసమాప్తిజేసి, అయోధ్యలో- సీతా, లక్ష్మణ, భరత, శత్రుఘ్నాదులతో ఆనందించెను. మనోరంజకములగు వివిధ భోగములతో సీతను సంతోషపరచెను. వినినంతనే సౌభాగ్యమును కలుగజేయునట్టి శ్రీసీతారాములయొక్క దివ్యమంగళ విలాసచరిత్రమును కొంచెము వినుము.

కః కృత్స్న చరితం వక్తుం తయోః క్రీడాన్వితం క్షమః ।
అతః సంక్షేపతః కించిద్వక్ష్యామి తవ సన్నిధౌ ॥ 6

అథ సీతాయుతో రామః పార్వత్యా శంకరో యథా ।
క్రీడాం చకార కైలాసేఽయోధ్యాయాం స తథాఽకరోత్ ॥ 7

హైమరత్నమయే దివ్యగేహే వైకుంఠసన్నిభే ।
నిద్రాస్థానం రాఘవస్య మనోజ్ఞం శశిసన్నిభమ్ ॥ 8

భిత్తౌ రత్నోపలా యత్ర హేమ్నః పంకోఽస్తి యత్ర హి ।
యత్ర స్తంభాః స్ఫాటికాశ్చ యత్ర మారకతోద్భవాః ॥ 9

ప్రతోళ్యః శతశోరమ్యాః శేషం నీలాదిభిశ్చితమ్ ।
ముకురైరుజ్జ్వలా యత్ర భిత్తయశ్చిత్రచిత్రితాః ॥ 10

యత్ర హేమమయీ భూమిర్యత్ర ముక్తామయం శుభమ్ ।
వితానం పుష్పహారైశ్చ ముక్తాగుచ్ఛైర్విరాజితమ్ ॥ 11

హేమతంతు మయాన్యత్ర భిత్తివస్త్రాణ్యనేకశః ।
యత్రాయుతమనుష్యైశ్చ సంపదో నైవ జాయతే ॥ 12

ఏవం తద్విస్తృతం రమ్యం రత్నదీపైర్విరాజితమ్ ।
హేమకుంభా విరాజంతే ప్రాసాదాగ్రేషు చిత్రితాః ॥ 13

యత్ర చిత్రాణ్యనేకాని మోహయంతి మృగీదృశామ్ ।
యత్ర హేమమయా రమ్యాః పర్యంకాశ్చిత్రచిత్రితాః ॥ 14

హేమకౌశేయసంభూతతంతుపట్టైర్విగుంఫితాః ।
మహార్హవసనైః పుష్పజాలైరాచ్ఛాదితాః శుభాః ॥ 15

చతుష్కోణే లంబమానముక్తాఘోషైర్విరాజితాః ।
యేషు దివ్యాః కశిపవస్తథోపబర్హణాని చ ॥ 16

కేకిపక్షమయాన్యేషు చామరాణి మహాంతి చ ।
గోపుచ్ఛబాలఖర్జూరీసంభవాదీని సంతి హి ॥ 17

**చతుష్కోణేషు సర్వేషాం మంచకానాం మహోజ్జ్వలాః ।**
**రత్నదీపాః ప్రకాశంతే సదైవాగ్నిశిఖోపమాః ॥** **18**

సీతారాముల వారి యొక్క క్రీడ, శుభకార్యముల చరిత్రను సమగ్రముగా చెప్పుటకు ఎవనితరము? కావున సంగ్రహించి, నీఎదుట కొంచెము చెప్పెదను. (6) కైలాసమున పార్వతి దేవితో కూడి శ్రీశంకరుడు క్రీడించినట్లు, అయోధ్యలో సీతాసమేతుడై శ్రీరాముడు క్రీడించుచుండెను. శ్రీ వైకుంఠముతో సమానమైన సువర్ణ రత్నాలంకృతమగు రాజమందిరమున శ్రీరాములవారి శయ్యాగృహము చంద్రునివలే వెలుగుచు, మనోహరముగా ఉండెను. అందులోని గోడలు బంగారు పూతవేసి, రత్న శిలలచే కట్టబడినవి. అచట స్ఫటిక స్తంభములు, పచ్చల దంతెలును, ఇంద్ర నీలాదులు చెక్కబడిన మధ్యమార్గములును, గోడలలో అలంకరింపబడి చిత్రవిచిత్రములైన దర్పణములను కలిగియుండెను. నేలంతయును బంగారము. యెచట చూచినను మంచి ముత్తెములు పూలదండలచేతను, ముత్తెముల హారములచేతను మేలుకట్లు మేలైయుండును. బంగారు అంచుగల తెరబట్టలు కట్టబడియుండెను. అచట పదివేలమంది గుంపుచేరినను శబ్దము వినిపించదు. ఇట్లది మనోహరముగాను, విస్తారముగాను, విరాజించుచుండెను. రత్నదీపములును, సువర్ణకలశములను మందిర పైభాగమున ప్రకాశించు చుండెను. అచటి చిత్రములు స్త్రీలకు మోహమును పుట్టించునవి. చిత్రాలంకారములు, బంగారు మంచములు ఉండెను. అవి సరిగ పట్టుబట్టలచే కప్పబడినవి. పూలపాన్పులు గలవు. నాలుగు మూలలలో ముత్యముల కుచ్చులును, దివ్యాంబరములు, తలగడలు, నెమలిపురుల చామరములు, గోవుతోకతోటి అల్లిన సామాగ్రులును గలవు. మంచముల నాలుగు మూలల్లోను ఎల్లప్పుడును దివ్యకాంతులుగల రత్నదీపములు అగ్నిజ్వాలలవలె వెలుగుచుండెను.

**ఉశీరవ్యజనాదీనీ చామరాదీని సంతి హి ।**
**యత్ర తాంబూలపాత్రాణి హేమరత్నోద్భవాని చ ॥** **19**

**తథా నిష్ఠీవనార్థం హి పాత్రాణి రాజతాని చ ।**
**యత్ర రంభోపమా దాస్యః శతశో రత్నభూషితాః ॥** **20**

**చామరైర్వీజయంత్యశ్చ సీతారామావహర్నిశమ్ ।**
**యత్ర హేమమయాశ్చిత్రా బద్ధాస్తే పంజరాః శుభాః ॥** **21**

**యే యాగే నృపపత్నీభిః శ్రీసీతాయాః సమర్పితాః ।**
**యేషు వై కేకినో హంసాః సారసాః సారికాః శుకాః ॥** **22**

లావకాః కోకిలాద్యాశ్చ నానా యేఽస్య పతత్రిణః ।
నానాశబ్దాన్ప్రకుర్వంతః శతశస్తేషు సంస్థితాః ॥ 23

తేషాం శబ్దస్య శిష్య త్వాం కిం ప్రాకట్యం వదామ్యహమ్ ।
యే రామస్మరణేనైవ జీవన్ముక్తా న సంశయః ॥ 24

పక్షిణ ఊచుః
జయతు రాఘవో జానకీయుతో
జయత్వాఖిలారాజరాజేశ్వరః ।
దశరథాత్మజో లక్ష్మణాగ్రజో
జయతు మాపతిస్తాటికాంతకః ॥ 25

జయతు కౌశికస్యాధ్వరం గతో
జయతు రక్షసాం మారకో మహాన్ ।
జయతు గౌతమాహల్యయా స్తుతో
జయతు జానకీతాతమానితః ॥ 26

జయతు నః పతిశ్చాపఖండనో
జనకజావరోన్ముక్తమాలయా ।
నృపసభాంగణే కౌశికానుగః
పరమశోభితశ్చాతిహర్షితః ॥ 27

జయతు భూమిజాంఘ్ర్యోస్తదా ముదా
నిజకరోత్పలే స్థాప్య రాఘవః ।
కమలహస్తకేనాకరోన్నతిమ్
స రఘునందనః పాతు నః సుఖమ్ ॥ 28

జయతు భూమిజాలింగితో మహాన్
జనమనోహరశ్చాతిశోభనః ।
పరశురామదం ధృత్య వై ధను-
ర్నిజపితుస్తదాఽదర్శయద్ బలమ్ ॥ 29

వట్టివేరు విసనకఱ్ఱలు మొదలైన చామరములు, సువర్ణరత్నాలంకృత తాంబూలపాత్రలు, అట్లే వెండి ఉమ్మిగిన్నెలు గలవు. అచ్చట రంభాసమాన దాసీజనులును నూర్ల కొలదిగా రత్నాలంకృతలై ఉందురు. వారు శ్రీసీతారాములకు రాత్రింబగలు చామరములు వీయుచుందురు. యజ్ఞమున రాజపత్నులచే శ్రీజానకీదేవికి సమర్పింపబడిన– నెమళ్ళు, హంసలు, బెగ్గురుపిట్టలు, చిలుకలు, గోరింకలు, కోయిలలు, లావుకపిట్టలు మొదలైన నానా పక్షులు గల సువర్ణ రత్న పంజరములు రంజించుచుండును. ఆ గూళ్ళలో అవి నూర్లకొలది పలు పలుకులచే కోలాహలము చేయుచుండును. శ్రీరామ నామస్మరణ వలన అన్నియు జీవన్ముక్తములు అనదగును. (24). ఆ పక్షులు శ్రీరాముల చరిత్రమును ఇట్లు పాడుచుండినవి.....

## శ్రీరామస్తుతిరూపక పక్షిగీతా నవకము.

ఈశుల కీశుడైన యేలక్ష్మీపతి రఘువంశమున దశరథనందనుడై అవతరించి, లక్ష్మణునికి అన్నయై తాటకిని సంహరించెనో, అట్టి రాజుల రాజగు రాముడు సీతాసమేతుడుగా సర్వోత్కృష్టుడగు గాక. విశ్వామిత్రుని యజ్ఞమును సంరక్షించుచు రాక్షసులను సంహరించువాడై, శాపముక్తయగు అహల్యచే సంస్తుతింపబడిన జనకరాజుచే సమ్మానింపబడిన శ్రీసీతారామమూర్తి సర్వోత్కృష్టుడై ఉండనీ. యే మా యొక్కనాథుడు శివధనస్సును ఖండించి, సీతాదేవి పాణిపద్మమునుండి పుష్పమాలికనంది, రాజసభలో విశ్వామిత్ర అనుచరుడై మిగుల ప్రకాశించెనో ఆ శ్రీ సీతారామమూర్తి సర్వోత్కృష్టుడుగా ఉండనీ. తన కరకమలములచే సీతాచరణారవిందములను అలంకరించి, నిజమస్తక అలంకృతమగునట్లు నమస్కరించిన శ్రీరాముడు జయశాలియై ఉండనీ. ఎవ్వడు సీతాసమాలింగితుడు అగుటచే భువన సుందరుడై వచ్చుచు, నిజజనకుడగు దశరథునికి పరశురామ ధనురాకర్షణచే నిజబలమును ఎఱింగించెనో అతడు జయించుచుండనీ.

**జయతు సీతయా భోగకృచ్చిరం**
**జయతు కైకయీప్రేరితో వనమ్ ।**
**జయతు పర్వతే వాసకృచ్చిరం**
**జయతు యోఽత్రిణా పూజితో వనే ॥ 30**

**జయతు స విరాధస్య ధాతకృత్**
**జయతు దూషణాదిప్రమర్దనః ।**
**జయతు యో మృగం మోచయద్భవాత్**
**జయతు యః కబంధం క్షణాజ్జహౌ ॥ 31**

**జయతు వాలిహా సేతుకారకో**
**జయతు రావణాదిప్రమర్దకః ।**
**జయతు స్వం పదం ప్రాప సీతయా**
**జయతు మంగళస్నానకృన్ముదా ॥ 32**

**జయతు వాక్యతో భూసురస్య యః**
**సకలభూతలం పర్యటన్ చిరమ్ ।**
**జయతు యాగకృల్లోకశిక్షయా**
**జయతు జానకీం రంజయన్ స్థితః ॥ 33**

**శ్రీరామదాస ఉవాచ**
**రఘువరస్య యత్పక్షిభిః కృతం**
**నవకముత్తమం యః పఠిష్యతి ।**
**తపననిర్గమే భక్తితత్పరో**
**నిజమనోఽర్థితం సంగమిష్యతి ॥ 34**

**ఏతాదృశే రమ్యగేహే మయా శిష్య ప్రవర్ణితే ।**
**సీతయా స సుఖం రేమే చైకపత్నీవ్రతస్థితః ॥ 35**

**అథ సా జానకీ దేవీ రంజయామాస రాఘవమ్ ।**
**స్థితం మంచకవర్యే తం నిజక్రీడాదికౌతుకైః ॥ 36**

**మంచకస్థశ్చ శ్రీరామస్త్వేకదా సుఖనిర్భరః ।**
**సీతాసౌందర్యమాలోక్య వర్ణయాస తాం ముదా ॥ 37**

సీతతోడ చిరకాలము భోగించుచు శ్రీరాముడు జయించనీ. కైకేయిచే వనమునకు పంపబడినవాడు జయించనీ. బహుకాలము పర్వతవాసియగువాడు జయించనీ. అరణ్యమున అత్రిచే సంపూజింప బడినవాడు జయించనీ. విరాధునిని హింసించి, కరదూషణాదులను సంహరించి, మాయామృగమునకు జన్మరాహిత్యమును ఇచ్చి, కబంధుని చంపినవాడు జయాన్వితుడై ఉండవలయును. వాలిని సంహరించి, సేతువును కట్టించి, రావణాదులను నిర్మూలించి, తనరాజ్యమునకు ఏతెంచి, మంగళస్నానముచే లోకమోహనుడై వెలిగినవాడు జయయుతుడు అగుగాక! బ్రాహ్మణ వాక్యముచే భూమిని చుట్టివచ్చి, లోకశిక్షణకై యజ్ఞములను ఆచరించి, సీతాదేవితో క్రీడించుచుండువాడు జయియై విరాజించుచుండనీ.

(33) శ్రీ రామదాసు చెప్పుచున్నాడు. సూర్యాస్తమయమున భక్తితో ఎవ్వడు ఈ పక్షులచే పాడబడిన తొమ్మిది శ్లోకములను చదువునో వానికి మనోరథము సిద్ధించును.

## శ్రీరాముడు సీతాదేవిని అభివర్ణించుట

ఇట్టి మనోహరమగు మందిరమున శ్రీరాముడు ఏకపత్నీవ్రత పరాయణుడై సీతతోడ సుఖముగ క్రీడించుచుండెను. పిదప జానకీదేవి, తనతోకూడిన శ్రీరాముని తన ఆటపాటలు మొదలగు వేడుకలచే రంజింపజేసెను. ఒకప్పుడు మంచముపై ఎక్కియున్న శ్రీరాముడు సీతయొక్క సౌందర్యమునుజూచి, సంతోషముతో ఇట్లు అభివర్ణించెను.

**హే సీతే కంజనయనే బ్రహ్మణా త్వం కథం చితా ।**
**జానామ్యహం వితర్కేణ తేన త్వం నిర్మితాఽసిన ॥ 38**

**త్వద్రూపసదృశీం నాన్యాం పశ్యామి జగతీతలే ।**
**ప్రతిపచ్చంద్రకలయా స్పర్ధయంతి నఖాని తే ॥ 39**

**నఖమధ్యా రక్తవర్ణాః శుభా దాడిమబీజవత్ ।**
**అంగుష్ఠౌ వర్తులౌ రమ్యౌ శిశ్వంగుష్ఠోపమౌ తవ ॥ 40**

**మృదులే తే పాదతలే కంజపత్రాంతిరోపమే ।**
**సమే రేఖాధ్వజయుతే స్వస్తికాదిసుచిహ్నితే ॥ 41**

**సీతే తేంఘ్ర్యూర్ధ్వభాగౌ తౌ నిర్లోమౌ మాంసలౌ శుభౌ ।**
**అశిరౌ మృదులౌ పీతౌ నృపస్త్రీవందనోచితౌ ॥ 42**

**పాదమూలే దధిజేన స్పర్ధేతే రక్తవర్తులే ।**
**పాదపృష్ఠం సమే పీనే కోమలే లోమవర్జితే ॥ 43**

**తవ గుల్ఫౌ రక్తవర్ణౌ వర్తులౌ మాంసలౌ శుభౌ ।**
**జంఘే గోపుచ్ఛసదృశే వర్తులే మాంసలే శుభే ॥ 44**

**నిర్లోమే మృదులే పీనే హ్యశిరే సరలే వరే ।**
**వర్తులౌ తే మహాజానూ మాంసలౌ బీజపూరవత్ ॥ 45**

రంభాస్తంభోపమే చోరూ మాంసలౌ త్వతికోమలౌ ।
పీనౌ ఘనౌ వర్తులౌ తౌ విలోమౌ మే సుఖోచితౌ ॥ 46

జఘనం మాంసలం రమ్యం వర్తులం గజకుంభవత్ ।
పీనం విలోమం సుస్నిగ్ధం మమ చిత్తైకమోహనమ్ ॥ 47

నాహం తే వర్ణనే శక్తో రతిస్థానస్య భామిని ।
గంభీరా వర్తులా నాభిస్తవ రమ్యా ప్రదృశ్యతే ॥ 48

వలిత్రయం తు జఠరే దృశ్యతే త్రిస్రువేణివత్ ।
మృగరాజస్య కటినా తుల్యాస్తే కటిరుత్తమా ॥ 49

రమ్యం తవోదరం సూక్ష్మం మృదులం మాంసలం శుభమ్ ।
విలోమం పీతవర్ణం చ పుత్రోత్పత్తివిసూచకమ్ ॥ 50

ఓ జానకీ! నీవు బ్రహ్మచే ఎట్లు నిర్మింపబడియుందువు? తర్కించి చూచినపుడు అతడు నిన్ను నిర్మించలేదని తోచుచున్నది. నీతో సమానమగు రూపముగల వేరొక పడతి ఈ జగమున నేను ఎఱుగను. నీ గోళ్ళు పాడ్యమినాటి చంద్రరేఖతో పోరాడుచున్నవి. నీ నఖమధ్యములు ఎఱ్ఱని మేలైన దానిమ్మవిత్తులవలే ఉన్నవి. నీ బ్రొటనవ్రేళ్ళు గుండ్రముగా మిక్కిలి సొగసై బిడ్డల బొటనవ్రేళ్ళవలే ఉన్నవి. మెత్తని నీ అఱికాళ్ళు తామరరేకుల మధ్యభాగములవలె వెలుగుచు సమముగా, స్వస్తిక ధ్వజాది దివ్యరేఖాంకితములై ఉన్నవి. నీ మీగాళ్ళు నరములు కనబడక, రోమములు లేక బలిసి, కోమలముగాను, మృదువుగాను, పసుపు వన్నెగలదిగాను, రాజస్త్రీల ప్రణామములకు తగినవిగా ఉన్నవి. నీ పాద మూలములు వెన్నముద్దతో పోట్లాడుచు గుండ్రముగా ఎఱ్ఱగా ఉన్నవి. పాదపృష్ఠములు వెంట్రుకలు లేక కోమలముగా, పచ్చగా, సమముగా ఉన్నవి. నీ చీలమండలములు గుండ్రముగా, యెఱ్ఱగా బలిసి శోభించు చున్నవి. నీ పిక్కలు ఆవుతోకవలె గుండ్రముగా బలిసి నరములు కనబడక చక్కగా ఉన్నవి. అవి సరళములు, మృదులములు, నిర్లోమములు. నీ మోకాళ్ళు మాదిఫలములవలె గుండ్రముగా బలిసి ఉన్నవి. నీ తొడలు మిక్కిలి కోమలములుగాను, వెంట్రుకలు లేక పసుపు రంగునుపోలి, వర్తులములును, దట్టముగాను, నాసుఖపాత్రములై ఉన్నవి. నీ మణికట్లు, నా మనసునకు మాత్రమే మోహకారములై గజకుంభస్థలమువలె గుండ్రముగా బలిసి విలోమమగు వెలయుచున్నది. నీ రతిస్థానమును వర్ణించుటకు శక్తుడను కాను. నీ బొడ్డు గుండ్రముగా, సొగసుగ, లోతుగా కనబడుచున్నది. నీ కడుపుమీద మూడు ముడతలు త్రివేణివలే ఉన్నవి. నీ నడుము సింగపు నడుమునకు

సాటియై ఉన్నది. నీ కడుపు మృదువుగాను, మనోహరముగాను, పసుపువన్నెగలదిగాను, రోమవిహీనముగాను, పుత్రసంతానమును సూచించునదిగాను బలసి బాగుగా ఉన్నది.

వంశస్య శకలేనైవ స్పర్ధతే తవ మాంసలః ।
పృష్ఠస్తంభః కోమలశ్చ నిమ్నో లోమవివర్జితః ॥ 51

పార్శ్వేఽతిమృదులే పీతే మాంసలే లోమవర్జితే ।
కుక్షీ పీనే లోమహీనే మాంసలే కించిదున్నతే ॥ 52

హృదయం కోమలం రమ్యం మాంసలం పీనమున్నతమ్ ।
విస్తీర్ణం లోమహీనం చ సుస్నిగ్ధం సౌఖ్యదం మమ ॥ 53

హేమకుంభసమానౌ ద్వౌ కుచౌ పీనౌ ఘనౌ శుభౌ ।
గజశుండాతుండతుల్యే పీనౌ తే కోమలౌ భుజౌ ॥ 54

కృశా రమ్యాః కోమలాశ్చ తేఽంగుల్యో జనకాత్మజే ।
రక్తే పాణితలే శంఖధ్వజమత్స్యాదిచిహ్నితే ॥ 55

మాంసలే కోమలే ప్రోచ్చైః సురేఖామండితే వరే ।
కరపృష్ఠే లోమహీనే మాంసలే కోమలే శుభే ॥ 56

పీనౌ స్కంధౌ వర్తులౌ తే జత్రుస్తే మాంసపూరితః ।
కంబుకంఠోఽతిపీనశ్చ సవళిత్రయ ఉత్తమః ॥ 57

మధ్యే నిమ్నం సుపీనం తే చుబుకం వర్తులం మృదు ।
ప్రవాలబింబసదృశశ్చారక్తః కోమలౌ ఘనః ॥ 58

సీతే తేఽధోఽధరో భాతి మధురోఽమృతసన్నిభః ।
కుందపుష్పకలికయా స్పర్ధంతే దశనాస్తవ ॥ 59

సాంద్రాః కృత్రిమపర్ణైశ్చ కృష్ణవర్ణా మనోహరాః ।
హేమపుష్పైర్హేమతంతుబంధైశ్చిత్రవిచిత్రితాః ॥ 60

ఊర్ధ్వాధరః కోమలస్తే రక్తవర్ణో విభాత్యయమ్ ।
ఋజు ఘ్రాణమున్నసం తే దివ్యం భాతి మనోహరమ్ ॥ 61

నీ వెన్నెముక కోమల స్తంభమువలె వెదురు బద్దనుపోలి, లోతుగా నునుపుగా ఉన్నది. మిక్కిలి మెత్తని నీ ప్రక్కలు వెంట్రుకలు లేక బలిసి చక్కగాఉన్నవి. నీ కుక్షి కొంచెము మెత్తగా పచ్చగా మెచ్చతగి యున్నది. నీ యెద ఎత్తుగా విస్తీర్ణముగా మిగుల రమ్యముగా, కోమలముగా, బంగారు వన్నెగలదిగా నాకు మిక్కిలి సౌఖ్యకరముగా ఉన్నది. నీ స్తనములు రెండును కనకకలశములవలె ఘనముగా బలిసి శోభనములుగా ఉన్నవి. ఎనుగు తొండము వలె నీ భుజములు రెండును సొంపుగా ఇంపై ఉన్నవి. నీ వ్రేళ్ళు సొగసుగా, సన్నగా ఉన్నవి.

నీ అరచేతులు మత్స్య, శంఖ, ద్విజాది రేఖలచే చక్కగా అలంకరింపబడి మెత్తగా, ఎఱ్ఱగా, చక్కగా ఉన్నవి. నీ చేతులు, నీ రోమములును కోమలములు, శుభప్రదముగా ఉన్నవి. నీ మూపులు గుండ్రముగా బలిసియున్నవి. నీ మెడ కొంకులు మాంసపూరితములై, మనోజ్ఞములుగా ఉన్నవి. శంఖమువంటి నీ మెడ మిక్కిలి చక్కగా ఉన్నది. నీ గడ్డము నడుమ లోతుగా మెత్తగా గుండ్రముగా బలిసి, సుపీనమై అసమానమనబడుచున్నది. దొండపండువలె, లేత చిగుళ్ళవలె, పగడమువలె నీ నోరు మిక్కిలి మక్కువనిచ్చుచున్నది. జానకీ! నీ మధురమగు అదరము దివ్యామృతము వలె భవ్యంబై ఉన్నది. నీ దంతములు కుందకుట్మలములతో స్పర్ధజేయునని నిర్ధారించతగిఉన్నవి మరియు అవి పండ్లపూడి మొదలైన వన్నెలచే చెన్నుమీరు నల్లగా ఉల్లాసకరములై బంగారు సరిగ కట్లచే కనక కుసుమాలతో కాంతిప్రదములై ఉన్నవి. నీ పైపెదవి రక్తవర్ణమై రక్తిని ఇచ్చుచున్నది. నీ యొక్క చక్కని ముక్కు మెత్తగా మిక్కిలి మనోహరమైనది.

**తవ నేత్రే కంజపత్రతుల్యే దీర్ఘే మనోహరే ।**
**హరిణీనేత్రసదృశే కామబాణవివ ప్రియే ॥ 62**

**తవ కర్ణౌ ఘనౌ పీనౌ బహుభారసహౌ వరౌ ।**
**తవ సీతేఽతిసుస్నిగ్ధే ప్రోచ్చే గండస్థలే శుభే ॥ 63**

**కృశే భ్రువౌ చాపతుల్యే కృష్ణవర్ణే సుకోమలే ।**
**లలాటం తవ విస్తీర్ణం మాంసలం హి సమం మృదు ॥ 64**

**గంగాకూలోపమః సీతే సీమంతస్తవ సుందరః ।**
**హేమతంతుసమానాస్తే కేశాః స్నిగ్ధాః సుకోమలాః ॥ 65**

**మస్తకస్తవ సూక్ష్మాశ్చ వర్తులో మాంసలః శుభః ।**
**వేణీబంధో వరః సీతే జఘనే పతితస్తవ ॥ 66**

చంపపుష్పోపమో వర్ణః సౌకుమార్యమపి ప్రియే ।
సీతే తవాననస్పర్ధీ శశాంకః క్షయమాప సః ॥ 67

త్వన్నేత్రవిజితా సీతే మృగీ ధావతి కాననే ।
సీతే త్వద్భ్రుకుటిస్పర్ధీ చాపం భగ్నం మయా పురా ॥ 68

తవ నేత్రకటాక్షేణ మునీనాం మదనోద్భవః ।
నేత్రయోస్తవ చాంచల్యం మకరాన్ లజ్జయత్యహో ॥ 69

తవ ఘ్రాణం శుకో దృష్ట్వాఽఽత్మానం ధిక్కరోతి హి ।
దృష్ట్వోష్ఠయోః శోణిమాం తే సౌకుమార్యమపి ప్రియే ॥ 70

సహకారతరోశ్చాపి రక్తః కోమలపల్లవః ।
లజ్జయా హరితో భాతి త్యక్త్వా స్వీయాం సురక్తతామ్ ॥ 71

సౌకుమార్యం తథా త్యక్త్వా లజ్జయా తే ఘనోఽపి సః ।
ఏవం కిం కిం మయా కాంతే సౌందర్యం తవ జానకి ॥ 72

వర్ణనీయం మహద్దివ్యం తత్ర బ్రహ్మోఽపి కుంఠితః ।
ఇత్యుక్త్వా రాఘవః సీతాం ప్రీత్యా తాం పరిషస్వజే ॥ 73

తచ్ఛ్రుత్వా వర్ణనం స్వీయం లజ్జయాఽధః కృతాననా ।
కించిత్స్మితాననం కృత్వా తస్థావంకే పతేశ్చ సా ॥ 74

**ఇతి శ్రీశతకోటిరామచరితాంతర్గతే, శ్రీమదానందరామాయణే, వాల్మీకీయే, ఆదికావ్యే, విలాసకాండే, సీతావర్ణనం నామ, ద్వితీయః సర్గః ॥**

నీ నేత్రములు తామర పత్రములవలె విశాలములై, మనఃప్రీతిపాత్రములై లేడినేత్ర సమానములై, మన్మథబాణములవలె మనస్సును దోచుచున్నవి. ప్రేయసీ! నీ చెవులు దట్టమై, భారసహనములుగా బలిసి, బాగా లీలనొదవించుచున్నవి. నీ చెక్కిళ్ళు మిక్కిలి చిక్కగా, ఎత్తుగా ఉత్తమములై ఉన్నవి. నీయొక్క సన్నని కనుబొమ్మలు విల్లువలె వక్రములై నల్లగా ఉల్లాసప్రదములుగా ఉన్నవి. నీ నుదురు మృదుల విశాలమై విరాజిల్లు చున్నది. నీ పాపట గంగాకూటమువలె సుందరమైనది. మృదువైన నీ

తల వెంట్రుకలు మిక్కిలి కోమలములై కనకతంతువులవలె మెరయుచున్నవి. నీ తల గుండ్రముగా స్వస్తి ప్రదమై, ప్రశస్తమనబడినది. సుఘనమగు నీ జడ కడు శోభతో నడుము వరకు వచ్చి ఆడుచున్నది. ప్రియురాలా! నీ సౌకుమార్యము ఎఱ్ఱనికాంచనపుష్పసమాన సుఖరాగమైనది. జానకీ! చంద్రుడు నీ మోముతో దెబ్బలాడి క్షయించుచుండును. సీతా! నీ కండ్లచే గెలువబడిన లేడి ఆ అడవిలో పారిపోవుచున్నది. కాంతామణీ! నీ కనుబొమ్మలలో పోటిగా వచ్చినదని వెనుక ధనస్సు నాచే భగ్నమయ్యె. నీ కడగంటి చూపుచే మునీంద్రులు కూడా మన్మథావిష్టులగుదురు. నీ కండ్లలోని చాంచల్యము మకరములకు లజ్జనిచ్చుచున్నది. చిలుకలు నీ ముక్కునుజూచి తమ్ముతామే నిందించుకొనుచున్నవి. తియ్యమామిడి చిగుళ్ళు నీ పెదవుల ఎఱుపును ఎరిగి సిగ్గుపడి తమ ఎఱుపును వదలి పచ్చగా మారిపోవుచున్నవి. అట్లే మేఘము నీ సుకుమారమునుజూచి సిగ్గుపడి పారిపోవుచున్నది. ప్రేయసీ! నేనే నీ సౌందర్యమును వర్ణించెదను. బ్రహ్మదేవుడును నిన్ను వర్ణింపనేరక అశక్తుడనబడె. ఇట్లు పలుకుచు ప్రీతిచే సీతాదేవిని హృదయమునకు హత్తుకుని, ఆనందనిర్భర్యుడయ్యె. ఈ స్వీయవర్ణమును విని, సీతాదేవి లజ్జచే తలవంచుకుని, మందహాసమును చేయుచు, కాంతుడగు శ్రీరాముని అంకమును అలంకరించి ఉండెను.

***శతకోటిప్రవిస్తరమైన రామకథలో, శ్రీమద్వాల్మీకిమహర్షిచే రచింపబడిన, ఆనందరామాయణంలోని, విలాసకాండలో, సీతావర్ణనను తెలుపు రెండవసర్గ ముగిసినది.***



# తృతీయః సర్గః-3వ సర్గ

దేహరామాయణ వర్ణన

శ్రీరామదాస ఉవాచ

అథ సా జానకీ రామం వినయాల్లజ్జితాఽబ్రవీత్ ।
రామ రాజీవపత్రాక్ష కించిత్ప్రష్టుం మమ ప్రభో ॥ 1

వాంఛాఽస్తి చేత్కరోష్యాజ్ఞాం తర్హి పృచ్ఛామ్యహం తవ ।
తత్సీతావచనం శ్రుత్వా రాఘవః ప్రాహ జానకీమ్ ॥ 2

పృచ్ఛస్వ సీతే యత్తేఽస్తి ప్రష్టవ్య మాం సుఖేన తత్ ।
మా శంకాం భజ రంభోరు గుహ్యం చాపి వదామి తే ॥ 3

తద్రామవచనం శ్రుత్వా నత్వా తం ప్రాహ జానకీ ।
రామ రామ మహాబాహో కించిదుపదిశస్వ మామ్ ॥ 4

యేన మాం తవ సంజ్ఞానం భవేచ్చైవ మహోజ్జ్వలమ్ ।
తత్సీతావచనం శ్రుత్వా రామచంద్రోఽబ్రవీద్వచః ॥ 5

సమ్యక్ పృష్టం త్వయా సీతే శ్రుణుష్వైకాగ్రమానసా ।
మమ జ్ఞానాయ తే వచ్మి పరం కౌతూహలం శుభమ్ ॥ 6

శ్రీరామచంద్ర ఉవాచ

సచ్చిదానందరూపాఖ్యసాగరస్య తదిచ్ఛయా ।
తరంగరూపయాఽఽత్మాంశబిందుః శుద్ధో వినిర్గతః ॥ 7

ఆత్మనామా మాతృభూతబుద్ధేర్జఠరసంభవః ।
శుద్ధసత్వాంతః కరణం పితా చాత్మాన ఈరితః ॥ 8

తస్యాత్మనశ్చ చత్వారో భేదాస్తే బంధవః స్మృతాః ।
తుర్యావస్థస్తత్ర వరస్తతో జాగ్రదవస్థకః ॥ 9

**స్వప్నావస్థ స్తృతీయశ్చావరః సుషుప్త్యవస్థకః ।**
**హృదయాకాశస్తస్థానం మనోవేగో బహిర్గమః ॥ 10**

## శ్రీరాముడు సీతాదేవికి సంజ్ఞానపేటికను ఇచ్చుట.

శ్రీరామదాసు ఇట్లు పలికెను, "తరువాత ఆ సీతాదేవి వినయమువలన లజ్జించుచు శ్రీరాముని జూచి, "రాజీవాక్షుడవగు శ్రీరామా! మన్మథ! నిన్ను నేను కొంచెము అడుగనెంచితిని. నీకు అది ఇష్టమైన ఆజ్ఞను ఒసంగుము. అంత నేను ప్రశ్నజేసెదను," అని విన్నవించెను. అందుకు శ్రీరాముడు, "ప్రేయసీ! నీవేమి అడుగ దలచితివో దానిని అడుగుము, శంకించవలదు. రహస్య విషయమై ఉండినను చెప్పెదను," అని అనుగ్రహించెను. అంత ఆ జానకీదేవి శ్రీరామునికి నమస్కరించి, "మహానుభావడగు శ్రీరామా! మహోజ్వలమగు నీ సంజ్ఞానము నాకు ఎట్లు లభించునో దానిని ఉపదేశించి ఉద్ధరించుము," అని ప్రార్థించెను. ఆ సీతాదేవిప్రశ్నను విని, శ్రీరాముడు ఇట్లు చెప్పుచున్నాడు. "దేవీ! నీవు చక్కగా అడిగితివి. ఏకాగ్రమానసవై వినుము. నాయొక్క విజ్ఞానము కొరకు నీకు మిక్కిలి కుతూహలమగు మంగళవిషయమును నిరూపించు చున్నాను. అదెట్లనిన....

నిషేధ ప్రతియోగి అగుటచేత 'సత్త'నబడి సంవిద్రూపమగుటచే 'చిత్' అనబడి నిత్యానందమగుటచే 'ఆనంద'మనబడి అపారమును, గంభీరమును అగుటచే సముద్ర సదృశ్యమైన సచ్చిదానంద లక్షణుడగు సాగరుడు పరమాత్మనుండి తరంగాత్మాకమగు తన ఇచ్చచేత శుద్ధమగు ఆత్మాంశబిందువు వెలువడెను. అదియే ఆత్మయనబడును. ఆ యాత్మ తల్లియైన బుద్ధియొక్క కడుపున పుట్టినది. ఆ యాత్మకు శుద్ధసత్వమగు అంతఃకరణము తండ్రిగా చెప్పబడినది. అట్టి ఆత్మకు నాలుగు భేదములు గలవు. వాటిని సోదరులని చెప్పెదరు. అందులో తురీయావస్థుడు శ్రేష్ఠుడు. పిదప జాగ్రదవస్థ గలవాడు మూడవవాడు, స్వప్నావస్థుడు నాలుగవవాడు, సుషుప్తి అవస్థ గలిగినవాడు రెండవవాడు, వాని స్థానము హృదయాకాశ మనబడును.

**మనోదుర్వృత్తిఘాతశ్చ మనోవేగస్య ఖండనమ్ ।**
**మాయాయోగస్తతస్తస్య పూర్వసంస్కారనిగ్రహః ॥ 11**

**తతః కుబుద్ధిహేతోర్హి భవారణ్యేఽటనం చిరమ్ ।**
**దంభస్య నిగ్రహస్తత్ర పంచభూతాత్మకా స్థిరా ॥ 12**

**ఆత్మనః పర్ణకుటికా విశ్రాంతిస్థానమీరితా ।**
**కామక్రోధలోభజయస్తత్రాశాకృంతనం స్మృతమ్ ॥ 13**

మోహస్య నిగ్రహస్తత్ర శుద్ధమాయాశ్రయస్తతః ।
తేజోరూపా తు యా మాయా జఠరాగ్నీ తదా స్మృతా ॥ 14

తామస్యాశ్చైవ మాయయా వియోగశ్చ తదా స్మృతః ।
సుఖాలాభో మహాన్క్లేశాః శోకభంగస్తతః పరమ్ ॥ 15

వివేకస్యాశ్రయస్తత్ర భక్త్యుద్రేక సమాగమః ।
అవివేకవధశ్చాపి హ్యుత్సాహేన సమాగమః ॥ 16

అజ్ఞానతరణోపాయస్త్రిగుణాశ్రయసద్మని ।
లింగాఖ్యనిగ్రహస్తత్ర మదస్య సంప్రకీర్తితః ॥ 17

నిగ్రహో మత్సరస్యాపి తతోఽహంకారనిగ్రహః ।
వియోగో లింగదేహస్య మాయానామైక్యతా తతః ॥ 18

హృదయాకాశగమనమానందైకసుఖం తతః ।
మాయాత్యాగస్తతశ్చైవ సాత్వికాగ్రహణం స్మృతమ్ ॥ 19

మనోవేగమే వాని బయటి సంచారము. మనసున కలిగిన దుర్వృత్తుని ధ్వంసముచేయుట, పిదప మనోవేగమును కుంచించుట అట్టి ఆత్మకు మాయామోహము ఘటించుచున్నది. పిదప పూర్వజన్మసంస్కారమును నిగ్రహించుట. పిదప దుర్బుద్ధియే కారణమగుట చేత సంసారారణ్య సంచారము సంభవించినది. పిదప దంభమును నిగ్రహించుట, పిదప అతడు పంచభూతాత్మకుడై నిశ్చలముగా ఉండుట, ఆత్మకు పర్ణశాలయే విశ్రాంతిస్థానముగా చెప్పబడినది. పిదప ఆ యాత్మ కామ, క్రోధ, లోభములను జయించి ఆశను కత్తిరించుచున్నాడు. పిదప మోహము నిగ్రహింపబడగా శుద్ధమాయను ఆశ్రయించుచుండును. తేజోరూపమగు మాయ జఠరాగ్నిలో లీనమగును. తామసరూపమగు మాయ అపుడు తొలగిపోవును. సుఖలాభము లేదను గొప్పక్లేశము సంభవించగా అపుడు శోకభంగమగుచున్నది. పిదప అచట వివేకము వచ్చి ఆశ్రయించును. అచట నడుమ భక్త్యాతిశయము వచ్చిచేరును. పిమ్మట ఆ అవివేకము నశించును. అటుమీద ఉత్సాహము వచ్చిచేరును. పిదప అజ్ఞానమును అతిక్రమించుటకు ఉపాయము సందింపబడి, త్రిగుణాశయమగు దేహమునందు లింగమును నిగ్రహించుట. అందులో మదమును మర్దించి, మాత్సర్యమును ధ్వంసము చేసి, అహంకారమును నిర్మూలనము చేయవలయును. పిదప లింగదేహము వియోగమై పోగా, మాయతో కూడా ఈ ఆత్మకు ఐక్యత సంభవించును. పిదప హృదయాకాశమునకు వచ్చుట, అంత ఆనందైక సుఖము కలుగుట. అటుమీదట మాయను వదిలివేయుట.

సాత్త్విక్యా మాయయా సార్ధం హృదయాకాశముత్తమమ్ ।
మహాకాశే ప్రణయనం సచ్చిదానందసంజ్ఞకే ॥ 20

ప్రవేశనం సాగరే హి ముక్తిర్జ్ఞేయాఽఽత్మనః శుభా ।
సాయుజ్యా సా పరిజ్ఞేయా ముక్మిర్ముక్తిచతుష్టయే ॥ 21

ఏవం మయేయం తే ప్రీత్యా సీతే సంజ్ఞానపేటికా ।
వేదసారైర్గూఢార్థైరజ్ఞానమతినాశకైః ॥ 22

మత్‌జ్ఞానదైః పంచదశశ్లోకరత్నైః ప్రపూరితా ।
సమర్పితా గృహాణ త్వమస్యాం బుద్ధ్వాఽవలోకయ ॥ 23

భవిష్యతి మమ జ్ఞానమస్యాః సమ్యగ్విచారతః ।
తద్రామవచనం శ్రుత్వా సీతా సంజ్ఞానపేటికామ్ ॥ 24

నిజహృన్మందిరే స్థాప్య బుద్ధిదృష్ట్యా ముహుర్ముహుః ।
సమ్యగుద్ఘాట్య తూష్ణీం సా ముహూర్తమవలోకయత్ ॥ 25

తదా జ్ఞాత్వాఽథ సకలాం నిజక్రీడాం విదేహజా ।
విహస్య రఘువీరస్య సా ననామాంఘ్రిపంకజే ॥ 26

ఆనందనిర్భరా జాతా సానందాశ్రుసమన్వితా ।
ఆనందోత్ఫుల్లరోమాంచా తూష్ణీమాసీత్తదా క్షణమ్ ॥ 27

ఆనందనిర్భరా సీతాం దృష్ట్వా తాం రాఘవోఽబ్రవీత్ ।
పేటికాయాం త్వయా సీతే కిం దృష్టం తోషకారకమ్ ॥ 28

కచ్చిద్గతం తవాజ్ఞానం కచ్చిల్లబ్ధం మమ త్వయా ।
సంజ్ఞానం వద మాం సీతే యథా జ్ఞాతం త్వయా హృది ॥ 29

జ్ఞాతం త్వయా వా న జ్ఞాతం వేత్తుమిచ్ఛామి త్వన్ముఖాత్ ।
యది కించిత్త్వయా నస్యాం జ్ఞాతం తద్బోధయామ్యహమ్ ॥ 30

ఇతి రామవచః శ్రుత్వా నిమగ్నాఽఽనందసాగరే ।
మంచకస్థా రామచంద్రం జానకీ వాక్యమబ్రవీత్ ॥ 31

పిమ్మట సాత్త్వికి అగు మాయను స్వీకరించి, ఆమెతోడ నీ హృదయాకాశమును సచ్చిదానంద ఆత్మకమగు మహాకాశమున చక్కగా చేర్చునది. సాగర ప్రవేశ్యకమే ఆత్మముక్తిగా ఎంచబడును. అదియే చతుర్విధ ముక్తులలో సాయుజ్యముక్తి అనబడుచున్నది. (21) సీతాదేవీ! ఇట్లు నీకు నేను వేదశాస్త్రసారములును, బ్రహ్మజ్ఞాన ప్రదములును, రహస్యార్థములును, అజ్ఞానమతి నిరాకారములును అగు పదిహేను శ్లోకములను రత్నములచే నిండియుండు సంజ్ఞాన పేటికను అనుగ్రహించి ఇచ్చితిని. దీనిని నీవు గ్రహించి, నీ బుద్ధిచే దీనిని చక్కగా నొక్కిచూడుము. దీనియొక్క చక్కని విచారముచేత నాయొక్క జ్ఞానము కలుగును. ఇట్లని శ్రీరాముడు తత్త్వోపదేశము చేయగా ఆ రామ వాక్యామృత వచనములను సంజ్ఞాన పేటికను జనకపుత్రి తన మనోమందిరమున సంస్థాపించి, బుద్ధి దృష్టిచే పలుమారు పర్యాలోచించి, చక్కగా తెరచి, ఊరకే ముహూర్తకాలము పరిభావించు చుండెను. పిమ్మట వైదేహీ దేవి తనయొక్క క్రీడయగు సంగతినంతటిని తెలిసి, నవ్వుచూ శ్రీరాముని చరణ కమలములకు నమస్కరించెను. అపుడు సీతాదేవి ఆనందితురాలై దేహమున ఆనంద రోమాంచనములను నయనములలో ఆనందాశ్రువులు కలిగి ఊరకే క్షణకాలము ఉండెను. అపుడు శ్రీరాముడు ఆనంద నిభరాంగియైన సీతనుజూచి, "సంతోషకరమగు సంగతి సంజ్ఞానపేటికయందు నీచే ఏమి తెలియబడినది? నీ అజ్ఞానము నివృత్తించెనా? నాయొక్క సంజ్ఞానము తెలిసి సదా నీకెట్లు తెలిసినదో ఆసంగతిని చెప్పుము. నీకు తెలుసునో తెలియలేదో నాకు తెలియదు. నీ నోటినుండి వినగోరుచున్నాను. ఒకవేళ ఏదైనను నీకు తెలియని దానిని నేను చెప్పెదను," అని పలుకగా అందుకు సీతాదేవి మంచముపై ఆనంద సాగరనిమగ్నియై శ్రీరాచంద్రునికి ఇట్లు విజ్ఞాపించుచున్నది....

**శ్రీసీతోవాచ**

**రామ రావణదర్పఘ్న త్వద్దత్తా జ్ఞానపేటికా ।**
**మయాఽవలోకితా బుద్ధ్యా లబ్ధం జ్ఞానం తవ ప్రభో ॥ 32**

**నిర్గుణో నిర్వికారస్త్వం క్రీడేయం సకలా త్వయా ।**
**మత్సంగాద్దర్శితా భూమ్యాం కృత్వా లోకహితాయ హి ॥ 33**

**పేటికాయాం యథా జ్ఞాతం మయా తత్ప్రవదామి తే ।**
**త్వయా పంచదశశ్లోకైర్యుక్తా గుహ్యముత్తమమ్ ॥ 34**

**ప్రకటం తత్కరోమ్యద్య తవాగ్రే రఘునందన ।**
**సర్వేషాం మందబుద్ధీనాం హితాయ జ్ఞానసిద్ధయే ॥ 35**

**జనానాం సంబోధయితుం చరిత్రం భవతాఽత్ర యత్ ।**
**కృతం తస్య విచారేణ హ్యాత్మజ్ఞానం లభేన్నరః ॥ 36**

సచ్చిదానందరూపీ యో విష్ణుర్జ్ఞేయః స సాగరః ।
భూభారహరణాదీచ్ఛా విష్ణోర్యా జాయతే శుభా ॥ 37

స వై జ్ఞేయస్తరంగోఽత్ర తయాత్మాంశలవః శుభః ।
బహిః కృతః సాగరాత్స ఆత్మాఖ్యః కథ్యతే భువి ॥ 38

బుద్ధిస్తు జననీ చైవ కౌసల్యా సాఽత్ర కథ్యతే ।
శుద్ధసత్త్వాంతః కరణం పితా తస్యాత్మనః స్మృతిః ॥ 39

రాజా దశరథో జ్ఞేయః శ్రీమాన్సత్యపరాక్రమః ।
తస్యాత్మనశ్చ చత్వారో భేదాస్తే బంధవః స్మృతాః ॥ 40

రామసౌమిత్రిభరతశత్రుఘ్నా ఏవ చాత్ర హి ।
తుర్యావస్థస్తేషు వరః స త్వం దశరథాత్మజః ॥ 41

తతో జాగ్రదవస్థశ్చ లక్ష్మణః సోఽత్ర కథ్యతే ।
స్వప్నావస్థస్తృతీయశ్చ భరతోఽపి నిగద్యతే ॥ 42

అవరః సుషుప్త్యవస్థస్తు జ్ఞేయః శత్రుఘ్న ఏవ సః ।
హృదయాకాశం తత్స్థానమయోధ్యాఽత్ర స్మృతా తు సా ॥ 43

సీతాదేవి చెబుతున్నది, "రావణ దర్పమణిచిన రామా! నీవు ఇచ్చిన జ్ఞానభాండాగారాన్ని నేను బుద్ధితో చక్కగా విచారించి, నీయొక్క సంజ్ఞానమును సంగ్రహించితిని. నీవు నిర్గుణుడవు, నిర్వికారుడవు, నాయొక్క సంగమువలన భూమిలో లోకహితముకొరకై ఈ సమస్తక్రీడ నీచే చూపబడినది. నేనెట్లు సంజ్ఞాన పేటికయందు తత్త్వమును గ్రహించితినో దానిని చెప్పెదను. మూఢబుద్ధులగువారందరి హితమునకు జ్ఞానసిద్ధికిని నీవు చెప్పిన (7వ శ్లోకం నుండి 21వ శ్లోకం వరకు) పదిహేను శ్లోకములలోని గూఢార్థమును ప్రకటించుచున్నాను. లోకులకు తెలివిని ఇచ్చుటకై నీ చేత ఏ చరిత్రము అనుకరింప బడెనో అట్టి నీ చరిత్రను విచారించుటచేత మానవునికి ఆత్మజ్ఞానము కలుగును. (36)

## సీతాదేవి దేహరామాయణ తత్త్వమును నిరూపించుట.

ఎవడు సచ్చిదానందరూపుడో వాడే విష్ణువని తెలియుచున్నది. అతడే సాగరుడు. వానియొక్క భూభార హరణాది ఇచ్ఛయే తరంగమనబడును. వానినుండి వెలువడిన ఆత్మాంశబిందువే పురుషోత్తముడను జీవాత్మ శ్రీరాముడనబడును. వాని జనని బుద్ధి, ఇచ్చట అది కౌసల్య అనబడును.

వాని తండ్రి శుద్ధ సత్త్వ అంతఃకరణము, అది ఇచ్చట సత్యపరాక్రముడగు దశరథమహారాజుగా ఎంచబడును. ఆ దాశరథి ఆత్మయొక్క భేదములు నాలుగును తమ్ములుగా ఎంచబడును. ఇచట లక్ష్మణ, భరత, శత్రుఘ్నులన బడుదురు. వారిలో తురీయావస్థ అనుభవవ్యక్తియే శ్రేష్ఠుడగు శ్రీరాముడగు నీవు. పిదప జాగ్రదావస్థ అను అనుభవవ్యక్తి లక్ష్మణుడు, మూడవదియగు స్వప్నావస్థ అనుభవ వ్యక్తి భరతుడు. కడపటి సుషుప్తి అవస్థ అనుభవించు వ్యక్తి శత్రుఘ్నుడనబడును. వారిస్థానము హృదయాకాశమనబడినది, దానిని అయోధ్యగా తెలియవలయునుగదా?

మనోవేగో బహిర్యాత్రా విశ్వామిత్రాధ్వరే గమః ।
మనోదుర్వృత్తిఘాతశ్చ తాటికాయా వధోఽత్ర సః ॥ 44

మనోవేగస్య యో భంగః స ధనుర్భంగ ఉచ్యతే ।
మాయాయోగస్తతస్తస్య మత్పాణిగ్రహణం స్మృతమ్ ॥ 45

పూర్వసంస్కారనిగ్రహో జామదగ్న్యేర్వినిగ్రహః ।
తతః కుబుద్ధిహేతోర్హి కైకేయ్యా వరదానతః ॥ 46

భవారణ్యేఽటనం ప్రోక్తమటనం దండకేఽత్ర తే ।
దంభస్య నిగ్రహస్తత్ర విరాధస్యాత్ర నిగ్రహః ॥ 47

ఆత్మనః పర్ణకుటికా పంచభూతాత్మకశ్చ సః ।
దేహోఽయం పంచవటికా విశ్రాంత్యర్థం తవాత్ర సా ॥ 48

కామస్య నిగ్రహః ప్రోక్తః ఖరస్యాత్ర వినిగ్రహః ।
క్రోధస్య నిగ్రహశ్చాపి దూషణస్యాత్ర నిగ్రహః ॥ 49

లోభస్య మర్దనం తత్ర త్రిశిరానిగ్రహోఽత్ర హి ।
తత్రాశాకృంతనం ప్రోక్తం బాణేనాత్ర విరూపణమ్ ॥ 50

తస్యాః శూర్పణఖాయాశ్చ మోహస్య నిగ్రహః స్మృతః ।
మృగమారీచఘాతోఽత్ర శుద్ధమాయాశ్రయస్తతః ॥ 51

మమాశ్రయస్తే వామాంగే సాత్త్వికా దండకే వనే ।
రజోరూపా తు యా మాయా జ్వలనాగ్నౌ స్మృతా శుభా ॥ 52

**మమ రజః స్వరూపాయాః ప్రవేశశ్చానలేఽత్ర సః ।**
**తామస్యాశ్చైవ మాయాయా వియోగశ్చ తదా స్మృతః ॥ 53**

**మమ తమః స్వరూపాయా హరణం రావణేన హి ।**
**సుఖాలాభో మహాన్క్లేశస్త్వత్తో మద్విరహస్తతః ॥ 54**

మనోయోగమనే బాహ్య ప్రయాణమే విశ్వామిత్ర ముని వచ్చి యజ్ఞమునకు కొనిపోవుట. మనస్సుయొక్క దుర్వృత్తిని నాశనముచేయుటయే తాటక సంహారము అనబడును. మనోవేగముయొక్క భంగమే ధనుర్భంగమనబడును. ఆ తరువాత జరిగిన మాయా మోహమే నాయొక్క వివాహ మహోత్సవము. పరశురాముని జయించుటయే జన్మాంతర సంస్కారములను నిగ్రహించుట. పిమ్మట దుష్టబుద్ధి కారణముగా అనగా కైకేయి వరదానము వలన సంసారారణ్య సంచారము అనబడునది. దండకారణ్యము సంచారము, అచట విరాధుని నిగ్రహించుటయే దంభ నిగ్రహము. ఆత్మయొక్క పంచభూతాత్మక స్థిరవృత్తియే పర్ణశాల. ఈ దేహమే పంచవటి క్షేత్రము. అది నీ విశ్రాంతి కోసం ఏర్పరచబడినది. అచట కామవిధ్వంసనమే ఖరుని సంహరించుట. దూషణుని సంహరించుట క్రోధ ధ్వంశము. లోభమును నాశనముచేయుట త్రిశిర సంహారమనబడును. అచట ఆశాచ్ఛేదనమే బాణముచే ఆ శూర్పణఖకు విరూపమును (ముక్కు, చెవులను కోయుట) ఏర్పరుచుట. మోహ నిగ్రహమే మాయామృగ మారీచ మథనము. పిదప శుద్ధ మాయాశ్రయమైన దండకావనమున సాత్త్వికియగు నన్ను ఎడమభాగమున ధరించుట. రజోరూపయగు మాయ జఠరాగ్నిలో పోవునని చెప్పబడినది గదా, అదియే రజస్వరూపిణియగు నేను అగ్నిలో ప్రవేశించుట. పిదప తామసియగు మాయకును ఆత్మకును వియోగము కలుగునని చెప్పినది. తమస్వరూపమగు నన్ను రావణుడు అపహరించుట గదా? అపుడే సుఖలాభమహాక్లేశము అనునది.

**శోకవేగస్తతః ప్రోక్తః కబంధస్య వధోఽత్ర సః ।**
**వివేకస్యాశ్రయస్తత్ర సుగ్రీవస్యాశ్రయోఽత్ర సః ॥ 55**

**భక్త్యుద్రేకప్రలాభశ్చ తవలాభో హనూమతః ।**
**అవివేకవధః ప్రోక్తశ్చాత్ర వాలివధస్తథా ॥ 56**

**ఉత్సాహేన తతః సంగః సా విభీషణమైత్రికీ ।**
**అజ్ఞానతరణోపాయః సేతుబంధో మహోదధౌ ॥ 57**

త్రిగుణాశ్రయగేహం వై లింగదేహాహ్వయే శుభే ।
త్రికూటాచలసంస్థాయాం లంకాయాం రఘునందన ॥ 58

మదస్య నిగ్రహస్తత్ర కుంభకర్ణవధస్త్వయా ।
నిగ్రహో మత్సరస్యాపి మేఘనాదవధోఽత్ర సః ॥ 59

తత్రాహంకారఘాతశ్చ రావణస్య వధస్త్వయా ।
మాయానామైక్యతా చాపి త్రివిధా యా మమైక్యతా ॥ 60

వియోగో లింగదేహస్య లంకాత్యాగస్త్వయాఽత్ర సః ।
హృదయాకాశగమనమయోధ్యాగమనం పునః ॥ 61

ఆనందైకసుఖం తత్ర రాజ్యభోగస్త్వయా సోఽత్ర హి ।
మాయాత్యాగస్తతశ్చైవ వాల్మీకేరాశ్రమే మమ ॥ 62

త్యాగోఽగ్ర భావి శ్రీరామ త్వయా సోఽత్ర ప్రకాశితః ।
సాత్వికాయా గ్రహణం యచ్చ పునర్మే గ్రహణం స్మృతమ్ ॥ 63

సాత్వికాయా మాయయా సార్ధం తవోద్యోగో మయా సహ ।
తతశ్చ హృదయాకాశం మహాకాశే విలాపయేత్ ॥ 64

అయోధ్యానగరీమగ్నే వైకుంఠం ప్రతి నేష్యసి ।
ప్రవేశనం సాగరే హి సచ్చిదానందసంజ్ఞకే ॥ 65

నరరూపం పరిత్యజ్య విష్ణురూపప్రదర్శనమ్ ।
నృణాం త్వయా సైవ ముక్తిః సాయుజ్యాత్మన ఈరితా ॥ 66

నా విరహమువల్ల నీకు పుట్టిన శోకము తొలగుటయే అనంతమయిన కబంధ సంహారము. సుగ్రీవుని ఆశ్రయమే వివేకాశ్రయమనబడును. నీకు హనుమంతుడు దొరుకుటయే భక్తిఉద్రేకాతి లాభము. నీచే వాలి సంహరింపబడుటయే అవివేక నాశనము. పిదప గలుగునట్టి ఉత్సాహ సాంగత్యమే విభీషణుని మైత్రిగా గుర్తించాలి. మహోదధిలో సేతు నిర్మాణమును చేయుటయే అజ్ఞానమునుండి తరించునట్టి యుక్తి. త్రిగుణాశ్రయ దేహమే త్రికూటాచలము. అందులోని లంకయే లింగదేహము. అచట మదమును మర్దించుటయే కుంభకర్ణ సంహారము. మత్సరమును జయించుటయే

మేఘనాదసంహారము. అహంకార సంహారమే రావణవధ అనబడును. లింగదేహనివారణయే లంకాపట్టణమును విడిచివచ్చుట. త్రివిధమగు మాయయొక్క ఐక్యమే నాతోడ చేరుట. అయోధ్యకు ఏతెంచుటయే హృదయాకాశగమనము. ఆనందైక సుఖానుభవమే రాజ్యభోగములు. ఆ తరువాత జరగు మాయాత్యాగమనగా ఇకమీదట జరగబోవునట్టి వాల్మీకి ఆశ్రమమున నన్ను విడిచిపెట్టుటగా ప్రకాశపరచితివి. ఏది సాత్త్వికీ గ్రహణమనబడినదో అదియే మరలా నన్ను పరిగ్రహించుట. సాత్త్వికీయగు మాయచేరి ఉండుటయే నాతోడ నీ ప్రయత్నము. పిదప హృదయాకాశము అను మహాకాశమున జొప్పించుట అనగా అయోధ్యకు, వైకుంఠమునకు నీవు తీసికొనిపోవుట. సాగరప్రవేశము అనగా నరరూపమును వదలి, సచ్చిదానంద సంజ్ఞానకమగు శ్రీ విష్ణురూపమును జూపుట. నరులకు నీచే ఇదియే సాయుజ్యముక్తిగా చెప్పబడినది.

**ఏవం యద్యత్త్వయా రామ కృతం కర్మ శుభాశుభమ్ ।**
**తత్సర్వం జనబోధాయ సర్వేషాంచ హితాయ హి ॥ 67**

**కర్తవ్యమప్యకర్తవ్యం కర్మాతీతస్య కిం తవ ।**
**నిర్గుణస్యాత్మరూపస్య సచ్చిదానందరూపిణః ॥ 68**

**ఇత్థం త్వయోపదిష్టా మే శుభ సంజ్ఞాన పేటికా ।**
**అహం తస్యా విచారేణ జీవన్ముక్తా న సంశయః ॥ 69**

**దేహే రామాయణం సర్వం యత్త్వయా మమ దర్శితమ్ ।**
**పంచదశశ్లోకరత్నైః కంఠే తద్ధారవత్కృతమ్ ॥ 70**

**శ్లోకరత్నమయం యో వై కంఠే హారం బిభర్తి హి ।**
**జీవన్ముక్తః క్షణాదేవ భవిష్యతి నరోత్తమః ॥ 71**

**దేహరామాయణం నామ రామ యత్కథితం త్వయా ।**
**నేదృశం కథితం కేన న కోప్యఽగ్రే వదిష్యతి ॥ 72**

**మమ ప్రీత్యోపదిష్టం హి త్వయైతద్రఘునందన ।**
**ఇత్థం కోఽపి న జానాతి బ్రహ్మాదీనామగోచరమ్ ॥ 73**

**గుహ్యం రమ్యం సుదుర్బోధం స్వల్పం జ్ఞానప్రకాశితమ్ ।**
**దేహరామాయణం చైతచ్ఛ్రవణాత్పాతకాపహమ్ ॥ 74**

**ఇతి సీతావచః శ్రుత్వా ప్రహస్య రాఘవోఽబ్రవీత్ ।**
**విదేహతనయే సాధ్వి ధన్యాఽసి గజగామిని ॥ 75**

**సమ్యగ్విచారితా బుద్ధ్యా త్వయా సంజ్ఞానపేటికా ।**
**కించిన్న్యూనం త్వయా నైవ దృష్టమస్యాం యథాస్థితమ్ ॥ 76**

**బుద్ధ్యా జ్ఞానం మమ జ్ఞానం మోహజాలనికృంతనమ్ ।**
**కథనీయమిదం దేహరామాయణం న కస్యచిత్ ॥ 77**

**ఏతద్గుహ్యతమం ప్రోక్తం తవ ప్రీత్యా విదేహజే ।**
**దాంభికాయ చ దాతవ్యం నాస్తికాయ శఠాయ చ ॥ 78**

**అభక్తాయ ద్విజద్వేష్ట్రే పరదారరతాయ చ ।**
**మలినాయాతిక్రూరాయ నిందకాయ జడాయ చ ॥ 79**

శ్రీరామా! నీవు ఈ విధముగా శుభాశుభ రూపమగు యే కర్మను చేసితివో అదంతా అందరియొక్క హితము కొరకు అను వివేకము లభించుటకు చూపబడినది. నిర్గుణుడు, స్వాత్మారాముడు, సచ్చిదానంద రూపుడు, కర్మాతీతుడును అగు నీకు చేయతగినది, చేయకూడనిది గలదా? (68)అని ఇట్లు మంగళమగు సంజ్ఞానపేటిక నీచే నాకు ఉపదేశింపబడినది. నేను దానిని విచారమువలన జీవన్ముక్తయై ఉన్నాను. ఇందులో సంశయములేదు. నీచే నాకు చూపబడిన **'దేహరామాయణము'** అను నిధి పదిహేను శ్లోక రత్నములచే కంఠమున హారముగా చేయబడినది. ఇట్టి శ్లోకరత్నమైన హారమును యే మానవోత్తముడు కంఠమున ధరించునో వాడు తత్ క్షణముననే జీవన్ముక్తుడు కాగలడు.

శ్రీరామా! ఈ దేహరామాయణము అనునది నీచేత ఇపుడు చెప్పబడినది. ఇదివరకు ఎవ్వరును చెప్పలేదు. ఇంకనెవ్వరును చెప్పరు. నాయొక్క ప్రీతికొరకు నీచే ఇట్లు ఉపదేశింపబడినది. రఘునందనా! బ్రహ్మాదులకును అగోచరమగు నీ ఈ విషయము ఇట్లు ఎవ్వరికిని గోచరము కాజాలదు. ఇది మిక్కిలి రమ్యము, రహస్యము, కష్టము, స్వల్పము, జ్ఞానప్రకాశితము. ఇట్టి ఈ దేహ రామాయణము వినుటచేతనే పాపములు తొలగిపోవును," అని చెప్పుచున్న సీతాదేవి పలుకులను విని, శ్రీరాముడు నవ్వుచూ, "సతియగు జానకీ! నీవు కృతకృత్యవైతివి. నీవు బుద్ధిశక్తిచే సంజ్ఞానపేటికను చక్కగా విచారించితివి. నీవు గ్రహించినదానిలో కొంచెముకూడా కొరతలేదు. యథాస్థితముగా గ్రహించితివి. బుద్ధిచే తెలియబడిన నాయొక్క జ్ఞానము సమస్త అజ్ఞానములను తొలగించును. ఇట్టి సుప్రసిద్ధమగు దేహరామాయణమును ఎవరికంటే వారికి చెప్పకూడదు. ఇది మిగుల రహస్యము. నీకు ప్రీతిచే

ఉపదేశించితిని. విదేహపుత్రీ! దీనిని దాంభికునకు, నాస్తికునికి, మొండివానికి, భక్తిలేనివానికి బ్రాహ్మణ విరోధికి, పరస్త్రీలను కోరువానికి, కల్మష స్వభావునికి, క్రూరాత్మునికి, నిందించు వానికి, మూఢునికి చెప్పకూడదు.

**కలౌ చైతత్తు వై గుహ్యం భవిష్యతి న సంశయః ।**
**సహస్రేషు నరః కశ్చిత్ జ్ఞాస్యత్యేతన్న సంశయః ॥ 80**

**సర్వవేదాంత సారం హి మయా తే సముదీరితమ్ ।**
**దేహరామాయణం చైతద్భుక్తిముక్తిప్రదం వరమ్ ॥ 81**

**ఇత్యుక్త్వా రాఘవః సీతాం పర్యంకే రత్నమండితే ।**
**సుష్వాప సీతయా రాత్రౌ దాసీభిర్వీజితః సుఖమ్ ॥ 82**

**ఇతి శ్రీశతకోటిరామచరితాంతర్గతే, శ్రీమదానందరామాయణే, వాల్మీకీయే, ఆదికావ్యే, విలాసకాండే, దేహరామాయణం నామ తృతీయః సర్గః ॥ 3**

కలియుగమున ఇది చాలా రహస్యమై ఉండును. సందేహములేదు. ఏ వేయిమందిలో ఒకడు దీని తత్త్వమును గ్రహించును, సంశయములేదు. సమస్తవేదాంత సారమైన ఈ దేహరామాయణ రహస్యమును నీకు చెప్పితిని. ఇదియే భుక్తి, ముక్తులను ఇచ్చునట్టి పరమోత్తమ తత్త్వము. ఇదియే సర్వోత్తమము," అని చెప్పిన శ్రీరాముడు, దివ్యరత్నాలంకృత మంచముపై సీతతో పవ్వళించి, దాసీజనులు వీచుచుండగా సుఖముగా నిద్రించెను. ॥ 3 ॥

***శతకోటిప్రవిస్తరమైన రామకథలో, శ్రీమద్వాల్మీకిమహర్షిచే రచింపబడిన, ఆనందరామాయణంలోని, విలాసకాండలో, దేహరామాయణమును తెలుపు మూడవ సర్గ ముగిసినది.***



# చతుర్థః సర్గః-4వ సర్గ

సీతాదేవి అలంకార వర్ణన

శ్రీరామదాస ఉవాచ
చతుర్నాడ్యవశిష్టాయాం నిశాయాం రఘునాయకమ్ ।
ఉద్బోధనార్థం సంప్రాప్తా రతిశాలాబహిః స్థితాః ॥ 1

వందినో మాగధాః సూతా నర్తక్యశ్చ నటాదయః ।
వాదయామాసుర్వాద్యాని ననృతుశ్చాప్సరోగణాః ॥ 2

జగుర్మంగళగీతాని స్తోత్రాణి వివిధాని చ ।
ప్రాభాతికీం స్తుతిం ప్రోచుః కలకంఠైర్మనోరమైః ॥ 3

విఘ్నేశ్వరః సకలవిఘ్నవినాశదక్షో
దక్షాత్మజా భగవతీ హి సరస్వతీ చ ।
దృష్టాష్టభైరవగణా నవ దివ్యదుర్గా
దేవ్యః సురాస్తు నృపతే తవ సుప్రభాతమ్ ॥ 4

భానుః శశీ కుజబుధౌ గురుశుక్రమందా
రాహుః సకేతురదితిర్దితిరాదితేయాః ।
శక్రాదయః కమలభూః పురుషోత్తమేంద్రోః
రుద్రః కరోతు సతతం తవ సుప్రభాతమ్ ॥ 5

పృథ్వీ జలం జ్వలనమారుతపుష్కరాణి
సప్తాద్రయోఽపి భువనాని చతుర్దశైవ ।
శైలా వనాని సరితః పరితః పవిత్రా
గంగాదయో విదధతాం తవ సుప్రభాతమ్ ॥ 6

దిక్చక్రమేతదఖిలం దిగిభా దిగీశా
నాగాః సుపర్ణభుజగా నగవీరుధశ్చ ।
పుణ్యాని దేవసదానని బిలానిదివ్యా-
న్యవ్యాహతం విదధతాం తవ సుప్రభాతమ్ ॥ 7

వేదాః షడంగసహితాః స్మృతయః పురాణం
కావ్యం సదాగమపథో మునయోఽపి దివ్యాః ।
వ్యాసాదయః పరమకారుణికా ఋషీణాం
గోత్రాణి వై విదధతాం తవ సుప్రభాతమ్ ॥ 8

ఇతి బందిజనైః సూత్రైః స్తోత్రైర్గీతాదిభిః స్తుతః ।
నానాపక్షిసమూహైశ్చ పూర్వోక్తైః పంజరస్థితైః ॥ 9

## శ్రీరాములవారిని వందిమాగదులు నిద్రలేపుట

శ్రీరామదాసు చెప్పుచున్నాడు, "పిదప తెల్లవారుటకు నాలుగు గడియలు ఉన్నవనునప్పటికి వందిమాగదులు, సూతులు, నటులు, నర్తకీజనులు మొదలగువారు శ్రీరామచంద్రస్వామిని మేలుకొలుపులచే నిద్రలేపుటకై, పడక గదికి వెలుపల వచ్చి చేరిరి. వాద్యములు వాయింపబడినవి. అప్సరసలు నాట్యమాడిరి. నానామంగళ సంగీతములను, స్తోత్రములను పాడిరి. సుప్రభాత స్తోత్రమును మనోహరములగు అవ్యక్త మధుర ధ్వనులచే ఇట్లు చెప్పిరి.

సమస్త విఘ్నములను పరిహరించుటలో సమర్థమగు విఘ్నేశ్వరుడును, భగవతియగు దాక్షాయణి దేవియును, శ్రీ సరస్వతీదేవియును, ఉన్మాదయుక్తులగు అష్టభైరవులును, నవదుర్గలును, దేవతలును, శ్రీరామా! నీకు సుప్రభాతమును ఒసంగుదురుగాక!

సూర్యుడు, చంద్రుడు, అంగారకుడు, బుధుడు, గురుడు, శుక్రుడు, శని, రాహువు, కేతువు, అతిథిదేవి, దితి దేవతలు, ఇంద్రాదులు, బ్రహ్మ, విష్ణు, మనువులు, రుద్రుడు వీరందరును నీకు సుప్రభాతమును చేయుదురుగాక!

పృథివి, జలము, అగ్ని, వాయువు, ఆకాశములను పంచభూతములు, సప్తకుల పర్వతాభిమాని దేవతలు, చతుర్దశభువన దేవతలు, గంగాది పవిత్రములైన నదీదేవతలు, నీకు సుప్రభాతమును ఇచ్చుదురు గాక!

ఈ సమస్త దిక్సమూహమును, దిగ్గజములును, దిక్కులును, నాగులును, సుపర్ణులును, వృక్ష, లతాదుల అధిష్ఠిత దేవతలును, పవిత్రములగు దేవాయతనములును, దివ్యగుహలును, నిరంతరాయముగా నీకు సుప్రభాతమును ఒసంగుదురు గాక!

నాలుగువేదములును, వాటితోడ ఆరు శాస్త్రములును, స్మృతులును, పురాణములును, వేదమార్గములను అవలంబించిన కావ్యములును, దేవర్షులును, వ్యాసుడు మొదలగు దయావంతులును, ఋషుల గోత్రములవారును నీకు సుప్రభాతము చేయుదురుగాక!

ఇట్లు వందిమాగద సూత్రాదులు వివిధ సుప్రభాత స్తోత్రగీతాదులచే స్తుతించిరి. రత్నపంజర ములలోనుండు వివిధ పక్షులచేతను పొగిడించుచుండిరి.

**స్తుతో వాదిత్రనినదైర్నవవాద్యస్వనైరపి ।**
**సుప్రబుద్ధో బభూవాథ రామచంద్రః స సీతయా ॥ 10**

**ఆదౌ ప్రబుద్ధా సా సీతా పశ్చాద్బుద్ధో రఘూత్తమః ।**
**రామః సురాన్ మునీంస్తాతం మాతరం సరయూం గురుమ్ ॥ 11**

**చింతామణిం కామధేనుం చింతయామాస చేతసి ।**
**తతః సీతాఽపి సా దుర్గాం గంగాం వాణీం రఘూత్తమమ్ ॥ 12**

**చింతయామాస కౌసల్యాం గురుపత్నీం స్వమాతరమ్ ।**
**తతో నత్వా రామచంద్రం వినయావనతా స్థితా ॥ 13**

**ఆవశ్యకం తు సంపాద్య కృత్వా శౌచవిధిం క్రమాత్ ।**
**దంతశుద్ధి చకారాథ రామచంద్రః సవిస్తరామ్ ॥ 14**

**ఆవశ్యకం తు సంపాద్య కృత్వా శౌచవిధిం క్రమాత్ ।**
**హుత్వాఽగ్నిహోత్రవిధినా కృత్వా దేవార్చనం గృహే ॥ 15**

**దదౌ దానాన్యనేకాని బ్రాహ్మణేభ్యో యథాక్రమమ్ ।**
**ఏతస్మిన్నంతరే స్నాత్వా సీతా దేవీ ప్రపూజ్య చ ॥ 16**

**దేవానగ్నీన్ ద్విజాన్నత్వా శ్వశ్రూర్నత్వా యథాక్రమమ్ ।**
**తతో నత్వా రామచంద్రం తత్పార్శ్వే యత్నతః స్థితా ॥ 17**

**అథ రామో వసిష్ఠస్య ముఖాత్పౌరాణికీం కథామ్ ।**
**సీతయా మాతృభిర్యుక్తో బంధుభిశ్చ సుహృజ్జనైః ॥ 18**

**సమ్యక్ శ్రుత్వైకచిత్తేన పూజయామాస తం గురుమ్ ।**
**తతో నత్వా గురుం రామో గురుపత్నీం చ మాతరమ్ ॥ 19**

మంగళఘోషలచేతను, నవవాద్యధ్వనులచేతను, శ్రీరామచంద్రుడు సీతతోడ నిద్రమేల్కొనెను. మొదట సీతాదేవి నిద్రలేచెను. పిమ్మట శ్రీరాముడు నిద్ర లేచెను. అపుడు రాముడు– దేవతలను,

మునులను, తల్లిదండ్రులను, వసిష్ఠులను, సరయూనదిని, చింతామణిని, కామధేనువును– వీటిని తన చిత్తమున ధ్యానించెను. పిమ్మట ఆ సీతాదేవియును– శ్రీరామచంద్రస్వామిని, దుర్గాదేవిని, గంగా దేవిని, శారదాదేవిని, తన తల్లిని, కౌసల్యాదేవిని, అరుంధతిని– ధ్యానముజేసి, శ్రీరామచంద్రుని పాదారవిందములకు వినయవనతయై నమస్కరించి నిలిచెను.

శ్రీరాముడు ముఖ్యమగు వస్తువులను తీసికొని శౌచాచార విధిని నిర్వర్తించెను, శ్రీరాముడు చక్కగా దంతశుద్ధిని గావించుకొనెను, తనపేరున గల రమ్యమగు రామ తీర్థమున స్నానముచేసి, మంగళమగు నిత్యకర్మలను ఆచరించి, క్రమముగా దేవతలకు ఆహుతలను ఇచ్చి, తమ గృహ దేవతార్చనను చేసి, యథాక్రమముగా బ్రాహ్మణోత్తములకు వివిధ దానములను చేసెను.

అంతలో సీతాదేవి లేచి స్నానముచేసి, పార్వతీ దేవిని పూజించి, దేవ, గురు, అగ్ని, బ్రాహ్మణులకు నమస్కరించి, అత్తలకు నమస్కరించి, పిదప శ్రీరామచంద్రునికి నమస్కరించి, రఘునాథుని ప్రక్కలో చక్కగా నిలిచెను. (17) పిమ్మట శ్రీరాముడు వశిష్ఠమునులవారివలన పౌరాణిక కథలను, తల్లుల తోను, తమ్ములతోను, సీతతోను, స్నేహితులతోను, ఏకాగ్రమానసుడై శ్రవణముచేసి, గురుపూజను ఒనరించి, అరుంధతి వశిష్ఠులకు, తల్లులందరికి నమస్కరించెను.

**సర్వా మాతౄశ్చ విప్రాంశ్చ పండితాన్ వైదికాన్ మునీన్ ।**
**యోగనిష్ఠాంస్తపోనిష్ఠాన్ విప్రాన్ జ్యోతిర్విదస్తథా ॥ 20**

**మీమాంసకాంస్తార్కికాంశ్చ మంత్రశాస్త్రవిశారదాన్ ।**
**ధర్మశాస్త్రవిదశ్చైవ వంద్యానన్యాన్ వయోధికాన్ ॥ 21**

**పూజయామాస శ్రీరామః సీతయా ప్రణనామ తాన్ ।**
**అథ సీతా హేమపాత్రే పూజోపకరణాని సా ॥ 22**

**గృహీత్వా స్వసఖీభిశ్చ నత్వా సురభిమర్చయత్ ।**
**నానోపచారైః సంపూజ్య పక్వాన్నైర్నవనిర్మితైః ॥ 23**

**విచిత్రైః పాయసాద్యైశ్చ సా తాం ధేనుమతోషయత్ ।**
**తతః ప్రదక్షిణాం కృత్వా ప్రార్థయామాస జానకీ ॥ 24**

**కామధేనో నమస్తుభ్యం పక్వాన్నాదీని వేగతః ।**
**దివ్యాన్నాని భూసురేభ్యో రామాదిభ్యస్త్వమర్పయ ॥ 25**

ఇతి సా ప్రార్థనాం కృత్వా కామధేనోస్తు జానకీ ।
తదధో రుక్మపాత్రాణి స్థాపయామాస కోటిశః ॥ 26

దివ్యాన్నైః పరిపూర్ణాని చకార సురభిస్త్వపి ।
తతః శీఘ్రం హేమపాత్రైః గృహ్యాన్నాని పృథక్ జవాత్ ॥
పరివేషణార్థం సంతుష్టా యయౌ నూపురగర్జితా ॥ 27

ఏతస్మిన్నంతరే రామశ్చోపహారార్థమాదరాత్ ।
విప్రానిష్టాన్మంత్రిణశ్చ సమాహూయ సహస్రశః ॥ 28

ఉపావిశద్భోజనస్య శాలాయాం తైః సమన్వితః ।
రుక్మపీఠే తు సర్వే తే నేమిరేఖోపమాః స్థితాః ॥ 29

పీతకౌశేయవస్త్రాద్యైః భూషితా రుక్మమండనైః ।
పూజితా రాఘవేణాపి గంధమాల్యాదిభిర్ముదా ॥ 30

స్త్రీభి రుక్మత్రిపదాసు రుక్మపాత్రాణి చ పృథక్ ॥
రంగావలీవిచిత్రాయాం భూమౌ న్యస్తాని తత్పురః । 31

## శ్రీరాముడు పురాణశ్రవణానంతరము పూజ్యులనర్చించుట.

బ్రాహ్మణులను సదసద్వివేకము గలవారిని, వేదవిద్వరిష్ఠులను, మునులను, యోగీంద్రులను, తపస్సంపన్నులను, ద్విజులను, దైవజ్ఞులను, బ్రహ్మావాదులను, మాంత్రికులను, ధర్మశాస్త్రజ్ఞులను, ఇంకను వయోధికులను, వంద్యులను, శ్రీరాముడు సంపూజించి, సీతతోడ వారందరికి నమస్కరించెను. (22)

## సీతాదేవి కామధేనువును అర్చించి, అందరిని సత్కరించుట.

పిదప సీతమ్మ తన చెలికత్తెలతోడ బంగారు పళ్ళెములలో పూజాసామాగ్రులను తీసికొని, కామధేనువు సన్నిధానమునకు పోయి, నమస్కరించి, వివిధ ఉపచారములతో పూజించి, పక్వాన్నములను, విచిత్రములగు పాయసాదులను నివేదించి, ధేనువును ఆనందపరచుచు, ఆ సీతాదేవి ప్రదక్షిణ నమస్కారముచేసి, కామధేనువుతో, "ఓ కామధేనూ! నీకు నమస్కారము. బ్రాహ్మణులకును, శ్రీరామాదులకును త్వరగా నీవు దివ్యాన్నములను, వివిధ పక్వాన్నములను సమర్పించుము," అని ప్రార్థించి, కామధేనువుయొక్క కాళ్ళనడుమ కనకపాత్రములను అనేకములుగా ఉంచెను. అంత ఆ

కామధేనువు కూడా వాటినిండా దివ్య అన్నాది భోజ్య వస్తువులను ఇచ్చెను. అంత త్వరత్వరగా వేర్వేరుగా బంగారు పాత్రలలో ఆ పక్వాన్నములను తీసిపెట్టి, నూపురనాద గజనాంగనలతో సీతాదేవి సంతోషముతో వడ్డించుటకు వెడలెను. అంతలో శ్రీరాముడు ఉపాహారము కొరకై సాదరముగా శ్రేష్ఠులగు బ్రాహ్మణులను, మంత్రులను వేలకొలదిగా పిలచి, భోజనశాలలో వారితో పాటు కూర్చుండెను. బంగారు పీటలపై వారందరును కనకాభరణములను, దివ్యమైన పసుపువర్ణపు వస్త్రములను అలంకరించుకుని, సుస్థితులై, శ్రీరామునిచేతకూడా పుష్పగంధాదులచే పూజింపబడిరి. అపుడు అంగనామణులు వారిఎదుట వేర్వేరుగా, చిత్రవిచిత్రములుగా ముగ్గులిడిన నేలమీద బంగారు ముక్కాలుపీటనువేసిరి.

హేమోద్భవాని పానీయపాత్రాణ్యపి పృథక్ పృథక్ ।
సోపపాత్రాణి చిత్రాణి రత్నదీపయుతాని చ ॥ 32

స్థాపయామాసుః శ్రీరామబంధుపత్న్యస్త్వరాన్వితాః ।
ఏతస్మిన్నంతరే సర్వైః శ్రుతో మంజులనిఃస్వనః ॥ 33

నూపురాణాం కింకిణీనాం కంకణానాం మనోరమః ।
రత్నమౌక్తికమాలానాం ఘర్షణాదుత్థితో మహాన్ ॥ 34

తం మంజులస్వనం శ్రుత్వా కస్యాయం శ్రూయతే స్వనః ।
ఇతి సందిగ్ధచిత్తాస్తే వ్యగ్రనేత్రైరితస్తతః ॥ 35

అపశ్యన్ బ్రాహ్మణాద్యాశ్చ తావత్సీతాం వ్యలోకయన్ ।
తటిత్పుంజోపమాం దివ్యాం శతకోటిరవిప్రభామ్ ॥ 36

యస్యాంగులిషు సర్వత్ర పాదయోర్వివిధాని చ ।
మత్స్యకచ్ఛపనక్రాదిచిహ్నితాన్యుజ్జ్వలాని చ ॥ 37

దదృశూ రత్నచిత్రాణి హైమాన్యాభరణాని తే ।
తత ఊర్ధ్వం కింకిణీనాం పాదయోర్నూపురాణి చ ॥ 38

శృంఖలా వివిధా రమ్యాస్తథా గుర్జరదేశజాః ।
నానానూపురభేదాశ్చ కంకణాన్యుజ్జ్వలాని చ ॥ 39

రత్నకంకణగర్భాణి దివ్యరుక్మోద్భవాని చ ।
దదృశుస్తే హి సీతాయా మాణిక్యచిత్రితాని చ ॥ 40

**తస్యాః కట్యాం దదృశుస్తే పీతకౌశేయముజ్జ్వలమ్ ।**
**ముక్తాజాలరుక్మతంతు పుష్పరాజివిరాజితమ్ ॥ 41**

**నవీనం గతిచాంచల్యాత్ కృతమంజులనిఃస్వనమ్ ।**
**ఆదర్శబింబసంయుక్తం సుగంధామోదమోదితమ్ ॥ 42**

**వస్త్రోపరి దదృశుస్తే రశనాం రుక్మతంతుజామ్ ।**
**రత్నకంకణగర్భాభిః కింకిణీభిర్విరాజితామ్ ॥ 43**

పీటలమీద బంగారుపళ్ళెములను పెట్టిరి. రత్నదీపములచే వెలుగొందు బంగారుపాత్రలను కూడా త్వరగా లక్ష్మణ, భరత, శత్రుఘ్న పత్నులు ఉంచిరి. అంతలో అచటివారికందరికిని మనోహరధ్వనియొకటి వినబడెను. అది కాలిఅందెలయొక్కయు, చేతి గాజులయొక్కయు, చిరుగజ్జెల యొక్కయు, రత్నహారముల యొక్కయు, ముక్తాసరముల యొక్కయు, మనోహర నాదమని తెలియ వచ్చెను. ఆ మనోహర ధ్వనిని విని, దేనిశబ్దమిది ఇలా వినవచ్చుచున్నది? అని సందేహించుచు, చకితనేత్రులై యచటి బ్రాహ్మణాదులందరును ఇటునటుచూసి, అంతలో సీతాదేవిని అవలోకించిరి. మెఱుపుల గుమివంటి మేనుకలిగిన నూరుకోట్ల బాలాసూర్యులవంటి, తేజస్సుగల ఆ మంగళాదేవత యగు తల్లియొక్క కాలివ్రేళ్ళలోనంతట చేప, తాబేలు, మొసలిఆకార సువర్ణ, రత్న నిర్మితములగు దివ్యాభరణములను చూచిరి. అంత ఆ లోకమాతయొక్క పాద కమలములపై చిరుగజ్జెలుగల నూపురములను, గుజరాతీదేశమునకు చెందిన రకరకాల బంగారు గొలుసులను, నడుమ నడుమ రత్ననిర్మితములగు కడియములను చిత్రముగా దర్శించిరి. అంత ఆ జగజ్జననియొక్క నడుమున బంగారు సరిగె పూలచే లీలలను ప్రదర్శించు ముత్యముల జాలరులు గలదియును, నడకవలన మూరమూరలాడుచుండునదియును, అద్దపు బిళ్ళలతో గలదియును, దివ్యపరిమళయుక్తమగు పసుపు వస్త్రములను దర్శించిరి.

**కేకిసింహవృషవ్యాఘ్రమృగచిత్రవిచిత్రితామ్ ।**
**పీతరక్తహరిన్నీలకృష్ణమాణిక్యమండితామ్ ॥ 44**

**తత ఊర్ధ్వం దదృశుస్తే పదకాన్యుజ్జ్వలాని హి ।**
**రంభాఫలోపమాన్యేవ హైమాన్యాభరణాని చ ॥ 45**

**సకాంచనశృంఖలాని కాచద్రవయుతాని చ ।**
**నానారత్నవిచిత్రాణి ముకురైర్మండితాన్యపి ॥ 46**

నానామాణిక్యయుక్తాని దీప్తిమంత్యుజ్జ్వలానిహి ।
తతో దదృశుస్తే దివ్యాన్ రుక్మహారాన్ విచిత్రితాన్ ॥ 47

నవరత్నయుతాన్ హారాన్ ముక్తాహారాంశ్చ శృంఖలాః ।
మూర్తిమాలా రుక్మజాశ్చ యవమాలా విచిత్రితాః ॥ 48

పుష్పమాలాః కాంచనజాః సారికా రత్నమండితాః ।
రుక్మగుంజాన్వితా మాలా హేమధాత్రిఫలాన్వితాః ॥ 49

ప్రవాళమణిముక్తాసమ్మిశ్రితాశ్చిత్రచిత్రితాః ।
చంపసూక్ష్మకలికయా సదృశా హేమమాలికాః ॥ 50

కంఠే మంగళ సూత్రం చ పేటికా రత్నభూషితా ।
కాంచనానాం సుసూక్ష్మాణాం మణీనాం వివిధాని చ ॥ 51

గుచ్ఛై కంఠభూషణాని ముక్తాగుచ్ఛయుతాన్యపి ।
దదృశుస్తే హి సీతాయాః కంఠే హైమాన్యనేకశః ॥ 52

రశనాసదృశాన్యేవ గ్రీవాయాం భూషణాన్యపి ।
ప్రవాళమణిమాణిక్యరచితాన్యుజ్జ్వలాని చ ॥ 53

ముక్తాగుచ్ఛాన్ కాచగుచ్ఛాన్ మణిగుచ్ఛైర్విచిత్రితాన్ ।
ప్రవాళమణిగుచ్ఛాంశ్చ రత్నపుష్పవిగుంఫితాన్ ॥ 54

తతో దదృశుస్తే సర్వే మైథిలీకుచకంచుకీమ్ ।
హేమతంతుభవాం చిత్రాం ముక్తామాణిక్యగుంఫితామ్ ॥ 55

ఆదర్శబింబసంయుక్తాం పుష్పరాజివిరాజితామ్ ।
మయూరశుకవృక్షైశ్చ లవంగైస్తంతునిర్మితైః ॥ 56

సీతమ్మవారు ధరించిన వస్త్రములపై- నెమలి, సింహము, ఎద్దు, పులి, జింక-ఇట్టి చిత్రములు పంచవర్ణ, పంచరత్నములచే అల్లబడియుండెను, బంగారు దారములతో అల్లబడిన బంగారు తీగెను అందు రత్నకింకిణీలను దర్శించిరి. అటుమీద ప్రకాశించుచుండు పథకములను అరటిపండ్లవంటి ఆకృతి విశేషములచే ఆహ్లాదకరములగు ఆభరణములను, బంగారు గొలుసులను, వివిధ రత్న విచిత్రములుగాను, వజ్రముచే అలంకృతముగాను చూచిరి. పిదప నవరత్నహారములను, ముక్తా

సరములను, దేవప్రతిమాయుక్తములైన వరహాలదండలను, గోదుమ సరములను, విచిత్రములైన బంగారుఆకుల మాలికలను, రత్నపుచిలుకలచే అలంకరింపబడినవి. సువర్ణమణి హారములను, బంగారు ఉసిరిక హారములను, ముత్తెములు పగడములు కలిసిన కనక చంపక కుసుమ మాలికలను, కంఠమున మంగళసూత్రములను, రత్నాలంకృతములగు తాయిత్తులను, వివిధమణి కనక కల్పితములగు కుచ్చులను, ముత్తెముల కుచ్చులను, ఇట్లు సువర్ణాలంకారములు అనేకములుగా దర్శించిరి. మెడలో అన్ని ఆభరణములును ధారముల వంటివి. పగడముల, రత్నముల మాణిక్యముల, ముత్తెముల, స్ఫటికముల గుచ్ఛెములను, రత్నపు పుష్పములను చూచిరి. అటుపిమ్మట, ముత్తెములు, రత్నములు చెక్కబడిన బంగారు సరిగతో చేయబడిన స్ఫటిక శకలములలో చేరిన పూలవరుసలచే లీలాస్పదమైన నెమళ్ళు మొదలగు చిత్రములచే అలంకరింపబడిఉండెను.

చిత్రితాం శ్రమఘర్మేణార్ద్రాం సంలగ్నాం దృఢం తనౌ ।
తతో దదృశుర్భుజయోః కేయూరే రత్నమండితే ॥ 57

వజ్రకంకణసాదృశ్యే హేమమాణిక్యనిర్మితే ।
రత్నచిత్రవిచిత్రాశ్చ భుజయోః పేటికాః శుభాః ॥ 58

హేమతంతుభవైలంబమానగుచ్ఛైః సుమండితాః ।
ప్రవాళమణిముక్తానాం నానాగుచ్ఛైర్యుతాఅపి ॥ 59

తదధః కరయోః సర్వే దదృశుర్భూషణాని తే ।
రత్నమాణిక్యముక్తాభిశ్చిత్రితౌ హేమసంభవౌ ॥ 60

కరచూడౌ దీప్తిమంతౌ హేమపుష్పాదిచిత్రితౌ ।
కాచకంకణమధ్యస్థౌ చంద్రసూర్యోపమౌ త్విషా ॥ 61

తదూర్ధ్వాధః కంకణాని హేమజాని ఘనాని చ ।
రత్నమాణిక్యముక్తాభిశ్చిత్రితాన్యుజ్జ్వలానిచ ॥ 62

ప్రవాళమణిముక్తానాం కరహారాదిచిత్రితాన్ ।
కరయోః సారికే దివ్యే హ్యూర్ధ్వాధో రత్నమండితే ॥ 63

తదూర్ధ్వం కంకణాన్యేవ పుష్పవల్ల్యంకితాని హి ।
దంతరాజ్యుపమాదీని రత్నహేమోద్భవాని చ ॥ 64

అంగులీషు దదృశుస్తే ముద్రికా రుక్మనిర్మితాః ।
రత్నమాణిక్యముక్తాభిర్నీలమారకతైరపి ॥ **65**

ప్రవాళచంద్రకాంతైశ్చ సూర్యకాంతైర్విచిత్రితాః ।
నానాపుష్పోపమా దివ్యాః ప్రతిపర్వసమాశ్రితాః ॥ **66**

తతో దదృశుః సీతాయా రమ్యం ఘ్రాణేతిసోఽజ్జ్వలమ్ ।
దివ్యం మయూర చిత్రం చ వరరుక్మవినిర్మితమ్ ॥ **67**

మణిమాణిక్యముక్తాభిర్వరరత్నైః సుమండితమ్ ।
లంబితైర్మౌక్తికాదీనాం వరగుచ్ఛైః సువేష్టితమ్ ॥ **68**

తతో దదృశుః సీతాయాః కర్ణయోర్భూషణాని తే ।
మకరధ్వజసాదృశ్యే తాటంకే రత్నచిత్రితే ॥ **69**

ఎంతో శ్రమించి చక్కగా తయారుచేసిన రవికను చక్కగా తొడిగిన సీతమ్మను చూచిరి. అంత ఆ మంగళాంగియొక్క భుజములపై రత్నాలంకృతములైన కేయూరములను, కనకమణి చిత్రితములను రత్నచిత్రములను గలదియునగు భుజతాయెత్తులను జూచిరి. వాటిక్రింద బంగారు సరిగెచే చుట్టబడిన వ్రేలాడుచుండు ముత్తెముల, పగడముల, రత్నముల గుచ్ఛములచే అలంకృతమైన చేతి సొమ్ములను పరికించిరి. మణిమాణిక్య మండితములైన సువర్ణ సుమాలంకృతములై వెలుగుచుండు బహు బాహురులను, సూర్యచంద్రుల వలె వెలుగుచుండు గాడుకడియములను, వాటిపై బంగారు గట్టిగాజులను, మణి మాణిక్య ముక్తాలంకృతములైన కరహారములను, దిగువ, పైన రత్నమండిత ములగు చేతి సారికలను, వాటిపైన పుష్పవల్లీ విచిత్రములగు గజదంతావళుల వలె వెలుగుచున్నట్టి కనకమణి అలంకృతమగు కంకణములను, పదివ్రేళ్ళలోను- ముత్తెములు, పగడములు, పుష్యరాగములు, గోమేధికములు, వైఢూర్యములు, మరకతములు, మాణిక్యములు, వజ్రములు, ఇంద్రనీలములు- అను నవరత్నములచే దేదీప్యమానములైన గణుపులన్నిటిని ఆశ్రయించిన మణి సువర్ణ ముద్రికలను చూచిరి. పిదప సీతాదేవియొక్క చంపక ముక్కుపై ముత్తెముల కుచ్చులచేతను, నవరత్న రచనలచేతను రారాజించుచుండు నెమలి ఆకారములైన మనోహరమగు ముక్కెరను జూచిరి. పిదప ఆమెయొక్క కంకణములలో మకరధ్వజ సమానమైన రత్నవిచిత్రితములైన దివ్యతాటంకములను, మణి మాణిక్య ముక్తాలంకృతములైన బుడగలను, రత్నపుష్పక రమణీయములైన కత్తారిభావలీలలను, సువర్ణ ముక్తారత్నవిరాజితములగు జంపులను, ముక్తాగుచ్ఛ ప్రకాశితములైన బుడగ గొలుసులను, చెవి మొదలుకొని పాపటవరకు.....

మణిమాణిక్యముక్తాభిర్గుంఫితే సోజ్వలే వరే ।
రత్నపుష్పాదిభిశ్చిత్రైశ్చిత్రితే రవిభాస్వరే ॥ 70

తతో భ్రమరికే దివ్యే రుక్మరత్నవిచిత్రితే ।
ముక్తాభిర్గుంఫితే రమ్యే హేమపుష్పాణి వై తథా ॥ 71

కర్ణయోః శృంఖలాశ్చిత్రా దదృశూ రుక్మనిర్మితాః ।
ముక్తాగుచ్ఛైర్గుంఫితాశ్చ రత్నమాణిక్యమండితాః ॥ 72

ఆకర్ణాభ్యాం చ సీమంతపర్యంతం భాలపార్శ్వయోః ।
హారవద్రుక్మజాలాని మాణిక్యసహితాని హి ॥ 73

ముక్తాగుచ్ఛైర్గుంఫితాని వైడూర్యచిత్రితాన్యపి ।
తతస్తదూర్ధ్వం సీతాయా దదృశుః శిరసిద్విజాః ॥ 74

సీమంతస్యోత్తరే యామ్యే కేశేషు శశిభాస్కరౌ ।
రుక్మజౌ రత్నవైధూర్యమణిముక్తావిచిత్రితౌ ॥ 75

నీలకాశ్మీరకాంతైశ్చ విద్రుమైరతిశోభితౌ ।
చంద్రసూర్యావివ స్వీయభాసా దీపయతో దిశః ॥ 76

నిటిలే తిలకం రత్నమణిముక్తావిరాజితమ్ ।
హైమం దివ్యముజ్జ్వలం చ కోటిసూర్యసమప్రభమ్ ॥ 77

తతో దదృశుః సీమంతే ముక్తాహారైర్మమహోజ్జ్వలమ్ ।
నానారత్నవిచిత్రం చ సవేణితిలకావధి ॥ 78

చూడామణిం చ దదృశుస్తే జనకేన సమర్పితమ్ ।
నానారత్నవిచిత్రం చ ముక్తాగుచ్ఛవిరాజితమ్ ॥ 79

తతో దదృశుఃశిరసి ముక్తాజాలాని భూసురాః ।
హేమతంతుగుంఫితాని రత్నపుష్పయుతాన్యపి ॥ 80

మణివైడూర్యకాశ్మీర విద్రుమైశ్చిత్రితాని హి ।
తదూర్ధ్వం పుష్పజాలాని సుగంధీని వ్యలోకయన్ ॥ 81

తతో వేణ్యాం భూషణాని దదృశుస్తే వరాణి హి ।
నానాపక్ష్యుపమాన్యేవ మాణిక్యచిత్రితాని హి ॥ 82

పల్లవాంతరవర్తీన్యత్యతిదీప్తుజ్జ్వలాని చ ।
హేమతంతుమయాన్ గుచ్ఛాన్ ముక్తాహారవిమిశ్రితాన్ ॥ 83

లంబమానాన్ దదృశుస్తే మణిమాణిక్య సంయుతాన్ ।
వేణ్యగ్రేసంస్థితాన్ రమ్యాన్ పుష్పాపీడసమన్వితాన్ ॥ 84

ఏవం సీతాం దదృశుస్తే శ్రమన్యస్తవిభూషణమ్ ।
సర్వాలంకారసహితాం తాం ద్రష్టుం కోఽపి న క్షమః ॥ 85

నొసటిప్రక్కలను ఆశ్రయించిన మణిమాణిక్య మండిత కనక హారములను, ముక్తాగుచ్ఛ కుంభితమైన రత్నవైఢూర్య రాజితమగు పాపటను, దానికి ఇరువైపులలో వెంట్రుకలనడుమ నిజముగా స్వతేజస్సువలన దిక్కులను ప్రకాశింపజేయునట్టి నవరత్నములచే దేదీప్యమానమైన చంద్ర, సూర్యులవంటి శశిభాస్కర బింబాభరణములను చూచిరి. ఆమె మోమున కోటిసూర్యప్రకాశమానమై, ముక్తామణి విరాజితమై ఉండు ఇంద్రనీలమణి తిలకమును దర్శించిరి. పిదప జడమొదలు తిలకమువరకు పాపిటపై కనిపించు నవరత్నవిరాజితమగు ముక్తాహారమును జూచిరి. పిమ్మట జనకరాజుచే సమర్పింపబడిన సర్వరత్న సమానమగు చూడామణిని చూచిరి. అంత ఆమె శిరస్సుపైన బంగారు సరిగ చుట్టిన ముక్తాహారములను సద్రత్న పుష్పాలంకృతములుగా అవలోకించిరి. వాటిపైన దివ్యపరిమళ పూర్ణములగు పుష్పమాలికను చూచిరి. అంత ఆమెయొక్క జడలోని సువర్ణ నిర్మిత వివిధ పక్ష్యాకృతి, రత్నరాజితమైన జడ బంగారును అందులో ముక్తాగుచ్ఛములను, కొనలో కనకరత్నమయములగు జడకుచ్చులను, నడుమ నడుమ పుష్పాభరణములను చూచిరి. ఇట్లుండు సీతాదేవిని ఆ బ్రాహ్మణులు దర్శించిరి. ఆహా! శ్రమచే సర్వాభరణములను ధరించిన సాక్షాత్ లక్ష్మీదేవిని చూచుటకు ఎవ్వడును సమర్థుడు కాడు.

దివ్యాలంకారరత్నానాం ప్రభయా హతలోచనాః ।
వామహస్తేన పాన్నం చ దర్వీం దక్షిణసత్కరే ॥ 86

దధానాం పద్మచరణాం రథోత్పలకరాం వరామ్ ।
పద్మాస్యాం పదపత్రాక్షీం పద్మగర్భస్వరూపిణీమ్ ॥ 87

దివ్యకర్పూరగంధైశ్చ చందనైరపి చర్చితామ్ ।
స్ఫురన్మంజీరచరణాం దివ్యకంకణ మండితామ్ ॥ 88

స్వపదారక్తవర్ణేన గతిం దర్శయతీం నిజామ్ ।
రత్నాంగదధరాం సీతాం దదృశుస్తే ద్విజాదయః ॥ 89

గజేంద్రగమనాం రమ్యాం దివ్యపుష్పైః సుశోభితామ్ ।
దివ్యమందారకుసుమ మాలాభిశ్చ సుశోభితామ్ ॥ 90

కస్తూరీకృతతిలకాం కుంకుమేన సుశోభితామ్ ।
హరిద్రయా కజ్జలాద్యైర్మండితాం చ స్మితాననామ్ ॥ 91

ఇతి దృష్ట్వా జానకీం తేఽభూవన్ చిత్రోపమాస్తదా ।
ఆత్మానం న విదుః సర్వే సీతాసౌందర్యవిస్మితాః ॥ 92

**ఇతి శ్రీశతకోటిరామచరితాంతర్గతే శ్రీమదానందరామాయణే, వాల్మీకీయే, ఆదికావ్యే, విలాసకాండే, సీతాఽలంకారవర్ణనం నామ చతుర్థః సర్గః ॥**

ఆ దివ్యాలంకారములలోని రత్నకాంతులచే కళ్ళు త్రిప్పుకోలేని బ్రాహ్మణులందరును; ఎడమచేతిలో పాత్రమును, కుడిచేతిలో గరిటెను ధరించినదియు, కమలములవంటి పాదములు గలదియు, రత్నపు కలువలవంటి చేతులు గలదియు, తామరరేకులవంటి కన్నులు గలదియు, పద్మము వంటి ముఖము గలదియు, దివ్యగంధలేపితాంగియు, మంజీర మంజుల చరణయును, కంకణాలంకృత కరకమలయు, తన ఎఱ్ఱని చేతులచే గగనమును చూపునదియును ఐన సాక్షాత్ లక్ష్మీస్వరూపిణియగు సీతాదేవిని దర్శించిరి. గజరాజ గమనయు, దివ్యపుష్పాలంకృత దివ్యాంగియు, సురపారిజాతాది మాలికను ధరించి, రారాజించునదియు, కస్తూరి తిలకమును ధరించినది, పసుపు కుంకుమలచే అలంకరింప బడినది, కాటుకచే శోభించునదియు అగు సీతమ్మను చూచుచున్నవారందరును తమ్ముతాము ఎఱుంగక, జానకీ సౌందర్య విస్మితచిత్తులై బొమ్మలవలె స్తబ్ధులైఉండిరి. (92)

*ఈ విధముగ శ్రీమద్వాల్మీకి మహర్షిచే రచింపబడిన,*
*శ్రీ శతకోటిరామచరితాంతర్గత శ్రీమత్ ఆనందరామాయణములో,*
*శ్రీసీత అలంకారవర్ణనమనే 4వ సర్గ ముగిసినది.*



# పంచమః సర్గః-5వ సర్గ

సీతాదేవి జలక్రీడా వర్ణన

శ్రీరామదాస ఉవాచ
అథ సీతా క్షణేనైవ చకార పరివేషణమ్ ।
హేమపాత్రేషు సర్వేషాం పక్వాన్నైర్వివిధైర్ముదా ॥ 1

కామధేనూద్భవైశ్చైవ మండకాన్ పూర్ణపూరితాన్ ।
పటకాన్ ఫేనికాంశ్చాపి పాయసాన్యుజ్జ్వలాని చ ॥ 2

పర్పటకాన్ లడ్డూకాంశ్చ కూష్మాండవటకాంస్తథా ।
సుమృష్టతండులకృతాన్ దధిక్షీరం ఘృతం మధు ॥ 3

పృథక్కాంచనద్రోణేషు జానకీ పర్యవేషయత్ ।
శర్కరాః శ్వేతవర్ణాశ్చ తథైవ ఖండశర్కరాః ॥ 4

మరిచాద్యుపచారైశ్చ సంస్కృతం తక్రముత్తమమ్ ।
ఘృతపాచితశాఖాశ్చ హ్యుపశాకా రుచిప్రదాః ॥ 5

తిలసంమిశ్రవటకానార్ద్రకం బీజపూరకమ్ ।
ఆమ్రాదీనాం రసాంశ్చాపి రంభాదీని ఫలాన్యపి ॥ 6

ఏవమాదీన్యనేకాని చోష్యాని వివిధాని చ ।
తథా లేహ్యాని పేయాని జానకీ పర్యవేషయత్ ॥ 7

## సీతాదేవి శ్రీరామాదులకును, బ్రాహ్మణులకును వడ్డించుట.

శ్రీరామదాసు ఇట్లు పలికెను, "పిదప ఆ మంగళదేవతయగు జానకమ్మ క్షణమాత్రమున అచటివారందరికిని, కామధేనువు సృష్టించిన పక్వాన్నాది సమస్త పదార్థములను బంగారు పాత్రలో వడ్డించెను. ఊరగాయలు, గుజ్జులు, పచ్చళ్ళు, నేతితో వండినకూరలు, నువ్వుల వడియాలు, గుమ్మడివడియాలు, అటుకుల వడియాలు, వరుగులు, దప్పళములు, నప్పళములు, మండిగెలు, లడ్డులు, పాయసములు, పక్వాన్నములు, భక్ష్యములు, చప్పరించే లేహ్యములు, త్రాగే చారులు, మంచి జలములు, బంగారు దొన్నెలలో నెయ్యి, పాలు, పెరుగు, మంచి మజ్జిగ, తెల్లచక్కెర,

ఖండశర్కర, అరటిపండ్లు, మామిడిపండ్లు, దానిమ్మపండ్లు, ద్రాక్షపండ్లు, పనసపండు మొదలైన ఫలములు ఇంకా అనేకపదార్థములు వీటినన్నిటిని సాదరముగా సీతమ్మ వడ్డించి వానిపై నేతిని చిలకరించెను. (7).

**తతో రామః సుహృన్మిత్రైః కథాం కుర్వన్ సుఖేన సః ।**
**అకరోదుపహారం చ కరశుద్ధిం విధాయ సః ॥ 8**

**స్వర్వేషాం నిజహస్తేన దదౌ తాంబూలముత్తమమ్ ।**
**స్వయం భుక్త్వాఽథ తాంబూలం వాసాంసి పరిధాయ సః ॥ 9**

**బద్ధ్వా వస్త్రాణి సర్వాణి దృష్ట్వాదర్శే నిజం ముఖమ్ ।**
**ఆరుహ్య శిబికాం దివ్యాం ముక్తాగుచ్ఛవిరాజితామ్ ॥ 10**

**హైమీం రత్నాదిభిశ్చిత్రాం యయౌ నిజగృహాద్బహిః ।**
**బంధుభిః సచివైరిష్టైస్తైస్తైః సర్వత్ర వేష్టితః ॥ 11**

**స్తుతో వందిజనైః సర్వైర్యయౌ స జానకీగృహమ్ ।**
**తత్ర నత్వాఽథ కౌసల్యాం తథా మాతౄర్యథాక్రమమ్ ॥ 12**

**ఆశీర్భిరీడితస్తాభిర్యయౌ రామః సభాం వరమ్ ।**
**తత్ర సింహాసనే స్థిత్వా మంత్రిభిర్లక్ష్మణాదిభిః ॥ 13**

**రాజకార్యాణి సర్వాణి చకార నీతిమత్తరః ।**
**శశాస రాజ్యం ధర్మేణ బుద్ధిమాన్చారలోచనః ॥ 14**

**చారైర్జ్ఞాత్వా స్థితం సర్వం స్వరాజ్యస్య చ సర్వథా ।**
**శశాస రాజ్యం ధర్మేణ రాఘవో దీర్ఘలోచనః ॥ 15**

**అథ సీతోపహారం స్వసఖీభిశ్చోర్మిలాదిభిః ।**
**దేవరాణాం కామినీభిః స్వసృభిశ్చాకరౌత్సుఖమ్ ॥ 16**

**కరశుద్ధిం విధాయాథ భుక్త్వా తాంబూలముత్తమమ్ ।**
**పరిధాయ హరిద్వస్త్రం తథా రక్తాం తు కంచుకీమ్ ॥ 17**

## శ్రీరాములవారు భుజించివచ్చి, ధర్మపాలనమొనర్చుట.

అంత శ్రీరాముడు ఇష్ట మిత్రులతో వినోద కథాసల్లాపములను చేయుచు, సుఖముగా ఆహారమును భుజించి, హస్తప్రక్షాళన గావించి, అందరికి తన చేతిమీదుగా తాంబూలమును ఇచ్చెను. తానూ తాంబులమును సేవించి, వస్త్రములను అలంకరించుకుని సమస్త ఆయుధములను ధరించి, నిలువుటద్దములో ముఖమును చూచుకుని, ముత్తెముల కుచ్చులచే అలంకరింపబడియుండు సువర్ణాలంకృతమైన పల్లకీమీదనెక్కి, తన భవనమునుండి బయలుదేరి, ఇష్ట మిత్ర, బంధు, మంత్రి, దూత ప్రముఖులచే ముందుకుసాగి, వందిమాగదులు పొగడుచుండ తన తల్లి అంతఃపురమునకు వచ్చి, కౌసల్యాదేవికి నమస్కరించి, అదేవిధముగా వరుసగా తల్లులందరికిని నమస్కరించి, వారి ఆశీర్వాదములను తీసుకుని సభామండపమునకు వచ్చి, అచట దివ్యసింహాసనమున సుఖాసీనుడై, లక్ష్మణాది మంత్రులతో నీతిజ్ఞుడై రాచకార్యములను అన్నిటిని విచారించెను. వేగులనే కన్నులుగా గల బుద్ధిమంతుడైన శ్రీరాముడు ధర్మముగా రాజ్యమును పరిపాలించెను. (14)

## సీత భుజించి, ఉద్యానవనమునకు వెళ్ళుట.

తరువాత సీతమ్మ తన మరుదుల భార్యలైన ఊర్మిళాదులతోను, తన చెలికత్తెలతోను యథా సుఖముగా భోజనము ముగించి, చేతులు కడుగుకొని, తాంబూలమును పొంది, పీతాంబరమును అలంకరించుకొనెను.

**హేమతంతుసుపుష్పాఢ్యాం ముక్తాజాలవిగుంఫితామ్ ।**
**గేహాంతర్వర్త్యుపవనశాలాయాం సంస్థితాఽభవత్ ॥ 18**

**సఖీభిర్వేష్టితా రమ్యా ధృతాఽధోంకోపబర్హణా ।**
**తతో దివ్యానలంకారాన్నిజదేహే దధార సా ॥ 19**

**యే మయా కథితా నైవ పూర్వన్యస్తాన్ క్రమేణ తాన్ ।**
**కస్తేషాం వర్ణనే శక్తో భవేదత్ర నరోత్తమః ॥ 20**

**చతురాస్యః కుంఠితోఽభూత్పంచాస్యశ్చ షడాననః ।**
**ఉచ్చైఃశ్రవాశ్చ సప్తాస్యః సహస్రాస్యోఽపి వర్ణనే ॥ 21**

**శ్రుత్వా సీతాముపవనే గతాం తే జలయన్త్రిణః ।**
**జలయంత్రాణి సర్వాణి చక్రుర్ముక్తాని వేగతః ॥ 22**

రత్నమంచకసంస్థా సా సీతా చామరవీజితా ।
జలయంత్రకౌతుకాని దదర్శ నగవీరుధః ॥ 23

ఏతస్మిన్నంతరే రామో రాజకార్యాణి కృత్స్నశః ।
కృత్వా యయౌ సభాయాః స నిజగేహం తు బంధుభిః ॥ 24

తదా దుందుభినిర్ఘోషో నవవాద్యస్వనా అపి ।
శంఖానాం గోముఖానాం చ భేరీణాం తుములస్వనాః ॥ 25

బభూవుర్యత్ర శబ్దాశ్చ తూర్యాదీనాం స్వనాః శుభాః ।
ననృతుర్వారనార్యశ్చ తుష్టువుర్మాగధాదయః ॥ 26

తం స్వనం జానకీ చాపి శ్రుత్వా చోపవనే స్థితా ।
సంభ్రమేణ సముత్తీర్య మంచకాధో వరాననా ॥ 27

వామహస్తే ఝర్ఝరీం తాం హ్యుపపాత్రం చ దక్షిణే ।
ధృత్వా కరే సా వైదేహీ రామం ప్రత్యుజ్జగామ వై ॥ 28

ఏతస్మిన్నంతరే రామస్త్యక్త్వా తాం శిబికాం బహిః ।
విసర్జ్య సకలాన్‌లోకాన్ వివేశ బంధుభిర్గృహే ॥ 29

ముత్యాల దారములచేతను, బంగారు సరిగపూలను గల ఎఱ్ఱని రవికను ధరించి, ఇంటిలోని వెనుక వైపున ఉన్న ఉపవనమున ప్రవేశించి సుఖముగా కూర్చుండెను.

విష్ణుదాసా! మునుపు నేను చెప్పినట్టి అలంకారములే గాక, నేను చెప్పని దివ్యాలంకారములను ఎన్నిటినో జానకీదేవి అలంకరించుకొనెను. సీతాదేవి అలంకారమును వర్ణించుటకు యే నరోత్తమునికి సాధ్యమగును? నాలుగు తలలుగల బ్రహ్మదేవుడూ, ఐదు ముఖములుగల రుద్రుడును, ఆరు ముఖములుగల కుమారస్వామియును, ఏడు ముఖములుగల అగ్నిదేవుడును, వేయి తలలుగల ఆదిశేషుడు కూడా సమర్థుడు గాడు. సీతాదేవి ఉపవనమునకు దయచేసెనని విని, నీటిపనివారు జల యంత్రములను అన్నిటిని తెరచి నీటిని విడిచిరి. మణులతో, బంగారముతో చేసిన బల్లపై సీతమ్మ సుఖముగా కూర్చొనగా, దాసీజనులు చామరములు వీచుచుండగా జలయంత్రవినోదములను, వృక్షశాఖలలోనుండి చూచుచుండెను. (22) అంతలో ఆ శ్రీరాముడు రాజకార్యములను అన్నిటిని నిర్వర్తించి, సభనుండి వచ్చి, తన తమ్ములతో తన మందిరమునకు వచ్చెను.

## శ్రీ సీతారాముల జలక్రీడా మహోత్సవము

అప్పుడు దుందుభులు, నవవాద్యములు ప్రోగింపబడెను. వారనాంగలు ఆడిరి. స్తోత్రపాఠకులు కొనియాడిరి. ఆ కోలాహలములను ఉద్యానవనములో ఉన్న జానకీదేవి విని మిక్కిలి సంభ్రమముతో బల్లపైనుండి దిగి, ఎడమచేతిలో అర్ఘ్యపాత్రమును, కుడిచేతిలో ఉపాపాత్రమును తీసికొని, శ్రీరాముని ఎదుటకు వచ్చెను. అంతలో శ్రీరాముడు ముత్యపు పల్లకినుండి దిగి సమస్త పరివారజనులను వదలి తమ్ములతో ఉద్యానవనములోనికి ప్రవేశించెను.

**ఏతస్మిన్నంతరే దాస్యః శతశో రుక్మభూషితాః ।**
**రాఘవాగ్రే దుద్రువుస్తాః స్వస్వకర్మసు తత్పరాః ॥ 30**

**కాచిత్తం వ్యజనేనైవ వీజయామాస వేగతః ।**
**దధార చామరే కాచిత్కాచిదాసనముత్తమమ్ ॥ 31**

**కాచిత్తాంబూలపాత్రం సా కాచిన్నిష్ఠీవనస్య చ ।**
**పాత్రం దధార కాచిత్తు జలకుంభం మనోరమమ్ ॥ 32**

**కాచిద్దధార వస్త్రాణాం కోశం కాచిత్తు కార్ముకమ్ ।**
**కాచిద్దధార తూణీరం కాచిత్ఖడ్గం దధార సా ॥ 33**

**ఏవమాదీన్యనేకాని తదోపకరణాని తాః ।**
**జగృహూ రామచంద్రం తం వేష్టయామాసురాదరాత్ ॥ 34**

**తతో రామః శనైః పద్భ్యాం యయౌ జనకనందినీమ్ ।**
**స్థితాం తత్ర ప్రతీక్షంతీం పతిం జలరుహేక్షణమ్ ॥ 35**

**గృహాంగణారామమధ్యే సంస్థితాం సస్మితాననామ్ ।**
**దృష్ట్వాత్మానం విలజ్జంతీం సునాసాం చారులోచనామ్ ॥ 36**

**కటాక్షైశ్చారు పశ్యన్తీం సఖీభిః పరివేష్టితామ్ ।**
**తాం దృష్ట్వా రాఘవశ్చాపి కించిత్ కృత్వా స్మితాననమ్ ॥ 37**

**చకారాచమనం సమ్యక్ సీతార్పితజలేన సః ।**
**తతః స్థిత్వాఽఽఽసనే పీత్వా జలమగ్నే యయౌ పునః ॥ 38**

జలయంత్రసమీపస్థాం శాలాం సీతాసమన్వితః ।
తస్యాం సింహాసనే స్థిత్వా లక్ష్మణం ప్రాహ రాఘవః ॥ 39

గచ్ఛ భోజనశాలాం త్వం సర్వానాహూయ వేగతః ।
బ్రాహ్మణాదీనూర్మిలాదినారీణాం త్వరయస్వ హి ॥ 40

సర్వం కృత్వా యథాయోగ్యం తతో మాం కురు సూచనామ్ ।
తథేతి రామవచనాద్భరతేన స శత్రుహా ॥ 41

లక్ష్మణస్త్వరితో గత్వా సర్వానాహూయ వేగతః ।
వసిష్ఠాదిమునీన్మిత్రమంత్రిణః సుహృదస్తథా ॥ 42

త్వరయామాసోర్మిలాం చ మాండవీం భరతప్రియామ్ ।
శ్రుతకీర్తిం చ సౌమిత్రిః శ్రీరామవచనాత్తదా ॥ 43

ఏతస్మిన్నంతరే రామః కేసరాదివినిర్మితైః ।
చిత్రరాగైః పూరితాని జలయంత్రాణ్యనేకశః ॥ 44

కారయిత్వా తేషు సీతాం బాహుపాశైః దృఢం ముదా ।
ధృత్వాఽక్షిపత్పృథగ్గాస్యాదిషు పశ్యత్సు వై సుఖమ్ ॥ 45

అంతలో అచట బంగారు ఆభరణాలు ధరించిన దాసీజనులు తమతమ పనులలో జాగరూకులై వెడలిరి. ఒక చెలికత్తె విసనకఱ్ఱచే వీచసాగెను. మరియొక చెలికత్తె చామరములను ధరించెను. మరో చెలికత్తె ఆసనమును అందుకొనెను. ఇట్లే తమ్మపడిగెను ఒకరు, అమ్ములపొదను ఒకరు, వస్త్రపేటికను ఒకరు, ధనుస్సును ఒకరు, ఖడ్గమును ఒకరు, ఇట్లే శ్రీరాములవారి అన్ని వస్తువులను ఒక్కో చెలికత్తె తీసుకుని దూరముగా వెళ్ళిరి. అంత ఆ శ్రీరాముడు కాలినడకతో వెడలి, ఆ ప్రాంగణ మధ్యము నిలిచెను. తన్నుచూచి లజ్జించుచుండు దివ్యసుందరాంగి యైన మంగళాదేవత యగు సీతా సన్నిధానమునకు వచ్చెను. అచట సీతచే సమర్పింపబడిన జలముచే ఆచమనముచేసి, పీఠముపై కూర్చుండి, దివ్యజలమును త్రాగి ముందుకు వెడలెను. జలయంత్ర సమీపమున ఉండెడు లతాశాలను సీతాసమన్వితుడుగా ప్రవేశించి, అచటి సింహాసనముమీద కూర్చుండి, లక్ష్మణునిజూచి, “తమ్ముడా! నీవు భోజనశాలకుపోయి, బ్రాహ్మణాదులందరిని పిలిచి, ఊర్మిళాదులను త్వరపరచుము. అన్నిటిని సిద్ధపరచి నాకు సూచనచేయుము,” అని చెప్పెను. లక్ష్మణుడు అట్లే అని భరత, శత్రుఘ్నులతో వెడలి, వశిష్ఠాది మునులను, మంత్రులను, ఇష్టమిత్రులను అందరిని పిలిపించెను. ఊర్మిళ,

్రశుతకీర్తి, మాండవులను కార్యక్రమములలో శ్రీరామాజ్ఞచే త్వరపరచెను. అంతలో ఉద్యానవనమున శ్రీరాముడు చిత్రరాగములను నింపి, కేసరాదులచే నిర్మింపబడిన అనేక జలయంత్రములను చేయించి, వేరుగా దాసీజనులందరును సంతోషించుచుండ జలకోనేరులో సీతను తన బాహుపాశములచే పట్టి, ఎత్తి త్రోసెను. తానుకూడా ఆ కోనేరులో ఎక్కిదూకెను.

తతః స్వయం పపాతోచ్చైర్జలయంత్రేషు వై పృథక్ ।
జలక్రీడాం స మైథిల్యా చకార రఘునందనః ॥ 46

భుజాభ్యాం స సమాలింగ్య తాం ముహుః ప్రక్షిపన్ముదా ।
రంజయామాస వైదేహీం సురాగాంజలిసేచనైః ॥ 47

తతః సుగంధతైలాని తథా పరిమళాని హి ।
నానాసుగంధద్రవ్యాణి మాంగల్యాని బహూని చ ॥ 48

దాసీభిః శీఘ్రమానీయ తావుభౌ హి పరస్పరమ్ ।
వవర్షతుః సుమాద్యైశ్చ క్రీడాద్రవ్యైర్మనోరమైః ॥ 49

కరాభ్యాం జలయంత్రాణి మిథస్తౌ సమ్ముమోచతుః ।
రామాక్షిసంజ్ఞయా దాస్యః సీతాసఖ్యోఽపి సూచితాః ॥ 50

వస్త్రభిత్తిబహిర్ద్వారం గత్వా తస్థుర్వ్రిలజ్జితాః ।
కాశ్చిత్ ద్వారేషు తస్థుస్తాస్తూష్ణీం ప్రముదితాననాః ॥ 51

అదృష్ట్వాఽయం తతః సీతారామౌ రహసి సాదరమ్ ।
జలయంత్రేషు తౌ క్రీడాం చక్రతుః సుచిరం ముదా ॥ 52

ముష్టిభ్యాం జానకీ రామం తాడయామాస కౌతుకాత్ ।
సోఽపి తాం తాడయామాస ముష్ట్యా పుష్పసమానయా ॥ 53

చుచుంబా తస్యా బింబోష్ఠం చూర్ణయామాస తత్కుచౌ ।
ముక్త్వా తత్కంచుకీబంధమాలింగ్య హృదయేన తామ్ ॥ 54

ముమోచ కచ్ఛం శ్రీరామః సీతాయాః స్వకరేణ సః ।
ఉడ్డీయ వస్త్రం హస్తేన తద్రంభోరు దదర్శ సః ॥ 55

ఆ వైదేహి తోడ శ్రీరాముడు జలక్రీడలకు ఆరంభించెను. భుజములచే ఆమెను ఆలంగించుకుని, పలుమార్లు నీటిలో పడద్రోయుచు, రాగరసయుక్త జలములను చల్లుచు మిక్కిలి రంజింపజేసెను. పిదప అట్లే పరిమళోదకములను, దివ్యతైలములను, సుగంధి చూర్ణములను, మంగళద్రవ్యములను, దాసీజనులు తెచ్చి అందించుచుండగా ఒండొరులు మీద చల్లుకొనుచు క్రీడించిరి. పూలవానలను పరస్పరము ఒకరిమీదనొకరు కురిపించుకొనిరి. మరి వారు పిచకారులచే వసంతములను చల్లుకొనుచుండిరి. శ్రీరాముడు కనుసన్నలచే సూచనచేయగా సీత సఖీజనులు కూడా అక్కడ నిలువక దివ్యవస్త్రముల పరదాలకు వెలుపల దూరముగా పోయి లజ్జించుచు నిలిచిరి. కొందరు ద్వార ప్రదేశమునకు పోయి సంతోషముతో ఊరకే నిలిచిఉండిరి. ఇట్లుండగా ఆ సీతారాములు అన్యులు లేరని గుర్తించి, రహస్యముగా జలయంత్రములతో చాలాసేపు క్రీడించుచు ఆనందించిరి. ఒకరినొకరు తాకుచూ సరసములాడసాగిరి. పరమాత్మయగు శ్రీరాముడు మహామాయయగు మంగళాదేవియొక్క బింబోష్ఠమును సాంసారిక మానవసుఖ నిరూపణమును చూపుచున్నాడనునట్లు చూపించెను. కుచకుంభములను మర్దించెను. కంచుక బంధమును వదలించి, గాఢాలింగమునములను ఒనరించెను.

**తతః కరేణ తన్నీవీం రామశ్చాకర్షయన్ముదా ।**
**సీతాప్యాకర్షయద్వేగాద్రామనీవీం స్మితాననా ॥ 56**

**ఏవం పరస్పరం క్రీడాం చక్రతుర్దంపతీ ముదా ।**
**కః సమర్థస్తయోః క్రీడాం సవిస్తారాం నివేదితుమ్ ॥ 57**

**ఏతస్మిన్నంతరే రామం భోజనార్థం తు సూచనామ్ ।**
**కర్తుం యయౌ స సౌమిత్రిః సమాహూయ సుహృజ్జనాన్ ॥ 58**

**నిషేధితః స దాసీభిర్వనద్వారాద్బహిః స్థితః ।**
**తా ఊచుః సమయో నాయం రామం గంతుం చ న క్షణమ్ ॥ 59**

**స్థిరో భవాత్ర సౌమిత్రే రామో రహసి సీతయా ।**
**కరోతి జలయంత్రేషు జలక్రీడాం యథాసుఖమ్ ॥ 60**

**పునస్తాః ప్రాహ సౌమిత్రిర్యుష్మాభిర్వచనేన మే ।**
**నివేదనీయం రామాయ సూచనార్థం హి లక్ష్మణః ॥ 61**

**సమాగతస్త్వామస్తీతి తతో యాస్యామ్యహం గృహమ్ ।**
**తతస్తాసు తదా త్వేకా దాసీ గత్వా రఘూత్తమమ్ ॥ 62**

వస్త్రభిత్తేర్బహిః స్థిత్వా భయభీతాఽతిలజ్జితా ।
కథయామాస సౌమిత్రేర్ద్వారి హ్యాగమనం శనైః ॥ 63

తద్దాసీవచనం శ్రుత్వా జలయంత్రాత్తు జానకీమ్ ।
బహిః కృత్వా నిర్గతశ్చ రామస్తుష్టమనాః స్వయమ్ ॥ 64

జలైరుష్ణైః ప్రభుః స్నాత్వా దేహముద్వర్తనాదిభిః ।
సుగంధద్రవ్యరాగాదీన్ కృత్వా దూరం ప్రియాన్వితః ॥ 65

పీతకౌశేయవాసాంసి పరిధయాఽథ దంపతీ ।
దదతుశ్చార్ద్రవస్త్రాణి హేమతంత్వకితాని చ ॥ 66

దాసీభ్యశ్చాథ దాసేభ్యో రాగాద్యైశ్చిత్రితాని హి ।
తౌ జగ్మతుః పుష్పచితమార్గేణాప్యశనగృహమ్ ॥ 67

తత్ర పూర్వోక్తోపచారాధికైర్నానోపచారకైః ।
ఊర్మిలాదిభిరన్నం యత్కామధేనుసముద్భవమ్ ॥ 68

దర్వీభిః స్వర్ణజాభిశ్చ పాత్రేషు పరివేషితమ్ ।
మునీశ్వరైశ్చ గురుణా సుహృన్మిత్రసమన్వితః ॥ 69

మంత్రిభిర్బంధుభిశ్చాపి రామోఽశ్నం స్తోషమాప సః ।
తత్పాత్రం వీజయామాస జానకీ చామరేణ సా ॥ 70

ఇంకను కామోత్తేజకములైన చేష్టలచే సీతను ఆనందకేళిలో తేలించెను. ఒండొరులు పరస్పరం వస్త్రాపహరణములచే పరిహాసములాడిరి. దీనిని వర్ణింపనెవని తరము? అంతలో అచటి భోజనసమయ సూచన నిచ్చుటకై లక్ష్మణుడు ఏతెంచి, తత్ సఖీజనులను పిలిచెను. ద్వారదాసులచే అడ్డగించబడి నిలచియుండు లక్ష్మణునిజూచి, వారు, "శ్రీసీతారాములు ఇరువురును రహస్యముగా జలయంత్రముల తోడ జలక్రీడాతత్పరులై ఉన్నారు నీవు పోవలదు ఇచటనే క్షణకాలము నిరీక్షించుచుండుము." అని పలికిరి. అందుకు లక్ష్మణుడు, "సరియె మీరు వెళ్ళి, భోజనసమయాసూచనకై లక్ష్మణుడు వచ్చి కనిపెట్టికొనియున్నాడు అని ఇంతమాత్రము చెప్పి రండి." అని ఆజ్ఞాపించెను. వారిలో ఒక చెలికత్తె అపుడు శ్రీరామసన్నిధానమునకు పోయి, తెరచాటున నిలచి, భయభీతయును లజ్జితయును అయి తిన్నగా లక్ష్మణుని ఆగమనమును విన్నవించెను. శ్రీరాముడు ఆ మాటను విన్నతోడుతనే సీతను నీళ్ళతొట్టినుండి బయటవిడిచి, తాను బయటకువచ్చి సంతసించుచు, ఉష్ణోదకమున నలుగుపిండి

మొదలైన సుగంధ దివ్య ద్రవ్యములతో స్నానముచేసి, సీతాదేవి తోడ దివ్య పీతాంబరములను ధరించి, సరిగె తడిబట్టలను దాసీజనులకు ఇచ్చి, పూలుపరచిన నేలమీదుగా భోజనశాలకు ఏతెంచెను. అచట పూర్వోక్తవిధానములకన్నా అధికముగ వివిధోపచారములతో, సువర్ణపాత్రలలో ఊర్మిళాది అంగనామణులు కామధేను కల్పితములైన పక్వాన్నాది సమస్త పదార్థములను వడ్డించిరి. అప్పుడు శ్రీరాముడు మునీంద్రులతోను, గురువులతోను, మిత్రులతోను, సాధువులతోను, మంత్రులతోను సుఖముగా భోజనమారగించి, ఆనందించుచుండెను. సీతమ్మ వ్యజనముచే వీచుచుండెను.

**సవినోదైశ్చాటువాక్యై రంజయామాస రాఘవమ్ ।**
**ఏవం కృత్వా భోజనం తు కృత్వా తాంబూల చర్వణమ్ ॥ 71**

**సీతాసమర్పితం రామస్తస్థౌ శ్రుణ్వన్ కథాః సుఖమ్ ।**
**మంత్రిభిర్బంధుభిర్మిత్రైర్గేహాంతః సదసి ప్రభుః ॥ 72**

**సీతాఽపి భోజనం కృత్వా దివ్యాలంకారమండితా ।**
**నిద్రాశాలాం సమాసీనా సఖీభిః పరివేష్టితా ॥ 73**

**చకార సారిభిః క్రీడాం వాసీభిర్వీజితా ముదా ।**
**కుర్వంతీ రఘునాథస్య ప్రతీక్షాం ద్వారలోచనా ॥ 74**

**ఇతి శ్రీశతకోటిరామచరితాంతర్గతే, శ్రీమదానందరామాయణే,**
**వాల్మీకీయే, ఆదికావ్యే, విలాసకాండే, జలక్రీడావర్ణనం నామ, పంచమః సర్గః ॥**

వినోదకరములగు చాటువాక్యములచే శ్రీరాముని రంజింపజేసెను. శ్రీరాముడు ఇట్లు భుజించి, సీతచేతినుండి ఇవ్వబడిన తాంబూలమును ఆస్వాదించి, అంతఃపుర దివ్యమందిరమున మంత్రి, బంధు, మిత్ర, పరివారములతో కథాగోష్ఠి సుఖమును అనుభవించుచుండెను. సీతమ్మయును భోజనముచేసి, దివ్యాలంకారములను అలంకరించుకుని, నిద్రాశాలకు ఏతెంచి, సఖీజన పరివేష్టితయై శ్రీరాముని రాకకై ఎదురుచూచుచుండెను. తద్వారము నవలోకించునదియై దాసీజనులు వ్యజనాదులచే సేవించుచుండగా సోగాటలాడుచుండెను. (5)

***ఈ విధముగ శ్రీమద్వాల్మీకి మహర్షిచే రచింపబడిన, శ్రీ శతకోటిరామచరితాంతర్గత***
***శ్రీమత్ ఆనందరామాయణములో, 5వ సర్గ ముగిసినది.***



# షష్ఠః సర్గః-6వ సర్గ

శ్రీ సీతారాముల దినచర్య వర్ణన.

శ్రీరామదాస ఉవాచ

అథ రామో బంధుభిశ్చ నిద్రాశాలాం యయౌ ముదా ।
స్తుతో బందిజనాద్యైశ్చ వివేశైకాంతమందిరమ్ ॥ 1

విసర్జ్య లక్ష్మణాదీంశ్చ దాసీభిః పరివారితః ।
దదర్శ జానకీం నిద్రాశాలాయాం రఘునందనః ॥ 2

సాఽపి జ్ఞాత్వాఽఽగతం రామం సారిక్రీడాం విహాయ చ ।
ప్రత్యుజ్జగామ రామాయ సఖీభిర్నూపురస్వనా ॥ 3

నత్వా రామం కరే ధృత్వా మంచకే సంన్యవేశయత్ ।
దత్త్వా పాతుం జలం తస్మై దదౌ తాంబూలముత్తమమ్ ॥ 4

తతశ్చకార శ్రీరామో నిద్రాం సీతాసమన్వితః ।
దాసీభిర్వీజితశ్చాపి పర్యంకే రత్నభూషితే ॥ 5

ముహూర్తమాత్రాదుత్థాయ ధృతార్ధోకోపబర్హణా ।
తస్థౌ సీతా మంచకాధస్తతో రామోఽప్యబుధ్యత ॥ 6

## శ్రీసీతారాముల దినచర్యా వర్ణనము.

పిదప శ్రీరాముడు తమ్ములతోపాటు సంతతముగా నిద్రాశాలకు వెళ్ళెను. వందిజనులచే స్తుతింపబడుచు, లక్ష్మణాదులను, దాసీవర్గమును వదలి ఏకాంతమందిరమున ప్రవేశించి, నిద్రామందిరమున సీతను జూచెను. ఆమె శ్రీరాముని రాకను గుర్తించి, సారికా క్రీడను వదలి, సఖులతో నెదుటవచ్చి, శ్రీరాముని చరణకమలములకు నమస్కరించి, హస్తలాఘవమునిచ్చి దివ్యమంచముమీద కూర్చుండబెట్టి, దివ్యపానీయములను సమర్పించి, తాంబూలమును సరాగముగా అర్పించెను. అంత ఆ రఘునందనుడు రత్నములు పొదిగిన మంచముపై దాసీజనులచే వీజితుడై, జానకీదేవితో స్వానంద నిద్రనందెను. తనతొడపై తలపెట్టి నిదిరించుచున్న శ్రీరాముడు ఒక ముహూర్తము కాగానే లేచి మంచమునుండి దిగి నిలిచెను. వెంటనే శ్రీరాముడు మేల్కొనగా, నిద్రలేచిన తన పతికి జనకపుత్రి మరలా పానీయములగు దివ్యజలములను అర్పించెను.

దృష్ట్వా సముత్థితం రామం దత్వా పాతుం జలం పునః ।
దదౌ సీతాఽథ తాంబూలం రాఘవాయాతిహర్షితా ॥ 7

రామదాస్యస్తథా రామం వీజయామాసురాదరాత్ ।
కేకిపక్ష సముద్భూతైః చామరై రుక్మభూషితైః ॥ 8

సీతాదాస్యస్తథా సీతాం వీజయామాసురాదరాత్ ।
ధేనుపుచ్ఛోద్భవైర్దివ్యైశ్చామరైర్హేమమండితైః ॥ 9

తతః సీతాకరం ధృత్వా ద్రాక్షావల్యా సుమంటపమ్ ।
యయౌ రామోఽఽంగణోద్భూతం తస్థౌ తదథ ఆసనే ॥ 10

ఉపబర్హణసంపృష్టః సీతావామస్థితో ముదా ।
హస్త్యశ్వోష్ట్రమంత్రిరాజదూతైః కృత్రిమనిర్మితైః ॥ 11

హేమరత్నహస్తిదంతసంభూతైరతిచిత్రితైః ।
క్రీడాం బుద్ధేర్బలేనైవ చకార సీతయా సుఖమ్ ॥ 12

తతః పక్షికులైః సర్వైః పంజరస్థైః ససీతయా ।
క్రీడాం చకార శ్రీరామో దాసీభిర్వీజితో ముహుః ॥ 13

ఏతస్మిన్నంతరే తత్ర సీతయాఽఽకారితాః పురా ।
సమాయయుర్వారనార్యో ననృతుః శతశస్తదా ॥ 14

చక్రుర్గీతం సస్వరం తాః షడ్జస్వరసమన్వితమ్ ।
తతస్తాభ్యో హ్యలంకారాన్ దత్వా వస్త్రాణి జానకీ ॥ 15

విసర్జయామాస తాః సర్వాస్తతో రాఘవమబ్రవీత్ ।
స్థిత్వా ప్రాసాదవర్యేద్య కౌతుకం హట్టజం త్వయా ॥ 16

ద్రష్టుమిచ్ఛామ్యహం రామ శీఘ్రముత్తిష్ఠ రాఘవ ।
తత్సీతావచనాద్రామః ప్రాసాదం ప్రతి సీతయా ॥ 17

గత్వా దివ్యాసనే స్థిత్వా గవాక్షై రుక్మభూషితైః ।
రత్నోద్భవకపాటైశ్చ ముక్తాజాలవిరాజితైః ॥ 18

సీతాదేవి మిక్కిలి సంతోషముతో శ్రీరామునికి తాంబూలమును అందించుచుండెను. శ్రీరాముని దాసీవర్గము సాదరముగా శ్రీరాఘవేంద్రుని నెమలి రెక్కలతో ఏర్పరిచిన కనకాలంకృత వ్యజనములచే వీచుచుండెను. అట్లే సీతయొక్క దాసీవర్గము మైథిలిని ధేనువోచ్చములగు సువర్ణాలంకృత చామరములచే విసురుచుండిరి. అంత ఆ శ్రీరామచంద్రుడు నిజకరకమలములచే సీతాదేవి పాణిపద్మమును గ్రహించి, అగణ మధ్య నర్తియగు ద్రాక్షాలతల మంటపమునకు వచ్చి దివ్యాసనమున సుఖాసీనుడాయెను. సీతాదేవికి ఎడమ ప్రక్కలో సంతోషించుచు, వెన్నుతలగడను ఆనుకుని కూర్చుని– రాజు, మంత్రి, సేనాపతులు, గజ, రథ, తురగ, పదాతులు మొదలైన సువర్ణ, రత్న, గజ దంతాదులచే బొమ్మలుగా కల్పించి పెట్టియుండు కృత్రిమ ప్రతిమలచే– శ్రీరాముడు జానకమ్మతో బుద్ధిబలముచే యథేష్టముగా క్రీడలను ఒనరించెను. పిదప పలుమారు దాసీజన సేవితుడైన శ్రీరాముడు సీతతో పంజరములలోని పక్షులను పట్టుకుని క్రీడించెను. ఇంతలో వారిఎదుట సీతచే పిలుపింపబడిన వారకాంతలు నూర్లకొలదిగా వచ్చి నర్తనములాడిరి. షడ్జస్వర సమన్వితముగా సుస్వరగీతములను పాడిరి.

## శ్రీ జానకీదేవియొక్క మహోదార శాసనము.

సీతాదేవి ఆ కళాకారులకు వస్త్రాలంకారములను పారితోషకముగా ఇచ్చి, అందరిని పంపించి, శ్రీరామచంద్రుని జూచి, "ప్రాణనాథా! మనమీరథమునెక్కి అంగడి వీధులలోని వేడుకలను చూతము వేగమే లెమ్ము." అని ప్రార్థించెను. అట్టి భూపుత్రి మాటలను విని, సీతతోడ మేడనెక్కి, దివ్యాసనమున కూర్చుని, ముత్తెముల జాలర్లు కలిగి, రత్నకవాటములచే రాజించుచుండెను.

**రాజవీథ్యాం హట్టజాతం దదర్శ జనకౌతుకమ్ ।**
**సీతాయై దర్శయామాస కౌతుకాని స రాఘవః ॥ 19**

**స్వీయదక్షిణహస్తస్య తర్జన్యా ముదితాననః ।**
**ఏతస్మిన్నంతరే హట్టే ద్విజపత్నీ తు సీతయా ॥ 20**

**దృష్ట్వాఽలంకారవస్త్రాద్యైర్హీనా కటిధృతాఽర్భకా ।**
**గచ్ఛంతీ రాజమార్గేణ కృశా భిక్షార్థముద్యతా ॥ 21**

**తాం తాదృశీం నిరీక్ష్యాథ దాస్యాహూయ విదేహజా ।**
**పప్రచ్ఛ భూషణాద్యైస్త్వం కిమర్థం రహితా హ్యసి ॥ 22**

**సా ప్రాహ తీర్థయాత్రార్థం త్యక్త్వా మాం తాతలాలితా ।**
**తాతగేహే గతో భర్తా తాతోఽపి జరతో మృతః ॥ 23**

గురుగేహేஉవంతికాయాం వర్తేతే భ్రాతరౌ మమ ।
న పోషకః కోஉపి గేహేஉధునా సీతేஉస్తి వై మమ ॥ 24

తస్మాన్న సంత్యలంకారవాసాంసి జనకాత్మజే ।
ఇతి తస్యా వచః శ్రుత్వా రామాస్యం సన్నిరీక్ష్య సా ॥ 25

నిజాలంకారవాసాంసి దదౌ తస్యై విదేహజా ।
బ్రాహ్మణీం సా పునః ప్రాహ గచ్ఛ త్వం లక్ష్మణం ప్రతి ॥ 26

హేమముద్రా లక్షమితాస్త్వం గృహాణ మమాజ్ఞయా ।
తథేతి జానకీం పృష్ట్వా సా యయౌ లక్ష్మణం తదా ॥ 27

పూర్వాధికానలంకారాన్ స్వదేహే జానకీ పునః ।
దధార దివ్యవాసాంసి హేమతంతూద్భవాని సా ॥ 28

లక్ష్మణం బ్రాహ్మణీ గత్వా సీతావాక్యం న్యవేదయత్ ।
దదౌ తస్యై లక్ష్మణోஉపి హేమముద్రాస్తదైవ సః ॥ 29

సీతావాక్యాల్లక్షమితా మృషా మేనే న తద్వచః ।
కః సమర్థో రామరాజ్యే మృషా వక్తుం భవేదితి ॥ 30

బంగారు కిటికీలలోనుండి వీధిబజారులలోని వేడుకలను చూచుచు, సీత తన కుడిచేతి చూపుడు వేలిచే చూపించుచు, చిరునవ్వుగల ముఖముతో ఇట్లుండగా అచట వ్యాపార వీధిలో దారిద్ర్యముతో కొట్టుమిట్టాడుచు, ఒంటిపై సరియైన వస్త్రాలులేక, నడుముపై బిడ్డను ఎత్తుకుని, బిచ్చమెత్తుచు పోవుచుండు ఒక బ్రాహ్మణ స్త్రీని సీతమ్మజూచెను. కరుణ కలిగిన సీతమ్మ దాసీలను పంపి ఆ బ్రాహ్మణ స్త్రీని పిలిపించెను. నీవేల అలంకారములేక ఇట్లు ఉందువని అడిగెను. ఆమె సీతను జూచి, “పుట్టినింట కన్నతండ్రిచే గారాబముగా పెంచబడుచుండు నన్నువదలి నా భర్త తీర్థయాత్రార్థము వెడలినాడు ఇప్పటివరకు రాలేదు. నా తండ్రియును వయసుమీరి చనిపోయెను. నా సోదరులు ఇరువురిని అవంతికా పురిలో గురుకులవాసము చేయించుచున్నారు. ఇప్పుడు ఇంటిలో నన్ను పోషించువారు ఎవ్వరూ లేరు. కావున నా దేహమున యే అలంకారములేదు.” అని చెప్పగా ఆ మాటలను వినిన జనకపుత్రి శ్రీరామచంద్రుని ముఖారవిందమును చక్కగా అవలోకించి, తన అలంకారములను, వస్త్రాభరణములను ఆ బ్రాహ్మణ స్త్రీకి ఇచ్చి, “నీవు లక్ష్మణుని వద్దకు పొమ్ము. నా ఆజ్ఞ వలన అతనివద్ద లక్ష బంగారు నాణెములను తీసుకొనిపొమ్ము.” అని చెప్పి పంపగా, ఆమె అట్లే

అని లక్ష్మణ సన్నిధానమునకు పోయెను. సీతాదేవి మునుపు ఉన్న అలంకారములకన్న అధికముగా దివ్యభూషణములను, బంగారు సరిగె వస్త్రములను అలంకరించుకొనెను. ఆ ద్విజాంగన లక్ష్మణుని వద్దకుపోయి సీతాదేవియొక్క ఆజ్ఞను తెలిపెను. లక్ష్మణుడు వెంటనే ఆమె మాటలను అబద్ధములని అనుమానించక లక్ష బంగారు నాణెములను ఆమెకు ఇచ్చెను. శ్రీరాముని రాజ్యములో అబద్ధములాడెడువారు కూడా గలరా? అట్టి సాహసముగలవారెవరు? లేనేలేరు. పిమ్మట సీతమ్మయును లక్ష్మణుని వద్దకు తన దాసీని పంపెను.

**అథ సీతాఽపి సౌమిత్రి స్వాం దాసీం ప్రేష్య వై తదా ।**
**అయోధ్యాయాం తథా రాష్ట్రే ఘోషయామాస దుందుభిమ్ ॥ 31**

**సప్తద్వీపేషు సర్వత్ర పృథగ్వర్షేషు సాదరమ్ ।**
**కాచిన్నారీ పుమాన్ వాపి వినా సద్వస్త్రభూషణైః ॥ 32**

**దృష్టశ్చారైర్మయా జ్ఞాతో యద్దేశే యత్పురే కదా ।**
**తద్రాజ్ఞశ్చాస్తు మే దండో రామస్యాపి విశేషతః ॥ 33**

**ఇతి మచ్ఛిక్షితం జ్ఞాత్వా సకోశైః స్వీయరాష్ట్రకే ।**
**వస్త్రాలంకారభూషాభిర్భూషణీయా ద్విజాదయః ॥ 34**

**సప్తద్వీపనృపతయశ్చేత్థం సీతాసుశిక్షితమ్ ।**
**గజదుందుభిఘోషేణ శ్రుత్వా చక్రుస్తథైవ చ ॥ 35**

**తదారభ్య జగత్యాం న కశ్చిద్విగతభూషణః ।**
**నారీ వా పురుషో వాఽఽసీత్ కుత్రాప్యవనిజాభయాత్ ॥ 36**

**ఏవం నానాకౌతుకాని భూమ్యాం సీతాఽకరోన్ముదా ।**
**అథ రామః సభాం గత్వా పునర్వ్యోమే చతుర్థకే ॥ 37**

**చకార రాజకార్యాణి ధర్మేణైవ స్వబంధుభిః ।**
**నటనాటకవేశ్యానాం కౌతుకాని మహాంతి చ ॥ 38**

**దదర్శ స సభామధ్యే స్తుతోమాగధవందిభిః ।**
**తతః సర్వాన్విసృజ్యాథ యయౌ సీతాగృహం ప్రభుః ॥ 39**

**సాయంసంధ్యాదికం కృత్వా హుత్వా హోమం యథావిధి ।**
**తతో గంధాదిభిః పూజ్య బ్రాహ్మణాంశ్చాపి రాఘవః ॥ 40**

**నానోపహారనైవేద్యం దత్వా తేభ్యః స్వయం ప్రభుః ।**
**కృత్వోపహారం శ్రీరామః శ్రుత్వాపౌరాణికీం కథామ్ ॥ 41**

"సప్తద్వీపములలోను అంతట ఒక్క పురుషుడు గాని, స్త్రీ గాని మంచి వస్త్రములను, మంచి సొమ్ములను లేనివాడుగాని, లేనిదానిగా చారులవలన నాకు తెలియవచ్చితే, ఎప్పుడేదేశమునందు, యేపురమునందు అట్లు తటస్థించునో ఆ రాజు నాయొక్క శిక్షను శ్రీరామదండనమును వహింపవలసి ఉండును. ఇట్లు నాచేత శాసనము చేయబడినదని తెలిసి, తమ కోశములవలన రాష్ట్రమున ఉండు ద్విజాతులు, వస్త్రాలంకార భూషణాదులచే అలంకరింప బడియుండవలయును," అని భేరీనాదముతోడ అంతట దండోర వేయించునట్లు చెప్పి పంపెను. అట్లే లక్ష్మణుడు శ్రీసీతాదేవి శాసనమును ఏనుగులమీద దుందుభులచే మ్రోగించుచు, ప్రకటించెను. దానిని విని సప్తద్వీప రాజులందరును అట్లే నెరవేర్చిరి. అది మొదలు జానకీదేవి యొక్క భయము వలన స్త్రీ గాని, పురుషుడు గాని ఆభరణములులేక ఉండలేదు. ఇట్లు సీతాదేవి వివిధ ఆశ్చర్యకర విషయములను సంతోషముతో చూపుచు వచ్చెను. అంత ఆ శ్రీరాముడు సభకు వెడలి, నాలుగవ యామమున తన తమ్ములతోడ ధర్మముగా రాజకార్యములను నెరవేర్చెను. వంది మాగధులచే అభివందితుడగుచు, సభామధ్యమున రారాజించుచు, శ్రీరాముడు నటుల నాటకాదులను, గణికాంతర నాధులను విలోకించెను. పిదప శ్రీరాముడు సభనుండి సర్వజనులను విడచి, జానకి మందిరమునకు వెడలి, సాయంసంధ్యా వందనాది సత్కారాలను ఆచరించి, యథావిధిగా అగ్నిహోత్ర కర్మలను నిర్వర్తించి, గంధాది ఉపచారములచే సాంబశివుని ఆరాధించి, భూసురోత్తములను పూజించి, వారికి రకరకాల ఉపచార నైవేద్యములను సమర్పించి, తాను అభ్యవ్యవహారమును ఆరగించి, పురాణకథలను ఆలకించుచుండెను.

**కీర్తనైర్హరిదాసానాం వేశ్యానాం నర్తనైరపి ।**
**పౌరోదితాభిర్వార్తాభిర్గాయకానాం చ గాయనైః ॥ 42**

**సార్ధయామాం నిశాం నీత్వా యయౌ నిద్రాస్థలం శనైః ।**
**తతో రత్నప్రకాశైః స జగామ జానకీం ప్రతి ॥ 43**

**సాఽపి ప్రత్యుజ్జగామాథ రత్నదీపైః సఖియుతా ।**
**తతః స సీతయా రామః పర్యంకే రత్నచిత్రితే ॥ 44**

**చకార సీతయా క్రీడాం రంజయామాస జానకీమ్ ।**
**తతస్తౌ దంపతీ నిద్రాం చక్రతుర్వీజితౌ ముహుః ॥ 45**

దాసీభిర్వ్యజనైశ్చిత్రైశ్చామరైర్హేమభూషితైః ।
ఏవం రామేణ సా సీతా సుఖమాప పతివ్రతా ॥ 46

సీతయా రాఘవశ్చాపి సుఖమాప విశేషతః ।
ఏవం నానాకౌతుకాని ప్రత్యహం రఘునందనః ॥ 47

చకార సీతయా సార్ధం పరిపూర్ణమనోరథః ।
కదా చంద్రస్య జ్యోత్స్నాయామంగణే సద్మ నః ప్రభుః ॥ 48

చకార సీతయా నిద్రాం కదా ప్రాసాదమస్తకే ।
కదా ప్రాసాదాంతరే వాఽపి గవాక్షపవనైః శుభైః ॥ 49

సుఖమాప కదా రామః కదా రహసి మందిరే ।
కదా కనక శృంఖలా సవితానసుమంచకే ॥ 50

కదా ద్రాక్షామంటపాధో జలయంత్రసమీపతః ।
కాచభూమ్యాం రుక్మభూమ్యాం మణిభూమ్యాం కదాఽపి వా ॥ 51

స్ఫటికాది సుభూమ్యాం హి కదా సుష్వాప రాఘవః ।
కదా స పుష్పకే వాఽపి రంగశాలాఽన్తరే కదా ॥ 52

కదా స చిత్రశాలాయాం కదోశీరమయే గృహే ।
కదా పుష్పమయే గేహే కదా రంభావనే వరే ॥ 53

సీతాదేవి–హరినామమును ఒనరించు భాగవతుల కథలచేతను, వారాంగనా నర్తనములచేతను, ఉత్తమమగు ఊరివారుచెప్పెడు వార్తలచేతను, గాయకులయొక్క దివ్యగానముల చేతను, రాత్రియొక్క మొదటి ఒకటిన్నరజామును గడిపి, తిన్నగా నిద్రాలయమునకు వెడలెను. పిదప రత్నప్రకాశములతో వచ్చుచుండు శ్రీరామచంద్రస్వామిని సీతాదేవి రత్నదీపములతో, సఖీవర్గముతోను ఎదురువచ్చి పిలుచుకొనిపోగా ఆ ఇరువురు రత్నచిత్రితమగు మంచమునెక్కిరి. శ్రీరాముడు సీతాదేవితో సరస సల్లాపాది క్రీడాకౌతూహకమునుపొంది, ఆనందముతో హృదయారవిందుడయ్యె. అంత ఇరువురు దంపతులు దాసీజనులచే కనకరత్న చిత్రిత చామరవ్యజనములచే సేవింపబడుతు సుఖానిద్రా ముద్రితులుగా ఉండిరి. ఇట్లు సతీమణియగు సీత శ్రీరామునివలన సుఖమును పొందుచుండెను. సతీవ్రతుడగు శ్రీరాముడు సీతవలన విశేషసుఖమునందుచుండెను. మరియు నిట్లే శ్రీరాముడు సీతాదేవితోడ ప్రతిరోజూ వివిధ వినోదములను అనుభవించుచు, పరిపూర్ణ మనోరథుడై ఉండెను.

ఒకప్పుడు చంద్రశాలలలో ఆరుబయట వెన్నెలలోను, ఒకప్పుడు డాబామీదను, ప్రాసాద మధ్యమున గవాక్షముల మంగళమారుతములచే రంజించు సుస్థలములలోను, ఒకప్పుడు ఏకాంత శుద్ధాంతముల బంగారు గొలుసులచే కట్టబడిన తూగుటుయ్యాలమీదను, ఒకప్పుడు ద్రాక్షా మంటపముల క్రింద జలయంత్ర సమీపమునను, అట్లే స్ఫటిక స్థలమునను, కాంచన స్థలమునను, రత్నస్థలములను, ఒకప్పుడు పుష్పకవిమానములోను, ఒకప్పుడు రంగశాలలలోను, ఒకప్పుడు చిత్రశాలలలోను, ఒకప్పుడు వట్టివేరు తడికెల పందిరిలోను, ఒకప్పుడు పూలపందిళ్ళలోను ఒకప్పుడు అరటిపొదల లోను గడిపెడివారు.

**కదా పుష్పవాటికాయాం కదా వృక్షోర్ధ్వసద్మని ।**
**శృంఖలావృక్షసంబద్ధదోలకే రత్నచిత్రితే ॥ 54**

**కదా కాష్ఠమయే దివ్యే మంచకే రత్నభూషితే ।**
**కదా చకార తులసీవాటికాయాం రఘూత్తమః ॥ 55**

**నిద్రాం జనకనందిన్యా సభాయామథవా కదా ।**
**కదా ద్వారోర్ధ్వప్రాసాదే కదైకస్తంభసద్మని ॥ 56**

**కదా స్వగృహదేహల్యాం కదా వృందావనేఽపి చ ।**
**ఏవం స సీతయా రేమేఽయోధ్యాయాం రఘునందనః ॥ 57**

**ఇతి శ్రీశతకోటిరామచరితాంతర్గతే శ్రీమదానందరామాయణే, వాల్మీకీయే, ఆదికావ్యే, విలాసకాండే, సీతారామయోర్దినచర్యావర్ణనం నామ, షష్ఠః సర్గః ॥ 6**

ఒకప్పుడు పుష్పవాటికయందును, ఒకప్పుడు వృక్షముమీది క్రీడామందిరమునను, ఒకప్పుడు చెట్లకు అంటగట్టిన గొలుసుల రత్న చిత్రిత ఊయలలోను, ఒకప్పుడు రత్నాలంకృత దారు చెక్కతో చేసిన మంచముపైనను, ఒకప్పుడు తులసీవనమునను, ఒకప్పుడు సభామధ్యమునను, ఒకప్పుడు ఇంటిపైనను, ఒకప్పుడు ఏకస్థంభముమీది మందిరమునను, ఒకప్పుడు తమ పడకటింటిలోను, ఒకప్పుడు బృందావనము మీదను ఇట్లే శ్రీరాముడు అయోధ్యలో సీతాదేవితో సుఖక్రీడలను పొంది ఆనందించుచుండెను. (6)

***ఈ విధముగ శ్రీమద్వాల్మీకి మహర్షిచే రచింపబడిన,***
***శ్రీ శతకోటిరామచరితాంతర్గత శ్రీమత్ ఆనందరామాయణములో, విలాసకాండలో,***
***శ్రీ సీతారాముల దినచర్యను వర్ణించు, 6వ సర్గ ముగిసినది.***

# సప్తమః సర్గః-7వ సర్గ

దేవతల భార్యలకు వరములనిచ్చుట

**శ్రీరామదాస ఉవాచ**

**ఏకదా రాఘవం ద్రష్టుం తథా స్నాతుం మథావపి ।**
**శిష్యైః సమాయయౌ వ్యాసో మునిభిః పరివేష్టితః ॥ 1**

**సమాగతం మునిం శ్రుత్వా తం ప్రత్యుద్గమ్య రాఘవః ।**
**ననామ శిరసా భక్త్యా నినాయ నిజమందిరమ్ ॥ 2**

**దత్వా వరాసనం తస్మై ద్విజేభ్యశ్చాపి వై పృథక్ ।**
**దత్వాఽఽసనాని దివ్యాని చకార పూజనం పృథక్ ॥ 3**

**కామధేనూద్భవైః రత్నైర్మణిభ్యాం సంభవైరపి ।**
**వ్యాసం తం భోజయామాస మునిభిర్జానకీపతిః ॥ 4**

**తాంబూలం దక్షిణాం దత్వా ప్రబద్ధకర సంపుటః ।**
**పప్రచ్ఛ కుశలం తస్మై వ్యాసాయ రఘునందనః ॥ 5**

**సీతాం తం వీజయామాస వ్యాసం సత్యవతీసుతమ్ ।**
**ఏతస్మిన్నంతరే వ్యాసో రామాయ కుశలం నిజమ్ ॥ 6**

**నివేద్య పృష్ట్వా తత్క్షేమం తమాహ కౌతుకాత్పునః ।**
**రామ రామ మహాభాహో యథా రాజ్యం త్వయా భువి ॥ 7**

## వ్యాసులవారు శ్రీరాములవారితో మాటలాడిపోవుట.

శ్రీరామదాసు ఇట్లుచెప్పెను, “ఒకానొకసారి వ్యాసముని శ్రీరామదర్శనమునకు, చైత్రస్నానమునకు శిష్యులతోను, మునులతోను కూడి అయోధ్యకు వచ్చెను. మునీంద్రుడు వచ్చిన సంగతి విని, శ్రీరాముడు వారిని సమీపించి, భక్తితో నమస్కరించి, తనమందిరమునకు పిలచుకొనివచ్చి, దివ్యాసనమును ఇచ్చి, ఇతర ద్విజవర్యులకును వేరువేరు పీఠలను ఇచ్చెను. అందరిని వేర్వేరుగా కామధేను, చింతామణి, కౌస్తుభ జన్యములగు దివ్యవస్తువులచే సత్కరించెను. జానకీదేవి మునీంద్రులతో ఆ వ్యాసమహర్షికి దివ్యభోజనము వడ్డించెను. శ్రీరాముడు దక్షిణ, తాంబూలములను అర్పించి, చేతులు జోడించి,

వ్యాసుని యోగక్షేమములను విచారించెను. సీతాదేవి వ్యాసమునిని విసనకఱ్ఱచే వీచుచు సేవించుచుండెను. అప్పుడు వ్యాసుడు తన క్షేమసమాచారమును శ్రీరామునికి తెలిపి, శ్రీరాముని కుశలములను విచారించి, మరలా కుతూహలముతో, "మహానుభావుడైన శ్రీరామచంద్రా! ఈ భూమిని నీవు పరిపాలించినట్లు యేరాజును పాలించలేదు.

భుజ్యతే న తథాఽన్యేన కేనాపి పృథివీభృతా ।
పురా భుక్తం న కోఽప్యగ్రే భోక్ష్యతే పృథివీపతిః ॥ 8

అన్యత్త్రేఽత్రమహద్ధైర్యమేకపత్నీవ్రతం ప్రతి ।
దృష్ట్వాతివిస్మయశ్చిత్తే జాయతే మే రఘూత్తమ ॥ 9

కః సహేతాత్ర తారుణ్యకామదావానలం నృపః ।
పదస్థే యౌవనే చాపి త్వమేవాస్మిన్ వ్రతే క్షమః ॥ 10

ఇతి వ్యాసవచః శ్రుత్వా రామో వ్యాసం వచోఽబ్రవీత్ ।
మయా త్రయః కృతాః సంతి నియమా మునిసత్తమ ॥ 11

ముఖాద్వినిర్గతం వాక్యమేకమేవ వినిశ్చితమ్ ।
న క్రియతే మృషా తచ్చ నోచ్యతే హ్యపరం పునః ॥ 12

అన్యత్సీతా వినాఽన్యా స్త్రీ కౌసల్యాసదృశీ మమ ।
న క్రియతే పరా పత్నీ మనసాఽపి న చింతయే ॥ 13

తథా యం హన్తుమిచ్ఛామి బాణేనైకేన కోపతః ।
నిహన్యతే తదైకేన నాన్యం బాణం సృజామ్యహమ్ ॥ 14

ఇత్థం త్రయః కృతాః పూర్వం నియమాస్త్వత్ర భో మునే ।
సత్యా ఏవ భవత్యగ్రేఽఖండితాస్తవ వాక్యతః ॥ 15

తథైవాస్త్వితి సోఽప్యాహ వ్యాసః శ్రీరాఘవం తదా ।
పునరాహ మునిః శ్రీమాన్ వ్యాసః శ్రీరాఘవం ప్రతి ॥ 16

ఏకపత్నీవ్రతస్యాస్య ఫలేనాపరజన్మని ।
త్వం కృష్ణరూపేణ బహ్వీర్నారీర్భోక్ష్యసి రాఘవ ॥ 17

**తన్మునేర్వచనం శ్రుత్వా విహస్య రాఘవోఽబ్రవీత్ ।**
**బహ్వీశ్చ కామినీర్భోక్తుం కృష్ణరూపధరోఽప్యహమ్ ॥ 18**

**ద్వారకాయాం యదాఽగ్రే హి ద్వాపరే మునిసత్తమ ।**
**యేన వ్రతేన దానేన నియమేనాఽథవా మునే ॥ 19**

**బహునారీర్నిశ్చయేన ప్రాప్స్యామీతి వదస్వ మామ్ ।**
**ఇతి రామవచః శ్రుత్వా వ్యాసో రాఘవమబ్రవీత్ ॥ 20**

"శ్రీరామా! ఇంతకు మునుపు కూడా ఇట్లు ఎవ్వరును రాజ్యమును అనుభవింపలేదు. ఇకమీద కూడా ఎవ్వరును అనుభవింపలేరు. మరియు ఏకపత్నీవ్రతమును చూడగా నీ ధైర్యము గొప్పది. దీనిని చూచి నామనసున మిక్కిలి ఆశ్చర్యము కలుగుచున్నది. రాజ్యపదవిని పొంది, పైగా మంచి యవ్వనము కలిగియుండగా ఎవ్వడును ఇట్లు తారుణ్య కామదావాగ్నిని సహింపగలడు? ఈ వ్రతమున నీవే సమర్థుడవు," అని నొక్కివక్కాణించెను. ఆ వ్యాసముని వాక్కునువినిన శ్రీరాముడు, "స్వామీ! నాచే మూడు నియమములు చేయబడినవి. అవి ఏవనగా చెప్పెదను వినుడు. నా నోటినుండి వచ్చిన మాట ఒక్కటిగా ఉండును, అది ఎన్నటికి వ్యర్థము కాజాలదు. దానిని మార్చి వేరుగా చెప్పను. ఇది ఒకటి. మరియొకటి ఏదనిన; సీత తప్ప తక్కిన పడతులు లోకమున నా తల్లియగు కౌసల్యాదేవికి సమానులు. నేను వేరొక పత్నిని వరించను. మనస్సులోకూడా చింతించను. యిదిరెండవది. ఇంకొకటి యేది అనినా నేను ఒకబాణమును ఎత్తి ఎవ్వనిని చంపబూనుదునో వానిని ఆ బాణము ఒక్కటి చేతనే సంహరించెదను. వేరొక్కబాణమును విడువను. ఇట్లు నేను మూడు నియమములను అవలంబించి యున్నాను. ఇకమీదను నా వాక్య బలముచే నెడతెగక అట్లే జరుగవలయును," అని విన్నవించెను. ఆవ్యాసుడు అట్లేయగును కదాయని మరలా శ్రీరామచంద్రునితో,

**సమ్యక్పృష్టం త్వయా రామ దానం తే ప్రవదామ్యహమ్ ।**
**ఏకపత్నీవ్రతాదేవ యద్యపి త్వం చ స్త్రీర్బహూః ॥ 21**

**లభిష్యసి తథాప్యద్య దానం తవ వదామ్యహమ్ ।**
**సీతాభారసువర్ణేన మూర్తిమేకాం రఘూత్తమ ॥ 22**

**ఏవం షోడశమూర్తీశ్చ కారయ త్వం పృథక్ పృథక్ ।**
**దేహి త్వం సరయూనద్యాస్తీరే విప్రేభ్య ఆదరాత్ ॥ 23**

వస్త్రాలంకారభూషాద్యైః దక్షిణాభిశ్చ తాః శుభాః ।
అనేన బహునారీస్త్వం లభిష్యస్యన్యజన్మని ॥ 24

తథేతి రాఘవశ్చాపి మూర్తీః కృత్వా మనోరమాః ।
దదౌ తాః సరయూనద్యాం బ్రాహ్మణేభ్యస్తు షోడశ ॥ 25

తతస్తే బ్రాహ్మణాస్తుష్టా రామాయాశీర్దదుర్ముదా ।
దత్తమేకగుణం రాజన్ సహస్రగుణితం పురా ॥ 26

అస్మాకం వచనాద్దానఫలం తవ భవిష్యతి ।
షోడశస్త్రీసహస్రాణి త్వం లభిష్యసి నిశ్చయాత్ ॥ 27

తథాస్త్విత్యాహ రామోఽపి తతో విప్రాన్ వ్యసర్జయత్ ।
ప్రణమ్య పూజితం వ్యాసం దదావాజ్ఞాం రఘూద్వహః ॥ 28

అథైకదా రామచంద్ర సీతయా సరయూతటే ।
మధుమాసే వస్త్రగేహే స్థితః క్రీడాం చకార సః ॥ 29

ఏతస్మిన్నంతరేఽయోధ్యాం నానాదేశనివాసినః ।
రామతీర్థే మధౌ స్నాతుం సమాజగ్ముః సహస్రశః ॥ 30

సురా యక్షాః కిన్నరాశ్చ గంధర్వాః పన్నగా నగాః ।
వల్ల్యశ్చ సరితః సర్వాస్తీర్థాని మునయో నృపాః ॥ 31

అప్సరసః పన్నగాశ్చ ఖగాః క్షేత్రాణి వానరాః ।
అథైక దేవపత్న్యో జ్ఞాత్వాఽస్పృశ్యాం విదేహజామ్ ॥ 32

"శ్రీరామమూర్తీ! ఏకపత్నీ వ్రతఫలమువలన రాగల జన్మమున నీవు కృష్ణుడవై బహుస్త్రీ భోగమును అనుభవింపగలవు," అని పలికెను. ఆ వ్యాసముని వాక్యమును విన్న, శ్రీరామచంద్రుడు నవ్వి, "మునీంద్రా! భవిష్యత్తులో ద్వాపర యుగమున ద్వారకలో నేను కృష్ణరూపధారినై అనేక మంది కామినులను యే వ్రతాచరణమువలన, దానములవలన పొందగలనో అట్టిదానిని చెప్పుము." అని అడిగెను. అందుకు వ్యాసుడు, "రఘునాథా! చక్కగా అడిగితివి. ఆ దానమును నీకు చెప్పుచున్నాను. అయినా నీకు ఏకపత్నీ వ్రతమువలననే అనేకమంది స్త్రీలు దొరుకుదురు. అట్లైనను దానమును చెప్పెదను. సీతతో సమాన తూకముగల సువర్ణప్రతిమలను పదహారింటిని చేయించి, సరయూ

నదీతీరమున బ్రాహ్మణులకు దానముచేయుము. వస్త్రాలంకార దక్షిణములతో ఇచ్చిన షోడశ (పదహారు) సువర్ణ ప్రతిమాదానమువలన జన్మాంతరమున బహుస్త్రీ లాభము తప్పక కలుగును," అని చెప్పగా శ్రీరాముడు అట్లేఅని మనోహరమగు 16 ప్రతిమలను చేయించి, సరయూతీరమున బ్రాహ్మణులకు ఇచ్చెను. అంత ఆ బ్రాహ్మణులు మిక్కిలి సంతుష్టులై ఒక్కటిగా ఇచ్చినది వేయింతలుగా ఫలించును మా మాటలు వ్యర్థముగావు. నిశ్చయముగా నీవు 16వేల మంది స్త్రీలను భోగింపగలవు." అని ఆశీర్వదించిరి. రాముడు వారితో అట్లే అగునని ఆమోదించుచు పంపెను, మరియు సత్కృతుడైన శ్రీవ్యాసమునీంద్రునికి ప్రణమిల్లి అనుజ్ఞను ఇచ్చిపంపెను. (28)

## దేవపత్నులు గోపికలగునట్లు శ్రీరాముని వరదానము.

పిదప ఒకానొకసారి శ్రీరామచంద్రుడు సీతతో సరయూనదీతీరమున చైత్రమాసమున పరదా గృహములలో క్రీడించుచుండెను. అంతలో అయోధ్యకు నానాదేశవాసులు రామతీర్థమున చైత్ర స్నానమునకై వేలకొలదిగా వచ్చుచుండిరి. దేవతలు, యక్షులు, రాక్షసులు, కిన్నెరులు, గంధర్వులు, పన్నగులు, నాగులు, మునులు, నృపులు, ఖగులు, ప్లవగేంద్రులు, అప్సరసలు, నదీ, తీర్థ, వృక్ష, గుల్మ, పక్షి, వల్యాది కామరూపులగు నదీదేవతలు కూడా వచ్చియుండిరి.

**పరస్పరం తాః సంమంత్ర్య నిశీథే రాఘవం ప్రతి ।**
**సమాజగ్ముర్దివ్యవస్త్రైరత్నాభరణభూషితాః ॥ 33**

**రామసౌందర్యసంభ్రాన్తాః కామబాణప్రపీడితాః ।**
**తా దృష్ట్వా రామదూతాస్తే పప్రచ్ఛు రక్షణస్థితాః ॥ 34**

**యూయం కిమర్థం సంప్రాప్తా నిశీథేఽత్ర భయావహే ।**
**కథయధ్వం హి నః సర్వం మా శాంకాం కురుతాత్ర హి ॥ 35**

**తా ఊచూ రాఘవం ద్రష్టుం సమాయాతా వయం స్త్రియః ।**
**అధునా చేద్రాఘవస్య దర్శనం న భవిష్యతి ॥ 36**

**జాతో వధిస్తదాఽస్మాకం జీవితాని నదీజలే ।**
**ఇతి తాసాం వచః శ్రుత్వా దూతాస్తే రాఘవం జవాత్ ॥ 37**

**దాస్యా నివేదయామాసుః స్త్రీవృత్తం తత్సవిస్తరమ్ ।**
**శ్రుత్వా దాసీముఖాద్రామః సైకతే మంచకే స్థితః ॥ 38**

**సమాహూయ స్త్రియః సర్వా దదర్శ రఘునాయకః ।**
**తాశ్చాపి దృష్ట్వా శ్రీరామం మేనిరే కృతకృత్యతామ్ ॥ 39**

**తతస్తా రాఘవం నత్వా లజ్జయాఽధోముఖాః స్త్రియః ।**
**పీడితాః కామబాణైశ్చ తస్థుః శ్రీరామసన్నిధౌ ॥ 40**

**తాః పప్రచ్ఛ రాఘవోఽప్యాగమనస్యాథ కారణమ్ ।**
**తా రాఘవ తదా ప్రోచుః సర్వం వేత్సి త్వమీశ్వర ॥ 41**

**జ్ఞాత్వా తాసాం రామచంద్రో హృద్గతం ప్రాహ తాః పునః ।**
**ఏకపత్నీవ్రతం మేఽస్తి చైతజ్జన్మని భోః స్త్రియః ॥ 42**

**న జ్ఞేయం మే మృషా వాక్యం గమ్యతాం స్వస్థలం జవాత్ ।**
**మాఽభూదధర్మో మద్రాజ్యే రాజ్ఞాం వై నిరయప్రదః ॥ 43**

**ఇతి రాఘవవాగ్బాణైర్భిన్నమర్మస్థలాః స్త్రియః ।**
**యయుర్మూర్ఛాం క్షణాదేవ సికతాయాం సహస్రశః ॥ 44**

ఒకానొకసారి శ్రీరామునియొక్క దివ్యసౌందర్య సుకుమారాకారమును జూచి, మన్మథ బాణ ప్రపీడితలైన దేవపత్నులు, జానకీదేవి దూరమైయున్న సంగతిని గుర్తించి, తమలో తాము ఒకరికొకరు ఆలోచించుకుని, అర్ధరాత్రి దివ్యమైన వస్త్ర ఆభరణములను ధరించి, శ్రీరాముని దర్శనమునకై వచ్చిరి. అపుడు అచట ద్వారపాలకులుగా ఉన్న రామదూతలు వారిని, “భయంకరమగు ఈ అర్ధరాత్రిలో మీరేల వచ్చిరి? ఎవరు మీరు? మీ సంగతిని శంకింపక చెప్పవలయును,” అని అడిగిరి. అందుకు వారు, “మేము స్త్రీలము. శ్రీరామదర్శనమునకై వచ్చితిమి. ఇప్పుడు మాకు శ్రీరామచంద్రుని దర్శనము దొరకనియెడల నేటితో మా ప్రాణములకు సరయూనదిలో ముక్తికలిగినది. అని ఏకగ్రీవముగా పలికిరి. ఆ దూతలు ఈ సంగతిని విని, వార్తను దూతికల ద్వారా శ్రీరామ సన్నిధికి పంపిరి. దూతికల ద్వారా వార్తను విని, సరయూ సైకతమున మంచముపై ఉన్న రాఘవుడు వెంటనే వారినందరిని పిలిపించెను. ఆ దేవతాస్త్రీలు శ్రీరామునికి నమస్కరించి, సిగ్గుతో తలవంచుకుని, కామబాణ పీడితులై, శ్రీరాముని సన్నిధానమున నిలిచిరి. శ్రీరాముడు వారిని చూచి, “మీరు వచ్చుటకు ఏమి కారణ”మని అడిగెను. అందుకు వారు, “సర్వజ్ఞుడైన నీవు అంతటిని తెలిసియున్నావు,” అని ప్రత్యుత్తరమును ఇచ్చిరి. శ్రీరఘునందనుడు మరలా వారి మనోభిప్రాయమును గుర్తించి, “ఓ పడతులారా! ఈ జన్మయందు నాకు ఏకపత్నీవ్రతము గలదు. నా మాటను వ్యర్థము చేయవద్దు. మీ మీ స్థలములకు మీరు వెళ్ళండి. నా రాజ్యమున అధర్మము జరుగ కూడదు. అది రాజులకు నరక

ప్రదముకదా!” అని నిరాకరించెను. ఇట్లు శ్రీరాముని వాగ్బాణములచే విభిన్న గాత్రలైన స్త్రీలు వేలకొలది ఆ క్షణముననే సరయూ సైకతమున మూర్ఛాక్రాంతలైరి.

తా మూర్ఛావిహ్వాలా దృష్ట్వా రామో విహ్వాలమానసః ।
నారీః సంతోషయన్ ప్రాహ హే నార్యః శ్రూయతాం మమ ॥ 45

వాక్యం ఖేదాపహం వోఽద్య ద్వాపరే కృష్ణరూపధృక్ ।
అహం వ్రజే భవిష్యామి నందగోపేశపాలితే ॥ 46

తదా దేవాస్తు గోపాలా భావి మద్వరదానతః ।
భవిష్యంతి సురేశశ్చ నందస్తత్ర భవిష్యతి ॥ 47

భవిష్యథ తథా యూయం గోపికాః సకలా వ్రజే ।
యుష్మాకం పూరయిష్యామి యథేచ్ఛం వాంఛితం తదా ॥ 48

రాసక్రీడాం హి యుష్మాభిః కరిష్యామి న సంశయః ।
వృందావనే తు కాలింద్యాం సైకతే నిశి వై చిరమ్ ॥ 49

భవధ్వం స్వస్థచిత్తాశ్చ గచ్ఛధ్వం స్వస్థలం ముదా ।
ఇతి రామవచోరూపసుధయా జీవితాః స్త్రియః ॥ 50

కించిత్తుష్టహృదో రామం నత్వా జగ్ముర్నిజం స్థలమ్ ।
ఏతస్మిన్నంతరే తత్ర మధుస్నానార్థమాదరాత్ ॥ 51

మాయాపుర్యాః సమాయాతా రమ్యా గుణవతీ శుభా ।
విష్ణుదాస ఉవాచ
కా సా ప్రోక్తా గుణవతీ కింశీలా కస్య కన్యకా ॥ 52

తద్వదస్వ సవిస్తారం కస్యాసీత్ప్రమదా పురా ।
ఇతి శిష్యవచః శ్రుత్వా రామదాసోఽబ్రవీత్పునః ॥ 53

ఇతి శ్రీశతకోటిరామచరితాంతర్గతే, శ్రీమదానందరామాయణే, వాల్మీకీయే, ఆదికావ్యే, విలాసకాండే, దేవపత్నీవరదానం నామ, సప్తమః సర్గః ॥

సరయూనది ఇసుకతిన్నెలమీద మూర్ఛనంది విహ్వాలురగు విలాసినులను జూచి, శ్రీరాముడు విహ్వాలచిత్తుడై, ఆ పడతులను సంతోషపరచుచు, "కామినులారా! దుఃఖ పరిహారకమగు నా మాటను ఇపుడు వినుడు. నేను ద్వాపరాంతమున నందగోప పరిపాలితమగు గోకులమున శ్రీకృష్ణ రూపముపొంది అవతరించెదను. అప్పుడు దేవతలు, రాగల వర ప్రదానముచే గోపబాలకులగుదురు. అచట ఇంద్రుడే నందుడుగా పుట్టును. అప్పుడు మీరందరును గోపికలుగా అవతరించవలయును. అపుడు మీ కోరికను మీయిష్టము వచ్చినట్లు నెరవేర్చగలను. మీతోడ కాళింది నదీతీరమమున బృందావనములో రాత్రి ఎక్కువసేపు రాసక్రీడను ఒనరించెదను. ఇందులో సంశయములేదు. మీరందరును మంచి మనస్సుగలవారలై, మీస్థలములకు సంతోషముగా పొండి," ఇట్లు చెప్పిన శ్రీరామవాక్యామృతపానముచే స్త్రీలందరును బ్రతికి, కొంచెము ఊపిరిని పీల్చుకుని, శ్రీరామునికి నమస్కరించి, తమతమ నెలవులకు వెళ్ళిరి. ఇంతలోపల అచటికి సాదరముగా మాయాపురి నుండి, చైత్రస్నానమునకై శుభాంగియైన గుణవతి అను రమామణి వచ్చెను." అని ఇట్లుచెప్పిన రామదాసు మాటలను విని, విష్ణుదాసుడు

గురూత్తమా! ఆ గుణవతి యెవరు? ఆమెస్వభావము ఎట్టిది? ఆమె ఎవరి కూతురు? ఎవరికి భార్యగా ఉండె? ఆమె సంగతిని నాకు సవిస్తరముగా వివరింపుము." అని వేడెను. (7)

***ఈ విధముగ శ్రీమద్వాల్మీకి మహర్షిచే రచింపబడిన,***
***శ్రీ శతకోటిరామచరితాంతర్గత శ్రీమత్ ఆనందరామాయణములో,***
***విలాసకాండలో, శ్రీరాముడు దేవతాస్త్రీలకు వరమిచ్చే 7వ సర్గ ముగిసినది.***



# అష్టమః సర్గః-8వ సర్గ

సీతా క్రోధ వర్ణన

శ్రీరామదాస ఉవాచ

ఆసీత్కృతయుగస్యాంతే మాయాపుర్యాం ద్విజోత్తమః ।
ఆత్రేయో దేవశర్మేతి వేదవేదాంగపారగః ॥ 1

అతిథేయోఽగ్నిశుశ్రూషీ సౌరవ్రతపరాయణః ।
సూర్యమారాధయన్నిత్యం సాక్షాత్సూర్య ఇవాపరః ॥ 2

తస్యాతివయసశ్చాసీన్నామ్నా గుణవతీ సుతా ।
అపుత్రః స స్వశిష్యాయ చంద్ర నామ్నే దదౌ సుతామ్ ॥ 3

తమేవ పుత్రవన్మేనే స చ తం పితృవద్వశీ ।
తౌ కదాచిద్వనం యాతౌ కుశేధ్మహరణాయ వై ॥ 4

హిమాద్రిపాదే వేగేన చేరస్తుస్తావితస్తతః ।
తావత్తౌ రాక్షసం ఘోరమపశ్యతాం పురఃస్థితమ్ ॥ 5

భయవిహ్వాలసర్వాంగావసమర్థౌ పలాయితుమ్ ।
నిహతౌ రక్షసా తేన కృతాంతసమరూపిణా ॥ 6

తౌ తత్ క్షేత్రప్రభావేణ ధర్మశీలతయా పునః ।
వైకుంఠభువనం యాతౌ నీతౌ విష్ణుగణైస్తదా ॥ 7

యావజ్జీవం తు యత్తాభ్యాం సూర్యపూజాదికం కృతమ్ ।
కర్మణా తేన సంతుష్టో విష్ణుస్తాభ్యాం బభూవ హ ॥ 8

శైవాః సౌరాశ్చ గాణేశా వైష్ణవాః శక్తిపూజకాః ।
తమేవ ప్రాప్నువంతీహ వర్షాపః సాగరం యథా ॥ 9

ఏకః స పంచధా జాతః క్రియయా నామభిః కిల ।
దేవదత్తో యథా కశ్చిత్పుత్రాద్యాహ్వాననామభిః ॥ 10

తతశ్చ తౌ తద్భువనాధివాసినౌ
విమానయాతౌ రవివర్చసావుభౌ ।
తత్తుల్యరూపౌ హరిసన్నిధానగౌ
దివ్యాంగనాచందనభోగభోగినౌ ॥ 11

తతో గుణవతీ శ్రుత్వా రక్షసా నిహతావుభౌ ।
పితృభర్తృజదుఃఖార్తా విలలాప భృశాతురా ॥ 12

## గుణవతి సత్యభామ అగునట్లు వరమునిచ్చుట.

శ్రీరామదాసు ఇట్లు చెప్పుచున్నాడు. కృతయుగపు చివర్న మాయపురియందు, వేదవేదాంగ పారంగతుడును ఆత్రేయుడు అయిన దేవశర్మయను బ్రాహ్మణుడు ఉండెను. అతడు అతిథులను గౌరవించెడువాడు. నిత్యము అగ్నికార్యము చేయువాడు. సూర్యోపాసకుడై, నిత్యము సూర్యుని ఆరాధిస్తూ, తాను అపరసూర్యునివలె వెలుగుచుండెను. వృద్ధుడగు అతనికి మంగళాంగియగు గుణవతి అను పేరుగల ఒక కూతురు ఉండెను. పుత్రులు లేని ఆ బ్రాహ్మణుడు చంద్రశర్మయను తన శిష్యునికి తన కూతురును ఇచ్చి వివాహము చేసెను. ఆ శిష్యునే పుత్రునిగా ఎంచెను. వాడును తండ్రి వలెనె గురువుగారిని సేవించుచుండెను. ఒకసారి దేవశర్మ, చంద్రశర్మ ఇద్దరూ సమిధలు, దర్భలు సేకరించుటకై అడవికి వెడలిరి. వారిరువురును హిమాలయ పర్వత పాదమున నిటునటు సంచరించుచు ఉండిరి. అంతలో ఎదురుగ వచ్చిన రాక్షసుని చూచి ఒళ్ళు గడగడ వణుకుచూ భయభ్రాంతులై పారిపోలేక పోయిరి. యముని వలెనుండు రాక్షసుడు దేవశర్మ, చంద్రశర్మలను చంపివేసెను. వారు క్షేత్ర ప్రభావమువలనను, ధర్మ స్వభావమువలన విష్ణుదూతలచే వైకుంఠమునకు పిలుచుకొని పోబడిరి. బ్రతికియున్నంతవరకు వారిరువురును సూర్యపూజాదిక వ్రతమును ఆచరించుటచేత విష్ణుమూర్తి ప్రసన్నుడాయెను. శైవులనగా శివపూజా పరాయణులు. సౌరులు అనగా నిత్యము సూర్యుని అర్చించేవారు. గాణేశులు అనగా గణపతి ఆరాధకులు. వైష్ణవులనగా విష్ణుధర్మ పరాయణులు. శాక్తులనగా దేవీపూజాసక్తులు. అదే విధముగా ఆయా దేవతారాధకులు ఉందురు. వానసీరంతా

వెల్లువలా పారి సముద్రమున చేరినట్లు, భక్తులు శ్రీమన్నారాయణమూర్తి సన్నిధానమును చేరెదరు. ఆయొక్క పరమాత్మయే నామ క్రియా భేదమువలన ఐదు విధములుగా ఆకారభేదములను అంది యున్నాడు కదా? ఒకానొక సాంసారికుడు కుమారునిచే తండ్రిఅనీ, అల్లునిచే మామఅని, మరిదిచే బావ అనియు, తమ్మునిచే అన్న అనియు, తల్లిచే బిడ్డ అనియు, మామచే అల్లుడు అని పిలువబడు చుండినట్లు తాను ఒక్కడే అయినప్పటికీ శ్రీనారాయణుడే ఆయా దేవ రూప, నామ ప్రీతిగల ఆయా భక్తజనులచే అట్లు భావింపబడును. తాను అద్వితీయుడై ఉన్నాడు. అంత ఆ ఇరువురు బ్రాహ్మణులును సూర్యునివలె వెలుగొందు విమానములో సంచరిస్తూ, శ్రీహరి సన్నిధానమున విష్ణుమూర్తి వలె ఆకారముగలవారై దివ్య భోగములను అనుభవించిరి.

ఇచట రాక్షసునిద్వారా తన తండ్రి, భర్త చంపబడిన సంగతిని విని గుణవతి ఎంతో దుఃఖించెను.

**సా గృహోపస్కరాన్సర్వాన్విక్రీయ శుభకర్మకృత్ ।**
**తయోశ్చక్రే యథాశక్తి పరలోకక్రియాం తదా ॥ 13**

**తస్మిన్నేవ పురే వాసం చక్రే ప్రసృతజీవినీ ।**
**విష్ణుభక్తిపరా శాంతా సత్యశౌచా జితేంద్రియా ॥ 14**

**వ్రతాష్టకం తయా సమ్యగాజన్మమరణాత్కృతమ్ ।**
**ఏకాదశీవ్రతం సమ్యక్ సేవనం కార్తికస్య చ ॥ 15**

**మాఘే చైత్రే మాధవేఽపి స్నానాని ప్రతివత్సరమ్ ।**
**సంమార్జనం విష్ణుగేహే స్వస్తికాదినివేశనమ్ ॥ 16**

**నిత్యం విష్ణోః పూజనం చ భక్త్యా తత్పరమానసా ।**
**ఇత్థం వ్రతాష్టకం సమ్యక్ సా చ కారాతిభక్తితః ॥ 17**

**ఏకదా సా గుణవతీ పౌరాణికముఖేన హి ।**
**శ్రుత్వా మహత్ఫలం శిష్య సాకేతే సరయూజలే ॥ 18**

**చైత్రస్నానస్య కైవల్యదాయకం జనసంయుతా ।**
**యయౌ శ్రీరామనగరీం రామతీర్థేఽవసచ్ఛుభా ॥ 19**

సైకదా రాఘవం ద్రష్టుం సరయూసైకతస్థితమ్ ।
వాసోగేహే రహః పత్న్యా యయౌ బంధుసమన్వితమ్ ॥ 20

పూజాపాత్రాణి హస్తాభ్యాం బిభ్రతీ ద్వారసంస్థితా ।
ప్రతీహారేణ రామాయ వేదితా సా వివేశ హ ॥ 21

వాసోగేహం దదర్శాథ సీతయా రఘునాయకమ్ ।
రత్నమంచకసంలగ్నం ధృతార్ధోకోపబర్హణమ్ ॥ 22

క్రీడంతం సారిభిః పాశైః సీతయా లక్ష్మణేన చ ।
కైకేయీతనయాభ్యాం చ సఖీభిః పరివారితమ్ ॥ 23

మయూరపిచ్ఛసంభూతచామరైః పరివీజితమ్ ।
రత్నచిత్రరుక్మభవే నూపురే పదయోర్వరే ॥ 24

బిభ్రన్తం రశనాం కట్యాం రత్నరుక్మవిభూషితామ్ ।
రత్నరుక్మభవే దివ్యకంకణే కరయోర్వరే ॥ 25

తన తండ్రి, భర్త మరణవార్త తెలుసుకున్న గుణవతి, ఇంటిలోని వస్తువులనన్నిటిని అమ్మి, వారిరువురికి పరలోక క్రియను యథాశక్తిగా నెరవేర్చెను. ఆ తరువాత ఆమె ఆ పట్టణముననే బిచ్చమెత్తుతూ జీవించుచుండెను. ఆ గుణవతి విష్ణుభక్తి పరాయణ, శాంతచిత్తయును, సత్య, శౌచాచారము గలదియును, జితేంద్రియురాలు అయి 1. ఏకాదశి వ్రతాచారణము, 2. కార్తీక విష్ణుసేవనము, 3. ప్రతిసంవత్సరము మాఘమాస స్నానము, 4. చైత్రస్నానమును, 5. వైశాఖ స్నానమును, 6. విష్ణు ఆలయమున సమాజసేవ, 7. స్వస్తికాది నివేశనము, 8. నిత్యము విష్ణుపూజ, అను ఈ విష్ణు వ్రతమును మిక్కిలి భక్తితో తదైక మానసయై నెరవేర్చుచు వచ్చెను.

విష్ణుదాసా! ఇట్లు గుణవతి వ్రతపరాయణయై ఉండగా ఒకసారి ఒక పౌరాణికుని ద్వారా, అయోధ్యవద్ద సరయూతీరమున చైత్రస్నానము చేయుటకై కైవల్యప్రదమగు మహాతల్పము సంఘటించుటను విని, ఆ అయోధ్యానగరమునకు వచ్చి, రామతీర్థమువద్ద వాసముచేయుచుండెను. ఆమె ఒకప్పుడు సరయు సైకతమున పటగృహములో పత్ని బంధు సమేతుడై ఉండెడు శ్రీరాముని దర్శించవలయునని నిశ్చయించి, పూజాసామాగ్రులను తీసుకుని, రాజనివాస స్థలములకువచ్చి,

ప్రతిహారి మూలకముగ చెప్పి పంపి వచ్చుటకు ఉత్తరువుపొంది, లోపలకు ప్రవేశించెను. ఇట్లు గుణవతి పటగృహమున జొచ్చి, యచటి వైభవమును దర్శించెను. సీతాదేవి చిన్నదిండ్లకు ఆనుకుని లక్ష్మణ, భరత, శత్రుఘ్నులతోడ పగడకాయలాటనాడుచు, మితపరివారము సేవించుచుండగా, సీతమ్మవారు ధరించిన నవరత్న విచిత్రితములైన ఆభరణములను దర్శించెను. దివ్య మణి మండితమగు మొల త్రాడును కటిభాగమునను, దివ్య రత్నకంకణములను, రత్నకేయూరములను ధరించి యుండెను.

బిభ్రంతం భుజయోర్దివ్యకేయూరే రత్నభూషితే ।
కంఠదేశే కౌస్తుభం చ హృది చింతామణిం శుభమ్ ॥ **26**

బిభ్రంతం వివిధాన్ హారాన్ రత్నమాణిక్యనిర్మితాన్ ।
తథాజాలారుక్మజాంశ్చ ముక్తాహారాన్ విచిత్రితాన్ ॥ **27**

తులసీకాష్ఠహారాంశ్చ పుష్పహారాననేకశః ।
ప్రవాళమణిహారాంశ్చ శృంఖలాః కాంచనోద్భవాః ॥ **28**

పదకాని విచిత్రాణి రత్నమాణిక్యవంత్యపి ।
రంభాఫలాబ్జసదృశానలంకారాన్విచిత్రితాన్ ॥ **29**

రత్నమాణిక్యసంయుక్తాన్ ముకురైరతిమండితాన్ ।
నీలమారకతైశ్చిత్రాన్ రామనామాంకితానపి ॥ **30**

అంగులీష్వపి బిభ్రంతం హస్తయోర్ముద్రికాః శుభాః ।
రత్నమాణిక్యముక్తాభిశ్చిత్రా రుక్మవినిర్మితాః ॥ **31**

రామనామాంకితాశ్చాపి పవిత్రా ఉజ్జ్వలా అపి ।
రత్నముక్తాహేమమయే కర్ణయోః కుండలే వరే ॥ **32**

బిభ్రంతం మహిసాదృశ్యానలంకారాననేకశః ।
బిభ్రంతం రవిసాదృశ్యం ముకుటం రత్నచిత్రితమ్ ॥ **33**

నానామణిసమాయుక్తం కలశైరతిశోభితమ్ ।
ముక్తాప్రవాళ వైదూర్యయుక్తం హేమమయం వరమ్ ॥ **34**

ఏవం గుణవతీ రామం కోటిసూర్యసమప్రభమ్ ।
హేమవర్ణం మహారమ్య కంజపత్రాయతేక్షణమ్ ॥ 35

శ్రీరాముడు– భుజములకు ఆభరణము, కంఠమున కౌస్తుభము, హృదయమున చింతామణి , మెడలో నవరత్నాలంకృత దివ్యహారములను, విచిత్రములగు ముక్తాహారములను, సువర్ణహారములను, వివిధ పుష్పహారములను, తులసీధామమును, కమల కదళీ సదృశ శృంగాలంకార హార విశేషములను వక్షఃస్థలమున, చేతివ్రేళ్ళలో మణిమాణిక్య మంజుల కాంచన రంజిత ఉంగరములను, దివ్య కర్ణకుండలములను కర్ణములలోను, దివ్యాలంకారమగు సూర్యనిభ కిరీటమును తలపైనను, ఇట్లే అన్యాదృశ్యములును, సూర్యసమాన కాంతితో మెరిసిపోవు ఆభరణములు, అమూల్యములగు దివ్య అలంకారములను ధరించినవాడును, తామరలవంటి దీర్ఘనయనములును, చంద్రునివంటి మోమును, కమలములవంటి కరములును కలిగి, కోటిసూర్య ప్రకాశమానుడు అయిన శ్రీరామునియొక్క దివ్యమోహన సౌందర్యాకారమును గుణవతి చూచెను.

సోమాననం కంజహస్తం దృష్ట్వా తం ప్రణనామ సా ।
తాం సముత్థాపయద్రామస్తయా సమ్యక్ ప్రపూజితః ॥ 36

తద్దత్తైరుపహారాద్యైః సుప్రీతస్తాం తదాఽబ్రవీత్ ।
వరం వరయ మామద్య యత్తే మనసి వర్తతే ॥ 37

ఇతి రామవచః శ్రుత్వా సా తుష్టా రామమబ్రవీత్ ।
రామ రాజీవపత్రాక్ష యథేమాస్తే సహస్రశః ॥ 38

దాస్యః సంతి తథా మాం త్వమంగీకర్తుమిహార్హసి ।
ఇతి తద్వచనం శ్రుత్వా రాఘవః ప్రాహ సస్మితః ॥ 39

కథం త్వం బ్రాహ్మణీ చేత్థం వదస్యద్య శుభవ్రతే ।
మత్సేవాం కర్తుమిచ్ఛాఽస్తి తవ తర్హి వదామ్యహమ్ ॥ 40

శ్రుణుష్వ త్వం గుణవతి కృష్ణరూపధరో హ్యహమ్ ।
ద్వాపరే ద్వారకాయాం హి భవిష్యామ్యన్యజన్మని ॥ 41

**భవిష్యసి తదా మాం త్వం స్త్రీరూపేణ న సంశయః ।**
**సత్రాజిద్దేవశర్మా తే భవిష్యతి పితా పునః ॥ 42**

**యశ్చంద్రనామా సోఽక్రూరో భవిష్యతి సఖా మమ ।**
**సత్యభామేతి నామ్నా త్వం భవిష్యసి ప్రియా మమ ॥ 43**

**తదా కురుష్వ దాస్యం మే యత్తే మనసి వర్తతే ।**
**ఇతి రామవచః శ్రుత్వా తుష్టా గుణవతీ ముహుః ॥ 44**

**నత్వా శ్రీరాఘవం సీతాం యయౌ సా స్వస్థలం ప్రతి ।**
**చైత్రస్నానానంతరం సా హరిద్వారం యయౌ జనైః ॥ 45**

**ఆయుః శేషం సమాప్యాథ గంగాయాం కుణపం నిజమ్ ।**
**సత్వరం స్నానసమయే త్యక్త్వా నాకం చిరం గతా ॥ 46**

**తతః కాలాంతరేణాసీత్సత్రాజిత్తనయా భువి ।**
**బభూవ పత్నీ కృష్ణస్య ద్వాపరే ద్వారకాపురి ॥ 47**

శ్రీరామునికి గుణవతి సాష్టాంగ దండప్రణామమును ఆచరించెను. శ్రీరాముడు ఆమెను లేవనెత్తి, ఆమెచే పూజింపబడి, ఆమె అర్పించిన ఫలాహారాది వస్తువులను సాదరముగా స్వీకరించి, సుప్రీతుడై ఆమెతో, "నీ మనమున ఏమి కావలయునో కోరుకొనుము. నేనిపుడు వరమునిచ్చెద," అని ప్రసన్నుడుగా పలికెను. ఆ శ్రీరామవాక్యమును వినిన గుణవతి మిక్కిలి సంతోషించి, "రాజీవాక్షుడుగు రామా! వేలకొలదిగా వీరు ఎట్లు నీకు దాసీజనులగుదురో నన్నును అట్లే అంగీకరింప వేడెదను," అని విన్నవించెను. శుభవ్రతాచరణగల దానా! ఏమి నీవిట్లు ఇపుడు బ్రాహ్మణ స్త్రీవి అయ్యుండీ, ఈ విధముగా అడుగుచున్నావు? నా యొక్క సేవను నీవు చేయనిచ్చుగలిగితే అపుడు చెప్పెదను. వినుము, గుణవతీ! నేను వేరొకజన్మమున ద్వాపరాంతమున ద్వారకాపట్టణమున శ్రీకృష్ణ ఆకారమున అవతరించెదను. అపుడు నీవు నన్ను స్త్రీ రూపముచే భజించెదవుగాక. అందులో సంశయము లేదు. నీ తండ్రియగు దేవశర్మ మరలా అపుడు సత్రాజిత్తుగా పుట్టును. నీ భర్త చంద్రశర్మ నాకు సఖుడైన అక్రూరుడుగా జన్మించును. నీవు సత్యభామ అనుపేరుతో నాకు అత్యంత ప్రేయసిగా ఉందువు. అపుడు నీవు నన్ను సేవింపుము." అని వరమునిచ్చెను. అంత ఆ గుణవతి మహదానందము పొంది

పలుమార్లు శ్రీరామునికి నమస్కరించి, తన నివాసమునకు పోయి, చైత్ర స్నానాలు ముగిసిన తరువాత, భక్తులతో హరిద్వారమునకు పోయెను. అచట ఆయుష్షు ఉండునంతవరకు ధర్మములను ఆచరించుచు, జ్వరముగల తన దేహమును స్నాన సమయమున గంగానదిలో వదలి, చిరకాలము స్వర్గమును అనుభవింపజనెను. గుణవతి కాలాంతరమున సత్రాజిత్తు పుత్రికగా పుట్టి, శ్రీకృష్ణపత్ని అయ్యె.

**ఏకదా పింగళానామ్నీ వేశ్యా రాత్రౌ వినిద్రితమ్ ।**
**సీతయా దివ్యపర్యంకే యయౌ సా రాఘవం రహః ॥ 48**

**విహాయ నూపురాదీని స్వనవంతి పదోః శనైః ।**
**ఇతస్తతో నిరీక్షంతీ దివ్యవస్త్రాదిభూషితా ॥ 49**

**సీతాభయత్రపకంపన్తీ కామబాణప్రపీడితా ।**
**మండితా పుష్పమాలాద్యైర్భూషణైరతిశోభితా ॥ 50**

**అజ్ఞాతా ద్వారపాలైః సా నిద్రితైర్మంచకం యయౌ ।**
**స్వకరేణ పదస్పర్శం కృత్వా రామం ప్రబోధయత్ ॥ 51**

**తదా ప్రబుద్ధః శ్రీరామస్తాం దదర్శ పురః స్థితామ్ ।**
**సా ధృత్వా తత్పదే గాఢం ప్రార్థయామాస రాఘవమ్ ॥ 52**

**రామ రాజీవపత్రాక్ష మయా తేఽద్యాపరాధితమ్ ।**
**త్వం క్షమస్వ కృపాం కృత్వా మయి చానుగ్రహం కురు ॥ 53**

**తత్తస్యా వచనం శ్రుత్వా జ్ఞాత్వా తాం కామపీడితామ్ ।**
**తాం సమాశ్వాసితుం ప్రాహ రాఘవః కంజలోచనామ్ ॥ 54**

**ఏకపత్నీవ్రతం మేఽస్మిన్భవే త్వం వేత్సి పింగలే ।**
**అతస్త్వత్కామపూర్త్యర్థం వదామి తచ్ఛృణుష్వ హి ॥ 55**

**యథాఽహం మథురామగ్రే వ్రజాచ్ఛ్రీకృష్ణరూపధృక్ ।**
**యాస్యామి మాతులం కంసం హత్వా స్థాస్యామి తత్పురీమ్ ॥ 56**

**తదా భజిష్యసి త్వం మాం కుబ్జారూపేణ పింగళే ।**
**గచ్ఛ దాస స్వరూపేణ తిష్ఠ త్వం కంసవేశ్మని ॥ 57**

**ఆయుఃక్షయే త్విమం దేహం విసృజ్య బహుపుత్రకమ్ ।**
**ఇత్యుక్త్వా పింగళాం రామో దదావాజ్ఞాం భయాత్స్త్రియాః ॥ 58**

## శ్రీరాముడు పింగళయను గణికకు వరమునిచ్చుట.

ఒకసారి పింగళయను పేరుగల ఒక వేశ్యాంగన రాత్రిసమయమున శ్రీరామునిమీద ఆశకలిగి తనకాలియొక్క గజ్జెలగొలుసును, అందెలను శబ్దమగుచున్నదని ఎత్తిపెట్టి, కామబాణప్రపీడితమయ్యెను. సీతమ్మయొక్క భయమువలన కంపించుచు, పుష్పమాలికలను, సువర్ణభూషణాది అలంకారములను ధరించి, నిద్రించుచుండు ద్వారపాలకులకు కనబడక, ఇటునటుచూచుచు, తిన్నగా శ్రీరాముడు సుఖనిద్రపోవుచుండు దివ్య పర్యంకమువద్దకు వచ్చి, తన చేతితో శ్రీరామపాదమును స్పృశించి నిద్రలేపెను. అపుడు నిద్రమేల్కొనిన శ్రీరాముడు ఎదుటనున్న పింగళను చూచెను. అది చక్కగా కాళ్ళు పట్టుకుని, శ్రీరామభద్రస్వామిని మిక్కిలి ప్రార్థించెను. "రాజీవాక్షుడైన రాఘవేంద్రా! నేనిపుడు అపరాధమును ఆచరించితిని. నీవు దయచేసి నన్ను క్షమింపుము. నాయందు అనుగ్రహము కలవాడవగుము," అను ఆమెయొక్క మాటలను విని, శ్రీరాముడు కమలాక్షియగు కామబాణ ప్రపీడితమైన దానిని సమాధానపరచుచు, "ఓసి పింగళా! ఈ జన్మమున నాకు ఏకపత్నీవ్రతముగల సంగతి నీకు తెలియును కదా. కావున నీ కామపూర్తికొరకు చెప్పెదను వినుము. నేనెప్పుడు శ్రీకృష్ణరూపమును ధరించి, గోకులమునుండి మధురాపట్టణమునకు వచ్చి, అచట మేనమామయగు కంసుని ఎపుడు సంహరించెదనో అపుడు ఆ పుర వాసియగు నన్ను నీవు కుబ్జారూపముతో సేవించుము. అనేకులచే ననుభవింపబడిన ఈ దేహము ఆయుష్షు ముగియగానే విడిచి దాసీ స్వరూపమును దాల్చి, కంస మందిరమున సేవచేయుము." అని చెప్పి, ఆ పింగళ అను స్త్రీకి ఆజ్ఞను ఇచ్చి పంపి వేసెను.

**శిక్షయామాస ద్వారస్థాన్ దాసాన్ దాశీర్వినిద్రితాః ।**
**తతః సీతాం ప్రబోధ్యాథ వేశ్యావృత్తం న్యవేదయత్ ॥ 59**

**తచ్ఛ్రుత్వా జానకీ రుష్టా త్యక్త్వా పర్యంకముత్తమమ్ ।**
**రాఘవం ప్రాహ సక్రోధా కథం న హం ప్రబోధితా ॥ 60**

తద్దైవాద్య మయా జ్ఞాతమేకపత్నీవ్రతం మృషా ।
భుక్త్వాదౌ పింగలాం తూష్ణీం త్వయాఽహ బోధితా తతః ॥ 61

తాం విసృజ్య చిరాదద్య జ్ఞాతుం తే చరితం మయా ।
మృషా త్వయా ప్రతిజ్ఞాతం పురా వ్యాసమునేః పురః ॥ 62

ఏకపత్నీవ్రతం మేఽస్తి కౌసల్యాసదృశీ మమ ।
అన్యా స్త్రీతి మృషా వాక్యం కత్థసే త్వం పునః పునః ॥ 63

క్వ గతం తద్వచస్తేఽద్య క్వ గతం తద్వ్రతం తవ ।
అద్యైవ జీవితం స్వీయం త్యజామి సరయూజలే ॥ 64

వేశ్యాయాః పృష్ఠసంలగ్నాం శయ్యాం నాద్య స్పృశామ్యహమ్ ।
వేశ్యాసక్తం స్వామినం త్వాం దృష్ట్వా ద్వేషో భవేత్త్వయి ॥ 65

మృతాయాం మయి యద్భావ్యం వేశ్యాసక్తస్య తే భవేత్ ।
వేశ్యాసక్తపార్థివస్య చిరం రాజ్యం న తిష్ఠతి ॥ 67

ఇత్యుక్త్వా రాఘవం నత్వా దేహత్యాగార్థముద్యతా ।
యయౌ వేగేన సరయూం వస్త్రగేహోత్తటిప్రభా ॥ 68

గచ్ఛంతీం రాఘవో దృష్ట్వా ముక్తకచ్ఛః ప్రదుద్రువే ।
సంభ్రమాజ్జానకీం ధృత్వా భుజాభ్యాం సైకతేఽమలే ॥ 68

అబ్రవీన్మధురం వాక్య మా రుష త్వం విదేహజే ।
శ్రుణుష్వ వచనం మే త్వం దివ్యం తే ప్రదదామ్యహమ్ ॥ 69

మయి తే శాపథైరద్య ప్రత్యయో న భవిష్యతి ।
దుర్ఘటం యత్బ్రవీషి త్వం తద్దివ్యం ప్రవదామ్యహమ్ ॥ 70

వద శీఘ్రం జనకజే మా క్రోధం భజ భామిని ।
ఇతి రామవచః శ్రుత్వా జానకీ ప్రాహ రాఘవమ్ ॥ 71

## శ్రీరాముడు సీతాదేవి మూర్ఛతను నివారించుట.

నిద్రించుచున్న ద్వారపాలకులను, దాసీజనులను శ్రీరాముడు శిక్షించెను. అంత ఊరక యుండక సీతమ్మను లేపి, వేశ్యాంగనా సమాచారమును ఆమెకు తెలిపెను. (59) ఆ మాట వినగానే సీతామాత భటునితో కోపముగా, "నన్ను ఎందువలన అపుడు నిద్రలేపలేదు? కనుకనే ఇపుడు నీ ఏకపత్నీవ్రతము తెల్లవారెనని తెలిసినది. మొదట పింగళను నీవనుభవించిన పిమ్మట యూరక నిద్రలేపితివి కాబోలు. దానిని వదిలిపెట్టిన ఎంతోసేపటికి నీ చరిత్ర నాకు తెలిసినది. నీవు శ్రీవ్యాస మునీంద్రుని ఎదుట వ్యర్థప్రతిజ్ఞచేసితివి. ఆహా! నీవు పలుమార్లు అపుడపుడు– నాకు ఏకపత్నీ వ్రతముగలదు. సీత తప్ప తక్కిన స్త్రీ నాకు కౌసల్యా సదృశ్యగా ఉన్నది" అని అనెడివారు. ఆ తరువాత సీతాదేవి శ్రీరామునితో," శ్రీరామా! నీవు కల్లలాడుచున్నావు కదా? ఆ మాట ఇపుడేమైనది? ఆ ఏకపత్నీ వ్రతమేమైనది? ఇపుడే నేనీ ప్రాణమును సరయూతీర్థమునందు విడిచెదను. వేశ్య తాకిన ఈ పాడు పరువును నేను అంటను" అనెను. వేశ్యాంతరంగుడగు నాథుని జూచి, "రామా! నీయందు నాకు ద్వేషము కలుగుచున్నది. నేను చావగా నేమి కావలయునో వేశ్యారథుడగు నీకదియగును గాక. వారకాంతా సక్తుడగు రాజునకు రాజ్యము చిరకాలము నిలువదు," ఇట్లని నిరాకరించుచు, శ్రీరామునికి నమస్కరించి, దేహత్యాగమునకై ప్రయత్నించి, మించుబోణియగు సీతమ్మ పటగృహమునుండి సరయూనదికి వెడలెను. ఇట్లు పోవుచున్న సీతనుజూచి, శ్రీరాముడు కచ్చువీడియుండగా వెంబడించి పరుగెత్తెను. పిదప రాఘవుడు మిక్కిలి సంభ్రమముచే జానకమ్మను తనభుజములతో పట్టుకుని, ఇసుకదిబ్బమీద తిన్నగా తియ్యని మాటలచే, "ప్రేయసీ! కోపించవలదు, నీవు నా మాటను వినుము నేను ప్రమాణముచేసి చెప్పెదను. నాయందు శపథములచే నీకు నమ్మకము లేకపోయిన, నీవు దుర్ఘటమగు యేప్రమాణమును పలికెదవో దానిని జేసెదను. త్వరగా చెప్పుము. కోపము వలదు కోమలాంగి," అనెను.

**జానక్యువాచ**

**రామ బ్రూయామహం కిం తే యేన దివ్యం దదాసి తే ।**
**అనలస్త్వన్ముఖోద్భూతో నయనే శశిభాస్కరౌ ॥ 72**

**వాసస్తే జలధౌ రామ పృథ్వీయం విధృతా త్వయా ।**
**శేషస్తల్పస్తవైవాయ లక్ష్మణస్తిష్ఠతే బహిః ॥ 73**

**శాస్త్రాణి త్వన్నఖజాని సర్వాణ్యత్ర న సంశయః ।**
**యద్యత్పశ్యామి తత్సర్వం తవ రూపం న సంశయః ॥ 74**

న దుర్ఘటం తే దివ్యార్థం కించిత్పశ్యామి రాఘవ ।
కిం బ్రూయామధునా తేఽత్ర యేన మే ప్రత్యయో భవేత్ ॥ 75

ఏకమేవాస్తి జానేఽహం తత్కురుష్వ రఘూత్తమ ।
ఇదానీమేవ స్వగురుం సమాహూయ రఘూద్వహ ॥ 76

పదయోస్తస్య శపథం కృత్వా తే ప్రత్యయో మమ ।
భవిష్యతి న సందేహస్తం కురుష్వ రఘూత్తమ ॥ 77

ఇతి శీతావచః శ్రుత్వా ప్రహస్య రఘునందనః ।
దాస్యా సౌమిత్రిమాహూయ వసిష్ఠం ప్రేషయస్తదా ॥ 78

లక్ష్మణః శిబికారూఢః పురద్వారాంతికం యయౌ ।
రామవాక్యాద్ద్వారపోఽపి ద్వారముద్ఘాటయత్తదా ॥ 79

గత్వా పుర్యాం లక్ష్మణః స గురోర్ద్వారి స్థిరోఽభవత్ ।
వసిష్ఠద్వారపో దాస్యా వసిష్ఠాయ న్యవేదయత్ ॥ 80

నిశీథే లక్ష్మణం ద్వారమాగతం త్వితి సంభ్రమాత్ ।
అరుంధత్యా వసిష్ఠోఽపి తచ్ఛ్రుత్వా విహ్వలోభవత్ ॥ 81

నిశీథే లక్ష్మణశ్చాత్ర కిమర్థం మాం సమాగతః ।
ఇతి విహ్వలచిత్తః స సమాహూయాథ లక్ష్మణమ్ ॥ 82

పప్రచ్ఛగమనస్యాథ కారణం మునిసత్తమః ।
తం నత్వా లక్ష్మణః ప్రాహ రామేణ స్మారితోఽసి హి ॥ 83

శ్రీరాముని మాటలను వినిన సీతాదేవి ఇట్లనెను, "శ్రీరామచంద్రస్వామీ! నీకు నేనేమి చెప్పగలను? దేనిచే నీవు నాకు ప్రమాణమును చూపగలవు? అగ్ని నీముఖమున పుట్టినవాడు, చంద్ర సూర్యులు ఇరువురును నీ నయనములు అనబడుచున్నారు. నీయొక్క వాసస్థానము సముద్రమయ్యె, ఈ భూమిని నీవే ధరించి ఉద్ధరించితివి. ఆదిశేషుడు నీ శయనతల్పము. మరియు లక్ష్మణుడు వెలుపలనున్నాడు కదా! సకలశాస్త్రములును నీ నోటపుట్టినవి. దేని దేనిని చూచెద అవన్నియును నీవుగానే ఉందువే. అందుకు సంశయములేదు. నీకు దుర్ఘటనమేమియు లేదు. నాకు నమ్మకము కలుగునట్లు నేనేమి చెప్పగలను? నేను గ్రహించినది ఒకటి గలదు. దానిని ఆచరింపుము చెప్పెదను; ఇపుడే మీ గురువును

పిలిపించి, వారి పాదములను బట్టి ప్రమాణము చేయుము. అపుడు నాకు నమ్మకమగును. ఇందుకు సంశయములేదు. ఇట్టి సీతయొక్క వచనములను విన్న శ్రీరాముడు వెంటనే దాసినిపంపి, లక్ష్మణుని పిలిపించి, వశిష్ఠులవద్దకు పంపెను. వెంటనే లక్ష్మణుడు పల్లకీనెక్కి, ఊరివాకిలివద్దకు వచ్చి శ్రీరామాజ్ఞవలన ద్వారపాలకుడు తలుపు తెరువగా ఊరివెంబడిపోయి, వశిష్ఠ గృహద్వారమున నిలిచి, చెప్పిపంపెను. ఆ ద్వారపాలకుడు దాసీ మూలకముగా వశిష్ఠులవారికి సంగతిని తెలిపెను. అర్ధరాత్రిలో లక్ష్మణుడు వచ్చి, వాకిట నిలచియున్నాడన్న సంగతిని అరుంధతితోడ వశిష్ఠుడు విని, కలతనొంది, ఎందువలన లక్ష్మణుడు ఈ మధ్యరాత్రిలో నాకై వచ్చెనని చింతించి, లక్ష్మణుని పిలిచి, ఎందుకు ఇట్లు వచ్చితివని అడిగెను. అందుకు లక్ష్మణుడు, "స్వామీ! నాకేమియును తెలియదు. మీరిప్పుడు శ్రీరామునిచే స్మరింపబడితిరి. ఇపుడే బయలుదేరండి." అనెను.

**కారణం నాఽత్ర జానామి సముత్తిష్ఠాధునైవ హి ।**
**శిబికాఽధిష్ఠితా ద్వారాద్బహిస్తే మునిసత్తమ ॥ 84**

**ఇతి శ్రుత్వా రామవాక్యామరుంధత్యాఽతిప్రార్థితః ।**
**శిబికాయామరుంధత్యా స్థిత్వా శీఘ్రం యయౌ గురుః ॥ 85**

**తత్పృష్ఠం శిబికాసంస్థః సౌమిత్రిస్త్వరితో యయౌ ।**
**రత్నదీపప్రకాశైశ్చ వేష్టితో వేత్రపాణిభిః ॥ 86**

**సమాగతం గురుం జ్ఞాత్వా ప్రత్యుద్గమ్య రఘూత్తమః ।**
**దత్త్వాసనం వసిష్ఠాయ సీతయా ప్రణనామ సః ॥ 87**

**కృత్వా పూజాం సవిస్తారం వస్త్రైరాభరణాదిభిః ।**
**కథయామాస సకలం పింగలావృత్తమాదరాత్ ॥ 88**

**కథయామాస సీతాయాః క్రోధవాక్యాన్యపి ప్రభుః ।**
**దివ్యం దాతుం న కించిచ్చ దృష్ట్వాఽన్యత్ సీతయా మమ ॥ 89**

**వినిశ్చితం తే పదయోర్దివ్యం తత్తే వదామ్యహమ్ ।**
**మనసాఽపి న భుక్తా సా మయా వేశ్యాఽథవా పరా ॥ 90**

**ఇదం చేద్వచనం సత్యం స్పృశామి తర్హి తత్పదే ।**
**ఇత్యుక్త్వా రాఘవః శీఘ్రం వసిష్ఠపదయోః కరౌ ॥ 91**

స్వీయౌ సంస్థాప్య శిరసా ప్రణనామ గురుం పునః ।
తద్దృష్ట్వా లజ్జితా సీతా జ్ఞాత్వా శుద్ధం రఘూత్తమమ్ ॥ 92

ప్రణమ్య మేఽపరాధం తం క్షమస్వేతి ప్రసాదయత్ ।
తతః సీతా గురోః పత్న్యై దదౌ చిత్రాణి భక్తితః ॥ 93

భూషణాని వరాణ్యేవ దివ్యవస్త్రాణి సాదరమ్ ।
రామేణ పూజితశ్చాపి వసిష్ఠః పూర్వవత్ స్త్రియా ॥ 94

సహితః శిబికాసంస్థస్తుష్టః స్వీయగృహం యయౌ ।
తతః సీతాం సమాలింగ్య రామో నిద్రాం చకార సః ॥ 95

లక్ష్మణుడు, వశిష్టునితో, "మునీంద్రా! వాకిట పల్లకి ఎదురుచూచుచున్నది. అని త్వరపరచెను. పిదప వశిష్ఠుడు తన వెంటవచ్చుటకు సుముఖముగా ఉన్న అరుంధతిని తనతోపాటు తీసుకు వెళ్ళుటకు సిద్ధపడెను. అరుంధతి, వశిష్ఠులు పల్లకిని ఎక్కిరి. లక్ష్మణుడు ఆ పల్లకి వెనుక కూర్చుని, చేత దండమును ధరించిన భటులచేతను, రత్నదీపకాంతులచేతను పరివృతుడై త్వరగా వచ్చెను. శ్రీరాముడు దయచేసి వచ్చిన గురూత్తముని చూసి ఎదురేగి, దివ్యాసనమును చూపి, సీతతోడ నమస్కరించి, వస్త్రాభరణాదులచే సత్కరించి, పింగళ వృత్తాంతమును సవిస్తరముగా విన్నవించి, సీతాదేవియొక్క క్రోధవాక్యములను వినిపించి, "స్వామీ! మీ పాదములు తప్ప తక్కినదేదియును ప్రమాణ భూతములు కానందున ఇదిగో మీ పాదములను బట్టి, ప్రమాణముచేయుచున్నాను. నా మనస్సులోనైనను నాచే వేశ్యకాని, ఇతర స్త్రీలుగాని అనుభవింపబడలేదు. ఈ మాటసత్యమగుటచేత, నీ పాదారవిందములను స్పృశించుచున్నాను." అని చెప్పి, శ్రీరాముడు త్వరగా నిజకరములను గురుపాదములమీద పెట్టి, శిరస్సాష్టాంగ ప్రణామముజేసెను. దానిని జూచి, సీతమ్మ సిగ్గుపడి, శ్రీరాముడు పరిశుద్ధుడని నమ్మి, రామునికి నమస్కరించి, నా అపరాధమును క్షమింపుమని ప్రార్థించెను. శ్రీరాముడును ప్రసన్నుడయ్యె. పిమ్మట జానకమ్మ అరుంధతిని వస్త్ర ఆభరణాది అలంకారములతో సత్కరించి పూజించెను. శ్రీరామునిచే చక్కగా పూజితుడైన వసిష్ఠుడు యథాపూర్వముగా అరుంధతితోడ పల్లకిని ఎక్కి, సంతోషముతో తన ఆశ్రమమునకు వెళ్ళెను. అంత ఆ శ్రీరామచంద్రుడు సీతాదేవిచే హత్తుకొనబడి, నిద్రలోనికి జారుకొనెను.

ప్రభాతే పింగలాం దాస్యా సమాహూయాథ జానకీ ।
ధిక్ధిక్కృత్వా సఖీభిస్తాం తాడయామాస బంధితామ్ ॥ 96

సీతోవాచ తదా వేశ్యాం యస్మాన్మేద్యాపరాధితమ్ ।
భవిష్యసి త్రిధావక్రా త్వం మధురాయాం హి కుత్సితా ॥ 97

వేశ్యయా ప్రార్థితా ప్రాహ కృష్ణస్త్వాముద్ధరిష్యతి ।
శ్రుత్వా తాం బంధితాం వేశ్యాం మోచయామాస రాఘవః ॥ 98

ఏవం నానాకౌతుకాని చకార రఘునందనః ।
సీతాం సంరంజయామాస స్వచరిత్రైర్మనోరమైః ॥ 99

**ఇతి శ్రీశతకోటిరామచరితాంతర్గతే, శ్రీమదానందరామాయణే, వాల్మీకీయే, ఆదికావ్యే, విలాసకాండే, సీతాక్రోధవర్ణనం నామ, అష్టమః సర్గః ॥**

తెల్లవారగానే సీతమ్మ తన దాసీలను పంపి, పింగళను పిలిపించి, స్థంభమునను గట్టి, ఛీ, ఛీ, అని ధిక్కరించుచు, సఖులచే కొట్టించెను మరియు, "పింగళా! నీవు నాకు అపరాధముచేసినందున మధురాపురిలో నీవు మూడువంకరలు గలదానవై ఉండగలవు. పొమ్మ"నెను. ఆ పింగళయును మిక్కిలి ప్రార్థించి, సీతచే ఇవ్వబడిన శాపము కృష్ణుడు ఉద్ధరించునని తెలుసుకుని ఇది సీతాదేవి అనుగ్రహముగా భావించెను. శ్రీరాముడు పింగళను బంధమునుండి తొలగించి పంపెను. ఇట్లు శ్రీరాముడు పలురకములగు వేడుకలను చూచుచు, మనోహరములగు నిజ చరిత్రలచే సీతాదేవిని రంజింపజేయుచుండెను. (8)

***ఈ విధముగ శ్రీమద్వాల్మీకి మహర్షిచే రచింపబడిన, శ్రీ శతకోటిరామచరితాంతర్గత శ్రీమత్ ఆనందరామాయణములో, 8వ సర్గ ముగిసినది.***



# నవమః సర్గః-9వ సర్గ

కురుక్షేత్ర యాత్రావర్ణన

శ్రీరామదాస ఉవాచ
ఏకదా సీతయా రామః కురుక్షేత్రం స్వబంధుభిః ।
యయౌ సూర్యోపరాగే వై స్నాతుం పుష్పకసంస్థితః ॥ 1

తత్ర దేవాః సగంధర్వాః కిన్నరాః పన్నగా యయుః ।
నానాఽఽశ్రమేభ్యో మునయః పార్థివాశ్చ సహస్రశః ॥ 2

తత్ర స్నాత్వా రవౌ గ్రస్తే రాఘవః సీతయా సహ ।
చకార నానాదానాని హస్త్యుష్ట్రరథవాజినామ్ ॥ 3

తతస్తే పార్థివాః సర్వే నానోపాయన పాణయః ।
యయుస్తే రాఘవం ద్రష్టుం రాజపత్న్యశ్చ జానకీమ్ ॥ 4

అథ సీతా రాజపత్నీః సమాలింగ్య వరాసనే ।
సఖీభిర్మునిదారైశ్చ సుఖం చోపావిశత్తదా ॥ 5

ఏతస్మిన్నంతరే తత్ర సీతయా పూజితా స్థితా ।
లోపాముద్రాఽబ్రవీద్వాక్యం జానకీం రంజయన్ముదా ॥ 6

హే సీతే కంజనయనే ధన్యాఽసి గజగామిని ।
కించిద్వర్ణయ రామస్య పౌరుషం శ్రుతితోషదమ్ ॥ 7

శ్రీరామదాసు ఇట్లు చెప్పెను, "శ్రీరాముడు ఒకసారి సీతా, లక్ష్మణ, భరత, శత్రుఘ్నులను తీసుకుని పుష్పక విమానమెక్కి సూర్యగ్రహణ స్నానమునకై కురుక్షేత్రమునకు పోయెను. అచటికి దేవతలు, గంధర్వులు, కిన్నెరలు, నాగులును వచ్చిరి. సమస్త ఆశ్రమములనుండి మునీంద్రులును, నానాదేశములనుండి రాజేంద్రులును వేలకొలదిగా వచ్చిచేరిరి. అచట శ్రీరాముడు సీతతోపాటు గ్రహణ స్నానముచేసి, ఏనుగులను, ఒంటెలను, గుఱ్ఱములను మొదలగు దానములను చేసెను. అంత అచటచేరిన రాజులందరును వివిధములగు కానుకలను తీసుకుని శ్రీరామదర్శనమునకును, రాజపత్నులు సీతాదర్శనమునకును వచ్చిరి. పిదప జానకీదేవి రాజపత్నులను ఆలింగనాది

సమ్మానములచే మన్నించి, సుఖజనులతోను, మునిపత్నులతోను సుఖముగా దివ్యాసనమున కూర్చుండెను. (5) ఇట్లుండగా అచట జనక పుత్రికచే పూజింపబడి ఉన్న లోపాముద్ర సంతోషముతో సీతమ్మను రంజింపజేయుచు, "కంజాక్షియగు సీతమ్మా! నీవే ధన్యవు. గజగామినీ! చెవికి ఇంపైన శ్రీరామపౌరుషమును కొంచెము అభివర్ణింపుము అని పలికెను.

తత్తస్యా వచనం శ్రుత్వా వర్ణయామాస జానకీ ।
స్వపాణిగ్రహణాత్పత్యుః కురుక్షేత్రావధిం కథామ్ ॥ 8

లోపాముద్రాఽపి తత్ శ్రుత్వా విహస్య ప్రాహ జానకీమ్ ।
సర్వం యోగ్యం కృతం సీతే రాఘవేణ మహాత్మనా ॥ 9

ఏక ఏవ వృథా క్లేశః కృతస్తేనేతి వేద్మ్యహమ్ ।
మహాన్ శ్రమః సేతుబంధే కిమర్థం హి కృతః పురా ॥ 10

కథం న కథితం కుంభ జన్మనే రాఘవేణ హి ।
క్షణాత్తం చులుకే కృత్వా పీత్వేమం లవణార్ణవమ్ ॥ 11

శుష్కం కృత్వా కపీన్మార్గోఽభవిష్యదత ఏవహి ।
వృథా తే శ్రమితాః సర్వే వానరాః సేతుబంధనే ॥ 12

ఇతి తస్యా వచః శ్రుత్వా సగర్వం జానకీ తదా ।
లోపాముద్రాం విహస్యాహ లోపాముద్రే పతివ్రతే ॥ 13

సమ్యక్కృతం రాఘవేణ యత్సేతోర్బంధనం వరమ్ ।
తత్కారణం వదామ్యద్య శ్రుణు త్వం స్వస్థమానసా ॥ 14

శ్రుణ్వంత్విమాః సమాయాతా మద్వాక్యం పార్థివస్త్రియః ।
బాణేన శోషణీయశ్చేత్సాగరో రాఘవేణ హి ॥ 15

భవిష్యతి తదా హత్యా బహవశ్చేతి శంకితమ్ ।
ఉల్లంఘనీయో జలధిశ్చేద్రామేణ విహాయసా ॥ 16

తదా రామం మనుష్యం చ కదా జ్ఞాస్యతి రావణః ।
హనుమత్పృష్ఠ మారుహ్య గంతవ్యం చేత్పరే తటే ॥ 17

**లంకాం ప్రతి తదా రామపౌరుషం కిం వదంతి హి ।**
**యది తీర్త్వా ప్రగంతవ్యం బాహుభ్యాం రాఘవేణ హి ॥ 18**

**నోల్లంఘనీయం విప్రస్య మూత్రం చేతి విశంకితమ్ ।**
**చేన్మునిః కుంభజన్మా వై ప్రార్థనీయః పతిస్తవ ॥ 19**

## సీత–లోపాముద్ర సంవాదము

అగస్త్యముని భార్య యగు లోపాముద్ర అభ్యర్థనను మన్నించిన జానకి, తన వివాహ మహోత్సవము మొదలుకొని, కురుక్షేత్రమునకు వచ్చుటవరకు జరిగిన శ్రీరామకథను అభివర్ణించెను. లోపాముద్ర దానిని విని, నవ్వి, సీతతో, "జానకీ! శ్రీరాముడు చేసినదంతయు సరియె, ఒక విషయమునందు మాత్రము శ్రీరాముడు వ్యర్థముగా క్లేశపడెనని నేను అనుకుంటున్నాను. అది ఏమనిన, మునుపు సేతురచనకై ఎందుకంత పెద్దగా శ్రమించాలి? శ్రీరాముడు ఏల కుంభజ (అగస్త్య)మునికి చెప్పకపోయె? అతడు క్షణమున ఆ లవణ సాగరమును అరచేతిలో అందుకుని త్రాగివేసి, సముద్రమును శుష్కింపజేసి అప్పుడే వానరులకు చక్కని దారిని ఏర్పరిచియుండునే. వ్యర్థముగా వానరులకు సేతుబంధనశ్రమను కలిగించెను," అని అనెను. గర్వయుక్తయగు ఈ మాటను విని, సీతాదేవి నవ్వి, లోపాముద్రతో ఇట్లనెను, "సతీమణి యగు లోపాముద్రా! వినుము, శ్రీరాముడు సేతుబంధనమును చక్కగానే నెరవేర్చెను. దానికి కారణము చెప్పెదను. సమాహిత చిత్తయై ఆలకింపుము. ఇచటఉండు రాజపత్నులందరును నా వాక్యమును విందురుగాక. శ్రీరాముడు తన బాణములతో సముద్రమును ఎండింపజేసినచో అనేక హత్యాది దోషములు కలుగునని శంకించెను. ఇక శ్రీరాముడు గగనమున సముద్రమును దాటినట్లైన అపుడు రావణుడు శ్రీరాముని మనుష్యమాత్రునిగా ఎట్లెంచును! శ్రీరాముడు హనుమంతుని మీదనెక్కి సముద్రమును దాటి లంకకు చేరితే అపుడు శ్రీరాముని పౌరుషమును ఏమందురు? చేతులతో ఈదుచు, సముద్రమును దాటుద మనిన బ్రాహ్మణ మూత్రమును మనము దాటరాదని శంకించెను. ఐనా నీ మగడు నా మగనిచే ప్రార్థనీయుడే సరి. శ్రీరాముడును తన మనమున, "క్రోధమువలన అగస్త్యుడు ఈ జలనిధి త్రాగివేసెనని వింటిని. అంతేగాక అగస్త్యుడు ఈ సముద్రజలమును మూత్రద్వారమునుండి బయట విడిచెను.

**రామేణ చులుకం కర్తుం తదా తల్లవణాంబుధేః ।**
**మంత్రితం రాఘవేణాపి తదా హృది సవిస్తరమ్ ॥ 20**

**పీతోఽయం జలధిః పూర్వం శ్రుతం క్రోధాదగస్తినా ।**
**మూత్రద్వారాద్బహిస్త్యక్తో యస్మాత్ క్షారత్వమాగతః ॥ 21**

సర్వదా మూత్రవత్ క్షారః స కథం పాతుమర్హతి ।
స ఋషిర్మమ వాక్యేన చులూకం తు కరిష్యతి ॥ 22

భవిష్యతి మమాకీర్తిః సర్వత్ర జగతీతలే ।
మూత్రపానం బ్రాహ్మణేన స్వకార్యార్థ నిజోక్తిభిః ॥ 23

కారితం యేన రామేణ సోఽయం చేతీతి శంకితః ।
స మునిం ప్రార్థయామాస రాఘవో ధర్మతత్పరః ॥ 24

ఏవం సమ్మంత్ర్య రామేణ స్వకీర్త్యై సేతుబంధనమ్ ।
కృతం కేనాపి న కృతం నకోఽప్యగ్రే కరిష్యతి ॥ 25

యేన రామేణ జలధౌ శిలాః సంతారితాః పునః ।
సోఽయం దాశరథీ రామశ్చేతి ఖ్యాతిం గతో భువి ॥ 26

ఇతి సీతావచోభిః సా లోపాముద్రా జితా తదా ।
తూష్ణీమాస క్షణం నారీసభాయాం లజ్జితాఽభవత్ ॥ 27

తతో విహస్య వైదేహీ లోపాముద్రాం ప్రపూజయత్ ।
మునిపత్నీశ్చ సంపూజ్య ప్రార్థయామాస తాం పునః ॥ 28

మయాఽపరాధితం తేఽద్య తత్క్షమస్వ పతివ్రతే ।
స్నేహాత్ప్రసంగతశ్శోక్తం త్వదగ్రే రామపౌరుషమ్ ॥ 29

త్వద్భర్తురాశిషా రామే పౌరుషం చేతి వేద్మ్యహమ్ ।
ఇతి సంప్రార్థ్య తాః సర్వా మునిపత్నీర్వ్యసర్జయత్ ॥ 30

పూజితా నృపపత్నీభిర్యయౌ సీతా రఘూత్తమమ్ ।
తతో రామోఽపి పృథ్వీశైః పూజితో గజవాజిభిః ॥ 31

యయౌ స నగరీం తుష్టః సీతయా గరుడే స్థితః ।
యే యే సమాగతాస్తత్ర కురుక్షేత్రే రవిగ్రహే ॥ 32

అందువలన సముద్రజలము ఉప్పగామారెను. కనుక అగస్త్యునిచే విసర్జింపబడిన జలమును మరల తానే ఎట్లు పానముచేయగలడు? నా మాటమీద ఆ మహర్షి సముద్రమును పుక్కిలింతుననినను నాకు లోకమునందు అంతటా- శ్రీరాముడు తన కార్యక్రమముకై బ్రాహ్మణునిచే మూత్రపానము చేయించె- అని అపకీర్తి తప్పకవచ్చును.” అని ఇట్లు ఆలోచించి, ధర్మ తత్పరుడగు శ్రీరాముడు మునీంద్రుని ప్రార్థించలేదు. కావున ఇట్టియోచనలచే శ్రీరాముడు సేతు బంధనమును చేయించెను. ఇదివరకు ఈ విధముగా ఎవ్వరూ చేయలేదు. ఇకనెవరునూ చేయరు. యే రామునిచే సముద్రమున రాళ్ళు సంతరింపబడినవో అట్టివాడు గదా దాశరథియని నా మగడు ఖ్యాతినందెను- అని ఇట్లు సీతా వాక్యములు విన్న లోపాముద్ర లజ్జితయై సభలో కొంతసేపు ఊరకఉండెను. అంత ఆ జానకమ్మ నవ్వి, లోపాముద్రను చక్కగా సత్కరించి, మునిపత్నులనందరిని పూజించి, తిన్నగా ఆమెతో, “ఓ మహాపతివ్రతయగు లోపాముద్రా! నేను మిక్కిలి అపరాధమును ఆచరించితిని, దీనిని క్షమింపుము. స్నేహమువలన ప్రసంగవశముగా నీయెదుట శ్రీరాము పౌరుషమును చెప్పితిని. సదా నీ భర్తయొక్క ఆశీర్వాదములచేతనే శ్రీరాముడు పౌరుషము కలిగి ఉండునని నేను ఎరుగుదును. అని ఇట్లు చక్కగా ప్రార్థించి, ఆ మునిపత్నులనందరిని పంపించెను. సీత వారిచే గౌరవింపబడినదియై శ్రీరామసన్నిధానమునకు విచ్చేసెను. (30) పిదప శ్రీరాముడు రాజులచే సంసేవితుడై వారర్పించిన గజ, రథ, తురగాదులు మొదలగు కానుకలను స్వీకరించి, సీతతో గరుఢారూఢుడై అయోధ్యకు వచ్చెను. అచట కురుక్షేత్రమునకు సూర్యగ్రహణమునకై ఎవరెవరు వచ్చియుండిరో...

**తే సర్వే స్వస్థలం జగ్మూ రామదర్శనహర్షితాః ।**
**రామోఽపి నగరీమధ్యే పురస్త్రీభిర్ముహుః పథి ॥ 33**

**నీరాజితః కుంభదీపైర్యయౌ నిజగృహం ముదా ।**
**రేమే జనకనందిన్యా చిరకాలం యథాసుఖమ్ ॥ 34**

**ఏవం రామేణ సాకేతపుర్యామవనికన్యయా ।**
**నానాక్రీడాకౌతుకాని కృతాన్యతిమహాన్త్యపి ॥ 35**

**యథా కృతా రాఘవేణ సుఖం క్రీడా చ సీతయా ।**
**తథైవోర్మిలయా రేమే లక్ష్మణోఽపి యథాసుఖమ్ ॥ 36**

మాండవ్యా భరతశ్చాపి రేమే రామో యథా స్త్రియా ।
తథైవ శ్రుతకీర్త్యాఽపి శత్రుఘ్నః క్రీడనం వ్యధాత్ ॥ 37

ఏవం తే స్వీయపత్నీభిః పౌరాః క్రీడాః ప్రచక్రిరే ।
తథైవ వివిధద్వీపాన్నానాద్వీపనివాసినః ॥ 38

రేమిరే తేఽపి పత్నీభిః స్వీయాభిర్ముదితాః సుఖమ్ ।
సీతయా రాఘవో రేమే యథా గౌర్యా స శంకరః ॥ 39

రామే శాసితరాజ్యేఽత్ర న కోఽపి జగతీతలే ।
పరదారరతో వేశ్యాగామీ మాదకవస్తుభుక్ ॥ 40

న దరిద్రో నైవ రోగీ చింతాగ్రస్తో న విహ్వలః ।
న పాపాత్మా జడో నాసీన్న చోరో నాపి హింసకః ॥ 41

ఏవం శిష్య మయా ప్రోక్తం విలాసచరితం వరమ్ ।
సీతయా రామచంద్రస్య సాకేతే సౌఖ్యదం నృణామ్ ॥ 42

విలాసకాండమేతద్వై యః పఠిష్యతి మానవః ।
ప్రాతః కాలే చ మధ్యాహ్నే నిశాయాం రామసన్నిధౌ ॥ 43

స జ్ఞేయో రాఘవః సాక్షాద్భువి మానవరూపధృక్ ।
విలాసకాండపఠనాద్ధనార్థీ ధనమాప్నుయాత్ ॥ 44

## శ్రీరాముడు అయోధ్యకువచ్చి సుఖించుట.

కురుక్షేత్రమునకు వచ్చినవారందరూ శ్రీరామదర్శన ఆనందముచే పూర్ణ మనోరథులై తమతమ స్థానములకు వెళ్ళిరి. శ్రీరాముడు అయోధ్య నగరమున ప్రవేశించి, దారిలో నగర నారీమణులచే కుంభదీప, దీపనీరాజనాదులను అంగీకరించుచు, మహావైభవముతో రాజమందిరమున ప్రవేశించి సంతసించెను. శ్రీరామచంద్రుడు జానకీదేవితో యథాసుఖముగా చిరకాలము క్రీడించుచుండెను. ఇట్లే శ్రీసీతారాములు అత్యంత ఆశ్చర్యకరములైన గొప్పగొప్ప వేడుకలు జేయుచు, వినోదముగా ఉండిరి. వారెట్లుండిరో అట్లే, ఊర్మిళ–లక్ష్మణులును, మాండవి–భరతులును, శృతకీర్తి–శత్రుఘ్నులును, నిత్యానంద నిర్భరులై విలాసముగా ఉండిరి. ఇంతమాత్రమే కాదు. పురవాసులు,

దేశవాసులు, ద్వీపాంతరవాసులు, చివరకు లోకులందరును తమతమ పత్నులతో శ్రీసీతారామ విలాస క్రీడలవంటి మహోత్సవములు గలవారై ఆనందించుచుండిరి. శ్రీసీతారాములు శ్రీగౌరీశంకరుల వలె రమించుచుండిరి. శ్రీరాముడు రాజ్యమును పరిపాలించుచుండగా, ఈ జగమున ఎచటను పరదారరతుడు గాని, వారాకాంతాసక్తుడుగాని, మాదకవస్తుసేవనగలవాడుగాని, దరిద్రుడుగాని, రోగికాని, చింతాక్రాంతుడుగాని, విహ్వలుడుగాని, పాపాత్ముడుగాని, జారుడుగాని, చోరుడుగాని, హింసకుడు గాని ఒక్కడును చిక్కడు. అట్టివారే లేరు. (41) విష్ణుదాసా! ఇట్లు అయోధ్యలోని లోకరంజకమైన శ్రీసీతారాముల యొక్క విలాసచరితమును నీకు చెబితిని. ఈ విలాసకాండను యే మానవుడు ప్రొద్దున, మధ్యాహ్నమున, సాయంకాలమున, అర్ధరాత్రిలో శ్రీరామసన్నిధానమున పఠించునో అతడు ఈ భూమిపై సాక్షాత్ రాముడుగా ఎంచబడును. నరులు విలాసకాండమును పఠించుటచేత ధనము కావలసినవారికి ధనము లభించును.

భోగానాప్నోతి భోగార్థీ పుత్రార్థీ పుత్రమాప్నుయాత్ ।
విలాసకాండమేతద్వై రామభక్త్యైకమానసః ॥
యః శ్రుణోతి నరః కశ్చిత్స సుఖం ప్రాప్నుయాద్భువి ॥ 45

విలాసకాండశ్రవణాన్నరః పాపాత్ప్రముచ్యతే ।
విలాసకాండం పరమం రమ్యం జనమనోహరమ్ ॥ 46

ఆనందదాయకం చిత్రం శ్రుతిసౌఖ్యప్రదం మహత్ ।
యే పఠన్త్యథ శ్రుణ్వంతి సర్వాన్ కామాన్ లభంతి తే ॥ 47

ధర్మార్థీ ప్రాప్నుయాద్ధర్మాన్ ధనార్థీ ప్రాప్నుయాచ్ఛ్రియమ్ ।
కామానాప్నోతి కామార్థీ మోక్షార్థీ మోక్షమాప్నుయాత్ ॥ 48

నిశాయాం మంచకే స్థిత్వా నిజపత్న్యా పఠేత్తు యః ।
విలాసకాండం షణ్మాసం తస్య పుత్రో భవిష్యతి ॥ 49

అథవా మంచకే వ్యాసం సన్నివేశ్యాథ తత్పురః ।
ద్వితీయే మంచకే స్థిత్వా స్వయం దయితయా సహ ॥ 50

యః శ్రుణోతి నిశాయాం హి విలాసాఖ్యం మనోరమమ్ ।
ఏతత్కాండం పవిత్రం చ నవమాసాన్ పునః పునః ॥ 51

తస్యాపుత్రస్య పుత్రః స్యాన్నాత్ర కార్యా విచారణా ।
పుత్రార్థమేవ శ్రోతవ్యం మంచకే హ్యుపవిశ్య చ ॥ 52

శ్రోతవ్యం నాన్యకామేషు మంచకంస్థైర్నరైః కదా ।
విలాసకాండమేతద్వై స్త్రీకామాద్యః పఠేన్నరః ॥ 53

స భార్యాం ప్రాప్నుయాద్రమ్యాం నవమాసైర్న సంశయః ।
కుమారీ శృణుయాదేతత్పత్యర్థం కాండముత్తమమ్ ॥ 54

పునః పునస్తు షణ్మాసం లభిష్యతి వరం పతిమ్ ।
విలాసకాండమేతద్వై యాః శృణ్వంతి వరాః స్త్రియః ॥ 55

## విలాసకాండ ఫలశ్రుతి

ఈ విలాసకాండ భోగము కావలసిన వారికి భోగము, పుత్రులను కోరువారికి పుత్రులు కలిగి సుఖించెదరు. ఈ విలాసకాండమును విన్నవాడు రామభక్తి పరాయణుడై ఇహలోకసుఖములను పొందును. దీనిని వినుటచే పాపములు పారిపోవును. ఈ విలాసకాండ ఎంతో శ్రేష్ఠమైనది, మిక్కిలి పవిత్రము. లోకహృదయంగమము, ఆనందప్రదము, విచిత్రము, కర్ణానందము. ధర్మార్థులు ధర్మమును, ధనార్థులు సంపదను, కామార్థులు కామమును, మోక్షార్థులు ముక్తిని పొందగలరు. ఈ విలాసకాండమును మంచముపై పరుండి రాత్రులలో ఎవ్వడు ఆరునెలలు పఠించునో వానికి సత్పుత్రుడు పుట్టును మరియు ఒకమంచముపై వ్యాసుని స్థాపించి, దాని ఎదుట మరియొక మంచముపై దంపతులు కూర్చుండి తొమ్మిది నెలలు ఎవరు శ్రవణము చేయుదురో అట్టి యా దంపతులకు పుత్రుడు లభింపగలడు. దీని కారణము విచారింపవలదు. పుత్రులను కోరువారు మాత్రమే మంచముపై కూర్చుని వినదగును. తక్కిన కోర్కెలవారెవ్వరును అట్లు వినదగదు. మంచి భర్తను కోరు కన్యక మరలామరలా ఆరుమాసములు దీనిని వినుచుండిన మంచి వరుడు లభించును. ఈ విలాసకాండను వినుచున్న వనితలకు సౌమాంగళ్యము తప్పక కలుగును.

సౌభాగ్యలక్ష్మ్యా న కదా తా విహీనా భవంతి హి ।
భర్తురాయుష్యవృద్ధ్యర్థం స్త్రీభిశ్చ స్నానపూర్వకమ్ ॥
శ్రవణీయం విలాసాఖ్యమేతత్కాండం మనోహరమ్ ॥ 56

రమ్యం విచిత్రం మధురం పవిత్రం
విలాసకాండం హి యథేక్షుదండమ్ ।
పాఠాదినా పాపచయప్రచండం
ధర్మైకకుండ భవరోగదండమ్ ॥ 57

**ఇతి శ్రీశతకోటిరామచరితాంతర్గతే, శ్రీమదానందరామాయణే, వాల్మీకీయే, ఆదికావ్యే, విలాసకాండే, కురుక్షేత్రయాత్రావర్ణనం నామ నవమః సర్గః ॥**

**ఇతి విలాస కాండః సమాప్తః ॥**

భార్యలు భర్తల ఆయుష్షు వృద్ధికొరకు, దీనిని స్నానముచేసి, నియమముగా వినవలయును. చెవులకు ఇంపైన మరియు మనసుకు సొంపై, పవిత్రమై మరి విచిత్రమై; పఠించినవారి పాపములను పరిహరించునట్టి విలాసకాండము భవరోగ దండమును, ధర్మకుండమునై రారాజించు చున్నది.

***ఈ విధముగ శ్రీమద్వాల్మీకి మహర్షిచే రచింపబడిన,***
***శ్రీ శతకోటిరామచరితాంతర్గత శ్రీమత్ ఆనందరామాయణములో,***
***9వ సర్గ ముగిసినది.***



## 5. జన్మ కాండ వివరములు

| సర్గ. | శ్లోకాలు |
|---|---|
| 1. | 75 |
| 2. | 54 |
| 3. | 88 |
| 4. | 86 |
| 5. | 51 |
| 6. | 68 |
| 7. | 140 |
| 8. | 98 |
| 9. | 144 |

**మొత్తం 9 సర్గలు, 804 శ్లోకాలు**



# ప్రథమః సర్గః-1వ సర్గ

## సీతాదేవికి పుంసవనము

శ్రీరామదాస ఉవాచ
అథ రామః సీతయా స సాకేతే బంధుభిశ్చిరమ్ ।
క్రీడాం చకార వివిధాం దుర్లభాం త్రిదశైరపి ॥ 1

ఏకదా రఘువీరస్తు సోఽన్తర్వత్నీం విదేహజామ్ ।
జ్ఞాత్వా ధాత్రీముఖాత్తుష్టో దదౌ దానాన్యనేకశః ॥ 2

బ్రాహ్మణాన్ భోజయామాస కోటిశః ప్రత్యహం ముదా ।
చకార నానాలంకారాన్నవీనాన్ రత్ననిర్మితాన్ ॥ 3

సీతాయై దివ్య వాసాంసి హేమతంతూద్భవాని చ ।
హరితాన్యథ పీతాని రక్తాని చిత్రితాన్యపి ॥ 4

కారయిత్వాథ కుశలైర్జ్ఞనైః సూక్ష్మాణి రాఘవః ।
విస్తృతాన్యతిదీర్ఘాణి పుష్పవత్సులఘూన్యపి ॥ 5

మహార్ఘాణ్యతిరమ్యాణి దదౌ పత్న్యై ముదాన్వితః ।
అథ మాసే ద్వితీయేఽహ్ని రామో ద్విజవరైః సహ ॥ 6

వసిష్ఠేన పుంసవనసంస్కారం విధిపూర్వకమ్ ।
స చకారోత్సవైర్దివ్యైః సీతాయాః పరమాదరాత్ ॥ 7

### సీతాదేవికి పుంసవనము చేయుట.

శ్రీరామదాసు ఇట్లుచెప్పుచున్నాడు. "అనంతరము శ్రీరాముడు దేవతలకుకూడా దుర్లభమైన వివిధ క్రీడలను సీతా, లక్ష్మణ, భరత, శత్రుఘ్నుల తోడ అయోధ్యలో ఒనర్చుచుండెను. ఒకసారి సీతమ్మ గర్భిణి అనుసంగతిని దాదుల ద్వారా విని అనేకదానములను చేసెను. ప్రతినిత్యము కోట్లకొలది బ్రాహ్మణులకు సంతర్పణచేయుచు వచ్చెను. సీతాదేవి కొరకు క్రొత్తక్రొత్త అలంకారములను చేయించెను. నేర్పరులగు నేతగాండ్రచే వివిధవర్ణములును, విచిత్ర రచనాయుక్తములును మిక్కిలి సూక్ష్మములును, పుష్పములవలె తేలికైయుండునట్టి బంగారు అంచువస్త్రములను చేయించి సీతకు ఇచ్చెను. అంత

రెండవనెలలో ఒకమంచి పగటిసమయాన శ్రీరాముడు వశిష్ఠాది బ్రాహ్మణోత్తములతోడ విధివిధానముగా సీతమ్మకు పుంసవన కర్మను సాదరముగా మహోత్సవముగా చేసెను.

సుమేధాం జనకం చాపి సమాహూయ సవిస్తరమ్ ।
జనకః పరమస్తుష్టః సోఽన్తర్వత్నీం నిజాం సుతామ్ ॥ 8

దృష్ట్వా పుంసవనోత్సాహే సీతారామౌ ప్రపూజయత్ ।
నానాలంకారవాసాంసి హేమతంతూద్భవాని చ ॥ 9

హరితాన్యథ పీతాని సూక్ష్మాణ్యథ లఘూని చ ।
విస్తీర్ణాన్యథ దీర్ఘాణి సీతాయై స దదౌ ముదౌ ॥ 10

హస్త్యశ్వరథతురగాన్ దాసీర్దాసాన్మనోరమాన్ ।
శిబికాశ్చాపి వాసాంసి దదౌ రామాయ సాదరమ్ ॥ 11

ఏవం సంపూజ్య శ్రీరామం సీతాం చ జనకః స్త్రియాః ।
సంమానితో రాఘవేణ యయౌ స్వాం మిథిలాం పురీమ్ ॥ 12

అథ రామః సీతయా స రేమే సంతుష్టమానసః ।
గర్భాతిభారాక్రాంతా సా సీతా సంన్యస్తభూషణా ॥ 13

పాండువర్ణాననా దీనా కృశాఽపి నితరాం బభౌ ।
ఏకదా రాఘవం ధాత్ర్యా సూచయామాస జానకీ ॥ 14

మమేచ్ఛాఽఽరామమధ్యేఽద్యరంతుమస్తి త్వయా సహ ।
తథోపవనమధ్యేఽపి సాకేతనగరాద్బహిః ॥ 15

తద్ధాత్ర్యాస్యాత్ప్రియావాక్యం శ్రుత్వా చాహూయ లక్ష్మణమ్ ।
రామోఽబ్రవీచ్ఛుభాం వాచం మధురాం స్మితపూర్వకమ్ ॥ 16

హే సౌమిత్రేఽద్య సీతాయా జాతాఽఽరామస్పృహాస్తి హి ।
మయా రంతుం తతస్త్వం హి సూచితోఽసి మయాఽధునా ॥ 17

తథేతి రామవాక్యం సోఽప్యురరీకృత్య లక్ష్మణః ।
గత్వా సభాయామాహూయ త్వరయామాస సేవకాన్ ॥ 18

చిత్రోష్ణీషాన్వేత్రపాణీన్ ప్రాహ వాక్యం స్మితాననః ।
కథనీయం హట్టమధ్యే హ్యారామం యాతి జానకీ ॥ 19

రాఘవేణ తతో యూయం వణిజస్త్వరయంత్వితి ।
తతః సౌమిత్రివచనాత్ శ్రుత్వా తే వేత్రపాణయః ॥ 20

సీతమ్మ పుంసవనోత్సవమునకు సుమేధా, జనకులను పిలిపించెను. జనకమహారాజు తన కూతురు గర్భిణి అని తెలిసి పరమానంద భరితుడై చూచి, పుంసవనోత్సవ సమయమున శ్రీసీతారాములను పూజించెను. జనకమహారాజు సీతమ్మకు మనోహరములగు దివ్య పట్టువస్త్రములను, శ్రీరాములవారికి రథములను, ఏనుగులను, గుఱ్ఱములను, పదాతులను, దాసీదాస వర్గములను, వస్త్రములను సాదరముగా సమర్పించెను. ఇట్లు జనకుడు శ్రీరాములను పూజించి, శ్రీరామునిచే సమ్మానింపబడి, తన భార్యతో మిథిలాపురికి వెడలెను. అంత శ్రీరాముడు సంతుష్టాంతరంగుడై సీతతో క్రీడించుచుండెను. గర్భవతియగు సీత ఆభరణములు ధరించక, తెల్లని వర్ణము, చిక్కినప్పటికీ జానకమ్మ మిక్కిలి ప్రకాశించెను. ఒకప్పుడు ఆమె శ్రీరామునితో, "అయోధ్యకు అవల ఆరామములలో, ఉపవనములలో నేను నీతో క్రీడింపవలయు," నని తన కోర్కెను సూచించెను. దాది చెప్పిన ప్రేయసి వచనమును విని శ్రీరాముడు లక్ష్మణుని పిలచి, "తమ్ముడా! మీ వదిన నాతో ఉపవనములలోను, మందిరాలలోను విహరించాలని కోరుకుంటున్నది," అనగా, లక్ష్మణుడు అన్నగారి వాక్యమును అట్లే అని ఆనందించుచు వచ్చి,

చిత్రోష్ణీషా రుక్మదండా రాజమార్గే చతుష్పథే ।
హట్టం వీథ్యామూర్ధ్వహస్తస్తదా ప్రోచుర్మహాస్వరైః ॥ 21

పౌరాశ్చ వణిజః సర్వే తథాఽన్యే వ్యవసాయినః ।
శ్రుణ్వంతు హృష్టహృదయాః సీతోద్యానం ప్రగచ్ఛతి ॥ 22

రాఘవేణాభ్యనుజ్ఞాతైర్భవద్భిర్గమ్యతాం పురః ।
ఏవం సర్వాన్నివేద్యాథ జగ్ముస్తే లక్ష్మణం చరాః ॥ 23

దూతానాజ్ఞాపయామాస పునః సౌమిత్రిరాదరాత్ ।
వాసోగేహాని చిత్రాణి హ్యారామేషు సమంతతః ॥ 24

కల్పనీయాని వేగేన శోధనీయా భువః శుభాః ।
జలయంత్రాణి సర్వాణి శోధనీయాని సాదరమ్ ॥ 25

నానామాంగళ్యవస్తూని సుగంధీని మహాంతి చ ।
స్థాపనీయాని వై తత్ర వస్త్రాణ్యతిలఘూని చ ॥ 26

ఏవమాదీన్యనేకాని కల్పనీయాని సాదరమ్ ।
శృంగారణీయాః ప్రాసాదాః సర్వే హ్యారామసంభవాః ॥ 27

దివ్యవస్త్రైస్తోరణాద్యైర్ముక్తా గుచ్ఛైర్విరాజితాః ।
తథేతి దూతాస్తే సర్వే తథా చక్రుస్తరాన్వితాః ॥ 28

లక్ష్మణో రాఘవం గత్వా నత్వా తం ప్రాహ సాదరమ్ ।
ఉద్యోగసమయోఽద్యైవ వర్తతే రఘునందన ॥ 29

కుర్యాం సిద్ధం హి కిం యానం సీతాయాస్తవ వా విభో ।
తత్సౌమిత్రేర్వచః శ్రుత్వా జానకీం రాఘవోఽబ్రవీత్ ॥ 30

సీతే యానం వదాద్య త్వం యత్తే మనసి వర్తతే ।
తద్రామవచనం శ్రుత్వా శిబికాం ప్రాహ జానకీ ॥ 31

రామోఽపి రోచయామాస శిబికామేవ వై తదా ।
తత్ శ్రుత్వా లక్ష్మణశ్చాపి శిబికే రత్నభూషితే ॥ 32

## సీతయొక్క ఆరామక్రీడామహోత్సవము.

సభలో చేత బెత్తములనుపట్టి, విచిత్ర దుస్తులను ధరించిన సేవకులతో, "శ్రీసీతారాముల వారు ఆరామ మహోత్సవమునకు వెడలుచున్నారు. వర్తకులారా! మీరందరు త్వరపడండి అని అంగడిబజారులో చాటించవలయును," అని ఆజ్ఞాపించెను. అంత వారు అట్లేపోయి, అంగడి బజారులోని వీధిలో నిలచి, చేతులు పైకెత్తి, "ఊరివారును, వర్తకులును, అందరును తక్కినవారును సంతుష్టులై వినుడు. "నేడు సీతాదేవి శ్రీరాములవారితో ఉద్యానవనమునకు వచ్చుచున్నారు. రాజాజ్ఞవలన మీరందరును మొదట వెడలండి, అని బిగ్గరగా చెప్పి, అచటనుండి సౌమిత్రి సన్నిధికి వచ్చిరి. పిదప లక్ష్మణుడు దూతలకు, "త్వరగా మందిరములలో అంతట విచిత్రములగు చిత్రములను రచించవలెను, నేలలు చక్కగా పరిశుద్ధముగా ఉండవలయును. జలయంత్రములను చక్కబరిచిపెట్టుడు. సమస్త మాంగళ్య సద్వస్తువులు సర్వసిద్ధములుగా ఉండవలయును. ఇంకా అనేక అనేక శృంగారములను చేయించి పెట్టవలయును. ఉద్యానవనములోని మేడలన్నియు దివ్య వస్త్ర తోరణ ధ్వజాదులచే

అలంకరింప చేయాలి అని ఆజ్ఞాపించెను. వారును అట్లే అని త్వరగా వారివారి పనులలో ఉండిరి. లక్ష్మణుడు శ్రీరామసన్నిధికి వచ్చి నమస్కరించి, సాదరముగా, “స్వామీ! రఘుకుల స్వామీ! ఇప్పుడే ఉద్యానవన ప్రయాణమునకు సమయమైయున్నది. నీకును, వదినకును ఎట్టివాహనమును సిద్ధపరచునది?” అని సున్నితముగా అడిగెను. అందుకు శ్రీరాముడు సీతాదేవిని అడిగి, తనకును ఆమె చెప్పినట్లే రుచించగా,“పల్లకీలను సిద్ధపరచునది,” అని ఆజ్ఞను ఇచ్చెను.

హేమతంతూద్భవైర్వస్త్రైః సర్వత్ర వేష్టితే శుభే ।
ఆనయామాస దూతైః సన్ముక్తాజాలవిరాజితే ॥ 33

ఆరురోహాథ శ్రీరామః శిబికాం పరయా ముదా ।
తతః సీతా పాండురాంగీ పరిమేయవిభూషితా ॥ 34

కృశాంగయష్టిర్దాసీభిర్దత్తహస్తా యయౌ శనైః ।
శిబికామారురోహాథ పృష్ఠలగ్నోపబర్హణా ॥ 35

దాసీభిర్వీజితా చాపి ధృతార్యోఽంకోపబర్హణా ।
దధార శిబికామారురోహాథ పృష్ఠలగ్నోపబర్హణా ॥ 36

విగుంఫితం చ ముక్తాభిః సీతా స్వీయకరేణ తమ్ ।
ముక్తాజాలగవాక్షైశ్చ పశ్యంతీ సా ముహుర్ముహుః ॥ 37

రాజమార్గగతాన్యేవ కౌతుకానీ సమంతతః ।
దదర్శ నృత్యం వేశ్యానాం సఖీభిః పరితో వృతా ॥ 38

తతస్తే బాంధవాః సర్వే బంధుపత్న్యశ్చమాతరః ।
శిబికాసూపసంవిష్టా దివ్యాసు చ పృథక్ పృథక్ ॥ 39

అగ్రే తే భ్రాతరః సర్వే తతః సర్వాశ్చ మాతరః ।
సీతాద్యాః బంధుపత్న్యశ్చ సర్వేషాం పురతో గురుః ॥ 40

ఏవం తే ప్రయయుః సర్వే పశ్యంతో రాఘవం ముహుః ।
ననృతుర్వారనార్యశ్చ నేదుర్వాద్యాన్యనేకశః ॥ 41

తుష్టువ్వందినః సర్వే సీతాం చ రఘునాయకమ్ ।
ఏవం నానాసముత్సాహైరారామం స యయౌ ముదా ॥ **42**

రాఘవః సీతయా యుక్తః సైన్యైః సర్వత్ర వేష్టితః ।
వివేశ వాసోగేహే స ససీతో రఘునందనః ॥ **43**

వాసో గేహేషు సర్వే తే తస్థుః పౌరాః సమంతతః ।
హట్టా సమంతతశ్చాసన్ననృతుర్వారయోషితః ॥ **44**

వాసోగేహస్య సీతాయా భిత్తయో వస్త్రనిర్మితాః ।
పంచక్రోశమితాయామాశ్చాసన్ విస్తారతోఽపి చ ॥ **45**

శ్రీరాముని మాటను విన్న లక్ష్మణుడు బంగారుతో నేయబడిన పరదాలతో శృంగారింపబడి, బంగారు, రత్న, ముత్యముల మాలలతో దేదీప్యమానముగా ఉండు రెండు పల్లకీలను తెప్పించెను. శ్రీరాముడు సంతోషముతో ఆ పల్లకిని ఎక్కెను. అంత ఆ పాండురాంగియగు జానకీదేవి తనకు తగిన ఆభరణములను ధరించెను. దాసీలు చేతులు అందించు చుండగా హస్తలాఘవములతోడ తిన్నగా వచ్చి పల్లకిని ఎక్కి, ఒరగుదిండును ఆనుకుని, తొడదిండ్లను అందుకుని, దాసీజనులు సేవించుచుండగా పల్లకిలోని ముత్యాలసరములతో, సువర్ణ గుచ్ఛమును తన చేతితో పట్టుకుని, ముత్తెములచే ఏర్పరచిన గవాక్షములనుండి రాజమార్గములోని వేడుకలను అడుగడుగునకు చూచుచు, నడుమనడుమ నర్తనములను చూచుచుండెను. అట్లే లక్ష్మణాది సోదరులు తమతమ భార్యలతో పల్లకీలను ఎక్కి, వైభవముగా మొదట వెడలిరి. వారి వెనుక తల్లులు వెడలిరి. అందరికి ముందర వశిష్ఠులవారు వెళ్ళుచుండిరి. ఇట్లు వారందరును శ్రీరాముని దర్శించుచు వెళ్ళుచుండిరి. వారకాంతలు నాట్యమాడుచుండిరి. వాద్యములు మ్రోగుచుండినవి. వందిమాగదులు శ్రీసీతారాములను పొగడుచుండిరి. ఇట్లు వివిధ వినోదములను పరికించుచు, శ్రీరాముడు సైన్యములు చుట్టూబారి వచ్చుచుండగా ఆ దివ్యారామమున ప్రవేశించి, సీతమ్మతోడ ఒకరాజహంస దివ్యవస్త్రమందిరమున ప్రవేశించెను. ఆ పౌరులందరును అంతట వస్త్రగృహములో నిలిచిరి. ఎచట చూచినను తోటలో అంగడి బజారులు నిండియుండెను. వేశ్యానర్తనములు జరుగుచుండెను. సీతమ్మయొక్క వసనమందిరము విచిత్ర వస్త్రచిత్రితములగు గోడలచే ఒప్పబడు చుండెను. ఐదుక్రోసులు వెడల్పు గల తోటలో విహరించుచుండెను.

పంచక్రోశమితారామే యత్ర రేమే విదేహజా ।
దదర్శ జానకీ సమ్యగారామ నృపసౌఖ్యదమ్ ॥ 46

రసాలయం రసాలైస్తైరశోకైః శోకవారణమ్ ।
తాలైస్తమాలైర్హింతాలైః శాలైః సర్వత్ర శాలినమ్ ॥ 47

ఖపురైః ఖపురాకారం శ్రీఫలైః శ్రీఫలం కిల ।
గురుశ్రియం త్వగురుభిః కపిపింగం కపిత్థకైః ॥ 48

వనశ్రియః కుచాకారైర్లకుచైశ్చ మనోరమమ్ ।
సుధాఫలాసమారంభిరంభాభిః పరిభాషితమ్ ॥ 49

సురంగైశ్చాపి నారంగై రంగమంటపవచ్ఛ్రియః ।
వానీరైశ్చాపి జంబీరైర్బీజపూరైః ప్రపూరితమ్ ॥ 50

మందాందోలితకర్పూరకదలీదలసంజ్ఞయా ।
విశ్రామాయ శ్రమాపన్నానాహ్వయంతమివాధ్వగాన్ ॥ 51

పున్నాగ ఇవ పున్నాగపల్లవైః కరపల్లవైః ।
కలయంతమివాలోలైర్మల్లికాస్తబకస్తనమ్ ॥ 52

విదీర్ణదాడిమైః స్వాంతం దర్శయన్ననురాగవత్ ।
మాధవీధవరూపేణ శ్లిష్యంతమివ కాననే ॥ 53

ఉదుంబరైరవరగైరనంతఫలశాలిభిః ।
బ్రహ్మాండకోటిబిభ్రంతమనంతమివ సర్వతః ॥ 54

పనసైర్వనసాభైః శుకనాసైః పలాశకైః ।
ఫలాశనాద్విరహిణాం పత్రత్యక్తైరివావృతమ్ ॥ 55

కదంబవాదినో నీపాన్ద్దృష్ట్వా కంటకితైరివ ।
సమంతతో భ్రాజమానం కదంబకకదంబకైః ॥ 56

నమేరుభిశ్చ మేరోశ్చ శిఖరైరివ రాజితమ్ ।
రాజాదనైశ్చ మదనైః సదనైరివ కామినామ్ ॥ 57

**సమంతతః పటువటైరుచ్చైః పటకుటీకృతమ్ ।**
**కుటజస్తబకైర్భాతమధిష్టితబకైరివ ॥ 58**

**కరమర్దైః కరీరైశ్చ కరుజైశ్చ కదంబకైః ।**
**సహస్రకరవద్భాతమర్థిప్రత్యుద్గతైః కరైః ॥ 59**

సీతాదేవి– రాజసౌఖ్యప్రదమైన దివ్యారామమును చూచెను. ఆ వనము ఎట్టిదనిన రసాలములు అనబడే మామిడిచెట్లచే రసమునకు ఆలయముగా ఉండెను. శోకమును తొలగించే అశోక వృక్షములచే నిండి ఉండెను. తాటి, కానుగ, గిరుకతాడి వంటి చెట్లచే వ్యాపించినది. లోకమున గొప్పవగు పోకచెట్లు గలవు, బిల్వవృక్షములచే ఆవరింపబడినది. అడవికి పొగరును పెంచే అగరుచెట్లచే నిండి ఉండెను. కోతుల పిల్లలు ఆడుకునే వెలగ చెట్లు ఉండెను. వనస్త్రీ స్తనములను పోలిన గజనిమ్మపండ్లు ఘనములై ఉండెను. అమృతఫలములగు అరటిచెట్లు, సురంగ నారంగముల రంగమండపములును, గొప్పవైన ప్రభచెట్లును, శ్రేష్ఠమైన మాతులుంగములు, అలసినవారు విశ్రమించుటకై పిలచునట్లుండు ఆకులు కదలాడే కర్పూర కదళీచెట్లు, పచ్చని ఇగురులు గల పున్నాగ వృక్షములు, రాగాస్యములను చూపుచున్న వన్నట్లు విసిరిన పండ్లచే నిండియుండు దానిమ్మ చెట్లును, నిమ్మచెట్లును, వసంతమల్లికలచే అల్లుకొనబడి మేఘముల నందుకొనుచుండు మేడిచెట్లును, అడవికి ముక్కుపుడకలవంటి పనసచెట్లును, చిలకముక్కువంటి పూలు కలిగిన విరహుల, పత్ర హీనములైన పలాశ వృక్షములును, కదంబమనే పేరు కలిగిన కడిమిచెట్లు, కంఠకీతములగు కడపచెట్లు, మేరుశిఖరములవంటి ఆమేరు వృక్షములు, ప్రియాశ్రయములగు ప్రియాళు వృక్షములు, కామిసదనములైన మదనవృక్షములు, పందిరివంటి పటువృక్షములును, కొంగలకు ఇష్టమైన కొండమల్లెలును, కలివెచెట్లును, వేణుతురు చెట్లును, కానుగ చెట్లు గలవు.

**నీరాజితమివోద్దీపై రాజచంపకకోరకైః ।**
**సపుష్పశాల్మలీభిశ్చ జితపద్మాకరశ్రియమ్ ॥ 60**

**క్వచిచ్ఛలదలైరుచ్చైః క్వచిత్కాంచనకేతకైః ।**
**కృతమాలైర్నక్తమాలైః శోభమానం క్వచిత్ క్వచిత్ ॥ 61**

**కర్కన్ధుబంధుజీవైశ్చ పుత్రజీవైర్విరాజితమ్ ।**
**సతిందుకేంగుదీభిశ్చ కరుణైః కరుణాలయమ్ ॥ 62**

గలన్మధూకకుసుమైర్ధారారూపధరం హరమ్ ।
స్వహస్తముక్తముక్తాభిరర్చయంతమివానిశమ్ ॥ 63

సర్జార్జునాంజనైర్భూర్జైర్వ్యజనైర్వ్యజ్యమానవత్ ।
నారికేళైః సఖర్జూరైర్ధృతచ్ఛత్రమివాంబరైః ॥ 64

అమందైః పిచుమందైశ్చ మందారైః కోవిదారకైః ।
పాటలాంతింతిణీఘోటాంశాఖోటైః కరహాటకైః ॥ 65

ఉద్దండైశ్చాపి శేహుండైర్గండపుష్పైర్విరాజితమ్ ।
వకులైస్తిలకైశ్చైవ తిలకాంకితమస్తకమ్ ॥ 66

అక్షైః ప్లక్షైః సల్లకీభిర్దేవదారుహరిద్రుమైః ।
సదాఫలసదాపుష్పవృక్షవల్లివిరాజితమ్ ॥ 67

ఏలాలవంగమరిచకులంజనవనావృతమ్ ।
జంబ్వామ్రాతకభల్లాతశేలుశ్రీపర్ణివర్ణితమ్ ॥ 68

శాకశంఖవనం రమ్యం చందనై రక్తచందనైః ।
హరీతకీకర్ణికారధాత్రీవనవిభూషితమ్ ॥ 69

ద్రాక్షావల్లీనాగవల్లీకర్ణవల్లీశతావృతమ్ ।
మల్లికాయూథికాకుందమదయంతీసుగంధితమ్ ॥ 70

తులసీవృక్షఖండైశ్చ శిక్ష్వగస్తిద్రుమైర్యుతమ్ ।
భ్రమద్భ్రమరమాలాభిర్మాలతీభిరలంకృతమ్ ॥ 71

అలిచ్ఛాలాగతం కృష్ణం గోపీ రంతుమనేకశః ।
సుగంధవాతం సుఖదం కామసంజనకం పరమ్ ॥ 72

నానామృగగణాకీర్ణం నానాపక్షినినాదితమ్ ।
నానాసరిత్సరః స్రోతైః పల్వలైః పరితో వృతమ్ ॥ 73

ఉత్సృజంతమివార్ఘం వై పతత్పుష్పైరితస్తతః ।
కేకికేకారవైర్దూరాత్కుర్వంతం స్వాగతం కిల ॥ 74

**ఏతాదృశం హ్యుపవనం జానకీ తద్దదర్శ సా ।**
**తుష్టాఽభూద్దర్శనేనైవ విచచార త్వితస్తతః ॥ 75**

**ఇతి శ్రీశతకోటిరామచరితాంతర్గతే శ్రీమదానందరామాయణే, వాల్మీకీయే, ఆదికావ్యే, జన్మకాండే నామ ప్రథమః సర్గః ॥**

రాజచంపక వృక్షములు, కమలాకరములను పోలు కుసుమిత శాల్మివృక్షములు, తమాల వృక్షములు, బంగారములా మెరిసే కేతకీ వృక్షములు, గంగిరేగు చెట్లు, చందన, రక్తచందన, తిందుక, బంధుజీవక, పుత్రజీవక వృక్షములు, గారచెట్లు, కరుణాలయమున తరుణ జంబీరములును, శివుని అర్చించు కుసుమాలు, ఇప్పచెట్లును, ఆకాశ గొడుగులవంటి ఖర్జూర వృక్షములు, విసనకఱ్ఱల వలే వీచుచుండునట్టి కొబ్బరివృక్షములు, మద్దిచెట్లు, వెంగిస, కరక, ఉసిరి, వేప, చింత, నేరేడు, మామిడి, జీడి, నల్లతుమ్మ చెట్లును, పారిజాత వృక్షములును, దేవకాంచన వృక్షములును, ఘోట, కరహాట, పాటల వృక్షములు, ఉద్ధండ, శేహుండములు, అక్ష ప్లక్షాలు, తిలక, వకుళవృక్షములు, ఉల్లసత్సకి వృక్షములును, అదేవిధముగా ఎప్పుడూ పూలనుపూచే చెట్లు, ఎప్పుడూ పండ్లను కాచే పండ్లచెట్ల సమూహాలు రారాజించుచుండెను. యాలక, లవంగ, మరీచ, జాజి పూవులచే పరిమళించు చుండెను. మరియు ఆరామము, తులసీవన పరిశుద్ధ ద్రాక్షాలతలు, పిప్పలీలతలు, మల్లికాలతలు, నాగవల్లీ లతలు, పెద్దగోరంటలు నిండి ఘుమఘుమలాడుచుండెను. గోపీవృక్షములు అనబడు నల్లసుగంధ, పాలచెట్లలో నల్లని తుమ్మెదలు ఆడుచుండ కృష్ణక్రీడను అనుకరించునట్లుండును. వివిధ వృక్షములును, వివిధ పక్షులును, వివిధ సరస్సులను విలాస ప్రదములై ఉండెను. అంతట పడియ కుంటలు ఇటునటు పూలురాలియున్నవి. భూరి దక్షిణలను పారజల్లినట్లుండెను. నెమళ్ళు కేకలు వేయు చుండినవి. దూరమునుండి వచ్చువారికి స్వాగతములు పలుకునట్లు ఉండెను. ఇట్టి దివ్యమందిరమున నిరీక్షించుచునే, పరితుష్టయగు జానకీదేవి ఇటునటు సంచరించుచు, సంతోషించుచుండెను.

***ఈ విధముగ శ్రీమద్వాల్మీకి మహర్షిచే రచింపబడిన, శ్రీశతకోటిరామచరితాంతర్గత శ్రీమత్ ఆనందరామాయణములో, ఐదవదైన జన్మకాండలో 1వ సర్గ ముగిసినది.***



# ద్వితీయః సర్గః-2వ సర్గ

శ్రీసీతారాములు ఉద్యానవనములో విహరించుట.

శ్రీరామదాస ఉవాచ

అథ సీతా రాఘవేణ రమ్యోపవనభూమిషు ।
క్రీడాశ్చకార వివిధాస్త్రైదశైరపి సంస్తుతాః ॥ 1

కదా వనాంతః ప్రాసాదే కదా వస్త్రైగృహేష్వపి ।
కదాఽఽమ్రవృక్షచ్ఛాయాయాం కదా పుష్పవనేషు సా ॥ 2

కదా సా జలయంత్రాణాం సమీపస్థవరాసనే ।
కదా సరోవరతటే కదా నద్యాస్తటేఽపి చ ॥ 3

నౌకాస్థా సరయూతోయే సా రామేణాకరోత్కదా ।
కదా రాత్రౌ జలక్రీడాం సా దివాఽపి కదా ముదా ॥ 4

కదా తటాకే నౌకాస్థా కదా రంభావనేషు సా ।
కదా వృక్షోర్ధ్వగేహేషు కదోశీరగృహేష్వపి ॥ 5

కదా సా సరయూనద్యాం నిర్మితేషు గృహేషు వా ।
కదా కృత్రిమగేహేషు పుష్పగేహేషు సా కదా ॥ 6

కదా సా చిత్రశాలాయాం పుష్పకే వా కదా ముదా ।
కదా సా కేతకీషండే కదైకస్తంభసద్మని ॥ 7

కదా నౌకోర్ధ్వగేహస్థా సరయ్వాః సైకతే కదా ।
ఏకస్తంభోర్ధ్వగేహేఽపి సఖీభిః పరివేష్టితా ॥ 8

కదా రామేణ రహసి కదా దోలకసంస్థితా ।
పర్యంకచక్రమధ్యస్థా కదా సా దాడిమీవనే ॥ 9

వృక్షసంబద్ధపర్యంకసంస్థితా రాఘవేణ హి ।
చకార సా కదా క్రీడాం పాండురాంగీ పృథూదరీ ॥ 10

**హరిద్వస్త్రైయుతారక్తకందుక్యా జానకీ బభౌ ।**
**గోపయిత్వా నిజం దేహం సీతా వృక్షదళైర్ఘనైః ॥ 11**

**చకార వ్యాకులం రామం వినోదేన స్మితాననా ।**
**జ్ఞాత్వాత్మానం రాఘవేణ తుష్టాం సమ్యగ్వివిచ్య చ ॥ 12**

## సీతాదేవియొక్క క్రీడావర్ణనము.

అపుడు జానకీదేవి శ్రీరామునితో కలసి దేవతలచే కీర్తింపబడుతూ, క్రీడలను అనుభవించు చుండెను. ఒకప్పుడు తోటలోను, అరుగుమీదను, ఒకప్పుడు వస్త్రముతో చేసిన గృహమున, ఒకప్పుడు మామిడిచెట్టుక్రిందను, ఒకప్పుడు పూలతోటలోను, ఒకప్పుడు జలయంత్రములవద్ద, దివ్యపీఠముల మీదను, ఒకప్పుడు కొలనుగట్లుమీద, ఒకప్పుడు నదీతీరముయందును, ఒకప్పుడు సరయూలోని పడవమీదను, సీతమ్మ శ్రీరామునితో క్రీడించుచుండెను. ఒకప్పుడు రాత్రి జలక్రీడలను, ఒకప్పుడు పగటి జలక్రీడలను ఆడుచు, ఒకప్పుడు చెరువులోని పడవమీదను, ఒకప్పుడు అరటితోటలోను, ఒకప్పుడు వృక్షాగ్ర మందిరమునను, ఒకప్పుడు వట్టివేరు మేడలోను, ఒకప్పుడు సరయూనదిలో నిర్మించిన గృహములోను, ఒకప్పుడు కృత్రిమ గృహములోను, ఒకప్పుడు పూలఇండ్లలోను, ఒకప్పుడు చిత్రశాలలోను, ఒకప్పుడు పుష్పకవిమానమున, ఒకప్పుడు మొగలిరేకుల మందిరమునను, ఒకప్పుడు స్తంభగృహమునను, ఒకప్పుడు నావమీద మేడలోను, ఒకప్పుడు సరయూనది ఇసుకదిబ్బలమీదను, ఒకప్పుడు సఖులతోడ ఒంటిస్తంభపు మేడమీదను, ఒకప్పుడు రహస్యముగా శ్రీరామునితో అరుగు మీదను, ఒకప్పుడు దానిమ్మతోటలోని అరుగు మధ్యమునను, ఒకప్పుడు తరునిబద్ధ పర్యంకమునను ఇట్లు వివిధ స్థలములలో పాండురాంగియగు, భూ పుత్రిక అగు జానకమ్మ యథాసుఖముగా క్రీడించుచుండెను. సీతమ్మ పసుపు చీరెను, ఎఱ్ఱని రవికను తొడిగి ప్రకాశించు చుండెను. ఒకప్పుడు సీతాదేవి లేచి పచ్చని లేత చిగుర్లచే ఆచ్ఛాదితయై మరుగున ఉండి నవ్వుచు, శ్రీరాముని ఆటపట్టించుచుండెను.

**దుద్రావ సంభ్రమాద్రామం తత్కంఠే దోర్లతేఽకరోత్ ।**
**ఏవం సీతారాఘవయోః క్రీడనం పరమాద్భుతమ్ ॥ 13**

**విస్తరేణేహ కో వక్తుం సమర్థః పృథివీతలే ।**
**ఏక ఏవ సమర్థోఽభూద్వాల్మీకిర్మునిసత్తమః ॥ 14**

శతకోటిమితం యేన చరితం వర్ణితం తయోః ।
పారం సారం మయా యస్మాద్వివిచ్య త్వం ప్రవర్ణ్యతే ॥ 15

వారస్త్రీణాం కదా నృత్యం సీతాఽఽరామే దదర్శ సా ।
కదా శుశ్రావ వాద్యాని మంజులాని మహాంతి చ ॥ 16

కదా చిత్రకథా రమ్యాశ్చేంద్రజాలాని వా కదా ।
కదా వంశారోహణాదికౌతుకాని దదర్శ సా ॥ 17

కదా స్తంభోద్భవం దివ్యం దదర్శ కౌతుకం మహత్ ।
కదా కలానాం కౌశల్యం సూత్రబంధైర్వినిర్మితమ్ ॥ 18

కదా కృత్రిమహత్స్యాది నానారూపాణి వై పతేః ।
సీతా దదర్శ కుశలైర్ధృతాన్యాత్మయుతాన్యపి ॥ 19

ఏవం సీతాఽఽరామమధ్యే మాసమేకం నినాయ సా ।
యయౌ రామేణ నగరీం నృత్యగీతాదిభిః శనైః ॥ 20

సౌధస్థాభిః పురస్త్రీభిర్వర్షితా కుసుమాదిభిః ।
నీరాజితా కుంభదీపైర్దీపైర్దధ్యోదనోద్భవైః ॥ 21

మాషతైలసర్షపాద్యైర్నానాబలిభిరాదరాత్ ।
యయౌ నిజగృహం సీతా రాఘవేణ సమన్వితా ॥ 22

ఏవం నానాకౌతుకైశ్చ నానాదోహదపూరణైః ।
రామస్తాం రంజయామాస సాఽపి రామం స్వలీలయా ॥ 23

షష్ఠే మాసే త్వథ ప్రాప్తే సీతయా రాఘవో ముదా ।
సీమంతోన్నయనం చైవ వసిష్ఠేన చకార సః ॥ 24

తన్ను శ్రీరాముడు కనుగొనగానే పరుగెత్తివచ్చి, కంఠాలింగనములు ఇచ్చుచుండెను. ఇట్టి శ్రీసీతారాములయొక్క దివ్యక్రీడను అభివర్ణించుటకు భూమిపై ఎవ్వరు నేర్పరులు? శతకోటి రామాయణమును చెప్పిన మునిశ్రేష్ఠుడగు వాల్మీకి ఒక్కడే సమర్థుడు. దానిలోని సారమైన

కొన్నిసంగతులను మాత్రము నేను వివరించుచున్నాను. దివ్యారామమున సీతాదేవి ఒకప్పుడు వారకాంత చేయు నృత్యమును చూచుచుండెను. ఒకప్పుడు దివ్యమనోహర మహావాద్యమును ఆలకించుచుండును. ఒకప్పుడు మంజుల సత్కథలను ఆకర్ణించుచుండును. ఒకప్పుడు ఇంద్రజాల, మహేంద్రజాలాది క్రీడను, దొమ్మరాట మొదలైన ఆటలను చూచుచుండును. ఒకప్పుడు గడమీది వినోదమును నిరీక్షించును. ఒకొక్కప్పుడు దారాలచే కట్టబడిన చేతిపనుల నేర్పరితనమును విలోకించును. ఒకప్పుడు నేర్పరులు ఏర్పరచిన తన పతియొక్క కృత్రిమ మత్స్య, కూర్మాది, సజీవరూపములను పరికించును. జానకమ్మ ఆరామ మధ్యమున ఒక నెల గడిచిన వెనుక శ్రీరామునితో అయోధ్యానగరమునకు పోయి, తిన్నగా నృత్య, గీతాది, వాద్యములతో, ఊరివేడలమీది పురపురంధ్రులు వసించుచుండు పుష్పకముల తోను, దివ్యనీరాజములతోను, కుంభదీప పెరుగన్నపు నివాళికలతోను, నువ్వుల, సర్షపాది బలి ప్రదానముల తోను నిజరాజమందిరమునకు వచ్చి చేరెను. ఇట్లు శ్రీరాముడు వివిధ కౌతూహలములచే నానా దోహద పూరణములచే సీతను రంజింపజేసెను. ఆమెయును స్వలీలచే శ్రీరాముని ఆనందపరచుచుండెను. (23) పిదప సీతాదేవికి ఆరవమాసము రాగానే శ్రీరాముడు అత్తమామలగు సుమేధ, జనకులను సాదరముగా పిలిపించెను.

**సుమేధాం జనకం చాపి సమాహూయాదరేణ హి ।**
**దదౌ దానాన్యనేకాని బ్రాహ్మణేభ్యో రఘూత్తమః ॥ 25**

**జనకః పూజయామాస రామం స్త్రీబంధుసంయుతమ్ ।**
**కౌసల్యాదీంశ్చ సాకేతవాసినో వసనాదిభిః ॥ 26**

**పౌరాశ్చ సుహృదః సర్వే భోజనార్థం విదేహజామ్ ।**
**స్వస్వగేహం పృథగ్నిన్యుః శ్రీరామాదిభిరుత్సవైః ॥ 27**

**నానావాద్యనినాదైశ్చ వారస్త్రీనృత్యగాయనైః ।**
**స్త్రీముక్తపుష్పవర్షాభిర్నానాకౌతుకదర్శనైః ॥ 28**

**నానాదేశనివాసిన్యః కోటీశస్తా నృపస్త్రియః ।**
**సమాజగ్మురయోధ్యాయాం సీతాం ద్రష్టుం ముదాన్వితాః ॥ 29**

**తాసాం సైన్యైశ్చ సర్వత్ర వేష్టితా నగరీ బభౌ ।**
**తాః సర్వా నృపపత్న్యశ్చ సీతాయాః పరమాన్ వరాన్ ॥ 30**

దోహదాన్ పూరయామాసుర్దివ్యాన్నాదిభిరాదరాత్ ।
దదుర్వస్త్రాణ్యలంకారాత్ దివ్యాంశ్చిత్రవిచిత్రతాన్ ॥ 31

స్వస్వదేశోద్భవైర్దివ్యైర్నానావస్తుభిరాదరాత్ ।
జానకీం పూజయామాసుస్తాః సర్వాః పార్థివస్త్రియః ॥ 32

స్థిత్వా తా మాసమేకం తు జగ్ముర్దేశం నిజం నిజమ్ ।
అథైకదా తు శ్రీరామః సుమేధాం జనకం తథా ॥ 33

సీతాయాః పురతః ప్రాహ గుహ్యం రహసి హృత్స్థితమ్ ।
సీతామదృష్ట్వా సాన్నిధ్యే క్షణాచ్చ విరహేణ తామ్ ॥ 34

మయాఽఽగత్య తన్ముఖేందుసుధయా స్వాస్థ్యమాప్యతే ।
ఆత్మానం విహ్వలం దృష్ట్వా సీతాసాన్నిధ్యమాశ్రయే ॥ 35

అధునా జానకీం దృష్ట్వా కామో మేఽతీవ బాధతే ।
పంచమాస్యోర్ధ్వతః సంగం గర్హయంతి మునీశ్వరాః ॥ 36

## సీతమ్మ ఆరునెలల గర్భిణియైనపుడు సీమంతము

జనక సుమేధ దంపతులు బ్రాహ్మణాదులచే పరివృతులై, వసిష్ఠుడు చెప్పిన విధానమున సీతమ్మకు సీమంతకర్మను ఆచరించిరి. విప్రులకు వివిధ దానధర్మములను చేసిరి. జనకమహారాజు శ్రీసీతారాములను, లక్ష్మణాదులను, కౌసల్యాదులను, పౌరులను కూడా వస్త్ర, పాత్రాది సత్కారములచే పూజించెను. పుర ప్రముఖులు, మిత్రులు తమతమ ఇండ్లకు సీతమ్మను శ్రీరామాదులతోడ వేరువేరుగా భోజనమునకు సమస్తవిభవములతోడ గొనిపోయి సత్కరించి పంపుచు వచ్చిరి. నానాదేశములనుండి రాజస్త్రీలు సంతోషయుక్తులై సీతాదేవిని చూచుటకు అయోధ్యకు వచ్చిరి. ఆయా రాజులయొక్క సైన్యములతో నిండిన నగరము మనోహరముగా ఉండెను. ఆ రాజస్త్రీలు అందరును సీతమ్మను దివ్యాన్నాది సత్కారములచే తమతమ దేశములలోని దివ్యవస్తువులచే వస్త్రాభరణ అలంకారాదులచేతను సత్కరించి, వేవిళ్ళను పూర్తిచేయు చుండిరి. ఇట్లువారందరును ఒకనెలవాసముచేసి, సీతను సేవించి, తమదేశమునకు జనిరి. (33) తరువాత ఒకనాడు శ్రీరాముడు సీత యెదుట సుమేధ, జనకులతో "నేను క్షణకాలమైనను సీతను చూడకయుండలేను. వెంటనే వచ్చి ఆమె మోము చంద్రుని

అమృతమువలన సుస్థితుడగుచుందును. నా మనస్సు కలతనందుట తెలిసి సీతాసన్నిధిని ఆశ్రయించెదను. ఇపుడు సీతనుజూచి నాకు కామమధికముగా బాధించుచున్నది. ఐదునెలలు నిండిన తరువాత సంగమమును మునీంద్రులు నిందించెదరు.

ప్రసూత్యగ్రే పంచమాసైః స్త్రీ స్వాస్థ్యం ప్రాప్యతే పునః ।
పంచమాసైర్వినా సంగాద్దంపత్యోః క్షీణతేరితా ॥ 37

అత్ర కిం కరణీయం హి వద త్వం శ్వశురాద్య మామ్ ।
చేత్ప్రేషణీయా సీతేయం మిథిలాం ప్రతి వై మయా ॥ 38

తర్హి తత్రాపి మే గంతుం భవిష్యతి సముద్యమః ।
కించిత్కాలం తు సీతాయా వియోగో యేన మే భవేత్ ॥ 39

ఉపాయః స విధాతవ్యశ్చింతితోఽస్తి మయోఽపి చ ।
లోకాపవాదభీత్యాఽహం రజకోక్తచ్ఛలాదపి ॥ 40

గంగాయా దక్షిణే తీరే వాల్మీకేరాశ్రమే శుభే ।
త్యజామి జానకీం శుద్ధాం కించిత్కాలాంతరాత్పునః ॥ 41

ఏనాం సమానయిష్యామి ప్రత్యయం మాం ప్రదాస్యతి ।
తతోఽనయా చిరం కాలం నానాభోగాన్ భజామ్యహమ్ ॥ 42

జనకాద్య త్వయా తత్ర నిజపత్న్యా సుమేధయా ।
వాల్మీకేరాశ్రమే గత్వా స్థేయం వర్షాణి పంచ వై ॥ 43

తథేత్యంగీచకారాథ జనకోఽపి సుమేధయా ।
సీతాఽప్యంగీచకారాథ విహస్య తద్వచః పతే ॥ 44

అథ రామో దదావాజ్ఞాం సస్త్రియం జనకం ముదా ।
స గత్వా మిథిలారాజ్యే స్వీయం సంస్థాప్య మంత్రిణమ్ ॥ 45

యయౌ సుమేధయా శీఘ్రం వాల్మీకేరాశ్రమం ముదా ।
కించిద్దాసీదాససైన్యవాజివారణవేష్టితః ॥ 46

నానోపచారాన్ సీతార్థం సంగృహ్యా శకటాదిభిః ।
చకార గేహం విపులం వాల్మీకేశ్చ సుఖావహమ్ ॥ 47

సర్వసంపత్తిసంయుక్తం బహుగోమహిషీయుతమ్ ।
పూరితం ధాన్యసంఘైశ్చ వస్త్రైరాభరణాదిభిః ॥ 48

కాసారోపవనారామపుష్పవాటిశతావృతమ్ ।
గవాక్షైశ్చంద్రకాంతానాంకపాటైశ్చ సమన్వితమ్ ॥ 49

మరలా కనిన వెనుక ఐదుమాసములు స్త్రీ స్వాస్థ్యమునందుచుండును. ఐదు నెలలు కాకనే సంగమించుట దంపతులకు హానికరము. మామగారు! ఇచట నేనేమీ చేయవలయును? శెలవియ్యండి? మిథిలకు సీతను పంపించినను, అచటకూడా నేనువచ్చి చేరునట్లు అవకాశముండును. కొంతకాలము వరకు సీతావియోగమును నేను భరించవలసియున్నది. కనుక నేను ఒక ఉపాయమును ఆలోచించియున్నాను. ఏమనిన– నేను లోకాపవాద భీతివలనను, చాకలివానిమాట నెపముమీదను, గంగానదీ దక్షిణతీరమునందలి వాల్మీకియొక్క దివ్యాశ్రమమున పరిశుద్ధురాలగు జానకిని వదిలిపెట్టెదను. కొంతకాలమైన తరువాత మరలా పిలిపించెదను. నాకు ఆమె నమ్మకము నీయగలదు. పిదప నీమెతోడ చిరకాలము వివిధ భోగములను అనుభవించెదను. జనకరాజా! ఇపుడు నీవచట నీ పత్నియగు సుమేధాదేవితోడ వాల్మీకి ఆశ్రమమునకుపోయి ఐదు సంవత్సరములవరకు వసించవల యును," అని రహస్యముగా తన అభిప్రాయమును చెప్పెను. అట్లే అని సుమేధ తోడ జనకుడు అంగీకరించెను. భర్తమాటకు నవ్వుచు సీతాదేవియును సమ్మతించెను. అంత ఆ శ్రీరాముడు అత్తమామలకు ఆజ్ఞనిచ్చి సంతోషముతో పంపెను. ఆ జనకరాజు తన మిథిలా రాజ్యమున మంత్రిని సంస్థాపించి, సుమేధతో త్వరగా వాల్మీకి ఆశ్రమమునకు వెడలి, మితమైన దాసీదాస, సైన్య, గజ, తురగాది పరివారములతోను, సీతమ్మకొరకు వివిధ ఉపచారములకు కావలసిన సద్వస్తు పరిపూర్ణములగు బండ్లతో వాల్మీకిమహర్షి ఆశ్రమమును చేరి, అచట వాల్మీకి మునీంద్రునికి సుఖమును కలిగించు సమస్త ఐశ్వర్య సంపూర్ణమును గో, మహిష్యాది పశు సమృద్ధమును, ధాన్యపూరితమును, వస్త్రాభరణ అలంకృతములను, కొలనులు, తోటలు, పుష్పవాటికలు క్రీడారామములు గలదియును చంద్రకాంతామణి నిర్మిత గవాక్ష కవాటాది శిల్పరచనా చిత్రమును

కృష్ణాగరుసకర్పూరోశీరమాల్యాదిమోదితమ్ ।
కాంచనీశృంఖలాబద్ధరత్నపర్యంకమండితమ్ ॥ 50

హంసపారావతపికకేకీశుకనినాదితమ్ ।
ముక్తాగుచ్ఛవితానాద్యైః శోభితం చిత్రచిత్రితమ్ ॥ 51

ఏవం మనోహరం గేహం సీతార్థం జనకోఽకరోత్ ।
శ్రీః సాక్షాద్గంతుముద్యుక్తా యస్మిన్నివసితుం చిరమ్ ॥ 52

కిం దుర్లభం హి తత్రాస్తి వర్ణనీయం మయాఽద్య కిమ్ ।
యస్యా నేత్రకటాక్షేణ శక్రాదీనాం విభూతయః ॥ 53

వాల్మీకయే సర్వవృత్తం జనకోఽపి న్యవేదయత్ ।
మునిశ్చాప్యతిసంతుష్టో మేనే స్వతపసః ఫలమ్ ॥ 54

**ఇతి శ్రీశతకోటిరామచరితాంతర్గతే, శ్రీమదానందరామాయణే, వాల్మీకీయే ఆదికావ్యే, జన్మకాండే నామ, ద్వితీయః సర్గః ॥**

పరిమళద్రవ్యములు, అగరుబత్తులు, బంగారు మంచములు, భోగసామాగ్రులచే నిండిన వస్తువులు, చిలుకలు, నెమళ్ళు, కోయిలలు, పావురములు, హంస మొదలగు సత్ పక్షి గణ కలకలములచే, మనోహరమును, వివిధ చిత్రాలంకార రమణీయమగు విశాల రాజమందిరములను, కట్టించి పెట్టెను. ఎవరియొక్క కడగంటి చూపుచే ఇంద్రాదులకు దివ్య ఐశ్వర్యములు కలుగునో అట్టి సాక్షాత్ లక్ష్మియే ప్రత్యక్షముగా పోయి చిరకాలము వసింపదగిన సీత కొరకై సేవించిన ఆ దివ్యమందిరమున దేనికి కొరతగలదు? నేను ఏమని వర్ణింపను? ఆ జనకమహారాజు వాల్మీకి మహర్షికి సమస్త వృత్తాంతమును తెలిపెను. మునీంద్రుడు సంతోషించి సీత రాకను తన తపోఫలముగా ఎంచెను.

*ఈ విధముగ శ్రీమద్వాల్మీకి మహర్షిచే రచింపబడిన, శ్రీ శతకోటిరామచరితాంతర్గత శ్రీమత్ ఆనందరామాయణములో, ఐదవదైన జన్మకాండలో 2వ సర్గ ముగిసినది.*



# తృతీయః సర్గః-3వ సర్గ

## సీతాదేవి వాల్మీకి ఆశ్రమమునకు వెళ్ళుట.

**శ్రీరామదాస ఉవాచ**

**అథ రామం తు కౌసల్యాఽబ్రవీద్రహసి సంస్థితా ।**
**సీతాం సీమోల్లంఘనార్థం శీఘ్రం ప్రేషయ రాఘవ ॥ 1**

**తన్మాతుర్వచనం శ్రుత్వా తథేత్యుక్త్వా సవిస్తరాత్ ।**
**స లక్ష్మణో నిజామంబాం ప్రాహ యన్మంత్రితం పురా ॥ 2**

**వాల్మీకేరాశ్రమే సీతాత్యాగాది చ సకారణమ్ ।**
**అథ మాసేఽష్టమే ప్రాప్తే రామో రాజీవలోచనః ॥ 3**

**ఏకాంతే జానకీం ప్రాహ వీజితో లక్ష్మణేన హి ।**
**కల్పయిత్వా మిష దేవి రజకోక్తం త్వదాశ్రయమ్ ॥ 4**

**త్యజామి త్వాం వనే లోక వాదాద్భీత ఇవాపరః ।**
**త్రిమాసాత్పంచమాసాద్వా సప్త మాసాత్సుబుద్ధిభిః ॥ 5**

## శ్రీసీతారాముల రహస్యాలోచన.

శ్రీరామదాసు ఇట్లు చెప్పుచున్నాడు, "అటుపిమ్మట ఒకనాడు కౌసల్యాదేవి శ్రీరామునితో, "శ్రీరామభద్రా! సీతమ్మను సీమోల్లంఘనకై త్వరగా పంపుము," అని రహస్యముగా వార్త పంపెను. ఆ తల్లిమాటలను విని లక్ష్మణునితో శ్రీరాముడు కౌసల్యకు 'యే కారణముమీద సీతను వాల్మీకి ఆశ్రమానికి పంపబోతున్నదీ తెలియజేసెను. అంత సీతమ్మకు ఎనిమిదవనెల రాగానే లక్ష్మణుడు వీచుచుండగా రాఘవుడు ఏకాంతమున సీతతో, 'చాకలిమాటమీద నెపము కల్పించి, లోకోపవాదభీతి అన్నట్లు నిన్ను వనమునకు పంపుచున్నాను. మూడు నెలలనుండి గాని, ఐదు నెలలనుండి గాని, తుదకు ఏడునెలలు నిండిన గర్భిణితో సంగమింపరాదు.

**అంతర్వత్నీ న గమ్యేతి శాస్త్రాజ్ఞాం రజకచ్ఛలాత్ ।**
**త్వాం త్యక్త్వా పాలయిష్యామి నికటే వస్తుమక్షమః ॥ 6**

త్వాం దృష్ట్వా చంద్రవదనాం కామో మేఽతీవ బాధతే ।
త్వద్వియోగస్తు నిర్బంధాద్వినా మేత్ర కథం భవేత్ ॥ 7

తస్మాత్కృతోయం నిర్బంధః సత్యం విద్ధి మనోరమే ।
పంచవర్షానంతరేణ పునరాగత్య మేఽన్తికమ్ ॥ 8

లోకానాం ప్రత్యయార్థం త్వం శపథం హి కరిష్యసి ।
భూమేర్వివరమార్గేణ స్థిత్వా సింహాసనోపరి ॥ 9

యదా గచ్ఛసి పాతాలం జగత్యా పూజితా తదా ।
భువం స్తుత్వా భూషయిత్వా త్వామంకే స్థాపయామ్యహమ్ ॥ 10

పుత్రాభ్యాం చ మయా సీతే తతో భోగానవాప్స్యసి ।
మత్తస్త్వేకః కుశో జ్యేష్ఠస్తవ పుత్రో భవిష్యతి ॥ 11

మునస్తపఃప్రభావేణ భవిష్యత్యపరో లవః ।
వాల్మీకేరాశ్రమే చైవం కుమారౌ ద్వౌ భవిష్యతః ॥ 12

అగ్రే గత్వా చ త్వత్పుత్రౌ త్వద్యోగ్యం చ గృహాదికమ్ ।
ససుమేధేన సకలం కృతమస్తి మమాజ్ఞయా ॥ 13

కురుష్వాద్య మయా యత్త్వాముచ్యతే జనకాత్మజే ।
సాత్త్వికీ త్వం యథాపూర్వం దండకే గౌతమీతటే ॥ 14

మద్వామాంగే స్థితా యద్వన్మే వామాంగే వసాధునా ।
వాల్మీకేరాశ్రమే గన్తుం గుణద్వయవిమిశ్రితా ॥ 15

భూత్వా త్వమాశ్రమే స్థిత్వా మద్వియోగం ప్రదర్శయ ।
తత్రాపి త్వాం కుశోత్పత్తౌ దాస్యామి దర్శనం రహః ॥ 16

తథేతి రామవచనాజ్జానకీ సా స్మితాననా ।
రజస్తమోమయీం స్వీయాం ఛాయాం నిర్మాయ సాదరమ్ ॥ 17

“శాస్త్రమును గౌరవిస్తూ, రజకుని మాటను పరిపాలించెదను. నీ వద్ద ఉండదలచు కోవడంలేదు. చంద్రబింబమువంటి ముఖముగల నిన్నుజూచి కామమధికమగుచున్నది. నీ వియోగము భరించలేనిది. నీ మీద కోపము నాకెట్లు కలుగును? అందువల్ల కొంతకాలము నిన్ను నేను దూరముగా ఉంచదలచితిని. సత్యముగా వినుము. మనోహరిణి! ఐదు సంవత్సరములైన తరువాత మరలా నా సమీపమునకు వచ్చి, లోకమును మెప్పించుటకై శపథము చేయగలవు. భూమి నీకు దారి ఇవ్వగా సింహాసనముమీద కూర్చుని పాతాళమునకు ఎప్పుడు పోదువో అప్పుడు భూదేవిని స్తుతించి, జగత్పూజితవగు నీతో మళ్ళీ జీవించెదను. ఇద్దరు కుమారులతోను, నా తోను నీవు భోగములను అనుభవింపగలవు. నా వలన నీకు కుశుడు అను జ్యేష్ఠపుత్రుడు జన్మించగలడు. మునీంద్రుని తపః ప్రభావము వలన లవుడు అను పేరుగల మరియొక కుమారుడు జన్మించగలడు. వాల్మీకి ఆశ్రమముననే కుశ, లవులు జన్మించెదరు. మీ తండ్రి ముందుగా వెళ్ళి వాల్మీకి ఆశ్రమమున నీకు తగిన గృహాదులను సిద్ధపరిచియున్నాడు. మీ తల్లియును అచటనే వసించుచున్నది. అట్లుచేయుటకు నేను ఆజ్ఞాపించితిని. ఇపుడు నేను చెప్పినట్లు చేయుము. మునుపు దండకారణ్య గోదావరి తీరమున నీవు నా ఎడమ ప్రక్కలో వసించుచున్నట్లు ఇప్పుడును నా ఎడమభాగమున వసింపుము. వాల్మీకి ఆశ్రమమునకు పోవుటకై రజోగుణ, తమోగుణములు కలిసి వెళ్ళి, ఆ ఆశ్రమమున నా వియోగమును నటింపుము. అచట కుశుడు జన్మించినపుడు నీకు రహస్యముగా దర్శనమిచ్చెదను.” అని పలుకగా సీతాదేవి అట్లే కానిమ్మని నగుమోముతో సాదరముగా రజో, తమోగుణ కలయికతో నిజచ్ఛాయను నిర్మించి, శ్రీరాముని ఎడమభాగమున సత్త్వాలయమును ఆశ్రయించెను. (17)

**శ్రీరాఘవస్య వామాంగే సత్త్వరూపా లయం యయౌ ।**
**తతో రామః సభాం గత్వా రాత్రౌ జ్ఞానైకవిగ్రహః ॥ 18**

**మంత్రిభిర్మంత్రతత్త్వజ్ఞైర్దలముఖ్యైర్వయోధికైః ।**
**సమతతో వేష్టితః సంస్తస్థౌ సింహాసనోపరి ॥ 19**

**తత్రోపవిష్టం రాజానం సుహృదః పర్యుపాసిరే ।**
**హాస్యప్రాయకథాభిశ్చ హాసయన్తః స్థితాః ప్రభుమ్ ॥ 20**

**కథాప్రసంగాత్పప్రచ్ఛ రామో విజయనామకమ్ ।**
**పౌరా జనపదా వా మే కిం వదన్తి శుభాశుభమ్ ॥ 21**

సీతాం తాం మాతరం వా మే భ్రాతౄన్వా కైకయీమథ ।
న భేతవ్యం త్వయా బ్రూహి శాపితోఽసి మమోపరి ॥ 22

ఇత్యుక్తః ప్రాహ విజయో దేవ సర్వే వదన్తి తే ।
కృతం సుదుష్కరం కర్మ రామేణవిదితాత్మనా ॥ 23

తథాప్యేవం వదన్తి త్వాం జనాస్తత్తే వదామ్యహమ్ ।
కింతు హత్వా దశగ్రీవం సీతామావృత్య రాఘవః ॥ 24

అమర్షం పృష్ఠతః కృత్వా స్వవేశ్మ ప్రత్యపాదయత్ ।
కీదృశం హృదయం తస్య సీతాసంభోగజం సుఖమ్ ॥ 25

యా హృతా వీజనే పూర్వం రావణైన వనే తదా ।
అకస్మాదపి దుష్కర్మ యోషిత్స్వమర్షదం భవేత్ ॥ 26

యాదృగ్భవతి వై రాజా తాదృశ్యో నియతాః ప్రజాః ।
ఇతి నానావిధా వాచః ప్రవదంతి పురౌకసః ॥ 27

అన్యత్కించిత్ప్రవక్ష్యామి సాంప్రతం రజకోదితమ్ ।
దుర్మార్గగాం స్వరజకీం భార్యాం క్రోధవశేన సః ॥ 28

రజకః ప్రాహ భో రండే సోఽహం రామో న మైథిలీమ్ ।
రావణస్య గృహే స్పష్టం స్థితామంగీచకార యః ॥ 29

యథేచ్ఛం గచ్ఛ రండే త్వం నాహం రామవదాచరే ।
గచ్ఛతా చ మయా మార్గే రజకేన సమీరితమ్ ॥ 30

## శ్రీరాముడు లోకవార్తలను విచారించుట.

పిదప, జ్ఞానైక విగ్రహుడైన శ్రీరాముడు రాత్రి సభకువచ్చి, మంత్రి వర్యులు, పెద్దలు, సేనాప్రముఖులు అందరూ సమావేశమైయుండగా సింహాసనమును అలంకరించెను. ఇట్లు సింహాసనముపై కూర్చున్న శ్రీరాముని, సుహృత్తులు సేవించుచుండిరి. హాస్య వినోద సల్లాపములచే సభికులు ప్రభు మనోరంజకులై ఉండిరి. అపుడు శ్రీరాముడు కథాప్రసంగవశమున విజయుడు

అను పేరుగల వానితో, "ఊరివారు కానీ, దేశమువారు కాని, సీతను గురించికాని, నన్నుగూర్చిగాని, మా తల్లిని గూర్చిగాని, తమ్ములను ఉద్దేశించిగాని, కైకేయిని గురించిగాని ఏమనుకుంటున్నారు? అది మంచిగాని, చెడుగానీ నీవెంతమాత్రము వెఱువక చెప్పుము. నాయాజ్ఞను పాలించుము," అని అనెను. అపుడు విజయుడు, "మహాప్రభూ! అందరును నిన్నుగూర్చి– విజ్ఞాన నిధియగు శ్రీరాముడు దుష్కరమున మహాకార్యమును చేసెనని– చక్కగా పొగడుచున్నారు. ఐనా శ్రీరాముడు రావణాసురుని సంహరించి సీతను తెచ్చుకొని, వ్యభిచారి భావవిశేషరోషమును ప్రక్కనపెట్టి తనయింటచేర్చుకొనెను. మునుపు అరణ్యమున రావణుడు సీతను ఎత్తుకొనిపోయెను. సీతను కామదృష్టితో చూచిన అతని హృదయమెట్టిది? అకస్మాత్తుగా కలిగిన దుష్కర్మఅయినప్పటికీ స్త్రీలయందు వ్యభిచారి భావము ప్రచారమగును. రాజెట్టివాడగునో ప్రజలును తప్పక అట్టివారగుచుందురు. ఇట్లు నానా విధములుగా పౌరులు పలుకుచున్నారు. రజకుడు చెప్పిన మరో సంగతిని విన్నవించెదను. అది యేమనిన, ఆ రజకుడు దుర్మార్గురాలైన తన భార్యను జూచి, కోపముతో, "ఓసి నీచురాలా! రావణాసురుని ఇంటిలో వసించి వచ్చిన సీతను అంగీకరించిన ఆ రాముని వంటివాడిని నేను కాను. నీ ఇచ్చవచ్చినట్లు నీవు పొమ్ము. రామునివలే నేను ఉండలేను," అని అనెను.

**ఇతి రామ శ్రుతం పూర్వం త్వయా పృష్ట నివేదితమ్ ।**
**యత్పశ్యసి హితం చాత్ర తత్కురుష్వ రఘూత్తమ ॥ 31**

**శ్రుత్వా తద్వచనం రామః స్వజనాన్పర్యపృచ్ఛతాత్ ।**
**తేఽపి నత్వాఽబ్రువన్ రామమేవమేతన్న సంశయః ॥ 32**

**తతో విసృజ్య సచివాన్విజయం సుహృదస్తథా ।**
**ఆహూయ లక్ష్మణం రామో వచనం చేదమబ్రవీత్ ॥ 33**

**లోకాపవాదస్తు మహాన్సీతామాశ్రిత్య మేఽభవేత్ ।**
**సీతాం ప్రాతః సమానీయ వాల్మీకేరాశ్రమాన్తికే ॥ 34**

**త్యక్త్వా శీఘ్రం రథేన త్వం పునరాయాహి లక్ష్మణ ।**
**వక్ష్యసే యది వా కించిదత్ర మాం హతవానసి ॥ 35**

**ఛిత్వా సీతాభుజం లోకప్రత్యయార్థం సమానయ ।**
**ఇత్యుక్త్వా లక్ష్మణం రామః కైకేయీం ద్రష్టుమాయయౌ ॥ 36**

ఏతస్మిన్నంతరే సీతాం కైకేయీ రహసి స్థితా ।
పప్రచ్ఛ కౌతుకాత్సీతే భిత్తౌ లేఖ్య దశాననమ్ ॥ 37

మామత్ర దర్శయస్వాద్య తాం ప్రాహ జానకీ తదా ।
మయాఽవలోకితో నైవ కదాఽపి స దశాననః ॥ 38

యదా హర్తుం పంచవట్యాం మాం ప్రాప్తో గౌతమీతటే ।
తదా దృష్టస్తదంగుష్ఠో మయా దక్షిణపాదజః ॥ 39

తత్సీతావచనం శ్రుత్వా కైకేయీ ప్రాహ తాం పునః ।
యథా దృష్టస్త్వయాంగుష్ట స్తథా భిత్తౌ లిఖస్వ హి ॥ 40

తథేతి జానకీ లేఖ్య తదంగుష్ఠం భయానకమ్ ।
కైకేయ్యై దర్శయామాస తామామంత్ర్య గృహం యయౌ ॥ 41

అంగుష్ఠోపరి కైకేయ్యా యథా యోగ్యోదశాననః ।
లిఖితః స్వేన హస్తేన రామం ద్రష్టుం కుబుద్ధితః ॥ 42

రజకుడు అనిన ఆ మాటను దారిలో పోవుచు నేను వింటిని. శ్రీరామచంద్రస్వామీ! నీ యాజ్ఞచే ఇట్లు విజ్ఞాపించితిని. ఈ విషయమందు హితమగునట్లు ఆచరించవేడెదను. అని విజయుడు విజ్ఞాపించెను. ఆ మాటవిని శ్రీరాముడు తన మనుషులను అడిగెను. వారును సరియె ఇందులో సంశయములేదనిరి. అంత శ్రీరాముడు; మంత్రులను, మిత్రులను, విజయుని పంపివేసి, లక్ష్మణుని పిలచి, "లోకాపవాదము గొప్పది, సీతవలన నాకు అపవాదుకలిగెను. తమ్ముడా! రేపు ప్రొద్దున నీవు జానకిని తీసుకొనిపోయి వాల్మీకి ఆశ్రమ సమీపమున విడిచిపెట్టి రథమును ఎక్కి వచ్చివేయుము. అచటనేమైనా మాట్లాడితివా నన్ను చంపినట్లు. సీతయొక్క భుజమును ఛేదించి లోకాపవాద నివృత్తి కొరకు తీసుకొనిరమ్ము," అని చెప్పి, అచటినుండి కైకేయిని చూచుటకు వెడలెను. (36)

## కైకేయి సీతను మోసగించుట.

అంతలో రహస్యముగా కూర్చునియున్న కైకేయి, సీతనుజూచి, "జానకీ! ఈ గోడమీద రావణుని బొమ్మగీసి నాకు చూపుము," అని వేడుకగా అడిగెను. అందుకు ఆమె అత్తగారూ! నేనెప్పుడును రావణుని చూడలేదు. గోదావరి తీరమున పంచవటిలో నన్ను అపహరించుటకు వచ్చినపుడు వాని

కుడికాలి బ్రొటనవ్రేలును చూచితిని," అని చెప్పెను. పిమ్మట కైకేయి మరలా, "పోనిమ్ము, నీవుచూచినట్లే ఆ రావణుని కాలిబొటనవ్రేలినే గీయుము అని ఉత్సాహపరచెను. అంత సీతమ్మ అట్లేనని భయంకరమగు రావణుని కాలి బొటనవ్రేలిని గీసి చూపించి, కైకేయి అనుమతితో నిజమందిరమునకు వెళ్ళెను. అపుడు కైకేయి చిత్రకారుని పిలిపించి, ఆ రావణుని బొటనవేలు మీద తగినవిధముగా కౌశలముచే దశముఖుని రూపమును లిఖించి శ్రీరామునికి చూపవలెనని దుర్మార్గముగా ఆలోచించెను.

**తావద్రామం సమాయాతం దృష్ట్వా సా సంభ్రమాన్వితా ।**
**భిత్యంతికం రాఘవాయ దదావాసనముత్తమమ్ ॥ 43**

**రామోఽపి నత్వా కైకేయీమాసనేసంస్థితోఽభవత్ ।**
**దదర్శ భిత్తౌ లిఖితం విచిత్రం తం దశాననమ్ ॥ 44**

**రామః పప్రచ్ఛ కేనాత్ర లిఖితోఽయం దశాననః ।**
**కైకేయీ కథయామాస సీతయా లిఖితస్త్వితి ॥ 45**

**యత్ర యత్ర మనో లగ్నం స్మర్యతే హృది తత్సదా ।**
**స్త్రియాశ్చరిత్రం కో వేత్తి శివాద్యా మోహితాః స్త్రియా ॥ 46**

**కైకేయీచనం చేత్థం శ్రుత్వా రామో మహామనాః ।**
**సీతాశ్రయం సభావృత్తం కైకేయీమాహ విస్తరాత్ ॥ 47**

**లక్ష్మణేన త్యజామ్యంబ శ్వః సీతాం జాహ్నవీతటే ।**
**సీతాభుజం వనే ఛిత్వా సమానయతు మద్గిరా ॥ 48**

**సౌమిత్రిస్త్వాం తథా పౌరాన్దర్శయిష్యతి నిశ్చయాత్ ।**
**సీతయా లిఖితో యస్మాత్స్వభుజేన దశాననః ॥ 49**

**స్త్రీహత్యాభయమాలక్ష్య తద్వధే లక్ష్మణో మయా ।**
**న చోదితశ్చ తాం హింస్రా భక్షయిష్యంతి వై క్షణాత్ ॥ 50**

**ఇతి రామవచః శ్రుత్వా కైకేయీ ముదితాఽభవత్ ।**
**సీతాయా విరహాద్రామో నేదం రాజ్యం ప్రశాస్యతి ॥ 51**

**సేవార్థం రామచంద్రస్య లక్ష్మణోఽపి న శాస్యతి ।**
**తదా శ్రీరామవాక్యేన భరతో మే ప్రశాస్యతి ॥ 52**

**ఇతి సంచింత్య హృదయే కైకేయీ ముదితాఽభవత్ ।**
**రామోఽపి నత్వా కైకేయీం సుమిత్రాం స్వాం చ మాతరమ్ ॥ 53**

**సభావృత్తం చ కైకేయీగేహే యజ్జాతమాదరాత్ ।**
**శ్రావయామాస సకలం వృత్తం సీతాశ్రయం ప్రభుః ॥ 54**

ఆ సమయానికి శ్రీరాముడు అక్కడికి రావడంతో ఆమె చాలా ఆశ్చర్యముతో ఆ గోడప్రక్కననే శ్రీరామునికి కూర్చొనడానికి ఉత్తమపీఠమును చూపించెను. శ్రీరాముడు కైకేయి మాతకు నమస్కరించి, ఆ పీఠముపై కూర్చుని, ప్రక్కన గోడమీద చిత్రముగా వ్రాసియున్న రావణుని రూపము జూసెను. అప్పుడు కైకేయితో, " ఈ చిత్రమును ఎవరు గీశారని" శ్రీరాముడు అడుగగా, "సీత లిఖించె"నని కైకేయి తిన్నగా ముట్టించెను. స్త్రీ జాతికి ఎచటెచటో మనసొప్పియుండును గదా! స్త్రీల మనసు ఎవరికి తెలియును? స్త్రీలయొక్క చరిత్రను ఎవరెరుగుదురు? పరమేశ్వరాదులే స్త్రీచే మోహితులైరి. ఇకచెప్పదగినదేమి? మహా మనస్వియగు శ్రీరాముడు ఆ కైకేయి వాక్యమును విని, ఆమెతో సవిస్తరముగా సీతను గురించి, సభలోని సంగతిని చెప్పి, "తల్లీ! రేపు లక్ష్మణుడు సీతను గంగాతీరమున వదిలిపెట్టి వచ్చును. నా యాజ్ఞతో లక్ష్మణుడు సీతయొక్క భుజమును కత్తిరించి తెచ్చి నీకును, పౌరులకును చూపనున్నాడు. ఇది నిక్కము. స్త్రీ హత్య తగదని నేను లక్ష్మణునికి చెప్పి, సీతను చంపమని చెప్పక రావణుని వ్రాసిన భుజమును భేదించునట్లు చెప్పితిని. పిదప దానిని దుష్టజంతువులు త్వరగా భక్షించివేయును," అని అనుకూలముగా చెప్పితిని. ఆ శ్రీరామవాక్యములను విని కైకేయి– ఆహా! ఇక శ్రీరాముడు సీతావిరహము వలన రాజ్యమును ఏలజాలడు. రామసేవాపరాయణుడైన లక్ష్మణుడు తత్ సేవకొరకై రాజ్యమును అంగీకరించడు. పిదప నాయొక్క భరతుడు రామాజ్ఞచే రాజ్యమును పాలించును– అని ఇట్లు మనసున ఆలోచించి కైక మురిసిపోయెను. శ్రీరాముడు కైకేయికి నమస్కరించి, సుమిత్రకును, తన తల్లికిని సభలోని సమాచారమును, కైకేయి మందిర వృత్తాంతమును వినిపించి, కౌసల్యా, సుమిత్రలకు నమస్కరించెను. (54)

**నత్వా సుమిత్రాం కౌసల్యాం రామః సీతాగృహం యయౌ ।**
**సీతయా దత్తపాద్యార్ఘ్యాసన మంగీచకార సః ॥ 55**

**సభావృత్తం చ కైకేయీగేహే యద్దృష్టమాదరాత్ ।**
**శ్రావయామాస తత్కృత్స్నం వృత్తం తం జానకీం ముదా ॥ 56**

తత్ శ్రుత్వా జానకీంప్రాహ కైకేయ్యా వచనాన్మయా ।
అంగుష్ఠ ఏవ లిఖితస్తయోర్ధ్వం లిఖితో ధియా ॥ 57

అంగుష్ఠాస్యానురూపేణ దశాస్యో దుష్టబుద్ధితః ।
తత్సీతావచనం శ్రుత్వా జానకీమాహ రాఘవః ॥ 58

కౌటిల్యబుద్ధిం కైకేయ్యాః సమగ్రాం వేద్మ్యహం ప్రియే ।
ఇత్యుక్త్వా రాఘవః సీతామాలింగ్యాస్యం చుచుంబ సః ॥ 59

సీతయా హేమపర్యంకే భుక్త్వా భోగాన్ సుపుష్కలాన్ ।
వినోదార్థం రఘుపతిః ప్రాహ రాత్రౌ విదేహజామ్ ॥ 60

స్త్రీణాం సీతే సగర్భాణాం వాంఛితం వాంఛతే మనః ।
కా తే వాంఛా వదస్వ త్వం తత్తే దాస్యామి నిశ్చితమ్ ॥ 61

ఇతి రామవచః శ్రుత్వా భావికార్యేణ యంత్రితా ।
సా ప్రాహ రాఘవం రామం గంగాతీర స్థితాంస్తరూన్ ॥ 62

మునీనామాశ్రమాంశ్చాపి ఋషిపత్నీశ్చ తద్వనమ్ ।
వాంఛతే మే మనో ద్రష్టుం శీఘ్రం ప్రేషయ తత్ర మామ్ ॥ 63

ఇతి సీతావచః శ్రుత్వా తథాఽస్త్వితి రఘూత్తమః ।
ప్రాహ సీతే లక్ష్మణః శ్వో నేష్యతి త్వాం మమాజ్ఞయా ॥ 64

పునః ప్రాహ రఘుశ్రేష్ఠః సీతే తే క్రీడనాదిభిః ।
జపధ్యానాదికం సర్వం విస్మృతం తన్మయా పురా ॥ 65

## శ్రీ సీతారామ రహస్య సల్లాపము.

శ్రీరాముడు సీతయొక్క అంతఃపురమునకువచ్చి, ఆమె ఇచ్చిన అర్ఘ్య, పాద్యాది సత్కారములను స్వీకరించి, ఆమెకు సభా సమాచారమును, కైకేయి గృహవృత్తాంతమును చక్కగా వినిపించెను. అపుడు సీతమ్మ, "స్వామీ! ఆ కైకేయి ఇంటి గోడమీద ఆమె ఆజ్ఞమీరక రావణుని అంగుష్ఠము నొకటినే వ్రాసితిని. ఆ తరువాత ఆమె తనబుద్ధి కౌశలముచే రావణరూపమును ఊహించి వ్రాసెను. ఇది

దుర్బుద్ధికదా?” అని విన్నవించెను. అంత ఆ శ్రీరాముడు, “ప్రేయసీ! సమగ్రముగా కైకేయి యొక్క దుర్బుద్ధిని నేనెరుగుదును,” అని చెప్పి, సీతను ఆలింగించి, ముద్దుపెట్టి, సీతతోడ దివ్య కనక పర్యంకమున యథేచ్ఛముగా దివ్యభోగములను అనుభవించి, వినోదార్థముగా ఆ రాత్రి శ్రీరాముడు సీతతో, “గర్భవతియగు స్త్రీలయొక్క మనస్సు యేదైనా ఒక వాంఛితమును వాంఛించుట గలదు. నీకేమి వాంఛగలదు? చెప్పుము. నిశ్చయముగా దానిని అనుకూలపరచెదను,” అని పలికెను. ఇట్టి రామవాక్యమును విని, జానకీదేవి భవిష్యత్కార్య వశవర్తినియై, “గంగాతీరమునందలి వృక్షములను, మునీంద్రుల ఆశ్రమములను, ఋషిపత్నులను చూడవలయునని నామనస్సు ఆపేక్షించుచున్నది. త్వరగా నన్ను పంపుము,” అని చెప్పగా, రాముడు అట్లే అని, “ప్రేయసీ! నా ఆజ్ఞచే లక్ష్మణుడు రేపు నిన్ను తీసుకొని పోవుచున్నాడు,” అని, “సీతా! నీయొక్క క్రీడనాదులచే జప, ధ్యానాది సత్కర్మలన్నియును మరచిపోతిని. నీవు అరణ్యమునకు పోయినపుడు వాటినన్నిటిని ఆచరించెదను,” అనెను.

**తత్కరోమ్యధునా సీతే గతాయాం త్వయి కాననమ్ ।**
**ఇత్యుక్త్వా జానకీం రామః సుఖం సుష్వాప మంచకే ॥ 66**

**సీతాఽపి చింతయామాస యత్ర మాతా పితా మమ ।**
**కిం మాం న్యూనం హి తత్రాస్తి కించిద్వస్త్వాదికం సహ ॥ 67**

**నాహం నేష్యామి శ్వస్తూష్ణీం సఖ్య దాస్యా సమన్వితా ।**
**లక్ష్మణేన రథే స్థిత్వా గచ్ఛామి ముదితా సుఖమ్ ॥ 68**

**ఇతి నిశ్చిత్య సా రాత్రౌ సుఖం సుష్వాప మంచకే ।**
**అథ ప్రభాతే సోత్థాయ స్నాతా స్నాతం రఘూత్తమమ్ ॥ 69**

**పక్వాన్నాదీని సత్పాత్రే పర్యవేషయదుత్తమమ్ ।**
**ఉపహారే కృతే భర్త్రా స్వయం కృత్వోపహారకమ్ ॥ 70**

**పృష్ట్వోర్మిలాదికాః స్త్రీశ్చ తతః శ్వశ్రూః ప్రణమ్య చ ।**
**గంగాతీర స్థితాన్ వృక్షాన్ మునీన్ ద్రష్టుం సముద్యతా ॥ 71**

**తాః పప్రచ్ఛ సఖీయుక్తా దాస్యా సస్మార లక్ష్మణమ్ ।**
**తతోఽసౌ లక్ష్మణో భ్రాత్రా చోదితస్తాం యయౌ జవాత్ ॥ 72**

**దాస్యా సఖ్యా తులస్యాథ సీతాం కృత్వా రథస్థితామ్ ।**
**యయౌ దక్షిణమార్గేణ వాయువేగాత్స జాహ్నవీమ్ ॥ 73**

**ఇంద్రాద్యా నిర్జరాశ్చక్రుః సీతాసన్మార్గసత్క్రియామ్ ।**
**ఉల్లంఘ్య తమసాం పుణ్యాం గౌతమీం జాహ్నవీమపి ॥ 74**

**యమునాం తాం మహాపుణ్యాం తథా మందాకినీ నదీమ్ ।**
**ద్వితీయాం తమసా పుణ్యాం సముల్లంఘ్య స లక్ష్మణః ॥ 75**

**చిత్రకూటోపత్యకాయాం వాల్మీకేరాశ్రమాంతికే ।**
**పిప్పలాధో మైథిలీం తాం సఖ్యా దాస్యా వరాసనే ॥ 76**

శ్రీరాముడు మంచముమీద సుఖముగా నిద్రించెను. జానకమ్మయును, "ఎచట నా తల్లియును, తండ్రియును గలరో అచట నాకేమి కొదువగలదు? ఇక్కడినుండి ఒక్కవస్తువును తీసికొనిపోను. ఊరకే సఖిని, దాసిని మాత్రమే పిలుచుకుని ,లక్ష్మణునితోడ రథమునెక్కి సంతోషముగా వెడలెదను." అని నిశ్చయించుకుని, మంచముపై సుఖముగా నిద్రించెను. (68) తరువాత తెల్లవారగానే లేచి,

## లక్ష్మణుడు సీతమ్మను వాల్మీకి ఆశ్రమమువద్ద వదులుట.

స్నానముచేసి, స్నాతుడైన శ్రీరామునికి బంగారు పాత్రమున ఆహారాదులను వడ్డించి, మగని భోజనమైన వెనుక తాను భోజనముచేసి, ఊర్మిళాది తోడికోడండ్రను పరామర్శించి, కౌసల్య మొదలైన అత్తలకు నమస్కరించి, అనుజ్ఞనొంది, గంగాతీరమున ఉన్న వృక్షములను, మునీంద్రులను చూచుటకు యత్నించి, సఖీయుతయై దాసీచే లక్ష్మణుని పిలిచెను. అంత లక్ష్మణుడును అన్నగారిచే ఆజ్ఞాపించబడి, సీతాదేవియొక్క సన్నిధానమునకు వచ్చి, దాసిని, తులసి అను సఖిని, జానకమ్మను రథముపై నెక్కించి, దక్షిణమార్గమున వాయువేగముగా గంగాతీరమునకు బయలుదేరెను. ఇంద్రాది దేవతలు సీతాదేవి వచ్చుచున్న మార్గమున సత్కారములను ఆచరించిరి. పుణ్యప్రదయగు తమసానదిని దాటి, గౌతమీనదిని జాహ్నవీ నదిని కూడా నతిక్రమించి, పావనమైన యమునానదిని అట్లే మందాకినీని తరించి, రెండవ తమసానదిని దాటి, చిత్రకూటమువద్ద ఉండెడు వాల్మీకి ఆశ్రమమునకు సమీపమున అశ్వత్థ వృక్షము క్రింద ఉత్తమపీఠపై దాసీ, సఖులతో వదినను కూర్చుండబెట్టి, నమస్కరించెను.

నివేశ్య నత్వా స ప్రాహ సాశ్రునేత్ర సగద్గదః ।
లోకాపవాదభీత్యా త్వాం త్యక్తవాన్ రాఘవో వనే ॥ 77

దోషో న కశ్చిన్మే మాతర్గచ్ఛాశ్రమపదం మునేః ।
ఇత్యుక్త్వా తాం పరిక్రమ్య సఖ్యా దాస్యాఽపి వీజితామ్ ॥ 78

యయౌ రథేన సౌమిత్రిః పూర్వమార్గేణ జాహ్నవీమ్ ।
శిష్యైః శ్రుత్వాఽథ వాల్మీకిర్జనకేన సుమేధసా ॥ 79

యయౌ స్త్రీభిర్ద్విజైర్యుక్తః పూజయామాసజానకీమ్ ।
శిబికాయాం సన్నివేశ్య వీజితాం చామరాదిభిః ॥ 80

నానావాద్యనినాదైశ్చ వేశ్యానాం నర్తనైర్వరైః ।
స్తవనైర్మాగధాదీనాం నటాదీనాం సుగాయనైః ॥ 81

నినాయ జనకః సీతాం వాల్మీకేరాశ్రమే ముదా ।
మునిపత్న్యో వన్యపుష్పైర్వవర్షుర్జానకీం ముదా ॥ 82

జానకీశిబికాగ్రే తే దుద్రువుర్వేత్రపాణయః ।
ఏవం వివేశ సా సీతా వాల్మీకేరాశ్రమం శనైః ॥ 83

చక్రుర్నీరాజనం దీపైర్మునిపత్న్యశ్చ జానకీమ్ ।
జానకీ హేమపర్యంకే ధృతార్ధోకోపబర్హణా ॥ 84

సుఖమాపాశ్రమే తస్య వాల్మీకేశ్చ తపస్వినః ।
జానకీం పూజయామాసు మునిపత్న్యః పృథక్ పృథక్ ॥ 85

దివ్యాన్నైర్వనసంభూతైర్వన్యపుష్పైర్నిరంతరమ్ ।
జ్ఞాత్వా పరాత్మనో లక్ష్మీం మునివాక్యేన భక్తితః ॥ 86

దోహదాన్ పూరయామాసుః సీతాయాస్తా మునిస్త్రియః ।
శిబికాసంస్థితా సీతా దదర్శ వనకౌతుకమ్ ॥ 87

**యథాపూర్వం తు సాకేతే సుఖమాప విదేహజా ।**
**తథా మునేరాశ్రమేపి సుఖమాప పతివ్రతా ॥ 88**

**ఇతి శ్రీశతకోటిరామచరితాంతర్గతే, శ్రీమదానందరామాయణే, వాల్మీకీయే, ఆదికావ్యే, జన్మకాండే, సీతాయావాల్మీక్యాశ్రమగమనం నామ తృతీయః సర్గః ॥**

లక్ష్మణుడు కండ్లనీరు కమ్ముకువచ్చుచుండ గద్గదుడై, “లోకాపవాద భీతివలన శ్రీరాముడు వనమున నిన్ను పరిత్యజించెను. తల్లీ! కొంచెముకూడా నీదోషము లేదు. మునియొక్క ఆశ్రమమునకు వెడలుము.” అని పలికి, సఖీ దాసీచే సేవింపబడుతున్న సీతమ్మకు ప్రదక్షిణ చేసి, రథమును ఎక్కి, యథాపూర్వముగా గంగాతీరమునకు వెడలెను. (78) శిష్యులవలన సమాచారమును వినిన వాల్మీకి మహర్షి; సుమేధ జనకులను, మునిపత్నులను, బ్రాహ్మణులను వెంటతీసుకొనిపోయి, జానకీదేవిని పూజించి, పల్లకీమీద ఎక్కించి, ఛత్ర చామరాది ఉపచారములతోను, వివిధ వాద్యములతోను, వందిమాగధ సమస్త జనులతో, నటీ నట, నృత్యగీతములతో, సమస్త రాజోపచారములతో, తన ఆశ్రమమునకు సంతోషముతో తీసుకుని వచ్చెను. వన్యపుష్పములచే మునిపత్నులు సీతమ్మమీద వాన కురిపించిరి. వైదేహి పల్లకి ముందు వెండి, బంగారు దండములు దాల్చినవారు పరుగెత్తుచుండిరి. ఇట్లు తిన్నగా సీతమ్మ వాల్మీకి ముని ఆశ్రమమున ప్రవేశించెను. మునిపత్నులు దీపములచే జానకీదేవికి నీరాజనములు అర్పించిరి. తపస్వియగు వాల్మీకియొక్క దివ్యాశ్రమమున జానకీదేవి కనకరత్న మంచముపై తొడదిండ్లకు ఆనుకుని సుఖముగా సుస్థితయై ఉండెను. పరమాత్మయొక్క సాక్షాత్ లక్ష్మియే ఈ సీతమ్మయను సంగతిని మునివాక్యముచే తెలుసుకుని, భక్తిచే దివ్యాఖ్యానములను, వన్య సుమములును వేరువేరుగా వచ్చి, సమర్పించి, గర్భిణి కుతూహలములను ఈడేర్చుచు, కృతకృత్యులగుచుండిరి. వైదేహి పల్లకీనెక్కి మునుపు అయోధ్యలో ఆ రామక్రీడను ఎట్లు అనుభవించుచుండెనో అట్లే ఈ తపోవనమున అంతట అవలోకించుచు, సుఖముగా ఉండెను.

***ఈ విధముగ శ్రీమద్వాల్మీకి మహర్షిచే రచింపబడిన, శ్రీ శతకోటిరామచరితాంతర్గత శ్రీమత్ ఆనందరామాయణములో, ఐదవదైన జన్మకాండలో, సీతాదేవి వాల్మీకి ఆశ్రమములో ప్రవేశించు 3వ సర్గ ముగిసినది.***



# చతుర్థః సర్గః-4వ సర్గ

## కుశలవుల జననము

శ్రీరామదాస ఉవాచ

అథ గంగాతటం గత్వా లక్ష్మణోఽచిన్తయత్ హృది ।
స్వేచ్ఛయా కౌతుకాత్సీతాం మయా శుద్ధాం స త్యక్తవాన్ ॥ 1

స్వీయకామప్రశాంత్యర్థం శాస్త్రాజ్ఞాం ప్రతిపాలయన్ ।
ఏవం సతి పునస్తేన కిం మమాజ్ఞాపితం రహః ॥ 2

వనాత్సీతాభుజం ఛిత్వా నయస్వేత్యతిదుర్ఘటమ్ ।
మయాపి శపథం శ్రుత్వా న పృష్టః స విచింత్య చ ॥ 3

అధునా కిం కరోమ్యత్ర కథం రామం ప్రగమ్యతే ।
సీతాభుజం వినా దృష్ట్వా రామో మాం కిం వదిష్యతి ॥ 4

ఛేత్తుం సీతాభుజం శక్తో భవిష్యామి కథం త్వహమ్ ।
యయాఽహం పుత్రవన్నిత్యం పాలితో లాలితస్త్వితి ॥ 5

అధునాఽగ్నిం విశామ్యత్ర రామాయాస్యం న దర్శయే ।
ఏవం నిశ్చిత్య సౌమిత్రిశ్చితాం కర్తుం మనో దధే ॥ 6

ఏతస్మిన్నంతరే తత్ర విశ్వకర్మా విధేర్గిరా ।
కుఠారహస్తో విపినే బభ్రామ తక్షరూపధృక్ ॥ 7

తం దృష్ట్వా లక్ష్మణః ప్రాహ త్వం మే సాహాయ్యమాచర ।
కుఠారేణ తరూంశ్ఛిత్వా చితార్థం దేహి మాం జవాత్ ॥ 8

యథేచ్ఛం వసు దాస్యామి త్వామహం నిశ్చయేన హి ।
సోఽప్యాహ లక్ష్మణం వీర చితాహేతుం వదస్వ మామ్ ॥ 9

సౌమిత్రిః కథయామాస పూర్వవృత్తం సవిస్తరమ్ ।
తత్ శ్రుత్వా సకలం తక్షః సౌమిత్రిం ప్రాహ సస్మితః ॥ 10

**అల్పార్థే స్వీయకుణపం మా జుహోవ స్వబాహుజ ।**
**అహం సీతాభుజం కృత్వాఽధునా దాస్యామి తే క్షణాత్ ॥ 11**

## లక్ష్మణుడు సీతయొక్క కృత్రిమ భుజమును తెచ్చిచూపుట.

శ్రీరామదాసు చెప్పుచున్నాడు, "అపుడు లక్ష్మణుడు గంగాతీరమునకు వచ్చి, తనమనమున, "స్వయంప్రభువగు శ్రీరాముడు, శాస్త్రాజ్ఞను పాలించువాడై తన కామనిగ్రహము కొరకు స్వేచ్ఛాకౌతుకమున పరిశుద్ధయగు సీతను త్యజించెను. ఇట్లుండ అతడు రహస్యముగా నాకు సీతయొక్క భుజమును ఛేదించి తీసుకురమ్మని ఆజ్ఞాపించెను. నేనును శపథమును విని యోచించి, రాముని అడుగకపోతిని. ఇపుడేమి చేయుదును. ఆజ్ఞను పాటించకుండా రాముని సన్నిధికి ఎట్లు పోదును? సీతా భుజములేక నేను అయోధ్యకు వెళ్ళినచో ఆ శ్రీరాముడు ఏమి కోపగించునో! ఎవరి చేత నేను తన బిడ్డవలె నిత్యము పాలింపబడితినో అట్టిసీతాదేవి యొక్క భుజమును నేనెట్లు ఛేదించగలను? ఇపుడు నేను అగ్నిప్రవేశము చేసెదను. రామునికి ముఖముజూపను," అని చింతించి, చితిని ఏర్పరుచుటకు దృఢముగా నిశ్చయించెను. అంతలో బ్రహ్మాజ్ఞ నొందిన విశ్వకర్మయను దేవశిల్పి కమ్మరి వాని వేషముదాల్చి, గొడ్డలిని గైకొని కాననమున తిరుగుతూ వచ్చెను. లక్ష్మణుడు కమ్మరిని జూచి, "నీకు కావలసినంత డబ్బును ఇచ్చెదను, గొడ్డలిచే చెట్లను నరికి, చితిపేర్చుటకు నాకు కట్టెలను తెచ్చి సహాయము చేయుము." అని అడిగెను. ఆ విశ్వకర్మ లక్ష్మణుని జూచి, "చితి పేర్చుటకు కారణమేమో చెప్పుమనెను. అపుడు లక్ష్మణుడు జరిగిన సంగతిని సవిస్తరముగా పలికెను. అందుకు విశ్వకర్మ, "క్షత్రియుడా! ఈ అల్ప విషయమునకై నీ దేహము అగ్నిలో ఆహుతి చేయవద్దు. ఇదిగో క్షణమాత్రమున సీతాదేవి భుజమును తయారుచేసి ఇచ్చెదను," అనెను.

**ఇత్యుక్త్వా లక్ష్మణం కృత్వా జానకీభుజముత్తమమ్ ।**
**త్వఙ్మాంసాస్థిస్నాయురక్తపూరితం కంచుకీయుతమ్ ॥ 12**

**సీతాలంకారసహితం తస్యాశ్చిహ్నవిచిహ్నితమ్ ।**
**దదౌ లక్ష్మణహస్తే తం స్వయమంతర్దధే క్షణాత్ ॥ 13**

**సీతాభుజ సమాదాయ లక్ష్మణోఽపి పురీం యయౌ ।**
**గతశ్రియం నిరుత్సాహాం వాత్యాతిధూళిధూసరామ్ ॥ 14**

దదర్శ నగరీం స్వీయాం నారీహీనగృహోపమామ్ ।
వివేశాధోముఖః పుర్యాం నత్వా సదసి రాఘవమ్ ॥ 15

దర్శయామాస సీతాయా భుజం కంకణమండితమ్ ।
తం నిరీక్ష్య భుజం రామోఽధోముఖః ప్రాహ లక్ష్మణమ్ ॥ 16

కైకేయీం సుహృదః పౌరాన్ సర్వాన్ జానపదాన్నృపాన్ ।
సీతాభుజో దర్శనీయస్త్వయాఽద్య మమ శాసనాత్ ॥ 17

తథేత్యుక్త్వా లక్ష్మణోఽపి స చకార యథోదితః ।
భుజం సంరక్షయామాస పేటికాయాం నిధాయ సః ॥
కైకేయీ తం భుజం దృష్ట్వా తుతోష నితరాం హృది ॥ 18

రామోఽపి సీతారహితః పరాత్మా
విజ్ఞానదృక్కేవల ఆదిదేవః ।
సంత్యజ్య భోగానఖిలాన్విరక్తో
మునివ్రతోఽభూన్మునిసేవితాంఘ్రిః ॥ 19

అథ సీతాఽపి వాల్మీకేర్మునిపత్నీభిరాశ్రమే ।
ప్రత్యహం పూజితా వన్యైః సుఖం తస్థౌ ముదాన్వితా ॥ 20

ఏవం మాసద్వయం తత్ర నీత్వా సీతాఽఽశ్రమే మునేః ।
సుదినే సుషువే రాత్రౌ పుత్రరత్నం రవిప్రభమ్ ॥ 21

విశ్వకర్మ చర్మము, మాంసము, రక్తము, క్రొవ్వు, ఎముకలతో పాటు సీతమ్మ ధరించిన రవికెతో కూడిన అలంకారమును గల జానకి దేవి భుజమును ఏ మాత్రము తేడాలేకుండా కల్పించి, లక్ష్మణుని చేతికి ఇచ్చి వెంటనే తాను మాయమయ్యెను. లక్ష్మణుడు సీతాదేవి భుజమును తీసుకువచ్చి, అయోధ్యలో ప్రవేశించి, దుమ్ము, ధూళి, నిరుత్సాహము, లక్ష్మీకళలేక, కళావిహీనమైన మందిరము వలె ఉండెడు నగరమును చూచుచు, తలవంచుకుని సభలోఉన్న శ్రీరామునికి నమస్కరించి, కంకణముతో కూడిన సీతాదేవి భుజమును చూపించెను. దానిని శ్రీరాముడు వినమ్రముఖుడై, “తమ్ముడా! నా ఆజ్ఞచే కైకేయికి, మిత్రులకు, పౌరులకు, దేశమువారికి, రాజులందరికి దీనిని ప్రదర్శింపుము.” అని

ఆజ్ఞాపించెను. అట్లే అని లక్ష్మణుడు అందరికిని కృత్రిమ సీతాభుజమును చూపించి, పదిలముగా పెట్టెలో పెట్టి దాచెను. కైకేయి ఆ భుజమును చూచి మిక్కిలి సంతసించెను. సర్వజ్ఞమూర్తియగు శ్రీరాముడు సాక్షాత్ పరబ్రహ్మ అయినను, లోకనటనమును అనుసరించి విరక్తుడై సమస్త భోగములను వదలి, మునీంద్రులచేత పూజింపబడే శ్రీరాముడు ముని వ్రతమును ఆచరించుచుండెను. (19) అంత నచట సీతాదేవి వాల్మీకి ఆశ్రమమున మునిపత్నులచే వన్యోపచారములను అందుకొనుచు, పూజింపబడి సంతోషాన్వితయై సుఖముగా ఉండెను. ఇట్లు సీతాదేవి ఋష్యాశ్రమమున రెండుమాసములైన తరువాత ఒక శుభరాత్రియందు సూర్యకాంతివంటి మగపిల్లవానిని ప్రసవించెను.

**ఏతస్మిన్నంతరే రాత్రౌ జ్ఞాత్వా తం సమయం ప్రభుః ।**
**రాఘవః కింకిణీమాలా ఘంటాం ముక్త్వాఽథ బంధునా ॥ 22**

**పుష్పకస్య తతస్తస్మిన్ స్థిత్వాకాశపథా యయౌ ।**
**వాల్మీకేరాశ్రమే వేగాత్సబంధుస్తం ననామ సః ॥ 23**

**తతో వాల్మీకినా విప్రైర్మిత్రైరేవ రఘూత్తమః ।**
**జాతకర్మాదిసంస్కారాంశ్చకార విధిపూర్వకమ్ ॥ 24**

**సీతాయాః పురతః పుత్రాననమాలోకయన్ముదా ।**
**దదౌ దానాన్యనేకానీ స్వవస్త్రాభరణాన్యపి ॥ 25**

**చకార విధివచ్ఛ్రాద్ధం పుత్రజన్మమహోత్సవే ।**
**దేవదుందుభయో నేదుర్వవర్షుః పుష్పవృష్టిభిః ॥ 26**

**సురాః సీతాం శిశుం రామం ననృతుః ఖే సుర స్త్రియః ।**
**నేదుర్జనకవాద్యాని ననృతుర్వారయోషితః ॥ 27**

**తుష్టువుర్మాగధద్యాశ్చ సీతా రామం శిశుం ముహుః ।**
**ఋషిపత్న్యః శిశుం సీతాం రామం దీపైః సుభూషితాః ॥ 28**

**పృథఙ్నీరాజనం కృత్వా జగుర్గీతం హి సుస్వరమ్ ।**
**వస్త్రాద్యైః పూజయామాస తాః సర్వా రఘునందనః ॥ 29**

సీతారామౌ విదేహోఽపి పూజయామాస విస్తరాత్ ।
వాల్మీకిస్తు కుశైః శాంతిం చకార విధినా శిశోః ॥ 30

శాంత్యర్థం ప్రోక్షితో యస్మాత్కుశైస్తస్మాత్కుశాహ్వయః ।
వాల్మీకినా రాఘవాగ్రే నిశ్చితో బాలకస్య హి ॥ 31

ఏవం నానాసముత్సాహైర్నీత్వా తత్ర నిశాం సుఖమ్ ।
తత్రస్థాన్ సకలానాహ మమాత్రాగమనస్య హి ॥ 32

యస్మాద్వార్తా బహిర్గచ్ఛేదాశ్రమాదస్య వై మునేః ।
స మే దండ్యో భవేదేవ శత్రురూపీ న సంశయః ॥ 33

ఇత్యుక్త్వా సకలాన్దృష్ట్వా మునీన్నత్వా పునః పునః ।
సీతామామంత్ర్య శ్రీరామో యానం భ్రాత్రాఽఽరురోహ సః ॥ 34

విహాయసా క్షణాత్ప్రాప సాకేతం రఘునందనః ।
అవరుహ్య విమానాత్స పూర్వవన్నిద్రితో గృహే ॥ 35

సీతాదేవి ప్రసవించిన ఆ రాత్రి స్వయంప్రభువగు రామచంద్రుడు ఆ మంగళ ముహూర్తమును గుర్తించి, పుష్పకవిమానమున కింకిణీ మాలికను, గంటను తీసిపెట్టించి, తమ్మునితో ఆ విమానమును ఎక్కి గగనమార్గమున వెడలి, వేగమున వాల్మీకి ఆశ్రమమునకు వచ్చి, ఆ మునికి తమ్మునితోపాటు నమస్కరించెను. అంత ఆ రాఘవుడు వాల్మీకితోను, బ్రాహ్మణులతోను, మితపరివారముతో జాతకర్మాది సంస్కారములను విధివిధానముగా ఆచరించెను. సీతాదేవి ఎదుట సంతోషముతో, పుత్రుని ముఖమును చూచుచు, వస్త్రాభరణాదులు మొదలుగా గల దానములను అనేకములుగా చేసి, పుత్రజన్మ మహోత్సవ సమయమున యథావిధిగా నాందీశ్రాద్ధమును ఆచరించెను. దేవదుందుభులు మ్రోగినవి. శ్రీసీతారాముల మీదను, శిశువుల మీదను పూలవానలు కురిసినవి. దేవస్త్రీలు ఆడిరి. జనక మహారాజుయొక్క మహావాద్యములు వాయింపబడెను. గణికులు నాట్యమాడిరి. వందిమాగదులు సీతారాములను, శిశువును సంశ్లాఘించుచుండిరి. ఋషిపత్నులందరును చక్కగా అలంకరించుకుని; శ్రీసీతారాములను, శిశువులను దివ్యరత్నదీపములచే హారతులెత్తి చెవులకింపుగా పాటలు పాడిరి. వారినందరిని శ్రీరాముడు వస్త్రాలంకారములచే పూజించెను. జనకమహారాజు, సీతారాములను

వైభవముగా పూజించెను. వాల్మీకి మునీంద్రుడు శిశువుకు దర్భలచే క్రమముగా శాంతి కర్మను ఆచరించెను. కుశ శాంతి కర్మలో మంత్రముతో కుశ(దర్భ)లచే నీటిని చల్లడముతో కుశడని చెప్పబడెను. ఇట్లు వాల్మీకిచే రాముని ఎదుట బాలకునికి నామకరణోత్సవము జరిగెను. ఇట్లు అనేక మహోత్సవములతో అచట యథాసుఖముగా ఆరాత్రిని గడిపి, అచట ఉన్న వారందరితో, "ఇచ్చటికి నేను వచ్చిన సంగతిని ఈ ఆశ్రమమునందు తప్ప మరిఎచ్చోటనైనను ఎవ్వరు చెప్పుదురో వారు నాచే దండింపబడుదురు. నాకు వారు ప్రత్యక్ష శత్రువులు," అని చెప్పెను. శ్రీరాముడు అందరివద్ద శెలవుతీసుకుని, వాల్మీకి మహర్షికి పలుమార్లు నమస్కరించి, సీతాదేవి వద్ద శెలవుగైకొని తమ్మునితో పుష్పకవిమానమును ఎక్కెను. మరియు ఒక క్షణమాత్రమున విమానమునుండి దిగి, గృహమున ముందువలె నిద్రించుచుండెను. (35)

**అథ రామో వాజిమేధశతం కర్తుం మనో దధే ।**
**కృత్వా స్వర్ణమయీం సీతాం వస్త్రాలంకారభూషితామ్ ॥ 36**

**పాపినీం మలినాం దుష్టాం భర్తృనిందాపరాయణామ్ ।**
**భర్తృవిద్వేషిణీం క్రూరాం చౌరకర్మణి తత్పరామ్ ॥ 37**

**భర్తారం ఘాతుమిచ్ఛంతీం సదా కలహకారిణీమ్ ।**
**పరభుక్తాం పాపరతాం భర్తృవాక్యవిలాపినీమ్ ॥ 38**

**స్వేచ్ఛావర్తినీం నష్టాం మృతాం నీతాం గతామ్ స్త్రియమ్ ।**
**త్యక్త్వా కుశమయీం విప్రైః కార్యా పత్నీ స్వకర్మసు ॥ 39**

**హైమీ కార్యా బాహుజైశ్చ వైశ్యైః కార్యా తు రాజతీ ।**
**శూద్రైః కార్యా తామ్రమయీ స్వస్వకర్మప్రసిద్ధయే ॥ 40**

**అథవా సర్వవర్ణైశ్చ కార్యా పత్నీ తు కాంచనీ ।**
**రామోఽపి కృత్వా సౌవర్ణిమగ్నిహోత్రం చకార సః ॥ 41**

**రావణేన యదా నీతా సీతా సా దండకే తదా ।**
**హేమ్నోఽభావాత్కుశ మయీ కృతా రామేణ జానకీ ॥ 42**

అన్యే కుశమయీం పత్నీం విధాయ గృహమేధినః ।
అగ్నిహోత్రముపాసంతే నిత్యత్యాగోఽతిగర్హితః ॥ 43

వ్యభిచారవతీ పాపా భర్తృవిద్వేషిణీ తథా ।
ఆధానే సా పరిత్యాజ్యా న వా త్యాజ్యా మతాంతరాత్ ॥ 44

పక్షే పక్షే నవమ్యాం హి స్నానం హ్యవభృథాభిధమ్ ।
కర్తుం నిశ్చితవాన్ రామస్తదా విప్రైః పురోధసా ॥ 45

భాగీరథ్యుత్తరేతీరే యజ్ఞభూమి చకార సః ।
ఆప్రయాగాన్ముద్గలస్యాశ్రమో యావచ్చ దక్షిణే ॥ 46

జాహ్నవ్యుత్తరతస్తావచ్చకార స్వర్ణలాంగలైః ।
యస్యాశ్రమస్య సాన్నిధ్యే భాగీరథ్యస్త్యుదగ్వహా ॥ 47

## శ్రీరాముడు బంగారుసీతతో శతాశ్వమేధ ప్రయత్నము.

పిదప శ్రీరాముడు చక్కగా అలంకరింపబడిన బంగారముతో చేసిన సీతాదేవి విగ్రహమును పెట్టుకుని నూరు అశ్వమేధయాగములను చేయుటకు సిద్ధపడెను. యాగము చేయదలచినచో– దుష్ట స్వభావము కలిగినది, మలిన మైనది, దుర్మార్గురాలు, ఎప్పుడు భర్తను నిందించేది, ఎప్పుడు భర్తతో పోట్లాడునది, క్రూరురాలు, దొంగిలించు స్వభావము కలిగినది, భర్తను సంహరించుటకు ప్రయత్నించునది, నిత్యకలహప్రియ, జారిణి, భర్తమాటను గౌరవించనిది, వెళ్ళిపోయినది, చచ్చినది, దుర్నీతి గలదానిని– వదిలివేసి, బ్రాహ్మణుడైనచో పుణ్య కర్మ సమయమున దర్భతో చేసిన భార్యను ప్రక్కన పెట్టుకొనవలయును. క్షత్రియుడైనచో బంగారు ప్రతిమను, వైశ్యుడైతే వెండి ప్రతిమను, శూద్రుడైనచో రాగి ప్రతిమను తాను చేయు పుణ్యకర్మ సిద్ధించుటకై ప్రక్కన పెట్టుకొనవచ్చును. అట్లుకాకున్నా అన్ని వర్ణములవారును బంగారు ప్రతిమను చేయించవచ్చును. శ్రీరాముడు సువర్ణకృత్రిమ సీతను చేయించి పెట్టుకుని, అగ్నిహోత్రములను ఆచరించుచు వచ్చెను. ఇతరులు కుశమయ పత్నులనంది, గృహస్థులు అగ్నిహోత్రములను ఆచరించెదరు. సంతతము విడిచిపెట్టుట మిక్కిలి నింద్యము. వ్యభిచరించుచు, పతితో కలహించుచు, పాపినియైన ఘణతిని ఆదాన కర్మయందు పరిత్యజించవలయును. మతాంతరమున ప్రాయశ్చిత్తపూరిత గావించి పరిత్యజించక పెట్టుకొనవచ్చును.

శ్రీరాముడు అప్పుడు బ్రాహ్మణుల తోను, వశిష్ఠులవారితోను, పక్షపక్షమునను అవభృథస్నానము చేయ నిశ్చయించెను. (45) పిదప శ్రీరాముడు గంగానదికి ఉత్తరతీరమున ప్రయాగ మొదలు దక్షిణమున ఉత్తరవాహినియగు గంగాప్రవాహముగల ముద్గలాశ్రమమువరకు అట్లే గంగకు ఉత్తరమున విస్తారముగా బంగారు నాగళ్ళచే యజ్ఞభూమిని ఏర్పరచెను.

**రుక్మమయ్యాఽథ జానక్యా యజ్ఞారంభం చకార సః ।**
**అజ్ఞానదృగ్భ్యో ద్రష్టుం వై చకార స్వర్ణనిర్మితామ్ ॥ 48**

**వామాంగస్థాం గుప్తరూపాం జ్ఞానదృగ్భ్యశ్చ సాత్వికీమ్ ।**
**బిభ్రత్సదైవ శ్రీరామో జానకీం లోకమాతరమ్ ॥ 49**

**యజ్ఞాంతే స్వర్ణజం సీతాం దదౌ స్వగురవే ప్రభుః ।**
**ఏవం యజ్ఞశతేష్వత్ర గురవే శతమూర్తయః ॥ 50**

**యాః సమర్పితా రామేణ తాసాం దానఫలేన హి ।**
**షోడశస్త్రీ సహస్రేభ్యశ్చోర్ధ్వం స్త్రీణాం శతం పునః ॥ 51**

**ద్వారకాయాం కృష్ణరూపో వివాహేనోద్వహిష్యతి ।**
**ప్రతియజ్ఞే శ్యామకర్ణమశ్వం రామో ముమోచ హ ॥ 52**

**చతుర్దినాచ్చతుర్దిక్షు పరిక్రమ్య యయౌ హయః ।**
**ఏవం సర్వేషు యాగేషు యయౌవాజీ పృథగ్జవాత్ ॥ 53**

**పుష్పకస్థః స శత్రుఘ్నో హయరక్షాం చకార వై ।**
**ఏవం సదా యజ్ఞవాటే విరజే దీక్షయా విభుః ॥ 54**

**ఏవం చ నవతిసంఖ్యా రామేణ నవ వై కృతాః ।**
**చరమస్యాపి ప్రారంభం రామో యజ్ఞస్య సోఽకరోత్ ॥ 55**

**గంగాయా దక్షిణే తీరే ముద్గలస్యాశ్రమోఽస్తి హి ।**
**తత్ర తస్యాంతికే గంగోదక్తీరే చ ఉదగ్వహే ॥ 56**

**దినాని దశ వాల్మీకిర్నిశాయాం సంధ్యయోరపి ।**
**శ్రీరామరక్షయా చక్రే బాలకస్యాభిమంత్రణమ్ ॥ 57**

**కుశం నామ తదా చక్రే మునిరేకాదశే దినే ।**
**చకార సర్వసంస్కారాన్ మునిః శ్రీరాఘవాజ్ఞయా ॥ 58**

**ఏవం స బాలకస్తత్ర వవృధే మాతృలాలితః ।**
**జనకశ్చ సుమేధా చ నానావస్త్రైః సుశోభనైః ॥ 59**

## శ్రీరాముడు నూరు అశ్వమేధయాగములను చేయుట.

శ్రీరాముడు బంగారు సీతతో యజ్ఞమును ప్రారంభించెను. ఆహా! శ్రీరాములవారి మహిమను ఏమనవచ్చును? జ్ఞానదృష్టిగల తపస్సంపన్నులు మాత్రమే చూచునట్లు, సాత్వికియై సాక్షాత్ లోకైక మాతయగు జానకీదేవిని తన ఎడమప్రక్కలో నిరంతరముగా ధరించుచు, అజ్ఞాన దృష్టితో ఉండు పామరలోకులు చూచునట్లు బంగారు సీతను చేయించి పెట్టుకొనెను. యజ్ఞాంతమున ఆ బంగారు సీత ప్రతిమను నిజగురువగు వసిష్ఠమునికి అర్పించెను. ఇట్లే నూరు యజ్ఞములలోను నూరు సీతామూర్తులు గురువులవారికి అర్పింపబడెను. అట్టి నూరు బంగారు సీతాప్రతిమల దానఫలము చేతనే ద్వారకలో శ్రీకృష్ణావతారమున పదహారువేలమంది మీద నూరుగురిని పెండ్లాడనున్నాడు. ప్రతియజ్ఞమునను శ్రీరాముడు నల్లని చెవిగల యజ్ఞ అశ్వమును విడచుచుండెను. అది నాలుగు దినములలో చతుర్దిక్కులను చుట్టివచ్చును. ఇట్లేవేరువేరుగా గుఱ్ఱములు అన్ని యజ్ఞములలో వచ్చుచుండెను. శత్రుఘ్నుడు పుష్పకవిమానమును ఎక్కి, యజ్ఞతురగములను వెంబడించి, పాలించుచుండును. ఇట్లెల్లప్పుడును యజ్ఞశాలలో శ్రీరాముడు దీక్షవహించి, రారాజించుచుండెను. ఈ విధమున 99 యజ్ఞములను పూర్తిజేసిన శ్రీరాచంద్రుడు నూరవ యజ్ఞమును ఆరంభించెను. (55) గంగానదియొక్క దక్షిణ తీరమున ముద్గలాశ్రమము కలదుకదా? అచట దాని సమీపమున ఉత్తరవాహినియగు గంగగలదు. దానికి ఉత్తర తీరమున వాల్మీకి ముని 10 రోజులపాటు, రాత్రులలోను, సంధ్యాకాలముల యందును శ్రీరామ రక్షచే బాలకుని అభిమంత్రించెను. 11వ దినమునందు ఆ బాలకునికి కుశుడని నామకరణము చేసి, శ్రీరామాజ్ఞాను సారముగా అన్ని సంస్కారములను ఆచరించెను. ఇట్లు ఆ శిశువు తల్లిచే లాలింపబడుతు వృద్ధినొందుచు వచ్చెను. సుమేధ జనకులు తమ మనుమని మంగళకరములగు మనోహర వస్త్రములచేతను, పులిగోరు మొదలైన వివిధ రక్షావస్తువులచేతను, అలంకరించి ఆనందించుచుండిరి.

**శోభయామాస దౌహిత్రం నానావ్యాఘ్రనఖాదిభిః ।**
**బాలోఽపి రంజయామాస స్వక్రీడాభిర్విదేహజామ్ ॥ 60**

ఏకదా నిద్రితం ప్రేంఖే దృష్ట్వా బాలం మునేః పురః ।
అన్యకర్మణి వ్యగ్రా చ సఖీం స్వీయాం స్వమాతరమ్ ॥ 61

జనకం చాపి సా సీతా దృష్ట్వా సర్వాన్ బహిర్గతాన్ ।
ఆశ్వినే రవివారే చ నద్యాం స్నాతుం సముద్యతా ॥ 62

మునిం తం బాలరక్షాయాం కృత్వాఽథ తమసాం యయౌ ।
దాస్యా మార్గేణ గచ్ఛంతీ దదర్శ పథి వానరీమ్ ॥ 63

కటిస్కంధమస్తకేషు భీభ్రతీం పంచ బాలకాన్ ।
తాం దృష్ట్వా స్వశిశుం స్మృత్వాఽచింతయజ్జానకీ హృది ॥ 64

తిర్యగ్యోనౌ జన్మవత్యా వానర్యా బాలకానహో ।
స్నేహోత్సహైవ నీయంతే ధిఙ్మాం మానవదేహజామ్ ॥ 65

ఏవం చాపి నిజం బాలం త్యక్త్వా గేహేఽద్య గమ్యతే ।
మయా విమూఢయా స్నాతుం భువ్యత్ర క్షణికం సుఖమ్ ॥ 66

ఇతి ధిక్కృత్య చాత్మానం పరివృత్యాశ్రమం యయౌ ।
ఏతస్మిన్నంతరే గేహే వాల్మీకిర్మునిపుంగవః ॥ 67

గతః స లఘుశంకార్థం కార్యార్థం వటవో గతాః ।
గృహీత్వా సా కుశం ప్రేంఖాద్యయౌ సీతా బహిః పునః ॥ 68

దాస్యా సహ నదీం గత్వోషసి స్నానం చకార వై ।
అదృష్ట్వాఽథ మునిర్బాలం దీర్ఘం నిఃశ్వస్య వై ముహుః ॥ 69

## వాల్మీకిముని తన తపశ్శక్తిచే లవుని నిర్మించి, సీతాదేవికిచ్చుట.

కుశుడు తన ఆటలచే తల్లిని సంతోషపెట్టుచుండెను. ఒకసారి సీతమ్మ వాల్మీకి ఎదుట చిన్ని మంచము మీద నిద్రించుచున్న కుశుని జూచి, వేరొకపనిమీద తన చెలికత్తె వెడలగ తన తల్లిదండ్రులైన సుమేధ, జనకులు మొదలగువారందరును వెలుపల వెడలిన సంగతి చూసి, ఆశ్వీయుజ ఆదివారమున నదిస్నానము చేయనెంచి, బిడ్డను జాగ్రత్తగా చూచుకొని యుండునట్లు వాల్మీకి మహర్షితో చెప్పి, తాను దాసితోడ తమసానదికి బయలుదేరెను. ఇట్లు పోవుచు దారిలో తనమీద ఐదు పిల్లలను

ఎక్కించుకుని ఆడుకొనుచున్న ఆడకోతిని జూచి, తనబిడ్డను తలంచుకుని, మనసున, "జంతుగర్భమున పుట్టిన ఈ కోతి తన పిల్లలను చక్కగా తన వెంటబెట్టుకుని పోవుచున్నది. ఛీ, పొమ్ము, మానవ జన్మ ఎత్తిన నేను నాయొక్కబిడ్డను ఇంటిలో విడిచి, మూఢురాలనై స్నానమునకు పోవుచున్నాను. ఈ భూమిలోని సుఖము క్షణికమైనది," అని తన్నుతానే నిందించుకుని, వెనుకకు తిరిగి ఆశ్రమమునకు వచ్చెను. అంతలో అచట ఇంటిలో వాల్మీకిముని అల్పశంకకు పోయిఉండెను. శిష్యులు వారివారి పనులమీద ఉండిరి.

**సీతాశాపభయాచ్చక్రే లవైర్బాలం స పూర్వవత్ ।**
**తపోబలేన తం ప్రోక్ష్య జీవయామాస వేగతః ॥ 70**

**జ్ఞానదృష్ట్యా తీవ్రతయా మునీనా నావలోకితమ్ ।**
**తతః సీతాఽపి సుస్నాతా దాస్యా గేహం శనైర్యయౌ ॥ 71**

**కటౌ గృహీత్వా తం బాలం రుక్మనూపురనిఃస్వనా ।**
**ప్రేంఖ్యేఽన్యం బాలకం దృష్ట్వా మునిం పప్రచ్ఛ జానకీ ॥ 72**

**ప్రేంఖే కస్యాః శిశుశ్చాయం సోఽపి దృష్ట్వా తదా కుశమ్ ।**
**కటిప్రదేశే జానక్యా విస్మయం పరమం గతః ॥ 73**

**నమస్కృత్య తతః సీతాం సర్వం వృత్తం న్యవేదయత్ ।**
**అంకే నిధాయ తం బాలం సీతాయా అబ్రవీన్మునిః ॥ 74**

**ప్రసాదాన్మమ వైదేహి ద్వితీయోఽయం సుతస్తవ ।**
**భవత్వద్య లవో నామ్నా లవైర్యస్మాద్వినిర్మితః ॥ 75**

**వాల్మీకేర్వచనాత్సాఽపి శిశుం జగ్రాహ జానకీ ।**
**మునిస్తయోర్నామ చక్రే కుశో జ్యేష్ఠోఽనుజో లవః ॥ 76**

**జాతకర్మాదిసంస్కారాన్ లవస్యాపి చకార సః ।**
**తదా నినేదుర్వాద్యాని భూమ్యాం ఖేఽపి దివౌకసామ్ ॥ 77**

**వవర్షుజానకీం బాలౌ వాల్మీకిం కుసుమైః సురాః ।**
**చకార జనకశ్చాపి సుమేధా పరమోత్సవాన్ ॥ 78**

**క్రమేణ విద్యాసంపన్నౌ సీతాపుత్రౌ విరేజతుః ।**
**ధనుర్విద్యామస్త్రవిద్యాం శిక్షయామాస తౌ మునిః ॥ 79**

**కృత్స్నం రామాయణం స్వీయం కృతం తౌ శిక్షయన్ముదా ।**
**యస్మిన్నానందరమ్యం చ చరిత్రం రాఘవస్య హి ॥ 80**

అపుడు సీతమ్మ చిన్నిమంచం మీద ఉన్న తన బిడ్డ 'కుశుని' ఎత్తుకుని మరలా నదికి బయలుదేరెను. అట్లే దాసీతోడ తమసానదిలో ఉదయపు స్నానమునాచరించెను. ఇచట ఆశ్రమములో మంచముమీద మునీంద్రుడు బిడ్డను గానక మరలా మరలా నిట్టూర్పువిడుచుచు, సీతాదేవి శపించునేమోయని భయము వలన, లవము(దర్బ)లచే కుశునివలె ఒకబాలునిచేసిపెట్టి, తన తపోబలముచే ప్రోక్షించి, త్వరగా జీవశక్తిని ఇచ్చెను. అప్పటి ఆతురతచే మునీంద్రుడు జ్ఞానదృష్టిచే యథార్థమును ఎఱుగడయ్యె. అంత ఆసీతమ్మయును స్నానముచేసి, దాసీతోడ తిన్నగా కుటీరమునకు వచ్చెను. నడుమున కుశుని ఎత్తుకుని మంచము మీద మరియొకబాలుని చూసి, "మంచముమీది ఈ బాలుడు ఎవరు? అని మునీంద్రుని అడిగెను. అపుడు వాల్మీకి మహర్షి సీతాదేవి చంకన కుశునిజూచి, చాలా ఆశ్చర్యముతో సీతాదేవికి నమస్కరించి, సర్వవృత్తాంతమును విన్నవించెను మరియు ఆబాలకుని సీతాదేవియొక్క తొడమీద కూర్చుండబెట్టి, జానకమ్మా! నాయొక్క ప్రసాదమువలన నీకు వీడు రెండవ కొడుకు అగును. వీనిని లవములచే నిర్మించినందువలన వీనిపేరు లవణుడు అని చెప్పబడును. అని ఆనతిని ఇచ్చెను. అంత ఆ సీతకూడా వాల్మీకి వచనానుసారముగా ఆ శిశువును అంగీకరించి, లాలించెను. (75) మునీంద్రుడు ఆ బాలకులు ఇరువురిలో పెద్దవానిని కుశుడనియును, చిన్నవానిని లవుడనియును పేర్లు పెట్టి, లవునికి కూడా జాతకర్మాది సంస్కారములు జేసెను.

అపుడు భూమిమీదా, స్వర్గములోను మంగళవాద్యములు మ్రోగెను. దేవతలు సీతాదేవి మీదను, బాలకులమీదను, వాల్మీకి మీదను పూలవాన కురిపించిరి. సుమేధా జనకులు పరమోత్సవమును చేయించిరి. క్రమముగా ఆ బాలురు ఇరువురును విద్యాసంపన్నులైరి. వాల్మీకి వారికి ధనుర్విద్యను, అస్త్రవిద్యను చక్కగా నేర్పెను. శ్రీరామునియొక్క ఆనంద రమ్యమగు చరిత్రముగల సమగ్ర రామాయణమును వ్రాసెను.

**కుమారౌ స్వరసంపన్నౌ సుందరావశ్వినావివ ।**
**తంత్రీలయసమాయుక్తౌ గాయంతౌ చేరతుర్వనే ॥ 81**

**తత్ర తత్ర మునీనాం తు సమాజేషు సురూపిణౌ ।**
**గాయంతావపి తౌ దృష్ట్వా విస్మితా మునయోఽబ్రువన్ ॥ 82**

గంధర్వేష్విహ కిన్నరేషు భువి వా దేవేషు దేవాలయే
పాతాలేష్వథ వా చతుర్ముఖగృహే లోకేషు సర్వేషు చ ।
అస్మాభిశ్చిరజీవిభిశ్చిరతరం దృష్ట్వా దిశః సర్వతో
నాజ్ఞాయీదృశగీతవాద్యగరిమా నాదర్శి నాశ్రావి చ ॥ **83**

ఏవం స్తువద్భిరఖిలైర్మునిభిః ప్రతివాసరమ్ ।
ఆసాతే సుఖమేకాంతే వాల్మీకేరాశ్రమే చిరమ్ ॥ **84**

రుక్మకంకణమంజీరన్ నూపురైస్తౌ విభూషితౌ ।
కేయూరరశనాహార కుండలైరతిశోభితౌ ॥ **85**

నిజక్రీడాకౌతుకైశ్చ బాలవాక్యైర్మనోహరైః ।
సీతాం సుమేధాం జనకం రంజయమాసతుర్మునిమ్ ॥ **86**

**ఇతి శ్రీశతకోటిరామచరితాంతర్గతే, శ్రీమదానందరామాయణే, వాల్మీకీయే, ఆదికావ్యే, జన్మకాండే, కుశ లవ జన్మకథనం నామ, చతుర్థః సర్గః ॥**

అశ్వినీ దేవతలవలే సుందరాంగులైన కుశ, లవులు మధుర స్వరసంపన్నులై, వీణాపాణులై తాళానుసారముగా శ్రీరామదివ్యచరితమును పాడుచు, వనమునను, ముని సమాజములలోను సంచరించు చుండిరి. గానముచేయునట్టి కుమారులనుజూచి ఎంతో ఆశ్చర్యమునందిన మునీంద్రులు, "ఆహా! చిరకాలమునుండి చిరంజీవులగు మేము గంధర్వులలోను, కిన్నెరులలోను, దేవతలలోను స్వర్గ, భూ, పాతాళ, కైలాస, సత్యలోకాది సమస్తలోకములలోను, సర్వదిక్కులలోను, విశేషముగా సంగీతమును వింటిమిగాని ఇట్టి గీత వాద్య నైపుణ్యమును మేము ఎరుగము. మేమెన్నడును వినలేదు," అని ఇట్లు పొగడుచుండిరి. ఇట్లు సర్వసంస్తులై బంగారు ఆభరణములు అలంకరించుకున్న సుకుమార మూర్తులైన చిన్నారులు ఇరువురును వాల్మీకి ఆశ్రమములో ఏకాంతమున సుఖముగా చిరకాలము వసించుచుండిరి. ఆ బాలకులు బాలాక్రీడలచేతను, బాలవాక్కులచేతను సీతాదేవిని, సుమేధా జనకులను, వాల్మీకి మునీంద్రునికూడా ఆనందింపజేయుచుండిరి.

***ఈ విధముగ శ్రీమద్వాల్మీకి మహర్షిచే రచింపబడిన, శ్రీ శతకోటిరామచరితాంతర్గత శ్రీమత్ ఆనందరామాయణములో, ఐదవదైన జన్మకాండలో కుశ, లవ జననము వివరించు 4వ సర్గ ముగిసినది.***

# పంచమః సర్గః-5వ సర్గ

## శ్రీరామ రక్షాస్తోత్రము

విష్ణుదాస ఉవాచ
శ్రీరామరక్షయా ప్రోక్తం కుశాస్య హ్యాభిమంత్రణమ్ ।
కృతం తేనైవ మునినా గురో తాం మే ప్రకాశయ ॥ 1

రామరక్షాం వరాం పుణ్యాం బాలానాం శాంతికారిణీమ్ ।
శ్రీశివ ఉవాచ
ఇతి శిష్యవచః శ్రుత్వా రామదాసోఽబ్రవీద్వచః ॥ 2

శ్రీరామదాస ఉవాచ
సమ్యక్ పృష్టం త్వయా శిష్య రామరక్షాఽధునోచ్యతే ।
యా ప్రోక్తా శంభునా పూర్వం స్కందార్థే గిరిజాం ప్రతి ॥ 3

## శ్రీరామరక్ష స్తోత్రాభివర్ణనము.

విష్ణుదాసు ఇట్లు అడిగెను, "గురువరా! వాల్మీకిముని 'శ్రీరామరక్ష'చేత కుశుని అభిమంత్రించెనని శెలవిచ్చితిరే, అట్టి శ్రేష్ఠమును, బాలదోషశాంతి కారిణియునైన శ్రీరామరక్షను నన్ను అనుగ్రహించి, చెప్పవలయును," అని ప్రార్థించెను. శిష్యునికి శ్రీరామదాసు ఇట్లు చెప్పుచున్నాడు, "శిష్యుడా! నీవు చక్కగా అడిగితివి. మునుపు స్కందుని కొరకు పార్వతికి పరమేశ్వరుడు చెప్పిన శ్రీరామ రక్షను చెప్పుచున్నాను వినుము.

శ్రీశివ ఉవాచ
దేవ్యద్య స్కందపుత్రాయ రామరక్షాభి మంత్రణమ్ ।
కురు తారకఘాతాయ సమర్థోఽయం భవిష్యతి ॥ 4

ఇత్యుక్త్వా కథయామాస రామరక్షాం శివః స్త్రియై ।
నమస్కృత్య రామచంద్రం శుచిర్భూత్వా జితేంద్రియః ॥ 5

అథ ధ్యానమ్
వామే కోదండదండనిజకరకమలే దక్షిణే బాణమేకం
పశ్చాద్భాగే చ నిత్యం దధతమభిమతం సాసితూణీరభారమ్ ।
వామేఽవామేవ సద్భ్యాం సహ మిలితతనుం జానకీలక్ష్మణాభ్యామ్
శ్యామం రామం భజేఽహం ప్రణతజనమనః ఖేదవిచ్ఛేదదక్షమ్ ॥ 6

అస్య శ్రీరామరక్షాస్తోత్రమంత్రస్య, బుధకౌశిక ఋషిః,
శ్రీరామచంద్రో దేవతా, రామ ఇతి బీజమ్, అనుష్టుప్ ఛందః,
శ్రీరామప్రీత్యర్థే జపే వినియోగః ॥

చరితం రఘునాథస్య శతకోటిప్రవిస్తరమ్ ।
ఏకైకమక్షరం పుంసాం మహాపాతకనాశనమ్ ॥ 7

ధ్యాత్వా నీలోత్పలశ్యామం రామం రాజీవలోచనమ్ ।
జానకీలక్ష్మణోపేతం జటాముకుటమండితమ్ ॥ 8

సాసితూణధనుర్బాణపాణిం నక్తంచరాంతకమ్ ।
స్వలీలయా జగత్త్రాతుమావిర్భూతమజం విభుమ్ ॥ 9

శ్రీశివుడు ఇట్లు అనెను, "దేవీ! పుత్రుడగు మన స్కందునికి రామరక్షాభి మంత్రణము చేయుము. దీనితో స్కందుడు తారకాసుర సంహారమునకు సమర్థుడు కాగలడు." అని శ్రీరామచంద్రస్వామికి నమస్కరించి; పరిశుద్ధుడు, జితేంద్రియుడైన శివుడు పార్వతితో ఇట్లనెను, (5)

(6వ శ్లోకం నుండి 40 వ శ్లోకమువరకు శ్రీరామరక్షాస్తోత్రము)

తామరము వంటి తన ఎడమచేతిలో ధనుర్దండమును, కుడిచేతిలో బాణమును ధరించి, వెనుక ప్రక్కన ఖడ్గమును, అమ్ములపొదిని దాల్చి, తన ఎడమప్రక్క సీతాదేవియు, కుడిప్రక్క లక్ష్మణ స్వామియు నిలిచియుండగా, నల్లని మేనుకలిగి సల్లలితాకారుడై వెలుగుచుండు భక్తుల మనస్సంకటములను పరిహరించుటలో మిక్కిలి సమర్థుడైన శ్రీరామచంద్రస్వామిని భజించుచున్నాను. (ఇది ధ్యానము.)

శ్రీరామ రక్షాసోత్ర మంత్రమునకు బుధకౌశికుడు ఋషి, దీనికి దేవత శ్రీరామచంద్రుడు, దీనికి బీజము రామనామము, దీని ఛందస్సు అనుష్టుప్, శ్రీరామప్రీతికై దీనిని వినియోగించుచున్నాను. శతకోటి ప్రవిస్తరమైన శ్రీరామచరిత్రమున ఒక్కొక్క అక్షరము మానవుని మహా పాపములను పరిహరించునంతటిది. కమలముల వంటి కన్నులు కలవాడును, సీతా లక్ష్మణ సమేతుడును, జటాకిరీటాలంకృతుడును, ధనుర్బాణ, ఖడ్గ, తూణీరములను ధరించిన వాడును, రాక్షసాంతకుడును,

స్వయం ప్రభువుగాన నిజలీలచే, లోకములను రక్షించుటకై అవతరించినవాడైన శ్రీరామచంద్రస్వామిని ధ్యానించి, (9)

రామరక్షాం పఠేత్ప్రాజ్ఞః పాపఘ్నీం సర్వకామదామ్ ।
శిరో మే రాఘవః పాతు ఫాలం దశరథాత్మజః ॥ 10

కౌసల్యేయో దృశౌ పాతు విశ్వామిత్రప్రియః శ్రుతీ ।
ఘ్రాణం పాతు మఖత్రాతా ముఖం సౌమిత్రివత్సలః ॥ 11

జిహ్వాం విద్యానిధిః పాతు కంఠం భరతవందితః ।
స్కంధౌ దివ్యాయుధః పాతు భుజౌ భగ్నేశకార్ముకః ॥ 12

కరౌ సీతాపతిః పాతు హృదయం జామదగ్న్యజిత్ ।
పార్శ్వే రఘువరః పాతు కుక్షీ ఇక్ష్వాకునందనః ॥ 13

మధ్యం పాతు ఖరధ్వంసీ నాభిం జాంబవదాశ్రయః ।
సుగ్రీవేశః కటిం పాతు సక్థినీ హనుమత్ప్రభుః ॥ 14

ఊరూ రఘూత్తమః పాతు గుహ్యం రక్షః కులాంతకృత్ ।
జానునీ సేతుకృత్పాతు జంఘే దశముఖాంతకః ॥ 15

పాదౌ విభీషణశ్రీదః పాతు రామోఽఖిలం వపుః ।
ఏతాం రామబలోపేతాం రక్షాం యః సుకృతీ పఠేత్ ॥
స చిరాయుః సుఖీ పుత్రీ విజయీ వినయీ భవేత్ ॥ 16

పాతాలభూతలవ్యోమచారిణశ్ఛద్మచారిణః ।
న ద్రష్టుమపి శక్తాస్తే రక్షితం రామనామభిః ॥ 17

రామేతి రామభద్రేతి రామచంద్రేతి వా స్మరన్ ।
నరో న లిప్యతే పాపైర్భుక్తిం ముక్తిం చ విందతి ॥ 18

జగజ్జైత్రైకమంత్రేణ రామనామ్నాఽభిరక్షితమ్ ।
యః కంఠే ధారయేత్తస్య కరస్థాః సర్వసిద్ధయః ॥ 19

వజ్రపంజరనామేదం యో రామకవచం పఠేత్ ।
అవ్యాహతాజ్ఞః సర్వత్ర లభతే జయమంగళమ్ ॥ 20

**ఆదిష్టవాన్ యథా స్వప్నే రామరక్షామిమాం హరః ।**
**తథా లిఖితవాన్ ప్రాతః ప్రబుద్ధో బుధకౌశికః ॥ 21**

సమస్త కోరికలను తీర్చునట్టిది, పాపములను పారద్రోలే రామరక్షను ప్రాజ్ఞుడు పఠించవలయును. రాఘవుడు నా తలను రక్షించుగాక, దశరథనందనుడు నా ఫాలమును పాలించని (10). కౌసల్యాసుతుడు నా కన్నులను బ్రోచనీ, విశ్వామిత్ర ప్రియుడు చెవులను, యజ్ఞరక్షకుడు నా ముక్కును, లక్ష్మణ వత్సలుడు నా ముఖమును, విద్యానిధి నా నాలుకను, భరతస్తుతుడు కంఠమును, దివ్యాయుధుడు నా మూపులను, శివుని విల్లు విరచినవాడు నా భుజములను, జానకీనాథుడు నా చేతులను, పరశు రాముని జయించినవాడు నా భుజములను, రఘువరుడు నా ప్రక్కలను, ఇక్ష్వాకు వంశజుడు నా కడుపును, ఖరాంతకుడు నా నడుమును, జాంబవదాశ్రయుడు నా బొడ్డును, సుగ్రీవనాథుడు నా కటిప్రదేశమును, హనుమన్నాయకుడు నా పైతొడలను, రఘూత్తముడు నా క్రింది తొడలను, రాక్షసాంతకుడు నా గుహ్యమును, సేతువును కట్టినవాడు నా మోకాళ్ళను, రావణాంతకుడు నా పిక్కలను, విభీషణునికి సంపదలిచ్చినవాడు నాపాదములను, శ్రీరాముడు సర్వాంగములను కాపాడుగాక! ఇట్టి రామశక్తి యుక్తమగు రక్షను ఎవ్వడు పఠించునో వాడు ఆయుస్సౌఖ్యములను, వినయ విజయములను, పుత్రులను గలిగినవాడగును. (16) రామనామములచే రక్షింపబడినవానిని, త్రిలోకసంచారులును, మోసగాండ్రను చూచుటకు కూడా శక్తులు కాజాలరు. (17) రామా! అనిగాని, రామభద్రా! అనిగాని, రామచంద్రా! అనిగాని స్మరించు మానవుడు పాపముక్తుడై ఇహ పర గతులను అందగలడు. లోకైక విజయ మంత్రములైన రామ నామముచే రక్షింపబడనివాడెవడు? దీనిని కంఠమున ధరించినచో నవసిద్ధులు సొంతమగును, వజ్రపంజర నామకమగు ఈరామకవచమును పఠించినవాడు అంతటా నిజాజ్ఞచెల్లుచుండగా జయమును, మంగళమును అందగలడు. (20) ఈ రామరక్షను శివుడు స్వప్నమునందు ఎట్లు చెప్పెనో అట్లే బుధకౌశికుడు మోల్కొని ప్రొద్దున వ్రాసెను. (21)

**రామో దాశరథిః శూరో లక్ష్మణానుచరో బలీ ।**
**కాకుస్థః పురుషః పూర్ణః కౌసల్యానందవర్ధనః ॥ 22**

**వేదాంతవేద్యో యజ్ఞేశః పురాణపురుషోత్తమః ।**
**జానకీవల్లభః శ్రీమానప్రమేయపరాక్రమః ॥ 23**

**ఇత్యేతాని జపేన్నిత్యం మద్భక్తః శ్రద్ధయాఽన్వితః ।**
**అశ్వమేధాయుతం పుణ్యం సంప్రాప్నోతి న సంశయః ॥ 24**

సన్నద్ధః కవచీ ఖడ్గీ చాపబాణధరో యువా ।
గచ్ఛన్ మనోరథోఽస్మాకం రామః పాతు సలక్ష్మణః ॥ 25

తరుణౌ రూపసంపన్నౌ సుకుమారౌ మహాబలౌ ।
పుండరీకవిశాలాక్షౌ చీరకృష్ణాజినాంబరౌ ॥ 26

ఫలమూలాశనౌ దాంతౌ తాపసౌ బ్రహ్మచారిణౌ ।
పుత్రౌ దశరథస్యైతౌ భ్రాతరౌ రామలక్ష్మణౌ ॥ 27

ధన్వినౌ బద్ధనిస్త్రింశౌ కాకపక్షధరౌ శ్రుతౌ ।
వీరౌ మాం పథి రక్షేతాం తావుభౌ రామలక్ష్మణౌ ॥ 28

శరణ్యౌ సర్వసత్త్వానాం శ్రేష్ఠౌ సర్వధనుష్మతామ్ ।
రక్షః కులనిహంతారౌ త్రాయేతాం నో రఘూత్తమౌ ॥ 29

ఆత్తసజ్జధనుషావిషుస్పృశా వక్షయాశుగనిషంగ సంగినౌ ।
రక్షణాయ మమ రామలక్ష్మణావగ్రతః పథి సదైవ గచ్ఛతామ్ ॥ 30

ఆరామః కల్పవృక్షాణాం విరామః సకలాపదామ్ ।
అభిరామస్త్రిలోకానాం రామః శ్రీమాన్ స నః ప్రభుః ॥ 31

22,23 ఈ రెండు శ్లోకములను నా యొక్క భక్తుడు ఎవ్వడు శ్రద్ధగా పఠించునో వాడు అశ్వమేధముకన్న అధికమైన పుణ్యమును అందగలడు. ఇందులో సంశయములేదు. (24) చాపబాణములను, కవచఖడ్గములను ధరించిన తరుణుడును, యుద్ధ సన్నద్ధుడైన లక్ష్మణునితో పోవుచుండు మా మనోరథమూర్తియగు రాముడు రక్షించుగాక! (25) సుకుమారులును, సుందరాంగులును, మహాబలులును, తరుణులును, కమలపూల రేకులవంటి కన్నులుగల వారు, లేడి చర్మమును ధరించినవారును, పండ్లను, దుంపలను ఆహారముగా తీసుకునేవారు, జితేంద్రియులును, తపస్సంపన్నులును, బ్రహ్మచారులును, అనురూప సహజాతులును, వీరులును, ధనుర్బాణ ఖడ్గదారులును, వంకీలజుట్ట గలవారు, దశరథనందనులు అయిన శ్రీరామలక్ష్మణులు నన్ను దారిలో రక్షించుచుండనీ (28) సమస్త ప్రాణులకు రక్షకులును, ధనుర్ధారులలో శ్రేష్ఠులును, రాక్షసకులాంతకులు అయిన రఘువీరులు మము బ్రోచుగాక. (29) అక్షయ తూణీరములుగల రామలక్ష్మణులు వింటిని ఎక్కుపెట్టి, చేతబాణమును అందుకుని, నిరంతరము నాయొక్క రక్షణ కొరకు దారిలో ముందుగా పోవుచుండనీ (30). మా యొక్క ప్రభువగు శ్రీరాముడు కల్పవృక్షములకు ఉద్యానవనము వంటివాడు. సమస్త విపత్తులకును తొలగించువాడు. ముల్లోకములకును అభిరాముడు

రామాయ రామభద్రాయ రామచంద్రాయ వేధసే ।
రఘునాథాయ నాథాయ సీతాయాః పతయేనమః ॥ 32

శ్రీరామ రామ రఘునందన రామ రామ
శ్రీరామ రామ రామ భరతాగ్రజ రామ రామ ।
శ్రీరామ రామ రణకర్కశ రామ రామ
శ్రీరామ రామ శరణం భవ రామ రామ ॥ 33

లోకాభిరామం రణరంగధీరం
రాజీవనేత్రం రఘువంశనాథమ్ ।
కారుణ్య రూపం కరుణాకరం తం
శ్రీరామచంద్రం శరణం ప్రపద్యే ॥ 34

దక్షిణే లక్ష్మణో యస్య వామే చ జనకాత్మజా ।
పురతో మారుతిర్యస్య తం వందే రఘునందనమ్ ॥ 35

గోష్పదీకృతవారాశిం మశకీకృత రాక్షసమ్ ।
రామాయణమహామాలారత్నం వందేऽనిలాత్మజమ్ ॥ 36

అఘౌఘ తిష్ఠ దూరే త్వం రోగాస్తిష్ఠంతు దూరతః ।
వరీవర్తి సదాऽస్మాకం హృది రామో ధనుర్ధరః ॥ 37

మనోజవం మారుతతుల్యవేగం
జితేంద్రియం బుద్ధిమతాం వరిష్టమ్ ।
వాతాత్మజం వానరయూధముఖ్యం
శ్రీరామదూతం శరణం ప్రపద్యే ॥ 38

రామ రామ తవ పాదపంకజం
చింతయామి భవబంధముక్తయే ।
వందితం సురనరేంద్రమౌళిభిర్
ధ్యాయితం మనసి యోగిభిః సదా ॥ 39

**రామం లక్ష్మణపూర్వజం రఘువరం సీతాపతిం సుందరం**
**కాకుత్స్థం కరుణార్ణవం గుణనిధిం విప్రప్రియం ధార్మికమ్ ।**
**రాజేంద్రం సత్యసంధం దశరథతనయం శ్యామలం శాంతమూర్తిం**
**వందే లోకాభిరామం రఘుకులతిలకం రాఘవం రావణారిమ్ ॥ 40**

యోగిచిత్తాలలో రమించువాడు, మంగళమూర్తియు, లోకాహ్లాదకుడు, పరమాత్మయు, రఘుకుల తిలకుడు, ఈశ్వరుడు, జానకి వల్లభుడు అయిన శ్రీరామునికి నమస్కారము. (32) శ్రీరామా! నిన్ను 19 మార్లు స్మరించెదను నాకు నీవు రక్షకుడువు అగుము. (33) లోకమోహనుడును, యుద్ధశూరుడును, కమలనయనుడును, రఘుకుల నాయకుడును, దయానిధియును, రక్షకుడు అయిన శ్రీరామచంద్ర స్వామిని పొందుచున్నాను. (34) కుడిప్రక్కలో లక్ష్మణుడును, ఎడమప్రక్కలో సీతయును, ఎదుట ఆంజనేయుడును గల రాఘవమూర్తికి నమస్కరించెదను (35). సముద్రమును ఆవుయొక్క అడుగుగా చేసుకుని లంఘించినవాడును, రాక్షసులను దోమలుగా చేసుకుని దుమ్ముదులిపినవాడును అగు శ్రీరామ చరిత్రను హారమున రత్నమువలె రంజించునట్టి వాయుపుత్రునికి నమస్కరించెదను (36). కోదండపాణియగు శ్రీరాముడు నిరంతరము మా మనమున నివసించుటచేత పాప సమూహమా! నీవు దూరముగా పొమ్ము. రోగములారా! మీరు నిలువదగదు. (37). మనస్సువంటి వేగమును, వాయువు వంటి గమనశక్తియును, జితేంద్రియత్వము, ధీమంతులలో శ్రేష్ఠత్వము కపిసైన్యమున ప్రాముఖ్యము. శ్రీరామ కింకరత్వమును గల వాయునందనుడగు ఆంజనేయ స్వామిని రక్షకునిగా పొందెదను (38). శ్రీరామా! నిరంతరము యోగులచే మనమున ధ్యానింపబడుచుండెడు దేవరాజ, నరరాజ కిరీటములచే వందింపబడుచుండెడు నీయొక్క చరణకమలములను జన్మసంకట పరిహారమునకై చింతించుచున్నాను (39). రామా! లక్ష్మణాగ్రజా! రఘువీరా! సీతాపతి! సుందరా! కాకుత్స్థకుల జాతా! దయానిధీ, గుణనిధీ, బ్రాహ్మణప్రియా! ధార్మిక, రాజరాజా, సత్యసంధా, దశరథనందనా, శ్యామలాంగనా, శాంతమూర్తీ, లోకసుందరా, రఘువంశరత్నమా, రాఘవా, రావణ వైరీ! నీకు నమస్కరించెదను (40).

**ఏతాని రామనామాని ప్రాతరుత్థాయ యః పఠేత్ ।**
**అపుత్రో లభతే పుత్రం ధనార్థీ లభతే ధనమ్ ॥ 41**

**మాతా రామో మత్పితా రామచంద్రః**
**స్వామీ రామో మత్సఖా రామచంద్రః ।**
**సర్వస్వం మే రామచంద్రో దయాళుః**
**నాన్యం జానే నైవ జానే న జానే ॥ 42**

శ్రీరామనామామృతమంత్రబీజ
సంజీవనీ చేన్మనసి ప్రవిష్టా ।
హాలాహలం వా ప్రళయానలం వా
మృత్యోర్ముకం వా విశతాం ప్రవిష్టా ॥ 43

శ్రీశబ్దపూర్వం జయశబ్దమధ్యం
జయద్వయేనాపి పునః ప్రయుక్తమ్ ।
త్రిః సప్తకృత్వో రఘునాథనామ
జపాన్నిహన్యాద్విజకోటిహత్యాః ॥ 44

ఏవం గిరీంద్రజే ప్రోక్తా రామరక్షా మయా తవ ।
మయోపదిష్టా యా స్వాస్యైర్విశ్వామిత్రాయ వై పురా ॥ 45

శ్రీరామదాస ఉవాచ
ఇతి శివేనోపదిశం శ్రుత్వా దేవీ గిరీంద్రజా ।
రామరక్షాం పఠిత్వా సా స్కందం సమభిమంత్రయత్ ॥ 46

తస్యాస్తేజోబలేనైవ జఘాన తారకాసురమ్ ।
షడాననః క్షణాదేవ కృతకృత్యోఽభవత్పురా ॥ 47

సైవేయం రామరక్షా తే మయాఽఽఖ్యాతాఽతిపుణ్యదా ।
యస్యాః శ్రవణమాత్రేణ కస్యాపి న భయం భవేత్ ॥ 48

వాల్మీకినాఽనయా పూర్వం కుశాయ హ్యభిషేచనమ్ ।
కృతం బాలగ్రహాణాం చ శాంత్యర్థం సా మయోదితా ॥ 49

బాలానాం గ్రహశాంత్యర్థం జపనీయా నిరంతరమ్ ।
రామరక్షా మహాశ్రేష్ఠా మహాఘౌఘనివారిణీ ॥ 50

నాస్యాః పరతరం స్తోత్రం నాస్యాః పరతరో జపః ।
నాస్యాః పరతరం కించిత్ సత్యం సత్యం వదామ్యహమ్ ॥ 51

**ఇతి శ్రీశతకోటిరామచరితాంతర్గతే, శ్రీమదానందరామాయణే, వాల్మీకీయే, ఆదికావ్యే, జన్మకాండే, రామరక్షాకథనం నామ, పంచమః సర్గః ॥ (5)**

5వ శ్లోకము మొదలు, 41వ శ్లోకము వరకు అనగా శ్రీరామ నామాంకిత మగు ఈ 35 శ్లోకములను శ్రద్ధగా ప్రొద్దున లేచి ఎవ్వడు పఠించునో, అతడు పుత్రులు లేనివాడైనచో పుత్రులను, ధనమును కోరినచో ధనాన్ని పొందగలడు (41). నా తల్లియు, నా తండ్రియు, నన్నేలినవాడును, నా చెలికాడును, మరియు నా సర్వస్వమును, దయాళువైన శ్రీరామచంద్రుడు ఒక్కడే. వేరొకరిని నేను ఎఱుగను, నిక్కముగా ఎరుగను, నాకు తెలియదు (42). శ్రీరాములవారి దివ్యనామము అను అమృత మంత్రముయొక్క బీజమైన రామ భక్తియును, సంజీవని రసము మనమున ప్రవేశించియుండగా, కాలకూటవిషములను, ప్రళయాగ్నియందును, మృత్యుముఖము నందును ప్రవేశించినను భయములేదు (43) "శ్రీజయ రఘునాథా, జయజయ" అను మంత్రమును 27 మార్లు జపించువానియొక్క బ్రహ్మహత్యాది అనేక పాపములు పరిహరించును (44).

పార్వతీ! మునుపు నేను విశ్వామిత్రునికి స్వప్నమున ఎట్లు ఉపదేశించితినో అట్లే రామరక్షను నీకు ఉపదేశించితిని (45). అని శివుడు అనుగ్రహించెనని, రామదాసుడు మరలా చెప్పుచున్నాడు- పార్వతీదేవి ఇట్లు శివునిచే ఉపదేశింపబడిన శ్రీరామ మంత్రరక్షణచే కుమారస్వామిని అభిమంత్రించెను. మునుపు షణ్ముఖుడు దాని మహిమవలననే తారకాసురుని సంహరించి, ధన్యుడాయెను (47). విష్ణుదాసా! ఈ రామరక్షను నీకు నేను చెప్పితిని. ఇది మిక్కిలి పుణ్యకరము. దీనిని విన్నందువలన దేని భయమును లేదు (48). శ్రీ వాల్మీకిముని బాలగ్రహశాంతికొరకు ఈ శ్రీరామరక్షచేతనే కుశుని అభిమంత్రించెను (49). మహా దురిత పరిహారకమగు ఈ శ్రీరామరక్షను బాలగ్రహ పీడాపరిహారార్థము నిరంతరము జపించదగును. (50)

దీనికి మించిన మేలైన స్తోత్రములేదు. దీనికన్నామించిన జపములేదు. ఇంతకన్నను గొప్పది మరియొకటిలేదు. నేను సత్యముగా చెప్పుచున్నాను (51). ఈ సర్గలో చెప్పబడిన రామరక్షను షణ్ముఖునికై శివుడు దేవికి ఉపదేశించెను అనిన, కాలవ్యత్యాస దోషమని శంకించదగదు. వేదమున రామతాపిన్యుపనిషత్తులలో శ్రీరామ కథగలదు. 'తథా యథా పూర్వమకల్పయత్', అని ఉండుటచే కుమారోత్పత్తికి వెనుకటి మేధో కల్పములోని శ్రీరామ రక్షయని ఎరుగదగును.

***ఈ విధముగ శ్రీమద్వాల్మీకి మహర్షిచే రచింపబడిన, శ్రీ శతకోటిరామచరితాంతర్గత శ్రీమత్ ఆనందరామాయణములో, ఐదవదైన జన్మకాండలో 5వ సర్గ ముగిసినది.***

# 6వ సర్గ

లవుడు అయోధ్యనుండి పుష్పములను తెచ్చుట

శ్రీరామదాస ఉవాచ
ఏకదా జానకీ ప్రాహ వాల్మీకిం మునిపుంగవమ్ ।
కథయస్వ వ్రతం యేన రామయోగో భవేన్మమ ॥ 1

తత్సీతావచనం శ్రుత్వా వాల్మీకిస్తాం వచోఽబ్రవీత్ ।
ప్రతిపద్దినమారభ్య యావత్సా నవమీ సితా ॥ 2

తావన్నవదినం సీతే వ్రతం కురు మయోచ్యతే ।
ప్రతిపది రామచంద్రపాదుకే ధాతునిర్మితే ॥ 3

కృత్వాఽర్చ్య నవకమలైర్దేహి మంత్రాంజలిం శుభమ్ ।
తతః పుత్రాననాభ్యాం త్వం జన్మకాండం శుభం శ్రుణు ॥ 4

అష్టాదశకమలైశ్చ ద్వితీయాయాం శుభాంజలిమ్ ।
మంత్రైర్దేహి పూజనాంతే పతిపాదుకయోర్ముదా ॥ 5

పతిం వినా స్త్రియా నాన్యత్పూజనీయం హి దైవతమ్ ।
జన్మకాండ ద్వివారం తు శ్రుణు భక్త్యా శుచివ్రతే ॥ 6

ఏవం వృద్ధిర్నవాబ్జైశ్చ కార్యా సీతే దినే దినే ।
నవమ్యామేకాశీత్యబ్జైః పూజ్యస్వ భర్తృపాదుకే ॥ 7

**వాల్మీకిముని సీతాదేవికి సంయోగకరణ వ్రతమును ఉపదేశించుట.**

శ్రీరామదాసు ఇట్లుపలికెను, ఒకసారి జానకీదేవి వాల్మీకి మునీంద్రులనుచూచి, "మునీంద్రా! శ్రీరాముని సమాగమము కలుగునట్టి వ్రతమును ఉపదేశింపుము." అని వేడెను. ఆ సీతావాక్యమును విని, వాల్మీకి ఇట్లనెను "సీతమ్మా! నేను ఒక వ్రతమును చెప్పెదను వినుము. శుక్లపక్షమున పాడ్యమి మొదలు నవమి వరకు వ్రతమును ఆచరించవలయును. పాడ్యమినాడు శ్రీరామచంద్రునియొక్క ధాతు రచితములైన పాదుకలను చేయించి పెట్టి, పూజించి, తొమ్మిది తామరపూలుగల మంత్రాంజలిని సమర్పించవలసినది. పిదప నీ బిడ్డ నోటిమీదుగా మంగళకరమగు జన్మకాండమును వినుము.

రెండవనాడగు విదియయందు పతి పాదుకలకు 18 కమలములుగల మంత్రజలాన్ని అర్పించదగును. నియమములతో జన్మకాండమును రెండుమార్లు వినవలయును. పతిని తప్ప వేరే దైవమును స్త్రీలు పూజింపరాదు. మూడవనాడు 27 కమలములు, మూడుమార్లు జన్మకాండ కథ వినినట్లు ఇట్లే వృద్ధినొందుచు రాగా,

నవవారం జన్మకాండం పుత్రాస్యాభ్యాం సుఖం శ్రుణు ।
తతో దశమ్యాం సుస్నాతైకాశీతి ద్విజదంపతీన్ ॥ 8

సంపూజ్య వస్త్రాభరణైర్భోజయస్వాత్ర మైథిలి ।
దత్వా తేభ్యో దక్షిణాస్త్వం విసర్జయ ప్రణమ్య తాన్ ॥ 9

అనేన వ్రతరాజేన జన్మకాండశ్రవాదపి ।
అచిరాత్పతినా యోగం ప్రాప్స్యసి త్వం విదేహజే ॥ 10

సంయోగీకరణం నామ వ్రతం చేదం సుపుణ్యదమ్ ।
యే కుర్వంత్యత్ర మనుజాః స్వీయైర్యోగం లభంతి తే ॥ 11

తన్మునేర్వచనం శ్రుత్వా జానకీ ప్రాహ తం పునః ।
బహూన్యబ్జాని సాకేతే పుష్పారామజలాశయే ॥ 12

సంతి కస్తత్ర వై గంతుం సమర్థస్త్విహ వర్తతే ।
రామాజ్ఞయ రామదూతైః క్రియతే రక్షణం సదా ॥ 13

తత్సీతావచనం శ్రుత్వా తత్పురః సంస్థితో లవః ।
అబ్రవీన్మాతరం వాక్యం పంచవర్షవయః స్థితః ॥ 14

అంబారంభం వ్రతస్యాద్య త్వం కురుష్వాచిరాదిహ ।
అబ్జాన్యహం ప్రదాస్యామి సమానీయ నిరంతరమ్ ॥ 15

తల్లవస్య వచః శ్రుత్వా విహస్యాలింగ్య బాలకమ్ ।
చుచుంబ తన్ముఖం సీతా లవం వచనమబ్రవీత్ ॥ 16

పంకజాని కథం వత్స త్వం సమానీయ దాస్యసి ।
అసంఖ్యాతై రామదూతైః క్రియతే రక్షణం సదా ॥ 17

**తన్మాతృవచనం శ్రుత్వా లవః ప్రాహాథ మాతరమ్ ।**
**అంబ త్వత్ స్తన్యపానేన వాల్మీకేః శస్త్రవిద్యయా ॥ 18**

**తథాశీర్భిర్మునేశ్చాపి రామస్యాపి భయం న మే ।**
**పశ్యాంబ పౌరుషం మేఽద్య మామనుజ్ఞాతుమర్హసి ॥ 19**

తొమ్మిదవనాడు 81 కమలముల మంత్రజలాన్ని అర్పించి, తొమ్మిది మార్లు జన్మకాండను పుత్రులనుండి వినవలయును. అంత దశమినాడు మంగళస్నానముచేసి, ఇచట 81 బ్రాహ్మణ దంపతులకు వస్త్రాభరణాలంకారాది సత్కారములచే పూజించి, మంచి భోజనము పెట్టి, తాంబూల దక్షిణలను ఇచ్చి, నమస్కరించి పంపుము. ఈ సర్వోత్తమ వ్రతమును ఆచరించుట చేతను, జన్మకాండ శ్రవణముచేతను నీవు త్వరగా నీ పతితో చేరుదువు. ఇది మిక్కిలి పుణ్యకరమైన సంయోగకరణమను పేరుగల వ్రతము. పతిభక్తికలిగి, ఎవరు ఈ వ్రతమును ఆచరించెదరో వారు తమవారియొక్క సమాయోగమును కలిగియుందురు. అని ఇట్లు చెప్పిన వాల్మీకిమునీంద్రునియొక్క మాటను విని మరలా సీతమ్మ, "మునీంద్రా! అయోధ్యలోని పుష్పారామమున సరోవరమునందు కావలసినన్ని తామరలు గలవు. అచటికిపోయి వచ్చునట్టి, సమర్థుడు ఇచట ఎవడుగలడు? అక్కడ శ్రీరామదూతలు రామాజ్ఞచే సరోవరమును చక్కగా రక్షించుచుందురు" అనెను. అపుడచట ఎదుట ఉన్న లవుడు సీతావాక్యమును విని, ఏడేండ్ల వయస్సుగలవాడైనను తన తల్లినిజూచి, "తల్లీ! త్వరగా నీవు ఇపుడే వ్రతమునకు ఆరంభింపుము. తప్పక ప్రతిరోజూ తామరలను తెచ్చి ఇచ్చెదను." అని చెప్పెను. లవుని మాటను విన్న సీతమ్మ నవ్వి, ఆ చిన్నవానిని తన హృదయానికి హత్తుకుని, మోమున ముద్దుపెట్టి, "వత్సా! ఎల్లప్పుడును లెక్కలేనంతమంది రామదూతలు రక్షించుచుందురే, మరి నీవు ఆ తామరలను ఎట్లు తెచ్చి ఇవ్వగలవు," అని అనెను. అందుకు లవుడు, "తల్లీ! నీ స్తన్యపాన బలముచేతను, వాల్మీకి ముని ఉపదేశించిన శస్త్రవిద్యచేతను, మునీంద్రుని ఆశీర్వాదముచేతను శ్రీరామునియొక్క భయము నాకు లేదు. అమ్మా! నా పౌరుషమును చూడుము. నన్నిపుడే పంపుము" అని చెప్పి, తల్లికి నమస్కరించెను.

**ఇత్యుక్త్వా మాతరం నత్వా వాల్మీకిం ప్రణిపత్య చ ।**
**ఆశీర్భిరీడితస్తాభ్యాం ధృతతూణీరకార్ముకః ॥ 20**

**వస్త్రాలంకారసంయుక్తస్త్వేకాకీ రథమాస్థితః ।**
**యయౌ లవస్త్వయోధ్యాయాం శ్రీవిహీనాం జవేన సః ॥ 21**

**క్రోశోపరి రథం స్థాప్య పద్భ్యామారామమాయయౌ ।**
**తావన్మధ్యాహ్నసమయే గతా ఆరామరక్షకాః ॥ 22**

**భోజనార్థం స్వగేహాని లవోఽబ్జాని తదాఽహరత్ ।**
**పునః స్వస్యందినే స్థిత్వా గత్వాఽఽశ్రమపదం మునేః ॥ 23**

**నత్వా మునిం మాతరం స్వాం పంకజాన్యర్పయన్ముదా ।**
**ముదితా జానకీ చాపి వ్రతారంభమథాకరోత్ ॥ 24**

**ఏవం సప్తదినాన్యబ్జాన్యానయామా సబాలకః ।**
**న విదూ రామదూతాస్తే నీయంతేఽబ్జాని చేతి హి ॥ 25**

**అథాష్టమీదినేఽయోధ్యాం పూర్వవత్స లవో యయౌ ।**
**ఆరామస్య బహిః స్థాప్య రథం పద్భ్యాం యయౌ లవః ॥ 26**

**గత్వాఽఽరామస్య కాసార గృహీత్వాఽబ్జాని నిర్భయః ।**
**శనైర్యావద్రథం ప్రాప తావదారామపాఽఽయయుః ॥ 27**

**తే తం దృష్ట్వా లవం సాబ్జం పప్రచ్ఛుర్విస్మయాన్వితాః ।**
**న త్వం దృష్టః కదాఽస్మాభిః శ్రీరామానుచరేషు హి ॥ 28**

**కదారభ్య రామసేవా త్వయా చాంగీకృతా వద ।**
**యతస్త్వం నిర్భయోఽబ్జాని గృహీత్వా గచ్ఛసి ప్రభుమ్ ॥ 29**

**రామదూతవచః శ్రుత్వా విహస్యాహ లవోఽపి సః ।**
**వాల్మీక్యనుచరశ్చాహం న రామదర్శనం మమ ॥ 30**

**దాసోఽహం మునిరాజస్య వాల్మీకేః శుద్ధచేతసః ।**
**తదాజ్ఞాయా వై నీయన్తే కమలాని మయా ముదా ॥ 31**

లవుడు వాల్మీకికి నమస్కరించి, ఆశీర్వాదములనంది, ధనుర్బాణములను ధరించి, వస్త్రాలంకార భూషణాన్వితుడునై ఒంటరిగా రథమును ఎక్కి, శ్రీదేవి లేని ఆ అయోధ్యకు త్వరగా వెడలి, క్రోశడు దూరముననే రథమును నిలిపి, కాలినడకతో ఉద్యానవనమునకు వచ్చెను. అంతలో నాడు మధ్యాహ్న కాలమున తోటయొక్క కావలివారందరును తమఇండ్లకు భోజనమునకై వెడలిరి. ఆ సమయమున లవుడు కావలసిన కమలములను సరోవరమునుండి తీసుకొనివచ్చి, మరలా అట్లే రథమును ఎక్కి, వాల్మీకి ఆశ్రమమునకు వచ్చెను. వాల్మీకికి, తల్లికి నమస్కరించి సంతోషముగా తామరలను ఇచ్చెను. జానకీదేవి వ్రతాచరణమునకు ఆరంభించెను. ఇట్లే ఏడుదినములు బాలకుడు కమలములను

కొనితెచ్చెను. ఆ రామరక్షకులు ఎవ్వరునూ చూడలేదు. అంత ఎనిమిదవ దినమునందు అయోధ్యా పట్టణమునకు ముందరివలెనే లవుడు వచ్చెను. తోటకు బయట రథమును నిలిపి కాలినడకతో వెడలి, తిన్నగా సరోవరమున నిర్భయముగా కమలములను తీసుకుని యథాపూర్వముగా రథమువద్దకు వచ్చెను. అంతలో అచటికి రక్షకులగు రామదూతలు వచ్చి, కమలములతోడనున్న లవుని జూచి, ఆశ్చర్యముతో, ఇట్లడిగిరి "మేము నిన్ను ఎప్పుడును శ్రీరాముని అనుచరులలో ఒకనిగా ఎరుగము కదా నీవు భయములేక తామరలను తీసుకుని, ప్రభుసన్నిధికి పోవుచుండుటచే, విచారించు చున్నాము. ఎప్పుడుమొదలు నీవు శ్రీరాముని సేవకు ఒప్పుకునియున్నావు చెప్పుము," అని అడిగిన శ్రీరామ దూతల మాటలను విని, లవుడు నవ్వుచు, "నేను వాల్మీకిమునియొక్క ఆజ్ఞచే ప్రతిదినమందును ఇచటనుండి కమలములను కొనిపోవుచున్నాను. మీరిపుడే నన్ను చూచితిరి. మునుపెప్పుడును మీరెవ్వరును లేరు" (31)

**ఇతి తద్వచనం శ్రుత్వా వాల్మీకీయం లవం తదా ।**
**జ్ఞాత్వా దూతాః పారకీయం క్రోధాద్వచనమబ్రువన్ ॥ 32**

**రామస్తయా న దృష్టోఽత్ర న నః పృష్టస్త్వయా పునః ।**
**నాజ్ఞాపితోఽసి రామేణ నీయన్తేఽబ్జాని ప్రత్యహమ్ ॥ 33**

**న జ్ఞాతమేతదస్మాభిస్త్విదానీం తిష్ఠ మా వ్రజ ।**
**అపరాధ్యసి రామస్య త్వాం నేష్యామో వయం ప్రభుమ్ ॥ 34**

**ఇత్యుక్త్వా తస్య పంథానం రురుధూ రామసేవకాః ।**
**చతుర్దశ శస్త్రహస్తా సశతా రామతో యదాః ॥ 35**

**తాన్దృష్ట్వా స్యందనస్థః స లవోఽప్యాహ విహస్య చ ।**
**యూయం గచ్ఛత శ్రీరామం మద్వృత్తం బ్రూతసాదరాత్ ॥ 36**

**యద్యస్తి పౌరుషం రామే తర్హి యాస్యతి మాం ప్రతి ।**
**తత్తస్య వచనం శ్రుత్వా క్రోధాద్దూతా వచోఽబ్రువన్ ॥ 37**

**కథం వత్స మర్తుకామస్త్వమిత్థం వల్గసే ముధా ।**
**బద్ధ్వా త్వాం వయమేవాద్య వినేష్యామో రఘూత్తమమ్ ॥ 38**

**ఇత్యుక్త్వా తే లవం ధర్తుం యయుస్తస్య రథాంతికమ్ ।**
**తాన్దృష్ట్వా నికటం ప్రాప్తాన్ రామదూతాన్ లవోఽపి సః ॥ 39**

**రణత్కృత్య చ మహచ్చాపం శరాన్సంధాయ వేగతః ।**
**అబ్రవీత్తాన్ పునర్వాక్యం మాఽఽగంతవ్యం మమాన్తికమ్ ॥ 40**

**మార్గణైరధునా యుష్మాన్ త్యజామి రాఘవాన్తికే ।**
**ఇత్యుక్త్వా తాన్ పునర్దృష్ట్వాఽఽత్మానం ధర్తుం సముద్యతాన్ ॥ 41**

**రామాగ్రే ప్రాక్షిపద్బాణైర్లీలయాఽధ్వరమంటపే ।**
**చతుర్దశ రామదూతా లవమార్గణతాడితాః ॥ 42**

**నిపేతుర్మూర్ఛితాః సర్వే రామాగ్రే జాహ్నవీతటే ।**
**శతశో రామదూతాస్తే దృష్ట్వా చక్రుః పలాయనమ్ ॥ 43**

**లవోఽపి విజయీ శీఘ్రం పూర్వవత్స్వాశ్రమం యయౌ ।**
**సమర్ప్యాబ్జాని సీతాయై సర్వం వృత్తం న్యవేదయత్ ॥ 44**

## లవుడు శ్రీరాముని ఉద్యానవనమున పరాక్రమించుట.

లవుని మాటలను విన్న శ్రీరామదూతలు, లవుని బయటివానిగా గుర్తించిరి. క్రోధముతో, "నీవు శ్రీరాముని చూడనేలేదు? మరియు మమ్మును నీవడుగలేదు. రాముని ఉత్తర్వులేక తామరలను తీసుకెళ్ళదవా? ఇట్లని మాకు తెలియలేదు. నిలువుము. పోవలదు. శ్రీరామ అపరాధిగా ఉన్నావు. నిన్ను ప్రభుసన్నిధికి కొనిపోవుచున్నాము." అని చెప్పి, లవుని దారిని అడ్డగించిరి. ఇట్లు నిరోధించిన తోటమాలీలు నూరుమందిని ముట్టడించి, పద్నాలుగుమంది భటులను జూచి, రథము మీదఉన్న లవుడు నవ్వి, "మీరు వెడలి శ్రీరామునికి నా సంగతిని చెప్పండి. రామునికి పౌరుషము ఉండిన అతడే నావద్దకు వచ్చును." అని గర్జించగా వారు క్రోధముతో, "బాలకా! నీవు చావుగోరి ఇట్లు మొరుగుచున్నావు. నిన్ను పట్టి కట్టి, ఇపుడే శ్రీరామ సన్నిధికి తీసికొనిపోవు చున్నాము." అని లవుని పట్టుటకై రథమువద్దకు వచ్చిరి. సమీపించినవారిని జూచి, లవుడు తన గొప్పధనస్సును ఆకర్షించి, త్వరగా బాణములను అనుసంధానముజేసి, నా వద్దకు రావలదు. బాణములచే మిమ్మును శ్రీరాముని వద్దకు పంపెదను," అని అనుచు తొందరపడి వచ్చుచున్నవారిని వినోదముగా యజ్ఞమండపమున బాణములతో కొట్టెను. ఇట్లు పదునాల్గురు రామదూతలు గంగాతీరమున శ్రీరామ సన్నిధిలో లవుని బాణమునకు పడి మూర్ఛితులైరి. తక్కిన నూరారుమంది తోటవాండ్రు పరుగెత్తిరి. లవుడును జయముతో త్వరగా మునుపటివలె ఆశ్రమమునకు వచ్చి, సీతాదేవికి తామరలను అర్పించి, జరిగిన సమాచారమును తల్లికి విన్నవించెను.

చతుర్దశ రామదూతాః స్వస్థచిత్తాశ్చిరేణ తే ।
సర్వం వృత్తం రాఘవాయ కథయామాసురాదరాత్ ॥ 45

తత్ శ్రుత్వా రామచంద్రోఽపి విస్మయావిష్టమానసః ।
సహస్రదూతానారామరక్షణార్థం ప్రచోదయత్ ॥ 46

లవోఽప్యాథ నవమ్యాం స సాకేతం పూర్వవద్యయౌ ।
సహస్రం రామదూతాస్తే లవం యోద్ధుం సముద్యతాః ॥ 47

లవస్తానాహ యుష్మాకం స్వామినా రాఘవేణ హి ।
యదా సీతా వనే త్యక్తా జయశ్రీశ్చ గతా తదా ॥ 48

యుష్మాకం రాఘవస్యాపి గచ్ఛధ్వం రాఘవం పునః ।
యుష్మాభిర్మా మయా యుద్ధం కర్తవ్యం మరణోన్ముఖైః ॥ 49

సీతాత్యాగే తు యుష్మాకం స్వామినః పౌరుషం న మామ్ ।
ఇతి తే లవవాగ్బాణైర్భిన్నమర్మస్థలాస్తదా ॥ 50

దూతాః శస్త్రాణి ముముచుర్లవోపరి మహాస్వనైః ।
లవోఽపి చాపమాకృష్య రామదూతాన్ స్వమార్గణైః ॥ 51

ప్రాక్షిపత్పూర్వవద్రామం తచ్ఛస్త్రౌఘం నివార్య చ ।
ఆరామతో యదా దూతాశ్చక్రుః సర్వే పలాయనమ్ ॥ 52

యయౌ లవః స విజయీ పూర్వవత్కమలాన్వితః ।
ఆశ్రమం మాతరం నత్వా సర్వం వృత్తం న్యవేదయత్ ॥ 53

పుత్రస్య పౌరుషం శ్రుత్వా తుతోష జానకీ తదా ।
వృత్తం నివేదయామాసూ రామదూతా రఘూత్తమమ్ ॥ 54

మూర్ఛాం లవశరైః ప్రాప్తా భిన్నదేహా మఖాంగణే ।
రామ రామ మహాబాహో శ్రుణుష్వపూర్వమాదరాత్ ॥ 55

పంచవర్షీయబాలేన వయమద్య పరాజితాః ।
వాల్మీకేర్లబ్ధవిద్యః స న జ్ఞేయో లక్ష్మణాదిభిః ॥ 56

**తద్వధే మంత్రయస్వాద్య త్వముపాయం రఘూత్తమ ।**
**సీతాత్యాగాదివచనైర్నస్తవాపి చ బాలకః ॥ 57**

**చకార నిందాం శ్రీరామ గతభీస్త్వేక ఏవ యః ।**
**తత్తేషాం వచనైర్వృత్తం కృత్స్నమాకర్ణ్య రాఘవః ॥ 58**

కొంతసేపటికి ఆ పదునాలుగుమంది రామదూతలు సర్వవృత్తాంతమును శ్రీరామ సన్నిధికి వచ్చి సాదరముగా విన్నవించిరి. ఆ సంగతిని విని శ్రీరాముడును మనసున ఆశ్చర్యమునంది, తోట కాపలికి వేయిమంది భటులను పంపెను. అంత ఆ లవుడు నవమినాడు యథాపూర్వముగా అయోధ్యకు వచ్చెను. వేయిమంది రాజభటులును లవునితో యుద్ధమునకు సన్నద్ధులైరి. వారినిజూచి లవుడు, "ఎప్పుడు మీ ప్రభువగు రాముడు సీతాదేవిని వనమునకు పంపెనో అప్పుడే మీకును మీ యజమానికిని, జయసంపదలు తొలగెను. మరలా ఆ రాముని వద్దకే పొండి. చావునెదురుచూచువారై మీరు నాతోడ కలహించవలదు. మీ రాజుకు సీతను విడుచుటలో పౌరుషమేగాని, నన్ను గురించి శౌర్యమేలేదు." అని చెప్పగా ఆ లవుని వచనశరములచే కీళ్ళువిరిగిన ఆ దూతలు ఆర్భాటముచేయుచు, తమ శస్త్రములను ప్రయోగించిరి. లవుడు వాటిని ఖండించి, వారిని మునుపటివలెనే రాముని సన్నిధిలో పారవేసెను. తోటకు నీళ్ళుచల్లెడు దూతలు అందరును పరుగెత్తిరి. లవుడును మునుపటి వలెనె జయమునంది, కమలములతో ఆశ్రమమునకువచ్చి తల్లికి నమస్కరించి, జరిగిన విషయాలను అన్నిటిని విన్నవించెను. అది విని సీతమ్మ పుత్రుని పౌరుషమును విని మిక్కిలి సంతసించెను. అచట యజ్ఞవాటికలో లవుని శరములచే మూర్ఛాక్రాంతులై ఉండి లేచిన రామ భటులు, "శూరాగ్రణియైన శ్రీరామప్రభూ! ఐదేండ్ల బాలకునిచే మేము నేడు జయింప బడితిమి.

వాల్మీకి వలన విద్యలనందిన వానిని లక్ష్మణాది మహాశూరులు కూడా జయింపజాలరు. నీవు వానిని నిగ్రహించుటకు తగిన సదుపాయమును యోచింపవలయును. సీతా త్యాగాది వాక్యములచే ఆ బాలకుడు నిన్నుకూడా నిందించెను. వాడు ఒంటరిగా ఉండినను, నిర్భయముగా ఉన్నాడు." అని మొరపెట్టగా ఆ వాక్యములను విని శ్రీరాముడు (58)

**సంమంత్ర్య సచివైర్దూతం వాల్మీకిం ప్రేషయజ్జవాత్ ।**
**నత్వా మునిం రామదూతో రామవాక్యం న్యవేదయత్ ॥ 59**

**యస్తే శిష్యో మహావీరః సోఽపరాధ్యస్తి వై మమ ।**
**తం ప్రేషయాథవా తేన త్వమాగచ్ఛస్వ మన్మఖమ్ ॥ 60**

విస్మృత్యాపూర్వమేవ త్వం నాహూతోఽసి క్షమస్వ తత్ ।
తద్దూతవచనం శ్రుత్వా రామీయం మునిరబ్రవీత్ ॥ 61

శిష్యాభ్యామధ్వరం చాహమేవ యాస్యామి త్వం వ్రజ ।
తథేతి రామదూతోఽపి మునిం నత్వా యయౌ మఖమ్ ॥ 62

జానన్నేవ భావి వృత్తమాదౌ రామో మునిం మఖమ్ ।
నాహ్వాయామాస శిష్యాభ్యాం లౌకికీం రీతిమాశ్రితః ॥ 63

స్వీయవ్రతసమాప్తిం సాఽకరోత్సీతాఽపి సాదరమ్ ।
విష్ణుదాస ఉవాచ
అశక్తశ్చ కథం కార్యం వ్రతమేతద్వదస్వ మామ్ ॥ 64

శ్రీరామదాస ఉవాచ
కాంచనస్యాథవా రౌప్యస్యాథవా తామ్రనిర్మితే ।
కార్యే ద్వే పాదుకే రమ్యే రాఘవస్య యథాసుఖమ్ ॥ 65

అభావే కమలానాం చ పుష్పైరంజలిరీరితః ।
ఏకాశీతిదంపతీనాం న శక్తిః పూజనే తదా ॥ 66

పూజనీయాని యుగ్మాని నవ శక్యాఽథవా సుఖమ్ ।
స్వశక్త్యా పూజనం కార్యం విత్తశాఠ్యం పరిత్యజేత్ ॥ 67

అనేకదూరగస్యాపి సంయోగశ్చ భవేజ్జవాత్ ।
భావికార్యాణి వేగేన భవిష్యంతి న సంశయః ॥ 68

**ఇతి శ్రీశతకోటిరామచరితాంతర్గతే, శ్రీమదానందరామాయణే, వాల్మీకీయే, ఆదికావ్యే, జన్మకాండే, సంయోగకరణవ్రతం నామ, షష్ఠః సర్గః ॥**

## శ్రీరాముడు వాల్మీకిని పిలిపించుట.

శ్రీరాముడు మంత్రులతో ఆలోచించి, వాల్మీకి వద్దకు ఒకదూతను పంపెను. ఆ రామదూత వచ్చి, వాల్మీకికి నమస్కరించి, "మహావీరుడగు శిష్యుడు నీకెవ్వడు గలడో వాడు మా విషయమై అపరాధిగా ఉన్నాడు. వానిని పంపించుము. వానిని వెంటబెట్టుకుని, నా యజ్ఞమునకు నీవైనను

రమ్ము. మరపుచే మొదటనే నిన్ను యజ్ఞమునకు పిలువలేదు. దానిని క్షమింపుము.” అని మా ప్రభువుగారు మీకు విన్నవించిరని చెప్పెను. వాల్మీకిముని శ్రీరామ వాక్యమును విని “నీవు పొమ్ము, నేను ఇరువురు శిష్యులతోడ వచ్చుచున్నాను.” అని పలుకగా అట్లే అని మునికి మ్రొక్కి, రామదూత యజ్ఞవాటమునకు వచ్చెను.

రామదాసు చెప్పుచున్నాడు, “విష్ణుదాసా! వినుము. ఇకమీదట ఇట్లు కాబోవుచున్నదని ఎరిగినవాడు కాబట్టియే శ్రీరాముడు మొదట శిష్యులతో ఆ వాల్మీకిని పిలుపింపలేదు. అచట జానకీదేవియును, తాను పట్టిన వ్రతమును పూర్తిజేసెను.” అనెను. రామదాసుమాటలు విన్న విష్ణుదాసుడు, “గురూత్తమా! అశక్తులైనవారు ఈ వ్రతమును ఎట్లు చేయవలయునో చెప్పుమని,” వేడెను.

అందుకు రామదాసు చెప్పుచున్నాడు. బంగారముతోగాని, వెండితోగాని, రాగితోగాని శ్రీరాముని యొక్క పాదుకలను చేయించవలయును. కమలములు దొరకకపోయిన, సామాన్యముగా పూజాయోగ్యములగు ఏ పుష్పములతో నైనా అంజలిని అర్పింపదగును.

81 మంది దంపతులను పూజించుటకు శక్తిలేకపోయినచో 9మంది దంపతులను పూజించునది. లేదా వానివాని శక్త్యానుసారము చేయవచ్చును. ధనముకలిగి పిసినారితనము కూడదు. ఈ వ్రతమువలన దూరమైన ప్రియులును తమతోడవచ్చి చేరుదురు. కాతగిన కార్యములు త్వరగా అగును. ఇందులో సంశయములేదు. (68)

***ఈ విధముగ శ్రీమద్వాల్మీకి మహర్షిచే రచింపబడిన,***
***శ్రీ శతకోటిరామచరితాంతర్గత శ్రీమత్ ఆనందరామాయణములో, జన్మకాండలో***
***6వ సర్గ ముగిసినది.***



# సప్తమః సర్గః-7వ సర్గ

## కుశలవుల పరాక్రమ వర్ణన

శ్రీరామదాస ఉవాచ

అథ రామోఽపి ధర్మాత్మా చరమే తురగాధ్వరే ।
హయం ముమోచ శత్రుఘ్నస్తస్య పృష్ఠే యయౌ జవాత్ ॥ 1

దక్షిణాం పశ్చిమామాశాముత్తరాం తురగోత్తమః ।
అతిక్రమ్య తథా ప్రాచీం యజ్ఞస్థానం న్యవర్తత ॥ 2

నృపతిభ్యః సమస్తేభ్యః శత్రుఘ్నో వసు కోటిశః ।
గృహీత్వా తైర్నృపైర్యుక్తస్తురగస్యానుగో యయౌ ॥ 3

సేనయా చతురంగిణ్యా దశసాహస్రసంఖ్యయా ।
తస్మిన్విమానే ఋషయః సర్వే రాజర్షయస్తథా ॥ 4

బ్రాహ్మణాః క్షత్రియా వైశ్యాః సమాజగ్ముః సహస్రశః ।
చరమాధ్వరభవం ద్రష్టుం రామస్యోత్సవమాగతాః ॥ 5

వాల్మీకిరపి సంగృహ్య గాయంతౌ భూమిజాత్మజౌ ।
జగామ యజ్ఞవాటస్య సమిపం సీతయా సుఖమ్ ॥ 6

మార్గే నృపసమూహేషు శిబికాస్థాం హి జానకీమ్ ।
న విదుః పార్థివాః సర్వే జనాస్తేఽపి తథేతరే ॥ 7

సుమేధయా జనకోఽపి యయౌ రామాధ్వరం ప్రతి ।
క్రోశద్వయాంతరే పూర్వే యజ్ఞవాటాన్మునీశ్వరః ॥ 8

కృత్వా పర్ణకుటీం రమ్యాం తాభ్యాం యుక్తః స సీతయా ।
వాల్మీకిర్గోపయామాస పర్ణకుట్యాం విదేహజామ్ ॥ 9

### నూరవ అశ్వమేధమునకు వాల్మీకి సపరివారముగా వచ్చుట.

శ్రీరామదాసు ఇట్లు పలికెను, "అనంతరము ధర్మాత్ముడగు శ్రీరాముడు నూరవదియగు

అశ్వమేధయాగముకొరకు గుఱ్ఱమును విడిచెను. దాని వెనుక శత్రుఘ్నుడు త్వరగా వెడలెను. దక్షిణ, పశ్చిమ, ఉత్తర దిక్కులను పూర్తిజేసి, ఆ అశ్వోత్తమము తూర్పుదిక్కున వచ్చుచు యజ్ఞ శాలకు చేరెను. దాని వెనుకనే శత్రుఘ్నుడును, వేలకొలది రాజులనుండి సమర్పింపబడిన కానుకలతో కూడిన ద్రవ్యమును తీసుకుని ఆ రాజులతోను, పదివేల చతురంగ సైన్యములతోను వచ్చిచేరెను. ఆ అశ్వమేధయాగము నూరవది కడపటిది గనుక శ్రీరాముని ఉత్సవమును చూడవలెనని సమస్త మునీంద్రులును, రాజర్షులును, బ్రాహ్మణులును, క్షత్రియులును, వైశ్యులును వేలకొలదిగా వచ్చిచేరిరి. వాల్మీకి మునియును కుశలవులను వెంటతీసుకుని, సీతతో సుఖముగా వెడలి, యజ్ఞమునకు వచ్చుచున్న ఋషులందరు ఉండదగిన ఋషివాటికకు వచ్చెను. నడుమ దారిలో పల్లకిని ఎక్కి వచ్చుచున్న జానకీదేవిని, రాజులను, జనులను, అట్లే ఇతరులను ఎవ్వరును ఎరుగరైరి. జనకమహారాజు సుమేధతో రాముని యజ్ఞమునకు విచ్చేసెను. వాల్మీకిమహర్షి ఆ యజ్ఞవాటికకు తూర్పున రెండు క్రోశుల దూరముననే మనోహరమగు ఒక పర్ణశాలను ఏర్పరిచి, అందులో సీతమ్మను పెట్టి, కుశలవులతో వశించెను.

**నృపసేనానివాసేషు జనకశ్చ సుమేధయా ।**
**స్వసైన్యేన యయౌ తూష్ణీం రామేణాసౌ నిరీక్షితః ॥ 10**

**వాల్మీకిరపి తౌ ప్రాహ న్యస్తాలంకారమండితౌ ।**
**జటాచీరాజినధరౌ సీతాపుత్రౌ మహాధియౌ ॥ 11**

**యత్ర తత్ర చ గాయంతౌ పురే వీథిషు సర్వతః ।**
**రామస్యాగ్రే ప్రగాయేతాం సుశ్రూషుర్యది రాఘవః ॥ 12**

**ఆజన్మకాండాత్కాండాని న గేయాన్యత్ర బాలకౌ ।**
**యదా కరోమ్యహం చాజ్ఞాం గాయేతాం సకలం తదా ॥ 13**

**న గ్రాహ్యం తద్యువాభ్యాం స యది కించిత్ప్రదాస్యతి ।**
**ఇతి తౌ చోదితౌ తత్ర గాయమానౌ విచేరతుః ॥ 14**

**యథోక్తం ఋషిణా పూర్వం తత్ర తత్రాభ్యగాయతామ్ ।**
**తాం తు సుశ్రావ కాకుత్స్థః పూర్వచర్యాకృతిం తతః ॥ 15**

**అపూర్వపద్యవృత్తాదిగేయైశ్చ సమభిప్లుతామ్ ।**
**బాలాభ్యాం రాఘవః శ్రుత్వా కౌతూహలముపేయివాన్ ॥ 16**

అథ కర్మాంతరే రామః సమాహూయ మునీశ్వరాన్ ।
రాజ్ఞశ్చైవ నరవ్యాఘ్రః పండితాంశ్చైవ నైగమాన్ ॥ 17

పౌరాణికాన్ శబ్దవిదో గణకాంశ్చ చికిత్సకాన్ ।
నానాకౌశల్యనిపుణాం స్తథా వృద్ధాన్ ద్విజాదికాన్ ॥ 18

యజ్ఞవాటే తు తాన్ పూజ్య గాయకౌ సంప్రవేశయత్ ।
తే సర్వే హృష్టమనసో రాజానో బ్రాహ్మణాదయః ॥ 19

రామం తౌ దారకౌ దృష్ట్వా విస్మితా నిర్నిమేషకాః ।
అవోచన్ సర్వ ఏవైతే పరస్పరమథానయోః ॥ 20

ఇమౌ రామస్య సదృశౌ బింబాద్బింబమివోదితౌ ।
జటిలౌ యది న స్యాతాం న చ వల్కలధారిణౌ ॥ 21

విశేషం నాధిగచ్ఛామో రాఘవస్యానయోస్తదా ।
ఏవం సంవదతాం తేషాం విస్మితానాం పరస్పరమ్ ॥ 22

జనకమహారాజు; రాజసేనాని పరివారములతో తన సైన్యమును తీసికొని, సుమేధతో కలసి ఊరకే పోగా, శ్రీరాముడు కూడా చూచెను. వాల్మీకి మహర్షి అలంకారములను తీసిపెట్టి, నారబట్టలు కట్టుకొనిన కుశలవులతో, "మంచిబుద్ధిగల బిడ్డలారా! ఊరిలోని వీధులలో అచట నచట, శ్రీరాముడు వినినచో వారి ఎదుటను చక్కగా జన్మకాండమువరకు శ్రీరామాయణమును పాడండి. ఇచట పాడవలదు. నేనెప్పుడు ఆజ్ఞాపించెదనో అపుడు సమస్తమును పాడండి. అతడు ఏమైనా ఇచ్చినా మీరు కొంచెముకూడా తీసుకొనవలదు." అని చెప్పెను. వారును అట్లే ఊరిలో పాడుచూ సంచరించుచుండిరి. ఇట్లు వాల్మీకి ముని చెప్పినట్లు పాడుచున్న వారియొక్క దివ్యగానమును శ్రీరాముడు వినెను. అపూర్వరచనచే రమ్యమైన రాగయుక్తమగు గానమును విని, కుతూహలము నందెను. పిదప ఆ శ్రీరాముడు యజ్ఞకర్మ విశ్రామసమయమున మునీంద్రులను, రాజులను, పండితులను, వేదజ్ఞులను, పౌరాణికులను, వైయాకరుణులను, జ్యోతిష్యులను, వైద్యులను, శిల్పకౌశలాది చమత్కార విద్యలు నేర్పించినవారిని, అట్లే వృద్ధబ్రాహ్మణాదులను అందరిని యజ్ఞవాటికలో చక్కగా పూజించెను, (18) గాయకులైన కుశ, లవుల ఇరువురిని ప్రవేశపెట్టిరి. రాజులును, బ్రాహ్మణులును మొదలుగాగల వారందరును సంతుష్టచిత్తులై శ్రీరాముని, బాలకులను రెప్పవేయక జూచి, ఆశ్చర్యమును అందుచుండిరి. అంతనచట వచ్చినవారందరును పరస్పరముగా, "బింబమునుండి ప్రతిబింబము పుట్టినట్లుండెడు వారైన

వీరిరువురు చిన్నవాండ్రు శ్రీరామునికి సమానులుగా ఉన్నారు. ఐనా వీరు నారబట్టలు కట్టుకుని జడలు దాల్చియున్నారు. ఐనను శ్రీరామునికి వీరికిని రూపముననే విశేషమును కనిపెట్టజాలము," అని వాదించుచుండిరి.

**తదాఽఽహ రామదూతోఽపి లవబాణరుజం స్మరన్ ।**
**రామచంద్రం యజ్ఞవాటస్థితం వై సంభ్రమేణ హి ॥ 23**

**లవమంగులినా వీరం దర్శయంశ్చ ముహుర్ముహుః ।**
**రామ రామ మహాబాహో తమేనం పశ్య వై లవమ్ ॥ 24**

**యేనాస్మాకం శరౌఘైశ్చ ప్రక్షిప్య తవ సన్నిధౌ ।**
**నీతాని కనకాబ్జాని సుగంధీని నిరంతరమ్ ॥ 25**

**సీతాత్యాగనిమిత్తేన యేన తేనాపి వా ముహుః ।**
**కృతా నిందా గర్వితేన త్వద్దండైకార్థినా ప్రభో ॥ 26**

**తవ దండభయాదేవ పూర్వవేషం విలోపితః ।**
**రథవస్త్రాభరణాని శస్త్రాణ్యపి విహాయ చ ॥ 27**

**ధృతాని వల్కలాదీని దీనరూపోఽత్ర దృశ్యతే ।**
**త్వయాఽద్య దండనీయోఽయం బంధుసారాతిగర్వితః ॥ 28**

**ఇతి స్వదూతవాక్యాని శ్రుణ్వన్నపి రఘూత్తమః ।**
**ప్రేమ్ణాఽవలోకయామాస సుధాక్షిభ్యాం శిశూ ముహుః ॥ 29**

**బాలావపి సభాసంస్థాన్నమస్కృత్య యథాక్రమమ్ ।**
**రాఘవం స్వపితృవ్యాంశ్చ వసిష్ఠం ప్రణిపత్య చ ॥ 30**

**ఉపచక్రమతుర్గాతుం వీణే రణయతః శుభే ।**
**తతః ప్రవృత్తం మధురం గాంధర్వం గీతముత్తమమ్ ॥ 31**

**శ్రుత్వా తన్మధురం గీతం రామస్తోషమవాప హ ।**
**తాభ్యాం శ్రుతం స్వచరితం విలాసావధ్యనుక్రమాత్ ॥ 32**

**యద్యదాచరితం పూర్వం సీతయా సహ సౌఖ్యదమ్ ।**
**తతో౽ పరాహ్ణే శ్రీరామః ప్రసన్నవదనాంబుజః ॥ 33**

**ఉవాచ తౌ సమగ్రం వై శ్వో గేయం మమ సన్నిధౌ ।**
**తథేతి రామవచనం తావంగీచక్రతుస్తదా ॥ 34**

ఇట్లుండు వారిలో ఒకరామదూత లవుని బాణముచే దెబ్బతిన్నవాడు తనకు తగిలిన బాణపు దెబ్బను స్మరించుచు, సంభ్రాంతినొంది, యజ్ఞవాటమునున్న శ్రీరామునితో, ''రామా! రామా! మహాశూరుడా! ఆ చిన్నవానినే లవునునిగా ఎఱుగుము. వీడే మమ్ము బాణములచే నీ వద్దకు పడద్రోసి, దివ్య పరిమళయుక్తములగు బంగారు తామరలను తీసుకొనిపోయినవాడు. సీతను వదిలిన నిమిత్తము పెట్టుకుని వీడే మిమ్ము నిందించినవాడు. నీవు ఎచట శిక్షించెదవో అను భీతివలననే మొదటివేషమును మార్చియున్నాడు. రథమును, దివ్య వస్త్రములను, శస్త్రములను, భూషణములను వదలి, నారబట్టలతో వచ్చి, పేదవానిగా కనబడుచున్నాడు. బంధు బలగముచే మదించిన వీనిని నీవు తప్పక శిక్షింపుము.'' అని మొరపెట్టగా, ఆ దూత వాక్యములను విన్న శ్రీరాముడు బిడ్డలను పలుమార్లు అమృతకటాక్షములచే ప్రేమతో చూచెను. ఆ బాలకులును సభాశీనుడైన శ్రీరామునికి అట్లే క్రమముగా లక్ష్మణాదులకును, వశిష్ఠ మహామునికి నమస్కరించి, వీణలను వాయించుచు పాడనారంభించిరి. అపుడు అక్కడ గంధర్వాది దివ్యగానము వెలువడెను. వారు పాడుతూ వచ్చిన సీతతో తను అనుభవించిన విలాసకాండ చరిత్రము వరకు గల నిజ చరిత్రమును విని ఆనందమునొందెను. పిదప మధ్యాహ్న సమయమున శ్రీరాముడు సుప్రసన్న ముఖారవిందుడై బాలకులను జూచి, "మీరు ఇరువురును రేపువచ్చి సమగ్రముగా పాడవలయును అని చెప్పెను. అంత ఆట్లేనని వారు అంగీకరించిరి.

**తతో రామో లవం ప్రాహ మే యద్యప్యపరాధితమ్ ।**
**త్వయా పూర్వం తథాపి త్వాం తుష్టో౽ హం నాత్ర శిక్షయే ॥ 35**

**త్వద్గీతమచ్చరిత్రాది శ్రవణాదద్య మే మనః ।**
**పరాం విశ్రాంతిమాపన్నం త్వత్కృతం క్షమితం మయా ॥ 36**

**అధునా మద్భయం త్యక్త్వా త్వం సుఖం విచరాత్ర హి ।**
**తద్రామవచనం శ్రుత్వా లవో రాఘవమబ్రవీత్ ॥ 37**

**మయా౽ పరాధితం రాజంస్తవ దర్శనకామ్యయా ।**
**మదపరాధితం స్మృత్వాత్రాహూతో౽ హం యతస్త్వయా ॥ 38**

**అద్య తే దర్శనేనైవ పౌరుషం వృద్ధిమాగతమ్ ।**
**కీర్తిర్మే మహతీ జాతా తవాగ్రే గాయనాదపి ॥ 39**

**ఇత్యుక్త్వాఽఽసీల్లవస్తూష్ణీం బంధునా గంతుముద్యతః ।**
**సభాయాస్తౌ గంతుకామౌ స్థలం స్వీయం నిరీక్ష్య చ ॥ 40**

**రామోఽయుతం వసు తయోర్భరతేన ప్రదాపయత్ ।**
**దీయమానం సువర్ణం తౌ న తజ్జగృహతుస్తదా ॥ 41**

**రాజన్ హేమ్నా కిమేతేన హ్యావాం వై వన్యభోజినౌ ।**
**కృపావలోకనేనైవ పాహి త్వమావయోః సదా ॥ 42**

**ఇతి సంత్యజ్య తద్దత్తం జగ్మతుర్మునిసన్నిధిమ్ ।**
**ఆసీచ్ఛ్రుత్వా స్వచరితం రామో హృద్యతివిస్మితః ॥ 43**

**కుశోఽపి సకలం వృత్తం వాల్మీకిం మాతరం తథా ।**
**నివేద్య జాహ్నవీం స్నాతుం కౌతుకేన యయౌ సుఖమ్ ॥ 44**

అప్పుడు రాముడు లవునితో, "నీవు నా విషయమై నేరముజేసితివట. సంతుష్టుడగు నేను నిన్నిచ్చట శిక్షించను. నీచేత పాడబడిన నా చరిత్రమును వినుటచే నా మనసు మిగుల విశ్రాంతినంది యున్నది. నేను నీ తప్పును మన్నించితిని. ఇపుడు నా భయములేక నీవు సుఖముగా నిచట సంచరించవచ్చును," అని అనుగ్రహించెను. అందుకు లవుడు, "మహారాజా! నీ దర్శనము కొరకు నేను అపరాధమును చేసితిని. నా తప్పును తలచిగదా నన్ను పిలిపించితివి. ఇపుడు నీ దర్శనము వలన నాకు పౌరుషమధికమగుచున్నది. నీ యెదుట గానముచేయుటచే నాకు గొప్పకీర్తి కలిగినది." అని చెప్పి, కుశునితోపాటు వెళ్ళసాగెను. ఇట్లు సభనుండి లేచిపోవుచున్న కుశలవులను జూచి, శ్రీరాముడు పదివేల బంగారు నాణెములను భరతునిచే వారికి ఇప్పించెను. ఇచ్చుచున్న ద్రవ్యమును వారంగీకరించక శ్రీరాముని జాచి, "మహారాజా! ఈ బంగారముచే మాకేమి ఫలము? మేమిరువురము కందమూల ఫలాది భక్షకులముగదా! నీవు నిరంతరము దయాదృష్టులచే మమ్ము రక్షింపుము," అని చెప్పి, ఇచ్చిన సువర్ణమును విడిచిపెట్టి, ముని సన్నిధికివెడలిరి. శ్రీరాముడు తన చరిత్రమును విని, మనసున ఆశ్చర్యమునందెను. కుశుడు అచటి సమస్త వృత్తాంతమును వాల్మీకి మునికి, తల్లికిని తెలిపి కుతూహలముతో గంగా స్నానమునకై వెడలెను. లవుడు తక్కిన మునిబాలకులతో బాలక్రీడలలో ఉండెను. (44)

లవో మునీనాం శిశుభిః శిశుక్రీడనమాచరత్ ।
ఏతస్మిన్నంతరే యత్ర లవః క్రీడాం చకార హ ॥ 45

బాలకైస్తత్ర సంప్రాప్తాస్తురగాధ్వరకారిణః ।
త్యక్త్వా క్రీడాం లవః శీఘ్రమశ్వం ధృత్వోటజాంతికే ॥ 46

వృక్షే బబంధ శిశుభిః పూర్వవత్ క్రీడనం వ్యధాత్ ।
తతః ఖే పుష్పకం ప్రాప్తం దృష్ట్వా బద్ధం తురంగమమ్ ॥ 47

హత్వా బాలకృతం సర్వే శత్రుఘ్నాద్యా విహస్య తే ।
దూతానాజ్ఞాపయామాసుర్మోచ్యతాం తురగః సుఖమ్ ॥ 48

లవస్తానాగతాన్ దృష్ట్వా వాయవ్యాస్త్రేణ వై తృణమ్ ।
సంమంత్ర్య తాన్ ముమోచాథ లీలయా శిశుసంయుతః ॥ 49

ఝంఝూవాతైస్తదా యానం హస్త్యశ్వరథపూరితమ్ ।
శత్రుఘ్నేనాపి తైర్ధూతైః ఖేఽభూత్తద్ భ్రమరోపమమ్ ॥ 50

తచ్ఛ్రుత్వా రామచంద్రోఽపి ప్రేషయామాస సాదరమ్ ।
సుగ్రీవమంగదం నీలం మైందం జాంబవతం నలమ్ ॥ 51

సుమంత్రం భరతం వాయుపుత్రం తార్క్ష్యం విభీషణమ్ ।
సుషేణం పార్థివాన్ సర్వాన్ స్వస్వామితబలైర్యుతాన్ ॥ 52

ద్వివిదం దధివక్త్రం చ వానరాన్మకరధ్వజమ్ ।
తే లవం దుద్రువుర్గర్వాద్యుద్ధం చక్రుస్త్వరాన్వితాః ॥ 53

తానాగతాన్ లవో దృష్ట్వా కస్యచిత్పతితం భువి ।
దూతస్యాశ్వమోచనార్థమాగతస్య శరాసనమ్ ॥ 54

తూణీరం చ స్వయం ధృత్వా యయౌ యోద్ధుం త్వరాన్వితః ।
రణత్కృత్య మహచ్చాపం చింతయామాస చేతసి ॥ 55

పితృవ్యాద్యాః స్థితా యోద్ధుం మయాఽద్యపురతస్త్విహ ।
కథమేభిశ్చ యోద్ధవ్యం మయా చ సమరాంగణే ॥ 56

**కథం తీక్ష్ణానద్య శరానేతేషు ప్రక్షిపామ్యహమ్ ।**
**స్వీయానాం వధకర్తారం మాం సీతామునిరాఘవాః ॥ 57**

**సహిష్యంతి కథం దృష్ట్వా కర్తవ్యం కిం మయాऽధునా ।**
**యుద్ధాత్పరాఙ్ముఖోऽహం చేద్భూత్వా గచ్ఛామి తం మునిమ్ ॥ 58**

**వాల్మీకిశిక్షితా విద్యా తర్హి సా విఫలా భవేత్ ।**
**అతః కేషామపి వధం వినా యుద్ధం కరోమ్యహమ్ ॥ 59**

## లవుడు శ్రీరామాశ్వమును బంధించి భరతాదులను జయించుట.

అంతలో లవుడు ఎచట బాలురతో ఆటలాడుచుండెనో అచటికి యజ్ఞకారులు గుఱ్ఱమును తీసికొనివచ్చిరి. దానినిజూచి లవుడు ఆటను విడిచి, త్వరగా ఆ గుఱ్ఱమును పట్టి పర్ణశాలవద్ద చెట్టునకు గట్టి మునుపటివలె మునికుమారులతో ఆటలాడుచుండెను. అంత ఆకాశమున పుష్పక విమానమువచ్చెను. శత్రుఘ్నాదులు చెట్టుకుకట్టబడిన గుఱ్ఱమును జూచి బాలక్రీడగా ఎంచి నవ్వి, దూతలనుజూచి, జాగ్రత్తగా గుఱ్ఱమును విడిపింపుమని ఆజ్ఞాపించిరి. లవుడు వారు వచ్చుట జూచి, వాయువ్య అస్త్రముచే ఒక తృణమును అభిమంత్రించి వారిమీదవిడిచి బాలకులతో ఆడుచుండెను. ఆ లవబాణమున పుట్టిన జంఝామారుతములచే, చతురంగసైన్యముతో నిండిన పుష్పకవిమానము శత్రుఘ్నునితోను, ఆ దూతలతోను గగనమున తుమ్మెదవలె భ్రమింపసాగెను. ఆ సంగతిని విని శ్రీరామచంద్రుడు అంగద, సుగ్రీవ, నల, నీల, మైంద, ద్వివిద, దధివక్త్ర, మకరధ్వజాది కపివీరులను సమస్త రాజులను, గరుడాంజనేయులను, సుమంత్ర, భరతాదులను వారివారి సైన్యములతోడ శత్రుఘ్నునికి సహాయముగా పంపెను. వారు గర్వముచే త్వరపడి పరుగెత్తి లవునితో కలహింపబూనిరి. లవుడు వచ్చుచున్న వారినిజూచి, తప్పించుకొనుటకై వచ్చిన ఒకానొక దూతయొక్క నేలబడిన ధనస్సును, తుణీరమును తీసుకుని, తాను ధరించి యుద్ధమునకు వెడలి, ధనుష్టంకారముజేసి, తన మనమున, "నా యెదుట ఇపుడు పినతండ్రులు, మొదలైనవారు యుద్ధసన్నద్ధులై ఉన్నారు. రణరంగమున వీరితోడ నేనెట్లు జగడమాడుదును? ఎట్లు వీరలమీద పదునైన బాణములను ప్రయోగింతును. స్వజన హింసకుడగు నన్ను జూచి, సీతా రామ, వాల్మీకి మునులు ఎట్లు సహించెదరు? ఇపుడు నేనేమి చేయతగినది? యుద్ధమునుండి వెనుకకుతిరిగి మునీంద్రుని సన్నిధికిపోతినా వాల్మీకి నేర్పిన విద్య విఫలమైపోవుచున్నది. అందువల నేనెవ్వరికిని ప్రాణముపోనట్లు యుద్ధముచేసెదను." అని అనుకొనెను.

**ఇతి నిశ్చిత్య మనసి మేఘశబ్దవదాహ తాన్ ।**
**ఆగమ్యతే కిమర్థం మాం యుష్మాభిః బ్రూత వేగతః ॥ 60**

న సీతావత్సులభోఽహం పీడనార్థమిహాద్య హి ।
సీతాక్లేశానలహరం మాం మేధం వేత్థ భో ఖలాః ॥ 61

సీతోష్ణోచ్ఛ్వసితోగ్రాగ్నిజ్వాలాభిర్వోఽద్య పౌరుషమ్ ।
విదగ్ధం న స్ఫుటం లోకాన్దర్శనీయం మమాపి చ ॥ 62

ఇతి స్వవాక్యైరైర్భిన్నహృదయాన్స లవః పునః ।
మోహయామాస సకలాన్ మోహనాస్త్రం విసృజ్యచ ॥ 63

తతో లవః స విజయీ సుమంత్రం భరతం తథా ।
కృత్వా స్వకక్షయోః శీఘ్రం కరాభ్యాం వాయునందనమ్ ॥ 64

సుగ్రీవం చ ముదా ధృత్వా సీతాయై తాన్ ప్రదర్శయత్ ।
దృష్ట్వా సీతాపి తాన్ వీరాన్ మోహనాస్త్రేణ మోహితాన్ ॥ 65

పుత్రాత్తాన్ మోచయామాస రక్షయామాస తాన్ రహః ।
తాన్సీతాద్రాఘవః శ్రుత్వా లక్ష్మణం వాక్యమబ్రవీత్ ॥ 66

ఈదృశం పౌరుషం బంధో రావణేనాపి నో కృతమ్ ।
యథా కృతం బాలకేన కరణీయం కిమత్ర వై ॥ 67

తద్రామవచనం శ్రుత్వా లక్ష్మణః ప్రాహ రాఘవమ్ ।
మా చింతేయం త్వయా కార్యా ధృత్వాహం తం శిశుం క్షణాత్ ॥ 68

త్వత్సన్నిధావానయామి సింహో మృగశిశుం యథా ।
ఇత్యుక్త్వా రాఘవం నత్వా రథారూఢో యయౌ జవాత్ ॥ 69

సేనయా సచివైర్యుక్తో వాల్మీకేర్వసతిస్థలమ్ ।
తమాగతం విబుధ్వాథ లవోఽపి తత్పురో యయౌ ॥ 70

లవుడు ఆలోచించుకుని, మేఘమువలె గర్జించుచు, "ఎందుకు నాకొరకై వేగముగా వచ్చుచున్నారు? మీరు సీతయందు ప్రీతిగల నన్ను పీడించుటకై వచ్చితిరిగదా? దుష్టులారా! నన్ను సీతయొక్క దుఃఖాగ్నిని ఆర్పెడు వానిగా తెలుసుకోండి. జానకీదేవియొక్క నిట్టూర్పుల అగ్నిజ్వాలలచే మీయొక్క పౌరుషము కాలినది. నేను దానిని చక్కగా లోకమునకు చూపించ వలసియున్నది." అని

ఇట్లు తన మాటలచే గుండెలు పగిలిన వారినందరిని మరలా మోహనాస్త్రమును ప్రయోగించి మూర్ఛితులను జేసెను. అంత ఆ లవుడు సుమంత్ర, భరతులను తన చంకలలోను, సుగ్రీవాంజనేయులను చేతులలోను పట్టుకునిపోయి, వారిని సీతాదేవికి చూపించెను. సీతమ్మకూడ మూర్ఛితులగువారిని జూచి పుత్రుని నుండి విడిపించి, రహస్యముగా వారిని రక్షించెను. ఇట్లుండ ఇచట భరతాదులను లవుడు తీసుకుపోయెనని తెలిసి, శ్రీరాముడు లక్ష్మణునితో, "తమ్ముడా! ఇట్టి పౌరుషమును రావణుడు కూడా చూపలేదు. బాలకుడైనను ఎట్లుచేసెనో చూసితివా? మనమేమి చేయదగినది," అని ఆలోచించెను. (67) అందుకు లక్ష్మణుడు, "అన్నా! నీవు చింతింపవలదు. నేనాబిడ్డను క్షణములోపట్టి నీ సన్నిధానమునకు సింహము జింకపిల్లను పట్టితెచ్చినట్లు తెత్తును," అని శ్రీరామునికి నమస్కరించి, రథమును ఎక్కి, సైన్యముతోను, మంత్రులతోను కూడి, వాల్మీకి మహర్షి వసించుచున్న చోటుకు వచ్చెను. లవుడును లక్ష్మణుని యెదుటకు పోయి తారసిల్లెను.

**త ద్దృష్ట్వా బాలకం రమ్యం కృపయా లక్ష్మణోఽబ్రవీత్ ।**
**మా శిశో త్వం కురుష్వాద్య సాహసం మత్పురస్త్విహ ॥ 71**

**న సమర్థోఽసి వై స్థాతుం గచ్ఛ నోచేన్మరిష్యసి ।**
**శేషం రామాయణం శ్రోతుం త్వత్తోఽహం త్వాం నిహన్మి న ॥ 72**

**త్వయాఽపరాధితం బాల రాఘవస్య ముహుర్ముహుః ।**
**తత్సర్వమప్యహం వేద్మి తథాపి త్వా నిహన్మి న ॥ 73**

**నీతాన్ వీరాన్ సమర్ప్యాథ వాజినా రఘునందనమ్ ।**
**ఏహి త్వం శరణం బాల యద్యస్తి జీవితస్పృహా ॥ 74**

**తత్సౌమిత్రేర్వచః శ్రుత్వా లవోఽభీతస్తమబ్రవీత్ ।**
**వేద్మి త్వాం రాఘవం చాపి సీతాత్యాగాప్తపౌరుషమ్ ॥ 75**

**సీతాయామేవ యువయోః పౌరుషం న లవే మయి ।**
**సీతాదుఃఖాపనోదార్థం మునినా నిర్మితస్త్వహమ్ ॥ 76**

**యువాం జిత్వాఽద్య సమరే సీతాదుఃఖం ప్రమార్జయే ।**
**ముధా యువాభ్యాం సా సీతా ఛలితాపి పతివ్రతా ॥ 77**

**తస్యా వినిష్కృతిం చాహం కర్తుమత్ర సమాగతః ।**
**సీతాదుఃఖాగ్నినా యుష్మత్పౌరుషం దగ్ధమస్తి తత్ ॥ 78**

న స్థాతవ్యం మమాగ్రేऽత్ర గచ్ఛధ్వం విధవోపమాః ।
ఇతి తే లవవాగ్బాణైర్భిన్నమర్మస్థలాశ్చ వై ॥ 79

లక్ష్మణాద్యా వవర్షుస్తం శస్త్రైరస్త్రైర్లవం క్రుధా ।
తతో లవశ్చ స్వైర్బాణైః శస్త్రైర్వృష్టిం నివార్య చ ॥ 80

శ్రీరామసచివాదీంశ్చ ప్రాక్షిపద్యజ్ఞమంటపే ।
తే సర్వే సచివాద్యాశ్చ లవమార్గణతాడితాః ॥ 81

భిన్నదేహా లోహితాక్తాః ప్రోచూ రామం స్ఖలిద్గిరా ।
రామ త్వం నో పశ్యసి కిం తూష్ణీమధ్వరమంటపే ॥ 82

ఉపాయం చింతయస్వాన్యం వధే తస్య లవస్య చ ।
శస్త్రైరస్త్రైర్మ్మృతిం యుద్ధే న గచ్ఛతి లవః ప్రభో ॥ 83

## లవుడు లక్ష్మణుని జయించుట.

ఆ లవుని చూచిన లక్ష్మణుడు, "దయచే బిడ్డడా! ఇప్పుడు నీవు నా ఎదుట సాహసింపకుము. నా ఎదుట నిలుచుటకు నీకు శక్తిచాలదు. పోకపోతివా మరణింతువు. నీద్వారా తక్కిన రామాయణమును వినుటకై నేను నిన్ను చంపను. నీవు పలుమార్లు శ్రీరాముని విషయమై తప్పులు చేసితివి. వాటినన్నిటిని గుర్తించినను నిన్ను చంపను. నీవు బ్రతుకగోరితివా తీసుకుపోయిన వీరులను, గుఱ్ఱములను తీసుకుని శ్రీరాముని సన్నిధికి వచ్చి, శరణువేడుము." అని చెప్పిన లక్ష్మణుని జూచి, లవుడు నిర్భయముగా, "సీతమ్మను అడవిలో వదిలిన నిన్ను, శ్రీరాముని కూడా పౌరుషములేని వారని అనుకుంటున్నాను. సీతమ్మమీదే మీ పౌరుషము. లవుడగు నామీద కాదు. సీతాదేవి యొక్క దుఃఖపరిహారము కొరకు వాల్మీకి ముని నన్ను ఏర్పరిచెను. మిమ్ము‌ను యుద్ధమున జయించి, సీతాదేవి దుఃఖమును పోగొట్టుదును. పతివ్రతయగు జానకి వ్యర్థముగా మీచే నిందనీయురాలు అయ్యె. అందుకు ప్రాయశ్చిత్తము చేయుటకు నేను ఇచ్చటికి వచ్చియున్నాను. మీ యొక్క శౌర్యము, సీతయొక్క దుఃఖాగ్నిచే దగ్ధమైపోయినది. ఇచ్చట నా ఎదుటనీవు నిలువ వద్దు. విధవలవంటి వీరులవద్దకు పొమ్ము." అని వాక్ బాణములచే లక్ష్మణాదుల మర్మస్థలములను బ్రద్దలుచేసెను. అంత వారు శస్త్రాస్త్రములచే లవుని మీద బాణవర్షములు గురిపించిరి. లవుడును వారి శస్త్రవృష్టిని నివారించి, శ్రీరాముని మంత్రులను, యజ్ఞవాటికకు ఎగురగొట్టెను. మంత్రులు మొదలైనవారందరును లవుని బాణములకు ఒళ్ళు విరిగి, నెత్తుటమునిగి,

మాటలు జారిపోవుచుండగా, "శ్రీరామచంద్రస్వామి! మమ్ము ఊరకే యజ్ఞమండపమున చూచుచుందువా ఏమి? ఆ లవుని చంపుటకు వేరొక ఉపాయమును ఆలోచింపుము. మహాప్రభూ! శస్త్రాస్త్రములచే ఆ లవుడు రణమున చావడు." అనిరి.

**సాహాయ్యం కురు సౌమిత్రేర్యది బంధుం సజీవితమ్ ।**
**త్వమిచ్ఛసి లవశరప్రహారాద్బంధువత్సల ॥ 84**

**ఇత్యుక్త్వా లవవాక్యాని రాఘవం తే న్యవేదయన్ ।**
**తాని శ్రుత్వా రాఘవోఽపి తూష్ణీమాసీత్తదా క్షణమ్ ॥ 85**

**లవోఽపి లక్ష్మణం బాణైర్వివ్యాధ దశభిర్దృఢమ్ ।**
**ఆపుంఖమగ్నాస్తే బాణాః శరీరే లక్ష్మణస్య చ ॥ 86**

**తతః క్రోధపరీతాత్మా లక్ష్మణో వేగవత్తరః ।**
**లవదేహే స్వశస్త్రాణి భవంతి విఫలాని హి ॥ 87**

**దృష్ట్వేతి వ్యగ్రచిత్తః సన్ క్షణం సంచింత్య వై హృది ।**
**బ్రహ్మాస్త్రేణ లవం బద్ధ్వా సాశ్వం రాజ్ఞే న్యవేదయత్ ॥ 88**

**బ్రహ్మాస్త్రం మానయస్తూష్ణీం యయౌ రామం లవోఽపి సః ।**
**రాఘవస్తం సమానీతం దృష్ట్వా లక్ష్మణమబ్రవీత్ ॥ 89**

**జానన్నపి సుతం స్వీయం కౌతుకం దర్శయన్ జనాన్ ।**
**మహత్కార్యం కృతం బంధో త్వమేనం విద్ధిబాహుజమ్ ॥ 90**

**ద్విజహత్యాభయం త్యక్త్వా ఘాతయస్వైనమద్య హి ।**
**రామం ప్రోవాచ సౌమిత్రిర్నాయం శస్త్రైర్మరిష్యతి ॥ 91**

**భరతాద్యైర్మయా చాపి నాయం కిం తాడితోఽసిభిః ।**
**అస్య దేహే క్షతం చైకమపి కిం దృశ్యతే త్వయా ॥ 92**

**తచ్ఛ్రుత్వా రాఘవః ప్రాహ ప్రష్టవ్యో బాలకస్త్వయా ।**
**కేనోపాయేన తే మృత్యుర్భవేదితి మమాగ్రతః ॥ 93**

**గోపాయంతి నిజం మృత్యుం న శూరా వధకాంక్షయా ।**
**న వదంత్యనృతం క్వాపి స్వబలేనైవ జీవితాః ॥ 94**

శ్రీరామా! లక్ష్మణుడు బ్రతికియుండవలెనను కోరిక ఉన్నచో ఆ లవుని ప్రహారమునుండి లక్ష్మణుని తప్పించి బ్రతుకునట్లు చేయుము," అని మొరపెట్టి, లవుని మాటలను విన్నవించిరి. ఆ మాటలను విని శ్రీరాముడు కొంతసేపు ఊరకేయుండెను. లవుడును పదిబాణములచే లక్ష్మణుని కొట్టెను. ఆ బాణములు శరీరమంతా క్రమ్మినవి. అంత లక్ష్మణుడు కోపముతో "ఏమి నా బాణములు లవుని దేహమును తాకక నిష్ఫలములవుచున్నవి" అని కలతనొంది, కొంతసేపు మనమున ఆలోచించి, బ్రహ్మాస్త్రమును ప్రయోగించి, గుఱ్ఱముతోపాటు లవుని కూడా శ్రీరామ సన్నిధిలో తెచ్చి విడిచెను. ఆ లవుడును బ్రహ్మాస్త్రమును గౌరవించుచు తిన్నగా వెడలెను. సీతారాముడు లవుని తెచ్చుచున్న లక్ష్మణుని జూచి, తన కొడుకు అనే సంగతిని గుర్తించి, లోకమునకు వింతను చూపించుటకై, "తమ్ముడా! గొప్ప పనిచేసితివి. వీనిని క్షత్రియుడని గుర్తించి, బ్రహ్మ హత్యాభయములేక ఇప్పుడు చంపవలయును గదా," అని చెప్పెను. అందుకు లక్ష్మణుడు, "అన్నా! వీడు శస్త్రములచే చావువాడు కాదు. భరతాదులచేతను, నా చేతను వీడు పలుమార్లు నరుకబడినను వీని దేహమున ఒక గాయము కూడా లేదు. చూడుము," అని విన్నవింపగా, రాఘవుడు, నీవు బాలకుని అడుగుము. "ఎట్లు నీకు మరణము కలుగు"నన్న సంగతిని నా ఎదుట నీవు అడిగిన శూరులగు వారు వధకాంక్షచే మృత్యువును దాచరు. ఎప్పుడూ అబద్ధము చెప్పరు. తమబలముచేతనే బ్రతికియుందురు," అని ఆజ్ఞాపించెను.

**తతః పృష్టో లక్ష్మణేన లవః ప్రాహాథ లక్ష్మణమ్ ।**
**జలస్య సేచనాద్వృద్ధిం స్వీయాం జ్ఞాత్వా మునేర్గిరా ॥ 95**

**కాపట్యబుద్ధ్యా లోకాన్హి దర్శయన్ స్వపరాక్రమమ్ ।**
**జలస్య సేచనేనాద్య మృత్యుర్మే నిశ్చితో భవేత్ ॥ 96**

**తత్తస్య వచనం శ్రుత్వా శిలాయాం తం నివేశ్య చ ।**
**సేవనం తోయకలశైః కారయామాస లక్ష్మణః ॥**
**అయోధ్యావాసిభిర్నారీపురుషైః పరమాదరాత్ ॥ 97**

**చతుర్ముఖైశ్చ ఘటైర్ వృషానీతైశ్చ కోటిశః ।**
**తథా కార్పటికైశ్చాపి రథోష్ట్రవారణాదిభిః ॥ 98**

**ఆనయిత్వా జలం శీఘ్రం సిషేచ లవబాలకమ్ ।**
**యథా యథా జలైస్తం హి సేవనం చక్రిరే జనాః ॥ 99**

తథా తథా లవస్తత్ర వ్యవర్ధత ఘనో యథా ।
సప్తతాళప్రమాణోఽభూత్ వృద్ధ్యా భీమపరాక్రమః ॥ **100**

తతస్తం లక్ష్మణః ప్రాహ త్వయా లవ మృషేరితమ్ ।
నాయం తవ వధోపాయః స్వవృద్ధ్యర్థం కృతః ఖలు ॥ **101**

లవోఽప్యాహాథ సౌమిత్రిం కౌటిల్యేన ప్రతారయన్ ।
యథా తైలక్షతే దీపో వృద్ధిమంతే ప్రగచ్ఛతి ॥ **102**

తథాయుషః క్షయే మేఽపి వృద్ధిం పశ్య క్షణం త్విమామ్ ।
తద్వాక్య మానయన్సత్యం సేచయత్తం చ లక్ష్మణః ॥ **103**

జలైర్గాంగైః సమానీతైః పూర్వవచ్చ పునః పునః ।
కాష్ఠసోపానమార్గేణ సేచనం చక్రిరే జనాః ॥ **104**

బ్రహ్మాస్త్రేణ వినిర్ముక్తః ప్రచచాల లవస్తదా ।
భుజావాస్ఫాలయామాస తథోరూ బాలలీలయా ॥ **105**

తం దృష్ట్వా దుద్రువుః సర్వే త్యక్త్వా తోయఘటానపి ।
శకృన్మూత్రం ప్రముంచన్తో ముక్తకచ్ఛా లవేక్షణాః ॥ **106**

ఏతస్మిన్నంతరే క్రీడన్ గంగాయాం తాన్ జనాన్కుశః ।
పప్రచ్ఛాద్య ముహుర్నీరం కిమర్థం నీయతే జవాత్ ॥ **107**

అంత లక్ష్మణుడు అట్లే అని లవుని ప్రశ్నించెను. అందుకు లవుడు తన మనమున వాల్మీకి ముని మాటచే తనమీద నీళ్ళుముంచి పోయుటచే తనకు వృద్ధియగుచుండునను సంగతిని ఆలోచించుకుని, కపటబుద్ధిచే లోకులకు నిజపరాక్రమమును చూపించుటకు, "నా నెత్తిన నీళ్ళుపోయుటచే నాకు మృత్యువు ఘటిల్లు," అని చెప్పెను. ఆ మాటను విని లక్ష్మణుడు లవుని బండమీద నిలిపి, నీటి కుండలచే లవునికి అభిషేకమును చేయింపసాగెను. అలా స్నానము చేయించుటకు నీళ్ళుచాలక ఊరివారగు స్త్రీ, పురుషులును, రాజసేవకులును, నానా పాత్రలలోను వాహనాదులమీదను నీళ్ళు తెచ్చి పోయించుచు వచ్చిరి. అక్కడివారు జలాభిషేకము ఎంతెంత చేసిరో లవునికి అంతంత బలము వచ్చి, మేఘమువలే ఏడుతాటిచెట్లు అంత పొడుగు పెరిగెను. అపుడు లక్ష్మణుడు, లవుని జూచి,

"లవుడా! నీవు అబద్ధము చెప్పితివి. ఇది నీ యొక్క వధోపాయము కాదు. నీ అభివృద్ధికై ఇట్లు చేసితివి కదా," అని ఆక్షేపించెను. అందుకు లవుడును మభ్యపెట్టుటకు, "చమురు తగ్గినపుడు దీపము పెద్దదగునట్లు, ఆయుః క్షయ సమయమున నేను ఇట్లు పెరుగుచున్నాను. అని పలుకగా, ఆ మాటను సత్యమని నమ్మి లక్ష్మణుడు జలాభిషేకమును చేయించుచుండెను. అందరును ముందు వలెనే నీటిని తెచ్చి, కొయ్యమెట్ల దారిన వచ్చి, నీళ్ళుపోయుచుండిరి. అప్పటికి బ్రహ్మాస్త్రమునుండి విముక్తుడైన లవుడు చలించి, బిడ్డలాటచే భుజమును తట్టి, తొడను కదిలించెను. దానిని చూచి అందరును జలపాత్రములను అట్లే వదలి, కచ్చలువిడిపోవ మల మూత్రములను విసర్జించుచు, లవునినే చూచువారై, ఎచటివారచటే పరుగెత్తిరి. (106) అపుడు గంగాతీరమున ఆటలాడుచున్న కుశుడు ఆ జనులను జూచి, నేడు మీరేల పలుమార్లు నీళ్ళుమోయుచున్నారని అడిగెను.

**జనాః ప్రోచుర్లవం హంతుమస్మాభిర్నీయతే జలమ్ ।**
**విశ్వస్తైర్లవవాక్యేన తచ్ఛ్రుత్వా స యయౌ కుశః ॥ 108**

**సంగృహ్య స్వాశ్రమాచ్చాపం తూణీరం వేగవత్తరః ।**
**లవ మోచయితుం చాపం రణత్కృత్వాఽధ్వరస్థలే ॥ 109**

**కుశచాపధ్వనిం శ్రుత్వా తస్థౌ తూష్ణీం లవః క్షణమ్ ।**
**తతో దృష్ట్వా కుశ ప్రాప్తం యయౌ యోద్ధుం స లక్ష్మణః ॥ 110**

**తం దృష్ట్వా స కుశః ప్రాహ ఛలితౌ జానకీలవౌ ।**
**త్వయా రామేణ లోకైశ్చ తయోః కర్తుం వినిష్కృతిమ్ ॥ 111**

**అహం ప్రాప్తోఽస్మి మాం బాలం లవవత్త్వం న మానయ ।**
**యువయోః పౌరుషం నార్యాం శిశావస్తీతి వేద్మ్యహమ్ ॥ 112**

**సీతాక్లేశానలజ్వాలాసందగ్ధం యువయోర్బలమ్ ।**
**న మామగ్రే స్ఫుటం కార్యం యువాభ్యాముపహాసకృత్ ॥ 113**

**వాల్మీకిశిక్షితాంవిద్యాం రామం త్వామద్య దర్శయే ।**
**ఇత్యుక్త్వా తుములం యుద్ధం పితృవ్యేణ చకార సః ॥ 114**

**ఆసన్ వృథా జానకీయే లక్ష్మణోత్సృష్టమార్గణాః ।**
**రామాయణాత్మకో జ్ఞాత్వా శేష ఏవాత్ర లక్ష్మణః ॥ 115**

**జాతోఽస్తీతి వధే తస్య గారుడాస్త్రం ముమోచ సః ।**
**క్షాత్రధర్మం పురస్కృత్య న తద్ధింసాభయం దధే ॥ 116**

**జానన్ యుద్ధే పితుర్హిత్యా జాతా చేన్న భయం త్వితి ।**
**తద్దృశా ఖగరాజాస్త్రం సౌమిత్రేః కుఠితా మతిః ॥ 117**

## కుశుడు లక్ష్మణునితో యుద్ధముచేయుట.

లవుని చంపుటకు నీళ్ళు మోయుచున్నామనిరి. అపుడు కుశుడు వేగముగా వచ్చి, ఆశ్రమమున ధనస్సును అమ్ములపొదిని తీసుకుని, లవుని విడిపించుటకై యజ్ఞవాటిక వద్దకు వచ్చి, ధనుష్టంకారము జేసెను. కుశుని చాపనాదమును విని, లవుడు కొంతసేపు ఊరకేయుండెను. కుశుడు వచ్చుచుండటను తెలుసుకుని, లక్ష్మణుడు పోయి తారసిల్లెను. కుశుడు, లవుని జూచి, "లక్ష్మణా! నీవు, రాముడు, లోకులు, జానకీదేవిని, లవుని మోసబుచ్చితిరి. వాటికి తగిన ప్రాయశ్చిత్తము చేయుటకై నేను వచ్చియున్నాను. లవుని వలే నన్ను బాలకునిగా నీవు ఎంచవలదు. మీ అన్నదమ్ములు పౌరుషము, స్త్రీయందును, శిశువు నందును మాత్రమే గలదని నేనెఱుగుదును. సీతాదేవి యొక్క దుఃఖాగ్ని జ్వాలలచే మీ బలము దగ్ధమైనది. హాస్యాస్పదముగా నా ఎదుట చూపవలదు. నేడు వాల్మీకి వద్ద నేర్చిన విద్యను నీకును, రామునికిని చూపెదను." అని చెప్పి, లక్ష్మణునిచే దొమ్మియుద్ధమును ఆచరించెను. కుశుని మీద లక్ష్మణుడు ప్రయోగించిన బాణములు వ్యర్థములైనవి. అపుడు లవుడు రామాయణ కథచే నిచట శేషుడే లక్ష్మణుడుగా అవతరించెననుట గుర్తించి, వానిని వధించుటకై గరుడాస్త్రమును ప్రయోగించెను మరి యుద్ధమున తండ్రిని చంపినను, క్షత్రియునికి పాపము కాదనుట తెలుసుకుని, పినతండ్రి విషయమై రణరంగమున హింసాభయమునందలేదు. ఆ గరుడాస్త్రమును జూచి, లక్ష్మణుని గతిచెడెను. భయభ్రాంతుడై రథమునుండి దిగి నేలపై నిలబడెను. (117)

**భయభీతః పృథివ్యాం హి పపాత లక్ష్మణో రథాత్ ।**
**చ్యుతం దృష్ట్వా స్వయం తత్ర దీక్షాయుక్తోఽపి వేగతః ॥ 118**

**ధృత్వా చాపం చ తూణీరం యజ్ఞకుండాగ్రతః స్థితః ।**
**చాపం సంధాయ బ్రహ్మాణం సౌమిత్రేర్జీవితాశయా ॥ 119**

**ముమోచ బాణమాకాశే గరుడోపరి సాదరమ్ ।**
**తేన తచ్ఛాంతిమగమద్బ్రహ్మాస్త్రేణ తు గారుడమ్ ॥ 120**

తతః కుశః సందధే స సర్వాస్త్ర రాఘవోపరి ।
ఉవాచ నాహం సీతావత్సులభశ్చలితం త్వయా ॥ 121

జనాన్ దర్శయితుం స్వీయం పౌరుషం జానకీ వనే ।
త్యక్త్వా త్వయా వృథా పూర్వం జానేఽహం తవ చేష్టితమ్ ॥ 122

వాల్మీకిశిక్షితాం విద్యాం మమాద్య త్వ విలోకయ ।
నోచేత్త్వం యాహి శరణం వాల్మీకిం జానకీమపి ॥ 123

తద్వాక్యైరైర్భిన్నమర్మా రామః సర్వం విలోక్య తత్ ।
ఔత్వాస్త్రం ససృజే ఘోర తేన తచ్ఛాంతిమాప వై ॥ 124

సందధే సారమేయాస్త్రై కుశస్తం రాఘవం పునః ।
రామోఽపి మౌసలాస్త్రేణ సారమేయం న్యవారయత్ ॥ 125

వహ్న్యస్త్రం ససృజే ఘోరం కుశోఽపి రాఘవం జవాత్ ।
న్యవారయచ్చ తద్రామో మేఘాస్త్రేణ స లీలయా ॥ 126

వాయవ్యం ససృజే రామం జానకీజఠరోద్భవః ।
న్యవారయచ్చ తద్రామః పర్వతాస్త్రేణ లీలయా ॥ 127

వజ్రాస్త్రై ససృజే రామం సీతేయః సోఽతిసంభ్రమాత్ ।
యామ్యాస్త్రేణాథ రామోఽపి వజ్రాస్త్రం తన్యవారయత్ ॥ 128

బ్రహ్మాస్త్రం ససృజే రామం సీతేయః పరమాదరాత్ ।
హాహాకారస్తదా చాసీద్రాఘవస్యాధ్వరాంగణే ॥ 129

న్యవారయత్తద్బ్రహ్మాస్త్రం వైష్ణవేన రఘూత్తమః ।
తతో రామం కుశస్తీక్ష్ణాన్నారాచాంశ్చతశః పునః ॥ 130

ముమోచ రాఘవశ్చాపి మార్గణాంశ్ఛతశః పునః ।
ఏవం తత్తుములం యుద్ధం బభూవ ప్రహరం తయోః ॥ 131

తదాఽఽసీత్కౌతుకం రామకుశయోర్యుధ్యతోర్మహత్ ।
రామచాపవినిర్ముక్తా గతా యే యే పతత్రిణః ॥ 132

## కుశుడు-శ్రీరాముడు యుద్ధముచేయుట.

శ్రీరాముడు దీక్షాముక్తుడైనను, లక్ష్మణుడు నేలబడుటను జూచి, త్వరగా ధనుర్బాణములను అందుకుని, యజ్ఞకుండమునకు ఎదుట నిలిచెను మరియు ఆ లక్ష్మణుని బ్రతికింప వలెనను ఆశచే గరుడాస్త్రముమీద బ్రహ్మాస్త్రమును ప్రయోగించెను. అంతలో అది శాంతమయ్యె. అపుడు లవుడు శ్రీరామునిమీద సర్పాస్త్రము ప్రయోగించి, "నేను సీతవలే సులభముగా నీ వల్ల వెనుకకు ద్రొక్కువాడను గాను. మునుపు వ్యర్థముగా మీ పౌరుషమును జనులు చూడవలయునని, సీతను అరణ్యమునకు పంపితివి. నీ చేష్టితమును నేను ఎఱుగుదును. వాల్మీకి వద్ద నేను నేర్చిన విద్యను నీవిపుడు చూడుము. అట్లుగాకున్న నీవే వాల్మీకిమునికిని, సీతాతల్లికిని శరణాగతుడవగుము," అని వాగ్బాణములను విడిచెను. అంత ఆ రాముడు సర్పాస్త్రముమీద మార్జాలాస్త్రమును ప్రయోగించెను. అంత అది శాంతమయ్యె. కుశుడు శునకాస్త్రమును వేయగా, రాముడు ముసలాస్త్రముచే దానిని నిగ్రహించెను. పిమ్మట కుశు డు ప్రయోగించిన ఆగ్నేయాస్త్రము శ్రీరాముని మేఘాస్త్రముచే మాయమయ్యె. కుశుడు వాయువ్యాస్త్రము విడువగా లీలచే రాముడు పర్వతాస్త్రముచే దానిని నివారించెను. కుశుడు తన వజ్రాస్త్రము, రాముని మాయాస్త్రముచే శాంతినొందగా బ్రహ్మాస్త్రమునే ప్రయోగించెను. అపుడు రాముని యజ్ఞాంగమున హాహాకార కోలాహలము పుట్టెను. శ్రీరాముడు దానినికూడా వైష్ణవాస్త్రముచే అణచెను. అంత ఊరకుండక కుశుడును

**తే తే కుశస్యోత్తమాంగోపరిష్టాద్ధరణీతలే ।**
**పతన్తి స్మ తథా యే యే కుశచాపవినిర్గతాః ॥ 133**

**శరాస్తే రామచంద్రస్య పతంతి స్మ పదాంతికే ।**
**తద్దృష్ట్వా కౌతుకం రామో విస్మయావిష్టమానసః ॥ 134**

**ఆజ్ఞాపయత్స్వసచివ గచ్ఛ వాల్మీకిసన్నిధిమ్ ।**
**పృచ్ఛస్వ తం నమస్కృత్య కౌ తే శిష్యావిమౌ బలీ ॥ 135**

**తతో జ్ఞాత్వాఽనయోర్ఖాతే కరిష్యామి మతిం క్షణాత్ ।**
**తథేతి రామవచనాత్స మంత్రీ రథమాస్థితః ॥ 136**

**క్రోశద్వయాంతరేణైవ సవ్యం కృత్వా కుశం లవమ్ ।**
**దృష్ట్వా నత్వాఽథ వాల్మీకిం రామవాక్యం న్యవేదయత్ ॥ 137**

**మునిః ప్రాహ మంత్రిణం త్వం వద రామాయ మే వచః ।**
**సభామధ్యే గాయనస్య కాలే శ్వో విదితం తవ ॥ 138**

**భవిష్యతి సమస్తం హి వృత్తం బాలకయోః శుభమ్ ।**
**తతో మంత్రీర్మునేర్వాక్యం రాఘవాయ న్యవేదయత్ ॥ 139**

**కుశం లవం సమాహూయ వాల్మీకిరపి తౌ ముదా ।**
**సమాలింగ్య కథాభిస్తాం నినాయ రజనీం సుఖమ్ ॥ 140**

**ఇతి శ్రీశతకోటిరామచరితాంతర్గతే, శ్రీమదానందరామాయణే, వాల్మీకీయే, ఆదికావ్యే, జన్మకాండే, కుశలవయోః పరాక్రమ వర్ణనం నామ, సప్తమః సర్గః ॥**

శ్రీరాముడును పదునైన బాణములచే కొంతసేపు పోరాడిరి. అప్పటి రామ–కుశలయుద్ధమున కౌతుకమొకటి జరిగినది. రాముడు ప్రయోగించిన బాణములన్నియును కుశుని తలమీదుగా నేలక్రాలుచుండెను. కుశుడును ప్రయోగించిన వన్నియును రామునిపాదముల మీదుగా నేలజారుచుండెను. ఆ సంగతిలో శ్రీరాముడు ఈ వేడుకను జూచి, ఆశ్చర్యచకిత చిత్తుడై తనమంత్రికి, "నీవు వాల్మీకి ముని సన్నిధికిపోయి, నమస్కరించి, ఎవరు వీరిరువురు బలిష్టులగు మీ శిష్యులు? అని అడిగి తెలుకునిరమ్ము. నేను సంగతిని గ్రహించి, పిమ్మట వీరి సంహారవిషయమై మదినెంచెదను," అని ఆజ్ఞాపించెను. అంత అతడు అట్లేఅని రథమును ఎక్కి, వెడలి రెండుక్రోసుల దూరముననే కుశలవులను కుడిప్రక్కనజేసి, వాల్మీకి మునికి నమస్కరించి, శ్రీరామ వాక్యమును విన్నవించెను. ఆమునీంద్రుడు మంత్రిని జూచి, "బాలకులయొక్క మంగళచరిత్రము సమగ్రముగా రేపు సభలో గానముజరుగునప్పుడు తెలియును. అని నామాటగా చెప్పుము. పొమ్ము," అని పంపించెను. అతడు అట్లే రామునికి విజ్ఞాపించెను. అచట వాల్మీకి కుశలవులను సంతసముతో పిలిచి, ఆలింగించి, కథలచే ఆ రాత్రిని సుఖముగా నడిపెను.

***ఈ విధముగ శ్రీమద్వాల్మీకి మహర్షిచే రచింపబడిన, శ్రీశతకోటిరామచరితాంతర్గత శ్రీమత్ ఆనందరామాయణములో, జన్మకాండలో కుశలవుల పరాక్రమాన్ని వర్ణించు, ఏడవ సర్గ ముగిసినది.***



# అష్టమః సర్గః-8వ సర్గ

శ్రీరాముడు సీతను స్వీకరించుట.

**శ్రీరామదాస ఉవాచ**

**అథ ప్రభాతే రామేణ సమాహూతావుభౌ శిశూ ।**
**నత్వా మునిం మాతరం చ సభాయాం జగ్మతుర్ముదా ॥ 1**

**వాల్మీకేరాజ్ఞయా బాలౌ జటాకృష్ణాజినాంబరౌ ।**
**జన్మకాండం త్వేకమేవ జగతుస్తౌ పితుః పురః ॥ 2**

**జనైః శ్రుత్వా స్వచరితం రామోఽభూదతివిస్మితః ॥ 3**

**ఆసన్ జనాశ్చాపి సర్వే విస్మయావిష్టమానసాః ।**
**జ్ఞాత్వా సీతాకుమారౌ తౌ సంతోషం పరమం యయుః ॥ 4**

**ఏతస్మిన్నంతరే సర్వే లవవాయ్వస్త్రపీడితాః ।**
**శత్రుఘ్నాద్యా యయుస్తత్ర యానస్థాశ్చాస్త్రజీవినః ॥ 5**

**అంగదాద్యాః పార్థివాశ్చ మోహనాస్త్రైకజీవితాః ।**
**యయుః సవానరాః సర్వే లక్ష్మణోఽపి యయావరుక్ ॥ 6**

**సర్వే నత్వా రామచంద్రం తస్థుస్తస్యాంతికే ముదా ।**
**అథ సంమంత్ర్య రామోఽపి తౌ విసృజ్యాదరేణ హి ॥ 7**

## యజ్ఞసభలో కుశలవులు జన్మకాండను పాడుట

శ్రీరామదాసు ఇట్లు చెప్పెను, "అంత మరునాడు ప్రొద్దున శ్రీరాముడు కుశ, లవులను పిలిపించెను. జటా కృష్ణాజిన ధారులగు ఆ కుశలవులను, వాల్మీకి మహర్షికి, వైదేహికి నమస్కరించి, సభలో ప్రవేశించి, సంతోషముతో వాల్మీకి అనుజ్ఞను పొంది, తండ్రిఎదుట జన్మకాండను ఒకటినే పాడిరి. శ్రీరామచంద్రుడు జనులతోడ తన చరిత్రమును విని ఎంతో ఆశ్చర్యమును పొందెను. లోకులును విస్మయావిష్టులై వీరు సీతమ్మయొక్క ముద్దుబిడ్డలని తెలుసుకుని సంతోషపడిరి. అంతలో లవునిచే

వాయువ్యాస్త్రముతో దెబ్బతిన్న శత్రుఘ్నాదులను, మోహనాస్త్రానికి మోహముపొందిన అంగదాది కపివీరులును, మహోరాజులును గాయమునందక యుండిరి. లక్ష్మణుడును అచటికివచ్చి, శ్రీరామచంద్రస్వామికి నమస్కరించి, ఆ సన్నిధానమున సంతోషముతో కూర్చొనెను. అపుడు రాఘవుడు ఆ బాలకులను సాదరముగా వారి నివాసానికి పంపెను. (7)

రాక్షసేంద్రం లక్ష్మణం చ శత్రుఘ్నం మకరధ్వజమ్ ।
ఖగరాజం సుషేణం చ జాంబవంతం వచోఽబ్రవీత్ ॥ 8

ఆనయధ్వం మునివరం ససీతం దేవసంమితమ్ ।
అద్యాస్తు పర్షదాం మధ్యే ప్రత్యయో వై సభాంగణే ॥ 9

గంగాయా దక్షిణే తీరే సభాకార్యాఽఽయతా శుభా ।
కరోతు శపథం సీతా మమాగ్రే జాహ్నవీతటే ॥ 10

మునీశ్వరాద్యాః సర్వే తాం జానంతు గతకల్మషామ్ ।
తథా మమాపి వాల్మీకే శుద్ధిం జానంతు వేగతః ॥ 11

ఇతి తద్వచనం శ్రుత్వా లక్ష్మణాద్యా మునిం గతాః ।
ఊచుర్యథోక్తం రామేణ వాల్మీకిం లక్ష్మణాదికాః ॥ 12

రామస్య హృద్గతం సర్వం జ్ఞాత్వా వాల్మీకిరబ్రవీత్ ।
సమర్చితాన్ సుమంత్రాద్యాన్ లక్ష్మణాయ సమర్ప్య చ ॥ 13

యుష్మాభిః కథనీయం యద్వాక్యం శ్రీరాఘవం ప్రతి ।
శ్వః కరిష్యతి వై సీతా శపథం జనసంసది ॥ 14

యోషితాం పరమో దేవః పతిరేకో న చాపరః ।
పతిం వినా గతిః కాఽన్యా నార్యాశ్చాస్తి జగత్త్రయే ॥ 15

లక్ష్మణద్యాస్తతః సర్వే రామమాగత్య తే పునః ।
సుమంత్రాదీంశ్చతుర్వీరాన్రాఘవాయ సమర్ప్య చ ॥ 16

## శ్రీరాముడు సీతాదేవిని, వాల్మీకిని పిలిపించుట.

పిదప శ్రీరాముడు– విభీషణ, లక్ష్మణ, శత్రుఘ్న, మకరధ్వజ, అంగద, సుషేణ, జాంబవంతులతో ఆలోచించి, “దేవ పూజ్యుడగు వాల్మీకి మునీంద్రుని సీతాదేవి తోడ తీసుకునిరండి. నేడు సభికులనడుమ సభాంగణమున నమ్మకము కావలయును. గంగయొక్క దక్షిణతీరమున మంగళకరమైన గొప్పసభను ఏర్పరచవలయును. గంగాతీరమున నా ఎదుట సీత శపథముచేయుగాక! మునీంద్రులందరును ఆమెను పాపములేనిదానిగా ఎఱుగనీ. అట్లే నా యొక్క నిష్కల్మషత్వమును వాల్మీకియొక్క పారిశుద్ధ్యమును తెలియుదురుగాక.” అని చెప్పిపంపెను. ఆ మాటను విని, లక్ష్మణాదులు వాల్మీకి మునీంద్రుని వద్దకు వచ్చి, శ్రీరామ వచనములను విన్నవించిరి. అప్పుడు ఆ మహర్షి శ్రీరాముని అభిప్రాయమును ఎఱిగి, లక్ష్మణాదులతో, “శ్రీరామునికి నామాటలను ఇట్లు మీరు విన్నవించవలసినది. రేపు సభామధ్యమున సీతాదేవి శపథము చేయుచున్నది. స్త్రీలకు పతియే పరమోత్తమ దేవుడు. ఇతరుడు కాడు. ముల్లోకములలోను పతితప్ప సతికి మరియేమి వేరుగతి గలదు?” అని ఆజ్ఞాపింపగా, అట్లేఅని లక్ష్మణాదులు వచ్చి, శ్రీరామసన్నిధిలో వాల్మీకి వాక్యమును సంతసముతో విన్నవించిరి.

**వాల్మీకేర్వచనం హర్షాదూచుస్తం రఘునాయకమ్ ।**
**వాల్మీకేర్వచనం శ్రుత్వా తుతోష రాఘవోఽపి చ ॥ 17**

**సుమంత్రం భరతం వాయుపుత్రం వానరనాయకః ।**
**సమాలింగ్య చతుర్భ్యః స పునర్జ్ఞాతానమన్యత ॥ 18**

**సీతయా పాలితాః సర్వే వయం లవజితాస్త్వితి ।**
**కథయామాసుః శ్రీరామం సుమంత్రాద్యాః సవిస్తరమ్ ॥ 19**

**ద్వితీయే దివసే కృత్వా సభాం శ్రేష్ఠాం మనోరమామ్ ।**
**సర్వాంస్తస్యాం సమాహూయ రామో వాక్యమథాబ్రవీత్ ॥ 20**

**మునయః పార్థివాః సర్వే శ్రుణుత స్వస్థమానసాః ।**
**సీతాయాః శపథం లోకా విజానంత్వశుభం శుభమ్ ॥ 21**

**ఇత్యుక్త్వా రాఘవేణాథ లోకాః సీతాదిదృక్షవః ।**
**బ్రాహ్మణాః క్షత్రియా వైశ్యాః శూద్రాశ్చైవ సహస్రశః ॥ 22**

సవానరాః సమాజగ్ముస్తద్దివ్యం ద్రష్టుముద్యతాః ।
తతోమునివరస్తూర్ణం ససీతః సముపాగతః ॥ 23

అగ్రతస్తం మునిం కృత్వా యాంతి కించిదవాఙ్ముఖీ ।
కృతాంజలిర్ముదా సీతా శనైర్యజ్ఞం వివేశ తమ్ ॥ 24
దృష్ట్వా లక్ష్మీమివాయాంతీం శ్రీవిష్ణోరనుయాయినీమ్ ।
వాల్మీకేః పృష్ఠతః సీతాం జయఘోషం ప్రచక్రిరే ॥ 25

తదా మధ్యే జనౌఘస్య ప్రవిశ్య మునిపుంగవః ।
సీతాసహాయో వాల్మీకిస్తదా రాఘవమబ్రవీత్ ॥ 26

ఇయం దాశరథే సీతా సువృత్తా ధర్మచారిణీ ।
త్వయా పాపాత్పురా త్యక్తా మమాశ్రమసమీపతః ॥ 27

లోకాపవాదభీతేన యమునాదక్షిణే తటే ।
ప్రత్యయం దాస్యతే సాఽద్య తదనుజ్ఞాతుమర్హసి ॥ 28

ఇమౌ తు సీతాతనయౌ కుశస్త్వత్తో లవో మయా ।
లవైర్వినిర్మితః సీతాభయాత్త్వవ్యగ్రచేతసా ॥ 29

లక్ష్మణుడు చెప్పిన వాల్మీకి వాక్యములను విన్న రాముడు, విశేషముగా ఆనందించి, భరత, సుగ్రీవ, సుమంత్ర, హనుమంతులను ఆలింగనముచేసుకొనెను. భరత, శత్రుఘ్నులను మరలా పుట్టిన వారినిగా ఎంచెను. వారు “మేము నలుగురము లవునిచే జయింపబడిన వారము. సీతమ్మ మమ్మును పాలించుచుండెను.” అని తమ సంగతిని సవిస్తరముగా విన్నవించిరి. (19)

## వాల్మీకిముని శ్రీరాములవారికి కుశ లవులను సమర్పించుట.

మరునాడు మనోహరమగు గొప్పసభను ఏర్పరచి, అందరిని పిలిపించిన శ్రీరామచంద్రుడు, “మునీంద్రులారా! మహారాజులారా! మీరందరును స్వస్థచిత్తులై వినండి. శుభమైనను, అశుభమైనను, సీతయొక్క శపథమును తెలియుదురు గాక.” అని చెప్పెను. అంత అందరును సీతాదేవిని దర్శించుట కొరకు ఎదురుచూచిరి. బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులు వేలకొలదిగా వానరులతో సీతామాత ప్రతిజ్ఞను చూచుటకు ఉత్సుకతతో వచ్చిరి. అంత ఆ వాల్మీకి మహర్షి త్వరగా సీతాదేవిని వెంటతీసుకుని సభకు విచ్చేసెను. సీతాదేవి, మునీంద్రుని ముందుపెట్టుకుని తలవంచి, బద్ధాంజలియై సంతసముతో

తిన్నగా ఆ యజ్ఞసభలో ప్రవేశించెను. వాల్మీకి మహర్షి వెనుక వచ్చుచున్న సీతామాత, శ్రీవిష్ణుమూర్తిని అనుసరించే సాక్షాత్ లక్ష్మివలే వచ్చుచుండుటను చూచి, సాధు సమాగమము గొప్పదయ్యెను. అపుడు జనసమూహ మధ్యమున వాల్మీకిముని సీతమ్మతోపాటు సభలో ప్రవేశించి, శ్రీరామునితో, "దాశరథీ! యమున దక్షిణా తీరమున మా ఆశ్రమ సమీపమునందు, పాపమువలన లోకాపవాద భీతుడైన నీవు ధర్మచారిణియగు సుశీలనయగు ఈ సీతా దేవిని త్యజించితివి. ఆమె ఇప్పుడు నమ్మకమును ఇచ్చుచున్నది. అందుకు నీవు అనుజ్ఞనిమ్ము. వీరిద్దరును సీతా పుత్రులు. నీ వలన కుశుడును, సీతమ్మ భయముచే చకితుడగు నా చే లవములచే నిర్మింపబడినవాడు లవుడును కలిగిరి.

**సుతావిమౌ తు దుర్ధర్షౌ తథ్యమేతద్ బ్రవీమి తే ।**
**ప్రచేతసోఽహం దశమః పుత్రో రఘుకులోద్వహ ॥ 30**

**అనృతం న స్మరామ్యుక్తం యథేమౌ తవ పుత్రకౌ ।**
**బహున్వర్షగణాన్ సమ్యక్ తపశ్చర్యా మయా కృతా ॥ 31**

**నోపాశ్నీయాం ఫలం తస్యా దుష్టేయం యది మైథిలీ ।**
**ఇత్యుక్త్వా రాఘవస్యాంకే దక్షిణే స్థాప్య వై కుశమ్ ॥ 32**

**లవం విన్యస్య వామాంకే తస్థౌ తస్యాగ్రతో మునిః ।**
**రామోఽపి తౌ సమాలింగ్య మూర్ధ్న్యవఘ్రాయ సాదరమ్ ॥ 33**

**లవస్య మస్తకే హస్తం సంస్థాప్య జగదీశ్వరః ।**
**అతిహ్రస్వతరం బాలం పూర్వవత్సోఽకరోచ్ఛృతమ్ ॥ 34**

**తతో రామోఽపి తాం సీతాం దృష్ట్వా బాహుద్వయాన్వితామ్ ।**
**అజ్ఞాత ఇవ సంప్రాహ లక్ష్మణం పురతః స్థితమ్ ॥ 35**

**త్వయా భుజః సమానీతః సీతాయా మాం ప్రదర్శితుమ్ ।**
**పురా తమానయస్వాద్య చేదస్తి రక్షితస్త్వయా ॥ 36**

**తథేత్యుక్త్వా లక్ష్మణోఽపి పేటికానిహితం భుజమ్ ।**
**సీతాయాః పురతో రామం దర్శయామాస సాదరమ్ ॥ 37**

**సీతాభుజోపమం దృష్ట్వా భుజం మాంసాదిభిర్యుతమ్ ।**
**పంచవర్షాంతరే కాలే హ్యాసన్ సర్వేఽతివిస్మితాః ॥ 38**

**ఏతస్మిన్నంతరే తత్ర పశ్యత్సు సకలేష్వపి ।**
**భుజః స గుప్తతాం ప్రాప్తో విశ్వకర్మోద్భవః క్షణాత్ ॥ 39**

**తద్దృష్ట్వా కౌతుకం లోకా హ్యభూవన్నతివిస్మితాః ।**
**రామోఽపి విస్మితః ప్రాహ వాల్మీకిం ప్రణిపత్య చ ॥ 40**

ఈ కుశ, లవులు నీ కుమారులు. వీరు మిక్కిలి సమర్థులు. నీకు నేను యథార్థమును చెప్పుచున్నాను. రఘునాథా! నీకు వీరు పుత్రులైనట్లే, నేనూ వరుణునియొక్క పదియవ పుత్రునిగా ఉన్నాను. అసత్యమును నేను ఎన్నడును స్మరించను. ఈ సీతమ్మ దుష్టురాలైనచో, అనేక సంవత్సరములు నేను ఆచరించిన తపస్సుయొక్క ఫలములు నాకు దక్కవు" అని చెప్పి, శ్రీరామచంద్రుని కుడితొడమీద కుశుని, ఎడమతొడమీద లవుని కూర్చుండబెట్టి ఎదుట నిలిచెను. జగదీశ్వరుడగు రాఘవుడును వారిని ఆలకించి, తలపై ముద్దుపెట్టి, సాదరముగా లవుని తలమీద తన హస్తమును పెట్టి, వానిని మునుపటివలె చిన్నబాలకునిగా జేసెను. (34)

## విశ్వకర్మనిర్మిత సీతాభుజము అదృశ్యమగుట.

అంత ఆ శ్రీరాముడు రెండు భుజములను కలిగిన సీతాదేవిని జూచి, తెలియనివానివలె ఎదురుగా ఉన్న లక్ష్మణునితో, "మునుపు నాకు చూపుటకై సీతమ్మయొక్క భుజమును తెచ్చిచూపితివిగదా! దానిని పదిలముగా పెట్టియుండిన నీవిపుడు తీసుకుని రమ్ము," అని ఆజ్ఞాపించెను. అతడు అట్లే అని సాదరముగా పెట్టెలోనుండి సీతాభుజమునెత్తి, ఆమె ఎదుట రాములవారికి చూపించెను. అది ఐదేండ్లకు మునుపే ఛేదింపబడిన మాంసపూరితమై సీతభుజమువలె ఉండెను. దానినిజూచి అందరు ఆశ్చర్యపడుచుండగా, ఆ విశ్వకర్మ నిర్మిత భుజము అదృశ్యమయ్యెను. ఆ వింతనుజూచి జనులు ఎంతో ఆశ్చర్యమును పొందిరి. శ్రీరాముడును ఆశ్చర్యము నందినవాడై, వాల్మీకి మునిని జూచి నమస్కరించెను.

**ఏవమేవ మహాప్రాజ్ఞ యదుక్తం మాం త్వయాఽధునా ।**
**ప్రత్యయో జనితో మహ్యాం తవ వాక్యైరకిల్బిషైః ॥ 41**

**లంకాయామపి దృష్టో మే వైదేహ్యాః ప్రత్యయో మహాన్ ।**
**దేవానాం పురతస్తేన మందిరం సంప్రవేశితా ॥ 42**

సేయం లోకభయాద్బ్రహ్మన్నపాపాఽపి సతీ పురా ।
సీతా మయా పరిత్యక్త తద్భవాన్ క్షంతుమర్హసి ॥ 43

మత్తో జాతోస్తి జానామి కుశోఽయం చ లవస్త్వయా ।
లవైర్భ్రాంత్యా కృతో వేద్మి సీతాశాపభయాన్మునే ॥ 44

తథాపి లోకాన్ సకలాన్ ద్రష్టు సీతాఽత్ర ప్రత్యయన్ ।
కరోతు శపథం చాపి సభాయాం తవ సన్నిధౌ ॥ 45

శుద్ధాయాం జగతీమధ్యే సీతామంగీకరోమ్యహమ్ ।
తదా తచ్ఛపథం ద్రష్టుమాసంల్లోకాః సముత్సుకాః ॥ 46

సభయా జానకీ చాథ తదా కౌశేయవాసినీ ।
ఉదఙ్ముఖీ హ్యధోదృష్టిః ప్రాంజలిర్వాక్యమబ్రవీత్ ॥ 47

రామాదన్యమహం చేద్ధి మనసాఽపి న చింతయే ।
తర్హి మే ధరణీ దేవీ వివరం దాతుమర్హతి ॥ 48

ఏవం శపంత్యాః సీతాయాః ప్రాదురాసీన్మహాద్భుతమ్ ।
భూతలాద్దివ్యమత్యర్థం సింహాసనమనుత్తమమ్ ॥ 49

భువో వివరమార్గేణ సమానీతం మనోరమమ్ ।
నాగేంద్రైర్ధ్రియమాణం తద్దివ్యదేహం రవిప్రభమ్ ॥ 50

భూదేవీ జానకీం దోర్భ్యాం ధృత్వా దుహితరం నిజామ్ ।
స్వాగతాసీతి తాముక్త్వాఽఽసనే సా సంన్యవేశయత్ ॥ 51

వస్త్రాలంకారస్రగ్గంధసుగంధైః పూజ్య మైథిలీమ్ ।
సమాలింగ్యాథ భూదేవీ వీజయామాస సాదరమ్ ॥ 52

తదా శనైః శనైర్భూమ్యాం గుప్తం సింహాసనం త్వభూత్ ।
సింహాసనస్థాం వైదేహీం ప్రవిశంతీం రసాతలమ్ ॥ 53

మహర్షీ! ఇపుడు నీవు నాతో చెప్పినదంతయు సరి. నిర్మలములైన నీ మాటలచే నాకు నమ్మకము చక్కగా కలిగినది. లంకలో దేవతలఎదుట సీతద్వారా నేను విన్న మాటలను అనుసరించి ఆమెను నేను అంగీకరించితిని. అట్టిఈమెను లోకభీతివలన నేను పరిత్యజించితిని. దానిని నీవు క్షమింపుము. ప్రాజ్ఞుడా! కుశుడు నా వలన కలిగెనని ఎఱుగుదును. సీతాశాపభయమువలన భ్రాంతిచే నీవు లవుని లవములచే నిర్మించితివని తెలిసియున్నాను. ఐనను ఈ లోకులందరికిని నమ్మకమును ఇచ్చుటకై సీత ఈ నిర్మల సభలో నీ ఎదుట శపథము చేయవలయును. లోకుల ఎదుట సీతను అంగీకరించెదను అని చెప్పగా, అపుడు ఆ శపథమును జూచుటకు జనులందరును సముత్సాహులైరి. అంత పట్టుబట్ట కట్టుకొనిన జానకీదేవి సభలో నమస్కరించి, ఉత్తరదిక్కుకు తిరిగి, నేలవైపు జూచుచు, "శ్రీరాముని తప్ప వేరొకరిని మనసున కూడా తలంచలేదు. గనుక ఈ భూదేవి నాకు అవకాశమును ఇచ్చుగాక. అని ఇట్లు శపించుచుండగా ఒక వింతజరిగెను. భూమిపై పెద్ద గోతి ఏర్పడి ఆ గోతినుండి, మిక్కిలి మనోహరమగు గొప్ప సింహాసనము ఒకటి పైకి వచ్చెను. ఆ సింహాసనముపై భూదేవి ప్రత్యక్షమై వచ్చి, తన కూతురగు సీతమ్మను చేపట్టి, సుఖముగా రమ్మని చెప్పి, దివ్యదేహులగు నాగేంద్రులచే ధరింపబడిన సూర్య కాంతితో నిండిన ఆ సింహాసనమున సీతను కూర్చుండబెట్టి, వస్త్ర, భూషణ, గంధ, మాల్యాదులచే సత్కరించి, ఆలింగనము చేసుకుని సాదరముగా వింజామరతో వీచుచుండెను. అపుడు తిన్నతిన్నగా సింహాసనము భూమిలోకి వెళ్ళసాగెను.

**దృష్ట్వాఽఽకాశస్థితా దేవాస్త్రియః సర్వాస్తు సంభ్రమాత్ ।**
**నిరంతరాభిర్వైదేహీం వవర్షుః పుష్పవృష్టిభిః ॥ 54**

**సాధువాదశ్చ సుమహాన్బభూవ సురకీర్తితః ।**
**అంతరిక్షే చ భూమౌ చ సర్వం స్థావరజంగమమ్ ॥ 55**

**తదా బభూవ చకితం సీతాశపథదర్శనాత్ ।**
**ఊచుస్తే వసుధా వాచో వానరాశ్చ నరాధికాః ॥ 56**

**కేచిచ్చింతాపరాః కేచిదాసన్ ధ్యానపరాయణాః ।**
**కేచిద్రామం నిరీక్షంతః కేచిత్సీతామచేతసః ॥ 57**

**ముహూర్తమాత్రం తత్సర్వం తూష్ణీభూతమచేతనమ్ ।**
**ప్రవిశంతీ భువం సీతాం దృష్ట్వా సంమోహితం జగత్ ॥ 58**

ఏతస్మిన్నంతరే రామః ప్రవిశంతీం హి భూతలే ।
విదేహజాం తదా స్పృష్ట్వా వామహస్తేన సంభ్రమాత్ ॥ 59

యాం దధార కరేణాదౌ ధృత్వా హస్తేన వై భువమ్ ।
తతస్తాం ప్రార్థయామాస భువం స రఘునందనః ॥ 60

శ్రీరామచంద్ర ఉవాచ
దేవి త్వం సర్వలోకానాం నివాసస్థానముత్తమమ్ ।
అసి లోకైకమాతా త్వం మహానీరోర్ధ్వతః సదా ॥ 61

వర్తసే పుణ్యరూపా త్వం వసుదా సకలాన్ జనాన్ ।
స్వజఠరాదౌషధీస్త్వం కరోషి విశ్వతృప్తిదాః ॥ 62

త్వం దుర్గా త్వం స్వరా లక్ష్మీర్మమ విష్ణోః ప్రియా శుభా ।
త్వమేవాద్యాత్ర మే శక్తిర్నిర్మితాఽసి మయైవ హి ॥ 63

నిజోదరాద్దదాసి త్వం ధాతూన్ప్రీత్యా జనాన్సదా ।
క్షమాయుక్తా త్వమేవాసి సూక్తాసూక్తాదికర్మసు ॥ 64

సింహాసనముపై కూర్చుని, భూదేవితో రసాతలమునకు దిగిపోవుచున్న జానకమ్మను జూచి, గగనమున దేవస్త్రీలు సీతమీద ఎడతెగక పూలవాన కురిపించిరి. ఆహా! ఎంతమంచిది, ఎంతమంచిదని దేవతలు కీర్తించిరి. అపుడు భూమిలోను, అంతరిక్షమందును గల చరాచర ప్రపంచము సీతా శపథమును చూచుటవలన భయ భ్రాంతమయ్యె. నరాధిపులును, వానరాధిపులును విచ్చలవిడిగా మాటలాడుచుండిరి. కొందరు చింతాక్రాంతులైరి. కొందరు ధ్యాననిష్ఠులైరి. కొందరు శ్రీరాముని వీక్షించుచుండిరి. కొందరు సీతాదేవిని అవలోకించుచుండిరి. సీత భూమిలో ప్రవేశించుటను జూచి, ఈ జగము సమ్మోహితమై, అచేతనమై ఒక ముహూర్తకాలము ఊరకేఉండెను. అపుడు శ్రీరాముడు భూమిలోనికి పోవుచున్న సీతను సంభ్రమముతో ఎడమచేతితో పట్టి ధరించి, కుడిచేతిలో భూ దేవిని పట్టి, ఇట్లు ప్రార్థించెను. (60)

## శ్రీరాముడు భూదేవిని ప్రార్థించుట.

“భూదేవీ! నీవు సర్వలోకమునకును ఉత్తమనివాసస్థానమైతివి. నీవు పుణ్యస్వరూణివి. సకల జనులకును నీ కడుపునుండి సువర్ణమును ఇచ్చెదవు. నీవు అశేష తృప్తిదములగు ఔషధులను చేయుచున్నావు. (62)

నీవే దుర్గాదేవివి, నీవే లక్ష్మీదేవివి, సర్వాత్మికవు, విష్ణువగు నాకు నీవే ప్రియురాలైన మంగళదేవత. నీవే ఇపుడిచట నా శక్తిగా ఉన్నావు. నిన్ను నేనే నిర్మించితిని. (63)

నీ కడుపునుండి లోకులకు ప్రీతితో ధాతువులను ఇచ్చుచున్నావు. సంతతము నీవే వేదసూక్తోక్త కర్మలు, ఇతర శాస్త్రోక్త కర్మలు మొదలైనవాటిలో క్షమకలిగినదానవు. (64)

జానకీ త్వం కన్యేయం శ్వశ్రూస్త్వం మేఽధునా త్వ్విహ ।
కన్యాదానం కురు ముదా త్వయా పూర్వం కృతం న హి ॥ 65

ప్రసాద దేవి నోచేన్మే త్వయి క్రోధా భవిష్యతి ।
శ్రీరామదాస ఉవాచ
ఇతి సంప్రార్థితా చాపి రాఘవేణ మహాత్మనా ॥ 66

నారీ కాఠిన్యభావాత్సా నా శృణోద్రాఘవేరితమ్ ।
శనైః శనైరధః సీతాసహితా సా జగామ హ ॥ 67

తాం గచ్ఛంతీం పునర్దృష్ట్వా భువం రామో ధృతామపి ।
బభూవ క్రోధతామ్రాక్షస్తదా లక్ష్మణమబ్రవీత్ ॥ 68

చాపమానయ సౌమిత్రే శిక్షయేఽహం భువం త్విమామ్ ।
మత్క్షురోపమబాణేన వసుధేయం విదేహజామ్ ॥ 69

మామద్య దాస్యతి క్షిప్రమస్య ఘాతం న రోచయే ।
తతోఽసౌ లక్ష్మణానీతం కరే కోదండముత్తమమ్ ॥ 70

ధృత్వా జ్యారోపణం కృత్వా శరసంధానమాతనోత్ ।
తదా వవౌ మహాన్వాయుశ్చుక్షుభే లవణార్ణవః ॥ 71

తారా నిపేతుర్ధరణీం బభూవుః సరజా దిశః ।
చకంపే ధరణీ సాపి త్రాహీతి వదతీ ముహుః ॥ 72

కరాభ్యాం జానకీం ధృత్వా రామస్యాంకే న్యవేశయత్ ।
శ్రీరామపదయోః పృథ్వీ శిరసా నమనం వ్యధాత్ ॥ 73

తదా ఖే దేవవాద్యాని నేదుః కుసుమవృష్టిభిః ।
వవర్షుర్జానకీం రామ దేవసంఘా ముదాన్వితాః ॥ 74

తతో రామోఽపి తాం దృష్ట్వా పదయోర్నమతీం భువమ్ ।
స్వక్రోధం శాంతమకరోత్కరాభ్యాం చాపమార్గణౌ ॥ 75

విసృజ్యోస్థాపయామాస స్వకరేణావనిం ప్రభుః ।
తతః సా రాఘవం నత్వా ప్రసాద్య చ పునః పునః ॥ 76

దత్వా విదేహకన్యాయై తం సింహాసనముత్తమమ్ ।
సీతాం స్తుత్వాఽథ తాం పృష్ట్వా తయా సంపూజితాఽపి చ ॥ 77

దేవీ! నీవు సుప్రసన్నవగుము. అట్లుకాకపోయిన నీయందు క్రోధము పుట్టుచున్నది." అని మహాత్ముడగు రాఘవుడు ప్రార్థించినను స్త్రీ కాఠిన్య స్వభావముచే ఆ భూదేవి రాముని మాటవినక సీతాదేవి తోడ తినతిన్నగా నేలదిగబడిపోవుచుండెను. (67) చెప్పినట్లు వినకపోవుచున్న భూ దేవిని జూచి, శ్రీరాముడు....

## భూదేవి సీతమ్మను అప్పగించి వెడలుట.

శ్రీరాముడు కన్నులెఱ్ఱబారుచుండ లక్ష్మణుని జూచి, "తమ్ముడా! ధనస్సును తెమ్ము. ఈ భూమిని శిక్షించెదను. ఈ భూదేవి సీతను నాకర్పించకున్నది. నా తీక్ష్ణబాణముచే దీనిని వధించెదను." అని ఆజ్ఞాపించెను. అంతనతడు చాపమునందివ్వగా, కోదండరాముడు ధనుష్టంకారముజేసి, బాణమును అనుసంధించెను. అపుడు చండమారుతము వీచసాగెను. సముద్రము అల్లకల్లోలమయ్యె. చుక్కలు నేలరాలుచుండె. దిక్కులలో దుమ్ముక్రమ్మెను. భూమి కంపించె. భూదేవి పలుమార్లు రక్షింపమని వేడుచు, సీతమ్మను చేతులతో ఎత్తుకునివచ్చి, శ్రీరాముని తొడమీద కూర్చుండబెట్టి, శ్రీరాముని కాళ్ళమీదపడి నమస్కరించెను. అపుడు గగనమున దేవవాద్యములు మ్రోగినవి. సురులు సీతారాములమీద పూలవాన కురిపించిరి. అంత ఆ రాముడు తన కాళ్ళపైపడియుండు భూ దేవిని జూచి, తన కోపమును చల్లార్చుకొని, ధనుర్బాణములను వదలి ధరణిని చేతనెత్తెను. అంత ఆ వసుధాదేవి పలుమార్లు రామునికి నమస్కరించి, ప్రసన్నుని జేసి, సీతాదేవికి శ్రేష్ఠమైన తత్ సింహాసనమును ఇచ్చి కొనియాడి, విచారించి, సీతచే సంపూజింపబడి, శ్రీరాములవారివద్ద శెలవు తీసుకుని, క్షణములో అంతర్హితమయ్యె. అపుడు లోకులందరును సీతమ్మను మరలా పుట్టి వచ్చిన దానినిగా ఎంచిరి.

ఆమంత్ర్య రాఘవం పృథ్వీ క్షణాదంతర్హితాఽభవత్ ।
తదా సీతాం జనాః సర్వే పునర్జాతాం తు మేనిరే ॥ 78

జయశబ్దైః ప్రణేముస్తాం చక్రుః పూజాం పృథక్ పృథక్ ।
దదౌ దానాన్యనేకానీ తదా రామో ముదాన్వితః ॥ 79

నవవాద్యనినాదాశ్చ సంబభూవుః సమంతతః ।
ననృతుర్వారనార్యశ్చ తుష్టువుర్వందిమాగధాః ॥ 80

సీతాయాః శపథో యత్ర జాహ్నవ్యా దక్షిణే తటే ।
సీతాకుండమితి ఖ్యాతం తత్ర తీర్థం బభూవ హ ॥ 81

పాతాళస్థం జలం పుణ్యం సంతప్తమనలోపమమ్ ।
వర్తతేఽద్యాపి తత్తీర్థం సీతోష్ణశ్వాసకారణాత్ ॥ 82

తదత్ర జానకీకుండం స్మరణాద్భయనాశనమ్ ।
పత్యురాయుష్యవృద్ధ్యర్థం స్త్రీభిః సేవ్యం సదా భువి ॥ 83

తతః సీతాయుతో రామః పుత్రాభ్యాం సహితో ముదా ।
వస్త్రాలంకారయుక్తాభ్యాం స్నానం హ్యవభృథాహ్వయమ్ ॥ 84

చకార కథితోత్సాహైః పూర్వవచ్చ సవిస్తరమ్ ।
అథ యజ్ఞశతం పూర్ణమేవం కృత్వా రఘూత్తమః ॥ 85

జాతకర్మాదిసంస్కారాన్ లవస్య విధినాఽకరోత్ ।
చకార నానాదానాని దేవాన్ సంపూజ్య భక్తితః ॥ 86

తతో మునీశ్వరాన్ పూజ్య పూజయామాస పార్థివాన్ ।
జనకం చ సుమేధాం చ పూజయామాస రాఘవః ॥ 87

విససర్జ ఋషీన్ సర్వాన్ ఋత్విజో యే సమాగతాః ।
ద్విజాద్యాస్తాన్ ధనాద్యైశ్చ తోషయామాసురాదరాత్ ॥ 88

తతో విసృజ్య విప్రాంశ్చ పార్థివైః సహ రాఘవః ।
కుమారాభ్యాం సీతయా చ బంధుభిశ్చాగమత్పురీమ్ ॥ 89

వేరువేరుగా అందరూ జయజయ కోలాహలముతో సీతాదేవిని పూజించిరి. అపుడు రాముడు ఆనందభరితుడై అనేక దానములను చేసెను. ఎచట చూచినను నవవిధ వాద్యములు మ్రోగుచుండెను. గణికులాడుచుండిరి. వందిమాగదులు పొగుడుచుండిరి. (80)

## శ్రీరాముడు సీతతో యజ్ఞము పూర్తిచేయుట.

గంగా దక్షిణ తీరమున సీత ఎచ్చట శపథముచేసెనో అచట సీతాకుండము అను ఒక దివ్యతీర్థము కలిగినది. అచట సీతమ్మకు నిప్పువంటి దుఃఖసంతప్తమగు కన్నీరు పరిశుద్ధముగా ఆ తీర్థమున పడినందున, సీతయొక్క వేడి నిట్టూర్పులవల్లనూ, అది తప్తతీర్థమనబడుచున్నది. ఆ కుండమును స్మరించిన మాత్రమున భయములు వీడును. స్త్రీలు తమ భర్తల ఆయుర్వృద్ధి కొరకు దానిని సేవింపవలయును. అంత ఆ సీతాదేవి వస్త్రాలంకారయుతులగు పుత్రులతో వెనుక చెప్పిన మహోత్సవములతో అవభృథ స్నానము ఆచరించెను. శ్రీరాముడు ఇట్లు 100 యజ్ఞములను పూర్తిచేసి, విధిప్రకారముగా లవునికి జాతకర్మాది సంస్కారములనుజేసి, వివిధ దానములను చేసి, భక్తితో దేవతలను పూజించెను. పిదప మునులను, ఋత్విక్కులను వచ్చియున్న బ్రాహ్మణాదులనందరిని ధన, దాన్య దక్షిణాది ప్రదానములచే ఆనందపరచి పంపెను. రాజులందరికిని వారివారి నెలవులకు శెలవిచ్చెను. (88) అంత శ్రీరాముడు సీతతోను, పుత్రులతోను, తమ్ములతోను అయోధ్యలో ప్రవేశించెను.

**నీరాజితః పురస్త్రీభిర్వారణస్థో రఘూత్తమః ।**
**సీతయా తనయాభ్యాం చ యయౌ నిజగృహం ప్రతి ॥ 90**

**తదా మహోత్స వశ్చాసీదయోధ్యాయాం సమంతతః ।**
**చిరకాలేన వైదేహ్యా దర్శనం చ జనైః కృతమ్ ॥ 91**

**తతో నృపాదికాన్ పూజ్య విససర్జ రఘూద్వహః ।**
**జనకం చ సుమేధాం చ దదావాజ్ఞాం నిజాం పురీమ్ ॥ 92**

**తతః సీతాయుతో రామః పుత్రాభ్యాం బంధుభిః సహ ।**
**పూర్వవత్స సుఖం రేమే చిరకాలం రఘూద్వహః ॥ 93**

**రామేణ సీతయా సార్ధం సహస్రాణి త్రయోదశ ।**
**వర్షాణ్యత్ర కృతం రాజ్యం కస్మిన్కాలే ద్విజోత్తమ ॥ 94**

ఏకాదశ సహస్రాణి వత్సరాణి మహాంతి చ ।
తథైకాదశ వర్షాణి మాసా ఏకాదశైవ తు ॥ 95

దినాన్యేకాదశైవాత్ర రామేణ సీతయా సహ ।
అయోధ్యాయాం కృతం రాజ్యం కస్మిన్కల్పే ద్విజోత్తమ ॥ 96

ఏకాదశ సహస్రాణి చైకాదశ దినాని చ ।
సప్తద్వీపవతీపాలో రామోఽభూత్కల్పభేదతః ॥ 97

దశవర్షసహస్రాణి దశవర్షశతాని చ ।
రామేణ సీతయా రాజ్యం కస్మిన్ కాలే కృతం ద్విజ ॥ 98

**ఇతి శ్రీశతకోటిరామచరితాంతర్గతే, శ్రీమదానందరామాయణే, వాల్మీకీయే, ఆదికావ్యే, జన్మకాండే, జానకీగ్రహణం నామ, అష్టమః సర్గః ॥**

## సీతారాములు పుత్రులతో అయోధ్యలో ప్రవేశించుట.

సీత, కుశ, లవులతో ఏనుగుమీదనెక్కి, మహోత్సవముగా ఊరిలో వచ్చుచున్న రాఘవుడు పురనారులచే సమర్పింపబడు నీరాజనాది సత్కారములు ఆనందముగ అంగీకరించెను. ఇట్లువచ్చి, రామచంద్రుడు రాజమందిరముచేరి, రారాజించుచుండెను. బహుకాలమునకు సీతాదేవియొక్క దర్శనము లోకులకు లభించినందున అయోధ్యలో మహోత్సవములు మనోహరములై జరుగుచుండెను. అంత శ్రీరాముడు తక్కిన రాజులకు శెలవిచ్చి పంపి, అత్తమామలను మిథిలాపురానికి సాదరముగా పంపించి, పత్నీ, పుత్రులతోను, తమ్ములతోను చిరకాలము సుఖముగా ఉండెను.

విష్ణుదాసా! వినుము. శ్రీరామచంద్రుడు 13,005 సంవత్సరములు రాజ్యమేలుచున్నట్లును, 11,011 సంవత్సరములు, 11 మాసములు, 11 దినములు సీతతోడ రాజ్యమేలినట్లు, 11 వేల ఎండ్లు, 11 దినములు రాజ్యమేలినట్లును 11వేల ఏండ్లుమాత్రమే రాజ్యమేలినట్లును, కల్పాంతర భేదముచే తెలియదగును. ...(80)

***ఈ విధముగ శ్రీమద్వాల్మీకి మహర్షిచే రచింపబడిన, శ్రీశతకోటిరామచరితాంతర్గత శ్రీమత్ ఆనందరామాయణములో, జన్మకాండలో సీతాదేవిని స్వీకరించుటను వర్ణించే, ఎనిమిదవ సర్గ ముగిసినది.***

# నవమః సర్గః- 9వ సర్గ

కుశలవులకు ఉపనయనోత్సవము

**శ్రీరామదాస ఉవాచ**

**అథోర్మిలా మాండవీ చ శ్రుతకీర్తిః సహైవ తాః ।**
**బభూవురంతరాత్కించిదంతర్వత్న్యో మహోదరాః ॥ 1**

**తాసాం చకార సీతా సా కౌతుకాని చ సాదరమ్ ।**
**తాసాం పుంసవనాదీని వివిధాని రఘూత్తమః ॥ 2**

**ఆహూయ పత్న్యా జనకం కారయామాస బంధుభిః ।**
**దోహదాన్ పూరయామాసుస్తాసాం పౌరసుహృత్స్త్రియః ॥ 3**

## లక్ష్మణ, భరత, శత్రుఘ్నులకు పుత్రులు జన్మించుట.

శ్రీరామదాసు ఇట్లు చెప్పెను, "తరువాత కొంతకాలానికి క్రమముగా ఊర్మిళ, మాండవి, శ్రుతకీర్తులు గర్భిణులైరి. సీతాదేవి వారికి సాదరముగా పలువేడుకలు చేయించెను. శ్రీరాముడు అత్తమామలను మిథిలనుండి పిలిపించి, తన తమ్ములచే వారికి పుంసవనాది సంస్కారములను ఎంతో వైభవముగా జేయించెను. పౌరనారులు, సుహృత్కాంతలును వారియొక్క వేవిళ్ళను తలంచుకుని తమ కోరికలు తీరుతున్నందుకు సంతోషించిరి.

**తాసాం సర్వాన్ సముత్సాహానేవం కృత్వా రఘూత్తమః ।**
**వస్త్రాలంకారభూషాభిస్తోషయామాస తాః సుఖమ్ ॥ 4**

**అథోర్మిలా సా తనయం సుషువే పరమోదయమ్ ।**
**తతః సా మాండవీ పుత్రం సుషువే పరమే దినే ॥ 5**

**తతః సా శ్రుతకీర్తిశ్చ సుషువే యమలౌ సుతౌ ।**
**కాలాంతరేణోర్మిలాయా ద్వితీయస్తనయోఽభవత్ ॥ 6**

తథాఽవరస్తు మాండవ్యాః పుత్రః కాలాంతరాదభూత్ ।
జాతకర్మాది సంస్కారాన్ కృత్వా రామః పృథక్ పృథక్ ॥ 7

చకార గురుణా విప్రైర్మహోత్సాహైర్యథావిధి ।
లక్ష్మణస్యాంగదో జ్యేష్ఠశ్చిత్రకేతుః కనిష్ఠకః ॥ 8

మాండవ్యాః పుష్కరో జ్యేష్ఠః కనిష్ఠస్తక్షనామకః ।
శ్రుతకీర్త్యాః సుబాహుశ్చ యూపకేతుః పరః స్మృతః ॥ 9

ఏవం కృతాని నామాని గురుణా విధిపూర్వకమ్ ।
ఏతేస్తఽరేణ సంజాతాః కాలే కాలే క్రమేణ చ ॥ 10

తేఽత్రైకత్ర మయా ప్రోక్తాః సంక్షేపేణాంగ త్వత్పురః ।
సర్వేషాం జన్మకాలేషు సురాః సర్వే ముదాన్వితాః ॥ 11

వాదయామాసుర్వాదాని వవర్షుః పుష్పవృష్టిభిః ।
మాతృభిః పితృభిర్యుక్తాన్ బాలకాన్ సూర్యసన్నిభాన్ ॥ 12

రాజద్వారి మహానాసీదుత్సవశ్చ నృపాజ్ఞయా ।
ననేదుర్ణవవాద్యాని ననృతుశ్చాప్సరోగణః ॥ 13

వాదయంతి స్మ తూర్యాణి తుష్టువుర్వందిమాగధాః ।
నగరీం శోధయామాసుః పతాకాధ్వజతోరణైః ॥ 14

సుహృదః పార్థివాః సర్వే రామాదీనాం చ పూజనమ్ ।
వస్త్రైరాభరణాద్యైశ్చ చక్రిరే తే పృథక్ పృథక్ ॥ 15

దదుర్దానాని విప్రేభ్యో రామాద్యా బంధవశ్చ తే ।
బ్రాహ్మణాన్ భోజయామాసుః శ్రాద్ధాని చక్రురాదరాత్ ॥ 16

ఏవమష్టౌ కుమారాస్తే రామాదీనాం మనోరమా ।
వవృధుశ్చంద్రవదనా మాతృభిర్లాలితాః సుఖమ్ ॥ 17

శ్రీరాముడు మరదళ్ళందరిని పిలిపించి వస్త్రాలంకారాది సత్కారాదులచే ఆనందపరచెను. పిదప ఊర్మిళాదేవి తొలుత కుమారుని గనెను. పిమ్మట మాండవి దేవికి పుత్రుడు ఉదయించెను. అటుమీద శ్రుతకీర్తికి కవలపిల్లలు పుట్టిరి. కొద్దికాలానికి ఊర్మిళ రెండవ పుత్రుని గనెను. మాండవిని అట్లే మరియొకని గనెను. శ్రీరాముడు వశిష్ఠులవారిచే వారందరికిని జాతకర్మాది సంస్కారములను చేయించి, యథావిధిగా వేరువేరుగా పేర్లుపెట్టించెను. లక్ష్మణుని జ్యేష్ఠపుత్రుడు అంగదుడు. రెండవవాడు చిత్రకేతు అనువాడు. మాండవి యొక్క మొదటి కొడుకు పుష్కరుడు, ఇంకొకడు తక్షుడు అనువాడు. శ్రుతకీర్తియొక్క జ్యేష్ఠసుతుడు సుబాహువు, కనిష్ఠుడు యూపకేతువు అనువాడు. ఇట్లు వారికి వశిష్ఠుడు పేర్లను పెట్టెను. కాలక్రమముగా ఇట్లందరికిని బిడ్డలు పుట్టిన సంగతిని సంక్షేపముగా నీకు చెప్పితిని. వారు వారు పుట్టినప్పుడంతయును దేవతలందరును సంతోష యుక్తులై మంగళవాయిద్యములను వాయించిరి. తల్లిదండ్రులతో ఆ బిడ్డలమీద పూలవాన కురిపించిరి. రాజాజ్ఞచే నగరమంతా గొప్ప ఉత్సవములయ్యాయి. నవవాద్యములు మ్రోగినవి. అప్సరసలు ఆడిరి. వందిమాగదులు నమస్కరించుచుండిరి. రకరకాల పతాకాదులచే పురములను అలంకరించిరి. మిత్రులు, రాజులందరును శ్రీరామాదులను వస్త్రాభరణాదులచే వేరువేరుగా పూజించిరి. రామ లక్ష్మణ, భరత, శత్రుఘ్నులు నాందిశ్రాద్ధ, బ్రాహ్మణభోజనాది సత్కర్మలను ఆచరించిరి. ఇట్లు శ్రీరామాదులయొక్క ఎనిమిది మంది ముద్దుబిడ్డలు తల్లులచే లాలింపబడుచు, చంద్రునివంటి ముఖము గలవారై సుఖముగా విలసిల్లిరి.

**శృంఖలాబద్ధరుక్మాది నిర్మితేషు వరేషు చ ।**
**ప్రేంఖేషు హి కుమారాస్తే విరేజూ రుక్మభూషితాః ॥ 18**

**భాలే స్వర్ణమయాశ్వత్థపర్ణాన్యతిమహాంతి చ ।**
**ముక్తాఫలాగ్రలంబీని శోభయంతి స్మ బాలకాన్ ॥ 19**

**కంఠే రత్నమణివ్రాతమధ్యద్వీపినఖాంచితాః ।**
**కర్ణయోః స్వర్ణసంపన్నరత్నార్జునసుతాలుకాః ॥ 20**

**సింజానమణిమంజీరకటిసూత్రాంగదైర్యుతాః ।**
**స్మితవక్త్రాల్పదశనా ఇంద్రనీలమణిప్రభాః ॥ 21**

అంగణే రింగమాణాశ్చ సంస్కారైః సంస్కృతాః శుభాః ।
తే పితౄన్ రంజయామాసు ర్మాతౄశ్చాపి విశేషతః ॥ 22

నానాశిశుక్రీడనకైశ్చేష్టితైర్ముఖచుంబనైః ।
బాలకృత్రిమయుద్ధైశ్చ గమనైర్మధురేరితైః ॥ 23

తతస్తే బాలకాః సర్వే వస్త్రాలంకారభూషితాః ।
సభాయాం రాఘవం నత్వా తస్థుః సింహాసనోపరి ॥ 24

ఏకదా రాఘవః ప్రాహ వసిష్ఠం సదసి స్థితమ్ ।
అవలోకయ బాలానాం త్వం చిహ్నాని యథాక్రమమ్ ॥ 25

తచ్ఛ్రుత్వా రామవచనం వసిష్ఠో భూసురైః సహ ।
ఆదౌ కుశం సమాహూయ దృష్ట్వా రామం వచోఽబ్రవీత్ ॥ 26

వసిష్ఠ ఉవాచ
పంచసూక్ష్మః పంచదీర్ఘః సప్తరక్తః షడున్నతః ।
త్రిపృథుర్లఘుగంభీరో ద్వాత్రింశల్లక్షణస్త్వయమ్ ॥ 27

పంచ దీర్ఘాణి శస్తాని యథా దీర్ఘాయుషోఽత్ర చ ।
భుజౌ నేత్రే హనుర్జానూ నాసా చ తనయస్య తే ॥ 28

బంగారు గొలుసులుగల ఉయ్యాలలో బంగారు ఆభరణములతో వెలుగు చుండిరి. అలంకరింపబడిన ముఖములతో ఆ బాలురు ప్రకాశించుచుండిరి. కంఠమున నవరత్న హారము మధ్యన పులిగోర్లును, చెవులకు బంగారు రత్నకుండలములును, దేహమున మ్రోగుచుండు రత్ననూపురములును, బంగారు మొలత్రాడు కేయూరములును కలిగి, నగుమోములతో, ఇంద్ర నీలమణి వైభవములైన చిట్టిపలువరుస మెరయుచుండెను. సమయానికి తగిన మంగళ సంస్కారములతో సంగతులగు ఆ బాలకులు ముంగిళ్ళలో ఆటలాడుచు, తలిదండ్రులను వివిధ బాలక్రీడలచేతను, చుంబనాది చేష్టల చేతను, కృత్రిమయుద్ధముల చేతను, మంచి నడకలచేతను సంతోషపరచుచుండిరి. అంత కొంతకాలమునకు ఆ బిడ్డలు చక్కగా అలంకరింపబడి సభలో శ్రీరామునికి నమస్కరించి, సింహాసనముల మీద కూర్చుండిరి. ఒకప్పుడు శ్రీరాముడు సభాసీనులగు వశిష్ఠులను జూచి, "కుశలవులయొక్క లక్షణములను చూడవలయు,"నని వేడెను. (25)

## కుశలవాదుల సాముద్రికాది లక్షణములు

వసిష్ఠుడు ఆ మాటవిని, బ్రాహ్మణులతో కూడి, మొదట కుశుని పిలిచి పరికించి, శ్రీరామునితో ఇట్లనెను– ఐదు సూక్ష్మములు, ఐదు దీర్ఘములు, ఏడు ఎఱ్ఱనివి, ఆరు పొడవైనవి, మూడు విరివి అయినవి, మూడు చులకనివి, ముడు లోతైనవి, ఇట్టి 32 శుభలక్షణములు గల వాడితడు. దీర్ఘాయుష్మంతుడగు నితనికి ఐదు దీర్ఘములైనవవి, చక్కగా నున్నవి. అవి ఏవనిన– భుజములు, నేత్రములు, మోకాళ్ళు, చెక్కిళ్ళు, ముక్కు, గొంతు, పిక్కలు, మోహనము అనునవి మూడును హ్రస్వములు.

గ్రీవాజంఘేమేహనైశ్చ త్రిభిర్ హ్రస్వోఽయమీడితః ।
స్వరేణ సత్త్వనాభిభ్యాం త్రిగంభీరః శిశుః శుభః ॥ 29

త్వక్కేశాంగులిదశనాః పర్వాణ్యంగులిజాన్యపి ।
తథాఽస్య పంచ సూక్ష్మాణి సూచయంతి పరాం శ్రియమ్ ॥ 30

పాణ్యంఘ్రితలనేత్రాంతే తాలుజిహ్వాధరోష్ఠకమ్ ।
సప్తారుణం చ సనఖమస్మిన్ రాజ్యసుఖప్రదమ్ ॥ 31

వక్షః కుక్ష్యాలికస్కంధకరవక్త్రం షడున్నతమ్ ।
తథాఽత్ర దృశ్యతే బాలే మహదైశ్వర్యభోగభాక్ ॥ 32

లలాటకటివక్షోభిస్త్రివిస్తీర్ణో యథా హ్యసౌ ।
సర్వతేజో మహైశ్వర్యం తథా ప్రాప్యతి నాన్యథా ॥ 33

అచ్ఛిన్నాం తర్జనీం ప్రాప్య తథా రేఖాఽస్య దృశ్యతే ।
కనిష్ఠామూలానిర్యాతా దీర్ఘాయుష్యం యథా భవేత్ ॥ 34

కమఠపృష్ఠకఠినావకర్మకరణౌ కరౌ ।
రాజ్యహేతూ శిరోరస్య పాదౌ చాధ్వని కోమలౌ ॥ 35

పాదౌ సమాంసలౌ రక్తౌ సమౌ సూక్ష్మౌ సుశోభనౌ ।
సమగుల్ఫౌ స్వదేహేన స్నిగ్ధావైశ్వర్యసూచకౌ ॥ 36

స్వల్పాభిః కరరేఖాభిశ్చారక్తాభిః సదా సుఖీ ।
లింగేన కృశహ్రస్వేన రాజరాజో భవిష్యతి ॥ 37

ఉత్కటాసనగుల్ఫస్ఫిజ్ఞాభిరస్యాపి వర్తులా ।
దక్షిణావర్తమరుణ మహదైశ్వర్యశూచకమ్ ॥ 38

ధారైకా మూత్రకే యస్య దక్షిణావర్తనీ యది ।
గంధశ్చ మీనమధునోర్యది వీర్యం తదా నృపః ॥ 39

విస్తీర్ణజ్ఞౌ మాంసలౌ స్నిగ్ధౌ భుజావస్య సుఖోచితౌ ।
వామావర్తౌ సప్రలంబౌ భుజౌ భూరక్షణోచితౌ ॥ 40

శ్రీవత్సవజ్రచక్రాబ్జమత్స్యకోదండదండభృత్ ।
తథాఽస్య కరగా రేఖా యథా స్యాత్త్రిదివస్పతిః ॥ 41

స్వరము, బొడ్డు, మనస్సు ఈ మూడును గంభీరములు. చర్మము, వెంట్రుకలు, వ్రేళ్ళు, పళ్ళు, వ్రేళ్ళగణుపులు ఇవి ఐదును సూక్ష్మములునై గొప్పసంపదను సూచించుచున్నవి. అరచేతులు, అరికాళ్ళు, నేత్రాంతములు, దవడలు, నాలుక, పెదవి, గోళ్ళు ఇవి ఆరు నొకటియును ఎఱ్ఱనివి గాన రాజ్యసుఖదాయకములు. ఎద, కడుపు, నుదురు, మూపులు, చేయి, నోరు ఇవి ఆరు ఉన్నతములుగా ఉన్నవి. ఇవి మహదైశ్వర్య భోగప్రదములు. ఎద, నుదురు, మొల ఇవి మూడును విరివియైనవి. సకల తేజములు గల మహదైశ్వర్యమును అనుభవించును. చిటికెన వ్రేలు, మొదలు జుట్టును వ్రేలివరకు నెడతెగకబారిన రేఖను పడుటచేత ఇతడు దీర్ఘాయుష్మంతుడుగా నుండును. ఇతని చేతులు శత్రుసంహార కార్యమున తాబేలు వీపువలె కఠినములు ఇది రాజ్యప్రదము. ఇతని పాదములు సమములు, మృదువులు, సూక్ష్మములు, కోమలములు, పృష్టములు, దేహముతో సరియైన వ్రేళ్ళుగలవి ఇవి ఐశ్వర్య సూచకములు. చేతిలో రేఖలు కొద్దిగా కలిగి, అవి ఎఱ్ఱగా తెలియుటచే వీడు సత్యసుఖముగా ఉండును. లింగము హ్రస్వముగా క్రుశయై ఉండుటచే రేరాజుగా ఉండును. గుదము, చీలమండలు, పిరుదల ఉన్నతి, బొడ్డు ఇవి గుండ్రముగా ఉండుటచేతను, కుడి సుడి ఎఱ్ఱబారియుండుటచేతను, మహాదైశ్వర్యము గలదు. కుడిసుడిగా ఒక దారగా మూత్రము పడుచుండిన వీర్యము, మీన మధుగంధము గలదిగా ఉండిన అప్పుడు రాజుగా ఉండును. ఇతని భుజములు విస్తీర్ణములును, బలిసినవియును, చిక్కన గలవియును గాన సుఖార్హములు మరియు మిక్కిలి లంబములై ఎడమ

సుడిగలవి గాన భూరక్షణకు తగినవి. శ్రీవత్స, వజ్ర, చక్ర, కమల, మత్స్య, చేప దండములను ధరించినట్టి దివ్యరేఖలు కలిగి ముల్లోకములకు నాయకుడుగా ఉన్నాడు.

ద్వాత్రింశద్దశనశ్చాయం వరకంబుశిరోధరః ।
క్రౌంచదుందుభిహంసాభ్రస్వరః సర్వేశ్వరాధికః ॥ 42

మధుపింగళనేత్రోఽసౌ నైనం శ్రీస్త్యజతి క్వచిత్ ।
పంచరేఖాలలాటస్తు తథా సింహోదరః శుభః ॥ 43

ఊర్ధ్వరేఖాంకితపదో నిః శ్వసన్పద్మగంధవాన్ ।
అచ్ఛిద్రపాణిః సునసో మహాలక్షణవానయమ్ ॥ 44

ఏవం కుశం నిరీక్ష్యాథ సర్వాన్ దృష్ట్వా క్రమేణ సః ।
లవాదీనాం సుచిహ్నాని పూర్వవత్ప్రాహ రాఘవమ్ ॥ 45

తతః ప్రీతమనా రామః పూజయామాస తం గురుమ్ ।
వస్త్రైరాభరణైశ్చైవ యాయౌ హర్షాత్తతో గృహమ్ ॥ 46

ఏతస్మిన్నంతరే సీతా భూమిదత్తవరాసనే ।
సంస్థితా చాపరైర్దివ్యైర్దాసీభిః పరివీజితా ॥ 47

సఖీభిః సేవితా రమ్యా ధృతాధోంకోపబర్హణా ।
ముకురే స్వం నిరీక్షంతీ ముఖం చంద్రనిభం వరమ్ ॥ 48

రామస్యాగమనం శ్రుత్వా సంచచాలాసనాజ్జవాత్ ।
తతో దదర్శ శ్రీరామం బాలకైః పరివేష్టితమ్ ॥ 49

స్వకట్యాం యూపకేతుం చ దధానమవరం శిశుమ్ ।
తథైవ దక్షిణే హస్తే దధానం చాంగదం శుభమ్ ॥ 50

కుశం లవం పురస్కృత్య సభాయాం తం శనైః శనైః ।
తత్పృష్ఠే సా దదర్శాథ లక్ష్మణం బాలకాన్వితమ్ ॥ 51

**తక్షం కట్యాం పుష్కరం చ దధానం దక్షిణే కరే ।**
**తత్పృష్ఠే భరతం సీతా దదర్శ ముదితాననా ॥ 52**

**చిత్రకేతుం శిశుం కట్యాం దధానం రుక్మమండితమ్ ।**
**తథైవ దక్షిణే హస్తే సుబాహుం పంకజేక్షణమ్ ॥ 53**

**తత్పృష్ఠే సా దదర్శాథ శత్రుఘ్నం జనకాత్మజా ।**
**రామశస్త్రాణి బిభ్రంతం సమాయాంతం శనైః శనైః ॥ 54**

ఇతడు 32 దంతములు గలవాడు. శంఖమువంటి కంఠముగలవాడు. హంస, క్రౌంచ, మేఘ, దుందుభి నాదముగల వీడు సర్వేశ్వరాధికుడు. తేనెవంటి పింగళనయనుడు గాన ఇతనిని శ్రీదేవి యెప్పుడును వదలదు. నొసట ఐదురేఖలను, సింహమువలె పొట్టలోతుగా గలవాడును గాన మంగళాంగుడు. ఊర్ధ్వ రేఖలచే ఉచితమగు పాదములు గలవాడు. ఊపిరి విడిచినపుడు తామరరస గంధములు గలదు. దట్టమైన కరతలములు, మంచి ముక్కు కావున ఇతడు మహాలక్షణ సంపన్నుడుగా ఉన్నాడు. ఇట్లు కుశునిని చూచి, పిదప క్రమముగా అందరి శుభలక్షణములను పరీక్షించి, తొలుతచెప్పినట్లే వరుసగా చెప్పెను. అంత ఆ శ్రీరామచంద్రుడు సంతృప్తిచెంది వశిష్ఠమహర్షిని వస్త్రాభరణములచే పూజించి, తన రాజమందిరమునకు వెళ్ళెను. అంతలో అంతఃపురమున సీతాదేవి భూదేవి ఇచ్చిన దివ్యాసనమున కూర్చుని, దాసీజనులు చామరాదులను వీయుచుండగా, సఖీజనులు సేవించుచుండగా, ఒరగుదిండ్లు ఆనుకుని, చంద్ర ప్రభవమగు తనముఖబింబమును అద్దములో చూచుకొనుచు, సుఖముగా ఉండగా శ్రీరామచంద్రస్వామియొక్క రాకను విని, ఆసనమునుండి లేచి వెడలి, తన నడుమును, ఉపకేతువును, కుడిచేతిలో అంగదుని ఎత్తుకుని ముందర కుశలవులను పెట్టుకుని, వచ్చుచుండు రాముని, ఆ వెనుక ఎడమ చంకలో తక్షకుని, కుడిచేతిలో పుష్కరుని ఎత్తుకుని వచ్చుచున్న లక్ష్మణుని, వాని వెనుక చంకలో చిత్రకేతువును, చేతిలో సుబాహువును ఎత్తుకుని వచ్చుచున్న భరతుని, వాని వెనుక శ్రీరాముని శస్త్రములను ధరించి మెల్లగా వచ్చుచున్న శత్రుఘ్నుని చూచి,

**ఏవం సా రాఘవం దృష్ట్వా సీతా ప్రత్యుజ్జగామ తమ్ ।**
**శింజన్మంజీరరశనా పీతకౌశేయధారిణీ ॥ 55**

**కరాభ్యాం పురతో యాంతం లవం ధృత్వా చుచుంబ సా ।**
**నిధాయ తం లవం కట్యాం ధృత్వా హస్తేన తం కుశమ్ ॥ 56**

యయౌ శనైః సా రామేణ వదతీ స్వస్థలం పునః ।
సఖీభిర్వేష్టితా సీతా రంజయామాస రాఘవమ్ ॥ 57

అథ రామోఽపి సీతాయాః స్థిత్వా సింహాసనోపరి ।
అంకయోః పురతశ్చాపి బాలకాన్సంస్థితాంశ్చ సః ॥ 58

సీతాయై దర్శయన్ ప్రీత్యా లాలయామాస సాదరమ్ ।
సీతాయై రాఘవః ప్రాహ సభాయాం గురుణా పురా ॥ 59

యాన్యుక్తాని సుచిహ్నాని శిశూనాం తాని విస్తరాత్ ।
శ్రుత్వా రామముఖాత్తాని సీతా తేషాం పరం యయౌ ॥ 60

రాఘవః ప్రాహ వైదేహీమూర్మిలాపరివీజితామ్ ।
సీతేఽంగదం చిత్రకేతుం లక్ష్మణాంకే నివేశయ ॥ 61

తద్రామవచనం శ్రుత్వా సీతా శీఘ్రం శిశూ యయౌ ।
తావదుత్థాయ సౌమిత్రిర్లజ్జయా గంతుముద్యతః ॥ 62

తం గంతుకామం రామోఽపి దృష్ట్వా తాం మాండవీం తథా ।
శ్రుతకీర్తిం కంజనేత్రసంజ్ఞయాఽచోదయత్తదా ॥ 63

తాభ్యాం ధృతోఽథ సౌమిత్రిః స్మితాస్యాభ్యాముపావిశత్ ।
తావత్తదంకయోః సీతా తత్పుత్రౌ సన్న్యవేశయత్ ॥ 64

తద్వచ్చ భరతస్యాంకే నివేశ్య తక్షపుష్కరే ।
శత్రుఘ్నాంకే సుబాహుం చ యూపకేతుం న్యవేశయత్ ॥ 65

తతః సీతాం పునః ప్రాహ స్మితాస్యః స రఘూద్వహః ।
వీజయంతూర్మిలాద్యాశ్చ స్వం స్వం స్వామినమాదరాత్ ॥ 66

తతస్తా దుద్రువుః సర్వాః సఖీభిర్లజ్జితా ధృతాః ।
వ్యజనైర్వీజయామాసుః స్వం స్వం కాంతం సులజ్జితాః ॥ 67

సీతాదేవి- సంతోషముతో ఉప్పొంగి, తన వస్త్రాలంకారములు నిగనిగలాడుచుండ ఎదుట వచ్చుచున్న లవుని జూచి, చేతులతో పట్టి, ముద్దుపెట్టి, ఆ కుశుని చేతపట్టుకుని, తిన్నగా రామునితో మాటలాడుచు, మరల తనస్థానమునకు వచ్చెను. అంత ఆ రాముడు సీతయొక్క సింహాసనమున కూర్చుని, తొడలమీద బిడ్డలను కూర్చుండ బెట్టుకుని, సీతకు జూపుచు వారిని లాలించెను. మరియు ఆ కాంతామణికి సభలో వశిష్ఠులు వారు ఆనతిచ్చిన బాలకుల జాతక లక్షణములను వివరించెను. శ్రీరాముని నోటినుండి వాటిని విని జానకమ్మ పరమానందభరితమయ్యె. (60)

## శ్రీరాముడు తమ్ములతో సరసములాడుట.

ఊర్మిళచే సేవింపబడుచున్న లక్ష్మణుని జూచి, శ్రీరాముడు సీతాదేవితో, "సతీ! అంగదుని, చిత్రకేతువును లక్ష్మణుని తొడమీద కూర్చోండబెట్టుము," అని చెప్పగా ఆమె ఆ బిడ్డలను తీసుకుని, త్వరగా వెడలెను. అంతలో సిగ్గుచే లక్ష్మణుడు అక్కడినుండి వెళ్ళుటకు ప్రయత్నించెను. దానిని జూచి రాముడు మాండవి, శ్రుతకీర్తులను లక్ష్మణుని పోనీయవలదని కనుసైగచేసెను. నవ్వుచూ వారు అట్లేవచ్చి, బావను అడ్డగించిరి. లక్ష్మణుడును కూర్చుండెను. అంత ఆ సీత లక్ష్మణుని బిడ్డలను లక్ష్మణుని తొడమీద విడిచెను. అట్లే భరతుని తొడలపై తక్ష, పుష్కరులను విడిచి, శత్రుఘ్నుని తొడలమీద సుబాహు, ఉపకేతువులను కూర్చుండబెట్టెను మరియు రాముడు సీతను జూచి నవ్వుచు, "ఊర్మిళాదులు కూడా వారివారి పతులకు వింజామరలతో వీచుచుందురు గాక," అని చెప్పెను. అంతవారందరును సిగ్గుపడి, పరుగెత్తి, సఖీజనులచే పట్టుబడిరి.

**ఏవం నానాకౌతుకాని భోజనాసనకర్మసు ।**
**కారయామాస వైదేహ్యా బంధ్వాదీనాం రఘూద్వహః ॥ 68**

**అథ రామో వసిష్ఠం స ఏకదా వాక్యమబ్రవీత్ ।**
**కుశస్యాథ లవస్యాపి వ్రతబంధో విధీయతామ్ ॥ 69**

**తథేతి గురుణా ప్రోక్తస్తతో రామః శుభే దినే ।**
**గణకాన్ స సమాహూయ మంత్రయామాస సాదరమ్ ॥ 70**

**కుశాయ పంచమం వర్షం కించిన్న్యూనం లవాయ చ ।**
**జ్ఞాత్వా తే గణకాః సర్వే గురుశుక్రాదికం బలమ్ ॥ 71**

దృష్ట్వా పంచాంగపట్టేషు రాఘవం వాక్యమబ్రువన్ ।
బ్రాహ్మణస్యాష్టమే ప్రోక్తో ద్వాదశే క్షత్రియస్య చ ॥ **72**

వైశ్యస్య షోడసే వర్షే వ్రతబంధో మునీశ్వరైః ।
జన్మాత్ షష్ఠే తథా గర్భాత్సప్తమేఽబ్దే నృపస్య చ ॥ **73**

వ్రతబంధో విధాతవ్యో యత్నతశ్చ బలార్థినః ।
బ్రహ్మవర్చసకామస్య కార్యో విప్రస్య పంచమే ॥ **74**

రాజ్ఞో బలార్థినః షష్ఠే వైశ్యస్యార్థార్థినోఽష్టమే ।
విద్వద్భిశ్చోపనయనమేవం శాస్త్రేషు నిర్ణయః ॥ **75**

అతో గర్భాచ్చ షష్ఠేఽబ్దే పుత్రయోస్త్వం రఘూత్తమ ।
సుఖం కురూపనయనం ముహూర్తం శృణు సాదరమ్ ॥ **76**

అద్యారభ్య పంచదశదినే దత్తం కుశాయ హి ।
పక్షాంతరేణ తం శ్రుత్వా ముహూర్తం రఘునందనః ॥ **77**

గణకాన్ ధనవస్త్రాద్యైః పూజ్య లక్ష్మణమబ్రవీత్ ।
ఆకారణీయా రాజానః సుహృదశ్చ మునీశ్వరాః ॥ **78**

సాంతః పురాః సపౌరాశ్చ స్వస్వజానపదైః సహ ।
శృంగారణీయాఽయోధ్యేయం పరిఖాః సప్త సాదరమ్ ॥ **79**

ఊర్మిళ, మాండవి, శ్రుతకీర్తి– సిగ్గుతో రామాజ్ఞను సారముగా తమతమ పతులకు వింజామరలతో వీచుచుండిరి. ఇట్లే శ్రీరామచంద్రస్వామి సీతతోడ భోజనాది సమయములలో లక్ష్మణాదులను వినోదపరచుచుండెను. (68)

## కుశ, లవులకు ఉపనయనము చేయించుట

పిదప ఒకప్పుడు రాముడు వశిష్ఠుల వారితో, "కుశునికి, లవునికి ఉపనయనము చేయించ–వలయు," నని ప్రార్థించెను. అట్లే కానిమ్మని గురువులు వారు ఆజ్ఞాపింపగా శ్రీరాముడు శుభదినమున దైవజ్ఞులను పిలిపించి, వారితో సాదరముగా ఆలోచించెను. అపుడా గణకులు కుశునికి

ఐదేండ్లనియును, లవునికి కొంచెము తక్కువగా ఐదేండ్లనియును తెలిసి, పంచాంగములను చూచి గురు, శుక్రాది బలములను పరిశీలించి, శ్రీరామునితో, "బ్రాహ్మణునికి ఎనిమిదవ ఏటను, క్షత్రియునికి 12వ ఏటను, వైశ్యునికి 16వ ఏటను ఉపనయనమని మునీంద్రులచే స్మరింపబడియున్నది. అట్లే బలాపేక్షగల రాజునకు జన్మాదిగా 6వ ఏటను, గర్భాదిగా ఏడవ ఏటను ప్రయత్నించి వడుగుచేయవలయునందురు. బ్రహ్మవర్చసుగల బ్రాహ్మణునికి, ఐదవ ఏట ఉపనయనము చేయదగును. బలాపేక్షగల రాజునకు ఆరవ ఏటను, ధనార్థియగు వైశ్యునకు ఏనిమిదవ ఏటను ఉపనయనము కాదగినిది. ఇట్లు శాస్త్రనిర్ణయము గలదు. కావున శ్రీరామచంద్రస్వామీ! గర్భాదిగా ఆరవఏటలో నీ పుత్రులకు ఉపనయనమును చేయింపుము. సాదరముతో ముహూర్తమును వినుము. నేటికి మొదలు 15వ దినమునందు కుశునికి సుముహూర్తము ఇవ్వబడినది. అనిన దైవజ్ఞుల మాటను విని శ్రీరాముడు దైవజ్ఞులను ధన, కనక, వస్త్రాదులచే సత్కరించి పంపెను.

**శోధనీయాస్తథా సౌధసమూహేషు సుధాః శుభాః ।**
**దత్వా చిత్రాణి లేఖ్యాని ప్రాసాదేషు సమంతతః ॥ 80**

**దేవాలయేషు సర్వేషు సుధా దేయా మనోరమా ।**
**లేఖనీయాని చిత్రాణి స్థాప్యంతా బలయః పృథక్ ॥ 81**

**బంధనీయాః పతాకాంశ్చ రోపణీయా ధ్వజా అపి ।**
**సమంతతస్తోరణాని బంధనీయాని లక్ష్మణ ॥ 82**

**వేద్యః కార్యా రుక్మమయ్యో బంధనీయాశ్చ మంటపాః ।**
**శృంగారణీయా హస్త్యశ్వశిబికాశ్చ సహస్రశః ॥ 83**

**అన్యచ్చాపి యథాయోగ్యం యద్యజ్జానాసి లక్ష్మణ ।**
**తత్తత్కురుష్వ యన్నోక్తం మయా తవ రఘూత్తమ ॥ 84**

**తద్రామవచనం శ్రుత్వా తథేత్యుక్త్వా స లక్ష్మణః ।**
**తథా చకార తత్సర్వం యథా రామేణ శిక్షితః ॥ 85**

**తతో ముహూర్తే శ్రీరామః స్నానమభ్యంగపూర్వకమ్ ।**
**కృత్వా కుమారైర్వైదేహ్యా బంధుస్త్రీభిశ్చ బంధుభిః ॥ 86**

నానాలంకారవస్త్రాణి పరిధాయాథ తైః సహ ।
పుణ్యాహవాచనం చక్రే గురుం పూజ్య ఋషీశ్వరాన్ ॥ **87**

నాందీశ్రాద్ధాదికం కృత్వా ప్రతిష్ఠాం దేవతస్య చ ।
చకార మంగలైస్తూర్యనాదైః సీతాసమన్వితః ॥ **88**

తతో యయుః కోటిశస్తే పార్థివాశ్చ మునీశ్వరాః ।
సప్తద్వీపాంతరస్థాశ్చ సావరోధాః స వాహనాః ॥ **89**

తైః సాఽయోధ్యా తదా వ్యాప్తా విరేజే నితరాం తదా ।
తతో ముహూర్తదివసే వసిష్ఠో బ్రాహ్మణైర్యుతః ॥ **90**

రామస్యాథ కుశస్యాథ మధ్యే ధృత్వా వరం పటమ్ ।
ఉవాచ మంగలాన్యేవ సుస్వరైర్మధురాక్షరైః ॥ **91**

శ్రీరాముడు, లక్ష్మణునితో తమ్ముడా! అంతఃపురమువారు, పురమువారు, దేశమువారు మొదలగువారితోడ రాజులను, మిత్రులను, మునీంద్రులను, పిలిపింపవలయును. ఈ అయోధ్యను అలంకరించవలయును. అగడ్తలను ఏడింటిని శోధించవలయును. మంగళ సౌధసమూహములలో చిత్రాలంకారములను చేయవలయును. దేవాలయములంతటా సున్నముపూయించి, చిత్రములను గీయించి, బలులను అర్పింపదగును. ధ్వజములను స్థాపించి, తోరణములను కట్టించి, మండపములను వేయించి, సువర్ణవేదికలను కట్టించి, వేలకొలది ఏనుగు, గుఱ్ఱము, రథములకు, పల్లకీలకు అలంకారములను చేయించి, మరియు అట్లే యథాయోగ్యములుగా నీకు నచ్చినట్లుగా ఉత్సాహముతో నేను చెప్పని వాటిని కూడా చేయింపుము అని ఆజ్ఞాపించెను. అంత ఆ లక్ష్మణుడు అట్లే అని శ్రీరాముని ఆజ్ఞానుసారముగా సర్వమును చేయించెను. పిదప శుభముహూర్తమున శ్రీరాముడు సీతతోను, కుమారులతోను, తమ్ములతోను అభ్యంగ మంగళస్నానములు చేసి, వివిధ భూషణ వస్త్రములను అలంకరించుకుని, వారందరితో పుణ్యాహవాచనముచేయించెను. మునీంద్రులను, వశిష్ఠులవారిని పూజించెను. నాంది శ్రాద్ధమును ఆచరించి, కులదేవతలను ప్రతిష్ఠించెను. మంగళవాద్యములు మ్రోగుచుండినవి. అంత అచటికి సపరివారులుగా రాజులును మునీంద్రులును, సప్తద్వీపవాసులును వచ్చి చేరిరి. ఇట్లు అనేకులతో నిండి అయోధ్య మిక్కిలి అందముగా ఉండెను. అంత ముహూర్త దినమున వశిష్ఠుడు బ్రాహ్మణులతో శ్రీరామునికి, కుశునికిని, నడుమ దివ్యమంగళ వస్త్రమును అడ్డముగా కట్టిరి.

ధ్యాత్వా శ్రీగణనాయకం విధిసుతాం శంభుం విధిం మాధవం
లక్ష్మీం శైలసుతాం విధేస్తు దయితామింద్రం సురాంస్తాన్ గ్రహాన్ ।
పుణ్యాన్ స్థావరనిమ్నగాశ్చ సుమునీన్ స్వీయాం తులస్యాంబికాం
తాతం మాతరమాదరేణ వటవే భూయాస్తదా మంగళమ్ ॥ 92

తదేవలగ్నం సుదినం తదేవ
తారాబలం చంద్రబలం తదేవ ।
విద్యాబలం దైవబలం తదేవ
సీతాపతేర్యత్ స్మరణం విధేయమ్ ॥ 93

ఇతి నానామంగళవాద్యైస్తూర్యఘోషైర్మనోహరైః ।
ఓంకారఘోషైః స గురుర్ముమోచాంతః పటం తదా ॥ 94

తతస్తం రాఘవస్యాంకే నివేశ్య హవనాదికమ్ ।
విధిం కృత్వాఽథ కౌపీనం దండం చాథ కమండలుమ్ ॥ 95

బద్ధ్వాదౌ రుక్మజాం మౌంజీం బబంధైర్ణాజినం తదా ।
తతః కుశాయ స గురుర్గాయత్రీ ముపదిష్టవాన్ ॥ 96

బ్రహ్మచర్యవ్రతాదీని స కుశాయోపదిష్టవాన్ ।
కృత్వోక్తవిధినా శౌచం కుర్యాదాచమనం తథా ॥ 97

దంతాన్ జిహ్వాం విశోధ్యాథ కృత్వా మలవిశోధనమ్ ।
స్నాత్వాఽంబుదైవతైర్మంత్రైః ప్రాణానాయమ్య యత్నతః ॥ 98

ఉపస్థానం రవేః కృత్వా సంధ్యయోరుభయోరపి ।
అగ్నికార్యం తతః కృత్వా బ్రాహ్మణానభివాదయేత్ ॥ 99

బ్రువన్నముకగోత్రోఽహమభివాదయ ఇత్యపి ।
ధారయన్మేఖలాం దండోపవీతాజినమేవ చ ॥ 100

**అనిన్ద్యేషు చరేద్భైక్ష్యం బ్రాహ్మణేష్వాత్మవృత్తయే ।**
**వాగ్యతో గుర్వనుజ్ఞాతో భుంజీతాన్నమకుత్సయన్ ॥ 101**

మధురాక్షరములును, సుస్వరములును గల మంగళములను పలికెను – "శ్రీమహాగణపతి స్వామిని, సావిత్రీదేవిని, శంకరుని, బ్రహ్మను, విష్ణువును, లక్ష్మీ సరస్వతులను, ఇంద్రాది దేవతలను, గ్రహములను, పుణ్యాత్ములగు గిరి, నదీ దేవతలను, మునీంద్రులను, నిజ కులదేవతను, జననీ జనకులను వీరినందరిని ధ్యానించి, సాదరముగా ప్రార్థించునట్టిది ఏమనిన; ఈ వటువుకు నిరంతరము మంగళమగుగాక. శ్రీ సీతాపతిని చక్కగా స్మరించవలయును.

ఎందువలననిన, భగవంతుని స్మరణము చేయునట్టి కాలమే దివ్యలగ్నము. అదియే సుదినము. అదికద చంద్ర తారా బలయుక్తము! విద్యాబలము అదియే, దైవబలము అదియే. ఇట్లు వివిధ మంగళ శ్లోకములతోను, వాద్య ఘోషలతోను, ప్రణవనాదములతోను వశిష్ఠుడు తెరబట్టను తీసివేసెను. పిమ్మట శ్రీరాముని తొడమీద కుశుని కూర్చుండబెట్టి, హోమాదికమును ఆచరించి, విధి ప్రకారముగా కౌపీనమును, కమండలమును ఇచ్చి, సువర్ణ మౌంజిని బంధించి, జింక చర్మమును కట్టి, కుశునికి వశిష్ఠుడు గాయత్రీ మంత్రము ఉపదేశించెను. బ్రహ్మచర్య వ్రత కర్మములను చక్కగా తెలిపెను. ఎట్లనిన–

## కుశునికి ద్విజధర్మములను ఉపదేశించుట.

చెప్పబడినట్లు శౌచవిధిని ఆచరించి, ఆచమనముచేసి, పండ్లను నాలుకను తోమి కడిగి, మురికి కడుగుకొని, జలదేవత మంత్రములను చెప్పుచు స్నానముచేసి, ప్రాణాయామము చేసి, రెండు సంధ్యలలోను సూర్యోపస్థానమునుజేసి, అగ్ని కార్యమును ఆచరించి, పిదప బ్రాహ్మణులకు నమస్కరించు విధానము. నమస్కరించునపుడు దండ, కమండలు అజినములను ధరించి, ఇట్టి గోత్రమువాడగు నేనభివాదనము చేసెనని చెప్పవలయును. నిందనీయులుకాని బ్రాహ్మణులవద్ద తన జీవనమునకై భిక్షాచర్యము ఆచరించి తెచ్చి, మౌనముతో గురువు ఆజ్ఞనిచ్చినవెనుక ఆ యన్నమును నిందింపక భక్షింపవలయును. ఆ యన్నమునే తిననగును.

**ఏకాన్నం చ సమశ్నీయాత్ శ్రాద్ధేశ్నీయాత్తథాఽఽపది ।**
**ద్వివారం నైవ భుంజీత దివా క్వాపి ద్విజోత్తమః ॥ 102**

**సాయంప్రాతర్ద్విజోఽశ్నీయాదగ్నిహోత్రవిధానవిత్ ।**
**మధు మాంసం ప్రాణిహింసాం భాస్కరాలోకనం జలే ॥ 103**

స్త్రియం పర్యుషితోచ్ఛిష్టే పరివాదం వివర్జయేత్ ।
యథేష్టచేష్టో చ భవేద్గురోర్నయనగోచరే ॥ 104

న నామ పరిగృహ్ణీయాత్పరోక్షేఽ స్యవిశేషణమ్ ।
గురునిందా భవేద్యత్ర పరీవాదస్తు యత్ర చ ॥ 105

శ్రుతీ పిధాయ స్థాతవ్యం యాతవ్యం వా తతోఽ న్యతః ।
న మాత్రా న పితుః స్వస్రా న స్వస్రైకాన్తశీలతా ॥ 106

బలవంతీంద్రియాణ్యత్ర మోహయంత్యతికోవిదాన్ ।
ఏవమాదీన్యనేకాని బ్రహ్మచారివ్రతాని హి ॥ 107

తస్మై గురుశ్చోపదిశ్య దదౌ దానాన్యనేకశః ।
భోజయామాస తం మాత్రా సహ నానోత్సవైస్తదా ॥ 108

కారయిత్వాఽథ పాలాశపూజనం విధిపూర్వకమ్ ।
తేనాపి కుశబాలేన దేవకస్య విసర్జనమ్ ॥ 109

చకార రాఘవేణైవ సీతయా స గురుస్తదా ।
తతో రామో నృపతిభిర్జనకేనాపి పూజితః ॥ 110

చకార ధనవస్త్రాద్యైస్తుష్టాన్ విప్రాన్నృపాదికాన్ ।
ఆచండాలాంస్తదా రామస్తోషయామాస సాదరమ్ ॥ 111

ఏవం నానాసముత్సాహైర్మాసమేకం నినాయ సః ।
రామో విసర్జయామాస తతస్తాన్పార్థివాదికాన్ ॥ 112

ఆపత్కాలమునందు శ్రాద్ధభోజనము చేయవచ్చును. రెండమార్లు భుజింపకూడదు. ఎప్పుడును పగలు రెండుమార్లు ద్విజోత్తమునికి భోజనము కూడదు. అగ్నిహోత్రక్రమమును ఎటిగి, ద్విజుడు సాయంకాల ప్రాతఃకాలములలో భుజించదగును. మద్యము, మాంసము, ప్రాణిహింస, నీటిలో సూర్యునిజూచుట, స్త్రీ, ఎంగిలి, చల్ది, అపవాదము, వీటిని విడువ వలయును. గురువునకు కనబడునట్లు యథేష్టముగా చేష్టలు చేయరాదు. అవి శేషణముగా పరోక్షమున పేరును గ్రహించరాదు. ఎచట

గురునింద, అపవాదము చెప్పబడుచుండునో, అచట నిలువవలసి ఉండిన చెవులు మూసికొనవలయును. అటుగాకున్న అచట నిలువక పోవలయును. తల్లితోను, మేనత్తతోను, తోబుట్టువుతోనైనను ఏకాంతమున వశింపరాదు. ప్రబలమగు ఇంద్రియములు గొప్పపండితులను కూడా మోహింపజేయును. ఇటువంటి బ్రహ్మచారి వ్రతమును ఆ వసిష్ఠముని కుశునికి ఉపదేశించి, వివిధ దానములను చేయించి, అతనికి తల్లితోడ వివిధ ఉత్సవములు జరుగుచుండగ భోజనము చేయించెను. అపుడు విధిప్రకారముగా పాలాశపూజనమును చేయించి, సీతారాములతో వెరసి వశిష్ఠుడు దేవక విసర్జనము చేసెను. పిదప రాముడు రాజులచేతను, జనకుని చేతను పూజింపబడి ధన, కనక, వస్త్రాదులచే బ్రాహ్మణులను, రాజులను, ఆచండాలాంతము సకల ప్రాణులను సాదరముగా సంతుష్టులను చేసెను. ఇట్లు వివిధ మహోత్సవములచే ఒకనెల గడచిన తరువాత అందరిని వారివారి స్థలములకు పంపించెను.

**ఏవం కాలాన్తరాద్రామో వ్రతబంధం లవస్య చ ।**
**చకార పూర్వవద్వర్షాత్సమాహూయ నృపాదికాన్ ॥ 113**

**తతస్తౌ బాలకౌ రమ్యౌ వేదాధ్యయనముత్తమమ్ ।**
**చక్రతుర్గురుసాన్నిధ్యే విదవద్బుద్ధిసత్తమౌ ॥ 114**

**ఏవం తేషాం తు బాలానాం సర్వేషాం రఘునందనః ।**
**వ్రతబంధవిధానాని యథాకాలే మహోత్సవైః ॥ 115**

**చకార గురుణా విప్రైః సమాహూయ నృపాదికాన్ ।**
**విశేషైర్నిజపుత్రాభ్యాం చకార స మహోత్సవైః ॥ 116**

**అకరోదధికం కించిన్న న్యూనమకరోద్విభుః ।**
**తతస్తే బాలకాః సర్వే బ్రహ్మచర్యవ్రతే స్థితాః ॥ 117**

**చక్రుస్తే గురుసాన్నిధ్యే వేదాధ్యయనముత్తమమ్ ।**
**అథ రామోఽపి వైదేహ్యా బాలకైః పరివారితః ॥ 118**

**విరేజే స్కందగణపాదిభిర్దేవ్యా యథా శివః ।**
**అథ తే బాలకాః సర్వే కృత్వాఽధ్యయన ముత్తమమ్ ॥ 119**

వేదాదీనాం గురుముఖాల్లబ్ధ్వా జ్ఞానం గురోస్తతః ।
జగ్ముస్తీర్థాని వై కర్తుం సేనయా గురుమంత్రిభిః ॥ 120

పృథివ్యాం భారతే ఖండే యాని తీర్థాని తాని తే ।
కృత్వా సమాయయుః పంచ మాసైః స్వం నగరీం శనైః ॥ 120

బాలాన్ సమాగతాన్ శ్రుత్వా శోభయిత్వా నిజాం పురీమ్ ।
ప్రత్యుజ్జగామ సౌమిత్రిః పురస్కృత్యాథ వారణమ్ ॥ 121

తే దృష్ట్వా లక్ష్మణం నేముస్తేతేనాలింగితా అపి ।
నానోత్సవైర్యయుర్బాలా అయోధ్యాయా గృహం ప్రతి ॥ 123

అదేవిధంగా సంవత్సరము గడిచిన తరువాత యథాపూర్వముగా లవునికిని ఉపనయనముచేసెను. అంత ఆ ఇరువురును కుశలవులు గురుసన్నిధానమున విధిప్రకారముగా వేదములు అధ్యయనముచేసిరి. ఇట్లే శ్రీరాముడు తక్కిన చిన్నవాండ్రకును కాలానుగుణముగా క్రమముగా రాజులను, గురు, దేవ, ద్విజులను ఆహ్వానించి, తన కుమారులకన్నా అతిశయముగా పలు వేడుకలతో ఉపనయనము చేయించెను. ఒకటికన్నా నొకటి అధికముగా ఉండును గాని, ఎందును ఏ కొరతయును లేదు. అంత ఆ బాలకులందరును బ్రహ్మచర్య వ్రతస్థులైరి. గురు సన్నిధిలో అందరును వేద అధ్యయనమును చేసిరి. (118)

## బాలకులు విద్యనేర్చి, తీర్థయాత్రజేసి, అయోధ్యకు వచ్చుట.

పిదప శ్రీరాముడు సీతా సమేతుడై బాలకులతో కలసి, గౌరీ, గణేశ, సుబ్రహ్మణ్యునితో కూడిన పరమేశ్వరుని వలె ప్రకాశించెను. అంత ఆ కుశ, లవాది అన్నదమ్ములు విద్యాభ్యాసము చేసి, వేదాది విద్యా తత్త్వములను గురుముఖమునుండి తెలిసికొని, గురువాజ్ఞతో, గురువు, మంత్రులు, సేనలు వెంబడివచ్చుచుండగా తీర్థాటనమునకు పోయి, భూమిలో భరత ఖండమున ఎన్ని తీర్థములు గలవో వాటినన్నింటిని దర్శించి, తిన్నగా ఐదు నెలలలో మరలివచ్చి, అయోధ్యలో ప్రవేశించిరి. బాలకులు వచ్చుచున్న సంగతిని విని లక్ష్మణుడు పురమును శృంగారింపజేసి, వారిని పిలుచుకొని వచ్చుటకై భద్రగజమును ముందుపెట్టుకుని వెడలెను. వారు లక్ష్మణునిజూచి, నమస్కరించి, లక్ష్మణునిచేత హత్తుకొనబడి, దివ్యమంగళ మహోత్సవములతో వచ్చుచుండిరి.

మార్గే మార్గే పురస్త్రీభిః సౌధస్థాభిస్తు వర్షితాః ।
వృష్టిభిః కుసుమాదీనాం దీపైర్నీరాజితా అపి ॥ 124

తతస్తే బాలకాః సర్వే సభాయాం రఘునందనమ్ ।
నేముస్తేనాలింగితాశ్చ యయుః సీతాగృహం తతః ॥ 125

ఏతస్మిన్నంతరే సీతోర్మిలా సా మాండవీ తథా ।
శ్రుతకీర్తిశ్చ వేగేన చక్రుర్నీరాజనం పృథక్ ॥ 126

దధ్యోదనభవైర్దీపైః పక్వాన్నై స్తైలపాచితైః ।
సర్షపైర్లవణైర్మాషైః తోయకుంభైశ్చ సాదరమ్ ॥ 127

తతస్తే బాలకాః సర్వే నేముః సీతాం పృథక్ పృథక్ ।
తతో నేముః స్వమాతౄశ్చ పూర్వం నత్వా పితామహీః ॥ 128

తతస్తే బాలకాః సర్వే దదుర్దానాన్యనేకశః ।
బ్రాహ్మణాన్ భోజయామాసుః కోటిశస్తే పృథక్ పృథక్ ॥ 129

ఏవం నానోత్సవాస్తత్ర బభూవు రామసద్మని ।
అథ తే బాలకాః సర్వే స్యందనాదిషు సంస్థితాః ॥ 130

దివ్యవస్త్రాణి చిత్రాణి పరిధాయ సమంతతః ।
అయోధ్యారాజమార్గేషు హట్టేషు చ చతుష్పథే ॥ 131

ఆరామోపవనారణ్యా వాటికాసు నదీతటే ।
గమనాగమనే చక్రుః సేనయామంత్రిబాలకైః ॥ 132

ఏవం సాకేతనగరే బాలకైః సీతయా సుఖమ్ ।
రేమే స బంధుభిర్యుక్తశ్చిరం రాజా రఘూద్వహః ॥ 133

దారులలో మేడలమీద ఉండెడు పురస్త్రీలు, పుష్పవృష్టులను కురిపించుచుండిరి. మంగళ దీపములతో హారతులెత్తుచుండిరి. అంత ఆ బాలకులు రాజమందిరములో ప్రవేశించి, సభాసీనుడైన శ్రీరామ చంద్రస్వామి చరణారవిందములకు దండప్రణామములను ఆచరించి, శ్రీరామ దివ్య

మంగళదేహస్పర్శనంది, అమితానందభరితులై సీతాదేవియొక్క అంతఃపురమునకు వచ్చిరి. అంతలో అచట సీత, ఊర్మిళ, శ్రుతకీర్తి, మాండవి గార్లు చేరి, వేరుగా హారతులను ఇచ్చిరి. పెరుగన్నము, పక్వాన్నము, తైలపక్వ వస్తువులు వీటితో దీపములు, ఆవాలు, ఉప్పు, ఉద్దులు, జలకుంభములు వీనిచే ఆదరముగా దిగుతుడుపులను చేసిరి. అంత ఆ బాలకులు తొలుత నాయనమ్మలకు నమస్కరించి, పిమ్మట సీతాదేవికి నమస్కారముచేసి, తమతమ తల్లులకు నమస్కారము చేసిరి. వెంటనే అనేక దాన ధర్మములను ఆచరించిరి. కోట్లకొలది బ్రాహ్మణులకు సంతర్పణలు చేయించిరి. ఇట్లు పలువేడుకలు శ్రీరామ మందిరమున జరుగుచుండెను. పిమ్మట నిత్యము యథాసుఖముగా ఆ రాజకుమారులు తమకిచ్చువచ్చిన తొడుగులను తొడిగి, కావలసిన వాహనములను ఎక్కి, దివ్యాలంకారయుక్తులై మంత్రి పుత్రులతో, సేనలు అనుసరించు చుండగా రాజమార్గాలలోను, వ్యాపారవీధులలోను, నాలుగుదార్ల కూడళ్ళలోను, తోటలలోను, ఉద్యానవనములలోను, వనములలోను, నదీతీరములలోను రాకపోకలచే రారాజించుచుండిరి. ఇట్లు సాకేత రాజధానిలో రామచంద్రస్వామి సీతాదేవితోను, తమ్ములతోను, పుత్రులతోను చిరకాలము ఆనందించుచుండెను. (133)

ఏవం శిష్య మయా ప్రోక్తం జన్మకాండమిదం తవ ।
కుశాదీనాం చ జన్మాని వర్ణితాన్యత్ర విస్తరాత్ ॥ **134**

రమ్యం పవిత్రమానందదాయకం చ మనోహరమ్ ।
పుత్రపౌత్రప్రదం జన్మకాండమేతత్సుఖావహమ్ ॥ **135**

జన్మకాండమిదం పుణ్యం యే శ్రుణ్వంతి నరోత్తమాః ।
తేషాం పుత్రైశ్చ పౌత్రైశ్చ వియోగో న భవిష్యతి ॥ **136**

జన్మకాండమిదం యే వై భక్త్యాశ్రుణ్వంతి మానవాః ।
తేషాం స్త్రీణాం వియోగో హి న కదాప్యత్ర జాయతే ॥ **137**

జన్మకాండమిదం పుణ్యం యాః శ్రుణ్వంత్యత్ర వై స్త్రియః ।
స్వభర్తృభిర్వియోగం తా న గచ్ఛంతి యథా రమా ॥ **138**

గ్రామం దేశాంతరం తీర్థం యే గతాశ్చ చిరం నరాః ।
తేషామాగమనార్థం హి జన్మకాండ పఠేదిదమ్ ॥ **139**

యేషాం భావీని కార్యాణి లబ్ధుం త్వరయతే మనః ।
తైర్నరైః పఠనీయం వై జన్మకాండం దినే దినే ॥ 140

పూర్వే దినే చైకవారం ద్వివారం చాపరే దినే ।
ఏవం నవదినం వృద్ధిస్తథైకేన క్షయోఽపి హి ॥ 141

కార్యో నరైః స్వస్థచిత్తస్తేషాం కార్యం భవిష్యతి ।
వర్షమేకం పఠేదేవమపుత్రోఽపి లభేత్సుతమ్ ॥ 142

పుత్రార్థీ ప్రాప్నుయాత్పుత్రం ధనార్థీ ధనమాప్నుయాత్ ।
ఇష్టాన్ కామాంశ్చ కామార్థీ జన్మకాండశ్రవాల్లభేత్ ॥ 143

ఆనందరామాయణమధ్యసంస్థం
శ్రీజన్మకాండం తనయప్రదం చ ।
పారాయణం సంశ్రవణం తథా వా
కరోతి యో నా స లభేత్సుపుత్రమ్ ॥ 144

ఇతి శ్రీశతకోటిరామచరితాంతర్గతే, శ్రీమదానందరామాయణే, వాల్మీకీయే, ఆదికావ్యే, జన్మకాండే, కుశలవాదీనాంజన్మకథనవ్రతబన్ధవిస్తరే నామ, నవమః సర్గః ॥

## ఇతి జన్మకాండః సమాప్తః ॥

## జన్మకాండ ఫలశ్రుతి.

శిష్యుడగు విష్ణుదాసా! వినుము. కుశాదులయొక్క పుట్టుక దేనియందు వర్ణింపబడినదో ఆ జన్మకాండమును నీకు చెప్పితిని. ఈ జన్మకాండ పుత్ర, పౌత్ర ప్రదము, మిక్కిలి సుఖావహము, ఆనందదాయకము, రమ్యము, పవిత్రము, మనోహరమునై ఉన్నది. పుణ్యరూపమగు ఈ జన్మకాండను యే మానవోత్తములు వినుచుందురో వారు పుత్రులతోను, మనుమలతోను ఎప్పుడు ఎడబాయక ఉందురు. ఈ జన్మకాండను యే నరులు భక్తితో శ్రవణముచేయుదురో వారు ఎన్నటికి పత్నీవియోగము పొందరు. యే స్త్రీలు ఈ జన్మకాండను భక్తితో చదివెదరో అ కాంతలు తమ భర్తలతో 'నిత్యము

శ్రీదేవి విష్ణుమూర్తిని విడిచిలేనట్లు,' ఎప్పుడు ఎడబాయక ఉందురు. గ్రామమునకు, దేశాంతరమునకు, తీర్థమునకుపోయి రాకయుండెడువారిని రప్పించుటకై ఈ జన్మకాండమును పఠించవలయును. ఎవరు భవిష్యత్ శుభకార్యములను త్వరగా కావలయునని ఎంచెదరో వారు నిత్యము ఈ జన్మకాండను పఠించవలయును. కార్యసిద్ధిని కోరువారు తొలినాడు ఈ జన్మకాండమును ఒకమారు, రెండవనాడు రెండుసార్లు, మూడవనాడు మూడుసార్లు ఇట్లు తొమ్మిది దినములవరకు వృద్ధిగా చదివి, పిమ్మట తొమ్మిది దినములు 9-8-7-6-5-4-3-2-1 ఇట్లు తగ్గించుచు పఠించినచో స్వస్థత చిత్తులగు వారియొక్క కార్యము తప్పక సిద్ధించును. ఇట్లు ఒక సంవత్సరము పఠించినయెడల పుత్రులు లేనివారు పుత్రవంతులగుదురు. జన్మకాండ శ్రవణమువలన పుత్రులు కావలసినవారు పుత్రులును, ధనము కావలసినవారు ధనమును, తక్కిన ఇష్టార్థములు కావలసినవారు వారివారి ఇష్టార్థములను పొంది సుఖించెదరు.

ఆనందరామాయణ మధ్యన ఉండెడు సంతాన సౌఖ్యప్రదమగు ఈ జన్మకాండను తప్పక పఠించి, వినునట్టి పుణ్యాత్ములు వంశాభివృద్ధికలిగి, సంసార సుఖసంపదలచే ఆనందించుచుందురు.

***ఈ విధముగ శ్రీమద్వాల్మీకి మహర్షిచే రచింపబడిన,***
***శ్రీ శతకోటిరామచరితాంతర్గత శ్రీమత్ ఆనందరామాయణములో, జన్మకాండలో***
***9వ సర్గ ముగిసినది.***

**ఇట్లు శ్రీమద్వాల్మీకియానంద రామాయణమున జన్మకాండము సంపూర్ణము.**



## **6.** వివాహ కాండ వివరాలు

| సర్గ. | శ్లోకాలు |
|---|---|
| 1. | 68 |
| 2. | 95 |
| 3. | 78 |
| 4. | 58 |
| 5. | 47 |
| 6. | 48 |
| 7. | 52 |
| 8. | 97 |
| 9. | 42 |

మొత్తం 9 సర్గలు, **585 శ్లోకాలు**



# ప్రథమః సర్గః-1వ సర్గ

శ్రీ సీతారాములు స్వయంవరానికి వెళ్ళుట.

శ్రీరామదాస ఉవాచ

అథ రామః సభామధ్యే మంత్రిభిః పరివేష్టితః ।
తస్థౌ సింహాసనే రమ్యే వరచ్ఛత్రోపశోభితః ॥ 1

ఏతస్మిన్నంతరే తత్ర కశ్చిద్దూతః సమాయయౌ ।
నత్వా సభాయాం శ్రీరామం స్వామివృత్తం న్యవేదయత్ ॥ 2

పూర్వదేశాధిపతినా రాజ్ఞా శ్రీభూరికీర్తినా ।
ప్రేషితోఽస్మి మహారాజ ద్రష్టుం త్వత్పాదపంకజే ॥ 3

పత్రం పఠిత్వా శ్రీరామ కార్యా మత్స్వామినే కృపా ।
ఇత్యుక్త్వా రామచంద్రస్య కరే పత్రం న్యవేదయత్ ॥ 4

రామదూతోఽపి సౌమిత్రేః పురస్తాత్పత్రమాదరాత్ ।
స్థాపయామాస వేగేన గత్వా తస్థౌ నిజస్థలే ॥ 5

తతః స లక్ష్మణః పత్రం వరబంధనవేష్టితమ్ ।
సముద్ఘాట్య రాఘవాగ్రే పపాఠ మంజులస్వనః ॥ 6

హేమకృత్రిమపుష్పాద్యైరంకితం కుంకుమాన్వితమ్ ।
దర్శనాదేవ మాంగల్యసూచకం తోషకారకమ్ ॥ 7

ఉవాచ పత్రలిఖితైరక్షరైర్లక్ష్మణః శనైః ।
స్థితః శ్రీరామపురతో వరసింహాసనాంతికే ॥ 8

శ్రీమాన్ శ్రీరాఘవేంద్రో జయతు దశశిరశ్ఛేదనార్థం జగత్యాం
కౌసల్యాయాం నృపేశో దశరథతనయశ్చేతి నామ్నాఽవతీర్ణః ।
తస్యాహం భూరికీర్తిః పదజలరుహయోర్గంధమాఘ్రాతుకామః
కృత్వా నైజ శిరస్తు భ్రమరవదనిశం ప్రార్థనాం ప్రార్థయామి ॥ 9

## శ్రీరామసన్నిధికి భూరికీర్తి స్వయంవరలగ్న పత్రిక పంపుట

శ్రీరామదాసు ఇట్లు చెప్పెను, "తరువాత ఒకనాడు శ్రీరామచంద్రస్వామి సభామధ్యమున దివ్యఛత్రాలంకృత సింహాసనము మీద కూర్చుని మంత్రివర్యులు సభాసీనులై ఉండగా, అంతలో అచటకి ఒకానొక దూతవచ్చి, సభలో శ్రీరామునికి నమస్కరించి, "స్వామీ! పూర్వదేశాధిపతియైన శ్రీ భూరికీర్తి మహారాజు గారిచే పంపబడిన వాడనై తమ దివ్యపాదారవిందములను దర్శించుటకు వచ్చియున్నాను. రామచంద్రస్వామి! ఈ మంగళపత్రికను చదివి, మా దొరగారిని కృపచేయవలయును," అని విన్నవించి, పత్రికను అర్పించెను. శ్రీరామదూతయు అట్లే ఆ పత్రికను ఎత్తి, లక్ష్మణస్వామి ఎదుట పెట్టి, తాను తన తావున నిలిచెను. అంత ఆ సౌమిత్రి అతికించియుండెడు జాబును తీసుకుని, శ్రీరాముని ఎదుట విప్పి, బంగారు పూలచే అలంకరింపబడి, కుంకుమాంకితమైన చూచిన మాత్రముననే మంగళకార్యమును సూచించునట్టి సంతోషకరమైన పత్రికను మనోహర స్వరముతో శ్రీరామ సన్నిధిలో మెల్లగా చదివెను, "శ్రీ కౌసల్యా గర్భమున దశరథ తనయుడను పేరుతో జగమున దశకంఠ శిరచ్ఛేదనార్థముగా అవతరించిన శ్రీమంతుడగు శ్రీరామచంద్రస్వామి సర్వోత్కృష్టుడుగా ఉండునుగాక! అట్టి శ్రీరాముని పాదారవిందముల లోని, దివ్య పరిమళమును ఆఘ్రాణించనెంచి, భూకీర్తియను నేను నా తలను తుమ్మెదగా జేసుకుని, ఈ ప్రార్థనను చేయుచున్నాను.

**మమ పౌత్ర్యావుభే రామ చంపికా సుమతీతి చ ।**
**తయోః స్స్వయంవరార్థం హ్యాయాతాశ్చ బహవో నృపాః ॥ 10**

**బంధుపుత్రైర్బంధుభిస్త్వం స్వసుతాభ్యాం చ మంత్రిభిః ।**
**సుహృజ్జనైస్తథా పౌరైః సావరోధః స్వసేనయా ॥ 11**

**ఆగచ్ఛస్వ మమ పురం మయి కృత్వా మహత్కృపామ్ ।**
**విఫలాం ప్రార్థనాం మే త్వం మా కురుష్వ త్విమాం ప్రభో ॥ 12**

**ఇతి పత్రార్థమాకర్ణ్య స్వస్థచిత్తో రఘూత్తమః ।**
**స్వయంవరం తతో గంతుం గురుణా నిశ్చయం వ్యధాత్ ॥ 13**

**తతోఽబ్రవీత్స సౌమిత్రిమద్య సేనాం ప్రచోదయ ।**
**శ్వోఽహం గచ్ఛామి పుత్రాభ్యాం త్వయా మంత్రి జనైః సహ ॥ 14**

భరతేనాపి యుష్మాకం పుత్రైః శత్రుఘ్న సంయుతః ।
స్వయంవరం సావరోధః పౌరైర్జానపదైః సహ ॥ **15**

విజయో నగరీం రాజ్యం పాలితుం స్థాపితో మయా ।
అద్య వై వస్త్రగేహాని బహిర్నేయాని లక్ష్మణ ॥ **16**

పంథానం శోధయంత్వద్య నానాదూతాస్త్వరాన్వితాః ।
గచ్ఛన్తు సకలా నార్యః పుష్పకేణ విహాయసా ॥ **17**

తథేతి లక్ష్మణశ్చోక్త్వా చకార స యథోదితమ్ ।
రాఘవేణ సభామధ్యే ప్రబద్ధకరసంపుటః ॥ **18**

తతో ద్వితీయదివసే ప్రభాతే రఘునందనః ।
స్నాత్వా నిత్యవిధిం కృత్వా నినాయాగ్నీన్ స పుష్పకే ॥ **19**

స్థాపయామాస కుండేషు భక్త్యా సహ సుహృజ్జనైః ।
తతః సీతాం సమాహూయ త్వరయామాస రాఘవః ॥ **20**

తతః స్త్రియస్తదా సర్వాః సీతాద్యా రుక్మభూషితాః ।
యానమారురుహుః శీఘ్రం దివ్యవస్త్రాదిమండితాః ॥ **21**

మహా ప్రభూ! నా మనుమరాళ్ళు చంపిక, సుమతులు అను వారిరువురు గలరు. వారి స్వయంవరం కొరకు పెక్కుమంది రాజులు వచ్చుచున్నారు. తమరు తమ్ములను, తమ్ముల కుమారులను, మీ కుమారులను తీసుకుని మంత్రి, మిత్ర పరివారముతో, ఊరివారితోను, రాణివాసముతోను, సేనలతోను నా పట్టణమునకు దయచేసి రావలయును. నాయొక్క ప్రార్థనను వ్యర్థపరచవలదు. మహాప్రభూ!" అని చదువబడిన శుభపత్రిక సమాచారమును విని, సమాహిత మనస్కుడైన శ్రీరామచంద్రుడు వశిష్ఠులవారితో ఆలోచించి, స్వయంవరమునకు పోవుటను నిశ్చయించి, లక్ష్మణునితో, "నేడు సేనలను పంపుము. రేపు సీతతో నేను, నీవు, భరత శత్రుఘ్నులు, కుశలవులు, మీ పుత్రులు, పౌరులు, జనపదము వారును కూడా బయలుదేరవలయును. విజయునిని; నగరమును, రాజ్యమును పాలించుటకై స్థాపించియున్నాను. నేడే గుడారములను వెలుపలకు పంపనగును. దూతలు త్వరగా వెడలి, దారులను చక్కబరచనీ, స్త్రీలందరును పుష్పక విమానమునుఎక్కి, గగనమున వెడలనీ,"

అని ఆజ్ఞాపించెను. అట్లే అని శ్రీరాముడు చెప్పినట్లు తన ఏర్పాట్లుచేసి, లక్ష్మణుడు చేతులు కట్టుకుని, శ్రీరామసన్నిధిలో నిలిచెను. అంత మరునాడు ప్రాతఃకాలమున రాఘువుడు స్నానముచేసి, నిత్యకృత్యములను ఆచరించి, సుహృజ్జనులతో అగ్నిహోత్రములను, పుష్పకమున సముచిత కుండములలో స్థాపించి, సీతాదేవిని పిలిచి, త్వరగా ప్రయాణమునకు పోవలయునని త్వరపరచెను.

**తతో రామో గజారూఢో వరఛత్రోపశోభితః ।**
**యయావగ్రే చామరాద్యైర్వీజితశ్చ ముహుర్ముహుః ॥ 22**

**రామాగ్రే వారణారూఢో యయౌ శీఘ్రం గురుస్తదా ।**
**రాఘవస్య పృష్ఠభాగే కరిస్థో లక్ష్మణో యయౌ ॥ 23**

**తతః కుశాద్యాస్తే హృష్టా బాలా జగ్ముర్గజస్థితాః ।**
**తతో భరతశత్రుఘ్నౌ జగ్మతుర్గజసంస్థితౌ ॥ 24**

**తతః సర్వే మంత్రిణశ్చ పౌరా జానపదాదయః ।**
**నానావాహనసంస్థాస్తే యయుః సర్వే త్వరాన్వితాః ॥ 25**

**చతుర్దంతే శుక్లవర్ణే వారణైరావతోద్భవే ।**
**సంస్థితో రాఘవో రేజే ముక్తాజాలవిరాజితే ॥ 26**

**ఏవం రామః శనైర్మార్గే వందిమాగధసంస్తుతః ।**
**శృణ్వన్ వాద్యనినాదాంశ్చ యయౌ పూర్వదిశం శనైః ॥ 27**

**వవర్షుః సకలా నార్యః పుష్పకస్థా రఘూత్తమమ్ ।**
**పుష్పవృష్టిభిరానందపూరితా రాఘవేక్షణాః ॥ 28**

**నినేదుర్నవవాద్యాని ననృతుర్వారయోషితః ।**
**జగుర్గీతాని రమ్యాణీ పురతస్తే నటాదయః ॥ 29**

**ఏవం రామః శనైర్గత్వా సాకేతాద్యోజనోపరి ।**
**సేనానివాశసంస్థానం నిర్మితం తద్దదర్శ సః ॥ 30**

**అవరుహ్య గజేంద్రాత్స వివేశ వసనగృహమ్ ।**
**ఏవం రామః శనైర్మార్గే పశ్యన్ దేశాన్ మనోరమాన్ ॥ 31**

**తీర్త్వా భాగీరథీం గంగా విలంఘ్య కటకాన్ ప్రభుః ।**
**యయౌ వింశద్దినైర్భూరికీర్తేర్దేశమనుత్తమమ్ ॥ 32**

**భూరికీర్తేస్తతో దూతో గత్వా నిజప్రభుమ్ జవాత్ ।**
**కథయామాస రామస్య ముదాఽఽగమనమాదరాత్ ॥ 33**

అంత సీతాది స్త్రీలందరును దివ్య వస్త్ర భూషణాలంకృతులై త్వరగా తమతమ వాహనములను ఎక్కిరి. అంత శ్రీరాముడు దివ్యగజమును ఎక్కి, ఛత్ర, చామరాలంకృతుడై మొదట వెడలెను. రాముని ముందర వశిష్ఠుడు, గుఱ్ఱమును ఎక్కి వెడలెను. రాముని వెనుక ఏనుగును ఎక్కి లక్ష్మణుడు వచ్చెను. ఆ వెనుక కుశాదులు ఎనమండుగురు బాలకులును, వేరువేరుగా ఏనుగులను ఎక్కి వచ్చుచుండిరి. వారి వెనుక గజారూఢులై భరత, శత్రుఘ్నులు బయలుదేరిరి. అంత అందరు మంత్రులును, నాగరికులును, దేశమువారును క్రమముగా వివిధ వాహనారూఢులై వెడలిరి. శ్రీరాముడు తనకు తగినట్లు నాలుగు దంతములు గల ముత్యములతో అలంకరించబడిన తెల్లని ఏనుగుపై రారాజించు చుండెను. ఇట్లు శ్రీరాముడు తూర్పుమార్గమున వచ్చుచుండగా వందిమాగదులు పొగడుచుండిరి. పుష్పకమున ఉండెడి స్త్రీలు సంతసించుచు, శ్రీరాముని వీక్షించుచు, విరుల వానలను కురిపించు చుండిరి. నవవిధ వాద్యములు మ్రోగుచుండెను. గణికల ఆటపాటలు జరుగుచుండెను. నటాదులు మనోహర గీతములను పాడుచుండిరి. ఇట్టి వైభవముతో రఘునందనుడు వచ్చి, అయోధ్యకు ఆమడదూరమున ఏర్పరిచియుండు సేనా సన్నివేశ స్థానమును జూచి, వాహనమునుండి దిగి, వస్త్రములతో ఏర్పరచిన గృహమున ప్రవేశించెను. ఇట్లేరాముడు తిన్నగా దారిలో మనోహరములగు ప్రదేశములను చూచుచు, గంగానదిని దాటి, కటక రాష్ట్రముల గుండా, 20 దినములలో భూరికీర్తి ప్రదేశమునకు వచ్చెను. అంత నచట భూరికీర్తి దూతముఖమునుండి శ్రీరామ ఆగమనమును విని, మిక్కిలి సంతోషమునందెను.

**భూరికీర్తిర్నృపః శ్రుత్వాఽఽగమనం రాఘవస్య సః ।**
**తుతోష నితరాం శ్రీమాన్ రామం ప్రత్యుద్యయౌ జవాత్ ॥ 34**

**స్వపురీం శోభయామాస పతాకధ్వజతోరణైః ।**
**వారణేంద్రం పురస్కృత్య సమాయాతైః నృపైః సహ ॥ 35**

యే యే సమాగతాస్తత్ర పార్థివాశ్చ స్వయంవరే ।
విషణ్ణాస్యా బభూవుస్తే వ్యగ్రచిత్తాస్తథైవ చ ॥ 36

స్వచిత్తే మంత్రయామాసుః కథమత్ర స్వయంవరే ।
త్యక్త్వా శ్రీరామబాలాంశ్చ కన్యేఽస్మాకం వరిష్యతః ॥ 37

ఇతి చింతావిష్టచిత్తాః ప్రత్యుజ్జగ్మూ రఘూత్తమమ్ ।
రామం దూరాద్దదృశుస్తే తత్సేనాం చ త్వరాన్వితామ్ ॥ 38

తతస్తే రాఘవం నత్వోపాయనాని న్యవేదయన్ ।
రామేణాలింగితాః సర్వే తత్పార్శ్వే సంస్థితాస్తదా ॥ 39

తతస్తం భూరికీర్తిస్తు స్వపుత్రాభ్యాం సమన్వితః ।
నత్వా రామాదికాన్ పూజ్య వస్త్రాభరణవాహనైః ॥ 40

నినాయ నగరీం స్వీయాం గోపురాట్టాలమండితామ్ ।
నర్తత్సు వారనారీషు వాద్యేషు నినదత్సు చ ॥ 41

స్తువత్సు వందివృందేషు వివేశ నగరీం ప్రభుః ।
తదా తత్పురనార్యస్తాః శ్రుత్వా రామం సమాగతమ్ ॥ 42

విహాయ నిజకార్యాణి దుద్రువుర్గోపురాదిషు ।
శీఘ్రమారురుహుః సర్వా దదృశుస్తా రఘూత్తమమ్ ॥ 43

కాచిత్స్వబాలకం త్యక్త్వా రుదంతం నిజమంచకే ।
దుద్రావ రాఘవం ద్రష్టుం వరప్రాసాదమస్తకే ॥ 44

తాంబూలవీటికాం కాచిత్ కృత్వా యావత్పతిం దదౌ ।
తావచ్ఛ్రుత్వా సమాయాంతం రామం దుద్రావ సా జవాత్ ॥ 45

భూరికీర్తి మహారాజు త్వరగా శ్రీరాముని స్వాగతించుటకు, నిజనగరమును చిత్రధ్వజ పతాక తోరణాదులచే అలంకరించి, తన నగరానికి వచ్చియున్న రాజులందరిని వెంటతీసుకుని, భద్రగజ పురస్కృతుడై శ్రీరామసన్నిధికి వచ్చెను. (35)

## శ్రీరాముడు భూరికీర్తి పురములో ప్రవేశించుట.

ఆ స్వయంవరమునకై ఎవ్వరెవ్వరు వచ్చియుండిరో ఆ రాజులందరును విషణ్ముఖులై, చకితాంతరంగులై తమ మనసులో "ఆహా! ఈ స్వయంవరమున చంపక, సుమతులు శ్రీరాముని బిడ్డలను వదలి, మమ్ము ఏవిధంగా వరించెదరు? అను చింతచే, ఎట్లో శ్రీరాముని సన్నిధికి ఏతెంచి, దూరముననే శ్రీరాముని సేనను, శ్రీరామునిని దర్శించి, నమస్కరించి కానుకలను అర్పించిరి. శ్రీరాముడు వారిని సముచిత ఆలింగనాదులచే సంతోషపరచి తన ప్రక్కలో నిలిపెను. అంత ఆ భూరికీర్తిమహారాజు తన పుత్రులతో కూడి శ్రీరామచంద్రాదులకు అందరికి నమస్కరించి, వస్త్రాభరణ వాహనాదులతో సత్కరించి, గోపురాట్టాల శోభితమగు తనరాజధానికి పిలుచుకుని వచ్చెను. వారకాంతలు నర్తించుచుండ, మంగళవాద్యములు మ్రోగుచుండ, వంది మాగధ బృందము పొగడు చుండ, స్వయంప్రభువగు శ్రీరాఘవస్వామి పట్టణములో ప్రవేశించెను. అపుడు అచటి పురస్త్రీలందరును శ్రీరాముని రాకను విని, తమతమ పనులను వదలి రఘునాథుని దర్శించాలనే కుతూహలముచే గోపురాద్యున్నత ప్రదేశముల పైకి త్వరగా ఎక్కిరి. ఒక వనిత ఏడ్చుచుండు తన బిడ్డను మంచముపై వదలి, రామునిచూడాలనే వేడుకచే పరుగెత్తి గోపురాగ్రముమీద ఎక్కెను. ఒక కాంత కాంతునికి విడియములందించుచుండి అట్లే శ్రీరామాగమనమును విని మిక్కిలి మక్కువతో పరుగెత్తెను.

**కాచిత్త్యక్త్వా భోజనం తు కాచిత్పాకస్య సేవనమ్ ।**
**కాచిత్సకబరీహస్తా ముక్తకేశా యయౌ జవాత్ ॥ 46**

**పతినాలింగితా కాచిన్నిష్కాస్య స్వపతేః కరమ్ ।**
**యయౌ వేగేన లలనా వరప్రాసాదమస్తకమ్ ॥ 47**

**క్షాలయంతీ పతేః పాదావేకం ప్రక్షాళ్య కామినీ ।**
**యావజ్జగ్రాహ సాఽన్యం తు తావచ్ఛృత్వా సమాగతమ్ ॥ 48**

**సీతయా రామచంద్రం హి శీఘ్రం దుద్రావ సా తదా ।**
**కాచిద్భర్త్రా చుంబమానా దూరం కృత్వా పతేర్ముఖమ్ ॥ 49**

**దుద్రావ రాఘవం ద్రష్టుం ప్రాసాదే స్రస్తపల్లవా ।**
**కాచిద్వినిద్రితా భర్త్రా త్యక్త్వా నిద్రాం త్వరాన్వితా ॥ 50**

విస్తీర్ణకజ్జలా మందనేత్రాః నిద్రామరాన్వితా ।
నేత్రాభ్యాం కుంచితాన్ కేశాన్ వారయన్తీ జవాద్యయౌ ॥ 51

త్యక్త్వాఽభ్యంగం హి కాచిత్సా కుర్వన్తం కరసన్నిధిమ్ ।
యయౌ వేగేన ప్రాసాదం శ్రుత్వా రాఘవమాగతమ్ ॥ 52

కాచిద్భుజే కంచుకీం సా కృత్వైకే చాపరే భుజే ।
కర్తుకామా యయౌ శీఘ్రం తథైవ ప్రమదోత్తమా ॥ 53

కాచిదేకే పదే కృత్వా నూపురాదీని భామినీ ।
అపరే కర్తుకామా సా తథైవాట్టాలమాయయౌ ॥ 54

కథయతీ శుభాం వార్తాం స్వపత్యుః పురతః స్థితా ।
శ్రుత్వా రామం సమాయాంతం దుద్రావ గజగామినీ ॥ 55

కాచిన్నిజపతిం పాత్రే కుర్వన్తీ పరివేషణమ్ ।
భూమౌ త్యక్త్వాఽన్నపాత్రం సా యయౌ రామం నిరీక్షితుమ్ ॥ 56

కాచిత్స్నాత్వా దివ్యవస్త్రా కుర్వతీ సా ప్రదక్షిణాః ।
తులసీం చ మహాదేవం శ్రుత్వా రామం యయౌ జవాత్ ॥ 57

కాచిద్రజ్జుఘటం కూపే కృత్వా తోయార్థముద్యతా ।
త్యక్త్వా రజ్జుఘటం కూపే దుద్రావేందునిభాననా ॥ 58

కాచిత్స్వబాలకం స్తన్యం రహః పాయయతీ వధూః ।
కుచయోర్బాలకం ధృత్వా తథైవ సా యయౌ జవాత్ ॥ 59

మరియొక వనిత భోజనమును విడిచి, ఇంకొకవనిత వంటచేయుటను మాని, వేరొకతె కొప్పుపెట్టుకొనుచున్నట్లే వెంట్రుకలు విరియబోసుకుని త్వరగా పరుగిడిరి. మరియొక మగువ మగడు ఆలింగించుచుండ కాంతుని కరములను త్రోసివేసి గోపురాగ్రమునకు వేగముగా పోయెను. ఇంకొక ఇంతి పెనిమిటియొక్క పాదమునొకటిని కడిగి మరియొకటి వదలివచ్చెను. ఇంకొక ఇల్లాలు మగడు ముద్దుపెట్టుచుండగా అతని ముఖమును త్రోసి, కాళ్ళుతడబడుటను ఎరుగక డాబామీదకు పరుగెత్తెను. మరియొక తరుణి పతితోడ పాన్పుపై పవ్వళించి నిద్రించుచుండినది దబ్బునలేచి కన్నుల కాటుక

కలిసియుండ నిద్రమగతలో ఉన్నా, కన్నులకడ్డమగు ముంగురులను సవరించుకొనుచు త్వరగా వచ్చెను. మరియొకనాతి సిద్ధమగు అభ్యంగమును మాని, రామునిరాకను చూడగోరి, రయమున వెడలెను. మరియొక ప్రమద ఒక చేతికి రవికెను తొడుగుకొని, మరియొక చేతికి తొడుగు కొనునంతలో అట్లేత్వరబడివచ్చెను. మరియొక కామిని మోకాలికి కడియమును పెట్టుకొని, మరియొకటి పెట్టుకొనునంతలో తొందరపడి వచ్చెను. ఇంకొక మందయాన పతికి శుభవార్త వినిపించుచు ఎదుట ఉన్నది. రామగమనమును విని అట్లే బయలుదేరెను. ఒక గయ్యాళి మగనికి వడ్డించుచు ఆ అన్న పాత్రను అట్లేపారవేసి రాముని చూతునని పరుగెత్తెను. ఒక సువాసిని స్నానముచేసి దివ్యవస్త్రములను అలంకరించుకుని, తులసి ప్రదక్షిణము చేయుచున్నది. మహాదేవుడగు రాముడు ఏతెంచెనని విని త్వరగా చూడవెడలెను. వేరొక చపల నూతిలో నీళ్ళుచేదుచుండినది.

కాచిత్స్నా పరీధాయాథ వస్త్రం కచ్ఛం కరేణ సా ।
కర్తుకామా యయౌ వేగాత్తథైవాట్టాలమస్తకమ్ ॥ 60

ఏవం కర్మాణ్యనేకాని కుర్వంత్యస్తాః పురస్త్రియః ।
విహాయ తాని సర్వాణి యయౌ రామం నిరీక్షతుమ్ ॥ 61

దృష్ట్వా రామం గజస్థం తా వవర్షుః పుష్పవృష్టిభిః ।
ఊచుః పరస్పరంనార్యః శతశోఽట్టాలసంస్థితాః ॥ 62

ధన్యా సా రామజననీ కౌసల్యా సా రఘూత్తమమ్ ।
సుషువే రాజరాజానం పరిపూర్ణమనోరథా ॥ 63

కాశ్చిదూచుశ్చ సా ధన్యా సీతా జనకనందినీ ।
యస్యా బింబాధరరసమురరీకురుతేఽత్ర సః ॥ 64

కాశ్చిదూచుస్తయా తప్తం జానక్యా దుష్కరం తపః ।
పూర్వజన్మని యత్పుణ్యాద్రాజరాజప్రియాఽభవత్ ॥ 65

కాశ్చిదూచుర్వయం మందభాగ్యాస్తు జగతీతలే ।
సీతాదాస్యో న జాతాః స్మ రామసేవనతత్పరాః ॥ 66

ఇతి నానావిధా వాచస్తాసాం శ్రుణ్వన్ రఘూత్తమః ।
యయౌ స రాజమార్గేణ నృపకల్పితమందిరమ్ ॥ 67

తత్రావరుహ్య నాగేంద్రాద్వివేశ వరమందిరమ్ ।
తస్థౌ సుఖేన జానక్యా బంధుభిర్బాలకైః ప్రభుః ॥ 68

**ఇతి శ్రీశతకోటిరామచరితాంతర్గతే, శ్రీమదానందరామాయణే, వాల్మీకీయే, ఆదికావ్యే, వివాహకాండే, స్వయంవరార్థం భూరికీర్తేః, పురంప్రతి శ్రీరామగమనం నామ ప్రథమః సర్గః ॥**

చెంబు, చేంతాళ్ళను అట్లేపారవేసి పరుగెత్తెను. మరియొక ముగ్ధ రహస్యముగా బిడ్డకు పాలిచ్చుచున్నది. పాలిండ్లపై బాలకుని ఎత్తుకుని, అట్లే జవముగా ఏతెంచెను. మరియొకతె చీరగట్టుకుని కచ్చవేసుకొనుచునే గోపురాగ్రమునకు వచ్చిచేరెను. ఇట్లు వారివారి పనులలో ఉండిన పురస్త్రీలందరును శ్రీరామ దర్శనమునకై తమ పనులను మాని కుతూహలముతో వచ్చుచుండిరి. వారందరును శ్రీరామునిమీద పూలవాన కురిపించిరి. ఒండొరులు నారులు పలురకములుగా మాటలాడుచుండిరి. కొందరు యే కౌసల్యాదేవి రాజరాజగు శ్రీరామచంద్రస్వామిని కనెనో ఆ పూర్ణమనోహరథయగు ఆమెయే కృతకృత్యురాలు అనిరి. మరికొందరు శ్రీరామచంద్రుడు ఎవతె యొక్క బింబాదరమధుర రసమును ఆస్వాదించునో ఆ సీతాదేవి గద ధన్యురాలనిరి. ఇకకొందరు జానకమ్మ పూర్వజన్మలో కఠోర తపమును ఆచరించినది గనుక ఇప్పుడు రాజేంద్రుడగు రామునికి ప్రేయసిమణి అయ్యెననిరి. కొందరు 'మనము నిర్భాగ్యురాండ్రము, సీతమ్మయొక్క దాసీజనులై పుట్టి, శ్రీరామసేవాపరాయణులమై ఉండక పోతిమ'ని చింతించిరి. ఇట్లు చెప్పుకొనుచుండు నగరస్త్రీల సంభాషణలను వినుచు వినోదముగా శ్రీరామచంద్రుడు రాజమార్గమున వచ్చి, భూరికీర్తి కల్పిత రాజమందిరము చేరి, దివ్యగజమునుండి దిగి, అచట– సీతా, లక్ష్మణ, భరత, శత్రుఘ్న, పుత్ర మిత్ర పరివార సమేతుడై మహావిభవములను అందుచు, మహోన్నతుడై చరించుచుండెను.

***ఈ విధముగ శ్రీమద్వాల్మీకి మహర్షిచే రచింపబడిన, శ్రీ శతకోటిరామచరితాంతర్గత శ్రీమత్ ఆనందరామాయణములో, ఆరవదైన వివాహకాండలో 1వ సర్గ ముగిసినది.***



# ద్వితీయః సర్గః-2వ సర్గ

చంపిక స్వయంవరము

శ్రీరామదాస ఉవాచ

అథాపరదినే రామం భూరికీర్తిః సమాయయౌ ।
నత్వా ప్రాహ రఘుశ్రేష్ఠ సభామాగంతుమర్హసి ॥ 1

తథేతి రాఘవశ్చోక్త్వా బాలకై రుక్మభూషితైః ।
రుక్మతంతూద్భవశ్రేష్ఠ కంచుకోష్ణీషమండితః ॥ 2

ఊరూ పిధాయ త్రిముఖైః కటిబంధోత్తరీయకైః ।
భూషితైరష్టభిః శీఘ్రం శిబికాస్థైః సమాయయౌ ॥ 3

సభాయాం యే నృపాః పూర్వమాసనేషు చ సంస్థితాః ।
శ్రుత్వా రామం సమాయాతం సంభ్రమాతత్పురో యయౌ ॥ 4

చక్రుః సర్వే రాఘవాయ ప్రణామాన్పార్థివోత్తమాః ।
తేషాం నామాని రామాయ దీర్ఘశబ్దైః పృథక్ పృథక్ ॥ 5

చిత్రోష్ణీషా రామదూతాః ప్రోచుర్వై వేత్రపాణయః ।
వస్త్రాలంకారభూషాభిర్ భూషితా ముదితాననాః ॥ 6

రాజరాజ నృపశ్చాయం కర్ణాటవిషయే స్థితః ।
విజయస్తే ప్రణామాంశ్చ కరోతి త్వం విలోకయ ॥ 7

రాఘవేంద్ర నృపశ్చాయం శ్రీమాన్ ద్రవిడదేశజః ।
కంబుకంఠో ప్రణామాంశ్చ కరోతి త్వం విలోకయ ॥ 8

దీననాథ నృపశ్చాయం విదర్భవిషయే స్థితః ।
అంగనాథః ప్రణామాంశ్చ కరోతి త్వం విలోకయ ॥ 9

**మహారాజ నృపశ్చాయం మాగధే విషయే స్థితః ।**
**పరంతపః ప్రణామాంస్తే కరోతి త్వం విలోకయ ॥ 10**

**సీతాకాంత నృపశ్చాయమవంతిస్థః ప్రతాపవాన్ ।**
**ఉగ్రబాహుః ప్రణామాంశ్చ కరోతి త్వం విలోకయ ॥ 11**

శ్రీరామదాసు ఇట్లు పలికెను, "రెండవనాడు భూరికీర్తి రాజుగారు శ్రీరామ సన్నిధానమునకు వచ్చి, నమస్కరించి, సభకు దయచేయ వలయునని ప్రార్థించెను. అట్లేయని రఘునాథుడు పలికి–బంగారు అంచు బట్టలను, దివ్య రత్నాభరణములను, దివ్య కంచుకోష్ణీశములను అలంకరించికొనిన వారును, మొనలుమూసిన కత్తులు, దట్టీలు, దివ్యోత్తరీయములు వీటిచే అలంకృతులును, సుందరాంగులు అయిన ఎనిమిదిమంది పుత్రులు పల్లకినెక్కి, వరుసగా వెంబడించి వచ్చుచుండగా–వెడలి స్వయంవర మండప సభవద్దకు వచ్చెను. అంతకుమునుపు సభలో కూర్చుండియుండిన రాజులందరును శ్రీరాముని రాకను విని, సంభ్రమముతో ఎదుటపోయి ప్రణామము లర్పించుచుండిరి. అప్పుడు చిత్రమైన ఉన్ని దుస్తులతో అలంకార యుక్తులైన వేత్రపాణులగు శ్రీరామదూతలు చిరునవ్వుతో ఆ రాజులయొక్క నామధేయములను వేరువేరుగా దీర్ఘనాదములతో విన్నవించుచుండిరి. ఎట్లనిన–రాజరాజేంద్రా! శ్రీరామప్రభూ! విజయుడైన కర్ణాటక దేశాధీశ్వరుడగు ఈ రాజు ప్రణమించుచున్నాడు, ప్రసాదింపుము. శ్రీరాఘవస్వామి! శ్రీమంతుడును ద్రవిడదేశాధిపుడును ఐన కంబుకంఠకుడను ఈ రాజు మీకు నమస్కరించుచున్నాడు, నిరీక్షింపుము. కరుణాపయోనిధియగు దాశరథీ! విదర్భదేశమున వశించుచుండు అంగనాథుడు అను రాజు నీకు విన్నవించుచున్నాడు, దయజూపుము. మహారాజా! మగధ దేశపతియైన పరంతపుడు అను పృథివీపతి అభివాదమును చేయుచున్నాడు అనుగ్రహింపుము. శ్రీజానకీ వల్లభా! అవంతీనాథుడైన ఉగ్రబాహువను రాజు నమస్కరించున్నాడు, చూడుము.

**రఘువీర నృపశ్చాయం స్థితో హైహయపత్తనే ।**
**ప్రతీపస్తే ప్రణామాంశ్చ కరోతి త్వం విలోకయ ॥ 12**

**హే రామ నృపతిశ్చాయం శూరసేనే స్థితో మహాన్ ।**
**సుషేణస్తే ప్రణామాంశ్చ కరోతి త్వం విలోకయ ॥ 13**

**కోసలేంద్ర నృపశ్చాయం హరిద్వారస్థితో మహాన్ ।**
**నీపాన్వయే యజ్ఞకీర్తిః కరోతి నమనం తవ ॥ 14**

అయోధ్యేశ నృపశ్చాయం కలింగవిషయే స్థితః ।
హేమాంగదస్థటేఽ భ్ధేశ్చ కరోతి నమనం తవ ॥ 15

రావణారే నృపశ్చాయం నాగపత్తనసంస్థితః ।
పాండ్యోఽయం మతిమాన్ శూరః కరోతి నమనం తవ ॥ 16

ఏవం తేషాం ప్రణామాంశ్చ మానయన్ స్వేక్షణాదిభిః ।
వివేశ బంధుభిర్బాలైః సభాయాం మంత్రిభిః ప్రభుః ॥ 17

తత్ర సింహాసనే దివ్యే పశ్చిమాయాం తతోహరిః ।
ఉపావిశత్స పూర్వాస్యశ్ఛత్రచామరమండితః ॥ 18

రామస్య సవ్యే సౌమిత్రిః కైకేయతనయాః స్థితాః ।
తస్థుస్తథా రామవామే కుశాద్యా మంత్రిబాలకాః ॥ 19

శత్రుఘ్నసవ్యే సంతస్థుః సుమంత్రాద్యాః సుమంత్రిణః ।
సభాయాముత్తరే యామ్యే పంక్త్యౌ సర్వే నృపాదికాః ॥ 20

నేమిరేఖోపమాస్తస్థుః స్వసుహృత్పుత్రమంత్రిభిః ।
పశ్చిమాభిముఖాః సర్వా ననృతుర్వారయోషితః ॥ 21

అట్టాలసస్థా విప్రాద్యా దదృశుః కౌతుకం మహత్ ।
తతో నదత్సు వాద్యేషు ధూపేషు ప్రజ్వలత్సు చ ॥ 22

వీరాగ్రణీ! హైహయ దేశాధీశుడైన ప్రతీపుడు అను భూపతి ప్రణామముచేయుచున్నాడు, పరికింపుము. రత్నకుల రత్నమా! శూరసేన దేశస్థితుడను సుశేషణుడు అను వసుదేశుడు వందించుచున్నాడు, విలోకింపుము. కోసలేంద్రా! హరిద్వారమునుండి వచ్చిన యజ్ఞకీర్తియను రాజు నమస్కరించుచున్నాడు, నిరీక్షింపుము. అయోధ్యానిలయా! కళింగదేశాధీశుడైన హేమాంగదుడను మహీపతి నమస్కరించుచున్నాడు, విలోకింపుము. రావణదర్పవిరామా! నాగపట్టణమున వసించెడు శూరుడును, ధీరుడును ఐన పాండ్యరాజు ప్రణమిల్లుచున్నాడు, ప్రసన్నుడగుము– ఇట్లు అచటి రాజులందరియొక్క నమస్కారముల వీక్షణమాత్రమున అంగీకరించి, తమ్ములతోను, మిత్రులతోను, పుత్రులతోను శ్రీరామచంద్రుడు సభలో ప్రవేశించెను. అచట పడమట దివ్యసింహాసనమున ఛత్ర,

చామరాలంకృతుడై శ్రీమన్నారాయణుడు సుఖాశీనుడయ్యెను. శ్రీరాముని కుడిప్రక్క లక్ష్మణ, భరత, శత్రుఘ్నులును, ఎడమప్రక్కన కుశాదులును, మంత్రిపుత్రులును, కూర్చుండిరి. శత్రుఘ్నుని కుడిప్రక్క సుమంత్రాది మంత్రులు కూర్చుండిరి. సభలో ఉత్తర దక్షిణములలో ఇతరరాజులందరును వారివారి పుత్రమిత్ర పరివారములతో వరుసగా పీఠాశీనులైరి. తూర్పువైపున నిలబడి పడమర ముఖముగా వారకాంతలు నర్తనచేయుచుండిరి. పై మంచకములలో నివసించు వారలై విప్రోత్తములు ఆ గొప్పవేడుకను చూచుచుండిరి. వాటిపై మేడలమీద అంతఃపురాంగనలు గవాక్ష జాలములనుండి స్వయంవర మహోత్సవములను నిరీక్షించుచుండిరి. (22)

**నర్తత్సు వారనారీషు గాయత్సు మాగధాదిషు ।**
**స్తువత్సు వందివృందేషు సభాయాం నృపపౌత్రికే ॥ 23**

**శిబికాస్థే దివ్యవస్త్రదివ్యాలంకారమండితే ।**
**నవరత్నమహామాలా ధృతరమ్యకరోత్పలే ॥ 24**

**తే సమాజగ్మతూ రమ్యే సభాగ్రస్థే విరేజతుః ।**
**తయోర్నేత్రకటాక్షైశ్చ భిన్నమర్మస్థలా నృపా ॥ 25**

**బభూవుర్వికలాః సర్వే కామబాణైర్విశేషతః ।**
**న తదా లేభిరే శర్మ శుష్కకంఠోష్ఠతాలుకాః ॥ 26**

**సభాం తాం చంపికానామ్నీ వహ్నికోణాద్వివేశ హ ।**
**ఈశకోణాచ్చ సుమతిః సభాం తాం సంవివేశ హ ॥ 27**

**అథోపమాతా వృద్ధా సా ధృతహస్తాగ్రయష్టికా ।**
**సభాయాం చంపికానామ్నై దక్షిణస్థాన్ పృథక్ పృథక్ ॥ 28**

**క్రమేణ వర్ణయామాస తదా నృపతిసత్తమాన్ ।**
**తథాఽన్యా చ సభాగ్రాచ్చ ధృతహస్తాగ్రయష్టికా ॥ 29**

**సునందాఖ్యాఽతిజరతా సుమత్యై నృపతీన్ క్రమాత్ ।**
**వర్ణయామాసోత్తరస్థానుపమాతా పృథక్ పృథక్ ॥ 30**

అథ సా చంపికాం ప్రాహ నీత్వా తాం నృపతేః పురః ।
శిబికాస్థాం చోపమాతా నందా చామరవీజితామ్ ॥ 31

రాజకన్యే చంపికేఽత్ర శృణుష్వ వచనం మమ ।
ఏనం నృప వర్ణయామి పశ్య త్వం మదనోపమమ్ ॥ 32

పాండ్యోఽయం మతిమాన్నామ్నా నాగపత్తనసంస్థితః ।
శూరో రథీ నృపశ్రేష్ఠః ప్రజాపాలనతత్పరః ॥ 33

యది తే రోచతే చిత్తే వరయైనమనుత్తమమ్ ।
అస్య త్వం మహిషీ భూత్వా నాగపత్తనసంస్థితా ॥ 34

క్రీడస్వ ముదితాఽనేన వరప్రాసాదరాజిషు ।
నందోక్తం చంపికా శ్రుత్వా ద్వ్యర్థం వాక్యమనుత్తమమ్ ॥ 35

## చంపిక సుమతులు స్వయంవరమంటపములోనికి ప్రవేశించుట.

అపుడు నర్తకీమణులు నర్తించుచుండ, గాయకులు పాడుచుండ, పండితులు పొగుడుచుండగా, ఆ సభాప్రాంగణమునకు భూరికీర్తియొక్క మనుమరాండ్రు ఇరువురును దివ్యాలంకారములతో, నవరత్నమాలికలను చేతబట్టుకుని పల్లకీలనెక్కి సభలో ప్రవేశించిరి. ఇట్లువచ్చి సభాగ్రమున విరాజిల్లు చుండు ఆ బాలికలయొక్క కటాక్షములచే అచటి రాజులందరును వికలిత మర్మస్థలములను వికల చిత్తులునై పెదవులారి, గొంతుఎండి ఎపుడు ఎంతమాత్రమును సుఖమునందిన వారుమాత్రము కాదు. చంపిక అనుకన్య ఆగ్నేయ దిగ్భాగమునుండి సభలో ప్రవేశించెను. సుమతి అను సుకుమారి ఈశాన్యదిగ్భాగమునుండి సభలో ప్రవేశించెను. అంత వృద్ధురాలైన దాది నందయనునది చేత ఊత కఱ్ఱను పట్టుకుని వెంటవచ్చుచు, చంపికకు దక్షిణ భాగమున ఉన్న రాజులను వేరువేరుగా వర్ణించి చెప్పుచుండెను. అట్లే ఉత్తరభాగమున సునంద అను వృద్ధ దాది చేత ఊతకఱ్ఱను పూని సుమతికి రాజులను అభివర్ణించి చూపుచుండెను. (30)

## స్వయంవరంలో చంపిక రాజులను చూచుట.

పిదప పల్లకినెక్కి చామరవీజితయై ఉండెడు చంపికను నంద ఒక రాజుముందర నిలిపి, “రాజపుత్రీ! ఇచట నామాటను వినుము. ఈ రాజును వర్ణించెదను. ఇతడు కామునివంటివాడు. మతిమంతుడు

అను పేరుగలవాడు. పాండ్యనాథుడు, నాగపట్టణమున వశించును, శూరుడు, ప్రజాపాలన నిపుణుడైన రాజేంద్రుడు, నీ మనస్సు ఒప్పితే ఈయనను ఉత్తమునిగా వరింపుము. వీరికి నీవు రాణివై నాగపట్టణమున మేడలమీద క్రీడింపుము అని చెప్పగా నిపుణ యగు చంపిక నంద పలికిన అనుత్తముడను మాటచే వీడు వ్యర్థుడు అని ఎంచెను.

న బబంధ మనస్తస్మిన్నృపతౌ మతిమత్తరా ।
చోదయామాస నందం తామగ్రే గంతుం నృపాంతరమ్ ॥ **36**

తదాఽన్యం నృపతిం నందా నీత్వా తాం శిబికాస్థితా ।
చంపికాం ప్రాహ వేగేన పశ్యైనం బాలికే నృపమ్ ॥ **37**

కళింగవిషయస్థోఽయం నామ్నా హేమాంగదో మహాన్ ।
కోటిశో వారణేంద్రాణాం యస్యగండస్థలాదిషు ॥ **38**

ముక్తాజాలాతిగుచ్ఛాశ్చ రాజంతే కమలాననే ।
అస్య త్వం మహిషీ భూత్వా గవాక్షైః సాగరస్య చ ॥ **39**

పశ్యంతీ కౌతుకం బాలే కరోషి క్రీడనాదికమ్ ।
అస్య స్త్రీవృందమధ్యే త్వం భవ ముఖ్యాఽద్య కన్యకే ॥ **40**

ఇత్యుక్త్వాఽపి తయా తన్వీ నందయా చంపికా నృపే ।
తస్మిన్ మనో న బబంధాన్యం గంతుం తామచోదయాత్ ॥ **41**

సపత్నీభయమాలక్ష్య సపత్నీకస్త్యజిష్యతి ।
అమహానితి వాక్యేన నందయా సూచితాఽపి సా ॥ **42**

తతోఽన్యం నృపతిం గత్వా నందా ప్రోవాచ చంపికామ్ ।
పశ్యైనం నృపతిం ముగ్ధే హరిద్వారనివాసినమ్ ॥ **43**

నీపాన్వయసముద్భూతం హ్యబ్ధావివ నిశాకరమ్ ।
యజ్ఞానాం నృపతేరస్య కీర్త్యా జగతి మండలే ॥ **44**

**యజ్ఞకీర్తిరితి ఖ్యాతః పృథ్వీశః ప్రమదాప్రియః ।**
**నరయైనం నృపం పుత్రి రుక్మభూషణభూషితమ్ ॥ 45**

**అస్యాద్య మహీషీ భూత్వా గంగావీచిపరంపరాః ।**
**నౌకాస్థా పశ్యసి త్వం హి వరయైనం నృపోత్తమమ్ ॥ 46**

**అస్య పత్నీ వరిష్ఠా త్వం భవ మాఽగ్రే వ్రజాబలే ।**
**ఇత్యుక్త్వాఽపి తయా తస్మిన్న బబంధ నిజం మనః ॥ 47**

**త్వం వరిష్ఠా మా భవేతి నందయాగ్రే వ్రజేరితా ।**
**చోదయామాస సా నందామగ్రే గంతుం నృపాంతరమ్ ॥ 48**

చంపిక ఆ రాజును మోహింపక వేరొక భూపతి ఎదుటకు పొమ్మని నందను ప్రేరేపించెను. అపుడు నంద ఇంకొక రాజువద్దకు పోయి, నిలిచి, చంపికతో, "వరవర్ణిని! ఈ నరనాథుని వీక్షింపుము. ఇతడు కళింగదేశమునందుండు హేమాంగదుడు అను మహామహారాజు. కమలముఖీ! ఇతనియొక్క కోట్లకొలదిగాగల ఏనుగుల గండస్థలములపై ముత్యముల కుచ్చులు వెలయుచుండును. వీనికి నీవు రాణివై గవాక్షములనుండి సముద్రముయొక్క వేడుకలను నిరీక్షించుచు క్రీడించెదవు గాక. వీనియొక్క ప్రియురాండ్రనడుమ నీవే ముఖ్యమై ఉండుము." అని పలుకగా ఆ చంపిక పెక్కుమంది భార్యలు గలవాడు ఎన్నడైనను త్యజించుననే భీతిచేతను, మహామహారాజను మాటచే గొప్పవాడు కాడనియును నందావాక్య సూచనను గ్రహించి, వానియందు మనస్సునిలుపలేదు. అంత మరియొకరాజువద్దకు వచ్చి, నంద ఇట్లనియె, "నవమోహనాంగి! నరేంద్రుని వీక్షింపుము. ఇతడు వంశమునకు సముద్రమునకు చంద్రునివలె వర్ధకుడు. హరిద్వారనివాసి, ఈ రాజుచేయునట్టి యజ్ఞమువలన కలిగిన కీర్తిచే, ఇతనికి యజ్ఞకీర్తి అను పేరుకలిగినది. ఇతడు విలాసిని, వినోదపరుడు, దివ్యాలంకార కృతుడగు ఈ రాజును నీవు వరింపుము. ఇపుడు నీవు ఇతనికి పత్నివై పడవమీదనెక్కి, గంగాసంగ తరంగ మంగళవిహారములను దర్శించుచుందువు. ఇతని పత్నులలో నీవు గొప్పదానవు కావా? లోలాంబకి ముందు ఆలోచింపుము," అనెను.

**నందాఽప్యన్యం నృపం నీత్వా చంపికాం ప్రాహవేగతః ।**
**పశ్యైనం నృపతిం ముగ్ధే శూరసేనాహ్వయే వరే ॥ 49**

దేశే కరోతి వై రాజ్యం సుషేణోఽయమనుత్తమః ।
తురగా వాయువేగాశ్చ యస్య పత్న్యో మృగీదృశః ॥ 50

యస్యాంగణే వారనారీనృత్యఘోషస్త్వహర్నిశమ్ ।
వరయైన చంపికేఽద్య తవాననవదాననమ్ ॥ 51

అస్య త్వం మహిషీ భూత్వా జన్మసాఫల్యతాం కురు ।
వారస్త్రీలంపట శ్రుత్వా తథా వాక్యమనుత్తమమ్ ॥ 52

న బబంధ మనస్తస్మిన్నృపతౌ తాం ప్రచోదయత్ ।
అథ సా చోదితా నందా తయాఽన్యం నృపతిం క్షణాత్ ॥ 53

నినాయ శిబికాస్థాం తాం చంపికామాహ సాదరమ్ ।
పశ్యైన నృపతిం బాలే స్థితం హైహయపత్తనే ॥ 54

సహస్రార్జునవంశస్య భూషణం కమలోపమమ్ ।
ప్రతీప ఇతి నామ్నాఽయం ఖ్యాతః శూరో మహారథీ ॥ 55

వరయైనం నృపం మాఽన్యం గచ్ఛ హేమస్వరూపిణి ।
అస్య త్వం మహిషీ భూత్వా రేవాయాం పతినా సహ ॥ 56

కరిష్యసి జలక్రీడాం చంపికే శృణు మద్వచః ।
ఇత్యుక్త్వాపి తయా తన్వీ న బబంధ మనో నృపే ॥ 57

వరయైనం నృపం మేతి నందాస్యాదమహారథీ ।
నృపోఽయం చేతి వాక్యే ద్వే శ్రుత్వా హ్యర్థవిదుత్తమా ॥ 58

ఏవం నానానృపాణాం సా వర్ణనాని పృథక్ పృథక్ ।
స్తుతిరూపనిషేధాని సుశ్రూషతీ నృపాత్మజా ॥ 59

జగామ శిబికాసంస్థా సనందా భరతానుజమ్ ।
సుమంత్రాదీనతిక్రమ్య శ్రుత్వా శ్రీరామమంత్రిణా ॥ 60

**తతః ప్రోవాచ సా నందా పశ్యైనం భరతానుజమ్ ।**
**కోసలేంద్రస్య రామస్య బంధుమేకోదరోపమమ్ ॥ 61**

దాదియైన నంద వాక్యములలో ఇతనిని నీవు పెండ్లాడితే గొప్పదానవు కావు. ఆలోలాంబకి! అనియును ముందు ఆలోచింపుమని నందుకు మరియొకనిని చూడుము అనియును అర్థమును ఆలోచించి, వానిని వరింపక నందను ముందు వెడలుమని చంపిక సైగచేసెను. అంత ఆ నంద సానందముగా మరియొక నరపతియెదుట, “సుందరీ! ఇతనిని అవలోకింపుము. అనుత్తముడగు శూరసేనాధీశుడైన సుషేణుడు అను రాజేంద్రుడు ఇతడు. ఇతని గుఱ్ఱములు వాయువేగములు. ఇతని భార్యలు లేడికన్నులు గలవారు. ఇతని ఇంట ఎల్లప్పుడును భోగమువారు ఆడుచుందురు. నీ ముఖమువంటి ముఖముగల వీనిని వరింపుము. నీవు వీనికి సతివై జన్మసాఫల్యతను పొందుము అని నొక్కివక్కాణించిన ఆ వాక్యములచే చంపిక వీడు ఉత్తముడు కాడనియును గణిక లోలుడనియు గ్రహించి, వానిని హృదయంగమున చేసుకొనక వేరొకచోటుకు పొమ్మని నందను ప్రేరేపించెను. అంత అట్లే ఆమె ఇంకొక నృపుని సన్నిధికి జని, “కన్యామణీ! వీనిని విలోకింపుము. హైహయ రాజధానియందు ఉండువాడితడు. కార్తవీర్యార్జునుని వంశమునకు అలంకారభూతుడు. కమలముల వంటి నేత్రములు గలవాడు. ఇతనిపేరు ప్రతీపుడు. పరమమహారథుడును, శూరుడునై ఖ్యాతినంది యున్నాడు. సప్రేమ మన్యుని (ప్రేమమన్యుడు=ప్రణయకోపరసికుడు) వరింపుము, మానినీ! వీనికి నీవు ప్రేయసివై రేవానదిలో పతితోడ జలక్రీడలను ఆచరించెదవు. చంపిక! నా మాటను వినుము,” అని పలుకగా ఆమె పరమమహారథుడు అనుచోట పరమ మహారతుడునియును, స ప్రేమము అన్యుని వరింపుము అని అర్థమును గ్రహించి, నాకు వీడువలదు, ముందుకు పోనిమ్మని నందను ప్రేరేపించెను ఇట్లు చంపికాదేవి, నంద అను దాది స్తుతించునట్లును వెంటనే నిషేధించు నట్లును కూడా వేరువేరుగా రాజులను అభివర్ణించుచుండగా, అందరిని అతిక్రమించి, శ్రీరామ మంత్రులని విని, సుమంత్రాది మంత్రులను వదలి, పల్లకిమీదుగావచ్చి శత్రుఘ్నుని ఎదుట నిలిచెను. అపుడు నంద, “రాజపుత్రీ! భరత అనుజుడును కౌసల్యానందవర్ధనుడగు శ్రీరాముని తమ్ముడును, అన్నలతోనే ఒకేతల్లికి పుట్టినవానివలె కనిపించువాడూ....

**అయోధ్యావాసినం రామరాజవాక్యానువర్తినమ్ ।**
**వరయైనం చంపికేఽద్య శ్రుతకీర్త్యాః స్వసా భవ ॥ 62**

**ఇత్యుక్త్వాపి తయా తన్వీ శత్రుఘ్నే నిజమానసమ్ ।**
**న బబంధ భ్రువా సంజ్ఞామగ్రే గంతుం చకార తామ్ ॥ 63**

తతః సా భరతం నీత్వా నందా తామాహ మంజులమ్ ।
శత్రుఘ్నస్యాగ్రజం చైనం కైకేయ్యా జఠరోద్భవమ్ ॥ 64

రామసేవారతం శాంతం యువానం దయితాప్రియమ్ ।
వరయైనం బాలికేఽద్య మాండవ్యా సరయూజలే ॥ 65

కరిష్యసి జలక్రీడాం నౌకాస్థా భరతేన హి ।
తతస్తత్సంజ్ఞయా నందా లక్ష్మణం చంపికాం జవాత్ ॥ 66

నీత్వా సౌమిత్రికీర్తి తాం వర్ణయామాస సాదరమ్ ।
పశ్యైనం లక్ష్మణం బాలే సుమిత్రాజఠరోద్భవమ్ ॥ 67

అయోధ్యావాసినం రామసేవాసక్తం మనోహరమ్ ।
వరయైనం చంపికేఽద్య మేఘనాదప్రమర్దనమ్ ॥
శేషాంశసంభవం చోర్మిలాయా వీరస్వసా భవ ॥ 68

సర్వాన్ శ్రుత్వా రామసేవాసక్తాన్ పత్నీయుతానపి ।
ఛత్రచామరహీనాంశ్చ రోచయామాస తాన్న సా ॥ 69

తతస్తత్సంజ్ఞయా నందా శ్రీరామాగ్రే స్వయంవరమ్ ।
నీత్వా తామాహ మధురం స్తోతుం తం రఘునందనమ్ ॥ 70

మహత్తే చంపికే దైవం యేన పశ్యసి రాఘవమ్ ।
ధన్యోఽహమపి యా రామం దృష్ట్వా స్తోతుం పురః స్థితా ॥ 71

క్వాహం మందమతిర్నారీ క్వ రామో గుణసాగరః ।
నాహం తత్ స్తవనే శక్తా వాల్మీకిర్యత్ర కుంఠితః ॥ 72

శతకోటిమితైః శ్లోకైశ్చరిత్రం రాఘవస్య చ ।
మునినా వర్ణితం తచ్చ శతకోట్యంశవర్ణితమ్ ॥ 73

అయోధ్యావాసియును శ్రీరామునియొక్క వాక్యానువర్తియును అగు ఈ శత్రుఘ్నస్వామిని వరింపుము. ఇతని భార్యయగు శ్రుతకీర్తికి చెల్లెలైయుండుమని చెప్పగా ఆ చంపిక శత్రుఘ్నునిపై కటాక్షములను ఒనపక ముందుకు వెడలెను. అంత ఆనంద భరతుని ఎదుట చంపికను జూచి,

"కన్యారత్నమా! కైకేయియొక్క గర్భమున ఉద్భవించినవాడును, శత్రుఘ్నునికి అన్నయును, శ్రీరామసేవానిరతుడును, శాంతుడును, తరుణుడును, ప్రేయసి ప్రియుడును అగు ఈ భరతప్రభువును వరించుము. సరయూనదిలో నౌకను ఎక్కి, మాండవీదేవియును, నీవును భరతునితో జలక్రీడా మహోత్సవమునందగలవు," అని అభివర్ణించి పలికి చంపిక అతనిని మోహింపక విముఖయై అచట నుండి లక్ష్మణస్వామియుండెడు సింహాసనమువద్దకు వచ్చి, చంపికను జూచి, "బాలామణీ! ఈ మహానుభావుని నిరీక్షింపుము, ఇతడు సుమిత్రానందనుడు, అయోధ్యా వాస్తవ్యుడు, శ్రీరామసేవా పరాయణుడు, మనోహరాకారుడు, ఇంద్రజిత్ సంహారకుడు, శేషాంశ సంభవుడు అయిన ఇతనిని వరించి, ఊర్మిళాదేవికి చెల్లెలై ఉండుము." అని చెప్పెను. చంపక అంతటిని విని, శ్రీరామసేవా వారాప్తులు వీరు పత్నీసమేతులును, ఛత్ర, చామర రహితులును గాన వీరు నాకు వలదని నందకు సంజ్ఞను చేసెను. అంత ఆ నంద స్వయంవరమగు చంపికను శ్రీరామ సన్నిధానమున నిలుపుకుని, రఘురాముని ఇట్లుస్తుతించెను. ఓసీ చంపిక! నీవు మహాత్ముడైన సాక్షాత్ దేవునిగా ఈ శ్రీరాముని దర్శించుచున్నావు. ఈ శ్రీరాముని ఎదుట నిలిచి, స్తుతించుటచే నేను కృతకృత్యురాలిగా ఉన్నాను. ఐనా మందమతియగు నేనెక్కడ? సుగుణసాగరుడగు శ్రీరామచంద్రుడు ఎక్కడ? శ్రీ వాల్మీకి మునికూడా ఎవనిని వర్ణించుటలో అశక్తుడయ్యెనో నేను అతనిని వర్ణించుట శక్తురాలను కాను. ఆ మునీంద్రుడు శతకోటి శ్లోకములచే ఆ రామచంద్రుని చరితమును అభివర్ణించే.

**తస్యాహం వర్ణనం కించిత్కరోమి యత్ శ్రుణుష్వ తత్ ।**
**సూర్యవంశభూషణం శ్రీదశరథనృపాత్మజమ్ ॥ 74**

**కౌసల్యాతనయం రామం సాక్షాన్నారాయణం విభుమ్ ।**
**తాటికాంతకరం వీరం గాధిజాధ్వరపాలకమ్ ॥ 75**

**అహల్యోద్ధారిణం శ్రేష్ఠం శివచాపైక ఖండనమ్ ।**
**జానకీవల్లభం రమ్యం జామదగ్న్యదవానలమ్ ॥**
**నృపవృందైకజేతారం భరతప్రాణదాయినమ్ ॥ 76**

**తాతాజ్ఞాపాలకం భ్రాత్రా సీతయాఽరణ్యవాసినమ్ ।**
**విరాధమర్దనం శ్యామం ఖరదూషణమర్దనమ్ ॥ 77**

**త్రిశిరామృగమారీచకబంధవాలిమర్దనమ్ ।**
**సముద్రబంధనం లంకారాక్షసాంతకరం ప్రభుమ్ ॥ 78**

రావణాంతప్రకర్తారం సీతయా రాజ్యకారిణమ్ ।
తీర్థయజ్ఞప్రకర్తారం సీతాక్రీడనతత్పరమ్ ॥ 79

జానకీత్యాగకర్తారం సీతాగ్రహణతత్పరమ్ ।
కుశలవాత్మజాభ్యాం చ వాజ్యార్థం యుద్ధకారిణమ్ ॥ 80

ఏకపత్నీవ్రతం శాంతం సత్యభాషణతత్పరమ్ ।
ఏకబాణమసంఖ్యాతనామానం మారుతిధ్వజమ్ ॥ 81

కోవిదారధ్వజం బాణధ్వజం వజ్రధ్వజం శుభమ్ ।
తార్క్ష్యధ్వజం పుష్పకస్థం తార్క్ష్యవాయుజవాహనమ్ ॥ 82

నానారాజావతంసస్థముక్తాదీప్త్యంఘ్రిశోభితమ్ ।
వరసింహాసనాసీనం ఛత్రచామరమండితమ్ ॥ 83

అప్పటికిని ఆ శ్రీరాముని అనంత మహిమ వర్ణనము నూటిలో ఒకపాలు కాదు. అట్టిస్వామిని కొంచెము అభివర్ణించి చెప్పెదము వినుము. రవికుల రత్నము, దశరథనందనుడు, కౌసల్యానంద వర్ధనుడు, సాక్షాత్ నారాయణుడు, స్వయం విభువు, తాటకా సంహారకుడు, మహావీరుడు, విశ్వామిత్ర యజ్ఞరక్షకుడు, అహల్యాశాప విమోచకుడు, శివుని విల్లును విరిచినవాడు, వైదేహి వల్లభుడు, పరశు రామ గర్వభంజనుడు, జితరాజలోకుడు, భరత ప్రాణరక్షకుడు, పితృవాక్యపరిపాలకుడు, సీతా లక్ష్మణులతో అరణ్యమున వసించినవాడు, విరాధసంహారకుడు, ఖర, దూషణ, విమర్దనుడు, త్రిశురుని, మారీచ మృగములను, కబంధుని, వాలిని సంహరించినవాడు, సముద్రమునకు సేతువును కట్టించినవాడు, లంకారాక్షసాంతకుడు, మహాప్రభువు, రావణుని సంహరించినవాడు, సీతతోడ రాజ్యమేలువాడు, తీర్థాటన, యజ్ఞాచరణ నిర్వాహకుడు, జానకీఖేలనాసక్తుడు, జానకీదేవిని లోకులకు లోకాపవాదభీతిని చూపువానివలె పరిత్యజించి, ప్రతిజ్ఞావశమున పరిగ్రహించినవాడు, కుశలవులను పుత్రులతో అశ్వమేధ అశ్వము కొరకు యుద్ధమును ఆచరించినవాడు, ఏకపత్నీవ్రతుడు, శాంతుడు, సత్యవ్రతుడు, ఒకటేబాణము కలవాడని సుప్రసిద్ధమైన పేరుగలవాడు, బాణవజ్రకోవిదార, హనుమత్ ధ్వజములు కలవాడు, గరుడధ్వజుడు, పుష్పకారూఢుడు, గరుడాంజనేయారూఢుడు, సకల రాజకిరీట నీరాజిత పదారవిందుడు ఇట్టి ఛత్ర, చామరాలంకృత దివ్యసింహాసనాసీన శ్రీరామచంద్ర స్వామిని వరింపుము.

వరయైనం చంపికేఽద్య సీతయా భజ రాఘవమ్ ।
నవవర్షేశ్వరశ్చాయం సప్తద్వీపాధిపోఽపి చ ॥ 84

బాణః పత్నీవచో యస్య నాన్యం మా ఖేదమాచర ।
నవరత్నమాలికామస్య గ్రీవాయాం కురు మా వ్రజ ॥ 85

ఇత్యుక్త్వా నందయా బాలా స్వల్పపుణ్యా విధేర్వశాత్ ।
న బబంధ మతో రామే సీతాం సంస్మృత్య చంపికా ॥ 86

ఏకపత్నీవ్రతం రామం సీతయా హ్యభజేతి చ ।
ఖేదం మా చర తత్కంఠే మాలాం మా కురు చోదితా ॥ 87

తతస్తత్సంజ్ఞయా నందా తాం నినాయ కుశం ప్రతి ।
ప్రోవాచ మధురం వాక్యం కుశపర్ణనహర్షితా ॥ 88

ఏనం పశ్యాల్పవయసం శ్రీరామతనయం కుశమ్ ।
జానకీజఠరోద్భూతం జ్యేష్ఠే భార్యార్థినం శుభమ్ ॥ 89

లవాగ్రజం ధనుర్వేదనిపుణం వినయాన్వితమ్ ।
పిత్రా సంగ్రామకర్తారం వాల్మీకిమునిశిక్షితమ్ ॥ 90

ఏనం వృణీష్వ బాలే త్వం సురమానవసంస్తుతమ్ ।
నవరత్నమయీం మాలామజ్ఞస్య కంఠే సుఖం కురు ॥ 91

ఇతి నందావచః శ్రుత్వా చంపికా సా స్మితాననా ।
ముమోచ మాలికాం కంఠే స్వకరాభ్యాం కుశస్య హి ॥ 92

తదా నినేదుర్వాద్యాని తుష్టువుర్వందిమాగధాః ।
లజ్జయాఽధోముఖో రేజే సభాయాం కుశబాలకః ॥ 93

తదా తుష్టో భూరికీర్తిః కుశాంకే చంపికాం శుభామ్ ।
స్థాపయామాస వేగేన పశ్యత్సు నృపతీషు చ ॥ 94

దదర్శజాలరంధ్రైస్త ప్రాసాదస్థా విదేహజా ।
ముమోద నితరాం స్త్రీభిర్ముమోద రాఘవోఽపి సః ॥ 95

**ఇతి శ్రీశతకోటిరామచరితాంతర్గతే, శ్రీమదానందరామాయణే, వాల్మీకీయే, ఆదికావ్యే, వివాహకాండే, చంపికాస్వయంవరో నామ, ద్వితీయః సర్గః ॥**

చంపికా! సీతాదేవితో కలసి ఈ శ్రీరాముని సేవింపుము. ఇతడు నవవర్షములకును నాయకుడు. సప్తద్వీపాధిపుడు, ఎవనికి బాణము, పత్ని, మాట ఈ మూడును వేరొకటిలేదో అట్టి వీనిని వదలి చింతింపకుము. నవరత్నమాలికను ఇతని కంఠమున అర్పింపుము పోవలదు." అని అభివర్ణించిన నందావాక్యములను వినినను చంపిక విధివశమున అల్పపుణ్యము కలది గనుక, "ఏకపత్నీవ్రతుడు, సీతతోడ భజింపుము, అర్పింపుము, పోవలదు," అను మాటలను ఎంచుచు, శ్రీరామునిముందు మనస్సును నిలుపక నందను ముందుకు వెడలమని సంజ్ఞచేసెను. (87) అంత ఆమె శ్రీరాముని వదలి, కుశునివద్దకు వచ్చి,

## చంపిక కుశుని వరించుట.

చిరునవ్వు ముఖముగల చంపికతో, దాది, "చిన్నవయస్సుగల సుకుమారాంగుడగు ఈ శ్రీరామపుత్రుని చూడుము. ఇతని పేరు కుశుడు. కుశలుడు జానకి గర్భసంభూతుడు, ప్రేయసి మణిని అభ్యర్థించుచుండు తరుణరత్నము, లవుని అన్న అనబడును, ధనుర్వేద నిపుణుడు, సుగుణ సంపన్నుడు, శ్రీమద్వాల్మీకి మునీంద్రులచే శిక్షణ పొందినవాడు, తన తండ్రితోనే యుద్ధము చేసినవాడు, సుర నవ నందితుడగు ఇతనిని వరింపుము. నవరత్నాలంకృతమాలికను ఇతని కంఠమునకు అలంకరింపుము," అనిన నందా వాక్యములను వినిన చంపిక చిరునవ్వుతో కుశుని కంఠమున రెండుచేతులతో ఆ రత్నమాలికను అర్పించెను. అప్పుడు మంగళవాద్యములు మ్రోగినవి. వందిమాగదులు పొగిడిరి. బాలకుడగు కుశుడు లజ్జచేత తలవంచుకుని విరాజించుచుండెను. అపుడు రాజులందరును నిరీక్షించుచుండగా ఆనందభరితుడైన భూరికీర్తి త్వరగా వచ్చి, చంపికా కన్యను కుశుని తొడమీద కూర్చుండ బెట్టెను. మేడమీదనున్న సీతాదేవి జాల రంధ్రములనుండి స్త్రీలతోడ మిగుల ఆనందించెను. శ్రీరాముడు మిక్కిలి సంతోషించెను.

***ఈ విధముగ శ్రీమద్వాల్మీకి మహర్షిచే రచింపబడిన,***
***శ్రీ శతకోటిరామచరితాంతర్గత శ్రీమత్ ఆనందరామాయణములో, వివాహకాండలో***
***చంపికాస్వయంవరాన్ని వర్ణించు 2వ సర్గ ముగిసినది.***



# తృతీయః సర్గః-3వ సర్గ

సుమతి స్వయంవర వర్ణన

శ్రీరామదాస ఉవాచ

అథాన్యాం సా సభాగ్రాచ్చ సుమతిశ్చోత్తరస్థితాన్ ।
నృపానీశానాదిగ్భాగాత్సునందా ధృతయష్టికా ॥ 1

క్రమేణ వర్ణయామాస శిబికాస్థాం సులోచనామ్ ।
బాలే శ్రుణుష్వ మే వాక్యం పశ్యైనం త్వం నృపోత్తమమ్ ॥ 2

అవంతిస్థం చోగ్రబాహునామానం చ హ్యనుత్తమమ్ ।
నానేద సదృశః కశ్చిత్పృథివ్యాం వర్తతే నృపః ॥ 3

వరయైనం నృపం మాఽగ్రే గచ్ఛ త్వం గజగామిని ।
అస్య త్వం మహిషీ భూత్వా క్షిప్రానద్యార్చ సైకతే ॥ 4

వస్త్రగేహస్థితాఽనేన సుఖం క్రీడస్వ భామిని ।
అనుత్తమం చేతి వాక్యం ద్వ్యర్థం సా సుమతిః పురా ॥ 5

శ్రుత్వా మైనం వరయేతి సునందాయా వచః పునః ।
శ్రుత్వా తాం చోదయామాస సా తాం నీత్వా నృపాంతరమ్ ॥ 6

సునందా సుమతిం ప్రాహ పశ్యైనం త్వం నృపోత్తమమ్ ।
అంగనాథాహ్వయం శ్రేష్ఠం విదర్భవిషయస్థితమ్ ॥ 7

పూర్వవత్త్యజ మా బాలే వృణీష్వైనం నృపోత్తమమ్ ।
స్త్రీకామం స్వల్పవయసం భుజకేయూరరాజితమ్ ॥ 8

అస్య త్వం మహిషీ భూత్వా పయోష్ణీజలవీచిషు ।
సుఖం కురు జలక్రీడాం నృపేణానేన భామిని ॥ 9

## సుమతి కొరకు స్వయంవరమున రాజులను చూపుట.

శ్రీరామదాసు ఇట్లు పలికెను, "ఆ తరువాత ఊతకఱ్ఱతో ఉన్న సునందయను పేరుగల దాది పల్లకిలో వచ్చుచుండెడు సుందరియగు సుమతికి ఈశాన్యదిగ్భాగమునుండి ఉత్తర పార్శ్వమున గల రాజులనందరిని చూపుచు, ఒక రాకుమారుని ఎదుటనిలిచి, సుమతితో, "నామాట వినుము నారీమణీ! ఉగ్రబాహువను పేరుగల వాడు ఇతడు. అవంతి నివాసుడైన గొప్పరాజు. పుడమిలో వీనితో సమానమైన రాజులేడు. మంచిది ఈ రాజును వరించుట. ఏలముందుకు పోదువమ్మ! వీనికి నీవు ప్రియురాలవై క్షిప్రానదియొక్క సైకతభూములలో వస్త్రములతో తయారుచేసిన ఇండ్లలో సుఖక్రీడలనందుదువుగాక," అని వివరించగా, ఆ సుమతి అనుత్తముడనియును ఈరాజును వరించుటఏల? ముందుకుపొమ్మని చెప్పెను. సుమతి మాటను గ్రహించిన దాది, ఉగ్రబాహువును ఉల్లాసపరచక ముందుకు సాగెను. ముందుకు నడచిన దాది, "అంగనామణీ! మరియొక రాజును చూడుము. శ్రేష్ఠుడగు అంగనాథుడు అను పేరుగల ఈ రాజు విదర్భదేశమును ఏలుచున్నాడు. పూర్వము వలే వదులుట తగదు. వీరిని వరించుట భలేబాగు. చిన్నవయస్సుగల స్త్రీ కాముకుడు ఇతడు. దివ్యాభరణాలంకృతుడై ఉన్నాడు. వీనికి నీవు పత్నివై పయోష్ణీ నదిలో జలక్రీడామహోత్సవమునంది, ఆనందింపుము," అనెను.

**ఏనం వృణీష్వ మా చేతి హ్యుపమాత్రా సుచోదితా ।**
**అగ్రే గంతుం సునందాం సా చోదయామాస సంజ్ఞయా ॥ 10**

**తతోఽన్యం నృపతిం నీత్వా సునందా తాం వచోఽబ్రవీత్ ।**
**పశ్యైనం నృపతిం బాలే దేశే మాగధసంజ్ఞకే ॥ 11**

**రాజ్యం కరోత్యయం శ్రీమాన్నామ్నా ఖ్యాతః పరంతపః ।**
**వరయైనం నృపం మాగ్రే గచ్ఛాన్యం పార్థివోత్తమమ్ ॥ 12**

**అస్య త్వ మహిషీ భూత్వా తప్తనీరప్రపూరితే ।**
**బ్రహ్మతీర్థే సదా క్రీడాం హేమంతే భజ భామిని ॥ 13**

**మైనం నృపం వరయేతి శిక్షితా సా సునందయా ।**
**చోదయామాస తాం వృద్ధాం సా తాం నిన్యే నృపాంతరమ్ ॥ 14**

**సునందా బాలికామాహ శృణుష్వ మృగలోచనే ।**
**పశ్యైనం నృపతిం రమ్యం ద్రావిడే విషయే స్థితమ్ ॥ 15**

కంబుకంఠాహ్వాయం శ్రేష్ఠం శాంతిపుర్యాం నివాసినమ్ ।
ఏనం నృపం వృణీష్వాద్య మా వ్రజాన్యం నృపోత్తమమ్ ॥ 16

కాంచిపుర్యామనేన త్వం సర్వతీర్థమనోరమే ।
క్రీడాం భజస్వ విస్తీర్ణే హేమకంజవిరాజితే ॥ 17

విష్ణుం వరదరాజాఖ్యం శివమేకాంబరాహ్వాయమ్ ।
పూజయస్వ సదాఽనేన కంబుగ్రీవనృపేణ చ ॥ 18

వృణీష్వైనం నృపం మాఽద్య సామాన్యనృపవత్త్యజ ।
ఇతి వృద్ధావచః శ్రుత్వాఽగ్రే తాం గంతుం ప్రచోదయత్ ॥ 19

సునందాఽన్యం నృపం నీత్వా సుమతిం వాక్యమబ్రవీత్ ।
పశ్యైనం నృపతిం ముగ్ధే మత్తమాతంగ గామిని ॥ 20

కర్ణాటవిషయస్థం త్వం విజయం పార్థివోత్తమమ్ ।
కమలాస్యం కంజహస్తం కమలాంఘ్రిణముజ్జ్వలమ్ ॥ 21

స్మితాస్యం కంజనయనం విజయాఖ్యంపురస్థితమ్ ।
శృణుష్వ వచనం మేఽద్య వృణీష్వైనం నృపోత్తమమ్ ॥ 22

దాదియొక్క మాటలలో మంచిది, పూర్వము వలె వదలుట. తగదు వీనిని వరించుట బాగుబాగు! అని వ్యతిరేకార్థమైన సునందాసూచనను తెలుసుకుని విముఖియై సునందను ముందుకు పొమ్మని సంజ్ఞచేసెను. అంత ఇంకొక భూపతి వద్దకు వెళ్ళి, అచట దాది సుమతితో, "మానినీ మణీ! మగద దేశాధీశుడైన శ్రీమన్నారాయణుడను మహీపతియగు ఇతనిని అవలోకింపుము. ఇతడు శూరుడు. వీనిని వరించుట మంచిది. ఏల ఇంకొక పార్థివోత్తముని జూతము? వీనికి నీవు ఇల్లాలవై వేడినీళ్ళతో నిండిన బ్రహ్మతీర్థములో హేమంతమున ఎల్లప్పుడు క్రీడించుచుందువు," అని వచించెను. ఆ మాటలలో, "మంచిది, వీనిని వరించుట యేల? ఇంకోక పార్థివోత్తముని జూతము," అనెడు సునందాభిప్రాయమును అంగీకరించిన సుమతి, ఉపాంతరమును అవలోకింప ఉద్యమించెను. అంత ఆ వృద్ధయగు సునంద మరియొక మహీపతి వద్దకు వచ్చి, నిలిచి, బాలామణీ! భావింపుము కంభు కంఠకుడు అను ఇతడు ద్రవిడదేశాధీశుడు. కాంచీపురిలో ఇతని నివాసము. కనక కమల విరాజితమగు సర్వతీర్థములను సరోవరమున ఇతనితోడ విహరింపుము. వరదరాజను విష్ణుమూర్తిని,

ఏకాంబరనాథుడు అను సాంబమూర్తిని ఈ రాజుతో కలసి సేవించెదవు గాక. ఈ నృపుని నీవు వరించుట మేలుకాదు. సామాన్యరాజుగా యెంచి, విడుచుటబాగు," అని వృద్ధావచనములను విని, భావగ్రాహిణియగు భామామణి ముందుకుపోవ ఆ సునందను ప్రేరేపించెను. అట్లే సునంద ఇంకొకరాజువద్దకు పోయి, సుమతితో ఇట్లనెను, "మదగజగామిని! ఈ నరేంద్రుని అవలోకింపుము. ఇతడు కర్ణాటకదేశమున ఉండు విజయుడను రాజు. విజయముగలవాడు, పంకజవక్త్రుడు, కంజనేత్రుడు, కమలచరణుడు, హాసన్ముఖుడు, నీ ఎదుటనున్న ఈ నృపుని వరింపుము.

అస్యత్వం మహిషీ భూత్వా వనేకృష్ణానదీజలే ।
సుఖం నృపేణ క్రీడస్వ మద్వాక్యం శృణు మా వ్రజ ॥ 23

మద్వాక్యం శృణు మేత్యుక్త్వా శ్రుత్వా వాక్యమనుత్తమమ్ ।
వ్రజేతి శూచితా బాలా చోదయామాస తాం పునః ॥ 24

ఏవం నానానృపాణాం చ వర్ణనాని పృథక్ పృథక్ ।
స్తుతిరూపనిషేధాని శ్రుత్వా ద్వ్యర్థాని బాలికా ॥ 25

న బబంధ మనః కస్మిన్నృపతౌ తేషు సా తదా ।
తతస్తాం శిబికాసంస్థాం సునందా చ శనైః క్రమాత్ ॥ 26

అతిక్రమ్య రామమంత్రిబాలకానపి పూర్వవత్ ।
యూపకేతుం శిశుం నీత్వా బాలికాం వాక్యమబ్రవీత్ ॥ 27

శత్రుఘ్నతనయం బాలం యూపకేతుం మనోహరమ్ ।
పితృవ్యం రామతనయద్వయవాక్యానువర్తినమ్ ॥ 28

ఏనం పశ్య బాలికే త్వం సావధానమనా భవ ।
వరయైనం యూపకేతుం మాஉగ్రే గచ్ఛ నృపాత్మజే ॥ 29

మైనం వరయ గచ్ఛాగ్రే వృద్ధయా సేతి చోదితా ।
సునందా చోదయామాసాగ్రే గంతుం సుమతిః పునః ॥ 30

సుబాహుం పుష్కరం తక్షమేవం సా సుమతిః శనైః ।
చిత్రకేతుమంగదం చ త్యక్త్వా సా తం లవం యయౌ ॥ 31

విజయుడను ఈ ఉత్తమునికి నీవు సతివై కృష్ణానదిలో విహరింపుము. నా మాట వినవలదు? ప్రక్కకు పొమ్ము," అని పలుకగా ఆ సుమతి సునందా వచనములలో, "నామాట వినవలదు ఆ ప్రక్కకు పొమ్ము," అని తాత్పర్యమును గ్రహించి ముందుకు పొమ్మని మరలా సూచించెను. ఇట్లే అనేక రాజులయొక్క వర్ణనలను వేరువేరుగా విని, వాటిలో స్తోత్ర రూపములును, నిషేధకములును ఐన రెండు అర్థములు కూడా వాక్యములచే మనసొప్పక అందరిని వదలివెడలెను. అంత ఆ పల్లకిని సునంద తిన్నగా తీసుకుని శ్రీరామ మంత్రి పుత్రులను దాటి వచ్చి, ఉపకేతువనే శత్రుఘ్నుని పుత్రుని ఎదుట నిలిచి, సుమతితో, "సుందరీమణీ! మనోహరాకారుడగు ఇతుడు ఉపకేతువు శత్రుఘ్నస్వామి పుత్రుడు. ఇతనిని జూడుము. ఇతడు పెదతండ్రి కొడుకులగు కుశలవుల వాక్యానుసారము ప్రవర్తించువాడు. బిడ్డా! వీనిని జూచి, సమాహిత చిత్తయగుము. రాజపుత్రీ! ఈ ఉపకేతువును వరించునది. ఎలముందుకు పోవలయును? అని మందలించెను. ఆ సునందా వాక్యమున, "ఈ ఉపకేతువును వరించునది. ఏల ముందుకుపోవలె," అని గూఢార్థమును ఎఱింగి, సుమతి అతనిని ఒప్పక ముందుకుపొమ్మని సునందకు సూచించెను. ఇట్లే శత్రుఘ్నుని జ్యేష్ఠపుత్రుడగు సుబాహువు, భరతుని దివ్యపుత్రుడగు తక్షకుడిని, భరతుని ప్రథమ సుతుని పుష్కరుని, లక్ష్మణుని దివ్య పుత్రుడైన చిత్రకేతుని, లక్ష్మణుని జ్యేష్ఠనందనుడు ఐన అంగదుని వదలి, లవునిమీద కటాక్షములను ఉంచి, నిలిచెను. (31)

**లవార్పితేక్షణాం బాలాం సునందా వాక్యమబ్రవీత్ ।**
**పశ్యైనం బాలికే బాలం లవం శ్రీరాఘవాత్మజమ్ ॥ 32**

**స్త్రీకామం స్వల్పవయసం సీతాలాలితముత్తమమ్ ।**
**వాల్మీకికృపయా లబ్ధవిద్యం రమ్యం కుశానుజమ్ ॥ 33**

**వృణీష్వైనం సుఖేనైవ కంఠేస్య మాలికాం కురు ।**
**కుశాంకే చంపికేయం తే స్వసా యద్వత్ స్థితాఽద్య హి ॥ 34**

**తథా త్వమపి భో ముగ్ధే లవాంకే సంస్థితా భవ ।**
**ఇతి తస్యా వచః శ్రుత్వా సునందాయాః స్మితాననా ॥ 35**

**లవస్య కంఠే హర్షేణ లజ్జయాఽవనతాననా ।**
**సుమతిర్నిజబాహుభ్యామర్పయామాస మాలికామ్ ॥ 36**

తదా నినేదుర్వాద్యాని జుగుస్తే గాయకాస్తదా ।
ననృతుర్వారనార్యశ్చ తుష్టువుర్వందిమాగధాః ॥ 37

భూరికీర్తిర్నృపస్తుష్టో లవాంకే సుమతిం తదా ।
శీఘ్రం నివేశయామాస పరిపూర్ణమనోరథః ॥ 38

తోషమాప రఘుశ్రేష్ఠః సీతా ప్రాసాదసంస్థితా ।
జాలరంధ్రైః సపత్నీక లవం దృష్ట్వా తుతోష సా ॥ 39

తతః సర్వాన్ నృపాన్ పూజ్య భూరికీర్తిః నృపోత్తమః ।
ప్రార్థయామాస వినయ వచనైస్తత్పురతః స్థితః ॥ 40

వివాహకౌతుకం దృష్ట్వా భవద్భిర్గమ్యతామితి ।
తథేతి తే నృపాః ప్రోచుర్యయుర్వాసస్థలాని హి ॥ 41

రామాగ్రే సంగరం కర్తుమసమర్థా గతశ్రియః ।
మ్లానాననా గతోత్సాహాః కామబాణప్రపీడితాః ॥ 42

## సుమతి స్వయంవరమున లవుని వరించుట.

అప్పుడు లవునివద్ద ఆగిన సునంద, సుమతితో, “కామినీమణీ! కటాక్షింపుము మీ శ్రీరామ నందనుడు, అందగాడైన లవుడు అను ఇతడు చిన్నప్రాయము గలవాడు. స్త్రీ కుతూహలచిత్తుడు. జానకీదేవిచే లాలింపబడుచుండువాడు. శ్రీమద్వాల్మీకి యొక్క దివ్యానుగ్రహముచే సకలకళాకుశలుడై యున్నవాడు. కుశుని తమ్ముడు ఇతడే. దివ్యమోహనాంగుడు. సుఖముగా నీవితనిని వరింపుము. ఇతని కంబుకంఠమున రత్నమాలికను అర్పింపుము. కుశుని అంకముమీద నీ సోదరి ప్రకాశించుచుండునట్లు ఇపుడు ఇతని అంకమున నీవును ప్రకాశించుదానవు,” అని నొక్కివక్కాణించెను. అంత ఆ కాంతామణి చిరునగవుతో లవుని కంఠమున నవరత్నమాలికను శిరీషమాలికలవంటి, సుకుమార బాహువులచే అర్పించెను. అపుడచట మంగళమహావాద్యములు మ్రోగెను. గాయకులు గానములను చేసిరి. వారకాంతలు నర్తనమాడిరి. వందిమాగదులు శ్లాఘించుచుండిరి. అపుడు భూరికీర్తి మహాపరిపూర్ణ మనోరథుడై వచ్చి ఆ సుమతిని, లవుని తొడపై త్వరగా కూర్చుండబెట్టి, అమందానందమును పొందెను. నిత్యానందమూర్తియగు శ్రీరాముడు సంతసించెను. మేడమీద ఉన్న జానకీదేవి జాల రంధ్రములనుండి లలనా సమేతుడగు లవుని జూచి, హర్షించెను. (39)

## కుశ, లవుల వివాహమహోత్సవ వర్ణన.

పిదప ఆ భూరికీర్తి మహారాజు సమస్త రాజేంద్రులను జూచి, సంపూజించి, వారిఎదుట నిలిచి, సవినయముగా, "మహారాజులారా! ఈ వివాహ మహోత్సవమును సాంతముగాజూచి, నన్ను ఆనందపరచి, సంతుష్టులై వెడలవయునని వేడుకొనుచున్నాను," అని సంప్రార్థించెను. వారందరును అట్లేఅని అంగీకరించి, శ్రీరాముని ఎదుట యుద్ధముచేయనేరక నిస్తేజస్కులును, నిరుత్సాహులును, రామబాణ ప్రపీడితులును, తలలు ఎత్తుకొనలేక తమతమ విడిదిండ్లను చేరిరి.

రామోఽపి బంధుభిర్బాలైర్యయౌ వాసస్థలం ముదా ।
అథాపరే దినే రామం భూరికీర్తిః సమాయయౌ ॥ 43

పురోధసోపవిష్టః సన్నత్వా రామం వచోఽబ్రవీత్ ।
ద్రష్టవ్యో లగ్నదివసః సుముహూర్తః సుఖావహః ॥ 44

మామంగీకురు రామాద్య త్వత్పాదాశ్రయకాముకమ్ ।
ఉభయోస్త్వం మంటపయోః కార్యాణ్యాజ్ఞాపయ ప్రభో ॥ 45

తథేతి రాఘవశ్చోక్త్వా వసిష్ఠం చోదయత్తదా ।
సోఽపి రామాజ్ఞయా జ్యోతిః శాస్త్రజ్ఞః పరివేష్టితః ॥ 46

ముహూర్తం కథయామాస పంచమేఽహని రాఘవమ్ ।
తతస్తుష్టో భూరికీర్తిర్గణేశం లగ్నపత్రికామ్ ॥ 47

సంపూజ్య గణకాన్ సర్వాన్ పండితాన్ వైదికాదికాన్ ।
బంధుపుత్రాదిభిః సర్వైః శ్రీరామం పూజయత్తదా ॥ 48

నత్వా రామం గృహం గత్వా చకార మంటపాదికమ్ ।
రామాజ్ఞయా లక్ష్మణోఽపి చకార మంటపాదికమ్ ॥ 49

తదా వటపురీ రమ్యా పతాకాధ్వజతోరణైః ।
పురుషోత్తమరాజధానీ రేజే సాగరరోధసి ॥ 50

తతో ముహూర్తసమయే వధూచ్ఛిష్టాం నిశాం కుశమ్ ।
లవం చ లిప్య తైలాక్తం సీతాద్యా మాతరస్తదా ॥ 51

**కరకుంభాంశ్చతుర్దిక్షు జలపూర్ణాన్ సదీపకాన్ ।**
**సంస్థాప్య స్నాపయామాసుర్మహావాద్యపురః సరమ్ ॥ 52**

**తైలాభ్యంగం నిశాయుక్తం సీతాద్యాః స్వీయబాలకైః ।**
**సహైవ చక్రురానందపూరితా రుక్మభూషితాః ॥ 53**

శ్రీరామచంద్రస్వామి కూడా తన తమ్ముళ్ళతోను, పుత్రులతోను, తన రాజమందిరములకు వచ్చెను. ఆ మరునాడు భూరికీర్తి మహారాజు తమ పురోహితుని వెంటబెట్టుకుని వచ్చి, శ్రీరామ సన్నిధిలో నమస్కరించి, సుఖాసీనుడై, "స్వామీ! మంచి సుముహూర్తమును, సులగ్న దినమున కటాక్షించి ఆనందించవలయును. శ్రీరామప్రభూ! నన్నిపుడు నీ చరణారవింద కింకరునిగా అంగీకరింపుము. వియ్యాలవారి ఇరువురియొక్క మంగళమంటపములలోను, నీవే కర్తవ్యములను ఆజ్ఞాపించుచుండ వలయును," అని ప్రార్థించెను. అట్లే అని వశిష్ఠమహామునీంద్రుని ఆ పనిలో నియమించెను. అతడు అంతట జ్యోతిశ్శాస్త్ర పారీణులగు దైవజ్ఞులతో పరివేష్ఠితుడై నేటికి ఐదవనాడు సుముహూర్తదినమని నిశ్చయించి చెప్పెను. అంత ఆనందమునందిన భూరికీర్తి, శ్రీ మహాగణపతిని లగ్నపత్రికను పూజించి, గణకులను, పండితులను, వైదికమండలిని సత్కరించి, సుత సోదర సమేతుడైన శ్రీరామచంద్రస్వామిని సేవించి, నమస్కరించి, అనుజ్ఞనంది నిజమందిరమునకు వచ్చి, మంటపాలంకరణాది కార్యములను ఆరంభించెను. అచ్చట లక్ష్మణుడును, శ్రీరామాజ్ఞానుసారముగా మండపాదులను మనోహరముగా నిర్మింపజేసెను. అప్పుడు సముద్రముతీరమునందలి వటపురి పురుషోత్తముని రాజధానియైన చిత్రధ్వజ తోరణ పతాకాలంకృతమై, మంగళ మహోత్సవములచే రారాజించు చుండెను. అంత ముహూర్త సమయము రాగా సీతాదేవ్యాది ముత్తైదువులు కుశలవులకు సువాసిని పూజాశేషితములైన పసుపు మొదలగు మంగళలేపనములతో తైలాభ్యంగనము గావించి, నలుదిశలలోను నీళ్ళునింపిన కలశములను దీపములతో సంస్థాపించి, మంగళవాద్యములు మ్రోగుచుండగా, పరిమళజలములచే దివ్యమంగళస్నానములను చేయించుచు, జానక్యాది రాజా మహిషులను ఆ బాలకులతో హరిద్రాంకిత తైలాభ్యంగన మంగళ స్నానములను చేసుకొనిరి. అట్లే ముదముతో ఆ శ్రీరామాదులును అభ్యంగన మంగళస్నానములు చేసిరి.

**అభ్యంగపూర్వకం సస్నుస్తే రామాద్యాస్తదా ముదా ।**
**సమాహూయ తతః సీతాం ముక్తానాం స్వస్తికోపరి ॥ 54**

**వసిష్ఠో మునిభిర్యుక్తః శిశుభ్యాం రాఘవేణ హి ।**
**గణపార్చాం కారయిత్వా పుణ్యాహాదిత్రయం క్రమాత్ ॥ 55**

దేశాచారాన్ కులాచారాన్ ఇష్టదేవీం ప్రపూజ్య చ ।
కారయామాస విధివత్ ప్రతిష్ఠాం దేవకస్య చ ॥ 56

తదా జనకనందిన్యా రజనీకుంకుమాన్వితే ।
విరేజతుః స్త్రీకదంబస్థితాయాః పదపంకజే ॥ 57

సీతాద్యాస్తాః స్త్రియః సర్వా హరిత్పీతారుణైర్వరైః ।
హేమతంత్వంకితైర్వస్త్రైర్విరేజుర్మంటపాంగణే ॥ 58

తతః సమాయయుః సర్వే ముదా తత్ర మునీశ్వరాః ।
స్వయంవరోత్సవే పూర్వం నాగతా యే సహస్రశః ॥ 59

శ్రుత్వోత్సాహం వివాహస్య కుశస్య చ లవస్య తే ।
తాన్ సర్వాన్ రామచంద్రోఽపి వస్త్రాభరణధేనుభిః ॥ 60

పూజయామాస విధివత్ సీతయా లక్ష్మణాదిభిః ।
భూరికీర్తిః నృపైర్యుక్తో మహావాద్యపురస్సరమ్ ॥ 61

స్వయం కుశలవౌ గేహం నేతుకామః సమాయయౌ ।
మంటపే పూజయామాస వీరో రాజ్ఞః సుతస్తదా ॥ 62

కుశం తథా లవం చాపి కనీయాన్ భూరికీర్తిజః ।
హేమతంతూద్భవైర్దివ్యైర్వస్త్రైరాభరణాదిభిః ॥ 63

పిమ్మట వశిష్ఠమహాముని మునీంద్రులతో శ్రీరామచంద్రసన్నిధానమున కుశలవులను కూర్చుండబెట్టుకుని, శ్రీమహాగణపతిని పూజించి, పుణ్యాహవాచనము, నాందిశ్రాద్ధము, నవగ్రహపూజ అను ఈ మూడు కర్మలను ఆచరించుచు, దేశాచారములను, కులాచారములను అనుసరించి, ఇష్టదేవతలను ప్రార్థించి, కులదేవతను అర్చించి, విధివిధానముగా దేవతామూర్తిని ప్రతిష్ఠచేసెను. అపుడు జానకమ్మ, మునిపత్నులు మొదలైన సువాసినులకందరికిని పసుపు, కుంకుమలనిచ్చి, వారినడుమ కూర్చుని యుండగా సీతాదేవియొక్క కుంకుమ, హరిద్రాంకిత సుకుమార చరణారవిందములు రాజించుచుండెను. మరియు ఆ మైథిలి మొదలుగా గల మానినీ మణులు ఎఱుపు, పసుపు, పసరువన్నెల బంగారు అంచు చీరలను అలంకరించుకుని, మంగళమంటపము

నడుమ మంగళదేవతలవలె వెలుగుచుండిరి. స్వయంవర సమయమున రాకయుండిన మునీంద్రులు వేలకొలదిగా కుశ, లవ కళ్యాణ మహోత్సవములను విని, కుతూహలముతో రాగా వారినందరిని శ్రీ సీతా లక్ష్మణులతోను, శ్రీరామచంద్రుడు వస్త్రాభరణ, ధన, కనక, వస్తు, వాహనాది, గోవులను ఇచ్చి, సత్కరించి, సంతోషపరచుచు చక్కగా ఆరాధించెను. నిరంతరము దివ్యవాద్యములు, భవ్యవాద్యములచే కర్ణానంద ప్రదములుగా ఉండెను. తరువాత భూకీర్తి భూపతి ఇతర రాజలోకములతో మంగళవాద్య పురస్సరములుగా కుశలవులను తన రాజమందిరమునకు పిలచుకుని పోవుటకై ఏతెంచెను. అపుడు ఆ శ్రీరామమంటపమున భూరికీర్తి యొక్క జ్యేష్ఠపుత్రుడు కుశునికి వరపూజచేసెను. భూరికీర్తియొక్క కనిష్ఠపుత్రుడు లవునికి వరపూజచేసెను. అపుడు కుశలవులు మామలిచ్చిన మంగళ దివ్య కనక వస్త్రములచే అలంకృతులై పెండ్లికొడుకులు కన్నులపండుగగా ఉండిరి.

**తదా విరేజతుర్బాలౌ తథా తేஉప్యంగదాదయః ।**
**తతస్తౌ వారణేంద్రస్థౌ దివ్యచామరవీజితౌ ॥ 64**

**పశ్యంతౌ నర్తనాన్యగ్రే వారస్త్రీణాం స్మితాననౌ ।**
**శృణ్వంతౌ వాద్యఘోషాంశ్చ వర్ణితౌ మాగధాదిభిః ॥ 65**

**సీతాదిభిర్వారణీషు సంస్థితాభిస్తథా పథి ।**
**ప్రాసాదోపరి సంస్థాభిర్నారీభిః పుష్పవృష్టిభిః ॥ 66**

**హరిద్రాపీతధాన్యైశ్చ మాంగల్యైర్మౌక్తికైరపి ।**
**లాజాభిర్హేమపుష్పైశ్చ వర్షితావీక్షితౌ ముహుః ॥ 67**

**జగ్మతుర్బాలకావేవం పశ్యంతౌ కౌతుకాని హి ।**
**దదర్శతుర్వాటికాశ్చ పుష్పైర్వృష్టివినిర్మితాః ॥ 68**

**తథా కృత్రిమ వృక్షాంశ్చ పతాకాశ్చ ధ్వజాంస్తథా ।**
**తథౌషధిర్భవాన్ వృక్షాన్ వహ్నిస్పర్శావిదీపితాన్ ॥ 69**

**శకటస్థానౌషధీభిః పూరితాన్ కృత్రిమాన్ జనాన్ ।**
**తథా వ్యాఘ్రాదికాన్ హింస్రా నోషధీభిః ప్రపూరితాన్ ॥ 70**

**తటిత్సమానాన్ గగనే ప్రాకారానౌషధీభవాన్ ।**
**కేకిచక్రోపమాదీంశ్చ చంద్రజ్యోత్స్నాస్తు కృత్రిమాః ॥ 71**

**ఏవం దదర్శతుర్నానాకౌతుకాని నృపాత్మజౌ ।**
**తతస్తౌ భూరికీర్తేశ్చ గత్వా మంటపముత్తమమ్ ॥ 72**

**నానామహోత్సవైర్బాలౌ చామరచ్ఛత్రమండితౌ ।**
**అవరుహ్య గజేంద్రాభ్యాం తస్థతుర్మంటపాంగణే ॥ 73**

అట్లే అంగదాది రాజపుత్రులందరును సాలంకారులై ఆనందముగా అచట ముచ్చటలాడుచుండిరి. అంత ఆ కుశలవులు గజరాజములను ఎక్కి, ఛత్ర, చామరాది రాజోపచారములను అందుచు, వారకాంత నాట్యములను పరికించుచు, శుభ వాద్యముల సుస్వరములను ఆకర్ణించుచు, హాసన్ముఖులై వందిమాగదులు కీర్తించుచుండగా, ఆడ ఏనుగులను ఎక్కిన సీతాది పట్టమహిషులతోడ వటపురి రాజమార్గమున వచ్చుచుండిరి. అప్పుడు పరిగెలపై ఉండి పురస్త్రీలు పుష్పములను, పసుపు అక్షతలను, ముత్తెములను, లాజలను, కనక కుసుమములను వర్షించుచు మిక్కిలి మక్కువతో నిక్కి, నిక్కి చూచుచుండిరి. కుశలురైన ఆ కుశ లవులు దారివేడుకలను చూచుచుండిరి. అవి ఏవనిన- రాజమార్గము, ఇరువైపులలోను పుష్పవృక్ష వాటికలు కల్పింపబడియుండె మరియు అచట కృత్రిమ పుష్పవాటికలు, సహజ పుష్పవాటికలతో కలసి, వాటికి వీటికి విశేషముతో చనునట్లు రాజించుచుండెను. వింతవింతలైన చిత్రధ్వజ తోరణ పతాకాదులు విరాజించుచుండె. వెలిగించిన మాత్రమున తేజో వనములను చూపునట్టి నల్లమందుచే చేయబడిన వృక్షముల నడుమనడుమ నేత్రానందదాయకములై ఉండె. బండ్లుపోవుచుండుట, వాటిపై జనులు సంచరించుచుండుట, అట్లే నడుమ నడుమ వ్యాఘ్రాది జంతువులు ఆర్భాటముచేయుట, అంతయును క్షణమాత్రమున బయలువెడలుట, అంతలో అంతర్హితమగుట, ఇట్లు నల్లమందు బాణవేడుకలు బాగై బరగుచుండె. విగలు వత్తులు, వెన్నెల వత్తులు, మించువత్తులు, నెమలివత్తులు మొదలైన వెలుగు వత్తులు వెలుగుచుండె. గగన ప్రాకారములను, నభోవృక్షములను, వ్యోమలతలను చూపునట్టి ఆకాశబాణములు ఆనందావహములై వెలుగుచుండె. ఇట్లు పలు మహోత్సవములతో ఛత్ర చామరాది రాజోపచార రారాజితులైన కుశలవులు వివిధ వినోదములను విలోకించుచు, భూరికీర్తి నిర్మిత వివాహ మంగళ మండపమువద్దకు వచ్చి, గజేంద్రులనుండిదిగి, మండప సభామధ్యమున వేదికపై సుఖాసీనులైరి.

**మధుపర్కవిధానాని విష్టరాదీని వై క్రమాత్ ।**
**తయోర్గురూ చక్రతుస్తౌ బ్రాహ్మణైః పరివేష్టితౌ ॥ 74**

**తతో వధ్వోః పూజనం చ సీతయా రఘునందనః ।**
**చకార గురుణా యుక్తస్తదా స మంటపాంగణే ॥ 75**

**తతో లగ్నముహూర్తే తం కుశం చంపికయా గురుః ।**
**తథా లవం సుమత్యాపి పృథగ్వేదికయోస్తదా ॥ 76**

**కృత్వా సుసంస్థితౌ చోభౌ దంపత్యోరంతరే పటో ।**
**ధృత్వోభయోః పృథక్చిత్రౌ నూతనౌ హేమతంతుజౌ ॥ 77**

**నానామంగళఘోషాంశ్చ మునిభిశ్చక్రతుర్ముదా ।**
**ఆసన్సర్వే జనాస్తూష్ణీం శృణ్వంతో మంగళస్వనాన్ ॥ 78**

**ఇతి శ్రీశతకోటిరామచరితాంతర్గతే, శ్రీమదానందరామాయణే, వాల్మీకీయే, ఆదికావ్యే, వివాహకాండే, చంపికాసుమతిస్వయంవరవర్ణనం నామ, తృతీయః సర్గః ॥**

వారికి బ్రాహ్మణ పరివారముతో పరివేష్ఠింపబడిన పురోహితాచార్యులు మంగళపీఠములను ఇచ్చి, మధుపర్కాది సత్కారములను విధిప్రకారముగా ఆచరించిరి. అంత ఆ శ్రీరాముడు సీతాదేవితో వశిష్ఠులవారు చెప్పినట్లు ఆ మండప ప్రాంగణమున వధూరత్నములైన చంపిక, సుమతులను సత్కరించిరి. అపుడు వశిష్ఠుడు వివాహ లగ్నముహూర్తమునకు సమ్ముఖముగా చంపికా–కుశుని, సుమతీ–లవులను వేర్వేరు వేదికలపై నిలిపి, వారినడుమ కనకకాంతుల కమనీయములైన దివ్య వస్త్రములను తెరవేసి పట్టుకొనిరి. వివిధ మంగళవాద్యములు, విశ్వజనానందముగా వాయింపబడుచుండెను. మునీంద్రులందరును స్వస్తివాచనములను అమోఘములుగా ఉచ్చ స్వరములతో వచించుచుండిరి. సమస్త జనులును సుమంగళ సుస్వరములను సుఖముగా ఊరకే వినుచుండిరి.

***ఈ విధముగ శ్రీమద్వాల్మీకి మహర్షిచే రచింపబడిన, శ్రీశతకోటిరామచరితాంతర్గత శ్రీమత్ ఆనందరామాయణములో, ఆరవదైన వివాహకాండలో చంపికా, సుమతి స్వయంవరమును వర్ణించే, 3వ సర్గ ముగిసినది.***



# 4వ సర్గ

కుశ, లవుల వివాహఘట్టము

శ్రీరామదాస ఉవాచ

శ్రీసీతా రఘునాయకశ్చ గిరిజా శంభుర్గణేశస్తథా
నందీషణ్ముఖలక్ష్మణౌ చ భరతః కంజోద్భవః శత్రుహా ।
సర్వే తే మునయః సురాశ్చ దితిజాస్తీర్థాదినద్యో నదా
దిక్పాలాః శశిభాస్కరౌ చ హనుమాన్ కుర్వంతు వో మంగళమ్ ॥ 1

తదేవ లగ్నం సుదినం తదేవ
తారాబలం చంద్రబలం తదేవ ।
విద్యాబలం దైవబలం తదేవ
సీతాపతేర్యత్ స్మరణం విధేయమ్ ॥ 2

ఏవం మంగళఘోషైశ్చ నానావాద్యపురః సరమ్ ।
తతస్త్వంతః పటౌ ముక్త్వా ఓం పుణ్యాహమితి స్మరన్ ॥ 3

తయోస్తే పాణిగ్రహణవిధానం విధిపూర్వకమ్ ।
లాజాహోమాదికం సర్వం చక్రుర్మంగళపూర్వకమ్ ॥ 4

## కుశలవులయొక్క వివాహవిధాన మహోత్సవము.

శ్రీరామదాసు ఇట్లుచెప్పెను, "శ్రీసీతా, లక్ష్మణ, భరత, శత్రుఘ్న, హనుమత్సమేత శ్రీరామచంద్రుడును, శ్రీపార్వతీ, విఘ్నేశ్వర, నంది, షణ్ముఖ సమేత చంద్రశేఖరుడును, వాణీ హిరణ్యగర్భుడును, ఇంద్ర, అగ్ని, యమ, నిఋఋతి, వరుణ, వాయు, కుబేర, ఈశానులును దిక్పాలకులును, ముప్పదిమూడు కోట్ల దేవతలును, సూర్య చంద్రులును, సమస్త మునీంద్రులును, సకల నదీతీర్థదేవతలును, అందరును మీకు మంగళప్రదులుగా ఉందురుగాక. సాక్షాత్ లక్ష్మీపతిని స్మరించుట ఏది కలదో అదియే మంచిలగ్నము, నక్షత్రబలము, చంద్రబలము, విద్యాబలము, దైవబలమునై యున్నదిగాన శ్రీజానకీ రమణుని భజింపవలయును." అని ఇట్లు మంగళవాక్యములను పలికి, వివిధ శుభవాద్య సముద్ఘోషలతో

వస్త్రముతో కల్పించిన తెరను తొలగించి స్వస్తివచనమును ఒనర్చి, వారిరువురిని విధిపూర్వకముగా పాణిగ్రహణ విధానము గావించి, లాజహోమాదిక సమస్త కళ్యాణ శుభకర్మలను ఆచరించిరి.

తదా మహావాద్యఘోషా నినేదుర్మంటపాంగణే ।
ననృతుర్వారనార్యశ్చ తదామాగధవందినః ॥ 5

జగుర్మంగళగీతాని తుష్టువుస్తే మహాస్వనైః ।
తదా దానాన్యనేకానీ చక్రతుస్తౌ నృపోత్తమౌ ॥ 6

భురికీర్తిరామచంద్రౌ మహాతోషప్రపూరితౌ ।
అథ తౌ బాలకౌ వధ్వౌ నిజకట్యోర్నివేశ్య వై ॥ 7

సీతోర్మిలాదిభిః స్త్రీభిర్జగ్మతుర్భోజనంగృహమ్ ।
తత్ర గౌరీహరౌ పూజ్య చక్రతుశ్చాగ్రసించనమ్ ॥ 8

తతః కుశశ్చంపికయా సుమత్యా స లవోఽపి చ ।
చక్రతుర్భోజనం చోభౌ స్త్రీభిః సర్వత్ర వేష్టితౌ ॥ 9

మాత్రా సహోపనయనే వివాహే భార్యయా సహ ।
అన్యేన నైవ భోక్తవ్యం భుక్తం చేత్పతితః స్మృతః ॥ 10

రామోఽపి బంధుభిః పౌరైః సుహృద్భిః పార్థివోత్తమైః ।
చకార భోజనం భూరికీర్తేః సద్మని వై ముదా ॥ 11

ఏవం సీతాఽపి నారీభిశ్చకార భోజనం తదా ।
భూరికీర్తేః స్నుషాభిః సా ప్రార్థితా వందితా ముహుః ॥ 12

తతో నానాసముత్సాహాన్ భూరికీర్తేశ్చకార సః ।
అథ తౌ బాలకౌ రమ్యౌ స్త్రీవాక్యైర్మాతృసన్నిధౌ ॥ 13

స్వశ్వశ్రూసన్నిధౌ చాపి స్త్రీభిః సర్వత్ర వేష్టితౌ ।
స్వస్వపత్న్యా పదయోః శిరోభ్యాం నమనం ముహు: ॥ 14

అపుడు పెండ్లిపందిరి నడుమ దివ్యమంగళ మహావాద్యఘోషలు కర్ణపేయములుగా ఉండె. నటీ నర్తనములు నయనానంద జనకములైనవి. వందిమాగదులు వందన గీతమాలికలు మంగళకరములై ఉండ ఉచ్చైస్వరముతో స్తుతులను ఉచ్చరించుచుండిరి. అపుడా రాజేంద్రుడగు భూరికీర్తియును రాజరాజేంద్రుడగు శ్రీరామచంద్రుడును, మహానందభరితులై వివిధ దానములను ఒసంగిరి. అంత ఆ కుశ-లవులు, చంపికా-సుమతులను వధువులను తమ నడుములమీద ఎత్తుకుని, సీత, ఊర్మిళ, మాండవి, శ్రుతకీర్తి మొదలగు స్త్రీ పరివారములతో భోజన గృహములకు వెడలిరి. అచట పార్వతీ పరమేశ్వరులను పూజించి, ఆమసించనము అను మామిడి చిగుళ్ళచే వసంత మంగళ ఉదకమును ఒండొరులు విధివిధానముగా చల్లుకొను కళ్యాణమహోత్సవమును సలిపిరి. అంత కుశుడు-చంపికతోను, లవుడు-సుమతితోను అంతట మగువలు నిండియుండు నడుమ వినోద భోజనము చేసిరి. ఉపనయనమున తల్లితోను, వివాహమున పత్నితోను భుజింపవలయును గాని, ఇతరులతో ఎన్నడును భుజింపరాదు. అట్లు భుజించినేని పతితుడగునని స్మృతి శాసనము. శ్రీరామచంద్రుడు తమ్ములతోను, పురజనులతోను, మిత్రులతోను, రాజేంద్రులతోను, భూరికీర్తి మందిరమున ఆనందభోజనమును చేసెను. అట్లే భూరికీర్తి యొక్క కోడండ్రచే పలుమార్లు ప్రార్థింపబడి, నమస్కరింపబడి, సీతాదేవియును ఇతర నారీబృందముతో భుజించెను. అంత ఆ భూరికీర్తి వినోదావహములైన వివిధ మహోత్సవములను విశేషముగా చేయించెను. పిమ్మట ఆ నూతన వరులు ఇరువురును అత్తల ఎదుటను, తల్లుల ఎదుటను, స్త్రీల సరస సల్లాపములచే నారీబృందము నడుమన ఆనందిత అంతరంగులై తమతమ పత్నుల పాదములకు పలుమార్లు ప్రణయవందనములు ఆచరించిరి.

**చక్రతుస్తోషసంపూర్ణే తే తవాపి స్మితానన ।**
**వధూవరాశ్చ తే సర్వే నిశాపీతా విరేజిరే ॥ 15**

**కుంకుమాంకితపాదౌ తే దదతుర్వల్లభాంకయోః ।**
**ఏవం నానాసముత్సాహైరతిక్రాంతం దినత్రయమ్ ॥ 16**

**చతుర్థే దివసే రాత్రౌ వంశపాత్రవిరాజితైః ।**
**దీపైర్నీరాజితౌ చోభౌ బాలకౌ తౌ విరేజతుః ॥ 17**

**తతస్తౌ బాలకౌ పత్న్యౌ స్వస్వపృష్ఠే నివేశ్య చ ।**
**చక్రతుస్తాండవం నృత్యం కుశలౌ మంటపాంగణే ॥ 18**

**మాతృశ్వశ్రూరాదికాసు పరయత్సు చ సాదరమ్ ।**
**పారిబర్హీం భూరికీర్తిః కుశాయ చ లవాయ చ ॥ 19**

**దదౌ తుష్టమనాః శీఘ్రం రామసంబంధహర్షితః ।**
**నియుతాన్వారణేంద్రాంశ్చ శిబికాశ్చాపి తన్మితాః ॥ 20**

**తురంగాన్పంచనియుతం నియుతాన్ స్యందనాన్ దదౌ ।**
**ద్వాభ్యాం పృథక్ పృథక్ పౌత్రీధవాభ్యాం ద్రవ్యపూరితాన్ ॥ 21**

**నానాలంకారవాసాంసి గా దాసీః సేవకాంస్తథా ।**
**దదౌ తాభ్యాం భూరికీర్తిర్యేషాం సంఖ్యా న విద్యతే ॥ 22**

**ఏవం సమ్మానితస్తేన శ్రీరామో భూరికీర్తినా ।**
**సపత్నీకాభ్యాం పుత్రాభ్యాం గజస్థాభ్యాం సమన్వితః ॥ 23**

**సీతయా బంధుభిః పౌరైః సుహృద్భిర్భ్రాతృభిర్నృపైః ।**
**పూర్వవదుత్సవాద్యైశ్చ స యయౌ స్వీయమంటపమ్ ॥ 24**

**వటపుర్యాం తతో రామో మాసమేకం నినాయ సః ।**
**చకార సీతయా క్రీడాం నౌకాసంస్థో మహోదధౌ ॥ 25**

ఆ నూతన పెళ్ళికుమార్తెలు తమ భర్తల పాదారవిందములకు భక్తితో, ఆనందముతో నమస్కరించుచుండిరి. వధూవరులను అచట సతీమణులను వేకువజామున లేపుచుండిరి. నలుగిడిన కుంకుమాలాక్షారుణ చరణారవిందములను ఆ వధూమణులు వరరత్నముల తొడలపై ఇడుచుండిరి. ఇట్లు ప్రేమ ప్రపంచ నవనాటక రంగభూమి యన ఆ వివాహమంగళమందిరమున ఉత్సాహక్రీడ పరంపరలచే అందరు ఆనందితుల హృదయార విందులై ఉండ, మూడు దినములు గతించెను. పిదప నాలుగవనాడు రాత్రి వంశపాత్రములలో దివ్య దీపారతులై ఎత్తబడిన కుశలవులు రారాజించుచుండిరి. అంత ఆ రాజకుమారులు తమ పత్నులను తమమీద ఎక్కించుకుని మంగళమంటప మధ్యమున నాట్యవిధులై, తల్లులు అత్తలు మొదలైన బంధువర్గములు వారందరును బంధురముగా నిరీక్షించుచు, ఆనందించుచుండగా నర్తనములు ఆడిరి. అపుడు మహారాజు శ్రీరామ సంబంధము కలిగినదని సంతోషిత స్వాంతుడై కుశలవులకు ఐదు లక్షల గుఱ్ఱములను, లక్షపల్లకీలను,

లక్ష ఏనుగులను, లక్షరథములను కట్నకానుకలగా ఇచ్చెను. ఇట్లు భూరికీర్తి మహారాజు తన మనుమరాండ్ర భర్తలకు ఇరువురికిని వేరువేరుగా ఉపభోగ వస్తుపూర్ణములగు వాహనములను, దివ్య అమూల్య కనక, పట్టువస్త్రములను, గో, దాసీ, సేవకాదులను మరియు విశేషములైన రాజభోగ్య సద్వస్తువులను అపారముగా అర్పించెను. ఆ కట్నకానుకలను లెక్కించుట ఎవని తరము.(22)

## శ్రీరాముడు సపరివారముగా తూర్పు సముద్రములో క్రీడించుట.

ఇట్లు భూరికీర్తి మహారాజుచే సమ్మానింపబడి, అటువెనుక దండధారిణియైన సునంద అనుపేరుగల దాది పల్లకిలో వెళ్ళుచుండెడి సుందరియగు సుమతికి ఈశాన్యదిగ్భాగమునుండి ఉత్తర పార్శ్వమును గల రాజులనందరిని చూపుచు, ఒక రాకుమారుని ఎదుటనిలిచి, సుమతితో, “నామాట వినుము నారీమణీ! ఉగ్రబాహువను పేరుగల శ్రీసీతాయుత రామచంద్రస్వామి, చంపిక సుమతులతో కూడి, ఒంపు సొంపులతో ముచ్చటగానుండి గజారూఢులైన కుశలవులను పిలచుకుని తమ్ములతోను, తత్ పుత్రులతోను, మిత్రులతోను, రాజసమూహముతోను, యథాపూర్వముగా మంగళమహావాద్యాది ఉత్సవ పరంపరలనంది, నిజ శుభమండపమునకు విచ్చేసెను. అంత ఆ వటపురిలో ఒకనెల వసించి యుండెను. అపుడు శ్రీరామచంద్రుడు సీతాసమేతుడై మేడనెక్కి, పూర్వసముద్రమున విహరించుచుండెను. (25)

**తతః స్నుషాభ్యాం శ్రీరామో యయౌ నిజపురీం సుఖమ్ ।**
**అయోధ్యాయాం విజయోఽపి శ్రుత్వా రామం సమాగతమ్ ॥ 26**

**యః పుర్యా రక్షణార్థం హి రామేణాజ్ఞాపితః పురా ।**
**స పురీం శోభయామాస పతాకాధ్వజతోరణైః ॥ 27**

**వారణేంద్రం పురస్కృత్య తూర్యనృత్యపురః సరమ్ ।**
**విజయో రామసచివో రామం ప్రత్యుద్యయౌ జవాత్ ॥ 28**

**అథో నదత్సు వాద్యేషు రామో బాలైః స్నుహృజ్జనైః ।**
**స్నుషాభ్యాం సీతయా బంధుపత్నీభిర్భ్రాతృభిః పురీమ్ ॥ 29**

**వివేశ సేనయా పౌరైః పశ్యన్నృత్యాదికం పథి ।**
**తదా వేశ్యా ననృతుస్తుష్టువుర్వందిమాగధాః ॥ 30**

స్వస్వపత్నీయుతౌ బాలౌ వరవారణయోః స్థితౌ ।
తదా విరేజతుర్మార్గే స్త్రీభిః పుష్పైః సువర్షితౌ ॥ 31

ఏవం రామో గృహం గత్వా బాలాభ్యాం స్వీయసద్మని ।
కారయిత్వా రమార్చాం స దదౌ దానాన్యనేకశః ॥ 32

తదాఽలంకారవస్త్రాద్యైః సంపూజ్య రఘునందనః ।
సుహృదః సకలాన్పౌరానిష్టాన్ జానపదాన్నృపాన్ ॥ 33

ఆచండాలాదికాన్సర్వాన్ సంతుష్టానకరోన్ముదా ।
తతః స భూరికీర్తేస్తాత్ మంత్రిణః సైన్యసంయుతాన్ ॥ 34

సంపూజ్య ప్రేషయామాస స్వదేశం రఘునందనః ।
తతః సర్వాన్ జానపదాన్ సుహృదశ్చ ప్లవంగమాన్ ॥ 35

విభీషణాదికాంచజ్ఞాం గంతుం స్వస్వస్థలం దదౌ ।
తతః సర్వే రాఘవం తే వస్త్రాభరణవాహనైః ॥ 36

స్వస్వకోశైశ్చ సంపూజ్య నత్వా రామం యయుర్ముదా ।
స్వం స్వం దేశ నిజైః సైన్యైః శ్రీరామేణాతిమానితాః ॥ 37

## శ్రీరాముడు కొడుకులు, కోడండ్రతో అయోధ్యకు వచ్చుట.

పిదప శ్రీరాముడు కోడండ్రను తీసుకుని అయోధ్య రాజధానికి వచ్చెను. ఆ పురిలో నగర రక్షణకై స్థాపింపబడియుండిన విజయుడను మంత్రి శ్రీరాముని రాకను విని, చిత్రధ్వజ తోరణ పతాకాలచే దివ్యాలంకారము చేయించెను. దివ్యగజమును పురస్కరించుకుని తూర్య, నృత్య, వాద్యములతో శ్రీరామ మంత్రియైన విజయుడు జనమున నెదుర్కోలు వెడలెను. అంత మంగళవాద్యములు మ్రోగుచుండ శ్రీరాముడు సీతాసమేతుడై క్రొత్త పెళ్ళికొడుకులతోను, క్రొత్త పెండ్లికూతుళ్ళ కోడండ్రతోను, తమ్ములతోను, తమ్ముల పత్నులతోను, పౌరులతోను, సైన్యములతోను, దారిలో నర్తనాదులను అవలోకించుచు అయోధ్య పట్టణమున ప్రవేశించెను. వారకాంతలాడిరి. వందిమాగదులు స్తుతించుచుండిరి. కుశలవులు నిజకాంతలతో ఏనుగులమీద వచ్చుచు, పురాంగనల పూలవానలనంది,

ప్రకాశించుచుండిరి. ఇట్లు శ్రీరాముడు నిజరాజమందిరమున ప్రవేశించి, కొడుకులచే లక్ష్మీపూజ చేయించి, అనేక దానములను ఇచ్చెను. అపుడు రఘునందనుడు నాగరికులను, దేశమువారిని, మిత్ర వర్గమువారిని, రాజులను దివ్యాలంకార వస్త్రములచే సత్కరించి, సంతోషముతో ఆచండాలాంత ముగా ప్రజలనందరిని ఆనందపరచెను. అంత ఆ భూరికీర్తి రాజును, వారి మంత్రులను, సైన్యములతో చక్కగా సమ్మానించి, వానిదేశమునకు పంపించెను. అంత పెండ్లికి వచ్చియున్న వారందరిని, దేశస్థులను, మిత్రులను, కపీంద్రులను, విభీషణాదులను, వారివారిదేశములకు జనుటకు ఆజ్ఞనొసంగి సమ్మానించెను. అంత వారందరును తమతమ పెట్టెలలోనుండి తెచ్చిన వస్త్రాభరణ వాహనములచే శ్రీరామచంద్రస్వామికి కానుకలను అర్పించి, నమస్కరించి, తమసైన్యములతో తమతమ నెలవులకు వెళ్ళిరి. (37)

**అథ రామః స్నుషాభ్యాం చ పుత్రాభ్యాం బంధుభిః స్త్రియా ।**
**సుఖం చకార రాజ్యం స ధర్మేణాప్రతిమం చిరమ్ ॥ 38**

**తతః శ్రావణమాసస్య దర్శమారభ్య షోడశ ।**
**ప్రాప్తాన్యబ్దే యాని యాని సముత్సాహదినాని హి ॥ 39**

**తేషు సర్వేషు తం రామం సావరోధం స బాలకమ్ ।**
**స్వపురీం భూరికీర్తిః స నినాయ పరమాదరాత్ ॥ 40**

**పూజయామాస విధివద్వస్త్రాలంకారవాహనైః ।**
**కియద్దినాని సంస్థాప్య దదవాజ్ఞాం పునః పునః ॥ 41**

**సంవత్సరసముత్సాహదినాని షోడశాధునా ।**
**విష్ణుదాస మయా తేఽగ్రే కథ్యంతే తాని వై శృణు ॥ 42**

**శ్రావణస్యాథ మాసస్య కుహూః శ్రేష్ఠా ప్రకీర్తితా ।**
**భాద్రశుక్లచతుర్థీ తు విజయా దశమీ తథా ॥ 43**

**దీపావల్ల్యాశ్చ చత్వారి దినాన్యతిమహాంతి చ ।**
**మార్గశీర్షే పంచమీ చ సీతా షష్ఠీ తథా పునః ॥ 44**

**సంక్రాంతిర్మకరాఖ్యా తు తథా చ రథసప్తమీ ।**
**హుతాశనీ చైత్రశుక్లప్రతిపచ్చాపి పుణ్యదా ॥ 45**

**అక్షయ్యాఖ్యా తృతీయా చ తథా వై జ్యేష్ఠపౌర్ణిమా ।**
**పంచమీ శ్రావణే శుక్లా షోడశైవ స్మృతాని హి ॥ 46**

**సంవత్సరసముత్సాహదినాన్యతిమహాంతి చ ।**
**ఏతేషు భూరికీర్తిః స రామం నీత్వా ప్రపూజయత్ ॥ 47**

## పెళ్ళిజరిగిన సంవత్సరములోని విశేష ఉత్సవములు.

అంత అప్రతియుతుడైన శ్రీరామచంద్రుడు జానకిదేవితో క్రొత్తగా వచ్చిన కోండంగ్రతో కొడుకుల కోర్కెలు తీర క్రీడించుచుండువారితోను లక్ష్మణాది తమ్ములతోను ధర్మముగా రాజ్యపరిపాలనము చేయుచుండెను. పిదప శ్రావణమాసం అమావాస్య మొదలు 16 దినములు సముత్స జనకములై ఏది వచ్చుచుండెనో వాటి అన్నిటిలో, భూరికీర్తి మహారాజు వచ్చి, శ్రీరామచంద్రమూర్తి పుత్రులతోను, రాణీవాసమువారితోను, తన రాజధానియగు వటపురికి తీసుకుని వెళ్ళి, పలువేడుకలు జేసి, వివిధ వస్త్రాలంకార వాహనములచే సత్కరించి, కొన్ని కొన్నిదినములు కలసిమెలసియుండి, మరలా మరలా పంపించుచు, ఇట్లు సంతోషించెను.

వినుము విష్ణుదాసా! నేను చెప్పిన పెండ్లి అయిన సంవత్సరములోని పదహారు సముత్సాహ దినములు ఎన్ని అనిన చెప్పెదను. శ్రావణమాసము మొదలుకొని 1) అమావాస్య మిక్కిలి శ్రేష్ఠముగా చెప్పబడినది, 2) భాద్రపద శుక్లచతుర్థి, 3) ఆశ్వీయుజ శుక్ల విజయదశమి, 4), 5,6,7) ఆశ్వీయుజ కృష్ణ త్రయోదశి మొదలు నాలుగు దినములు మిక్కిలి గొప్పవి. 8,9) మార్గశిర మాసమున పంచమియును, సీతా షష్ఠియును, 10) మకర సంక్రాంతి, 11) రథసప్తమి అనగా మాఘ శుక్ల సప్తమి, 12) హుతాశని అనగా ఫల్గుణ శుక్లపూర్ణిమ కామదహన దినము, 13) చైత్ర శుక్ల ప్రతి పత్తు, 14) అక్షయ తృతీయ, 15) జ్యేష్ఠ శుక్లపూర్ణిమ, 16) శ్రావణ శుక్ల పంచమి. ఇట్లు పదహారు దినములు చెప్పబడినవి గద? ఇవి పెండ్లైన సంవత్సరము మిక్కిలి సముత్సాహదినములు. వీటిలో భూరికీర్తి రాజు శ్రీరామభద్రుని తీసుకొని వెడలి సంపూజించెను. (47)

ఏవం కుశస్య చ తథా లవస్యాపి సవిస్తరాత్ ।
వివాహౌ వర్ణితౌ శిష్య యథా పూర్వం శ్రుతౌ మయా ॥ 48

యదా శ్రీరామచంద్రస్య వైకుంఠారోహణం శుభమ్ ।
భవిష్యతి తదాఽయోధ్యాపుర్యాం వై సరయూజలే ॥ 49

కుశః స్త్రియా చంపికయా జలక్రీడాం కరిష్యతి ।
తస్య దక్షిణహస్తస్య కంకణం రుక్మనిర్మితమ్ ॥ 50

సరయూజలమధ్యే తు పతిష్యతి మహోజ్జ్వలమ్ ।
తత్ర తోయే కుముదస్య పన్నగస్య కుముద్వతీ ॥ 51

స్వసా దృష్ట్వా కంకణం తద్గృహీత్వా సద్మ యాస్యతి ।
కుశోఽపి కంకణార్థం హి బాణం సంధారయిష్యతి ॥ 52

సరయూశోషణార్థం హి సన్నద్ధశ్చ భవిష్యతి ।
తతః సా కుముదం గత్వా సరయూః ప్రార్థయిష్యతి ॥ 53

సోఽపి దృష్ట్వా కుశం క్రుద్ధం స్వసామాదాయ సాదరమ్ ।
కుశమాగత్య తం నత్వా స్వసాం తస్మై ప్రదాస్యతి ॥ 54

రత్నాని కంకణం దత్వా తేన సఖ్యం కరిష్యతీ ।
ఏవం కుముద్వతీభార్యాఽగ్రే తస్యాన్యా భవిష్యతి ॥ 55

తస్యాం కుశాత్సుతనయోఽతిథిర్నామ్నా భవిష్యతి ।
చంపికాయాం దుహితరః సంభవిష్యంతి నో సుతాః ॥ 56

అతిథేః సూర్యవంశోఽగ్రే చిరం విస్తారమేష్యతి ।
ఏవం కుశస్య ద్వే పత్న్యౌ వర్ణితౌ శిష్య వై మయా ॥ 57

అథ స్వీయగృహే పత్న్యాఽకరోత్క్రీడాం కుశః సుఖమ్ ।
తథా స్వీయగృహే పత్న్యాఽకరోత్క్రీడాం లవోఽపి చ ॥ 58

**ఇతి శ్రీశతకోటిరామచరితాంతర్గతే, శ్రీమదానందరామాయణే, వాల్మీకీయే, ఆదికావ్యే, వివాహకాండే, కుశలవయోర్వివాహవర్ణనం నామ చతుర్థః సర్గః ॥**

## శ్రీరామఅవతార పరిసమాప్తిలోని కథాసూచనము.

విష్ణుదాసా! నేను ఎట్లు వింటినో అట్లు కుశలవులయొక్క వివాహ విషయమును నీకు చెప్పితిని. ఎపుడు మంగళకరమైన శ్రీరామచంద్రునియొక్క వైకుంఠారోహణము నడుచుచున్నదో అప్పుడు ఆ అయోధ్యాపురిలో సరయు జలములలో కుశుడు తనపత్నియగు చంపికతో జల క్రీడలను ఆచరించును. అతని కుడిచేతిలో ఉన్న దివ్య సువర్ణ కంకణము సరయూ నదిలో పడును. అచట నీటిలో కుముదుడను పన్నగేంద్రుని చెల్లెలైన కుముద్వతి ఆ కంకణమును చూచి తీసుకుని తన ఇంటికి పోవును. కుశుడును కంకణము కొరకు బాణమును అనుసంధానము చేయును. ఆ బాణము సరయూ జలములను శోషించుటకు సర్వసిద్ధమగును. అంత ఆ సరయూ దేవత కుముదుని వద్దకు పోయి ప్రార్థించును. అతడును కోపావిష్టుడైన కుశుని జూచి, వెరచి, సాదరముగా తన చెల్లెలిని తీసుకుని వచ్చి, కుశుని సన్నిధిని జేర్చి, నమస్కరించి, కుముద్వతిని కానుకగా అర్పించును. ఆ దివ్య సువర్ణ రత్న కంకణమును అప్పగించి, మైత్రినంది ఆనందించును. ఇట్లు కుమద్వతి అను మరియొక పత్ని ఈ కుశునికి పత్ని కాబోవుచున్నది. దాని గర్భమందు కుశునికి 'అతిథి' అను కుమారుడు జన్మించును. చంపికా గర్భమున కుమార్తెలు జన్మించెదరు గాని, పుత్రులు ఉదయించరు. అతిథినుండి సూర్యవంశము ఇకమీద విస్తారముగా సాగుచున్నది. ఇట్లు కుశునికి ఇరువురు పత్నులు వర్ణింపబడిరి.

ఆ సంగతి ఇట్లుండగా ఆ కుశలవులు ఇరువురును చంపిక, సుమతులతో తమతమ దివ్య మందిరములలో సంసారానంద పరిమగ్నులై రతికేళిలో తేలుచుండిరి.

***ఈ విధముగ శ్రీమద్వాల్మీకి మహర్షిచే రచింపబడిన,***
***శ్రీశతకోటిరామచరితాంతర్గత శ్రీమత్ ఆనందరామాయణములో,***
***ఆరవదైన వివాహకాండలో కుశలవుల వివాహమును వర్ణించు 4వ సర్గ ముగిసినది.***



# పంచమః సర్గః-5వ సర్గ

జలదేవి జీవదానం, బాలికామోచనం.

శ్రీరామదాస ఉవాచ

ఏకదా రఘువీరః స సీతయా బాలబంధుభిః ।
పౌరైర్మంత్రిజనైరిష్టైః పుష్పకస్థో యయౌ వనమ్ ॥ 1

పశ్యన్నానాకౌతుకాని రంజయన్ జానకీం ముదా ।
యయౌ స దండకారణ్యమగస్తే రాశ్రమాంతికమ్ ॥ 2

రామమాగతమాకర్ణ్య కుంభజన్మా మునీశ్వరః ।
ప్రత్యుద్గమ్య రఘుశ్రేష్ఠం నినాయ స్వాశ్రమం ప్రతి ॥ 3

తతః స మునివర్యస్తు స్నాత్వా రహసి సంస్థితః ।
అన్నపూర్ణాం మహాలక్ష్మీం చింతయామాస చేతసి ॥ 4

తదా తత్తపసా తుష్టాఽఽవిర్బభూవ సురేశ్వరీ ।
దదౌ తస్మై పాయసేన పూరితం పాత్రముత్తమమ్ ॥ 5

అన్నపూర్ణా మునిం ప్రాహ స్థాల్యాస్తు వివిధాని హి ।
పక్వాన్నాని యథేష్టాని నిష్కాస్య తవ భామినీ ॥ 6

సర్వేషామగ్రతః శీఘ్రం కరోతు పరివేషణమ్ ।
ఇత్యుక్త్వా సాఽన్నపూర్ణా తం మునిమంతర్దధే తదా ॥ 7

లోపాముద్రా మునేః పత్నీ స్థాల్యా నిష్కాస్య వేగతః ।
దివ్యాన్నాని విచిత్రాణి సర్వేషాం పురతస్తదా ॥ 8

సమర్చితానాం విప్రాణాం చకార పరివేషణమ్ ।
అథ తుష్టం రఘుశ్రేష్ఠ కంకణే రత్ననిర్మితే ॥ 9

దదౌ ముదా కుంభజన్మా సీతాయై దివ్యకుండలే ।
ఏవం సంపూజితస్తేన మునినా రఘునందనః ॥ 10

## శ్రీరాముడు సపరివారముగ అగస్త్య ఆశ్రమమునకు వచ్చుట

శ్రీరామదాసు ఇట్లుచెప్పెను, “ఒకప్పుడు శ్రీరఘురాముడు సీతాదేవితోను, తమ్ములతోను, మంత్రులతోను, ఇష్ట మిత్రుల తోను పుష్పకమును ఎక్కి వనమునకు వెడలెను. దారిలోని వివిధ కుతూహలములను విలోకించుచు, జానకీదేవిని రంజింపజేయుచు, సంతోషముతో దండకారణ్యము నందలి అగస్త్య ఆశ్రమము వద్దకు వచ్చెను. శ్రీరామచంద్రుని రాకను తెలిసి, కుంభసంభవ మునీంద్రుడు ఎదుర్కొలు పోయి, తన ఆశ్రమమునకు శ్రీరామచంద్రస్వామిని పిలుచుకునివచ్చెను. అంత ఆ మునీంద్రుడు స్నానముచేసి, రహస్య ప్రదేశమున సుఖాసీనుడై, మహాలక్ష్మియగు అన్నపూర్ణాదేవిని మనమున అనుసంధానము చేసెను. అపుడు అన్నపూర్ణాంబ అతని తపముచే సంతుష్టయై ప్రత్యక్షముగా వచ్చి, పాయస పరిపూర్ణమైన పాత్రను అనుగ్రహించి, ఇచ్చి, “మునీంద్రా! వినుము, ఈ పాయస పాత్రలో బహువిధ పక్వాన్నాదులు, సమస్త భోజ్య వస్తువులు నిండియున్నవి. వాటిని నీ పత్నియైన లోపాముద్ర యథేష్టముగా తీసి అందరిఎదుట త్వరగా వడ్డించవలయును అని ఆజ్ఞాపించి, అంతర్ధానమయ్యె. పిమ్మట అగస్త్య పత్ని లోపాముద్ర ఆ పాత్రనుండి విచిత్రములగు పక్వాన్నములను తీసి, శ్రీరామాదులతో అచట ఉండెడు మునీంద్రులందరికి వడ్డించెను. అంత అగస్త్యుడు సంతసించు చుండెను. శ్రీరామచంద్రునికి దివ్యరత్న నిర్మితములగు కంకణములను, సీతాదేవికి దివ్యమైన కుండలములను సమర్పించెను. ఇట్లు అగస్త్యునిచే శ్రీరామచంద్రుడు చక్కగా పూజింపబడెను.

**సహితోఽగస్తినా స్థిత్వా పుష్పకే పూర్వవత్పునః ।**
**పశ్యంతౌ దండకారణ్యే కౌతుకాని సమంతతః ॥ 11**

**విచచార రఘుశ్రేష్ఠో దర్శయామాస మైథిలీమ్ ।**
**నానావృక్షాన్ పర్వతాంశ్చ నదీః పక్షికులాన్ మృగాన్ ॥ 12**

**పంచాప్సరసరో నామ దదర్శాసౌ భ్రమన్ సరః ।**
**తత్తటే రాఘవో రాత్రౌ నివాసమకరోన్ముదా ॥ 13**

**ఏతస్మిన్నంతరే రాత్రౌ నృత్యమప్సరసాం శుభమ్ ।**
**శుశ్రావ మధురం గీతం సీతయా మంచకే ప్రభుః ॥ 14**

**తేఽపి సర్వే శుశ్రువుస్తన్నృత్యం గీతం చ సుస్వరమ్ ।**
**అదృష్ట్వాఽప్సరసస్తత్ర తదా స రఘునందనః ॥ 15**

పప్రచ్ఛ కుంభజన్మానం గీతం నృత్యం కుతస్త్విదమ్ ।
శ్రూయతే మునిశార్దూల వదస్వ త్వం సవిస్తరమ్ ॥ 16

ఇతి రామవచః శ్రుత్వా తమగస్త్యిర్వచోఽబ్రవీత్ ।
రామ రాజీవపత్రాక్ష కిం త్వం వేత్సి న వై త్విదమ్ ॥ 17

సర్వానేతాన్మన్ముఖేన వృత్తం శ్రావయితుం ముదా ।
చేన్మాం పృచ్ఛసి తర్హ్యద్య తవాగ్రే ప్రవదామ్యహమ్ ॥ 18

పురా గంధర్వరాజస్య పుత్ర్యః పంచ మనోరమాః ।
అరజస్కా ముదా క్రీడాం చక్రురత్ర సరోవరే ॥ 19

ఏతస్మిన్నంతరే రామ నాగకన్యాః సరోవరాత్ ।
క్రీడార్థం నిర్యయుః సప్త బహిరప్రాప్తయౌవనాః ॥ 20

## శ్రీరాముడు అగస్త్యునితో పంచాప్సర సరోవరమునకు వెళ్ళుట.

శ్రీరాముడు అగస్త్య మునీంద్రుని కూడా తనవెంట పిలుచుకుని యథాపూర్వకముగా పుష్పకమును ఎక్కి, దండకారణ్యమునందంతట వింతలను దర్శిస్తూ, సంచరిస్తూ, జానకమ్మకు వివిధ వృక్ష విచిత్రములను, బహువిధ పర్వత విశేషములను నానావిధ నదీవినోదములను, పలురకముల పక్షుల విహారములను, అనేక ప్రకారములైన మృగముల సొగసులను చూపించుచూ వచ్చి, పంచాప్సర సరస్సు అను పేరుగల దివ్యసరోవరమును చూచి, దాని తీరమున ఆరాత్రి సంతోషముగా అందరితో విడిది చెసెను. అంత ఆనాడు రాత్రి అచట సీతతోడ మంచముమీద పవ్వళించిన శ్రీరాముడు మంగళసంగతమైన అప్సరసలయొక్క నర్తనమును, మధురమగు గీతములను వినెను. ఇతరులందరును ఆ నృత్యగీతముల సుస్వరములను వింతగావిన్నారు. అపుడు శ్రీరాముడు అప్సరసలు మాత్రము కంటికి కనబడనందున, "మునీంద్రా! ఇవి ఏమో వినవచ్చుచున్నది గదా! సవిస్తరముగా ఆ సంగతిని చెప్పుము. ఈ నృత్యగీతములు ఎచటివని అగస్త్యమునిని అడిగెను. అంత అగస్త్యుడు అందుకు శ్రీరామునితో ఇట్లు చెప్పుచున్నాడు, "రాజీవాక్షుడగు రామచంద్రస్వామి! సర్వజ్ఞుడైన నీకు ఈ సంగతి తెలియదా ఏమి! ఇదియు ఒక వినోదమా! ఐనా వీరికందరికిని నాచే ఈ వృత్తాంతములను వినిపింపవలయునని నీవిట్లు నన్ను అడిగెదవు. ఐనా నీ ఎదుట చెప్పెదను. మునుపు గంధర్వరాజుయొక్క పుత్రికలు ఐదుమంది, మనోహరాంగులు, రజస్వలలు.

తాసాం పరస్పరం మైత్రీ బభూవ రఘునందన ।
తత్ర తా నాగకన్యాశ్చ తథా గంధర్వకన్యకాః ॥ 21

యాతాయాతం సదా చక్రుః క్రీడార్థం సరసస్తటే ।
తపతా మునినా తత్ర ముహుర్వాక్యైర్నివారితాః ॥ 22

మాఽఽగచ్ఛధ్వం మన్నికటే చేతి తా బాలభావతః ।
అమానయంతస్తద్వాక్యం సమాజగ్ముర్నిరంతరమ్ ॥ 23

ఇంద్రేణ బోధితాశ్చాపి తత్తపోధ్వంసనం ప్రతి ।
మునిశ్చాపి తపోనాశం దృష్ట్వా శాపాదీనా తదా ॥ 24

వినా శాపేన తాసాం స దండం సమంత్రయద్ధృది ।
ఆత్మవాక్యగౌరవేణ జలదేవీః ప్రచోదయాత్ ॥ 25

తద్వాక్యాజ్జలదేవ్యస్తా మధ్యాహ్నే స్వీయమందిరమ్ ।
నిన్యుర్ధృత్వా బలాదేవ యత్ర కేషాం గతిర్న హి ॥ 26

గంధర్వాః పన్నగా యత్ర గంతుం శక్తా న చాభవన్ ।
తపోఽన్తే స మునిః స్వర్గం గతస్తా హ్యత్ర సంస్థితాః ॥ 27

తాః సర్వా జలదేవీనాం గేహే సంత్యధునా ప్రభో ।
ఇదం వృత్తమాధునికం విద్ధి రామ స్మయప్రదమ్ ॥ 28

తా హ్యత్ర జలదేవీనాం జలాంతర్గతసద్మని ।
కుర్వంతి నృత్యగీతాని తాసాం సంశ్రూయతే ధ్వనిః ॥ 29

ఏవం రామ యథా పృష్టం త్వయా సర్వం మయా తథా ।
వృత్తం తవాగ్రే కథితం కురు యేన హితం భవేత్ ॥ 30

సర్వాసాం నాగకన్యానాం గాంధర్వీణాం తథా విభో ।
మునినా చోదితశ్చేత్థం తదా సీతాపతిర్ముదా ॥ 31

## అగస్త్యుడు పంచాప్సర నాగకన్యకల వృత్తాంతమును చెప్పుట.

ఆ ఐదుమంది కన్యలు సంతోషముతో ఈ సరోవరమున క్రీడించిరి. అంతలో సరోవరమునుండి క్రీడించుటకై యవ్వనమునందలి ఏడుగురు నాకగన్యలు వెలువడివచ్చిరి. వారందరికిని, వీరితో పరస్పర స్నేహము పొసగెను. ఇట్లు గంధర్వకన్యకలును, ఆ నాగకన్యకలును క్రీడించుటకై సరసు తీరమున రాక పోకలు జరుపుచుండిరి. ఇట్లుండ అచట తపమాచరించుచుండిన మునీంద్రుడు వీరిని మీరిచటికి రావలదని పలుమార్లు నిరాకరించెను. వారు బాల్యదోషముచే అతని మాటను లక్ష్యపెట్టక ఎల్లప్పుడును వచ్చుచుండిరి. దేవేంద్రుడును ఆ మునీంద్రుని తపోనాశనమునకై మరికొంత వీరిని ప్రోత్సాహపరుచగా ఈ మగువలు రచ్చచేయుచుండిరి. అంత ఆ ముని వీరికి శాపాదులను ఇచ్చినట్లైన తన తపోభంగ మగునని ఆలోచించి, శాపమునివ్వక వీరిని దండింపవలయునని ఎంచి, తన వాక్యమునందు గౌరవముగల జలదేవతలను ప్రేరేపించెను. అంత ఆ ముని వాక్యమహిమచే, జలదేవతలు ఎచటకు పోయిన మాత్రమున నెవనికిని వెనుకకు వచ్చుటకు వీలులేదో గంధర్వులును, నాగులును ఎచటికి పోవుటకు శక్తులుకారో అట్టి తన ఇంటికి మధ్యాహ్నకాలమున ఆ పంచాప్సరసలను, నాగకన్యకలను బలత్కారముగా పట్టి తీసుకొనిపోయిరి. తపశ్చర్యానంతరము ఆ ముని స్వర్గమునకు వెడలెను. వారందరును అచట జలదేవతలయొక్క నీటి ఇంటిలో ఇప్పటికిని నివసించియున్నారు. ఈ వృత్తాంతమును నవీనమనియు, ఆశ్చర్యకరమనియు తెలియుము. వారచట జలదేవతలయొక్క జలాంతర్ గృహమున నృత్యగీతములను ఆచరించుచున్నారు. వాటియొక్క మనోహరనాదము వినవచ్చుచున్నది.

శ్రీరామచంద్రా! ఇట్లు నీవడిగిన సంగతిని విన్నవించితిని. యథాస్థితిని ఎఱిగిన నీవు ఆ నాగకన్యకలకును, అప్సరస పంచకములకును సంతోషము కలుగునట్లు కార్యమును నెరవేర్పుము. ఇట్లు అగస్త్య మునీంద్రునిచే ప్రేరేపింపబడిన సీతాపతి (31)

**లక్ష్మణం ప్రాహ మే చాపమానయాద్య క్షణాదిహ ।**
**ముక్త్వా బాణం మోచయామి దగ్ధ్వా దేవీర్జలస్థితాః ॥ 32**

**కన్యకాః పన్నగానాం చ తథా గంధర్వకన్యకాః ।**
**ఇతి తద్రామవాక్యం స శ్రుత్వా సౌమిత్రిరాదరాత్ ॥ 33**

శీఘ్రం చాపం స తూణీరం దదౌ శ్రీరాఘవం ప్రతి ।
తతః కోదండముద్యమ్య టణత్కృత్య రఘూద్వహః ॥ 34

శరం జగ్రాహ తూణీరం నిజనామాంకితం శితమ్ ।
తదా చచాల ధరణీ చక్షుభుః సప్తసాగరాః ॥ 35

వవౌ ఘోరతరో వాయూ రజోవ్యాప్తా దిశోఽభవన్ ।
తారా నిపేతుర్ధరణీం దుద్రువుర్వనచారిణః ॥ 36

పర్వతాః కంపితా ఆసన్ వవర్షుర్లోహితం ఘనాః ।
తత్జ్ఞాత్వా జలదేవ్యస్తాః శ్రుత్వా చాపధ్వనిం మహత్ ॥ 37

భయభీతాః సమాజగ్ముస్తాభిః సర్వాభిరాదరాత్ ।
ప్రణేముస్తాస్తదా రామం బాలికాస్తాస్తు ద్వాదశ ॥ 38

రాఘవాయార్పయామాసుర్దివ్యభూషణభూషితాః ।
రాఘవం జలదేవ్యస్తాః ప్రార్థయామాసురాదరాత్ ॥ 39

రామ రామ మహాబాహోఽస్మాభిర్యదపరాధితమ్ ।
తత్క్షమస్వ రఘుశ్రేష్ఠ మా ముంచ స్వపతత్త్రిణమ్ ॥ 40

న కశ్చిత్సూర్యవంశేఽభూత్ స్త్రిషు శస్త్రప్రహారకః ।
త్వయాఽపి రక్షితా పూర్వం స్త్రీత్వాద్భూర్జాహ్నవీతటే ॥ 41

యదాఽఘ్నయా తు శపథః కృతో మైథిలకన్యయా ।
తాటికాదిరాక్షసీషు యత్కృతం బాణమోచనమ్ ॥ 42

## శ్రీరాములవారు అప్సరస, నాగకన్యకలను విడిపించుట.

లక్ష్మణుని పిలిచి, “తమ్ముడా! నా ధనుర్బాణములను తీసుకుని రమ్ము. బాణమును ప్రయోగించి, జలదేవతలను శిక్షించి, నాగ కన్యకలను, గంధర్వ కన్యకలను క్షణమాత్రమున విడిపించెదను.”

అనెను. అంత లక్ష్మణుడు సాదరముగా ధనస్సును, తూణీరములను తెచ్చి రామునికి సమర్పించెను. రాముడు ఆ చాపమును చేతపట్టి, టంకారముచేసి, తూణీరమునుండి తనపేరుగల బాణమును ఎత్తి, ధనస్సులో సంధానము చేయనెంచెను. అపుడు భూమి చలించె. సాగరములు అల్లకల్లోలములు అయ్యె. అంతట చండమారుతములు ప్రచండములయ్యె. దుమ్ము క్రమ్మి దిక్కులు కానరాక దిమ్మ తిరుగుచుండె. చుక్కలు వ్రాలుచుండె. వనాచారులు పరుగెత్తిరి. పర్వతములు కంపించెను. మేఘాలలో నెత్తుటి వానగురిసె. ఇట్టి మహోత్పాతములను చూచి, శ్రీరాముని ధనుష్టంకార ధ్వనిని విని జలదేవతలు భయభ్రాంతులై ఆ కన్యకలనందరిని వెంటతీసుకుని వచ్చి, శ్రీరామచంద్రస్వామియొక్క పాదార విందముల మీదపడి ప్రణమిల్లిరి. దివ్య భూషణాలంకృత లగు ఆ పండ్రెండుమంది కన్యకలను శ్రీరామసన్నిధికి సమర్పించిరి మరియు ఆ జలదేవతలు, “మహానుభావుడవైన శ్రీరామచంద్రస్వామీ! మా అపరాధమును మన్నింపుము. రఘువీరా! బాణము ప్రయోగింపవలదు. ఈ సూర్యవంశమున ఒక్కడును స్త్రీలమీద బాణప్రయోగము చేయలేదు. నీవు కూడా గంగాతీరమున సీతాదేవి ప్రతిజ్ఞ చేసినపుడు భూ దేవిపై బాణప్రయోగము చేయక రక్షించలేదా? అయినా నేను తాటకాది రాక్షసాది స్త్రీలమీద శస్త్రములను ప్రయోగించలేదా అని శంకింపవలదు.

**బ్రహ్మఘ్నీషు త్వయా పూర్వం తత్సర్వేషాం హితాయ చ ।**
**ఇతి హాసాం వచః శ్రుత్వా విహస్య రఘునందనః ॥ 43**

**స్థాపయామస తూణీరే పూర్వవృత్తం స్వమార్గణమ్ ।**
**తతస్తాభిః పూజితః స తదా హృష్టోరఘూత్తమః ॥ 44**

**జలదేవీర్దదావాజ్ఞాం స్వస్థలం గమ్యతామితి ।**
**ఏతస్మిన్నంతరే తత్ర గంధర్వాశ్చాథ పన్నగాః ॥ 45**

**విదిత్వా సకలం రామకృతం రామాంతికం యయుః ।**
**నత్వా రామం ససీతం చ తథా తం కుంభసంభవమ్ ॥ 46**

**ఉపాయనాన్యనేకాని సమర్ప్య రఘునందనమ్ ।**
**ఊచుస్తే మంజుల వాక్యం ప్రబద్ధకరసంపుటాః ॥ 47**

### ఇతి శ్రీశతకోటిరామచరితాంతర్గతే, శ్రీమదానందరామాయణే, వాల్మీకీయే, ఆదికావ్యే, వివాహకాండే, జలదేవీజీవదానం బాలికామోచనం నామ పంచమః సర్గః ॥

బ్రహ్మహత్యాది మహాపాతకములచే పాపిష్టురాండ్రైన వారిని సంహరించుట లోకహితముకొరకై చేసినట్టైనది కాని స్త్రీ హత్యగా ఎంచబడదు," అని ఇట్లు మిక్కిలి భయభక్తులతో ప్రార్థింపగా వారి ప్రార్థనను విని శ్రీరామచంద్రుడు నవ్వి, తన బాణమును యథాపూర్వముగా తూణీరమున సంస్థాపించెను. అంత, ఆ జలదేవతలచే శ్రీరాముడు సంపూజింపబడి, సంతుష్టాంతరంగుడై జలదేవతలను మీమీ స్థలములకు మీరు సుఖముగా పోవుడని ఆజ్ఞాపించెను. ఆ వేళకు అచటికి గంధర్వులును, నాగులును, ఇచటి సమస్త వృత్తాంతమును ఎఱిగినవారై, శ్రీరామ సన్నిధానమునకు వచ్చి, శ్రీసీతారాములకు, అగస్త్య మునీంద్రునికి నమస్కరించి, శ్రీరామునికి రకరకాల కానుకలను అర్పించి, బద్ధాంజలులై, మనోహరవాక్యములచే ఇట్లు సంప్రార్థించిరి... (5)

***ఈ విధముగ శ్రీమద్వాల్మీకి మహర్షిచే రచింపబడిన, శ్రీశతకోటిరామచరితాంతర్గత శ్రీమత్ ఆనందరామాయణములో, ఆరవదైన వివాహకాండలో బాలికలను విడిపించే, 5వ సర్గ ముగిసినది.***



# షష్ఠః సర్గః-6వ సర్గ

12 మంది పంచాప్సర, నాగకన్యకల వివాహము

గంధర్వపన్నగా ఊచుః

రామ కంజానన స్వామిన్మోచితా బాలికాస్త్వయా ।
వివాహోనరజస్కానాం పుత్రైస్త్వం కర్తుమర్హసి ॥ 1

అద్య ధన్యా వయం సర్వే నః కులం పావనం కృతమ్ ।
త్వయా రామ మహాబాహో తారితాః స్మో వయం ప్రభో ॥ 2

సప్తజన్మసు యత్పుణ్యం కృతమస్తి రఘూద్వహ ।
అస్మాభిస్తేన సంబంధస్త్వయాఽద్య భవతు ప్రభో ॥ 3

శ్రీరామదాస ఉవాచ

ఇతి తేషాం వచః శ్రుత్వా సీతయా స రఘూద్వహః ।
అంగీకృత్య వచస్తేషామగస్తిమవలోకయత్ ॥ 4

తదా ప్రాహ కుంభజన్మా రాఘవం వచనం మునిః ।
రామాఽన్యాగ్రేకుముదస్య స్వసా నామ్నా కుముద్వతీ ॥ 5

త్వయి ప్రాప్తే హి వైకుంఠం కుశపత్నీ భవిష్యతి ।
చంపికాయాం న తనయో భవిష్యతి రఘూద్వహ ॥ 6

## నాగులు, గంధర్వులు శ్రీరాముని ప్రార్థించుట.

గంధర్వ పన్నగులు ఇట్లు పలికిరి, "రాజీవాక్షుడైన రామచంద్రస్వామీ! నీవీ బాలికలను చెరనుండి విడిపించితివి. రజస్వలలు కాని ఈ కన్యకలను నీ పుత్రులకు పత్నులుగా అంగీకరించి, వివాహ మహోత్సవములను చేయింపుము. మేమందరము కృతకృత్యులమైతిమి. మా యొక్క కులము మిక్కిలి పవిత్రమయ్యె. మహానుభావుడవగు నీవు మమ్మును ఉద్ధరించితివి. ఇందులో సంశయములేదు. మేము ఏడుజన్మములనుండి చేసిన పుణ్యము ఇప్పటికి ఫలించి, నీ సందర్శన భాగ్యము కలిగినది."

శ్రీరామదాసు చెప్పుచున్నాడు- అని ఇట్లు ప్రార్థించిన గంధర్వ నాగుల ప్రార్థనను విని, శ్రీరామచంద్రుడు సీతతో అట్లేనని, వారిమాటను అంగీకరించి, అగస్త్య మునీంద్రుని అవలోకించెను. (4) అంత అగస్త్యుడు, శ్రీరామునితో, "స్వామీ! వినుము నీవు వైకుంఠమునకు పోయినపుడు కుముదునియొక్క చెల్లెలైన కుముద్వతి నది కుశపత్నిగా ఎంచబడును. శ్రీరామా! ఈ చంపికకు మగబిడ్డలు పుట్టరు.

**కుశాత్పుత్రః కుముద్వత్యా మతిథిస్తు భవిష్యతి ।**
**రాజ్యకర్తా వంశకర్తా స ఏవాగ్రే భవిష్యతి ॥ 7**

**అతస్త్వమధునా రామ నాగకన్యాః కుశంవినా ।**
**సప్త స్వసప్తపుత్రేభ్యః ప్రయచ్ఛ విధినా ద్విజైః ॥ 8**

**పంచగంధర్వకన్యాశ్చ యూపకేతుం కుశం లవమ్ ।**
**వినా స్వపంచపుత్రేభ్యః ప్రయచ్ఛ రఘునందన ॥ 9**

**రాక్షసేన వివాహేన యూపకేతుః శిశుస్తతః ।**
**అగ్రే పత్నీ మహానేష కరిష్యత్యపరాం శుభామ్ ॥ 10**

**ఏవం రామసుతాః స్సర్వే స్వస్వస్త్రీభ్యాం యథాసుఖమ్ ।**
**క్రీడయిష్యంతి పౌత్రాస్తాన్ భవిష్యంతి ప్రపౌత్రకాః ॥ 11**

**ప్రపౌత్రస్య ప్రపౌత్రం త్వం దృష్ట్వా సీతాసమన్వితః ।**
**సుఖం గచ్ఛసి వైకుంఠం బంధుభిర్నగరీస్థితైః ॥ 12**

**ఏవం శ్రుత్వా మునేర్వాక్యమంగీకృత్య రఘూద్వహః ।**
**తాసాం నామాని పప్రచ్ఛ గంధర్వాన్ పన్నగానపి ॥ 13**

**తదాఽబ్రవీత్స గంధర్వః స్వపుత్రీణాం సవిస్తరాత్ ।**
**తాసాం నామాని రామాగ్రే పంచానాం సరసస్తతే ॥ 14**

**చంద్రికా చంద్రవదనా చంచలా చపలా చలా ।**
**ఏవం నామాని పంచానాం క్రమేణ రఘునందనః ॥ 15**

శ్రుత్వాఽవలోకయామాస పన్నగాంస్తేఽపి చాబ్రువన్ ।
కంజాననా కంజనేత్రా కంజాంఘ్రీ చ కళావతీ ॥ 16

కలికా కమలా చైవ మాలతీ సప్త కీర్తితాః ।
ఏవం నామాని పంచానాం క్రమేణ రఘునందనః ॥ 17

శ్రుత్వా తాః పుష్పకే స్థాప్య తైర్నిద్రామకరోన్నిశి ।
అథ ప్రభాతే శ్రీరామః హుత్వా స్నాత్వా యథావిధి ॥ 18

గంధర్వపన్నగాంశ్చాపి తదా వచనమబ్రవీత్ ।
ఏభిర్జ్ఞైర్మయా సాకం వివాహార్థం రసాతలమ్ ॥ 19

## పంచాప్సర నాగకన్యకల వివాహములు.

కుమద్వతి గర్భమున కుశునికి అతిథి అనువాడు జన్మించుచున్నాడు. వాడే రాజ్యమును ఏలువాడగును. వంశ వర్ధకుడు విరాజిల్లుచుండును. అందువలన ఇపుడు కుశుడు తప్ప తక్కిన లవాది పుత్రులకు నాగకన్యకల ఏడుమందిని విధివిధానముగా అర్పించి, బ్రాహ్మణులచే వివాహములను చేయింపుము. నీ బిడ్డడగు ఉపకేతువు ఇంకొక పత్నిని రాక్షస వివాహ విధిచే చేసుకొనుచున్నాడు. ఇతడు మిగుల సమర్థుడు. ఆ రాగాల పత్నియును మంగళాంగిగా ఉండును. శ్రీరామా! ఇట్లు నీ కుమారులందరును తమతమ పత్నులతో యథాసుఖముగా క్రీడించుచుందురు. వారికి కొడుకులును, మనుమలును కాగలరు. మనుమలకు కలిగెడు మనుమలను కూడా చూచిన వాడవై నీవు బంధుమిత్ర, పౌర, పరివారములతోడ వైకుంతమునకు వెడలుచుందువు," అని పలికిన అగస్త్య మునీంద్రుని పలుకులను విని, అట్లే సరియని అంగీకరించి, శ్రీరామచంద్రస్వామి ఈ కన్యకల పేర్లేమని నాగ, గంధర్వులను అడిగెను. అప్పుడు ఆ సరస్సు తీరమున గంధర్వులు తమ బిడ్డలు ఐదుగురియొక్క, నామములను, "చంద్రిక, చంద్రవదన, చంచల, చపల, అచల" అని విన్నవించిరి. అంత ఆ రఘునాథుడు గంధర్వ వాక్యమును వినిన వెనుక నాగులను అవలోకించెను. అందుకు వారును "కంజానన, కంజనేత్ర, కంజాగ్రి, కళావతి, కలిక, కమల, మాలతి" అని ఈ కన్యకలు పిలువబడుచుందురనే సంగతిని ఏడుగురు నాగకన్యకలయొక్క నామములను చెప్పిరి. పిదప శ్రీరామచంద్రుడు వారందరి అభివాదనముల నాలకించి, వారిని పుష్పక విమానమున ఎక్కించి,

అందరితోడ ఆ రాత్రి సుఖనిద్ర నందెను. మరునాడు ఉదయమున స్నానముచేసి, విధ్యుక్త ప్రకారముగా అగ్నిహోత్రములను ఆరాధించి, గంధర్వ, పన్నగులను చూసి, "ఈ జనులతోడ మనుష్యలోకవాసియగు నేను వివాహమునకై నాగలోకమునకుగాని, స్వర్గలోకమునకుగాని వచ్చుట గాని యోగ్యము కాదు.

నైవ యోగ్యం సమాగంతుం మర్త్యలోకనివాసినా ।
తస్మాచ్ఛృణుధ్వం మద్వాక్యం సుహృదః సకలాః శుభమ్ ॥ 20

యూయం గత్వా నిజస్థానం స్వస్త్రీభిశ్చ సుహృజ్జనైః ।
ఆగంతవ్యం వివాహార్థమయోధ్యాం మే యథాసుఖమ్ ॥ 21

అధునాఽహం తు గచ్ఛామి పురీమగ్రే క్షణేన హి ।
విహాయసా విమానేన పతాకాధ్వజమాలినా ॥ 22

తథేతి రామవచనాత్తే గతాః స్వస్థలాని హి ।
రామోఽపి మునినా తాభిర్బాలికాభిః సుతైః స్త్రియా ॥ 23

విహాయసా పుష్పకస్థో యయౌ పశ్యన్వనాని సః ।
అయోధ్యాం ప్రహరేణైవ ముదా ప్రాప రఘూద్వహః ॥ 24

నీరాజితః పురస్త్రీభిర్వివేశ నిజమందిరమ్ ।
వసిష్ఠగేహే తాః సర్వాః ప్రేషయామాస రాఘవః ॥ 25

అథ రామః సభామధ్యే సౌమిత్రిమిదమబ్రవీత్ ।
అకారణీయా రాజానః సుహృదశ్చ మునీశ్వరాః ॥ 26

సాంతః పురాః సపౌరాశ్చ స్వస్వజానపదైః సహ ।
శృంగారణీయాఽయోధ్యేయం పరిఖాః సప్త సాదరమ్ ॥ 27

శోధనీయాస్తథా సౌధసమూహేషు సుధా శుభా ।
దేయా చిత్రాణి లేఖ్యాని ప్రాసాదేషు సమంతతః ॥ 28

దేవాలయేషు సర్వేషు సుధా దేయా మనోరమా ।
లేఖనీయాని చిత్రాణి బలయః స్థాప్యతాం పృథక్ ॥ 29

సుహృదులగు మీరందరును మంగళమగు నామాటను వినుడు. మీరు మీ స్థానములకు పోయి, మీ మిత్రులతోడను, కళత్రములతోను వివాహమునకై ఆ అయోధ్యా పట్టణమునకు రావలయును. ఇదిగో ఇంకొక్షణమున ధ్వజపతాక వందన మాలికాలంకృతమైన విమానము మీదనెక్కి, గగనమున అయోధ్యకు పోవుచున్నాను అని చెప్పెను. అట్లే కానిమ్మని నాగులును, గంధర్వులును శ్రీరామ వాక్యమును అంగీకరించి, తమతమ నివాసస్థలములకు చేరిరి. (22) ఇచట శ్రీరామచంద్రస్వామి ఆ కన్యకలను, పుత్రులను తీసుకుని సకల పరివారములతో పుష్పకమును ఎక్కి, వనములను అవలోకించుచు వెడలి, వేకువజాములోపల సంతోషముతో అయోధ్యాపట్టణమును చేరెను. పౌరనారులు నీరాజనములను అనుమోదించుచు, రాజమందిరమును చేరి, రామచంద్రుడు రారాజించుచుండెను. గంధర్వ నాగ కన్యకలను వశిష్ఠ మునీంద్రుని ఇంటికి పంపించెను. పిమ్మట సభాసీనుడైన రఘురాముడు లక్ష్మణునిజూచి, "పురస్థలను, జనపదస్థులను, పరివారములను కూడా పిలుచుకుని వచ్చునట్లు మిత్రులకును, రాజులకును, శుభలేఖలను పంపవలయును. అంతటా గల మునులందరిని పిలిపింప వలయును ఈ అయోధ్య పట్టణమును శృంగారింపవలయును. ఏడు అగడ్తలను శోధింపవలయును. సమస్త సౌధములను క్రొత్తగా సున్నము పూయించి, బాగుచేయించ వలయును. అంతట ప్రాసాదములలో చిత్రములు వ్రాయించవలయును. సకల దేవాలయములను చిత్రములచే అలంకరించవలయును.

**బంధనీయాః పతాకాశ్చ రోపణీయా ధ్వజా అపి ।**
**సమంతతస్తోరణాని బంధనీయానిలక్ష్మణ ॥ 30**

**వేద్యః కార్యా రుక్మమధ్యే బంధనీయాశ్చ మంటపాః ।**
**శృంగారణీయా హస్త్యశ్వశిబికాశ్చ సహస్రశః ॥ 31**

**గంధర్వేభ్యః పన్నగేభ్యో వస్తుం గేహాని వై పృథక్ ।**
**కురుష్వ నూతనాన్యస్త్రవస్త్రాద్యైః పూరితాని చ ॥ 32**

**అన్యచ్చాపి యథాయోగ్యం యద్యజ్జానాసి లక్ష్మణ ।**
**తత్తత్కురుష్వ యన్నోక్తం మయా తవ రఘూద్వహ ॥ 33**

**తద్రామవచనం శ్రుత్వా తథేత్యుక్త్వా స లక్ష్మణః ।**
**తథా చకార తత్సర్వం యథా రామేణ శిక్షితః ॥ 34**

అథ గంధర్వరాజస్తు తథా వై సప్త పన్నగాః ।
సుహృద్భిః సావరోధాస్తే యయుః శీఘ్రం ముదాన్వితాః ॥ 35

సర్పా మానవరూపేణ హస్త్యశ్వరథసంస్థితాః ।
గంధర్వాశ్చాపి సైన్యైస్తే సాకేతోపవనం యయుః ॥ 36

తతస్తానాగతాన్ శ్రుత్వా ప్రత్యుద్గమ్య రఘూద్వహః ।
నానావాద్యని నాదైశ్చ నృత్త్యైరప్సరసాం పురీమ్ ॥ 37

నీత్వా సంస్థాపయామాస విస్తీర్ణేషు గృహేషు సః ।
అథ తైరేకదా రామః సభాయాం సంస్థితః సుఖమ్ ॥ 38

జ్యోతిర్విదః సమాహూయ వసిష్ఠం తత్పురోధసః ।
పృథగ్వివాహాన్కర్తుం స ముహూర్తానతిమంగళాన్ ॥ 39

సమ్యగ్విచారయామాస వర్షమధ్యే సవిస్తరమ్ ।
జ్యోతిర్విదస్తదా ప్రోచుర్ముహూర్తానతిసౌఖ్యదాన్ ॥ 40

ఆలయాలలో పతాకములను కట్టింపలయును. ధ్వజస్థంభములను స్థాపింపవలయును. అంతట తోరణములను అలంకరింపదగును. సువర్ణ వేదికలను వేయించవలయును. మంగళమంటపములను కల్పింపవలయును. వేలకొలది గుఱ్ఱములను, ఏనుగులను, పల్లకీలను శృంగారించి పెట్టింపుము. గంధర్వులకును, నాగులకును వసించుటకు తగినట్లు అన్న, వస్త్ర, ధన, కనక, వస్తు, వాహన పూరితములైన నూతన గృహములను సిద్ధపరుపుము. ఇవి గాక నేను చెప్పకయుండెడు వాటిని యథాయోగ్యముగా నీకు తోచినట్లు చేయింపుము." అని ఆజ్ఞాపించెను. లక్ష్మణుడు శ్రీరామ వాక్యములను శిరసావహించి, యథోక్త విధానముగా సర్వమును సిద్ధపరచెను. అంత గంధర్వ రాజులును అట్లే సమస్త నాగరాజులును, తమతమ రాణివాసములతోను, మిత్రులతోను మానవాకారములను స్వీకరించి, సంతోషముతో తమతమ సైన్యములతో వచ్చి, అయోధ్యారాజధానియొక్క ఉద్యానవనమునకు చేరిరి. పిదప గంధర్వులు, నాగులు వచ్చిరని విని, శ్రీరామచంద్రుడు రాజవైభవములతో ఎదుర్కోలుపోయి, వారినందరిని సమ్మానించి, వివిధ వాద్యములతోను, మంగళ నృత్య గీతములతోను నగరములోనికి తీసుకొనివచ్చి, విశాలమైన విడిది ఇండ్లలో బస ఏర్పాటుచేసెను (37)

## పంద్రెండు పెండ్లిళ్ళకు ముహూర్తములు నిశ్చయించుట.

అంత ఒక దినమునందు శ్రీరామచంద్రస్వామి చక్కగా సభాసీనుడై జ్యోతిశ్శాస్త్ర పారంగతులగు దైవజ్ఞులను పిలిపించి, వసిష్ఠులవారిని; నాగ, గంధర్వ పురోహితులను చూచి, వేరువేరుగా వివాహములను నెరవేర్చుటకు దివ్యమంగళ ముహూర్తములను నిర్ణయింపుడని విచారింపబూనెను.

పక్షాంతరేణ వైశాఖే ద్వౌ ముహూర్తౌ శుభావహౌ ।
తథా దదుర్ముహూర్తౌ ద్వౌ జ్యేష్ఠే పక్షాంతరేణ తే ॥ **41**

ద్వావేవ మార్గశీర్షేఽపి త్రీన్ మాఘే ఫాల్గునేఽపి చ ।
ఏవం ద్వాదశనారీణాం చక్రుర్లగ్నవినిశ్చయమ్ ॥ **42**

లవస్యాథాంగదస్యాపి వివాహౌ తైర్వినిశ్చితౌ ।
జ్యోతిర్విద్భిర్వసిష్ఠేన వైశాఖే రాఘవాగ్రతః ॥ **43**

చిత్రకేతోః పుష్కరస్య వివాహౌ తైర్వినిశ్చితౌ ।
జ్యేష్ఠే మాసి క్రమేణైవం పక్షే పక్షే పృథక్ పృథక్ ॥ **44**

తక్షస్యాథ సుబాహోశ్చ వివాహౌ మార్గశీర్షకే ।
పక్షాంతరేణ రామాగ్రే జ్యోతిర్విద్భిర్వినిశ్చితౌ ॥ **45**

యూపకేతోరంగదస్య చిత్రకేతోర్వినిశ్చితాః ।
మాఘమాసే వివాహశ్చ జ్యోతిశ్శాస్త్రవిశారదైః ॥ **46**

పుష్కరస్యాథ తక్షస్య సుబాహోః ఫాల్గునే శుభే ।
వివాహా నిశ్చితాః శిష్య రామాగ్రే గణకైస్తదా ॥ **47**

ఏవం వినిశ్చితాః సర్వే వివాహా ద్వాదశ క్రమాత్ ।
జ్యోతిర్విద్భిర్నిశ్చితాశ్చ శ్రుత్వా తానార్చయద్విభుః ॥ **48**

ఇతి శ్రీశతకోటిరామచరితాంతర్గతే, శ్రీమదానందరామాయణే, వాల్మీకీయే, ఆదికావ్యే, వివాహకాండే, ద్వాదశవివాహవినిశ్చయో నామ, షష్ఠః సర్గః ॥

అపుడు జ్యోతిర్విదులు మిక్కిలి సౌఖ్యకరములైన ముహూర్తములను ఇట్లు వక్కాణించిరి. వైశాఖమాసమున 15 దినముల అనంతరము శుక్లపక్షమున ఒక ముహూర్తము, కృష్ణపక్షమున ఒక ముహూర్తమును శుభకరములుగా ఉన్నవి. అట్లే జ్యేష్ఠమాసముననను శుద్ధమున ఒకటియును, బహుళమున ఒకటియును సుఖావహములై ఉన్నవి. అట్లే మార్గశీర్ష మాసమున రెండు ముహూర్తములే గలవు. మాఘమాసమునందు మూడు ముహూర్తములు ముచ్చటగా ఉన్నవి. ఫాల్గుణ మాసమునను మూడు ముహూర్తములు మేలైనవి గలవు. ఇట్లు 12 ముహూర్తములు 12 మంది కన్యకలకును తగి ఉన్నవని నిర్ణయించిరి. పిమ్మట వారందరును వశిష్ఠులవారితో ఆలోచించి, శ్రీరాముని ఎదుట లవునికిని, అంగదునికిని, వైశాఖముహూర్తములను నిర్ణయించిరి. చిత్రకేతు, పుష్కరులకు జ్యేష్ఠమాసమున వేరువేరు పక్షములలో మంచిముహూర్తములను నిశ్చయించిరి. తక్ష, సుభాహువులకు మార్గశిర మాసమును నిర్ణయించిరి. యూపకేతువునకును, అంగదునికిని, చిత్రకేతువునకును మాఘమాసమున వరుసగా మూడు ముహూర్తములు నిర్ణయింపబడెను. పుష్కరునికిని, తక్షకునికిని సుబాహువునకును ఫాల్గుణ మాసమున క్రమముగా మూడు ముహూర్తములు నిరూపించిరి. ఇట్లు గణకులు ద్వాదశ వివాహముహూర్తములను నిర్ణయించిన పిమ్మట శ్రీరామచంద్రుడు అంతటిని విని, అందరిని క్రమముగా సమ్మానించెను.

***ఈ విధముగ శ్రీమద్వాల్మీకి మహర్షిచే రచింపబడిన,***
***శ్రీశతకోటిరామచరితాంతర్గత శ్రీమత్ ఆనందరామాయణములో, ఆరవదైన***
***వివాహకాండలో 12మందికి వివాహముహూర్తములను నిర్ణయించే***
***6వ సర్గ ముగిసినది.***



# సప్తమః సర్గః-7వ సర్గ

12మంది నాగ, గంధర్వకన్యల వివాహవర్ణన

శ్రీరామదాస ఉవాచ
అథ తే గణకాః సర్వే వసిష్ఠస్తత్పురోధసః ।
కుమారీణాం విభాగాంశ్చ చక్రుః శ్రీరాఘవాగ్రతః ॥ 1

కంజాననాం లవాయాథ కంజాక్షీమంగదాయ చ ।
గణకా నిశ్చయం చక్రుః కంజాంఘ్రీం చిత్రకేతవే ॥ 2

కలావతీం పుష్కరాయ తథా తక్షాయ సాలికామ్ ।
సుబాహవే చ కమలాం మాలతీం యూపకేతవే ॥ 3

గణకై స్సప్త తా ఏవం నాగకన్యా వినిశ్చితాః ।
చంద్రికామంగదాయాథ చంద్రాస్యాం చిత్రకేతవే ॥ 4

చంచలాఖ్యాం పుష్కరాయ తక్షాయ చపలాం తథా ।
సుబాహవే తు హ్యచలాం ప్రోచుస్తే గణకాదయః ॥ 5

ఏవం గంధర్వకన్యాస్తాః పంచ విప్రైర్వినిశ్చితాః ।
ఏవం హి నిశ్చయం కృత్వా గణకాదీన్ రఘూత్తమః ॥ 6

విసృజ్య మైథిలీం గత్వా సర్వం వృత్తం న్యవేదయత్ ।
తతో యయుః కోటిశస్తే పార్థివాశ్చ మునీశ్వరాః ॥ 7

సప్తద్వీపాంతరస్థాశ్చ సావరోధాః సబాలకాః ।
నానావాహనసంస్థాశ్చ పౌరైర్జానపదైర్నిజైః ॥ 8

తైః సాఽయోధ్యాపురీ వ్యాప్తా విరేజే నితరాం తదా ।
యయౌ విభీషణశ్చాథ సుగ్రీవోఽపి ప్లవంగమైః ॥ 9

యయౌ స భూరికీర్తిశ్చ పుత్రాభ్యాం శీఘ్రమాదరాత్ ।
యయౌ స జనకశ్చాపి యుధాజిత్స యయౌ తదా ॥ 10

## నాగులు, గంధర్వులు శ్రీరాముని ప్రార్థించుట.

శ్రీరామదాసు ఇట్లు పలికెను, "తరువాత ఆ గణకులును, వశిష్ఠుడును ఆ గంధర్వ, నాగుల పురోహితుడును చేరి, శ్రీరామ చంద్రుని సన్నిధానమున గంధర్వ, నాగ కన్యకలను ఇట్లు పంచిరి. కంజన అను కన్యక లవునికిని, కంజాక్షిని-అంగదునికిని, కంజాగ్రిని-చిత్రకేతువునకును, కళావతిని -పుష్కరునికిని, కాళికను-తక్షకునికిని, కమలను-సుబాహువునకును, మాలతిని-ఉపకేతువునకును ఇచ్చి వివాహ ముహూర్తములను నెరవేర్చుటకు పొంతనము మొదలైనవి చక్కగా అమరియున్నవి. ఏడుగురు నాగకన్యకలకును, గణకాదులు వరులను నిశ్చయించిరి. చంద్రికను-అంగదునికిని, చంద్రాస్యను-చిత్రకేతువునకును, చంచలను-పుష్కరునికిని, చంపలను-తక్షకునికిని, అచలను-సుబాహునకును ఇచ్చి పెండ్లి జరుపుటకు తగియున్నదని దైవజ్ఞులు గంధర్వ కన్యకల ఐదుగురికిని వధూవర ఘటితార్థ నిర్ణయమును ఒనరించిరి. శ్రీరామచంద్రుడు ఇట్లు సభలో అందరి ఎదుట 12 వివాహములలోను, వధువులను నిశ్చయించుకుని గణకాదులను సత్కరించి పంపి, సీతాదేవికి సమస్త వృత్తాంతమును సవిస్తరముగా చెప్పెను. (6)

## శ్రీరామచంద్రుడు 12 వివాహములను చేయించుట.

అటుమీద సప్తద్వీపములలో కోట్లకొలది గల రాజేంద్రులు తమతమ పత్నులతోను, బాలకులతోను, పౌర జానపదాది సమస్త పరివారములతో వివిధ వాహనములమీద అయోధ్యానగరమునకు వచ్చిరి. సమస్త మునీంద్రులును తమశిష్య వర్గములతో దయచేసిరి. అయోధ్యా రాజధాని వారందరిచే నిండి శోభిల్లుచుండెను. విభీషణుడును, కపీంద్రులతో సుగ్రీవుడు, తన ఇరువురు కొడుకులతో భూరికీర్తి రాజును, సపరివారుడగు జనక మహారాజును, యుధాజిత్తు మొదలగువారందరును వచ్చి చేరిరి.

**కౌసల్యాయాః సుమిత్రాయా బాంధవాద్యాః సమాయయుః ।**
**అథ రామస్తు వైశాఖశుక్లే ద్విజవరైః సహ ॥ 11**

**పురోధసా సుహృద్భిశ్చ స్నానమభ్యంగపూర్వకమ్ ।**
**కృత్వా లవాయ మాంగళ్యస్నానార్థం స్త్రీః ప్రచోదయత్ ॥ 12**

**తతో ముహూర్తసమయే వధూచ్ఛిష్టాం నిశాం లవమ్ ।**
**సమ్యగ్ లిప్య సుతైలార్ద్రాం సీతాద్యా మాతరస్తదా ॥ 13**

**స్వయం సస్నుర్ముదా సర్వాస్తూర్యానాదైః సబాలకాః ।**
**అథ రామో దేవకస్య ప్రతిష్ఠాం బ్రాహ్మణైః సహ ॥ 14**

ఆదౌ కృత్వా గణపతేః పూజాం సమ్యగ్యథావిధి ।
పుణ్యాహాదిత్రయంచాపి కృత్వా పూర్వం సవిస్తరమ్ ॥ 15

చకార విధివత్తుష్టః పూజయామాస వై మునీన్ ।
తతో ముహూర్త సమయే గత్వా పన్నగమందిరమ్ ॥ 16

లవస్య కంజనయనావివాహం వినివర్తయత్ ।
చతుర్థే దివసే వంశపాత్రస్థై రత్నదీపకైః ॥ 17

నీరాజితస్తదా రామో విరేజే మంటపే స్త్రియా ।
తతో నిజగృహం గత్వా పూర్వోక్తైరుత్సవాదిభిః ॥ 18

లవేన కారయామాస లక్ష్మీపూజనముత్తమమ్ ।
తతో దానాన్యనేకాని దదౌ స రఘునందనః ॥ 19

తతస్తే పార్థివాః సర్వే తథా తే పన్నగా అపి ।
సుహృదశ్చాథ గంధర్వాః పౌరా జానపదాదయః ॥ 20

పూజయామాసుః శ్రీరామం వస్త్రైరాభరణాదిభిః ।
తథా తాన్ లక్ష్మణాదీంశ్చ కుశాద్యాంశ్చాపి బాలకాన్ ॥ 21

కౌసల్యాదేవియొక్క బంధువులును, సుమిత్రయొక్క బాంధవులును, ఇంకను కావలసినవారంతా వచ్చిరి. అంత శ్రీరామచంద్రుడు వైశాఖ శుక్లపక్షమున బ్రాహ్మణులతోను, పురోహితులతోను, మిత్రులతోను అభ్యంగన మంగళస్నానములను ఆచరించి, లవునిని మంగళస్నానపూర్వకముగా పెండ్లికొడుకును చేయుడని వృద్ధ సువాసినులను ప్రేరేపించెను. వారును అట్లే వధూచ్ఛిష్టమనిన సువాసిని పూజా, ప్రార్థన శేషమగు మంగళ కరమైన పసుపును పూసి, లవునికి దివ్య పరిమళ తైలములచే అభ్యంగనము చేయించి, సీతాదేవి మొదలైన తల్లులుకూడా మంగళ స్నానముచేయించి, వారును మంగళాభ్యంగ స్నానములు చేసుకుని, మంగళా పూర్ణులై వెలయుచుండిరి. బాలకులందరును చక్కగా స్నానముచేసి ముస్తాబైరి, సన్నాయి మొదలగు మంగళవాద్యములు శ్రావ్యముగా మ్రోగు చుండినవి. పిదప శ్రీరఘురాముడు బ్రాహ్మణులతో దేవతా ప్రతిష్ఠనుజేసి, శ్రీమహాగణపతిని పూజించి, యథా విధానముగా చక్కగా ప్రార్థించి, పుణ్యాహ నవగ్రహనానందులను కర్మత్రయమును నెరవేర్చి, విధివిధానముగా మునీంద్రులను అందరిని పూజా సత్కారములచే సంతోషపరచెను. అంత ముహూర్త సమయమునకు పన్నగరాజుల విడిది ఇంటికి వెడలి, లవునికిని–కంజనయనకును కన్నులపండువగా

పెండ్లిచేయించెను. నాలుగవనాడు లవుడు మంగళమండపమున నూతన పత్నితో వంశపాత్రలలోని రత్నదీపములచే నీరాజితుడై విరాజించుచుండెను. ముందుగా అనుకున్న ప్రకారము సమస్త వైభవోత్సములతో శ్రీరాముడు తన రాజమందిరమునకు వచ్చి, లవునిచే శ్రీమహాలక్ష్మి పూజనమును చేయించి, వివిధములగు మహాదానములను చేసెను. అపుడు పెండ్లికి వచ్చియుండిన సమస్తరాజులును, నాగులును, మిత్రులును, గంధర్వులును, నాగరికులును, దేశమువారును, శ్రీరామచంద్రస్వామిని వస్త్రాభరణాది అమూల్య వస్తువులచే పూజించిరి.

**తతస్తా నృపపత్న్యశ్చ సుహృత్పత్న్యః పృథక్ పృథక్ ।**
**నాగపత్న్యశ్చ గంధర్వపత్న్యశ్చాన్యాస్తథా స్త్రియః ॥ 22**

**సీతాద్యాః పూజయామాసుర్ వస్త్రైరాభరణాదిభిః ।**
**సీతాఽపి తాః సుహృత్పత్నీస్తథా పార్థివకామినీః ॥ 23**

**పూజయామాస విధివద్వస్త్రైరాభరణాదిభిః ।**
**రామోఽపి సుహృదః పౌరాన్ గంధర్వాన్ పన్నగాన్నృపాన్ ॥ 24**

**వస్త్రైరాభరణైర్యానైః పూజయామాస సాదరమ్ ।**
**ఏవం వైశాఖమాసే తు సితే పక్షే లవస్య చ ॥ 25**

**కృత్వా వివాహం రామః స కృష్ణపక్షే తు మాధవే ।**
**చకార పూర్వద్ధర్వాద్వివాహం హ్యంగదస్యచ ॥ 26**

**చిత్రకేతోః పుష్కరస్య వివాహో రఘునందనః ।**
**జ్యేష్ఠమాసే శుక్లకృష్ణపక్షయోరకరోన్ముదా ॥ 27**

**తతః సర్వాన్ నృపాదీంశ్చ దదావాజ్ఞాం సుపూజితాన్ ।**
**తతః పునస్తానాహూయ పూర్వవన్మార్గశీర్షకే ॥ 28**

**తక్షస్యాథ సుబాహోశ్చ వివాహావకరోత్ప్రభుః ।**
**తతః సర్వాన్ నృపాన్ రామో దదావాజ్ఞాం సుహృజ్జనాన్ ॥ 29**

**తతః పునస్తానాహూయ మాఘమాసే సుహృన్నృపాన్ ।**
**యూపకేతోరంగదస్య చిత్రకేతోర్మహోత్సవైః ॥ 30**

వివాహానకరోద్రామః పార్థివాన్న వ్యసర్జయత్ ।
పుష్కరస్యాథ తక్షస్య సుబాహోశ్చ మహోత్సవైః ॥ **31**

చకార ఫాల్గునే మాసి వివాహాన్ జానకీధవః ।
ఏవం కృత్వా వివాహాంశ్చ రామో ద్వాదశ సాదరమ్ ॥ **32**

నృపైః సంపూజితః సర్వాన్పూజ్యాజ్ఞాం నృపతీన్ దదౌ ।
పూజయిత్వా మునీంశ్చాపి విససర్జ రఘూద్వహః ॥ **33**

గంధర్వపన్నగాః సప్త తే సాకేతేఽత్ర సంస్థితాః ।
రామం ముక్త్వా న తే నైజం స్థలం జగ్ముర్ముదాన్వితాః ॥ **34**

అట్లే లక్ష్మణాదులను, కుశలవాది రాజపుత్రులను సత్కరించిరి. పిదప రాజపత్నులును, మిత్ర పత్నులును, నాగపత్నులును, గంధర్వపత్నులును వేరువేరుగా సీతాదేవి మొదలుగా గల అంగనామణులందరికిని వస్త్రాభరణాది దివ్య వస్తువులతో ఆరాధించిరి. సీతమ్మయును వారినందరిని సముచిత సత్కారములతో సంతోషపరచెను. ఇట్లు వైశాఖమాసమున శుక్లపక్షమున లవుని వివాహముచేసి, శ్రీరామచంద్రుడు వైశాఖ కృష్ణపక్షమున యథాపూర్వకముగా మిక్కిలి హర్షముతోడ అంగదునికి వివాహ మహోత్సవము చేయించెను. జ్యేష్ఠ శుక్ల కృష్ణ పక్షములలో, చిత్రకేతు పుష్కరులకు పెండ్లిండ్లు వైభవముగా జరిగినవి. అపుడు శ్రీరఘురాముడు సమస్త రాజులను, మిత్రులను సత్కరించి ఆజ్ఞనిచ్చి పంపించెను. అంత అట్లే మరలా వారిని పిలిపించి, పూర్వము వలెనె మార్గశీర్షమాసమున తక్షకునికిని, సుబాహునకును వివాహములను చేయించెను. అంత శ్రీరాముడు మిత్రమండలికిని, ధాత్రీపతి మండలికిని ఆజ్ఞనిచ్చి పంపించెను. మరలా వారిని పిలిపించి, మిళత రాజబృందములతో మాఘ మాసమున ఉపకేతువునకును, అంగదునికిని, చిత్రకేతువునకును అత్యంత వైభవములచే వివాహములను చేయించి, రాజులను పంపక అట్లే నిలుపుకుని, ఫాల్గుణ మాసమున పుష్కరునికిని, తక్షకునికిని, సుబాహునకును మహోత్సవములతోడ పెండ్లిండు చేయించెను. ఇట్లు జానకీ రమణుడు 12 మంగళ వివాహములను చేయించి, సమస్త రాజబృందములతో ఆరాధింపబడి, వారినందరిని సముచిత సత్కారములచే సమ్మానించి వీడ్కొలిపెను. మరియు మునీంద్రులందరిని పూజించి, వారివారి ఆశ్రమాలలో వదిలిపెట్టెను. గంధర్వులును, పన్నగులును, సాకేత రాజధానిలోనే వసించు వారలై సాక్షాత్ రామచంద్రస్వామి సాంగత్యము కలుగుచుండు బ్రహ్మానందమును వదిలి పోజాలక అచటనే విహరించుచుండిరి. మరి వారు తమతమ రాజ్యములకు వేరువేరుగా తమతమ మంత్రులను పంపించిరి. (34)

మంత్రిణః ప్రేషయామాసుః స్వస్వరాజ్యేషు తే పృథక్ ।
యదా రామః స వైకుంఠమగ్రే గచ్ఛతి కాలతః ॥ 35

తదా సాంతానికాంల్లోకాంస్తే గచ్ఛంతి న సంశయః ।
అథ రామః పన్నగానాం గంధర్వాణాం చ సద్మసు ॥ 36

వార్షికేషూత్సవేష్వత్ర సావరోధః సుహృజ్జనైః ।
పౌరైః స్వీయైర్భోజనాది గత్వా హ్యంగీకరోత్సదా ॥ 37

సదా మహోత్సవాశ్చాసన్నయోధ్యాయాం గృహే గృహే ।
ఆనందః సకలానాసీన్నాసీత్కుత్రాస్యమంగళమ్ ॥ 38

అథ తేషాం రాఘవేణ పుత్రాణాం చ పృథక్ పృథక్ ।
అష్ట కృత్వా తు గేహాని పృథక్కృత్వా చ శాంతయః ॥ 39

తేషు తే స్థాపితాః సర్వే స్వస్వస్త్రీభ్యాం పృథక్ సుఖమ్ ।
తథా తే లక్ష్మణాద్యాశ్చ పృథగ్గేహేషు బాంధవాః ॥ 40

పూర్వమేవ స్థాపితాశ్చ స్వస్వపత్న్యా ముదాన్వితాః ।
సుమిత్రాయాః స సౌమిత్రిః స్వీయగేహేఽవసత్సుఖమ్ ॥ 41

కైకేయీ భరతస్యాథ గేహే మాసమువాస సా ।
తస్థౌ శత్రుఘ్నగేహేఽపి మాసమేకం యథాసుఖమ్ ॥ 42

ఏవం సా పుత్రయోర్గేహేఽకరోద్వాస ముదాన్వితా ।
కౌసల్యా సా రామగేహే తస్థౌ సీతాతిసేవితా ॥ 43

తే సర్వే బాంధవాః పుత్రా నిజయానైశ్చ సేవకైః ।
స్వదాసీగోధనాద్యైశ్చ సుఖమాపుః పృథక్ పృథక్ ॥ 44

## బంధు, పుత్రాదులతో శ్రీరాముడు కలిసిమెలిసి ఉండుట.

కాలక్రమముగా శ్రీరాముడు ఇకనెప్పుడు వైకుంఠనగరమునకు వెడులునో అపుడు గంధర్వ, పన్నగులు తమతమ సంతానములు గల లోకములకుపోదురు. అంత వరకు శ్రీరామ పరబ్రహ్మ సన్నిధానమును వదలరు. ఇందుకు సంశయములేదు. అంత ఆ శ్రీరామచంద్రుడు గంధర్వ పన్నగుల

ఇండ్లలో వార్షికాది మహోత్సవదినములయందు తన సమస్త పరివారములతో వెడలి, వారు చేయించెడు భోజనాది సమస్త సత్కారములను అంగీకరించుచుండెను. అయోధ్య పట్టణమున నిరంతరము మహోత్సవములు జరుగుచుండినవి. ఇంటింటను మంగళవైభవములు జరుగుచుండె. అంతట ఆనందములు నిండియుండె. ఎచటను అమంగళమనునది అడుగంటిపోయె. పిమ్మట శ్రీరామచంద్రుడు ఆ పుత్రులు ఎనమండుగురికిని వేరువేరుగా దివ్యరాజమందిరములను కల్పించి, వాటికి విధిప్రకారముగా వాస్తుశాంతులను జేయించి, వానిలో ఆ పుత్రులను వారివారి పత్నీ పరివారములతో సంస్థాపించెను. మునుపే వారివారి పత్నీపరివారములతో లక్ష్మణాదులు సంతోషముగా పృథక్ రాజమందిరములలో బరగుచున్నారు గదా! ఆ సుమిత్రాదేవిని తనయొక్క లక్ష్మణుని ఇంటిలో సుఖముగా నివసించుచుండెను. కైకేయి ఒకనెల యథాసుఖముగా భరతుని ఇంటిలోను ఒకనెల శత్రుఘ్నుని ఇంటిలోను ఇట్లు తన ఇరువురి కుమారుల ఇళ్లలోను సంతుష్ట హృదయి అయి, పూజ్యురాలై ఉండెను. శ్రీకౌసల్యాదేవి శ్రీరామ మందిరమున జానకీదేవి సంసేవితయై నిలచెను. ఇట్లు సమస్త బాంధవులును, పుత్రులును తమతమవాహనములతోను సేవకులతోడను, స్వ దాసీదాస వర్గములతోను, గో దానములతోను వేరువేరుగా ఆనందించుచుండిరి.

**అథ తే లక్ష్మణాద్యాశ్చ కుశాద్యా బాలకా అపి ।**
**స్వస్వగేహేషు వై ప్రాతః స్నాత్వా హోమాన్ శివార్చనమ్ ॥ 45**

**గోద్విజార్చాది సంపాద్య తతస్తే రాఘవం యయుః ।**
**నత్వా రామం జానకీం తే తస్థుర్దివ్యాసనోపరి ॥ 46**

**తేషాం సర్వాః స్త్రియాశ్చాపి స్నాత్వా దుర్గాం ప్రపూజ్య చ ।**
**గత్వా సీతాం ప్రణేముస్తాస్తస్థుః సీతాజ్ఞయాఽఽసనే ॥ 47**

**తతస్తే లక్ష్మణాద్యాశ్చ కుశాద్యాః స్వగురోర్ముఖాత్ ।**
**కథాం పౌరాణికీం శ్రుత్వా జగ్ముః స్వం స్వం గృహం ప్రతి ॥ 48**

**తతః సర్వే రామగేహే సమాహూతా ముదాన్వితాః ।**
**ఉపహారాన్ పృథక్ చక్రుర్మధ్యాహ్నే భోజనాన్యపి ॥ 49**

**ఏవం తేషాం స్త్రియశ్చాపి సమాహూతాస్తు సీతయా ।**
**ఉపహారాన్ భోజనాని చక్రుః సీతాగృహే సదా ॥ 50**

**కదా ముదా స్వీయగేహే రాఘవేణాథ సీతయా ।**
**ఉపహారాన్ భోజనాని చక్రుస్తే బ్రాహ్మణాదిభిః ॥ 51**

**ఏవం తైర్బంధుభిర్బాలైః ప్రాపతుర్నితరాం సుఖమ్ ।**
**సీతారామౌ కదా నాసీత్కలహః క్వాపి కస్య హి ॥ 52**

**ఇతి శ్రీశతకోటిరామచరితాంతర్గతే, శ్రీమదానందరామాయణే, వాల్మీకీయే, ఆదికావ్యే, వివాహకాండే, ద్వాదశవివాహవర్ణనం నామ, సప్తమః సర్గః ॥**

అంత ఆ లక్ష్మణాదులును, కుశలవాది బాలకులును తమతమ మందిరములలో ఉదయపు స్నానములను, అగ్నిహోత్రములను, శివార్చనములను, గో బ్రాహ్మణ పూజ సత్కారములను నెరవేర్చి, శ్రీరామసన్నిధికి వచ్చి, శ్రీసీతారాముల పాదపద్మములకు నమస్కరించి సుఖాసీనులగుచుందురు. వారివారి పత్నులందరును కూడా స్నానములను ఆచరించి, గౌరిపూజనాది సత్కార్యములను నెరవేర్చి, సీతాదేవి వద్దకు ఏతెంచి, ఆమెకును నమస్కరించి, తదాజ్ఞానుసారముగా పీఠములపై ఆసీనులగుచుందురు. అంత అందరును లక్ష్మణాదులు, కుశలవాదులు, తత్ పత్నులును శ్రీవశిష్ఠ మునీంద్రులవారు అనుగ్రహించి చెప్పెడు పౌరాణిక గాథలను విని, తమ తమ దివ్యమందిరములకు వెడలుచుందురు. అంత అందరు శ్రీరామ మందిరమునకు వచ్చి, ఫలహారాదులను, మధ్యాహ్న భోజనములను సంతోషముగా ఆరగించుచుందురు. ఇట్లే సీతామందిరమునందు సంతతము జానకీదేవిచే పిలువబడి, తోడికోడండ్రును, కోడండ్రును వచ్చి, ప్రసాదములనంది ఆనందించు చుందురు. ఒకప్పుడు శ్రీరాముడు బ్రాహ్మణులతోను, సీతాదేవితోను, ఫలహార భోజనాదులను స్వీకరించి, ఆనందించుచుండును. ఇట్లు శ్రీరామచంద్ర పరబ్రహ్మ వస్తుజగన్నాటక ప్రదర్శకుడై, తమ్ములతోను, కొడుకులతోను చేరి, సంసార వైభవ భోగములనందుచుండె. ఒకప్పుడును ఒకరితోడను, శ్రీసీతారాములకు వైమనస్య కలహమనునది లేదు. ఇది కదా సంసారసాగరము.

***ఈ విధముగ శ్రీమద్వాల్మీకి మహర్షిచే రచింపబడిన,***
***శ్రీశతకోటిరామచరితాంతర్గత శ్రీమత్ ఆనందరామాయణములో, ఆరవదైన***
***వివాహకాండలో 7వ సర్గ ముగిసినది.***



# అష్టమః సర్గః-8వ సర్గ

మదనసుందరి హరణము

శ్రీరామదాస ఉవాచ
అథైకదా దక్షిణే హి శివకాంత్యాం మహాపురి ।
కంబుకంఠో నృపః శ్రీమాన్ నిజకన్యాస్వయంవరమ్ ॥ 1

కర్తుకామో నృపాన్సర్వానాహ్వయామాస సాదరమ్ ।
తదా తే పార్థివాః సర్వే పత్రాణి హి పృథక్ పృథక్ ॥ 2

పూర్వవైరమనుస్మృత్య కుశస్యాపి లవస్య చ ।
స్వయంవరే స్వీయమాన భంగేనోద్భూతహృత్స్థితమ్ ॥ 3

ప్రేషయామాసుర్నృపతిం న యయుశ్చ స్వయంవరమ్ ।
తేషాం పత్రాణి సర్వాణి కంబుకంఠో దదర్శ సః ॥ 4

సర్వేషు లిఖితస్త్వేక ఏవార్థస్తం దదామ్యహమ్ ।
యది నాయాంతి రామస్య బాలకాస్తే స్వయంవరే ॥ 5

వయం సర్వే తర్హి యామో జంబుద్వీపాంతరస్థితాః ।
తేషామేవమభిప్రాయం జ్ఞాత్వా స నృపతిస్తదా ॥ 6

న సమాహూయ శ్రీరామమాహ్వయామాస పార్థివాన్ ।
స్వయం చాపి స్మరన్వైరం తదేవం రామపుత్రయోః ॥ 7

చంపికాసుమతిపాణిగ్రహణీయం పురాతనమ్ ।
తతస్తే పార్థివాః సర్వే శ్రుత్వా రామం హి నాగతమ్ ॥ 8

సప్తద్వీపాంతరస్థాశ్చ యయుః కాంతిపురీం ప్రతి ।
అథ తాం కంబుకంఠస్య కన్యాం మదనసుందరీమ్ ॥ 9

ప్రాసాదసంస్థితా దృష్ట్వా నారదః ఖాత్సమాయయౌ ।
సఖీభిః సా మునిం పూజ్య వినయాత్పురతః స్థితా ॥ 10

**పప్రచ్ఛ నారదం భక్త్యా వినాయావనతా శనైః ।**
**కుతః సమాగతః స్వామిన్ గమ్యతే క్వాధునా వద ॥ 11**

## కంబుకంఠరాజు తనకూతురికి స్వయంవరం ఏర్పాటుచేయుట.

శ్రీరామదాసు ఇట్లు చెప్పుచున్నాడు, "అంత నొకప్పుడు దక్షిణ భాగమున శివకాంతి కంబుకంఠ నాముడైన మహాశత్రువగు రాజు ఒకడు ధనముతో మదించి, తన కూతురికి స్వయంవర మహోత్సవమును చేయనెంచి, సాదరముగా అందరు రాజులకును శుభలేఖలను వ్రాసి పంపెను. అపుడా రాజులందరును వేరువేరుగా తమకు వచ్చిన పత్రములను చూచుకుని కుశలవులయొక్క చంపికా సుమతి స్వయంవర సమయమునందలి వైరమును స్మరించి తమకు అప్పుడు కలిగిన అవమానమునకు దుఃఖించుచు, కంబుకంఠకునికి చెప్పి పంపిరే గాని ఒక్కరైనను స్వయం వరమునకు పోకపోయిరి. వారు ప్రత్యుత్తరముగా వ్రాసిన జాబులను కంబుకంఠరాజు చూచి, చదువుకొనెను. అందరు వ్రాసిన సంగతియు ఒక్కటిగా ఉండెను. అది ఏమనిన నీవు ఏర్పరిచిన స్వయం వరమునకు శ్రీరాముని పుత్రులు రాకయుండిన అపుడు మేము తప్పక వచ్చుచున్నాము. వారు వచ్చు పక్షమునందు మేము రాజాలము," అని ఇట్లు వ్రాసియుండిన సమస్త రాజుల లేఖలను పరిశీలించి, ఆ రామ పుత్రులయందు అప్పటి చంపిక, సుమతి స్వయంవర జన్యవైరమును తానుకూడా స్మరించుకుని శ్రీరామచంద్రస్వామిని పిలువక తక్కిన నరపాలకులందరిని పిలిపించెను. పిదప సప్తద్వీపాంతర గతులైన సమస్త భూపతులును శ్రీరాముడు రాలేదనే సంగతిని తెలుసుకుని, కాంతీపురికి వచ్చిరి. ఇట్లుండగా గగనమునుండి, నారద మునీంద్రుడు భూలోకమునకు అవతరించుచు మేడమీద వేడుకల పండుగగా ఉండిన కంభుకంఠరాజపుత్రియైన మదనసుందరిని చూచి అట్లే ఆ కన్యయొక్క అంతఃపుర సౌధమున ప్రవేశించెను. చెలికత్తెలనడుమనున్న ఆ మదనసుందరి మునీంద్రుని పూజించి, మిక్కిలి భయ భక్తులతో ఎదుట నిలిచెను. మరియు ఆ మునీంద్రునితో, "స్వామీ! ఎచటనుండి దయచేసితిరి? ఇపుడు ఎచటికిపోవుచున్నారు? తమ దర్శనమగుటచేత మిక్కిలి పవిత్రత కలిగినది," అని ఎంతో వినయముతో విన్నవించెను.

**భవతాం దర్శనేనాద్య పావిత్ర్యం పరమం గతా ।**
**ఇతి తస్యా వచః శ్రుత్వా కించిత్ స్మిత్వా మునిస్తదా ॥ 12**

**తామాహ బాలే స్వర్లోకాదాగతోఽస్మ్యధునా త్వహమ్ ।**
**అయోధ్యాయాం రాఘవస్య పుత్రాణాం తు పృథక్ పృథక్ ॥ 13**

గేహే సంభోక్తుకామోఽద్య నిర్గతోఽస్మి విహాయసా ।
ఏతస్మిన్నంతరే కాంతిపుర్యాః సైన్యాని వై బహిః ॥ 14

దృష్ట్వా కేషాం హి సైన్యాని సంతీతి హృది చింతితమ్ ।
తతః పాంథముఖాచ్ఛ్రుత్వా తవ చాత్ర స్వయంవరమ్ ॥ 15

తదా వినిశ్చితం చిత్తే మయా రామః స్వయంవరే ।
అత్రైవాస్తి హ్యాగతశ్చేత్తం పశ్యామి సబాలకమ్ ॥ 16

నైవాస్తి హ్యాగతశ్చేద్ద్వి తర్హి యాస్యామ్యతః పరమ్ ।
స్వయంవరో వినా రామం న భవిష్యతి సాత్మజమ్ ॥ 17

పశ్యామ్యత్రైవ తం రామం వృథాఽగ్రే గమనం మమ ।
నిశ్చిత్యేత్థం సమాయాతస్తతోదృష్ట్వా రఘూత్తమమ్ ॥ 18

కథం రామో నాగతోఽత్ర చేతి పృష్టా నృపా మయా ।
నృపాభిప్రాయమాకర్ణ్య తదా ఖిన్నం మనో మమ ॥ 19

సప్తద్వీపపతిం రామం బంధుబాలకసంయుతమ్ ।
స్వయంవరమనాహూయ త్వత్పిత్రా నిశ్చితం నృపైః ॥ 20

అధునాఽహం ప్రగచ్ఛామి సాకేతస్థం రఘూత్తమమ్ ।
మందభాగ్యాఽసి బాలే త్వ స్నుషా రాఘవసత్పతేః ॥ 20

యతో జాతాఽసి నైవాత్ర విచిత్రా కర్మణో గతిః ।
ఇత్యుక్త్వా బాలికాం పృష్ట్వా నారదో గంతుముద్యతః ॥ 22

## మదనసుందరితో నారదముని సంభాషణ.

అంత ఆ నారదముని ఆ మదనసుందరి పలుకులను విని, కొంచెము చిరునవ్వులు నవ్వి, ఆమెతో, "బాలికా! నేనిప్పుడు స్వర్గలోకమునుండి వచ్చుచున్నాను. అయోధ్యా రాజధానిలో శ్రీరాముని సన్నిధానమున ఎనమండుగురు పుత్రులు వేరువేరుగా తమతమ ఇండ్లలో అత్యంత వైభోగములను పొందుచుందురు. వారి ఇండ్లకుపోయి భుజింపవలయును అని కోరిక కలిగి వెడలితిని. ఇదిగో పోదును. అయితే నేను గగన మార్గమున వచ్చుచుండగా ఈ కాంతి పురికి చుట్టూ, బయట విశేషముగా సైన్యములు నిలిచియుండగా విషయము తెలియక చింతించి, దారిలో ఒక బాటసారివలన నీకు

స్వయంవర మహోత్సవము జరుగుచున్నదను శుభవార్తను వింటిని. అపుడు నా మనమున శ్రీరాముడు ఈ స్వయంవర మహోత్సవమునకు వచ్చిన పక్షమందు నేను ఇచటనే పుత్రులతోడ శ్రీరఘురామ మూర్తిని దర్శించెదనని కుతూహలముతో ఉంటిని. ఒకవేళ శ్రీరాముడు పుత్రులతో ఇచటికి దయచేయక ఉండిన అపుడు ఆ అయోధ్యకు పోదును, వృథాయేల ప్రయాసపడవలయును? సపుత్రుడగు శ్రీరామచంద్రుని విడిచి స్వయంవరము కూడా జరుగునా? అని నిశ్చయించుకుని, వచ్చి చూచితిని. శ్రీరాముడు రాడయ్యె ఏమి ఇట్లు జరిగినదని మీ తండ్రిని అడిగితిని. అతని అభిప్రాయమును విని, నా మనస్సు మిక్కిలి కలతనందెను. ఆహా! చూచితివా మీ తండ్రి సప్తద్వీపాధిపతియై చక్రవర్తిగా రారాజించుచుండు రామచంద్ర స్వామిని వదలి, ఈ రాజులతో కలసి, నీకు స్వయంవర మహోత్సవమును జరిపించుచున్నాడు. ఇదిగో నేను సాకేత రాజధానికి వెడలిపోవుచున్నాను. నీవు దురదృష్టము గలదానవై శ్రీరామచంద్రస్వామికి కోడలు కాకపోతివి," అని ఇట్లు మాటలాడి, నారదమునీంద్రుడు బయలుదేరుటకు సిద్ధపడెను.

**తతః సంప్రార్థయామాస నారదం బాలికా ముహుః ।**
**ఖిన్నచిత్తాఽశ్రుపూర్ణాక్షీ మ్లానాస్యా స్ఫురితాధరా ॥ 23**

**రోమాంచితతనుర్ముగ్ధా గతశ్రీర్గద్గదస్వరా ।**
**యేనాహం మునివార్యాత్ర స్నుషా శ్రీరాఘవస్య చ ॥ 24**

**భవిష్యామి తథా కార్యం త్వయా త్వాం శరణం గతా ।**
**ఇత్యుక్త్వా మునివర్యస్య పాదయోః స్థాప్య సా శిరః ॥ 25**

**చకార కరుణాం బాలా తదా తాం మునిరబ్రవీత్ ।**
**మా చింతాం కురు రంభోరు సముత్తిష్ఠస్వ బాలికే ॥ 26**

**భవిష్యసి త్వం రామస్య స్నుషా యత్నం కరోమ్యహమ్ ।**
**ఇత్యుక్త్వా తాం సమాశ్వాస్య స్వమార్గేణ మునిర్యయౌ ॥ 27**

**ఏతస్మిన్నంతరేఽయోధ్యాపుర్యాః స్యన్దనసంస్థితః ।**
**యూపకేతుర్వనం పశ్యంస్తమసాతీరమాయయౌ ॥ 28**

**కించిత్సైన్యయుతో బాలస్తమసాయాం విగాహ్య సః ।**
**యావత్సంధ్యాదికం కర్తుముపవిష్టస్తదా మునిమ్ ॥ 29**

**దదర్శ నారదం నత్వా పూజయామాస సాదరమ్ ।**
**తతః పప్రచ్ఛ మునయే యూపకేతుః పురః స్థితః ॥ 30**

**కుతః సమాగతం చేతి తచ్ఛ్రుత్వా నారదో మునిః ।**
**సర్వం వృత్తం సవిస్తారం కథయామాస బాలకమ్ ॥ 31**

**తచ్ఛ్రుత్వా సకలం వృత్తం నత్వా తం నారదం మునిమ్ ।**
**అబ్రవీద్బాలకో వాక్యం సక్రోధః సంభ్రమాన్వితః ॥ 32**

అంత ఆ మదనసుందరి మిక్కిలి చింతాక్రాంతయై కన్నీరు కమ్ముచుండగా గద్గదస్వరమును, రోమాంచనమును, స్వేదమును, అదరస్పదమును, నిజదుస్థితిని చూపుచుండగా వాడిన మోముగలదై, "స్వామీ! ఎట్లైనను నన్ను శ్రీరామచంద్రస్వామియొక్క కోడలగునట్లు చేయవలయును. అందుకై మిమ్మునే శరణమని నమ్మియున్నాను," అని చెప్పి మునీంద్రునియొక్క పాదారవిందములమీద తన తలనుంచి నమస్కరించెను. ఇట్లు అంగలార్చుచుండ మదనసుందరిని జూచి, నారదుడు, "ఓ కన్యా రత్నమా! లెమ్ము! నీవు శ్రీరామచంద్రస్వామియొక్క కోడలు కాగలవు. నేను దానికి తగిన యత్నమును చేయుదును," అని చెప్పి, ఆమెను సమాధానపరచి, తన దారిలో తాను వెడలెను (27).

## మదనసుందరి స్వయంవర వృత్తాంతము.

అంతలో అయోధ్యా పట్టణమునుండి, రథారూఢుడైన ఉపకేతువు వనమును అవలోకించుచు, తమసానదీతీరమునకు వచ్చెను. అచట తగు సైన్యములతో ఉన్న ఉపకేతువు సంధ్యావందనాది నిత్యకర్మలను, ఆ తమసానదిలో స్నానము చేసి నెరవేర్చుసమయానికి, నారదమునీంద్రుడు అచటికి ఏతెంచెను. ఉపకేతువు మునీంద్రుని జూచి; అర్ఘ్య, పాద్యాదికములను ఇచ్చి, పూజించి, ఎదుట నిలిచి, "ఎచటనుండి తమరిరాక" అని కుశల ప్రశ్నలను అడిగెను. అంత ఆ బాలకునికి నారదుడు సమస్త వృత్తాంతమును సవిస్తరముగా చెప్పెను. అంత ఆ మాటలను విని, విదిత వృత్తాంతుడైన ఉపకేతువు క్రోధావిష్టుడై,

**మునే నృపాణాం సర్వేషాం ద్వేషబుద్ధిశ్చ రాఘవే ।**
**యా జాతా సాఽద్య సర్వేషాం జ్ఞేయాఽనర్థకరీ జవాత్ ॥ 33**

**కంబుకంఠాదిభూపానాం సారం పశ్యామ్యహం రణే ।**
**రణే త్వత్కృపయా సర్వాన్ జిత్వా తామానయామ్యహమ్ ॥ 34**

ఇత్యుక్త్వా స యయౌ కాంతిం పంచమేఽహని సేనయా ।
నారదోఽపి యయౌ రామం ద్రష్టుం ప్రీతమనాస్తదా ॥ 35

రామేణ పూజితః ప్రేమ్ణా భోజనార్థం నిమంత్రితః ।
అథ భోజనవేలాయాం యూపకేతుం రఘూత్తమః ॥ 36

అదృష్ట్వా లక్ష్మణం ప్రాహ యూపకేతుర్నదృశ్యతే ।
బాలేషు తం భోజనార్థం లక్ష్మణాత్ర సమాహ్వయ ॥ 37

తదా స మాలతీం గత్వా పప్రచ్ఛ లక్ష్మణో జవాత్ ।
సా ప్రాహ వనమధ్యేఽద్య కించిత్సైన్యయుతో గతః ॥ 38

వృత్తమేతద్యథావత్స గత్వా రామం జగాద హ ।
అథ రామో భోజనాది సంపాద్య మునినా ముదా ॥ 39

యయౌ సభాయామాసీనస్తం మునిం వాక్యమబ్రవీత్ ।
పంచసప్తదినాన్యత్ర స్థేయం మద్వచనాత్త్వయా ॥ 40

తథేతి నారదః ప్రాహ సభాయాం సంస్థితః సుఖమ్ ।
అథ రాత్రౌ యూపకేతుమదృష్ట్వా రఘునందనః ॥ 41

ఉపాహారం కర్తుకామః పునర్లక్ష్మణమబ్రవీత్ ।
ఆకారయ యూపకేతుం నాయం దృష్టో మయా శిశుః ॥ 42

తథేతి రామవచనాత్పునర్గత్వా తు మాలతీమ్ ।
పప్రచ్ఛ యూపకేతుం స సా ప్రాహ నాగతస్త్వితి ॥ 43

"మునీంద్రా! వినుము, ఈ రాజులందరికిని శ్రీరామచంద్రస్వామియందు ద్వేషబుద్ధి కలుగుటచేత ఇదియేదో అనర్థములు కలిగింపకమానదు. ఆ కంబుకంఠు మొదలైన మహారాజులయొక్క సామర్థ్యమును నేను రణమున పరీక్షించి చూచెదను. మునీంద్రుడా! నీ అనుగ్రహము వలన నేను అందరిని జయించి, ఆ మదన సుందరిని తీసుకుని వచ్చుచున్నాను," అని చెప్పి నారదమునికి నమస్కరించి, ఐదవనాడు కాంతీపురికి వెడలెను. ఇచట నారదుడు శ్రీరామదర్శనమునందు మిక్కిలి కుతూహలము గలవాడై అయోధ్యకు వచ్చి, శ్రీరామునిచే సంపూజింపబడి, అచటనే భోజనమునకు అభ్యర్థింపబడెను. అంత అందరును కూర్చుండి భోజనము చేయునపుడు శ్రీరాముడు ఉపకేతువు

కానరానందున లక్ష్మణుని జూచి, "ఎచట ఉపకేతువు కనబడుటలేదు. బాలకులతోడ అతనిని భుజించుటకు తీసుకుని రమ్ము," అని ఆజ్ఞాపించెను. అంతనతడు వచ్చి, ఉపకేతువు పత్నియైన మాలతిని "నీ మగడెచ్చటకు పోయె"నని అడిగెను. అందుకు ఆమె, "కొంతసేనను వెంటతీసుకుని వనమధ్యమునకు వెడలెను," అని వినయముగా పలికెను. లక్ష్మణుడు ఆసంగతిని విని, శ్రీరామసన్నిధానమున విన్నవింపగా, సరియని అందరితో మునీంద్రులతో భుజించి సభకేతెంచెను. అపుడా సభలో శ్రీరామచంద్రుడు నారదునితో, "తపోధనా! నీవు కొన్ని దినములు ఇచటనే ఆతిథ్యము అంగీకరించి ఆనందించు చుండవలయునని ప్రార్థించెను" అని చెప్పగా, అతడు అట్లేఅని అంగీకరించి, సభాసీనుడై సుఖముగా ఉండె. అంత ఆ రాత్రికూడా ఉపకేతువును చూడనందున దశరథాత్మజుడు రాత్రి భోజనమును స్వీకరించజాలక మరలా లక్ష్మణునితో, "తమ్ముడా! చిన్నవానిని తీసుకుని రమ్ము, నా బిడ్డడగు ఉపకేతువును నేను చూడలేదు. మిక్కిలి వ్యాకులముగా ఉన్నది." అని చెప్పెను. అట్లే అని లక్ష్మణుడు శ్రీరాముని మాటప్రకారము మరలా మాలతి వద్దకు పోయి, ఆమె భర్త వివరములు అడిగి, ఆ మగువ తన భర్త ఇంతవరకు రాలేదని చెప్పెను.

**తతః స విహ్వాలో భూత్వా రామం వృత్తం న్యవేదయత్ ।**
**రామోఽపి నాగతం శ్రుత్వా బన్ధుభ్యాం విహ్వాలోఽభవత్ ॥ 44**

**తతః సా జానకీ శ్రుత్వా విహ్వాలా ఖిన్నమానసా ।**
**దుద్రావ రాఘవాగ్రే సా సర్వే తూష్ణీం కథం స్థితాః ॥ 45**

**ఇతి తాన్ ప్రాహ వైదేహీ తదా సర్వేఽతి విహ్వాలాః ।**
**త్యక్త్వోపహారాన్ వేగేన తచ్ఛోధార్థం సముద్యతాః ॥ 46**

**తదా తాన్విహ్వాలాన్దృష్ట్వా నారదః ప్రాహ రాఘవమ్ ।**
**కాంతివృత్తం యూపకేతోః ప్రయాణాదికమాదరాత్ ॥ 47**

**తత్సర్వం రాఘవః శ్రుత్వా కించిత్తుష్టమనాస్తదా ।**
**లక్ష్మణం ప్రాహ వేగేన శత్రుఘ్నోఽద్యైవ గచ్ఛతు ॥ 48**

**సేనయా చతురంగిణ్యా జవాత్కాంతిం కుశాదిభిః ।**
**తథేతి లక్ష్మణశ్చోక్త్వా చోపహారాన్విధాయ సః ॥ 49**

**సేనయా బాలకైవగాచ్ఛత్రుఘ్నం ప్రేషయన్నిశి ।**
**రామం నత్వాఽథ శత్రుఘ్నః శీఘ్రం స్యందనసంస్థితః ॥ 50**

**యయౌ కాంతిసమీపం స షష్ఠేఽహని ముదాన్వితః ।**
**ఏతస్మిన్నంతరే కాంతిపుర్యాం తత్ర స్వయంవరే ॥ 51**

**సభాయాం రాజశార్దూలాః సంస్థితాస్తే ముదాన్వితాః ।**
**అథ సా శిబికారూఢాఽఽయయౌ మదనసుందరీ ॥ 52**

**కించిత్మ్లానముఖీ దుఃఖాత్ స్మరంతీ నారదేరితమ్ ।**
**వృద్ధోపమాతా తాం సర్వాన్ దర్శయామాస పార్థివాన్ ॥ 53**

ఉపకేతువు కనబడని సంగతి విని శ్రీరామ సన్నిధికి విన్నవించెను. ఆ మాట విని శ్రీరాముడు చింతాక్రాంత చిత్తుడై కలతపడుచుండెను. సీతాదేవి ఈ సంగతిని విని విచారపడుచు, పరుగెత్తివచ్చి, శ్రీరామసన్నిధానమున ఏమి అందరును ఊరకే ఉన్నారే," అని జాగరూకత నిచ్చుచుండెను. అపుడు అందరును ఆహారాదులను అట్లేవదిలి, చింతతో ఉపకేతువును త్వరగా వెదుకుటకు ఉద్యమించిరి.(46)

ఇట్లు పరితపించుచుండు శ్రీరామదూతలను జూచి, నారదమునీంద్రుడు కాంతీపురిలోని మదనసుందరి స్వయంవర వృత్తాంతమును, ఉపకేతు ప్రయాణ సమాచారమును తిన్నగా చెప్పెను. ఆ సంగతిని శ్రీరామచంద్రుడు సమగ్రముగా విని, మనసున కొంత ఆనందమునంది, అప్పుడు లక్ష్మణునిజూచి, "త్వరగా నీవిపుడే శత్రుఘ్నుని పోనిమ్ము. చతురంగ సైన్యములతో కుశాది పుత్రులతోను వెడలవలయును," అని ఆజ్ఞాపించెను. అట్లే అని లక్ష్మణుడు సభా వ్యవహారములను వదలి, సేనలతోను, బాలకులతోను శత్రుఘ్నుని ఆరాత్రి పంపించెను. శత్రుఘ్నుడు అపుడు శ్రీరామచంద్రుని చరణారవిందములకు నమస్కరించి, రథారూఢుడై వెడలి, ఆరవనాడు సంతోషముతో కాంతీపురి సమీప ప్రాంతములను చేరెను.(51) అంతలో ఆ కాంతీపురిలో ఆ స్వయంవరమున సభలో రాజేంద్రులందరును ఆనందములో ఓలలాడుతూ సుఖాసీనులై ఉండిరి. ఆ మదనసుందరి కొంచెము వాడిన మోము గలదై దుఃఖమున నారద వచనమును తలంచుచు పల్లకీనెక్కి ఆ సభాభవనమున ప్రవేశించెను. ముసలిదియగు దాది ఆమెకు సమస్త రాజులను చూపించుచు వచ్చెను.

**యూపకేతుస్తదా వేగాద్గత్వా తూష్ణీం సభాంగణమ్ ।**
**మోహనాస్త్రం విసృజ్యాథ మోహయామాస తాం సభామ్ ॥ 54**

**మోహితైర్మోహనాస్త్రేణ న్యస్తాం తద్వాహకైర్భువి ।**
**రథేన శిబికాం గత్వా ధృత్వా మదనసుందరీమ్ ॥ 55**

**నిజాభిధానం సంశ్రావ్యం తాం తుష్టామకరోత్తదా ।**
**అథ సా వరయామాస వీరం మదనసుందరీ ॥ 56**

ముమోచ మాలాం తత్కంఠే నవరత్నమయీం శుభామ్ ।
తతః స యూపకేతుర్వై రథే మదనసుందరీమ్ ॥ 57

నివేశ్య కాంతిపుర్యాః స బహిర్గత్వా స్థిరోఽభవత్ ।
తామాహ దయితాం వీరస్త్విదానీం త్వం భయం త్యజ ॥ 58

జిత్వా సర్వాన్ నృపానద్య త్వయా గచ్ఛామ్యహం పురీమ్ ।
తత్తస్య వచనం శ్రుత్వా సా ప్రాహ వచనం తదా ॥ 59

బహవః సంతిరాజానస్త్వమేకః స్వల్పసేనయా ।
అసంఖ్యాతాని సైన్యాని తేషాం పశ్య సమంతతః ॥ 60

కథం యుద్ధం భవేదత్ర మా కురుష్వాద్య సంగరమ్ ।
శీఘ్రం మాం నయ సాకేతం తతో రామేణ సేనయా ॥ 61

యుద్ధం కురు నృపైర్ఘోరం శ్రుణు మద్వచనం ప్రభో ।
మా సాహసం కురుష్వాత్రార్థయే త్వాం ముహుర్ముహుః ॥ 62

ఇతి తస్యా వచః శ్రుత్వా తామాశ్వాస్య పునః పునః ।
ఉపసంహారయామాస మోహనాస్త్రం స లీలయా ॥ 63

తదా తే పార్థివాః సర్వే శ్రుత్వా నీతాం వధూం బలాత్ ।
శత్రుఘ్నతనయేనేతి స్త్రీవాక్యైః స్యందనే స్థితాః ॥ 64

నిర్యయుః కోటిశో యోద్ధుం స్వస్వసేనావృతా జవాత్ ।
చంపికాయాః సుమత్యాశ్చ పూర్వవైరేణ దర్పితాః ॥ 65

అపుడు ఉపకేతువు మిక్కిలి త్వరగా ఆ సభామండపమున ప్రవేశించి, ఆ సభనంతయును మోహనాస్త్రమును ప్రయోగించి, అందరిని మూర్ఛాక్రాంతము జేసెను. ఆ మోహనాస్త్రముచే మూర్ఛాక్రాంతులైన వాహకులు పల్లకిని దించిరి, కన్య పడియుండగా రథముమీద వచ్చిన ఉపకేతువు ఆమెను పట్టి, తనపేరుచెప్పి, ఆమెకు ఆనందకేళిని అందించెను. అంత ఆమె నవరత్నాలంకృత దివ్యమంగళ హారమును ఉపకేతు కంఠమున అలంకరించి, అతనిని ప్రాణనాథునిగా వరించెను. పిదప ఉపకేతువు మదనసుందరిని రథమున ఎక్కించుకుని, కాంతీపురియొక్క ఎల్లలను దాటి తన పరివారముతో సుస్థిరుడై నిలచి, మదనసుందరిని జూచి, "ప్రేయసీ! నీవిపుడు భయపడవలదు. ఈ

రాజులను అందరిని జయించి, నిన్ను సాకేత రాజధానికి కొనిపోవుచున్నాను.” అనెను. ఆ వీరాలాపములను విని, ఆమె, “ఇక్కడ రాజులు చాలామంది గలరు. నీవేమో కొద్దిపరివారముతో ఉన్నావు. ఎచట చూచినను సేనలే కనబడుచున్నవి. వారి సైన్యము అసంఖ్యాకములు చూడుము. ఇట్టిస్థితిలో ఎట్లు యుద్ధము జరుగునో? ఇపుడు నీవు రణసాహసమునకు వెడలవలదు. త్వరగా నన్ను అయోధ్యకు తీసుకుని పొమ్ము. పిమ్మట రామునియొక్క సైన్యములసహాయముతో రాజులతో ఘోర యుద్ధమును చేయుము. మహాప్రభూ! నామాటను వినుము నిన్ను నేనిట్లు పలుమార్లు ప్రార్థించుచున్నాను. సాహసింపకుము.” అని ప్రార్థించుచుండు మదన సుందరియొక్క మాటలను విని, మరలామరలా ఆమెను సమాధానపరచుచు, ఉపకేతువు వినోదముగా ఆ మోహనాస్త్రమును ఉపసంహారము జేసెను. అపుడు ఆ రాజులందరును బలాత్కారముగా శత్రుఘ్న నందనుడగు ఉపకేతువు కన్యారత్నమును ఎత్తుకొని పోయెనని తెలుసుకుని రథారూఢులై కోట్లకొలదిగా తమతమ సైన్యములను తీసుకుని త్వరగా యుద్ధోన్ముఖులై వచ్చిరి. ఇట్లు చంపికా సుమతి స్వయంవర వైరముచే రాజులంతా మదోన్మత్తులై వెంటబడిరి.

**దుద్రువుర్నేమిమార్గేణ దదృశుస్తం రథస్థితమ్ ।**
**యుక్తం మదనసుందర్యా బిభ్రంతం మాలికాం హృది ॥ 66**

**తతస్తం ముముచుః సర్వే నానాశస్త్రాణి సైనికాః ।**
**యూపకేతుస్తదా వేగాత్టణత్కృత్య మహద్ధనుః ॥ 67**

**వాయవ్యాస్త్రేణ తాన్సర్వానుద్ధృధ్య దశదిక్షు సః ।**
**ప్రాక్షిపత్పార్థివాన్ సైన్యై ర్నానావాహనసంస్థితాన్ ॥ 68**

**తదా స కంబుకంఠోఽపి పూర్వవైరమనుస్మరన్ ।**
**చంపికాయాః సుమత్యాశ్చ స్వయంవరసముద్భవమ్ ॥ 69**

**నిశేషాన్నిజకన్యాయా వైరతో హరణం బలాత్ ।**
**మహాక్రోధాన్నిర్యయౌ స స్వసైన్యేన పరివేష్టితః ॥ 70**

**కుర్వన్ దుందుభిఘోషాంశ్చ యుద్ధార్థం యూపకేతునా ।**
**యూపకేతురపి శ్రుత్వా దుందుభీనాం మహత్స్వనమ్ ॥ 71**

**కాంతిపుర్యుత్తరద్వారపురతః సంస్థితో రథీ ।**
**టణత్కృత్య మహచ్చాపం సందధే శస్త్రముత్తమమ్ ॥ 72**

**యే యే వీరాః పురద్వారాన్నిర్గతాశ్చ బహిః శనైః ।**
**తాన్ జఘాన క్షణాదేవ ప్రేతైర్ద్వారం రురోధ సః ॥ 73**

**తం దృష్ట్వా యూపకేతోశ్చ కంబుకంఠః పరాక్రమమ్ ।**
**యయౌ స్వయం స్యందనేన ప్రేతసంఘం విదార్య చ ॥ 74**

**శేషసైన్యేన సంయుక్తో యూపకేతుం క్రుధా జవాత్ ।**
**తదాఽఽహ యూపకేతుం స మయా త్వం సంగరం కురు ॥ 75**

**కిమేతాన్మశకాన్ హత్వా పౌరుష మన్యసే జడ ।**
**ఇత్యుక్త్వా సప్తభిర్బాణైర్యూపకేతుం జఘాన సః ॥ 76**

**తాన్బాణానాగతాన్ దృష్ట్వా యూపకేతుర్నిజైః శరైః ।**
**తాన్ఛిత్వా నవబాణైస్తచ్చాప సారథినం ధ్వజమ్ ॥ 77**

**కవచం ముకుటం ఛిత్వా జఘాన తురగానపి ।**
**పద్భ్యాం తదా కంబుకంఠో గదామాదాయ దుద్రువే ॥ 78**

రాజులందరును మదనసుందరి దత్త రత్నమాలికాలంకృత కంఠుడైన రథారూఢుడగు ఉపకేతువును విభ్రాంతులై విలోకించిరి. అంత అందరి సైనికులును నానాస్త్రములను ఉపకేతువు మీద ఏకకాలమున ప్రయోగించిరి. అపుడు అతడు తనధనస్సును ఎక్కుపెట్టి, టంకారముచేసి, వాయువ్యాస్త్రము ప్రయోగించి, వారినందరిని పదిదిక్కులకును చిమ్మెను. వివిధ వాహనములను ఎక్కి, వసుమతీశులను వారివారి సైన్యములతో ఇట్లు పడమొత్తి వెదజల్లగా అపుడు కంబుకంఠుడును, చంపికా సుమతి జన్యమైన వైరమును స్మరించుచు, మరియు తన కూతురిని బలాత్కారముగా అపహరించి నందున అతిశయ శత్రుత్వము వహించి, కోపముతో తనయొక్క మహాసైన్యములను తీసుకుని రణవాద్యములు మ్రోగుచుండగా, ఉపకేతువుతో యుద్ధమునకు వచ్చెను. ఇచట ఉపకేతువు రణదుందుభుల నాదమును విని, కాంతీపురియొక్క ఉత్తరద్వారమున రథారూఢుడై నిలచి, ధనుష్టాంకారముజేసి, ఉత్తమ శస్త్రమును అనుసంధించెను. యే వీరులు ఊరిబయటకు వచ్చుచుందురో వారినందరిని క్షణమాత్రమున ఈ ఉపకేతువు సంహరించుచుండగా ఆ ద్వారమున శవాలచే అడ్డగింపబడెను. అట్టి ఉపకేతువు యొక్క పరాక్రమమును కంభుకంఠుడు జూచి, తానే రథారూఢుడై ప్రేతసంఘమును భేదించుకుని,

తావత్సహస్రధా బాణైర్యూపకేతుశ్చకార తామ్ ।
తతో బద్ధ్వా దృఢాం ముష్టిం కంబుకంఠస్త్వరాన్వితః ॥ 79

హృదయే యూపకేతోస్తాం జఘానాచలసన్నిభామ్ ।
తదా స యూపకేతుస్తం శ్వశురస్యందనోపరి ॥ 80

ధ్వజే బబంధ వేగేన ఖడ్గం జగ్రాహ సంభ్రమాత్ ।
కంబుకంఠశిరచ్ఛేదం కర్తుం తం సముపస్థితమ్ ॥ 81

దృష్ట్వా ధృత్వా కరే తస్య సఖడ్గం సంభ్రమాన్వితా ।
తమాహ నత్వా సాధ్వక్షీ తదా మదనసుందరీ ॥ 82

విహ్వలా విగతోత్సాహా వేపతీ హ్యశ్రులోచనా ।
మమ తాతం కంబుకంఠమేనం హంసి కథం ప్రభో ॥ 83

మక్షికాపతనం పూర్వం గ్రాసే యద్వత్త్వయా కృతమ్ ।
సుఖారంభే పూర్వమేవ దుఃఖకర్మావలంబితమ్ ॥ 84

మద్వాక్యాన్నైవ హంతవ్యస్తస్మాత్త్వాం ప్రార్థయామ్యహమ్ ।
ఏవం మదనసుందర్యా వచః శ్రుత్వా విహస్య సః ॥ 85

కరాద్విసృజ్య తం ఖడ్గం స్వసూతం చోదయన్ముదా ।
సేనయా స యయౌ యావత్పథాఽయోధ్యాం పురీం ప్రతి ॥ 86

కంబుకంఠుడు మిగిలిన సైన్యముతోడ క్రుద్ధుడై త్వరగా ఉపకేతువునకును సుముఖముగా నిలిచి, "ఓరీ జడుడా! ఈ దోమలవంటి మానవులను చంపిన మాత్రమున ఏమి నీ పౌరుషమును గొప్పగా తలంచెదవు? నాతోడ యుద్ధముచేయుము అని ధిక్కరించి, ఏడు బాణములచే ఉపకేతువును పడమొత్తెను. ఆ వచ్చుచున్న బాణములను జూచి, ఉపకేతువు తననారాచములచే వాటిని ఖండించి, మరి తొమ్మిది బాణములతో వానిధనస్సును, ధ్వజమును సారథిని ఖడ్గమును, కవచమును, కిరీటమును, గుల్బములను కూడా ధ్వంసముచేసెను. అపుడు కంబుకంఠకుడు త్వరపడి పర్వతమువంటి చేతితో బలముగా ఉపకేతువుయొక్క హృదయమున కొట్టెను. అంత ఆ ఉపకేతువు కంభుకంఠుని ఆ రథముమీద అల్లె త్రాటితో ధ్వజస్థంభమునకు అంటగట్టి, వేగముగా అతనిని సంహరించుటకై ఖడ్గమును ఎత్తెను.

## ఉపకేతువు కంబుకంఠుని కాపాడుట.

అపుడు మదనసుందరి; ఖడ్గమును బట్టి తనతండ్రిపైకి ఉరుకుతున్న భర్తయగు ఉపకేతువు చేతిని పట్టుకుని నమస్కరించుచు, "ప్రభూ! నా తండ్రియైన కంబుకంఠరాజును ఎట్లు చంపెదవు? అట్లు చంపితే నోటికెత్తిన కడిలో ఈగపడినట్లు కాదా? సుఖారంభమున మొదటనీ దుఃఖకర్మ ఆరంభింపబడుచున్నది, నా మాటమీద ఇతడు చంపబడకూడదు. అందువలన నేను నిన్ను ప్రార్థించుచున్నాను," ఉత్సాహము తగ్గి, కలతనంది, క్లేశపడుచు, కన్నీరు మున్నీరు కాగా, కంబుకంఠుని రక్షించమని ప్రార్థించుచుండెను. అంత ఆ ఉపకేతువు ఖడ్గమును పారవేసి, తన సారథిని ప్రేరేపించెను. ఆ సారథి అట్లే అయోధ్యానగర మార్గమున సపరివారముగా రథమును త్రిప్పెను, (86)

**తావదుందుభినిర్ఘోషానగ్రే శుశ్రావ సేనయా ।**
**పునశ్చాపం దృఢీకృత్య యూపకేతుస్తదా పథి ॥ 87**

**కస్యాగ్రే వాహినీ చేతి చింతయామాస చేతసి ।**
**తతః శరం ముమోచైకం నిజనామాంకితం జవాత్ ॥ 88**

**యోజనాంతరసేనాయాం శరః శత్రుఘ్నసన్నిధౌ ।**
**పపాత తత్పదాగ్రే తం దృష్ట్వా స చకితస్తదా ॥ 89**

**శరపుచ్ఛే యూపకేతోర్నామ దృష్ట్వాఽథ శత్రుహా ।**
**నిశ్చితవాన్యూపకేతుర్మార్గేఽగ్రేవర్తతేధ్రువమ్ ॥ 90**

**తతశ్చాపే స శత్రుఘ్నః స్వనామాంకితముత్తమమ్ ।**
**శరం సంధాయ విముఖం యూపకేతుం ముమోచహ ॥ 91**

**స శరో యూపకేతోశ్చ మస్తకాదూర్ధ్వతస్తదా ।**
**అపతత్పృష్ఠభాగే స తం దదర్శ పితుః శరమ్ ॥ 92**

**తదా హృష్టో యూపకేతుః కుర్వన్దుందుభినిస్వనాన్ ।**
**గత్వా వేగేన శత్రుఘ్నం దృష్ట్వోత్ప్లుత్య రథాదధః ॥ 93**

**ననామ పితరం పత్న్యా కంబుకంఠం ప్రదర్శయత్ ।**
**తదా తం సుహృదం జ్ఞాత్వా మోచయామాస శత్రుహా ॥ 94**

కంబుకంఠముఖాచ్ఛ్రుత్వా సర్వం వృత్తం సవిస్తరమ్ ।
శత్రుఘ్నః ప్రార్థితస్తేన సుహృదా తత్పురీం యయౌ ॥ 95

కాంతిపుర్యా బహిః స్థిత్వా కంబుకంఠమతేన సః ।
ఆకారణార్థం లగ్నాయ రామం దూతాన్ప్రచోదయత్ ॥ 96

తదా తే కంబుకంఠస్య శత్రుఘ్నస్యాపి వేగతః ।
ఆకారణార్థం శ్రీరామం యయుర్దూతా ముదాన్వితాః ॥ 97

**ఇతి శ్రీశతకోటిరామచరితాంతర్గతే, శ్రీమదానందరామాయణే, వివాహకాండే, ఆదికావ్యే, వాల్మీకీయే, మదనసుందరీహరణం నామ, అష్టమః సర్గః ॥**

ఇట్లు వచ్చుచుండునపుడు ఉపకేతువు దారిలో నెదుట సేనతోడ వచ్చుచుండు దుందుభి నాదమును వినెను. అపుడు ఉపకేతువు మరలా ధనస్సును దృఢపరచుకుని, ఈ సేన ఎవనిది అని చింతించుచు, అంత తిన్నగా ఒక బాణమును ప్రయోగించెను. ఆ ఉపకేతువు నామాంకిత బాణము వెడలి, యోజన దూరములో ఉండు సైన్యమధ్యమున శత్రుఘ్నుని పాదములమీద పడెను. అతడు దానిని జూచి, ఇపుడు చకితుడై బాణమూలమున ఉపకేతువుయొక్క నామమును జూచి, తప్పక దారిలో ఉపకేతువు ఎదుట వచ్చుచున్నాడని నిశ్చయించి, అంత తానుకూడా తన పేరుగల బాణమును తలక్రిందుగా అనుసంధానముజేసి, ఉపకేతువుమీద ప్రయోగించెను. ఆ బాణము ఉపకేతువు యొక్క తలమీదుగా వెడలి వీపు ప్రక్కపడెను. అంత నతడు దానిని జూచి తండ్రిప్రయోగించిన బాణమని గుర్తించి, అత్యంత ఆనందమునంది, దుందుభి వాద్యములను వాయించుకొనుచు త్వరగా ప్రయాణము జేసి, శత్రుఘ్నుడు కనబడగానే, తటాలున రథమునుండి దిగి, పత్నితోడ ప్రణమించి, కంభుకంఠుని జూపించెను. అపుడు శత్రుఘ్నుడు వానిని సుహృదునిగా గుర్తించి విడిపించెను. అంత ఆ కంభుకంఠుడు సమస్త వృత్తాంతమును తెలుసుకుని శత్రుఘ్నుడు మిత్రుడగు కంబుకంఠకునిచే సంప్రార్థింపబడి, వాని పట్టణమునకు వెడలి, అచట ఊరిబయటనే అతని అభిప్రాయము చొప్పున నిలిచెను. మదన సుందరి వివాహ లఘ్నమునకు దయచేయవలయునని శ్రీరామసన్నిధానమునకు కంబుకంఠుని దూతలును, శత్రుఘ్న దూతలును సంతోషముతో శ్రీరామచంద్రస్వామిని పిలుచుకుని వచ్చుటకై అయోధ్యకు వెడలిరి.... (8)

***ఈ విధముగ శ్రీమద్వాల్మీకి మహర్షిచే రచింపబడిన, శ్రీ శతకోటిరామచరితాంతర్గత శ్రీమత్ ఆనందరామాయణములో, ఆరవదైన వివాహకాండలో 8వ సర్గ ముగిసినది.***

# నవమః సర్గః-9వ సర్గ

శ్రీరామ వంశ విస్తరణ

**శ్రీరామదాస ఉవాచ**

**గత్వాఽయోధ్యాపురీం దూతా రామం వృత్తం న్యవేదయన్ ।**
**రామోఽపి శ్రుత్వా తద్వృత్తం సీతాయై సంన్యవేదయత్ ॥ 1**

**తతో ముహూర్తే శ్రీరామః సావరోధజనైః సహ ।**
**పౌరైర్జానపదైః సర్వైః సుహృద్భిః సేనయా సహ ॥ 2**

**నారదేన యయౌ కాంతిమాద్యాం ముక్తిపురీం ప్రతి ।**
**తతః శ్రుత్వా కంబుకంఠః శీఘ్రం రాఘవమాగతమ్ ॥ 3**

**స ప్రత్యుద్గమ్య వినయాన్నత్వా సమ్పూజ్యయన్ముదా ।**
**యుపకేతు తతః పూజ్య వారణస్థం పురీం శనైః ॥ 4**

**వారస్త్రీనృత్యగీతైశ్చ తూర్యఘోషైర్నినాయ సః ।**
**తతః కాంతిపురీస్థాస్తాః స్త్రియః ప్రాసాదసంస్థితాః ॥ 5**

**దృష్ట్వా రామం యూపకేతుం వవర్షుః పుష్పవృష్టిభిః ।**
**తతో రామః శనైర్వస్తుం కల్పితం గృహముత్తమమ్ ॥ 6**

**గత్వా దృష్ట్వా ముహూర్తం తు పూర్వోక్తకౌతుకైః సుఖమ్ ।**
**యూపకేతోర్వివాహం స చకార పరమోత్సవైః ॥ 7**

**తతో వివాహం నిర్వృత్య కంబుకంఠేన పూజితః ।**
**హస్త్యశ్వరథపాదాతదాసదాసీజనాదిభిః ॥ 8**

**యయౌ మదన సుందర్యా రామోఽయోధ్యాపురీం నిజామ్ ।**
**తతో వివేశ నగరీం నేదుర్వాద్యాని వై తదా ॥ 9**

నననృతుర్వారనార్యశ్చ తుష్టువుర్మాగధాదయః ।
ప్రాసాదస్థాః స్త్రియో రామం వవర్షుః పుష్పవృష్టిభిః ॥ 10

మార్గే నీరాజితః స్త్రీభిర్వివేశ నిజమందిరమ్ ।
కారయిత్వా రమాపూజాం దదౌ దానాన్యనేకశః ॥ 11

సుహృదః పూజయామాస రాఘవో వసనాదిభిః ।
తతో విసర్జయామాస సర్వాన్స్వస్వస్థలంప్రతి ॥ 12

## శ్రీరాముడు మదనసుందరి వివాహమునకు వచ్చుట

శ్రీరామదాసు ఇట్లు పలికెను, "తరువాత ఆ దూతలు శ్రీరామచంద్రస్వామికి ఉపకేతు, మదనసుందరి వృత్తాంతమును సవిస్తరముగా విన్నవించిరి. రఘునాథుడును ఆ వృత్తాంతమును విని, సీతాదేవికి ఉపకేతు వివాహవార్తను పంపెను. అంత ఆ వివాహముహూర్తము రాగా, శ్రీరామచంద్రుడు అంతఃపుర జనులతోను, పౌర, జానపదాది ప్రముఖులతోను, సమస్త మిత్రులతోను, సేనలతోను, నారదమహామునీంద్రుని వెంటపిలుచుకుని, మొదటి ముక్తిక్షేత్రమగు కాంతిపురికి వెడలెను. అంత ఆ సంగతిని కంబుకంఠుడు త్వరగా శ్రీరాముడు వచ్చుచున్నాడని విని, ఎదుర్కోలు పోయి, వినయవనతుడై శ్రీరామచంద్రస్వామిని సంతోషముతో చక్కగాపూజించెను. గజారూఢుడగు ఉపకేతువునకు వరపూజచేసి, నృత్య, గీత, వాద్యాది, సమస్త వైభవములతో కాంతిపురి లోనికి తీసుకుని వెడలెను. అంత ఆ పురిలోని మేడలమీదనెక్కి వేడుకలు జూచుచుండు నాగరికులగు స్త్రీలందరును ఉపకేతువుమీద విరులవాన కురిపించిరి, అంత ఆ కంబుకంఠుడు శ్రీరామచంద్రస్వామికి విడిదిల్లును వైభవోపేతముగా అమర్చి, విశేష వినోదములతో వివాహమును విధివిధానముగా చేయించెను. అటుమీద రఘురాముడు కంబుకంఠునిచే చక్కగాపూజింపబడి, అతడు సమర్పించిన గజ, రథ, తురగ, పదాతి, దాస, దాసి, వాహనాది సమస్తమును స్వీకరించి, అతనిని అనుగ్రహించి, మదనసుందరి–ఉపకేతువులను నూతన వధూవరులను తీసుకుని రాజధానియగు అయోధ్యాపురికి వచ్చెను. అంత నగరప్రవేశము చేయునపుడు మంగళవాద్యములు శ్రావ్యముగా వాయింపబడినవి. గణికులాడిరి, గాయకులు పాడిరి, వందిమాగదులు స్తోత్రపాఠములను చెప్పుచు, సంశ్లాఘించుచుండిరి. ప్రాసాదములమీది విలాసినిలందరును శ్రీరామచంద్రస్వామిమీద పూలవానలు కురిపించిరి. నడుమ

నడుమ నారీమణులు సమర్పించుచుండు రత్న నీరాజనాదులను అనుగ్రహించుచు, రాజమందిరమున ప్రవేశించెను మరియు ఆ ఉపకేతువుచే లక్ష్మీపూజ చేయించి, వివిధములగు సమస్త దానములను ఒసంగి, మిత్రమండలిని, కనక వసనాదులచే సత్కరించి, అంత అందరిని వారివారి స్వస్థలములకు పంపించెను. (12)

**అథ సప్త కుమారాశ్చ లవాద్యాః స్వస్వవేశ్మని ।**
**చక్రుః క్రీడాం పృథక్ స్త్రీభ్యాం కుశశ్చంపికయాఽకరోత్ ॥ 13**

**చంపికాయాం దుహితరః కుశాజ్జాతాః శుభా నవ ।**
**కుశస్యాగ్రే కుముద్వత్యాం భవిష్యంత్యష్ట సూనవః ॥ 14**

**భవిష్యతి తథా కన్యా త్వేకా చంపకమాలినీ ।**
**జ్యేష్ఠః పుత్రేఽతిథిరితి నామ్నా రాజ్యం కరిష్యతి ॥ 15**

**చతుర్దశ సుమత్యాద్యాః స్త్రియః సర్వాః క్రమేణ హి ।**
**సుషువుస్తనయానష్ట కన్యైకాఽపి పృథక్ పృథక్ ॥ 16**

**స ద్వాదశశతం పౌత్రాన్పౌత్రీశ్చైవ మనోరమాః ।**
**త్రయోవింశద్రామచంద్రో లాలయామాస సీతయా ॥ 17**

**కుముద్వతీభావిపుత్రసహితాః శిశవః శుభాః ।**
**వింశచ్ఛతమాసంస్తే తథా పౌత్ర్యస్తటిత్ప్రభాః ॥ 18**

**చతుర్వింశన్మితాశ్చాసన్ సర్వాశ్చోద్వాహితా నృపైః ।**
**తథా శ్రీరామపౌత్రైశ్చ నృపకన్యా హ్యనేకశః ॥ 19**

**కాశ్చిత్స్వయంవరేణైవ కాశ్చిద్రాక్షసయోగతః ।**
**కాశ్చిద్గాంధర్వయోగేన కాశ్చిద్వైవాహకర్మణా ॥ 20**

**పరిణీతాః పౌరుషేణ తాసాం సంఖ్యా న విద్యతే ।**
**తాసాం హి సంతతిం వక్తుం కః సమర్థో భవేదిహ ॥ 21**

ఏవం స యూపకేతోశ్చ వివాదశ్చరమః శుభః ।
సంపాద్య నారదః శ్రీమాన్ సభాయాం రఘునందనమ్ ॥ 22

రామనామసహస్రేణ సూతోక్తేనాతిభక్తితః ।
స్తుత్వా శ్రీరాఘవం పృష్ట్వా యయావాకాశవర్త్మనా ॥ 23

## శ్రీరామచంద్రస్వామియొక్క వంశాభి వర్ణనము.

అనంతరము లవుడు మొదలుగా గల ఏడుగురు కుమారులను తమతమ రాజమందిరములలో వేరువేరుగా తమపత్నులతో ఆనందకేళి అందుచుండిరి. కుశుడు చంపికతో విహరించుచుండెను. కుశుని వలన చంపికయందు తొమ్మిదిమంది మంగళాంగులగు పుత్రికలు జనించిరి. ఇకమీద కుశునికి కుముద్వతి గర్భమున ఎనిమిదిమంది పుత్రులు జనించెదరు. అట్లే మరియొక కన్యకకూడా చంపిక, మాలిని అనునది జనించును. అతిథి అను పేరుగల జ్యేష్ఠపుత్రుడు రాజ్యమును ఏలగలడు. సుమతి మొదలైన పద్నాలుగుమంది కోడండ్రు వేరువేరుగా ఒక్కొక్కరు ఏనిమిది మంది మగబిడ్డలను, ఒక్కొక్క ఆడబిడ్డను కనుచుండిరి. శ్రీరామచంద్రుడు సీతాదేవితో 112 మంది మనుమలను, 23మంది మనుమరాండ్రను పాలించు చుండెను. కుముద్వతియొక్క భవిష్య పుత్రులతో 121 మంది మనుమలను, అట్లే అందమైన 24మంది మనుమరాండ్రు అయిరి. శ్రీరాముడు ఆ మనుమరాండ్రందరికి మంచి రాజులకిచ్చి వివాహము జరిపించెను. అట్లే ఆ పుత్రులను ఉపకన్యారత్నములను అనేకముగా పెండ్లాడిరి. కొందరు స్వయంవరములలోను కొందరు, రాక్షస వివాహ విధిలోను కొందరు, గంధర్వ వివాహ క్రమమున మరికొందరు క్రమ వివాహములు చేసికొనిరి. ఆ రాజులంతా తమతమ పౌరుషములతో అంతఃపురమున సుఖించుచుండిరి. మనుమలు, మనుమరాండ్ర సంఖ్య చెప్పుటకు అలివికాదు. ఆ స్త్రీలయొక్క సంతానము అభివర్ణించుటకు ఎవని తరము? ఇట్లు కడపటి ఉపకేతువు నకును, మదనసుందరికిని జరిగిన పెండ్లివేడుకలను జూచి, నారదుడు సభలో శ్రీరామచంద్ర స్వామిని సూతోక్తమగు శ్రీరామనామ సహస్రముచే మిక్కిలి భక్తితో స్తుతించి శ్రీరామాజ్ఞను పొంది, ఆకాశమార్గమున వెడలెను. (23)

శ్రీరామదాస ఉవాచ
ఏవం రామేణ సాకేతపుర్యాం భోగాశ్చిరం సుఖమ్ ।
భుక్తాస్తేషాం వర్ణనేఽత్ర కః సమర్థో భవేన్నరః ॥ 24

ఏక ఏవ సమర్థోఽభూద్వాల్మీకిస్తపసాం నిధిః ।
శతకోటిమితం యేన నానాక్రీడాదిసంయుతమ్ ॥ 25

వర్ణితం రామచరితం మహామంగళకారకమ్ ।
యత్ స్మృత్వాపి మయా కించిత్త్వదగ్రే పరివర్ణితమ్ ॥ 26

ఏవం రామస్త్వయోధ్యాయాం పుత్రైః పౌత్రైః సమన్వితః ।
ప్రపౌత్రైః పౌత్రపౌత్రైశ్చ రంజయామాస జానకీమ్ ॥ 27

ఏవం వివాహకాండం చ శిష్య త్వాం పరివర్ణితమ్ ।
నవసర్గైః పవిత్రం చ శ్రవణాన్మంగళప్రదమ్ ॥ 28

వివాహకాండం పరమం యే శృణ్వంత్యపి మానవాః ।
తే స్త్రీభిః పుత్రపౌత్రైశ్చ వియోగం నాప్నువంతి హి ॥ 29

ధర్మార్థీ ప్రాప్నుయాద్ధర్మం ధనార్థీ ధనమాప్నుయాత్ ।
కామానాప్నోతి కామార్థీ మోక్షార్థీ మోక్షమాప్నుయాత్ ॥ 30

స్త్రీకాముకైర్నరైరేతత్పఠనీయం నిరంతరమ్ ।
వివాహకాండ పరమం ప్రాప్నువంత్యత్ర తే వధూః ॥ 31

పతికామా కుమారీచేత్ స్నాత్వా శ్రోష్యతి భక్తితః ।
వివాహకాండమేతద్వై మనోజ్ఞం పతిమాప్నుయాత్ ॥ 32

సభార్యశ్చేత్పఠేదేతత్ శృణుయాద్వాఽత్ర భక్తితః ।
ఇహ స్త్రియా సుఖం భుక్త్వాఽప్సరోభిర్దివిమోదతే ॥ 33

సధవా శృణుయాదేతద్యా నారీ కాండముత్తమమ్ ।
వివాహాఖ్యం కదా భర్త్రా వియోగం నాప్నుయాత్తు సా ॥ 34

సప్తదశదినైరస్య కార్యం స్త్రీకాముకైర్ముహుః ।
అనుష్ఠానం వర్షమేకం మూర్ఖోఽపి స్త్రియమాప్నుయాత్ ॥ 35

ప్రథమే దివసే సర్గ పఠేద్వ్యా చ పరేఽహని ।
నవమే దివసే సర్గాన్ క్రమేణ సంపఠేన్నవ ॥ 36

దశమే దివసేఽష్టైవ క్షయస్త్వేకేన వై క్రమాత్ ।
ఏవం సప్తదశదినైరనుష్ఠానం స్మృతం బుధైః ॥ 37

అథవా సకలం కాండం ప్రథమే దివసే పఠేత్ ।
పరేఽహని ద్వివారం హి నవమే దివసే క్రమాత్ ॥ 38

నవవారం పఠేచ్చేదం దశమే దివసే తతః ।
అష్టవారం పఠేత్కాండం క్షయస్త్వేవం క్రమాత్స్మృతః ॥ 39

ఏవం నరో వర్షమేకమనుష్ఠానాత్ స్త్రియం లభేత్ ।
స్మితవక్త్రాం చారునాసాం దివ్యరూపాం మనోహరామ్ ॥ 40

వివాహకాండం పరమం పవిత్రం
ఆనందదం మంగళకారకం చ ।
స్త్రీదం మనోజ్ఞం శ్రుతిసౌఖ్యదం వై
నరైః సదా సంశ్రవణీయమేతత్ ॥ 41

ఆనందరామాయణమధ్యసంస్థం
వివాహకాండం పరమం హి షష్ఠమ్ ।
శృణ్వంతి భక్త్యా భువి మానవా యే
లభన్తి కామానఖిలాన్మనోజ్ఞాన్ ॥ 42

ఇతి శ్రీశతకోటిరామచరితాంతర్గతే, శ్రీమదానందరామాయణే, వాల్మీకీయే,
ఆదికావ్యే, వివాహకాండే, రామవంశావిస్తరాఖ్యానం నామ నవమః సర్గః ॥

**ఇతి వివాహకాండః సమాప్తః ॥**

ఇట్లు సాకేతరాజధానియగు అయోధ్యాపట్టణమున సచ్చిదానంద పరబ్రహ్మ శ్రీరామచంద్ర స్వామి లీలామానుష విగ్రహుడై, అనంతభోగములను అనుభవించుచుండెను. వాటిని వర్ణించి చెప్పుటకు సమర్థుడైన మానవుడు ఎవడు గలడు? వివిధ క్రీడాభివర్ణనములచే విరాజించుచుండు నూరుకోట్ల సంఖ్యాకములైన శ్రీరాములవారియొక్క దివ్యమంగళ చరిత్రములను అభివర్ణించి చెప్పిన తపోనిధి యగు వాల్మీకి మహర్షిఒక్కడే సమర్థుడు.

శ్రీరామదాసు చెప్పుచున్నాడు, విష్ణుదాసా! వినుము. "దానిలోని సారాంశమును కొంత నీకు నేను అభివర్ణించి చెప్పితిని. ఇట్లు శ్రీరామచంద్రుడు పుత్రులతోను, మనుమలతోను మునిమనుమల తోను, వారి మనుమలతోను జానకీదేవితో సంపూర్ణ సంసార సౌఖ్యమునంది, ఆనందపరచుచుండెను. ఇట్టి వివాహకాండ నాచే నీకు అభివర్ణించి చెప్పబడెను. తొమ్మిది సర్గలచే పరమపవిత్రమై వినినంతనే మేలుచేకూర్చు ఈ వివాహకాండను ఎవరు భక్తితో వినుచున్నారో వారు భార్యను, సంతానాన్ని, మనుమలను ఎప్పుడు ఎడబాయక సంసారసుఖమునంది ఆనందించెదరు. ధర్మము కావలసినవారికి ధర్మమును, ధనమును కావలసినవారికి ధనమును, కామము కావలసినవారికి కామము, మోక్షము కావలసినవారికి మోక్షమును లభించును. పరమోత్తమమగు ఈ వివాహకాండను భార్యను కోరువారు చదివినచో మంచి భార్య లభించును. మంచి భర్తను కోరు కన్యామణి నియమముతో, భక్తిగా చదివినచో మంచి వరుడు లభించును. భర్త సౌఖ్యమును కోరు స్త్రీ ఈ వివాహకాండను వినిన యెడల మనోహరుడగు భర్తతో సుఖమునందును. పెండ్లియైనవాడు దీనిని శ్రద్ధతో చదివినను విన్నను తన భార్యతో సంసారసౌఖ్యమునంది, అంత్యమున అప్సరస స్త్రీ సుఖకేళిచే ఆనందించును.

ఈ వివాహకాండమును యే సువాసిని స్త్రీముఖముగా వినునో ఆమె ఎప్పుడును పతిని ఎడబాయక సద్గతినొందును. స్త్రీ కాముకులు 17 దినములు దీనిని పలుమార్లు పఠించవలయును. ఒక సంవత్సరము ఈ వివాహకాండను పారాయణానుష్ఠానముచే పఠించినవాడు జడుడైనను మంచి కన్యక లభించి ఉల్లాసపడును. మొదటిదినమున ఒకసర్గ, మరునాడు రెండుసర్గలు, మూడవ నాడు మూడు సర్గలు, ఇట్లు తొమ్మిదవనాడు తొమ్మిది సర్గలు, పదియవనాడు మరల ఎనిమిది సర్గలు, ఇట్లు తగ్గించుచు వచ్చి, పన్నెండవనాడు ఒక సర్గ ఇలాగున ఒక సంవత్సరము వ్రతమును ఆచరించవలయును. అట్లు కాకపోయిన మొదటి దినమునందు వివాహకాండమును ఒకసారి, రెండవనాడు రెండుమార్లు ఇట్లు ప్రతిదినము ఒకటి పెంచుతూ తొమ్మిదవనాడు తొమ్మిదిమార్లు,

పదియవనాడు ఎనిమిదిమార్లు ఇట్లు తగ్గించుచు పదిహేడవనాడు ఒకతూరి ఇలాగున సంవత్సరము పఠించిన సరియే. వాడు తప్పక సుగుణగుణాలంకృతయును, దివ్య సుకుమారాంగియును, పతివ్రతా శిరోమణి, సుందరీమణిని పెండ్లాడి, సంసారసుఖ సామ్రాజ్య అనుభవముచే సుఖించును.

***ఈ విధముగ శ్రీమద్వాల్మీకి మహర్షిచే రచింపబడిన,***
***శ్రీ శతకోటిరామచరితాంతర్గత శ్రీమత్ ఆనందరామాయణములో, ఆరవదైన***
***వివాహకాండలో 9వ సర్గ ముగిసినది.***

## ॥ వివాహకాండ ముగిసినది ॥

వివాహకాండే సర్గా ఆనందరామాయణే నవైవ జ్ఞాతవ్యాః ।
పంచశతాశ్చ శ్లోకాః పంచాసీత్యుపరిష్ఠాః ॥

వివాహకాండలో మొత్తం శ్లోకాలు- 585

